శ్రీరస్తు

# శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము

## (మందరము)

## విషయసూచిక

—o:o:o—

## సుందరకాండము

శ్రీరామాయ నమః.

# శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము

## సుందరకాండ పీఠిక.

"యదా యదా హి ధర్మస్య, గ్లానిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య, తదాత్మానం సృజామ్యహమ్."
"పరిత్రాణాయ సాధూనాం, వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ, సంభవామి యుగే యుగే."

ద్వి. ఎప్పు డెప్పుడు ధర్మ మెడరు చెందెడినో, యెప్పు డధర్మంబు వృద్ధి చెందెడినో
యప్పు డప్పుడ నేన యవని సృజింతుఁ, దప్పక నన్ను నో ధర్మజావరజ!
సాధుజనంబుల సంరక్ష సలుప, బాధింప దుష్కృతిపరు లైనవారి
జగతి ధర్మంబు సంస్థాపన సేయ. యుగయుగంబునఁ బుట్టుచుండుదు నేను.

—ద్విపద భగవద్గీత.

అను నియమము ప్రకారము రావణాది రాక్షసులచే హీనస్థితిని జెందుచున్న ధర్మము నుద్ధరించుటకును, ప్రత్యక్ష దర్శనముఁ గోరుచున్న భరద్వాజ శరభంగ సుతీక్ష్ణాద్యరణ్యవాసుల యభీష్టముఁ దీర్చను, దుష్టరాక్షసులఁ గడదేర్చను భగవంతుఁడు శ్రీరామచంద్రమూర్తిగ నవతరించెను.

శ్లో. అవజానంతి మాం మూఢా, మానుషీం తను మాశ్రితమ్
పరం భావ మజానన్తో, మమ భూతమహేశ్వరమ్.

ద్వి. భూతనియామకమున సమర్థంబు. నాతతమగు నా మహాభావ మెదను
దెలియంగఁ జాలని ధీవిరహితులు, వలనుగ మనుజసంబంధ దేహమును
జేసికొన్న నన్ను పేక్షింతురు పార్థ!

—ద్విపద భగవద్గీత.

అన్నట్లు చెప్పినను దుర్యోధనునివంటి మూఢులు దీని నెఱుఁగఁజాలరు గాని భరద్వాజ వాల్మీకి ప్రముఖులగు ఋషీశ్వరులు జ్ఞానులు భక్తులు స్వభావముగనే యెఱుంగుచుందురు. మహాత్ములాత్మార్థమే లాభమును గోరరు. లభించెనా దానిని లోకమునకంతయు వినియోగపడు మార్గమును ఘటింతురు. కావున వాల్మీకిమహర్షి నారదోపదేశముచేతను జ్ఞానదృష్టిచేతను శ్రీరామాదులతత్త్వ మెఱింగి యంతటితో సంతుష్టి లేక లోకమును దరింపఁజేయఁ దచ్చరిత్రమును గావ్యరూపముగ రచించుచు దానియం దెక్కువ పటిమయుఁ బఠనమువలన నెక్కుడు ఫలముఁ గూర్పఁ గోరి దానిని వేదబృంహితముగావించి ప్రణవగాయత్ర్యష్టాక్షరాదిమంత్ర పూరితముఁగావించెను.

౧. శ్రీమద్రామాయణము నందలి కాండము లేడిటియందు సుందరకాండ ముత్తమోత్తమ మనియు, సకలాభీష్టప్రద మనియు నార్యులు విశ్వసించి శ్రద్ధాభక్తియుక్తముగ ననుదినము పఠించి కృతార్థు లగుచుండుట జగద్విదితము.

శ్రీరామాయణమున నొక్కొక్క కాండమున నొక్కొక్క విశేషము గలదు. వ్యాధులు, కారాగృహ బంధనములు, గ్రహపీడలు, అనపత్యతలు, దారిద్ర్యములోనైన సంకటములన్నియు సుందరకాండ పారాయణమువలనఁ దొలఁగుటయే గాక భుక్తిముక్తులును గలుగును. ఇది పారంపర్యముగ వచ్చిన మూఢవిశ్వాసము గాదు. పరీక్షితము. సిద్ధాంతితము. ప్రత్యక్షము. సహేతుకము.

శ్లో. త్రివర్గఫల కామేన, విపదు త్తరణేచ్ఛునా
శ్రీమత్సుందరకాండస్య, పాఠః కార్యో విజానతా.
శాంతికర్మణి సర్వత్ర, తథా దుస్స్వప్న దర్శనే
గ్రహపీడాసు చోగ్రాసు, రోగేషు విషమేషు చ
అరణ్యే ప్రాంతరేవాపి, శస్త్రచోరాగ్ని పీడనే
సర్వాస్వాపత్సు ఘోరాసు, నైతస్మా త్తారకం పరమ్.
శ్రీమత్సుందర కాండస్య, సప్తసర్గ్యభిపాఠతః
మహారాజ్యాది సంపత్తి, ర్లభ్యతే దుర్లభాపి వా.
ఆయుష్కామో లభే దాయు, ర్ధనకామో ధనాన్యపి
శ్రీకామః శ్రియ మాప్నోతి, క్షితికామ స్తథా క్షితిమ్.
విద్యాకామ స్తథా విద్యాం, స్త్రీకామశ్చ తథా స్త్రియమ్
ఆరోగ్యకామ స్త్వారోగ్యం, సప్తసర్గ్యభిపాఠనాత్.
యదా యదా హి రామస్య, వృత్తం విపఠిషే ద్బుధః
తదా తదాతు "ధర్మాత్మే", త్యేతన్మాల మనుం జపేత్.
శ్రీరామచరణాంభోజ, ద్వంద్వం ధ్యాయ న్ప్రసన్నధీః
సకృ దేవేతి చరమ, శ్లోకం చ శుభదం జపేత్.
అను పురాణవాక్యములు ప్రమాణములు.

3. తక్కిన యందఱు దేవతలకంటెను, దక్కిన యన్ని యవతారమూర్తులకంటెను శ్రీరామమూర్తి క్షిప్రముగఁ బ్రసాదించును. వాత్సల్యము, అభయప్రదాన కరణము, సౌశీల్యము, కరుణ, సత్యసంధత యివి యన్నియు శ్రీరామునందు విశేషముగఁ గలవు.

శ్లో. అనన్యా శ్చింతయంతో మాం, యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం, యోగక్షేమం వహామ్యహమ్
సర్వధర్మాన్ పరిత్యజ్య, మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వ పాపేభ్యో, మోక్షయిష్యామి మా శుచః

ద్వి. ఇతర మెయ్యదియైన, హృదిఁ దలంపకయ, క్షితిని నన్నెవ్వారు సేవింతు రట్టి
సతతాభియుక్తులౌ జనముల కైన, హితతర యోగక్షేమ మేన వహింతు.

అన్ని ధర్మంబులఁ ద్యజియించి లెస్స, నన్ను నొక్కని శరణంబును జొఱుము,
నన్నుగ సర్వపాపంబులవలన, నిన్ను ముక్తు నొనర్తు నిర్వేదపడకు.

— ద్విపద భగవద్గీత.

అను శ్రీకృష్ణవాక్యములను

శ్లో. మిత్రభావేన సంప్రాప్తం, న త్యజేయం కదాచన
దోషో యద్యపి తస్యస్యా,త్సతా మేత దగర్హితమ్
సకృ దేవ ప్రపన్నాయ, తవాస్మీతి చ యాచతే
అభయం సర్వభూతేభ్యో, దదా మ్యేత ద్వ్రతం మమ.

తే. మైత్రి భావించి తాన సంప్రాప్తుఁడైన, వాని నెటులేని చేపీడు వాఁడఁగాను
వాని యెడనుండెనేని నేదేని దోష, మద్ది గర్హ్యాంబు గాదు సదాళులకును.

క. నీవాఁడని యొకపరియే, యేవాఁడేఁ శరణు వేఁడెనేని సకల భూ
తావళి నభయంబును నే,వావిరి ఘటియింతు నిదియ వ్రతమగు నాకున్.

అను రామవాక్యములను,

"స్మరణమాత్ర సంతుష్టాయ" యని శ్రీరామకవచమునందలి వాక్యములను
బోల్చి చూచిన పైవిషయము స్పష్టమగును.

ఇట్టి శ్రీరామునికంటెను ప్రేమస్వరూపిణి సీతాదేవి క్షిప్రప్రసాదిని.

శ్లో. ప్రణిపాతప్రసన్నా హి మైథిలీ జనకాత్మజా.

కం. ప్రణతి ప్రసన్న జానకి.

శ్లో. న పరః పాప మాదత్తే, పరేషాం పాపకర్మణాం
సమయో రక్షితవ్యస్తు, సంత శ్చారిత్రభూషణాః
పాపానాం వా శుభానాం వా, వధార్హాణాం ప్లవంగమ!
కార్యం కరుణ మార్యేణ, న కశ్చి న్నాపరాధ్యతి
లోకహింసావిహారాణాం, రక్షసాం కామరూపిణామ్
కుర్వతా మపి పాపాని, నైవ కార్య మశోభనమ్.

క. తన కపకార మొనర్చిన, మనుజున కపకృతి నొనర్ప మదిఁ దలఁపడు స
జ్జనుఁ డీ నియతిం బ్రోవఁగఁ, బూనరుగ; సజ్జనులు శీలభూషణు లెందున్.

క. కపివర! పుణ్యులలోఁ బా,పపు జనములలోన వధకుఁ బాత్రుల పట్లన్
గృపఁ జూపవలయు సజ్జనుఁ; డపరాధము జేయనట్టి యతఁడుం గలఁడే.

తే. పాపములె చేయుచును గామరూపులగుచు, భువనహింసావిహారులైపొలుచుచున్న
యసురులకుఁగీడు సేఁత కార్యంబుగాదు, సుమ్మటన్న నుహానుమయాసుదతికనియె-

అను వాక్యములఁ బరిశీలించిన సీతారాములకుఁగల యంతరము స్పష్టమగు.

౮. రావణాసురుఁడు దేవతాస్త్రీలను మనుష్యస్త్రీలను జెఱపట్టి పతివ్రతల
జెఱిచి దుఃఖపెట్టుచుండ, శ్రీమహాలక్ష్మి సహింపఁజాలక, వేదస్వరమునుండి వేదవతి

యన నయోనిజయై జనియించి, రావణాసురు శపించి మరల నయోనిజయై సీతయై పుట్టి శ్రీరాముఁ జేపట్టి యాయనవెంట నడవులకు మెట్టి, రావణాసురుని మట్టుపెట్టింపఁ గారణముఁ గల్పింప జింకను బట్టితేర భర్తనంపి రావణునకుఁ జిక్కి, వానిని భస్మీకరింపఁ గలిగియు, భస్మీకరింప నొల్లక, భర్తచే నతని సపుత్రమిత్రబాంధవముగఁ జంపించి లోకమున కానందము గలిగించెను. ఎంత దయావతిగాక పరులకై తాను గష్టపడి వారి గష్టముఁ దప్పించునా? లోకమునఁ దండ్రికంటెను దల్లి దయావతి గదా. ఇఁక జగన్మాతవిషయ మేమి చెప్పవలయును.

౫. రాముని భజించి విసిగి "నన్నుఁ బ్రోవుమని చెప్పవే ఓ సీతమ్మా" యని గోపన యేడ్చువఱకు నాయనకుఁ గారాగృహముక్తి కలుగకపోయెను. భక్తులకెల్ల నిది యనుభవవిధితము.

౬. రామాజ్ఞప్రకారము లక్ష్మణుఁడు సీతాదేవిని వాల్మీకియాశ్రమమున విడిచి పోయెను. ఏటియొడ్డున నామె యొంటిగ దుఃఖించుచుండ వాల్మీకిశిష్యు లవతెయో యేడ్చుచున్నదని వాల్మీకికిఁ జెప్పిరి. ఆయన యోగదృష్టిచేత సర్వము దెలిసికొని పాపుకలైన ధరింపక రిత్తకాళ్ళఁ బరువెత్తివచ్చి యామెను బూజించి తోడ్కొనిపోయి మునిస్త్రీల కప్పగించెను. ఆమె మహిమయు నామెకు వచ్చిన నిందయుఁ జూడ వాల్మీకికిఁ గలిగిన పరితాప మింతంత యనరాదు. ఇట్టిపతివ్రత కిట్టి నింద లోకమున నిలువనిచ్చుట సరిగాదనియు, నామె వృత్తము జగద్విదితము చేయవలయుననియు నాలోచించి తద్విధానము సరహస్యముగ నారదుచే నుపదేశమునొంది రామాయణముగ రచించి యామె పుత్రులకే నేర్పి సభలయం దెల్లఁ బాడించి యామెను బరీక్షకు నిలువంజేసి యామె యపకీర్తి దొలఁగించి యామె యవతారమూర్తియని లోకమున బ్రసిద్ధిచేసెను. కావుననే శ్రీరామాయణమును వాల్మీకి "సీతాయాశ్చరితం మహత్" అనెను. రామాయణ మేడుకాండములు తుదముట్ట హెచ్చరికతోఁ జదువువారికి వాల్మీకికి రామునియందున్న భక్తిగౌరవముకంటె సీతాదేవియం దెక్కువభక్తిగౌరవము లుండెనని స్ఫురింపక మానదు. కావుననే యామె నధికరించి చెప్పు సుందరకాండము నన్నివిధముల సుందరముగను సారవంతముగను వాల్మీకి యొనర్చెను. సుందరమూర్తి వినాయకుఁ డన్నట్లే సుందరహనుమంతుడని పరాశర సంహితయందుఁ గలదు. 'నామైకదేశే నామగ్రహణ'మ్మని భీమసేనుని భీముఁడనియు, సత్యభామను భామయనియు ననునట్లే సుందరహనుమంతుని సుందరుఁడనఁదగు. 'అతిరూపవతీ సీతా' యన్నట్లు సీత త్రిలోకసుందరి కావున సుందరీ సుందరశబ్దముల కేకశేషమందు సుందరయనియే నిలుచును కావున సుందరుల నధికరించి చెప్పిన కాండము సుందరకాండము. భగవత్సౌందర్యముగూడ నిందు వర్ణితము.

౭. ఈ కాండమున నా యాఘట్టములను బఠించుటవలని ఫలము తత్త్వసంగ్రహ రామాయణమం దిట్లు చెప్పఁబడినది.

శ్లో. "సుందరాదిమ సర్గస్థ, హనుమద్విక్రమాదికమ్
శ్రుత్వాపస్మార కుష్ఠాది, భూతభేతాళ నాశనమ్,
సన్నిర్జిత్య పురీం శ్రేష్ఠా, మితిశ్లోకాదిమాక్షరమ్
శ్రుత్వా బంధా ద్విముక్తస్సన్, బ్రహ్మ భూయాయ కల్పతే.
సీతా సందర్శనం శ్రుత్వా, వీతశోకో భవిష్యతి.
శ్రుత్వాతు త్రిజటాస్వప్నం, దుస్స్వప్నం నశ్యతి ధ్రువమ్
శ్రీరామముద్రికాదానం, యే శృణ్వన్త్యాదరేణతు
నిర్జిత్య శత్రూన్ సంగ్రామే, స్థిరం రాజ్యం వ్రజంతి తే.
ధన్యా దేవా స్సగంధర్వా, స్సిద్ధా ఇత్యత్ర చాదిమమ్
శ్రుత్వా చతుర్దశం వర్ణ, మసంగో వాయువచ్చరేత్
హనూమద్గ్రహణం శ్రుత్వా, బంధా న్ముచ్యేత మానవః
లంకాదాహాద్యనుశ్రుత్వా, తాపత్రయహతి ర్భవేత్.
మంగళాభిముఖీ త్యస్మిన్, శ్లోకే యత్ప్రథమాక్షరమ్
తద్గాయత్ర్యాః పంచదశం, శ్రుత్వా మద్రూపభాగ్భవేత్
శ్రుత్వాతు పంచమం కాండం, హనుమద్విజయాంకితమ్
ఆంజనేయ ప్రసాదేన, బ్రహ్మలోకం స గచ్ఛతి."

భా. ఉ. ఎవ్వనిచే జనించు జగ, మెవ్వనిలోపల నుండు, లీనమై
యెవ్వని యందు డిందుఁ, బరమేశ్వరుఁ డెవ్వఁడు, మూలకారణం
బెవ్వఁ డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు, సర్వముఁ దాన యైన వాఁ
డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁడెదన్.

క. నర్తకునిభంగిఁ బెక్కగు, మూర్తులతో నెవ్వఁ డాడు మునులున్ దివిజుల్
గీర్తింప నేర రెవ్వని, వర్తన మొరు లెఱుఁగ రట్టివాని భజింతున్. భాగ.

అని గజేంద్రుఁడు ప్రార్థింప భగవంతుఁడు సాక్షాత్కరించి యతనిబాధ తొలఁగించెను. అట్లులే దేవతలు ప్రార్థింప భగవంతుఁడు శ్రీరాముఁడుగ భూమిపై నవతరించెను. మీఁదఁ జెప్పఁబడిన యనంతకల్యాణగుణము లన్నియు శ్రీరాముని యందుఁ గలవని వాల్మీకి యా యా కాండముల నందందు వర్ణించియున్నాఁడు. ఈ సుందరకాండమందు జగత్సంహారకశక్తి రామునందే కలదని,

తే. అధిప! బ్రహ్మస్వభువు చతురాస్యుఁడైనఁ
త్ర్యంబకుఁడు రుద్రుఁడును బురహరుఁడునైన
నింద్రుఁడు మహేంద్రుఁడును సురాధీశుఁడైనఁ
గలన శ్రీరామవధ్యునిఁ గావలేరు.

ఇత్యాది వాక్యములచే స్థాపింపఁబడినది.

౯. 'అజాయమానో బహుధా విజాయతే' యను శ్రుతిప్రకారము భగవంతుఁడగు విష్ణువు "సంభవా మ్యాత్మమాయయా" యన్నట్లు తన మాయచేత నానా రూపములు వహింపగలఁ డను విషయము.

తే. అకట! యవ్యక్త మేక మనంత మగు న,చింత్య విష్ణు సుతేజంబు స్వీయమాయ
వానరాకృతిఁ గైకొని వచ్చె నేమొ, యఖిల రాక్షసకులవినాశార్థ మిపుడు.

ఇత్యాది వాక్యములచే స్థాపింపఁబడినది. మాయ యనఁగా నద్భుతశక్తి.

౧౦. అర్థపంచకజ్ఞాన మాచార్యువలననే కలుగునని హనుమంతుని చర్య వలనబోధింపఁబడినది. ౧. ప్రాప్యమగు బ్రహ్మస్వరూపము, ౨. జీవాత్మస్వరూపము, 3. ఉపాయస్వరూపము, ౪. ఫలస్వరూపము, ౫. విరోధిస్వరూపము. ఈ యైదింటికి నర్థపంచకమని పేరు.

౧౧. దశేంద్రియాధిష్ఠితమైన దేహమే లంక. అహంకార మమకారములు రావణ కుంభకర్ణులు. ఇంద్రజిదాదులు కామక్రోధాదులు. ఇందు బంధింపఁబడిన చేతనుఁడే సీత. (స్త్రీప్రాయ మితరత్సర్వమ్మనునది ప్రమాణము) వివేకముతోడ్పాటు గల చేతనుఁడే యింద్రియములకు వశుఁడుగాక భగవంతుని భక్తిచే సేవించి సాయుజ్యము నొందఁగలఁడు. ఈ వివేకమే విభీషణుఁడు. భగవంతుఁడు తన్ను రక్షించునో రక్షింపఁడో యను సందేహముచేఁ బరితపించుచున్న చేతనునికి నాచార్యుఁ డర్థపంచకజ్ఞానము గలిగించి యతని నుజ్జీవింపఁ జేసె నని హనుమచ్చర్యవలన విశదమగుచున్నది. ఆచార్యుని చర్యయుఁ జక్కఁగ నిందు బోధింపఁబడినది.

౧౨. ద్వయమంత్రములోని శరణ శబ్దార్థ రహస్యమంతయు నిందు వివరింపఁబడినది.

౧౩. గాయత్రీమంత్రములోని 'దేవ' శబ్దార్థ మిందు శ్రీరామ దివ్యమంగళ విగ్రహావర్ణనముచే వర్ణింపఁబడినది.

౧౪. ఈ కాండమందు సంసార సాగరము తరింపఁగోరి యాత్మవిచారముఁ జేయు యోగి యభ్యాసాదివిధము హనుమంతుని చర్య వలనఁ దెలియఁదగియున్నది. హనుమత్కపియే మనస్సు. యోగమున కంగము లెనిమిది. యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధి. ఇందు మొదటివైదు బాహ్యాంగములు.

అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము అనునవి యమములు. శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ప్రణిధానము అనునవి నియమములు. పద్మాసనాదులు ఆసనములు. శ్వాసబంధము ప్రాణాయామము. ఇంద్రియములు విషయములయందు వ్యాపింపనీక లోపలి కాకర్షించి చిత్తమున నిలుపుట ప్రత్యాహారము.

యమనియమములు హనుమంతునియందుండుట సుప్రసిద్ధము. ఆసన ప్రాణాయామములు 3-30 పద్యములయందుఁ గననగు. ఇవి చదువునపుడు భగవద్గీతయందలి యీ శ్లోకముల ననుసంధించునది.

శ్లో. సమం కాయ శిరోగ్రీవం, ధారయ న్నచలం స్థిరమ్.
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం, దిశశ్చానవలోకయన్
ప్రశాన్తాత్మా విగతభీ, ర్బ్రహ్మచారివ్రతే స్థితః
మన స్సంయమ్య మచ్చిత్తో, యుక్త ఆసీత మత్పరః.

అభ్యాసమందుఁ బ్రాణాయామముకంటెను బ్రత్యాహారము కష్టసాధ్యము. ప్రాణాయామదశయందుఁ దా నింత లావు పొడుగు గలవాఁడ నను స్థూలదేహజ్ఞానముండవచ్చును గాని ప్రత్యాహారదశకు వచ్చునప్పటికి దేహ మత్యల్పమైనట్టుగ భావించి (హనుమంతుఁడు పిల్లి యంత యగుట) దేహసంధు లన్ని సడలించినఁ గాని ప్రత్యాహారము సాధ్యముగాదు. 'శనైశ్శనై రుపరమే' త్తన్నట్టు లెంత మెల్లగా మనస్సును లోపలికిఁ బ్రవేశింపఁ జేయవలయుననినను వ్యాధిలోనగు ప్రతిబంధకములలో నేదోయొకటి (లంకారాక్షసి) యడ్డపడుచునే యుండును. దానిని జయింపక యాత్మదర్శనము సాధ్యముగాదు. ఆత్మసాక్షాత్కారము నొందిన పెద్దలవలనను (సంపాతి) శ్రుతివలనను, ఆత్మ హృదయగుహయం దున్నట్టు తెలిసినను దానిని గనులారఁ గనుఁగొనుటకై హనుమంతుఁడు రాత్రియందు శ్రమించినట్టు మరల మరల శ్రమింపవలయును. ఇంకను భ్రాంతిదర్శనము (మండోదరీదర్శనము) లోనగు విఘ్నములు కలుగును. ఈ గండము లన్ని గడచిన నాత్మదర్శనము కలుగును. ఇట్టులే పోల్చి చూచినసీతాసంభాషణము,లంకాదహనము,వానరులతో సీతావృత్తాంతము చెప్పుట సీతాదేవియందలి భక్తి-యిట్టివన్నియు యోగాభ్యాసరతుల కనుభవగోచరములు. అభ్యాసులే కొంచెము సూచించుటవలననే సర్వము గ్రహించి యానందింపఁగలరు. కావున నింతతో నీ విషయము విరమించెదను.

౧౫. శ్లో. యే తు సర్వాణి కర్మాణి, మయి సన్న్యస్య మత్పరాః
అనన్యే నైవ యోగేన, మాం ధ్యాయంత ఉపాసతే
తేషా మహం సముద్ధర్తా, మృత్యుసంసారసాగరాత్
భవామి న చిరా త్పార్థ! మయ్యావేశితచేతసామ్
మయ్యేవ మన ఆధత్స్వ, మయి బుద్ధిం నివేశయ
నివసిష్యసి మయ్యేవ, అత ఊర్ధ్వం న సంశయః.

ద్వి. అన్ని కర్మముల నాయందున యునిచి, నన్నె పరుఁడుగ ననన్యయోగమున
నన్ను ధ్యానించుచు నన్నుపాసించు, చున్నారో వారల నోపి నాయందు
మనసుంచువారల మరణంబుతోడ, మొనయు సంసార సముద్రమునుండి
చెచ్చెరఁ దరియింపఁ జేయుదుఁ బార్థ, నిచ్చలు నాయందె నిలుపు మనంబు

నాయందె నిలుపు మనయమును బుద్ధిఁ, బాయక యికమీఁదఁ బార్థ! నాయందె
నిలువంగఁ గల విధి నిక్కంబు సుమ్ము, వలదు సందేహంబు వసుధేశతనయ.

—ద్విపద భగవద్గీత.

అను భక్తియోగవిషయమైన భగవద్గీతావాక్యములను సీతాదేవిచర్యతోఁ బోల్చిచూచిన పరభక్తి విషయము స్పష్టపడును.

౧౬. సీతాదేవిచర్య ప్రపత్తియు సూచించుచున్నది.

శ్లో. అనన్యసాధ్యే స్వాభీష్టే, మహావిశ్వాసపూర్వకమ్
తదేకోపాయతా యాచ్ఞా, ప్రపత్తిశ్శరణాగతిః.

అని శరణాగతి లక్షణము.

సీతాదేవికోరిక రామసమాగమము అనన్యసాధ్యము. రాముఁ డెట్లయినఁ దన్ను రక్షించుననుట సీతాదేవికి నమ్మకము. కావుననే యితరోపాయము (హనుమంతుని వెంటఁబోవుట) యను మార్గ మంగీకరింపదయ్యె.

౧౭. భక్తియోగ ముద్యానసంచారమువలె మనోహరమైన మార్గమనియు యోగమార్గము నిరాలంబనముగ సముద్రము దాఁటుటవంటి దుస్సాధఘోరకార్యమనియు నీ కాండమువలనఁ దెలియఁ దగియున్నది.

శ్లో. మనుష్యాణాం సహస్రేషు, కశ్చిద్యతతి సిద్ధయే
యతతామపి సిద్ధానాం, కశ్చిన్మాం వేత్తి తత్త్వతః.

అన్నట్టు లన్నికోట్లకపులలో హనుమంతుఁ డొకఁడే కార్యసిద్ధినొందఁగలిగెను.

యోగమార్గసంచరిష్ణువునకు 'ధైర్యము స్మృతియు వారక దాక్ష్యము దృష్టి' దృఢముగఁ గలిగినఁ గాని కడతేఱ లేఁడు. ఇట్టివానికి మొదటివిఘ్నము తన హితులవలననే కలుగును. వీనిమార్గకష్టము తెలిసిన మిత్రులితఁడింత దుస్సాధకార్యమునకుఁ బూనెనే యెట్లగునో యను సందేహముచే వీని దృఢవ్యవసాయమునకు సాహాయ్యరూపకవిఘ్నము కలిగింతురు. అది విఘ్నమే కావున దాని నభ్యాసి యంగీకరింపఁ దగదు. (మైనాకచరిత్ర) అది గెలిచినతరువాత వీని శుద్ధశక్తిఁ బరీక్షింప దేవతలే విఘ్నములు కలిగింతురు. (సురస) వానికిని లోఁబడరాదు. ఇదియైనపిమ్మట భూతగ్రహములు వీనివి బీడించును. (సింహికావృత్తాంతము) దీనిని జదువువారు జరిగిన కార్యమునకుఁ దగిన కారణములు కల్పించి వ్రాయుచున్నానని భ్రమింపవచ్చును. అభ్యాసపరు లట్లు తలఁపరు. ఈ విషయమై వివేకానందస్వాములవారిజీవితములోని యీ వాక్యముల ననువదించుట యప్రస్తుతము గాదు.

"Tradition has it that the tree is protected, as it were, by a *Bhairava* or a powerful spirit, who prevents any one who is not pure from meditating there. Even Totapuri and Noren experienced great difficulty, as it is said, in concentrating of their minds on Reality there. Some powerful force seemed bent on driving them forth........................................

In the instance of Moren, however, it was different. Finding that something opposed him in his desire to centre his mind upon God, he took a flaming brand from the meditation fire before him and struk the ground with such violence and with such intensity of emotion that he swooned. When he emerged from that state, however, he found that he could meditate with ease.

Later another man endeavoured to do that which saints had done, and he became mad. He could not endure the forms which came in the course of the meditation upon the Terrible one, who dances the Dance of Death and Destruction."

ఇట్టి యోగసిద్ధిని హనుమంతుఁడు పరభక్తికి సాధనముగఁ జేసికొనెను.

౧౮. సుందరకాండమునఁ బ్రథమాక్షరము 'త'. కాండము నందలి కడపటి యక్షరము 'త'. ఇది 'తత్' అనుదానిని బోధించుచున్నది.

మొదటి శ్లోకము.

శ్లో. తతో రావణనీతాయాః, సీతాయాః శ్శత్రుకర్శనః
ఇయేష పద మన్వేష్టుం, చారణాచరితే పథి.

క. తరువాత రావణాసుర,వరనీత ధరాత్మజాతపదము న్వెదకఁగ
గురుచారణమార్గంబున, నరుగఁగ నృపదూత కర్శితారి దలంచెఁ.

కడపటి శ్లోకము.

శ్లో. తతో మయా వాగ్భి రదీనభాషిణా, శివాభి రిష్టాభి రభిప్రసాదితా
జగామ శాంతిం మమ మైథిలాత్మజా, తవాపి శోకేన తథాభిపీడితా.

తే. తత భవద్దుఃఖమునకును ♦ ధరణిగోత్ర
వార్ధిచంద్రమ! యట్లు తా ♦ బాధపడుచు
శుభము సిష్టంబు నగు నాదు ♦ సూక్తి ధృతి నొ
సంగ శ్రీరామ వహియించె ♦ శాంతి సీత.

ఇది గాక సుందరకాండమునఁ బ్రతిసర్గమున మొదటి యక్షరము సకారమో తకారమో యుండును. లేదా యా శ్లోకమున సీత యను శబ్దముగాని తత్పర్యాయపదముగాని యుండును. అదియుఁ దప్పిన రెండవశ్లోకము మొదటియక్షరము స, త, తప్పదు.

ఈ స,త-లు సీతయని సూచించుట స్పష్టమేకదా. సీతయేకదా సుందరకాండమున కధిష్ఠానదేవత. 'సీతాయా శ్చరితం మహ' త్తన్నట్టు శ్రీరామాయణమంతయు సీతామాహాత్మ్యమే తెలిపినను నందు సుందరకాండము నాయకరత్నము కదా. సీత=ఓమ్ అని సాంఖ్యశాస్త్రప్రకార మగుచున్నది. ఈ ఓం తత్ సత్ ల ప్రయోజనము భగవద్గీతయం దిట్లు చెప్పఁబడినది.

శ్లో. ఓం తత్స దిత నిర్దేశో, బ్రహ్మణ స్త్రివిధస్మృతః
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ, యజ్ఞాశ్చ విహితాః పురా

తస్మా దో మిత్యుదాహృత్య, యజ్ఞ దానతపఃక్రియాః
ప్రవర్తన్తే విధానోక్తాః, సతతం బ్రహ్మవాదినామ్.
త దిత్యనభిసంధాయ, ఫలం యజ్ఞతపఃక్రియాః
దానక్రియాశ్చ వివిధాః, క్రియంతే మోక్షకాంక్షిభిః.

ద్వి. ఓమ్మని తత్తనియును సత్తటంచు, నిమ్మూఁడువిధముల నెసఁగుచునుండు
బ్రహ్మనిర్దేశంబు; పరఁగెఁ దద్యుక్తి, బ్రాహ్మణుల్ శ్రుతులు నధ్వరములుపూర్వ;
మట్టులుగాన నోమ్మని మున్న పల్కి, పట్టుగ నా బ్రహ్మవాదుల విధులఁ
బలుకంగఁ బడిన తపంబు దానంబు, కలితయజ్ఞము లెల్లకాలంబు జరగు;
తత్తని ఫలకాంక్షఁ దవులక ముక్తి, హత్తఁ గోరినవారు యజ్ఞముల్ తపము
వివిధ దానక్రియా విసరంబు లెల్ల, నవనీతనందన! యాచరించెదరు.

—ద్విపద భగవద్గీత

వీనిని బర్యాలోచించి చూచినచో సుందరకాండ పఠనమువలన భుక్తి, ముక్తులు కలుగుట యేమి వింత! శ్రద్ధయు భక్తియు నుండినఁ జాలును.

అల్పశక్తముకించిద్జ్ఞమునైన నామనస్సునకు గోచరించినవఱకు పరివర్తనమందు నాకు సాధ్యమైనవఱకు మూలమునఁ గల విశేషరహస్యము లాంధ్రమునను బొందు పఱిచితిని. లోపములున్నచోఁ దెలుపు మహాత్ముల పాదములకు నమస్కరించి వానిని గ్రహించి కృతార్థుఁడ నయ్యెద. సంస్కృతరామాయణము నర్థముగ్రహించి పారాయణ మొనర్చుట సర్వశ్రేయస్కరము. ఏతద్గ్రంథకర్తనుగృతార్థునిఁ జేయఁ గాఁ బోలుఁ గొందఱు పుణ్యు లాంధ్రవాల్మీకిరామాయణమునే పారాయణ మొనర్చితి మనియు, దానివలననే తమ కోరికలు కొనసాగినవనియు వ్రాసిరి. అర్థము తెలియని చదువువ్యర్థము. అర్థము తెలియక మనసు రంజిల్లదు. మనసురంజిల్లక భక్తికుదురదు.

క. ఆ యా దేశమువారికి, నా యా దేశంబుభాష నమరినకావ్యం
బాయతపురుషార్థంబులఁ, బాయక సమకూర్చు దేవభాషయపోలెన్.

క. సురభాషార్థము తెలియని, తరుణులకును శూద్రులకును దమతమ సీమం
బరఁగినమాటలఁ జెప్పిన, వరకావ్యము పఠనమున కవశ్యంబయ్యెన్.

—అప్పకవి.

అని యుండుటచే సుబోధమగు నీ గ్రంథము పఠించుటచే వీరికి సత్ఫలము కలుగుట ధర్మమే కదా. మూలమునందున్న మంత్ర, బీజాక్షరాదు లిందు నుండుటయే దానికిఁ గారణము.

భగవంతుఁ డిట్టివారికి సకల శ్రేయస్సులు నొసంగునుగాక. దైవభక్తి లోకమున వర్ధిల్లుగాక.

ఇట్లు ప్రార్థించు,
శ్రీరామచరణారవిందేందిందిరుఁడు. భక్తచరణపరిచరణుఁడు.
వాసుదాసుఁడు.

శ్రీ లక్ష్మీ నృసింహాయ నమః.

# అథ శ్రీ ఆపదుద్ధారక హనుమత్ స్తవరాజమ్.

శ్రీ గురుభ్యో నమః॥ హరిః ఓం॥ వసిష్ఠ ఉవాచ॥ సాధు శ్రుతం హనుమతశ్చరితం దురి
తాపహమ్। హనూమత్ స్తవరాజం మే వద దేవర్షిసత్తమ!॥ ౧

శ్రీ నారద ఉవాచ॥ ఆపదుద్ధారకం నామ స్తవరాజ మిమం మునే। కథయామి
హనూమంతం నత్వాహం వేధసా కృతం॥

అస్య శ్రీఆపదుద్ధారక హనుమ స్తవరాజ మహామంత్రస్య బ్రహ్మాఋషిః। ప్రకృతి
చ్ఛందః। ఆపదుద్ధారకో భగవన్మారుతి ర్దేవతా। రం (ఓం శ్రీం రం) ఇతిబీజం। లం
ఇతిశక్తిః। క్లీం ఇతి కీలకం। శ్రీహనుమదంతర్గత శ్రీసీతాపతి శ్రీరామచంద్ర ప్రసాద
సిద్ధ్యర్థే జపే వినియోగః॥ ఓం రం (ఓం శ్రీం రం) ఓం లం ఓం క్లీం హనుమతే అంగు
ష్ఠాభ్యాం నమః। ఓం రం (ఓం శ్రీం రం) ఓం లం ఓం క్లీం వృషాకపయే తర్జనీభ్యాం
నమః। ఓం రం (ఓం శ్రీం రం) ఓం లం ఓం క్లీం మారుతాత్మజాయ మధ్యమాభ్యాం
నమః। ఓం రం (ఓం శ్రీం రం) ఓం లం ఓం క్లీం అంజనాసూనవే అనామికాభ్యాం
నమః। ఓం రం (ఓం శ్రీం రం) ఓం లం ఓం క్లీం ఏకవీరాయ కనిష్ఠికాభ్యాం నమః।
ఓం రం (ఓం శ్రీం రం) ఓం లం ఓం క్లీం పంచముఖాయ కరతలకరపృష్ఠాభ్యాం
నమః। ఏవం హృదయాదిన్యాసః। భూర్భువస్సువరోం। ఇతి దిగ్బంధః॥ అథ ధ్యానం॥
ఆద్యాదిలక్ష్మీపతి పాదజాత మహానుభావ ర్త కృతాదిచర్యమ్॥ శ్రీ పారిజాత
ద్రుమమూలవాసం క్లేశాపహం సంకలయామి చిత్తే॥

బ్రహ్మా ఉవాచ॥ ఆద్యాదిశ్రీరమేశాంఘ్ర్యమలకమలజాంగుష్ఠమాలాభిజాతో।
యో ఘోరాదీననేకాక్షపయ దతిరుషా రాక్షసా న్వీక్షయన్ స్వాన్। యస్సా
హస్రాననాదీ నఖిలసురగణా నుద్ధరాపదో గ్ర్యం। నం వందే వజ్రకాయం
హరివరతనయం మారుతిం స్వేష్టసిద్ధ్యై॥ ౧

యో౽నంతాఖ్యాసనాంతర్మణిగణఖచితామోదనీయేచ పూర్వే। తీరేకల్పద్రుమస్య
ద్వ్యమణిరమణితాయాం లసచ్చిత్రవేద్యాం। ఆనందాఖ్యాభిరామే రమయ దతి
తరాం నంస్తువ న్రంగరాజం॥ తం వందే॥ ౨

యస్స్వైరం తాపసాక్ష్యే ద్విజవరజఠరే జాతమాత్రో వివస్వాన్। ఆత్మానం దీప్య
మానఃస్థిర (శిర) కృతవపుషా క్రోధితే నాత్మపిత్రా। సంశిష్టో దృప్తరూపంహరివర
వందనం ప్రాప్య శ్రీశాంఘ్రి మాప్తః॥ తం వందే॥ 3

యశ్శ్వేతద్వీపమధ్యే సురవరనికరై రీడ్యమానం రమేశం। ధ్యాయన్ కృత్వాతపోగ్రం
తదుచిత వచసా ప్రాప్యలోకా ననేకాన్। ఈశశ్శ్వేశినస్యా జననజనన (విజయ)
తాం నందయ న్నంజనాయః॥ తం వందే॥

యో లోకద్యోతనాయ ప్రభవతి తరుణో వారుణో వీక్ష్య భానోః। యంత్రం మం
త్రార్ఘ్య కాలే ఫలమితి సుధియా ధావమానో త్తరేణ। వజ్రేణాతాడితో
ద్రాగపత దితి మతిం ఖ్యాపయిత్వాచ భద్రాం॥ తం వందే॥ ౫

యో ధాత్రా సంస్మృతో వా ఉరుతరగిరిమా సానుజాతో వనాంతం। వీక్ష్యాబ్జం
స్వానాబ్జం హ్యురుతరకుపితో వజ్రసంజ్వాలనాసే। బధ్వామజ్జోదధౌ తద్గురు
యువతి కృతో మోచయంతం కృపాంతం॥ తం వందే॥ ౬

య స్సుగ్రీవేణ సాకం తరువరనికటె ఋష్యమూకే వసన్ సన్। సంప్రాప్తో రాఘ
వేశం కపివరవసనే తేన సంయోజ్య సఖ్యే। విఖ్యాతం వాలినం తం రఘుకుల
రమణే నార్దయామాస సంతం॥ తం వందే॥ ౭

యో ముద్రాం రామదత్తా మపి చలితమనా స్సన్నిధాయ స్వమూర్ధ్ని। ప్రాప్యాం
భోధిం తమబ్ధిం గురుతర వపుషా మేషమాత్రా దతీత్య। గత్వా లంకా
మశోకే విశకలితమతిం తోషయామా స సీతాం॥ తం వందే॥ ౮

యో హత్వాక్షం పరోక్షే క్షుభితమభిగతాన్ రాక్షసా న్నూక్షమాత్రైః। విక్షిప్యో
ఽక్షోభ్యరక్షః శరకృతరశనాం ప్రాప్య స్వేచ్ఛావశేన। పుచ్ఛాగ్రే దీపితేన
జ్వల దనలరుచా దీపయామాస లంకాం॥ తం వందే॥ ౯

యోగత్వాథాంతరంగే రఘుపతిదయితాం తోషయిత్వాచ వృత్తం। దత్తంచిహ్నం
గృహీత్వా పున రమరపథా(పిరమతా)లంఘయిత్వా తమ (దా) బ్ధిం। ప్రాప్యేశం
ప్రత్యయాయ జ్వలదనలనిభం ప్రార్పయామాస చిహ్నం॥ తం వందే॥ ౧౦

యో లబ్ధ్వా రామసీతాం ప్రతి రఘుపతినా ప్రేషితః ప్రాప్యలంకాం। నిశ్శంకం రావ
ణేన ప్రతిగిర మురుణా చోత్తరేణ ప్రభాష్య! తద్భాషాం ప్రేక్ష్య రోషా దథ
పునరపత త్క్షైచ్చరై రేకవీరః॥ తం వందే॥ ౧౧

యో గత్వైకో ఽరువీరః పథి నరవపుషం మర్దయిత్వా సురారిం। గత్వాద్రిం ద్రోణ
భద్రం తదుపరి దితిజాం శ్చాను (శు) ద్వోషాత్ప్రహార్య। తం గృహ్యాగత్య
భానా వుదయతి సుధియా జీవయామాస శేషం॥ తం వందే॥ ౧౨

యో లింగం వారణాశ్యాః చిర మితి హరిసం(స్థిరమనుపనయన్)స్థాపితే వాలుకే తం
దృష్ట్వా తూష్ణీం నివిష్టో హరి రథ కృపయా తత్పుర స్థాపయిత్వా। తద్యాత్రా
పూర్ణ పుణ్యం దిశతి భువి సతాం సర్వదాఽద్యాపి దేవః॥ తం వందే॥ ౧౩

యో దేహం త్యక్తుకామో జ్వలదనలనిభం శ్యామసు ఖ్యాతయిత్వా రామోద్వ్యా
భ్యాగమిష్యత్యహహ ప్రియసఖే మాత్యజాద్య క్షమస్వ। ఇత్యుక్త్వా శ్రీశవాక్యం
భరత మతియశాః రక్షయామాస శిష్టః॥ తం వందే॥ ౧౪

యో ఽయోధ్యాం పాలయిత్వా రఘుకులతిలకే స్వీయధామప్రవిష్టే స్రష్టుం విశ్వం
పురోధాః ప్రథితబహుమనాః భక్తిభావేన రామే। ఖండే కింపూరుషాఖ్యే హృదయ
సరసిజే ధ్యాయమానోఽన్వతస్థే (నావితస్థే)॥ తం వందే॥ ౧౫

యో భీమం చాశ్వమేధే దృఢతరవపుషా పూరుషాఖ్యం మృగేంద్రం హ్యానేతుం
గమ్యమానం తనురుహత్రితయం తస్య దత్త్వా కృపావాన్। తత్పాత్రోద్భూతలిం
గార్చనజనమిషతో రక్షయామాస తోషాత్॥ తం వందే॥ ౧౬

యో హ్యేవం ద్వాదశాబ్దానివ లఘుగణితాన్ బ్రహ్మకల్పానతీత్య। ప్రీత్యా శ్రీ
శాంఘ్రిసేవానవరతమహిమా హ్యక్షలబ్ధ్వబ్రహ్మచర్యం గార్హస్థ్యం ప్రాప్య బ్రహ్మ
సకల జనకృద్ద్య ద్భవిష్యత్యసిహా॥ తం వందే॥ ౧౭

యః పాటీరోదరాఖ్యే శిఖరిశిఖరగే కాననే దత్తవాక్యాత్। అగ్రేహస్తిధ్వజిన్యాం
స్ఫుటతరరభసే నాట్టహాసేన సైన్యం। కృత్వా స్తబ్ధం మహాత్మారిపుగణవిజయం
చాకరోద్దుర్జయం వై॥ తం వందే॥ ౧౮

యస్త్విద్ధం న్యాయమార్గం నిజనియమమనాః సంవ్రజన్నిర్గమాయ। వానప్రస్థాశ్రమ
స్థః శతధృతి రథతం చాశ్రమం సంప్రపూర్య। పారివ్రాజ్యాశ్రమేణ క్షుభితతను భవే
ద్య ద్విముక్తో భవేత్॥ తం వందే॥ ౧౯

యో భక్తానన్వవేత్య భవభయమపహాయాతికష్టంచ కష్టాత్। సంతార్యాభీష్టసిద్ధిం
హరిగురుభజనే భావశుద్ధించ దత్వా। కృత్వా శ్రీశాంఘ్రిభక్తాన్వితరతి నియతి
జ్ఞాన వైరాగ్యధర్మాన్॥ తం వందే॥ ౨౦

నారద ఉవాచ॥ ఇదం హనుమతస్తోత్రం ఆపదుద్ధారనామకం। కృతం యద్బ్రహ్మణా పూర్వం ప్రత్యహం యః పఠేత్కలౌ। స్నాత్వా శుచిస్సమాసీనః త్రివారం నియమాన్వితః। న తస్యాభిభవం క్వాపి శ్రీహనూమత్ప్రసాదతః। సంకటే విషమే ప్రాప్తే కారాగారప్రవేశనే। శత్రుమధ్యే సభామధ్యే సింహవ్యాఘ్రారి వేష్టితే। మహదాపత్సముత్పాతే ప్రాప్తే రాజభయేపి చ। శతవారం పఠేదేతత్సప్తాహాన్ముచ్యతే నరః। ప్రసూతికాలే నారీణాం సంకటే చ సుమంత్రితం। ప్రాశయేదుదకం సాపి సుప్రసూర్భవతి క్షణాత్। పుమాన్ఋతుమతీం నారీం ఆమాసం స్నానకాలతః॥ త్రివారం మంత్రితం తీర్థం పాయయిత్వాప్నుయాత్సుతం। విప్రో వినయసంపన్నో బాహుజోఽతి

పరాక్రమం॥ నైశ్యో హ్యతిధనాఢ్యస్స్యాత్ శూద్రస్సుఖ మవాప్నుయాత్ ।విద్యా
కామో లభేద్విద్యాం రోగీ రోగాత్ప్రముచ్యతే। జపం మంత్రసహస్రేణ జపసిద్ధిర్భవే
ద్ధ్రువం। శతవారం పఠే న్మంత్రం ఆదా వష్టాక్షరం పునః। ఏకవారం త్రివారం వా
యావన్మంత్ర మనన్యధీః ॥ఓంహనుమా న్ఫట్ స్వాహా॥ ఇత్యష్టాక్షరమంత్రతః॥ ఏవం
చ సంపుటీకృత్వా స్తవరాజమిమం మునే। తేన సిద్ధి మవాప్నోతి నాన్యథా సిద్ధి మేష్యతి।
దశాంశం తర్పణం కుర్యా త్పునశ్చర్యాపరోన్వహం। తర్పణస్య దశాంశేన పరమా
న్నాహుతిః స్మృతా॥ ప్రతిశ్లోకం చ జుహుయా త్పాయసం గోఘృతేనచ। ప్రతి
శ్లోకం యవైశ్యాకం తర్పయేత్ శుద్ధవారిణా। భోజయేచ్ఛ శతం విప్రాణ్ శక్త్యా
భావేక వింశతిం। ఋత్విగ్భ్యో దక్షిణాం దద్యా దాచార్యాయచ గాం వరాం। నవరా
త్రంజితాహారో దృఢభక్తిర్జితేంద్రియః। శ్రీహనూమత్ప్రసాదేన తస్య లక్ష్మీ స్థిరా
భవేత్॥ హనుమా నంజనాసూను ర్మారుతిశ్చ వృషాకపిః॥ వజ్రకాయ స్తపస్వీ చ
సీతా శోకవినాశనః। లక్ష్మణప్రాణదాతా చ రామకార్యధురంధరః॥ మాసకల్ప
బ్రహ్మచారిః। పంచాస్యో భక్తవత్సలః (రక్షకః)। ద్వాదశైతాని నామాని భక్త్యా
నిత్యంహనూమతః యః పఠేత్ప్రయతో భక్త్యా స దేవైరపి పూజ్యతే। ప్రాతస్స్నాత్వా
భానువారే హనూమత్స్తవరాజకం। యః పఠేత్సతతం భక్త్యా సర్వసిద్ధి మవాప్ను
యాత్॥

ఇతి శ్రీబ్రహ్మాండపురాణే బ్రహ్మ నారద సంవాదే ఆపదుద్ధారక
హనుమత్ స్తోత్రం సంపూర్ణం
శ్రీ కృష్ణార్పణ మస్తు.





శ్రీః

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణే నమః.

శ్రీహయగ్రీవ ప్రసన్న

శ్రీ శా ర దా యై న మః.

శ్రీమతే రామానుజాయ నమః.

# శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణము

## సుందరకాండము



శరణ! యాజవంజవ
దాశరథి గురుతర కర్ణ♦ధారా! శ్రద్ధా
శ్రీశస్త భక్తి తరవ
ణ్యా! శర్మద జానకీ మ♦నోంబుజధామా! ౧

## మందరము

సీ॥ పదియు నొక్కండవ ♦ భావ వత్సరమున, మాతండ్రి మముఁ బాసి♦మరణ మొందఁ
బిన్నజనకుచేతఁ ♦ బ్రేమ రక్షింపించెఁ, బదియు మూఁడవ యేఁట♦భయద మగుచు
నేఁటికి విడువని ♦ నిష్ఠుర రోగానఁ, జావక యుండఁగఁ♦జక్కఁగాచె
నలువ దేడవ యేఁటఁ♦జలుపుచు విధురుఁగా, యోగమార్గంబున ♦ బాగుపఱిచె

గీ. నేఁబదెనిమిది యేఁటఁ దా♦నెలమిఁ బిలిచి, తనదు కైంకర్యమున యంద♦తద్దనిలిపె
జన్మసార్థకముగ రామ♦చంద్రవిభుఁడు, నేఁడు వ్రాయించుకొనుచున్న♦వాఁడు దీని.

కం. డెందంబున రఘుపతి పద, వందారుఁడ నగుచు స్వాంధ్ర♦వాల్మీకి కృతిన్
సుందర కాండము వ్యాఖ్యను, మందరము రచింతు రామ♦మాధవు కరుణన్.

అర్థము. శ్రీ సుందరకాండమును శ్రీరామచంద్రమూర్తికిఁ గవి వినిపింప వారిని సంబోధించుచున్నాఁడు.

శ్రీ శబ్దము కాండాదియందు మంగళ కరము గావునఁ బ్రయోగింపఁబడెను.

శ్రీ=నిత్యానపాయినియై యే కాలమం దైనను భర్తను వదలియుండని లక్ష్మీదేవికి-శరణ=నివాసస్థాన మైనవాఁడా! శ్రీనివాసుఁడా యనుట – 'శరణం గృహరక్షిత్రో'' యని యమర కోశము. "రాఘవత్వే భవేత్సీతా రుక్మిణీకృష్ణ జన్మని" యను విష్ణుపురాణ వాక్యము నిట ననుసంధించునది. ఇచ్చట శరణ శబ్దము మంత్ర రత్న మందలిది. ఈ కాండమందు నా శబ్దార్థమే విశదీకరింపఁ బడునని యీ పద ప్రయోగము సూచించు చున్నది. ఆజవంజవ=సంసారమనెడి, దాశరథి= సముద్రమునకు – దాశ=బెస్తల, రథి=వాహనములైన యోడలఁగలది. రథములు గలది రథి. అనఁగా సంసార సముద్రమునకు గురు=(౧) గొప్పదగు (౨) ఆచార్యు డనెడి, తరి = ఓడకు, కర్ణాధార = ఓడనడుపువాఁడా — సముద్రమును దాటఁ గోరిన వారికిఁ బెద్దనావ నడపు వానివలె సంసారమును దాటఁగోరిన వారికి నాచార్య ముఖమున సద్జ్ఞానము గలిగించి వారి నందుండి దాటించువాఁడా, గురువనువాఁడు- ఓడ-ఓడలభించి నంతమాత్రముననే మనము సముద్రమును దాటలేము. దాని నడుపువాఁడుండవలెను. అతఁడే భగవంతుఁడు. నావ యెట్లోడవాని స్వాధీనమై వాఁడు నడుపునట్లు నడచునో గురువు భగవదాజ్ఞాబద్ధుఁడై భగవదాజ్ఞ లగు శ్రుతి స్మృతి శాసనముల ప్రకారము వర్తించువాఁడై యుండవలెను గాని భగవ దాశ్రితుఁడు గానివాఁడు, శాస్త్రజ్ఞానము లేనివాఁడు గురువుగా నుండరాదు. దేశి కుఁడు భగవత్ప్రేరితుఁడై యుండవలెనని భావము. శ్రద్ధా శ్రీ = శ్రద్ధయనఁగా మహావిశ్వాసము. నన్నవశ్య మావలియొడ్డు చేర్చునుగాని చేర్చకపోఁడను దృఢమైన నమ్మకము. అట్టి శ్రద్ధయనెడి సంపద – శస్త = ప్రశస్తమైన – భక్తి = ప్రేమ పూర్వకమైన సేవ యనెడి – శ్రద్ధాసంపత్తి – శస్తభక్తి-పరమభక్తి చెప్పఁబడుటచేఁ బ్రపత్తిభక్తి చెప్పఁబడెను.

ఈ కాండమున సీతాదేవియందుఁ గానవచ్చునవి ప్రేమయుఁ, బ్రపత్తియుఁ గదా. తరపణ్యా=దాఁటించుట కీయఁబడు కూలి గలవాఁడా – ఓడ నడపువానికి ధనరూపకమైన కూలి యిచ్చినచో భగవంతుని కిచ్చుకూలి శ్రద్ధాభక్తులని భావము. అవి తప్ప మఱి యే కూలియు నాయన యాశింపఁడు. ఆ కూలి యీయకుండిన నాయన దాఁటింపఁడు. ఇట్లు దాఁటిపోయిన రాఁగల లాభమేమి యనిన, శర్మము= మోక్షసుఖము, శర్మద=సుఖము నిచ్చువాఁడా! జానకీమనోంబుజధామా=సీతా

దేవి మనస్సనెడి కమలమే గృహముగాఁ గలవాఁడా—ఆమెచే నెప్పుడు స్మరింపఁబడు వాఁడా— ఈ కాండమందు సీతాదేవి చేసిన కార్యమనియె కదా—ఏవిధమైన శర్మము గలుగునందురా—భగవద్దంపతి ప్రాప్తియే సుఖమని భావము. అంతకు మించిన సుఖ సంతోషములు లేవు. హనుమంతుఁడు మహాయోగియు, మహాజ్ఞానియు నగుట నిర్వివాద విషయము. అంతటివాఁడు కూడ పోవునపుడు రామముద్రికయు వచ్చునపుడు సీతా చూడామణియు ధరించి సముద్రమును దాఁటెను. లంకలో నున్నప్పుడు తా నంతటి గొప్పవాఁడయ్యు భగవద్దాస్యము యోగమునకంటె జ్ఞానమునకంటె గొప్పది యగుట యెఱింగినవాఁ డగుటచే లజ్జ విడిచి 'దాసోహం కోసలేంద్రస్య' దాసుఁడ రామచంద్రున కని రహస్యముగఁగాదు, దిక్కులు మాఱు మ్రోగునట్లు చాటించెను. రామదాసుఁడ నని యెప్పుడు హనుమంతుఁడు చెప్పెనో యప్పుడే రక్షాభరము తమయందున్నదని యంగీకరించినదై 'శీతో భవ హనూమతః' అగ్నిహోత్రుఁడా! హనుమంతునకుఁ జల్లగాఁ గావలసినదని యాజ్ఞాపించెను. అగ్ని వెంటనే చల్లపడెను. రామచంద్రమూర్తితో సముద్రుఁడు 'అవని నభోఽనిలానలపయస్సులు శాశ్వతమైన మార్గముఁ దవిలి స్వభావ మేమియును దప్పక యట్టులు నే నగాధమప్లవమును నౌట నాసహజభావము దీనిని దప్పరాదు" అనఁగలిగెనుగాని, 'శీతోభవ' చల్లన గమ్మని సీత యనఁగానే నా స్వభావము దాహక గుణమును నేను వదలలేఁని చెప్పు నంతటి ధైర్య మగ్నిహోత్రునకు లేదయ్యెను. దీనివలన రామబాణములకన్నను సీతాదేవి వాక్కమోఘమని యేర్పడుచున్నది ఈస్వభావములు గిభావములు, చూచుచుండిన దాసోహమ్మను వారు తమయందు వైచిన భారము నెట్లు సీతారాములు నిర్వహింపఁగలరు. 'యత్రరామో భయంనాత్ర నాస్తి తత్ర పరాభవ' యను వాక్యమెట్లు సార్థక పడఁగలదు ? ఒకని కొక యధికార మిచ్చినప్రభు వా యధికారమును మరలఁ దీసికొనలేఁడా ? అట్టులే యగ్నికి దాహకగుణ మిచ్చినవారు మరల ననివార్యసందర్భముల నివారింపలేరా ?

శ్రీరామ దాసోహమ్మను షడక్షరీమంత్రముచే హనుమంతుఁడు లంకయం దే బాధయు రాక్షసులచేఁ జెందఁడయ్యె. అట్టులే జీవాత్మయు దేహమున నుండువేళ శ్రీరామ దాసోహ మ్మనెనేని దేనివలనను బాధచెందఁడు. సుఖముగ సంసారము దాఁటి రామ పాదసన్నిధిఁ జేరఁగలఁడు. ఈ పంచాక్షరియందలి తడపటి వర్ణము ప్రథమాగ్ని బీజముతోను, ప్రథమ ద్వితీయ దీర్ఘస్వరములతోను గలిసిన నసాధ్యసాధనమునకు, సర్వభూతోచ్చాటనమునకు సమర్థము లగుచుండ షడక్షర మంత్ర మహిమ నెఱుఁగ నెవ్వరితరము ?

సాంఖ్య శాస్త్రప్రకారము రామశబ్దమును శోధించి తెలియవచ్చిన విశేషములు బాలకాండమున వ్రాయఁబడెను. అట్టులే శ్రీ, సీతాశబ్దములను శోధింతము.

రామ ౨, ౫ అనియు ౨ + ౫ = ౭ ప్రణవ మనియు నీలోనగు విషయములు పూర్వము వ్రాయఁబడెను. ఆ ప్రకారము చూచిన శ్రీ = శ + ర = ౫ + ౨ = ౭ ఆ యంకెలే యీ పర్యవసానముగా నేర్పడి శ్రీ = రామ యని సూచించుచున్నది. అనఁగా నిరువురయందు సమత్వము ద్యోదితము. ఈ సందర్భమున. "యథా మయా జగద్వ్యాప్తం, స్వరూపేణ స్వభావతః । తయా వ్యాప్త మిదం విశ్వం, నియంత్రీచ తథేశ్వరీ" స్వరూపముచే, స్వభావముచే నాచే నెట్లు ప్రపంచము వ్యాపింపఁబడి యున్నదో యట్టులే యామెచేతను వ్యాపింపఁబడియున్నది. ఆమెయే ప్రపంచమునకు నియంత్రి, ఆమెయే యీశ్వరి, 'నిత్యైవేషా జగన్మాతా, విష్ణోశ్శ్రీరనపాయినీ । కిమత్ర బహునోక్తేన, సంక్షేపేణేద ముచ్యతే । దేవతిర్యఙ్మనుష్యేషు, పున్నామా భగవాన్ హరిః । స్త్రీ నామ్నీ లక్ష్మీ మైత్రేయ, నానయో ర్విద్యతే పరమ్॥' ఈ జగన్మాత విష్ణువునకు నిత్యానపాయిని. పెక్కుమాటలవలన లాభమేమి? సంక్షేపముగాఁ జెప్పెదను. దేవతలందు, మనుష్యులందు, బశుపక్ష్యాదులందు మగవారిపేర్లు గలవి విష్ణువు స్త్రీపేర్లు గలవి లక్ష్మి. ఈయిరువురకంటెఁ బరమైనది లేదు. 'సర్వేషామేవ లోకానామీశ్వరీ మమ వల్లభా । అస్యా మమచ శేషం హి, విభూతి రుభయాత్మికా॥' అన్ని లోకములకు నా ప్రియురాలే యీశ్వరి. నిత్యవిభూతి, లీలావిభూతి (ప్రపంచము) యను రెండు విభూతులు ఆమెకు నాకు శేషములై యున్నవి. 'అస్యేశానా జగతః, ఈ ప్రపంచమునకు నీశానయగు నీకు 'ఈశానాం జగతా మధీశ దయితాం' ఇత్యాది ప్రమాణములచే లక్ష్మీనారాయణులు శీతారాము లిరువురు సమాను లని యేర్పడుచున్నది.

లోకే స్త్రీవాచకం యావత్, తత్సర్వం జానకీ శుభా । పున్నామ వాచకం యావత్, తత్సర్వం త్వం హి రాఘవ । తస్మాల్లోకత్రయే దేవ యువాభ్యాం నాస్తి కించన॥ అధ్యాత్మ, ౩.

రామా! లోకమున పురుష వాచకములన్నియు నీవు, స్త్రీవాచకము లన్నియు సీతాదేవి, కావున మూఁడు లోకంబు లందు మీ యిరువుర కంటె వేఱైనది లేదు.

రామ = ౫౨. శ్రీ = ౫౨. - ౨౭ + ౨౫ = ౫౨. ఇరువదియేడవ వాఁడు భగవంతుఁడు. ౨౫ = చేతనాచేతనాత్మక మగు (౨౪ + ౧ = ౨౫) తత్త్వము. ౨౭ + ౨౫-౫౨ రామయైనట్టే శ్రీ = ౫౨ తెలుపుచున్నది. ఇదియును లక్ష్మీనారాయణుల సమత్వము తెలుపుచున్నది. ఈ యర్థమునే సీతయను శబ్దము సుస్పష్టముగఁ దెలుపుచున్నది. సీ + త = ౭ + ౬ = ౧౩ = వర్ణ సమామ్నాయ మందలి పదుమూఁడవ యక్షరము ప్రణవము. ఈ ౭౬ ను ముందుచెప్పిన ప్రకారము విభజించితిమేని ౨౭ + ౨౫ + ౨౪ = ౭౬ అగుచున్నది. ఇది చిదచిదీశ్వర తత్త్వముల మూఁటిని దెలుపుచు

వీని కేకీభావమును సూచించు చున్నది. ఇంతకంటెం బరమై, మాహాత్మ్యము కలది మఱేది కలదు ?

సీతాశబ్దము 'రసోవైస' యను శ్రుత్యర్థమును బోధించు చున్నది. 'రసోవైసః' అనఁగా భగవంతుఁడు ఆనందము నిశ్చయము అని యర్థము. అట్టులే సకారమునకు స్త్రీలింగ రూపము సీ-కావున సీ శబ్దమునకు భగవతి లక్ష్మీదేవి యని యర్థము- 'సా చ లక్ష్మీః బుద్ధిః ప్రోక్తా' యని ఏకాక్షర కోశమునందుఁ గలదు. అట్టులే తకారమునకు నిశ్చయ మని యర్థము.

'కరుణాయాంతు తాస్త్రియా'మ్మని నానా. ర. యందుఁగలదు. తా శబ్దమునకు దయ యని యర్థము కలదు.

కావున సీతాశబ్దమునకు లక్ష్మీదేవి కేవల దయావతి యని యేర్పడుచున్నది. "లక్ష్మ్యా సహ హృషీకేశో దేవ్యా కారుణ్యరూపయా । రక్షక స్సర్వ సిద్ధాంతే వేదాంతేపిచ గీయతే' యని ప్రమాణము గలదు.

సీతాదేవి యెట్టి దయావతియో రామాయణము చదివినవారికిఁ జెప్పవలసిన పనియేలేదు.

సీతాశబ్దమునందువలె సకార తకారములు గల శబ్దములు సతీ, సత్, సేతు, సత్య యనునవి కానవచ్చుచున్నవి. వీని యర్థమునకు సీతాదేవికి సంబంధము గలదేమో చూతము. సతీ='సతీ సాధ్వీ పతివ్రతా' అమరకోశము సతీశబ్దము సాధారణముగఁ బతివ్రతకుఁ బేరు. దర్శనాదేవ పాపం స్యతీతి సతీ = దర్శమాత్రముననే పాపముల పోఁగొట్టునది సతి. ఇది సామాన్యసతుల లక్షణము. అందు సీతాదేవి యెటువంటిసతియో రామాయణజ్ఞులకుఁ జెప్పవలసిన పనియేలేదు. ఒకసారి యామె కటాక్షము మనమీఁదఁ బడినను, ఆమె దర్శనము మన కొకసారి కలిగినను మన పాపములెల్ల నశించి కృతకృత్యుల మగుటయందు నేమి సందేహము గలదు. ఆమె దర్శనప్రాప్తి లేనప్పుడు అట్టి పుణ్యాత్మురాలి చరిత్ర పఠించుటయు సర్వపాపహరము.

సేతు=నీళ్ళుపోకుండ రెండొడ్డులకు నడుమ నడ్డముగఁ గట్టఁబడుకట్టకు సేతువనిపేరు. ఈయన కట్టలు కట్టుట యందు ద్దేశ్యమేమి ? (౧) నీళ్ళు వ్యర్థముగఁ బోకుండ మరలించి పైరుపచ్చలు వృద్ధిచేసికొని బాగుపడుట. అట్టులే సీతాదేవిని మన మాశ్రయించితిమేని మనజన్మ ప్రవాహములు వ్యర్థములై పోక ఫలించునట్లుచేసి యైహికసుఖములను గలిగించును. (౨) రెండవయుద్దేశ్య మీయొడ్డున నుండువారావలి యొడ్డునకుఁబోవుటకు నిరపాయమైన సదుపాయము. ఒక గొప్పనదిని మనమీఁదియో, నడిచియో దాఁటిపోవచ్చును. ఇది యాబాల గోపాల మందఱకు సాధ్య మగునది కాదు. అపాయముతోఁ గూడినది. ధన పరజన సాహాయ్య మపేక్షించునవి పడవలు,

సేతు వట్టిది గాదు. ఇది నిరపాయము. ఇది యాబాలగోపాలము బాలురకు, వృద్ధులకు, స్త్రీలకుఁ, బురుషులకు, ధన పరజన సాహాయ్య మపేక్షించి సుసాధనమై నమ్మకమైన యుపాయము. సీతాదేవియు భగవత్ప్రాప్తిఁగోరి తన్నాశ్రయించు వారి కిట్టిదే. కావుననే యామెను బురుషకారముగా భక్తులు ప్రపన్నులు నాశ్రయింతురు. ఈ సందర్భమున నుపనిషద్వాక్యములు స్మరణీయములు.

అమృతస్య పరం సేతుం = ఈ పరబ్రహ్మమును సంసార సముద్రమును దాఁటించి మోక్షమును బొందించుటకొఱకు సాధన భూతమగు గొప్పసేతు వని తెలిసికొనుము.

అమృతస్యైష సేతుః । ఏషాం లోకానా మసంభేదాయ = సినోతి, బధ్నాతి స్వస్మిన్ సర్వం చిదచిద్వస్తు జాత మితి సేతుః = చిదచిద్విశిష్ట మగు సర్వమును దన యందు బంధించు కొనునది సేతువు.

ఏతం సేతుం తీర్త్వా = ఈ సేతువు నాశ్రయించి దానిని దాఁటవలయునే కాని యన్యోపాయముచేఁ గాదు.

ఇఁక సత్యమనఁగా నేమియో చూతము సకారో జీవ స్త్రేశ - స్తకారః పర వాచకః । తయో స్సంసర్గ శక్తిర్యా స్తస్మాత్సత్య ఉదాహృతః॥ సకారమునకు జీవుఁ డనియు, తకారమునకుఁ బరబ్రహ్మ మనియు యకారము ఈ రెంటిని జేర్చు శక్తి యనియు నర్థము. ఈ యాకారమునకు లక్ష్మియని యర్థము. కావున లక్ష్మీదేవియే జీవాత్మను బరమాత్మతోఁ బొందించునది.

సత్ = ఈమె యెవతె? ఇట్టి ప్రభావ మీమెయందుఁ గలుగఁ గారణమేమి? ఈమె నమ్మకముగ నద్దరిచేర్చునని నమ్ముటెట్లు? ఉపనిషత్తులందు, ఆకులు, కొమ్మలు, కాయలు, పండ్లతోడ మహావృక్షమగు శక్తి మఱ్ఱివిత్తనమం దెట్లున్నదో, యట్లు చితచిదాత్మక ప్రపంచ మంతయు నామరూపములచే వేర్పఱుపరాని భగవంతుని యందు లీనమైయుండు దశ నసత్తనియు, నామరూప భేదములతోఁ బ్రపంచముగఁ బరిణమించిన దశ సత్తనియుఁ జెప్పఁబడెను. సూక్ష్మ చిదచిద్విశిష్టుఁ డగు బ్రహ్మ సమస్త, స్థూల చిదచిద్విశిష్ట బ్రహ్మము సత్తు. మనకు గోచరించునది యంతయుఁ జిదచిద్విశిష్టమే-అనఁగా జీవులతోను బ్రకృతితోను గూడి యుండుననే -ఈ రెంటికిని నంతర్యామిగా నుండు వాఁ డీశ్వరుఁడు, ఆయన మన కన్నులకుఁ గానరాఁడు. అయినను మనము చేరవలసిన దాయననే-ఈ పద్యమున జానకీమనోంబుజధామా యను వాక్య మీ యర్థమునే సూచించుచున్నది. ఎట్లు చేరుట? ఆయన గృహస్థుని వంటి వాఁడు జీవ ప్రకృతులు గృహము. ఆయన గృహాంతర్భాగమునఁ దన యిష్టులతోఁ, శిష్టులతో సంతోషముగఁ గాలక్షేపము చేయుచుండును. గృహకృత్యములు పుత్ర మిత్ర భృత్య పోషణాదు లాయన భార్య విచారించుచుఁ బతివ్రత కావున భర్త

కే విచారము లేకుండునట్టు లానందముతోఁ గాలము గడుపునట్లు సర్వకార్యములు నిర్వహించుచుండును. అట్టి భార్యయే లక్ష్మీదేవి - భర్తను విడక సర్వదా యాయనకు నానందము గలుగ వ్యవహరించును. ప్రపంచ వ్యవహారము నిర్వహించును. జీవ ప్రకృతులు రెండును ఆమె యాజ్ఞానుసారము వర్తించునవే. ఇందు జీవులు బిడ్డలు, ఇల్లు, ఇంటిచుట్టు తోఁటయందలి వినోదవస్తువులు ప్రకృతి. బిడ్డలు తోఁటలో వినోద వస్తువులతోఁ గ్రీడించుచుండ నామె తనపనిలోఁ దానుండును. ఎప్పుడు బిడ్డ లాఁకలిగొని యాటవస్తువు లావలఁ బాఱవైచి యమ్మా యని బిగ్గ నేడ్తురో యప్పు డమ్మ వచ్చి వాకిలి దీసి వారిని లోపలికి రానిచ్చి పాలిచ్చి పోషించును. కావుననే యామెను చైతన్యస్తన్యదాయిని యని గ్రంథములు చెప్పుచున్నవి. ఈ బిడ్డలు మఱల నాటలకుఁ బోరాదని తలఁచి భక్తిగలవారై మాతాపితృ సేవాపరాయణు లగుదురేని మఱల నాటలకుఁ బంపక తండ్రి కప్పగించి యాసేవయందే యుండుఁడనును. ఈ బిడ్డల కపాయము పాముల వలననో పులులవలననో, దొంగలవలననో శత్రువుల వలననో కలిగి వారు ఘోషించిరేని యప్పుడు తండ్రి దానిని వారింపఁగల వారిని దన వారిని బంపనైనఁ బంపును. ఇదే యంశావతారము. లేకయంతటి గొప్పకార్యమైన యెడలఁ దానే బయలు దేఱి కావలసిన యుడుపులు, పరికరములు తన భార్య యొసఁగఁగాఁ బరిగ్రహించి సందర్భోచిత వేషముతో నంతఃపురము విడిచి సోపానములు దిగి యిల్లు విడిచి బిడ్డలయొద్దకు వచ్చి యపాయముఁ దప్పించి బిడ్డల రక్షించి మఱల లోపలికిఁబోయి యా వేషముదీసి వేయును ఇది పూర్ణావతారము. భర్తయొద్దకుఁ బోఁదలఁచినవారి కెవ్వరికైనను నామె యనుగ్రహించి తలుపుదీయువఱకు లోపలఁ బ్రవేశింపఁ సాధ్యపడదు. ఈతలుపు దానే తీయనైనఁ దీయును. లేక భర్తచేఁ బంపఁబడిన వానిచేనైనఁ దీయఁజేయును. (వీఁడే యాచార్యుఁడు) అంతియకాని మనమై స్వశక్తిచే నెన్ని కల్పములకైనఁ బోఁజాలము. మన యేడుపులు విని మనస్సు కరఁగి యామె తలుపులు దీయవలె. మనము లోపలికిఁబోవలె. ఇది తప్ప వేఱు మార్గము లేదు. మీఁదఁజెప్పిన తలుపులనే నామరూపములచే వ్యాపించియుండు దీనినే మాయయని, ప్రకృతియని, కర్మమని నానావిధములఁ బిలుతురు. ఇదియంతయు శ్రీదేవి చిద్విలాసము, భగవచ్ఛక్తియే, అన్యము గాదు. కావున భగవత్ప్రాప్తి కోరువారికి శ్రీదేవి యనుగ్రహ మనివార్యము. భగవంతుఁడు పంపిన యాచార్యుఁడైనను ఈమె యనుగ్రహము లేదేని యేకార్యముఁ జేయఁజాలఁడు. వెలికిఁ బోనులేఁడు. లోపలికి రానులేఁడు. ఇట్లున్నను శ్రీదేవి భర్త సంకల్పప్రకారమే సమస్తకార్యములు చేయునుగాని యతిక్రమించి యేమియుఁ జేయదు. కావుననే భగవత్సంకల్పమే శ్రీ, శ్రీయే భగవత్సంకల్ప మందురు. భగవద్వ్యవహార మంతయు నీమెమూలమున జరుగవలసినదే. "మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరమ్ । మమ యోని ర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్।

హేతునానేన కౌంతేయ జగద్విపరివర్తతే, భ. గీ. ౯-౧౦ భగవత్కరుణాస్వరూపిణియైన యీశక్తినే సాత్త్వికులు శ్రీయని, లక్ష్మియని కొలుతురు. ఈ పద్యమందలి శ్రీ శరణమను వాక్య మీ యర్థమునే సూచించుచున్నది. తామసులు వారి చిత్తవృత్తి ననుసరించి ఘోరరూపిణిగా కాళీచండీత్యాది నామములఁ బిలుతురు. ఆమె తృప్తికని హింసాది ఘోరకార్యములను జేయుదురు. కాకాసురుని ప్రత్యక్ష పురుషకారము చేతను, జటాయువు సేవచేతను, సుగ్రీవుని నాభరణములు వైచుటచేతను, సకుటుంబముగ విభీషణుఁ డానుకూల్యము వహించి ప్రాతికూల్యము విసర్జించుటచేతను, సీతానుగ్రహమునకుఁ బాత్రులైరని యెఱిఁగియే రామచంద్రమూర్తియు వారల ననుగ్రహించెను. ఆమె యనుగ్రహింపని వారిని దండించెను. కావున రామ కటాక్షప్రాప్తికి సీతానుగ్రహ మావశ్యక మగుచున్నది ఓయీ! "ఏక మేవాద్వితీయం బ్రహ్మ"యని బ్రహ్మయొక్కఁడే సర్వకారణ మని చెప్పుచుండఁగా నీవు లక్ష్మీనారాయణులని యిద్దఱఁ జెప్పుచున్నావే. అది శ్రుతి విరోధము గాదా? యందురేమో - కాదు. నీవు చేసిన యర్థము శ్రుతి విరోధము. ఏక మను శబ్దమే నేను జెప్పిన యర్థము బోధించుచున్నది. ఆ-ఇ-ఉ ల వంటిది కాదు, ఏకారము. ఈ మూఁడక్షరములను నీవు విభజింపలేవు. అవి సంఘగతములు గావు. ఏకారము అ+ఈ కారముల సంధిచేనైనది. అకారమునకు విష్ణువు, ఈ కారమునకు లక్ష్మియని యర్థము. అట్టులే ప్రణవమందలి ఓకారము అ+ఉలచే నయినది. లక్ష్మీనారాయణులనే తెలుపుచున్నది. అట్లైన ప్రపంచమున కిరువురు ప్రభువులైరి గదా యందురేమో. ఒక రాష్ట్రమునకు నిరువురు స్వతంత్రరాజు లుండిన హానికరము గాని, రాజు, యువరాజు లుండిన నేమి హాని కలదు. సూర్యుఁడు, ఎండ యుండిన లోకమున కేహాని గలిగినది. లక్ష్మీదేవి పతివ్రత గావున భర్తృ సంకల్పము ననుసరించి పోవుచుండును గాని యాయనను ధిక్కరించిపోదు. కావున నే హానియు లేదు. ఎండలేని సూర్యుఁడున్నాఁడని నీవు చెప్పెదవు. ఎండతోడ సూర్యుఁ డున్నాఁడనియు నెండలోకి పోక సూర్యదర్శనము కలుగదనియు నేను చెప్పుచున్నాను. ఎండచే లోకతంత్ర మంతయుఁ జరుగుచున్నది కాని యెండలేని సూర్యబింబముచే గాదు. మన కారోగ్యకారణ మెండయే కాని యెండలేని సూరుఁడు కాఁడు. ఈ కాండమును బఠించువారు:—

(౧) బద్ధజీవ తారతమ్యము.

(౧) లంకలోనుండు రాక్షసస్త్రీలు. (౨) చెఱయందుంపఁబడి తప్పించుకొని పోవ నిష్టము కలిగియు. బోలేని దేవతాస్త్రీలు. (౩) సీతాదేవి కర్మవశమునఁ బ్రవేశించియు నందు లగ్నగాక ప్రసన్నయై భగవత్సహాయముచేఁ దప్పించుకొన్నది. (౪) హనుమంతుఁడు స్వేచ్ఛగాఁ బ్రవేశించి యందుఁ దగులుకొనక దానిని దగ్ధము చేసి వచ్చినవాఁడు. ఇట్టివారు మహాత్ములు, ఋషులు. ఈ నాలుగు విధములైన జీవాత్మలు సుందరకాండమున వివరింపఁబడినారు.

(౨) జీవాత్మ పరమాత్మలకుఁ గల సంబంధము సీతారాముల సంబంధము వంటిది.

(౩) జీవాత్మ తరణోపాయము - ఇది సీతాదేవి చర్యవలన నెఱుఁగనగు.

(౪) శిష్యాచార్య లక్షణములు - సీతాంజనేయ చర్యలవలన నెఱుఁగనగు.

(౫) జీవాత్ములకు సేవ్యుఁడు నిర్విశిష్టరాముఁడా? సీతావిశిష్టరాముఁడా? హనుమంతుని చర్యవలన నెఱుఁగనగు.

(౬) ఆత్మావలోకన పరుఁడైన యోగిలక్షణము హనుమంతుని చర్యవలనఁ దెలియనగు.

(౭) సీతాదేవి యుపాయమా? ఉపేయమా? రెండునా?

(౮) యోగికిఁ బ్రపన్నునకు భేదమేమి?

ఈ ముఖ్యవిషయములకుఁ బ్రత్యుత్తరము గోరి చదువవలయును. ఇన్నిఁటికిఁ బ్రత్యుత్తరము లిందుఁగలవు. ఈ విషయములు బాగుగ మనస్సున నాటుటకై దీని నెన్నిమార్లైనఁ బారాయణము చేయవలయును. మీఁద వ్రాసినదంతయు నప్రస్తుత ప్రశంసముగాదు. సీతా హనుమంతుల విషయము - వీర నిరువుర విడిచిన వారికి రామచంద్రానుగ్రహప్రాప్తి లేదు. సుందరకాండ మీ యిరువుర చరిత్రమే చెప్పుచున్నది. కావుననే యీ కాండము తక్కిన కాండములకంటె నెక్కువగా జనులచే నాదరింపఁబడు చున్నది. ఆ కారణముచేతనే దీనకి సుందరకాండ మని పేరు. సుందరశబ్దమునకు "సుతరాం ఆద్రియత ఇతి సుందరం, దృఙ్ ఆదరే. మిక్కిలి సంతోషపెట్టునది" యని లింగాభట్టీయము. పారాయణరూపముగా జనులచే నాదరింపఁబడునది. వారి వారి యిష్టార్థములు నెఱవేర్చి సంతోషపెట్టునది సుందరకాండమే కదా. కావున సుందర శబ్దమునకు ధాత్వర్థము సంపూర్ణముగా సరిపోవుచున్నది. ఈ విశేషము దీనియందుఁ గలదని తెలుపుటకే తక్కిన కాండములకు స్థలమును బట్టియో కార్యమును బట్టియో బాలకాండమని, యయోధ్యాకాండమని, యరణ్యకాండమని, కిష్కింధాకాండ మని, యుద్ధకాండమని, పేరు పెట్టినట్లు పెట్టక వాల్మీకి సుందరకాండ మనియెను.

మీఁద వ్రాసిన విషయములు మనస్సునం దుంచుకొని యీ పద్యము చదివినచోఁ దాత్పర్యము సుస్పష్టమగును.

తాత్పర్యము

శ్రీదేవికి వాసస్థానమైనవాఁడా! సంసారసముద్రము దాఁటుటకు గురువను గొప్ప పడవను నడుపు నారకాటీ! అట్లు సంసారసాగరము దాఁటించుటకుఁ గేవుగా శ్రద్ధాభక్తు లనుగ్రహించు వాఁడా! శాశ్వత సుఖము నిచ్చువాఁడా! జానకీదేవి హృదయ కమలమందు వాసము చేయువాఁడా!

ఈ కాండాది పద్యమునందు నీ కాండమునఁ బ్రతిపాదింపఁ బడిన యర్థము గలదు. భగవంతుఁడు సంసారిచేతనుని రక్షించుటకై యాచార్యుని సంపాదించె ననుట పూర్వకాండార్థము. సంసారిచేతను నుద్ధరింప నాచార్యుఁడు చేయు ప్రయత్నమీ కాండమునఁ జెప్పఁబడినది. ఈ యర్థమును నా జవంజవాది వాక్యము సూచించును. గురుతరి హనుమంతుఁ డనియుఁ, గ్రన్థధారుఁడు శ్రీరామచంద్రమూర్తి యనియుఁ నెఱుఁగనగు. శ్రీశరణ యనుటచే శ్రియః పతిత్వ మనెడి బాలకాండార్థము కళ్యాణగుణాకరత్వ మనెడి యయోధ్యాకాండార్థమును, సజ్జన రక్షకత్వ మనెడి యరణ్య కాండార్థమును సూచితము. ఆ జవంజవేత్యాది పూర్వకాండార్థము నీ కాండార్థమును సూచించును. శ్రద్ధేత్యాది పదము యుద్ధకాండార్థమైన ప్రపత్తిని దెలుపును. శర్మద యనునది ప్రపత్తి ఫలమును, జానకీత్యాది పదము ప్రాప్యస్వరూపమును సూచించును. కాఁగా నీ పద్యమునందు నేతత్కాండార్థము ప్రధానముగను బూర్వోత్తర కాండార్థములు తత్సహకారులుగను వివక్షితములు.

అవతారిక :— శ్రీ రామచంద్రమూర్తి పరాత్పరుఁ డనుటకు నసాధారణమగు సమస్తకళ్యాణగుణాకరత్వము కిష్కింధాకాండమందుఁ జెప్పఁబడెను. ఈ కాండమున నాయనకుఁగల సర్వసంహారకత్వ మనెడి గుణము 'అధిప బ్రహ్మస్వభువు చతురాస్యుఁడైన' నను పద్యంబునఁ జెప్పఁగలఁడు అని కొందఱు చెప్పుచున్నారు. పూర్వకాండమున మిత్ర రక్షణము సర్వథా చేయవలయు నని చెప్పఁబడెను. ఈ కాండమందు దూతకృత్యము, పతివ్రతా లక్షణము చెప్పఁబడు చున్నదని మఱి కొందఱు, ఆత్మావలోకన తత్పరుఁడైన యోగి చర్యయు, ఆత్మచేయు భగవదనుసంధానవిధము, ఆత్మదర్శనము గల యోగి దేహాభిమానత్యాగము ధ్వనితము.

మొదటి సర్గమందుఁ జక్కఁబఱుప వలసిన శిష్యుని నాచార్యుఁడు వెదకు విధము చెప్పఁబడుచున్నది.

## —* హనుమంతుఁడు మహేంద్రపర్వతంబున విహరించుట *—

క. తరువాత రావణాసుర, వరనీత ధరాత్మజాత♦పదము న్వెదకన్
గురుచారణమార్గంబున, నరుగఁగ నృపదూత గర్శి♦తారి తలంచెన్. ౨

అర్థము. తరువాతన్ = జాంబవంతునిచేఁ బ్రేరింపఁబడి సముద్రోల్లంఘనము చేయ నుత్సహించి మహేంద్రనగమునఁ జేరిన తరువాత, రావణ + అసురవర + నీతన్ = రావణుఁడనెడి రాక్షసశ్రేష్ఠుని చేతఁ దీసికొని పోఁబడిన, ధరాత్మజాత = భూదేవియందు జనించిన సీతాదేవియొక్క, పదమున్ = ఉన్నస్థలమును, గురు = గొప్పదగు, చారణ = ఆకాశమందు సంచరించు చారణు లను దేవజాతులయొక్క, మార్గంబునన్ = త్రోవయందు, నృపదూత = రామచంద్రమూర్తి దూతయగు

హనుమంతుఁడు; ఈయన యెట్టివాఁడన; కర్శితారి = నశింపఁజేయఁబడిన శత్రువులు గలవాఁడు; అవ్యవహిత భవిష్యత్తునకు వర్తమాన భూతము లగు, సు. వ్యా. వాక్య. ౪౧. సూ. "మదర్థే త్యక్తజీవితాః" 'హా హతోఽస్మి' అన్నట్లు, దీనిచే నీయన శత్రుసంహారముచేసి పూనిన కార్యము సాధింపఁగలఁడని సూచితము.

తరువాత కర్శితారి నృపదూత రావణాసురవరనీత ధరాత్మజాతపదము వెదకన్ గురుచారణ మార్గంబున నరుగఁదలచెను అని యన్వయక్రమము.

ఆచార్యపరమైన యర్థము :— శిష్యుఁ డున్నచోట వెదకునట్టి యాచార్యు స్వరూపముకూడ నిందుఁ జెప్పఁబడెను. తరువాతన్ = భగవంతుఁ డనుజ్ఞయిచ్చి పంపిన పిదప, భగవదాజ్ఞలేక యెవఁడును నాచార్యత్వము వహింపరాదని దీనివలన నేర్పడుచున్నది. ఈ యర్థమును నృపదూత యను శబ్దము స్థాపించుచున్నది. నృప= నృ=నరులను, జీవకోటులను, ప=పాలించువాఁడు. అనఁగా జీవాత్మల కీశ్వరుఁడై వానియం దంతర్యామియై ప్రేరకుఁడై యుండువాఁడు. అట్టివాఁడు భగవంతుఁడు. ఆయన దూత–"సందేశహరో దూత"యని యమర కోశము సందేశమనఁగా నోటి మాట. దానిని గొనిపోవువాఁడు సందేశ హరుఁడు. వీనికే దూతయని పేరు. "దూతః దూఙ్ పరితాపే' వీనిచేత శత్రువు తపింపఁ జేయఁబడును. అనుటచే దూతయగువాఁడు తన స్వామిచెప్పిన మాట చెప్పుటయేకాక, శత్రువులు నిరోధించినను వారిని బాధించి మరల వచ్చి తానుచేసిన కార్యము చెప్పఁగలవాఁడై యుండవలెను. ఇట్టివానికి దూత యని పేరు. అటుగాక యచ్చటికిఁ బోయి శత్రువులచేఁ జిక్కి చచ్చువాఁడు దూతగాఁ బోరాదు. గురు విట్టివాఁడై శిష్యసందేహముల నెల్ల దీర్పఁగలవాఁడై యుండవలెఁ గాని శిష్యున కెక్కడ సందేహ మేమో గురువున కక్కడనే నట్టన్నట్లుండ రాదు. అట్టివాఁడు గురువుగా నుండ యోగ్యుఁడు కాఁడు. భగవంతునిచే నాజ్ఞాపింపఁ బడిన గురు వెట్టి లక్షణములు గలవాఁడై యుండుననిన; కర్శిత+అరి= (౧) కృశింపఁ జేయఁబడిన కామక్రోధాదులను నరిషడ్వర్గము గలవాఁడై యుండును. (౨) గురువు సార్థక నామధేయుఁడై యుండవలెను. "గుశబ్ద స్త్వంధకార స్స్యాత్ । రుశబ్ద స్తన్నిరోధకః । అంధకార నిరోధిత్వా, ద్గురు రిత్యభిధీయతే." గు శబ్దమునకు నజ్ఞాన మను చీఁకటియని యర్థము. రు శబ్దమునకు దాని నిరోధించువాఁడని యర్థము. శిష్యు నజ్ఞానాంధకారముఁ బోఁగొట్టువాఁడు గురువని యర్థము. మఱియు గురు వెట్టివాఁడై యుండవలయు ననిన గురుచారణమార్గంబున నరుఁగదలఁచువాఁడుగా నుండవలయును గురువులయిన చారణులు పోయిన మార్గమునఁ బోవువాఁడుగా నుండ వలయునుగాని తద్భిన్న మార్గమున వర్తించువాఁడుగా నుండరాదు. చారణు లనఁగా, చారయంతి ఇతి చారణాః=ధర్మము ననుష్ఠించువారు కావునఁ జారణులు అని వ్యుత్పత్తి. అనఁగాఁ బూర్వాచార్యులని యర్థము. వారిమార్గంబునన్=వా

రనుష్ఠించిన విధమున, 'పోవందగుఁ బెద్దవారు పోయెడి త్రోవఁ' అన్నట్లు శిష్టుల సదాచారమునం దున్నవాఁడని యర్థము.

ఈ విధముగ గురు లక్షణము చెప్పఁబడెను. భగవదాజ్ఞ కలదనుటకు రామ ముద్రికయుఁ గర్శితారి యనుటకు దిసమొలల సుందరుల రావణాంతఃపురమునఁ జూచినను మనసు చలింపమియు, లంకాదహనాక్ష కుమారాది వధయు గురుచారణ మార్గమున ననుటచే దూతకృత్యము ధర్మశాస్త్రమున కవిరోధముగఁ జేయుటయుఁ దెలిపెడిని.

ఇందుఁ బూర్వాచార పరాయణత్వమునకే ప్రాధాన్య మీయఁబడెనని తలంప రాదు. ధర్మ నిర్ణయమందుఁ బరాశరుఁడు.

కల్పే కల్పే క్షయోత్పత్తౌ బ్రహ్మ విష్ణు మహేశ్వరాః, శ్రుతిస్మృతిసదాచార నిర్ణేతారశ్చ సర్వదా. మనువు, ౨, ౬, "వేదోఖిలోధర్మమూలం స్మృతి శీలేచ తద్విదామ్, ఆచారశ్చైవ సాధూనా మాత్మన స్తుష్టి రేవచ.

వ్యాసులు :— ధర్మమూలం వేద మాహుః, గ్రంథరాశి మకృత్రిమమ్, తద్విదాం స్మృతిశీలేన, సాధ్వాచారం మనః ప్రియమ్.

శ్రుతిస్స్మృతి స్సదాచారః స్వస్యచప్రియామాత్మనః. సమ్యక్సంకల్పజః కామో, ధర్మమూల మిదం స్మృతమ్॥ యాజ్ఞవల్క్యుఁడు.

ఈ విధముగ శ్రుతి – స్మృతి – సదాచారము, మనువు చెప్పిన శీలమే యాజ్ఞవల్క్యుఁడు చెప్పిన సమ్యక్సంకల్పజకామమని వీరమిత్రోదయుఁడు సమర్థించెను.

కావున శ్రుతి, స్మృతి, సదాచారము, స్వప్రియము, శీలము ననునవి ధర్మ నిర్ణయమునందు బ్రమాణములు. 'శ్రుతి స్మృతి ర్మమైవాజ్ఞా' యను ప్రమాణము చొప్పున హనుమ ద్విషయమున రామాజ్ఞ కలదు. అది రాజాజ్ఞ కావున వేదానుశాసనమే. సదాచార మనునది గురుచారణ మార్గ గమనముచేఁ జెప్పబడెను. శీల మనునది అస్ఖలిత బ్రహ్మచర్యముచేఁ జెప్పఁబడెను ఇచ్చట స్వప్రియమునకుఁ గారణము లేదు. ఏలన— ఈ మార్గముల దేనిచేతను బరిష్కారము గాక యిటుచేసిన బాగా యిటు చేసిన బాగా యను ధర్మసందేహము వచ్చినపుడు కామక్రోధ లోభములకుఁ బాలుపడని తన పరిశుద్ధాంతఃకరణము ప్రమాణము. ఇచ్చట నట్టి సందేహము లేదు.

శిష్టాచార మనఁగా :—

ధర్మేణాఽధిగతో యైస్తు, వేదః సపరిబృంహణః ।
తే శిష్టా బ్రాహ్మణా జ్ఞేయాః శ్రుతి ప్రత్యక్ష హేతవః. ౧౨–౧౦౮

ధర్మమార్గమున ననఁగా గురు ముఖముగానో, వృద్ధసేవ చేసియో, మీమాంస, ధర్మశాస్త్రము, ఇతిహాస పురాణములతోడ వేద మెఱిఁగి దానిని

ప్రత్యక్షము చేసికొని యర్థజ్ఞానము గలిగి చెప్పఁగలవారు శిష్టులు. ఈ విధముగ నాచార్య లక్షణ పరిపూర్తి హనుమంతునందుఁ గలదనియు, నట్టివాఁడు శిష్యాన్వేషణ మం దర్హుఁడనియుఁ జెప్పబడెను.

ఇఁక శిష్య లక్షణము చెప్పఁబడును. శిష్యుని ప్రథమ లక్షణము సీతవలె నుండుట. స్త్రీ యేల చెప్పఁబడె నన, 'స్త్రీ ప్రాయ మితర త్సర్వం, జగద్బ్రహ్మ పురస్సర'మ్మన్నట్టు భగవంతుఁ డొకఁడే పురుషుఁడు. తక్కిన జీవకోటు లన్నియు భర్తకు భార్య పరతంత్రమైనట్లు భగవంతునకుఁ బరతంత్రములే. ధారణపోషణాదులకాయనపై నాధారపడి యుండునవే. ఇట్లు చెప్పుటచే భగవత్ప్రాప్తికోరు జీవాత్మ తాను స్వతంత్రుఁడ నని తలఁపక తాను సర్వవిధముల భగవంతునకుఁ బరతంత్రుఁడననియాయనపై యోగక్షేమముల కన్నిఁటికి నాధారపడి యుండవలయును. 'నిర్యోగక్షేమ ఆత్మవాన్' అని కదా భ. గీ. చెప్పుచున్నది. ఇట్టి భావములేని జీవాత్మకు భగవత్ప్రాప్తి లేదు. హనుమంతుఁడు నేను వీఁపుపైఁ గూర్చుండఁ బెట్టుకొని పోయెద రమ్మని పిలిచినపుడు పోకయుండుటయు, రావణాసురుని రామాజ్ఞలేక నిన్ను భస్మముచేయనని చెప్పుటచేతను, స్వరక్షణభారము రామచంద్రమూర్తిపై వైచి యుండుటచేతను సీతాపారతంత్ర్య మెఱుఁగనగు. ధరాత్మజాత = ఈ విశేషణము మీఁదఁ జెప్పిన జీవాత్మయొక్క స్వరూపస్వభావములఁ దెలుపుచున్నది. భూమియందుఁ బుట్టిన దనుటచే నయోనిజత్వము దెలుపు టయ్యె. అట్టులే జీవుఁడు నయోనిజుఁడే కదా. ఆ కారణముచే జీవుఁడు నిత్యుఁ డనియు నేర్పడెను. సీత యనఁగా నాఁగటిచాలు. ఇది భూజాత,భూమియందుఁ బుట్టిన దేకదా.అంతియేకాక భూమియేయాధారముగాఁగలదై భూమిని విడిచి యుండలేనిదియు, విడిచిన స్వరూపనాశమై పోవునదియుఁగదా. అట్టులే జీవుఁడును దనకుఁ గారణమై యాధారమైన భగవంతుని విడిచెనేని స్వరూపనాశమై పోవునని భావము. ధరాత్మజాత యనునది వృక్షమును దెలుపును. వృక్షము భూమియందుఁబుట్టి భూమియే యాధారముగఁ గలదై భూమికిఁ బరతంత్రమై యుండునుగదా. అట్టులే జీవుఁడును. ఈ విషయమున ముండకోపనిషత్తునందలి యీ మంత్రము స్మరింపనగు.

'యథోర్ణనాభి స్సృజతే గృహ్యతేచ। యథా పృథివ్యా మోషధయ స్సంభవంతి। యథా సతః పురుషః కేశలోమాని। తథాక్షరా త్సంభవతీహ విశ్వమ్॥ఏప్రకారము సాలెపురుగు తంతువులను దన దేహమునుండి విడుచునో మరల గ్రహించునో, యే ప్రకారము భూమినుండి వృక్షములు జనించునో, యెట్లు పురుషునందు వెండ్రుకలు పుట్టునో యట్లు భగవంతునుండి ప్రపంచము పుట్టుచున్నది. ధరాత్మజాత పదమీ యర్థమునే మఱియొక విధముగను దెలుపుచున్నది. ఎట్లన :— ఆత్మశబ్దమునకు విష్ణువని యర్థము 'ఆత్మ యత్న, ధృతి, స్వాంత, స్వభావ, పరమాత్మను – జీవబుద్ధి శరీరేషు'॥ నానా. 'బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి కథ్యతే. దీనికిఁ బ్రయోగము

"దత్తం దుర్వాససం సోమ మాత్మేశబ్రహ్మసంభవాన్" దత్తాత్రేయుఁడు, దుర్వాసుఁడు, చంద్రుఁడు ఆత్మకు, శివునకు, బ్రహ్మకు సంభవించిరి. ఇచ్చట నాత్మ యనఁగా స్పష్టముగ విష్ణువే. కావున ధర + ఆత్మజాత, యన్నప్పుడు సర్వము ధరించు విష్ణువునకు జనించినవాఁడు జీవుఁడని యర్థము. ఇట్లు చెప్పుటచే వృక్షము లెట్లు భూమికిఁ బరతంత్రములో, యాధేయములో యట్లులే జీవకోటులు భగవంతున కని యర్థము. పదమును = స్థానమును, సంసారమండల మందీ జీవుఁ డెచ్చట నున్నాఁడా యని వెదకఁబోవఁ దలఁచెను. పద శబ్దమునకుఁ జిహ్నమనియు నర్థము గలదు. ఓయి! జీవాత్మలన్నియు భగవ దంశములే కదా. ప్రపంచము జీవకోటితో నిండి యున్నదికదా! ఇఁక వెదకనేల యందురేమో. లోకములో నందఱు నాత్మవంతులే. అయినను వాఁ డాత్మవంతుఁడై నాఁ డన్నప్పుడు తా నాత్మయని దేహము గాదని యాత్మజ్ఞానము గలవాఁడని యెట్లు లర్థమో యట్లులే ధరాత్మజాత యన్నప్పుడు తనకు భగవంతుఁ డాధార మనియుఁ దా నాధేయ మనియుఁ బరతంత్రుఁ డనియు జ్ఞానముగల జీవుఁడు చెప్పఁబడెను. ఇట్టి జ్ఞానము గలిగి భగవత్ప్రాప్తి గోరు జీవు డెచ్చట నున్నాఁడా యని యాచార్యుఁడు వెదకు నని భావము. పద మనఁగాఁ జిహ్నమని యర్థము. కావున నట్టి చిహ్నములు సజ్జన సంభాషణము, సాంగత్యము, భగవన్నామోచ్చారణము లోనైన చిహ్నములు. "విష్ణోః కటాక్షశ్చాద్వేష అభి ముఖ్యం చ సాత్త్వికై । సంభాషణం షడేతాని త్వాచార్యప్రాప్తి హేతవః॥" అను వాక్య మిచ్చట ననుసంధింపవగు. ఇట్టి చిహ్నము లెవని యందుఁ గలవని యాచా ర్యుఁడు వెదకును. ఇట్టి జీవుఁడు తన స్వరూపము మఱచి రావణాసురవర నీతుఁ డయ్యెనని చెప్పఁబడెను. రావయతి = చెడుమాటలఁ జెప్పించునది. ఇట్టివాఁడు రావణుఁడు. కామ క్రోధములకు వశుఁడై తెలివిలేని మాటలాడు వాఁడు అనఁగా యుక్తాయుక్త పరిజ్ఞానము లేనివాఁడని భావము. వీఁడు అసురవరుఁడు; అసురుఁడు అనఁగాఁ బ్రాణములఁ గొనువాఁడు. అసూన్ = ప్రాణాన్, రాంతి = గృహ్ణాంతి, రా = ఆదానే, అట్టివారిలో శ్రేష్ఠుఁడు. అసురవరుఁడు అవివేకముచేఁ బరుల హింసించువాఁ డని భావము. ఇట్టి వానిచే, నీత = స్వాధీన పఱుచు కొనఁబడినది. భగవత్పరతంత్రుఁడై భగవంతునకు నాశ్రితుఁడై యుండవలసిన జీవుఁడు కామముచే హింసా స్వభావుఁ డగు నవివేకికి లోపడె నని భావము. ఇట్లు లోపడి తన యవివేకమునకై యేడ్చు జీవుని వెదక నాచార్యుఁడు ప్రయత్నించు నని భావము.

## తాత్పర్యము

జాంబవంతుఁడు ప్రేరించిన పిమ్మట హనుమంతుఁడు వానరులతో మహేంద్ర నగమెక్కి లంకకుఁబోవ మనస్సుచే సంకల్పించిన దానిని గార్య రూపముగాఁ బరిణ మింపఁజేయు రావణాసురునిచే హరింపఁబడిన భూపుత్రియగు సీత యుండు స్థానమును వెదకుటకై రామచంద్రమూర్తి దూతయు శత్రు సంహారకుఁడు నగు హనుమంతుఁడు

చారణ సంఘములు సంచరించు నాకాశమార్గంబునఁ బోవఁదలఁచెను. ధరాత్మజాత పదము వెదక ననుటచే నటువంటి పతివ్రతాశిరోమణి పాదదర్శనమైనను దాను గృతకృత్యుఁడ నని హనుమంతుఁడు తలఁచె నని సూచితము. దీనివలన సీతామహాత్మ్యము, హనుమంతుని భక్తివినయములు తేటపడుచున్నవి. కావున భక్త ప్రపన్నులకు సీతారాము లిరువురు సేవ్యులే.

ఈ కాండము తకారముతోడఁ బ్రారంభించి తకారముతో సాంతము చేయబడెను. ఈ పద్యమునందు గాయత్రియందలి పండ్రెండవ యక్షరము గలదు.

క. నిక్కించి తలయు మెడయును, జక్కఁగ నాఁబోతువోలెఁ♦జారుతరుండై
యెక్కడ నెవరి కశక్యము, నుక్కడ మగుపని యొనర్ప♦నూహించి మదిన్. 3

అర్థము. నిక్కించి = పొడుగగునట్లు సాచి, ఆఁబోతు = ఆవుపోతు, కోడె, చారుతరుండై = మిగుల మనోహరుఁడై, ఉక్కడము = గొప్పది, అశక్యము = ఇతరులకుఁ జేయ సాధ్యము గానిది. దీనికిఁ గర్త నాలుగవ పద్యమందలి కపికులేశ్వరుఁ డనునది. ఆ పద్యముతో నేకాన్వయము.

తాత్పర్యము

తాను బోవలసిన మార్గముఁ బాఱఁజూచుటకుఁ గాను దల మెడ నిక్కఁబెట్టి మదించిన కోడె వలె మిక్కిలి మనోహరుఁడై యేకాలమందే దేశమందెవ్వరికైనను జేయుటకు సాధ్యము గాని గొప్పపని చేయవలయునని మనస్సునఁ దలఁచినవాఁడై.

కం. మెచ్చఁగువైడూర్యము రుచి, నచ్చపుఁజలినీటిఁబోలి♦యందం బగుచున్
హెచ్చిన పచ్చికపట్టుల, నిచ్చగ విహరించెఁ గపికు♦లేశ్వరుఁ డెలమిన్. ౪

అర్థము. రుచిన్ = కాంతితో, పచ్చికపట్టు = కొంచెము తెలుపుతోఁ గూడిన యూదుపచ్చరంగు కలది, కావున వైడూర్య వర్ణము కలది యనుట. చలినీటిఁ బోలెన్ = అను నుపమానముచేఁ బచ్చిక పట్టునకు శైత్య మార్దవములు వివక్షితములు, పచ్చిక పట్టులన్ = పచ్చిక మొలచిన చోటులందు, కపికులేశ్వరుఁడు = వానర జాతియందు శ్రేష్ఠుఁడు.

తాత్పర్యము

వానర శ్రేష్ఠుఁ డగు హనుమంతుఁడు నిర్మలమైన చల్లని నీటి వలె శైత్యము, మార్దవము గలిగి శ్రేష్ఠమైన వైడూర్యముల కాంతి గలిగి యందముచే నతిశయించిన పచ్చిక పట్టులందు సంతోషముతో నిటునటు ముందు వెనుకకుఁ బచారము సలిపెను.

ఈ తిరుగుట ప్రొద్దుపోక వ్యర్థముగఁ దిరుగుట గాదు. దీర్ఘముగ నాలోచించువారిటు తిరుగుట గలదు.

కం. బెదరించుచు వికిరంబులు, నదలించుచు మృగగణంబు♦నక్కఁన నేలం
బొదలించుచుఁ దరువుల మలఁ, గదలించుచు రేఁగు వెలిమె♦కం బనఁ దిరిగెన్. ౫

అర్థము. వికిరంబులన్ = పక్షులను, అక్కున్ = ఱొమ్ముచే, తరువులన్ = చెట్లను, రేఁగు = విజృంభించు, వెలిమెకము = సింహము, నగన్ = పర్వతమును, పొందలించుచున్ = విఱుగఁ ద్రోయుచు; ఇప్పుడు మనుష్యులవలె రెండుకాళ్ళచేఁ గాక వానరుని వలె నాలుగు పాదముల నడచెనని తోఁచుచున్నది.

తాత్పర్యము

హనుమంతుఁడు పక్షుల బెదరించుచు, మృగసమూహమును నదలించుచు, ఱొమ్ము పార్శ్వభాగములచేఁ జెట్లు విఱిగి నేలఁబడ హుమ్మని తాఁకుచుఁ, గొండను నూఁగులాడించుచు విజృంభించిన సింహమువలెఁ దిరిగెను.

చం. అసితము లోహితంబును సి♦తాసితవర్ణము నాకుపచ్చనై
పొసఁగెడి పెక్కురంగులను ♦ బొంపిరిపోయెడి ధాతుకోటిచేఁ
బసగల యక్షకిన్నరసు♦పర్వసుపర్వనిభాహినిర్జరీ
విసరపరిష్క్రియావితతి♦విస్తృతిచే హృదయంగమంబునై. ౬

అర్థము. అసితము = నలుపు, లోహితము = ఎఱుపు, సితాసిత వర్ణము = తెలుపు నలుపు కలసిన చిత్రపువన్నె, పొంపిరిపోయెడి = అతిశయించెడి, ధాతుకోటిచేన్ = పర్వత సంబంధ ధాతువులచే (లోహాదులచే) సుపర్వ = దేవతలయు, సుపర్వనిభ = దేవతలతో సమానములయిన, అహి = పాములయు, నిర్జరీ = దేవతా స్త్రీలయు, విసర = సమూహములచేతను, పరిష్క్రియా = వారు ధరించిన యలంకారములయొక్క, వితతి = సమూహముల, విస్తృతిచేన్ = విస్తారముచేతను, హృదయంగమంబునై = మనస్సు నాకర్షించునదియై, (మహేంద్రనగముతో నన్వయము) ఇది మహేంద్రపర్వత వర్ణనము.

తాత్పర్యము

నలుపు, తెలుపు, నలుపు దెలుపు గలిసిన చిత్రవర్ణము, ఆకుపచ్చగల పెక్కురంగులచేవృద్ధిచెందినలోహాదులచేతను, మృత్తికాదులచేతను, మిగుల కాంతిగల యాభరణములచే నలంకరించుకొన్న యక్షులు, కిన్నరులు, దేవతలు, దేవతాసములైన పన్నగులు, దేవతాస్త్రీలు వీరి గుంపులచేతను మనోహరమై.

క. మత్తిలి నాగవరంబులు, నెత్తఱిఁ జరియించు నామ♦హేంద్రనగమునన్
జిత్త మిగురొత్త మడువున,హత్తిన నాగంబువోలె♦నతఁడు వెలింగెన్. ౭

అర్థము. మత్తిలి = మదించి, నాగవరంబులు = శ్రేష్ఠము లయిన యేనుఁగులు, ఎత్తఱిన్ = ఏకాలమందును, ఇగురొత్తన్ = సంతోషముచే నతిశయింపగా, హత్తిన = ఉండిన, నాగంబు = ఏనుఁగు.

తాత్పర్యము

మదించిన యేనుఁగులు సర్వకాలములందు సంచరించు నామహేంద్ర పర్వతమునందు సంతోష మతిశయించుచు నుండ మడుఁగులోని యేనుఁగువలె విచ్చలవిడి సంచరించుచు హనుమంతుఁడు ప్రకాశించెను.

The Mahendra range, so colled from Indra, the tutelary god of the East, is identified with the Eastern Ghats, which run in a succession of ranges from Orissa in a South and Westerly direction almost along the Eastern Coast of the Deccon until they lose themselves in the Malaya range to which it is linked by the Nilagiris and the Palni hills on the South. According to Valmiki both Hanuman and Rama passed on from the Malaya to the Mahendra Range, on the sea coast opposite which, on the other side of the channel, was Lanka. It is thus evident that the Southern extensions of the Mahendra Range, known at present under various names such as Kumbhakamdrug (opposite lake Pulicat), Nagari Nose, Jawadi Hills, Kalrayan, Pachmalais, Kolla-malais and Alagar hills (near Madura) formed the natural Eastern barrier of the Deccan, which kept off the Bay; and that the low irregular tracts which now lie between the hills and the Sea, as the deltas of the Pennar (Pinakini) ane the Vellar, the Coleroon, the Kaveri and the Viaga, were, like lower Bengal, subsequent formations due to alluvial deposits of the river and recess of the sea. The Channel which seperated Lanka from the main land probably extended at that time up to the spurs of the Mahendra range (Alagar hills) near modern Madura, and was 100 Jojans (nearly 150 miles) in extent and was studded with islets and shoals, as described in the Ramayana. The causeway constructed by Rama would thus appear to have been very nearly along the lower course of the Vaiga (not mentioned in the Ramayana) which flows through Ramnad into the sea, opposite Rameswaram. The distance between India and Ceylon at present is about 60 miles. [The Ancient Geography of Asia P. P. 43 and 44.]

కం. రవికిని బాకవిరోధికిఁ, బవనునకు స్వయంభువునకుఁ బలు వేల్పులకున్
సవినయముగ నతి మొనర్చి, పవమానసుతుండు చనఁగఁ బయనం బగుచున్. ౮

అర్థము. రవికిని = సూర్యునకు, పాక విరోధికిన్ = పాకుఁడను రాక్షసుని జంపిన యింద్రునకు, పవనునకున్ = వాయుదేవునకు, స్వయంభువునకున్ = బ్రహ్మకు, పలు వేల్పులకున్ = నానా దేవతలకు, నతి = నమస్కారము, పవమాన సుతుండు = వాయుపుత్రుఁడు, ఆంజనేయుఁడు, పయనము = ప్రయాణ శబ్దభవము, రవి = ఈయన విద్యాగురువు. కావునఁ దొలుత నమస్కరించెను. దీనిచే నే కార్యము నందైనను గురు నమస్కారము గావించియే తరువాత దేవతాది నమస్కారము గావింపవలె నని సూచితము. పాకవిరోధి = తాను రాక్షసులతో విరోధింపఁ బోవు చున్నాఁడు కావున రాక్షసవిరోధియగు నింద్రుని సాహాయ్యముగోరి నమస్కరించెను.

తండ్రి గావున నాయన బలవేగములు గలుగ వాయుదేవునకు నమస్కరించెను. బ్రహ్మాస్త్రమువలన బాధలేకుండ బ్రహ్మను బ్రార్థించెను, ఇచ్చట నొకవరుస

గాన వచ్చెడిని, బాల్యమందుఁ దాను సూర్యుని గ్రహింపఁ బోవ నింద్రుఁడు వజ్రాయుధముతోఁ గొట్టఁగా వాయువు స్తంభించి నపుడు బ్రహ్మాదులు వచ్చి వరము లిచ్చిరి. కావున నా నలుగురి పేర్లు వరుసగాఁ జెప్పబడెను, ఆనాఁడు మీరిచ్చిన వరము లీనాఁడు ఫలింప ననుగ్రహింపుఁడని వారిని బ్రార్థించెను. దీనిచేఁ గార్యారంభమందు గురువునకు నిష్టదేవతలకు నమస్కరించుట విధియని యేర్పడుచున్నది.

తాత్పర్యము.

సూర్యునకు, నింద్రునకు, వాయుదేవునకు, బ్రహ్మకుఁ, దక్కిన దేవతలకు నణఁకువతో నమస్కరించి యాంజనేయుఁడు ప్రయాణమై.

కం. తూరుపుముఖమై తండ్రికి, మారుతునకు నంజలిని స♦మర్పించి క్రియా
శూరుఁడు దక్షిణదిశగా, నీరనిధి న్దాఁట మేను♦నెఱి నిగిడించెన్. ౯

అర్థము. మారుతునకున్ = వాయుదేవునకు, క్రియా శూరుఁడు = ఇంతవఱకు నేమాటలు చెప్పెనో దానిని సాధింపఁ గలవాఁడు, నీరనిధిన్ = సముద్రమును, నిగిడించెన్ = పెంచెన్, మీఁది పద్యమందు వాయుదేవునకు దేవతాభావముతో నమస్కరించెను. ఈ పద్యమం దాయన తండ్రికావున జనకభావముతో నమస్కరించెను. కావుననే 'తండ్రికి' నను పదము చేర్పఁబడెను.

దీనివలన గురుదేవతలకు వలెఁ బ్రత్యక్షదేవత తండ్రికిని నమస్కరింపవలెనని సూచితము. తా నిప్పుడు దక్షిణముఖమై యున్నాఁడు. దక్షిణాభిముఖుఁడై నమస్కరింపరాదు. గావునఁ దూర్పు తిరిగి నమస్కరించి మరల దక్షిణ ముఖముగఁ దిరిగెను. శుభకార్యములన్నియుఁ దూర్పు ఉత్తరము తిరిగి చేయవలెను. అశుభకార్యము దక్షిణముఖమై చేయవలెను. నిద్రకు నుత్తరము నిషిద్ధము.

తాత్పర్యము.

తూరుపు దిక్కు తిరిగి తండ్రి యగు వాయుదేవునకు నంజలి జోడించి నమస్కరించి కార్యసాధన మందు సమర్థుఁడగు హనుమంతుఁడు మరల దక్షిణ ముఖము తిరిగి సముద్రమును దాఁటుటకు దేహమును బెంచెను.

కం. ప్లవనకృతనిశ్చయుండై, పవమాననుతుండు రాము♦పనికై తన్నుం
బ్లవగతతి గనఁగఁ బర్వపు, దివసంబున జలధి యనఁగ♦దేహము బెంచెన్. ౧౦

ప్లవన = దాఁటుటయందు, కృత = చేయఁబడిన, నిశ్చయుండు = నిశ్చయముగలవాఁడు, ప్లవగతతి = వానర సమూహము, పర్వపు దివసంబునన్ = పున్నమనాఁటియందు.

తాత్పర్యము.

హనుమంతుఁడు రాముని కార్యము సాధింప సముద్రమును దాఁట నిశ్చయించుకొన్నవాఁడై వానరు లందఱుఁ జూచుచుండఁ బున్నమనాఁటి సముద్రమువలె దేహమును బెంచెను.

—♦ హనుమంతు విక్రమమునకు మహేంద్రాద్రి చీకాకుపడుట ♦—

కం. కొలఁదికి మీఱు శరీరము, పొలుపారఁగ నబ్ధి దాఁటుపూనికను మహా
 బలసుతుఁడు పర్వతముఁ జే, తులతోఁ జరణములతోడఁ దూఁగాడించెన్. ౧౧

అర్థము. మహాబలసుతుఁడు = వాయువు కుమారుఁడు, తూఁగాడించెన్ = ఊఁగు లాడించెను. ఇది శబ్దపల్లవ క్రియ. తూఁగు + ఆడు = తూఁగాడు.

తా త్ప ర్య ము .

మితిమీఱిన శరీరముతో, సముద్రమును దాఁటు పూనికతో హనుమంతుఁడు రెండుచేతులతోను గాళ్ళతోను గొండను నూఁగు లాడించెను.

కం. అచలం బయ్యు ముహూర్తము, ప్రచలిత మయ్యెం గపీంద్ర పరిపీడిత మై
 యచలారుహములు సుమనో, నిచయంబుల నెల్ల రాల్చె నింతం గొండన్.

అర్థము. అచలము = కదలనిది, పర్వతము. ప్రచలితము = మిగులఁ గదలినది. పరిపీడితము = మిగుల బాధింపఁబడినది. బలవంతముగ నూఁచుటచే నని భావము. అచలారుహములు = వృక్షములు, అచలా = భూమి, సుమనోనిచయంబులన్ = పూలగుంపులను.

తా త్ప ర్య ము .

ఆ మహేంద్రపర్వతము కదలని దయ్యు హనుమంతుఁడు బలవంతముగా నూఁచుటచే మిగులఁ గదలిన దయ్యెను. పర్వతము ముందు వెనుకకు నూఁగుటచే దానియందలి చెట్లన్నియుఁ బూలను గొండనిండ జలజల రాల్చెను.

కం. అమ్మహిజమ్ముల రాలిన, ఘుమ్మను క్రొత్తావి బుగులుకొను కుసుమసమూ
 హమ్ముల పెల్లునఁ బుష్పమ, యమ్ముగ శైలమ్ము దనరె నతిరమ్యంబై. ౧౩

అర్థము. మహిజమ్ములన్ = చెట్లనుండి, క్రొత్తావి = క్రొత్తవాసన, క్రొత్త + తావి = క్రొత్తావి, గుబులుకొను = పరిమళించు, కుసుమ = పూవుల, పెల్లునన్ = అతిశయముచే, పుష్పమయమ్ముగన్ = పూలతో నిండినదిగ.

తా త్ప ర్య ము .

ఘుమ్మని క్రొత్తవాసనలచేఁ బరిమళించు పూలు విస్తారముగఁ జెట్లనుండి రాలుటచే నా పర్వతము పూలపర్వతము వలె మిగుల నందమై యుండెను.

కం. ఉత్తమవీర్యం డగు కపి, సత్త్వముచేఁ బీడ చెంది శైలంబు జలం
 బత్తఱిఁ గార్చెను మదమును, మత్తమతంగజము కార్చుమాడ్కిం బెలుచన్. ౧౪

తా త్ప ర్య ము .

ఉత్తమ పరాక్రమముగల కపి నాయకునిచేఁ బీడింపఁబడి యా పర్వతము మదించిన యేనుఁగు మదము కార్చునట్లు నీళ్ళవంకలు పాఱునట్లు చేసెను.

కం. వడ వడ వడఁకెడి శైలము, నడుమను మడికాసు పైఁడి నవ్యాంజన ముం
 డెడి పొరలచాళ్లు కానం,బడియెను దరతరమ ముసుఁగుఁ బాపిన భంగిన్. ౧౫

అర్థము. మడికాసు = వెండి, నవ్యాంజనము = క్రొత్త కాటుక, ఇది మిగుల నలుపై యుండును.

తాత్పర్యము.

గడగడలాడుచున్న కొండనడుమ వెండి బంగారు క్రొత్త కాటుకవంటి లోహము లుండెడి పొరలు చాళ్లు ముసుఁగు దీసి వేసిన కానవచ్చు నట్లొకటి వెంట నొకటి కానవచ్చెను. ఆయారాలు పగులు నప్పటికి వానిలోనుండి యీ విధములైన చాలు కనఁబడినవని భావము.

క. ధగ ధగ మను నడిజ్వాలను, బాగఁ గ్రక్కెడి వహ్ని భంగిఁ♦బోరి మణిసిలలన్
దగు పెనుబండలఁ ద్రోచెను, దిగువబడ మహేంద్రనగ మతి♦ద్రుతరీతిన్. ౧౮

అర్థము. వహ్ని = అగ్ని, అతిద్రుతరీతిన్ = మిగుల వేగముతో, నడిజ్వాల = అగ్నిహోత్రునకు కాళి, కరాళి, విస్ఫులింగిని, ధూమ్రవర్ణ, విశ్వరుచి, లోహిత, మనోజవ యని యేడు విధముల జ్వాలలు గలవు. దానిలో నడిమిది ధూమ్రవర్ణయని కొందఱు, అగ్నిహోత్రము మండునపు డంచున నుండు జ్వాలలు పొగతోఁ గూడి యుండును. నడిమి జ్వాల పొగలేక యుండును. దానివలె నని కొందఱు.

తాత్పర్యము.

మండెడు నగ్నిహోత్రము నడిమిజ్వాలచే భగభగమని మండు మంట లంచు జ్వాలలచేఁ బొగను నెట్లు క్రక్కునో యట్టులే పర్వతము నడుమ మణిసిలలను నంచునఁ బెద్ద బండలను గ్రక్కెను.

క్రక్కుట వాంతి చేసికొనుట యివి ముఖ్యార్థమున జుగుప్సాకరములు కావునఁ బ్రయోగింపరాదు. గౌణార్థమునఁ బ్రయోగింపనగు.

నిష్ఠ్యూతోద్గీర్ణ వాంతాది గౌణవృత్తివ్యపాశ్రయమ్
అతిసుందర మన్యత్ర గ్రామ్యకక్ష్యాం విగాహతే.

కం. గడగడ లాడఁగ శైలము, వడఁబడి గుహలందుఁ బొదలు♦వనసత్త్వంబుల్
దొడిఁబడి యడలెడు రవముల, బుడిబుడి నిగిడించె దెసలుఁ♦బుడమియు నిండన్.

అర్థము. వనసత్త్వంబుల్ = అడవిమృగములు, వడఁబడి = బాధపడి, తొడిఁబడి = తొట్రుపాటుచెంది, అడలెడు రవములన్ = ఏడ్పుధ్వనులను, బుడిబుడిన్ = తత్తఱపాటుతో, నిగిడించెను = వ్యాపింపఁజేసెను.

తాత్పర్యము.

ఆ కొండ గడగడ వడఁకఁగా బాధపడి గుహలందున్న యడవి మృగములు తొట్రుపడి యేడ్పుధ్వనులచే భూమి యాకాశము వ్యాపింపఁజేసెను.

చం. ప్రకటమహేంద్రసానునగ♦భాగచరిష్ణుభుజంగకోటి స్వ
స్తికవరలక్షణోల్లసిత♦తీవ్రఫణంబుల విచ్చి యుగ్రపా
వకనిభమౌ విషంబు నట♦వారక హోక్కునఁ గ్రక్కె గుండులన్
వికటరదంబులం గొఱుకఁ♦ బెటెఁ బఱలున వేయుచున్నవై. ౧౯

అర్థము. ప్రకట=ప్రసిద్ధమైన, మహేంద్ర పర్వతము యొక్క, సాను నగ=చఱియల యందును, బర్వత ప్రదేశమందును, చరిష్ణు=సంచరించు, భుజంగకోటి=పాముల సమూహము, భుజగము యూ. భుజంగము, స్వస్తిక=పాము పడగపై నర్థ చంద్రాకారముగ నుండు మచ్చయనెడి, వరలక్షణ = గొప్ప గుర్తుచేత, ఉల్లసిత=ప్రకాశింపఁ జేయఁబడిన, తీవ్ర ఫణంబులన్=భయంకరములైన పడగలను, హోక్కన్=ఇది వాంతియందలి యనుకరణ ధ్వని, వికటరదంబులన్=వంకరలగు కోఱలచేన్ కొఱుకన్=కోపముచే గట్టిగఁ గఱవఁగా, పెల్లైన్=ఎగిరిపడెను.

తాత్పర్యము.

ఆపర్వతము చఱులయందును దక్కిన ప్రదేశములందు సంచరించు పాములు స్వస్తిక చిహ్నములచేఁ బ్రకాశించు పడగలు విచ్చి భయంకరమైన యగ్నితో సమానమైన విషమును హోక్కన సమీపమందున్న గుండులను గోపముచేఁ దమ దంతములచేఁ గొఱుకఁగా నవి విషము వేఁడిమికి వేయితునకలై యెగిరి పడెను.

కం. విషమవిషమేని నొక్కని, మిషమున నగమూలికలు శ♦మింపఁగ నై యా
విషముం బాపఁగ నోపవు, విషధరవిష మార ! యెంత విషమవిషంబో. ౧౯

అర్థము. విషమ విషమేని=మిక్కిలి క్రూరమైన విషమునైనను, నగమూలికలు=పర్వతము నందలి వేళ్లు. శమింపఁగనై=హరింప శక్తి కలిగియు, విషధర విషము=పాముల విషము, విషమ విషమంబో=క్రూర విషమో.

తాత్పర్యము.

ఆ పర్వత మందలి యోషధు లెంత క్రూరమైన పామువిషమునైనను నిమిషములో హరింపఁగలవు. అట్టు లయ్యునా పాముల విషము నణఁప లేని వయ్యెను. ఆ పాములవిష మెంత క్రూరమో,

ఉ. బ్రద్దలువాఱు నోటు కుధ♦రం బను నివ్వెఱఁ గాందిశీకులై
గ్రద్దనఁ బానపాత్రకర♦క ప్రకరంబులు భక్ష్యలేహ్యముల్
పద్దఱఁ బైఁడిపిళ్ళ మొల♦బాకులు నార్షభచర్మఖేటముల్
రద్దు చెలంగ సర్వముఁ గ♦లంక యథాస్థితి వీడి కోనలన్. ౨౦

అర్థము. ఓటు = సందేహార్థము, కుధరము = పర్వతము, నివ్వెఱన్ = నిండు వెఱన్ = నిండు భయముచే, కాందిశీకులై = పరువెత్తుచున్నవారై, పానపాత్ర=మద్యముత్రాగెడి పాత్రము, కరక=గిండివంటి పాత్రలయు, ప్రకరంబులు=సమూహములు, లేహ్యముల్=నాలుకతో నాకి తినునవి, పద్దు+అఱన్=పంతము చెడునట్లు, ఆర్షభచర్మఖేటముల్=ఎద్దుతోళ్ళతోఁ జేయఁబడిన డాలులు, రద్దు=అల్లరి. కలంకన్=కలవరపాటుచే, యథాస్థితి=ఉన్నవున్నట్లు.

తా త్ప ర్య ము .

కొండ బ్రద్దలుగాఁ బగులునో యేమో యను భయముచే వారువారు, మద్యముఁద్రాగు పాత్రములను, గిండీలను, భక్ష్యములను, లేహ్యములను బంగారు పిడులుగల మొలయందుఁ జెక్కుకొను బాకులు, ఎద్దుచర్మముతోఁ జేయఁబడిన డాలులు, కలవరపాటుచే వీని నన్నిఁటి నున్నవున్నట్లు కోనలందు వదలి సందడిగాఁ బరువెత్తువారై. పై పద్యముతో నన్వయము.

కం॥ హారంబులు కంకణ కే, యూరంబులు ఘుల్లులారవోద్భటపటుమం
జీరంబులు నవసుమనో, హారంబులు ధగితపారిహార్యము లమరన్. ౨౧

అర్థము. కేయూరంబులు = బాహుపురులు, ఘుల్లులారవ = ఘల్లు ఘల్లు మను ధ్వనిచే, ఉద్భట = అతిశయించిన, పటు = దృఢములైన, మంజీరంబులు = అందెలు, నవ=క్రొత్తవగు, సుమనోహారంబులు = పూలసరములు. ధగిత = ధగధగ మను, పారిహార్యములు=కడియములు, అమరన్=ఒప్పఁగా.

తా త్ప ర్య ము .

హారములు, కంకణములు, భుజకీర్తులు, ఘల్లుఘల్లుమను కాలియందెలు, క్రొత్త పూలదండలు, ధగధగమని ప్రకాశించు కడియము లొప్పుచుండఁగా, దేహముమీఁద నుండునవి తప్పఁ దక్కిన వన్నియు విడిచి పోయి రని భావము.

తే. అంగనలు కూడరాఁగ విద్యాధరులును, రక్తమాల్యానులేపనరక్తనయన
పుష్కరాక్షులుహారముల్ పొదల మొడల, నభ్రమునకుద్గమింత్రుమత్తాత్ములగుచు.

అర్థము. రక్తమాల్యానులేపన=ఎఱ్ఱని పూలదండలు, మైపూఁతలు; రక్త నయన = త్రాగుటచే నెఱ్ఱనయిన కన్నులుగల, పుష్కరాక్షులు = స్త్రీలు, అభ్ర మునకున్ = ఆకాశమునకు, ఉద్గమింత్రు = ఎగసి పోయిరి. మత్తాత్ములు = మత్తుచే దేహములు దెలియనివారు.

తా త్ప ర్య ము .

వారివారి స్త్రీలు కూడ రాఁగా, విద్యాధరులును, ఎఱ్ఱనిపూలదండలు, ఎఱ్ఱని మైపూఁతలు, ఎఱ్ఱని కన్నులుగల స్త్రీలు మెడలందు హారములు కదలు చుండ మత్తుచే దేహము లెఱుఁగక యాకాశమున కెగిరిరి.

కం॥ సస్మితలై రమణులతో, విస్మితలై వానరేంద్రు వికటపుఁగృతికిన్
విస్మృతలై సురశాత్రవ, ఘస్మరునిం గనిరి వాలుఁగంటులు మింటన్. ౨౩

అర్థము. సస్మితలై=చిఱునవ్వుతోఁ గూడినవారై, రమణులతో=ప్రియులతో, విస్మితలై = ఆశ్చర్యపడినవారై, వికటపుఁగృతికై = భయంకరమైన కార్యమునకు, విస్మృతలై = దేహములు మఱచినవారై, సురశాత్రవ= దేవతలకు విరోధులగు, రాక్షసుల-ఘస్మరునిన్=భక్షించువాని నఁగాఁజంపువానిని, వాలుగంటులు = స్త్రీలు.

తాత్పర్యము.

ఆ స్త్రీ లాకాశమందుఁ దమ ప్రియులతోఁ నిలిచి నవ్వుచు, హనుమంతుని భయంకర కార్యమున కాశ్చర్యపడుచు, దేహములు మఱచినవారై రాక్షస హంత యగు హనుమంతుఁ జూచిరి.

కం. విద్యాధరపరమర్షులు, విద్యలవిభవంబు వెలయ♦బృందంబులుగా
నై ద్యోవీథిని నిలఁబడి, చోద్యంబుగఁ గనిరి నగము♦చొప్పావేళన్. ౨౮

అర్థము. బృందంబులుగా = గుంపులుగా, ధ్యోవీథిని = ఆకాశమార్గమందు, 'ద్యోవాహిని'యని ఎలకూచి బాలసరస్వతి దశావతార స్తోత్రములందుఁ బ్రయోగించి యున్నాఁడు. 'దూ్యత్తంభద్గిరికల్పితావతరణద్యోవాహినీసంగమో' యని కూర్మావతార వర్ణనము. విద్యాధర పరమర్షులు = గొప్పఋషుల వలె శ్రేష్ఠులగు విద్యాధరులు. ఇచ్చటఁ బరమర్షి శబ్దము శ్రేష్ఠార్థకము. ఉపమిత సమాసము. విద్యాధరులు, పరమర్షులు, అని ద్వంద్వము చెప్పరాదు. విద్యాధరు లాకర్ణించిరని మీఁది పద్యంబునఁ గలదు.

తాత్పర్యము.

గొప్పఋషులవలె శ్రేష్ఠులగు విద్యాధరులు తమ తమ యణిమాది విద్యల బలముచే గుంపులు గుంపులుగా నాకాశమున నిలువఁబడి యప్పుడు పర్వతముండు విధమును జూచిరి.

శా. ఆకర్ణించిరి సిద్ధచారణసమూ♦హంబుల్ వచింపంగ శై
లాకారుం డదె యంజనాసుతుఁడు రా♦మార్థంబుఁ గీశార్థమ
స్తోకాశూద్ధతి దుష్కరంపుఁగృతికై♦దుష్ప్రాప మా వార్ధి దా
నా కూలంబును జేర నెంచెఁ గనుఁగొం♦డా యంచు విద్యాధరుల్. ౨౯

అర్థము. ఆకర్ణించిరి = వినిరి, దీనికిఁ గర్తృపదము విద్యాధరులు, శైలాకారుఁడు = పర్వతమంత దేహము గలవాఁడు, కీశార్థంబు = వానరుల కొఱకు, హనుమంతుఁడు సీతకై సముద్రము దాఁటి పోవుట కేవల రాముని నిమిత్తమే కాదు. వానరుల ప్రాణరక్షణము చేయవలసి యున్నది. కావున నిపు డిది వారి కార్యమే యయ్యెను, అస్తోక = గొప్పది యగు, ఆశూద్ధతి = వేగాతిశయముచే, దుష్కరంపుఁ గృతి = చేయ మిగులఁ గష్టమైన కార్యము, దుష్ప్రాపము = సులభముగాఁ బొంద రానిది, నాలుగవ పాదంబునఁ బ్లుతయతి. ఇట్లు సిద్ధచారణ సమూహములు చెప్పఁగా విద్యాధరు లాకర్ణించిరని యన్వయము.

తాత్పర్యము.

ఆంజనేయుఁడు పర్వతాకారము గలవాఁడై రామునియొక్కయు, వానరుల యొక్కయుఁ గార్యార్థము మిగులఁ గష్టసాధ్యమైన సముద్రమును దాఁటి యావలి యొడ్డునకు మహావేగముతోఁ బోవుట యను నసాధ్యకార్యము చేయుచున్నాఁడు, చూడుఁడీ యని సిద్ధులు చారణులు చెప్పుచుండ విద్యాధరులు వినిరి.

తే. ఆ మహాత్ములమాటల నాలకించి, పర్వతాగ్రమునం దున్న ప్లవగవరుని
నప్రమేయునిఁ గాంచి వి ద్యాధరాళి, యద్భుతైకరసాతివ శాత్మ మయ్యె. ౨౬

అర్థము. అప్రమేయుని = ప్రమాణము చెప్పరాని దేహముగల వానిని, అద్భుతైకరస=ఆశ్చర్యమే ప్రధానముగాఁగల రసమునకు, అతివశాత్మము = మిగుల వశపడిన మనస్సు గలది.

తాత్పర్యము.

ఆ మహాత్ములమాటలు విని పర్వతముపై నున్న కొలఁది చెప్పరాని శరీరము గల హనుమంతుని గని విద్యాధరులు మిగుల నాశ్చర్యపడిరి.

తే. కొండవలెనుండు నాకపి కుంజరుండు, మేను విదలించి రోమవి తానములను
విదుచి వర్షాగమాభ్రంబు విధముదోఁప, బిట్టుటిమె నిస్వనము దిశల్ దట్టుచుండ.

అర్థము. రోమవితానములను = వెంట్రుకల సమూహమును, వర్షాగమాభ్రంబు = వానకాలమందలి మబ్బు, నిస్వనము = ధ్వని.

తాత్పర్యము.

కొండవలె దేహము పెంచిన యా కపిశ్రేష్ఠుఁడు దేహము విదలించి వెంట్రుకలు రాల్చి వానకాలమందలి మేఘమువలె ధ్వనిని దిక్కులు నిండునట్లు గర్జించెను.

కం. రోమాంకురసంచిత మై, భీమం బై యానుపూర్వి వృత్తం బయి యు
ద్దామం బగు లాంగూలముఁ, బామును గరుటాలమంతు భంగి విదిర్చెన్. ౨౮

అర్థము. రోమాంకురసంచితమై = మొలకలవలె నిలువఁబడియున్న వెంట్రుకలచే నిండినదై, ఆనుపూర్వివృత్తంబయి = మొదటినుండి తుదదాఁక గుండ్రనై, ఉద్దామంబు = గొప్పది, లాంగూలము = తోఁక, గరుటాల మంతుభంగిన్ = గరుత్మంతునివలె, విదిర్చెన్ = విదలించెను.

తాత్పర్యము.

మొలకలవలె నిట్టపొడిచిన వెంట్రుకలచే నిండినదై భయంకరమై మొదటి నుండి తుదిదాఁక వట్రువదై గొప్పదియగు తోఁకను గరుత్మంతుఁడు పామును విదలించినట్లు విదలించెను.

క. భీమజవు భుగ్నవాలము, దామోదరహయగృహీత దర్వీకర మో
నా మహనీయుని వీఁపునఁ, దా మెఱయుచు నుండె నద్భుతం బగురీతిన్. ౨౯

అర్థము. భీమజవు = భయంకరమైన వేగముగల హనుమంతుని యొక్క, భుగ్నవాలము = వంగినతోఁక, దామోదర హయ = విష్ణువాహనమైన గరుత్మంతునిచే, గృహీత=పట్టుకొనఁబడిన, దర్వీకరమో=పామో, ఉత్ప్రేక్షాలంకారము.

తాత్పర్యము.

భయంకర వేగము గల హనుమంతుని వంగిన తోఁక గరుత్మంతుఁడు పట్టుకొన్న పామువలె నాయన వీఁపుపై నాశ్చర్యముగ మెఱయుచుండెను.

—♦ హనుమంతుఁ డాకాశంబున కెగిరి కపులచే సెలవు దీసికొనుట. ♦—

సీ. పరిఘనిభంబులౌ ♦ బాహువుల్ స్తంభించి, భుజములు మెడయును ♦ బోరి ముడించి
మోఁకాళ్లు లర్ధంబు ♦ ముంగలగా వంచి, పాదముల్ జోడించి ♦ వడిఁ గుదించి
వీనుల స్రుక్కించి ♦ పెదవుల బిగియించి, కటిభాగమును లోను ♦ గాఁగఁ గుంచి
కనుఱెప్ప లెగయించి ♦ కడుదవ్వుదిలకించి, యుర్వీధ్రమునఁగాళ్లు ♦ లూఁదియుంచి
తే. యూర్పు బిగియించి తమిమీఱ ♦ నురవడించి,
బయలఁ జూపు రహిఁయించి ని ♦ ర్భయత మించి
కార్యముఁ దలంచి తన పరా ♦ క్రమము నెంచి
పెంపు వహియించి యట్టె కుప్పించి యెగసె. ౩౦

అర్థము. పరిఘనిభంబులు = ఇనుపకట్ల గుదియలతో సమానములు, పోరి = మిక్కిలి, ముడించి = ముడుఁచుకొనునట్లు చేసి, కుదించి = కుదియఁజేసి, స్రుక్కించి = ముడుఁచుకొని, తిలకించి = చూచి, ఉరవడించి = వేగిరపడి, స్వభావోక్త్యలంకారము.

తా త్ప ర్య ము .

హనుమంతుఁడు సముద్రముదాఁట నుద్యుక్తుఁడై యినుపకట్ల గుదియలవంటి రెండుబాహువులు కదలకపట్టి భుజములు మెడ ముడిఁచికొని సగము మోఁకాళ్ళు ముందరివైపు వంచి రెండుపాదము లొక్కచోనుంచి కుదియఁజేసి చెవులు స్రుక్కఁజేసి పెదవులు బిగించి నడుము లోపలికిఁదీసి కంటి ఱెప్పలు పైకెత్తి దూరమునందు దృష్టినిలిపి పర్వతమునందుఁ గాళ్ళు బిగఁదన్ని, శ్వాస బిగించి సముద్రముదాఁటు కోరికతో వేగిరపడి బయలఁ జూపు నిలిపి చేయవలసిన కార్యము దానికిఁదగిన తన పరాక్రమము యోజించి భయము లేదు కార్యము సాధింపఁగలనని ధైర్యము గలవాఁడై గొప్పతనము వహించి యట్టె చివ్వున గుప్పించి యెగయఁబూనెను.

కం. ఎగయుచు నచ్చట నుండెడు, నగచరనాయకులతోడ ♦ హర్షంబున నా
శుగతనయుం డిట్లనుఁ దన, మగతనపుంబలిమిఁ దెలుపు ♦ మాటలతోడన్. ౩౧

అర్థము. ఆశుగతనయుఁడు = వాయుపుత్రుఁడు, మాటలతోడన్ + అనున్ = తృతీయ కభేద మర్థము, ప్రకృత్యాచారుః అను సంస్కృత ప్రయోగము వంటిది. అనున్ = ఈ క్రియకు ముఖ్యకర్మము వక్ష్యమాణవృత్తాంతము.

తా త్ప ర్య ము .

ఇట్లెగయుటకై పూని యచ్చట నున్న వానర ముఖ్యులతో సంతోషముతోఁ దన పౌరుషబలము దెలియున ట్లిట్లనియె.

ఉ. చెచ్చెర వాయువేగ మగు ♦ శ్రీరఘురాముశరంబునట్లు నేఁ
జొచ్చెద లంక, నందు నృప ♦ సుందరి గన్పడకున్న నాకముం
జొచ్చెద నిట్లె, నందు సతిఁ ♦ జూడమి గల్గినఁ గట్టి రావణుం
దెచ్చెద, నెట్టులైన నృపు ♦ దేపిని దోడ్కొనివచ్చెదం జుఁడీ. ౩౨

అర్థము. శ్రీరఘురాము శరంబునట్లు=శ్రీరామచంద్రమూర్తి బాణమువలె, ఈ దృష్టాంతముచేఁ దనకు వేగాతిశయము గలదనియుఁ దన ప్రయత్నము వ్యర్థముకాదనియుఁ దన కష్టములేదనియు ఆవలియొడ్డు చేరువఱకు నడుమ నిలువ ననియు సూచితము. ౪౭ వ పద్యమునందు 'ప్రతిన సల్పితిఁ గ్రోవను నిల్వనంచు'నని చెప్పిన వాక్యమున కిదియే ప్రమాణము. ఇది వాల్మీకి శైలి విధానము.

తాత్పర్యము.

మిత్రులారా! వాయువేగము గల రామచంద్రమూర్తి బాణము వలె లంకఁ బ్రవేశించెదను. అచ్చట సీతాదేవి కనఁబడదాయెనా యిదే విధముగా స్వర్గమునకుఁ బోయెదను. అక్కడ సీతాదేవి కానరాకున్న రావణుఁ గట్టితెచ్చెదను. ఏవిధముగనైన సీతాదేవిని బిలుచుకొని వచ్చెదను.

కం. తెచ్చెద లంకను నిచటికిఁ, గ్రొచ్చెద రావణునిఁబట్టి ♦ క్రూరతమై నే
వచ్చెద సెలవిచ్చెదరే, హెచ్చెదఁ గృతకృత్యతను గ♦పీశ్వరులారా! 33

అర్థము. క్రొచ్చెదను = నేల గుంతఁదీసి పాతిఁపెట్టెదను. వచ్చెదను = పోయి వచ్చెదను. ఆంధ్ర లోకోక్తి.

తాత్పర్యము.

వానరశ్రేష్ఠులారా! నేనొకఁడనే సీతాదేవిని లంకయందు వెదుక జాగగునట్లుండిన లంకనే యిచ్చటికిఁ దెచ్చెదను. రావణుఁ డడ్డము వచ్చెనా వానిని దయలేక గోతిలో వేసి పాతి పెట్టెదను. పోయివచ్చెదను సెలవిచ్చెదరా. ఎటులైనను గార్యము సాధించెదను.

—♦హనుమద్గమన వేగ వర్ణనము♦—

చ. అనుచుఁ జువుక్కున న్నెగసి ♦ యాత్మను దన్వినతాత్మజాతుఁగా
ననుకొని పోవు వేగమున ♦ కాతనితోన ద్రుమంబు లెల్లఁ జి
య్యన సుమపక్షి యుక్తముగ ♦ నభ్రపథంబున కుద్గమించి తోఁ
జనె దవు పోవుచుట్టమును♦సాగఁగ నంపెడి బంధులో యనన్. 3౪

అర్థము. ఆత్మను=తన మనస్సునందు, వినతాత్మజాతుఁగాన్=గరుత్మంతునిఁగా, ద్రుమంబులు = చెట్లు, సుమ పక్షి యుక్తముగన్ = పూవులతో, పక్షులతో, అభ్రపథంబునకున్=ఆకాశ మార్గమునకు, తోఁజనెన్ = వెంటఁబోయెను. దవు=దూరము, రూ. దవ్వు.

తాత్పర్యము.

ఈ ప్రకారము చెప్పి చివాలున నెగసి తన్ను గరుత్మంతుఁనిగాఁ దలఁచుచు వేగముగఁ బోఁగా నా వేగమునకుఁ గొండమీఁది చెట్లు పూలతోఁ బక్షులతో నాకాశమున కెగిరి దూరము పోవు చుట్టమును సాగనంప వెంటఁబోవు బంధులవలె నతని వెంటఁ బోయెను.

క. దళవాయిని వెనుకొనియెడి, దళము లనన్ సాలవృక్ష♦తతు లవ్వేళన్
దళముగ వెన్నంటె మహా,బలసుతమహితోరువేగ♦భగ్నము లగుచున్. ౩౫

దళవాయి = సేనానాయకుఁడు, దళములు = సేనలు, దళముగన్ = దట్టముగ, మహాబలసుత = వాయుపుత్రుని, మహిత = గొప్పదగు, ఊరు వేగ = తొడలవేగముచే, భగ్నములు = విఱిగినవి.

తాత్పర్యము.

సేనానాయకుని వెంటఁబోవు సేనలవలె మద్దిచెట్లగుంపులు దట్టముగ నా సమయమందు నాంజనేయుని తొడల వేగముచే విఱిగి వెంబడి పోయెను.

క. దండిగఁ బూచిన కొమ్మల, కాండంబులతోడ నొప్పు♦ క్ష్మారుహవితతుల్
దండ నరుదేరఁ గపివే, తండము గిరివోలె నద్భు♦తంబుగఁ దోఁచెన్. ౩౬

అర్థము. కాండంబులతోడన్ = సమూహములతో, క్ష్మారుహ వితతుల్ = చెట్ల సమూహములు, దండ = సమీపమున, కపివేతండము = కపిశ్రేష్ఠుఁడు, వేతండము. రూ-వేదండము - భామినీ విలాసము. ౧-౬౨.

తాత్పర్యము.

విస్తారముగఁ బూచిన కొమ్మలగుంపులు గల చెట్ల సమూహములు తన సమీపమున రాఁగా హనుమంతుఁడు కొండవలె నాశ్చర్యకరముగఁ గానవచ్చెను.

క. దంభోళిధరునిపటుసం,రంభంబున జలధి మునుఁగు♦గ్రావము లటు లా
యంభోధిఁ బడి గుభాలున, నంభస్సుల సారవద్ద్రు♦మాళి మునింగెన్. ౩౭

అర్థము. దంభోళిధరుని = వజ్రాయుధము ధరించిన యింద్రుని, పటు సంరంభమునన్ = అధిక వేగముచే, గ్రావములు = పర్వతములు, అంభస్సులన్ = నీటియందు, సారవద్ద్రుమాళి = సారవంతములైన చెట్లగుంపులు.

తాత్పర్యము.

తమ ఱెక్కల ఖండింపఁ బూనిన యింద్రుని వేగమునకు వెఱచి సముద్రములో మునుఁగు కొండలవలె సారవంతములై భారము గల చెట్లు సముద్రములో గుభాలున బడి మునిఁగెను.

క. జలధరనిభుఁ డగు తత్కపి, కలికాంకురయుక్తకుసుమ♦గణములతోడన్
విలసించె మిణుంగురుపు,వ్వులతో నిశ రాణ మీఱు ♦ భూధర మనఁగన్. ౩౮

అర్థము. జలధర నిభుఁడు = మేఘముతో సమానుఁడు, కలిక+అంకుర+యుక్త = మొగ్గలతోను, మొలకలతోను గూడిన, కుసుమ గణముల తోడన్ = పూల గుంపులతో.

తాత్పర్యము.

మేఘమువంటి యా హనుమంతుఁడు మొగ్గలతో మొలకలతోఁ గూడిన పూలతో మిణుఁగురు పురువులతో రాత్రియందుఁ బ్రకాశించు కొండవలె నుండెను.

క. ఉరవడిఁ జన నే కెడలిన, ధరణీరుహకోటి ముక్త♦తతపుష్పంబై
తొరఁగె జలంబుల నుదకపు,టిరవువరకు సాగనంపు ♦ హితచయ మనఁగన్. ౩౯

అర్థము. ఎడలిన = వేగము తగ్గిన, ధరణీరుహకోటి = చెట్లసమూహములు, ముక్తతత పుష్పంబై = విడువఁబడిన విస్తారమగు పుష్పములుగలదై, ఉదకపుటిరవు వఱకున్ = నీళ్ళుండు స్థలముపఱకు, చెఱువు, కాలువ, ఏఱు మొదలైనవి. బంధువులను, హితులను సాగనంపువారు నీళ్ళడ్డము వచ్చువఱకే పోవలయును. ఆవలఁ బోరాదు. 'ఉదకాంతాత్ స్నిగ్ధో బంధు మనువ్రజే' త్తని శాస్త్రము.

తాత్పర్యము.

భారమగుట వేగముగఁ బోలేక వెనుకఁబడిన చెట్లగుంపులు రాలిపోయిన పూలు గలవై నీళ్ళడ్డము వచ్చువఱకు బంధువుల సాగనంపి కన్నీళ్లు గార్చుచు నిలిచిపోవు హితులవలె నీళ్ళలోఁబడెను.

ఉ. ఆ కపిగాలి నుత్థితము♦లై బడి నేగియుఁ దేలి కొటచే
త్తో కసుమంబు లెల్ల వడిఁ♦దోయధిఁ గూలెఁ బరస్సహస్ర మై
ప్రాకట తారకాశతవి♦రాజిత మైన నభంబుపోల్కి నీ
రాకర మప్పు డొప్పెఁ బ్రస♦వౌఘము లెల్లెడ నిండియుండుటన్. ౪౦

అర్థము. ఉత్థితములై = ఎగిరినవై, బడి = వెంబడి, స్తోకసుమంబులు = చిన్నపూలు, పరస్సహస్రము = వేయికి మించినవి, 'పరశ్శతాద్యాస్తే యేషాం పరా సంఖ్యా శతాధికాత్' అమరుఁడు. 'బ్రహ్మోదయో బ్రహ్మహితాయ తప్త్వా పరస్సహస్రం శరద స్తపాంసి' భవభూతి. ప్రాకట = స్పష్టముగాఁ బ్రకాశించు, తారకాశత = అనేక నక్షత్రములచే, విరాజితము = ప్రకాశించునది. నభంబు = ఆకాశము, నీరాకరము = సముద్రము, ప్రసవ + ఓఘము = పూలగుంపు.

తాత్పర్యము.

బరువుగా నుండు చెట్లు ముందుగాఁ బడిపోఁగాఁ దేలికయైనవి పూవులు గాలికెగసి హనుమంతుని వెంబడి మఱి కొంతదూరము పోయి యందు వేల కొలఁది పూవులు సముద్రములో రాలఁగా నప్పుడా సముద్రము పూలచే నిండినదై నక్షత్రములచేఁ బ్రకాశించు నాకాశమువలె నుండెను.

క. నానావర్ణవిరాజిత, సూనావృతుఁ డైన వాయు♦సూనుఁడు పొలిచెన్
మానుగ మెఱుపులతోడ న,నూనం బగు తోయదమున ♦ కుద్దిగ నఁగన్. ౪౧

అర్థము. నానావర్ణ = పెక్కువన్నెలచే, విరాజిత = ప్రకాశించు, సూన = పుష్పములచే, ఆవృతుఁడు = కప్పఁబడినవాఁడు, అనూనము = కొఱఁతలేని, తోయదము = మేఘము.

తాత్పర్యము.

పెక్కురంగుల పూలతోఁ గప్పఁబడిన హనుమంతుఁడు మెఱుపులతో నిండిన మేఘమువలె నుండెను.

క. మారుతసుతు వేగంబున, వే రాలెడు వివిధపుష్ప♦బృందముతోడన్
నీరధి యుదయత్తారా, వారమనోహరనభంబు♦వడువున నొప్పెన్. ౪౨

అర్థము. ఉదయత్=ఉదయించుచున్న, తారావార = నక్షత్రసమూహముచే, మనోహర=ఇంపైన, నభంబు=ఆకాశము.

తాత్పర్యము.

ఆంజనేయుని వేగముచే వెంటవెంట రాలుచున్న నానావిధములైన పుష్ప సమూహములతో సముద్ర ముదయించుచున్న నక్షత్రముల గుంపుతోఁ బ్రకాశించు నాకాశమువలె నుండెను.

తే. ఉడుపథంబునఁ బోవు వా♦యుజుని చాఁపఁబడిన కేల్దోయిగన్పట్టె♦భయదమగుచుఁ
బర్వతమునుండి తల నిక్క♦పఱిచి పఱచు, నైదుతలలమహోఫణు♦లట్టు లగుచు. ౪౩

అర్థము. ఉడుపథము=నక్షత్రమార్గము, ఆకాశము. ఇది హనుమంతుని హస్త వర్ణనము.

తాత్పర్యము.

ఆకాశమునందుఁ బోవుచుండు హనుమంతునిచేఁ జాఁపబడిన రెండు చేతులు పర్వతమునుండి తల నిక్కఁబెట్టి పరువెత్తు నైదుతలల పాములవలె నుండెను. అయిదు వ్రేళ్లు ఐదు తలలవలె నుండెనని పోలిక.

క. అప్పునఁ దరించి చనుచో, నప్పవనచరుఁ డూర్మిసహిత♦మంబునిధిం దా
నప్వియదధ్వముఁ ద్రావెడు, నప్పడువునఁ దోఁచు చుండె♦నత్యుగ్రగతులన్. ౪౪

అర్థము. ఊర్మిసహితము=అలలతోఁ గూడినది. వియత్+అధ్వము = ఆకాశ మార్గము.

తాత్పర్యము.

అలలతోఁగూడిన సముద్రమును అప్పునదాఁటి యాకాశమునఁ బోవు హను మంతుఁడు ఆకాశమును, సముద్రమును ద్రావుచుఁ బోవుచున్నాఁడా యేమి యన్నట్లు లుండెను. ఆయన వేగమునకు నవి రెండును గడచి పోవుచుండెను.

ఉ. మండుచునుండు కొండపెను♦మంటలు నా, యుగపత్సముద్భవో
ద్దండదివానిశాకర వి♦ధంబున, మించులఁబోలి గుంద్రమై
వెండియుఁ బింగళంబు లయి♦వెల్గెడి నేత్రము లొప్పె వాయుపు
త్రుండు సురాధ్వగామి యయి♦తోరపువీఁకను బోవుచుండఁగన్. ౪౫

అర్థము. యుగపత్=ఏకకాలమున, సముద్భవ=పుట్టిన, ఉద్దండ=(ప్రకాశముచే) అతిశయించిన, దివానిశాకరవిధంబునన్, దివాకర నిశాకరవిధంబున=సూర్యచంద్రుల వలె, మించులన్=మెఱుపులను, పింగళములు = ఎఱుపు పసుపు గలిసినవి, సురాధ్వ గామి = ఆకాశమునఁ బోవువాఁడు. తోరపు వీఁకను=అధికపరాక్రమముచే, పింగళత యందు మాత్రమే పెనుమంటలు, మించులు ఉపమానములు. దివాకర నిశాకరులు

వర్తులత పింగళతయం దుపమానములు, ఇది యభూతోపమ. ఉదయించు వేళ సూర్య చంద్రులు ఎఱ్ఱగానే యుందురు. ఇది హనుమంతుని నేత్రవర్ణనము.

తాత్పర్యము

హనుమంతుఁడు మిగుల వేగమున నాకాశమున బోవునపు డాయన కన్నులు మండుచున్న కొండల యందలి పెద్దమంటలో యేకకాలమం దుదయించిన సూర్య చంద్రులో యన్నట్లు గుండ్రమై పింగళ వర్ణములై యుండెను.

తే. ఎఱ్ఱడాలున మెఱయు క♦పీంద్రువదన, బింబ మెఱ్ఱని నాసికఁ ♦ బెనుపు మీఱె
సంజకెంజాయ సోఁకున ♦ సవురు మిగులు, నరుణదీధితిమండల ♦ మనఁగ నపుడు.

అర్థము. అరుణ దీధితి=సూర్యుని, ఇది హనుమంతుని నాసిక వర్ణనము.

తాత్పర్యము.

ఎఱ్ఱని కాంతిగల హనుమంతుని ముఖమందు నెఱ్ఱని ముక్కు సంజ కెంజాయలు వ్యాపింపఁగా నందుఁ గానవచ్చు నెఱ్ఱని సూర్యబింబము వలె నుండెను.

క. పవమానతనూభవుఁ డిటు, ప్లవమానుం డగుచు నార్వ♦లాంగూలంబున్
దివి నదివెలిఁగె సముచ్ఛ్రిత, దివిజాధిపతిధ్వజంబు♦తీరుగ గురుతన్. ౬౨

అర్థము. ప్లవమానుండు = దాఁటుచున్నవాఁడు, ఆర్వన్=ఆడింపఁగా, లాంగూలంబున్=తోఁకను, గురుతన్=గొప్పతనమందు, సముచ్ఛ్రిత=ఎత్తఁబడిన, దివిజాధిపతి=ఇంద్రుని, ధ్వజంబు=జెండా, ఇది హనుమంతుని తోఁక వర్ణనము.

తాత్పర్యము.

ఈ ప్రకార మాంజనేయుఁడు సముద్రము దాఁటిపోవుచుఁ దోఁక నాడింపఁగా గొప్ప తనమునందు నాకాశమందది యెత్తఁబడిన యింద్రధ్వజమువలెఁ బ్రకాశించెను.

క. వెలిఁగెడి వెలికోఱలతో, వలయాకారంబు గొనిన♦వాలముతో ని
స్తులమతియగు హనుమంతుఁడు, జలజాప్తుఁడు పరిధి నున్న♦చందముఁ దాల్చెన్.

అర్థము. వలయాకారంబు = గుండ్రము, జలజాప్తుఁడు = సూర్యుఁడు, పరిధిన్=పరివేషమునందు.

తాత్పర్యము.

వెలుపలఁ బ్రకాశించుచు కోఱలతోను గుండ్రముగాఁ దన్నుఁ జుట్టుకొన్నతోఁక తోను హనుమంతుఁడు పరివేషము నడుమ నున్న సూర్యునివలె నుండెను.

క. నెఱయెఱుపుడాలు పిఱుఁదుల, మఱికంబున నొప్పెఁ గీశ♦ముఖ్యుఁడు దాఁ జే
గుఱుధాతువులను శైలము, తెఱపలు తెఱపలుగ నైన ♦ తెఱఁగులు దోఁపన్.

అర్థము. నెఱ = పూర్ణమైన, డాలు = కాంతి, మఱికంబునన్ = నిక్కుచేత, జేగుఱు=ఎఱ్ఱని.

తాత్పర్యము.

పూర్ణమైన యెఱ్ఱని కాంతిగల పిఱుఁదుల నిక్కుచే హనుమంతుఁడు ఎఱ్ఱని

ధాతువులచేఁ బర్వతము, తెట్టెలు తెట్టెలుగా నున్న విధముఁ దోఁపఁ జేయుచుండెను.

క. ఒడిసెలఱాVవలె దివిఁ జని, యెడికరువలిముద్దుఁగొడుకు♦నిరుమడిసందిన్
వెడలెడిగాడుపు మేఘము, బెడిదపుటుఱుము మనఁగ మొరసె♦భీషణభంగిన్. ౫౦

అర్థము. ఒడిసెల=ఱాలు విసరివేయుటకై యల్లఁబడిన త్రాడు, రూ. వడిసెల కరువలి=గాలి, ఇరుమడిసంధిన్ = రెండు చంకలనుండి.

తాత్పర్యము.

ఒడిసెలతో వేసిన ఱివ్వునఁబోవు రాయివలె, బోవుచున్న హనుమంతుని రెండు చంకల నుండి వెడలు గాలి మేఘములు యుఱుములవలె భయంకరముగ ధ్వనించెను.

తే. ఉత్తరమునుండి దక్షిణం♦బొత్తికొనుచు, స్రుక్కకరిగెడి పెనుఁదోఁక♦చుక్కవోలెఁ
దాను బెనుఁదోఁకతోడనె♦మ్మేను వెలుఁగ, లంకవైపుగఁ బఱచె ని♦శ్శంకమతిని. ౫౧

అర్థములు. ఒత్తికొనుచున్=ఆక్రమించుకొనుచు.

తాత్పర్యము.

ఉత్తరమునుండి దక్షిణమునకై పోవు తోఁకచుక్కవలె, నాంజనేయుఁడు పెద్దతోఁకతో దేహము ప్రకాశించుచుండ లంకవైపుగ జంకులేక పోయెను. తోఁకచుక్క యుపమానము లంక కనిష్టసూచకము.

తే. నింగితెరువునఁ జనెడి ప♦తంగునట్లు, పొంగిపఱచుచు నున్న ప్ల♦వంగుఁ డొప్పె
నడుమునను ద్రాటఁ గట్టంగఁ♦బడుట దీర్ఘ, భూతమైన మదోత్కట♦రీతి దనర.

అర్థము. నింగి=ఆకాశము, పతంగునట్లు = సూర్యునివలె, దీర్ఘభూతము = నిడివిగా సాఁగినది, మదోత్కటము=ఏనుఁగు.

తాత్పర్యము.

ఆకాశమార్గమునఁ బోవుచున్న సూర్యునివలె వేగముగఁ బరువు పాఱుచున్న వానరుఁడు నడుమునకుఁ ద్రాడుగట్టఁగా నిడివిగా సాఁగు నేనుఁగువలె దీర్ఘకాయుఁడై తోఁచెను.

క. అంబువులం బ్రతిబింబం, బంబరమున రూపు వెలయ♦హనుమంతుం డ
ర్ధంబు జలంబుల మునిఁగి జ, వంబున గాలికిని బోవు♦ప్లవ మనఁ దోఁచెన్. ౫౩

అర్థము. అంబువులన్=నీటియందు, అంబరమునన్=ఆకాశమందు, ప్లవము = పడవ.

తాత్పర్యము.

ఆకాశమున రూపము, దాని నీడ సముద్రము నీళ్లయందుండుటచే హనుమంతుఁడు సగము నీళ్లలో మునిఁగి సగము వెలికి గానవచ్చు పడవవలె నుండెను.

తే. గాడ్పుకొడుకఁడు చనినమా♦ర్గంబు సర్వ, మతని మహితోరువేగంబు♦కతనఁ జేసి
యల్లకల్లోల మగుచు వా♦రాకరమునఁ, బొలిచె సోన్మాదభంగిని♦గలఁగఁబడుచు.

అర్థము. గాడ్పు కొడుకఁడు = వాయుకుమారుఁడు, కొడుకు శబ్దము బిడ్డాదులలోఁ జేరినది. బిడ్డాదులకు డుజ్జును విభాషనగు, సు. వ్యా. ఆచ్ఛిక. ౫ సూ. కతనఁ జేసి = కారణముచేత.

తాత్పర్యము.

వాయుపుత్రుఁడు పోయిన మార్గమంతయును సముద్రమున నాయన తొడల వేగముచేఁ గ్రింద మీఁద మీఁద క్రిందుగఁ దాఁటుమాత్రె పిచ్చి పట్టిన వానివలె నుండెను. పిచ్చిపట్టిన వాఁడు తల దిరిగి పడుచు లేచుచు నోట నురుగు గ్రక్కుచుఁ బెద్దగా శబ్దించుచుండునట్లు సముద్రము భ్రమణ ఫేన ఘోషణములఁ గలదై యుండె నని భావము.

క. మిన్నప్పళింప నెగిరెడి, మున్నీటికరళ్ళఁ బ్లవగ♦ముఖ్యుఁడు తనమే
న న్నిగిడెడి కరువలిచేఁ, దన్నుచు వడిఁ బోవుచుండె♦దారుణభంగిన్. ౫౫

అర్థము. అప్పళింపన్ = తాఁకుటను, కరళ్ళన్ = అలలను, కరువలిచే = గాలిచే.

తాత్పర్యము.

ఆకాశ మంట నెగురు సముద్రముయొక్క యలలను హనుమంతుఁడు తన దేహమునుండి కలిగిన గాలిచేఁ దన్నుచుఁ బోవుచుండెను.

ఉ. వానరవర్య వేగభవ♦వాయువునున్ జలదాశుగంబుసం
తానము నొక్కటై జలధిఁ♦దద్దయుఁ దాఁ గలగుండు వెట్టెఁ బెం
పాన నభంగభంగనిచ♦యంబుల లాగెడి నాఁగ, నంజనా
సూనుఁడు మింటి మంటిగరు♦సున్ విభజించెడి నాఁగ దాఁటుచోన్. ౫౬

అర్థము. వేగభవ = వేగముచేఁ గలిగిన, జలదాశుగంబు = మేఘములవలనఁ గలిగిన వాయువు. కలగుండు వెట్టెన్ = కలవర పఱిచెన్, పెంపానన్ = పెంపుగలుగ, అభంగ = భంగములేని; భంగ నిచయంబులన్ = అలల సమూహములను, గరుసున్ = ఎల్లను, పొలిమేరను.

తాత్పర్యము.

వానర శ్రేష్ఠుఁడగు హనుమంతుఁడు పోవుటచేఁ గలిగిన వాయువు మేఘములు పోవుటచేఁ గలుగు వాయువు రెండు నేకముగఁ గలిసి సముద్రమును గలవరపఱిచెను. హనుమంతుఁడు సముద్రము దాఁటునపుడు గొప్పతనము గలుగునట్లు నిండు తరఁగల గుంపులను లాఁగుచున్నాఁడో, యాకాశమునకు భూమికి నెల్ల యేర్పాటు చేయుచున్నాఁడో యన్నట్లుండెను.

క. ఉన్నతి మేరువు మందర,ము న్నగు మున్నీటియలల♦మానుకొని వడిఁ దా
నెన్నుచుఁ బోయెడినో యనఁ, గ్రన్నన తరియింపసాగెఁ♦గడిమి దలిర్పన్. ౫౭

అర్థము. మున్నీటి = సముద్రముయొక్క, మును+నీరు = మున్నీరు, తొలుత సృజింపఁబడిన నీరు, అప ఏవ ససర్జాదౌ (౨) ఆకాశము నుండి పడు వాననీళ్ళు,

వెళ్ళ నీళ్ళు, ఊటనీళ్ళు గలసినది యని యైనఁ జెప్పవచ్చును. మూఁడు+నీరు = మున్నీరు, ఎన్నుచున్ = లెక్కపెట్టుచు, క్రన్నన = శీఘ్రముగ, కడిమి = పరాక్రమము, తలిర్పన్=అతిశయింపఁగా.

తా త్ప ర్య ము.

ఎత్తునందు మేరు మందర పర్వతములతో సమానము లయిన సముద్రపుటలల లెక్కపెట్టుచుఁ బోవుచున్నాఁడేమో యనునట్టు లలల మీఁదుగ హనుమంతుఁడు వేగమునఁ బోయెను.

క. పవనజజవనజపవనము, దివికిని మున్నీటినీటి ♦ దెలిబిందులుగా
సవురుగ నెగఁజిమ్మిన నవి, సవనధరము లగుచుఁ దోఁచె♦శరదభ్రములై. ౫౮

అర్థము. పవనజ – వాయుపుత్రునియొక్క, జవనజ= వేగమువలనఁబుట్టిన, పవనము=గాలి, తెలిబిందులుగాన్ = తెల్లని తుంపురులుగా, సవనధరములు = మేఘములతో గూడినవి, శరదభ్రములై = శరత్కాలమేఘములై.

తా త్ప ర్య ము.

హనుమంతుని వేగమువలనఁ గలిగిన వాయువు సముద్రము నీటిని దెల్లని తుంపరలుగా నాకాశమునకు నెగఁజిమ్మఁగా నవి శరత్కాల మేఘములవలె మేఘములతోఁ గూడినవై కానవచ్చెను.

క. చేలము దొలంప దేహికి, వాలాయము దోఁచు నవయ♦వంబులభంగిన్
నీళులు చనఁ దిమికచ్ఛప, పాళియు ఝషనక్రవితతి♦స్పష్టం బయ్యెన్. ౫౯

అర్థము. ఝష=చేఁపలయు, నక్ర=మొసళ్లయు, వితతి=సమూహము.

తా త్ప ర్య ము.

మనుష్యునకు వస్త్రము దీసివేయఁగా నవయవములు గానవచ్చునట్లు సముద్రమునందలి నీళ్ళాకాశమున కెగిరిపోఁగాఁ దిములు, తాఁబేళ్ళు, చేపఁలు, మొసళ్ళు గానవచ్చెను. తాఁబేళ్ళు మీఁగాళ్ళు, చేఁపలు కన్నులు, మొసళ్ళు పిక్కలు.

క. నింగిని జనియెడి వానర,పుంగవుఁ గని కడలిలోని♦భుజగంబులు భీ
తిం గదురఁగ గరుడుం డను,చుం గళవళ మంది కుంది♦సొమ్మలు బోయెన్. ౬౦

అర్థము. సొమ్మలు=మూర్ఛలు.

తా త్ప ర్య ము.

ఆకాశమునఁబోవు హనుమంతునిఁ జూచి సముద్రములోని పాములు గరుత్మంతుఁడు పోవుచున్నాఁడని భయపడి కలవర పాటుచెంది మూర్ఛపోయెను. (ఈ యభిప్రాయము ననుసరించి కాఁబోలు నాముక్త మాల్యదయందుఁ గృష్ణదేవరాయలు 'ఖనటత్పయోబ్ధి వీక్ష్యరసాతలాన్యోన్య పిండీకృతాంగ భీతాండజము'లని వ్రాసెను.

క. పదియామడ వెడలుపు ము,ప్పదియామడ నిడివి యగుచుఁ♦బరఁగి రుచిరమై
యుదధిని బావని నీడ వి,శదఘనఘనపంక్తి యనఁగఁ♦జనుచుండె బడిన్. ౬౧

అర్థము. ఉదధిని = సముద్రమందు, పావని = ఆంజనేయుని, విశద = నిర్మలమై, ఘన = దట్టమైన, ఘనపంక్తి = మేఘము చాలు, బడిన్ = వెంబడి.

తా త్ప ర్య ము .

ఆంజనేయుఁడు సముద్రము దాఁటునపుడు ఆయన నీడ సముద్రమునందుఁ బదియామడ వెడలుపు, ముప్పది యామడ పొడుగై నిర్మలమై, దట్టమై మేఘము చాలువలె నాయన వెంబడి పోయెను.

ఇందుఁ జెప్పఁబడినది నీడ పరిమాణమే కాని ప్రతిఫలించిన దేహపరిమాణము గాదు. ముప్పది యామడ దేహము గలవాఁడు మూఁడంజలలో లంక చేరి యుండవచ్చును గదా యని సందేహింపరాదు. ఇది యుదయకాలము కావున నీడలు దీర్ఘములై యుండును. నీటికి సమీపమునఁ బోయి యుండిన నీడ యంత పెద్దదై యుండదు. గాన చాల నెత్తునఁ బోవుటచే నీడయుఁ జాల పెద్దదై యుండును.

క. అంబర భాగంబున నా,లంబవిహీనతను గపికు♦లప్రవరుఁడు పో
వం బక్షయుక్తభూమిధ,రం బన నొప్పారియుండె♦రభసోద్ధతిమై. ౬౨

అర్థము. ఆలంబ విహీనతను=నిరాధారముగ, పక్షయుక్త భూమిధరంబు = ఱెక్కలుగల పర్వతము, రెండు చేతులే ఱెక్కలు.

తా త్ప ర్య ము .

ఆకాశమునందు నిరాధారముగఁ బోవు హనుమంతుఁడు ఱెక్కలు గల పర్వతము వేగముగఁ బోవునట్లు గానవచ్చెను.

సీ. బలశాలి వడి నేగు♦వార్ధిమార్గం బెల్ల, ద్రోణీకృతం బయి♦తోఁచు చుండెఁ
బక్షుల నడుమను♦బక్షిరా జనఁ బోవు, కపి మొగుల్ దూలించె♦గాడ్పునట్లు
వలిముఖాకృష్టాభ్ర♦ములు సితాసితరక్త,మాంజిష్ఠవర్ణముల్♦మలసె మింట
మఱుఁగుచు మెఱయుచు♦మబ్బుల నడుమను, జంద్రుఁడోయనఁ గీశ♦చంద్రుఁడమరె
తే. వనధి జవమున లంఘించు♦ప్లవగుమీఁద
సురలు దనుజులు గంధర్వ♦వరులు విరులు
గురిసి రప్పుడు తాపంబుఁ♦గూర్పఁడయ్యె
హనుమ కనిలుండు వీచె రా♦మార్థముగను. ౬౩

అర్థము. ద్రోణీకృతము = దోనెవలెఁ జేయఁబడినది. వలిముఖ=వానరునిచే, ఆకృష్ట = ఆకర్షింపఁబడిన, అభ్రములు = మేఘములు, సిత+అసిత+రక్త+మాంజిష్ఠ వర్ణముల్ = తెలుపు, నలుపు, ఎఱుపు, ఎఱుపు తెలుపు కలిసిన వన్నెలు, మఱుఁగుచు= చాటుగఁబోవుచు, మెఱయుచు=ప్రకాశించుచు, దీనివలన మేఘములకంటె నెత్తుగఁ బోయె నని సూచితము. విరులు=పుష్పములు.

తా త్ప ర్య ము .

బలవంతుఁడైన హనుమంతుఁడు వేగముగ బోవు నామార్గమంతయుఁ దోనెవలె

నడుమ పల్లము ఈవలావల నెత్తుగాఁగలదై కానవచ్చుచుండెను. (కదలని నీటిమీఁద మనము గట్టిగ నూఁదితిమేని నీటియందు గుంత యేర్పడును. ఆ విధముగ) పక్షులనడుమ గరుత్మంతుని వలెఁ బోవు హనుమంతుఁడు పెద్ద వాయువువలె మేఘములను జెదరఁ దోలెను. వానరుచే నాకర్షింపఁబడిన మేఘములు తెలుపు, నలుపు, ఎఱుపు నానావర్ణములు గలవయ్యెను. మేఘముల నడుమఁ బోవునపుడు చంద్రునివలెఁ గొంతసేపు కానవచ్చి కొంతసేపు కానరాక యుండెను. ఆంజనేయుమీఁద, జనులు, గంధర్వులు, దేవతలు పూలు గురియించిరి. రాక్షసులకు దానవులకు విరోధము కలదు. వారలనుగూడ రావణుఁ డణఁగఁ ద్రొక్కెను. సూర్యుఁడు వేఁడిమి చూపఁడయ్యె. (మధ్యాహ్న సమయము) రామకార్యము సుఖముగ హనుమంతుఁడు చేయుటకై యాయనకు శ్రమము దోఁపకుండునట్లు వాయువు చల్లఁగా వీచెను. నిర్వంచనముగా భగవత్కైంకర్యము చేయువారికి దేవత లందఱు సాహాయ్యము చేయుదురని సూచితము.

చ. బళి బళి యంచు మెచ్చిరి సు♦పర్వులు, బాపురె యంచు స్తోత్రముల్
చలిపిరి కిన్నరుల్, మునులు ♦ చాఁగురె యంచుఁ బ్రశంస చేసి, రా
త్మల నయిఁనైఁ యటంచు విబు♦ధప్రకరంబు పొగడ్త గూర్చె య
క్షులు కడుమేలు మే లనిరి ♦ కొంకక యబ్ధిఁ దరించు కైసరిన్. ౬౮

అర్థము. సుపర్వులు = దేవతలు, నయిఁనైఁయటంచున్ = ఇం దనునాసికోచ్చారణము సూచింప నర్థానుస్వారము లుంపఁబడియె, కైసరిన్ = కేసరి కుమారుని కైసరిన్, ఈ ద్వితీయ మెచ్చిరి యను క్రియతో నన్వయించు నపుడు కారకవిభక్తి; తక్కిన క్రియతో నన్వయించునపుడు 'కూర్చి' యను దానిని జేర్చుకొని యుపపద విభక్తి యగును.

తా త్ప ర్య ము .

జంకు కొంకు లేక సముద్రమును దాఁటుచున్న కేసరిపుత్రునిఁజూచి దేవతలు బళిబళీ యని మెచ్చుకొనిరి. మునులు చాఁగురె యని శ్లాఘించిరి. నైఁనైఁయని దేవతా సమూహము స్తుతించెను. యక్షులు మేలు మేలని నుతించిరి.

—♦ సముద్రుఁడు హనుమంతునకుఁ దోడ్పడ యోజించుట. ♦—

క. అరిగెడు కపికేసరిఁ గే,సరిసుతుఁ గని వనధి యెట్లు ♦ సలుపనలయు నీ
తరుణంబున సాహ్యము నీ,హరి కని యిక్ష్వాకుగౌర♦వార్థి దలంచెన్. ౬౯

అర్థము. కపికేసరి = కపిసింహము, తరుణంబునన్ = సమయమందు, సాహ్యము = తోడుపాటు, ఇక్ష్వాకు గౌరవార్థి = ఇక్ష్వాకు వంశము వారి గౌరవము కోరువాఁడు, వనధి = సముద్రుఁడు.

తా త్ప ర్య ము .

ఈ ప్రకారము పోవుచున్న కపిశ్రేష్ఠునిఁ జూచి యిక్ష్వాకువంశము వారి గౌరవముఁ గోరు సముద్రుఁడు ఇక్ష్వాకువంశ సంభవుఁడైన శ్రీరామచంద్రమూర్తి

కార్యార్థమై యీయన పోవుచున్నాఁడే. రామకార్యము నేను జేయఁజాల కున్నను చేసెడి మహానుభావులకైన సాహాయ్యము చేయవలయునుగదా. ఈ సమయమున నే నీయన కేవిధముగఁ దాను దోడు పడఁగల నని యాలోచించెను.

ఉ. పోఁడిమిఁ గాంచితిన్ సగర♦భూమిధవర్షభుచేత నేను మున్
వీఁడును దత్కులోద్భవుఁడు ♦ విశ్రుతుఁడై రఘునాథుకార్యమై
వాఁడిచెలంగ నేగెడి న♦వారణలీల, శ్రమంబు వాయఁగా
నేఁ డిట మేలు చేయ నగు ♦ నిర్మలరాగపురస్సరంబుగన్. ౬౬

అర్థము. ఇక్ష్వాకు గౌరవార్థి యనుటకుఁ గారణము చెప్పుచున్నాఁడు.
పోఁడిమిన్ = అభివృద్ధిని, భూమిధవ + ఋషభుచే = భూమిధవర్షభుచే = రాజశ్రేష్ఠునిచే, తత్కులోద్భవుఁడు = ఆ వంశమునందుఁ బుట్టిన వాఁడు, విశ్రుతుఁడు = ప్రసిద్ధుఁడు. వాఁడి = పరాక్రమము, అవారణలీలన్ = అడ్డములేని క్రీడగా, రాగపురస్సరంబుగన్ = అనురాగపూర్వకముగా.

తా త్ప ర్య ము .

నేను బూర్వ మా సగర చక్రవర్తిచే బాగుపడినవాఁడను. వీఁడా! యా వంశమందే పుట్టి ప్రసిద్ధికెక్కిన రామచంద్రమూర్తి కార్యము చేయ నడ్డము లేక పరాక్రమించి పోవుచున్నాఁడు. కావున వీనికి గష్టము దోఁపకుండునట్లు గాసి దీరునట్లు ప్రేమపూర్వకముగఁ జేయుట మేలు.

క. అక్కమలాక్షుని దూతకుఁ, జక్కనిసాయంబు నేను ♦ జలుపన యేనిన్
జిక్కొట్టదె జగ మెల్లను, నక్కటికములేని 'జడధి' ♦ యంచును నన్నున్. ౬౭

అర్థము. కమలాక్షుని దూతకున్ = కమలములవంటి కన్నులుగల శ్రీరామచంద్రమూర్తి దూతకు, ఇది పుండరీకాక్ష శబ్దము స్ఫురింపఁజేసెడిని. అనఁగా భగవంతుని దూత కని భావము. సాయంబు = తోడుపాటు, సాహ్యశబ్దభవము. చలుపను + అ + ఏనిన్ = చేయకయే పోయినయెడల, చిక్కొట్టదె = ఛీఛీ యని నిందింపదా? కూ, చీకొట్టు, అక్కటికము = దయ, జడధి = మందబుద్ధి, లడల కభేదము గావున జలధి జడధి యయ్యె. "జడనిధి యను తెలుమఁ గటు వెడలి నిలిచినట్టి యాట వెలఁదియు పోలెన్" ప్రభా. ప్ర.

తా త్ప ర్య ము .

ఆ పుండరీకాక్షుని దూతకు నేను సరియైన సాహాయ్యము చేయకయే పోయిన యెడల లోకమంతయు సముద్రుఁడు దయ, బుద్ధి లేనివాఁడని నిందింపదా? భగవత్కార్యమునకుఁ దోడుపడ శక్తి గలిగియుఁ దోడుపడఁడేని కృత్యాకరణ దోషము ప్రాప్తించుటయేగాక లోకనిందలకుఁ బాలుపడి యపకీర్తి పాలుగావలసి వచ్చునని భావము.

క. బడలిక నిచ్చటఁ బాసినఁ, గడు సుకరం బితఁడు దాఁటఁ♦గడమ న టంచున్
జడనిధి దలఁచుచుఁ దనలో, నడఁగిన మైనాకుఁ జూచి♦యాదటఁ బలికెన్. ౬౭

అర్థము. ఆదటన్ = ప్రీతితో.

తా త్ప ర్య ము .

ఇచ్చట బడలిక పాపుకొనెనా తక్కినదంతయు సులభముగా దాఁటవచ్చును. అని తలఁచుచుఁ దనలో దాగియున్న మైనాక పర్వతమును జూచి యిట్లనెను. మైనాకుఁడు మేనకకు కుమారుఁడు. హిమవంతునకు జన్మించినవాఁడు. పార్వతి తోడఁ బుట్టువు.

—♦ సముద్రుఁడు మైనాకునితో సంభాషించుట. ♦—

ఉ. ఓయి హిరణ్యనాభ! విను♦మొక్కటి చెప్పెద మర్త్యలోకమున్
డాయక యుండఁగా నసుర♦నాథు లధోభువనంబునుండి, ని
న్నాయసభీకరోరుపరి♦ఘాకృతి నిల్పినవాఁడు వేలుపు
ఱేఁడు, నీవ నేర్తు నలు♦ప్రక్కఁ బతంగ మనంగఁ బోవఁగన్. ౬౮

అర్థము. హిరణ్యనాభ = హిరణ్మయములైన నాభులు గలవాఁడా; అనగా బంగారు శిఖరములు గలవాఁడా, నాభి = అధ్యక్షుఁడు, ప్రధానుఁడు, పర్వతమున కధ్యక్షము శిఖరము కావున నిది నాభి శబ్దార్థమయ్యెను. "నాభి రధ్యక్షకస్తూర్యోః" అని దర్ప నిఘంటువు. "నాభిః ప్రధానే ప్రాణ్యంగే కస్తూర్యాం క్షత్రియే నృపే" నానా. ర. ఒక్కటి = చెప్పబోవు వృత్తాంతము. అధోభువనము = పాతాళము, ఆయస = ఉక్కుచేఁ జేయఁబడిన, భీకర = భయంకరమైన, ఉరు = గొప్పదగు, పరిఘ + ఆకృతి = ఇనుపకట్ల గుదియవలె, వేలుపుఱేఁడు = దేవతల ప్రభువు = దేవేంద్రుఁడు, స్థిరము పరమగునపుడును నుగాగమము గలదు, గరువపు న్మురువువలె, పతంగము = పక్షి.

తా త్ప ర్య ము .

ఓయి! బంగారు శిఖరములు గల మైనాకా? నీకొక వార్త చెప్పెద వినుము. పాతాళలోకము నుండి రాక్షసులు భూలోకమునకు రాక యుండునట్లు నిన్నింద్రుఁడు ఉక్కుగుదియవలె నడ్డముగా నుంచెను. పక్షివలె నే ప్రక్కనైనఁ బోవ నీకు సామర్థ్యముగలదు.

సీ. రామకార్యార్థమై♦భీమకర్ముఁడు హనూ,మానుండు చనెడి నం♦బరము నొరసి
నాకు సంపూజ్యు లి♦క్ష్వాకుకులోద్భవుల్, పరమపూజ్యులు నీకుఁ♦బర్వతేంద్ర!
నెయ్యంబుమై నీవు♦తియ్యఁదనంబున, సాచివ్య మొక్కటి♦చలుప వలయుఁ
గాపింపఁ దగుపనిఁ♦గావింప కుండినఁ, గోపింత్రు సజ్జనుల్♦గూళ యనుచు
తే. లెమ్ము జలములయందుండి♦లీల నీవు, మనకు నతిథియుఁ బూజ్యుండు♦మారుతాత్మ
భవుఁడు గావున నెదు రేగి♦బడలిక చన, నతని ధరియింపు శిరమున♦హర్షమునను.

అర్థము. సాచివ్యము = సాహాయ్యము,

తా త్ప ర్య ము .

రామచంద్రమూర్తి కార్యము సాధింప భయంకర కర్మము చేయు హనుమంతుఁ డాకాశమంటి పోవుచున్నాఁడు. ఇక్ష్వాకువంశమునఁ బుట్టినవారు నాకుఁ బూజ్యులు. నాయందు నీవు సుఖముగా నుండుటచే నేను నీకుఁ బూజ్యుఁడను గదా. ఆ కారణముచే నిక్ష్వాకువంశము వారు నీకుఁ బరమ పూజ్యులు. స్నేహము చేతను సౌమ్యభావముచేతను నీ సమయంబున నీవు నా కొక సాహాయ్యము చేయుము. చేయవలసిన పని చేయని వాని దుష్టుఁ డని సత్పురుషులు కోపింతురు. కావునఁ జేయక తప్పదు. హనుమంతుఁడు మన కతిథి, పూజ్యుఁడు కావున నీవు నీళ్లలో నుండి లేచి యాయనకు నెదురుగఁబోయి గాసి దీరునట్లు శిరమున ధరింపుము. దీనివలనఁ దాను భగవత్కార్యము చేయ నాసక్తి యుండియుఁ జేయలేనివాఁడు చేయఁగల వానిని బ్రేరించి వానిచే నా కార్యము చేయింపవలెను. అతిథిని మఱి యే విధముగ నుపచరింప లేనివాఁడు మంచిమాటలచేతను కూర్చుండుట కాసన మిచ్చుటచేతను దాహమునకు మంచినీళ్లిచ్చుట చేతనైన నాదరింపవలెనని సూచితము.

ఉ. ఇంచుక సేదదీఱి మఱి యేగెడిఁ గాక కొందం దరింప, యో
జించి రఘూత్తమోత్తము సుశీలతయుఁ సతి గోలుపోక రా
త్రించరు వీటికై చనెడి ధీరకపీంద్రుని పెన్ శ్రమంబు మో
దించుచు నీటనుండి యరుదెమ్మిక లెమ్ము శుభమ్ము నీ కగున్. ౭౧

అర్థము. సేద=గాసి, కొందన్=కొలఁత సముద్రమును.

తా త్ప ర్య ము .

ఇట్లు నీవు చేసితివేని కొంచెము బడలిక తీర్చుకొని తరువాతఁ దక్కిన సముద్రము దాఁటిపోవును గాక. రామచంద్రుని మంచి నడవడి, ఆయన భార్యను బోఁగొట్టుకొనుట, రావణాసురు పట్టనమునకై పోయెడి ధీరుఁడైన వానరేంద్రుని శ్రమము నాలోచించి సంతోషముతో నీటినుండి రమ్ము, లెమ్ము, నీకు మేలగునుగాక.

— మైనాకుఁ డాంజనేయున కెదురుగవచ్చుట —

చ. అను లవణాంబురాశినుడు లా నగవల్లభుఁ డాలకించి తీ
వ్రున మొగులుం బగల్చురవిఁ బోలుచు నీ రిరుపాయ చీలఁగా
ఘనతరనాగకిన్నర నికాయసమంచితబాలభానుబిం
బనిభసుకూటకాంతి నసివర్ణనభంబు సువర్ణతం గనన్. ౭౨

అర్థము. ఇరుపాయ = రెండుచీలికలుగా, నికాయ = సమూహముచే. సమంచిత=ఒప్పుచున్న, బాలభానునిభ=నిభ=లేఁతసూర్యునితో సమానమైన, సుకూట= మంచి శిఖరముల, ఘనతర, సమంచిత, నిభ; ఇవి కూట విశేషణములు. అసివర్ణనభంబు=కత్తివన్నెగల యాకాశము, కత్తులు నలుపని కవి సమయము. సువర్ణతన్= బంగారు తనమును, బంగారుకాంతి.

తాత్పర్యము.

ఈ ప్రకారము చెప్పుచున్న లవణసముద్రముమాట లా పర్వతశ్రేష్ఠుఁడు విని చివాలున మేఘములను బగలఁదీసికొని వచ్చు సూర్యునివలె నీళ్లు రెండు ఖండములుగాఁ జీలఁగా నాగులు కిన్నరులు వీరల సమూహముచేఁ బ్రకాశించునదియు లేఁత సూర్యుని కాంతిగలదియు గొప్పదియు నగు శిఖరము కాంతి నల్లని యాకాశము బంగారువన్నె కలదికాఁగా.

ఉ. ఉప్పరవీథికి న్నెగయ ♦ నుగ్రమరీచిశతంబుపోల్కిఁ దా
నొప్పుచు మార్గమధ్యమున ♦ నుండు మహాగిరిఁ గాంచి విఘ్న మి
ట్లుప్పతిలెం గదే యనుచు ♦ నుగ్రభయంకరవేగ యుక్తుఁడై
ఆొప్పి ఢికీలునందగిలె ♦ ఆోలుచు సోలుచు గొండ స్రుక్కఁగన్. 23

అర్థము. ఉప్పర వీథికిన్ = ఆకాశమునకు, ఉగ్రమరీచి శతంబు=నూర్వురు సూర్యులు, ఉప్పతిలెన్=కలిగెను, ఆొప్ప=హుమ్మనిధ్వనించి, ఆోలుచు=విలపించుచు సోలుచున్=పడుచు, స్రుక్కఁగన్ = బాధపడఁగా.

తాత్పర్యము.

ఆకాశమున కెగయఁగాఁ ద్రోవ కడ్డముగ నూర్వుర సూర్యుల కాంతితో నిలువగా విఘ్నము వచ్చెరా యని తలఁచి వేగ మతిశయింపఁజేసి హుంకరించి ఢికీలున ఢీకొట్టగా మైనాకుఁడు విలపించుచు శోషిల్లుచు స్రుక్కెను.

క. పిడుగువలెఁ దాఁకఁ గళవళపడి గాలికి మబ్బురీతిఁ ♦ బఱచియు మోదం
పడి పొంగి యెఱిఁగి యాతని,నడిఁ బ్రీతిని బర్వతంబు ♦ వనదాధ్వమునన్. 24

అర్థము. వనద+అధ్వమునన్ = మేఘమార్గమున=ఆకాశమందు.

తాత్పర్యము.

హనుమంతుఁడు పిడుగు దాఁకినట్లు తాఁకఁగా మైనాకుఁడు కళవళించి గాలికి మబ్బువలె దూరము కొట్టుకొని పోయియు, నాయన వేగము బలము నెఱిఁగి మనస్సులో సంతోషించి పైకిఁ బొంగుచుఁ బ్రీతుఁడై యాకాశమునందు.

క. మానవరూపంబున నిజ,మానితశిఖరమున నిలిచి ♦ మారుతతనయా!
వానరవల్లభ! దుష్కర, మైన పనిం జలిపి తీ వహో యే మందున్. 25

అర్థము. మానవ రూపంబునన్ = మనుష్యాకారముతో.

తాత్పర్యము.

మనుష్యస్వరూపముతోఁ దన శిఖరమందు నిలచి యిట్లనియె. 'వాయునందనా! వానరశ్రేష్ఠా! యెంతటి యసాధ్యమైన పని చేసితివి. ఆహా! నీ శక్తి నే నేమని పొగడుదును.

పర్వతములకు నదులకు మొదలైనవానికి వెలుపలఁగానవచ్చు రాలు నీళ్లు మొదలయినవి శరీరములనియు, నధిష్ఠాన దేవత వేఱుగా నందే యుండుననియు నెఱుఁగనగు.

ఉ. నిర్మలతేజ ! నీ బలము ♦ నీ వడిఁ జూచిన మెచ్చు వచ్చె, నా
భర్మసుకూటపాళి దగ ♦ పాయఁగ నిల్చి యథేచ్ఛ మేగుమీ
శర్మముఁ గూర్చు వారలకు ♦ శర్మము సేఁత సనాతనంబు నా
ధర్మము గాన సాగరుఁడు ♦ తద్దయుఁ బ్రత్యుపకారచిత్తుఁ డై. ౭౬

అర్థము. భర్మసుకూట పాళిన్ = బంగారు శిఖరముల సమూహమందు, దగ = శ్రమము, శర్మము = మేలు. సనాతనంబు = శాశ్వతము, ప్రత్యుపకారచిత్తుఁడై = మఱు మేలు చేయ మనస్సు గలవాఁడై.

తాత్పర్యము.

శుద్ధమైన తేజస్సు గలవాఁడా! నీ బలము నీ వేగము చూచి మెచ్చుకొంటిని. నా బంగరు శిఖరము లందు నీ శ్రమము పోవునట్లు నిలిచి యావల నీయిష్టము వచ్చునట్లు పొమ్ము. నా మీఁద నీ కింత ప్రేమ యెట్లు గలిగెనందువా ? మేలు చేసిన వారికి మఱు మేలు చేయుట సనాతన ధర్మము. కాఁబట్టి సముద్రుఁడు మఱుమేలు చేయఁ గోరినవాఁడై.

ఉ. తా రఘువంశజాత వసు♦ధాపతిచేఁ బరివర్ధితాత్ముఁడై
పేరిమిఁ గంట, నీవు రఘు♦వీరునికార్యము దీర్పఁ బోవుటన్
గూరిమి నీకు సాయ మొన♦గూర్చి బహూకృతి నొందఁ గోరి నన్
జేరి సగౌరవోక్తి నగ♦శేఖర ! యల్లదె మింటఁ గంటివే. ౭౭

అర్థములు. బహూకృతి = గౌరవము.

తాత్పర్యము.

ఆయన మఱుమేలు చేయుటకు నేనేమియు నాయనకు ముందుపకారము చేయలేదుగదా యందువేమో. సముద్రుఁడు తాను రఘువంశమునఁ బుట్టిన సగరుఁడను రాజుచే వృద్ధిపొంది, యా నిమిత్తమున సాగరుఁడను పేరువహించి యుండుటయు నీవు రఘువంశమునఁ బుట్టిన రామచంద్రమూర్తి కార్యము చేయఁబోవుచుండుటయుఁ జూచి, నీకు సాహాయ్యము చేసిన, వారికిఁ జేసిన ట్లగునని తలఁచి యా విధమున సాగరుఁడు కృతజ్ఞుఁడను గౌరవము నొందఁగోరి నన్నుఁ బిలిచి సగౌరవవాక్యముల నిట్లనియె. పర్వతోత్తమా ! యదిగోఁ జూచితివా యాకాశంబున.

క. అసఘుఁడు కపివీరుఁడు యో,జనశతముం దాఁటఁ బూనెఁ ♦ జయ్యన నీవుం
జను మెదురుగ నీ శిఖరా,వని బడలిక వాసి కడను ♦ వడగొనక చనున్. ౭౮

అర్థము. కడమ = తక్కినదూరము. వడగొనక = గాసిలేక.

తాత్పర్యము.

రామకార్య ధురంధరుఁ డగుటచేఁ బుణ్యాత్ముఁడైన వానర వీరుఁడు నూఱు యోజనముల దూరము దాఁట బ్రయత్నించి పోవుచున్నాఁడు. నీవు త్వరగా

నెదురుగఁ బోయి నీ శిఖరమునందు నిలువుము. అందు విశ్రమించి గాసి దీఱిన పిదప తక్కినది కష్టములేక దాటును.

ఉ. అచ్చపుఁ బ్రేమ నిట్టు లతఁ డాడిన మారుతపుత్ర ! నీకుఁగా
వచ్చితి, నిందు నిల్చి ఫలవర్గముఁ దియ్యని కందమూలముల్
మచ్చిక నారగింపుము, శ్రమం బఱ హాయిగ విశ్రమింపుమీ
ద్రచ్చఱ వెండి వేగ సుకరం బగు శేషము వానరేశ్వరా ! ౪౯

అర్థము. సుగమము.

తా త్ప ర్య ము .

వాయు నందనా ! ఆయన యీ ప్రకారము నిర్మలమైన ప్రేమచేఁ జెప్పఁగా నీ నిమిత్తమై నేను వచ్చితిని. ఇచ్చట నిల్చి ఫల సమూహములను, తియ్యని కంద మూలములను నాయందలి ప్రేమచే నారగింపుము. బడలిక దీఱునట్లు విశ్రమింపుము. ఆవల నీవు తక్కిన దూరము వేగముగా, సులభముగాఁ బోవ సాధ్యపడును.

ఉ. క్రొత్తల నైన సజ్జనులఁ గూరిమిఁ బూజ యొనర్చుటల్ సుధీ
సత్తములెల్ల మెత్తురు ప్రశస్త మటంచది యిట్టులుండ దే
వోత్తముఁడున్ మహాత్ముఁడు బలోగ్రుఁడు నా పవమానుపుత్ర ! నా
కిత్తఱి విందవైతివి గ్రహింపుము యింపుగ నాతిథేయమున్. ౫౦

అర్థము. క్రొత్తలనైనన్ = క్రొత్తవారినైనను, విందవు = అతిథివి, అతిథేయమున్ = అతిథి సత్కారమును.

తా త్ప ర్య ము .

క్రొత్తవారినైనను సత్పురుషులను ప్రేమతోఁ బూజించు కార్యములను బుద్ధిమంతులగు సత్పురుషులు శ్లాఘ్యమైనవని మెచ్చుకొందురు. అతిథిగుణవంతుఁడగునేని క్రొత్త ప్రాఁత విచారము చేయరాదు. అదట్టులుండనీ, ఆ కారణముగాక నేను బూజించుటకు వేఱొక కారణము గలదు. దేవతలందు శ్రేష్ఠుఁడును (త్వమేవం ప్రత్యక్షం బ్రహ్మాసి) మహాత్ముఁడును బలమున భయంకరుఁడు నగు వాయుదేవునకు నీవు పుత్రుఁడవు. నీ యోగ్యత నాకుఁ దెలిసినను దెలియక పోయినను నీ తండ్రి యోగ్యతను బట్టియైన నేను నిన్నుఁ బూజింపవలెను. అట్టి మహానుభావుని కొడుకవైన నీవు మా కతిథివైతివి. కావున నేనిచ్చు నతిథిసత్కారము గ్రహింపుము. ఎట్టివాఁడైనను అతిథి పూజ్యుఁడు. అందు సజ్జనుఁడు విశేష పూజ్యుఁడు. అందు సద్వంశ ప్రసూతుఁడు పరమ పూజ్యుఁడు. ఈ మూఁడును నీయందుఁ గలవు. కావున నీవు నాకుఁ బూజ్యుఁడవు.

తే. ధర్మజిజ్ఞాసువులకును ధర్మవిదుల, కతిథి సామాన్యుఁడయ్యుఁ బూజార్హుఁడగును
జెప్పనేటికి నీవంటి శిష్టు; మనకు, బాంధవం బొప్పు నేఁ గ్రొత్తవాఁడఁగాను. ౫౧

అర్థము. దీనినే చెప్పుచున్నాఁడు. ధర్మజిజ్ఞాసువులకున్=ధర్మమెఱుఁగఁ గోరిక గలవారికిని; ధర్మవిదులకు=ధర్మము తెలిసినవారికిని, సామాన్యుఁడయ్యు=గొప్పవాఁడు కాకున్నను.

తాత్పర్యము.

ధర్మమిట్టిదని తెలియకపోయినను, దెలిసికొనఁ గోరిక గలవారికిని, ధర్మము చక్కగా తెలిసినవారికిని సామాన్యుఁడైన యతిథియుఁ బూజ్యుఁడే. అట్లుండ నీవంటి సాధుపురుషుఁడు పూజ్యుఁడని వేఱుగఁ జెప్పవలెనా? మన యిరువురకు సంబంధ మింత మాత్రమేగాదు. నేను గ్రొత్తవాఁడఁగాను. నీకుఁ గావలసిన వాఁడనే.

క. ఆశుగమనమునఁ బోలెద, వాశుగమనములను నిన్నునర్చించినచో
నా శుభచరితునిఁ బవనుని, నే శశ్వద్గతిని బూజనెఱపిన యటులౌ. ౧౨౨

అర్థము. ఆశు+గమనమునన్=త్వరగాఁ బోవుటయందు. ఆశుగ+మనముల=వాయువును, మనస్సును.

తాత్పర్యము.

నీవు వాయువేగ మనోవేగములఁ బోఁగలవు. నిన్ను నేను బూజించితినా లోకక్షేమకరమైన నడవడిగల వాయుదేవుని బూజించిన వాఁడ నగుదును.

—మైనాకుఁడు తన పూర్వవృత్తాంతము హనుమకుఁ దెల్పుట—

సీ. కలదు దీనికి నొండుకారణం బది విను, మనఘాత్మ! నాతండ్రి! యాంజనేయ
పూర్వము కృతయుగంబున గిరుల్ ఱెక్కలు వెలయఁ దార్క్ష్యానిలవేగయుక్తి
విచ్చలవిడి వినువీథిఁ జరింపఁగఁ, దలలపైఁ బడు నంచుఁ దలఁకె నెదల
మునులును దేవతల్ మున్నుఁగాఁ గల భూత,కోటి యంతట శతకోటిఁ బూని
తే. వాసవుఁడు క్రుద్ధుఁ డగుచు గ్రావముల ఱెక్క
లెల్లఁ దుత్తునియలు చేసి యొసఁగి నాదు
వంకఁ గవియుడు మీతండ్రి పరమకరుణఁ
జిమ్మి కొనివచ్చి నను ద్రోచె సింధువునను. ౧౨౩

అర్థము. తార్క్ష్యానిల వేగయుక్తిన్=గరుడునియొక్కయు, వాయువుయొక్కయు వేగము వంటి వేగముతోఁ గూడినవి; తార్క్ష్యుఁడు = తృక్షుఁడను ముని కొడుకు తార్క్ష్యుఁడు. శతకోటి=నూఱంచులు గలది వజ్రాయుధము. గ్రావముల = పర్వతములయొక్క, తుత్తునియలు=తునియలు+తునియలు తుత్తునియలు=తునుకలు తునుకలు, సింధువునను=సముద్రమునందు.

తాత్పర్యము.

నేను నిన్నుఁ బూజించుటకు మఱియొక కారణముగలదు, వినుము. పూర్వము కృతయుగంబునఁ గొండలకెల్ల ఱెక్కలుండెను. అవిగరుడానిల వేగమున నాకాశమున

విచ్చలవిడి సంచరింపఁగా నవి తమ తలలమీఁదఁ బడునేమో యని మునులును, దేవతలు చాలభయపడుచుండిరి. అది యెఱిఁగి యింద్రుఁడు వజ్రాయుధముచే వాని ఱెక్కల నెల్ల తునుకలుగా నఱకి నా ఱెక్కలు ఖండించుటకు నా దెస వచ్చెను. అప్పుడు మీ తండ్రి వాయుదేవుఁడు నన్నుఁ జిమ్ముకొని వచ్చి సముద్రములో వైచి రక్షించెను.

క. ఎఱకలపోఁడిమి దఱుఁగక, వఱలెద నిట నీదు తండ్రి♦వాత్సల్యముచే
నెఱిఁగితె మనసంబంధము, నెఱిఁ బూజ్యుఁడు నీదు తండ్రి♦నిన్నాకతనన్. ౮౪

అర్థము. ఎఱకల=ఱెక్కలయొక్క, పోఁడిమి=అందము.

తా త్ప ర్య ము .

ఆ కారణముచే నేను ఱెక్కల యందము చెడక యుండి యిచ్చట నున్నాను. దీనికి మీ తండ్రి వాత్సల్యమే కారణము. మన సంబంధము తెలిసినదా? ఈ కారణముచే నీ తండ్రి నాకుఁ బూజ్యుఁడు. నిన్నాకారణముచే (గౌరవించెదను.)

ఉ. పావని! గౌరవించెదను♦బాయక కూరిమి నాదుమైత్రి సం
భావనఁ జేసి, నా యిడు స♦పర్యల నెల్ల గ్రహించి ప్రీతిమై,
వావిరి సేద దేఱి, నను,♦వారనిధిం బరితుష్ట చిత్తులం
గా వెలయింపు, ప్రీతుఁడవు♦గమ్ము, ఘటింపుము ప్రీతి మారుతన్, ౮౫

అర్థము. సపర్యలు=శుశ్రూషలు, సత్కారములు.

తా త్ప ర్య ము .

వాయు కుమారా! యీ కారణముచే నిన్ను గౌరవించెదను. నా మైత్రిని వ్యర్థపుచ్చక నీవు గౌరవింపుము. నేను జేయు సత్కారముల గ్రహించి బడలిక తీర్చికొని నన్ను, సముద్రుని సంతోషింపఁ జేయుము. నీవును బ్రీతుఁడవు కమ్ము.

క. నా చేయుపూజఁ గొనుమీ, పాచుకొనుమి గాసి గాడ్పు♦పట్టి! నిన్నుం
జూచుటచే ముద మందితి, యాచించెద నాదు ప్రీతి♦సార్థకపఱుపన్. ౮౬

తా త్ప ర్య ము .

నేను జేయు పూజ గ్రహింపుము. నీవు బడలిక పాపుకొనుము. నిన్నుఁ జూచుటచే సంతోషము గలిగి నా ప్రీతి సార్థకము చేయ యాచించెదను.

చ. అన నగరాజ! నీ వొసఁగు♦నట్టి సపర్యలు వచ్చె, మోదముం
గనితి, నిలంగరాదు, ననుఁ♦గార్యము కాలము తీవరించెడిన్
జనియెడిఁ బ్రొద్దు, నేఁ బ్రతిన♦చల్పితిఁ ద్రోవను నిల్వనంచు, గా
వునఁ జనెదన్ మదిం గినియఁ♦బోకుము నిల్వనటంచు మిత్రమా! ౮౭

తా త్ప ర్య ము .

ఈ ప్రకారము మైనాకుఁడు చెప్పఁగా హనుమంతుఁ డిట్లనియె. పర్వతోత్తమా! నీవు చేయు సత్కారము లంగీకరించిన వాఁడ నే నైతిని. అన్నరసము కన్న నాదరణరసము మేలు గావున నీ మంచి మాటల చేత నే సపర్యల నంగీకరించిన ఫలము నీకుఁ

గలదయ్యెను. సంతోషించితిని. నేను నిలువఁగూడదు. ఏలనఁ గార్యము కాలము నన్నుఁ దొందర పెట్టుచున్నది. చేయవలసిన కార్యము చాల నున్నది. ప్రొద్దా గ్రుంకఁ బోవు చున్నది. ఇక్కడ నాలసించితి నేని నేను గార్యము చేయుటకుఁ జాలినంత ప్రొద్దులేదు. అదియును గాక నేను ద్రోవలో నిలువ నని వానరులతోఁ ప్రతిజ్ఞ చేసితిని. (చూ. ప. ౩౭) కావునఁ బోయెదను. నేను తిల్వాలే దని మిత్రమా! కోపింపకుము.

చం. అని పవమానసందనుఁడు ♦ నాదగ మారఁగ శైలరాజమున్
దనకరపల్లవంబునను ♦ దద్ద స్పృశించి హాసన్ముఖాబ్జుఁ డై
చనియెద నంచు వీడ్కొని భృ♦శత్వర నూర్ధ్వము దాఁటి వేగి యై
వననిధిశైలరాజశుభ♦వాక్కులు గైకొని పూజితుండు నై. ౮౮

అర్థము. కరపల్లవంబునను = చిగురువంటిచేతితో, హాసన్ముఖాబ్జుఁడై = నవ్వుచున్న ముఖాబ్జముగలవాఁడై, భృశత్వరన్ = అతివేగమున, వననిధి = సముద్రుని యొక్కయు, శైలరాజ = మైనాకుని యొక్కయు.

తా త్ప ర్య ము.

ఇట్లు చెప్పి హనుమంతుఁడు ప్రీతితో మైనాకునిఁ దన చేతితోఁ దాఁకి నవ్వుమోము గలవాఁడై పోయి వచ్చెద నని సెలవు తీసికొని మిగుల వేగమున నంతకుఁ బై కెగిసి సముద్ర మైనాకుల యాశీర్వచనములు పొందినవాఁడై.

క. అంబరమార్గమున నిరా,లంబనముగ వాయుసూతి♦లక్షించుచు భూ
ధ్రంబును జనె; రెండవకా,ర్యంబును దుష్కరముఁ జూచి♦యమరులు పొగడన్.

తా త్ప ర్య ము.

ఆకాశమునందు నిరాధారముగ నాంజనేయుఁడు మైనాకుని జూచుచుఁ బోయెను. రెండవ యసాధ్య కార్యమునుజూచి దేవతలు పొగడిరి.

మొదటి కష్టకార్యము, సముద్రము దాఁటుట. రెండవది కొండ యడ్డుపడినను భేదించుకొని నిలువక పోవుట.

క. మైనాకుఁ డొనర్చిన స్నే,హానూనకృతిం దలంచి♦యంబరవీథిన్
గానఁగ నిలిచిన నాకౌ,కోనికరము పొగడె,నద్రి♦కుంజరు నంతన్. ౯౦

అర్థము. స్నేహానూనకృతిన్ = స్నేహముచేనైన గొప్ప కార్యమును, నాకౌకోనికరము = దేవతాసమూహము, అద్రికుంజరున్ = పర్వతశ్రేష్ఠుని, మైనాకుని.

తా త్ప ర్య ము.

మైనాకుఁడు చేసిన స్నేహపూర్ణమైన కార్యమును జూచి యాకాశమందు నీ వినోదము చూడనిలిచిన దేవతాసమూహము మైనాకుని బొగడిరి.

ఉ. నాకవిభుండు దానికి న♦నంతముదంబును బొంది పెండి మై
నాకునిఁ జూచి యో కనక♦నాభ! నినుం గని సంతసించితిన్

నీ కభయం బొసంగితి వి♦నిర్మలనీతి యథాసుఖంబుగా
లోకమునం జెలంగు భయ♦లోలత మానుము మానసంబునన్. ౯౧

తా త్ప ర్య ము .

ఆ మాటలు విని యింద్రుఁడు మిగుల సంతోషపడి వచ్చి మైనాకునిఁ జూచి యో సువర్ణనాభ ! 'నిన్నుఁజూచి మిగుల సంతోషించితిని. నావలన నీకిఁక భయము లేకుండ వరమిచ్చితిని. నీవు సంకోచములేక లోకంబున సుఖింపుము. మనస్సునందైన భయపడ వలదు.'

చ. ఎటు లొకో నూఱుయోజనము ♦ లీతఁడు వార్థిఁ దరించు నంచు లోఁ
దటతట గల్గె మాకు నెఱ♦ధైర్యము నైనతఁ డేగుచుండినన్
దిటముగ రాముకార్యమును ♦ దీర్పఁగ దూతగఁ బోవు మారుతిన్
దటుకున నాదరించితివి ♦ తద్దయు మెచ్చితి నీకు నెచ్చెలీ. ౯౨

అర్థములు. తటతట=భయముచే గుండెలు కొట్టుకొనుట యందు ధ్వన్యను కరణము=భయము, నెఱ=నిండు, నీకు మెచ్చితిన్=నిన్ను మెచ్చితిని, ద్వితీయకు మాఱు షష్ఠి. షష్ఠీ స్థానకం బగు కువర్ణకఁ బొక్కొ-క్క-చో ద్వితీయాది విభక్తులకు మాఱుగాఁ దత్తదర్థంబులఁ జూపట్టెడిఁ (త్రికా-౧౭ సూ)

తా త్ప ర్య ము .

హనుమంతుఁడు నిండుధైర్యముతోఁ బోవుచుండినను నీతఁడెట్లు నూఱు యోజనముల సముద్రము దాఁటఁగలఁడని భయముచే మా గుండెలు కొట్టుకొను చుండెను. ఆవిధముగ రాముని కార్యముఁ దీర్ప దూతగఁ బోవుచున్న హనుమంతుని నాలస్యము లేక సమయమున నాదరించితివి. నీ కార్యము స్నేహితుఁడా ! మెచ్చితిని.

క. అనుచు శచీవల్లభుఁ డిటు, తనుఁ బల్కి-న లబ్ధవరుఁడు ♦ ధర్మావల్లభుఁ డా
త్మను నలరి వెలసెఁ బదపడి, హనుమంతుఁడు పోవు చుండె ♦ నంబరవీథిన్. ౯౩

అర్థములు. లబ్ధవరుఁడు=వరముపొందినవాఁడు, ధరవల్లభుఁడు=పర్వతశ్రేష్ఠము.

తా త్ప ర్య ము .

అని యీ ప్రకారము దేవేంద్రుఁడు తనతోఁ జెప్పఁగా మైనాకుఁడు వరము పొందినవాఁడై భయము విడిచి సంతోషించెను. హనుమంతుఁ డాకాశమునఁ బోవు చుండెను. దీనిచే భగవత్సేవకులకు దేవతలు సాహాయ్యపడుదురు. 'శ్రేయాంసి బహు విఘ్నాని' శ్రేయస్కర కార్యములకు విఘ్నములు మెండు. సంసారమును దరింప నాత్మావలోకనపరుఁడై యోగ మభ్యసించువానిఁ జూచి నిద్రాహారములు మాని వాఁడు చేయు కృషి చూచి యిట్లయిన వీఁడు చెడునేమో యని భయపడి ప్రేమ చేతనే వానికి నిషిద్ధ వస్తువులు తినఁబెట్టి భోగములు మఱపి తమవలె నుండఁ జేయ నేవేవియో కుచేష్టలు వాని యాప్తబంధువులే తొలుతఁ జేయుదురు. కారణము ప్రేమయైనను విఘ్నము విఘ్నమే. కావున వీరిని లక్ష్యము చేయరాదు. మంచిమాటల

తోనే వారిని సమాధాన పఱచి బెదరించి తాను దిరిగి చూడక వెనుకంజ పెట్టక కృషిచేయవలెను. భాగవతుల నిష్ఠ యిట్టిదై యుండవలెను. అది విఘ్నకారుల విషయమున దయాదాక్షిణ్య మెఱుఁగదు.

—♦ హనుమంతునకు సురస యడ్డపడుట ♦—

చ. సురఋషిసిద్ధు లెల్లఁ గపి♦శూరు బలంబు నెఱుంగఁ గోరి భా
స్కరనిభ నాగమాత సుర♦సం గని యల్లదె కంటె వాయుజుం
డురుతర వేగయుక్తిని మ♦హోదధి దాఁటెడి, దైత్యరూపవై
సరగున నేగి యడ్డపడి ♦ జాగొనరింపు ముహూర్తమాత్రమున్. ౯౪

అర్థములు. భాస్కరనిభ=సూర్యునితో సమానమైనది. నాగమాత=నాగులకుఁ దల్లియైనది. ఉరుతర వేగ యుక్తిని= మిగుల గొప్పదగు వేగముతో, విఘ్నముచేఁ గాలహరణమైన కారణముచే హనుమంతుఁడు మునుపటికంటె వేగముగఁ బోవఁబూనెనని భావము.

తా త్ప ర్య ము .

దేవతలు, ఋషులు, సిద్ధులు, మొదలగు వారీయన యట్లొంటరిగా సాహసించి పోవుచున్నాఁడే రావణుని గెలిచి రాఁగలఁడా? సముద్రమైన నంతయు దాఁటగలఁడా? యీయన బల మే మాత్రమా తెలిసికొంద మని యాలోచించి సూర్యకాంతిగల నాగమాతను సురసను జూచి యదిగోఁ జూచితివా? హనుమంతుఁడు మిగుల వేగముతో సముద్రము దాఁటుచున్నాఁడు. నీవు దైత్య స్త్రీవై పోయి యతని కడ్డపడి ముహూర్త మాత్ర మాలస్య మగునట్లు చేయుము.

క. కోఱలు, నాకాశంబును నూఱెడువక్త్రంబు, కావి ♦ నుఱు మిడిగ్రుడ్లై,
మాఱొడ్డి నిలుము యుక్తిని, మీఱెడినో కాక చిక్కి ♦ మిడుకాడెడినో. ౯౫

అర్థములు. నూఱెడు=రాచుకొను, స్పృశించు, వక్త్రంబు=నోరు, కావి=ఎఱ్ఱని నుఱు=నాశముచేయు, మాఱు+ఒడ్డి=ఎదిరించి.

తా త్ప ర్య ము .

కోఱలు, నాకాశము నంటు నోరు ఎఱ్ఱనివై చూపులచేతనే యెదుటివారిని జంపు మిడిగ్రుడ్లు కలదానవై త్రోవ కడ్డముగ నెదిరించి నిలువుము. యుక్తిచే నిన్ను దాఁటిపోవునో, లేక నీచేఁ జిక్కి పోలేక మిణకరించునో.

ఉ. చూతము గాక యన్న సుర♦సుందరి వల్లె యటంచుఁ గంధిపై
భూతభయావహం బగు న♦పూర్వవికారవిరూప మైన రూ
పాతతరీతి రక్కసియ♦యట్లు ధరించి చరించుచున్ జనో
పేతముగాఁగ వాయుసుతుఁ ♦ డేగెడి మార్గము నడ్డకట్టుచున్. ౯౬

అర్థములు. వల్లె=అట్లే కానిండు, ఇది యంగీకారము సూచించును. కంధిపై=సముద్రముమీఁద, భూత భయావహంబు = ప్రాణులకు భయము కలిగించునది.

అపూర్వ=మును పెన్నఁడు విన్నది కన్నది కానిది. వికారము=చూడ భయంకరమైనది, విరూప=వంకరటింకరమైనది, రక్కసియ యట్లు=రాక్షసివలెనే, జవోపేతముగాఁగ వేగముతోఁ గూడినట్లుగ.

తాత్పర్యము.

చూతమని చెప్పఁగా నా దేవతాస్త్రీ సరియని యంగీకరించి ప్రాణికోటికి భయంకరమై మును పెవ్వరు నెన్నఁడు వినని కనని వికారము విరూపము నగు పెద్ద రూపము ధరించి యాకాశమందుఁ దిరుగుచు వేగముగఁ బోయి యాంజనేయుఁడు బోవు మార్గమున కడ్డముగా నిలిచి,

ఉ. ఇట్లను వానరేంద్ర! యెట కేగెదు నిల్వుము, నాకు నిన్ను నీ
పట్ల విధించినారలు సుపర్వులు భోజ్యము గాఁగ, నన్ను నీ
వెట్లును మీఱలేవు, చొరు మీ వదనంబును, మ్రింగినైతు, ము
చ్చట్లిఁక సాగ వన్న సురసం గని పావని మోదుఁ గేలునన్. ౯౭

తాత్పర్యము.

ఇట్లు చెప్పెను. వానరశ్రేష్ఠా! యెందుఁబోవుచున్నావు. నిలువుము. ఏలం దువా? దేవతలు నిన్ను నా కాహారముగాఁ గల్పించినారు. కావున నన్ను మీఱి నీవు పోలేవు. నా నోరఁ జొరఁబడుము. మ్రింగెదను. ఇఁక ముచ్చటలతోఁ బనిలేదు. అని సురస చెప్పఁగా నామె వేషము చూచి యిది సహజ రాక్షసి గాదు. కృత్రిమ రాక్షసి. ఎవతెయో నన్నుఁ బరీక్షింప వచ్చినది. నిజముగా నిది నన్నుఁ దినుటకై వచ్చి యుండినఁ దానే నన్నెత్తి నోట వేసికొని యుండును గాని నన్ను నోటిలోఁ జొరఁబడు మని కోరునా? ఈమెతో మనము విరోధింపరాదని తలఁచి యాంజ నేయుఁడు రెండు చేతులు జోడించి నమస్కరించి.

శా. దేవీ! శ్రీరఘురామచంద్రుఁ డటవీ దేశంబునన్ భార్య సీ
తావామాక్షియుఁ దోడు లక్ష్మణుఁడు రాఁ దానుండఁ గ్రవ్యాదవై
రావిష్టుండును నన్యకార్యరతుఁ డౌ నా రాము నిల్లాలి ర
క్షోవర్యుండు హరించె రావణుఁడు; నేఁ జూడంగ సాధ్వీమణిన్. ౯౮

అర్థములు. క్రవ్యాద వైరావిష్టుండును=మాంసభక్షకులగు రాక్షసులందు విరోధభావము గలవాఁడు. (దీనిచే ఖరసంహారాది సూచితము) అన్యకార్యరతుఁడు= మఱియొక పనియందు మనస్సుంచినవాఁడు (ఇది మారీచవధ సూచించును.)

తాత్పర్యము.

దేవీ! శ్రీరామచంద్రమూర్తి సీతాలక్ష్మణులతో నరణ్యమందు సంచరించుచుండఁగా రాక్షసులందు ద్వేషబుద్ధిగల రామచంద్రమూర్తి కార్యాంతరాసక్తుఁడై యున్న సమయంబున నాయన భార్యను సీతను రావణాసురుఁడు హరించెను. ఆ పతి వ్రతను నేను జూడఁ బోయెదను.

ఉ. రామునియాజ్ఞఁ బోయెదను♦రాముని రాజ్యమునందు నుండుటన్
రామరో! నీకునుం దగవు♦రామునికార్యముఁ దీర్పఁ గావునన్
సేమముగాఁగ నేఁ జనఁగఁ♦జేయుము, కాదని లేని జానకీ
క్షేమముఁ దెల్పి రామునకుఁ♦జెచ్చెర నీ వదనంబుఁ జొచ్చెదన్. ౯౯

తాత్పర్యము.

శ్రీరామచంద్రమూర్తి యాజ్ఞచొప్పున నేను బోవుచున్నాను. నీవును ఆయన దేశమం దున్నదానవు కావున నీవు నాయన కార్యముఁ జక్కఁ జేయఁదగును. ఏమి చేయు మందువా నన్ను క్షేమముగాఁ బోనిమ్ము. ఆ సహాయ్యము చాలును. అట్లు కాదందువా జానకీదేవిని జూచి యామె కుశలవార్త రామునకుఁ దెలిపి వచ్చి నీ నోరఁ బ్రవేశించెదను.

క. నిక్కము నమ్ము మటంచన, నెక్కుడిమాటలు కపీంద్ర♦యిప్పుడు నాచేఁ
జిక్కియుఁ బోవం గలవే, గ్రక్కున జీవంబుతోఁ వ♦రం బిది నాకున్. ౧౦౦

అర్థములు. నిక్కము=నిజము.

తాత్పర్యము.

నిజము నమ్ముమని చెప్పఁగా నామె యివేటి మాటలు. ఇప్పుడు నాచేఁ జిక్కియు నీవు తప్పించుకొని ప్రాణముతోఁ బోఁగలవా? ఇది నాకు వరము.

ఇది మొదలు ౧౦౮ వఱకుఁ బ్రక్షిప్తము. ఏలన నిందు సురసయు, ఆంజనేయుఁడిరువురు నూఱామడ వెడలుపున నోరు దేహము పెంచినట్లు చెప్పఁబడెను. సముద్రము వెడలుపు నూఱామడ. వీరి నోరు దేహము నూఱామడయైన వీరి దేహము లెంతయై యుండవలెను. ఇప్పుడు వీరు సముద్రమధ్యమున నున్నవారు, వీరు నూఱామడ పెరిఁగియుండిన నా ప్రక్క రాక్షసులకు నీ ప్రక్క వానరులకుఁ గూడఁ గనఁబడి యుండవలెను. అట్లయిన ననర్థకము తప్పదు. కావున నిది యెవరో తెలివి మాలిన వాఁడు వ్రాసినదిగా గ్రహింపవలెను.

ఈ ప్రక్షిప్తములకుఁ గారణమే మని యాలోచింపఁ గొందఱ యభిప్రాయమేమన:—

ప్రక్షిప్తములకుఁ గారణములు రెండు. స్వమతాభినివేశము, పౌరాణిక వినోద క్రీడ. భారతము "నారాయణకథా మిమా"మ్మని వ్యాసులు చెప్పినను దమతమ మత ప్రశస్తికై యితర మతముల వారు తమ తమ యిష్ట దేవతలకుఁ బరత్వము చెప్పుచుఁ గొన్ని యధ్యాయము లందందు నిఱికించిరి. భారత మందలి ప్రక్షిప్తముల కిది ముఖ్యకారణము. రామాయణ విషయమున నట్లు చేయ సాధ్యపడక యా యా మతములవారు వారి వారి మతానుసారముగ వాల్మీకి పేరుపెట్టి యితర ఋషుల పేరు పెట్టి వేఱువేఱు రామాయణములు వ్రాసి కొనిరి. కావున నట్టివి రామాయణమందు లేవు. రామాయణమును వాల్మీకి

రచించిన పిమ్మటఁ జాలకాలము వేదమువలెనే దానియందు శ్రద్ధగలవారు ముఖస్థము చేసి యుండిరి గాని లిఖిత రూపమున లేదు. ఒకవేళ యుండినను ఎందో యపురూపముగ నుండెడిది. రామాయణము సర్వజనీనగ్రంథ మగుటచేఁ బౌరాణికులు లోకులకు దానిఁ జెప్పసాగిరి. ఇట్లు చెప్పుటయందు వినెడి వారి కింపుగ నుండి వారి మనస్సు నాకర్షించుట రావణ సీతా రామ హనుమదాదుల మహిమ విశేషముగ లేనివి పోనివి యా యా పౌరాణికుల బుద్ధి చమత్కారము కొలఁదియో, బుద్ధిహీనత కొలదియో, క్రొత్తవి కల్పించి చెప్పుచుండిరి. ఆవల నెవరో మహానుభావులు రామాయణమును లిఖితరూపముగల లోకమున వెలయింప నందందుఁ గలవి చేర్చి యన్నిఁటి యందు సమానముగా నున్న భాగములను మూలముగాఁ జేసి కొన్ని కొన్ని ప్రతులందున్న వానిని బ్రక్షిప్తము లని చెప్పిరి. ఈ సురసవిషయము, కాలనేమివిషయము పౌరాణికులు వర్ణించి చెప్పునపుడు పామర జనము లెంతయానందింతురో చెప్పవలసిన పనిలేదు. ఈ ప్రక్షిప్తశ్లోక కారులు తెలివి తక్కువ వారగుటచే వారి దొంగతనము కనిపెట్ట సాధ్యపడుచున్నది. ఈ ప్రక్షిప్తములు అధిక పాఠము లుత్తర కాండమున దండిగఁ గలవు. పూర్వ వ్యాఖ్యాతలు ప్రక్షిప్తముల నెల్ల వేఱు పఱిచిరి.

చ. [అని యిటు కామరూపిణి సు♦రాంగన పల్కి తనంత నిచ్చమైఁ
జనియెడి యాంజనేయుఁ గని♦సత్త్వ మెఱుంగఁగఁ గోరి యోరి వే
చనియెద వెందు? నా వదన♦సద్మమునం జొరఁ బొఱు, మిట్లుగా
వనజభవుం డొసంగె మును♦వాసరనాథ! వరంబుఁ బ్రీతితోన్. ౧౦౧

క. అని బిఱబిఱ జని వదనం,బును దెఱచి మరుత్తనూజు♦ముంగల నిలువం
గని కోపంబున నేదీ, నను మ్రింగెడినోరు చూపు♦నారీ! యనుచున్. ౧౦౨

చ. ఒక పదియామడల్ నిడివి♦యొప్పఁగ దేహముఁ బెంచి నిల్చినన్
వికటకరాళవక్త్రమును♦నెల్తుక యిర్వదియామ డొప్పఁగా
నకుటిలరీతిఁ జేయ నమ♦రాంగనయుం, గని వాయుసూనుఁడున్
దికమిక లేక పెంచెఁ దన♦దేహము ముప్పదియోజనంబులన్. ౧౦౩

క. నలువదియామడ వేల్పుం,జెలువయు వాదెఱవఁ గీశ♦సింహుఁడు పెంచెన్
వలనుగ నేఁబదియామడ, నల సతి నోర్విచ్చె నఱువ♦దామడ గాఁగన్. ౧౦౪

క. డెబ్బదియామడ క్రోఁతుల,గబ్బియు మెయి వెంచె నమర♦కాంతయు విచ్చెన్
గొబ్బున నెనుబదియామడ, నబ్బలియుఁడు తొంబదామ♦డాయత మగుచున్.

క. ఒప్పఁగ మెయిఁ బెంచిన సతి, యప్పుడ నూఱామడగను♦నాస్యకుహరమున్
విప్పఁగ విచ్చెను నన్నుం, దప్పించుకొనంగ నీకుఁ♦దరమా క్రోఁతీ.] ౧౦౫

౧౦౧ మొదలు ౧౦౫ వఱకుఁ దాత్పర్యము. ఈ ప్రకారము కామరూపిణి యగు దేవతా స్త్రీ చెప్పి తన త్రోవన తాను నిలువక పోవుచున్న హనుమంతుని బల మెఱుఁగఁ గోరి 'యోరీ! నీ వెందురా పోయెదవు : నా నోర నీవు చొచ్చవలసి

నట్లు బ్రహ్మ నాకు వరమిచ్చెను' అని శీఘ్రమున నడ్డముపోయి నోరు తెఱచికొని యాంజనేయుని ముందు నిలువఁగా హనుమంతుఁడు కోపించి నన్ను మ్రింగఁగల నీ నోరేదో చూపుమని యొక పది యామడ నిడివిగాఁ దన దేహమును పెంపఁగా నది తన నోరిర్వది యామడ వెడలుపుగాఁ జేసెను. హనుమంతుఁడు తన దేహమును ముప్పది యామడ నిడివి గలదిగాఁ జేసెను. అది దాని నోరు నలువదామడ వెడలుపు చేసెను. ఆయన యేఁబదామడ పొడవయ్యెను. దాని నోరు అఱువది యామడ వెడలుపయ్యెను. ఆయన దేహము డెబ్బది యామడ దీర్ఘమయ్యెను. దాని నోరు ఎనుబది యామడ వెడలుపయ్యెను. ఆయన తొంబది యామడ దీర్ఘముగ దేహము పెంచెను. అది నూఱామడగాఁ దన నోరు విచ్చి నన్నుఁ దప్పించుకొని నీ వెందుఁ బోయెదవురా క్రోఁతీ యనెను.

తే. అనుచు విచ్చిన వదనంబు ♦ ననిలసుతుఁడు, బుద్ధిమద్వర్యుఁడు [సమస్త ♦ భూతనిచయ
భయదనరకాభదీర్ఘజి ♦ హ్వాయును]గాంచి, తత్క్షణమకొంచెపఱుచుచుఁ ♦ దనదుమేను.

తా త్ప ర్య ము .

అని సురస నోరు తెఱవఁగా బుద్ధిమంతుఁడైన యాంజనేయుఁడు చూచి తత్క్షణమే తన దేహము కొంచెముగాఁ జేసెను. దీనివలన హనుమంతునందు నణిమాది సిద్ధులు గలవని యేర్పడుచున్నది.

—♦ హనుమంతుఁడు సురసనోటఁ జొచ్చి వెడలుట ♦—

క. అంగుటమునంత యయి కపి, పుంగవుఁడు తటానఁ జొచ్చి ♦ పొలఁతుక నోరన్
జంగున వెలి వచ్చెను రయ, చంగుం డభ్రమున నిలిచి ♦ సతి కిట్లనియెన్. ౧౦౭

అర్థములు. అంగుటము నంత=బొటనవ్రేలియంత, అంగుష్ఠ శబ్దభవము అంగుటము, రయ చంగుఁడు=వేగమున సమర్థుఁడు.

తా త్ప ర్య ము .

వానర శ్రేష్ఠుఁడగు హనుమంతుఁడు బొటనవ్రేలంత రూపము ధరించినవాఁడై వేగమున సమర్థుఁడగుటచేఁ దటాలున నామె నోరఁ జొచ్చి యామె నోరు మూసికొను లోపలఁ జంగున బయటికి దూఁకి యాకాశమున నిలిచి యిట్లనెను.

శా. తల్లీ! నీవదనంబుఁ జొచ్చితిని, స ♦ త్యం బయ్యె నీ కోర్కి, చం
చల్లీలం గరుణించి నాదకు నమ ♦ స్కారంబుఁ గైకొమ్మి, నే
నుల్లాసంబుగ జానకి న్వెదగు ను ♦ ద్యోగంబునం బోదు, నీ
యుల్లంబందు శుభంబు సంఘటనగా ♦ నూహింపు దాక్షాయణీ. ౧౦౮

అర్థములు. వదనంబు=నోరు, దాక్షాయణీ=దక్షుని కూతురా! హనుమంతుఁడిట్లు సంబోధించుటచే నామె తాను దక్షుని కూఁతు రని చెప్పియుండవలెను. ఈ యొక్కమాట చేతనే హనుమంతుఁడు నీ వెవ్వఁతె వని యడుగుట లోనగు ప్రశ్నలు

నేను దక్షుని కూఁతురని యామె చెప్పుట లోనగు సంభాషణ మూహ్యము, గావున ముందు చెప్పలేదు. ఈ కారణము చేతనే హనుమంతుఁ డామెను రాక్షసి యని భావింపక సగౌరవముగ నమస్కరించి సంభాషించెను. ఇది వాల్మీకి శైలిఫక్కి.

తా త్ప ర్య ము .

తల్లీ! దాక్షాయణీ! నీవు కోరిన ప్రకారము నీ నోరఁ బ్రవేశించితిని. నీకు బ్రహ్మయిచ్చిన వరము సత్యమయ్యెను. నా యందు దయయుంచి నా నమస్కార మంగీకరింపుము. నేను సంతోషముతో సీతను వెదకు పనిమీఁదఁ బోయెదను. నీ మనస్సునందు నేను బోవుకార్యమున మేలు కలుగునట్లు సంకల్పింపుము.

క. పలుక నిటు రాహువదనము, వెలువడు శశి యట్లు నోరు ♦ వెడలుడు వేల్పుం
జెలువ హనుమంతుఁ గనుఁగొని, యలరుచు నిట్లనియె నైజ♦మగు నాకృతితోన్.

తా త్ప ర్య ము .

ఈ విధముగ హనుమంతుఁడు చెప్పఁగా రాహువు నోరఁబడి వెడలిన చంద్రుని వలెఁ దన నోటఁబడి వెలుపలరాఁగా నా దేవతాస్త్రీ మిగుల సంతోషించి తన సహజ స్వరూపమును ధరించినదై.

క. సౌమ్యా హనుమ! యథాసౌఖ్యమ్ముగ నీ కెల్లపనులుఁ ♦ గడుసుకరము లౌ
నిమ్ముగ రామునిముద్దుంగుమ్మను బతితోడ వేగ ♦ కూర్పుము వత్సా! ౧౧౧

తా త్ప ర్య ము .

నాయనా! హనుమంతా! సౌఖ్యముగఁ బోయిరమ్ము. నీ కన్ని కార్యములు మిగుల శ్రమములేకయే ఫలించును. రామచంద్రమూర్తి భార్యను భర్తతోడి వేగకూర్పుము.

తే. అనుచు వచియించి చనియె న♦య్యమరవనిత, దేవతాదులు చూచి తృ♦తీయమైన
యాంజనేయుని దుస్సాధ ♦ మైన పనిని, మేలు మే లని మిక్కిలి ♦ మెచ్చిరపుడు.

అర్థములు. దుస్సాధము = సాధింపఁ గష్టమైనది.

తా త్ప ర్య ము .

అని చెప్పి యా దేవతా స్త్రీ పోయెను. దేవతలు మొదలగువా రాంజనేయుని దుష్కరమైన యా మూఁడవ పనిని జూచి మేలుమేలని మిక్కిలి మెచ్చిరి.

ముముక్షువగు యోగిని భాగవతుని దేవతలు పరీక్షించుటకై విఘ్నములు కల్పింతురు. వీనిని భక్తిచేతనే తప్పించుకొనవలెను.

క. ఆవల నధృష్య మగు పారావారము వదలి విహ్గ♦రాధిపుజవుఁ డై
ద్యోవీథికి లంఘించి భయావహ మగురీతిఁ జనియె ♦ నంజనసుతుఁడున్. ౧౧౨

అర్థములు. ఆవల = సురస వెడలిపోయిన తరువాత, అధృష్యము = అంత్యుపెట్ట రానిది, పారావారము = సముద్రము, విహ్గరాధిపుజవుఁడై = పక్షిరాజగు గరుత్మంతుని వేగమువంటి వేగముగలవాఁడై, ద్యోవీథికిన్ = ఆకాశ మార్గమునకు, భయావహము = చూచువారికి భయము కలిగించునది.

తా త్ప ర్య ము .

సురసపోయిన తరువాత నలక్ష్యము చేయరాని సముద్రమును వదల గరుడ వేగుండై యాకాశమునకు లంఘించి భయంకర విధముగా నాంజనేయుఁడు చనియెను. సముద్రము వదలి యాకాశమునకుఁ లంఘించి యనుటచే సురసతోడి వ్యవహారము నీటిమట్టమునకుఁ బైగా జరిగెను గాని మేఘమండలమునఁ గాదని యేర్పడు చున్నది.

సీ. దొంతరగా నున్న♦తోరంపుమబ్బులు, పసువులు పాఱెడి♦పక్షికులము
సంగీతసుకళావి♦శారదాచార్యులు, శాణ నొప్పారు నై♦రావతంబు
బెబ్బులి యేనుంగు ♦ బొబ్బ మెకంబులు, నెక్కిరింతలు గాఁగ ♦ నెసఁగువారు
మహనీయ మైన వి♦మానంబు లశనివ,జ్రోద్భవశిఖిశిఖా♦ప్రోచ్చయములు
తే. నాక మరిగెడి కృతపుణ్యు ♦ లౌ మహాను
భావజనములు సందడి ♦ బాటగములు
హవ్యమును మోసికొని చను♦హవ్యవహుఁడు
చంద్రసూర్యగ్రహాదున♦క్షత్రములును. ౧౧౪

అర్థములు. దొంతరగాన్ = దొంతులు దొంతులుగా నొక దానిపై నొకటి, తోరంపు=గొప్పవగు, సంగీత సుకళా విశారదాచార్యులు = సంగీత విద్యయందు నేర్పుగల తుంబురుఁడు మొదలుగాఁ గల యాచార్యులు, ఐరావతంబు = ఇంద్ర ధనుస్సు. "ఇంద్రాయుధం త్వింద్ర ధనుస్తు దీర్ఘ మృజు రోహితం ఐరావతం చ విద్యుత్తు చంచలాచపలాపిచ" అని వైజయంతి. ఋజువు, దీర్ఘమైన యింద్రధనుస్సు ఐరావత మనఁబడును. బొబ్బ మెకంబులు = సింహములు, ఎక్కిరింతలు = వాహనములు, అశనివజ్రోద్భవ శిఖిశిఖా ప్రోచ్చయములు=పిడుగు వజ్రాయుధము కలియుటచేఁ బుట్టిన నిప్పుమంటల సమూహములు, కృతపుణ్యులు=పుణ్యము చేసినవారు. మహానుభావ = గొప్ప మహిమగల, సందడి=క్రిక్కిరిసిన జనుల గుంపుగల, హవ్యవహుఁడు = అగ్నిహోత్రుఁడు, చంద్రసూర్యాదులు గ్రహములు, ఉడు = తక్కిన సామాన్య నక్షత్రములు, అశ్విన్యాదులు నక్షత్రములు.

తా త్ప ర్య ము .

దొంతులు దొంతులుగా నొకదానిపై నొకటియున్న గొప్ప మబ్బులు, పరువెత్తుచున్న పక్షులు, సంగీత విద్యానిపుణులైన తుంబురుఁడు లోనగువారు, కాంతిచే వెలుఁగు నింద్ర ధనుస్సు, పెద్దపులి యేనుఁగు సింహము వీనిని వాహనములుగాఁ గలవారు, గొప్ప విమానములు, వజ్రము పిడుగులు వీని రాపిడిచేఁబుట్టిన మంటలు, స్వర్గమునకుఁ బోవు పుణ్యాత్ములు, వీరిచే నెడము లేకుండు బాటలు, దేవతలకు హవ్యమును మోచికొనిపోవు నగ్నిహోత్రుఁడు, చంద్ర సూర్యాది గ్రహములు, సామాన్యములైన చుక్కలు, అశ్విన్యాది నక్షత్రములుఁ, ఇదియును రాఁబోవు రెండుపద్యంబులు ఆకాశవర్ణనము.

ఉ. దేవమునిప్రకాండములు ♦ దివ్యనభశ్చరనాగయక్షవి
శ్వావసు కిన్నరాదులు ది♦శాగజముల్ రవిచంద్రు లేగు మేల్
త్రోవలు మీఱఁగా నఖిల♦లోకవితానవితాన మై శివం
బై వనజాసనాకలిత ♦ మై రహిఁ మించు నభఃపథంబునన్. ౧౧౫

అర్థములు. దేవముని ప్రకాండములు=దేవర్షి శ్రేష్ఠులు. నభశ్చర = ఆకాశమందు సంచరించువారు, విశ్వావసువు=గంధర్వరాజు, దిశాగజముల్=దిక్కులయందుండు నైరావతాదు లేనుఁగులు, అఖిలలోకవితాన వితానమై=సమస్తలోకములకు మేల్కట్టు (చాందినీ) వంటిదై, శివంబై=శుభకరమై, వనజాసన+ఆకలితము=బ్రహ్మచే సృజింపఁ బడినది, నభఃపథంబునన్=ఆకాశమార్గమున.

తాత్పర్యము.

దేవర్షిశ్రేష్ఠులు, దేవతలు, ఆకాశసంచారులు, నాగులు, యక్షులు, విశ్వావసువు లోనగు దేవగంధర్వులు, కిన్నరులు లోనగువారు దిగ్గజములు, సూర్యచంద్రాదులు పోవుమార్గములు అతిశయింపఁగా నన్నిలోకములకు మేల్కట్టువంటిదై బ్రహ్మనిర్మితమై ప్రకాశించు నాకాశమార్గమున.

క. గరుటామంతునిపోలిక, సరగున ఱెక్కలు గలట్టి♦శైలం బనఁగా
నరిగె నిరాలంబనగతి, మరుదాత్మజుఁ డులక దివిజ♦మార్గము వెలుఁగన్. ౧౧౬

అర్థములు. ఉలక=లక్ష్యములేక, దివిజమార్గము=ఆకాశము.

తాత్పర్యము.

గరుత్మంతునివలె ఱెక్కలు గల కొండవలె నిరాధారముగ లక్ష్యము లేక యాకాశమును బ్రకాశింపఁజేయుచు హనుమంతుఁడు పోయెను.

—♦ ఆంజనేయుఁడు సింహికను వధించుట. ♦—

క. రంహోజృంభితవానర,సింహుం డరుగంగఁ జూచి ♦ చింతించె మదిన్
సింహిక యను పెనురక్కసి, యంహోభావమున నెంత♦యనఘాత్మికనో. ౧౧౭

అర్థములు, రంహోజృంభిత=రంహస్=వేగముచే, జృంభిత=అతిశయించిన, అంహోభావమునన్=పాపిష్ఠ మగు మనస్సుచేత, మధ్యమపదలోపి కర్మధారయము.

తాత్పర్యము.

వేగాతిశయము గల వానరశ్రేష్ఠుఁడు పోవుచుండుట చూచి సింహిక యను రాక్షసి పాపబుద్ధిచే నిట్టు లాలోచించెను. ఆహా! నేనెంత పుణ్యాత్మురాలనో.

ఉ. ఎన్నిదినంబులో కడచె ♦ నింతయుఁ గూడు లభింప కయ్యె నా
కిన్నిదినాల కేన్ దొఱకె ♦ నిట్టిమహాద్భుత సత్త్వ మంచు నాఁ
కొన్నతనంబునం బెరిఁగి ♦ క్రూరపురక్కసి యాంజనేయుఛా
య న్నెఱి నిగ్రహింపఁ బవ♦నాత్మజుఁ డాత్మ విషాద మూరఁగన్. ౧౧౮

అర్థములు. సత్త్వము=జంతువు, ఆఁకొన్నతనంబునన్=ఆఁకలిచే, 'పెల్లాఁకొన్నతనాన నే నొకఁడనే భిక్షానకున్ వత్తునో' భీమేశ్వర.

తాత్పర్యము.

కొంచెమైన నాహారము దొరకక యెన్నిదినములో యాయెను. ఇన్నాళ్ళకైనను నిట్టి యత్యాశ్చర్యకరమైన జంతువు లభించెను, అని యాఁకలిచేఁ బెరిఁగి క్రూరరాక్షసి తన నీడను బట్టుకొనఁగా హనుమంతుఁడు మనస్సులో దుఃఖ మతిశయింపఁగా.

తే. ఓరుగాలికి నెదురేఁగు♦నోడనైతి
గుంటుపడియెను వేగంబు ♦ కూలె బల మి
దేమి యొకో యంచు నటు నిటు ♦ లెల్లఁ జూచి
కనియెఁ బెనుభూత మొక్కండు ♦ కడలి లేవ. ౧౧౯

తాత్పర్యము.

ఓరుగాలికి నెదురుగాఁ బోవు నోడవలె నైతిని. నా వేగము తగ్గెను. బలము చెడెను. దీనికేమి కారణ మని నాలుగు ప్రక్కలఁ జూచి యొక పెద్ద భూతము సముద్రములో నుండి లేచుచుండఁగాఁ జూచెను.

క. సుగ్రీవుఁడు చెప్పిన ఛాయాగ్రాహియ దీన సంది♦యం బేమి యటం
చుగ్రుండై మెయి పెంచె మహాగ్రావము నట్లు ప్రావృ♦డంబుద మనఁగన్. ౧౨౦

అర్థములు. ఛాయాగ్రాహి=నీడనుబట్టునది, గ్రావము=పర్వతము, ప్రావృట్+అంబుదము=వానకాలమందలి మేఘము.

తాత్పర్యము.

ఈ సముద్రమున నీచోట నీడను బట్టు నంగారక యను గ్రహ మున్నదని సుగ్రీవుఁడు చెప్పెను గదా. అదియే యిది సందేహము లేదు, అని కోపించి భయంకరుఁడై పెద్దకొండవలె, వానకాలపు మబ్బువలె దేహము నెత్తుగా వెడలుపుగాఁ బెంచెను.

ఉ. వ్రీలక మేనుపెంచు కపి♦వీరవరుం గని దైత్యకాంత పా
తాళగుహాంతరాభ మగు ♦ దారుణవక్త్రము విచ్చి కార్మొయిల్
లీలను గర సేసి యవ♦లీలగఁ ద గ్రసియింప రాఁగ న
య్యాలరిభూతమున్ భయద♦మౌ మెయియున్ వివృతాస్యమర్మముల్. ౧౨౧

అర్థములు. వ్రీలక=వెనుదీయక, పాతాళగుహాంతరాభము = పాతాళ గుహ లోపలి భాగముతో సమానమైనది, వక్త్రము=నోరు, కార్మొయిల్ లీల=వానమబ్బువలె, గ్రసియింపన్=భక్షించుటకు, ఆలరి=చెడ్డ, మెయి=దేహము, వివృత=తెఱవఁబడిన, ఆస్య=నోరు, మర్మముల్=ప్రాణస్థానములు.

తా త్ప ర్య ము.

దేహమంత కంతకు వదలక పెంచుచున్న హనుమంతుని జూచి రాక్షసి పాతాళగుహవంటి భయంకరమైన నోరు తెఱచి వానమబ్బువలె గర్జించి సునాయాసముగఁ దన్నుఁ దినుటకు రాఁగా నా పెద్ద భూతమును భయంకర దేహమును విచ్చిన నోరును మర్మస్థానములు.

దేహము నోరు ప్రాణస్థానములఁ బరిశీలించుట శీఘ్రవధోపాయమున నెచ్చట నేమిచేసిన వెంటనే చచ్చునని చూచుటకే.

కం. కని వజ్రకాయుఁ డల్పుఁడు,దనువునఁ దద్వివృతవక్త్రదరిఁ బడ; దివిజుల్
ఘనుఁ డితఁడు పర్వమున రా,హునివాతను బడెడి చంద్రునొప్పున నకటా. ౧౨౨

అర్థములు. వజ్రకాయుఁడు=వజ్రమువలెఁ గఠినమైన దేహముకలవాఁడు. అది మ్రింగినను దానికిఁ బ్రాణాపాయమే కాని జీర్ణమునకు రానివాఁడు. వజ్రము తాఁకునఁ గొండలైన నెట్లు పిండియగునో యట్టి తాఁకు గలవాఁడు, అల్పుఁడనువున్ = చిన్న దేహమున, తత్=ఆరాక్షసియొక్క, వివృత=తెఱవఁబడిన, వక్త్ర=నోరనెడి, దరిన్= గుహయందు, పర్వమునన్=పున్నమనాఁడు.

తా త్ప ర్య ము.

ఇట్లు చూచి వజ్రమువంటి దేహముగల యాంజనేయుఁడు చిన్నశరీరము గలవాఁడై దాని తెఱచిన నోరను గుహయందుఁ దటాలునఁ బడెను. దేవత లదిచూచి పున్నమనాఁటి చంద్రుఁడు రాహువు నోటఁబడినట్లు లయ్యో యింతటి గొప్పవాఁడు.

క. రక్కసివాతం బడియెనె, యుక్కఱి యని వగవఁ బ్రేవు లుగ్రనఖాళిన్
గ్రక్కున మనోజవంబున, వెక్కసముగఁ బెఱికి కపియు వెలికిన్ దూఁకెన్. ౧౨౩

అర్థములు. ఉక్కఱి=ఉక్కు+అఱి=పరాక్రమము చెడి, మనోజవంబునన్= మనస్సు వేగముతో, వెక్కసముగన్=సహింపరానట్లుగ.

తా త్ప ర్య ము.

రాక్షసి నోటఁబడియెఁగదా యని వ్యసనపడుచుండఁగా దాని ప్రేవుల వాఁడియైన గోళ్ళచే మనోవేగమున నతిశీఘ్రముగ దానికి సహింపరాని విధముగఁ బెఱికి యది నోరు మూయులోపల హనుమ బయట దూఁకెను.

ఉ. ధీరత నేర్పుచూపులను దిగ్గన దానిమదం బడంచి, యా
కారము తొల్లి యట్ల కొని క్రమ్మఱఁ బోవుచు నుండ, మర్మసం
వారము ద్రెవ్వ రక్కసియు వారినిధిం బడి బిద్దినన్ నభ
శ్చారులు వాయుసూనుఁ గని చాఁగు బళీ విను లెస్సచేసితే. ౧౨౪

అర్థములు. ధీరతన్ = ధైర్యము చేత, నేర్పు=బుద్ధి చమత్కారము చేత, చూపులన్ =దూరమునుండియే యెదుటివారి మర్మము నొక్కసారి చూచుటచేతనే తెలిసికొనఁగల చూపుచేత, దిగ్గన=తటాలున, తొల్లియట్ల=పూర్వమున్న విధముగ,

పెద్దదేహమును, మర్మసంవారము = ప్రాణస్థానముల సమూహము, త్రెవ్వఁగా = తెగి పోఁగా, బిద్దినన్ = చావఁగా, నభశ్చారులు = ఆకాశమున సంచరించువారు, చాఁగు బళీ = ఇది ప్రశంసార్థకము.

తాత్పర్యము.

ఎదుటివారు దిగ్భ్రమ గొనునట్లు చేయుధైర్యము బుద్ధి చమత్కారము దృష్టి బలము వీనిచే నారాక్షసి గర్వమణఁచి పూర్వమున్న యాకారము మరల గ్రహించి మునుపటివలెఁ బోవుచుండెను. మర్మస్థానములు తెగిపోవుటచే రాక్షసి సముద్రములోఁ బడి చచ్చెను. అదిచూచి దేవతలు లోనగు నాకాశ సంచారులు హనుమంతుని జూచి బళే బళే చక్కఁగాఁ జేసితివి. సరి సరి.

ఉ. వానరలోకనాయక! భవత్కృత మన్యదురాసదంబు, నీ
యానిన కార్యముం జలుపనోయ్యనఁ బొమ్ము శుభంబు గల్గు, నె
వ్వానికి ధైర్యము స్మృతియు వారక దాక్ష్యము దృష్టి నీవలెన్
జానుగఁ గల్గు వానికి నసాధ్యము లేదది యెట్టి కార్యమేన్. ౧౯౧

అర్థములు. భవత్ + కృతంబు = నీచేఁ జేయఁబడినది, అన్యదురాసదంబు = ఇతరులకు సాధ్యముకానిది, దాక్ష్యము = సామర్థ్యము, దృష్టి = ఎదుటివారి మర్మము తెలిసికొనఁగల సూక్ష్మదృష్టి.

తాత్పర్యము.

కపీంద్రా! నీవు చేసిన కార్య మితరులకు సాధ్యమగునది కాదు. నీవు పూనిన పని నెఱవేర్ప నిఁక వేగముగఁ బొమ్ము. నీకు మేలుగలుగును. ఎట్లుచేసిన కార్యము సాధ్యమగునా యని యాలోచించు బుద్ధి చమత్కారము, ఆ యాలోచనను గొనసాగించు సామర్థ్యము ఎదుటివారి రహస్యము తెలిసికొనఁగల చూపుగల వానికి నే కార్యమైన నసాధ్యముకాదు. ఈ రాక్షసి (సంహిక = అంగారక) చరిత్రము ముముక్షువునకు దుష్టగ్రహ భూతములచేత దుష్టజనులచేతఁ గలుగు బాధలు సూచించుచున్నది. ఇట్టి విరోధ భావము గలవారి యందు దయాగౌరవములు చూపరాదు. వారిని హతముచేయుటే తగిన కార్యము.

— హనుమంతుఁడు లంకాదీరంబును జూచుట. —

చ. అన విని వారిభాషణములంజనపుత్రుఁడు స్వాపయోజనం
బును స్మరియించుచుం జనుచుఁబుల్గులతేనివిధాన నంబరం
బున దిగుచుం గనుంగొనియెభూరితరోరుమనోజ్ఞ భూమిజా
తనివహసుందరంబును నితాంతవిశాలముఁ బ్రాప్తతీరమున్. ౧౯౨

అర్థములు. పుల్గులతేని విధానన్ = గరుత్మంతునివలె, దిగుచున్ = ఆకాశమున నుండినచో రాక్షసులకుఁ గానవత్తునని యాలోచించి నీటిమట్టమునకు సరిగా దూరము

నుండియే దిగ నారంభించెను. భూరితర=గొప్పవై, ఉరుమనోజ్ఞ=మిగులసందమైన, భూమిజాతనివహ=చెట్లసమూహముచే, సుందరముః = అందమైనదానిని, నితాంత విశాలము=మిగుల వెడల్పైనది, ప్రాప్తతీరముః=సమీపమందుండు గట్టును, స్వప్రయోజనము=ఎక్కడ నెట్లుచేసినఁ దనకార్యము కొనసాగునో యట్లు వర్తించుట. కావుననే సురసాసింహికలయందు స్త్రీత్వదోషము సమానమైనను సురసను జయింపవలె నని తలఁచెను. సింహికను జంపఁదలఁచెను.

తా త్ప ర్య ము .

వారిమాటలు విని హనుమంతుఁడు తాను వచ్చినకార్యము నెరవేర్చునుపాయ మాలోచించుచు గరుత్మంతుఁడు నేలవ్రాలునపుడు దిగునటు లాకాశమునుండి దిగుచు గొప్పచెట్లచే నందమై మిగుల విశాలమై తాను దిగవలసిన తీరమును సమీపమందుఁ జూచెను.

చ. కనుఁగొని తత్ప్రదేశమునఁ ♦ గ్రమతరంబుఁ దదంతరీపమం
దును మలయాద్రిపొంతఁ గల♦తోరపుఁదోఁపులు గల్గుసీమలుః
వనచరవీరవల్లభుఁడు ♦ వారిధిఁ దీరముఁ దీరజాగముల్
వనధిసతుల్ పతిం గలయ ♦ వచ్చిన వారిముఖప్రదేశముల్. ౧౭౭

అర్థములు. తదంతరీపము = ద్వీపము, నీటి నడుమనుండు మిట్ట ప్రదేశము, నాలుగు ప్రక్కల నీళ్ళుగల భూమి, తీరజాగముల్=తీరమునందుఁ బుట్టిన చెట్లు, వనధిసతుల్=సముద్రము భార్యలు, ఏళ్ళు, పతిః=భర్తయగు సముద్రుని, వారి ముఖప్రదేశముల్=నదీ ముఖద్వారములు, ఏళ్ళు సముద్రములోఁ గలియు ప్రదేశములు.

మలయ మను నొక పర్వతము లంక యందును గలదు. నదు లనియో ఏళ్ళనియో యొకచిన్నమాటఁ జెప్పినఁ జాలునే 'వనధి సతుల్ పతింగలయ వచ్చిన వారి ముఖప్రదేశముల్' అని యింత దీర్ఘముగఁ జెప్పనేల? భర్తలను గలియఁగోరి వచ్చిన వారి యనఁగా ముత్తైదువుల ముఖదర్శన మయ్యె ననుట శుభశకునము సూచించుచున్నది. నదులు వచ్చి సముద్రములోఁ గలిసినట్లు సీతాదేవి భర్తతోఁ గలియు నని సూచితము. వచ్చినవారి=వచ్చినట్టి స్త్రీలయొక్క యనియు నర్థము గ్రహింపనగు. అప్పుడు 'వారి' తెనుఁగు పదమగును. వీరు సతులు అనఁగాఁ బతివ్రతలు కావున భర్తనే కలియవచ్చి రని భావము.

తా త్ప ర్య ము .

చూచి యా ప్రదేశమందు మిగుల మనోహరమైన ద్వీపమందుఁ గల మలయ పర్వతము సమీపమునఁ గల గొప్ప తోఁపులు గల ప్రదేశములును సముద్రమును దానియొడ్డును నొడ్డునందుఁగల చెట్లను నదులు సముద్రమును గలయుచోటులు. పై పద్యముతో నన్వయము,

సముద్రమున కావలియొడ్డున నీవలియొడ్డున మలయ పర్వతము లున్నట్లు చెప్పుటచే నొకానొక కాలమున లంకయు దక్షిణ హిందూస్థానము నేకమై నడుమ సముద్రము లేక యుండెనను వారి యభిప్రాయము సాధువని తోఁచఁజేయుచున్నది.

"The islands of Rameswaram and Mannar, and the chain of islets and sand banks between them, called Adam's Bridge, appear to be remnants of the natural land connection between the main land of India and Ceylon, which existed in some recent geological epoch. There is no doubt of the fact that Ceylon once formed a part of the Deccan. The existence in Ceylon of Indian elephants (elephas Indicus) and other animals and vegetables, natural to southern India, proves the former connection of Ceylon to India. If that were not the case, elephants and other land animals, could not have crossed the sea to make the island of Ceylon their habitant. The Eastern Archipelago once formed a part and parcel of the Continent of Asia. But by the gradual subsidence of land, from volcanic action, to the bottom of the sea, portion of the south and south Eastern Asia got detached from the mainland and became islands. The separation of Ceylon, and the islands of the Archipelago took place, I think, at the same geological epoch and by the same cause or causes. It will appear from a study of the map of Asia that the subsidence took place in a latitudinal belt almost parallel to the Equator, on both sides of it, seperating Ceylon, Sumatra, Java, Borneo, Celibes and a host of smaller islands from the mainland of Asia. It will also appear that the Malaya Peninsula very narrowly escaped complete detachment from this volcanic disturbance. It will also appear from a study of geographical distribution of animal and vegetable life in the south and south eastern parts of the Asiatic continent, and the islands, that most of them, got detached from the mainland by subsidence and that some of them, on the other hand, have sprung up from the bottom of the sea by upheaval (vide Wallace, Malay Archipelago; Island life and Geographical distribution of animals 2Vols. Hackils, History of Creation. 2Vols.)

క. అంగుమెయి నాకసంబును, మ్రింగఁగ గమకించు తనశ ♦ రీరంబు మహో
భంగురతయుఁ గనితనలోఁ,నం గాడుపుపట్టి యోజ ♦ నాపరుఁ డయ్యెన్. ౧౨౮

అర్థములు. అంగుమెయిన్=చక్కఁగా, గమకించు=యత్నించు, మహోభంగురత్న=మిగులనభివృద్ధి, యోజనాపరుఁడయ్యెన్=ఆలోచించినవాఁడయ్యెను. 'యోచన' యనుశబ్దము సంస్కృతమున లేదని పండితు లందురు. యకారాదులు తెనుగున లేవు కావున యోచన యనునది తెలుఁగు శబ్దమునుగాదు.

తాత్పర్యము.

చక్కఁగా నాకాశంబును మ్రింగుటకై యత్నించు తన శరీరముయొక్కయభివృద్ధి చూచి హనుమంతుఁడు తనలో నిట్లు లాలోచించెను.

ఉ. ఈమెయిపెంపు నా దగున♦హీనజవంబును గాంచి రాక్షసుల్
దా మొకవింతగాఁగ ననుఁ ♦ దద్దయుఁ జూడఁగఁ గోరుచుంద్రు, నే
నేమెయిఁ గార్యముం జలుప♦నేర్పడు నంచు మహాద్రిసన్నిభం
బౌ మెయి వానరాధిపుఁడు ♦ నా క్షణమందున సంగ్రహించుచున్. ౧౨౯

అర్థములు. మెయిపెంపు=దేహముయొక్క గొప్పతనము, అహీనజవంబు=మిగుల వేగము, వింతగాఁగ=ఆశ్చర్యకరమైన క్రొత్తవస్తువుగా.

తాత్పర్యము.

ఈ నా పెద్ద శరీరము నా యీ వేగము రాక్షసులు చూచిరా నన్నొక వింత జంతువునలెఁ జూడ మిగుల వేడుక పడుచు నా చుట్టు తిరుగు చుందురు. అప్పుడు నేనెట్లు సీతాన్వేషణ కార్యము చేయఁగలను, అని కొండవలె నున్న తన దేహమును హనుమంతుఁడు తత్క్షణమే చిన్నదిగాఁ జేసెను.

ఆ. వీతమోహుఁ డగుచు ♦ వెలసిన యాత్మజ్ఞు పోల్కి స్వస్వరూప♦మును ధరించె
బలిని నడఁగఁ ద్రొక్కి ♦ప్రబలు త్రివిక్రముఁ, డాత్మరూపధారి ♦ యయిన యట్లు.

అర్థములు. వీతమోహుఁడు=అజ్ఞానము వదలినవాఁడు, ఆత్మజ్ఞు పోల్కి=ఆత్మజ్ఞానము కలవాని వలె.

తాత్పర్యము.

ఆఱడుగుల పొడుగు గల యీ దేహమే నేనను నజ్ఞానము గలవాఁడు ఆత్మలక్షణ మెఱిఁగి యీ దేహము నేను గాను, నే నణుస్వరూపుడను అని తన యథార్థ స్వరూపజ్ఞానమున నిలిచినట్లు త్రివిక్రమావతారంబున బలి నణఁగఁద్రొక్కి విష్ణువు మరలఁ దన స్వరూపమును గ్రహించినట్లు హనుమంతుఁడు తన స్వస్వరూపమును ధరించెను.

ఉత్సాహము. చారువివిధరూపధారి ♦ సాగరప్రతీరమున్
జేరి దుర్జయుండు పూని♦నైజరూపుఁ గార్యమున్
సారె దలఁచి తనదురూపుఁ ♦ జక్కఁ జూచి కేతకే
లారుహాళి సొంపు సింపు ♦ లంబభూధరంబునన్. ౧౩౦

అర్థములు. చారు వివిధరూపధారి=మనోహరమై యనేక విధములైన రూపములు ధరించువాఁడు, ఇచ్చటనే గాక యింతకుఁ బూర్వము కూడ హనుమంతుని రూపము సుందర మనియే చెప్పఁబడెను. హనుమంతుఁడు సుందరుఁడగుటను, సీతాదేవి సుందరి యగుటను సుందరశ్చ, సుందరీచ = సుందరౌ యని యేకశ్లేషచే వీరికి సంబంధించినది కావున దీనికి సుందరకాండ మని పేరు పెట్టఁబడెనేమో! సాగరప్రతీరమున్=సముద్రపు టావలి యొడ్డున 'ప్రతిముఖే స్థితం తీరం ప్రతీర' మ్మని వ్యుత్పత్తి. దుర్జయుఁడు=జయింపరానివాఁడు, నైజరూపు=తన సహజ స్వరూపమును, కేతక+ఇలారుహాళి=మొగిలిచెట్లు, లంబ భూధరంబునన్=లంబ పర్వతమునందు.

ఉత్సాహమునకు నేడు సూర్యగణములు, నొక గురువు. ఐదవ గణము మొదటి యక్షరము యతి. హనుమంతుని యుత్సాహము దెలుప నుత్సాహము వ్రాయఁబడెను.

పంచచామరము. సుకూటవాటికాగ్రసీమఁ ♦ జూచి దూఁకి యొద్దునన్
త్రికూటభూధరాగ్రసీమ ♦ దేవతాధిరాట్పురీ
నికాశమైన లంకనున్ వ♦నీసమూహరాజ పా
వకాత్మమిత్రపుత్రుఁడప్డు♦పాఱఁజూచెఁ జక్కఁగన్. ౧౩౨

అర్థములు. సుకూట వాటికాగ్ర సీమన్=మంచి శిఖర ప్రదేశముల కొనయందు, దూఁకి=దుమికి, ఆకాశమునుండి, త్రికూట భూధరాగ్ర సీమన్ = త్రికూటమను పర్వతము యొక్క పై భాగమందు, దేవతాధి రాట్ పురీ నికాశము= ఇంద్రుని పట్టనముతో సమానము, వనీ సమూహరాజిన్=వన సమూహములచేఁ బ్రకాశించు దానిని.

తా త్ప ర్య ము .

మంచి శిఖర ప్రదేశముల కొనను జూచి యొద్దున దూఁకి త్రికూట పర్వతము కొనయందు దేవేంద్రు పట్టనముతో సరియై వనసమూహములచేఁ బ్రకాశించు లంకను హనుమంతుఁడు పాఱఁజూచెను.

పంచ చామరమునకు జరజర జగలు, తొమ్మిదింట యతి, రామార్థమై సముద్ర లంఘనము చేసిన మహానుభావునకుఁ బంచచామరసేవ కవి చేసెను.

—♦ ౨-వ సర్గము. హనుమంతుఁడు లంకాపురి వెలుపలి యుద్యానంబుల నిహారించుట. ♦—

క. తరియింపరానిరత్నా,కరముం దరియించి సుఖము♦గాఁగఁ ద్రికూటో
ద్ధరశిఖరాగ్రంబునఁ గే,సరిసూనుఁడు లంకఁ గాంచి ♦ స్వస్థత నొందెన్. ౧౩౩

తా త్ప ర్య ము .

దాఁటుట కితరులకు సాధ్యముగాని సముద్రమును సుఖముగా దాఁటి త్రికూట పర్వత శిఖరంబున నుండు లంకఁగాంచి హనుమంతుఁడు కుదుటఁబడిన మనస్సుగలవాఁడయ్యెను.

హనుమంతుఁడు సముద్రమును నాకాశమార్గమున లంఘించె నని స్పష్టముగ రామాయణము చెప్పచున్నను నెగిరి దాఁటలేదు. ఈది పోయినాఁడని వాదించు మూఢులుకూడఁ గలరు.

క. లలితోద్యానస్థలముల, జలజలఁ బయి రాల్ప భూజ♦సంతానము పు
వ్వులు వలపులు వెదచల్లుచుఁ, బొలిచె న్వానరవరుండు ♦ పుష్పమయుండై. ౧౩౪

అర్థములు. లలిత+ఉద్యానస్థలములన్=మనోహరములయినతోఁటలయందు,

భూజసంతానము = చెట్లసమూహము, భూజ (సీత) యొక్క దుఃఖము బాపుటకై పోవు హనుమంతునిమీఁద భూజ సంతతి = పుష్పములు, చల్లుట సముచితమేకదా, వలపులు = వాసనలు.

తాత్పర్యము.

ఆరబయలఁ దిరిగిన రాక్షసులు చూతురను తలంపుతో నుద్యానవృక్షముల మాటునఁ దిరుగుచున్న యాంజనేయునిపై వృక్షములు జలజల పూవులు రాల్పఁగా వాని సువాసనల వ్యాపింపఁజేయుచుఁ బూలతోఁ నిండినవాఁడై యాయన యొప్పు చుండెను. పుష్పాభిషేకము శుభసూచకమే.

క. ఇట్టులు నూఱామడ యొక,పెట్ట వడిం దాఁటి బాహు♦విక్రమపరుఁడై
నిట్టూర్పైనను విడువఁడు, కొట్టఁబడఁడు గాసిఁ గీశ♦కుంజరుఁ డంతన్. ౧౩౪

తాత్పర్యము.

ఈ ప్రకారము నూఱుయోజనము లొక్కసారిగ నడుమ విశ్రమింపక బాహు బలముచేతనే వేగముగ దాఁటి హనుమంతుఁడు హుస్సబ్బాయని నిట్టూర్పైన విడి చిన వాఁడు కాఁడు. అలసిన వాఁడును గాఁడు. హనుమంతుఁడు నూఱు యోజనముల సముద్రమును దాఁటెనని స్పష్టముగ రామాయణమునఁ గలదు.

ఇప్పుడు సముద్రమంత వెడలుపు లేదు. కావున రావణాసురుని లంక యిది యగునా యని కొందఱ సందేహము.

"There is a place called *Nikumbhila* about 40 miles from Colombo. It is associated with a Jagna or sacrifice performed by *Indrajit*. The Asoka forest of Ravana where Sita is kept is still in existence and I was told by a Brahman of jaffna that there is an image of Sita, which is still worshipped. There is a rock in the waters at Point-de-Galle which goes by the name of Ravana Kotta." D. N. Gangli's trip to Colombo
Buddhist Text Society's Journal Vol. III. Pt. I. Ap. 2.

దీనివలన నింద్రజిత్తు హోమము చేసిన నికుంభిలయు సీతాదేవి యుండిన యశోక వనము నేఁటికి నున్నట్లును నందు సీతాదేవి పూజింపఁబడు చున్నదనియు రావణకోట యను స్థలమున్నట్లు స్పష్టమగు చున్నది. దీనివలన నిప్పటి సింహళ ద్వీపమే మునుపటి లంకయని నమ్మఁదగి యున్నది.

ఇప్పుడు సింహళ ద్వీపమునకు మన దేశమునకు నడుమ సముద్రము వెడలుపు అఱువది మైళ్ళే యున్నది. నూఱు యోజనము లెక్కడ? అఱువదిమైళ్ళెక్కడ నని సందేహము బాధింపకపోదు. యోజనము కొలఁత యెంతైనది నిష్కర్ష లేక యున్నది. కొన్ని చోటుల నాఁలుమైళ్ళు, కొన్నిచోటుల నెనిమిది మైళ్ళు, కొన్ని చోటుల రెండున్నర మైలున్నట్లు కొందఱు వ్రాసి యున్నారు. తెనుఁగున ఆమడయు కొన్ని దేశములఁ బదిమైళ్ళు, కొన్ని మండలముల నెనిమిది మైళ్లు కొలఁత గలదై

యున్నది. క్రోశమిట్టిదేయై యున్నది. ఇప్పటి మైళ్ళు (1760 గజములు మైలు అను పరిమాణము) గలవి పూర్వమందు లేవు. కావున యోజనమున కిన్ని మైళ్ళని నిర్ధారింప సాధ్యము కాకున్నది. ఇప్పుడు సముద్రము అఱువది మైళ్ళే యున్నను రామాయణ కాలమున సముద్ర మింత మాత్రమే కాదు. ఇప్పటి మధురకుఁ గొంచెము దూరములోనే దక్షిణమున సముద్రముండినది. సముద్రభాగము విశేషముగఁ బూడి యిప్పుడు నేల యైనది తన తచ్ఛాస్త్రవేత్తలు వ్రాసి యున్నారు.

"It thus appears that rocks and islets and fordable shoals existed in the channel, even at that time. The fect of connecting the gaps to construct a cause-way was not impossible with Sugriva, who had almost all the resources of Southern India at his command."

ఇప్పటి రామనాథపురమునకు దక్షిణభాగమంతయుఁ బూర్వము సముద్రముగానే యుండెను. కావుననే సుగ్రీవుఁ డంగదాదులకుఁ జెప్పునపుడు "పాండ్యకవాటావనిఁ బరికింపుఁడీ" యని చెప్పి వెంటనే "వననిధి తీరముం గదిసి" యని చెప్పెనుగాని యడవులఁగానికొండలఁగానియూళ్ళఁగాని చెప్పినవాఁడుకాఁడు. మఱియొకవిషయము. తూర్పుననుండు దీనితో సమానముగ బడమట నుండు నిప్పటి మళయాళదేశము తిరువాన్కూరు లోనైనది సముద్రమున మునిఁగియుండెననియు బరశురాముఁడు కోరఁగా సముద్రుఁ డా ప్రదేశమును నాయన కిచ్చెననియుఁ బురాణములఁ గలదు. కావున నిప్పటితిరువాన్కూరు పూర్వము సముద్రములో మునిఁగియుండెనేని యిప్పటి తిరునల్వెల్లి, మధురమండలమున దక్షిణభాగము సముద్రమున మునిఁగియుండుట యేమిచిత్రము ? అదియును గాక రామాయణమునఁ జెప్పఁబడిన త్రికూటము, లంబపర్వతము సువేల యనునవి లంకకు దక్షిణభాగంబున నున్నవికాని యుత్తర భాగంబున లేవు. కావున నిప్పటి లంకయందలి యుత్తరభాగముకూడ సముద్రమున మునిఁగియే యుండవలెను. లేదా హనుమంతుఁ డీ ప్రదేశమును విడిచి చక్కఁగా నచ్చటికైనఁ బోయి యుండవలెను. ఈ పర్వతముచుట్టు సముద్రము చెప్పఁబడెనేకాని నేల గ్రామము లున్నట్టు వాల్మీకి చెప్పలేదు. సువేల యను పదమే సముద్రతీర దేశమని తెలుపుచున్నది. లంకయందలి యిప్పటి యుత్తరపు రేవునకుఁ ద్రికూటమునకు నూఱుమైళ్ళకుఁ బైగా నున్నది. కావున హనుమంతుఁడు దాఁటినది రెండువందల యేఁబది మైళ్ళని యేర్పడుచున్నది. కావున నూఱు యోజనము లనఁగా రమారమి రెండువందల యేఁబదిమైళ్ళని గ్రహింపనగు. దీనివలన నిప్పుడు మహేంద్రనగము రామాయణమునకు సంబంధించిన మఱి కొన్ని ప్రదేశములు తీర్థవాసులచేఁ జూపఁబడునవి కృత్రిమము లని స్పష్టపడుచున్నది. ఇచ్చట నింకొక విషయ మాలోచింపవలసి యున్నది. అకంపనుఁడు శూర్పణఖ లోనగు రాక్షసులు లంకకుఁ బోవుచు వచ్చుచు నుండిరి. రావణుఁడు పంచవటి నుండి లంకకుఁ బోయెను. వీరి కార్యము

ప్రశంసింపఁబడలేదు. హనుమంతుని కార్యము మాత్రము ప్రశంసింపఁబడు చున్నది. ఏల ?

రాక్షసులు స్వభావమునఁ గామచారులు. వారు విద్యాబలముచేఁ బోవుచు వచ్చుచుండిరి. అది గొప్ప కార్యముగాదు. హనుమంతుఁడు కేవల భుజబలము చేతనే దాఁటినవాఁడు అని రామాయణమునఁ జెప్పఁబడెను. కావున నిది ప్రశస్తము. రావణాసురుఁడొక ముసలిగ్రద్ద యడ్డము రాఁగానే తికమకలాడెను. హనుమంతుఁడు మూఁడు గండములు తప్పించుకొనెను. హనుమంతుఁడు సంజీవనికై పోయిన దూరము చూచినపు డిది యొక లెక్క గాదు. తరువాతఁ జేసినది యసాధ్యకార్యము.

ఉ. ఆమడ లెన్ని వే లయిన ♦ నశ్రమలీలఁ దరింప నేర్తు నూ
ఱామడ యేమి లెక్క యని ♦ యాత్మఁ దలంచుచు మంజువాసనా
స్తోమము నింపుతోఁటలును ♦ జొక్కపుఁబచ్చికపట్లు స్వల్పపుం
భూమిధరంబులు న్గనుచుఁ ♦ బోయి నగాగ్రమునుండి కన్గొనెన్. ౧౩౬

అర్థములు. మంజువాసనాస్తోమము = మనోహరమైన పరిమళముల సమూహము.

తాత్పర్యము.

ప్రయాసము లేక యెన్నివేల యామడ లయిన దాఁటఁగలను. నూఱామడ లక్ష్యమా యనుకొనుచుఁ బరిమళించు తోఁటలను నిర్మలమైన పచ్చిక ప్రదేశములను జిన్న చిన్న గుట్టలను జూచుచుఁ బోయి హనుమంతుఁడు కొండమీఁదినుండి చూచెను.

ఉ. గోఁగులు దేవదారులును ♦ గొండవిసెల్ చిఱునిమ్మ మల్లియల్
రేఁగు లరంట్లు గన్నెరులుఁ ♦ బ్రేంకణముల్ కడుముల్ మొగళ్లునున్
పోఁగఁగ బూచి కాచి యర♦విచ్చిన మొగ్గలఁ బూపపిందెలన్
ప్రేఁగున నేలఁ బ్రాఁకు పృథి♦వీరుహపాళులు నాటతోఁటలున్. ౧౩౭

అర్థములు. పూప పిందెలు = లేఁతపిందెలు, ప్రేఁగున = బరువుచే, పృథివీరుహపాళులు = చెట్లవరుసలు, ఆటతోఁటలు = ఉద్యాన వనములు; (తాత్పర్యము, స్పష్టము.)

క. రెమ్మలుఁ గొనకొమ్మలుఁ బవనమ్మునకుఁ జలించు నవియు ♦ నవ్యములు శకుంతమ్ములు నిండఁగఁ గడుహృద్యమ్ములు నగు పాదపముల♦ హనుమఁడు గాంచెన్.

అర్థములు. శకుంతమ్ములు = పక్షులు, కడున్ = మిక్కిలి, హృద్యమ్ములు = మనోహరములు, పాదపములన్ = చెట్లను.

తాత్పర్యము.

గాలికిఁ గదలు రెమ్మలు కొనకొమ్మలు క్రొత్తలై చూడ నింపైన పక్షులు గల వృక్షముల హనుమంతుఁడు చూచెను.

హనుమఁడు = హనుమచ్ఛబ్దతత్సమము. హనుమ, హనుమఁడు తద్భవము అనుమ, అనుమఁడు.

ఉ. అంచలుఁ గన్నె తేళ్లు నళి♦నావళి కల్వలచాలు లొప్ప న
భ్యంచిత మైన డిగ్గియలు ♦ నైకవిధంబులు నాటపట్టులున్
మంచిమడుంగు లెల్లపుడు ♦ మానక పూచుచుఁ గాచుచెట్లచే
మించువనాళిఁ బద్మముల♦మేలిమి గన్న యగడ్తలుం గనెన్. ౧౩౯

అర్థములు. నళినావళి=కమలముల గుంపులు, డిగ్గియలు = దిగుడు బావులు, నైక విధంబులు =అనేక విధములగు.

తాత్పర్యము.

హంసలు, కన్నెతేళ్ళు కమలములు కలువలు గల దిగుడు బావులును అనేక విధములైన క్రీడాస్థలములును మంచి మడుఁగులు, ఎప్పుడు పూచు కాచు చెట్లు గల తోఁటలు కమలములచే నిండిన యగడ్తలు హనుమంతుఁడు చూచెను.

సీ. సీతను ముచ్చిలిం♦చినకారణంబున, రావణుం డెంతయు ♦ రక్ష నునుప
నెల్లచోటుల మార్గ♦ణేష్వాసపాణు లై, నడయాడు రాక్షస♦నాయకులును
గనకమయంబు ప్రా♦కారంబు చుట్టంగ, గ్రహముల శారదా♦భ్రముల నెనయు
నగుగృహంబులు పాండు♦రాంచత్ప్రతోళులు, నట్టశతము వైజ♦యంతిపంక్తి
తే. వింత లగుపైడితీఁగల ♦ వేడ్కఁగొలుపు, తోరణంబులు గలిగి ని♦స్తుల్య మగుచు
గగనమున స్వర్గ మనఁగ లం♦కాపురంబు, కొండశిఖరంబుపేటున ♦ నుండుఁ కతన.

అర్థములు. మార్గణ+ఇష్వాస+పాణులై=బాణములు విండ్లు చేత ధరించినవారై, నడయాడు సంచరించు, శారదాభ్రముల=శరత్కాలమేఘములను, ఎనయు=సరిపోవు, పాండుర=తెల్లని, అంచత్=ప్రకాశించు, ప్రతోళులు=పెద్దవీధులు, అట్టశతము = ప్రాకారములపై యుద్ధార్థము కట్టఁబడిన యెత్తుప్రదేశము లనేకములు, వైజయంతి పంక్తి=టెక్కెముల వరుస, పైడితీఁగలన్=తీఁగలవంటి బంగారురేఖలచే.

తాత్పర్యము.

సీతను దాను దొంగిలించి తెచ్చిన కారణముచే రావణుఁడు మిక్కిలిగఁ గాపుంచఁగా సమస్తప్రదేశముల విల్లు బాణములు ధరించి తిరుగు రాక్షసశ్రేష్ఠులును బంగారు మయమైన ప్రాకారము చుట్టుకొనఁగా గ్రహములను శరత్కాలమేఘములను బోలు నిండ్లును తెల్లని పెద్దవీధులును, నూర్లకొలఁది యట్టములును వానిమీఁద ధ్వజములును తీఁగలవలె బంగారుతోఁ జేయఁబడిన తోరణములు గలదై యసమానమై యాకాశమున వేలు స్వర్గమో యన్నట్లు లుండు లంకాపురము కొండశిఖరముపేటున నుండుటచే.

అయోధ్యకు సాకేత మను పేరు లంకకు సింహళ మను పేరు ఇటీవలఁ వచ్చినవేకాని ప్రాంతపేర్లుకావు. లంకకు సింహళ మను పేరువచ్చిన కారణము, అది యిప్పుడు సిలోన్ అయిన కారణ మిట్లు చెప్పఁబడెను.

"In the seventh century of our era, Ceylon was known by the name of Seng. kia-lo or Sinhala, which was said to be derived from the lion-descended Sinhala, whose son Vijaya is fabled to have conquered the island on the very day of Buddha's death, in B. C. 543..................Its existence was first made known to the European world by the expedition of Alexander, under the name of Taprabane...............The true form however would appear to be Tambapanni or red-leaved from the Sanskrit Tampra-parni. Ptolemy calls the island Salika (corrupt from Simhalaka). Ammianus calls it Serendives, which is the same as the Sieladiba of Kosmas, derived Sihala-dipa, the Pali form of Simhal dvipa. Abe Rahin gives the form Singal-dip, or Sirindib, which is the Serendib of European Sailors. From the same source came the Arabic Lilan and our own Ceylon" Com, Geo. An. India P. 557.

—♦ హనుమంతుఁడు లంకఁ జూచుట. ♦—

ఉ. వ్రేలెడి నే మొకో గగన♦వీథి నటం చన నొప్పుదాని, నీ
లీల నభంబునందు నవ♦లీలగ నేగుచు నున్న దేమొ నాఁ
జా లగుదాని, సంతతని♦శాచరనాయకగాఢరక్షితం
బై లలి మీఱు పట్టనవ♦రాద్యము దుర్గచయానవద్యమున్. ౧౮౧

అర్థములు. సంతత=ఎడఁదెగక, నిశాచరనాయక=రావణునిచే, గాఢ=మిక్కిలి, రక్షితంబు=కాపాడఁబడునది, పట్టనవరాద్యము=శ్రేష్ఠమైన పట్టనములందు మొదటిది, దుర్గచయ=కోటల సమూహములచే, అనవద్యము=లోపములేనిది.

తాత్పర్యము.

ఆకాశమున వ్రేలాడుచున్నదో, యాకాశమున నవలీలగా నెగిరిపోవుచున్నదో యన్నట్టులుండు దానిని, రావణుఁడు విడువని కాపు పెట్టుటచే రక్షింపఁబడుచుఁ గోటల లోపములేక గొప్ప పట్టనములందు మొదటిదని యెంచఁబడఁదగిన దానిని.

క. తొలుదొల్తఁ గుబేరునకున్, నిలయంబై యున్నదాని♦నెఱి యిట్లనుచున్
దలఁపున నైనను నెన్నఁగ, నలవిపడనిదాని సుకృత♦మై స్పష్టంబై. ౧౮౨

అర్థములు తొలుదొల్తన్ = మొట్టమొదట, నిలయము = వాసస్థానము, నెఱిన్ = అందమునందు, సుకృతమై = చక్కఁగా నిర్మింపఁబడినదై, విశదమై.

తాత్పర్యము.

తొలుత విశ్వకర్మచే నిర్మింపఁబడి కుబేరునకుఁ దొలుత వాసస్థానమై యందమున నిట్టిదని మనస్సుచేనైన నూహింపరానిదై యున్నదానిని.

క. ప్రాకారజఘనయును న,స్తోకజలనవీనపటయు♦శూలఁగురుశత
ఘ్నీకుంతలపాశయు న,ట్టాకలితవతంస యగుచు♦నంగనకరణిన్. ౧౮౩

అర్థములు. ప్రాకార జఘన=ప్రాకారమనెడి మొలగలది. అస్తోక=అధికమైన, జల=అగడ్తయందలి నీళ్లనెడి, నవీనపటయు = క్రొత్తచీరగలది, శూల గురు శతఘ్ని కుంతలపాశయు=శూలములు గొప్పశతఘ్నులనెడి కొప్పుగలది, పాశశబ్దము క్షత్రాది శబ్దములకుఁ బరముగా నుండెనా నిందను దెలుపును. క్షత్రపాశుఁడనఁగా క్షత్రియాధముఁ డని యర్థము. కర్ణశబ్దము పైనుండెనేని బంగారుసొమ్మని యర్థము. కర్ణపాశము అనఁగా కర్ణభూషణము, కచము కేశము కుంతలములకుఁ బరముగా నుండిన కొప్పని యర్థము. కచపాశము, కేశపాశము, కుంతలపాశము అనఁగాఁ గొప్పు. అట్ట+ఆకలిత+వతంస=అట్టములచేతఁ జేయఁబడిన శిరోభూషణముగలది. అట్టములే శిరోభూషణములని భావము. ఇట్టి దగుటచే స్త్రీవలెను నున్నదని భావము.

తాత్పర్యము.

కోట గోడ యను మొలయు దానిని జుట్టి యగడ్తల నీళ్ళనెడి చీరయు శూలములు శతఘ్నులు అనెడి కొప్పును అట్టములనెడి శిరోభూషణము గలిగి స్త్రీవలెనై.

ఉ. తీరుప విశ్వకర్మయు మ♦దిన్ సురవైరులచేత వాయుభు
గ్వారముచేత భోగవతి♦కైవడి నొప్పు పురంబునుత్తర
ద్వారముఁ జేరి రౌప్యధర♦తద్విధి మింటిని రాయు నున్నతా
గారము లొప్ప భీకరవి♦కారసురారిచమూసమూహముల్. ౧౭౪

అర్థములు. తీరుపన్ = నిర్మాణము చేయఁగా, వాయుభుక్+వారము = పాముల సమూహము, భోగవతి=పాతాళములోని సర్పముల ముఖ్యపట్టనము, రౌప్యధర తద్విధిన్=వెండికొండవలె, ఉన్నతాగారములు=ఎత్తైన యిండ్లు, భీకర=భయము కలిగించు, వికార సురారి = అసహ్యములైన రూపములు గల రాక్షసుల, చమూసమూహముల్ =సేనల గుంపులు.

తాత్పర్యము.

విశ్వకర్మ నిర్మింపఁగాఁ బాములచే నిండిన భోగవతివలె రాక్షసులచే నిండిన లంకానగరము నుత్తర ద్వారముఁ జేరి కైలాశ పర్వతమువలె నాకాశమును దాఁకుచున్న యెత్తైన యిండ్లు గలిగి భయంకరాకారములు గల రాక్షస సేనా సమూహములు.

ఉ. పట్టిసశూలపాణు లయి.పాములు పెన్గుహఁ గాచు భంగిగా
నెట్టన కాచులంకను వి♦నిర్మలమై సొబగారు లంకరున్
బెట్టనికందకం బనఁగఁ♦బేర్మి నెసంగు మహార్ణవంబునున్
జుట్టును జూచి నిర్జరని♦షూదను రావణుశౌర్య మెంచుచున్. ౧౭౫

అర్థములు. పట్టిస శూల పాణులయి=అడ్డకత్తులను శూలములను జేతియందు

ధరించి, పెట్టని కందకంబు=మనుష్యులు నిర్మింపని యగడ్త, మహార్ణవము=పెద్ద సముద్రము, నిర్జర నిషూదను= దేవతల హింసించిన వానియొక్క.

తా త్ప ర్య ము .

చేతులందు నడకత్తులు శూలములు ధరించి పాములు గుహనుగాచు విధముగ రాక్షసులు కాచుచున్న లంకను, దానికి మనుష్యులు నిర్మింపని యగడ్తయై చుట్టి యుండు పెద్ద సముద్రమును జూచి దేవతల జయించిన రావణుని శౌర్య మింతదిగదా యని తలంచుచు తనలోఁ దా నిట్లనుకొనుచున్నాఁడు.

—♦ హనుమంతుఁడు లంకను జూచి నివ్వెఱగొనుట ♦—

క. ఏలీలఁ గపులు వత్తురు, వాలాయము వచ్చి రేని ♦ వ్యర్థశ్రము లై
తూలఁగలవారు తరమే, యీ లంకన్ వేల్పుగముల ♦ కేనియు గెలువన్. ౧౯౬

అర్థములు. వాలాయము=నిర్బంధముగ.

తా త్ప ర్య ము .

ఈలంకకు వానరులందఱు నేవిధముగ రాఁగలరు. ఇంత సముద్ర మందఱు దాఁటి రాఁగలరా? ఒకవేళ నిర్బంధముగా రాఁగలరని తలంచినను వారి ప్రయాసము వ్యర్థమై వారు చిన్నపోవలసినవారే. ఏలన నీ లంక దేవతాసమూహముల కైన గెలువ సాధ్యమా? కాదు.

క. అనుపమబలుఁ డారాముఁడె, చనుదెంచియు నిటకు నేమి ♦ చలుపం గలుగున్
ఘనదుర్గము విషమము రావణపాలిత మైన నగర♦వర్యము లంకన్. ౧౯౭

తా త్ప ర్య ము .

వానరుల మాట యటుండ నీ యసమానబలుఁ డగు రామచంద్రమూర్తియే యిచ్చటికి వచ్చినవాఁ డనుకో, వచ్చి ప్రవేశింపరాని సంకటస్థలమందుండి రావణుఁడు రక్షించు లంక నేమి చేయఁగలఁడు?

ఉ. మంచితనంబుమాటలకు ♦ మానుగ లే దవకాశమేనియున్
లంచము లిత్తమన్న విఫ♦లంబ యగున్, మఱి వారిలోనఁ గ
ల్పించి పరస్పరంబుఁ గడు♦వేఱిమి చూడ నసాధ్య, మెంత యో
జించిన రాక్షసానళులఁ ♦ జివ్వను గెల్వ నశక్య మెరికిన్. ౧౯౮

అర్థములు. అవకాశము=ఎడము, వేఱిమి=భేదము, చివ్వను=యుద్ధమందు.

తా త్ప ర్య ము .

మనలో మనకేల విరోధము సీత నీయుఁడని మంచి తనముగా మాటలాడు టకు సందులేదు. మంచిమాటలకు వీరు చెవి నిచ్చువారు కారు. ఏలన బల మదోన్మత్తులు సామమునఁ జక్క బడుదురా? అదిగాక దానముచే వశపఱచుకొంద మనిన లంచము లిచ్చుటయు వ్యర్థమే. ఏలన ధనకాంక్ష గలవారుగదా లంచము

లాశింతురు. వీరి కైశ్వర్యము పుష్కలముగా నున్నది. ఒకరి డబ్బుతో వీరికేమిపని? ఒకవేళ యిత్తమన్నను నింతకంటె నెక్కువ యైశ్వర్యము రామచంద్రునొద్ద నేమి గలదు? అటుగాకున్న భేదోపాయముచే వారిలో వారికిఁ గలహము పెట్టుదమన్న నదియు నసాధ్యమే. ఏలన భేదములు కల్పించుటకు వారి మర్మములు లోపాలోప ములు ముందు తెలియవలె. వారిలోఁ గొందఱు పరిచితులు కావలె. వీరి మర్మము లెఱుంగు టెట్లు? అవి తెలిసికొనుటకు వీరిలోఁ గలసిమెలసి యుండు టెట్లు? అది యెన్నాళ్ళకార్యము? నన్నుఁ జూడఁగానే యందఱు నేకకలహమునకు వత్తురేకాని యూరక యుండనిత్తురా! కావున భేదోపాయము వ్యర్థమే. పోనీ యుద్ధములో గెల్త మనిన నెంత యోజించినను నదియు సాధ్యముకాదు. ౧౦౭ పద్యము చూచునది. క్రమక్రమముగ నభిప్రాయ మెట్లు మాఱెనో తెలియును.

క. నీలుం డంగదుఁ డేఁ మతి,శాలి ప్రభువు సూర్యసుతుఁడు ♦ జలనిధి దాఁటం
గా లంకాపురిఁ జేరఁగ, జాలెద మా మాత్ర నేమి♦సాధ్యము సేయన్. ౧౪౯

తా త్ప ర్య ము.

ఏ యుపాయము చేయుటకైన నిచటికి రాఁగలవా రెవ్వరు? నీలుఁడు, అంగ దుఁడు, నేను, బుద్ధిశాలి ప్రభువు సుగ్రీవుఁడు యీ నలుగురము సముద్రము దాఁట గలము. లంకకు రాఁగలము. ఈ నలుగురితో నే కార్యము కాఁగలదు?

క. ఇంతకు శ్రీరఘురాముని, కాంతామణి జీవయుతయొ ♦ కాదో యీ వృ
త్తాంత మెఱిఁగి సీతను గని, చింతించెదఁ గాక యవలి♦చేఁత తెఱంగుల్. ౧౫౦

తా త్ప ర్య ము.

ఇంతకు నీ లంకను సాధించు నుపాయ మిప్పుఁ డాలోచించి యేమి చేయుదును? ఇందు సీత యున్నదో లేదో, ఉండినఁ బ్రాణముతో నున్నదో లేదో? ఆ విషయము నిశ్చయము చేసికొనికదా యావల సీతాదేవి యుందుండిన లంక సాధించు నుపాయ మాలోచింపవలె. ఇప్పుడు నేను జేయవలసిన యాలోచన యదికాదు. సీతాదేవి నెట్లు చూతునా యాలోచింపవలె. ఆ నిమిత్తమై లంకలో నెట్లు ప్రవేశింపవలె. ఇది నేను జేయవలసిన యాలోచన.

—♦ హనుమంతుఁడు లంకలోఁ జొచ్చు నుపాయంబు యోజించుట. ♦—

సీ. ఎటులు ప్రవర్తింప ♦ నెంతయు మే లగు, రామునికార్య మా♦క్రమముఁగూర్చి
శృంగాగ్రసీమ నా♦సీనుఁడై యొక్క ముహూర్తంబు చింతించి ♦ యుగ్ర మిట్టి
రూపంబుఁ దాలిచి ♦ క్రూరరాక్షసమహా,వాహినీగుప్తమై ♦ వఱలు లంకఁ
జొఱఁగ నసాధ్యంబు ♦ సురవైరు లందఱు, వీర్యవంతులు మహా♦భీమబలులు
తే. జానకిని రోయుచోట నీ♦సర్వదైత్య,తతుల వంచించి విదితావి♦దితములైన
వేషములఁ గొని మాపటి♦వేళయందుఁ,జొచ్చి కార్యంబుఁ దీర్పఁగ ♦ వచ్చునాకు.

అర్థములు. మహావాహినీ గుప్తము=గొప్పసేనచే రక్షింపఁబడినది, విదితా విదితములు=వెలికిఁ దెలియవచ్చినవి తెలియరానివి.

తా త్ప ర్య ము .

నే నే యాలోచన చేసినను రామచంద్రమూర్తి కార్యము మేలగునో యట్టి యాలోచన చేయవలె. ఆ విధముగా నడువవలె. అది యెట్లగునా యని శిఖరము కొనభాగమునఁ గూర్చుండి కొంచెమునే పాలోచించి లంకలోకిఁ బోకతప్పదు. ఎట్లు పోదును ? ఈ భయంకరరూపముతోఁ గ్రూరు లగు రాక్షసులసేనలచే రక్షింపఁబడు లంకఁ బ్రవేశించుటే యసాధ్యమగును. నన్నుఁ జూడఁగానే కలహమునకు వత్తురు. లోపలికి రానిత్తురా ? రానీయరు. జయించి పోద మనిన నందఱు రాక్షసులు మహా బలపరాక్రమములు గలవారు. కావున బహిరంగముగాఁ బోవుట నీతిగాదు. వీరికిఁ దెలియ రాకుండునట్లు వీరిని వంచించి లోపలికిఁ బోయి కానఁబడవలసిన చోటఁ గానఁబడుచు, గానఁబడరాని చోటులఁ గానరాకయుండు వేషముల ధరించి రాత్రివేళ కార్యము చక్కఁ జేసికొనుట బాగు.

వాలి వధవిషయమున రామచంద్రు నధిక్షేపించు మహానుభావులు హనుమంతుఁడు పిఱికి, మోసగాఁడు, దానివలన నిట్టి కుటాలోచన చేసెను. పౌరుష శాలియైన బహిరంగముగా నున్న రూపునఁ బోఁడా యని యేలొకో యింకను నాక్షేపింప కున్నవారు. ఈ విషయము ముందు వ్రాయఁబడును.

మ. అని చింతించు, దురాసదం బయినదై త్యాధీశు తత్పట్టనం
బును దా నట్లె గనుంగొనుం, బిదప నూర్పుల్ పుచ్చుఁ బల్మాఱు, నా
హనుమానుం డెటు కన్నుఁ బ్రామి ఖలు ర క్షోధీశు, ధాత్రీసుతన్
గనఁగా నౌ నొకో యొంటిదాని, నెటు లేఁ గార్యంబు సాధింతునో. ౧౫౨

అర్థములు. దురాసదము=ప్రవేశింప రానిది, ఊర్పుల్ పుచ్చున్=నిట్టూర్పులు విడుచును, అంత సముద్రము దాటి నిట్టూర్పు విడువని వాఁడిప్పుడు నిట్టూర్పులు విడుచుటచే దానికంటె నిది కష్టతర కార్య మని యాయనకుఁ దోఁచెను. కనుబ్రామి= కన్నులు మూసి=మోసగించి,

తా త్ప ర్య ము .

ఈ ప్రకార మాలోచించును. ప్రవేశింప సాధ్యముగాని యా రాక్షసేశ్వరు నగరమును దా నూరక తెప్పవాల్పక చూచును. చూచి చూచి మిగులఁ గష్ట కార్య మని తోఁపఁగా బలుమాఱు నిట్టూర్పులు విడుచుచు రావణాసురుని కన్నులలో నెటులు మిరపపొడి కొట్టి కన్నులు మూసి మోసగింతును ఒంటరిగా నుండు సీత నే నెట్లు చూడఁగలను. నే నెట్లు లీకార్యము సాధింపఁగలను ?

క. ఐనట్లు తోఁచు పను లేన్, భానునిఁ గనుఁగొన్నతమము పగిదిం జెడెడున్
వానిని దేశము కాలము, జ్ఞానము లేనట్టి దూత సలుపఁ గడఁగినన్. ౧౫౩

తాత్పర్యము.

కాలదేశముల జ్ఞానములేక యేకాలమున నే దేశమున నెట్లు ప్రవర్తింపవల యునో యోచింపక పనిచేయు దూత యతని జ్ఞానహీనతచే నక్రమప్రయత్నముచే సాధ్య మని తోఁచిన పనికూడ సూర్యుని యెదుట చీఁకటి చెడునట్లు చెడఁజేయును.

క. దీని నిటు సల్ప సఫలం,బౌ నని ప్రాజ్ఞులు విధించి♦నట్టిది కార్యం

బైనను జెఱుచును బండిత,మాని యయినదూత శక్తి♦మంతుఁడు గామిన్. ౧౫౩౧

అర్థములు, పండితమాని = పండితుఁడు కాకున్నను దాను బండితుఁడ నని తలఁచువాఁడు.

తాత్పర్యము.

ఈ కార్య మీ ప్రకారము చేసినఁ దప్పక ఫలించునని బుద్ధిమంతులు నిశ్చ యించి విధించిన కార్యము కూడ పండితమాని యగువాఁడు కార్యము చేయు సామర్థ్యము లేనివాఁడై కార్యమును బ్రాజ్ఞుల యాలోచనమును గూడ విఫలము చేయును. నే నెట్లు కార్యము సాధింతును? ఈ నింద నా కెట్లు రాకుండును? అని హనుమంతుఁడు మఱియు నాలోచించు చున్నాఁడు.

దూతం చైవ ప్రకుర్వీత, సర్వశాస్త్రవిశారదమ్
ఇంగితాకార చేష్టజ్ఞం, శుచిం దక్షం కులోద్గతమ్.

ఐహికాముష్మిక శాస్త్రముల నెల్ల నెఱిఁగిన వాఁడును, ఇతరుల మనస్సు నెఱుఁగుమాటల నేర్పు స్వభావము ఆకారము చేష్టలు మొదలగువాని సంజ్ఞలు నెఱిఁగిన వాఁడును, అర్థదాన స్త్రీ విషయంబులఁ బరిశుద్ధుఁడును, నేర్పరియు, సద్వంశమునఁ బుట్టినవాఁడును, నగు వానిని దూతగాఁ బంపవలెను.

'అనురక్తః శుచి ర్దక్షః స్మృతిమాన్ దేశకాలవిత్ వపుష్మాన్ వీతభీర్వాగ్మీ దూతో రాజ్ఞః ప్రశస్యతే' అందఱయం దనురాగము గలవాఁడును, ధన స్త్రీ విష యంబుల శుచియును నేర్పరియు జ్ఞప్తిగలవాఁడు దేశకాలముల నెఱిఁగినవాఁడు చక్కని దేహముగలవాఁడు భయములేనివాఁడు మాటలయందు నేర్పరియగువాఁడు దూతగా నుండఁదగును. ఇన్నిగుణములు హనుమంతునందుఁ గల వనుట యా యా సందర్భముల నెఱుఁగనగు. మను ౭-౬౩-౬౪ శ్లో.

సీ. కార్య మేరీతిని ♦ గావింప మే లగుఁ, దెలివి పాయక యెట్లు ♦ దీర్పఁ గలనొ
లవణార్ణవంబును ♦ లంఘించు టది యెల్ల, నే రీతి వ్యర్థమై ♦ యేగ కుండుఁ
జూచిరా నన్ను నీ♦సురవైరు లంతతోఁ, గాకుత్స్థు కార్యంబు ♦ గాకు చెందు
నసురరూపముఁ గొన్న ♦ నైన గుర్తింతురు, పరరూపములమాటఁ ♦బలుక నేల
తే. రాక్షసాళికిఁ దెలియంగ♦రాక యుండు,నట్టి దొకటియు లేదు య♦థార్థ మింపు
గాలి యైనను వీరలు ♦ కాన కుండ, మలయ నసుమాట కల్ల నా♦మతికిఁ జూడ.

అర్థములు. కాకుచెందుట = వ్యర్థమగును.

తాత్పర్యము.

ఏవిధముగఁ గార్యము చేసిన నా ప్రయత్నము సఫలమగును. ఈపగటి వేళనే ప్రవేశింతురా? రాత్రివేళఁ బ్రవేశింతునా? ఈరూపముతోఁ బ్రవేశింతునా? రూపము మార్తునా? దీనిని వివేకము చెడకుండ నెట్లు నెఱవేర్పఁగలను? ఏ విధముగ నేను బ్రవర్తించిన సముద్రము దాటివచ్చుట వ్యర్థము కాకుండును. ఇట్లు దాఁటివచ్చిన వాఁడ నేకార్యము చేయక యెట్లుండవచ్చును? ఇప్పుడే యీ రూపముతోనే పోదునా? నన్ను రాక్షసులు చూచిరా రామకార్యము సీతను వెదకుట యనునది చెడి పోవును. రాక్షస రూపము ధరించి పోదునా? లంకలోని వారందఱు వారికిఁ దెలిసినవారే. వీఁడెవఁడో క్రొత్తవాఁడు వచ్చినాఁడని శోధించి బాధించి వాస్తవము నెఱుఁగఁ గలరు. ఇఁక మఱియొక రూపముతోఁ బోయిన వారు తెలిసికొనుటయందు సందేహమేమి; ఇప్పుడు నేనే విధముగఁ బోయినను రాక్షసులకుఁ దెలియనిది లేదు కావున నవశ్యము తెలిసికొందురు. ఈ రాక్షసులకుఁ దెలియకుండ గాలియు లంకలో సంచరింపలేదని నా యభిప్రాయము. అంత హెచ్చరిక గలవారై యున్నారు.

క. నా యాకృతితో నిచ్చట, నే యుండినయట్లులైన♦నేఁ జెడుట నిజం
బాయనఘరామకార్యము,పాయంబును బొందుఁ గానఁ♦బని యది యగునే.

తాత్పర్యము.

ఇప్పుడు లంకలోనికిఁ బోవలను. ఈ రూపముతో నిచ్చటనేయుందునా? అట్లున్నను వారెవరైన నన్నుఁ గనిపెట్టుదురు. నాకు వారు గానవచ్చినప్పుడు నేనువారికిఁ గానరాకుందునా? కావున వారికి నేఁ గనబడుటే నిజము. వారిచ్చటికి వచ్చుటే నిజము. నేను, రామకార్యముకూడఁ జెడుట నిజము. కావున నది సరియగు కార్యము కాదు.

ఉ. కావున నిర్లు గ్రమ్ముడును♦గైకొని గుజ్జుప్లవంగరూపముం
రావణుపట్టనంబును దు♦రాసదముం వెసఁ జొచ్చి యందు ర
క్షోవసథంబుల న్నెమకి♦యా జనకాత్మజ, రామకార్యసం
భావన మీఱువాఁడ నని♦పావని దాఁ దలపోసి యాత్మలోం. ౧౪౭

అర్థములు. ఇర్లు=చీఁకట్లు, గుజ్జు=పొట్టి, ప్లవంగరూపము=క్రోతి యాకారము, రక్షోవసథంబులం = రాక్షసులయిండ్లను, నెమకి= వెదకి.

తాత్పర్యము.

ఇప్పు డీ రూపములతో లంకలోనికిఁబోవుట తప్పు. ఇక్కడ నుండుట తప్పు. కావునఁ జీఁకటి క్రమ్మువఱకు నిందే మాటుననుండి యావలఁ బిల్లక్రోతినై సులభముగఁ జొరరాని రావణుపట్టణంబునఁ బ్రవేశించి సీతను రాక్షసుల యిండ్లయందు వెదకెదను. అట్లైన రామకార్యము చేసినవాఁడనను గౌరవముచే నతిశయింపఁగలను, అని హనుమంతుఁడు తనలోఁ నాలోచించి.

తే. ఎప్పు డెప్పుడు గ్రుంకునో♦యీదినేశుఁ
డెప్పు డెప్పుడు వైదేహి♦నేను జూతు
ననుచు నెదురు చూచుచు నుండ♦న స్తమించెఁ
బద్మినీబాంధవుం డంతఁ♦బశ్చిమాద్రి. ౧౫౯

అర్థములు. పద్మినీ బాంధవుఁడు=సూర్యుఁడు, సూర్యుఁడు పద్మినీ బాంధవుఁడగుటచేతను సీతాదేవి పద్మిని యగుటచేతను నే నింక నుండిన నామె కార్యము నెఱవేఱదని తలఁచి సూర్యుఁ డస్తమించెను.

తాత్పర్యము.

ఆలోచన కుదురుటచే నిఁక నా యాలోచన కార్యరూపముగఁ బరిణమింపఁజేయఁ దొందర పడుచున్నాఁడు. ఎప్పు డీ సూర్యుఁడు గ్రుంకునా ఎప్పుడు నేను సీతను జూతునా యని ప్రొద్దుగ్రుంకుట కెదురుచూచుచుండఁగా సూర్యుఁడు పడమటి కొండపై నస్తమించెను.

౮ వ పద్యమందుఁ దూర్పు తిరిగి సూర్యునకు సమస్కరించి హనుమంతుఁడు లంక దాఁట యత్నించె ననుటచే నుదయ మెనిమిది గంటల ప్రొద్దైన నైయుండవలెను. అభిజిత్తునందు బయలు దేఱె నాఁడనినచో మధ్యాహ్నము నీడ ౬౧ వ పద్యమునఁ జెప్పినంత యుండఁజాలదు. పడమటి సూర్యుని జెప్పుదుమా యనిన నంత నీడ పడుటకు నాలుగుగంటల ప్రొద్దైన నైయుండ వలయును. తీరమున దిగి వనములందు సంచరించి కొండయెక్కి యింత యాలోచన చేసినను ఇంకను బ్రొద్దు గ్రుంకలేదని చెప్పుటచేఁ దీరమున దిగునప్పటికి నాలుగు గంటల ప్రొద్దైయుండును. కావున నుదయ మెనిమిది గంటలకు బయలుదేఱె నాలుగు గంటలకుఁ దీరమున దిగెనని చెప్పవచ్చును. అటయిన నెనిమిది గంటల కాలము సముద్రము దాఁటుట యందుఁ బట్టెనని యెంచనగు. ఇందొక గంటకాలమైన విఘ్నములచే వ్యర్థమైయుండు ననుకొన్నను నేడు గంటలకాలములో రెండువందల యేఁబది మైళ్ళు ప్రయాణించెనని [illegible]ంచనగు. అనఁగా సరాసరి గంటకు నధమపక్షమున ముప్పదియాఱు మైళ్ళు పోయెనని చెప్పనగు. ఇదిగొప్పగాదు. మరలి వచ్చునప్పు డింతదూర మొక గంటలో వచ్చెను.

తే. సూర్యుఁ డస్తగతుండైనఁ♦జూచి పిదప, హనుమ యద్భుతగతిఁబిల్లి♦యంతరూపుఁ
గొనిప్రదోషకాలంబునఁ♦దనుజపురముఁ, జొచ్చెనొకగంతువెసవైచి♦చూచెదాని.

అర్థములు. ప్రదోషకాలంబునన్ = "త్రిముహూర్తం ప్రదోషస్స్యాద్భానావస్తంగతేసతి" సూర్యాస్తమానానంతరము మూఁడు ముహూర్తముల కాలము ప్రదోష మనఁబడును. "ప్రదోషోస్తమయాదూర్ధ్వం ఘటికాద్వయ మిష్యతే" ఇది గౌడమతము. చొచ్చెన్ = ప్రవేశింపఁ బ్రయత్నించెను. లంకా ప్రవేశము ౧౮౪ వ

పద్యంబునఁ జెప్పఁబడును గావున నిచటఁ దత్ప్రయత్నమున దానికి సమీపమునకుఁ బోయెనని గ్రహింపవలయును.

తాత్పర్యము.

సూర్యుఁ డస్తమింపఁగాఁ జూచి పిదప హనుమంతుఁడు పిల్లియంతరూపము ధరించి ప్రదోషకాలంబున లంకఁ బ్రవేశించుటకై దానికి సమీప ప్రదేశమునకు నొక గంతు వైచెను. అనఁగాఁ గొండదిగి నడచిరాలేదని భావము.

"భోజనం మైథునం యానం, మభ్యంగం హరిదర్శనమ్
అన్యాని శుభకార్యాణి, ప్రదోషే నైవకారయేత్."

భోజనము, మైథునము, ప్రయాణము, తలంటు, హరిదర్శనము మొదలగు శుభకార్యములను బ్రదోషవేళ చేయరాదుకదా! ఎట్లు హనుమంతుఁ డీ కార్యము చేయఁబూనెను?

అర్చకాన్ పరిచారాంశ్చ, వైష్ణవాన్ జ్ఞానినో యతీన్
దాసీదాసాదికాంశ్చైవ, ప్రదోషో నతు బాధతే.

అర్చకులను, బరిచారకులను, వైష్ణవులను, జ్ఞానులను, సన్న్యాసులను, దాసీదాసులను, బ్రదోషము బాధింపదను నపవాదముండుటచే హనుమంతుఁడు జ్ఞానియు వైష్ణవుఁడు రామదాసుఁడు నగుటచే స్వామికార్యమందుఁ బ్రదోషబాధ యాయనకు లేదు.

—— హనుమంతుఁడు లంకలోఁ బ్రవేశించుట. ——

సీ. నలుచదరంబులై నలువొందుబాటలు, ప్రాసాదమాలావి రాజితములు
స్వర్ణరాజతమహా స్తంభశోభితములు, శాతకుంభగవాక్ష సంయుతంబు
లగుచు నే దెసమిది యంతస్తు లేపారు, గంధర్వనగరసీ కాశసౌధ
పాళులు గలిగి స త్స్ఫటికసుసంకీర్ణ, కనక వైడూర్యము క్తాప్రవాళ
తే. భూషితాసురమందిర పుంజ మమరఁ, జిత్రతోరణ పంక్తులు చెలువు మీఱ
నెపుడు సమలంకృతం బయి యాఢ్య శౌర్య, నిష్ఠురోదగ్రరాక్షసా న్వీత మగుచు.

అర్థములు. ప్రాసాద మాలా విరాజితములు=ఇది బాటలకు విశేషణము = మేడల వరుసలచేఁ బ్రకాశించునవి. ఇది నాలవపాదమందలి కలిగితో నన్వయము. స్వర్ణరాజత మహాస్తంభశోభితములు=బంగారు వెండితోఁ జేయఁబడిన గొప్పస్తంభములచేఁ బ్రకాశించు నవియు, శాతకుంభ గవాక్షసంయుతములు = బంగారు కిటికీలతోఁ గూడినవియు, గంధర్వనగర నీకాశ = గంధర్వనగరములతో సమానమైన, సౌధపాళులు = మేడల వరుసలు, గంధర్వనగరము = రత్నమయములైన గోపురముల మేడలవలె నాకాశమున నొకప్పుడు మబ్బులు కనఁబడును. అట్టి సన్నివేశమునకు గంధర్వ నగరమని పేరు. అది చూచుటకు మిగుల నాశ్చర్యముగ నుండును.

"అనేక రత్నాకృతి ఖే విరాజితే, పుర పతాకాధ్వజ తోరణాన్వితమ్,
యదాతదా హస్తి మనుష్యవాజినాం పిబత్యసృ క్ప్ఫూరి రణే వసుంధరా."

యనువాక్యము ప్రమాణము.

అది కనఁబడెనేని భూమి నెత్తుటఁ దడియును. సత్ + స్ఫటికము = మంచిస్ఫటికములతో, సుసంకీర్ణ = బాగుగా వ్యాపించిన, కనకవైడూర్య ముక్తాప్రవాళభూషిత = బంగారు వైడూర్యములు, ముత్యములు, పగడములు వీనిచే నలంకరింపబడిన, అసుర మందిర పుంజంబు = రాక్షసులయిండ్ల గుంపులను, ఈడ్య = కొనియాడఁదగిన, శౌర్య = పరాక్రమముచే, నిష్ఠుర = కఠినులును, ఉదగ్ర = భయంకరులు నగు, రాక్షస = రాక్షసులచే, అన్వితము = కూడినది.

తాత్పర్యము.

మేడలవరుసలచేఁ బ్రకాశించుచు నలుచదరంబులైన బాటలును, బంగారు వెండి స్తంభములచేఁ బ్రకాశించుచు బంగారు కిటికీలు గలిగి ఏడెనిమిది యంతస్తులు గలవై గంధర్వ నగరములవలె నుండు మేడలును గలిగి స్ఫటికములు పఱువఁబడినవై బంగారు, వైడూర్యములు, ముత్తెములు, పగడములు వీనిచే నలంకరింపఁబడిన రాక్షసుల యిండ్లవరుస లొప్పుచుండఁగాఁ జిత్రములైన తోరణములు గలిగి సర్వదా యలంకరింపఁబడి శ్లాఘింపఁదగిన పరాక్రమము గల కఠినులైన రాక్షసులచేఁ గూడినదై.

తే. అద్భుతంబు నచింత్య మై♦యసురనాథ
రక్షితంబైన లంకాపు♦రంబుఁ జక్కఁ
గాంచి దైన్యంబు నొందియు♦ఁబ్రీతనూజఁ
గనఁగఁ గోరుట సంతోష♦కలితుఁ డయ్యె. ౧౬౧

అర్థములు. అద్భుతంబు = ఆశ్చర్యకర మైనది, అచింత్యము = ఇట్టిదని యూహింపరానిది - చక్కఁగాంచి = ఇదివఱకు దూరమునుండి చూచిన వాఁడు ఇప్పుడు సమీపమునకు వచ్చి చూచుచున్నాఁడు కావున బాగుగఁ గనఁబడెను.

తాత్పర్యము.

ఆశ్చర్యకరమై యిట్టిదని యాలోచించి తెలిసికొనరానిదై రావణాసురుచేత రక్షితంబైన లంకాపురమును సమీపమునకు వచ్చినవాఁ డగుటచేఁ జక్కఁగాఁజూచి దీని నేమి? సాధించుట యన నేమి? ఇది సాధ్యమగునదిగాఁ దోఁపలేదే యని వ్యసన పడిన వాఁడయ్యు సీతాదేవి యిందున్నదికదా, ఆమెను నేను దర్శింప వలెఁగదా యను కోరికతో సంతోషించిన వాఁడయ్యెను.

క. కువలయ బాంధవుఁ డప్పుడు, ప్లవగునకుం దోడుపడెడి♦భావంబున నా
భువి దివిఁ గాంతులఁ గప్పుచు, నపురుగఁ దోతెంచెఁ జక్క♦చాలులనడుమన్.

అర్థములు. కువలయ బాంధవుఁడు = కలువల చుట్టము, చంద్రుఁడు.

## తాత్పర్యము.

అప్పుడు చంద్రుఁడు సముద్రమైనాక సూర్యులవలె హనుమంతునకుఁ దోడు పడుటకై వచ్చెనా యేమి యన్నట్లు భూమిని నాకాశమును గాంతులచేఁ గప్పుచుఁ జుక్కలనడుమఁ జక్కఁగాఁ గానవచ్చెను. ఇది ఫాల్గుణశుద్ధ త్రయోదశీ తిథి. రాత్రి ఏడున్నర గంటలకాలము. ఆశ్వయుజశుద్ధ త్రయోదశిరాత్రి యెనిమిది గంటలవేళఁ జంద్రునిఁ జూచుచు నీ వ్యాఖ్య వ్రాయఁబడెను. చంద్రబింబము నిర్మలముగా నున్నది. వెన్నెలయు శుభ్రముగా నున్నది.

తరలము. జలజకాంతియుఁ బాలడాలు బి♦సంబు డంబును నింబుగాఁ
గలికిరూపునఁ గానవచ్చి ప్ర♦కాశమానుఁడు నా శశిన్
వలిముఖాగ్రణి సారసాకర♦వారిఁ గ్రీడఁ జరించు నా
జలజసంభవు తేజి యట్టులు ♦ సంతసంబునఁ గన్గొనెన్. ౧౮౩

అర్థములు. జలజకాంతియు = శంఖము యొక్క కాంతి, పాలడాలు = పాలకాంతి, బిసంబు డంబు = తామరతూఁడు కాంతి, ఇంబుగన్ = మనోహరముగా, కలికి రూపునన్ = ఒప్పిదమైన యాకారముచే, సారసాకర వారిన్ = తామరకొలని నీటియందు, జలసంభవు తేజి = బ్రహ్మవాహనము హంస.

## తాత్పర్యము.

శంఖము, పాలు, తామర తూఁడు వీనివంటి తెల్లని కాంతి గలవాఁడై మనోహరరూపంబునఁ గాన వచ్చి ప్రకాశించు చంద్రుని వానరశ్రేష్ఠుఁడగు హనుమంతుఁడు తామరకొలని నీటియందుఁ గ్రీడించు హంసవలె సంతోషముతోఁ గనుఁ గొనెను.

తరలము - నభరసజజగ - పండ్రెండవయింట యతి, "కౌముదీ వితానము నంబరమంత వెదఁజల్లుచు విష్ణుపద మధ్యగతుండగు నంశుమంతునిఁ జూచె ననియు గలదు గాన నస్తమయ పర్యంతము వెలుపల నుండియు ప్రదోషసమయమున లంకను బ్రవేశించు వఱకు చంద్రుఁడు విశేషకాంతి గలవాఁడుగా నుండెననియు, మీఁది మీఁదికిఁ బోవుచుండె ననియు, శంఖక్షీర సమాన వర్ణములు గలవాఁ డనియు, వర్ణించినందున నస్తమయమునకుఁ బూర్వమే యుదయింపని యెడల ప్రదోషసమయము (రాత్రి 4 గడియల) వఱకు మధ్యాంగతుఁడుగ నుండఁజాలఁడు గాన పగ లిరువదినాలుగు గడియలకు నుదయించిన యెడ చంద్రోదయానంతరము 10 గడియలకు (రాత్రి 4 గడియలకు) ఖగోళమున మీఁది మీఁదికి రాఁగల వాఁడుగ నుండును. కాంతియు విశేషముగ నుండును గాన నదియు వసం॥ ఫాల్గున శుద్ధ త్రయోదశి యని నిర్ణయింప వచ్చును. ఒకవేళ తత్పూర్వము దశమి మొదలగు తిథులనుగాని తత్పరము చతుర్దశి మొదలగు తిథులనుగాని గ్రహించితిమా యొక విధమున వ్యవధాన మధికముగను, ఇంకొకవిధమున వ్యవధానము లేకుండుటయుం

గలుగును. లంకనుండి వాయుసూనుఁ డేతెంచిన మఱుదినము యుద్ధయాత్ర నిర్ణయమునకు విరోధము రాకుండ విచారించినచో నీ త్రయోదశి తిథియే యుక్తము గాన స్థిరపఱుపఁబడినది" (శ్రీరామ కాలనిర్ణయ బోధిని పు. ౨౯.)

## 3-వ సర్గము.

సీ. లంబమానాంబుద♦లంబలంబాగ్రంబు, నందుండి రేయి వ♦నావళులను
జారుతోయంబుల ♦ శారదాబ్దప్రఖ్య, భవనంబులను నబ్ధి♦పవనములను
సాగరోపమమహా♦చటులఘోషంబుల, రమ్యసుద్వారతో♦రణచయముల
మందమారుతముల ♦ మహితజాంబూనద, మయగృహప్రాకార♦మంటపములఁ
తే. గింకిణీజాలరవములఁ ♦ గీర్తితేంద్ర
నగరనిభ మయి నిస్తుల ♦ నాగరాజ
రక్షితాహిపురాభమై ♦ రమణ మీఱు
పట్టనముఁ జొచ్చెఁ గన్గొంచుఁ ♦ బ్రాజ్ఞవరుఁడు. ౧-౪

అర్థములు. ౧౯౬ పద్యమందు హనుమంతుఁడు లంకాప్రవేశమునకు యత్నించి పురను సమీపమునకుఁ బోయె నని చెప్పఁబడెను. దానినే విపులీకరించుచున్నాఁడు.

లంబమాన = వ్రేలాడుచున్న, అంబుద = మేఘమువలె, లంబ = దీర్ఘమైన, లంబాగ్రమునందుండి = లంబపర్వతముకొననుండి, శారదాబ్దప్రఖ్య = శరత్కాల మేఘములవంటి, భవనంబులను = మేడలచేతను, సాగరోపమ = సముద్రధ్వనితో సమానమైన, అబ్ధిపవనములను = సముద్రపుగాలిచేతను, మహాచటుల ఘోషంబులన్ = గొప్పదై సర్వత్రవ్యాపించిన శబ్దముచేతను, రమ్య = మనోహరములయిన, సుద్వారతోరణచయములన్ = మంచివాకిండ్లు తోరణములచేతను, మందమారుతములన్ = మెల్లనిగాలిచేతను, మహిత = గొప్పవగు, జాంబూనదమయ = బంగారుతోనిండిన, గృహప్రాకారమంటపములన్ = ఇండ్లు ప్రాకారములు మంటపములచేతను, కింకిణీజాల రవములన్ = చిఱుగజ్జెలగుంపుల ధ్వనులచేతను, కీర్తిత = పొగడ్తకెక్కిన, ఇంద్రనగర నిభము = అమరావతి సమానము, నిస్తుల = అసమానమైన, నాగరాజరక్షిత = సర్ప రాజగు వాసుకిచే రక్షింపఁబడిన, అహిపురాభమై = భోగవతీపట్టణముతో సమానమై ప్రాజ్ఞవరుఁడు = బుద్ధిమంతులలో శ్రేష్ఠుఁడు. ఇది కర్తృ పదము.

## తాత్పర్యము.

బుద్ధిమంతులలో శ్రేష్ఠుఁడగు హనుమంతుఁడు రాత్రికాలమున వ్రేలాడుచున్న పర్వతమువలె దీర్ఘమైన లంబ పర్వత శిఖరమునుండి వనముల వరుసలను, మనోహరములైన నీళ్ళచేతను శరత్కాలమేఘమువలెఁ దెల్లనగు నిండ్లచేతను సముద్రఘోషముతో సమానమైన గొప్ప ధ్వనులచేతను ఇంపైన వాకిండ్ల తోరణములచేతను మెల్లగా వీచు గాలులచేతను, బంగారు మయములైన గొప్ప యిండ్లు, చుట్టుగోడలు,

మంటపముల చేతను, చిఱుగజ్జెల రవళిచేతను పొగడ్తకెక్కిన యమరావతీ భోగవతీ పురములతో సమానమై యందముచేత నతిశయించు లంకాపట్టణమును బ్రవేశింప నారంభించెను.

క. అలకాపురముం బోలుచు, సలలిత మై పుష్టసైన్య♦సంఘుష్టం బై
కలితతటిద్ఘన మై గజ్జెలరవళుల మీఱె నౌర ♦ చిత్రం బనుచున్. ౧౬

అర్థములు. సలలితమై=చక్కఁదనముతోఁ గూడినదై, పుష్టసైన్య సంఘుష్టంబై = బలసిన సేనలచే ధ్వనింపఁబడినదై, కలితతటిత్ ఘనమై = మెఱుపులతోఁ గూడిన మేఘము వంటిదై.

తాత్పర్యము.

అలకాపురముతో సమానమై, యందమై బాగుగఁ బోషింపఁబడుటచే బలసిన సేనల ధ్వని గలదై, మెఱుపులతోఁ గూడిన మేఘము వంటిదై, గజ్జెల ధ్వనులచే నతిశయించి యున్నది. ఏమీ చిత్రము. ఇది హనుమంతుని స్వగతము. కవివాక్యము గాదు.

—♦ హనుమంతుఁడు ప్రాకారంబున జేరి యాలోచించుట ♦—

సీ. చని యిట్లు ప్రాకార♦సన్నివేశముఁ జేరి, కలయంగఁ గాంచె లం♦కాపురంబు
స్వర్ణకవాటముల్ ♦ వైడూర్య వేదికల్, గురువజ్రముక్తాశ్మ♦కుట్టిమంబు
లపరంజియొఱగుదిం ♦ డ్లమలసోపానముల్, మింటి కెగురుమాడ్కి♦ మెఱయుచున్న
వరచతుశ్శాలలు ♦ వరహంసమాయూర, కలకలార్భటులు నా♦కసము నిండఁ
తే. దూర్యభూషణరవములు ♦ తోరములుగఁ, గలిమి వస్వౌకసార నాఁ ♦ గ్రమ్మమైన
విబుధశాత్రవనగరంబు♦పెంపునకును, మదిని హర్షించి యీ పావ♦మాని దలఁచు.

అర్థములు. ప్రాకార సన్నివేశము=ప్రాకార సమీపమున నున్న బయలు, వేదికల్ = అరుఁగులు, గురువజ్ర ముక్తాశ్మ కుట్టిమంబులు = గొప్పవగు వజ్రములు ముత్తెములు వీనిచేతను నితర రత్నముల చేతను గట్టఁబడిన నేలలును, వరచతుశ్శాలలు=శ్రేష్ఠములై నలు దిక్కులయందు నభిముఖముగా నడుగు నెడము విడిచి కట్టిన యిండ్లు. "సంజవనం త్విదమ్ చతుశ్శాలమ్" అని యమరకోశమున చతుఃశాల శబ్దము నపుంసకముగాఁ బఠింపఁబడినను పా. చతుశ్శాలా యని లింగాభట్టీయము. ఆబంతో వా ఇతి వాక్లీబత్వమ్ అని సుధా. తూర్య = వాద్యముల, 'వస్వౌకసారా=ఇంద్రపురము శక్రస్య పూర్వస్యాం దిశివైపురీ' తూర్పుదిక్కున నుండు ఇంద్రునిపురము, "వస్వౌకసార" అను పురాణ వచనము, వస్వౌకసారా శక్రస్య యమ్యా సంయమినీ తథా, సుఖా జలేశస్య, సోమస్య చ విభావతీ" యను విష్ణు పురాణ వచనము స్మరించునది.

ఇంద్రుని పట్టనముపేరు వస్వౌకసార, యముని పట్టనము సంయమని, వరు

ణుని పట్టనము సుఖ, సోముని పట్టనము విభావతి, అలకాపురికిని వస్వౌకసార యను పేరుగలదు. పావమాని = ఆంజనేయుఁడు, పవమానపుత్రుఁడు=పావమాని, అప త్యార్థకతద్ధితము.

తాత్పర్యము.

ఇట్లు మనస్సులో ననుకొనుచుఁబోయి ప్రాకారసమీపమున నున్న బయలు చేరి లంకాపుర మంతయుఁ బాఱఁజూచెను. బంగారు తలుపులు, వైడూర్యపు టరుఁగులు, గొప్ప వజ్రములచే ముత్యములచే నితర రత్నములచేఁ గట్టఁబడిన నేలలు, బంగారు టొఱగు దిండ్లు, శుభ్రములైన సోపానములు, ఆకాశమున కెగిరి పోవు చున్నట్లుండు బవంతులు, హంసలయు, నెమిళ్ళయుఁ గలకల ధ్వనులు నాకాశము నిండ, వాద్యములయు భూషణములయు చప్పుడులు నతిశయింపఁగా నింద్రుని పుర మనఁదగి మనోహరమైన రావణుని పట్టనము గొప్పదనమునకు మిగుల సంతోషించి హనుమంతుఁ డిట్లు తలఁచెను.

ఉ. ఎప్పుడు విచ్చుకత్తులు వ♦హించి చరించు బలంబు గావఁగా
నిప్పురి గెల్వ శక్య మగు♦నే పరు కేరికి నైన బల్మి మై
జొప్పడు నంగద ద్వివిద♦సూర్యజమైంద సుషేణఋక్షులున్
దప్పక తూఱఁగాఁ గుముద♦తత్కుశపర్వులుఁ గేతుమాలుఁడున్. ౧౬౭

అర్థములు. బలంబు = సేన, తూఱఁగాన్ = ప్రవేశింపఁగా.

తాత్పర్యము.

ఒఱదూసిన కత్తులు చేతఁబట్టుకొని తిరుగుచున్న సేన రక్షించుచున్న యీ పట్టనము బలముచే గెల్వ నెవరికి సాధ్యముగాదు గాని దీనిని నంగదుఁడు ద్వివిదుఁడు సుగ్రీవుఁడు మైందుఁడు సుషేణుఁడు ఋక్షుఁడు కుముదుఁడు కుశపర్వుఁడు కేతుమాలుఁడు వీరు ప్రవేశింపఁగలరు. తొలుత లంకాపురిని జూడఁగానే హనుమంతుఁ డధైర్య పడి నలుగురు మాత్రము (౧౮౯ ప.) సముద్రముదాఁటి లంకయొద్దకు రాఁగలరని తలఁచెను. ఇప్పుడు తొమ్మిదిమంది లంకలోఁ బ్రవేశింపఁగలరని తలఁచుచున్నాఁడు. కార్యభార మెఱుంగని మూఢుఁడు తొలుత నుత్తరకుమార ప్రజ్ఞలు పలికి యావలఁ గార్యము చేయవలసి వచ్చినప్పుడు వెల్లకిలఁబడును. ఆలోచనగల బుద్ధిమంతుఁడు కార్యభార మాలోచించి యీ కార్యము మనవలన నగునా యని తొలుత జంకును. కార్యము చేయక తప్పదు కావునఁ బనిలోఁ దిగి కొంచెము కొంచెము చేయసాగి క్రమక్రమముగా ధైర్యము తెచ్చుకొని కార్యమంతయు సాధించును. ఇన్ని యాలోచనలు చేసిన వాఁడు తుదకుఁ దా నొక్కఁడే రాక్షసుల నందఱను జయించి లంక కాల్చి వచ్చెనుగదా. ఇది కార్యసాధకుల లక్షణము.

క. అని బలశాలుల వానరులను నెన్ని సుమిత్రసుతుబ♦లంబును శ్రీరా
ముని శౌర్యగరిమ దలఁచుచు, ననఘుఁడు సంతుష్టచిత్తుఁ ♦ డగుచుం బిదపన్.

తాత్పర్యము.

ఈ ప్రకారము లంకకు రాఁగల బలవంతులగు వానరు లెక్కించి లక్ష్మణుని బలము శ్రీరామచంద్రమూర్తి శౌర్యము నాలోచించి భయములేదు, వారువచ్చిన జయింపఁగలరని సంతోషించిన వాఁడయ్యెను.

రామ లక్ష్మణులైనను నిచ్చట నేమిచేయఁ గలరని యధైర్యము పడిన వాని కిప్పుడు కొంచెము ధైర్యము వచ్చెను.

క. వెండియుఁ గనె మణివాసో,మండిత గోష్ఠావతంస♦మఱి యంత్రసభా
కాండస్తని భూషిత వే,తండగమన యట్లు వెలయు♦దశకంఠపురిన్. ౧౯

అర్థములు. మణివాసస్ మండిత=రత్నములను వస్త్రములచేతను నలంకరింపఁ నడినది. గోష్ఠావతంస = పశువుల కొట్టము లనెడి యలంకారముగలది, యంత్రసభా కాండస్తని=యంత్రగృహ సమూహము లనెడి స్తనముల గలది. కావుననే; భూషిత వేతండగమన=అలంకరింపఁబడిన స్త్రీ.

తాత్పర్యము.

మఱియు సమీపించి పోయి మణులను వస్త్రములచేఁ గప్పఁబడినదియుఁ బశువుల కొట్టము లనెడి శిరోభూషణముల గలదియు యంత్రశాల లనెడి స్తనములు గలదియునై యలంకరింపఁబడిన స్త్రీవలెనుండు రావణుని పట్టనమును జూచెను.

లంకా నగరమును స్త్రీగా వర్ణించుట లంకాధిదేవత రాక సూచించుటకే. లంక స్త్రీవలె నున్నదిగదా యనుకొనఁగానే స్త్రీయై రానేవచ్చెను.

—♦ హనుమంతుఁడు లంకాధిదేవతను జయించుట. ♦—

క. నవరత్నకలితశాలా, నివహానిరస్తాంధకార♦నిచయం బగు నా
దివిజారిపురముఁ జొచ్చెడి, ప్లవగు నిజాకార మూని♦లంకయుఁ జూచెన్. ౨౦

అర్థములు. నవరత్నకలిత = నవరత్నములతో నిర్మింపఁబడిన, శాలానివహా = ఇండ్లసమూహముచే, నిరస్తాంధకార నిచయంబు = కొట్టివేయఁబడిన చీఁకటి గుంపు గలది. నిజాకారము=తన స్వస్వరూపము.

తాత్పర్యము.

నవరత్నములచేఁ గట్టఁబడిన యిండ్ల సమూహములచేఁ జీఁకటి యనునది లేకుండఁ జేయుచున్న యా రావణాసురుని పురము నందుఁ బ్రవేశించు వానరుని లంకాధిదేవత లంక యను పేరుగలది తన స్వస్వరూపముతోఁ జూచెను. లంకను హనుమ చూచెను. హనుమరు లంక చూచెను.

చ. కనుఁగొని కింక లంకయు వి♦కారముఖంబును ఘోరరూపముం
బెనఁగొన లేచి, యా ప్లవగ♦వీరున కడ్డము నిల్చి, గర్జలన్
నినుచుచుఁ బల్కె నోరి విను♦నీల్గక మున్నె యెవండ వీ వహో
వనచర యేమి కార్యముగ♦వచ్చితి విచ్చటికి న్వచింపరా. ౨౧

అర్థములు. కింకర = కోపముచే. లంక యనునది గ్రామదేవత. గ్రామము రక్షించుచు నూరివెలుపల నుండును.

తాత్పర్యము.

ఇట్లుచూచి లంక కోపించి చూచుట కసహ్యమైన ముఖము భయంకర రూపము దాల్చి హనుమంతున కడ్డమువచ్చి నిలఁబడి సింహనాదములు చేయుచు నిట్టులనెను. ఓరీ! నీ వెవ్వఁడవు? ఏమిపనిగా నిచటికి వచ్చితివి? నీవు చావకముందే చెప్పుము.

క. ఏవేళల నేచోటుల, రావణబలగుప్త మగుచుఁ ◆ గ్రాలెడులంకన్
నీవా చొచ్చెడివాఁడవు, దేవాదులు చొచ్చి బ్రతుక ◆ దెరవుం గలదే. ౧౭౨

అర్థములు. రావణబలగుప్తము = రావణుసేనలచే రక్షింపబడునది.

తాత్పర్యము.

అన్ని వేళలందును నన్నిస్థలములందును రావణునిసేనలు రక్షించుచున్నలంకను నీవా ప్రవేశింపఁ గలవాఁడవు. దేవతలు లోనగువారు ప్రవేశించి బ్రదుకఁగలరా?

చ. అనిన వచింతు నా చరిత ◆ మంతయు నైన విరూపనేత్రవై
పని యెది గల్గి యీ నగరి ◆ వాకిట నుండెద? వేల యొప్పుచున్
నను నిటు లడ్డగించెదవు ◆ నా కిది తెల్పు మ టన్న నా మరు
త్తనయునిఁ గాంచి లంక య నె ◆ దారుణభాషలఁ గ్రోధదీప్తయై. ౧౭౩

తాత్పర్యము.

అని యిట్లు లంక యడుగఁగా హనుమంతుఁ డిట్లనెను. ఓసీ! నా కథ చెప్పెదనుగాని యీవికారపుఁగన్నులతో నీపట్టనము వాకిటనుండు నీ వెవతెవు? ఏల యిందున్నావు? ఏల యీ ప్రకారము ఒప్పుచు నా కడ్డము వచ్చెదవు? ఊరనియుండిన నెవరైన రాక పోక యుందురా? చెప్పవలసిన దని యడుగఁగా నా మారుతిని జూచి భయంకరవాక్కులచే గోపముచే మండిపడుచు లంక యిట్లనియె,

ఉ. రావణునాజ్ఞ మోచి నగ ◆ రం బిది కాచెద నెల్లవేళలన్
నీ విటు కన్నుఁ బ్రామి నను ◆ నేరుతె దీనిఁ జొరంగ? నిప్పుడే
చావఁ గలాఁడ వోరి వన ◆ చారి! స్వయంబుగ నేన లంకరా
నా విధమింత, నీ కథ వి ◆ నన్ వచియింపు మ టన్న నాతఁడున్. ౧౭౪

అర్థములు. కన్నుఁబ్రామి = మోసగించి.

తాత్పర్యము.

రావణాసురు నాజ్ఞ శిరసావహించి నేనీ పట్టనము సర్వకాలముల రక్షించెదను. నన్నుఁ గన్నులు కప్పి నీవు ప్రవేశింప సాధ్యమా? ఓరీ క్రోఁతీ! నీ విప్పుడే చావఁగలవు. నేనే లంకనురా. ఇది నా చరిత్రము. నీ వెవ్వఁడవో యిఁకఁ జెప్పుము.

ఉ. లంక వచించినట్టి నుడు♦ల న్విని కొండవ నిల్చి యింతయేఁ
జంకక యోషిదాకృతి నె♦సంగెడు దానిని జూచి వాహినీ
సంకులితాట్టగోపురవి♦శాల గృహాంగణనిష్కుటోత్కరా
లంకృత యై తనర్చు పురి ♦ లంక గనుంగొను వేడ్క వచ్చితిన్. ౧౭౫

అర్థములు. నుడులన్ = మాటలను, యోషిదాకృతిన్ = స్త్రీరూపమున, వాహినీ=సేనలతో, సంకులిత=సంకులమైనదై (సమ్మర్దమైనదై) అట్ట = యుద్ధార్థము వాకిటి మండపము మీఁదఁగాని, కొత్తళముమీఁదఁగాని యేర్పడిన గదులచేతను, అంగణ—ముంగిళ్ళచేతను, నిష్కుట—ఇంటిచుట్టు నుండు తోఁటలచేతను, అలంకృతయై—అలంకరింపఁ బడినదియై.

తా త్ప ర్య ము .

లంక చెప్పినమాటలు విని హనుమంతుఁడు కొండవలెఁ గదలక ధైర్యమున నిలిచి కొంచెమైనను సందేహింపక స్త్రీ యాకారముతో వచ్చినదానిని జూచి సేనలతోఁగూడిన యట్టడులచేతను గోపురములు వెడలుపాటి యిండ్లు ముంగిళ్ళు తోఁటలు వీనిచేతను నందమైన లంకను జూచి పోవు కోరికతో వచ్చితిని.

క. నావుడు నను నిర్జింపక, యే వడువున నీవు దుర్మ♦తీ! చూచెద వీ
రావణపాలితపుర మని, యీ విధమునఁ బరుషభాష ♦ లింత యనంగన్. ౧౭౬

అర్థములు. నిర్జింపక=గెలువక, ఏవడువున=ఏవిధముగ.

తా త్ప ర్య ము .

అని హనుమంతుఁడు చెప్పఁగా నదియును నన్ను గెలువక యేవిధముగానో ద్రోహబుద్ధి గలవాఁడా! రావణుఁడు రక్షించు పురములోనికిఁ బోఁగలవు, అని యీ విధముగా నది కఠినముగా మాటలాడఁగా.

క. రక్కసిఁ గనుగొని యిట్లను, నక్కపివీరుఁడు పురము ♦ నంతయుఁ గని నే
గ్రక్కున వచ్చినత్రోవం, ద్రొక్కెద నన లంక భయద♦రోషార్భటులన్. ౧౭౭

తా త్ప ర్య ము .

ఆ రాక్షసిని జూచి హనుమంతుఁ డిట్లనియె. ఓసీ! నే నీ పట్టణమంతయుఁ జూచి శీఘ్రముగా వచ్చినత్రోవఁ బోయెదను, అని చెప్పఁగా లంక భయంకరమైన రోషముచేఁ గలుగు ధ్వనులు చేయుచు.

క. అరచేతఁ గొట్టె వానర, వరునిం గపి యిట్లు దెబ్బ♦పడి బొబ్బిడుచున్
దరుణి యని తీవ్రరోష, స్ఫురితుఁడు గా కెడమముష్టిఁ ♦ బొడిచెం గినుకన్. ౧౭౮

తా త్ప ర్య ము .

అరచేతితో వానరశ్రేష్ఠుని గొట్టెను. ఇట్లు దెబ్బదిని బొబ్బపెట్టి యిది యాఁడుది, దీనిమీఁదనా నా బలము చూపవలె నని తలఁచి విశేషము కోపింపక యెడమ చేతి పిడికిట దానిని బొడిచెను.

—♦ లంక దన్ను రక్షింప హనుమంతుని వేఁడుట. ♦—

క. ఆముష్టిఘాతముననే, భూమింబడ వివృతవక్త్రి ♦ బోలఁతుక ననుకం
పామతిఁ గనెఁ బావని యా,భామిని గతగర్వ యగుచుఁ ♦ బలికె నతనితోన్.

అర్థములు. వివృతవక్త్రి=నోరు తెఱచుకొనునది.

తా త్ప ర్య ము .

ఆ పిడికిటి పోటుననే యది నోరు తెఱచికొని నేలమీఁదఁ బడఁగా హనుమంతుఁడు దానిని దయతోఁ జూచెను. అదియును గర్వముడిగినదై యాయనతో నిట్టులనెను.

క. కరుణింప వయ్య వానర,వర ! కావుము నన్ను వీర్య♦వంతుఁడ వెందున్
దరుణులఁ జంపఁగ రా దను,మరియాదను దాఁట రెపుడు ♦ మహితబలాఢ్యుల్.

తా త్ప ర్య ము .

వానరేంద్రా ! నన్నుఁ గావుము. నాయందు దయ దలఁపుము. నీవు విశేష పరాక్రమ వంతుఁడవు. విశేష బల సంపద గలవారు స్త్రీలలు జంపరాదను మరియాదను దాఁటరు.

చ. అగచరలోకపుంగవ ! స్వ♦యమ్ముగ లంకను నేన, పోరిలోఁ
దెగి నను గెల్చి తీవు భవ♦దీయపరాక్రమ మేర్పడంగ ; ని
న్నగచరుఁ డెవ్వఁ డే గెలుచు ♦ నాఁడు మొదల్ సురవైరికోటికిం
దెగుదలకార్య మబ్బెడి న♦నెన్ విధి మున్ను వరంబులిచ్చు చోన్. ౧౮౧

అర్థములు. అగచర లోకపుంగవ=వానరశ్రేష్ఠా. తెగుదల=నాశమైపోవు, విధి=బ్రహ్మదేవుఁడు.

తా త్ప ర్య ము .

వానరశ్రేష్ఠుఁడా ! నేనే లంకను. యుద్ధమునందు సాహసించి నీ బలపరాక్రమములచే నన్నే గెల్చితివట. ఇఁక రాక్షసులు నీ కడ్డమా ? నాకు బ్రహ్మదేవుఁడు నగరప్రతిష్ఠయందు వరములిచ్చు సమయంబున నిన్ను నేనాఁడు సీతాదేవిని వెదకుచు గ్రోఁతి వచ్చి గెలుచునో యానాఁడు మొదలు లంక నాశ మగునని చెప్పెను.

ఉ. సత్యముఁ జెప్పితి న్విధియు ♦ సత్యమ పల్కెను దప్ప దేమిటన్
దైత్యులకున్ దశాస్యునకు ♦ ధారిణికన్యక కారణంబుగా
మృత్యువు దాపరించె నిఁక ♦ నేగుము పట్టన మెల్లఁ జూడుమీ
కృత్యము లెల్లఁ దీర్చుకొను♦మీ మది చొప్పునఁ గీశపుంగవా. ౧౮౨

తా త్ప ర్య ము .

వానరశ్రేష్ఠుఁడా! నేనుసత్యము చెప్పితిని. బహ్మదేవుఁడు యథార్థమే చెప్పెను. అది యేమి చేసినను తప్పదు. సీతాదేవి కారణంబుగా రాక్షసులకు రావణునకు

చావు సమీపించెను. ఇఁక నీవు పురములోనికిఁ బొమ్ము. పట్టనమంతయుఁ జూడుము. నీయిష్ట ప్రకారము నీకుఁ గావలసిన పను లన్నియుఁ జేయుము.

క. శాపోపహతం బగు లం, కాపురముం జొచ్చి జనక ♦ కన్యకఁ గన ని
చ్ఛాపూర్తి యొదవఁ గపికుల, దీప! యథాసుఖముగాఁగ ♦ ద్రిమ్మరు మనినన్.

అర్థములు. శాపోపహతము= నందికేశ్వరుని యొక్కయు, పతివ్రతల యొక్కయు శాపముచేఁ గొట్టఁ బడినది.

## తాత్పర్యము.

పతివ్రతలు లోనగు వారి శాపముచేఁ గొట్టఁబడిన లంకాపురముఁ బ్రవేశించి సీతను జూచుటకై నీకోరిక దీర యథాసుఖముగఁ దిరుగుము, అని చెప్పఁగా ;

లంకయును హనుమంతుఁడు బొబ్బలు పెట్టిరి. ఒకరి నొకరు కొట్టిరి. ఇది రాక్షసుల కేల తెలియలేదు. గ్రామ దేవతల యాలయము లూరికి వెలుపల నుండును. ఆ దేవతలు రారాని వారు గ్రామపు పొలిమేర దాఁటి రాకుండఁ బొలిమేరగాచి యుందురు. ఇది యూరి వెలుపలి వృత్తాంతము. దానిలో రాత్రివేళ. ఊరివారి యఱపులలో నీ యఱపులు వారికి వినఁబడి యుండవు. అదియును గాక యెవ్వరు లేనిచోటఁగదా హనుమంతుఁడు ప్రవేశింప యత్నించెను. హనుమంతుఁడు చెప్పక పోయినను బ్రహ్మదేవుని వాక్యముల వలన హనుమంతుఁడు సీతాదేవికై వచ్చెనని లంక తెలిసికొనెను.

లం. ఇదిపృథివీ బీజాక్షరము. కావున పృథివీ తత్త్వమును దెలుపు చున్నది. అది కలది లంక=అనఁగా దేహము. హనుమంతుఁడు లంక జయించె ననుటచేఁ దన యందాత్మను వెదకు వాఁడు తొలుత దేహమును జయింపవలె నని యేర్పడు చున్నది. దేహమును జయింపని వాని కాత్మావలోకనము లేదు. ఈ యర్థ మీ క్రింద పద్యమునఁ గాననగును.

—♦ ౪-వ సర్గము. హనుమంతుఁడు లంకలో సంచరించుట ♦—

తే. సత్యవిక్రముఁ డైనకే ♦సరిసుతుండు, కామరూపిణి లంకను ♦ గడిమి గెలిచి
తడయకాపత్తనంబున♦ద్వారమునను, జొచ్చెఁబ్రాకారమును దాఁటి♦శూరవరుఁడు.

అర్థములు. సత్యవిక్రముడు = వంచనము లేని పరాక్రమము గలవాఁడు, సత్యమే పరాక్రమముగాఁ గలవాఁడు. కామరూపిణిన్ =కోరిన రూపమెత్తఁగలదానిని. కడిమిన్ =పరాక్రమముచే. అద్వారమునను=వాకిటిలోనుండి గాక యితరమార్గమున. దీనివలన హనుమంతుఁడు రాక్షససంచారము లేనిచోట లంకలోఁ బ్రవేశింప యత్నించె ననియు, ఆ కారణముచే లంకా పరాజయము రాక్షసు లెఱుంగరనియుఁ దెలియ వగు శత్రుస్థానమును నద్వారముగఁ బ్రవేశింపవలె నని రాజనీతి. కాన హనుమంతుఁడును నద్వారమున లంకఁ బ్రవేశించెను **గాని** వెఱచి కాదు. 'గ్రామంవా నగరం వాపి,

పత్తనం వా పరస్యాపి, విశేషాత్సమయే సౌమ్య, నద్వారేణ విశేన్నృప' యని ప్రమాణము. జరాసంధుని మీఁదికి యుద్ధమునకుఁ బోయినపుడు శ్రీకృష్ణ భీమార్జునులు నద్వారములనే కదా ప్రవేశించిరి. 'అద్వారేణ రిపోర్గేహం, ద్వారేణ సుహృదో గృహాన్, ప్రవిశంతి నరా ధీరా, ద్వారాణ్యేతాని ధర్మతః। భార. సభా.

ఇందు ముముక్షువగు యోగిచర్య సూచితము. ఎట్లన:— ఆత్మావలోకన పరుఁడు సత్యవిక్రముఁడై యుండవలయును. ఇచ్చట సత్యమనునది యమముల కన్నిఁటికి నుపలక్షణము. 'సత్యేన లభ్య స్తపసా హ్యేష ఆత్మా సమ్యక్ జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యం, అంతశ్శరీరే జ్యోతిర్మయోహి శుభ్రో యం పశ్యంతి యతయః క్షీణదోషాః॥ సత్యమేవ జయతే నానృతం, సత్యేన పంథా వితతో దేవయానః,' అను ముండకోపనిషత్తు ప్రకారము ఆత్మ సత్యముచేత తపస్సుచేత జ్ఞానముచేత బ్రహ్మచర్యముచేత లభించును. ఇన్నియు హనుమంతునందుఁ గలవు. కావున సత్యమనునది యిన్నిఁటికి నుపలక్షణము. విక్రమ శబ్దము = 'నాయమాత్మా బలహీనేన లభ్యః' బలహీనులకు నాత్మ లభింపదు అను శ్రుత్యర్థమును బోధించుచున్నది. కేసరి సుతుండు = సింహపుఁ బిల్ల. ఇది సాహసము కలిమి తెలుపుచున్నది.

లంక యగు దేహము ప్రకృతి పరిణామము. అది కామరూపిణి గదా. లంకా రక్షః పురీశాఖా శాకినీ కులటాసుచ ॥నానా॥ లంకాశబ్దమునకు అంకుటాలనియు నర్థము గలదు. ఈ జీవుని నీ జన్మమున ననుసరించియున్న దేహము మఱుజన్మంబున మఱియొక జీవు నాశ్రయించును. ఈ విధముగ జన్మజన్మమున వేఱువేఱు జీవుల నాశ్రయించును గావున నీ దేహము అంకుటాలి వంటిదే. కడిమిన్ = బలముచే నిర్బంధపెట్టి యనఁగా తపస్సుచే దేహమును గెలువవలయును గాని సౌమ్యమార్గమున గెలువరాదనుట సూచితము. పత్తనము = దేహము. పత్ఌ గతౌ అను ధాతువువలన బుట్టినది. దీనికిఁ బోవునది యని యర్థము. దేహము నశించునదియే కదా.

అద్వారమునను = దేహము లోనికిఁ బోవుటకు నవద్వారములు గలవు. ఆత్మయందు మనస్సు పోవుట కీ ద్వారములు పనికిరావుగదా.

ప్రాకారమును దాఁటి = ప్ర + ఆకారము = స్థూల దేహమును భేదించెనని భావము.

క. అగచరపతిహితకరణుం, డగచరవరుఁ డరులమూర్ధ♦మందున్ బలిమిన్
దగఁదన డాకాలిని మున్నుగ నుంచి దశాస్యపురము♦నుం జొచ్చి నిసిన్. ౧౮౫

అర్థములు, అగచరపతి = సుగ్రీవునకు, హితకరణుండు = మేలుచేయువాఁడు, అగచరవరుఁడు = వానరశ్రేష్ఠుఁడగు హనుమంతుఁడు, అరుల = శత్రువులయొక్క, మూర్ధమందున్ = తలలయందు, బలిమిన్ = బలముచే, డాకాలిని = ఎడమకాలిని, మున్నుగనుంచి = ముందుగాఁ బెట్టి, నిసిన్ = రాత్రివేళ, ఒకఁడు శత్రుదేశమును బ్రవేశించునపుడెడమకాలు ముందుంచవలెను. మేలుకోరు వారియింటఁ బ్రవేశించునపుడు కుడికాలు ముందుంచవలెను. హనుమంతుఁ డీ నీతి ననుసరించెను.

'ప్రయాణ కాలేచ గృహ ప్రవేశే, వివాహకాలేపిచ దక్షిణాంఘ్రిః, కృత్వాఽగ్రతః శత్రుపురప్రవేశే, వామం నిదధ్యా చ్చరణం నృపాలః॥ అని బృహస్పతి వాక్యమిచ్చటఁ బ్రమాణము.

క. పూవులచే ముత్తెంబుల,చే వెనసెడిరాచబాటఁ♦జేరి మనోజ్ఞం
బౌ వీడు నాల్గుప్రక్కలఁ, బావని తిలకించి మెచ్చె♦భాగ్యోన్నతికిన్. ౧౮౬

తా త్ప ర్య ము.

ఊరిలోనికిఁ బోవుటకై పూవుల చేతను, ముత్తెముల చేతను నొప్పుచున్న రాచబాట చేరి మనోహరమైన యా పట్టనము నాలుగు ప్రక్కలఁ జూచి దాని భాగ్యాధిక్యమునకు నాంజనేయుఁడు మెచ్చుకొనెను.

సీ. తోరంబుగా మ్రోయు♦తూర్యనాదంబులఁ, బకపకనవ్వుల♦ప్రాభవముల
వజ్రాంకుశనికాశ♦వజ్రజాలవిభూష, ణాంచితగృహపయో♦దాళికలన
మేఘాళిచే నొప్పు♦మిన్నునా విలసిల్లి, మఱి సితాబ్దాభమై♦మహిమమీఱు
స్వస్తిక పద్మాఖ్య♦వర్ధమానాకృతిఁ, గొమరొప్పు రాక్షస♦కూటవితతిఁ
తే. జిత్రమాల్యాభరణములఁ♦జెన్ను మీఱు
పురిని గనుఁగొని సంతోష ♦ భరితుఁ డగుచు
సూర్యభవహితకరణుండు ♦ చొచ్చి చూడఁ
గడఁగి శ్రీరాఘవార్థంబు ♦ కరము నలరె. ౧౮౭

అర్థములు. నవ్వుల ప్రాభవములన్ = నవ్వుల యతిశయములచే, వజ్రాంకుశనికాశ=(౧) వజ్రాయుధాకారము కలవియును, అంకుశముల వంటివియును, (౨) వజ్రములతోఁ జేయబడిన యంకుశములు. (3) వజ్రమంకుశముగాఁ గల యైరావతము వంటివి, దానివలె శుభ్రమైనవి, వజ్రజాల=వజ్రమణుల సమూహము చేతను, విభూషణ=సొమ్ములచేతను, అంచిత=ఒప్పిన, గృహపయోద=గొప్ప యిండ్లయొక్క, పయోద శబ్దము శ్రేష్ఠ వాచకము, ఉపమిత సమాసము, ఆళి=సమూహముయొక్క, కలనన్=కూడికచేత, సిత+అబ్ద+ఆభమై = తెల్లని మబ్బుతో సమానమై; స్వస్తిక, పద్మాఖ్య వర్ధమానాకృతిన్=స్వస్తికమని, పద్మమని వర్ధమానమని రాజ గృహముల పేర్లు, యాకారముల పేర్లు, నలుచదరముగానున్న రాచ నగరికి స్వస్తికమని పేరు. 'చతుశ్శాలా చతుర్ద్వారా సర్వతోభద్రసంజ్ఞితా। పశ్చిమద్వార రహిత మధ్యావర్తా హయాననా। దక్షిణ ద్వార రహితా వర్ధమానా ధనప్రదా। ప్రాగ్ద్వారరహితా స్వస్తికాఖ్యా పుత్రధనప్రదా" యను వాక్య మిటఁ బ్రమాణము. పడమటి వాకిలి లేనిది మధ్యము, దక్షిణ ద్వారము లేనిది వర్ధమానము. తూర్పు ద్వారము లేనిది స్వస్తికము, కూట వితతి = ఇండ్ల సమూహము. శ్రీరాఘవార్థంబు = శ్రీరామచంద్రమూర్తి కార్యార్థమై.

తా త్ప ర్య ము.

విశేషముగ ధ్వనించు వీణెలయు, తాళములయు, మేళములయు ధ్వనులచేతను, బకపక నవ్వుల యతిశయములచేతను, వజ్రాంకుశ సమానములైన వజ్రములచేతను, సొమ్ములచేతను నొప్పుచున్న మేలియిండ్లచేతను, మేఘములచే నొప్పు నాకాశమో యనునట్లు ప్రకాశించి తెల్లని మేఘకాంతి కలిగి యతిశయ మహిమగల స్వస్తికము, పద్మము, వర్ధమానము నను నాకారములు గల రాక్షసుల యిండ్ల సమూహముల చేతను, చిత్రములైన మాల్యములచేతను, భూషణముల చేతను కాంతిగల పట్టనమును జూచి మిగుల సంతోషించి సుగ్రీవునకు మేలుచేయగోరు హనుమంతుఁడు శ్రీరామ కార్యార్థమై లోపలికిఁ బోయి చూడఁ బ్రయత్నించి మిగుల సంతోషించెను.

తే. ఈగతిని నింటి కింటికి♦నేగుచోటఁ, గనియె నానావిధాకృతుల్♦గలిగి వెలయు
మందిరంబులు నసమాన♦సుందరములు, నయనపర్వంబుగా వాయు♦నందనుండు.

తా త్ప ర్య ము.

ఈ విధముగ నింటింటికిఁ బోవుచుఁ బెక్కురూపములుగలిగి యసమానములు సుందరంబులు నగు నిండ్లను గన్నుల పండువుగా వాయుపుత్రుఁడు చూచెను.

ఉ. వీనుల కింపు గూరుప ది♦విన్ సురకన్యలువోలె నందుఁ ద్రి
స్థానమనోహరస్వరయు♦తంబుగ మాదసమృద్ధదైత్యకం
జానన లోలి గానరస♦మాదట నంచుట హారిరత్న కాం
చీనినదంబు నూపురవి♦శిష్టఝుళంఝుళ శింజితంబులున్. ౧౦౯

అర్థములు. త్రిస్థాన = ఱొమ్ము, కంఠము, శిరము, ఈ మూఁడు స్థానములఁ బుట్టిన, మనోహర=మనస్సు నాకర్షించు, స్వరయుతంబుగన్=మంద్ర మధ్యమ తార స్వరములతో, యాద, రూ. మదము=మదముచే వృద్ధిపొందిన, దైత్యకంజాననలు = రాక్షస స్త్రీలు, ఆదటన్=ప్రేమతో, హారి=మనోహరమైన, రత్నకాంచీనినదంబు = రత్నములు చెక్కిన యొడ్డాణముల ధ్వని, నూపుర = అందెల. విశిష్ట శ్రేష్ఠమైన, ఝుళంఝుళ శింజితంబులున్=ఝుళంఝుళ ధ్వనులు, వీరు చిత్రిణీజాతి స్త్రీలు.

"వ్రజతి రతిసుఖార్థం చిత్రిణీ మగ్రయామే, భజతి దినరజన్యో ర్హస్తినీం చ ద్వితీయే గమయతిచ తృతీయే శంఖినీ మార్ధ్రభావం రమయతి రమణీయాం పద్మినీం తుర్యయామే." రాత్రి మొదటియామమున రతి గోరునది చిత్రిణి, రెండవజామునఁ గోరునది హస్తిని, మూఁడవజామునఁ గోరునది శంఖిని, నాలుగవజామునఁ గోరునది పద్మిని.

తా త్ప ర్య ము.

స్వర్గమునందు దేవతాస్త్రీ వలె లంకయందు ఱొమ్ము కంఠము శిరము నను మూఁడు స్థానములయందుఁ బుట్టిన మనోహరమైన మంద్ర మధ్యమ తారములను స్వరములతోఁ గూడినట్లు పూర్ణమదముగల రాక్షస స్త్రీ లాసక్తితోఁ జేయు గాన ధ్వనులను మనోహరములయి రత్నములు చెక్కఁబడిన యొడ్డాణములందలి చిఱుగజ్జెల ధ్వనులును, అందెల ఝుళంఝుళ ధ్వనులును.

సీ. సోపాననాదముల్ ♦ శూరభుజాస్ఫాల,నంబులు భీమకం♦ఠరవములును
జాపకమాంత్రిక♦స్వనము లాకర్ణించె, స్వాధ్యాయరతుల ని♦శాచరేంద్ర
సంస్తవశీలురఁ ♦ జక్కఁగఁ గనుఁగొని, రాజమార్గస్థచ♦క్రముల రాజ
చారుల గర్జన్ని♦శాటుల దీక్షిత,జటిలముండుల వృష♦చర్మధరుల
తే. దర్భముష్టిప్రహరణుల ♦ దహనకుండ
సాధనులఁ గూటముద్గర ♦ శస్త్రధరుల
నొంటి కన్నొక్క చెవియు లం♦బోదరములు
వ్రేలుగొప్పులుఁ గలవారి ♦ వేడ్కఁగనియె. ౧౯౦

అర్థములు. సోపాననాదముల్ = స్వర్ణరత్నమయములైన మెట్లకు నందెలు లోనైనవి తగులఁగాఁ గలిగిన ధ్వనులును, సోపానము కూ. సౌపానము. శూర భుజాస్ఫాలనంబులు = శూరులు భుజము లప్పళించు ధ్వనులు, భీమకంఠరవములును = భయంకర కంఠధ్వనులును, జాపక మాంత్రికస్వరములు = జపము చేయువారి యొక్కయు, వేదాది మంత్రము లుచ్చరించు వారియొక్కయు ధ్వనులును, స్వాధ్యాయ రతులన్ = వేదాధ్యయనము చేయువారలను నిశాచరేంద్ర సంస్తవ శీలురను = రావణుని బొగడువారిని, రాజమార్గస్థచక్రములను = రాచబాటలయందు నడుమ గుంపులుగఁ జేరినవారిని, రాజచారులన్ = వేగువాండ్రను, గర్జన్నిశాటులన్ = సింహనాదము జేయు రాక్షసులను, దీక్షిత జటిలముండులను = దీక్షవహించిన జడదారులను; బోడులను; వృషచర్మధరులన్ = ఎద్దు చర్మమును ధరించినవారిని, దర్భముష్టి ప్రహరణులన్ = దర్భలను బిడికిళ్ళలో నాయుధములుగా నుంచుకొన్నవారిని, దర్భను చేతనుంచుకొని సత్కార్యానుష్ఠానము చేసిన శత్రువులు నశింతురు.

యథావజ్రం హరేః పాణౌ, తథా విప్రకరే కుశః

ఇంద్రునిచేతి వజ్రాయుధ మెట్టిదో బ్రాహ్మణునిచేతి దర్భయట్టిది. దహనకుండ సాధనులన్ = నిప్పుగుండమే యాయుధముగాఁ గలవారిని, శత్రునాశార్థము నిప్పుగుండమున హోమము చేసి కృత్యను గలిగింతురు గావున వాని నాయుధముగాఁ జెప్పెను. లంబోదరములు = వ్రేలాడు పొట్టలు.

తాత్పర్యము.

అందెలు మెట్టెలు పాముజీలు లోనగు కాలియాభరణములు మెట్లకుఁ దగులఁగాఁ బుట్టిన చప్పుడులు శూరులు భుజములు తట్టుకొనఁగాఁ బుట్టిన ధ్వనులు వీరుల భయంకరములైన సింహనాదములు జపములు చేయు వారియొక్కయు మాంత్రికుల యొక్కయు ధ్వనులను వినెను. వేదాధ్యయనము చేయువారలను, రావణు పొగడు స్వభావముగల వారలను (వీరు రాక్షస వంది మాగధులు) రాచబాటల నడుమ నిలఁబడిన గుంపులను, వేగు వాండ్రను, గర్జించు రాక్షసులను, దీక్ష గొన్న వారిని జడలు పెంచుకొన్నవారిని, బోడి తలల వారిని (రాక్షస సన్న్యాసులు) ఎద్దు చర్మ

ములను ధరించిన వారిని చర్మపిడికిళ్లు నగ్నికుండములు నాయుధములుగాఁ గలవారిని, సమ్మెటలు ఇనుప గుదియలు ధరించిన వారిని, ఒంటికన్ను, ఒంటిచెవి, వ్రేలాడు పొట్టలు, వ్రేలాడుతొమ్ములు గలవారిని హనుమంతుఁడు చూచెను.

సీ. వికటకరాళుల ♦ విపులకోదండుల, వామనులను భుగ్న♦వక్త్రయుతుల
ఖడ్గుల ముసలులఁ♦గవచులఁ బరిఘాయు,ధులను శతఘ్న్యాయు♦ధులను మఱియు
నాధికస్థూలుల ♦నాతికృశాంగుల, నాతిదీర్ఘుల నాతి ♦ హ్రస్వకులను
నాతిగౌరాంగుల ♦ నాతికృష్ణాంగుల, నాతివామనులను ♦ నాతికుబ్జ
తే. కులను బహురూపులను విరూ♦పుల సురూపు
లను సువర్చసులను బతా♦కినిచయముల
ధ్వజుల వివిధాయుధుల శక్తి♦కుజధరులను
బట్టిసాయుధులను గాడ్పు♦పట్టి గనియె. ౧౯

అర్థములు. వికట కరాళులన్ = భయంకరములైన మిట్టపండ్లవాండ్రను, విపుల కోదండుల = పెద్దవిండ్లను ధరించినవారిని, వామనులను = పొట్టివారిని, భుగ్న వక్త్రయుతులన్ = వంకరయగు నోళ్ళతోఁగూడినవారిని, ఖడ్గులన్ = ఖడ్గములను ధరించిన వారిని, ముసలులన్ = రోఁకండ్లన్ ధరించినవారిని, కవచులన్ = కవచముల దొడిగిన వారిని, పరిఘాయుధులను = ఇనుపకట్ల గుదియలు ధరించినవారిని, శతఘ్న్యాయుధులను = శతఘ్ను లాయుధములుగాఁ గలవారిని. 'అయః కంటక సంఛన్నా శతఘ్నీ పరికీర్తితా' వైజయంతి. నూఱుమేకుల యినుపగద శతఘ్ని యనఁబడును. నాధిక స్థూలులన్ = మిక్కిలి స్థూలములుకాని దేహములు గలవారిని, నాతికృశాంగులన్ = మిక్కిలి కృశింపని దేహములు గలవారిని, నాతిదీర్ఘులన్ = మిక్కిలి పొడవు కాని వారిని, నాతిహ్రస్వులను = మిక్కిలి పొట్టిగాని వారిని, నాతిగౌరాంగులన్ = మిగులఁ బచ్చని కాని శరీరము గలవారిని, నాతికృష్ణాంగులను = మిగుల నలుపుగాని వారిని, నాతివామనులను = మఱుగుజ్జులు కాని వారిని, నాతికుబ్జకులను = విశేషము గూని లేని వారిని, బహురూపులను = అనేకవిధములైన యాకారములు గలవారిని, సురూపులను = చక్కఁదనము గలవారిని, సువర్చసులను = మంచికాంతి గలవారిని, పతాకినిచయములను = చిన్నధ్వజములు పట్టుకొన్నవారిని, ధ్వజులన్ = పెద్దజెండాలను బట్టుకొన్న వారిని, వివిధాయుధులను = పెక్కుతెగల యాయుధములను ధరించినవారిని, శక్తికుజధరులను = శక్తులను జెట్లను ధరించిన వారిని, పట్టిసాయుధులను = కటారు లాయుధములుగాఁ గలవారిని, గాడ్పుపట్టి = వాయుపుత్రుఁడు, కనియెన్ = చూచెను.

తాత్పర్యము.

మిట్టపండ్ల వాండ్రను, పెద్దవిండ్ల వాండ్రను, పొట్టివాండ్రను, వంకర నోటి వాండ్రను, బాకులు రోఁకండ్లు గుదియలు ఇనుపముండ్ల గదలు ఆయుధములుగఁ గల

వాండ్రను, కవచములు దొడిగినవాండ్రను, మిక్కిలి లావులేనివాండ్రను, మిక్కిలి కృశించినవారుగాని వాండ్రను, మిగులఁ బొడవుగాని వాండ్రను, మిగులఁ బొట్టిగాని వాండ్రను, మిక్కిలి పసిమిలేని దేహముల వాండ్రను, కాఱు నలుపుగాని వాండ్రను, మిక్కిలి పొట్టిగాని వాండ్రను, మిక్కిలి గూనులుగాని వాండ్రను, అనేక రూపములు గల వారిని, వికార రూపములు గల వాండ్రను, సుందరులను, సుకాంతులను, గుర్తులు లేని ఒక్కములు గలవాండ్రను, గుర్తులుగల ఒక్కముల వాండ్రను, నానాయుధములవాండ్రను, శక్తులు వృక్షములు ధరించినవాండ్రనుఁ కటారులను గలవారిని వాయునందనుఁడు చూచెను.

తే. క్షేపణీపాశకరుల నా♦లేపరతుల, మాల్యవిలసితతనుల న♦మూల్యభూరి
భూషణుల స్వైరుల ననేక ♦ వేషయుతుల, వేలకొలఁదుల గనియెనా♦భీమబలుఁడు.

అర్థములు. క్షేపణీ పాశకరులను=వలలను పాశాయుధములను జేత ధరించిన వారిని, ఆలేపరతులన్=గంధము పూసికొనుటయం దాశగలవారిని, మాల్య విలసిత తనులన్=పూలదండలచేఁ బ్రకాశించు దేహములు గలవారిని, అమూల్య=వెలలేని, భూరిభూషణులను=గొప్పసొమ్ములు ధరించిన వారిని, స్వైరులన్ = స్వేచ్ఛగా సంచరించువారిని, అనేక వేషయుతులన్=పలువిధము లయిన వేషములు వేసినవారిని.

తా త్ప ర్య ము .

వలలు, పాశములు చేత గల వారిని, దండిగ గంధము పూసి కొన్నవారిని, పూలదండలు ధరించిన వారిని, వెలలేని గొప్పయాభరణముల నలంకరించుకొన్న వారిని, నిష్టముకొలఁది తిరుగువారిని, నానావిధాలంకారము చేసికొనిన వారిని, వేలకొలఁదులను నా భయంకరబలము గల హనుమ చూచెను.

ఆ. భయదశూలధరుల ♦ వజ్రహస్తకులను, బంక్తికంఠు నాజ్ఞఁ ♦ బట్టనమున
నడిమిగుల్మ మగుచుఁ♦గడు హెచ్చరిక నింటె,నుందు గ్రాలఁగనియె♦మూలబలము.

అర్థములు. భయదశూల ధరులన్=భయంకరములైన శూలములను ధరించిన వారిని, వజ్రహస్తకులను = వజ్రాయుధములను ధరించిన వారిని (ఇవి యింద్రుని వజ్రములు గావు. ఆ యాకారముగ సిద్ధము చేసినవి) జూచెను. నడిమిగుల్మము=పట్టనము నడుమ నున్న సైన్య సమూహము.

తా త్ప ర్య ము .

భయంకరములైన ముమ్మొనయాయుధముల ధరించిన వారిని ఇంద్రుని వజ్రము వంటి యాయుధములు చేతియందుఁ గల వారిని జూచెను. మఱియు రావణుని యాజ్ఞప్రకారము పట్టనము నడుమ రావణుని యింటిముందు హెచ్చరికగల మూల బలము (Reserved force) ను జూచెను.

క. బంగరుతోరణములను జె,లంగుచు గిరిశిఖరసీమ♦లన్ వెలిదమ్ముల్
రంగగు నగ్తతోడ వె,లింగెడిప్రాకారమున ల♦లింగొమ రొప్పన్. ౧౯౪

అర్థములు. వెలిదమ్ముల్ = తెల్లతామరలు, రంగగు = అందమైన, ఈ మూఁడు పద్యము లేకాన్వయము; ఇందలి విశేషణములకు రాణివాసము (౧౮౬ వ. ప.) విశేష్యము.

తాత్పర్యము.

బంగారు తోరణములు గలిగి కొండ శిఖరములందుఁ దెల్లఁదామరలు గల యగడ్తలతో వెలింగెడి ప్రాకారము గలదై.

చ. అమరనివాసతుల్యమయి ♦ హారినినాదయుతంబునై తురం
గమపటుహేషితంబు నయి ♦ క్రమవిభూషణశింజితంబునై
విమలవిమానయానరథ♦విశ్రుతవారణమత్తపక్షిసం
ఘమృగమనోహరంబు నయి ♦ గ్రాలు మహాబలయోధగుప్తముఁ. ౧౮౫

అర్థములు. అమరనివాస తుల్యమయి=స్వర్గముతో సమానమై, నినాదము=ధ్వని, తురంగమ పటుహేషితంబు నయి=గుఱ్ఱముల గొప్ప సకిలింపులుగలదై, క్రమ విభూషణ శింజితంబునై = మనోజ్ఞములైన యాభరణముల ధ్వనులు గలదై, విమానము=ఆకాశమున సంచరించు వాహనము, యానము=పల్లకి మొదలయినవి, వారణ=ఏనుఁగులు, మహాబల యోధగుప్తముఁ = మిగుల బలముగల యోధులచే రక్షింపఁబడినది.

తాత్పర్యము.

స్వర్గముతో సమానమై మనోహర ధ్వనులతోఁ గూడినదై గుఱ్ఱముల గట్టి సకిలింతలు గలదై, మనోహరమైన భూషణ ధ్వనులు గలదై, ఆకాశ యానములు పల్లకులు తేర్లు ప్రసిద్ధి కెక్కిన యేనుఁగులు మదించిన పక్షులసంఘములు జింకలు వీనిచే నందమై మిగుల బలవంతులగు యుద్ధభటులచే రక్షింపఁబడినదై.

వంశస్థము. సహేమరత్నోజ్జ్వల♦చక్రవాళముఁ, మహార్హముక్తామణి♦మండితాంతముఁ
మహాసితాభ్రాగురు♦మంజుగంధమై, రహించురక్షోధిపు♦రాణివాసముఁ.

అర్థములు. సహేమ రత్నోజ్జ్వల చక్రవాళముఁ = బంగారుతోఁగూడి రత్నములచే వెలింగెడి ప్రాకార వలయము గలదానిని, మహార్హ=మిక్కిలి వెలగల, ముక్తామణి = ముత్యములచే మణులచే, మండితాంతముఁ = అలంకరింపఁబడిన లోపలి భాగముగలదానిని, మహాసిత=మిగుల నలుపైన, అభ్ర = మబ్బువంటి రంగుగల, అగురు = అగురు చెక్కయొక్క, మంజుగంధమై = మనోహరమైన వాసనగలదై, రహించు=ప్రకాశించు, రాణివాసముఁ = అంతఃపురమును, పై పద్యములోని కనుఁగొని తో నన్వయము. వంశస్థము. జత జరగణములు. ఎనిమిదింట యతి.

తాత్పర్యము.

బంగారుతోఁగూడిన రత్నములచేఁ బ్రకాశించు ప్రాకారవలయము గలది యును, మిగుల వెలగల ముత్యములచేతను రత్నములచేతను నలంకరింపఁబడిన మధ్య

భాగము గలదియును, కారుమబ్బువలె నల్లనైన యగురు చెక్కల కమ్మని వాసన గలదియు నయిన రావణుని అంతఃపురమును జూచెను:

—♦ ౫–వ సర్గము. చంద్రవర్ణనము ♦—

క. కనుఁగొని కేసరిసూనుఁడు, చనె లోనికి రామచంద్రు♦సతి నెమకంగా
విను వీదిని మధ్యంబున, జనలోచనపర్వముగను♦జంద్రుఁడు వెలిఁగెన్. ౧౯౭

అర్థములు. లోనికిఁజనెన్=లోపలికిఁ బోయెను. అనుటచే నింతవఱకుఁ బట్టణమున సంచరించెననియు రావణు నంతఃపురము వెలుపలి నుండి చూచి యిప్పుడు లోపలఁ బ్రవేశించెననియు నెఱుఁగనగు. వినువీదిని మధ్యంబునన్ = ఆకాశమధ్యమందు, జనలోచన పర్వముగను = జనుల కనుల పండువుగ, శుద్ధత్రయోదశినాఁడు ఆకాశ మధ్యంబునఁ జంద్రుఁడు వెలిఁగె ననుటచే నిప్పుడు సరిగా తొమ్మిదిన్నరగంట యని యేర్పడు చున్నది.

లయగ్రాహి. అంత హనుమంతుఁడు న♦భోంతరమునం గనియె
వింత లగు వెన్నెలల♦కాంతులు వెలుంగన్
గాంత మగుమంద వృష ♦ కాంతునిగతిన్ మలయు
చంతట జగంబు ని♦తాంతరుచి మీఱన్
స్వాంతములు హాయి గొన♦సంతసమునన్ జలధి
కాంతుఁడు తరంగముల♦గంతులిడునట్లా
శాంతముల నంటునటు♦లెంతయును జేయు నుడు
కాంతు జనసంచయదు♦రంత దురితాంతున్. ౧౯౮

అర్థములు. అంత హనుమంతుఁ డుడుకాంతుని నభోంతరమునం గనియె నని యన్వయము. తక్కిన పదములలోఁగొన్ని క్రియాంతములు గలవి. మఱికొన్ని యుడు కాంతునితో నన్వయించును. వెలుంగన్, మీఱన్—ఇవి మలయుచు నను దానితో నన్వయించును. మలయుచున్—చేయుతో నన్వయించును. చేయు—ఉడుకాంతుని విశేషణము. నభోంతరమున = ఆకాశమధ్యమందు. మందన్ = మందయందు, వృష కాంతునిగతిన్ = పెద్దయెద్దువలె, నితాంతరుచి = మిగులఁ గాంతి, స్వాంతమును = మనస్సులు, జలధికాంతుఁడు = సముద్రరాజు, తరంగములన్ = అలలచే, ఆశాంత ములన్=దిక్కులకొనలయందు, ఉడుకాంతున్ = నక్షత్ర పతిని, చంద్రుని, జన సంచయ=మనుష్యసమూహముల, దురంత = అంతములేని, దురితాంతున్ = పాపముల నాశముఁ జేయువానిని.

## తాత్పర్యము.

అంతట హనుమంతుఁడు ఆకాశ మధ్యమందుఁ జంద్రుని జూచెను. ఎట్టి చంద్రుని ననిన – వినోదకరమైన వెన్నెల కాంతులు వెలుఁగఁగ నందమైన మంద

యందు వృషభమువలె సంచరించుచుఁ బ్రపంచమం దంతట తన విశేషకాంతి వ్యాపింపఁగా నా కారణమున జనముల మనస్సులు సుఖపడగా సముద్రు డుప్పొంగుటచే నృత్యమాడు చున్నాఁడా యన్నట్లు అతని పెద్దయలలచే దిక్కుల నంటుచున్నట్లు చేయుచు జన సమూహముల యంతము లేని దుఃఖము నాశము చేయుచుండు చంద్రుని జూచెను. చంద్రుఁడు సంతోషకారి గావున నాయనను జూచిన వారికి సంతోషము కలుగునని భావము. లయగ్రాహి :—భజసన, భజసన భయ గణములు. ఈపద్యమందుఁ బ్రాస యతియేకాని యతిలేదు. ఇది సమవృత్తము లందుఁ జేరినదికాదు. మాలికావృత్తములందుఁ జేరినది.

ఇంబడరఁగా భజసనంబులతుదన్ భజసనంబుల పదంపడి భయంబులు లయగ్రాహిం బరఁగు ప్రాసవిరమంబు నలుమాఱు గుదురం బటుకవీశులు తిరంబుగ వచింతురన్. క॥ ముప్పదితొమ్మిది మాత్రల, ముప్పది యక్కరముల పదముల యంఘ్రులు నా,ల్గొప్ప యతిప్రాసంబులు, గుప్ప లయగ్రాహి యనఁగఁ గొమరొందు హరీ. అప్పకవీయము. ౪ అ.

చారుమతి. ఏ కాంతి పొల్చునొ మహీస్థలి మందరస్థమై
యే కాంతి సంజ రహియించు నదీశ్వరస్థమై
యేకాంతి యొప్పు సరసీద్ధకరోరుహస్థమై
యా కాంతి యప్డు పొలుపారె నిశాకరస్థమై ౯౯

అర్థములు. మందరస్థము = మందర పర్వతమందుండునది, సంజన్ = సాయంకాలమందు, నదీశ్వరస్థము = సముద్రమం దుండునది, సరసిద్ధ సరోరుహస్థము = సరసులందుఁ బ్రకాశించు కమలములందుండునది, నిశాకరస్థము = చంద్రునియందుండునది, పదార్థ వృత్తి నిదర్శనాలంకారము. ఉపమానగుణమే యుపమేయమందుఁ జెప్పఁబడెను.

తాత్పర్యము.

భూమియందు మందర పర్వతంబున నెట్టి కాంతియుండునో, సాయంకాలమున సముద్రమునం దెట్టి కాంతి యుండునో, సరస్సులందలి కమలంబులం దే కాంతి యుండునో యటువంటి కాంతి యప్పుడు చంద్రునం దుండెను.

ఉ. రాజతపంజరస్థ మగు రాజమరాళము భంగి, మందర
భ్రాజితకందరస్థమృగరాజము పై ఖరి, భూరిదుర్మదో
ద్వేజకకుంజరస్థుఁ డగు వీరువిధంబునఁ, జంద్రుఁ డయ్యెడన్
రాజిలె నంబరస్థుఁ డయి రాజముఖీవదనాభిరాముఁడై. ౧౦౦

అర్థములు. రాజత పంజరస్థమగు = వెండి పంజరమందున్న, రాజ మరాళము భంగిన్ = రాజహంసవలె, వెన్నెలచే నాకాశము తెలుపై యందు చంద్రుఁడుండుటచే

నీ యుపమానము సార్థకము. పంజరములందుఁ జిలుకలు గోరువంకలు లోనైన వానినేగాక హంసలనుగూడ నుంతురు.

"కృష్ణత్వదీయపద పంకజ పంజరాంత మద్యైవ మేవిశతు మానస రాజహంసః" ముకుందమాల. వెండి పంజరమందలి తెల్లనిహంస యనుటచే ననుగుణాలంకారము. మందరభ్రాజితకందరస్థ=మందర పర్వతమందుఁ బ్రకాశించు గుహాయందున్న, మృగ రాజము వైఖరి=సింహామువలె, సింహాము తెలుపు, మందరము తెలుపు కావున నీ యుపమానము. భూరి = గొప్పదై, దుర్మద = చెడ్డ మదముచే, ఉద్వేజక = భయము కలిగించు, కుంజరస్థుఁడు = ఏనుఁగుపైనుండు వాఁడు, వీరు విధంబునన్ = వీరునివలె, ఆకాశము స్వభావమున నలుపు గావున నీ యుపమానము. అంబరస్థుఁడయి = ఆకాశమందున్నవాఁడై, ఇందు సాధారణ ధర్మము చెప్పలేదు కావున లుప్తోపమాలంకారము. రాజముఖీ వదనాభిరాముఁడై - రాజముఖీ=(చంద్రునివంటి ముఖముగల) స్త్రీల, వదన=ముఖమువలె, అభిరాముఁడై = మనోహర మైనవాఁడై, స్త్రీలముఖమువంటివాఁడు చంద్రుఁ డనుటచే నుపమేయోపమాలంకారము. ఉపమానోపమేయములు పర్యాయంబునఁ గల్పించిన నుపమేయోపమ యగు. ఇందు చంద్రునివంటి ముఖము, ముఖమువంటి చంద్రుండని కల్పింపఁబడెను.

తాత్పర్యము.

వెండి పంజరమందలి హంసవలె, మందర గుహాయందున్న సింహామువలె, నేనుఁగుపైనున్న వీరునివలె నాకాశమునఁ జంద్రుఁడు, చంద్రముఖుల ముఖమువలె మనోహరుఁడై యుండెను.

చ. బలిసినతీక్ష్ణశృంగవృష♦భంబువరంబు విధంబు దోఁపఁగా
సలలితహేమశృంగ మగు♦సామజరాజము నోడఁ బాండురో
జ్జ్వలితమహోచ్చ శృంగకర♦సాధరనాథు విధానఁ జంద్రుఁడుఁన్
వెలసెను బూర్ణశృంగుఁ డయి♦విశ్వమనోజ్ఞవిభానుషంగుఁడై. ౨౦౧

అర్థములు. తీక్ష్ణశృంగ వృషభంబు=వాఁడికొమ్ములుగల యెద్దు, హేమ శృంగ మగు=బంగారుకొమ్ములుగల, సామజరాజము నోజన్=గొప్ప యేనుగువలె, పాండురోజ్జ్వలిత=తెల్లగాఁ బ్రకాశించెడి, మహోచ్చ=మిక్కిలి యెత్తైన, శృంగక=శిఖరము గల, రసాధరనాథువిధానన్=శ్రేష్ఠమగు పర్వతమువలె, పూర్ణశృంగుఁడయి = నిండిన కొమ్ములుగలవాఁడు, పాడ్యామి విదియ తదియలందు చంద్రుని కొనలు తెలిసినట్లు త్రయోదశినాఁడు స్పష్టముగాఁ దెలియవు. కొంచెము తక్కువగాఁ బూర్ణబింబము వలె నుండును, ఇచ్చట శృంగ మనఁగా గిరణము లని చెప్పుట సరిగాదు. విశ్వ = లోకులకు, మనోజ్ఞ = ఇంపైన, విభా = కాంతిచే, అనుషంగుఁడై = కూడిన

వాఁడై, ఉత్తర శృంగమని, దక్షిణశృంగమని చంద్రుని కొనలకుఁ బేర్లు. ఇట్టి శృంగములు గల వాఁ డిప్పుడు శృంగములు లేనివాఁడై ప్రకాశించె నని భావము.

తా త్ప ర్య ము.

బలసిన వాడి కొమ్ములుగల యెద్దువలె బంగారు కొమ్ములు గల యేనుఁగువలె తెల్లని యెత్తైన శిఖరము గల కొండవలె నుండు చంద్రుఁ డిప్పుడు పరిపూర్ణశృంగుఁడై లోకముల కింపైన కాంతి గలవాఁడై ప్రకాశించెను.

వంశస్థము.. వినష్టశీతోదక బిందుపంకుఁడుఁ, ఘనగ్రహగ్రాహవినష్టపంకుఁడుఁ
వినోదలక్ష్మ్యాశ్రయనిర్మలాంకుఁడుఁ, వినిద్రరుగ్యుక్తిఁజనేఁ శశాంకుఁడుఁ.

అర్థములు. వినష్ట = నశించిన, ఇది పంక విశేషణము, శీతోదక = మంచు యొక్క, బిందు=తుంపరలను, పంకుఁడు=మాలిన్యము కలవాఁడు, అట్టి మాలిన్యము లేదని భావము, ఇది చంద్రుని యందు సూర్యకిరణ సంబంధము చేత నని యెఱుఁగునది. ఇట్లు చెప్పుటచే మంచుకాలము పోయినదని భావము. కావున నది ఫాల్గునమధ్యమే. ఘనగ్రహ గ్రాహ వినష్టపంకుఁడుఁ=(౧) ఘనగ్రహ=గొప్ప గ్రహములైన బృహస్పత్యాదులను, గ్రాహ=తనకిరణములచేఁ గప్పుటచేత, వినష్ట=నశించిన, పంకుఁడుఁ = కాంతి హీనత కలవాఁడు, తన కిరణములచే నితరగ్రహములను గాంతి తగ్గించి, తాను జక్కఁగ వెలుఁగుచున్నాఁడని భావము. (౨) ఘనగ్రహ=గొప్పగ్రహమైన సూర్యుని యొక్క, గ్రాహ = కిరణ సంబంధముచే, వినష్ట = నశించిన, పంకుఁడుఁ = చీఁకటి గలవాఁడును. సూర్యకిరణ సంబంధముచేఁ దాను వెలుగుచుఁ జీఁకటిని దొలఁగించుచున్నాఁడని భావము. 'సలిలమయే శశిని రవే ర్దీధితయో మూర్ఛితా స్తమోనైశం। క్షపయంతి దర్పణోదర నిహితా ఇవమందిరస్యాంతః॥' అను వరాహమిహిరాచార్యుని వాక్యము ప్రమాణము. సూర్యకాంతి యద్దముపైఁ బడి నేని యెట్లు ప్రతిఫలించునో యట్లే జలమయమైన చంద్రునియందుఁ బడిన సూర్యకాంతి ప్రతిఫలించి వెన్నెలగా వ్యాపించును.

వినోద లక్ష్మ్యాశ్రయ నిర్మలాంకుఁడుఁ = వినోద=ఆశ్చర్యకరమైన. లక్ష్మి= కాంతి విశేషమునకు, ఆశ్రయుఁడు కావున నిర్మలమైన కళంకముగలవాఁడు, అంకము= చిహ్నము, కళంకము తెల్లగా నున్న చంద్రునియందు నతని కళంకము పరభాగము చెంది వెలుఁగుచున్నదని భావము. శశాంకుఁడుఁ=కుందేటివంటి మచ్చగలవాఁడు. చంద్రునియందు భూచ్ఛాయ కుందేటివలెఁ బ్రతిఫలించుచున్నది. "లోకచ్ఛాయ మయం లక్ష్మ తవాంకే శశసన్నిభమ్" అని హరివంశము. 'భూచ్ఛాయ మైచ్ఛన్నరే' బిల్హణుఁడు. వినిద్రరుక్+యుక్తిఁ-అధిక కాంతితోఁ గూడిన వాఁడయి.

తా త్ప ర్య ము.

నశించిన మంచు బిందువుల మాలిన్యము కలవాఁడును, తన కాంతిచే బృహ

స్పతి మొదలగు పెద్ద గ్రహములకాంతి గప్పినవాఁడును, ఆశ్చర్యకరమైన కాంతి కాశ్రయమై నిర్మలమైనయంకము గలవాఁడునై విశేషకాంతితోఁ జంద్రుఁడు పోయెను.

క. చంద్రుఁడు విపులశిలాస్థమృ, గేంద్రుఁడునా, భీమసమర♦పృథ్వీగతనా
గేంద్రుఁడునా, రాజ్యాప్తిన, రేంద్రుఁడునా, వెలసె సితఖ♦గేంద్రుని మాడ్కిన్.

అర్థములు. విపుల శిలాస్థ మృగేంద్రుఁడు = విశాలమైన రాతిమీఁద నుండు సింహము, భీమసమరపృథ్వీగత = భయంకర యుద్ధభూమియందున్న, నాగేంద్రుఁడు= పెద్దయేనుఁగు, సితఖగేంద్రుని మాడ్కిన్= తెల్లని పక్షిరాజమువలె, హంసవలె.

తాత్పర్యము.

విశాలమైన బండపైఁ గూర్చుండిన సింహమో, భయంకర యుద్ధభూమియందున్న పెద్దయేనుఁగో, (ఐరావతము) రాజ్యము లభించిన రాజో యనునట్లు, హంసము వలెఁ బ్రకాశించెను.

దీనివలనఁ జంద్రబింబము నిర్మలముగా నుండెనని భావము.

శా. రాజద్రాజవినష్టదోషము,సురా♦రాతిప్రవారామిష
భ్రాజద్భోజనవృత్తదోషము, లస♦ద్రామాభిరామేరితో
ద్వేజన్మానసదేశ దోష, మగుచున్ ♦ వేడ్కం బ్రదోషంబు స్వా
రాజావాససమానతోషణము నై ♦ రాజిల్లెఁ దేజంబునన్. ౨౦౪

అర్థములు. రాజత్ =ప్రకాశించు చున్న, రాజ=చంద్రునిచే ; వినష్ట = నాశమైన, దోషము = చీఁకటి గలది,సురారాతి ప్రవార = రాక్షస సమూహములయు, ఆమిష భ్రాజత్ + భోజన = మాంసమును జక్కఁగా భుజించువారియు, వృత్త దోషము=కలిగిన దోషము కలది, సంచార మనెడి దోషము గలది. రాత్రులందు రాక్షసులయు, మాంసభక్షకము లయిన మృగములయు సంచారము కలది. లసత్ = ప్రకాశించు, రామా+అభిరామ = స్త్రీ పురుషుల, ఈరిత=ప్రేరింపఁబడిన, ఉద్వేజత్ = మన్మథతాపముచే భయ పడుచు చున్న, మానస దేశ = మనస్సునందు, దోషము = దోషము, ప్రణయ కలహము గలది. చంద్రుఁడు విరహిణీ విరహులకు భయంకరుఁడు గదా, ప్రదోషంబు=ప్రదోషకాలము. ఈ దినము త్రయోదశి.

"త్రయోదశీ యదా రాత్రౌ, యామ స్త్రత్రనిశాముఖే ప్రదోష ఇతి విజ్ఞేయా, జ్ఞానార్థమాన మాచరేత్।" అను వాక్యమునుబట్టి యిప్పుడు తొమ్మిదిన్నర గంటయే యగుటచేఁ బ్రదోషమున్నది కాని పోలేదు. కొందఱు తలఁచినట్టులది యర్ధరాత్రము గాదు. స్వారాజ=స్వర్ + రాజ=స్వారాజ = ఇంద్రుని, ఆవాస = నివాసమైన స్వర్గముతో సమానముగా, తోషణము=సంతోషము కలిగించునది.

తాత్పర్యము.

ఆ ప్రదోషకాలము ప్రకాశించు చంద్రునిచే నాశమైన చీఁకటి గలదియు, రాక్షసులయు, మాంసము భుజించు మృగములయు సంచారము గలదియు స్త్రీ పురు

షుల మదన తాపముచేఁ గలిగిన మనస్సునందలి ప్రణయకోపము గలదియునై స్వర్గ లోక సంతోషము వంటి సంతోషమును తన తేజస్సుచేఁ గలిగించెను.

ఉ. అత్తఱిఁ దంత్రినాద మల♦రారెను గర్ణసుఖప్రవృత్తమై
బిత్తరి మొత్తముల్ నిదుర♦పెల్చన నొప్పె హృదీశ వృత్తమై
హత్తెను గ్రూరశీలపిశి♦తాశనసంఘము రౌద్రవృత్తమై
తత్తఱచే వియుక్తవని♦తాతతి గుందె సుమేషుకృత్తమై.

తత్తఱచే వియుక్తవని♦తాతతి గుందె సుమేషుకృత్తమై. ౨౦౫

అర్థములు. అత్తఱిఁ = ఆ సమయమందు, తంత్రినాదము = వీణెలు వాయిం పఁగాఁ బుట్టిన నాదము, కర్ణసుఖ ప్రవృత్తమై = చెవులకు సుఖము కలిగించునదియై, బిత్తరి మొత్తముల్ = స్త్రీల గుంపులు, పెల్చన = అతిశయముచే, హృదీశవృత్తమై = భర్తల ననుసరించునదియై, క్రూరశీల = హింసాభావముగల, పిశితాశన సంఘము = మాంసముభక్షించువారిసమూహము, రౌద్రవృత్తమై = భయంకర వ్యాపారముగలదై హత్తెను = ఒప్పెను, వియుక్త వనితాతతి = భర్తల విడిచియుండు స్త్రీజనము, సుమేషు కృత్తమై = మన్మథుని పూల బాణములచేఁ జీల్పఁబడినదై, కుందెఁ = దుఃఖించెను.

తాత్పర్యము.

ఆ సమయంబునఁ గర్ణ రసాయనంబుగా వీణానాదము వినవచ్చెను. శృంగార చేష్టలు గల యువతులు నిద్ర యతిశయముచే భర్తల ననుసరించిరి. హింసాశక్తిగల మాంసభక్షక సంఘము రౌద్రకార్యములు చేయసాగెను. భర్తలను విడిచియుండు స్త్రీలు మన్మథతాపముచే తత్తఱలాడి దుఃఖించిరి.

క. గృహములు మత్తోన్మత్తని,వహములు రథగజతురంగ♦భద్రాసనసం
గ్రహములు శుభవీరరమా,వహములు గనుఁగొనియెఁ బ్లవఁగ♦వల్లభుఁ డచటన్.

అర్థములు. మత్త+ఉన్మత్త నివహములు = మత్త = మద్యపానముచే దేహ ములు తెలియనివారలయు, ఉన్మత్త = చేయవలసిన కార్యముల మఱచినవారలయు, నివహములు = సమూహములు, భద్రాసన = శుభకరములయినవాని సంపాదన కలది, శుభ = క్షేమకరములైన, వీరరమా = వీరలక్ష్మిని, ఆవహములు = కల్గినవి. గృహము లకు విశేషణములు. త్రిప్రాసకందము.

తాత్పర్యము.

మత్తులు నున్మత్తులు గలవియు, తేరు లేనుఁగులు గుఱ్ఱములు శుభాసనములు వీని సంపాదన గలవియు, వీరలక్ష్మిని గలవియు నగు గృహములను వానరపతి కనుఁ గొనియెను.

—♦ హనుమంతుఁడు లంకలో రాక్షసస్త్రీపురుషులఁ జూచుట ♦—

క. ఆక్షేపంబుల గురుభుజ,విక్షేపంబులను మత్తవివిధాలాపా
ధిక్షేపంబుల నన్యాధిక్షేపంబులఁ జెలంగు♦దితిజులఁ గాంచెన్. ౨౦౬

అర్థములు. ఆక్షేపంబులన్ = పరిహాసములచేతను, భుజవిక్షేపంబులను = ఒకరిపై నొకరు చేతులు వేసికొనుట చేతను, మత్త = మద్యపానముచే దేహము తెలియక చేసెడి, వివిధాలాపాధిక్షేపంబులన్ = నానావిధములైన మాటలు చెప్పుటచేతను, అన్యాధిక్షేపంబులన్ = ఇతరులను బెదరించుట చేతను.

తా త్ప ర్య ము .

ఒకరి నొకరు పరిహాస మాడుచు నొకరిపై నొకరు పూలో రాలో వేసికొనుచు మత్తతచేత నోరికి వచ్చినట్లు నానాభాషణము లాడుచు నితరులను బెదరించు రాక్షసులం జూచెను.

ఉ. ఱొమ్ములు విచ్చి దేహము తెలియంగక కూర్కెడివారి, స్త్రీలగా
త్రమ్ములఁ గాలుఁ జేయి రుచిరమ్ముగ వైచి పరున్నవారి, రూ
పమ్ములు పెక్కురీతులుగ భాసిలువారిని, సారభూరిచా
పమ్ములు మీటువారిఁ, గనెఁ బావని పౌరనిశావిహారులన్. ౨౦౮

తా త్ప ర్య ము .

ఱొమ్ములు తెఱచుకొని వెల్లకిలఁ బండుకొని నిద్ర పోవువారిని స్త్రీల దేహమ్ములపై నొక కాలు నొక చేయి వైచి ప్రక్కఁదిరిగి పండుకొన్నవారిని, నానావిధముల నలంకరించుకొన్నవారిని దృఢములైన పెద్ద విండ్లను మీటు వారిని పురవాసులైన రాత్రించరులగు రాక్షసులను మారుతి జూచెను.

ఉ. ముచ్చట లాడువారి, నగుముద్దుమొగంబులవారిఁ, నిద్ర క
న్గుఱిచ్చెడివారిఁ, జందనమనోహరలేపముఁ బూయువారి, లో
నెచ్చిన నర్మకోపమున నెంతయు నూర్చుచు నున్నవారి, సొం
పచ్చుపడంగఁ గాంతులను బ్రార్థన చేసెడివారిఁ గన్గొనెన్. ౨౦౯

అర్థములు. నర్మకోపము = భార్యాభర్తల ప్రేమ చూపక కోపము, ప్రణయకోపము.

తా త్ప ర్య ము .

ముచ్చట లాడుచున్న వారిని, నవ్వు ముద్దుమొగము గలవారిని నిద్రచే ఱెప్పలు మూఁతలు పడువారిని తమ భర్తలకు గంధము మొదలగు మనోహరములైన లేపములఁ బూయువారిని, భర్తలమీఁదఁ గోపగించి వారు పలుకరింప లేదని శ్వాసములు పుచ్చువారిని (కలహాంతరిత నాయిక) భర్తలను రతికై ప్రార్థించెడివారిని స్త్రీలను హనుమంతుఁడు చూచెను.

క. వినదద్గజములు సభ్య, ప్రణమత్పూజ్యులు హ్రదాంతరస్థితపూఘూ
నినదత్ఫణులను బోలెడి, వినిశ్వసద్వీరభటులు వెలయఁగఁ బురిలోన్. ౨౧౦

అర్థములు. వినదత్ + గజములు = ధ్వనించుచున్న యేనుఁగులు, సభ్యప్రణమత్ పూజ్యులు = పెద్దలకు నమస్కరించు పెద్దలు, హ్రదాంతర స్థిత = మడుఁ

గులో నుండు, ఘూఘూనినదత్ఫణులను = ఘూఘూ యను చున్న పాములను, వినిశ్వసత్ = ఊర్పులు పుచ్చుచున్న, వీరభటులు=వీరులగు భటులు.

తా త్ప ర్య ము.

విశేషముగ ఘీంకారములు చేయు నేనుఁగులు పెద్దలకు నమస్కరించు పెద్దలు, మడుఁగులో నుండి ఘూత్కారములు చేయు పాములవలె నూర్పులు పుచ్చు వీర భటులు, వీరిని బురమందు హనుమంతుఁడు చూచెను.

సీ. సంవిత్ప్రిధానుల ♦ సంశ్రద్దధానుల ♦ రుచిరాభిధానుల ♦ రూఢిమీఱు
విశ్వప్రధానుల ♦ వివిధవిధానులఁ, బురి యాతుధానులఁ ♦ బురుమనోజ్ఞ
రూపుల స్వగుణాను♦రూపుల నసమాన,రూపుల బహుగుణ♦దీపితులను
మఱియు విరూపుల ♦ మానితపరిశుద్ధ,భావలను మహానుభావురాండ్రఁ
ఆ. బావనాధిసక్త♦భావలఁ దారకా,పటలలసితసుప్ర♦భావలను స
మీరసుతుఁడు గాంచె ♦సారతరానంద,యుక్తి సౌధరాజి ♦ నుప్పరిగల. ౨౧౧

అర్థములు. సంవిత్ప్రిధానులన్ = గొప్ప బుద్ధిగలవారిని. సంశ్రద్దధానుల = శాస్త్రములందు మిగుల శ్రద్ధగలవారిని ; సంవిత్ప్రిధానులని వెంటనే సంశ్రద్ధధానులనుటచే సంవిత్ప్రిధానులనఁగా వేదబాహ్యులగు శూన్యవాదులగు బౌద్ధులనియు, సంశ్రద్దధానులనుటచే శాస్త్ర విశ్వాసము గల యాస్తికులనియుఁ దోఁచుచున్నది. శూన్యవాదులగు బౌద్ధుల సంవిత్తు శుష్కాద్వైత వేదాంతుల వ్యావహారిక సత్యము రెండు సమానములు. జాబాలి చేసిన యా వాదమునే శ్రీరామచంద్రమూర్తి ఖండించి యాయనను జీవాట్లు పెట్టెను. ఈ కారణముచే నిది బౌద్ధమతాంతరమని వ్రాయఁబడెనని తలఁపరాదు. కడపటి శాక్య బుద్ధుఁడు తా నేడవ బుద్ధుఁడనని తనకు ముందు తనవంటివా రార్గురు పోయిరని చెప్పెను. (చూ. అయో ౨౮౬౫-౨౮౬౬-౨౮౬౭ ప) రుచిరాభిధానులన్=మంచిపేర్లుగలవారిని, విశ్వప్రధానులన్= ప్రపంచమున మేటులను, వీరు సాంఖ్యులని తోఁచెడి, వివిధ విధానులన్=అనేకాకారములు గలవారిని, యాతుధాతులన్ = రాక్షసులను, పురుమనోజ్ఞరూపులన్ = మిగుల నందమయిన యాకారములుఁ గలవారినిఁ స్వగుణానురూపులన్=తమగుణమునకుఁ దగిన వ్యవహారములు గలవారిని, అసమాన రూపులన్ = ప్రకాశించు రూపములుఁ గల వారిని, బహుగుణ దీపితులన్ = అనేక గుణములచే వెలుఁగు వారిని, విరూపులన్ = వికారరూపముల, గలవారిని, యాతుధానులఁ గనుఁగొనెనని యన్వయము. ఇఁక స్త్రీలు వర్ణింపఁబడు చున్నారు. మానిత పరిశుద్ధభావలను=గౌరవింపఁబడు నిర్మలమైన మనస్సులు గలవారిని, మహానుభావురాండ్రన్=పాతివ్రత్యమను గొప్పమహిమగల వారలను, పావనాధి సక్తభావలన్=భర్తలయందుఁ బరిశుద్ధమైన ప్రేమగలవారిని, తారకాపటల = నక్షత్ర సమూహములవలె, లసిత=ప్రకాశించు,

సుప్రభావాలను = దొడ్డవైభవము గలవారిని, ఉప్పరిగలన్ = మేడలయందు, ఉపరి గృహము-తద్భవము ఉప్పరిగ.

తాత్పర్యము.

గొప్పబుద్ధి గలవారిని శాస్త్రవిశ్వాసము గలవారిని మంచిపేర్లు గలవారిని ప్రపంచమున మేటులను, అనేకాకారములు గలవారిని తమ గుణములకుఁ దగిన కార్యములు చేయువారిని ప్రకాశించు రూపములు గలవారిని అనేక గుణములచే వెలుఁగు వారిని వికార రూపములఁగలవారిని రాక్షసులను జూచెను. మఱియు నిర్మల మనసు గలవారలును పాతివ్రత్య మహిమ గలవారలును భర్తలందుఁ బరిశుద్ధమైన ప్రేమ గలవారును నక్షత్రములవలె వెలుఁగు వారలును నగు స్త్రీలను సౌధముల మేడలయందు హనుమంతుఁడు చూచెను.

చ. భరితత్రపోపగూఢలను♦భాస్వర మోహరసైకరూఢలన్
వరరమణోపగూఢలను♦వల్లభ మోహనకార్య మూఢలన్
సురుచిసుమోపగూఢవి♦సుందరలం బ్రమదోపగూఢలన్
వరమతిభర్తృపోఢలను♦వానర నేత గనె న్నవోఢలన్. ౧౮

అర్థములు. భరితత్రపా+ఉపగూఢలను = సంపూర్ణమైన సిగ్గుచే నావరింపఁబడిన వారిని, వీరు ముగ్ధనాయికలు, భాస్వర = ప్రకాశించు, మోహరసైక రూఢలన్ = ప్రేమరసమే ప్రధానముగాఁ గలవారిని, వీరు మధ్యనాయికలు, వర రమణోపగూఢలను = అంగముగల తమ భర్తలచేఁ గౌఁగిలింపబడిన వారిని, వీరు ప్రౌఢ నాయికలు, వల్లభ మోహన కార్యమూఢలన్ = తమ భర్తలను మోహింప జేయు విధము తెలియని వారిని, వీరు బాలనాయికలు. సురుచి = మంచి కాంతిగల, సుమోపగూఢ = పువ్వులచేఁ గప్పఁబడిన, కవిసుందరలన్ = ఆడు పక్షులవలె నందమైన వారిని, ప్రమద + ఉపగూఢలన్ = సంతోషముచేఁ గ్రమ్ముకొనఁబడిన వారిని, వరమతి భర్తృ + ఉపోఢలను = గొప్పబుద్ధిగల భర్తలచేఁ బోషింపఁబడు వారిని, నవోఢలన్ = స్త్రీలను.

ముగ్ధా మధ్యా ప్రౌఢా నాయికల లక్షణము నీ పద్యంబున నెఱుఁగనగు.

'నవనవకామ యౌవన సనాథయు నల్పరతంబు గల్గు న
య్యువిదయె ముగ్ధ; మధ్య సదృశోదిత యౌవనకామయై రతాం
త వివశయౌ లతాంగి; సతత ప్రథితోల్బణ కామ యౌవనో
త్సవయు రతాది మోహమును దాల్చుతలోదరి ప్రౌఢ దానగున్. నరస-. భూ.

తాత్పర్యము.

సంపూర్ణమైన సిగ్గుచే నావరింపఁబడిన వారిని, ప్రేమరసము ప్రధానముగాఁ గల వారిని, ప్రియునుగల భర్తలచేఁ గౌఁగిలింపఁబడిన వారిని, భర్తలను మోహింపఁ జేయు విధము దెలియని వారిని, చక్కని కాంతిగల పువ్వులచేఁ గప్పఁబడిన యాఁడు

పక్షులవలె నందమైన వారిని మిగుల సంతోషముచేఁ గ్రమ్ముకొనఁబడిన వారిని, బుద్ధిమంతులగు భర్తలచేఁ బోషింపఁబడు వారిని, వయస్సు స్త్రీలను, మారుతి చూచెను.

చ. కనకగృహోపవిష్టలను♦గాంతధవాంకసుఖోపవిష్టలన్
వినయకృతాత్మనాథసమ♦భీష్టల ధర్మకళావిశిష్టలన్
ఘనమదనాభివిష్టల వి♦కారవిదూరమనోజ్ఞచేష్టలన్
గనియె నివిష్టలం బవను♦గాదిలిపట్టి నితాంతహృష్టలన్. ౨౧౩

తాత్పర్యము.

కనకగృహ + ఉపవిష్టలను = బంగారు మేడలలోఁ గూర్చుండిన వారిని, కాంతధవాంక సుఖోపవిష్టలన్ = అందముగల భర్తల యొడిలోఁ గూర్చుండిన వారిని, వినయ కృతాత్మనాథ సమభీష్టలన్ = అణఁకువచేతఁ జేయఁబడిన తమ భర్తలకోరికలఁ గలవారిని, ధర్మకళావిశిష్టలన్ = ధర్మశాస్త్రజ్ఞానమందు గొప్పవారిని, ధర్మకార్యములఁ జేయువారిని, ఘన మదనాభివిష్టలన్ = విశేషించి మదనునిచే నావేశింపఁ బడిన వారిని, వికార విదూర మనోజ్ఞ చేష్టలన్ = వికార విదూర = చెడనివి, మనోజ్ఞ = ఇంపైన, చేష్టలన్ = చేఁతలుగలవారిని, నివిష్టలన్ = పెండ్లికాఁబడిన స్త్రీలను, 'నివేశ శిబిరోద్వాహన్యాసేషు" అని విశ్వనిఘంటువు.

తాత్పర్యము.

బంగారు మేడలందుఁ గూర్చుండినవారిని, భర్తల యొడిలోఁ గూర్చుండిన వారిని, అణఁకువచేత పతుల యిష్టకార్యములఁ జేయువారిని, ధర్మశాస్త్రమందుఁ బ్రవీణులై ధర్మకార్యములు చేయువారిని, కామావేశము గలవారిని, నిలుకడయయి నవియు నింపైనవియగు చేష్టలు చేయువారిని, వివాహితులైన వారిని, మిగుల సంతోషించి యుండువారిని హనుమంతుఁడు చూచెను.

ఉ. కాంతసువర్ణవర్ణలను♦గాంతవియోగవళక్షవర్ణలన్
గాంతవకేళ్యుదీర్ణలను♦స్కన్నకుచాంశుకగౌరవర్ణలన్
గ్లాంతిగళత్సువర్ణలను♦నాయకవిద్ధసుగంధి చూర్ణలన్
శ్రాంతవికీర్ణ చూర్ణకచ♦చారుదృగబ్జనిగారకర్ణలన్. ౨౧౪

అర్థములు. కాంతసువర్ణ వర్ణలను = అందమైన బంగారువంటి వన్నెగలవారిని, కాంత వియోగ = భర్త నెడఁబాసి యుండుటచే, వళక్షవర్ణలన్ = తెల్లని వన్నెగల వారిని, ఇది వైవర్ణ్యమను సాత్త్విక భావము. కాంతవకేళి = కంతుసంబంధము కాంత వము, సంబంధార్థక మత్వర్థీయము అనఁగా మన్మథసంబంధమైన యాటలందు, ఉదీర్ణలను = గొప్పవారిని, స్కన్నకుచాంశుక గౌరవర్ణలన్ = స్కన్న = జాఱిన, కుచాంశుక = పైఁటలు గలవారగుటచే, గౌరవర్ణలన్ = తెలియవచ్చు కుచ ప్రదేశమందలి పచ్చని కాంతి గలవారిని, దీనివలన రాక్షసస్త్రీలకు రైకలు లేవని యేర్పడు చున్నది.

సీతకును రవిక లున్నట్లు ప్రమాణము గానరాదు. కావుననే మళయాళ స్త్రీలు తమ దనాది యార్యాచార మను చున్నారు. క్లాంత = రతిశ్రమచే, గళత్ = చెదరిపోయిన, కరఁగిపోయిన, సువర్ణలను = చెంపలందు స్తనములందు వ్రాయఁబడిన మకరికా పత్రములు గల వారిని, ఇప్పుడు కొందఱు స్త్రీలు పచ్చపొడిపించు కొన్నట్లు పూర్వకాలమందు కస్తురి కుంకుమపువ్వు మొదలయిన వాని లేపముతో చెంపలందును స్తనములందును మొసళ్ళవలెఁ జేపలవలె స్త్రీలు చిత్రములు వ్రాసికొనుచుండిరి. నాయక విద్ధ=భర్తలచే విసరి చల్లఁబడిన, సుగంధి చూర్ణలన్ = మంచి వాసనగల గందపొడి గలవారిని, శ్రాంత వికీర్ణ చూర్ణ కచలను, చారు దృగబ్జ నిగార కర్ణలన్ ; అని విశేషణోభయ పదము. శ్రాంత = సురత శ్రమ కలవారు గనుకనే, వికీర్ణ = చెదరిన, చూర్ణకచ=ముంగురులు గలవారిని, చారు=అందమైన, దృగబ్జ=కమలములవంటి కన్నులచే ; నిగార = మ్రింగఁబడిన, కర్ణలన్ = చెవులుగల వారిని, కన్నులు దీర్ఘములై చెవుల దాఁక వ్యాపించి యున్నవని భావము. పైపద్యముతో నేకాన్వయము.

తా త్ప ర్య ము .

అందమైన బంగారు వఁటి దేహకాంతిగల వారిని, భర్త నెడఁబాసిన విరహ తాపముచే తెల్లఁబాఱిన వారిని, మన్మథ కేళియం దాఱితేఱిన వారిని, పైఁటలు జాఱిపోవుటచేఁ గానవచ్చు పచ్చని స్తనములఁ గలవారిని, రతిశ్రమముచేఁ గరఁగిపోయిన మకరికా పత్రములు గలవారిని, భర్త గందపొడి చల్లిన వారిని, రతిబడలికచేఁ జిందర వందరలైన ముఁంగురులు గలవారిని చెవులదాఁక వ్యాపించిన నిడుపాటి కన్నులుగల వారిని.

ఉ. రామలఁ బ్రాప్తనాథపరి♦రంభణహృష్టమనోభిరామలన్
శ్యామల నాత్మమందిరవి♦హారకతాపరమాభిరామలన్
గోమలగాత్రవల్లు లగు♦కోమలఁ బ్రేమరసైకధామలన్
రాముని దూత గన్గొని మె♦ రాక్షసకేళిగృహాళిసీమలన్. ౨౧౯

అర్థములు. ప్రాప్తనాథ=స్త్రీలచే స్వయముగాఁబోయి పొందఁబడిన భర్తల యొక్క, పరిరంభణ = కౌఁగిలింతలచే, హృష్టమనోభిరామలన్ = సంతోషించిన మనస్సుచే నొప్పినవారిని, శ్యామలన్=నడిమి వయస్సువారిని. ' శ్యామా యౌవన మధ్యస్థా ' అమరుఁడు. ఆత్మమందిర=తమ యిండ్లయందే, విహారకతా=విహరించు వారగుటచే, పరమాభిరామలన్ = మిగుల మనోరమలైన వారిని, వీరు సంపదచే నెండకన్ను వాన కన్నెఱుఁగక యున్న వారో, లేక ఘోషాలో (పరదా పద్ధతిచే నిల్లు విడిచి వెలుపలఁబోని కులపాలికలో) తాము వెలుపలఁబోక తమ యిండ్లకే విటుల రప్పించుకొను వేశ్యలని కొందఱి యభిప్రాయము. కోమలగాత్ర వల్లులగు=మృదువైన తీఁగలవంటి దేహముగల, కోమలన్=స్త్రీలను, రూ.కొమ్మ. ప్రేమరసైకధామలన్=

ప్రేమరసమునకే స్థానములైనవారిని, ఇట్టి రామలన్ = స్త్రీలను, రాక్షస కేళి గృహాళి సీమలన్ = రాక్షస కేళి గృహ ప్రదేశములందు, రాముని దూత = హనుమంతుఁడు, కన్గొనియెన్ = చూచెను.

తాత్పర్యము.

భర్తలయొద్దకు దామే పోయి వారిచేఁ గౌఁగిలింపఁబడి సంతోషించిన మనస్సు గలవారిని, నడిప్రాయపు వారిని. తమ యిండ్ల యందే విహరించు వారిని, తీఁగవలె మృదువైన దేహము గల స్త్రీలను, విశేషప్రేమకు స్థానమైన వారిని, రాక్షసుల పడక టిండ్లయందుఁ గ్రీడామందిరంబులందు హనుమంతుఁడు చూచెను.

క. బాలికలన్ శశినిభముఖ, పాలికలన్ వక్రపక్ష్మ ♦ మంజులతరదృ
క్పాళికలం గనె భూషణ, మాలికలం జంచలారు ♦ మాజాలకలన్. ౨౧౬

అర్థములు. బాలికలన్ = పడుచులను, శశినిభ ముఖ పాలికలన్ = చంద్రునితో సమానమైన ముఖముల వరుసలు గలవారిని, వక్రపక్ష్మ = ముత్తైపుఁ జిప్పలవలె వంకరమైన కనుతెప్పల వెండ్రుకలచే, మంజులతర = మిగుల నందమైన, దృక్ + పాళికలన్ = కన్నుల సమూహములు గలవారిని, భూషణ మాలికలన్ = ఆభరణముల వరుసలు గలవారిని, చంచలారమా జాలకలన్ = మెఱుపుకాంతుల సమూహము గలవారిని.

తాత్పర్యము.

లేతప్రాయపు పడుచులను, చంద్రునివంటి ముఖములు గలవారిని, వంకరలగు కను తెప్పల వెండ్రుకలు గల కన్నులు గల వారిని భూషణముల ధరించిన వారిని మెఱుపు తీఁగల వంటి వారిని స్త్రీలను హనుమంతుఁడు చూచెను.

సీతను వెదకుచున్న హనుమంతుఁడు స్త్రీల ముఖనేత్రములఁ జూచుట వీరు దేవజాతులా, మనుష్యులా, రాక్షసస్త్రీలా, యని పరీక్షించుటకును, ఆభరణ పరీక్ష, సీతాభరణ స్వరూపము నిర్ధారించుట కనియును దెలియనగు. సీతాదేవిని జూచినపుడు ఈమె సీతయని నిర్ణయించుటయందామె యాభరణము లొక ముఖ్య విషయముగా హనుమంతుఁడు గ్రహించె నని 'జానకి సొమ్ములటంచును, మానవ విభు దేవి పలికె మా కవియెల్లన్, గానఁగ నయ్యెడిఁ గుజశాఖానికరము నందు వ్రేలి కలికికి నఱితన్,' అని చెప్పఁగలఁడు,

క. సీతను రాజాన్వయసం, జాతను బరమాభిజాత ♦ సద్వ్రతపూతన్
స్ఫీతస్ఫుటలతికానిభ, జాతను గపి మానసాభి ♦ జాతఁ గనందున్. ౨౧౭

అర్థములు. రాజాన్వయ సంజాతను = రాజవంశమునఁ బుట్టిన దానిని, పరమాభిజాత = మిక్కిలి మనోహరమగు దానిని, సద్వ్రత పూతన్ = మంచివ్రతముచేఁ బవిత్రురాలిని; భర్తృ వియోగమందు బతివ్రతయగు స్త్రీ యెట్లులుండవలెనో యట్లులుండు దానిని; స్ఫీత స్ఫుటలతికానిభ జాతను = కొంచెము లావై స్పష్టముగఁ

గనఁబడెడి సన్నని తీఁగవంటి దేహము గలదానిని, జాతశబ్దము జన్యాశ్రయ దేహలాక్షణికము. మానసాభిజాతను=(౧) అయోనిజను (౨) వేదవతీ జన్మమున సీతగాఁ దాను బుట్టవలెనని సంకల్పించుకొని పుట్టినదానిని (చూ. ఉత్తర. ప ౩౫౯. ౩౬౦ప.)

'సంభవా మ్యాత్మ మాయయా' యని భగవంతుఁడు తన సంకల్పముచేఁ దాను జనించినట్లు లక్ష్మియును దన సంకల్పముచే జనించునని భావము.

## తాత్పర్యము.

తానుజూచిన స్త్రీలయందు హనుమంతుఁడు రాజవంశమునఁ బుట్టినదానిని ఒకవేళఁ బుట్టినను అంతటి మనోహరను, ఒకవేళ నంతటి మనోహర యయినను భర్త సమీపమున లేనపుడు పతివ్రత యెట్టులుండవలెనో యట్టులుండుదానిని దీఁగవంటి దేహము గలదానిని స్వసంకల్పముచే నయోనిజగా బుట్టినదానిని జూడలేదు.

సీ. వరసనాతనపథ♦స్థిరసన్నివిష్టను, బ్రాణేశముఖలోక♦నైకహృష్టఁ
గామాభివిష్ట సు♦కాంతవిశిష్టను, నాత్మవల్లభహృద♦యప్రవిష్ట
విరహతాపోద్భవా♦విరళాశ్రుకంఠిని, రమ్యపక్ష్మల నభి♦రక్తకంఠిఁ
దరుణిఁ బురావరో♦త్తమనిష్కకంఠిని, నిష్కుటసంచర♦న్నీలకంఠి
తే. నబ్జరేఖనుబోలె న♦వ్యక్తరేఖ, పాంసుపరిదిగ్ధ మగు నవ♦భర్మరేఖ
వ్రణమునను లెస్సనాటిన♦బాణరేఖ, యనిలభిన్నాభ్రరేఖనాఁ♦దనరుదాని.

అర్థములు:—వర=శ్రేష్ఠమైన, సనాతన=శాశ్వతమై, యనాదియైన, పథ = మార్గమున, పతివ్రతల మార్గమున; స్థిరసన్నివిష్టను = స్థిరముగా నుండుదానిని, ప్రాణేశముఖ లోకనైకహృష్టఁ = భర్తముఖము చూచుటచేతనే సంతోషించునది, తక్కిన దేదియు నామెకు సంతోషకరముగాదని భావము, కామాభివిష్టను = కనుక నే భర్తతో గలియవలెనను పట్టుదల గలదానిని, సుకాంతావిశిష్టను=చక్కని యందగత్తెలలో గొప్పదానిని, ఆత్మవల్లభ హృదయ ప్రవిష్టను = తన భర్త హృదయమందుఁ బ్రవేశించియుండుదానిని, విరహతాపోద్భవ=వియోగతాపముచేఁ గలిగిన, అవిరళ = దట్టమైన, అశ్రు=కన్నీటిచే నడ్డగింపఁబడిన-కంఠిని=కంఠముగల, లేక, తడిసినకంఠము గలదానిని, రమ్యపక్ష్మల=అందమైన ఱెప్పలుగలదానిని, అభిరక్తకంఠిఁ=రంజకమైన కంఠధ్వని గలదానిని, తరుణిఁ = ప్రాయపుదానిని, పురా+వర+ఉత్తమనిష్కకంఠిని=పూర్వము భర్తయొద్ద నున్నప్పుడు కోరఁబడునదియు శ్రేష్ఠమైన పతకము మెడయందుఁ గలదానిని, నిష్కుట సంచరన్నీలకంఠ=వనమునందు సంచరించు నాఁడునెమలివంటి దానిని, అబ్జరేఖనుబోలెఁ = చంద్రరేఖవలె, పాడ్యమినాఁటి చంద్రునివలె, అవ్యక్తరేఖఁ = స్పష్టముగాఁ గానరాని యాకారముగల దానిని, పాంసుపరిదిగ్ధమగు=దుమ్ముచేఁ గప్పఁబడిన, నవభర్మరేఖ=క్రొత్త బంగారు సలాకు వంటిదానిని, పారిశుధ్యము స్వభావము, మాలిన్య మాగంతుక మని యీ యుపఽ

మానము దెలిపెడిని, వ్రణము = పుండు, అనిల భిన్న = గాలిచేఁ జెదరఁ గొట్టబడిన, అభ్ర రేఖ = సన్న మేఘము.

తాత్పర్యము.

శ్రేష్ఠమైన సనాతన ధర్మమార్గమందు స్థిరముగా నుండుదానిని, భర్తముఖము చూచుట చేతనే సంతోషించు దానిని, కావుననే ఆయనను గూడుట యందుఁ బట్టుదల గలదానిని, అందగత్తెలలో శ్రేష్ఠురాలైన దానిని, భర్త హృదయమందుఁ బ్రవేశించి యుండుదానిని, విరహతాపముచే జనించిన కన్నీటిచేఁ దడిసిన కంఠము గలదానిని, అందమైన ఱెప్పలు గలదానిని, రంజకమయిన కంఠస్వరము గల దానిని, ప్రాయపు దానిని, పూర్వమునందుఁ గోరఁబడిన శ్రేష్ఠమగు పతకము గల దానిని, వనమునఁ దిరుగు నాఁడు నెమలివంటి దానిని, పాడ్యమి నాఁటి చంద్రుని వలెఁ గాంతిహీనమై శుష్కించి స్పష్టముగఁ గానరాని దానిని, ధూళిగప్పిన క్రొత్త బంగారుకడ్డీవంటి దానిని, పుండునందు గ్రుచ్చుకొన్న బాణమువంటి దానిని, (అంత బాధపడుదానిని,) గాలికిఁ జిందరవందరయైన సన్న మేఘమువంటి దానిని, సీతాదేవిని హనుమంతుఁడు చూచినవాఁడు కాఁడయ్యెను.

దోదకము. సీతను రాముని♦శ్రీతరళాక్షిన్, వాతతనూజుఁడు♦పట్టనమందున్
భీతిల కారసి♦వేదిజ లేమిన్, జాతమహావ్యథ♦సంకటమందెన్. ౨౯

అర్థములు. ఆరసి = వెదకి, వేదిజ = సీత, వేది రూపాంతరము వేదీ. యజ్ఞము చేయుచోటఁ బుట్టినది. దోదకమునకు మూఁడు భగణములు, రెండు గురువులు, ఏడింట యతి.

తాత్పర్యము.

శ్రీరామచంద్రమూర్తి భార్యయగు సీతాదేవిని భయపడక యన్ని రహస్య స్థలము లందుఁ గూడ వెదకియుఁ గానరామిని మిగుల సంకటపడెను.

—♦ ౬-వ సర్గము. హనుమంతుఁడు రావణాలయంబుఁ జూచుట. ♦—

తే. వెదకి వెదకియు రాక్షస♦నిలయములను
సీతఁ గానక సవిషాద♦చిత్తుఁ డగుచుఁ
గామరూపంబుఁ దాల్చి లా♦ఘవము మెఱయ
వెండి నొకమాటు పావని♦వెదకఁ దొడఁగె. ౨౦

తాత్పర్యము.

రాక్షసుల యిండ్లయందు సీతాదేవియు వెదకివెదకి గానక దుఃఖితుఁడగుచుఁ గోరిన రూపము ధరించి మునుపటికంటె హెచ్చరికగాను వేగముగను మఱియొకసారి వెదక నారంభించెను.

క. కేసరులు గావ నెల్లెడ, భాసిల్లు మహావనంబు♦భాతిని దుష్ప్రా-
రాసురసంఘము గావఁగ, వాసిం గని యర్కవర్ణ♦వప్రావృతమై. ౨౧

అర్థములు. అర్కవర్ణప్రావృతమై=సూర్యకాంతిగల ప్రాకారములచే జుట్టఁబడినదై, ఇది దివిజారి భవనమునకు విశేషణము.

తాత్పర్యము.

సింహములు గావఁగా నిరపాయముగా నుండు వనమువలె మిగులఁ గ్రూరులగు రాక్షసులు గాచుటచేఁ గీర్తిఁగని సూర్యునికాంతిగల ప్రాకారముచేఁ జుట్టఁబడి.

సీ. దేదీప్యమాన మౌ ♦ దివిజారిభవనంబుఁ, గని ముక్కునను ప్రేలు♦గదియఁజేర్చి
రూప్యకోపహితాభి♦రూపమణీహేమ,భూషితతోరణ♦పుంజ మగుచుఁ
జిత్రకక్ష్యంబులఁ ♦ జెలువారి రుచిర మౌ,ద్వారపంక్తులచే ను♦దార మగుచు
వారణారూఢు లో♦బరికాండ్రచేతను, శ్రమ మెఱుంగని శూర♦రాజిచేత
తే. శోభితం బయి ద్రొక్కసి♦చోట్లు ద్రొక్కు
యుగ్యములచేతఁ బలులయు ♦ నుగ్రసింహ
ములయుఁ జర్మములను గప్పు ♦ మొనసి దాంత
కాంచనాంచిత మగు రథ♦గణముచేత. ౨౨౨

అర్థములు. దివిజారి భవనంబుఁ గని = రావణునింటినిఁ జూచి, రావణు గృహము హనుమంతుఁడు ప్రవేశించినట్లు ముందు చెప్పఁబడెను. మఱల నిప్పుడు చూచెనని చెప్పనేలయనిన మొదట రావణాంతఃపురమందు సీత యున్నదని చెప్పుటచేత నందు వెదకుద మని ప్రవేశించెనుగాని జాముర్రాత్రియే యయి యుండుటచే నందఱు నిద్రింపక మేలుకొని యుండిరి. ఆ కారణముచే మఱల వెలుపలికి వచ్చి లంకాపురమున వెదకెను. గనుకనే లంకాపుర స్త్రీలు మొదలయినవారు వర్ణింపఁబడిరి. ఇప్పు డంతకంటెఁ బ్రొద్దుపోయిన కారణముచే మఱల రావణు గృహము నొద్దకు వచ్చెనని గ్రహింపవలయును.

దేదీప్యమానము = తళతళ ప్రకాశించునది. రూప్యక+ఉపహిత = వెండిచేఁ జేయఁబడినదియు, అభిరూపమణీ హేమభూషిత = మంచి రత్నములచేతను. బంగారుచేతను నలంకరింపఁబడినది. తోరణపుంజము = తోరణముల సమూహము గలది. చిత్రకక్ష్యంబులు = వింతలగు తొట్టికట్లు. వారణారూఢులు = ఏనుఁగుల నెక్కిన వారు, బరికాండ్రచేతను=మావటివాండ్రచేతను, ద్రొక్కనిచోట్ల ద్రొక్కు = మిగుల వేగముగఁబోవు. యుగ్యములచేత = తేజికిగట్టెడి గుఱ్ఱములచేత. దాంతకాంచన అంచితమగు = దంతములచేతను బంగారుచేతను ప్రకాశించునదియు.

తాత్పర్యము.

ధగద్ధగాయ మానముగ వెలుఁగుచున్న రావణు గృహముఁజూచి యాశ్చర్యమున ముక్కుపై ప్రేలుంచుకొని వెండితోఁ జేయఁబడి నవియు, మేలైన రత్నములు బంగారు చేతను నలంకరింపఁబడినదియు నగు తోరణ సమూహము కలిగి వింతలగు తొట్టికట్లు కలిగి యందమయిన ద్వారములచే, విశేషించి యేనుఁగు లెక్కిన మావ

టీల చేతను, కష్టము తెలియని శూరులచేతను, శోభించి యతివేగముగఁ బోవు తేరి గుఱ్ఱములచేతఁ బులులయు సింహములయుఁ జర్మములచేఁ గప్పఁబడి దంతము బంగారుతోఁ బ్రకాశించు తేర్లగుంపులచేత.

సీ. రహి మీఱుచు నమూల్య♦రత్నసమాకీర్ణ,మై పరార్థ్యాసన♦మగుచు మఱియు
నతిరథావాస మై♦యతులరథంబులు, నతులపీఠంబులు♦నమర బహుళ
విధమృగంబులచేత♦వికిరసంఘముచేతఁ, బరిపూర్ణ మగుచు ని♦ర్భయత రేఁగు
నంతపాలురచేత♦నభిరక్షితం బయి, యాత్మ కెక్కిన మెచ్చు♦లాఁడు లొప్ప
తే. బలుపు వెన్నెలపులుఁగుల♦బవిసి యార్చు
కన్నుఁగవ లొప్పు ప్రమదల♦కనకరత్న
భూషణంబులరాపున♦బొడము నులివు
లబ్ధిరావంబు నటు లుండు♦మనుచు నుండ. ౨౩

అర్థములు. రహిమీఱుచు=బాగుమీఱుచు, అమూల్యరత్న సమాకీర్ణమై= వెలలేని మణులచేఁ గూడినదై, పరార్థ్యాసన=గొప్ప పీఠములు గలది, అతిరథ + ఆవాసమై = అతిరథులకు స్థానమై, పెక్కువిలుకాండ్రతోఁ బోరెడి యోధుఁడు అతిరథుఁడు, వికిర=పక్షుల, అంతపాలురచేతన్ = గృహము వెలుపల రక్షించువారిచేత, ఉలివులు=ధ్వనులు, అటులుండు మనుచు=తిరస్కరించుచు.

"స్పర్ధతే, జయతి, ద్వేష్టి, ద్రుహ్యతి, ప్రతిగర్జతి, ఆక్రోశ త్యవజానాతి, కదర్థయతి, నిందతి, తస్య చానుకరోతీతి శబ్దాః సాదృశ్యవాచకాః । ఉపమాయా మిమే ప్రోక్తాః కవీనాం బుద్ధిసంపదాః॥" దండి. కావున నిది యుపమావాచక మని యెఱుఁగునది.

తాత్పర్యము.

బాగు మీఱి వెలలేని రత్నములచే నిండినదై పెద్దపీఁటలుగలిగి, యతిరథులకు వాసస్థానమై యసమానములైన తేర్లు, పీఁటలు సొప్పుచుండఁ అనేక విధములైన మృగములచేతను, పక్షుల గుంపులచేతను, నిండి భయములేక విజృంభించు వెలుపలి కావలివారిచేఁ జక్కఁగఁ గాపాడఁబడి మనస్సునకుఁ దృప్తిని గలిగించు మెప్పులకుప్పలగు స్త్రీలను గలదై, బలసిన చకోర పక్షులతో సమానములైన కన్నులుగల స్త్రీల బంగారు, మణుల భూషణముల రాపిడిచేఁ బుట్టిన ధ్వనులు సముద్రధ్వనులను బోలియుండ.

తే. చందనాగరుధూపవా♦సనలు నిండ, భేరికామర్దలధ్వనుల్♦బోరుకొనఁగ
నిశిచరావిరతాభ్యర్చ♦నీయ మగుచు, నబ్ధిగంభీర మగు రావ♦ణాలయంబు. ౨౪

అర్థములు, నిశిచర = రాక్షసులచే, అవిరత=ఎడఁదెగక, అభ్యర్చనీయ మగుచు=పూజింపఁబడినదై, అబ్ధి గంభీరము=సముద్రమువలె గంభీరమైనది.

తా త్ప ర్య ము.

చందనము, అగరు వీని ధూపముల వాసనలు నిండఁగా భేరులయు, మద్దెలలము ధ్వను లతిశయింప, రాక్షసులచే సర్వదా పూజింపఁబడుచు సముద్రమువలె గంభీరమైన రావణ గృహము.

క. పొంకంబుగ హయవారణ,సంకులమై వివిధరత్న♦జాలక వేశ్మా
లంకృత మవుదానిని గని, లంకాభరణంబుగాఁ ద♦లఁచి నికటమునన్. ౨౫

అర్థములు. హయవారణ సంకులమై = గుఱ్ఱములచే నేనుఁగులచే దండినదై; వివిధ రత్న జాలక = నానావిధములయిన మణులు, గవాక్షములు గల యిండ్లచే నలంకరింపఁబడిన దానిని; నిది లంకకు నలంకారమైనదని తలఁచి దాని సమీపమున,

చ. వెదకెను రాక్షసావళుల ♦ వీడును వాడ వాడయున్
వదలక తోఁట తోఁటయును ♦ వానరవర్యుఁడు దొడ్డి దొడ్డియున్
గొదకొని మేడ మేడయును ♦ గూటము కూటము మూల మూలయున్
మది వెఱలేక తావిసివి ♦ మానక కార్యభరంబు పెంపునన్. ౨౬

అర్థములు. రాక్షసావళుల = రావణు సోదరులు మున్నగు రాక్షుల, గొదకొని = త్వరపడి, వెఱలేక = భయముపడక, విసివి మానక = విసుఁగుచే వదలక.

తా త్ప ర్య ము.

సులభము.

—♦ హనుమ రాక్షసముఖ్యుల యిండ్లయందు సీతాదేవిని వెదకుట ♦—

సీ. వేగ ప్రహస్తుని♦వీటికి లంఘించి, యెలమి మహాపార్శ్వ♦నిక్క కెగిరి
కందతుల్యము కుంభ♦కర్ణుసౌధముఁ జొచ్చి, యల విభీషణునావాస ♦ మధిగమించి
యట మహోదరవిరూ♦పాక్షవిద్యుజ్జిహ్వు, లిండ్లు విద్యున్మాలి♦గృహము నరసి
వజ్రదంష్ట్రివిశాల ♦ వలనొప్పఁగా రోసి, శుకసారణులసభల్ సొరిది ♦ నెమకి
తే. యింద్రజిత్తునివేశ్మంబు ♦ నెల్ల వెదకి, జంబుమాలి సుమాలుల♦సదనములను
రశ్మికేతువుసూర్యశా♦త్రవుల నెలవు, వజ్రకాయునిగేహంబు ♦ వరుసఁ జూచి. ౨౭

అర్థములు. ఇక్క = ఇల్లు, కందతుల్యము = మేఘముతో సమానము, కం+ద = నీళ్ళ నిచ్చునది, శాల = గృహము, వేశ్మంబు = గృహము.

తా త్ప ర్య ము.

శీఘ్రమునఁ బ్రహస్తునింటికి దాఁటి, మహాపార్శ్వ నింటికి నెగిరి, మేఘముతో సమానమైన కుంభకర్ణు గృహము ప్రవేశించి, విభీషణు నిల్లు చొచ్చి. మహోదర విరూపాక్ష విద్యుజ్జిహ్వ విద్యున్మాలి వజ్రదంష్ట్రి శుకసారణులయు, నింద్రజిత్తు జంబుమాలి సుమాలి రశ్మికేతువు సూర్యశత్రువు వజ్రకాయుఁడు వీరల యిండ్లు వెదకి.

సీ. బలులు ధూమ్రాక్షసం♦పాతినామకులు వి,ద్యుద్రూపభీములు ♦ నుగ్రు లైన
ఘనుఁడు విఘనుఁడు వి♦కటుఁడు వక్రుండును, శఠశుకనాస ర♦క్షఃప్రవరులు

బ్రహ్మకర్ణుండు దంష్ట్రధ్వజగ్రీవయు,ద్ధోన్మత్తమత్తులు ♦ నుదుటు మీఱు
రోమశుండును మఱి♦క్రూరవిద్యుజ్జిహ్వ, హస్తిముఖేంద్రజి♦హ్వప్రవరులు
తే. శోణితాక్షపిశాచులు ♦ శూరుఁడైన, యాకరాళుండు నివసించు♦నాలయముల
వరుస దప్పక యా గంధ♦వహసుతుండు, తగవు మఱవక వెదకు సీ♦తావధూటి.

అర్థములు. ఉదుటు = గర్వము.

తా త్ప ర్య ము .

బలవంతులైన ధూమ్రాక్షుఁడు, సంపాతి, విద్యుద్రూపుఁడు,భీముఁడు, ఘనుడు, విఘనుఁడు, వికటుఁడు, వక్రుఁడు, శఠుఁడు, శుకనాసుఁడు, బ్రహ్మకర్ణుఁడు, దంష్ట్రధ్వజ, గ్రీవ, యుద్ధోన్మత్త మత్తులు, రోమశుఁడు, విద్యుజ్జిహ్వాహస్తి ముఖేంద్రజిహ్వులు, శోణితాక్షుఁడు, పిశాచుఁడు, కరాళుఁడు, వీరుండు, గృహముల నన్నిఁటిని వరుస దప్పక హనుమంతుఁడు వెదకెను.

—♦ హనుమంతుఁడు రావణగృహంబుఁ జొచ్చుట. ♦—

ఉ. ఈ విధి వారు వారు వసి♦యించు గృహంబుల నెల్ల రోసి యా
పావని పాశతోమరకృ♦పాణసుముద్గరశూలహస్తలై
కావలికాచుస్త్రీల నుప♦కంఠమునన్ శయనించువారి ర
క్షోవిభుమందిరంబునను ♦ జూచి తదంతరసీమలోపలన్. ౨౯

అర్థములు. తోమర=చిల్లకోలయను నాయుధము, కృపాణ=కత్తి.

తా త్ప ర్య ము .

ఈ ప్రకారము వారు వారు కాపురముండు నిండ్లయందు వెదకి యాంజనేయుఁడు పాశములను, చిల్లకోలలను, కత్తులను, ముద్గరములను, శూలములను, జేతియందు ధరియించి కావలియుండు స్త్రీలను సమీపమున శయనించువారిని రావణు గృహమందుఁజూచి దాని లోపలి ప్రదేశమందు.

క. నానావిధసాధనముల, మానుగ ధరియించు యుద్ధ♦మర్మజ్ఞుల ర
క్షోనిచయము రక్తసితా,జానేయంబులను జూచె ♦ జవనాఢ్యములన్. ౩౦

అర్థములు. రక్తసిత+ఆజానేయములను=ఎఱ్ఱని, తెల్లని యుత్తమజాతి గుఱ్ఱములను, యుద్ధమర్మజ్ఞుల, రక్షోనిచయము='మహత్సమూహార్థక శబ్దం బమహార్థ్రార్థ్య యుక్తంబయ్యె తద్విశేషణ క్రియలు మహాత్కార్య యోగ్యంబులు విభాషనగు త్రి. శ. ౧౭. జవనాఢ్యములన్=వేగసంపత్తిగలవి.

తా త్ప ర్య ము .

అనేకవిధము లయిన యాయుధముల ధరించి యుద్ధ రహస్యము తెలిసిన రాక్షస సమూహములను, అతి వేగముగఁ బోఁగల ఎఱ్ఱని, తెల్లని యుత్తమజాతి గుఱ్ఱములను హనుమంతుఁడు చూచెను.

క. పరగజపీడాకరములఁ, బరసేనామర్దనముల♦వరకులజములన్
హరిహయగజనిభములఁ గో,సరిసూనుఁడు గాంచె రూప♦సంపన్నములన్. ౨౩౧

అర్థములు. పరగజ పీడాకరములన్ = శత్రువుల యేనుఁగులను బాధించునవి, పరసేనా మర్దనములన్ = శత్రుసేనలఁ జంపునవి, వరకులజములన్ = గొప్పకులము లందుఁ బుట్టినవి; హరిహయగజ=ఇంద్రుని యేనుఁగగు నైరావతముతో, నిభములన్ =సమానములైనవి, రూపసంపన్నములన్ = ఆకార సంపత్తిగలవానిని.

తాత్పర్యము.

శత్రువుల యేనుఁగులను, శత్రుసైన్యములను నాశము చేయునవియు, నుత్తమ జాతిఁ బుట్టినవియు, నింద్రుని యైరావతముతో సమానమైనవియు, నాకారపుష్టి గలవియునగు నేనుఁగుల హనుమంతుఁడు చూచెను.

క. కురిసెడు జలదములో యనఁ, దొరఁగెడినిర్ఝరచయంబు♦తోడి గిరు లనన్
గురుగర్జన్మేఘము లనఁ, బరఁగెడి పరదుర్జయముల♦వారణములన్. ౨౩౨

అర్థములు. నిర్ఝరచయంబులు=కొండవంకలు, గర్జత్ + మేఘములు=ఉఱుము చున్న మేఘములు, పరదుర్జయములు=ఇతరులకు జయింపరానివి, వారణములన్ = ఉత్తమ గజములను.

తాత్పర్యము.

వానకురిసెడి మేఘములో, సెలయేళ్లు పాఱిన కొండలో యనునట్లు మదము కాఱుచున్నట్టివియు, గొప్పగా నుఱుము మేఘములవలె ఘీంకరించునవియు, వేఱు గజములకు, శత్రువులకు జయింపరానివియగు శ్రేష్ఠములైన యేనుఁగులను మారుతి చూచెను.

సీ. తతకాంచనపరిష్కృ♦తంబులౌ తరుణార్క,సన్నిభ వాహినీ♦సంఘములను
నైకాకృతుల నొప్పు♦నాందోళికలను వి,చిత్రలతాగేహ♦చిత్రనిలయ
కేళీగృహంబులఁ♦గ్రీడింప దారుప,ర్వతములఁ గామకా♦రణగృహముల
మంజుదివాగృహ♦మందరప్రఖ్యమ,యూరతలంబుల;♦నొప్పు మీఱు
తే. టెక్కెముల దండములను బా♦టించి చూడఁ
దగిన నిధిజాలముల నొప్పి♦ధగధగాయ
మాన మగుచుఁ గైరాసస♦మాన మైన
రావణు వీడు గనుఁగొనె♦ రాముదూత. ౨౩౩

అర్థములు. పరిష్కృతంబులు=అలంకరింపఁబడినవి, తరుణార్కసన్నిభ = లేఁత సూర్యునితో సమానములైన, వాహినీ=సేనల, నైకాకృతులన్ = అనేకాకారములను, ఆందోళికలన్ = పల్లకులను, దారు పర్వతములను = కొయ్యతోఁ జేయబడిన కృత్రిమ క్రీడా పర్వతములను, కామకారణ గృహములన్ = కామము గలిగించు నిండ్లను, దివా

గృహ=పగలు క్రీడింపఁ గట్టఁబడిన యిండ్లను, మందరప్రఖ్య=మందర పర్వతముతో సమానమైన, మయూర తలంబులన్ = పెంపుడు నెమిళ్ళ నివాసస్థలములను.

తా త్ప ర్య ము .

విస్తారముగ బంగారుచే నలంకరింపఁబడి బాలసూర్యునితో సమానములైన సేనల సమూహములను, అనేకరూపములు గల పల్లకీలను, చిత్రముగా నల్లిన తీఁగలచే నిర్మింపఁబడిన యిండ్లను, చిత్రములైన క్రీడా గృహంబులను క్రీడించుటకై కొయ్యలచే నిర్మింపఁబడిన పర్వతములను, కామము వృద్ధిచేయు నిండ్లను, పగటివేళఁ గ్రీడింప ననువైన యిండ్లను, పెంపుడు నెమిళ్లుండుటకై కట్టఁబడిన మందరముతో సమానమైన ప్రదేశములను, ధ్వజదండములను, నిధుల సమూహములను గలిగి ధగధగ మని ప్రకాశించుచుఁ గైలాసముతో సమానమైన రావణుని యింటిని రాముదూత చూచెను.

క. సురశాత్రవు తేజముచేఁ, బరమమణీనికరదీప్తి♦పటలంబులచే
భరితం బయి రావణుమందిరము వెలింగెను గరాళి♦దినకరుమాడ్కిన్. ౪౩౪

అర్థములు. సురశాత్రవు = దేవ విరోధియగు రావణుని యొక్క, పరమమణీ నికర=ఉత్తమములైన రత్నసమూహముల యొక్క, దీప్తి పటలంబులచేన్ = కాంతి సమూహములచే, భరితంబయి = నిండి, కరాళిన్ = కిరణములచే, దినకరుమాడ్కిన్=సూర్యునివలె.

తా త్ప ర్య ము .

కిరణములచే సూర్యుఁడు ప్రకాశించునట్లు దేవవిరోధి తేజముచేతను, జాతిరత్నములకాంతుల సమూహములచేతను, రావణుమందిరము ప్రకాశించెను.

క. ప్రాసాదసంఘయుతమై, భాసురమణిభాజనాళి♦భరితంబై మ
ధ్వాసవసుపరిక్లిన్నం, బై సరసమృదంగనాద♦మై కడువిరివై. ౪౩౫

అర్థములు. భాజనాళి = పాత్రల సమూహముచే, భరితంబై = నిండి, మధ్వాసవ=తియ్యని సారాయముచే, పరిక్లిన్నంబై =తడిసినదై, మృదంగనాదమై = మద్దెలధ్వనులు గలదై, విరివై = వెడల్పై.

తా త్ప ర్య ము .

మేడల, యిండ్ల గుంపులు గలదై ప్రకాశించు రత్నములచేఁ జేయఁబడిన పాత్రలతో నిండి తియ్యని సారాయములతోఁ దడిసి యానందకరమైన మద్దెల ధ్వనులు గలదై వెడల్పై.

ఉ. బంగరుసజ్జెలుం దళుకు♦బంగరుపాత్రలుఁ జిత్తచోరమ
త్తాంగజఘోటికానిభవ♦రాంగనలున్ మణికాంచినూపురా
భంగరవంబులుం గలిగి♦బాఢమనోరమమై విశాలమై
యంగగు రావణాసురగృ♦హంబు వరంబును గాంచి దానిలోన్. ౪౩౬

అర్థములు. సెజ్జ=పానుపు, శయ్యా శబ్దభవము (సజ్జ=ఇల్లు) మత్త=మదించిన, అంగజఘోటికానిభ=మన్మథుని యొుఁడు గుఱ్ఱములతో (చిలుకలతో) సమానలైన, వరాంగనలుః=ఉత్తమ స్త్రీలును, మణికాంచి = మణులు చెక్కిన మొలనూళ్ళ యొక్కయు, నూపుర = అందెలయొక్కయు, అభంగరవంబులు = విడువని ధ్వనులు, (లక్ష్మణునకు కిష్కింధలోఁ బట్టిన దశ హనుమంతునకు లంకలోఁ బట్టెను) బాధ మనోరమమై=మిగుల మనోహరమై, కాంచీ-కాంచి యని రెండు రూపంబులు గలవు. (చూ. కుమా. సం. 1-37-3-55 ; మేఘ. 28. శిశు. 9-82, రఘు. 6-43) కాంచి దామ పిహితైక కరోరుః'' అని మాఘుఁడు. 'క్వచిత్ కాంచిః ఇత్యపిపాఠః' అని త్రికాండశేషవ్యాఖ్య. ఏకయష్టి ర్భవేత్కాంచీ, మేఖలా త్వష్టయష్టికా, రసనా షోడశసరా కలాపః పంచవింశకః'' ఒంటి సరము మొలనూలు కాంచి, ఎనిమిది సరములది మేఖల, పదాఱుసరములు గలది రసన (రశన) ఇరువదియైదుసరములు గలది కలాపము, అని మొలనూళ్ళ భేదములు.

తా త్ప ర్య ము .

బంగారు పానుపులుఁ మెఱుఁగు బంగరు పాత్రములు, మనస్సును దొంగిలించు చిలుకలవంటి యుత్తమ స్త్రీలు, వారి మొలనూళ్ళయు, నందెలయు ధ్వనులు, (ఇది పురుషాయిత క్రీడ తెలిపెడిని) గలిగి మిగుల మనోహరమై విశాలమై యందమైన రావణాసురుని యుత్తమ గృహములఁ జూచి దానిలో పానుపులు, పానపాత్రములు వరాంగనలు, రతిక్రీడలు తెలుపుటచే స్త్రీలు పురుషు లందఱు తమ పడుకటిండ్లలోఁ బండుకొని యున్నారనియు వెలుపలఁ దిరుగువారు లేరనియు సూచన.

—♦ ౭-వ సర్గము. హనుమంతుఁడు నగళ్ళలో సంచరించుట. ♦—

మధురగతిరగడ.

మారుతి గన్గొనె ♦ మందిరజాలము, హారివిదూరజ♦హాటకజాలముఁ
జపలాలతికా♦శకునవిహారము, నిపుణప్రావృ♦ణ్ణీరదవారము
వలెఁ బలుదెఱఁగుల ♦ భాసిలు శాలలఁ, గలితాంబుజఘన♦కార్ముఖశాలల
రమణీయం బయి ♦ క్రాలు విశాలల, విమలగృహోపరి♦విలసచ్ఛాలలఁ
బరమసురత్న♦భ్రాజిత మగుచును, బురుహూతాదిక♦పూజిత మగుచును
వరమును దోషని♦వర్జిత మగుచును, నరయఁగ నాత్మబ♦లార్జిత మగుచును
మయదానవ వర♦మతి నిర్మితమై, మణిమయభూషా♦మండిత మగుచును
భాసిలు గృహముల ♦ బావని గాంచెను, వీసముఁ గొంకక ♦ వేడ్కఁ జరించెను.

అర్థములు. మందిరజాలము=ఇండ్లసమూహము, హారి = మనోహరమైన, విదూరజ = వైడూర్యములతోను, హాటక = పైఁడితోను జేయఁబడిన, జాలము = కిటికీలు గలదియు, చపలాలతికా = మెఱుపులవంటి తీఁగలు గలదియు, శకున = పక్షులయొక్క; విహారము = సంచారము గలదియు; ప్రావృట్ =

వానకాలమందలి, నీరదవారమువలె = మేఘసమూహమువలె, కలితాంబుజ ఘన కార్ముక శాలలన్ = శంఖములతోను, గొప్ప విండ్లతోను గూడిన శాలలను, విమల = శుద్ధమైనఁ గృహోపరి = ఇండ్లమీఁద, విలసత్ = ప్రకాశించు, శాలల = బవంతులను, పురుహూతాదిక = ఇంద్రుఁడు మొదలగువారిచే, ఆత్మ బలార్జితము = తన భుజబలముచే కుబేరుని జయించి సంపాదించినది, మయదానవ = మయుఁడను దానవునియొక్క, వరమతి = బుద్ధి చాతుర్యముచే, నిర్మితమై = కట్టఁబడినదై, పూర్వము లంక విశ్వకర్మ కృతమని చెప్పఁబడెను. ఇప్పుడు మయదానవకృత మని చెప్పఁబడెను. లంకానగరమును తొలుతఁ గుబేరునకై విశ్వకర్మ నిర్మించెను. ఆవల రావణుఁడు దాని నాక్రమించిన తరువాత వాని కనుకూలముగ వాని యాజ్ఞచే మయుఁడు తన బుద్ధి చమత్కారము కొలఁది నెక్కువ గృహములు కట్టెను. ఈయిల్లు తన యిష్టానుసారము రావణుఁడు స్వయముగఁ గట్టించుకొన్నది.

మధురగతి రగడ—"నాలుగు మాత్రలు నాటిన గణములు నాలుగు రెంటికి నవి విరమణములు గలసి మధురగతికి నలును జగణము తొలఁగిన ధృత కౌస్తుభక విరమణము." అప్ప.

తా త్ప ర్య ము .

మనోహరములైన వైడూర్యములచేతను బంగారుచేతను, నిర్మింపఁబడినవియు, మెఱుపుఁదీఁగలవంటివై పక్షులు విహరించునవియు నగు నిండ్ల సమూహములను, గొప్ప వర్షాకాల మేఘమువలె నానావిధముల నొప్పు శాలలను, శంఖములు పెద్ద విండ్లుగల శాలలను, మిగుల విశాలములైనవానిని, ఇండ్లమీఁదఁ గట్టఁబడిన బవంతులను, హనుమంతుఁడు చూచెను. జాతి రత్నములచేఁ బ్రకాశించుచు, ఇంద్రాదులచేఁ బూజింపఁబడుచు, నెట్టి వాస్తుదోషము లేనిదై, తన భుజబలముచేఁ గుబేరుని గెలిచి సంపాదించినదై మయుఁడను దానవునిచే నతని బుద్ధి చమత్కారము కొలఁది నిర్మింపఁబడినదై రత్నములచే నిండిన భూషణములచే నలంకరింపఁబడి ప్రకాశించు గృహములను వాయుపుత్రుఁడు చూచి వానియందు జంకు గొంకు లేక విహరించెను.

—♦ హనుమంతుఁడు పుష్పకవిమానముఁ జూచుట ♦—

వృషభగతిరగడ.

ఘనఘనాఘనకలితరూపము ♦ కాంచనాంచిత చారురూపము
దనుజనాథబలానురూపము ♦ ధాత్రి నప్రతిరూపరూపము
ధారిణీగన్వః ప్రకీర్ణము ♦ తతవిభాబహురత్నకీర్ణము
చారుతరకుసుమావకీర్ణము ♦ క్షౌద్ర మనఁగ రజోవికీర్ణము
చంచలాంగీదీప్యమానము ♦ చంచలాయుతఘనసమానము
అంచితసితఖగోహ్యమానము ♦ నగు విమానమునకు ననూనము
నగ మనన్ బహుధాతుచిత్రము ♦ నైకవర్ణపయోదచిత్రము

గగన మన గ్రహచంద్రచిత్రము♦గనె విమానము రత్నచిత్రము
ధరణి పర్వతరాజిపూర్ణము♦ధరము వృక్షవితానపూర్ణము
ధరణిరుహము సుమౌఘపూర్ణము ♦ తతసుమావళి పత్రపూర్ణము
భాసురసుమగపుష్కరంబులు♦పక్షికలయుతనిష్కుటంబులు
కేసరాన్వితపుష్కరంబులు♦గృహము లచ్ఛ త్విట్కరంబులు
అకుపచ్చవిహంగమంబులు♦హారిజాత్యతురంగమంబులు
నైకరత్న భుజంగమంబులు♦నవ్యరుచి నభసంగమంబులు. ౨౩౮

ఇక్కఁ గుబేరుని జయించి తెచ్చిన పుష్పక విమానము వర్ణింపఁబడుచున్నది.

ఘన = గొప్పదియగు, ఘనాఘన = వర్షాకాల మేఘమువలె. కలితరూపము = ఒప్పిన యాకారము గలది, కాంచనాంచిత = బంగారుచేఁ బ్రకాశించు, చారు రూపము=మనోహరమైన రూపము గలది, దనుజ నాథ = రావణునియొక్క బల = బలమునకు, అనురూపము = తగినది, అప్రతిరూప = ఎదురులేని, రూపము = సౌందర్యముగలది, ధారిణీగస్వః ప్రకీర్ణము = దైవవశమున భూమి మీఁద జాఱిపడిన స్వర్గము వంటిది, తతవిభా = విస్తార కాంతిగల, రత్నకీర్ణము = రత్నములతోఁగూడినది, చారుతరకుసుమ=మిగుల మనోహరమయిన పుష్పములచే, అవకీర్ణము=వ్యాపించినది, 'క్షౌద్రమనఁగా = తేనెయో యన్నట్లు, రజోవికీర్ణము = పుప్పొడిచే నిండినది. "మాక్షికం తైలవర్ణంస్యాత్, ఘృతవర్ణంతు పౌత్తికమ్, విజ్ఞేయం భ్రామరం శ్వేతం, క్షౌద్రంతుకపిలం మతమ్" మాక్షికమను తేనె తైలవర్ణము గలది. పౌత్తికమను తేనె నేతివర్ణము గలది, భ్రామరమను తేనె తెలుపువన్నె గలది. క్షౌద్రమను తేనె కపిల వర్ణము గలది. చంచలాంగీ = మెఱుపువంటి దేహముగల స్త్రీలచే, దీప్యమానము = ప్రకాశింపఁ జేయఁబడినది. చంచలాయుత = మెఱుపులతోఁ గూడిన, ఘనసమానము = మేఘముతో సరిపోయినది, అంచిత = ప్రకాశించు, సితఖగ = హంసలచే, ఊహ్యమానము = మోయఁబడుచున్నది. అగు విమానమునకు, అనూనము=తక్కువకానిది, అనఁగా సమానమైనది, నగమనఁగా = పర్వతమువలె. నైకవర్ణపయోదచిత్రము=నానా వర్ణములు గల మేఘమువలె వింతయైనది, గ్రహచంద్ర చిత్రము = సూర్యచంద్రులు చిత్రింపఁ బడినది, ధరము = పర్వతము, వితాన = సమూహము. సుమౌఘ = పూల రాశి, భాసుర+సుమగ+ పుష్కరంబులు = కాంతిగల పుష్పములతోఁ గూడిన జలములు, కల = అవ్యక్త మధుర ధ్వని, నిష్కుటంబులు = ఉద్యానవనములు, కేసరాన్విత పుష్కరంబులు= అకరువులతోఁ గూడిన కమలములు, అచ్ఛ = నిర్మలమైన, త్విట్క రంబులు = కాంతుల కిరణములు గలది, విహంగమంబులు = పక్షులు, హారి = ఇంపైన, జాత్య తురంగమంబులు = ఉత్తమాశ్వములు, నైకరత్న భుజంగమంబులు = అనేక రత్నములతోఁ జేయఁబడిన పాములు, నవ్యరుచి = మనోజ్ఞ! కాంతిగల, నభసంగమం

బులు=పక్షులు, నభసి+గచ్ఛంతి=ఆకాశమునఁ బోవునవి కావున నభసంగమములు.

## తాత్పర్యము.

గొప్ప వర్షాకాల మేఘమువంటి యాకారము గలది, బంగారుచేఁ బ్రకాశించు మనోహరాకారము గలది, రావణాసురుని బలమునకుఁ దగినది, కావుననే భూమి యందు దానికి సమానమైనది లేనిది, ఆకాశమునుండి జారిపడిన స్వర్గమా యేమి యనదగినది, విస్తారకాంతిగల యనేక రత్నములతోఁ గూడినది, మనోహరము లైన పుష్పములచే వ్యాపించినది, తేనెవలెఁ బుప్పొడిచే నిండినది, మెఱుపులతోఁ గూడిన మేఘమువలె మెఱుపుఁదీఁగలవంటి దేహములు గల స్త్రీలచేఁ బ్రకాశించునది. హంసలు మోసికొనిపోవు బ్రహ్మవిమానమునకు సమానమైనది, పర్వతమా యన్నట్టు లనేకగైరికధాతువులచే వింతయైనది, గనుక నానావర్ణములుగల మేఘమువలెఁ జిత్రమైనది, ఆకాశ మనునట్లు సూర్య చంద్రులు చిత్రింపఁబడినది, ఇట్టి రత్న చిత్రమైన విమానమును హనుమంతుఁడు చూచెను. అందు భూమి పర్వతముల వరుసలచే నిండినది, పర్వతములు వృక్షసమూహములచే నిండినది, వృక్షములు పూల రాసులచే నిండినవి, పూలరాసు లాకులతో నిండినవి, భూమి-పర్వతములు లోనైనవి చిత్తర్వులని గ్రహింపవలెను.(ఈ రెండు పాదములందు నేకావళి యలంకారము) పూర్వపూర్వ వస్తువునకు నుత్తరోత్తరవస్తువు విశేషణ మయ్యెనేని యేకావళి యగును.పూలతో నిండిన నీళ్లు;పక్షి కలకలధ్వనులతో నిండిన తోఁటలు, అకరులతోఁడి కమలములు, కాంతులు వెదజల్లు గృహములు, ఆకుపచ్చ పక్షులు, ఉత్తమ జాతి గుఱ్ఱములు, అనేక రత్నములతోఁ జేయఁబడిన పాములు, ఆయా పక్షివర్ణములకుఁ దగినట్లు రత్నములతోఁ జేయబడిన పక్షులు అందుఁ జిత్రింపఁబడెను. వృషభగతి రగడ=ఇరువది యెనిమిది లఘువులు, పదునేనిట విశ్రాంతియుఁ గూర్చిన నిరవగు వృషగతి పద్మాధిప, యది విను మాదరమున ముదమున; ఇందు లఘువులనుటచే నన్నియు లఘువు లుండవలెనని యెంచరాదు. గురువునకు రెండు లఘువుల వంతున లెక్కింపవచ్చును.

క. సాక్షాత్సుమనస్సాయక, పక్షములు ప్రవాళకనక♦పక్షములు లస
త్పక్షములు కుసుమకీలిత, పక్షములు సలీలవక్ర♦పక్షము లమరన్. ౨౩౯

అర్థములు. మీఁదఁ గడపటఁ జెప్పిన పక్షు లిందు వర్ణింపఁబడు చున్నవి. సాక్షాత్ సుమనస్సాయక పక్షములు = ప్రత్యక్షముగ మన్మథునకు సహాయము లగునవి, వానిని జూడఁగానే కామము జనించునని భావము. ప్రవాళకనక పక్షములు = పగడములతోను, బంగారుతోను దీర్పఁబడిన ఱెక్కలు గలవి. ఱెక్కల కొనలందు బంగారు కూర్పఁబడినదని భావము. 'కం. ఱెక్కల కొనలం గలిగిన, యిక్కాంచన మాసపడియెదే నృప నీ కే యక్కఱ దీనం దీరెడు" నని

శృంగారనైషధము. కుసుమ కీలిత పక్షములు=పూలతోఁ జేసిన, కూర్పఁబడిన ఱెక్కలు గలవి, సలీలవక్రపక్షములు = విలాసముగా వంకరగా నుండు ఱెక్కలు గలవి. పూర్తిగా ముడుచుకోక పూర్తిగా చాఁచుకోక కొంచెముగా విచ్చిన ఱెక్కలని భావము.

తాత్పర్యము.

కామ ముద్దీపింపఁ జేయుటయందు మన్మథునకు సహాయపడునవి, ఱెక్కల కొనలందు పగడములు బంగారు కూర్పఁబడినవి, ఆ కారణముచేఁ బ్రకాశించునవి. బంగారుతోను, పగడములలోను జేయఁబడినపూలు చెక్కఁబడినవి. మీఁదఁ జెప్పబడిన పక్షు లిట్లున్నవని భావము.

క. తమయంతఁ గరులు నునుఁదొండముల నెఱవిఱియు కలువ♦ననలఁ గొలని నీ
రము గొని యభిషేకింపఁగఁ, గమలాంచితహస్తయైన♦కమలాసతితోన్. ౨౪౦

తాత్పర్యము.

ఏనుఁగులు తమ తమ తొండములతో దమంతఁదామే బాగుగ విచ్చిన కలువపూలను నీరు తీసికొని యభిషేకింపఁగాఁ గమలము చేత ధరించిన లక్ష్మీదేవితో— ఈ ప్రకారము శిల్పము చేయఁబడి యున్నదని భావము.

క. కమ్మనివలపులు గల వృక్షమ్మన మాధవదరీద్ధ♦శైలమ్మన హృ
త్సమ్మతపుష్పవిమానం, బమ్మరుదాత్మజుఁడు గాంచి♦ యబ్బురపడియెన్. ౨౪౧

అర్థములు. అమరన్ - అనునది పూర్వ పద్యమునుండి గ్రాహ్యము, అమరన్ హృత్సమ్మత పదముతో నన్వయము, వలపులు = వాసనలు, మాధవ = వసంతకాల మందలి, దరీద్ధ = గుహలచేఁ బ్రకాశించు, శైలమ్మనన్ = పర్వతమో యనునట్లు హృత్సమ్మత=హృదయమున కిష్టమైన, అబ్బురపడియెన్=ఆశ్చర్యపడియెను.

తాత్పర్యము.

సువాసనలు గల వృక్షమో, వసంతకాలమున గుహలచే నొప్పు పర్వతమో యనఁదగిన, హృదయమున కిష్టమైన పుష్పక విమానమును హనుమంతుఁడుచూచి దాని రచన కాశ్చర్యపడెను. మాధవ కాలమందలి గుహయనుటచే నా కాలమందలి పుష్పవాసనతోఁ గూడియుండుట వివక్షితము. దానిచుట్టి యెంతదిరిగినను రావణుఁడు స్త్రీలతో నుండు స్థలము కానరాలేదు. ఆ విమానము పరిమితి తెలియలేదు కావున నాశ్చర్యపడె నని భావము.

క. ఎంతయు వింతలు పురమం, దంతటఁ గనుఁగొనుచు నరిగి♦ యరిగి మహీజా
కాంతను గనక సునేత్రుఁడు, చింతాయుతుఁ డయ్యె నేమి♦ చేయుదు ననుచున్.

అర్థములు. సునేత్రుఁడు=(౧) బహు దూరముననున్న సూక్ష్మ వస్తువునైన జక్కఁగాఁ జూడఁగల దృష్టి పాటవము గలవాఁడు. దగ్గఱకుఁబోయి తిరుగవేసి మరల వేసి చూడవలసిన పనిలేదని భావము. ఈదృష్టి పాటవ మీయనయందు విశేషించి

యున్నట్లు ౧౨౪ వ పద్యమునఁ జెప్పఁబడెను. (౨) ఒకసారి చూచిన మాత్రాన సమస్త వస్తువులను మఱలఁ జూడవలసిన పనిలేక కరతలామలకముగా గ్రహించును.

తా త్ప ర్య ము.

ఆ పట్టనమందు సమస్త ప్రదేశములు తిఁగి తిరిగి యెన్ని వింతలో చూచెను గాని యా సునేత్రుఁడు సీతాదేవి గానరామిని నిఁక నేమి చేయుదునా యని మిగుల విచారగ్రస్తుఁ డయ్యెను.

—♦ ౮–వ సర్గము. పుష్పకవిమానవర్ణనము ♦—

ఉ. ఆ నిలయంబులోన నడు♦మంతరమందు విచిత్రరత్నసం
తానధగద్ధగాయితసు♦తప్తసువర్ణమనోహరంబు వై
మానికమార్గసంచరణ♦మానిత మప్రతిమం బమేయముఁ గ్
భానుపథైకలక్ష్యమును ♦ బావని గాంచె విమానరత్నముఁ గ్. ౨౪౩

పుష్పకవిమాన వర్ణనమే యింకను జేయుచున్నాఁడు. ఆ నిలయంబులోనఁ గ్= పుష్పకాధారమైన రావణుగృహంబు లోపల, సుతప్తసువర్ణ = పుటము వేయఁ బడిన బంగారు, వైమానిక మార్గ=దేవతలు సంచరించు నాకాశమందు, సంచరణ= సంచరించుటచేత, మానితము=గౌరవింపఁబడినది. అప్రతిమము = అసమానమైనది, అమేయము=పరిమితి చెప్పరానిది, భానుపథైకలక్ష్యము = సూర్యుఁడు సంచరించు మార్గమే తనకుఁ బ్రధాన లక్ష్యముగాఁ గలది. విశేషముగ నాకాశమందే సంచరించునది యని భావము. ఆకాశసంచారము గలది యా యింటినడుమ గలదనుటచే నా విమానము భూమి మీఁద నాకాశమునఁ గూడ నుండఁగలదని భావము. దేవతల విమానములు కొన్ని భూమి మీఁదికి రాఁజాలవు. భూమియందలివి యాకాశమునకుఁ బోలేవు. ఇది యట్లు గాదు అని భావము.

తా త్ప ర్య ము.

పుష్పకాధారమైన యా యింటిలో నడిమిభాగంబున వింతవింతలైన మణుల గుంపులచే ధగద్ధగ మని మెఱయు పుటము వేసిన బంగారువలె మనోహరమై యాకాశ మార్గమునఁ బోఁగల దగుటచే గౌరవింపఁబడు నదియై యాకారణముచే నసమానమై పరిమాణమందు విస్తారమై యాకాశమందే విశేషముగ సంచరించు శ్రేష్ఠమైన విమానమును హనుమంతుఁడు చూచెను.

ఉ. అందు నమేయకౌశలసు♦యత్నముతోడ నొనర్పఁబట్టి దే
దెందును లేదు దివ్యమణి♦హీరవినాకృత మెందు లేదు త
త్సుందరతాగుణంబు గన ♦ ద్యోచరయానములందుఁ గల్గ దెం
దెందుఁ గనంగ నబ్ర ముద♦యింపక పోదు నితాంత మేరికిఁ గ్. ౨౪౪

అర్థములు. అమేయకౌశల=మిగుల నేర్పుతోను, సుయత్నముతోడ = విశేష

ప్రయత్నముతోఁగాను, హీరవినాకృతము=వజ్రములు లేనిదిగాఁ జేయఁబడినది, ద్యోచర యానములందు= దేవతల విమానములందు.

తా త్ప ర్య ము .

ఆ విమానమందు మిగుల నేర్పుతోఁను, నతి ప్రయత్నముతోఁను జేయఁబడనిది యేదియు లేదు. ఎందును లేదు. దేవతాసంబంధమైన మణులు వజ్రములు గూర్పనిదియు లేదు. దాని సౌందర్యము దేవతల విమానమందును లేదు. ఏ ప్రదేశమును జూచినను చూచినవారికి మిగుల నాశ్చర్యము గలిగింపకపోదు.

సీ. విపులతపంబున♦విక్రమంబున నార్జి,తం బయి హృత్సమా♦ధానముగను
జరియించుచు ననేక♦సంస్థాననిర్మి,తం బై సర్వతో మనో♦హరము నగుచు
దుర్వార మై వాయు♦తుల్యజవంబు నై, కృతపుణ్యమహితాత్మ♦గేహ మనఁగ
నొప్పుచుఁ జిత్రకూ♦టోత్కర మండితం, బై హృద్యమై శర♦దంబుజారి

తే. ధవళ మై కుండలాలంకృ♦తముఖ గగన, చరనిశాచరచారువి♦శాలనయన
భూరిజవనదురాధర్ష♦భూతగణస,హస్రవాహిత మయి యొప్పు♦నట్టి దాని. ౫౬౭

అర్థములు. హృత్సమాధానముగను = మనస్సునకుఁ దృప్తికరముగ, అనేక సంస్థాన నిర్మితబై = గోపురములు, ప్రాకారములు లోనగు ననేక సన్నివేశములచే నేర్పఱుపఁబడి, సర్వతోమనోహరము = అన్ని ప్రదేశముల నన్ని విషయముల మనస్సు నాకర్షించునది, దుర్వారము=గమనమం దడ్డములేనిది, వాయుతుల్య జవం బునై = వాయువేగముతోఁ బోఁగలదై, కృతపుణ్య=పుణ్యము చేసిన, మహితాత్మ= గొప్ప మనస్సుగల యుత్తమ పురుషుల, గేహము=ఇల్లు, అనఁగా స్వర్గమో యను నట్లు, చిత్రకూటోత్కర మండితంబై = చిత్రములైన యనేక శిఖరములచే నలంకరింపఁ బడి, హృద్యమై=హృదయమునకు సంతోషకరమై, శరదంబుజారి ధవళమై=శరత్కాల చంద్రునివలెఁ దెల్లనై, కుండలాలంకృత ముఖ = కుండలములచే నలంకరింపఁ బడిన ముఖములను, గగన చర నిశాచర= దేవతలు రాక్షసులు గలవియు, చారు విశాల నయన = మనోహరమైన వెడలుపాటి కన్నులు గలవియును, భూరి జవన = అధిక వేగము గలవారివలెఁ గానవచ్చునవియు, దురాధర్ష = తిరస్కరింపరాని, భూతగణసహస్ర = గోపురములను మోయు బొమ్మలవలెఁ బ్రతిమరూపముగ నున్న పిశాచములచే, వాహితము = మోయఁబడునది, ఇందుఁ జెప్పఁబడిన భూతగణములు ప్రాణములతో నుండునవి కావు. ఆకాశమునఁ బోవుఁ దాని నొకరు మోయ నేల? అదియునుగాక రావణుని యంతఃపురమున జీవించి యుండు మగవారుండఁ రాదు. కావున నివి నిర్జీవములైన బొమ్మలనియే గ్రహింపనగు. ప్రయాణమై పోవునపు డెవ్వరైన మోయవలసిన పని యుండును గాని కదలక యొక చోట నుండునపు డెవరు మోయవలసిన పని యేమి యున్నది? ఈ విమానము యంత్ర బలమున నడచునుగాని భూతములు మోసికొని పోవుటచేఁ గాదు. దీనిని

నడపువాఁడును గలఁడు. ఉత్తరకాండమునఁ జూచునది. (ప. ౯౦౬) ఇది యిప్పటి యంత్రసాధ్య విమానముల వంటిది.

తాత్పర్యము.

గొప్ప తపస్సువలన గలిగిన పరాక్రమముచే సంపాదింపఁబడి హృదయ సమ్మతముగఁ దిరుగఁ గలదై, గోపుర ప్రాకారాదులు గలిగి యెందుఁ జూచినను అన్ని ముఖముల మనోహరమై వాయు వేగము గల దనుటచే నివారింపరానిదై, స్వర్గమో యనునట్టు లొప్పుచుఁ జిత్ర శిఖరములచే నలంకరింపఁబడి శరత్కాల చంద్రునివలెఁ దెల్లనై, కావున నేయింపై, కుండలములచేనలంకరింపఁబడిన ముఖములు గలిగి దేవతా రాక్షసాకారములు పెద్దకన్నులు నధిక వేగము గలిగి తిరస్కరింపరాని వేలకొలఁది భూత సమూహములచే మోయఁబడు దానిని.

క. సురభిసుమసుందరం బై, సురభిత మై సురభికంబు♦సుందర మగుచుఁ
సురశిల్పివినిర్మిత మై, పరఁగెడి పుష్పకవిమాన♦వరముం గనుచుఁ. ౨౪౬

అర్థములు. సురభిసుమ సుందరంబై=వసంతకాలపుష్పమువలె నందంబై, సురభితమై = మంచి వాసనగలదై, సురభికంబు = వసంతకాలముకంబు, సురశిల్పి వినిర్మితంబై=విశ్వకర్మచే నిర్మింపఁబడినదై,

తాత్పర్యము.

వసంతకాల పుష్పమువలె సుందరమై, పరిమళముగలదై, వసంతకాలముకంబు సుందరమై, విశ్వకర్మ నిర్మితమైన విమానశ్రేష్ఠమును జూచుచు.

—♦ ౯-వ సర్గము. హనుమంతుఁడు రావణుని యంతఃపురంబుఁ జూచుట. ♦—

తే. ఆ విమానంబు మధ్యంబు♦నందు నర్థ, యోజనము వి స్తృతియునొక్క♦యోజనంబు
నిడివి గలపం క్తికంబుమం♦దిరముఁజొచ్చి, యాయతాక్షిని వెదకె హ♦తారికుఁడు.

అర్థములు, హతారికులుఁడు=చంపఁబడిన శత్రు సమూహము గలవాఁడు.

తాత్పర్యము.

ఆ విమానము నడుమ నర్థ యోజనము వెడలుపు, ఒక యోజనము నిడుపు గల రావణాసురుఁడు కాఁపురము చేయు నిల్లుసొచ్చి యందు హనుమంతుఁడు సీతాదేవిని వెదకెను.

క. పెక్కులు మాడుగు లొప్పెడి, రక్కస నాయకులనగరఁ♦గ్రమముగఁ గని పే
రుక్కు గల సోఁకు లిండ్లను, గ్రక్కున తేఁడుండు వీటఁ♦గనఁగఁ దొడంగెఁ. ౨౪౮

అర్థములు. మాడుగులు=మేడలు, సోఁకులు=రాక్షసులు.

తాత్పర్యము.

పెక్కులు మేడలుగల రావణుని నగరునందు వరుసగ బలవంతులగు రాక్షసుల యిండ్లయందు రావణుఁ డుండు నింటియందును వెదక నారంభించెను.

సీ. మూఁడును నాల్గు కొ♦మ్ములు గలయేనుఁగు, లెడ మెడముగఁ గట్టఁ♦బడుచు నుంట
యుద్ధృతాయుధు లైన♦యోధులు గాచుట, యసురనాయకుని భా♦ర్యాళిచేత
విక్రమాహృతపృథి♦వీధవకన్యకా, బృందంబుచేఁ బరి♦వృతము నగుట
తిమితిమింగిలనక్ర♦దీర్ఘఝషాకులో, దధి నాఁగఁ గల్లోలి♦తంబు నగుట

ఆ. శ్రీదు లక్ష్మి, యింద్రు♦సిరియును, సర్వంబు, పాయ కుంట వాని♦బంధు లిండ్ల
యమకుబేరవరుణ♦రమయు నంతకు మిన్న, వెలయు చుంటఁ గనియె♦వీరవరుఁడు.

అర్థములు. ఉద్ధృతాయుధులు = ఎత్తఁబడిన యాయుధములు గలవారు, విక్రమ=పరాక్రమముచే, ఆహృత = అపహరింపఁ బడిన, పృథివీధవ కన్యకాబృందంబుచే = రాచకన్నియల సమూహముచే, పరివృతము=ఆవరింపఁబడినది, తిమింగిల= తిమిని మ్రింగెడి పెద్దచేఁపచేత, దీనిని మ్రింగెడి చేపకు తిమింగిలగిల మని పేరు, నక్ర= మొసళ్ళచేత, దీర్ఘఝషా=నిడివి చేఁపలచేత, ఆకుల=కలఁత చెందిన, ఉదధినాఁగన్= సముద్రమో యనునట్లు, కల్లోలితంబు=అల్లకల్లోలమైనది, శ్రీదు = కుబేరునియొక్క, రమ=సంపద, మిన్న = హెచ్చుగ.

తా త్ప ర్య ము .

ఆ యింటియందు మూఁడుకొమ్ములు, నాలుగు కొమ్ములు గల యేనుఁగులు దూరము దూరముగఁ గట్టఁబడి యుండుటను, యుద్ధమునకు సిద్ధపడి యెత్తఁబడిన యాయుధములు గల యోధులు గాచుచుండుటను, రావణుని భార్యలచేత, వాఁడు బలాత్కారముగ నపహరించి తెచ్చిన రాచకన్నెలచేత నావరింపఁబడి యుండుటను, తిమితిమింగిలము మొసళ్లు నిడుపాటి చేఁపలు వీనిచేఁ గలఁత నొందిన సముద్రము వలె నల్లకల్లోలమై యుండుటను, కుబేరుని సంపదయు, నింద్రుని యైశ్వర్యము, సర్వ దిక్పాలుర లక్ష్మి వాని యింటను, వాని బంధువుల యిండ్లయందు యమ కుబేర వరుణుల సంపద యొక్కొక్కరి యింట నొక్కొక్క దిక్పతి సంపద వదలక యంత కంటె నెక్కువగా నుండుటయు హనుమంతుఁడు చూచెను.

ఉ. ఆ సొబగారుమేడనడు♦మంతర మం దొగి విశ్వకర్మ దా
వాసిగ మింటఁ దొల్దొలుత ♦ వారిజగర్భునకై రచించె నా
నాసుమణీయుతంబుగ న♦నంతర మా ధనదుండు నీరజా
తాసనుఁ గొల్చి చేకొనియె ; నాతని గెల్చి రణాంగణంబునన్.	౫౧౦

పుష్పకవిమానము పూర్వచరిత్ర చెప్పఁబడుచున్నది.

తా త్ప ర్య ము .

ఆ యందమైన మేడ నడుమ నుండు పుష్పకమును దొలుత విశ్వకర్మ బ్రహ్మ దేవునకుఁగాను మంచి రత్నములచే నాకాశమున నిర్మించెను. దాని నాయన యావలఁ దన్ను సేవించిన కుబేరున కిచ్చెను. ఆయనను యుద్ధ భూమి యందు గెల్చి ;

సీ. రావణుఁ డుగ్రత ♦ గ్రహియించినదియు నీ,హామృగయు క్తమై♦యమరు నదియుఁ
గా ర్తస్వర స్తంభ♦కమనీయ మగునది, ధగధగత్కాంతులఁ ♦ దనరు నదియు
మేరుమందరముల♦మేలిమి గగసంబు, రాయు కూటాలయ♦రాజిచేత
సమలంకృతం బయి ♦ సవురు మీఱెడునది, నడిమింటిసూర్యుని ♦ నవ్వునదియుఁ
తే. గనకసోపానపంక్తులఁ♦గ్రమవేది,కలను వాతాయసంబులఁ ♦ గలితనీల
విద్రుమాంచిత మౌక్తిక♦వితతి స్థగిత,మైన పుష్పక త్రల మెక్కె హనుమ యపుడు.

అర్థములు. ఈహామృగయుక్తమై=కృత్రిమములైన జింకల యాకారము గల బొమ్మలతోఁ గూడినది, కార్తస్వర స్తంభకమనీయము = బంగారు కంబములచే నందమైనది, మేలిమి = ఎత్తైన, కూటాలయరాజిచేతన్ = కొలువుకూటముల సమూహముచేత, క్రమవేదికలన్ = అందమైన యరుఁగుల చేతను, వాతాయనంబులన్ = కిటికీల చేతను, నీల ఇంద్రనీల మహానీల నీలమణులచేతను – నీలములు ఇంద్రనీలము లని మహానీలములని నీల మణులని మూఁడు తెగలు గలవు. అందు పాలను నీలముగఁ జేయునది ఇంద్ర నీలము. దీనిని పాలలో వేసినచోఁ బాలు నీలముగాఁ గనఁబడును. దీనికి క్షీరగ్రాహి యని పేరు. నీలము మీఁద పచ్చిగడ్డి పోఁచగాని, పొట్టుగాని గసగసాలు గాని యుంచి యూఁదిన దలక్రిందుగఁ ద్రిప్పినను బడిపోవదేని దానిని తృణగ్రాహి యందురు. సింహళ ద్వీపమునఁ బుట్టినది మహానీలము. 'క్షీరమధ్యే క్షిపే న్నీలం క్షీరంచే న్నీలతాం వ్రజేత్ । ఇంద్రనీల మితి ఖ్యాత మితి చాగస్త్య భాషితమ్ । సింహళాకరసంభూతా మహానీలా ఇతి స్మృతాః' అని రత్నశాస్త్రము. విద్రుమము = పగడము.

ఇంద్రనీలము నెమలి కంఠచ్ఛాయ గలదై యుండును. మహానీలము వెన్నెదురాకు పూవువలె నుండును. నీలమణి నల్ల విష్ణుక్రాంతమువలె నుండును.

పగడములు సముద్రము నీటిలో దీఁగలవలె నల్లుకొని యుండును.

స్థగితము = చెక్కఁబడిన నేలగలది.

తాత్పర్యము.

రావణుఁడు గ్రహించినదియుఁ, గృత్రిమపు జింకలవంటి బొమ్మ లమర్పఁబడినదియు, బంగారు కంబములు గలదియు, ధగ ధగ మను కాంతులు గలదియు, మేరు మందరపర్వతముల వలె నెత్తుగుటచే నాకాశమును రాచుకొను కొలువు కూటములచే నలంకరింపఁ బడినదియు మిట్ట మధ్యాహ్నమున సూర్యునివలెఁ బ్రకాశించు నదియు, బంగారు మెట్లు అరుఁగులు, కిటికీలు గలదియు, నీలములు, పగడములు, మంచి ముత్యములు వీనిచేఁ జెక్కఁబడినదియు నగు పుష్పక ప్రదేశము మీఁద హనుమంతుఁ డెక్కెను.

ఉ. ఆ యెడ భక్ష్యపానవివి♦ధాన్న వినిర్గతక్రమవాసనల్
వాయుతనూభవుం గదిసి ♦ స్వాంతము రంజిల బంధురీతిగా

నీయెడ నున్నవాఁడు దను♦జేశ్వరుఁ డిట్టెటు రమ్ము రమ్మటం
చా యతివీరునిం బిలుచు♦నట్టులు రాజిలె సోడు ముట్టుచున్.          ౨౫.౨

అర్థములు. భక్ష్యపానవివిధాన్నవినిర్గతకమ్రవాసనల్ = భక్ష్యములనుండియు, పానముల నుండియు వివిధాన్నముల నుండియు బయలు వెడలిన కమ్మని వాసనలు, సోడు = నడినెత్తి.

తా త్ప ర్య ము .

ఆ సమయమందు పిండివంటలు, అప్పచ్చులు, పాకములు, పులిహోర, దధ్యోదనము, కేసరీభాత్, వాంగీభాత్ లోనగు వివిధములైన యన్నములు - వీని నుండి వెలువడిన కమ్మని వాసనలు హనుమంతుని యొద్దకు వచ్చి యతని మనస్సు సంతోషపడునట్లు బంధువువలె రావణాసురుఁ డిచ్చట నున్నవాఁడు మావెంటరమ్ము చూపెదమని పిలుచునట్టులు తలకెక్కునట్లు వ్యాపించి యుండెను. వాయువశమున వాసనలు కొట్టును. వాయువు హనుమంతునకుఁ జుట్టమే కదా. ఇది మొదలు నాలుగు పద్యములు కలాపకము.

సీ. అట కేగి వరశుభా♦యత మయి కాంత నాఁ, గాంత మై ప్రియనిజ♦కాంతవోలె
నమరారికిని మనో♦హర మయి రత్న సో,పానవికృత మయి ♦ పైఁడిజాల
కంబుల నీ టయి ♦ కడుఁబటికపురాల, ని మ్మయి దంతపు♦బొమ్మ లమరి
పవడముల్ ముత్యముల్ ♦ బంగారు వెండియుఁ, బటిమఁదీర్చిన స్తంభ♦పటలి గలిగి
తే. సమము చక్కన యెత్తును ♦ జాను మీఱు,కంబములమింటి కెగిరెడి♦కరణి వెలసి
యిలను గలిగినచిత్రంబు ♦ లెల్ల వ్రాయఁ, బడిన చిత్రకంబళములై♦పఱపు గలిగి.

అర్థములు. కాంతనాన్ = స్త్రీవలె, వికృతము=కట్టఁబడినది, పవడముల్ ముత్యముల్ బంగారు వెండియు బటిమ=ఇది సమస్తపదము, చక్కన=వంకర లేనిది, పఱపు= వెడలుపు, ముత్యములు = ఇవి మేఘములందు, పాము పడగలందు, వెదుళ్ళయందు, జేపలందు, నేనుఁగు కుంభములందుఁ జెఱకులందు శంఖములందు, పంది కోఱలందు, ముత్తెపు జిప్పలందుఁ బుట్టును. మేఘమునందుఁ బుట్టునవి మనుష్యులకు లభింపవు.

'నీరదముల్ దిగంతములు నిండి పటుస్ఫుటగర్జితంబు లే
పార మహోగ్రవృష్టి గురియం బ్రభవించు నితాంతకాంతితో
నారయఁ గుక్కుటాండ సమమై పడు ముత్యము లంతరిక్ష సం
చారులు పట్టుకొందురు వెసన్ వసుధం బడకుండ నేర్పునన్॥'

పాము పడగలోని ముత్తెము గురిగింజ వన్నె గలది. వెదురునందుఁ బుట్టునది నక్షత్ర కాంతి గలది. ఇది స్త్రీ వశీకరణమం దుపయోగపడును. ఇది మినుపగింజంత యుండును. చేపతలయం దుండునది వెండివలె తెల్లమల్లె పూవువలె నుండును. దీనికి నిష్ప్రభత్వము లేదు. ఏనుఁగు కుంభములం దుండునది యుసిరికకాయయంత యుండును.

వెత్తిచెఱకు నందుఁ బుట్టునది ప్రేంకణపుఁబూవు చాయగలది. పంది కొమ్మునం దుండునది రేఁగుఁ బండంత యుండును, కుంకుమ చ్ఛాయగలది. వెదురుముత్తెములు కోడిగ్రుడ్డంత యుండును. ఇది మాత్రసాధకులకు లభించును. స్వాతియందు ముత్తెపుఁ జిప్పలలోఁబడిన వానచినుకులు మంచిముత్యము లగును. వర్షబిందువు కొలఁది ముత్తెము. ఇందు శృంగళశుక్తు లందుఁ బుట్టినవి యెఱ్ఱగాను, రావణ శుక్తులం దుఁ బుట్టినవి బంగారు వన్నె కలవిగా నుండును. తామ్రపర్ణి శుక్తియందలివి తెల్లగా నుండును. పూర్వకాలమున నానాదేశములవారు పాశ్చాత్యులు వీని వ్యాపారమునకై యీదేశమునకు వచ్చుచుండిరి. వీనిలో ఆణి, సుతారము, సుపాణి యనునవి మంచిజాతులు.

తాత్పర్యము.

ఆ వాసనజాడ పట్టి పోయి యందు మిక్కిలి యింపై పొడవై సుందరివలెఁ బ్రియమై రావణాసురనికిఁ దన ప్రియభార్యవలె మనోహరమై రత్నసోపానములు బంగారు కిటికీలు దంతపు బొమ్మలు పగడములయు ముత్యములయు బంగారు వెండులయు పటుత్వముచేఁ దీర్చిన స్తంభములు గలదై సమమై వంకర లేనిదై యెత్తైన కంబములచే నాకాశమున కెగిరిపోవుచున్న దానివలె నొప్పి భూమియందుగల చిత్రములన్ని వ్రాయఁబడిన కంబళ్లు గలిగి వెడలుపై.

ఉ. ఘుమ్మని కమ్మవాసనలు ♦ క్రమ్మ నితాంతశకుంతనాద మ
భ్రమ్మును ముట్టఁగా మృదువు♦పాన్పులు వన్నెలు మీఱ శుభ్రమై
నెమ్మది రావణాసురుఁడు ♦ నిచ్చ చరించెడి ధామ మాచు ధూ
పమ్ముల ధూమ్రమై శబల♦భంగి విచిత్రసువర్ణజాతమై. ౨౭

అర్థములు. నితాంతశకుంతనాదము = అతిశయించిన పక్షులధ్వని, అభ్రము = ఆకాశము, ధూమ్రము = నలుపు ఎక్కువగాఁ గలసిన యెఱుపు, శబలభంగిక = కామధేనువువలె. దీనివలననిది చిత్రవర్ణముగలదియెగాక సర్వకామముల నిచ్చునది యని సూచితము. విచిత్ర సువర్ణజాతము = చిత్రమైన మంచి రంగులు గలది.

తాత్పర్యము.

ఘుమ్మని కమ్మని వాసనలు వ్యాపింపఁగాఁ బక్షులధ్వనులు విశేషించి యాకాశమును దగులు చుండఁగా మెత్తని పఱుపులు తెల్లనై కాంతి లీను చుండఁగా రావణాసురుఁడు సంతోషముతోఁ దిరిగెడి యిల్లై సాంబ్రాణి యగరు దశాంగము వీని పొగలచే ధూమ్రవర్ణము గలదై శబలవలెఁ జిత్రమై మంచి రంగులు గలదై.

క. మదికిని నతిసంహ్లాద, ప్రదమై రంగులకు మేలి♦రం గొసఁగుచు శో
కదళనసమర్థమై సమ్మదమై కాంతులకు జనన ♦ మందిర మగుచున్. ౨౮

అర్థములు. అతి సంహ్లాదప్రదము = మిగుల సంతోషము కలిగించునది, శోకదళన సమర్థము = శోకమును బాపుటయందు శక్తి గలదై.

తాత్పర్యము.

మనస్సునకు మిగుల సంతోషము గలిగించునదియై వన్నెలకు వన్నెగలిగించు నదియై సమ్మదమగుటచే శోకించు వారిశోకము నణఁచునదియై కాంతులకుఁ బుట్టినిల్లై.

క. రావణపాలిత భవనము, పావని పంచేంద్రియముల♦పాళికి నవు రై
దౌ విషయంబులచే మో, దావాప్తిం గూర్చెఁ దల్లి♦యనువున నతఁడుర్. ౨౫౮

అర్థములు. రావణపాలిత భవనము = రావణుఁడు రక్షించు గృహము, పంచేంద్రియముల పాళి = త్వక్కు, కన్నులు, చెవులు, నాలుక, నాసిక : వీనికి, ఐదౌ విషయంబులచే = స్పర్శ, రూప, శబ్ద, రస, గంధములను నైదింటిచే.

తాత్పర్యము.

రావణుఁడు రక్షించు నా యిల్లు హనుమంతునికి వినుట కింపైన ధ్వనులచేత వీనులకును, కనుట కింపైన రూపములచేఁ గన్నులకును, తాఁకుటకు నింపైన వానిచేఁ జర్మమునకును, సువాసనలచే నాసికకును, నోట నీరూరించుటచే నాలుకకును దల్లి వలెఁ దృప్తి కలిగించెను. ఈ పంచేంద్రియ సుఖములు భార్యవలనఁ గలుగవచ్చును. అటుగాక తల్లివలె ననుటచే హనుమంతుని జితేంద్రియత్వము ప్రకటితము.

ఈ నాలుగుపద్యములు కలాపకము.

"కులకం బహుభిః శ్లోకైః, సాకాంక్షై రేకవాక్యతా
ద్వాభ్యాంతు యుగ్మకం నామ, తుల్యార్థాభ్యాంతు యుంబకమ్."

అనియు

'ద్వాభ్యాం యుగ్మ మితి ప్రోక్తం, త్రిభిః శ్లోకై ర్విశేషకమ్
కలాపకం చతుర్భి స్స్యాత్, తదూర్ధ్వం కులకం స్మృతమ్.'

ఏకాన్వయము గల రెండు పద్యములకు యుగ్మకమనియు మూఁటికి విశేషక మనియు నాల్గింటికి కలాపకమనియు అంతకుఁ బైపడిన కులకమనియుఁ బేర్లు.

క. నాకమొ కాకుండిన సుర,లోకమొ హరిహయునిపురమొ♦లోకేశుమహా
లోకమొ యగు సిద్ధం బని, యా కపి యటు చనుచు నెదుట♦నద్భుతకాంతిన్.

అర్థములు. నాకమొ = సామాన్యముగా స్వర్గలోకమో, సురలోకమొ = అందు ముఖ్యులయిన ముప్పది మువ్వురు దేవత లుండు స్థలమో, హరిహయుని పురమొ = అందు నింద్రుఁడు స్వయముగా నుండు ప్రదేశమో, లోకేశు మహా లోకమొ = బ్రహ్మలోకమో, సిద్ధము = నిశ్చయము.

తాత్పర్యము.

ఇదియేమి? పుణ్యముచేసినవారు పోయియుండు సామాన్య దేవలోకమా? అటుగాక ముఖ్య దేవతలు ముప్పదిముప్వు రుండు స్థలమా? అటుగాక యింద్రుఁడు స్వయముగా నివసించునిల్లా? కాక బ్రహ్మలోకమో నిశ్చయమని హనుమంతుఁ డాలో

చించుచుఁబోయి యెదుట నాశ్చర్యమైన కాంతిచే 'కనుగొనె'తో నన్వయము.

మానిని. జూదమునం బెనుజూదరి కోడి వ♦సుల్ వెసదోఁపక చింతిలు నా
జూదరియట్టులు నిశ్చలతం గను♦సొన్ను ప్రదీపములున్ జగతిన్
మాదిరిలేక వెలుంగు మణీకృత♦మంజులదీపులు సెమ్మెలుఁ దా
మోదము మీఱఁ గనుంగొనె వానర♦ముఖ్యుఁడు తద్భవనాంతమునన్.

అర్థములు. వసుల్ = ధనములను, సొన్నుప్రదీపములు = బంగారు దీపములు స్వర్ణశబ్దభవము సొన్ను రూ. సొన్నము. సమాసంబున సొన్నా యనియు రూపముగలదు. సొన్నాటంకములు, మణీకృత మంజుల దీపులు = రత్నములతోఁ జేయఁబడిన యందమైన దీపములు, దీపము లనఁగా దీపపు స్తంభములనియైనఁ జెప్ప వచ్చును. లేక రత్నములనే దీపాకృతులుగా నేర్పఱచిరనియు జీవమణులు కావున నవియే కాంతులు ప్రసరింపఁజేయుచుండె ననియు గ్రహింపనగు. సెమ్మెలను శబ్ద సాహచర్యముచే నీ యర్థమే గ్రాహ్యము.

మానిని:—ఏడు భగణములు గురువు. పదిమూఁడవ స్థానమున యతి.

తాత్పర్యము.

నేర్పరి యగు జూదగానికిఁ దన సర్వస్వ మోడిపోయి యేమిచేయుటకు దిక్కు దోఁపక చింతలో మునిఁగిన జూదరివలెఁ గదలక మెదలకుండు బంగారు దీపములును బ్రపంచమునందు సమానమైనవి లేక ప్రకాశించు మణులచేఁ జేయఁబడిన దీపములును సెమ్మెలును హనుమంతుఁ డా యింటియందుఁ గనుఁగొనెను.

సుగంధి. దీపకాంతి దైత్యకాంతు♦దేహకాంతిఁ దద్వపు
స్స్థాపనీయభూషణాళి♦సారకాంత కాంతులన్
బాపు! మండు చుండునట్లు♦ప్రజ్వరిల్లె శాల, యా
యేపుఁ జూచి మెచ్చె నంజ♦నేష్టపుత్రుఁ డాత్మలోన్. ౨౯

అర్థములు. తద్వపుః = రావణాసురుని దేహమందు ధరింపఁబడిన, స్థాపనీయ = బంగారుతోఁ జేయబడిన, భూషణాళి = సొమ్ముల వరుసలయొక్క, సారకాంత = సత్తుగలిగి, మనోహరమైన, కాంతులన్ = కాంతులచేతను, బాపు = ఔరా ఆశ్చర్యార్థకము రూ. బాపురే.

తాత్పర్యము.

దీపములకాంతి రావణాసురుని దేహకాంతి వాఁడు ధరించిన బంగారు సొమ్ముల కాంతి యివి యన్నియుఁ గలిసి యా శాల మండుచున్నట్లు వెలుఁగుచుండెను. ఆవిశేషముఁ జూచి హనుమంతుఁ డౌరా యని తనలో మెచ్చుకొనెను. సుగంధి:—రజరజర గణములు. తొమ్మిదింట యతి. ఉత్సాహమునకు దీనికి విశేషము భేదములేదు. సుగంధులన్నియు నుత్సాహములే కాని యుత్సాహములన్నియు సుగంధులు కావు. అందు నగణమున కెడమున్నది. ఇందులేదు.

—♦ నిద్రించు రావణుని యంతఃపురస్త్రీలను హనుమంతుఁడు చూచుట. ♦—

రసమంజరి. పరిపరివిధముల ♦ భాసిలుచేలల్, సరగలుఁ బలుపలు ♦ చందపులీలల్
పరఁగెడియువతులు ♦ పానసుకేళీ, పరతను నిదురను ♦ బండఁగఁ జూచెన్.

అర్థములు. సరగలు = హారములు.

తా త్ప ర్య ము .

నానావిధములుగఁ బ్రకాశించు చీరలు హారములు నానావిధ విలాసములు గల వయస్సు స్త్రీలు పానక్రీడాసక్తలై బాగుగఁ ద్రాగి నిద్రపోవుచుండ హనుమంతుఁడు చూచెను. రసమంజరి. ననససగురువు గణములు. తొమ్మిదింట యతి.

స్రగ్విణి. సద్దు లేకుండఁగా ♦ జారుభూషాతతుల్
ముద్దియల్ నిద్దురన్ ♦ మున్గి వర్తింపఁగాఁ
దద్ద యంచల్ మిళిం♦దంబులున్ లేనిమేల్
ముద్దుఁబద్మాకరం ♦ బో యనన్ రాజిలెన్. ౨౬౧

అర్థములు. మిళిందంబులు = తుమ్మెదలు.

తా త్ప ర్య ము .

స్త్రీలు బాగుగ నిదురించుటచే వారు ధరించిన సొమ్ములు సద్దుచేయకుండఁగా హంసలు తుమ్మెదలులేని యందమైన కొలనివలె నా మందిర ముండెను.

హంసలు - స్త్రీలు. తుమ్మెదలు - వారి యాభరణము.

స్రగ్విణి. నాలుగు రగణములు - ఏడింట యతి.

క. ముకుళితనయనంబులు నించుకయున్ వెలిఁ దోఁపనట్టి ♦ సొబగు రదంబుల్
ప్రకటసరోజాతామోద కలితవదనములు గలుగు ♦ తరుణులఁ జూచెన్. ౨౬౨

అర్థము. ముకుళిత = ముడుచుకొనిన, మూసికొనిన, రదంబుల్ = దంతములు, సరోజాత = పద్మముల, ఆమోద కలిత = వాసనగల, వదనములు = ముఖములు, తరుణులన్ = స్త్రీలను. తా త్ప ర్య ము .

మూసికొనఁబడిన కన్నులు, కొంచెమైన వెలికిఁ గానరాని యందమైన దంతములు విస్తారముగ పద్మముల వాసనగల ముఖములుగల స్త్రీలఁ జూచెను. నోళ్ళు తెఱచుకొని పండ్లు వెళ్ళఁబెట్టి నిదురించుట యధమస్త్రీల లక్షణము. పద్మవాసన చెప్పుటచే వీరు పద్మినీజాతి స్త్రీలని యేర్పడుచున్నది. పద్మినీ పద్మగంధా.

క. తామరలువోలె వారల, మోములు వికసించు నుదయ♦మున రుచిరముగన్
యామిని యగుడున్ మఱి తా, మే ముకుళితదళము లయిన♦యెలమిం గూర్చెన్.

అర్థములు. యామిని = రాత్రి, ముకుళితదళములు = ముడుచుకొనిన తేకులు.

తా త్ప ర్య ము .

వారి కన్ను లుదయమున వికసించి రాత్రి కాఁగానే తమంతఁదామే ముడుచుకొను కమలముల వలె సంతోషము కలిగించెను.

క. వీరల మోములు నిజముగ, సారసములు గాక యున్న ♦ షట్చరణంబుల్
నీరజములవలె నేలా, సారెకు నీ వదనములను సంప్రార్థించున్. ౨౬౪

తా త్ప ర్య ము .

వీరలముఖములు నిజముగ, కమలములే. అటుగాకయున్నఁ దుమ్మెదలు కమలములనువలె నేల వీని చుట్టు తిరుగుచున్నవి.

క. అందము చందము మఱి చల్లందనమును బరిమళంబు ♦ లలితాకృతులున్
సుందరము లగుటఁ బాకజ,బృందముపో ముఖము లనుచు ♦ నెంచెను గపియున్.

తా త్ప ర్య ము .

అందముయొక్క విధము చల్లదనము సువాసన మనోజ్ఞమైన యాకారము ఇవియన్నియు సుందరములేయైన కారణముచే వారి ముఖములు నిజముగఁ బద్మములే యని తలఁచెను. 'పో' యనునది నిశ్చయార్థమును దెలుపును.

'కమల ముకుళమృద్వీ ఫుల్లరాజీవగంధ
స్సురత పయసి యస్యాస్సౌరభం దివ్యమంగే
చకిత మృగ దృగాభే ప్రాంతరక్తేచ నేత్రే
స్తనయుగళ మనర్ఘ్యం శ్రీఫలశ్రీవిడంబి॥
తిల కుసుమ సమానం బిభ్రతీ నాసికాగ్రం
ద్విజ గురు సురపూజా శ్రద్ధధానా సదైవ
కువలయ దళకాంతిః కాపి చాంపేయగౌరీ
వికచ కమలకోశాకార కామాతపత్రా
వ్రజతి మృదుసలీలం రాజహంసీవ తన్వీ
త్రివళి లలితపద్మా హంసవాణీ సువేషా
మృదుశుచిలఘు భుంక్తే మానినీ గాఢలజ్జా
ధవళకుసుమవాసో వల్లభా పద్మినీస్యాత్.'

అని పద్మినీ జాతి స్త్రీ లక్షణము.

పద్మినీ జాతి స్త్రీలు తొలి మూఁడు జాములందు భర్తలతోఁ గలియును. ఈ కాలమందు వీరు నిద్రించుచున్నారని చెప్పుటచేతను వీరు పద్మినులనియే చెప్పనగును. 'రమయతి రమణీయాం పద్మినీ తుర్యయామే' యని లక్షణము.

క. తారాగణరాజిత మగు,శారదతారాపథంబు ♦ చందంబున దే
వారివరమందిరము కాం,తారత్నగణంబుచేతఁ ♦ దద్దయు వెలిఁగెన్. ౨౬౬

అర్థములు. తారాగణరాజితము = నక్షత్రసమూహముచేఁ బ్రకాశించునది. శారద తారాపథంబు = శరత్కాలమందలి యాకాశము.

తా త్ప ర్య ము .

నక్షత్ర సమూహముచే శరత్కాలమందలి యాకాశము ప్రకాశించునట్లు స్త్రీ

రత్నములచే రావణాసురుని యిల్లు ప్రకాశించెను. రావణాసురుఁడు చంద్రుఁడనియు స్త్రీలు నక్షత్రము లనియు గ్రహింపవలెను.

శా. ఆ రాజీవవిలోచనాపరివృతుం డై రాక్షసాధీశుఁడున్
దారాసంవృతకైరవాప్తుఁ డన నత్యంతంబు శోభిల్లె బా
లారత్నంబులఁ బుణ్యవిచ్యుతిని నేలన్ రాలు తారాళిగా
ధీరాగ్రేసరుఁ డా మరుత్తనయుఁ డెంతే నెంచెఁ జిత్తంబునన్. ౨౬౭

అర్థములు. రాజీవ విలోచనా = కమలములవంటి కన్నులుగల స్త్రీలచే, పరివృతుండై = చుట్టఁబడినవాఁడై, తారాసంవృత = నక్షత్రములచేఁ జుట్టఁబడిన, కైరావాప్తుఁడనన్ = చంద్రుఁడో యన్నట్లు, పుణ్యవిచ్యుతిని = పుణ్యము క్షయించిన కారణమున, ధీరాగ్రేసరుఁడు = ధైర్యము గలవారిలో మొదటివాఁడు.

తా త్ప ర్య ము .

కమలములవంటి ముఖములుగల యా స్త్రీలచేఁ జుట్టఁబడిన రావణుఁడు నక్షత్రములచేఁ జుట్టఁబడిన చంద్రుఁడో యను నట్లుండెనుగాని పుణ్యము క్షయించి పోఁగా నేలరాలిన నక్షత్రములవలె నా స్త్రీలను ధైర్యవంతులలో శ్రేష్ఠుఁ డగు హనుమంతుఁడు తలఁచెను. వీరు శీఘ్రకాలమందే విధవలు కాఁబోవు చున్నారు కావున హనుమంతుఁ డట్లు తలఁచెను.

౨౬౫ వ పద్యమందు బలవంతముగ హరింపఁబడిన స్త్రీలు రావణునింట నున్నట్లు చెప్పఁబడెను. ఇది వారిస్థితి తెలుపుచున్నది. ఉత్తమజాతి క్షత్రియస్త్రీలు రాక్షసునితో సంభోగింపవలసి వచ్చుట. వారి పుణ్యక్షయము చేత నేకదా. దీనివలన నుత్తమజాతిస్త్రీ లధమజాతి పురుషులతోఁ గలియరాదని సూచితము. 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి' యనికదా భగవంతుఁడు చెప్పెను.

క. తళుకు తళుక్కను బెనుఁదారలవన్నె ప్రసాదగరిమ ప్రభయును ఘనమై
చెలువారు చుండె రావణునిలయంబునఁ గూర్కు చున్న నెలఁతుకలందున్.

తా త్ప ర్య ము .

తళుకు తళుక్కను నక్షత్రముల గొప్ప రూపము వాని నైర్మల్యము వాని కాంతి ఘనమై రావణునింట నిద్రించుచున్న స్త్రీలయందుఁ గానవచ్చెను.

క. పానవ్యాయామంబుల, మీనాంకుని యుద్ధమునను మెయి స్రగ్భూషల్
పేనుకొన రాలిపడినను, మే నెఱుఁగక కూర్కె సందు మెలఁతలపిండుల్. ౨౬౯

అర్థములు. పానవ్యాయామంబులన్ = మద్యపానానంతరము జరుగు కార్యములందు, మీనాంకుని యుద్ధమునను = రతియందు, స్రక్ + భూషల్ = హారములు సొమ్ములు.

తా త్ప ర్య ము .

పానానంతరము జరిగిన రతికేళులందుఁ దమ దేహమందున్న హారములు

ఆభరణములు పెనవేసికొని నేలరాలినను దేహము తెలియక స్త్రీసమూహము నిదురించెను. హనుమంతుఁడు సంచరించు నీ కాలము రెండవజాము. కావున నీ స్త్రీలు హస్తినీజాతి స్త్రీలని సూచన.

'భజతి దినరజన్యోర్హస్తినీఁచ ద్వితీయే'యని రతిశాస్త్రము.

సీ. జాఱఁగ దిలకంబు♦నివు రొప్పు నారులు, నందియ లూడిన♦యబ్జముఖులు
ప్రక్కల రాలిన♦వరమాల్యముల చెలుల్, చీరలు సడలిన♦చేడియలును
ద్రెస్సిన మంచిము♦త్తియపుఁ బేరుల సతుల్, తునిఁగిన మొలనూళ్ళ♦తోయజాస్య
లలసట దీఱంగ♦నల్లఁ బండినగుజ్జు,పుం బిల్లలను బోలు♦పువ్వుఁబోండ్లు

తే. తళుకుఁగమ్మలు దాల్చిన♦తలిరుఁబోండ్లు, నలఁగి తెగియుండుదండల♦చెలువుమీఱి
కానఁ గరిద్రెంచి వైచినఁ♦గ్రాలు పూల, తీగలనఁబోలి కొందఱు♦తేజరిలిరి.

అర్థములు. త్రెస్సిన = తెగిపోయిన, కానక = అడవియందు, నారులు, అబ్జముఖులు, చెలులు, చేడియలు, సతులు, తోయజాస్యలు, పువ్వుఁబోండ్లు ఇవి యన్నియు స్త్రీపర్యాయ నామములు.

తాత్పర్యము.

కొందఱ స్త్రీలకుఁ జెమటవలనఁ దిలకము కరఁగిపోయెను. కొందఱకుఁ గాలి యందెలూడెను. కొందఱకు మెడలోని దండలు ప్రక్కల రాలియుండెను. కొందఱకు చీరలు సడలుపడి జాఱియుండెను. కొందఱు మెడలోని ముత్యాలదండలు తెగి నేలరాలి యుండెను. కొందఱ మొలనూళ్ళు తునిఁగి యుండెను. కొందఱు అలసిన గుజ్జుపుఁ బిల్లలవలెఁ బండికొని యుండిరి. కొందఱు తళుకుఁగమ్మలు ధరించి యుండిరి. రతిశాస్త్రప్రకారము చుంబనప్రదేశములలో చెవులు చేరవు. కావునఁ జెవుల కే హానియులేదు. అవి రతియం దుపయోగపడునవి కావు. కావున కమ్మలు హానిలేక 'యథాప్రకారమున్నట్లు చెప్పఁబడెను. ఈ సందర్భమున నీ శ్లోకము స్మరింపనగును. "కమలే కమలం తదుపరి కమలం తస్మిన్ కమలం విమలం భాతి, అమునా యమునా కరధృత వదనా చుంబన సమయే శ్రుతిరివ భాతి" కొందఱు దండలు తెగి యుండుటచే నడవియందు నేనుఁగు త్రెంచివేయఁగా నొప్పు పూలతీఁగవలె నుండిరి.

క. ముద్దియలు గూర్కఁ గొందఱు, ముద్దుఁజనుంగవలఁ దఱచు♦ముత్తెపుఁబేరుల్
తద్దయు రవిశశికరముల, కుద్దిగ నయి కూర్కునంచ♦లొప్పుం జూపెన్. ౨౬౧

తాత్పర్యము.

కొందఱు స్త్రీలు నిద్రించునపుడు వారి యందమైన చనుఁదోయి యందలి హెచ్చు ముత్యాలదండలు సూర్యచంద్రకిరణముల కాంతిగలవై నిద్రించు హంసలవలె నుండెను. మిట్టలు, వర్తులవలు, శ్వేతములు నగుటచే నీ యుపమానము.

క. ఇంబుగఁ గొందఱ వైడూ,ర్యంబులు కాదంబపక్షుల ట్లొప్పు, రథాం
గంబులగతిఁ గొందఱ గ్రీవంబులఁ దనరారు చుండె బంగరుసరడుల్. ౨౭౨

అర్థములు. కాదంబపక్షులు = పొగచాయగల ముక్కు కాళ్లు తెక్కలు గల హంసలు, రథాంగంబులు = చక్రవాకములు.

తా త్ప ర్య ము .

కొందఱు స్త్రీలు ధరించిన వైడూర్యంబులు కాదంబపక్షుల వలె నుండెను. కొందఱ మెడల యందున్న బంగారు సరడులు చక్రవాకములవలె నుండెను.

వైడూర్యలక్షణము. గీ. పగలు గోఁదిఁ గానఁబడిన బిడాలంపుఁ గన్నువోలె వెలుఁగు గలిగి నూలు! తిరిగినట్టు మీఁది తెలిపారు వైడూర్య రత్నమున కతి ప్రయత్నమునను ॥

క. కొందఱు మెడలం దాల్చిన, యందపు వైడూర్య వితతు లంచలరీతిఁ
గొందఱి బంగరుసరడులు, సుందరచక్రముల రీతి సొబగున వెలసెన్. ౨23

అర్థములు. చక్రములు = చక్రవాకములు.

తా త్ప ర్య ము .

సులభము.

క. అంచలచేఁ గారండవ, చంచచ్చక్రముల చేత సైకతములచేఁ
బ్రాంచన్నదు లన జఘనో, దంచిత లయి సతులు వెలసి రా భవనమునన్. ౨౭౪

అర్థములు. అంచలచేన్ = హంసల చేతను, నారండవ = కన్నెలేళ్ల చేతను, చంచత్ + చక్రములచేతను = చలించుచున్న చక్రవాక పక్షులచేతను, సైకతముల చేతన్ = ఇసుక దిబ్బలచేత, ప్రాంచత్ + నదులనన్ = ప్రకాశించు నదు లనునట్లు, జఘనోదంచితలయి = నడుముల ముందటి భాగము గలవారై, 'జఘనం కామినీ శ్రోణి పురోభాగే కటిస్థలే' వైజయంతి. భవనమునన్ = ఇంటియందు చక్రములకు స్తనములకు, ఇసుక దిబ్బలకు, పిఱుదులకు నుపమానోప మేయములు.

తా త్ప ర్య ము .

హంసలచేతను, గన్నెలేళ్ల చేతను, చక్రవాకములచేతను, ఇసుక దిబ్బలచేతను నొప్పునదులవలె జఘనములచే నొప్పు స్త్రీ లా యింట నుండిరి. ఈ యర్థమునే క్రింది పద్యమున వివరించుచున్నాఁడు.

చ. ప్రకట సువర్ణభూషణసు పద్మచయంబులఁ జారుకింకిణీ
ముకుళములన్ మనోగ్రసన మోహనశీల విలాసనక్రరు
క్ప్రకరతటంబు లై నిదురఁ గ్రాలెడు బాలలు పోల్ప నేఱు ల
ట్లకలుషరీతిఁ గ్రాలిరి విహారభరశ్రమ నష్టచిత్త లై. ౨౭౫

అర్థములు. ప్రకట సువర్ణభూషణ = స్పష్టముగాఁ దెలియుచున్న బంగారు సొమ్ములనెడి, సుపద్మచయంబులు = మంచి కమల సమూహములు, చారు కింకిణీ

ముకుళములు = అందములైన చిఱుగజ్జెలనెడి మొగ్గలు; మనోగ్రసన = మనస్సును హరించునట్టియు, మోహనశీల = మోహింపఁజేయు స్వభావము గలట్టియు; విలాస=శృంగార చేష్టలనెడి, నక్ర = మొసళ్ళను, మొసళ్ళు జంతువుల వశపఱుచు కొనునట్టు లీ శృంగారచేష్టలే పురుషుల వశపఱుచు కొనునవి కావున నవి మొసళ్ళ వంటివి. ఈ చేష్టలే భావములు. సుందరులే దశయందున్నను ఏ చేష్టలు చేసినను జేయకున్నను నది యొక్క విలాసముగనే పురుషులకుఁ దోఁచును. మధురవాణి లేడ్చినను శ్రవ్యముగా నున్నట్లు సుందరుల యే వికారములైనను విలాసముగానే తోఁచును. రుక్ప్రకర తటంబులై = కాంతి సమూహము లొడ్డులై; స్త్రీలు నిదురించుచున్నను వాసనావశమున నిట్టివి కలుగును. విహారభరశ్రమ నష్ట చిత్తలై = క్రీడాతిశయముచేఁ గల్గిన శ్రమముచే స్వాధీనము తప్పిన మనస్సు గలవారై.

తాత్పర్యము.

బంగారు సొమ్ములనెడి వికసించినకమలములు, నొడ్డాణము లందలి చిఱుగజ్జెలనెడి మొగ్గలు, మనస్సును మ్రింగునట్టి మోహింపఁజేయు స్వభావముగల శృంగార చేష్టలనెడి మొసళ్ళను, కాంతులనెడి యొడ్డులు గలిగి నిద్రించుచు బాలికలు క్రీడాతిశయముచే నలసి పరవశలై యేఱులవలె నుండిరి.

బాలలు - 'బాలా స్యాత్ షోడశాబ్దాత్తదుపరి తరుణీ వింశతే ర్యావదూర్ధ్వం ప్రౌఢాస్యా త్పంచపంచాశదవధి పరతో వృద్ధతా మేతి నారీ.' పదునాఱు సంవత్సరములకుఁ బైపడినది బాల యనియు నిరువది యేండ్లకుఁ బైపడినది తరుణి యనియు, ఆపై నేఁబదియైదు వఱకుఁ బ్రౌఢయనియు ఆపై వయస్సుది వృద్ధయనియుఁ జెప్పబడును. ముప్పది యేండ్లవఱకుఁ దరుణియని యొకపాఠము గలదు. ఇట్లు చెప్పుటచేఁ బదునాఱు సంవత్సరములకుఁ దక్కువ వయస్సుది రతికి యోగ్యురాలు కాదని శాస్త్రాభిప్రాయము. ప్రథమ రజస్వల యెప్పుడైనను బదునాఱవ సంవత్సరము వచ్చువఱకు గర్భాదానము చేయరాదు.

చ. గురుకుచ చూచుకంబులను♦గోమలహృద్యతరాంగ పాళులన్
సరసమణీమయాభరణ♦సంఘము లెంతయు నొప్పు మీఱెన
త్తరుణులు నిద్ర వోవు నెడ♦దర్పకదర్ప వినష్టచిత్తులై
పురుషులు మీఁద సోలిపడు♦పొల్పు వహించి మనోహరంబుగన్. ౨౬

అర్థములు. గురు = గొప్పవగు, కుచ చూచుకంబులన్ = చన్నులందు, వాని ముక్కులందును, కోమల = సుకుమారమైన, హృద్యతర = మిగుల మనోజ్ఞమైన, అంగపాళులన్ = అవయవ ప్రదేశములందును, సరస = శృంగారముతోఁ గూడిన, మణీమయాభరణ సంఘములు=రత్నములతోనిండిన సొమ్ములగుంపులు, ఎంతయున్= మిక్కిలి, దర్పక దర్పవినష్టచిత్తులై = మన్మథుని ప్రతాపముచే నశించిన మనస్సు గలవారై.

తాత్పర్యము.

గొప్పవగు స్తనములందును, చనుముక్కులందును, సుకుమారులై మిగుల మనోహరములైన యవయవములందును ధరింపఁబడిన యందములైన రత్నాభరణముల సమూహములు ఆ స్త్రీలు నిద్రపోవునపుడు వారిని జూచిన మగవారు మదన వికారముచేఁ బరవశులై వారిమీఁదఁ బడునంతటి యొప్పుగలవై యుండెను.

ఈ కారణముచేతనే స్త్రీలు నిదురించునపుడు పురుషులు చూడరాదను నియమ మేర్పడెను.. స్త్రీలును వెల్లకిలఁ బరుండరాదు.

క. అయ్యెడ నిదురించెడు న,త్తొయ్యలులముఖములనుండి ♦ తొలఁకెడి యూర్పుల్
పయ్యెదచెంగులచేఁ దా, మొయ్యన వీచోపు లిడెడు ♦ యోషాస్యములన్. ౨౭౭

అర్థములు. తొయ్యలుల = స్త్రీలయొక్క, ఒయ్యన = మెల్లగా, వీచోపులు = వింజామరలు, యోషాస్యములన్ = స్త్రీల ముఖములందు.

తాత్పర్యము.

ఆ సమయమున నిదురించు స్త్రీల ముఖములనుండి వెలువడు నూర్పుగాలులచేఁ గదలుచున్న పైఁటకొంగులు ఆ స్త్రీల ముఖములపై వింజామరలు వేయుచున్నట్టు లుండెను.

వీరి కెవ్వరికి రైకలు లేవనుట స్పష్టము.

క. నానావర్ణసువర్ణస, తీనవ్యముఖాబ్జములను ♦ దీవ్యచ్ఛుభపై
టానివహము మదనపతా,కానికరము నట్లు వెలిఁగెఁ ♦ గమనీయంబై. ౨౭౮

అర్థములు. నానావర్ణ సువర్ణ = పలుతెగలగు మంచి కాంతులు గల, సతీ= స్త్రీలయొక్క, నవ్యముఖాబ్జములను = అందమైన ముఖకమలములను, దీవ్యత్ = ప్రకాశించు, శుభపైటానివహము = అందమైన పైఁటల సమూహములు. మదనపతాకానికరము నట్లు = మన్మథుని ధ్వజముల గుంపువలె.

తాత్పర్యము.

పలుతెగలగు మంచి కాంతులుగల స్త్రీల యందమైన ముఖకమలములందుఁ బ్రకాశించుచున్న పైఁటలు మదనుని ధ్వజములవలె నందములై యుండెను.

పై పద్యమునందలి యీ పద్యమునందలి వర్ణనమును బట్టి యీ స్త్రీలు ముఖములపై పైఁటలు కప్పుకొని నిదురించు చుండిరని యేర్పడుచున్నది. అటు గాకున్న ఆ కొమ్మల మీఁది పైట యూర్పుగాలికిఁ గదలుటగాని ముఖములకు వీచోపు లిడుటగాని తటస్థింపదు.

క. ఇందుముఖీ ముఖనిర్గత, మంద సుగంధవహసర్గ ♦ మండిత మగుచున్
మందంబుగఁ గదలెను గురు,విందమణీరుచిరము లగు♦ వెలఁగల కమ్మల్. ౨౭౯

అర్థములు. ఇందుముఖీ = చంద్రునివంటి ముఖముగల యా స్త్రీలయొక్క, ముఖ=ముఖములనుండి, నిర్గత=బయలువెడలిన, మంద = మెల్లనైన, సుగంధవహ=

మంచిగాలియొక్క, సర్గ = కూడికచే, మండితము = అలంకరింపఁబడినది, మంద ముగ = కొంచెముగ, కురువిందమణీరుచిరములు = కెంపులచే నందములు,

తా త్ప ర్య ము .

ఆ స్త్రీల ముఖమునుండి వెడలుచున్న కమ్మని వాయువుచే నలంకరింపఁబడినవై వెలగల కెంపులు కొంచెముగఁ గదలెను.

కురువిందము పద్మరాగములందు భేదము.

సీ. ఉదయార్కబింబ సముజ్జ్వల ప్రభగల్గి, కర మెప్పు పద్మరాగంబు పొదలు
అసమాన దాడిమీ కుసుమ మంజరిచాయ, గలిగి శోభిల్లు సౌగంధికంబు
సలలిత మత్తకోకిల లోచనద్యుతి, నలరారుఁ గురువింద మనెడి కెంపు
మండిత శశమాంస ఖండంబు గతి నున్న, మంద తేజంబగు మాంసగంధి
గీ. నలుపు నెఱ్ఱదనము మిళితమై నెగడెడు, వాలు గలిగినదియు నీలగంధి
లాలు లేక కోమలం బను సంజ్ఞలు, గ్రాలు కెంపు చాల రంగులేక.
క. ధరఁ బద్మరాగ మెందును, దొరకదు కలియుగమునందుఁ ♦ దోచిన వ్రేఁగై
నిరుపమ రుచి నిర్మలమగుఁ, గురువిందపుఁ గెంపు గలదు ♦ గోరి భజింపన్.
(రత్నపరీక్ష.)

క: చక్కెరకల్వాలపులు వెలిఁగ్రక్కెడు నచ్చిగురుబోండ్ల ♦ కమ్మనియూర్పుల్
మిక్కిలి రావణుమీఁదను, జక్కఁగ విహరించెఁ గైపు♦సంపద లొలయన్. ౨౮౦

అర్థములు. చక్కెరకల్వాలపులు = చక్కెరతో జేసిన కల్లువాసనలు, చక్కెర యొక్కయు, కల్లుయొక్కయు సువాసనలు, చిగురుబోండ్ల = స్త్రీలయొక్క, కైపు సంపద = మదాతిశయము.

తా త్ప ర్య ము .

చక్కెర కల్లువాసనలు గొట్టుచున్న యా స్త్రీల కమ్మని శ్వాసములు మదాతి శయముచే రావణుమీఁద వ్యాపించెను. దీనివలన హనుమంతుఁడు రావణు సమీ పించు చున్నాఁడని సూచన.

సీ. రావణాననము లన్ ♦ భ్రాంతిని సవతుల, ముఖముల ముద్దిడు ♦ ముద్దరాండ్ర
నధిపుఁడే ముద్దిడె ♦ న భ్రమ మత్తున, సవతాండ్రఁ జుంబించు ధవసురతలఁ
బడుకలు పైఁటలు ♦ కడియాలచేతులు, దిండ్లుగా నిదురించు ♦ తీఁగఁబోండ్లఁ
దమయురంబుల నుంచి♦తలలు నిద్రించుచుచె,ల్వాల బొమ్మలను జేయి♦వైచు సతుల
తే. నొఱపు మెఱయంగ నొక్కర్తు ♦ కురువుమీఁద
శిరము ఘటియించ కూర్కెడి ♦ చెలువబొమ్మ
నందుఁ గేల్వైచి నిదురించు ♦ నిందుముఖుల
నందుఁ గనుఁగొనె నంజనా♦నందనుండు. ౨౮౧

తా త్ప ర్య ము .

కన్నులు మూసికొని నిదురించుచుండుటచే రావణుని ముఖము లను భ్రాంతిచే సవతుల ముఖములను కొందఱు ముద్దుపెట్టుకొనుచుండిరి. వారిట్లు ముద్దుపెట్టుటచేఁ తమ మగఁడే ముద్దిడెనని తలఁచి మత్తువలనఁ గలిగిన భ్రమచే నది మఱియొక సవతిని ముద్దుపెట్టెను. నిద్దురమబ్బు విశేషించి పీడించుటచే పఱుపులు పఱుచుకొనుట కవకాశములేక వానినే తలక్రింద దిండుగాఁ బెట్టుకొని కొందఱు - పైఁటలు పఱచుకొని కొందఱు- కడియాలచేతులు తలక్రిందఁబెట్టుకొని కొందఱు నిదురించుచుండిరి. తమ రొమ్ములమీఁదఁ దలయుంచి కొందఱు స్త్రీలు నిదురింపఁగా వారి రొమ్ములపైఁ జేతులువైచి కొందఱు నిద్రించిరి. ఒకదాని తొడమీఁద మఱియొకతె తలయుంచి నిద్రింపఁగా దాని రొమ్ముమీఁద నది చేయివైచి నిద్రించెను. ఇట్టి స్త్రీలనెల్ల హనుమంతుఁడు చూచెను.

ఉ. సారెకుఁ ద్రావి మేను లవశంబుగ నొండొరుమీఁదఁ బార్శ్వపృ
ష్ఠోరుకటీ ప్రదేశముల నుంచి సుమాంబకరాగమగ్న లౌ
వారును సూత్రబద్ధమదబంభరశోభితమాలికారుచిఁ
వారక యొక్కొకర్తుకను బాహులఁ గట్టి పెనంగు కేశినుల్. ౫౮-౫౯

అర్థములు. పార్శ్వ = ప్రక్కలు, పృష్ఠ = వీఁపులు, ఊరు = తొడలు, కటి = నడుము, సుమాంబకరాగ = మన్మథకామమునందు, మగ్నలు = మునిఁగినవారు, సూత్రబద్ధ = దారముచేఁ గట్టఁబడినదియు, మద = మదించిన, బంభర = తుమ్మెదలచే, శోభిత = ప్రకాశించునదియు, మాలికారుచిఁ = పూలసరముయొక్క కాంతితో, ఒక్కొకర్తుకను = ఒకతె మఱియొక్క దానిని, కేశినుల్ = నల్లనియందమైన తలవెండ్రుకలు గల స్త్రీలను.

తా త్ప ర్య ము .

పలుమాఱు ద్రావి దేహములు తమ స్వాధీనము తప్పిపోఁగా నొకతెమీఁద నింకొకతె ప్రక్కలు వీఁపు తొడలు నడుము లుంచి మన్మథకామమున మునిఁగిన వారిని, నారచేఁ గట్టఁబడి తుమ్మెదలచేఁ బ్రకాశించు పూలదండలవలెఁ జేతులు చేతులు కలిసియున్నట్లు పెనవేసికొనిన కబరీవతులను హనుమంతుఁడు చూచెను. చేతులు పెనవేయుట సూత్రముచేఁ గట్టఁబడుట, కొప్పులు తుమ్మెదలు, మాలికలు స్త్రీలు.

చ. సలలితమందమారుతవశంబునఁ గూడి పెనంగుతీఁగలఁ
గలసిన స్కంధసంతతుల నవ్యసుమౌఘముులఁ మిళిందపం
క్తులఁ జెలువారి చైత్రమునఁ దోరపుఁగాంతిని మీఱు సద్వనీ
విలసనము న్వహించె సురవీరవిరోధివధూవనం బటఁ. ౬౦-౬౧

అర్థములు. సలలిత మందమారుతవశంబున = ఇంపైన మెల్లని గాలి

కారణముగా, స్కంధసంతతులన్ = చెట్లబోదెల, సుమ+ఓఘములన్ = పూల సమూహములను, మిళింద = తుమ్మెదల, సద్వనీవిలసనమున్ = మంచి యుద్యానవము యొక్క చక్కఁదనమును, సురవీర విరోధి = రావణునియొక్క, వధూవనము = స్త్రీ వనము.

తాత్పర్యము.

రావణుని స్త్రీలను వనము మనోహరమైన మెల్లని గాలిచే నొకదానితో నొకటి పెనవేసికొనిన తీఁగలతోఁ గలసిన బోదెలను పూలసమూహములను దుమ్మెద గుంపులను గల చైత్రమాసమున వికాసముతోఁ గూడిన వనమువలె నుండెను.

ఇచ్చట మన్మథోద్రేకము మందమారుతము తీఁగలు, చేతులు, స్కంధములు బొమ్ములు నడుములు గల దేహభాగములు సుమములు వారు ధరించిన పూవులు, తుమ్మెదలు తల వెంట్రుకలుగా నుపమానోపమేయంబుల గ్రహించునది.

ఆ. మెలఁతలచట నత్తమిల్లిన లీలలు, చూడ నవయవములు సొబగు మీఱు
వస్త్రమాల్యములును వారి వారి వటంచు, వేఱువఱుపరాక బెరసి యుండె.

అర్థములు. అత్తమిల్లిన = పరుండిన, లీలలు = విధములు, బెరసి = కలసి.

తాత్పర్యము.

స్త్రీలచ్చటఁ బండుకొనిన విధము చూడఁగా కాళ్ళు చేతులు వస్త్రములు మాల్యములు ఇది దీనిది అవి దానివి యని వేఱు వేఱుగఁ జెప్పరానట్లు కలిసి. యుండెను.

క. ఆ మందిరమణిదీపము, లాముదితలరూపు ఱెప్పలార్పక జగతీ
స్తోమభయదుండు గూర్కఁగఁ. గామము చనఁ జూచు మాడ్కి గ్రాలెన చలతన్.

అర్థములు. ఆ మందిర = ఆయింటియందలి, జగతీస్తోమభయదుండు = లోకములకన్నిఁటికి భయము కలిగించువాఁడు, కామముచనన్ = కోరికదీరునట్లు, ఉత్ప్రేక్షాలంకారము.

తాత్పర్యము.

ఆయింట మణిదీపములు చలింపక యేకాగ్రముగ వెలుఁగుచుండు విధము చూడ లోకభయంకరుఁడైన రావణుఁడు నిండ్రించుచున్న కారణముచే భయముదీఱి కోరికదీర నవి వాని స్త్రీలను జూచుచున్న వా యేమి యన్నట్లులుండెను.

ఇట్లు చెప్పుటచే రావణుఁడు మేలుకొనియున్నప్పుడా స్త్రీలను దీపములుకూడ నిర్భయముగాఁ జూడఁజాలవని భావము.

ఉ. కాముని బారి కోహటిలి కైవసమైన సృపర్షిదైత్యక
న్యామణులున్ సురాంగనలు నాహవకాంక్షను దెచ్చినట్టి కాం
తామణులున్ స్మరాశుగహతప్రమదల్ సురవైరి చుట్టు ని
ద్రామదపారవశ్యమున రంజిలు చుండిరి తల్పలంబునన్. ౭౬

అర్థములు. ఈ స్త్రీ లందఱు రాక్షసస్త్రీలు, రావణాసురుఁడు యథావిధి వివాహ మాడినవారా యనినఁ గాదను చున్నాఁడు. కామునిబారికి = మన్మథుని దాడికి, ఓహటిలి = భయపడి, కైవసము = స్వాధీనము, నృప = రాజులయొక్కయు, ఋషి = ఋషులయొక్కయు, నృపర్షి = రాజర్షులయొక్కయు, దైత్య = దైత్యుల యొక్కయు, కన్యామణులన్ = కన్యకలు, సురాంగనలు = దేవతాస్త్రీలు, ఆహవ కాంక్షను = యుద్ధమందలి కోరికచే, అనఁగా గొందఱు యుద్ధమునకు రాక ముఖము తప్పించుటచే వారిని యుద్ధమున కీడ్చుటకై వారి స్త్రీల నపహరించి తెచ్చెనని భావము. స్మరాశుగహత ప్రమదల్ = మదన బాణములచేఁ గొట్టఁబడిన స్త్రీలు, నిద్రామదపారవశ్యమున = నిద్రమబ్బుచే దేహములు తెలియని వారై.

తా త్ప ర్య ము .

ఆప్రదేశమందు మన్మథతాపము సహింపలేక స్వాధీన పడిన రాజుల ఋషుల దైత్యుల కన్యకలును దేవతాస్త్రీలును యుద్ధమునందలి కోరికచేఁ దెచ్చిన స్త్రీలును కామముగలస్త్రీలును నిద్రమబ్బుచే దేహము తెలియక రావణాసురుని చుట్టుపడియుండిరి.

ఇట్లు చెప్పుటచే నీ గుంపులోఁ గొందఱు స్త్రీలు తమంతటఁ దామే రావణు వరించి వచ్చిరి. కొందఱు బలాత్కారముగఁ దేఁబడి మరల వారు తమ బంధువుల గలిసికొను ప్రాప్తిలేమిచే వ్రతము చెడినను సుఖము దక్కవలెఁ గులము చెడినను గూడు పుట్టవలె నన్న సామెత చొప్పున పస్తులఁ జావలేక వాని బాధపడలేక కామము వ్యర్థము చేయనొల్లక వానికి వశపడిరని యేర్పడుచున్నది. కాని మందోదరివలె ధర్మపద్ధతిని వివాహ మాడినవారు కారని భావము.

చ. ప్రమదలలో సురారి ప్రస♦భంబున దెచ్చిన నన్యకామ ము
న్నమగనిఁ బొందినట్టి చెలి ♦ యక్కడ లే దొకసీత దక్కఁగా
నమరవిరోధిఁ గాంచి తమ ♦ యంతన తాము తదీయ శౌర్యమున్
రమయు గుణంబు మెచ్చి తమి ♦ రాములు వచ్చిరి వానిఁ గూడఁగన్.    ౭౨

అర్థములు. ప్రమదలలో = స్త్రీలలో, ప్రసభంబునన్ = బలాత్కారముగ, అన్యకామ = ఇతరపురుషులందుఁ గామముగలది.

తా త్ప ర్య ము .

ఆ స్త్రీలలో బలాత్కారముగఁ దేఁబడినది, ఇతర పురుషునందు మోహము గలది, పూర్వము మగనితోఁ గలిసినది సీతదక్క వేఱొక్కతెయు లేదు. అచ్చట నున్నవా రందఱు రావణుఁజూచి వాని శౌర్యము సంపద గుణము మెచ్చి వానిని గూడ వారంతటవారే వచ్చిరి.

ఇట్లు చెప్పుటచే నా గుంపులో నిట్టివారు లేరని యర్థమె కాని రావణుఁ డెవ్వ తెను బలాత్కరించి తేలేదని యర్థముగాదు. ఏలన :—

౧. రావణాసురుఁడు పరస్త్రీలను గాముకుఁడై బాధించె ననుటకు వేదవతీ చరిత్రము ప్రమాణము.

౨. దశరథుని యజ్ఞకాలమున దేవతల శరణాగతియందు రావణుఁడు దేవతాస్త్రీల హింసించెనని చెప్పుట ప్రమాణము.

౩. రావణుఁడు రంభాది స్త్రీలను జెఱుచుట నలకూబర బ్రహ్మలచే శాప గ్రస్తుఁడగుట బ్రమాణము.

౪. మందోదరీ విలాపంబున

'దేవతాసుర నృ కన్యానా మాహర్తారం తతి స్తతః.

దేవతల, అసురుల, మనుష్యుల కన్యల హరించినవాఁడని యుండుట ప్రమాణము.

౫. అన్నను విడిచి వచ్చితివని యింద్రజిత్తు విభీషణు నాక్షేపించినపుఁడు :-

పరధనములఁ బరదారల హరియించుట,

పరవిత్తమపహరించుట - పరదారలఁ గోరుచుంట.

యివి రావణు దోషములని యతఁడు ప్రత్యుత్తరమిచ్చెను.

హింసా పరస్వహరణే పరదారాభిమర్శనం

పరస్వానాంచ హరణం పరదారాభిమర్శనం

ఏతే దోషా మమభ్రాతు ర్జీవితైశ్వర్యనాశనాః.

యుద్ధ. ౮౭ సర్గము.

౬. ఉత్తరకాండమున ౪౯౩ మొదలు పద్యములఁ జూచునది.

చ. వనుచును రావణుండు బల♦సంపద పొంపిరివోవుచుండఁ గ్రొ
వ్వునఁ దనమార్గమందు నృప♦పుష్కరనేత్రల మాని కన్యలన్
దనుజ కులాంగనామణుల ♦ దైవతకాంతల వీరు వారటం
చన కగపడ్డ సుందరుల ♦ యావతముం గులకన్యకాతతిన్. ౪౯౩

చ. బలిమిని ముట్టి యడ్డపడు ♦ బంధువులం బడఁగొట్టి కేలుఁ గొ
ప్పులు బిగఁబట్టి యచ్చెలులు ♦ బ్రుయ్యఁగఁ దిట్టఁగ మొత్తుకోఁగ నీ
డ్గిలఁబడ నీడ్చికొం చరిగి ♦ పెక్కువ పెక్కువఁ బుష్పకంబునన్. ౪౯౪

క. ఈ నెఱిఁ బన్నగకన్యల, మానవభామలను నసుర♦మానినులన్ ర
క్షోనారుల యక్షసతుల, దానవ యోషల విమాన♦తనముం జేర్చెన్. ౪౯౫

౭. అరణ్యకాండమున ౩౨ వ సర్గమందు.

"పురీం భోగవతీం ప్రాప్య పరాజిత్యచ వాసుకిం । తక్షకస్య ప్రియాం భార్యాం పరాజిత్య జహార యః" యని చెప్పఁబడెను.

౮. రావణుఁడు సీతాదేవితో,

'పరదారగమనకేళియుఁ బరదారాపహరణంబు పద్మదళాక్షీ పరఁగుఁ గుల ధర్మమయి' యని చెప్పెను. (సుందర ౯౫ వ ప.)

అచ్చటచ్చట నాఁచికొనుచుఁ దెచ్చిన నా యెల్ల తెఱవలలో నగ్రమహిషివి గమ్ము. (సుందర. ౯౨౭)

'బహ్వీనా ముత్తమ స్త్రీణా మాహృతానా మిత స్తతః సర్వాసా మేవ భద్రం తే మమాగ్రమహిషీ భవ. (సుందర. ౨౦ వ స. ౧౬ శ్లో.

౯. రావణుని శూర్పణఖ చూచినపుడు వాని గుణవర్ణనమందు 'పరదారాభిమర్శన'మ్మని చెప్పఁబడెను.

౧౦. పంక్తికంఠుఁడు బలిమిని బట్టినట్టి నాగకన్యలలోన జానకియ లేదు. (సుందర. ౩౯౭ వ. ప.)

ఇత్యాద్యనేక ప్రమాణములచే రావణుఁడు పరస్త్రీల నంటని సదాచార సంపన్నుండని తలఁపరాదు. కావున నిచ్చటి మాటకేమి యర్థమనిన నాపడుకటింటిలో వాని నొల్లని స్త్రీలు లేరనియే కాని యట్టివారు వేఱు స్థలమునందు లేరని యర్థము కాదు. ఈస్త్రీలలోనే వానియందుఁ బ్రేమలేనివారు లేకపోలేదు. చూ. సుం. ౯౭౬.

రావణుఁడు సీతాదేవిని బెదరించినపు డామె దుఃఖింపఁగా నీ స్త్రీలలోఁ గొందఱు సీతాదేవికి ధైర్యము వచ్చునట్లు కన్నులచే ముఖములచేఁ బెదవులచేఁ దల యాడించుటచే లోపడవలదని సైఁగలుచేసిరి. వానియందు నిజమైన కామము గలవారట్లు చేయుదురా? వేఱు రక్షకులులేక గతిలేక వీనికిఁ జిక్కితిమి, అనుభవింత మని వారు వాని కనుకూలలుగా నుండిరి కాని వాస్తవపు మక్కువచేఁగాదు. అట్లు లోపడనివారిని వాఁడనేక హింసలఁ బెట్టెను.

ఉ. లేదు కురూప యందు నకు♦లీనయు లే దుపచారసత్క్రియా
మోదితచిత్త గాని యొక♦ముగ్ధ యదక్షిణ లేదు చూడఁగా
లేదు విహీనసత్త్వయును♦లీలల భర్త కకామనీయయుఁ
లే దల రావణాసురుని♦ప్రేమలయం దొకభార్య యేనియుఁ.     ౨౦౮

అర్థములు. అకులీన = మంచి వంశమందుఁ బుట్టనిది, ఉపచార సత్క్రియా మోదితచిత్త=ఉపచారముచే సంతోషింపని మనస్సుగలది, అదక్షిణ = సామర్థ్యము లేనిది, విహీనసత్త్వ = బలము లేనిది, అకామనీయ = కామింపరానిది.

## తా త్ప ర్య ము.

ఆ రావణు భార్యలందు నొకతెయైన కురూపగాని యుత్తమ వంశమందుఁ బుట్టనిదికాని యుపచారములచే సంతోషింపని ముగ్ధగాని భర్తను వశపఱుచుకోలేని మధ్యగాని బలము లేనిది ప్రౌఢగానిది గాని శృంగార చేష్టలచే భర్తకుఁ గామింపదగ నిదిగాని లేదు.

లీల=అధిపుని యలఘు గుణానుకృతి లీల యనఁబడును. ఇచ్చట లీల లనునది శృంగారచేష్టల కన్నిఁటికి నుపలక్షణము, అవి యేవన :—

కం॥ ఇల భావ హావ హేలా, విలాస మాధుర్య ధైర్య విభ్రమలలా,
కిలికించిత మోట్టాయిత, లలితాదులు చేష్టలగుఁ దలంపఁగ మఱియున్.

గీ. వెలయు బిబ్బోక విచ్ఛిత్తి విహృతి చకిత, హాసిత కుట్టమిత కుతూహలాదు లనఁగఁ
గలవుమరియందు భావంబు వెలయుచుండుమహిరసజ్ఞానయోగ్యతామాత్రమగుచు.
నర. భూ.

క. ఈ రావణు భార్యలవలె, శ్రీరాముని ధర్మపత్ని చేరినచో దే
వారాతి సుకృతి యనెడు వి,చారం బుదయించె హరికి సద్బుద్ధి కతన్. ౭౩

తా త్ప ర్య ము .

(౧) ఈ రావణున్ వాని భార్యలవలె శ్రీరాముని నాయన ధర్మపత్ని సీతాదేవి చేరినచో రావణుఁ దర్పించుటచేఁ గలిసికొనెనేని, ఈ దేవారాతి = రావణుఁడు, సుకృతి = మంచికార్యము చేసినవాఁ డగును, హనుమంతుఁడు సద్బుద్ధి = మంచి బుద్ధిగలవాఁడగుటచే నిట్టి యాలోచన దోఁచెను. రావణుఁడు సీతను రామున కిచ్చి యామెను పటిచెనేని తాను బుణ్యవంతుఁ డగునని హనుమకుఁ దోఁచెనని భావము.

(౨) చేరినచో = రామచంద్రుని వివాహము కాకముందే వీని యొద్ద జేరి యుండినచో ననఁగా వివాహమాడి యుండినచో నని యర్థము. అనఁగా సీతాదేవి యీస్త్రీలవలె శ్రీరామచంద్రుని దాను వరింపకముందే యీరావణుని వరించి యుండెనేని పుణ్యాత్ముఁడై యుండునుగదా యని సుబుద్ధియైన హనుమకుఁ దోఁచెను. ఇచ్చట సుబుద్ధియను ప్రయోగముచే నిది కపిత్వమువలనఁ గలిగిన చపలతయే గాని స్వభావ సిద్ధము గాదని భావము. ఇట్టి దుర్బుద్ధి పుట్టినందునకు హనుమ పశ్చాత్తాప పడుచున్నాఁడు.

వ్యసనపడి ఇత్యాదిగాఁ బైపద్యమున కవతారిక, అవనిజ, అసదృశగుణ విశిష్ట = సాటిలేని పాతివ్రత్యముచే నందఱ మించినది (అని తలఁచి) అతఁడు వ్యసనపడి = ముందు కలిగిన దురాలోచనకుఁ బశ్చాత్తాప పడి, మఱియున్ అయ్యో! అసమాత్ముఁడు=విషమబుద్ధిగల రావణాసురుఁడు, ఆమె యెడ, అసత్కార్యంబున్ = దుష్కార్యమును జేసెఁ గదా యని చింతించెనని పైపద్యముతో నన్వయము.

(౩) రావణు భార్య లితరులచే నపహరింపఁబడక సదాభర్తతోఁ గూడి యెట్లు సుఖపడుచున్నారో యట్లే సీతయు సదాభర్తతోఁగూడి సుఖించు చుండినచో రావణునైశ్వర్యము చెడకుండును గదా యని, సుబుద్ధికిన్ = శత్రువులకును మేలుగోరు హనుమంతునకుఁ దోఁచెను, మఱియు నాలోచించు చున్నాఁ డని పైపద్యమున కవతారిక. అవనిజ యసదృశ గుణవిశిష్టగదా, అయ్యో, మహాకుల

జాతుఁడయ్యును విషమబుద్ధిగల రావణుఁడు ఆమెయెడ నసత్కార్య మొనరించెఁ గదా యని వ్యసనపడి చింతించుచునని యన్వయము.

సీత దృఢమనస్కురాలు గావున నామె పాతివ్రత్యమున కేలోపము గలుగదు కాని యామెకు లేనిపోని యపవాదము మాత్రము కలిగించెఁగదా యని వ్యసనపడుచు నాలోచించెనని భావము.

(౮) రావణు భార్యలవలె సీత రావణుచే నపహరింపఁబడక సదా భర్తతోఁ గూడి యుండినచో రావణుఁడు సుకృతియై యుండు నని హనుమ మొదట నాలోచించెను. నిరతిశయ సౌందర్యవంతురాలైన సీతను రాక్షసస్త్రీ సామ్య మెంచి నందునఁ దా నామెకు హీనోపమాన మిచ్చినట్లనుకొని హనుమ దుఃఖించుచున్నాఁడు. అని పై పద్యమున కవతారిక. అవనిజ అసదృశ గుణ విశిష్టగదా యని యాతఁడు పశ్చాత్తాపముచే వ్యసనపడి మఱియుఁ జింతించు చున్నాఁడు.

అయ్యో యిత్యాదిగా, అయ్యో సీతాపహరణముచే నీతని రాజ్యమంతయు నశించునుగదా యని యన్వయము.

ఇది గోవింద రాజీయము ననుసరించి వ్రాయఁబడెను.

హనుమ తుఁడు సద్బుద్ధి యయ్యు నాయన కొక దుర్బుద్ధి పుట్టెను.

ఈ రావణుని భార్యలవలె, రావణుని యీ భార్యవలె, శ్రీరాముని ధర్మపత్నియుఁ జేరి యుండినచో నీ దేవారాతి పుణ్యాత్ముఁడై యుండును గదా యను నాలోచన గలిగి.

క. వ్యసనపడి మఱియు నాతం,డసదృశసద్గుణవిశిష్ట ♦ యవనిజ యయ్యో
యసమాత్ముఁ డామె యెడ రా,క్షసరా జొనరించెఁగా య♦సత్కర్మంబుల్. ౨౯౦

తాత్పర్యము.

అట్టి యాలోచన గలిగిన దానికై అసమానమైన పాతివ్రత్యమున గొప్పదియు అవనిజ—అయోనిజ— భూమియందుఁ బుట్టినది, ఆ ప్రకారము చేయనాయని పాపాలోచనము నాకేల గలిగె నని వ్యసనపడి యట్టి పతివ్రతయందు వీఁడు తననాశముకొఱకు విషమబుద్ధి గలవాఁడై చేయరాని పని చేసెఁగదా యనుకొనెను.

—♦ ౧౦ వ సర్గము. హనుమంతుఁడు నిద్రించు రావణునిఁ జూచుట. ♦—

క. అని చింతించుచుఁ జూచుచు, జనుచుం బలుఁగులను రత్న♦సమితుల గొనబై
కనకవిదూరజదాంతా,సనములఁ జిత్రాంగములను ♦ సవురగుదానిఁ. ౨౯౧

అర్థములు. పలుఁగులను=స్ఫటికములను, కనకవిదూరజ దాంతాసనముల్ = బంగారు వైడూర్యములు ఏనుఁగు దంతములతోఁ జేయఁబడిన యాసనములను, చిత్రాంగములను = చిత్రాసనములచేతను, సవురు = అందము.

తాత్పర్యము.

అని యాలోచించుచుఁ జూచుచుఁ బోవుచు స్ఫటికములచేతను బంగారు

వైడూర్యములు,దంతములు;వీనిచేతను జేయఁబడిన యాసనములచేతను జిత్రాంగముల చేతను నందమైనదానిని, ఇదియు ముందుపద్యము రావణుని శయ్యావర్ణనము.

సీ. పఱపుపైన పఱపులఁ ♦ బట్టుదిండ్లును గల్గి,మహితమై దేదీప్య♦మాన మగుచు
నొక్కచో నవ్యమా♦లోదారహరిణాంక,సన్నిభ♦పాండరచ్ఛత్ర మమర
జాతరూపఖచిత♦సారసాప్తప్రభాఽ,శోకమాలాపంక్తి♦సుందర మయి
వీవనల్ విసరెడి♦వెలఁదిబొమ్మల నొప్పి, వరధూప పంక్తులఁ ♦ బరిఢవిల్లి
తే. మేఁకపిల్లల చర్మముల్ ♦ మేల్మిఁ బఱచి, పూలదండల నెల్లెడఁ ♦ బొనరుపఱచి
కనఁగ సురనాథశయ్యాని♦కాశమైన, యసురపతిమంచము గనె ♦ హనుమ యచట.

అర్థములు. పఱపు = వెడలుపు, నవ్యమాలోదార = విశేషముగఁ గ్రొత్త మాలికలచే నలంకరింపఁబడి, హరిణాంక సన్నిభ = చంద్రునితో సమానమైనదై, పాండరచ్ఛత్రము = తెల్లగొడుగు, జాతరూపఖచిత = బంగారుచేఁ జెక్కఁబడిన, సారసాప్తప్రభా = సూర్యకాంతిగల, అశోకమాలాపంక్తి = అశోక పుష్పముల మాలికలచే నందమై, వెలఁదిబొమ్మలు = ఆఁడుబొమ్మలు, యంత్రము బలమున బొమ్మలు వీవనలు విసరుచున్నవని భావము. శిల్పచమత్కారము శ్లాఘింపఁదగినది కదా. ఇవి బొమ్మలేకాని రాక్షసస్త్రీలుగారు. స్త్రీలేయైయుండిన హనుమ సమీపించు టకుఁ జూచుటకు సాధ్యమైయుండదు. వరధూప పంక్తులన్ = శ్రేష్ఠమైన ధూపము లచే నొప్పి.

## తాత్పర్యము.

వెడలుపాటి పఱుపులు పట్టుదిండ్లు గలిగి గొప్పదై ప్రకాశించునదై యొక చోట పూలమాలలచే నలంకరింపఁబడిన చంద్రబింబమువలెఁ దెల్లనైన శ్వేతచ్ఛత్ర మొప్పుచుండఁగా బంగారుతోఁ జెక్కఁబడి సూర్యకాంతిగల యశోకపుష్పముల పంక్తులచే నందమై విసనకఱ్ఱలు విసరుచున్న యాఁడుబొమ్మలు గలిగి అగరు మహి సాక్షి ధూపములచే నొప్పి మేఁకపిల్లల చర్మములు మీఁదఁ బఱచి చుట్టు పూల దండలు గట్టి చూచుటకు నింద్రుని పానుపుతో సరిపోలుచున్న రావణుని మంచ మును హనుమంతుఁడు కనుగొనెను.

సీ. ఆ మహనీయశ♦య్యాతలంబునయందుఁ, గారుమేఘము నవ్వు♦కాంతివాఁడు
క్రొత్తతళుకులఁ దేఱు ♦ కుండలంబులవాఁడు, కావిపాఱిన పెద్ద♦కనులవాఁడు
సంజకెంజాయ స♦శంపాంబుదమురీతిఁ, బొరి నెఱ్ఱగందంపుఁ♦బూఁతవాఁడు
దివ్యపరిష్కార♦దేదీప్యమానుండు, రూపసియును గామ♦రూపధరుఁడు
తే. అసురకన్యలకును బ్రియుం ♦ డైనయాతఁ
డాడి మాపట మిక్కిలి ♦ యలయువాఁడు
మేలిసొమ్ముల మెఱసెడి ♦ మేనివాఁడు
రావణుఁడు నిదురింప మ♦ర్కటుఁడు గనియె.

అర్థములు. సశంపాంబుదము = మెఱుపులతోఁ గూడిన మేఘము, పరిష్కార = ఆభరణములచే, రూపసి = అందగాఁడు, ఆడి = క్రీడించి, మాపటన్ = రాత్రివేళ.

తాత్పర్యము.

ఆ పెద్ద పానుపు మీఁది వర్షాకాల మేఘము వలె నల్లని దేహకాంతి గలవాఁడును క్రొత్తకాంతులచేఁ దేటయగు కుండలములు గలవాఁడును, ఎఱ్ఱనైన పెద్ద కన్నుల వాఁడును, సంధ్యాకాలపు రాగము మెఱుపుతోడి మేఘమువలె విస్తారముగ నెఱ్ఱ గంధమును బూసికొన్నవాఁడును, దివ్యాభరణములచేఁ బ్రకాశించువాఁడును, సుందరుఁడును, కోరిన రూపము ధరించువాఁడును అసుర స్త్రీలకును బ్రియుఁడైనవాఁడును, రాత్రివేళ యాడి యలసిన వాఁడును, శ్రేష్ఠములైన సొమ్ములచే మెఱయుచున్న దేహముగలవాఁడును నగు రావణుఁడు నిదురింపఁగా హనుమంతుఁడు చూచెను.

తే. రజతచేలంబువాని దీర్ఘంబులైన, బాహువులవాని భూరుహావనకుడుంగ
సహితమందర మనఁగను జాలువాని, నెల్ల రాక్షసులకు సుఖ మిడెడువాని.

అర్థములు, రజతచేలంబువానిన్ = వెండిసరిగ వస్త్రము ధరించినవానిని, భూరుహావన = చెట్లతో నిండిన వనములతోను, కుడుంగ=పొదలతోను, సహిత = కూడిన, మందర మనఁగను = మందరపర్వత మనునట్లు.

తాత్పర్యము.

వెండిసరిగ గల వస్త్రమువాని నిడుపాటి చేతులవాని చెట్లు దట్టముగాఁగల వనముతోను పొదలతోను గూడిన మందరము వంటి వాని రాక్షసుల కందఱకు సుఖమిచ్చువాని.

ఉ. పెద్దగ దంతివోలె బుస పెట్టెడువానిని, పానమత్తతన్
నిద్దురగొన్నవాని, రణనిష్ఠురు రావణు డాసి భీతిమైఁ
దద్దయు దద్దరిల్లె హరి దయ్యముఁ జూచి వణంకు కోఁచ నా
నొద్దకి కేల వచ్చితి నయో యని పానుపు డిగ్గి యంతటన్. ౨౬౫

అర్థములు. దంతి = ఏనుఁగు, దద్దరిల్లెన్ = తబ్బిబ్బుపడెను. కోఁచ = పిఱికి.

తాత్పర్యము.

ఏనుఁగువలెఁ బెద్దగ బుసపెట్టుచున్నవానిని, త్రాగిన మత్తుచేత నిదురించువానిని, యుద్ధమందుఁ గఠినుఁడైనవానిని, రావణు సమీపించి భయపడి దయ్యమును జూచి వణఁకు పిఱికివానివలె మిగులఁ దబ్బిబ్బుపడెను. అయ్యో! యీ పాపిదగ్గఱ కేలవచ్చితి నని పానుపుదిగి తరువాత.

దీనివలనఁ బాపాత్ముల సమీపింపరాదని యేర్పడుచున్నది.

ఉ. చెచ్చెర వేదికాంతరముఁ జేరి కనుంగొనె నిద్దురించు నా
రుచ్చితు, దచ్ఛయంబు మదకుంజరయుక్త ఘురీప్రకాశమై

మెచ్చులు గొల్పఁ, నయ్యెడ న♦మేయపరాక్రమకీర్తి యుక్తముల్
నిచ్చలుఁ గాంచనాంగదమ♦ణీమయభూషణ భూషితంబులున్. ౨౯౬

అర్థములు. వేదికాంతరము = వేఱొకయరుఁగు, తచ్ఛయము = ఆపానుపు, మదకుంజరయుక్త = మదించిన యేనుఁగుతోఁ గూడిన, ఝర్ప్రకాశమై = ప్రవాహము యొక్క కాంతిగలదై, నిచ్చలు = ఎల్లప్పుడు, నిత్య శబ్దభవము — యా — నిచ్చ.

తాత్పర్యము.

శీఘ్రముగ మఱియొక యరుఁగుమీఁదికిఁబోయి నిద్రపోవుచున యా కుచ్ఛ తుని జూచెను. మదించిన యేనుఁగుతోఁగూడిన ప్రవాహమువలె వాని పానుపు శ్లాఘ్యమైయుండెను. విస్తారమైన పరాక్రమము వలనఁ గలిగిన కీర్తితోఁగూడినవియు బంగారు భుజకీర్తులు రత్నమయములైన యాభరణములచే నలంకరింపఁబడినవియు.

సీ. అగుచును నింద్రధ్వ♦జాభంబు లగువాని, నైరావతవిషాణ♦హతులచేతఁ
గాయ గాచినవాని ♦ ఘనశతారాహతి, నోర్చు నంసంబుల ♦ నొప్పువాని
విష్ణుచక్రక్షతి ♦ వెలయుచుండెడివాని, సబలసంగతసమాం♦సములవాని
నమలచిహ్నాత్తన♦ఖాంగుష్ఠములవాని, గుదియలఁ బోలిన♦కొమరువానిఁ
తే. గరికరాకృతి గల గరి♦గరికవాని, నైదుపడగల పాముల♦యట్లు పొన్పు
నెరసి పడియుంటువాలిఁ గుండేటినల్ల, బోలు కమ్మనిగందంపుఁ♦బూతవానిఁ

అర్థములు. ఇంద్రధ్వజాభంబులు = ఇంద్రధ్వజముతో సమానములు, ఐరావత విషాణహతులచేత = ఐరావతముయొక్క కొమ్ములదెబ్బలచే, ఘనశతారాహతి = గొప్ప వజ్రాయుధము దెబ్బలను, అంసంబులు = మూఁపులు, విష్ణుచక్రక్షతి = విష్ణుచక్రముయొక్క గాయములచే, సబల సంగత = బలముతోఁగూడిన, సమాంసములవానిని = సమములైన మూఁపులవానిని, అమలచిహ్నాత్త = నిర్మలములైన లక్షణములు గల, నఖాంగుష్ఠములవానిన్ = గోళ్ళు బొటనవ్రేళ్ళు గలవానిని, గరిగరికవాని = అందముగలవాని, ఐదుపడగల పాములట్లు = చేతి యైదువ్రేళ్ళు నైదు పడగలని భావము. నల్ల = నెత్తురు.

విష్ణుచక్రక్షతి యనుటకు శ్రీమహావిష్ణువుయొక్క సుదర్శనము వలననైన గాయమనియు రావణుఁడు విష్ణువును జయించెననియుఁ గొందఱు చెప్పదురు. రావణునకు విష్ణువునకు యుద్ధము జరిగినట్లు రామాయణమున లేదు. అంతియ కాక యింద్రుఁడు తన్నుఁదోడుపడ రమ్మని పిలిచినపుడు నేను యుద్ధమునకు వచ్చితినేని జంపికాని రాను. ఇప్పుడు వాని జంప వలనుపడదు. కాలాంతరముననే చంపెదనని సమాధానము చెప్పి పంపినట్లుత్తర రామాయణమున ౬౦౭-౬౦౮-౬౦౯ పద్యంబులఁ జూడుఁడు. ఈ కారణముచే విష్ణుని సుదర్శన మిచటఁ జెప్పరాదు. విష్ణుచక్రమను నస్త్రమును విశ్వామిత్రుఁడు శ్రీరామచంద్రమూర్తి కుపదేశించినట్లు బాలకాండము ౬౬౨ పద్యమునఁ గలదు. ఈ విష్ణుచక్రమును విశ్వామిత్రుఁడు వసిష్ఠునిపైఁ

ప్రయోగింపఁగా వ్యర్థమై పోయినట్లు బాల. ౧౦౭౦ వ పద్యంబున గలదు. కావున నిది యాయుధమే కాని సుదర్శన చక్రముగాదు. సుదర్శన మనునది భగవత్సంకల్ప రూపకము. అది విశ్వామిత్రున కెట్లు లభించె. వసిష్ఠునిచే హత మెట్లయ్యె. నామ సామ్యముచేఁ బ్రమాద పడరాదు.

### తా త్ప ర్య ము .

అగుచు నింద్రధ్వజముతో సమానము లగునవియు, ఇంద్రుని వాహనమైన యైరావతము కొమ్ముల పోట్లచే కాయలు గాచినవియు, గొప్పవజ్రాయుధము దెబ్బల సహించిన మూఁపురములు గలవియు, విష్ణుచక్రమను నాయుధముచే గాయపడినవియు, బలముగలిగి సమములైన మూఁపులు గలవియు, నిర్మల లక్షణములు గల గోళ్ళు బొటనవేళ్ళు గలవియు గుదియలఁ బోలినవియు నేనుఁగు తొండములవంటి యందము గలవియు, నైదుపడగల పాములఁ బోలునవియు, పానుపుపై నావరించి పడియుండు నవియు, కుందేటి నెత్తురువంటి యెఱ్ఱని గంధము పూయఁబడినవియు.

సీ. మృగవిలోలాక్షీవి◆మృదితంబు లగువాని, మంచిగందపుఁబరిమళమువాని
　యక్షపన్నగనిర్జ◆రాసురగంధర్వ, పటలి హా హా యనఁ ◆ బ్రబలువాని
　మందరాచలశృంగ◆మధ్యసీమను గూర్కు, క్రుద్ధాహు లన భీతి ◆ గొలుపువానిఁ
　గ్రవ్యాదనాథుక◆రంబులు రెంటిని, బావని కనుఁగొనె ◆ బాహుయుగము
తే. కలిమి సశిఖరమందర◆క్ష్మాధ్ర మనఁగఁ గ్రాలు రావణు వదనని◆ర్గతములైన
　చూతపున్నాగవకుళాన్న◆సురభితములు, శ్వాసపవనముల్ నిండారె◆సదనమునను.

అర్థములు. మృగవిలోలాక్షీ = జింక కన్నులవలెఁ జలించు కన్నులుగల స్త్రీలచే, విమృదితంబులు = ఆలింగనాదులు చేసికొనఁబడినవి, క్రుద్ధాహులు = కోపించిన పాములు, క్రవ్యాదనాథు = రాక్షసపతియొక్క, క్ష్మాధ్రము = పర్వతము, నిర్గతములు = బయలువెడలినవి, సురభితములు = సువాసన గలవియు

### తా త్ప ర్య ము .

స్త్రీలచేఁ గౌఁగిలింపఁబడినవియు, మంచిగంధము వాసనగలవియు, యక్షుల పన్నగుల దేవతల యసురుల గంధర్వుల సమూహము విలపింపఁజేసినవియు మందర పర్వతము శిఖరము నడుమ నిద్రించు కోపించిన పాములవలె భయపెట్టునవియు, నగు రాక్షసేశ్వరుని రెండుచేతులను హనుమంతుఁడు చూచెను. రెండుబాహువు లుండుటచే శిఖరములతోఁగూడిన మందర పర్వతమువలె నుండు రావణుని నోరనుండి వెడలుచున్న మామిడి పున్నాగము పొగడ వీనితోఁ జేయబడిన సారాయము ద్రాగుటచే నా వాసన గల యూర్పు లిల్లు నిండియుండెను.

ఈ పద్యమునందు రావణున కొక తల, రెండు చేతు లున్నట్లు చెప్పఁబడెను. ఈ తలల, చేతుల విచారము ౧౧౩౪ వ్యాఖ్యయందుఁ జేయఁబడును.

సీ. ఒకయోర నొఱఁగిన యుజ్జ్వలన్మౌక్తిక, కాంచనమకుటంబు ♦ మించువాని
గుండలజ్వలితాస్య♦మండలంబుఁ గలానిఁ, గ్రూరసర్పమువోలె ♦ రోఁజువాని
రక్తచందనదిగ్ధ♦రమణీయహారసం, సక్త విశాలవ♦క్షంబు వాని
నొకవంక వ్రాలిన♦యెఱ పైన వెలిపట్టుఁ, బుట్టంబు ముంగొంగు♦పొలుచువాని
ఆ. విలువ లేని పైఁడి♦వలువఁ గట్టినవాని, మినుపపెద్దకుప్ప ♦ నెనయు వాని
గంగ నడుమ నిదుర♦నంగం బెఱుంగని, ద్విపము నాఁగ మిగుల ♦ వెలుఁగువాని.

అర్థములు. కాంచనమకుటంబు=బంగారు కిరీటము, కుండల=చెవి పోగులచే, జ్వలిత=ప్రకాశించు, ఆస్యమండలము = ముఖబింబము, రక్తచందనదిగ్ధ = ఎఱ్ఱగంధముచేఁ బూయఁబడిన, రమణీయ = మనోహరమైన, హారసంసక్త = హారములతోఁ గూడిన, విశాలవక్షంబువాని= వెడలుపాటి ఱొమ్ముగలవాని, ద్విపము=ఏనుఁగు.

తాత్పర్యము.

పండుకొన్న కారణముచే నొకప్రక్కకు నొఱగిన- ప్రకాశించు ముత్యములుగల బంగారు కిరీటంబు గలవాఁడును, చెవుల కుండలములచేఁ బ్రకాశించు ముఖమండలము గలవాఁడును, క్రూరమైన పామువలె బుసగొట్టువాఁడును, ఎఱ్ఱగందపుఁ బూఁత గలిగి యందమైన హారములతోఁ గూడిన వెడలుపాటి ఱొమ్ముగలవాఁడును, నొకప్రక్క వ్రేలిన యందమైన తెల్లని పట్టువస్త్రము ముంగొంగు గల వాఁడును, వెలలేని బంగారు సరిగ వస్త్రముగట్టినవాఁడును, మినుముల రాశివలె నున్నవాఁడును, గంగనడుమ నిద్దురగొని దేహము దెలియని యేనుఁగువలె నుండువాఁడును.

క. నాలుగు దిక్కులఁ దమరుచి, వాలాయము నిండ వెలుఁగు♦వరదీపములన్
నాలుగిట మెఱయ మెయి శం,పాలలితాబ్దంబు పగిది ♦ భాసిలువానిన్. ౩౦౦

అర్థములు. శంపాలలితాబ్దంబు = మెఱపుచే నందమైన మేఘము.

తాత్పర్యము.

నాలుగు దిక్కులయందుఁ దమ కాంతి వ్యాపింపఁజేయు నాలుగు దీపములచే మెఱయుచున్న దేహముతో మెఱుఁగులతోఁ గూడిన మేఘమువలె నున్నవానిని.

—♦ హనుమంతుఁడు నిద్రించు రావణుభార్యలఁ జూచుట. ♦—

తే. అసురవల్లభు నాతని♦యంఘ్రిమూల,మునను బండినయాతని ♦ ముద్దరాండ్ర
రాక్షసాధీశు దివ్యహ♦ర్మ్యంబునందుఁ,గాంచెఁ బవమానసూతి ని♦ష్కలుషమతిని.

అర్థములు. అంఘ్రిమూలమునను = పాదముల కడ, నిష్కలుషమతిని = పాపములేని మనస్సుతో.

తాత్పర్యము.

రావణాసురుని, వాని కాళ్ళయొద్దఁ బండుకొనిన యాతని స్త్రీలను, రావణాసురు నింట నిర్మల మనస్సుతో నాంజనేయుఁడు చూచెను.

క. కమ్మలతో వాడని మాల్యములతో నిండు నెలను♦హసియించెడు నా
స్యమ్ములతో నట ముద్దుం, గుమ్మలఁ గనుగొనియె గాలి♦కొడుకవ్వేళన్. ౩౦౨

తాత్పర్యము.

ఈ స్త్రీలు వర్ణింపఁబడుచున్నారు. కమ్మలతోను, వాడిపోని పూలదండలతోను పున్నమ చంద్రుని నవ్వు ముఖములతోను నుండు స్త్రీలను హనుమంతుఁడు చూచెను.

క. ఇంబుగఁ దాలిచి యాభరణంబుల వీణాదివాద♦నంబుల శుభనృ
త్తంబులఁ జతురలఁ బత్యంకంబులపై నిదురగొనెడి♦కాంతలఁ గనియెన్. ౩౦౩

తాత్పర్యము.

మనోహరముగ నాభరణంబుల ధరించి వీణాదుల వాయించుట యందును, నృత్యములందును నేర్పుగలవారిని, పతి తొడలపైఁ బండుకొని యుండగాఁ జూచెను.

ముందుఁ జెప్పఁబడినవారు రావణునకు దూరముగా నేలఁబడి యుండినవారు. వీరంతకంటె నుత్తములు గావున రావణు సమీపంబున వానిని తొడలమీఁదనే తల యుంచి పండుకొనిరి.

క. అంగనల వీనులందుఁ జెలంగెడి వైడూర్యకుండ♦లంబులు మఱి యా
చెంగట వెలుంగు బంగరుటంగదములు గాంచె వాన♦రాగ్రణి యచటన్. ౩౦౪

తాత్పర్యము.

ఆ స్త్రీల చెవులందు వైడూర్యముల కుండలంబులు వారి సమీపమున బంగారు భుజకీర్తులు హనుమంతుఁడు గనుఁగొనెను.

క. ఇందురుచిఁ గేరు ముఖములు, సుందరతఁ దళుక్కు మనెడి♦చొక్కపుఁగమ్మల్
మందిరమును దారాగణతుందిల గగనంబుమాడ్కిఁ♦దోఁపించెఁ గడున్. ౩౦౫

తాత్పర్యము.

చంద్రుని పరిహసించు ముఖములు, సౌందర్యముచేఁ దళుక్కు మను కమ్మలు ఆ యింటిని నక్షత్రసమూహములచేనిండిన యాకాశమును బోలి యుండఁ జేసెను.

క. హాలారతిఁ గేళీగతి, లీలారతిఁ దేలినట్టి♦లీలావతుల
వ్వేళను మే నెఱుఁగక కడుఁ, దూలిరి యిందందు నిదుర♦తోరముగాఁగన్. ౩౦౬

అర్థములు. హాలారతిన్ = మద్యపానాసక్తిని, కేళీగతిన్ = క్రీడలందు, లీలారతిన్ = విలాసముతోఁ గూడిన రతియందు, లీలావతి యనుటచే, చౌశీతి బంధములు సూచితము. లీలావతులు = శృంగారవతులు. స్త్రీలు.

తాత్పర్యము.

మద్యము బాగుగఁ ద్రావి, నృత్యాదులు సలిపి, ధేనుకాది బంధముల భర్తతో రతి సలిపిన స్త్రీలు నిద్దుర పెల్లున దేహములు తెలియక యందందుఁ బడి నిద్రించిరి.

క. మత్తచకోరాంబక వర,నృత్తకళాశీల యగుట♦నే యభినయ సం
పత్తిమును వెలసె నిద్రా,యత్తయునై తదభినయము♦యనువుగఁ దాల్చెన్.

అర్థములు. మత్తచకోరాంబక = మదించిన చకోరములవంటి కన్నులుగలది, వరనృత్తకళాశీల = నాట్యము చక్కఁగా నాడుట స్వభావముగాఁగలది.

తాత్పర్యము.

నాట్యమునందు సామర్థ్యముగల యొకతె యాడునపుడే హస్త గ్రీవాభినయము చూపెనో నిద్రించి నపుడును నా యభినయమే చూపించుచుండెను.

క. వెల్లువఁ బోవుచుఁ బోతము, ఫుల్లనళిని యాశ్రయించు♦పోలువున నిదురన్
హల్లకపాణి యొకతె కర,పల్లవములఁ గౌఁగిటన్ వి♦పంచిం గూర్చెన్. ౩౦౭

అర్థములు. పోతమును = పడవను, ఫుల్లనళిన = వికసించిన తామరతీఁగ, హల్లకపాణి = చెంగలువ వంటి యఱచేయి గలది, విపంచిన్ = వీణను.

తాత్పర్యము.

ఏటివెంటఁ బోవు వికసించిన తామరతీఁగ పడవను చుట్టుకొన్నట్టు లొకహల్లకపాణి తన చిగురువంటి చేతులతో వీణను గౌఁగిలించి పండుకొనెను.

క. కక్షంబున నొక కంజా,తేక్షణ మడ్డుకము నుంచి♦యెలమిని శిశువున్
గక్షమునఁ జేర్చి పండు,మ్మ,గేక్షణ యన నిద్దురించె♦నెలమిం గొనుచున్. ౩౦౯

అర్థములు. కక్షంబునన్ = చంకయందు, మడ్డుకము = తుడుము.

తాత్పర్యము.

ఒకతె చంకయందుఁ దుడుము నుంచుకొని శిశువును జంక నుంచుకొని నిదురించు స్త్రీవలె సంతోషముతోఁ బండుకొనెను.

క. చిరకాలాగతు వల్లభుఁ, గరముల బిగిఁ గౌఁగిలించు♦కామిని కరణిన్
గురుకుచ యొకర్తు పటహముఁ, గరముల బిగిఁ గ్రుచ్చి నిదుర♦కైపునఁ జొక్కెన్.

అర్థములు. చిరకాలాగతున్ = దీర్ఘకాలమునకు వచ్చినవానిని, పటహము = తప్పెట, కైపునన్ = మత్తుచే.

తాత్పర్యము.

దేశాంతరము పోయి యుండి చాలఁగాలమునకు వచ్చిన భర్తను గౌఁగిలించు కామినివలె గొప్ప స్తనములు గల స్త్రీ యొకతె తప్పెటను గట్టిగఁ గౌఁగిలించుకొని నిద్దుర మత్తున పడియుండెను.

క. కామమదంబున నొకర్తుక, కామిని ప్రియతము రహస్సు♦గ్రహియించినటుల్
తామరసాక్షి యొకర్తుక, ప్రేమంబునఁ గౌఁగిలించి♦వేణువుఁ బండెన్. ౩౧౧

అర్థములు. రహస్సు = రహస్యాంగము, లింగము.

తాత్పర్యము.

కామాతిశయమున నొకకామిని తనకు మిక్కిలి ప్రియుఁడగు వానిలింగమును

జేతఁబట్టుకొని నిద్రించు నట్టు లొకతె పిల్లఁగ్రోవిని జేతఁ బట్టుకొని నిదురించెను.

క. కాంతునితోడఁ బరుండిన, కాంతామణి నా విపంచి ♦ గౌఁగిట నొనరన్
దంతిగమన నృత్తకళా,త్యంతనిపుణ యొర్తు నిదుర ♦ నంగము వ్రాల్చెన్. ౩౧౨

తాత్పర్యము.

మగనితోడఁ బండుకొనిన కాంతవలె నృత్తమునందు మిగుల నేర్పుగల యొకతె వీణెను గౌఁగిలించి నిదురచే దేహము వ్రాల్చి పరుండెను.

నిద్దుర మబ్బుచే వీరికి నీ కౌఁగిలుల్లు దూరముగ నుంచి పండుకొనుటకు నవ కాశము దొరకినది కాదు. ఎవరిపని వారు చేయుచు నట్టులే పడి నిద్రించిరి.

క. బంగరుజిగి మృదువును హృద,యంగమమును బీవరంబు ♦ నగు నంగములన్
రంగార నొత్తి యొక్క మృ,దంగ మొక కురంగనయన ♦ తద్దయుఁ గూర్కెన్.

అర్థములు. పీవరము = బలిసినది, మృదంగము = మద్దెల.

తాత్పర్యము.

బంగారు కాంతి, మృదుత్వము, మనోహరత్వము బలుపుగల యవయవములచే నొకతె మృదంగమును నెత్తుకొని పండుకొని నిదురించెను.

క. మద్దెల మొరయించుచు నొక,ముద్దియ శ్రమ మొంది బాహు♦మూలంబులచేఁ
దద్దయుఁ గక్షంబున నది, గ్రద్దన బిగియించి సోలె ♦ గాటపు నిదురన్. ౩౧౪

తాత్పర్యము.

ఒకతె మద్దెల వాయించుచు బడలి దానిని చంకలచే బిగించి గాఢనిద్రచే సోలెను.

క. డిండిమముఁ గ్రుచ్చి వెనుకను, నొండొక డిండిమము గ్రాల ♦ యువవల్లభుతోఁ
గొండొక బిడ్డనితోడఁ బరుండిన కకుభోరు వనఁ బ♦రుండెను నిదురన్. ౩౧౫

అర్థములు. డిండిమము = రాయిడి గిడిగిడి, ఢక్క. కొండొక = చిన్న, కకుభోరువు = కకుభమువంటి తొడగలది.

తాత్పర్యము.

ఒకతె ముందొక ఢక్క, వెనుక నొక ఢక్క యుంచుకొని చిన్నబిడ్డను ముందు, వయస్సుమగని వెనుక నుంచుకొని పరుండిన స్త్రీవలెఁ బరుండెను.

క. మదనమదభృశవిమోహిత,మదకలమదిరాక్షి యొర్తు ♦ మతి తెలియక తా
మ్రమకరముల నాడంబర,ము దగఁ గవుంగిటను జేర్చి ♦ మునిఁగెను నిద్రన్. ౩౧౬

అర్థములు. మదన మద = కామమదముచే, భృశవిమోహిత = మిక్కిలి మోహము చెందిన, మదకల = మదముచే నందమైనది, మదిరాక్షి = మద్యము వలె నెదుటివారిని మత్తుఁగొనఁ జేయు కన్నులు గలది. ఆడంబరము = తూర్యవిశేషము. "ఆడంబర స్సమారంభే గజగర్జిత తూర్యయోః" విశ్వము.

తా త్ప ర్య ము.

కామ మదమున మిగుల మోహము చెందిన యొకతె దేహము తెలియక తన మృదుకరములఁ నాడంబరమును గౌఁగిలించి నిదురలో మునిఁగెను.

క. జలకలశ మొకర్తు వసుధా,తలమున దొరలించి దానఁ దడెసెన్ సురభిన్
  జెలువఱి వాడమికై ని,ర్మలజలసిక్తమగు శబల♦మాల్యము మాడ్కిన్. ౩౧౭

అర్థములు. జలకలశము = నీటిపాత్ర, సురభిన్ = వసంతకాలమందు, చెలువఱి = అందముచెడి, వాడమికై = వాడిపోకయుండుటకై, శబలమాల్యము=నానావర్ణములు గల పూలదండ, మాడ్కిన్ = వలె.

తా త్ప ర్య ము.

రావణాసురునకు నీళ్ళుపోసెడి పనికత్తె నీటిపాత్ర నిద్ర మబ్బున నేల దొరలించి యా నీటియందే పండుకొని వసంతకాలమున వాడిపోకుండుటకై నీళ్ళచేఁ దడుపఁబడిన పెక్కురంగుల పూలదండవలె నుండెను.

శబల శబ్దస్వారస్యముచే నీళ్లు వట్టివేరు మొదలైన వాని వాసన గలవై కుంకుమ పూవుతోఁ గలసి యుండెనని భావము.

క. బంగరు గిండుల మేలిహొం,రంగులు గల నిజపయోధ♦రంబులఁ గేలన్
  భృంగీకురళ యొకర్తుక, పొంగుగ బిగఁ బట్టికొనుచుఁ బొందెన్ నిదురన్. ౩౧౮

అర్థములు. భృంగీకురళ = ఆఁడు తుమ్మెదలవంటి ముంగురులు గలది.

తా త్ప ర్య ము.

బంగరు గిన్నెలవంటి శ్రేష్ఠ మగు విలాసము గల తనకుచములను సంతోషముతో గట్టిగాఁ బట్టుకొనుచు నొక యాఁడుతుమ్మెదలఁబోలు ముంగురులు గల సుందరి నిద్రించెను.

క. మదవిహ్వల యగు నొక్క ప్ర,మద శారదపూర్ణ చంద్రు ♦ మఱపించెడి స
  ద్వదనముఁగలయొకహరికటి, నిదురను బిగియారఁ గ్రుచ్చె ♦ నెఱమోహమునన్.

అర్థములు. మదవిహ్వల=మదముచే వికలమైన మనస్సుగలది, హరికటిన్ = సింహమధ్యను.

తా త్ప ర్య ము.

మదముచేఁ జెదరిన మనస్సుగల యొకపడుచు శరత్కాల చంద్రునితో సమానమైన ముఖముగల యొక సింహమధ్యను నిండు మోహముచే నిదురఁబోవుచు గట్టిగాఁ గౌఁగిలించుకొనెను.

తే. కామినులు కామమదమునఁ గాముకులను, జన్నులను బిగ్గ నొత్తెడి♦చందమునను
  తతఘనానద్ధసుషిరవా♦ద్యములఁ గ్రుచ్చి, మత్తకాశినులయ్యెడ ♦ నత్తమిలిరి.

అర్థములు. తత = వీణాదిక వాద్యము - తంతెలుగల వాద్యము, ఘన = తాలాదికము-వాయించునవి - కంచుతాలములు, ఆనద్ధము = మద్దెల మొదలయినవి,

సుషిరములు = పిల్లఁగ్రోవులు - మేళములు మొదలయినవి, మత్తకాశినులు = మదముచేఁ బ్రకాశించు స్త్రీలు, అత్తమిలిరి = పండుకొనిరి.

తాత్పర్యము.

కామము గల స్త్రీలు కామముగల తమ భర్తలను గాఢాతిశయమునఁ జన్నులచే గట్టిగా నొత్తు విధముగాఁ గొందఱు స్త్రీలు వీణెలను, మద్దెలలను, తాళములను, వెదురుగొట్టములతో వాయించు పిల్లఁగ్రోవులు మొదలగు వాద్యములను గట్టిగాఁ గౌఁగిలించుకొని పండుకొని నిద్రపోయిరి.

రావణాసురుని యంతఃపురస్త్రీ లందఱు సొమ్ము లూడిపోయినవారుగను, చీరలూడిపోయిన వారుగను, ముఖముమీఁదఁ బైఁటకొంగు వేసికొనినవారుగను వర్ణింపఁబడిరి. ఇందు శృంగారరసము వర్ణితమైనను నివన్నియు రాఁగల వైధవ్య చిహ్నము లని ధ్వనిత మని యెఱుంగ నగు.

క. వారల నెల్లరఁ జూచుచు, వీరుఁడు కపివరుఁడు పోయి వే ఱొకచోటన్
చారుతరరూపవిభవో, దారను నేకాంతసీమఁ ♦ దరుణిని గాంచెన్. ౫౧

తాత్పర్యము.

వీరుఁ డగు నాంజనేయుఁడు వారి నందఱఁ జూచుచు బోయి పోయి వేఱొకచోట నేకాంతస్థలమున మిగుల మనోహరమైన సౌందర్యాతిశయము గల యొక వయస్సు స్త్రీని జూచెను.

ఇచట వీరుఁ డనఁగా నింద్రియజయము గలవాఁ డని భావము. ఇందఱ నందగత్తెలఁ గామమత్తల నేకాంతమునఁ జూచినను ఆయన మనస్సు చలింపలే దని భావము. ఈమె పట్టపుదేవి గనుక ఈమూఁకలో గలియక వేరుగ నొంటిగఁ బండుకొనెను.

—♦ హనుమంతుఁడు మందోదరిని జూచుట. ♦—

శా. రాణ న్మించిన మంచిముత్తియపు హా♦రాల్ దూల వక్షస్స్థలిన్
మాణిక్యప్రకరప్రభాపటలశుం♦భన్మండనోద్దీప్తయై
రాణింపన్ శయనంబునం గనియె ని♦ద్రాసక్త స్వర్ణాంగి మ
త్తైణీలోచనఁ జారురూపిణిని శు♦ద్ధాంతేశ మందోదరిన్. ౫౨

అర్థములు. తూలన్ = వ్రేలాడఁగాఁ, మాణిక్యప్రకర = మాణిక్య సమూహములయొక్క, ప్రభాపటల = కాంతి సమూహముచే, శుంభత్ = ప్రకాశించు, మండన = అలంకారములచే, ఉద్దీప్తయై = మిగుల వెలుఁగునదియై, నిద్రాసక్తన్ = నిద్రించుదానిని, స్వర్ణాంగిన్ = బంగారువలెఁ బచ్చనైన దేహము గలదానిని, మత్త+ఏణీలోచనన్ = మదించిన యాఁడుజింక కన్నులవంటి కన్నులు గలదానిని, చారురూపిణిని = మనోహరమైన సౌందర్యముగలదానిని, శుద్ధాంతేశ = అంతఃపుర ప్రభ్వని-పట్టపురాణిని, మందోదరిన్ = మందోదరి యను పేరు గలదానిని, మందో

దరి = పలుచని కడుపుగలది. మండోదరి యనియు రూపము గలదు. అప్పుడు మీఁగడ వంటి కడుపుగల దని యర్థము. చూ. ౧౬౧౭ పద్యము.

తా త్ప ర్య ము.

మంచి ముత్తియముల హారములు లోమ్మున వ్రేలఁగా మాణిక్యముల కాంతులచేఁ బ్రకాశించు నలంకారములచే ఒగుల వెలుగుచున్నదియై నిద్రించుదానిని, బంగారువలెఁ బచ్చనైన దేహము గలదానిని, మదించిన యాఁడుజింకకన్నులవంటి కన్నులు గలదానిని, మనోహరమైన సౌందర్యము గలదానిని, పట్టపురాణి యగు మందోదరిని పడుక యందొప్పుచుండఁ జూచెను.

క. హత్తినమేలిరూపమును ♦ యౌవనసంపదఁ జూచి కంటి నే
న త్తరళాక్షి సీత నని ♦ హర్షమునన్ భుజ మప్పళించు, ము
ద్దొత్తును దోఁక, నాఁడు, మురు ♦ మొందును, గంబము లెక్కు, దూఁకు, గిం
చిత్తుగఁ బాడు, నైజ మగుచేష్టలు సేయుచు వానరుం డటన్. 3_౨3

అర్థములు. హత్తిన = పొందిన, మేలి రూపమును = గొప్ప సౌందర్యమును, అప్పళించుట = తట్టుకొనును, ముద్దు+ఒత్తును = ముద్దు పెట్టుకొనును, కించిత్తుగ = కొంచెముగ, 'కించిత్తు నల్లి గఱచిన' యని సుమతి శతము, నైజము = సహజము.

తా త్ప ర్య ము.

ఆమెకుఁగల గొప్ప సౌందర్యమును, బ్రాయమును జూచి, చూచితిఁ జూచితి సీత నని సంతోషాతిశయముచే భుజములు తట్టుకొనును. తోఁకముద్దు పెట్టుకొనును. గంతులు పెట్టును. సంతోషించుచు స్తంభము లెక్కి దూఁకును. మెల్లగఁ బాడును. (హనుమంతుఁడు సంగీతవిద్వాంసుడు) కోఁతులకు స్వభావమైన చేష్టలు చేయును.

వాస్తవపు సీతదేవిని జూచినపుడీ చేష్టలను జేయలేదు. ఏల? తన కష్ట మంతయు ఫలించెగదా యన్న సంతోష మంతయుఁ బొంగి పొరలిపోయెను.

—♦ ౧౧-వ సర్గము. హనుమ సీతాదేవిని పానశాలయందు మరల వెదకుట. ♦—

ఉ. కాంచితిఁగా రఘూత్తముని♦కామిని నంచును స్వస్థచిత్తుఁడై
యించుక యుండి యా హనుమ ♦ యెట్లగు నీ సతి సీత? సీత ని
ద్రించునొ ? యారగించునొ ? రు♦చించునొ? సొమ్ములు మేనఁ దాల్చఁ గాం
క్షించునొ? పాన మామెకు రు♦చించునొ? రాముని బాసి యుండుటన్, ౩_౨౮

అర్థములు. స్వస్థచిత్తుఁడై = కుదుటఁబడిన మనస్సుగలవాఁడై, ఇంక = కొంచెము, ముదించునో = సంతోషించునా ?

తా త్ప ర్య ము .

అబ్బా! యిప్పటికి చూచితిని శ్రీరామచంద్రమూర్తి భార్యను అని కొంచెము సేపు మనస్సు కుదురుగా నుంచుకొని యీ యామె సీత యగునా యని వితర్కించి సీత యైనయెడల నామె పతివ్రతగదా! భర్తను విడిచియుండు సమయంబున నామె

నిద్దురపోవునా? ఆహారము తీసికొనునా? సంతోషించునా? దేహమున సొమ్ములు ధరించునా ? పానము, తుదకు మంచినీళ్ళయినను ఆమెకు రుచించునా ? ఇవన్నియు నీమె యొద్ద నున్నవి కావున నీమె సీత యెట్లగును ? కాదు.

క. రాముని( దక్క(గ నాసు, త్రాముని నేని భూమికన్య తగ( గను(గొనునే?
రామునితో( దుల్యు(డు స్వ, ర్గాముల నేని లే(డు నిశ్చితం బిది యనుచున్. ౩-౭౫

అర్థములు. సుమిత్రాముని నేని = ఇంద్రుడైనను, స్వర్గాముల నేని = దేవతల యందైన.

తాత్పర్యము.

సీతాదేవి రామచంద్రమూర్తిని దప్ప నింద్రునినైన( గన్నెత్తి యైన( జూచునా? చూడ( జాలదు. ఏల? ఆమె పతివ్రత. ఎట్టి నికృష్టుడైనను ఆ పతియే దైవమని పరులెట్టివారైనను దన పతికంటె నికృష్టులని యుండునది కదా పతివ్రత. అట్టులుండ రామచంద్రమూర్తితో సమానుడు దేవతలందైన లే(డే. ఇక నీ రాక్షసునిమాట చెప్పనేల. ఉత్తమోత్తమ వస్తువు లభించినవారధమవస్తువు నాశింతురా? కావున నీమె సీతగాదు. ఇది నిశ్చయము, అనుచు,

సీ. ఆవల నరిగి పానాలయంబునయందు, వెదకంగ( దొడ(గె నా వీరవర్యు(
డాటలఁ బాటల( నలసినవారిని, మధుపానమున మేను మఱచువారి
మర్దలమురజముల్ మఱి పీఠకాతతి, తలదిండ్లు గా(గను దనరువారి
నంచితాస్తరణాళి నత్తమిల్లినవారి, వాలు(గంటుల( గాంచి వాన రేంద్రు(
తే. డమలమణిభూషణాలంకృతాంగులైన, రూపసల్లాపశీలతా రూఢలైన
కాలదేశాభియుక్తలౌ కాంతలెల్ల, బలియు(గ రతాభిరతసుప్తు వాసవారి. ౩-౭౬

అర్థములు. పానాలయంబు = మద్యపానము చేయు నిల్లు, మర్దలమురజముల్ = మద్దెల మృదంగములు, ఆస్తరణాళి = నేల( బఱచిన కంబళ్ళు మొదలయినవి, అత్తమిల్లినవారిని = పండుకొనినవారిని, రూపసల్లాపశీలతా రూఢలు = సౌందర్య విషయమైన ముచ్చటలు చెప్పు స్వభావమందు( దేఱినవారు. కాలదేశాభియుక్తలు = యుక్తమైన దేశకాలముల నెఱి(గినవారు, రతాభిరతసుప్తు = సురతమునిష్టముగలవానిని, నిద్రించిన వానిని, విశేషణోభయపదము. రతశబ్దము బాహ్యసురతమును, అభిరతశబ్దము కరణ బంధాదులను సూచించునని కొందఱు, రతాభిరతస్సుప్తు = స్నాతావలిప్తశబ్దము(నందువలె రతాభిరతశ్చ అసౌ సంసుప్తశ్చ యని సమాసము గ్రహింపనగు. 'బాహ్యమాభ్యంతరం చేతి ద్వివిధం రతముచ్యతే తత్రాద్యం చుంబనాశ్లేష నఖదంతక్షతాదకం, ద్వితీయం సురతం సాక్షాన్నానా కరణ కల్పితమ్. ఆదౌ రతం బాహ్య మిహ ప్రయోజ్యం తత్రాపి చాలింగన మేవ పూర్వమ్ ॥ రతి రహస్యే. బాహ్యమనియు అభ్యంతరమనియు రెండు విధములు. ముద్దుపెట్టుకొనుట, కౌ(గిలించుట, నఖక్షత, దంతక్షతములు లోనైనవి బాహ్యమన(

బడును. నానాబంధకల్పిత సాక్షాత్సురతము ఆభ్యంతర మనఁబడును. బాహ్యముతో నందు నాలింగనముతో రతి నారంభింపవలయును. ఇందీ రెండు తెగలవారు చెప్పఁబడిరి వాసవారిః = ఇంద్రద్వేషిని – పై పద్యముతో నన్వయము.

తా త్ప ర్య ము.

మందోదరిని దాఁటి యావలఁ బోయి మద్యము ద్రాగు సింటియందు హనుమంతుఁడు వెదక నారంభించెను. ఆట లాడి పాటలు పాడి, యలసినవారిని, మద్యము ద్రావి దేహములు మఱచినవారిని, మద్దెలలు, మృదంగములు, పీఁటలు, తలదిండ్లుగాఁ గలవారిని కంబళ్ళు, తివాచీలు పఱచుకొని పండుకొనినవారిని, స్త్రీలను జూచి నిర్మలమైన రత్నాభరణములచే నలంకరింపఁబడినవారై, సౌందర్యలక్షణ ముపన్యసించు స్వభావము గలవారై, దేశకాలముల యుచిత జ్ఞానము గలవారైన స్త్రీలు చుట్టుకొన బాహ్యాభ్యంతర రతుల నలసి నిద్రించు రావణుని,

ఉ. ఆవులమందలో వృషము♦నట్టులు కానలలోఁ గరేణుపూ
గావృత మైన దంతిగతి ♦ నబ్జముఖీపరివారకీర్ణునిః
రావణుఁ గాంచి దాఁటె చని ♦ రమ్యసమస్త సువస్తుపూరితం
బౌ వరపానభూమి, గది♦యం జని యందు సమీరసూతియుక్. ౩౨

అర్థములు. వృషము = ఎద్దు, కరేణుపూగావృతము = ఆడేనుఁగల సమూహముచేఁ జుట్టఁబడినది, దంతి = ఏనుఁగు, అబ్జముఖీ పరివారకీర్ణునిః = స్త్రీ పరివారముతోఁ గూడియుండువానిని.

తా త్ప ర్య ము.

ఆవుల మందలో నెద్దువలె, ఆఁడేనుఁగుల గుంపులో నేనుఁగువలె స్త్రీ పరివారములో నుండువానిని రావణుఁ గాంచి దాఁటిపోయి, మనోహరమైన సమస్త వస్తువులచే నిండిన మద్యపాన గృహప్రదేశము చేరఁబోయి యందు హనుమంతుఁడు.

సీ. మహిషసూకరమృగ♦మాంసంబు లచ్చట, నచ్చటఁ బ్రోవులై ♦ హెచ్చి యుండ
మీఁగడ పెరుఁగున ♦ మేలిమి సౌవర్చ,లమునఁ దీరిచిన కో♦ళ్ళయు నెమిళ్ళ
కిరుల ఖడ్గంబుల ♦ వరశల్యముల లేళ్ళ, క్రకరచకోరసం♦ఘము నెఱచుల
సామిభక్షితకల♦శంబుల జహువిధ, పక్వలేహ్యసుభోజ్య♦పటలములను
తే. నుప్పు పులుసుల పండుట ♦ నొప్పు మీఱు, రాగషాడబములను దొ♦రంగ నైనఁ
బడినసరగలు నందెలుఁ దొడవు లెల్లఁ బానభాజననిక్షిప్త ♦ ఫలచయములు. ౩౭

అర్థములు. సౌవర్చలము = సౌవర్చ మను పేరుగల లవణము, శల్యము = ఏదుపంది, క్రకరము = కక్కెర, ఎఱచులః = మాంసములను, సామిభక్షిత = సగముతినఁబడిన, రాగషాడబములః; రాగ = తెల్లయావాలు, 'రాగసిద్ధార్థకోజ్ఞేయః' అని పాకశాస్త్రము. షాడబము = షడ్రసములుగల యట్లు చేయబడిన భక్ష్యము. (౨) రాగ = పలుచగా నున్న మధురరసము – షాడబము = చిక్కఁగా నున్న మధురాదిరసము.

చక్కెర తేనె ద్రాక్ష దానిమ్మ - వీని రస మని భావము. సీతా మధ్వాదిమధురో ద్రాక్షా దాడిమయో రసః। విరళశ్చేత్ కృతో రాగః సాంద్రశ్చేత్ షాడబస్స్మృతిః॥ పానకం ద్రాక్షమాధూకం ఖార్జూరం తార మైక్షవం। మధూత్థం శీధుమార్ద్వీకం మైరేయంనారికేళజమ్॥ అర్ణవము. అను వాక్యము ప్రమాణము. తోరణగళ్=దారలు నట్లు, సరగలు = హారములు, తొడవులు = ఆభరణములు, పానభాజన = పాన పాత్రములందు. నిక్షిప్త = ఉంచఁబడిన.

తా త్ప ర్య ము .

దున్నపోతులు - పందులు - జింకల మాంసము లందందుఁ గుప్పలు కుప్పలు గాఁ బడియుండెను. మీఁగడ పెరుఁగులో సౌవర్చలవణము కలిపి సిద్ధము చేసిన కోళ్ళ - నెమిళ్ళ - పంచుల - ఖడ్గముల - ఏదుల - లేళ్ళ - కక్కెరల - చకోరముల మాంసములను సగము భక్షింపఁబడిన పాత్రములందు నానావిధములుగఁ బాకము చేసిన లేహ్యములను, భోజ్యములను ఉప్పు పులుసువేసి వండిన రాగషాడబములను తోరలిపడిన హారములను, నందెలను అన్నివిధముల యాభరణములను, పానపాత్రలం దుంచఁబడిన ఫలములను హనుమంతుఁడు చూచెను.

తే. అచ్చ టచ్చట నునిచిన ♦ హరువుమీరు
నవ్య కనకమణీశయ♦నముల నాస
నములకాంతులఁ బానగే♦హము కృశాను
రహిత మయ్యుఁ బ్రదీప్త మై ♦ రమణఁ దోఁచె. ౩౨౯

అర్థములు. కృశాను రహితమయ్యున్ = అగ్నిహోత్రము లేకున్నను, ప్రదీప్తము = మండుచున్న, రమణ = విధము.

తా త్ప ర్య ము .

అక్కడక్కడ నుంచిన యందముచే నతిశయించు క్రొత్తబంగారు రత్నములచే జేయఁబడిన శయ్యలయు నాసనములయుఁ గాంతులచే నా గృహము నిప్పులేకున్నను గాలు చున్నట్టు లుండెను.

క. వెరవరులగు నడబాలలు, సరసంబుగ దీర్చు నామి♦షంబులు సుమశ
ర్కరలను మధుఫలములచే, సురుచిరముగ, దీర్చినట్టి ♦ సురలం గాంచెన్. ౩౩౦

అర్థములు. వెరవరులు = వెరవు+అరి = ఉపాయశాలులు, అడబాలలు = వంటవాండ్రు, ఆమిషంబులు = మాంసములు, సుమశర్కరలను = పూలరసము చేతను చక్కెరచేతను, మధుఫలములచేన్ = ద్రాక్ష మొదలగు తీయని పండ్లచే, సురలన్ = సారాయములను.

తా త్ప ర్య ము .

పాకము చేయు నుపాయము తెలిసి వంటవాండ్రు రుచిపుట్టునట్లు వండిన

మాంసంబులను పూలచేతను చక్కెరచేతను ద్రాక్ష ఇప్పపూవు లోనగు తియ్యని ఫలములచేతను ఇంపుగ సిద్ధముచేసిన సారాయములను జూచెను.

క. బుక్కాములు పలు తెగ లగు, స్రక్కులు బంగారు వెండి స్ఫటికంబులఁ జెం
పెక్కిన కలశంబులు రుచి, పెక్కువ పానీయములఁ గపిప్రభుఁ డగనెన్. ౩౩౧

అర్థములు. బుక్కాములు=గందవొడులు, స్రక్కులు—హారములు.

తాత్పర్యము.

గందవొడులు నానావిధములైన హారములు బంగారు వెండి స్ఫటికంబులఁ జేసిన పాత్రములు విశేషము రుచిగల పానీయములను హనుమంతుఁడు చూచెను.

క. అఱద్రావిన నెఱ ద్రావిన, కొఱగానని కమ్మరసముఁ గూడిన పాత్రల్
నెఱమెక్కిన యఱ చిక్కిన, కొఱ దక్కని భక్ష్యములయుఁ గుప్పలు గాంచెన్.

అర్థములు. నెఱద్రావిన=పూర్ణముగఁ ద్రావిన, కొఱగానని - కొఱత లేక నిండియున్న, కమ్మరసము=సారాయము, నెఱ=పూర్ణముగ, మెక్కిన=తినిన అఱచిక్కిన=సగము మిగిలిన, కొఱదక్కని=కొదువలేక నిండియున్న.

తాత్పర్యము.

కొన్ని పాత్రము లందలి సారాయము సగము త్రావఁబడియుండెను. కొన్నిఁటి యందుఁ బూర్ణముగఁ ద్రావఁబడి యుండెను. కొన్నిటియందు నేమియుఁ ద్రావఁబడక నిండియుండెను. భక్ష్యములు కొన్ని సగము దినఁబడినవి, పూర్ణముగఁ దినఁబడినవి, ఏమియుఁ దినఁబడనివి కుప్పలు కుప్పలుగాఁ బడియుండెను. ఇవియన్నియు హనుమ చూచెను.

మనోరంజని. తగిలినగిన్నెలు దొరలెడి కుండలుఁ బాఱు జలంబులు దండలుఁ బల్
తెగ లగు పండులు బిగిగల కౌఁగిటఁ దేల్చుచు నొండొరు నిద్దుర మై
నన గల కన్నెలచెలు వగుచిన్నెలు వారక వేఱొక తొయ్యలిచీ
ర గరితయొక్కతె నిదురను లాగి యురంబునఁ గప్పికొనం గపియెన్.

తాత్పర్యము.

పగిలిన గిన్నెలు, దొరలుచున్న కుండలు, నేలఁ బాఱుచున్న నీళ్ళు, దండలు, నానావిధములయిన పండ్లు నిద్దురచే గట్టిగా నొకరి నొకరు కౌఁగిలించుచున్న సుందరుల చిన్నెలు, నొకదాని చీర తీసికొని వేఱొకతె యీడ్చుకొని ఱొమ్ములపైఁ గప్పుకొనుటలు హనుమంతుఁడు చూచెను.

మనోరంజని : నజనలు నైదు నగణంబులు, పదేనింట యతి.

క. సుందరుల మేనివలువలు, నందపుసరములును నూర్పుటనిలమున దర
స్పందము లయి మందానిల,కందళముల సుఖముఁ జెందు కైవడి నయ్యెన్. ౩౩౪

అర్థములు. దరస్పందములు = కొంచెముగాఁ గదలినవి, మందానిల కందళములన్ = మందమారుతముయొక్క మొలకలు అనఁగా మెల్లగా వీచు పిల్లగాలులు.

తా త్ప ర్య ము.

అందగత్తెలు దేహముల ధరించిన చీరలు సొగసైన దండలు వారి వారి యూర్పుగాలిచేఁ గొంచెముగాఁ గదలుచు మెల్లని పిల్లగాలులచే సుఖించు విధముగ నుండెను.

ఉ. కమ్మని చందనంబు కసు♦గందని పూలసరాలు శీధుపా
నమ్ములు స్నానలేపములు♦నవ్యసుధూపము లీనుచున్న ఘుం
ఘుమ్మను కమ్మఁదావు లెస♦కంబునఁ గైకొని తన్మహావిమా
నమ్మున నించె సౌరభము♦నవ్యముగాఁగ మరుత్కిశోరముల్. ౩౩౭

అర్థములు. కసుగందని = వాడిపోని, శీధుపానమ్ములు = సారాయము త్రాగుటలు, 'శీధు రిక్షురసైః పక్వై రపక్వై రాసవో భవేత్, మైరేయం ధాతకీ పుష్ప గుడధాన్యాంబు సంహితమ్. చెఱకు పాలతోఁ గాచిన సారాయము శీధు వనియు, కాఁచక సిద్ధము చేసినది ఆసవమనియు, ఆరెపూలు బెల్లము ధాన్యము (ధని యాలు) నీళ్ళు కలిపి కాఁచినది మైరేయ మనియుఁ బేరు. స్నానలేపములు=స్నానము చేయునపుడు రుద్దుకొను నలుగుపిండులు, ఎసకంబుగన్ = విస్తారముగ, సౌరభము = పరిమళము, మరుత్కిశోరముల్ =గాలిపిల్లలు.

తా త్ప ర్య ము.

మంచి వాసనగందము, వాడని పూలదండలు, సారాయిరసములు, సున్నిపిండి మొదలగు నలుగు పిండులు, క్రొత్త మంచి ధూపములు-వీనివలనఁ గలుగు మంచి వాసనలను విస్తారముగఁ గొని పిల్లగాలు లా విమానమ్మును మంచి సువాసనలతో నించు చుండెను.

క. నల్లని తెల్లని పచ్చని, మెల్లం బగు వన్నె లొప్పు♦మోహానవతు లం
దెల్లెడఁ గూర్కియుఁ గూర్కన, హల్లకలత లట్టు లొప్పి♦రంగజుగాసిన్. ౩౩౮

అర్థములు. నల్లని తెల్లని పచ్చని మోహానవతు లనుటచే నానా దేశస్త్రీలు చెప్పఁబడిరి. హల్లకలతలు= తామరతీఁగలు.

తా త్ప ర్య ము.

నల్లని - తెల్లని - పచ్చని వర్ణముగల స్త్రీ లందంనుఁ గామ కేళియం దలసిన వారై నిద్రించు తామరతీఁగలవలెఁ బడి నిద్రపోవుచుండిరి.

—♦ పరాంగనాదర్శనంబునకు హనుమంతుఁడు చింతించుట. ♦—

క. అంతయు దశకంధరు నే, కాంతగృహం బిటులు కడిగి♦గాలించియు భూ
కాంతాత్మజ యడపొడ గన, కెంతయుఁ జింతించె వాన♦రేశ్వరుఁ డాత్మన్. ౩౩౯

అర్థములు. ఏకాంతగృహము = అంతఃపురము, కడిగి గాలించి = చక్కఁగాఁ బరిశోధించి, అడపొడ= ఆకారముజాడ.

తా త్ప ర్య ము.

రావణాసురుని యంతఃపురమంతయు నిటుల చక్కఁగా శోధించి సీతాదేవి రూపముగాని యామె యుండు స్థలము జాడగాని తెలియక హనుమంతుఁడు మిగుల జింతించెను.

ఉ. అచ్చట నిద్దురించు కమ♦లాక్షుల నెల్లరఁ జూచి యయ్యయో
వచ్చెను ధర్మహాని పరి♦వారిజలోచన లందు నాదుచూ
పెచ్చట నేని వర్తిలద♦యిచ్చటిమేడలఁ గూర్కు కాంతలన్
బొచ్చెము మీఱఁ జూచితిని♦బోవఁగఁ ద్రోచితి ధర్మమార్గమున్. ౩౩౮

తా త్ప ర్య ము.

అక్కడ నిదురించుచున్న స్త్రీలను పైటలు దొలఁగిన వారిని చీరలు దొలఁగిన వారిని తక్కిన వారి నందఱను జూచి యయ్యో నే నెంతటిధర్మ విరుద్ధమైన కార్యముచేసితిని. పరస్త్రీలయందు నాదృష్టి పాఱునదిగాదు. అటులుండ నిప్పుడు మేడలందు నొడలెఱుఁగక నిద్రించు స్త్రీలను గపటవిధముగఁ జూచితిని. నిద్రించుస్త్రీలనునందుఁ బరస్త్రీలను అందుమోహము తెలియక చీరలు తొలఁగిపడి యుండు స్త్రీలను జూడరాదను ధర్మమునకు హాని కలిగించితిని. 'నేక్షేత్కారం న నగ్నాం స్త్రీమ్'.

క. పరదారల నెయ్యెడనే, నరసి కనుట ఘోరపాప♦మందును నిద్రా
పరవశులై యొడ లెఱుఁగని, పరసతులంగంటి నెంత♦పాపం బకటా. ౩౩౯

అర్థములు. దారలను=భార్యలను.

తా త్ప ర్య ము.

మేలుకొని తిరుగుచున్నప్పుడే పరుల భార్యలను మోఁకాటికి మీఁదఁ బాలించి చూడరాదు. అది మహా పాపకార్యము. అటులుండ నిద్రచేఁ బరవశులై దేహము లెఱుఁగక యుండు పరస్త్రీలను జూచితిని. అయ్యో! యెంతపాపము చేసితిని.

తే. అనుచుఁ దలపోయుచున్న మ♦హాత్మునకును, నిశ్చితైకాంతమతికి ని♦ర్నిద్రగతికిఁ
గార్యనిశ్చయదర్శన♦క్షమమునైన,బుద్ధి జనియించెఁ గ్రమ్మఱ♦బూతగతిని. ౩౪౦

అర్థములు. మహాత్మునకు = గొప్ప మనస్సు గలవానికి, జితేంద్రియునకు, నిశ్చిత + ఏకాంత + మతికిన్ = నిశ్చయించుటే స్వభావము గాఁగల మనస్సుగలవానికి, 'వ్యవసాయాత్మికా బుద్ధిరేకేహ కురునందన' యన్నట్టు - ఏకాంతము=ఏక + అంతము = ఒకటే అంతము గాఁగలది. అనఁగా నిటునటు చలింపని, మతికిన్ = మనస్సుగలవానికి. సీతాదేవిని జూచుటయందే మనస్సంతయు నిశ్చయమై యుండుటచే నెవతెను జూచినను 'ఈమె సీతయా, ఆమె సీతయా, యని సీతాదేవియందు దృష్టి, సీతాదేవి స్మరణము తప్ప వేఱు భావము వేఱు దృష్టి లేనివాఁడని భావము. ఆ కారణముచేతనే, నిర్నిద్రగతికి = హెచ్చరికతోఁ గూడిన గమనము గలవానికి, అనఁగాఁ బ్రతిస్త్రీయొద్దకుఁ బోయి యవయవ పరీక్ష చేయలేదు. అవును గాదని నిశ్చ

యించుకొనుటకు నెంతకావలయునో యెంతవఱకుఁ బోవచ్చునో యంతమాత్రమే పోవుచుండెను. కార్యనిశ్చయ దర్శన క్షమము = చేయవలసిన కార్యము నిశ్చయించి తీర్మానింప సామర్థ్యము గలది. ఈ సందేహముచేఁ బని చాలించిన యెడలఁ దాను బూనిన కార్యము చెడిపోవును. అట్లు కార్యము చెడిపోకుండఁ జేయు బుద్ధి- పూతగతిని = పవిత్రమైన విధముగ.

తాత్పర్యము.

అని యాలోచించు గొప్పమనస్సుగలట్టియు, నిశ్చయింపఁబడిన యేకాంతమైన మనస్సుగలట్టియు, హనుమంతునకుఁ బవిత్రమైన మార్గమున నిది చేయఁదగినది, యిది చేయరానిది యని నిశ్చయించి తీర్మానింప సామర్థ్యము గల బుద్ధి మరలఁ గలిగెను. చేసిన పని తప్పొ యొప్పొ యని మనస్సు సందేహించును. దానిని నిర్మలబుద్ధి యించుచున్నది.

ఉ. కాంచితి రావణాసురుని ♦ కాంతల నెల్లర నైన నేమి నా
కించుకయైన బుద్ధి చలి ♦ యింపద; యింద్రియవర్తనంబు సా
గించుఁ గదా మనంబు గడుఁ ♦ గీడున కేనియు మేలు సేఁతకే
నెంచగ నట్టి నా మన మొ ♦ కింతయుఁ గ్రాలదు సాభిలాషమై.　　౩౪౧

తాత్పర్యము.

రావణాసురుని స్త్రీల నందఱను జూచితిని. చూచుటచే వచ్చిన హాని యేమి? నా బుద్ధి కొంచెమైనఁ జలించినదికాదు. పాపకార్యమందో పుణ్యకార్యమందో యింద్రియ వ్యాపారము జరుపునది మనస్సు. చూచినంత మాత్రమున వినినంత మాత్రమునఁ బుణ్యముగాని, పాపముగాని రాదు. మనసు పాపాభిలాషగల దయ్యెనేని ప్రత్యక్షముగఁ జూచినను జూడకున్నను బాపము వచ్చును. పుణ్యాభిలాషగల దయ్యెనేని పుణ్యము వచ్చును. ఏ యభిలాష లేకున్నవారి కేదియు రాదు. 'మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః' యని కలదు గదా. కావున మనోవ్యాపారము ప్రధానము, గాని యింద్రియవ్యాపారము మాత్రము ప్రధానము గాదు. అట్టి నా మనస్సు నందు నభిలాష యనునది లేదు. నేను వీరిని గామాసక్తిని జూడను లేదు. చూచిన కారణముచేఁ గామ ముదయింపను లేదు. ఇఁక నాకేమి భయము.

ఉ. ఇయ్యెడఁ గాక యింకెచట ♦ నే వెదకందగు భూమికన్యకన్?
దొయ్యలులందుఁ గాక యెచటఁ ♦ దొయ్యలి యుండఁగ నేర్చుఁ జూడఁగా?
నెయ్యది జాతి దేని కది ♦ యేర్పడ నందులఁ గాదె రోయనౌ;
నెయ్యెడ నష్టకాంత నగు ♦ నే నెమకం జని జింకమందలన్.　　౩౪౨

తాత్పర్యము.

ఈ విచార మేల. ఇది విడిచి మఱియొకచోట వెదుకుదమందునా? ఆఁడుది యాఁడువారి యందుండక మఱి యెందుండఁ గలదు? ఏ జాతి వస్తువును ఆ జాతిలో

వెనకవలయును గాని వేఱొక జాతిలో వెదకిన లాభ మేమి? పోయిన యావును నాలమందలోఁగాక మఱి యే పశువుల మందలో వెదకిన దొరకును. అట్టిదే కాన రాని స్త్రీ స్త్రీల గుంపులోఁ గాక జింకమందలో వెదకవచ్చునా? కావునఁ గర్తవ్యమును జేయవలయును, మానరాదు. నిష్కాముఁడనై చేయవలయును. అది యకార్యమైనను బాపము రాదు. శ్రీకృష్ణభగవానుఁడు అర్జునున కుపదేశించిన దాని సారాంశమిదియే. అకార్యమో సుకార్యమో చేయవలసివచ్చినప్పుడు చేయవలయును. నిష్కాముఁడై చేయవలయునుగాని కర్మము స్వరూపత్యాగము చేసెద ననరాదు. పరస్త్రీదర్శనము పాప మను సామాన్యశాస్త్రవిధి ననుసరించి హనుమంతుఁడు సీతాన్వేషణకార్యము చాలించియుండిన నేది యెట్లయి యుండునో యూహింపవచ్చును. కావునఁ గామము త్యాజ్యము గాని కర్మము త్యాజ్యము గాదు.

క. శుద్ధం బగు మనమున నే, శుద్ధాంతం బెల్ల వెదకి♦చూచితి నధిక
శ్రద్ధను నెచ్చటఁ గానను, నద్ధారిణితనయ ననుచు ♦ నాతఁడు మఱియుఁన్. ౩౪౩

అర్థములు. అద్ధారిణితనయ – అద్ధారిణి, ఇబ్బంగి యని రూపము రాదు. రావలయు నని కొందఱు సందేహించిరి గాని యీ విషయము తొలుత సులభవ్యాకరణము పరిష్కరించెను. తరువాతఁ బండితులు దానినే తమ వ్యాఖ్యానాదుల నామోదించిరి. చూ. సు. వ్యా. సమాస. ౩౬ సూ.

తాత్పర్యము.

నేను నిష్కల్మషమైన మనస్సుతో నంతఃపురమంతయు మిగుల శ్రద్ధతో వెదకితిని. సీతాదేవి యెచ్చటను గానరాలేదు, అనుకొని మఱియు హనుమంతుఁడు,

తే. నాగకన్యల యందును ♦ నాకకన్యలందు గంధర్వకన్యల♦యందు వెదకెఁ
గాని కానక సీతఁ ద♦త్పానశాల,విడిచి యంతఃపురంబున ♦ వెదకె మరల. ౩౪౪

తాత్పర్యము.

నాగకన్యకలందును, దేవతాస్త్రీలయందును, గంధర్వస్త్రీలయందును, మరల వెదకెఁ గాని సీత గానరాలేదు. కావున నా పానశాల విడిచి మరల నంతఃపురంబున వెదకెను.

—♦ ౧౨-వ సర్గము. హనుమంతుడు సీతాదేవిని గానక విచారపడుట ♦—

క. ఆ యంతిపురము నడుమ ల. తాయతనంబుల విచిత్రి♦తాయతనములన్
వాయుతనూజుఁడు వెదకియు, మాయురె! కనఁ డయ్యె రాము♦మహిళామణినిన్.

అర్థములు. లతాయతనంబులన్ = తీఁగల యిండ్లయందును, విచిత్రితాయతనములన్ = చిత్రముల నలంకరింపఁబడిన యిండ్లయందును, మాయురే = ఆశ్చర్యార్థకము.

తాత్పర్యము.

ఆ యంతఃపురము నడుమ తీఁగలచే నేర్పఱుపఁబడిన యిండ్లయందును, చిత్ర

ములచే నలంకరింపఁబడిన యిండ్లయందును నెంత వెదకినను హా! సీతాదేవి కానరాలేదు.

క. స్వాంతమునం దీ విధమున, జింతించెను రాముదేవి ♦ సీతను గన నే
నెంతయు వెదకితిఁ దత్సతి, యంతముగనెఁ గాక యున్న ♦ నగపడ కున్నే ? ౩౮౬

తా త్ప ర్య ము.

అప్పుడు హనుమ తన మనస్సున నిట్టు లాలోచించెను. శ్రీరామచంద్రమూర్తి భార్యను సీతాదేవిని జూడవలయు నని నే నెంతో వెదకితిని. కానరాలేదు. ఆమె మరణించెనేమో, అటుగాకున్నఁ గానరాక యుండునా ?

క. కా కున్న రాక్షసేంద్రుం, డాకట ! నిజశీలరక్ష♦ణాసక్తను స
ల్లోకనుత సుగుణ, సీతఁ జి,రాకున వధియించె నేమొ ♦ క్రౌర్యరతుండై. ౩౮౭

అర్థములు. నిజశీల రక్షణాసక్తను = తన పాతివ్రత్యమును రక్షించుకొనఁ గోరు దానిని, చిరాకునన్ = కోపముచే.

తా త్ప ర్య ము.

ఆమె తానై యాత్మహత్య చేసికొని యుండునా ? ఉండదు. అటుకాని యెడల నయ్యో! తన పాతివ్రత్యమును రక్షించుకొనుటయం దాసక్తి గలదియును, ఆ కారణముచే సత్పురుషులచే స్తోత్రము చేయఁబడు సుగుణములను గలదియును, నగు సీతను తన కోర్కి నెఱవేర్ప లే దను కారణముచేఁ గ్రూరుఁడై రావణుఁడు చంపెనేమో!

చ. కనుఁగొన ఘోర మహా వికృత♦కాయములం బెదపెద్ద మోములన్
ఘనములు దీర్ఘముల్ గడువి♦కారము లై భయపెట్టు కన్నులన్
దనరిన రాక్షసాంగనల ♦ దైన్యమునం గని బెగ్గడిల్లి యా
జనకతనూజ దేహమును ♦ జయ్యన వీడెనొ యేమి చేయుదున్. ౩౮౮

తా త్ప ర్య ము.

కామాసక్తుఁడై తెచ్చినవాఁడు తన కామమును నయభయముల నెట్లైనఁ దృప్తిపడఁ జేసికొనఁ గోరునుగాని, హింసించిన నేమిలాభము పొందఁగలఁడు. కావున వాఁడు హింసించి యుండఁడు. భయంకరములై, వికారములైన దేహములును, పెద్దపెద్దముఖములును, పెద్దవియు దీర్ఘములు నైన కన్నులును గల రాక్షసస్త్రీలఁ జూచి భయపడి సీతాదేవి ప్రాణములు వదలిపెట్టెనేమో. నే నేమి యిప్పుడు చేయుదును?

ఉ. సీతను జూడ లేక మును ♦ చెప్పిన బీరము లెల్లఁ దీర్ప కే
రీతినిఁ గ్రుప్తకాలముఁ బొ♦రింబొరి మీఱఁగ భానుపుత్త్రు మో
మే తగ వెంచి చూచుటకు ♦ నేగుదునో ? బలియుం డతండు నా
జ్ఞాతిచరిష్ణులం గినిసి ♦ యంతన దండన చేయకుండు నే. ౩౮౯

అర్థములు. బీరములు = పౌరుష వాక్యములు, ఆజ్ఞాతి చరిష్ణులన్ = ఆజ్ఞ మీఱి చరించువారిని, కినిసి = కోపించి.

తాత్పర్యము.

సీతను జూడలేక మునుపు చెప్పిన పౌరుష వాక్యముల నెల్ల నెఱవేర్పక సుగ్రీవుడు పెట్టిన గడువుమీఱి యాయనను జూచుటకు నేమి ధర్మము ననుసరించి పోదును? పోయితినిబో యతఁడు బలవంతుఁడు; తనయాజ్ఞ మీఱి వర్తించిన వారిని దండింపక విడుచునా?

క. చూచితి నంతిపురంబును, జూచితి దశకంఠు సకల♦సుందరులను సీ
తాచపలాక్షిమణి దా, నే చోటను లేదు శ్రమము ♦ వృథ వోయెఁ గదే. ౩౫౦

తాత్పర్యము.

అంతఃపురమును జూచితిని. రావణాసురుని స్త్రీల నందఱఁ జూచితిని. ఎక్కడ సీతాదేవి కానరాలేదు. నేను జేయవలసిన కృషియంతయుఁ జేసితిని. శ్రమయంతయు వ్యర్థమయ్యెఁ గదా.

ఉ. ఏమి యొనర్చితో హనుమ! ♦ యేది ధరాసుత ? యన్నఁ గ్రోతు లే
నేమని యుత్తరం బిడుదు ♦ నేగి సురారిపురంబుఁ జొచ్చి శ్రీ
రాముని దేవిఁ గాన కిటు ♦ గ్రమ్మఱితిన్ వృథ యంచు నందునా ?
హా! మరణించు వానరచ♦యంబులు నే నిట నాలసించినన్. ౩౫౧

తాత్పర్యము.

వానరుల యెదుట నన్ని పౌరుషములు పలికితిని గదా! ఇప్పుడు నేను మరల పోఁగానే హనుమంతా! యేమి చేసి వచ్చితివి? సీతను దెచ్చెద నంటివే. ఏదీ సీత యని క్రోఁతులందఱ అడిగిన నే నేమని ప్రత్యుత్తర మిత్తును. పోయితిని, లంకలో వెదకితిని, కానరాలేదు, పోయినవాఁడను బోయినట్లు మరలి వచ్చితి నందునా? ఎట్లందును? కావున నేను బోను. ఇందే యుందును. ఇందు నెంతకాల మని యుందును? నేను ఆలస్యము చేసితినా? హనుమంతుఁడు రావణునిచే హతుఁడయ్యెనో మఱి యేమయ్యెనో, కావున నే రాలేదు. మనము బ్రతికి లాభ మేమి? సుగ్రీవుని చేతిలోఁ జచ్చుటకు మాఱు ప్రాయోపవేశమున నిందే మరణింత మని యందఱు నిశ్చయముగఁ జత్తురు.

ఉ. ఆవలియొడ్డు చేరఁ గపు ♦ లందఱు గుంపుగఁ గూడి జానకీ
దేవిని గాన నైతి ననఁ ♦ దెల్పుచు నా జననంబు భంగిఁ దా
వావిరి మెచ్చినట్టి గుణ♦వంతుఁడు వృద్ధుఁడు జాంబవంతుఁడున్
శ్రీవిభవుండు నంగదుఁ డి♦సీ యనరే ప్లవగాగ్రగణ్యులున్. ౩౫౨

తాత్పర్యము.

కావున నేనిచ్చటఁ దడయ రాదు. మరలి పోవలసినదే. పోయితినిబో-అందఱు వానరులు గుంపులై వచ్చి జానకీదేవిని నేను జూడలేదు. అని చెప్పఁగానే నేను బుట్టిన

విధము- అప్పుడు నేను జేసిన కార్యము శ్లాఘించి శ్లాఘించి చెప్పిన గుణవంతుఁడు పెద్దవాఁడు నగు జాంబవంతుఁడు అంగదుఁడు ఇంకను వానరముఖ్యులు ఛీఛీయనరా.

—♦ హనుమ యుత్సాహంబు వహించి మరల సీతాదేవిని వెదకుట. ♦—

శా. ఉత్సాహంబె సిరిం ఘటించు మఱి యా♦యుత్సాహమే సౌఖ్య మా
నుత్సాహంబె సతంబు నెల్ల కెలసం♦ బొప్పారఁగాఁ దీర్చు నా
యుత్సాహంబు నె యాశ్రయించి పనికై♦ యుంకింతు నిం కొక్కమా
టుత్సాహంబుఁ ద్యజింతురే పనికి ను♦ద్యోగించు ధీరాత్మకుల్. ౩౫౩

అర్థములు. కెలసము = కార్యము, ఉంకింతుఁ = ప్రయత్నింతును. త్యజింతురే = వదలుదురా. ధీరాత్మకుల్ = ధైర్యవంతులు.

తాత్పర్యము.

కావున నే నిందుండను రాదు. వ్యర్థుఁడ నైపోనురాదు. ఈ విధముగ నే నధైర్య పడనురాదు. కార్య మెట్టులైన సాధింపవలెను. కార్యసాధనమునం దుత్సాహము ప్రథమసాధనము. దానిని విడిచి నే నేమి చేయఁగలను. సంపద సంపాదించి యిచ్చునది యుత్సాహమే. ఉత్సాహమే సౌఖ్యము. ఆ యుత్సాహమే సకల కార్యముల నెఱవేర్చును. కావున నా యుత్సాహము నాశ్రయించి మఱియొకసారి ప్రయత్నించెదను. కార్యము చేయు ధీరు లుత్సాహమును వదలుదురా.

"క్లైబ్యం మా స్మగమః పార్థ, నైతత్త్వ య్యుపపద్యతే
క్షుద్రం హృదయ దౌర్బల్యం, త్యక్త్వోత్తిష్ఠ పరంతప."

అను భగవద్వాక్యము స్మరించునది.

ఉ. చక్కఁగఁ జూతు వెండి యొక♦సారి సురారిసురక్షితంబు లౌ
నిక్కవ లెల్లఁ బానగృహ♦ మేడ్తెఱఁ జిత్రగృహాళి తోఁటలుం
జక్కని కేళిశాలలును♦ సందులు వీథులు నవ్విమానముల్
దక్కక యుండ నొక్కటియుఁ♦ దత్పరవృత్తి నటంచు నెంచుచుం. ౩౫౪

అర్థములు. ఇక్కవలు = ప్రదేశములు.

తాత్పర్యము.

రావణాసురుఁడు రక్షించు ప్రదేశము లన్నియు మఱియొకసారి చూచెదను. అని పానగృహములు చిత్రగృహములు తోఁటలు కేళిశాలలును సందులు వీథులు విమానములు నన్నియు నొక్కటియైన విడువక నదియే పనిగా వెదకెదను అని యాలోచించుచు;

చం. వెదకుటకుం గడంగెఁ బృథి♦వీగృహవర్గము చైత్యగేహముల్
సదనసమీప కేళివన♦శాలలు నొండొకచోట నెక్కు వే
ఱుదలల డిగ్గుఁ దాఁ బలుమ♦ఱుం జనుచోటికె పోవు ద్వారముల్
వరలిచి దల్పులుం దెఱచి♦ వచ్చును బోవును నెక్కు దూఁకెడిం. ౩౫౫

అర్థములు. పృథివీ గృహావర్గము = భూమిలోనుండు నిండ్ల సమూహము, నేల మాళిగలు, చైత్యగేహములు=నాలుగు వీథులు కలియుచోట నుండు నిండ్లు- సదన సమీపకేళి వనశాలలు = రావణు నింటికి సమీపమున నుండు నాటపట్టులు.

తా త్ప ర్య ము .

వెదుకఁ బ్రారంభించెను. నేలమాళిగలు, నాలుగు వీథులు కలియుచోట నుండుమందిరములు, రావణుని యింటిసమీపమున నుండు నాటపట్టులు-చూడ నారంభించి యొకచోట మెట్లెక్కును, ఒకచోట దిగును. పోయినచోటికే పోవును, వాకిండ్లు గడియలు దీసి తలుపులు దెఱచి వచ్చును, బోవును, నెక్కును, దూఁకును.

తే. కొంచె మైనను విడక శో♦ధించె హనుమ, రావణాసురు నంతిపు♦రంబునందు
నాలుగంగుళముల యేని♦గాలికొడుకు, చొచ్చి చూడని దేశ మ♦చ్చోట లేదు.

తా త్ప ర్య ము .

ఈప్రకారము వదలక రావణుని యంతఃపురమంతయు శోధించెను. ఆ యంతఃపురమున హనుమంతుఁడు చొచ్చి చూడని ప్రదేశము నాలుగంగుళముల మాత్ర మైనను లేదు.

సీ. ప్రాకారములు నడి♦బాటలు వేదికల్, దిగుడుబావులు సర♦స్తీరములును
వివిధవికారరూ♦పవిశేషలను సోఁకుఁ, జెలువలఁ గనె నందు ♦ సీత లేదు
అసమానసౌందర్య ♦ లసమానవిద్యాధ, రీతతు లందు శ్రీ♦సీత లేదు
పూర్ణచంద్రాస్యలా♦భోగినులం దంద, గత్తెలలోన భూ♦కన్య లేదు
తే. పంక్తికంఠుఁడు బలిమిని ♦ బట్టి నట్టి, నాగకన్యలలోన జా♦నకియ లేదు
సుందరుల నటఁ బెక్కుఱఁ ♦ జూచెగాని, కమలలోచన మైథిలి ♦ గానరాదు. ౩౯౭

అర్థములు. సరస్+తీరములు = కొలఁకులయొడ్డులు, సోఁకుచెలువల్ = రాక్షసస్త్రీలను.

తా త్ప ర్య ము .

ప్రాకారములు, ఇండ్లకు నిండ్లకు నడుమ నుండు వీథులు, అరుఁగులు, దిగుడు బావులు, కొలఁకుల యొడ్డులు, నానావిధ వికారవేషములు గల రాక్షసస్త్రీలను జూచెఁగాని యందెందును సీత లేదు. అసమానమైన చక్కఁదనముచేఁ బ్రకాశించు విద్యాధరస్త్రీలను జూఁచెగాని, వారియందు సీత లేదు. నిండుపున్నమనాఁటిచంద్రుని వంటి ముఖములు గల భోగినీస్త్రీల యందందగత్తెలలో సీత లేదు. రావణుఁడు బలాత్కారముగాఁ బట్టి తెచ్చిన నాగకన్యక లందు సీతమాత్రమే లేదు. అందు సుందరుల నెందఱినో మరున్నందనుఁడు చూచెఁగాని భూనందన గానరాలేదు. ఇందుఁ జెప్పఁబడినవారు మునుపు చెప్పఁబడిన రావణున కనుకూల లగు స్త్రీలుగారు. బలాత్కారముగఁ దెచ్చి, వారు వశపడమిని నందఱ వేఱొకచో వేసియుంచెనని యేర్పడుచున్నది. రెండవపాదమునఁ జెప్పఁబడినవారు కావలియుండు స్త్రీలు.

ఉ. ఇంతయుఁ జూచి యా హనుమ♦యెంతయు దుఃఖ విషాదసంభ్రమ
స్వాంతత వంది కుందుచును♦వానరవర్యుల యెత్తికోలు వి
క్రాంతి సముద్రలంఘనము♦గాంచి వృథా చనుటల్ మనంబులో
మంతన ముండి డిగ్గెను వి♦మానవరంబుఁ దటిజ్జవాఢ్యుఁడై. ౩౫౮

అర్థములు, ఎత్తికోలు = ప్రయత్నము, విక్రాంతి = పరాక్రమముచే, మంతనముండి=ఆలోచించి.

తాత్పర్యము.

ఈవిధముగ రావణునికి ననుకూలలైనస్త్రీలను, ప్రతికూలలైనస్త్రీలను, అంద అనుజూచి సీతగానరామిని మిగుల దుఃఖము, శోకము, సంభ్రమము చెందినమనస్సు గలవాఁడై వ్యసనపడి వానరశ్రేష్ఠుల ప్రయత్నము, పరాక్రమించి తాను సముద్రమును దాఁటుట యంతయు వ్యర్థమై పోవుట యాలోచించి మెఱుగు మెఱసినట్లు శీఘ్రముగ నా విమానము దిగెను.

—♦౧౩-వ సర్గము. హనుమ ప్రాకారంబుఁజేరి సీతాదేవి గానరామికి వ్యసనపడుట♦—

క. ప్రాకారము మీఁదికి జని, కాకుత్థ్సకులాభరణుని♦కాంతామణి నా
లోకింపఁగఁ గానక చిం,తాకులితమనస్కుఁ డగుచు♦నంజనసుతుఁడున్. ౩౫౯

తాత్పర్యము.

ప్రాకారము మీఁదికిఁబోయి సీతాదేవిని జూడలేక హనుమంతుఁడు చింతచేఁ గలఁత నొందిన మనస్సుగలవాఁ డయ్యెను.

తే. కడిగి గాలించి చూచితిఁ గాని లంక
గుంటలును, జెర్వులును, గొలం♦కులును, నదులు
వంకలును, వాఁగులును, మలల్♦డొంక లెల్ల
తలములును దిమ్మఁదిరుగుచు♦ఫలము లేదు. ౩౬౦

తాత్పర్యము.

లంకలో నుండు గుంటలు, చెఱువులు, సరస్సులు, నదులు, వంకలు, వాగులు, కొండలు, డొంకలు సమస్తప్రదేశములు దిమ్మఁదిరుగుచుఁ గడిగి గాలించి చూచితినిగాని వ్యర్థ మయ్యెను.

క. కానను గావై దేహిని, దానవవరు నింటఁ గలదు♦ధరణిజ యనుచుం
దా నాడఁడె సంపాతియు, జానకి యిట లేద యేమి♦సలుపుదు నింకన్. ౩౬౧

తాత్పర్యము.

సీతను జూడలేక పోయితిని. సీతాదేవి రావణు నింటనున్నది యని సంపాతి నమ్మకము చెప్పెను. ఇచ్చటఁ గానరాలేదు. ఏమిచేయుదును? అతఁడసత్య మాడెనందునా? అంతటి యకార్య మతని కేలకలిగెను? దాని వలన నతనికి రాఁగల లాభ మేమి? కాఁబట్టి యిందే యామె యుండవలె; నెందున్నదో!

క. జనకజ మైథిలి రాముని, వనిత విదేహభవ సీత♦వశమతి దుష్టున్
దనుజున్ మనుజాశను నే, మనుచుం గామించు నట్టి♦యాగడ మున్నే. ౩౬౨

అర్థములు. జనకజ = జనకరాజుకూఁతురు, 'కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయ' యన్నట్లు సదాచార సంపన్నులలో నుత్తముఁడైన వానికూఁతురు. కులముఁ బట్టి గుణములు. అట్టివాని కూఁతురు రావణునకు లోఁబడునా? మైథిల = ఆయనయొక్కఁడే కాదు 'యథారాజా తథాప్రజా' యన్నట్టు లాదేశము వారందఱు నట్టివారే. అట్టిమిథిలయందుఁ బుట్టినది. అట్టి సదాచార సంపన్ను లుండెడి చోట దుష్టస్త్రీ పుట్టునా?

పుట్టినయింటి సమాచార మిట్టుండ మెట్టిన యింట రామునివనిత. ధర్మ విగ్రహమగు రామచంద్రుని భార్య. గుణవత్సంబంధముచేతఁ బరుసవేదిచే నినుము బంగారమైనట్లు చెడువారుకూడ మంచివారగుచుండ బంగారినుమగునా? విదేహ భవ=విదేహులు = దేహాభిమానము లేనివారు, బ్రహ్మజ్ఞాన పరాయణులు. అట్టి దేశము విదేహదేశము. అట్టిదేశమందుఁ బుట్టిన సీత, తుచ్ఛమైన దేహసౌఖ్యము నకై చేయరానిపని చేయునా? సీత = అందు మనుష్యస్త్రీలు పుట్టినట్లు పుట్టినది కాదు. అయోనిజ – కావుననే అమానవి – అట్టిది యకార్యము చేయఁబూను కొనునా? వశమతి=తన మనస్సును దన స్వాధీన మందుంచుకొనలేక– దుష్టున్ = దోషకార్యములే చేయువానిని, దనుజున్=రాక్షసుని, మనుజాశనున్ = మనుష్యులను బీఁకితినువానిని, దుష్టు ననుటచే దుష్టస్వభావము– దనుజున్– అనుటచే దుష్టజాతి– మనుజాశనుని అనుటచే క్రియయుఁ, జెడ్డది. మనుష్య స్త్రీ మనుష్యులఁ దిను వానిని గామించునా? ఆగడము = విపరీతవర్తనము, ఉన్నే = ఉండునా? – ఉండదు.

తాత్పర్యము.

రావణాసురునకు వశపడుటచే వాఁడామెను వీరిలోఁ గలుపక మఱి యెందైన నుంచినాఁ డనుకొందునా? ఛీ ఛీ యదియేమి యాలోచన. జనకరాజు కూఁతురు, మిథిలయందుఁబుట్టినది, రామునిభార్య, విదేహసంబంధముగలది, భూమియందుఁబుట్టి నది, సీతయను పేరుగలది, కామవశురాలై గుణమున దుష్టుఁడు, జాతిచే నీచుఁడైన దనుజుఁడు, క్రియలచేఁ గ్రూరుఁడై మనుష్యులఁ దినువాఁడు నగువాని నేమని కామించును? అట్టి విపరీతముకూడ నుండునా? ఎప్పటికి నుండదు.

క. సీతఁ గొని రామమార్గణ, భీతి న్వడి నెగుర నసుర♦వీరుఁడు నీరే
జాతాక్షియు నడి క్రోవను, భీతిం బడిపోయె నోటు♦భీరువుగానన్. ౩౬౩

అర్థములు. మార్గణ = బాణములవలని, భీతిన్ = భయమున, భీరువు = పిఱికిది.

తా త్ప ర్య ము.

సీతాదేవి యిదు లేదాయె, నందు లేదాయె, నడుమ నెక్కడ బోయె నందునా, రావణుఁడు రామ బాణములకు భయపడి సీత నెత్తుకొని యాకాశమున నెగురునప్పుడు భయశాలిని కావున సీత నడిత్రోవలోఁ బడిపోయె నేమో.

ఉ. అట్టులుగాక యున్న ఖచ♦రాధ్వమునం జనుచోట రావణుం
డిట్టల మైన భీతి మిథి♦లేశ్వరుకన్యక యబ్ధిలోన లోఁ
దొట్టిన నివ్వెఱం బడెనొ ♦ తోరపువేగము సైఁప లేక తా
నెట్టన మే న్వణంక ధృతి♦నిల్పఁగ నేరక మేను వాసెనో? ౩౬౪

అర్థములు. ఖచరాధ్వమునన్ = ఆకాశమార్గమున, ఇట్టలమైన=అధికమైన, దృఢమైన, 'తలఁకెడువాఁడు గాఁడు భగదత్తుఁడు భీమతనూజుతోడ నిట్టలముగఁ బోరఁజాలు నకటా కరి యోరువ దేమి సేయు' భార. నివ్వెఱన్ = పారవశ్యముచే.

తా త్ప ర్య ము.

అట్లు త్రోవలోఁ బడిపోక యుండినచో రావణుఁ డాకాశమార్గమునఁ బోవునపుడు సీత నిండారు భయముచే సముద్రమును జూచి భయపడి పరవశురాలై దానిలోఁ బడిపోయెనేమో! అటుగాక యుండెనా, వాఁడుపోవు వేగమును సైరింప లేక ధైర్యము విడిచి వణఁకుచు నాకాశమందే దేహమును విడిచెనేమో.

క. రాముని రాకావేళా,సోముని నిరసించు ముఖము ♦ సురుచిరకంజా
తామలదళనయనములను, వేమఱు స్మరియించుకొనుచు ♦ విడిచెనొ మేనిన్.

అర్థములు. రాకావేళాసోముని=నిండుపున్నమనాఁటి చంద్రుని, రాక= పదునాఱు కళలు గల చంద్రుని గల రాత్రి.

తా త్ప ర్య ము.

అటుగాక యుండెనా, రాముని నిండు పున్నమనాఁటి చంద్రునిఁ దిరస్కరించు ముఖమును, మనోహరములైన కమలముల రేకులవంటి కన్నులను స్మరించుచు ప్రాణము విడిచెనేమో.

సీ. చుట్టపక్కములు లే♦నట్టి సాధ్వి సుశీల, సీత రావణుఁడు భ♦క్షించె నేమొ?
యీసున రావణు ♦ నిల్లాండ్రు రసఘాత్మఁ. బట్టి భక్షించిరో ♦ పాపరతులు?
హా! రామ! హా!లక్ష్మ♦ణా!హా!యయోధ్య! యం,టుచు నేడ్చుచుమర♦ణించెనొక్కొ?
పంజరంబున గోరు♦వంక నా నసురుండు, నేలమాళిగ నుంచి ♦ యేలు నేమొ?
ఆ. జనకరాజతనయ ♦ సాధ్వి సుమధ్యమ, రాము పత్ని సీత ♦ రావణాసు
రాధిపతికి నెట్లు ♦ స్వాధీన యయ్యెడు? నట్టి దెన్నఁడైన ♦ నగుట గలదె. ౩౬౬

అర్థములు. చుట్టపక్కములు = చుట్టములు+పక్కములు. ఒకానొకచో ద్వంద్వంబునఁ బూర్వపదంబు క్లీబసమం బగు. అగుచో నామువర్ణకమునకు లోపం

బగు (త్రి. స. ౭౯ సూ) పక్షశబ్దభవము పక్కము. ఈసున=సవతిమాత్సర్యముచే, సుమధ్యమ = సన్నని నడుము గలది.

తా త్ప ర్య ము.

సుగమము.

ఉ. దానవుఁ డింద యెయ్యెడనొ ♦ దాఁచెనొ, కాక సుశీల మిత్తికిన్
లోనయి పోయెనో వనధి♦లోఁ బడి భీతి? హృదీశకూటమిన్
మాని మనంగలేక మర♦ణంబునె తా శరణంబుఁ గాంచెనో
మానిని, యిష్టభార్యునకు ♦ మానుగ రామున కేమి చెప్పుదున్. ౩౬౭

అర్థములు. మిత్తికిన్=మృత్యువునకు, మనంగలేక=బ్రదుకలేక, ఇష్టభార్యునకు=భార్యయందుఁ బ్రేమ గలవానికి, ఇష్టురాలగు భార్యగలవానికి.

తా త్ప ర్య ము.

రావణుఁ డిందే యెందైన సీతను దాఁచెనో లేక పతివ్రత గావున రావణునకు వశపడక సముద్రములోఁ బడి నశించెనో, భర్త సాంగత్యమునువిడిచి బ్రదుకలేక తానే మరణించెనో, భార్యయందుఁ బ్రేమఁగల రామునకు నే నేమని చెప్పుదును?

—♦ { సీతాదేవి లేదని శ్రీరామునితోఁ జెప్పినఁ గలుగు ననర్థంబుల హనుమంతుఁడు యోజించుట. } ♦—

క. చెప్పిన ననర్థకం బగు, జెప్పమినిం దోష మెట్లుఁ ♦ జేకుఱుఁ గానన్
జెప్పుదమన; చెప్పకుందున? యిప్పగిది ఘటిల్లె విషమ ♦ మే మొనరింతున్.

తా త్ప ర్య ము.

సీత కానరాలేదని చెప్పితినా కీడు తప్పదు. చెప్పకుందునా దోషము తప్పదు. చెప్పినను గీడే, చెప్పకున్నను గీడే. చెప్పుదునా చెప్పకుందునా? విషమ సంకటము ప్రాప్తించెనే, యేమి చేయుదును?

క. అని యన్యోన్యవిరుద్ధము,గను దోఁప సమర్థ మగుచుఁ ♦ గాలార్హం బౌ
ఘననీతి యెద్ది యంచును, మనమునఁ దలపోయఁ దొడఁగె ♦మారుతి మఱియున్.

అర్థములు. అన్యోన్యవిరుద్ధము=ఒకదాని కొకటి సరిపడనిది.

తా త్ప ర్య ము.

ఏ యాలోచన చేసినను మనస్సునకు సమాధానము కుదిరినది కాదు. ఒక యాలోచనను బాధించు నాలోచన వేఱొకటి తోఁచుచున్నది. ఇట్టి సందర్భమందుఁ గాలయోగ్యమై కార్యసాధకమైన నీతి యెద్ది యని హనుమంతుఁడు మఱియు నాలోచింపసాగెను.

ఉ. ఏమిఫలంబు గల్గుఁ దర♦శేషుఁడఁ గానక నేను వానర
స్వామి పురంబుఁ జేరఁ జన ♦ వారిధి దాఁటుట, లంకఁ జొచ్చుటల్,

భూమిజ రోయుటల్, దనుజ♦పుంగవులం గనుటల్, వృథా చనన్
భూమిజఁ గాన కే మనుచుఁ♦బోవుదుఁ బుణ్యమొ పూరుషార్థమో. ౩౨౦

అర్థములు. తరళేక్షణ = చలించు కన్నులు గలది — సీత.

తాత్పర్యము.

నేను గిష్కింధకుఁ బోయెద ననుకో, దానివలన రాఁగల లాభమేమి? సముద్రము దాఁటుట, లంకఁ బ్రవేశించుట, సీతను వెదకుట, రాక్షస శ్రేష్ఠులఁ జూచుట యివన్నియు వ్యర్థమైపోవఁగా సీతను జూడక యక్కడికిఁ బోయిన పుణ్యమా, పూరుషార్థమా? ఫలహీనమైన కష్ట మేటఁ జేసిన కృషియేగదా.

ఉ. ఏ మన యందురో వనచ♦రేశ్వరులున్ రవిజుండు నేఁ జనన్
రాముఁడు లక్ష్మణుండుఁ గన♦రాదు సుఁడీ జనకాత్మజాత నా;
రాముఁడు ప్రాణముల్ విడుచుఁ♦ గ్రచ్ఛలఁ, గ్రూరము తీక్ష్ణ మింద్రియ
స్తోమసుతాపనంబు చెవి♦సూఁడు నుడుల్ వినియున్ సహించునే? ౩౨౧

తాత్పర్యము.

నేను బోయి సీత గానరాలేదు అని చెప్పఁగానే వానర వీరులు సుగ్రీవుఁడు రాముఁడు లక్ష్మణుండు నన్నే మందురు? లేనివస్తువును జూడలేదని నన్ను దండింతురా? దండింపరు గాని రామచంద్రమూర్తియామాట చెవిలోఁ బడగానే వెంటనే ప్రాణము విడుచుట సిద్ధము. క్రూరమై తీక్ష్ణమై ఇంద్రియములకు సంతాపకరమై చెవులలో కరగించి పోసిన సీసమువంటి మాటలు వినియేమని ప్రాణము పట్టుకొని యుండఁగలఁడు?

క. మరణకృతనిశ్చయాత్ముని, వరగుణునిన్ రాముఁజూచి♦ భ్రాతృసుహృత్త్వ
స్ఫురితుం డగు సౌమిత్రియు, మరణంబును బొంద కేల ♦ మఱి జీవించున్. ౩౨౨

అర్థములు. మరణకృతనిశ్చయాత్మునిన్ = మరణింప నిశ్చయము చేసికొనిన వానిని; భ్రాతృసుహృత్త్వస్ఫురితుండు = అన్నయందు స్నేహభావముచే నిండి యుండు వాఁడు.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి మరణింపవలె నని నిశ్చయము చేసికొనఁగానే యాయన కంటెముందుగనాయనయందు నిండారు సోదరప్రేమగల లక్ష్మణుఁడు మరణించును, గాక యేల జీవించును. రాముని మరణమని వినుటకు కనుటకు ముందే యాయన ప్రాణములు పోవును.

క. అన్నయుఁ దమ్ముఁడుఁ జచ్చిన, యన్నుడి విన్నంతమాత్ర ♦ నట భరతుండున్
మున్నుగఁ బ్రాణము విడుచును, సన్నుతశత్రుఘ్నుఁడు బడిఁ ♦ జను దేరంగన్.

తాత్పర్యము. ౩౨౩

అన్నయుఁ దమ్ముఁడు మరణించిరని వినఁగానే యయోధ్యలో భరతుఁడు శత్రుఘ్నుఁడు తోడరాఁగా ముందుగనే ప్రాణము విడుచును.

కం. కొడుకులమరణము విని వగఁ, బడి కౌసల్యయు సుమిత్ర ♦ భరతుజననియున్
విడుతురు వెంటనె ప్రాణముఁ, బుడమిని జీవింప నెట్లు ♦ బుద్ధియుఁ బుట్టున్. 3౨౪

తా త్ప ర్య ము.

కొడుకులచావు విన్నంతమాత్రముననే కౌసల్యసుమిత్ర కైకేయియుఁజత్తురు. వారు కొడుకులఁ బోఁగొట్టుకొనియు బ్రదుక నెట్లు బుద్ధి పుట్టును?

క. కృత మెఱుఁగును సత్యముఁదన, మతిఁ బాయఁడు కపిభుండు ♦ మార్తండజుఁడున్
క్షితితనయావల్లభుఁ డా, గతిఁ బట్టుటఁ జూచి తాను ♦ గాలముఁ జెందున్. 3౨౫

తా త్ప ర్య ము.

పరులు తనకుఁ జేసినమేలు మఱువనివాఁడు, చెప్పినమాట దప్పనివాఁడునగు సుగ్రీవుఁడు రామచంద్రుని గతఁజూచి తాను మరణించును.

క. శోకోపహతయు భృశదుః, ఖాకులిత యపాస్తనిర్భ ♦ రానందమహా
శోకాకుల యయి రుమ పతి, శోకంబున మేను విడఁగఁ ♦ జూడక యున్నే. 3౨౬

అర్థములు. శోకోపహత = మగఁడు చచ్చిన శోకముచేఁ గొట్టఁబడినది, భృశదుఃఖాకులిత = మిగుల దుఃఖముచేఁ గలఁత నొందిన మనస్సుగలది, అపాస్త = పోయిన, నిర్భర = అధికమైన, ఆనంద = సంతోషము కలిగినది.

తా త్ప ర్య ము.

మగఁడు చచ్చిన శోకదుఃఖములచేఁ గలఁత పడిన మనస్సుగల రుమాదేవి దేహము వదలు నాలోచన చేయకయుండునా?

తే. వాలి మరణంబునకె కడు ♦ వగఁ గృశించు, తార సుగ్రీవుగతిఁజూచి ♦ తా నశించుఁ
దల్లియును దండ్రియును బిన్న ♦ తండ్రిచావఁ, జూచి యంగదుఁ డేటికిఁ ♦ బ్రోచు మేను.

తా త్ప ర్య ము.

వాలి చచ్చినాఁడని యేడ్చు తార సుగ్రీవుఁడుకూడఁ జచ్చుట చూచి తాను నశించును. తలిదండ్రు లిద్దఱు మరణించుట చూచి యంగదుఁడు నశించును.

చం. వనచరవీరు లెల్ల నిజ ♦ వల్లభసంస్థితి దుఃఖతప్తులై
ఘనతరముష్టిగాఢతల ♦ ఘాతములన్ నిహతోత్తమాంగులై
చనఁ జిరసాంత్వనాదృతులు ♦ చత్తు రరణ్యచరుల్ సపుత్రకుల్
వనచరు లార్తిఁ గూరి భృగు ♦ పాత మొనర్చి నిజప్రియాళితోన్. 3౨౭

అర్థములు. నిజవల్లభ సంస్థితిన్ = తమ ప్రభువు మరణించుటచే, ముష్టిఘాతములన్ = పిడికిళ్ళ గ్రుద్దులచే, తలఘాతములన్ = అరచేతి దెబ్బలచే, నిహతోత్తమాంగులై = పగులఁ గొట్టఁబడిన శిరస్సులు గలవారై, చిర = దీర్ఘకాలముగ, సాంత్వన = మంచిమాటలచే, ఆదృతులు = ఆదరింపఁబడినవారు, అరణ్యచరుల్ = అరణ్యమం దుండువారు, భృగుపాతము = కొండమీఁదనుండి క్రిందఁ బడుట, నిజప్రియా + ఆళితోన్ = తమ ప్రియురాండ్రతో.

తాత్పర్యము.

కిష్కింధయందుండు ముఖ్యవానరులందఱు తమరాజు చచ్చినాఁడన్న వార్త విన్నంతమాత్రముననే దుఃఖముచేఁ దపించినవారై గట్టిపిడికిళ్ళచేతను దృఢమైనయఱచేతి దెబ్బలచేతను దమ తలలు పగులఁగొట్టుకొని మరణింపఁగా నరణ్యమందుఁ జిరకాలముగ మంచిమాటలచే నాదరింపఁబడుచుండినవారు ఇఁకఁ దమ్ము నాదరించువారు లేమిని కొడుకులతోను బ్రియురాండ్రతోను గొండలమీఁదినుండి క్రిందఁబడి మరణింతురు.

క. శైలంబుల వివిధవనీ,వజాలంబులఁ గీశవరులు ♦ సంఘము లగుచున్
హాళిఁ జరింతురు తమి వాహ్యాళిం గ్రీడలను దుఃఖ ♦ తాత్మకు లగుచున్. ౩౮

అర్థములు. శైలంబులన్ = పర్వతములందును, వివిధ వనీ జాలంబులన్ = నానావిధములయిన యడవుల గుంపులందును, కీశవరులు = వానరశ్రేష్ఠులు, కీశ = 'కః' యనఁగా వాయువు. ఆయన కుమారుఁడు 'కి' యనఁగా హనుమంతుఁడు. ఆయనను ముఖ్యుఁడు గాఁగలవారు కీశులు, గురుబాల ప్రబోధికయం దిట్లుత్పత్తి వ్రాయఁబడెను గాని కీస్, కీస్ అనువారు గనుక కీసులయి రేమో యని తోఁచుచున్నది. వాహ్యాళి—వినోద సంచారము, తద్భవము వయ్యాళి.

తాత్పర్యము.

అట్లు చావఁగా మిగిలిన క్రోఁతులు కొండలందు నడవులందు గుంపులై దుఃఖముచే మునుపటివలె విలాసముగా సంచరింపరు.

క. ఉరిపోఁతలఁ బెనుమంటలఁ, బరువవిషంబులను నిట్రు ♦ పాసంబులచే
మరణింతు రొండె నసువులు, తరవారుల నుఱికి యొండెఁ ♦ దలఁగుదురు కపుల్.

అర్థములు. నిట్రుపాసంబులు = శుష్కోపవాసములు, తరవారులు=కత్తులు, 'తరవారి ర్మండలాగ్రః ఖడ్గః కౌక్షేయక స్సమాః' యాదవ.

తాత్పర్యము.

కొంద ఱురిపోసికొని చత్తురు. కొందఱు మంటలలో దూఁకి చత్తురు, కొందఱు విషముద్రావి చత్తురు. కొందఱు కత్తులపైఁబడి ప్రాణములు విడుతురు.

సీ. కిష్కింధ కిప్పు డేఁ ♦ గితి నేని యెయ్యెడ, హా యను నేడుపు ♦ టులివు వినఁగఁ
బడు నంతె, యిక్ష్వాకు ♦ వంశనాశంబును, గపికులనాశంబుఁ ♦ గలుగు నిజము
కావునఁ గిష్కింధ ♦ కడకు నే నిట నుండి, చన కుండుటయె చూడ ♦ సమ్మతంబు
చూతు నే నెట్టులు ♦ సుగ్రీవుముఖమును, జానకి బొడఁ ♦ గాన లేక
తే. నేను బోకుంటి నేని వ ♦ నేచరులును, దాశరథులును బ్రాణముల్ ♦ దాల్చువార
లాశచే నైనఁ గొన్నాళ్ళు ♦ లట్టుగాన, నటకు బోకుండుటే మేల ♦ టంచుఁ దోఁచె.

అర్థములు. ఏడుపు+ఉలివు=ఏడుపుటులివు=ఏడుపుధ్వని.

తాత్పర్యము.

ఇప్పుడు నేను కిష్కింధకుఁ బోయితినా యెక్కడఁ జూచినను నేడుపుధ్వనులే వినవచ్చును. అంతమాత్రమే ప్రయోజనము. ఏల? ఇక్ష్వాకు వంశనాశంబు, వానర కులనాశము తప్పక కలుగును. కావున నిచ్చటనుండి కిష్కింధకుఁ బోకుండుటే సమ్మత మైన కార్యము. జానకి పోఁబడి తెలిసికొనలేక పోయి సుగ్రీవు ముఖ మేమని చూతును. అంత సిగ్గు బిడియము లేని వాఁడనా? కావున నేను పోకుండితినేని హను మంతుఁ డింకను వచ్చును, రేపు వచ్చును, ఎల్లుండి వచ్చును, అను నాశచే నింకను గొన్ని నాళ్లైన జీవించి యుందురు. కాఁబట్టి నేను బోకుండుటే మేలు.

హనుమంతుఁడు సీతాదేవిని జూడకయే యుండెనేని యెంత కీడు మూఁడి యుండునో చూచుటచే నెంత కీడు తొలఁగెనో పాఠకు లూహింపవచ్చును. అయినను నొక సందేహము. ఇంత కీడు సీత కానరాలేదనఁగానే రాముఁడు మరణించు నను నూహమీఁద నాధారపడియున్నది. ఆయన సీతావియోగముచే మరణించిన నేయింత యనర్థము సంభవించును గాని యాయన జీవించి యుండిన నింత యనర్థము పొసఁ గదు. భార్య కానరాలేదనఁగానే రామచంద్రమూర్తి ప్రాణము విడుచునా? సీతాదేవి రెండవసారి శపథము చేసి భూమిలోనికిఁ బోయిన తరువాత రామచంద్రమూర్తి మరణించెనా? ఆవల నెన్నియో నూర్ల సంవత్సరములు బ్రదికియుండెఁ గదా. కావున రామచంద్రమూర్తి సీతకై ప్రాణము విడుచు నను నూహ సరియైనది కాదు. కావున నీ యూహాపరంపర నిరాకరము. సమాధానము రెండవసారి సీతావియోగము స్వబుద్ధి పూర్వకముగఁ జేసిన కార్యము. అందు దుఃఖ మతిశయించి యుండదు. భార్య మరణిం చిన నేడుచువాఁడు తాను సన్న్యాసియై భార్యను వదలెనేని యేడువఁడు. అబుద్ధి పూర్వకముగ నొక రూపాయ పోఁగొట్టుకొనినవాఁడు దేవురు లాడినట్లు బుద్ధిపూర్వ కముగ వంద రూపాయలు దానముచేసిన వాఁ డేడువఁడు. కావున రెండవసారి సీతా వియోగమున రామచంద్రమూర్తికి వ్యసనము తక్కువ. ఇంత తీవ్రవ్యసనము లేదు. సీతాదేవి భూమిలోఁ బ్రవేశించుటకు ముందు పండ్రెండు సంవత్సరములనాఁడే భార్యాభర్తృవియోగము సంభవించెను. ఇన్ని సంవత్సరములు వియోగము ననుభ వించిన వాని మనస్సున శోక మెంతమాత్ర ముండఁగలదు. వాల్మీకి రామాయ ణము వ్రాయకుండిన నామె యావజ్జీవ మట్లుండవలసినదే కదా. వియోగ మదైన నేమి? ఇదైన నేమి? వియోగము వియోగమే. ఇప్పటిస్థితి యట్టిది కాదు. కావున హనుమంతుని యూహ తప్పన రాదు.

మఱియొకవిధముగ నాలోచింతము. హనుమంతుఁడు సీతను గానక మరలి, పోయి వానరులకీ వార్త చెప్పఁగానే వానరు లందఱు సుగ్రీవు భయమున ప్రాయోప వేశము చేసియుందురు. హనుమంతుఁడు మాత్రము బ్రహ్మ వరబలమున జీవించి యుండి కిష్కింధకుఁ బోయి యీవార్త చెప్పియుండవలసివచ్చును. అప్పు డెంతటి

యల్ల కల్లోలము పుట్టియుండునో. అటుగాక వానర యూరకపోయిరా రాజాజ్ఞ మీఱిన వారని వీరినందఱ సుగ్రీవుఁడు దండింపఁ బూనిన నెంత యనర్థము పుట్టియుండునో? ఇక్కడ సీత యేమై యుండునో? ఇవన్నియు హనుమంతుఁ డాలోచించిన విషయములే. ఈ కారణముచేఁ బోయి యనర్థకారి యగుటకంటెఁ బోకుండుటే మే లని తీర్మానించుకొనెను. ఇట్లు తీర్మానించుకొని తరువాతఁ జేయవలసిన కార్య మాలోచించుచున్నాఁడు.

—♦ హనుమంతుఁడు ప్రాణత్యాగముఁ జేయ నాలోచించుట. ♦—

శా. ఏ నిందుం గన నైతి నేని మిథిలా♦ధీశాత్మజాతం గరా
దానుండై నియతవ్రతంబుగ ముఖా♦దానుండ నై యుంద యెం
దేనిన్ భూరుహమూలవాసి నయి జీ♦వేచ్ఛన్ విసర్జించుచున్
వానప్రస్థుఁడ నై చరించుటయె భ♦వ్యం బైన మార్గం బగున్. ౩౮౨

అర్థములు. కరాదానుండన్ = చేతిలోఁబడిన దానిని దినువాఁడను, ముఖాదానుండను = నోటిలోఁబడిన దానిని దినువాఁడను, భూరుహమూలవాసిని = చెట్టు క్రిందఁ బడియుండువాఁడను, జీవేచ్ఛన్ = బ్రదుకవలెనను కోరికను.

తాత్పర్యము.

నేను మరలిపోను. ఇందే యేదో యుండెద ననుకో. ఉండి చేయవలసిన దేమి? ఇందుండి సీతాదేవినే కనుఁగొనలేక పోయితినా యొక చెట్టు క్రింద బ్రదుకు మీఁది యాశ వదలి దోసిలి పట్టుకొనియో నోరు తెఱచికొనియో కూర్చుండును. చేతిలోఁ బడినదో నోటిలోఁ బడినదో కాయో పండో తిందును. పడకుండిన నూరకుందును. ఈ విధముగ వానప్రస్థుఁడనై యుండుటే క్షేమంకరమైన మార్గము.

క. మెచ్చగు ఫలమూలంబుల, హెచ్చగు జలనిధితటంబు ♦ నే నరిగి యటన్
జిచ్చుటికెదఁ జితి పేరిచి, చచ్చుట మేల్ సీతఁ గనక ♦ చనుకంటె నిటన్. ౩౮౩

తాత్పర్యము.

ఫలములు, మూలములు విశేషముగ నుండు సముద్రతీరముఁ జేరి యచ్చటఁ జితి పేరిచి దానిలో దూఁకి చచ్చుట మేలుగాని సీతను జూడక మరలిపోవుట మేలుగాదు.

చిచ్చు+ఉటికెదన్ = సప్తమ్యర్థమునఁ బ్రథమ-చనుకంటెన్ = చనుటకంటె, భావార్థక ట వర్ణలోపము.

క. అంగములు వ్యాఘ్రకాకప, తంగంబులు దినుచు నుండఁ ♦ దలఁగక ధృతిమీ
ఱంగ మరణోపవిష్టత, లింగిని సాధించువాఁడ ♦ లీలగ నిచటన్. ౩౮౪

అర్థములు. వ్యాఘ్రకాకపతంగంబులు = పులులు, కాకులు లోనగు పక్షులు, మరణోపవిష్టత = మరణము నిమిత్తమై కూర్చుండుట, లింగిని = లింగ మనఁగా సన్న్యాసము = నిరాహారము అది కలది లింగిని. అనఁగా నిరశన వ్రతము, లీలగన్ = అవలీలగ.

తాత్పర్యము.

చెట్టుక్రిందఁ గూర్చుండి కాయలు పడునా, పండులు పడునా యని దేహాభిమానముచేఁ గాచి యుండుట యెవఁడు చెప్పిన పని. అదియు సరిగాదు. ఒక చెట్టు క్రింద మరణము నిమిత్తమై నిరాహారినై ధీరుఁడనై నా దేహమును పులులు, కాకులు, గ్రద్దలు లోనగు పక్షులు తినినను గదలక కూర్చుండును.

తే. అవనిసంభవ నిటఁ గాన ♦ నైతినేని, నీళ్ళ నుఱికి త్యజించెద ♦ నేను మేని
నిట్టినిర్వాణగతికి ము♦నీంద్రు లెల్ల, సమ్మతింతుర యని తోఁచె♦ స్వాంతమునను.

తాత్పర్యము.

సీతాదేవిని నే నిందుఁ జూడఁజాలక పోయితినా నీళ్ళలో దూఁకి దేహము వదలెదను. ఇట్టి కార్యము రామార్థమై చేయుట మునీశ్వరు లెల్ల సమ్మతింతు రనియె తోఁచుచున్నది. స్వామికార్యమునకై అందు రామకార్యమునకై ప్రాణము విడుచుట పాపకార్యమగునా? జటాయువువలె నందునా? జటాయువు కార్యము చేయలేక బుద్ధిపూర్వకముగ మరణింపలేదు. ఆయనది వీరమరణము. నా స్థితి యట్టిది కాదుగదా.

ఉ. హా యెటు సేయుదుఁ గ వరశు♦భావహశాలిని యై మనోజ్ఞ చం
ద్రాయతచంద్రికాసుభగ ♦ యౌచు యశోవిభవాభిరామ యై
పాయుట నిద్ర దీర్ఘయయి ♦ బాధసుకీర్తిద యైనరాత్రి వే
పోయెడిఁగా వృథా జనక♦పుత్త్రిఁ గనుంగొను భాగ్య మేదఁ గ ౯. ౩౮౭

అర్థములు. వరశుభావహశాలిని=మేలైన శుభమును గలుగఁజేయు దానితోఁ గూడినది, మొట్టమొదట లంకాధిదేవతా జయము, శుభ సూచకము, చంద్ర=చంద్రునియొక్క, ఆయత=గొప్పది యగు, చంద్రికా=వెన్నెలచేత, సుభగ=సుందరమైనది, ఇట్లు చెప్పుటచే నిప్పటికి వెన్నెల దట్టముగా నున్నది. కాని పలుచఁబాఱలే దని భావము. యశోవిభవ = కీర్తి సంపదవలె, అభిరామమై=మనోహరమై, కీర్తి తెలుపని కవిసమయము. ఈ రాత్రి గదా హనుమంతుఁడు లంకలోఁ బ్రవేశించె నని కీర్తిగలది, ఏదఁ గ ౯=పోయింపఁగా.

తాత్పర్యము.

అయ్యో! నేనేమి చేయుదును. ప్రారంభమందు లంకా జయముతో శుభము గలిగించి మనోజ్ఞమై చంద్రుని విస్తారమైన వెన్నెలచే నందమయిన యశస్సువలెఁ దెల్లనై నిద్రలేకుండుటచే దీర్ఘమై యీరాత్రి లంకయందు హనుమంతుఁడు ప్రవేశించె నను కీర్తి తెచ్చునదియైన రాత్రి సీతాదేవిని జూచు భాగ్యము లేకయే వృథాగాఁ బోవుచున్నది గదా.

క. వ్రతినై భూరుహమూల, క్షితిపైఁ బడి యుండువాఁడ ♦ సీతం గనకే
మతి లేక చనిన నంగద, పతిముఖ్యులుఁ గీశవరులు ♦ బ్రతుకం గలరే. ౩౮౮

అర్థములు. భూరుహమూలక్షితిపై=చెట్టుమొదట నుండు నేలమీఁద.

తా త్ప ర్య ము .

నేను జేయఁదగిన దేదియు నాకుఁ గానరాలేదు. కావున వ్రతము పూని చెట్టుమొదల్లఁబడి యుందును. అటుగాక బుద్ధిలేని వాఁడనై పోయితినా యంగదుఁడు మొదలగు వానరులు బ్రదుకఁజాలరు.

ఆ. ప్రాణములను విడువ♦బహుదోషములు గల్గు
 బ్రదికి యున్నఁ గాదె♦పడయు శుభముఁ
 గానఁ దాల్చువాఁడ♦మేనఁ బ్రాణంబులు
 బ్రదికి యున్న భద్ర♦ మొదవు నిజము.

తా త్ప ర్య ము .

ఆహారము లేక దేహము విడిచెద మనుకో, చచ్చి సాధించునదియే మున్నది? ప్రాణములను వదలితినా పెక్కుదోషములుగలవు. బ్రదికియుండినఁగదా మేలనుభవింప వచ్చును. చచ్చిన తరువాత మేలేమిగలదు. కావునఁబ్రాణముల విడువరాదు. బ్రదికి యుండిననే శుభము గలదు.

'జీవితం మరణా చ్ఛ్రేయో జీవ న్ధర్మ మవాప్నుయాత్.' (భారత. విశ్వామిత్ర చండాల సంవాదము)

శరీరం ధర్మసర్వస్వం, రక్షణీయం ప్రయత్నతః
శరీరాత్ స్రవతే ధర్మః, పర్వతా త్సలిలం యథా. శంఖుఁడు.
బ్రదికియుండిన శుభములు బడయవచ్చు. భార.
'శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్' కాళిదాసుఁడు.

ఈ కారణముచేఁ దానై దేహము విడువరాదు. ధర్మార్జనము కొఱకై జీవింపఁ గోరవలయును గాని కామార్థములకై కాదు.

చ. అని యిటు మాటిమాటికి దు♦రంతపుఁజింతలఁ జిక్కి దుఃఖసా
 రనిధికి వేల గాన కెదఁ♦గ్రమ్మఱ యోజనసేయు, ధారిణీ
 తనయ యెటైన నౌత, మఱిక♦దానవనాథునిఁ బట్టి త్రుంతునా?
 దనుజుని దుష్కృతంబునకుఁ♦దద్దయు నయ్యది పాచితం బగున్. ౩౯.

అర్థములు. దురంతపు = అంతములేని, వేల= చెలియలికట్ట, పాచితంబు = ప్రాయశ్చిత్తము.

తా త్ప ర్య ము .

అని యీప్రకారము పలుమా ఱాలోచించి యంతములేని చింతలకు లోనై దుఃఖసముద్రమునకుఁ దీరము గనలేక బ్రతికి నే నేమి చేయవలయును అని మరల నాలోచించి సీత బ్రదుకనీ చావనీ – ఇందుండనీ – లేకపోనీ – ఆమె యెటైనఁగానీ ముందు రావణాసురునిఁ బట్టుకొని చావఁ దన్నుదునా? ఏలన వాఁడు చేసిన పాపకార్యమునకు నదియే ప్రాయశ్చిత్తము.

క. రావణుని నీడ్చికొనుచుం, బోవుదునా జలధిమీఁద♦భూపతికడకున్
వేవేగమ పశుపతికై, వావిరిఁ గొనిపోవు పశువు♦వడువున బలిమిన్. ౩౯౦

అర్థములు. పశుపతి = అగ్నిహోత్రుఁడు, "ఇమం పశుం పశుపతే అద్య బధ్నా మ్యగ్నే" ఇది శ్రుతి. పశువు = మేఁక.

తా త్ప ర్య ము .

రావణునిఁ జంపిన రాఁగల లాభమేమి? రామచంద్రమూర్తి తాను జంపెద ననెనే. అట్టివాని నేనెట్లు చంపుదును. కావున నది సరియైన యాలోచన కాదు. యజ్ఞము చేయునపు డగ్నియొద్దకు మేఁకను నీడ్చికొని పోయినట్లు రావణునిఁ బట్టుకొని సముద్రముమీఁద వేసి యీడ్చితీసికొనిపోయి రామచంద్రమూర్తి యెదుటఁ బెట్టెదను. ఆవలఁ జేయవలసిన కార్య మాయనయే చేయనీ.

ఉ. సారెకుఁ గుందు, వందు, నిట♦జానకి గానఁగ రాదిఁ కేదిరా
తీరగు నంచు నెంచు, సుద♦తీమణిఁ గన్గొనుదాఁక నీ పురిన్
నారక చూతుఁగాక యను♦బాహుపరాక్రము రాము గృధ్రరా
డ్భారతి నమ్మి యిందుఁ గొని♦వచ్చితినా సతిఁ గానకే యెడన్. ౩౯౧

అర్థములు. గృధ్రరాట్ + భారతి = గ్రద్దరాజు సంపాతి వాక్కు.

తా త్ప ర్య ము .

పలుమా ఱధైర్యపడి విచారించును. వ్యసన పడును. ఇచ్చట జానకి కానరాలేదే, ఇఁక నేమి చేయనగు ననుకొనును. సీత కనఁబడు దాఁక వెదకెద ననుకొనును. సంపాతి మాట నమ్మి రామచంద్రమూర్తిని దోడి తెచ్చితినా యిచ్చట సీత లేకపోయెనా,

క. దారుణ మగు రోషంబున, మారణహోమంబు సేయు♦మార్గణవహ్నిన్
వీరకపివారముల రఘు,వీరుఁడు పోవిడుచు నెట్లు♦వృథ వంచకులన్. ౩౯౨

అర్థములు. మార్గణ వహ్నిన్ = బాణాగ్నియందు.

తా త్ప ర్య ము .

భయంకర మగు కోపంబుచే వానర వీరుల నందఱను బాణాగ్ని యందు మారణహోమము చేయును. మోసగించినవారి నటుచేయక రామచంద్రమూర్తి యూరకవిడచునా ?

క. నియతాహారుఁడ నగుచును, నియతేంద్రియ వృత్తి నిందె♦నివసించెద నా
కయియేలమడియవలయును, నయగుణులగు నృపతివరులు♦నగచరవర్యుల్? ౩౯౩

అర్థములు. నియతాహారుఁడను = ఆహారనియమము గలవాఁడను, నియతేంద్రియ వృత్తి = ఇంద్రియవ్యాపారముల నియమించిన వాఁడనై, మడియవలయును = చావవలయును.

తాత్పర్యము.

ఆహారనియమము, ఇంద్రియవ్యాపార నియమము గలవాఁడనై యిండే యుండెదను. నేను వ్యర్థుఁడనై పోనేల? సుగుణ సంపన్నులగు రామలక్ష్మణులు వానరులు చావనేల?

—♦ హనుమంతుఁ డశోకవనంబును జూచుట. ♦—

క. అదిగో మహాద్రుమాన్విత, మది యొక్క యశోకవాటి ♦ యం దిందనుకన్
వెదకంగ లేదు సీతను, వెదకెదఁ గాకందు నేల ♦ విడువఁగ వలయున్. ౩౯౮

అర్థములు. మహాద్రుమాన్వితము = పెద్దచెట్లతోఁ గూడినది. అదిగో= దూరమునందుఁ గానవచ్చుచున్నదని భావము.

తాత్పర్యము.

ప్రాకారము మీఁద నుండు హనుమంతుఁడు నలువంకలు పాఱఁజూచి యదిగో నచటఁ బెద్దచెట్లుగల యశోకవన మొకటి గానవచ్చుచున్నది. దానియందు నిందనుక వెదకలేదు. అక్కడఁగూడ వెదకెదను. ఏల విడువవలయును?

క. మ్రొక్కెద వసురుద్రులకును, మ్రొక్కెద నాదిత్యులకును ♦ మ్రొగి మరుతులకున్
మ్రొక్కిచని యశ్వులకు నేఁ, ద్రొక్కించెద సోఁకుకండ♦గరువం బెల్లన్. ౩౯౯

అర్థములు. సోఁకు = రాక్షసునియొక్క — కండగరువంబు=బలముగలవాఁడనను గరువము. రాము కార్యమందుఁ దనకుఁ దోడుపడుటకై దేవతలఁ బ్రార్థించుచున్నాఁడు. ఏలన వారును రామకార్యమునందు రామక్షేమ మందు నాసక్తిగలవారే.

కం. రాముఁడు సుఖియగుఁ గావుత
రాముఁడు చిరజీవి యగుచు - రంజిలు గాతన్
రాముఁడు నిరామయుండగు
రామునకును దేహబలము - ప్రాలెడి నెపుడున్. అయో. ౨౩

కం. అనివేల్పులు గంధర్వులు
జనములుఁ బన్నగులు రాష్ట్ర- జనపదములఁ బ
ట్టనములఁ బరదేశంబుల
మనసీమను గోరుచుంద్రు - మహిపా! సతమున్. ౨౪

ఉ. రాముని మేలుకోరి నగ♦రంబున రాష్ట్రమునందుఁ బక్కణ
గ్రామములందు నిత్యముఁ ♦ద్రికాలములందును నెల్ల వేల్పులన్
సేమమునన్ భజింత్రు తరు♦ణీమణులున్ ముదుసళ్ళు స్త్రీలునున్
గ్రామజనాదినాగరులు ♦ రామునిఁ దప్ప స్మరింప రెవ్వనిన్. ౨౫

ఏకకార్యాసక్తు లగుటచే నొకరి కొకరు సహాయపడుట యొకరి కొకరు సహాయము కోరుట యుక్తమేకదా!

తాత్పర్యము.

వసువులకు, రుద్రులకు, ఆదిత్యులకు, మరుత్తులకు అశ్వులకు నమస్కరించి పోయి రావణుని బలగర్వమును వదలించెదను.

క. మక్కించి రక్కసుల నే, నుక్కున వారెల్లి నేడ్వ ♦ హాయని సీతన్
మక్కువగల పతిఁ గూర్చెదఁ, జక్కఁగఁ దపసికి ఫలం బొ♦సంగెడురీతిన్. ౬౬

అర్థములు. మక్కించి = బాధపెట్టి, ఉక్కున = పరాక్రమముచే, ఎల్లి = రేపు.

తాత్పర్యము.

రక్కసుల నందఱను నా పరాక్రమముచే బాధించి వారందఱు హాయని యేడ్చుచుండ సీతాదేవిని నామె ప్రేమగల భర్తతోఁ దపసికి ఫలము నర్పించినట్లు కూర్చెదను.

ఈ యుపమానము కార్యసాఫల్యమును సూచించుచున్నది.

క. అని చింతాసందానిత, మనమున నొండొకముహూర్త♦మాత్రము నాలో
చన యొనరిచి యుత్సాహం,బున లేచి మరుత్తనూభ♦వుం డిటు పల్కున్. ౬౭

అర్థములు. చింతాసందానితమనమున్ = ఆలోచనతోఁగూడిన మనస్సుతో.

తాత్పర్యము.

ఈ ప్రకారము చింతచేఁ గూడిన మనస్సుతోఁ గొంచెము కాల మాలోచించి యా వనమున సీత యుండును, దప్పదు, అని నిశ్చయించుకొని యుత్సాహవంతుఁడై లేచి.

ఉ. మ్రొక్కెద రామచంద్రునకు ♦ మ్రొక్కెదఁ గేలు సుమిత్రపట్టికిన్
మ్రొక్కెదఁ దద్విదేహపత♦నూజకు శ్రీరఘురాము దేవికిన్
మ్రొక్కెద ధర్మవాసవమ♦రుద్గణ మారుత రుద్రపాళికిన్
మ్రొక్కెద సూర్యచంద్రులకు ♦ మ్రొక్కెదఁ దామరసాప్తసూతికిన్. ౬౮

అర్థములుఁ విదేహప = విదేహ రాజ్యపతియొక్క, తనూజకు=సీతాదేవికి.

తాత్పర్యము.

రామచంద్రమూర్తికి నమస్కారము. లక్ష్మణస్వామికి నమస్కారము, విదేహ రాజపుత్రికయు శ్రీరామచంద్రమూర్తి ధర్మపత్నియగు సీతాదేవికి నమస్కారము. ధర్మరాజునకు ఇంద్రునకు మరుత్తులకు వాయువునకు రుద్రులకు సూర్య చంద్రులకు సుగ్రీవునకు నమస్కరించెదను. హనుమంతుఁడు లంకను జయించుట, యోగి దేహమును జయించుట యని ముందుఁ జెప్పఁబడెను. దేహము వశపడగానే యాత్మావలోకనము లభింపదు. లంకయందు హనుమంతుఁడు విసుగు వేసట లేక 'అన్వేషితవ్యమ్' అనియుపనిషత్తులు చెప్పినట్లు శోధించి యుల్లిఁటిని బరిహరింపవలెను. ఇట్లుశోధించుట

యందు కొన్ని స్థలములందు శోధించు సమయంబున ఆత్మజ్యోతివంటి తేజస్సు గానవచ్చును. మందోదరిని జూచి సీత యనుకొన్నట్లు ఆ తేజస్సే యాత్మయని భ్రమింపరాదు. సకారణముగ దానిని బరిహరింపవలయును. ఇట్లు మిక్కిలి హెచ్చరికతో నిష్కాముఁడై జితేంద్రియుఁడై వెదకవలయును. ఇట్లు వెదకుటయందు స్వప్రయత్నసాధ్యమను భావ ముండువఱకు ఆత్మ దర్శనము లభింపదు. కావునఁ గార్యసిద్ధికై సీతారామలక్ష్మణులకుఁ దొలుత నమస్కరించి భారము వారిపై వైచి దేహాధిష్ఠిత దేవతలకు మ్రొక్కి కార్య మారంభింపవలెను. దేవతలకు నమస్కరించుట న్యాయమే, సుగ్రీవున కేల నమస్కార మనిన సుగ్రీవు నాశ్రయము కలుగుటచేఁగదా హనుమంతునకు సీతాదర్శనము రామచంద్రమూర్తి దర్శనము లభించెను. కావున నెవరి యాశ్రయమువలనఁ బ్రత్యగాత్మ దర్శనము పరమాత్మ దర్శనము లభించునో యట్టివారికిఁ గృతజ్ఞుఁడై నమస్కరింపవలెను. కావున ముముక్షువు లగు నే యోగుల కయినను బోషకులు వందనీయులే యగుదురు. సంపాతి రావణు నంతఃపురంబున సీతాదేవియున్నది యని చెప్పెను. హనుమంతుఁడా మాట యందు శ్రద్ధగలవాఁడై సీతను వెదకినట్లు సాధకుఁడు గురువాక్యమునందు శ్రద్ధగలవాఁడై దేహమునం దాత్మాన్వేషణము చేయవలయును. కానరాకుండుట ప్రయత్నలోపమే కాని యాత్మలేమిని గాదు. కానఁ గానవచ్చువరకు వెదకవలయును. నిరుత్సాహ పడరాదు. సం+పాతి=చక్కఁగాఁ బాలించువాఁడు, గురు వని యర్థము.

చ. అని ప్రణుతుల్ ఘటించి దిశ♦లన్నియుఁ జూచి యశోక కాననం
బునఁ దనదృష్టి నిల్పి చనఁ బూని మఱిఁ మది నెంచు నీగతిన్
వనచరలోకనాథుఁడు ధ్రు♦వంబు నిశాచరకోటిరక్షితం
బును బరిసంస్కృతంబుఁ బురు♦భూరుచిరంబు నశోకవాటికన్. ౩౯౯

అర్థములు. ప్రణతుల్ = నమస్కారములు.

తాత్పర్యము.

ఈ ప్రకార మందఱకు నమస్కరించి దిక్కు లన్నియుఁ బాఱఁజూచి యశోకవనమునందుఁ దనదృష్టి నిల్పి హనుమ యిట్లనుకొనెను. ఈ వనమందు సీత యుండుట నిశ్చయము. ఏలన—అనేకులు రాక్షసులు దీనిని గాపాడుచున్నారు. మిగుల సంస్కరింపఁబడి చక్కఁ జేయఁబడి యున్నది. పరిశుద్ధముగా నుంచఁబడి యున్నది. నే నిదివఱకుఁ జూచిన వనముల కంటె నిది మిగుల మనోహరమై యున్నది. ఈ యశోక వనమును,

ఉ. కావలివారు వృక్షములఁ♦గాచుచు మిక్కిలి యున్నవార, లం
దా విభుఁడైన మారుతుఁడు♦నల్లన వీచుచు నున్నవాఁడు, సీ
తావిభు నర్థమై తనువు♦దానవ నేత కగోచరంబుగా
వావిరి సంగ్రహించి రఘు♦వల్లభు వల్లభ నందు నోసెదన్. ౪౦౦

తాత్పర్యము.

కావలివారు విశేషముగఁ జెట్లను రక్షించుచున్నారు. ఆవనమందు సర్వవ్యాపియైన వాయుదేవుఁడు మెల్లగా వీచుచున్నాఁడు. కావున నిందు సీత తప్పక యుండును. రావణునకుఁ గాన రాకుండ నట్లు దేహ మింతకంటె సంగ్రహపఱచి సీతాదేవిని వెదకెదను.

చ. మునులును వేల్పులుం గివిజ♦ముఖ్యుఁడు వజ్రి స్వభుండు బ్రహ్మవా
య్వనలశశిప్రభాకరజ♦లాధిపశర్వమరుత్తులశ్వులుం
గనులకుఁ దోఁచువారు మఱి♦కానివారును సర్వభూతముల్
ఘనతరభూతనాయకుఁడుఁ♦గార్యము సిద్ధి యొనర్తురియ్యెడన్.   ౮౦౧

అర్థములు. అనల = అగ్ని, ప్రభాకర = సూర్యుఁడు, జలాధిప = వరుణుఁడు, శర్వ = రుద్రుఁడు, ఘనతరభూతనాయకుఁడు = వీరికందఱికంటె మిగుల గొప్పవాఁడును, వీరికందఱకు నాయకుఁడు నైన పరాత్పరుఁడు, భగవంతుఁడు, పరిశేష న్యాయముచే విష్ణువు.

తాత్పర్యము.

మునులును, సామాన్యదేవతలు, వారిలో ముఖ్యుఁడు వజ్రధరుఁడైన యింద్రుఁడు స్వయంభు వగు బ్రహ్మ, వాయువు, అగ్ని, చంద్రుఁడు, సూర్యుఁడు, వరుణుఁడు, రుద్రుఁడు మరుత్తులు, అశ్వులు, కన్నులకుఁ గానవచ్చువారు, కానరానివారు సమస్త భూతములు, వీరికందఱకు నాయకుఁడగు పరాత్పరుఁడు భగవంతుఁడు కార్యము ఫలింపఁ జేయుదురు గాక. తోఁచువారు కానరానివారు అన్నచోట, ''యచ్చకించిత్ జగత్సర్వం దృశ్యతే శ్రూయతేపి వా। అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః'' అను శ్రుతి యనుసంధించునది. శర్వశబ్దము ముందు చెప్పఁబడియుండుటచే నిచట భూతనాయకశబ్దము రుద్రపర్యాయము గాదు.

సీ. ఎప్పుడు చూతునో♦యే నున్నసంబును, బాండురదంత మ♦వ్రణము నగుచు
మందహాసాంకూర♦సుందరం బయి పద్మ, దళలోచనంబులఁ♦జెలువు గాంచి
నిర్మల తారేశ♦నిభదర్శనం బగు, సమ్మహాదేవి యా♦స్యమ్ము నేను
ఏగతిఁ గందునో♦హీనుండు క్షుద్రుండుఁ, బరమపాపియుఁ గ్రౌర్య♦పరుఁడు దులువ
తే. దారుణుండయ్యు నుసువేష♦ధారియయిన, యసురపతిచే బలాత్కృతి♦నపహరింపఁ
బడిన సాధ్వి దపస్విని♦బుడమికూఁతు, రామదేవుని దేవి స♦తీమతల్లి.   ౮౦౨

అర్థములు. ఉన్నసము = ఉన్నత నాసిక గలది. ఉన్నసము బహువ్రీహి సమాసము. ఉన్నత నాసిక కలది యేదో యది ఉన్నసము. అజ్ నాసికాయాః సంజ్ఞాయాం నసం చాస్థూలాత్. ఉపసర్గాచ్చ. పాణిని. V. 4-118-119. ఇచ్చట ఉత్ ఉపసర్గ కావున నాసిక నస మయ్యెను. పాండుర దంతము = తెల్లని దంతము గలది, అవ్రణము = ఏకొఱఁతయు లేనిది. మందహాసాంకూర సుందరము =

చిఱునవ్వు మొలకలచే నందమైనది. పద్మదళలోచనంబులన్ = తామర రేకులవంటి కన్నులచే, నిర్మల=మలినము లేని, తారేశనిభ=చంద్రునితో సమానముగ, దర్శనము=కానవచ్చునది, ఆస్యమ్ము=ముఖము.

తాత్పర్యము.

సీతామహాదేవియొక్క యున్నతమైన నాసికయు, తెల్లనిదంతములును గలిగి యే లోపమును లేక చిఱునవ్వు మొలకలచే నాదమై తామర రేకులవంటి కన్నులు గల గళంకము లేని చంద్రుని వంటి ముఖారవిందమును నే నెప్పుడు చూతునోకదా! గుణహీనుఁడు, నీచుఁడు, పరమపాపి, క్రూరుఁడు, తులువ, నిర్దయుఁడయ్యును సాధువగు సన్న్యాసివేషమును ధరించిన రావణుచే బలాత్కారముగ నపహరింపఁబడిన పతివ్రతను, ఖిన్నురాలిని, భూపుత్రిని, శ్రీరామచంద్రమూర్తి దేవిని, స్త్రీలయందు త్తమరాలిని నే నెట్లు చూతునో కదా.

—♦ ౧౪-వ సర్గము. హనుమంతుఁ డశోకవనంబునఁ బ్రవేశించుట. ♦—

క. అని యీగతి మనమునఁ బావని యించుకసేపు లోన ♦ వనరుచు నాలో
చన మొనరించి యా ప్రమదావని ప్రాకారమున కంత♦వలనుగ దాఁటెన్. ౪౦౩

తాత్పర్యము.

ఈ విధముగ నాంజనేయుఁడు తన మనస్సులోఁ గొంతసేపు వగచి యాలోచించి యా యుద్యానముయొక్క ప్రాకారము మీఁదికి దాఁటెను.

సీ. ప్రాకారమున నిల్చి ♦ పావని సంహృష్ట, సర్వాంగుఁ డగుచును ♦ సంతసమునఁ
జూడ వసంతాది ♦ సురుచిరవికసిత,శాఖలైనట్టి భూ♦జములతోడ
సాల తమాల తక్కోల హింతాల కో,ద్దాల కాశోక్రర♦సాల చంప
క కపిముఖానేక♦కమనీయతరలతా,భవ్యాగయుతవృక్ష♦వాటిఁ గాంచి
తే. యల్లె విడిచిన బాణంబు ♦ ననుకరించి, చివ్వనను దాఁటి యచటికిఁ ♦ జేరఁబోయి
చారునీడజనిస్వనో♦దార మగుచుఁ, గనక రాజత పాదపా♦క్రాంత మగుచు. ౪౦౪

అర్థములు. సంహృష్ట సర్వాంగుఁడు=గగ్గురు పొడిచిన యన్ని యవయవములు గలవాఁడు, వసంతాది=వసంతారంభమున, కొందఱు పున్నమ మొదలు నెల గణింతురు. కావున వసంతకాలము ఫాల్గున శుద్ధ పూర్ణిమతోనే ప్రారంభము. దీనికిఁ బ్రపూర్వ దిన మని గోవిందరాజీయమునఁ గలదు. పున్నమకుఁ బూర్వదినము చతుర్దశి. ప్రపూర్వదినము త్రయోదశి కావున నీ దినము త్రయోదశి యని నిశ్చయము.

సురుచిర = అందముగా, వికసిత = వికసించిన, శాఖలై = కొమ్మలు గలవై, సాల = మద్ది, తమాల = చీఁకటిమ్రాఁకులు, హింతాల = గిఱక తాటి చెట్లు, ఉద్దాలక=విరిగి మ్రాను, రసాల = తియ్యమామిడి, చంపక = సంపెఁగ, కపిముఖ=క్రోఁతిమూఁతి గల కాయలు గాచు చెట్లు, అనేక=నానావిధములైన, కమనీయతర=మిగుల నందమైన, లతా=తీఁగలచే, భవ్య=శుభమైన, అగ=

చెట్లచే, యుత=కూడిన, వృక్షవాటికా=తోఁటను, చారు=అందమైన, నీడజ=పక్షులయొక్క, నిస్స్వనోదారము=గొప్పధ్వనులు గలది. కనక రాజత పాదప+ఆక్రాంతము=బంగారు వెండి చాయ గల చెట్లచే నిండినది.

తా త్ప ర్య ము.

ఆ యశోకవనముయొక్క ప్రాకారమందు నిలఁబడి యాంజనేయుఁడు దేహమంతయు సంతోషముచేఁ బులకరింపఁగా పాఱఁజూడఁగా వసంతము మొదట పూలచే వికసించు కొమ్మలు గల చెట్లతోఁడను, మద్దులు, చీకటిమ్రాఁకులు, తక్కోలములు, గిలకత్రాటిచెట్లు, పరిగిమ్రాఁకులు, అశోకములు, తియ్యమామిడిచెట్లు, సంపెఁగలు, క్రోఁతిమూఁతి కాయలు కాచు చెట్లు, అనేకములయిన మిగుల నందమయిన చెట్లతోఁగూడిన తోఁటనుజూచి యల్లెత్రాటఁ విడిచిన బాణమువలె సూటిగ వేగముగ నచ్చటికిఁ జివ్వునఁ దాఁటిపోయి పక్షుల కలకల ధ్వనులతోను, బంగారు వెండి చెట్లతోను నిండినదై.

సీ. వింతవింతలు గొల్పు ♦ విహగమృగంబుల, నవు రయి యుదయభా♦స్కరనిభంబు
నగచుఁ జిగుళ్లు లే♦యాకులు పూవులు, పూపలు పిందెలు ♦ పొలుపు మీఱు
పసరుగాయలు దోర♦పండులు పండులు, గల పెక్కు తెగలవృ♦క్షముల వెలసి
కోకిల హిందోళ ♦ కేకిరవంబుల, నానాశకుంతసం♦తానకలన
తే. నవ్య మైన యశోకవ♦నంబునందు,
ధారిణీసుత వెదకుచో ♦ మారుతాత్మ
జుండు సుఖసుప్తములను బ♦త్తులను మేలు
గొలుప నవి యెల్ల గలకల ♦ కూయఁ దొడఁగె. ౪౦౫

అర్థములు. విహగమృగంబుల=పక్షులచే, మృగములచే, ఉదయభాస్కరనిభంబు=ప్రాతఃకాల సూర్యునితో సమానము, హిందోళ=తుమ్మెదలు, 'బంభరశ్చ మిళింద శ్చ హిందోళ భసలా సమాః' అని నిఘంటువు. సుఖసుప్తములు=సుఖముగా నిద్రించునవి.

తా త్ప ర్య ము.

క్రొత్తక్రొత్త యాశ్చర్యములు గలిగించు పక్షులచే, మృగములచే నందమై, ప్రాతఃకాల సూర్యునిఁబోలి చిగుళ్లు, లేఁతయాకులు, పూవులు, లేఁతపిందెలు పసరు విడిచినపిందెలు, పసరుగాయలు, దోరపండులు, పండులు, గల బహువిధవృక్షములు గలిగి కోకిలలు, తుమ్మెదలు, నెమిళ్లు- వీని ధ్వనులచేతను అనేకవిధములైన పక్షిజాతులచేతను మనోహరమైన యశోకవనముఁ జూచి యందు సీతను వెదకుచు నాంజనేయుఁడు నిద్రపోవు పక్షులను మేలుకొలుపఁగా నవి కలకలకూయ నారంభించెను.

పక్షులను నిద్ర లేపెననుటచే హనుమంతుఁడు చెట్టునుండి, చెట్టునకుదాఁటుచు జెట్లమీఁదనే సంచరించెనని యేర్పడుచున్నది. ఏలన- కొందఱు రాక్షసులు తోఁట

కావలి కాచుచున్నట్లు ముందు చెప్పఁబడెను. సీతాదేవి యుండెనా, యామె మేలుకని యుండునే కాని నిద్రించుచుండదు. ఆమె నిమిత్తమై మఱి కొందఱు కావలికత్తెలు మేలుకని యుందురు. తాను నేలనడచిపోయిన నెవరో వచ్చిరని వారు గుర్తించి కలవరపడుదురు. అనిమిత్తముగఁ జెట్లమీఁద నేసంచరించెను. ఆకారణముచేఁబక్షులు నిద్రలేచుట సంభవించెను. నేల నడచిపోయిన నవి మేలుకొనుటకుఁ గాని, యెగిరి పోవుటకుఁగాని కారణ ముండదు.

సీ. నింగికి నెగురు ప॥తంగకోటుల యెఱకల తాఁకునను జల॥జల మటంచు
రాలఁ బూవులు వాని॥రాసుల నడుమను, బుష్పమయాద్రినాఁ॥బోలిచెఁగపియు
దిక్కు దిక్కుల నున్న॥యక్కుజంబుల కేఁగు, కపి వసంతునిఁగాఁగఁ॥గనియె భూత
తతులు భూమీరుహ॥పతిత పుష్పాకీర్ణ, వసుధ, భూషిత యోష॥పగిది వెలిఁగె
తే. గంధవహసుతగమనవే॥గ ప్రకంపి, తావనీరుహపాళి వా॥తాత్మజాతు
మీఁదవర్షించెఁబుష్పముల్॥మేలిమిగను, బుష్పపర్ణఫలావళుల్॥పొనుఁగుపడియె

అర్థములు. నింగికిన్ = ఆకాశమునకు, పతంగ = పక్షులయొక్క, ఎఱకల = ఱెక్కలయొక్క, పుష్పమయాద్రి = పూలకొండ, భూమీరుహపతిత = చెట్లనుండి రాలిన, పుష్ప = పూలచే, ఆకీర్ణ = వ్యాపింపఁబడిన, వసుధ = భూమి, భూషితయోష = అలంకరించుకొన్న స్త్రీ, గంధవహసుత = వాయుపుత్రునియొక్క వేగ = వేగముచే, ప్రకంపిత = మిగులఁ గదలింపఁబడిన, అవనీరుహపాళి = చెట్ల సమూహము, వాతాత్మజాతు మీఁదన్ = వాయుపుత్రుని మీఁద, పొనుఁగు పడియె = రాలిపోయెను.

తాత్పర్యము.

హనుమంతుఁడొక చెట్టునుండి మఱియొక చెట్టునకు దాఁటునపుడు కొమ్మలు కదలఁగా నందు నిద్రించు పక్షులు లేచి కలకల కూయుచు నాకాశమునకు నెగురఁగా వాని ఱెక్కల తాఁకున పూవులు జలజల రాలఁగా వాని నడుమనున్న హనుమంతుఁడు పూలకొండవలె నుండెను. మఱియు నన్ని ప్రక్కలనుండు చెట్లకై యొక్కొక్క చెట్టునకై పోవు హనుమంతుఁడు వసంతునివలె భూతకోటులకుఁ గానవచ్చెను. చెట్లనుండి రాలినపూలచే నిండిన భూమి యలంకరించుకొన్న స్త్రీవలె నుండెను. వాయుపుత్రుని వేగముచేఁ గదలిన చెట్లు హనుమంతునిమీఁదఁ బుష్పవర్షము గురిపించెను. పూలు, పండ్లు, నాకులు రాలిపోయెను. పుష్పవృష్టి అలంకృత స్త్రీదర్శనము లోనైనవి శుభ శకునములు.

కం. రాలిన యాకులతో నిలఁ, దూలిన పూవులను బండ్ల॥తుటుములతోఁ బై
చేలలు పొమ్ములు నోడిన, యాలరిజూదరియుఁ బోలె॥నమరె నగంబుల్. ౪౦౭

అర్థములు, తుటుములు = సమూహములు, చేలలు = వస్త్రములు ఆలరి = దుష్టుఁడు, ఈ యాలరి శబ్దమే కాఁబోలు నిప్పు డల్లరి యయ్యెను. నగంబుల్ = చెట్లు.

తా త్ప ర్య ము.

రాలిన యాకులతోఁ, నేలరాలిన పూవులతోఁ, బండ్లతోఁ జెట్లు చూచుటకు పైఁ గుడ్డలు సొమ్ములు నోడిన చెడు జూదరివలె నుండెను.

ఆ. శకునినికర మేది♦స్కంధమాత్రాశ్రయ,ద్రుపు లసేవ్యము లయి♦తోఁచెనపుడు
సకలమిత్రబంధు♦సంపరిత్యక్తమా,నవుల పగిది నింపు♦మివుల లేక. ౨౦౮

అర్థములు. శకుని నికరము = పక్షిసమూహము, ఏది = లేకుండుటచే, స్కంధమాత్రాశ్రయద్రుపులు = బోదెలు మాత్రము మిగిలినచెట్లు, ద్రు= చెట్టు, తెనుఁగున - ద్రుపులు.

తా త్ప ర్య ము.

పక్షులన్నియు నెగిరిపోయి బోదెలుమాత్రము మిగిలినచెట్లు బంధువులందఱు వదలిపెట్టి పోఁగా మిగిలిన మానవునివలె సేవింపరానివై యుండెను.

చ. విరిసిన కేశపాశముల♦వీడిన కుంకుమపత్ర రేఖలన్
ఖరనఖరాంకురక్షతయు♦గాఢరదక్షతి విహ్వలాత్మయున్
వరపరిపీతశుభ్రరద♦నచ్ఛద యౌ జవరాలిఁ బోలె వా
నరవరవాలహస్తచర♦ణంబులఁ దద్వని యప్డు రాట్పడెన్. ౨౦౯

అర్థములు. విరిసిన కేశపాశముల = విరియబోసికొనిన వెండ్రుకలచేతను, వీడిన = వదలిపోయిన, కుంకుమపత్ర రేఖలన్ = కుంకుమ రసముతో వ్రాయఁబడిన మకరికా పత్రరేఖలతోను, ఖరనఖరాంకుర = వాఁడి గోళ్ళ మొనలచేనైన, క్షత = గాయములు గలదియు, గాఢ రదక్షతి = గొప్ప దంతక్షతముచే, విహ్వలాత్మయున్ = వివశరాఁబోయిన మనస్సు గలదియు, వర = వరునిచే, పరిపీత = చక్కఁగా ముద్దిడఁబడినది, గనుకనే, శుభ్ర = తెల్లనైన, రదచ్ఛద = పెదవులు గలదియు, జవరాలు = వయసుస్త్రీ, జవ్వని+ఆలు = జవరాలు, జవ్వని శబ్దమునకు ఆలు శబ్దము పరమైనపుడు జవ ఆదేశమని యెఱుంగునది. 'ఏకాంతమునందున్న జవరాండ్ర నెపం బిడి' యని మనుచరిత్ర. కర్మధారయ సమాసము గావున 'ఆలు' శబ్దము పరం బవునపుడు రుగాగమంబగు. సు. వ్యా. సంధి ౫౮. వానరవర = వానరశ్రేష్ఠునియొక్క, వాల హస్తచరణంబులన్ = తోఁకచేతను, చేతులచేతను, కాళ్ళచేతను, ఆ వని = తోఁట, రాట్పడెన్ = ఉపద్రవ పడెను.

ఇది రతాంత స్త్రీవర్ణనమని కొంద అభిప్రాయ పడిరి. కాని యిది లంకకు, అశోకవనమునకు రాఁబోవు దుస్థితి సూచించు చున్నదని తోఁచుచున్నది. తల విరియఁబోఁతలు, కుంకుమ పత్రభంగములు తెల్లని పెదవులు దంతనఖాయుధు లగు వానరులచేఁ గలుగు బాధలు, విహ్వలత్వము, ఇవి వనభంగము, లంకా వైధవ్యము సూచించెడి ననుట సముచితము. అస్థానవర్ణనము వాల్మీకి చేయఁడు.

—♦ హనుమంతుఁ డశోకవనంబున విహరించుట. ♦—

క. వింజము శిఖరంబుల వృష్టిం జెలఁగెడి యాగడపలఁ ♦ జెదరఁగ ననిలుం
డుం జిమ్మిన వడువునఁ గపి కుంజరుఁడును జెదరఁ దీఁగ ♦ గుంపులఁ జిమ్మెన్. ౪౧౦

అర్థములు. వింజము — వింధ్యపర్వతము, వృష్టిన్ = వానచే, ఆగడపలన్ = మేఘముల గుంపులచే.

తా త్ప ర్య ము.

వింధ్యపర్వత శిఖరంబు లందు వాన గురిసెడి దట్టపు మబ్బులను వాయువు చెదరఁ జిమ్మునట్లు హనుమంతుఁడు తీఁగ గుంపులను జిమ్మెను.

సీ. అయ్యెడ మగరాల ♦ ననువైన భూముల, వెండియు, బైఁడియు ♦ వేఁయుస్థలుల
మంచినీళ్ళల నింపు ♦ మించిన బావుల, మణిమయసోపాన ♦ మండలముల
మౌక్తికప్రద్రుమ ♦ మంజులసికతాసు, కూలముల్ స్ఫాటిక ♦ కుట్టిమములఁ
దీరజకనకమ ♦ హీరుహాన్వితములఁ, బద్మినీకుముదినీ ♦ భాసురములఁ

తే. జక్రచక్రాంగ నత్యూహ ♦ సారసాళి
కూజితంబుల వాహినీ ♦ రాజితముల
నమృతనిభతోయములఁ గుసు ♦ మావృతవ్ర
తతుల నగు నూతులను గనెఁ ♦ దరుచరుండు. ౪౧౧

అర్థములు. మగరాలన్ = వజ్రములచే, సికతాసుకూలముల్ = ఇసుక గట్టులు, తీరజ = ఒడ్డునందుఁ బుట్టిన, కనక మహీరుహ = బంగారు వన్నెగల చెట్లచే, అన్వితములన్ = కూడినవానిని, పద్మినీ = తామర తీఁగలచే, కుముదినీ = కలువ తీఁగలచే, భాసురములన్ = ప్రకాశించు వానిని, చక్ర = చక్రవాకములయొక్కయు, చక్రాంగ = హంసలయొక్కయు, నత్యూహ = 'నత్యూహో జలరంకు స్స్యాత్,' నీటి యిఱ్ఱుల యొక్కయు, సారస = బెగ్గురులయొక్కయు, ఆళి = పంక్తులయొక్క, కూజితంబులన్ = ధ్వనులచేతను, వాహినీ = ఏళ్ళచే, రాజితములన్ = ప్రకాశించునవియు, అమృతనిభతోయములన్ = అమృతముతో సమానమైన నీళ్ళను, కుసుమావృత = పూలచే నిండిన, వ్రతతులన్ = తీఁగలను, అగు = కల, నూతులను = బావులను.

తా త్ప ర్య ము.

ఆ చోట వజ్రాలు బంగారు వెండి గల స్థలములను, మంచినీళ్ళ బావులను, వానిలోనికి దిగిపోవుటకుఁ గట్టఁబడిన మణిమయములైన మెట్లను, వానికి ముత్తెములచేఁ బగడములచే నేర్పరుపఁబడిన యిసుక యొడ్డులను, వానికిఁ బ్రక్కనఁ గూర్చుండుటకయి యేర్పఱుపఁబడినస్ఫటికప్రదేశములను, వానియొడ్డునందుఁబుట్టినబంగారు వన్నె చెట్లను ఆ బావులయందుఁ గల తామర తీఁగలను, కలువతీఁగలను, అందుఁ గూయుచున్న హంసలనుచక్రవాకములను, నీటియిఱ్ఱులను, బెగ్గురులను, వానిలోనుండి

పాఱు నేళ్లను, వానియందలి యమృత తుల్యమైన నీళ్లను, చుట్టు నల్లఁబడిన పూల తీఁగలను హనుమంతుఁడు చూచెను.

క. ఆ యాటతోఁటలోపల, వాయుతనూజుండు గాంచె ♦ వరశిఖరవిచి
 త్రాయతకూటాగయుతశి,లాయతనం బైన కేళి♦కావనిధరమున్. ౪౧౨

అర్థములు. ఆటతోఁట = కేళీవనము, ఉద్యానవనము; వరశిఖరవిచిత్రమును = ఇంపైనశిఖరములచే నలంకరింపఁబడినది, ఆయతకూట = దీర్ఘములైనయిండ్లుగలదియు, అగయుత = చెట్లుగలదియు, శిలాయతనము = రాతిగృహము గల, కేళికావనిధరమున్ = ఆట మలను – క్రీడాపర్వతమును.

తా త్ప ర్య ము.

ఆ యుద్యాన వనము నందు నింపైన శిఖరములు గదులు, చెట్లుగల ఱాతి యిల్లు గల క్రీడాపర్వతమును హనుమంతుఁడు చూచెను.

సీ. ఆ నగాగ్రమునుండి ♦ యవనికి నరుదెంచు, సెలయేటిచొప్పఁ గాం♦చినను నచట,
 బతిమీఁద గినిసి యం♦కతలంబు డిగి యేగు,కోపనవైఖరి ♦ కొమరు మీఱె
 నందు వ్రేలాడు శా♦ఖాగ్రంబు లా క్రుద్ధ, వారించు చుట్టాల♦పగిదిఁ దోఁచె
 ఝురమప్డు వెనుకకు ♦ మరలెడినహి చూడఁ, గినుక చల్లారఁ గాం♦తుని గనంగ
తే. మెల్లఁ గ్రమ్మఱి పోయెడి ♦ మెలఁతఁ బోలె
 దానికి నలంతి దవ్వునఁ ♦ దతశకుంత
 రాజిరాజితకాసార ♦ మోజఁ గాంచె
 మారుతసుతుండు భృశహర్ష ♦ మాణుఁడగుచు. ౪౧౩

అర్థములు. కినిసి = కోపించి, అంకతలంబు = తొడ, కోపన = కోపము గలస్త్రీ, క్రుద్ధన్ = కోపించిన దానిని, ఝురము = ప్రవాహము. నహి = విధము, అలంతి = కొంచెము, తత = విస్తారమైన, శకుంతరాజ = పక్షిసమూహముల చేత, రాజిత = ప్రకాశించు, కాసారము = కొలను, హర్షమాణుఁడు = సంతోషించుచున్నవాఁడు.

తా త్ప ర్య ము.

ఆ పర్వతము మీఁది నుండి క్రిందికి నొక సెలయేఱు పాఱుచుండెను. అది చూచుటకు మగనిపైఁ గోపించి వాని తొడనుండి దిగిపోవు కోపించిన స్త్రీ వలెఁ దోఁచెను. ఆ నది వ్రేలాడు కొమ్మలచే నడ్డగింపఁబడిన నీళ్ళు దురెక్కి పోవుట చూడఁగా నా నాయిక బంధువులు సమాధాన పెట్టి వారింపఁగా శాంతిపడి మగని యొద్దకుఁ బోవు నట్లుండెను. దాని సమీపమందు విస్తారముగఁ బక్షులు గల కొల నుండెను. దానిని సంతోషముతో హనుమంతుఁడు చూచెను.

క. చిత్రపురతనపుమెట్లు ప,విత్రశిశిరజలము వివిధ♦విహగంబుల్
 కృత్రిమవనములు గల పలు,కృత్రిమదీర్ఘికలఁ ద్రవ్వ♦కృతసౌధములన్. ౪౧౪

అర్థములు. విహిరమృగంబుల్ = పక్షులు మృగములు, కృత్రిమ దీర్ఘికల= కల్పితము లయిన దిగుడు బావులను. త్వష్టృకృత = విశ్వకర్మచేఁ జేయఁబడిన, సౌధముల్ = మేడలను.

తా త్ప ర్య ము.

రతనపుమెట్లు, నిర్మలమై చల్లనైన నీళ్లు, నానావిధములైన పక్షులు, మృగములు, కల్పితములైన వనములు గల కల్పితములైన దిగుడు బావులు విశ్వకర్మ నిర్మించిన మేడలు.

క. ఫలపుష్పభరితకుజపాళులు గొడుగులు పసిడి జగతు ♦ లుఁ సోపానం
బులు గ్రాల నందు వల్లీదళమేదురశింశుపో ♦ రు ♦ తరువు నొకండున్. ౪౧౫

అర్థములు. కుజపాళులు = చెట్ల సమూహములు, జగతులు = అరుఁగులు, వల్లీదళ = తీఁగలచేతను, ఆకులచేతను, మేదుర = దట్టమైన, శింశుపా + ఉరుతరువు = పెద్ద యిరుగుడు చెట్టు.

తా త్ప ర్య ము.

ఫలములచేఁబుష్పములచేనిండిన చెట్లవరుసలుగొడుగులు, బంగారుటరుఁగులు, మెట్లు ప్రకాశింపఁగా నందు హనుమంతుఁ డొక పెద్ద శింశుపావృక్షమునుజూచెను.

క. బంగరుటరుంగు లోలిఁ జెలంగఁగఁ దనచుట్టు కడుప ♦ లసితము గాఁగన్
బొంగుచుఁ దనలో వానర, పుంగవు, డటఁగాంచె వహ్ని ♦ బోలు తరువులన్.

తా త్ప ర్య ము.

ఆప్రదేశమునందు బంగారువన్నెగల యరుఁగులు తమ చుట్టునుండఁగ నెఱ్ఱని పూవులు చిగుళ్లు గల అగ్నివంటి చెట్లను హనుమంతుఁడు సంతోషముతోఁజూచెను.

ఉ. గుంటల మిట్టలన్ నదుల ♦ గ్రొందళుకుం గనకంపుఁ జెట్లు మి
న్నంటు వెలుంగుతోడఁ దన ♦ రారఁ గనుంగొని వీని డాలు మై
నంటుటఁ బైఁడిగుంటి రుచి ♦ లంటిన వేఁడి వెలుంగు నట్లు నే
నుంట లభించెఁగా యనుచు ♦ నూహ యొనర్చెఁ గపీంద్రుఁ డాత్మలోన్. ౪౧౭

అర్థములు. గుంటల మిట్టలన్ నదులన్ = దీనికిఁ గ్రియ ౪౧౬ వ పద్యము లోని కాంచెను అనునది. క్రొందళుకున్ = క్రొత్త + తళుకు = క్రొందళుకు, క్రొత్త కాంతిగల, మిన్నంటు = ఆకాశము దాఁకు, డాలు = కాంతి, మైన్ = దేహము నందు, అంటుటన్ = తగులుటచే, పైఁడిగుంటి = బంగారు కొండ, రుచులు = కాంతులు, వేఁడి వెలుంగు = సూర్యుడు.

తా త్ప ర్య ము.

క్రొత్తమెఱుఁగుగల బంగారుచెట్టు లాకాశము తగులు కాంతులతోనుండుట

చూచి వీని కాంతులు నాపైఁబడుటచే నేను బంగారు కొండ కాంతులు పడిన సూర్యునివలె నుండుట లభించెగదా యని హనుమ తలంచెను.

క. అచ్చెరుపడెఁ దనచుట్టును, నచ్చపుటపరంజిచాయ ♦ నమరు కుజంబుల్
హెచ్చుఁగ బంగరుగజ్జెలు, నిచ్చ మొరయు శింశుపావ♦నీరుహవరముల్. ౪౧

తాత్పర్యము.

తన చుట్టు బంగారు చాయ గల చెట్లు చుట్టుకొనఁగా బంగారు గజ్జెలు ధ్వనించు శింశుపావృక్షమును జూచి హనుమంతుఁ డాశ్చర్య పడెను.

సీ. సురుచిరకోమలాం♦కురపల్లవంబుల, నవ్యమా శింశుపా♦నగము నెక్కి-
యిచ్చట నుండి నే♦ వీక్షింతుఁ గాక శ్రీ, రామదర్శనలోల రమ్యశీల
నిట నట నలమట ♦ నటమట గొనుబాల, జనకేశ్వరునిపుత్రి ♦ చారుగాత్రి
ధూర్త రావణు వని ♦ తోరంపుఁజందన, చంపకవకుళవృ♦క్షములచేత

తే. సొంపు నింపెడి పక్షుల ♦ గుంపుచేతఁ
గ్రమతర మైన వరతటా♦కములచేత
నింపు నిండారఁ గూర్చెడి ♦ హృదయమునకు
నాత్మతనూభవ యిందు రా♦గలదు నిజము. ౪౨

అర్థములు. అంకుర=మొలకలెత్తు, పల్లవంబులన్ = చిగుళ్ళచేతను, అలమటన్ = చింతచే, అటమట = దుఃఖము, ధూర్తరావణు వని = దుష్టుఁడగు రావణు నుద్యానము. ధూర్తశబ్దము వృద్ధాదులలోఁ జేరినది. కావున డుజ్ విభాష నగు. సు. వ్యా. తత్సమ. ౨౦ సూ.

తాత్పర్యము.

మిగుల మనోహరములు, మృదువులునై, మొలకలెత్తు చిగుళ్ళచేతను మనోహరమైన శింశుపావృక్షము నెక్కి యిచ్చటనుండి శ్రీరామునిజాడఁ గోరిక గలదియు మంచి స్వభావము గలదియు, చింతచే దుఃఖించు నదియు జనకరాజుకూఁతురు మనోహర మగు దేహము గలదియు నగు సీతాదేవిని నేను జూతును గాక. ఏలన:— ధూర్తుడైన రావణుని యీయశోకవనము చందన వృక్షములచేతను సంపెంగపొగడ వృక్షములచేతను, మనోహరముగఁ గూయు పక్షులచేతను, అందమైన కొలఁకుల చేతను మిగుల సంతోషము గలిగించుచున్నది. కావున సీత యిచ్చటికి రాఁగలదు! ఇది నిజము.

క. ఆరామ రాముదేవెరి, శ్రీరాముఁడు గూర్పు సాధ్వి ♦ శ్రీరాఘవ చిం
తారత మృగలోచన కాం, తారపహారచణ యిటకుఁ ♦ దప్పక వచ్చున్. ౪౩

తాత్పర్యము.

సీతాదేవి యిచ్చటకు వచ్చుట యేమి నిజమందువా. సుందరియు, రాముని రాణియు, శ్రీరామచంద్రమూర్తి ప్రేమించు పతివ్రతయు, శ్రీరాము నేధ్యానించు నదియునగు సీత, జింకకన్నులవంటి కన్నులు గలది, వనములయందుఁ దిరుగు నేర్పు గలది, యిచ్చటి కెట్లు రాకుండును ?

క. శ్రీరామశోకతప్తయుఁ, జారువిలోచన యరణ్య ♦ సంచారిణి కాం
తారవిహారాసక్త మహీరమణీతనయ సత్య ♦ మిట కరుదెంచున్. ౪౨౧

తాత్పర్యము.

శ్రీరామచంద్రుని విడిచి యుండుటచేఁ దపించునది, అందమైన కనులు గలది యడవులందుఁ దిరుగునది, అడవులందు దిరుగు నాసక్తి గలది, భూదేవి కూఁతురు సత్యముగా నిచ్చటికి వచ్చును.

క. మున్నీ యుద్యానంబున, నున్న వనేచరుల సేమ ♦ ముల్లంబునఁ దా
నెన్నుచు నున్నది సత్యము, సన్నుతరఘురాముదేవి ♦ జానకి యిచటన్. ౪౨౨

తాత్పర్యము.

తక్కిన యన్నిఁటికంటె ముందుగ సీతాదేవి యీ యుద్యానవనమున సంచరించు మృగాదుల సేమమును దాను విచారించుచున్నది. ఇది నిజము కావున నిచటికి వచ్చును ;

క. సంధ్యాకాలంబునఁ దా, సంధ్యావందనముఁ జలుపఁ ♦ జనుదెంచును ని
ర్వంధ్యోదక యీనదికడ, సంధ్యాన మొనర్చికొనుచుఁ ♦ గూర్మిమ్మాదిశన్. ౪౨౩

అర్థములు. నిర్వంధ్యోదక=ఎడఁదెగని నీరు గలది.

తాత్పర్యము.

సంధ్యావందన మింటికి వెలుపల చెఱువునందో, గుంటయందో, నదియందో వార్వవలయును గావున సంధ్యవార్చుటకై యెడఁదెగక పాఱు నీ నది యొద్దకుఁ దన భర్తను శ్రీరామచంద్రమూర్తిని స్మరించుకొనుచు రాఁగలదు.

పూర్వయుగములందు స్త్రీలకు సంధ్యావందనము ఉపనయనము గలదు. స్త్రీల యుపనయనము గుఱించి వైద్యనాథీయంబున వర్ణాశ్రమాచారకాండమం దీ వాక్యములు గాన నగు.

'స్త్రీణాం వివాహ ఏవ ఉపనయన మిత్యాహ మనుః'

శ్లో॥ వైవాహికో విధిః స్త్రీణా మౌపనాయనికః స్మృతః
పతిసేవా గురౌ వాసో, గృహార్థోగ్ని పరిక్రియా. మను. ౨-౬౭

వివాహమే స్త్రీలకుపనయనము. పతిసేవయే గురుకులవాసము, గృహకృత్య నిర్వాహకమేయగ్నిహోత్రము. గనుకవారికి వివాహము లే యుపనయనాదులు. ఇది యిప్పటికాలమునవిధి. కల్పాంతరవిషయమున హారీతుఁడు 'ద్వివిధాస్త్రియో బ్రహ్మవాదిన్య స్సద్యో వధ్వశ్చ। తత్ర బ్రహ్మవాదినీనా ముపనయన మగ్నీంధనం వేదాధ్యయనం స్వగృహే భిక్షాచర్యేతి। సద్యోవధూనాం తూపస్థితే వివాహే కథంచి దుపనయనం కృత్వా వివాహః కార్యఇతి తత్కల్పాంతరాభిప్రాయం'; స్త్రీలు రెండువిధములు, (౧) బ్రహ్మవాదినులు. (౨) సద్యోవధువులు. అందు బ్రహ్మవాదినుల కుపనయనము, అగ్నీంధనము, వేదాధ్యయనము, స్వగృహమందు భిక్షాచర్య- వీరికి వివాహము లేదు. ఇఁకసద్యోవధువులకు వివాహకాలమం దేదోయొక విధముగ నుపనయనము చేసి యావల వివాహము చేయవలయును. ఇది కల్పాంతర వ్యవస్థ. మంగళసూత్రధారణము స్మార్తము గావున నుపవీతములకు బదులు మంగళసూత్రము లేర్పడినవి.

యమస్మృతి యం దిట్టులే యున్నది. "పురా కల్పే కుమారీణాం మౌంజీబంధన మిష్యతే। అధ్యాపనంచ వేదానాం, సావిత్రీ వచనం తథా। పితా పితృవ్యో భ్రాతావా నైనా మధ్యాపయే త్పరః। స్వగృహేచైవ కన్యాయా భైక్షచర్యం విధీయతే, వర్జయే దజినం చీరం జటాధారణ మేవ చ॥

పూర్వకల్పమందుఁ గన్యకలకు మౌంజీబంధనము చెప్పఁబడెను. వేదాధ్యయనము గాయత్రీజపము గలదు, గాని తండ్రి పినతండ్రి, అన్న మాత్రమే యివి చెప్పవచ్చును గాని పరుఁడు చెప్పరాదు. కన్య తనయింటియందే భిక్ష మెత్తవలయును. కృష్ణాజినము నారచీరలు ధరింపరాదు. జడలు మాత్రము ధరింపవలెను. ఈ కారణమునఁ త్రేతాయుగమందలి సీతాదేవికి సంధ్యావందనము గలదు.

క. ఆ యంబకు రఘురాముని, ప్రేయసికిన్ రాజవర్య ప్రియ కనురూపం
బై యమరె సమ్మతంబై, యీ యతులాశోకవనము హృదయంగమ మై.

తాత్పర్యము.

అటువంటి తల్లికి రఘురాముని ప్రియురాలికి రాజవర్యుఁడగు రామునందుఁ బ్రీతిగలదానికి నీయసమానమైన యశోకవనము తగియున్నది. కావున నిందు సీత యుండఁ గలదు.

క. జీవిత మేనియు రాముని, దేవియుఁ దా నిందు నరుగు దెంచుట నిజ మం
చీ విధిఁ దలఁచుచుఁ బావని, యావృక్షంబునను డాఁగి యటు నిటు గనుచున్.

తాత్పర్యము.

సీతాదేవి ప్రాణములతోనే యుండెనా యిచ్చటికి వచ్చుట నిజము, అని యీ విధి నాలోచించెను. ఆ చెట్టునందు డాఁగి యీ ప్రక్క నాప్రక్క చూచెను.

—♦ ౧౫-వ సర్గము. హనుమంతుఁ డశోకవనంబున సీతాదేవిని వెదకుట. ♦—

సీ. సంతానకలతోరు♦సంతానములచేత, రాజిత భూరుహ♦రాజిచేత
దివ్యగంధరసాఢ్య♦భవ్యాకృతులచేత, నందనతుల్యసుం♦దరతచేత
సలలితమృగపక్షి♦కులచయంబులచేతఁ, బ్రాసాదహర్మ్యాగ్ర♦పాళిచేతఁ
గోకిలాలాపన♦కోలాహలము చేతఁ, గనకాంబుజోత్పల♦గణము చేతఁ
తే. బలువిధంబులు మేలికం♦బళులచేత, నతులితవిశాలభూమిగృ♦హాళిచేత
సర్వఋతుపుష్పఫలగభూ♦జములచేత, మించెడు నశోకవనిని సా♦మీరి గనియె.

అర్థములు. సంతానకలతా=తీఁగలుగా నున్న కల్పవృక్షములయొక్క, ఉరు సంతానములచేత = గొప్ప సమూహముచే, రాజిత = ప్రకాశించు, భూరుహ రాజిచేత = చెట్ల సమూహముచే, దివ్య = దేవలోక సంబంధమైన, గంధ = సువాసనగల, రస=పండ్లరసముచే, ఆఢ్య=నిండినదియు; భవ్యాకృతులచేతన్ = శుభకరములయిన యాకారములచే, నందనతుల్య=ఇంద్రు నుద్యానవనమగు నందనముతో సమానమైన, సుందరత చేతన్ = అందముచే, సలలిత = అందముగల, మృగపక్షికుల చయంబుల చేతన్=మృగములయు, పక్షులయు జాతుల సమూహములచే, ప్రాసాద హర్మ్యాగ్రపాళిచేత=రాజులయు, ధనికులయు, శ్రేష్ఠములయిన యిండ్లచేత, కోకిలాలాపన కోలాహలముల చేత=కోకిలధ్వనుల సందడిచే, కనకాంబుజోత్పలగణము చేతన్ = బంగారు కమలములచేత, కలువల సమూహముచేత, సామీరి=హనుమంతుఁడు.

## తాత్పర్యము.

శింశుపా వృక్షముపైనుండి చూడఁగాఁ గనఁబడిన యశోక వన మున్న విధము చెప్పుచున్నాఁడు.

తీఁగలుగా నున్న కల్పవృక్షములతోను, ప్రకాశించు చెట్లచేతను, దేవలోక సంబంధమైన పరిమళము గల ఫలరసముతోఁగూడి శుభాకారము లైన వానితోను నందనవనమువంటి సౌందర్యముతోను అందములైన మృగపక్షిజాతులతోను మంచి మిద్దెలు మేడలతోను, కోకిలల కూఁతల సందడితోను బంగారు కమలములతోను కలువలతోను నానావిధములైన గొప్పకంబళ్ళతోను అసమానమై విశాలములైన నేలమాళిగలచేతను అన్ని ఋతువులందు పూచు కాచు చెట్లచేతను, నతిశయించు నశోకవనమును హనుమంతుఁడు చూచెను.

క. ఫుల్లాశోకప్రతతులఁ, బెల్లగు నెఱడాలు మించె ♦ వేకువప్రొద్దు
న్నొల్లపుఁగాంతుల నగుచుం, గొల్లగ నెఱమంటఁ జిక్కి♦కొనియె ననంగన్. ౮-౧౭

అర్థములు. ఫుల్లాశోకప్రతతులన్ = వికసించిన యశోకవృక్షసమూహముల చేతను, ఉత్ప్రేక్షాలంకారము.

తాత్పర్యము.

వికసించిన యశోకవృక్షముల యధికమైన యెఱ్ఱకాంతి ఉదయవేళ సూర్యుని కాంతులను బోలి పెద్దమంటలోఁ జిక్కుకొన్నదో యన్నట్లుండెను.

ఉ. రాలెడు పూలు సొమ్ములనఁ ♦ గ్రాల శిరంబుల నన్ని యొక్కచో
కాలమునందుఁ బక్షు లెఱ♦కల్ నెఱవిచ్చికొనం దదీయ వ
ర్షాళివిలీనపుష్పదళ ♦ మై ద్రుమపాళి విహీనపత్రశా
ఖాళియుతంబు నట్లు గన♦నయ్యె మరుత్సుతు కన్నుదోయికిన్. ౮౨

తాత్పర్యము.

పూవులు పక్షుల శిరంబులం దొక్కసారిగ రాలఁగా నా పక్షులు వానిని బోఁగొట్టుకొన రెక్కలు విచ్చగా ఆ రెక్కల సందునఁ దాఁగిన పూలు నాకులు గలవై చెట్లు ఆకులుపూలు లేనివానివలె హనుమంతునకుఁ గన్నులకుఁ గానవచ్చెను.

క. ఆమూలపుష్పనిచితం, బై, మంజుతరంబు నయి వ్య♦థాపహ మగుచున్
శ్రీమత్కుసుమభరంబున, భూమిని సోకెడు నశోక♦భూరుహశాఖల్. ౮౯

అర్థములు. ఆమూల = మొదలువఱకు, అవ్యయీభావసమాసము. పుష్పనిచితంబై = పూలతో నిండినదై, వ్యథాపహము = వెత పోఁగొట్టునది, శ్రీమత్కుసుమభరంబునన్ = శోభకల పూవుల యాధిక్యముచే.

తాత్పర్యము.

వేళ్ళవఱకుఁ బూచినవై ఆ కారణముచే మిగుల నందమై ఆ కారణముచే చూచువారి మనస్సులోని సంతాపము పోఁగొట్టునవియై కాంతిగల పూల బరువుచే అశోకవృక్షముల కొమ్మలు నేల తాఁకుచుండెను.

చ. కుసుమితకర్ణికారములుఁ ♦ గ్రొన్ననలం గల కింశుకంబులున్
బసగల సప్తపర్ణములు ♦ బాగగుపొన్నలుఁ జంపకంబులున్
నసి గల శాతకుంభనిభ♦చారునగంబులుఁ గొన్ని కొన్ని య
గ్గిసిగలఁ బోలు చెట్టులను ♦ గేసరిసూనుఁడు చూచె నయ్యెడన్. ౮౩౦

అర్థములు. కుసుమిత = పూచిన, ఇది తారకాదిగణములలోఁ జేరినది. 'సంజాతాని కుసుమాన్యేష్వితి కుసుమితాః' అని వ్యుత్పత్తి. ఇతచ్ప్రత్యయాంతము. కర్ణికారములు = కొండగోఁగులు, కింశుకములు = మోదుగులు, సప్తపర్ణములు = ఏడాకుల యరఁటిచెట్లు, శాంతకుంభనిభ = బంగారుతో సమానమైన, చారునగంబులు = మనోహరములైన చెట్లు, అగ్గిసిగలన్ = అగ్నిశిఖలను.

తాత్పర్యము.

పూచిన గోఁగులను, క్రొత్తపూలుగల మోదుగులను, సారవంతము లయిన యేడాకుల యరఁటులను, పొన్నలను, సంపెఁగలను, బంగారు కాంతిగల చెట్లను, అగ్నిజ్వాలలవలె నెఱ్ఱనైన కొన్ని చెట్టులను నాంజనేయుఁ డందుఁ జూచెను.

సీ. కాటుకడాలునఁ♦గ్రాలు చెట్టులు కొన్ని, వేవేలుగ నశోక♦వృక్షములును
సవురొప్ప నందన♦చైత్రరథంబుల, నతికరించిన కాంతి♦నంద మగుచు
వాక్కున కందని♦ప్రాప్తరూపం బయి, కుసుమతారావళిఁ♦గొమరు గనుట
రెండవయాకాశ♦మండలం బనఁ బుష్ప,మణుల నేనవ పెను♦మడుఁ గనంగ
తే. సర్వఋతుఫలనిచిత మై♦చారుగంధి, పాదపంబులఁ దనరారి♦బహుమృగాళి
కలితమగుచును రెండవ♦గంధమాద,నాద్రియనఁ బుణ్యగంధమై♦యమరుదాని.

అర్థములు. అతికరించిన = అధఃకరించిన, తక్కువగాఁ జేసిన, ప్రాప్త రూపంబయి = సౌందర్యము గలిగి, 'ప్రాప్తరూప సురూపాభిరూపాః పండిత సౌమ్యయోః' నానా॥ ర॥ కుసుమతారావళి = పూలనెడి నక్షత్రసమూహములు= పుష్పమణులన్ = పూలనెడి రత్నములచే, ఏనవ పెనుమడుఁగు = ఐదవ రత్నాకరము, సముద్రము అనునట్లు, సర్వఋతుఫలనిచితమై=అన్ని ఋతువుల యందుఁ బండు పండ్లు గలదై, చారుగంధి=కమ్మవాసన గల, పాదపంబులన్ = చెట్లచే.

తాత్పర్యము.

నల్లని కాంతిగల వేనవే లశోకవృక్షములును, ఇంద్రు నుద్యాన మగు నందనము, కుబేరుని యుద్యాన మగు చైత్రరథమును మించిన సౌందర్యమును, వాక్కుచే వర్ణింప సాధ్యముగాని సురూపము గలిగి, పూలనెడి నక్షత్రములను గల దగుటచే రెండవ యాకాశమో యను నట్లును పూలనెడి రత్నములచే నిండియుండుటచే నైదవ రత్నాకరమో యను నట్లును నొప్పి, యన్ని ఋతువు లందు ఫలించు ఫలములతో నిండి, సువాసన గల చెట్టు లనేకములయిన జింకలు లోనగు మృగములు గలదై రెండవ గంధమాదన పర్వతము వలె మంచి వాసనలఁ గలదానిని.

తే. ఆ యశోకవనంబు వా♦తాత్మజుండు, చూచి నడుమను గైలాస♦శుద్ధమగుచుఁ
బగడపు న్మెట్లు తప్తసు♦వర్ణ వేది,కలును వెలయఁగ లక్ష్మిప్రకాశ మొనరి. ౮౩

తాత్పర్యము.

అటువంటి యశోకవనమును హనుమంతుఁడు చూచి, దాని నడుమఁ గైలాస పర్వతమువలెఁ దెల్లనై, నిర్మలమై పగడాల మెట్లు, బంగారు టరుఁగులు గలిగి లక్ష్మి దేనివలెఁ బ్రకాశము గలదై.

సీతాదేవి యందుండుటచే లక్ష్మిప్రకాశము చెప్పఁబడెను.

ఈయశోక వనము నేఁటికి నున్నదని చూచిన వారు వ్రాసిన వాక్యము లిది వఱకే యనువదింపఁ బడినవి.

క. మి న్నొరయుచు రమ్యం బై, కన్నులకును మేలి విందు♦ఘటియించుచు సం
పన్న స్తంభసహస్రము, చెన్నా రెడు నొక్క మేడఁ♦జేరువఁ గాంచెన్. ౪౩౩

అర్థములు. మిన్ను+ఒరయుచు=ఆకాశముతో రాచుకొనుచు, స్తంభ సహస్రము=వేయి స్తంభములు.

తా త్ప ర్య ము.

ఆకాశ మంటుచు రమ్యమై కన్నుల పండుగై వేయి స్తంభములు గల యొక మేడను సమీపమందే చూచెను.

—♦ హనుమంతుఁడు సీతాదేవిని జూచుట ♦—

ఉ. మాసిన చీరతోడ, ధృతి♦మాలిన చిత్తముతోడ, నింతయేన్
గ్రాసము లేమిఁ జిక్కిన సు♦కాయముతోఁ, బయి పై నిగుడ్చు ని
శ్శ్వాసచయంబుతో; గుఱుతు♦పట్టఁగరాని స్వరూపకాంతితో,
గాసి నొసంగురాత్రిచర♦కాంతులచేఁ బరివేష్టమాన యై. ౪౩౪

తా త్ప ర్య ము.

మాసిన చీరతో, ధైర్యము చెడిన మనస్సుతో, కొంచె మైన నాహారము లేకుండుటచే శుష్కించిన దేహముతో, మీఁద మీఁద వెలువరించు నిట్టూర్పులతో నీమె సీత యని గుర్తింపరాని దేహకాంతితో, బాధపెట్టుచున్న రాక్షస స్త్రీలతోఁ జుట్టఁబడినదె.

ఆహారము కొంచెమైన లే దనుటచేఁ గిష్కింధాకాండ మందు ఇంద్రుఁడు పాయస మిచ్చె నను కథ కల్పితము.

ఉ. క్రొన్నెలవోలె నున్న యొక♦కోమలగాత్రిని, హోమధూమసం
ఛన్నహుతాశనార్చి గతి♦జానఱి యుండెడిదాని, నైజమూ
యిన్నెఱిరూప మంచు మది♦నెంతో విచారముఁ జేసి కాని లో
నెన్నఁగరాని దానిని, న♦హీనతరవ్యధితాత్మ, సుందరిన్. ౪౩౫

అర్థములు. క్రొన్నెల = క్రొత్తచంద్రుఁడు, హోమధూమ = హోమము పొగచే, సంఛన్న=కప్పఁబడిన, హుతాశనార్చిగతిన్=అగ్నిశిఖవలె, జానఱి= అందముచెడి, నైజము = స్వభావసిద్ధము, అహీనతర = మిగుల నధికమైన, వ్యథితాత్మన్=బాధపడు మనస్సు గలదానిని.

తా త్ప ర్య ము.

క్రొత్తచంద్రునివలెఁ గోమలమైన దేహముగలదానిని, ఇట్లు చెప్పుటచే నిది మొదలుకొని కాంతి హెచ్చునని భావము. హోమధూమముచేఁ గప్పఁబడిన యగ్ని శిఖవలె నందము చెడినదానిని, వెలుపలికిఁ దెలియ రాకున్నను లోపల నంతఃకరణము శుద్ధముగా నున్నదని భావము. ఈమె కీరూపము స్వభావమున వచ్చినదా లేక, కారణాంతరమున వచ్చినదా యని మిక్కిలి యాలోచించిగాని తీర్మానింప రాని దానిని, మిక్కిలి బాధపడుచున్న దానిని, సుందరిని.

ఉ. ధూళిని గ్రుంగియున్న మెయి♦తోఁ గమలంబులు లేని కొల్కు నా
వ్రీళ నలంకృతుం దొఱఁగి ♦ పీతరుచిం గల యొంటిచీరతో
వాలిన దుఃఖభారమున ♦ వాడి తపస్విని యై కుజగ్రహం
బోలిని బట్టుకొన్న చెలు♦వూడిన రోహిణి నాఁగ నొప్పుచున్. ౪౩౬

తా త్ప ర్య ము.

పదినెలలుగా స్నానము లేక దుమ్ములో మునిఁగిన దేహముతోఁ గమలములు లేని కొలనువలె సిగ్గుచే నలంకారమును విడిచి పచ్చని యొంటి చీరతో నతిశయించిన దుఃఖాతిశయముచే వాడి శుష్కించి యంగారకుఁడు పట్టుకొనుటచేఁ గాంతిచెడిన రోహిణి వలెనై.

ఓయి! పదినెలలుగా స్నానము లేదంటివే. స్నానము చేయక సంధ్యావారువ రాదుగదా. ఎట్లు చేసెను? ఇది యాపద్ధర్మము. ఆతురవిధి యామెకు నన్వయించును. స్నానము చేసినచో రెండవ చీర లేదాయె. తడి చీరతో సంధ్యావారువరాదాయె. దేహముమీఁదనే చీర యిరుపూఁట నాఱు టెప్పుడు? సంధ్యవార్చు టెప్పుడు? కావున మానసిక - మాంత్రిక స్నానములు చేసెనని యెఱుఁగ నగు.

సీ. కాలువలై పాఱు ♦ కన్నీళ్ళు మొగ మెల్ల, నావరింపఁగఁ గడు♦నడలుదాని
దలపోఁతలకుఁ జిక్కి♦తతశోకమున స్రుక్కి, యెప్పుడు వెకివెక్కి ♦ యేడ్చుదాని
దనవారి మొగములఁ ♦ గనలేక రక్కసి, పిండు మోములు చూచి ♦బెగడుదాని
వేఁటకుక్కలలోన ♦ వేర్పడి చిక్కిన, యాఁడుజింకనఁగ న♦ల్లాడుదాని
తే. నల్లఁ ద్రాఁచన దిగి జఘ♦నంబు నొరయు,నొంటిజడతో శరత్తున ♦ నుదయవేళఁ
గాఱుటడవుల నొప్పారు ♦ తోమతలంబుఁ,బోని దానిని సెఱమాపు♦మేనిదాని. ౪౩౭

తా త్ప ర్య ము.

మొగమెల్ల నావరించునట్లు కాలువలుగాఁ గన్నీళ్లు కార్చుదానిని, ఆలోచనలకు వశపడి మిక్కిలి దుఃఖమున శోషించి యెప్పుడు వెక్కి-వెక్కి ఏడ్చుచుండుదానిని, తన బంధువుల ముఖములు చూడఁజాలక రాక్షసస్త్రీ సమూహములు చూచుచుండు

దానిని, ఒంటిగా వేఁటకుక్కలలోఁ జిక్కిన యాఁడుజింకవలె నల్లాడుదానిని, నల్లని త్రాచుపామువలె వ్రేలాడి నడుము నంటుచున్న యొంటి జడతో శరత్కాలము నుదయంబున కాఱడవులందలి భూమిని బోలుదానిని, స్నానము లేమిచేఁబూర్ణముగ మాసిన దేహముగల దానిని.

క. వ్యసన మెఱుంగనిదానిని, వ్యసనంబున మాఁడుదాని ♦ బరమసుఖార్హన్
బస దొఱఁగి ధ్యానపరమై, వసివాడినదాని దీన♦వనజదళాక్షిన్. ౪౩౮

తా త్ప ర్య ము.

ఇంతవరకు వ్యసన మెట్టిదో తెలియని దానిని ఇప్పుడు తీవ్రవ్యసనముచే మాఁడిపోవు చున్నదానిని, మిగుల సుఖమునకు యోగ్యమగు దానిని, పస చెడి చింతలకుఁ జిక్కి మిగుల వాడి దుఃఖించుస్త్రీని,

——♦ హనుమంతుఁడు సీతాదేవిని జూచి తనలో వితర్కించుకొనుట. ♦——

క. కని యీ కృశమలినాంగియె, ఘనుఁ డగు జనకుని తనూజ ♦గాఁబోలు నొకో
యని యీ కారణముల నా,హనుమ వితర్కింపఁ దొడఁగె ♦ స్వాంతమునందున్.

తా త్ప ర్య ము.

హనుమంతుఁడు చూచి యీ యాహారము లేక శుష్కించి పదినెలలుగా స్నానము లేమిని మాసిన దేహము గలది సీతగా నుండునా? యని యీ కారణములచే నాలోచింపసాగెను.

క. ఏ రూపముఁ గల సుందరి, నా రావణుఁ డపహరించి ♦ యరుగుచు నుండన్
వారక కంటిమొయానాఁ, డా రూపమ యీమెయందు ♦ నయ్యెం గనఁగన్. ౪౪౦

తా త్ప ర్య ము.

ఈమె సీతాదేవియే యని నిశ్చయించుటకుఁ దగిన కారణములఁ జెప్పు చున్నాఁడు. మొదటిది ప్రత్యభిజ్ఞ, మొదటఁ జూచిన జ్ఞప్తితో మరలఁ జూచి సరి పోల్చుట ప్రత్యభిజ్ఞ.

౧. ఆనాఁడు ఋశ్యమూకమం దుండి మేము రావణుఁ డపహరించుకొని పోవుచున్న సుందరి రూపము చూచితిమి గదా. ఆ రూపమే యీమె యందుఁ గానవచ్చుచున్నది.

సీ. నిండుఁజందురుఁబోలు♦ నెమ్మోముఁ గలదానిఁ, బొలుపులీనెడి కను♦బొమలదాని
లలివృత్తయౌవన ♦లక్షణంబుల దాని, నిడుద లౌ నీలంపు ♦ నెఱులదాని
నిరుల గ్రమ్మిం గెడి కాంతి ♦ నెసఁగుచుం డెడిదాని, బింబంబు డం బగు ♦ పెదవిదాని
సింహమధ్యంబు హ ♦సించుమధ్యముదాని, నొప్పఁదీర్చిన పాద ♦యుగముదాని

తే. దోయజంబులఁదోలు క♦న్దోయిఁదాంచి, పుష్పబాణుని యలివేణిఁ ♦ బోలుదాని
నిండు నెలడాలునాఁగను ♦ నిఖలజగతి. కనుపమానేష్ట యగుచును♦జనెడు దాని.

అర్థములు. యావన లక్షణంబులు= స్తనములు, 'లావణ్యేచ స్తనేచ స్యా త్స్త్రీ-బే యావన లక్షణం॥ నానా॥ర॥ పుష్పబాణుని యలివేణి=రతీదేవి. నెలడాలు= చంద్రకాంతి, అనుపమాన+ఇష్ట=అసమానమైన ప్రీతిగలది. లోకమున నామె యందప్రియము గలవారు లేరని భావము.

తా త్ప ర్య ము .

పూర్ణచంద్రుని వంటి ముఖము, అందములైన కనుబొమలు, వర్తులవలగు స్తనములు, నిడుపారు నల్లని తల వెంట్రుకలు, చీఁకటిని హరించు దేహకాంతి, దొండపండువంటి పెదవులు, సింహము నడుమువంటి సన్నని నడుము, తీర్చి నట్లుండు పాదములు, తామరలవంటి కన్నులు గలిగి రతీదేవివలె సుందరమై నిండు చందు రుని వలె సర్వజనులకు నభీష్టమై యుండుదానిని.

అవివేకు లందును రామచంద్రునిఁ దప్పు పట్టెడువారు గలరుగాని సీతా దేవిని దప్పుపట్టువారు లేరు.

ఉ. తాపసిఁబోనిదాని, వసు♦ధం బడియుండెడిదాని, నూరుపుల్
పైపయిఁ బాఁపలేమ యనఁ ♦ బర్వఁగఁజేసెడిదాని, ధూమమా
లాపరితాగ్ని నాఁగ విపు♦లవ్యథ సొంపఱి యుండుదాని, మి
థ్యాపరిభూతకీర్తి నిహ♦తం బగు నాశను బోలు తొయ్యలిన్. ౨౨౨

అర్థములు. తాపసిఁ బోనిదాని=తపస్సు చేయుచుండుదానివలె నుండు దానిని, పాఁపలేమ = ఆఁడు పాము, సమాసంబుల నొప విభక్తికంబుల దీర్ఘ పూర్వకద్విత్వ మువర్ణంబులకు ఖండపూర్వబిందుపూర్వకంబుగను లఘుపూర్వక మువర్ణంబునకుఁ గేవలమును పవర్ణం బగు. పాము+లేమ=పాఁపలేమ. వేము+ చెట్టు=వేఁపచెట్టు. మొ॥ ధూమమాలా = పొగగుంపుచే, పరితాగ్ని=సర్వత్ర కప్పఁబడిన యగ్ని, మిథ్యాపరిభూతకీర్తి=అసత్యపు టపవాదముచేఁ జెఱుపఁబడిన కీర్తి, తొయ్యలిన్=స్త్రీని. ఇది మొదలు కులకము.

తా త్ప ర్య ము .

తపస్సు చేసికొను దానివలె, తివాచీలు చాపలు లేక నేలఁబడి యుండుదానిని, ఆఁడుపాము బుసకొట్టు నట్లు మీఁద మీఁద నిట్టూర్పులు విడుచుదానిని, పొగ గ్రమ్ముటచేఁ దెలియరాని యగ్నివలె విస్తారతాపముచే సొంపు చెడి యుండుదానిని, అసత్యమైన యపకీర్తిచేఁ జెడిన యాశవంటి దానిని, నొకస్త్రీని.

తపస్సుచేసికొను స్త్రీ యనుటచే యమసంపత్తి జితేంద్రియత్వము భోగవిరా

గము, తపశ్శక్తియు, బుసకొట్టు నాఁడుపాముచుటచే, కోపించిన పామును జెనకు వాఁడెట్లు జీవింపఁడో యట్లామెను జెనకువాఁడు జీవింపఁజాలడనియు, ధూమమాలా పరితాగ్ని యనుటచే పైన కాంతి కానరాకున్నను మనస్సగ్నివలె పరిశుద్ధమైయున్న దనియు మిథ్యాపవాదముచేఁ జెడిన కీర్తియనుటచే నీమెయందు నింద యారోపించువా రసత్యవాదులని సూచన.—

ఆ. కుదుటఁ బడని శ్రద్ధ♦మదిక సందిగ్ధమౌ, స్మృతియు, క్షీణమైన♦సిరియుఁ గలుష యుక్తమైన బుద్ధి,♦యుపహతిఁ గూడిన, కార్యసిద్ధి నాఁగఁ♦గ్రాలుదాని. ౪౪౩

అర్థములు. కుదుటఁబడని శ్రద్ధ = స్థిరపడని శాస్త్రవిశ్వాసము, శాస్త్ర మందుఁ జెప్పిన యీ పని చేసిన నీ ఫలము గలుగునను నమ్మకమునకు శ్రద్ధ యని పేరు. అట్టి శ్రద్ధ దృఢముగాఁ గుదురదేని శాస్త్రప్రకారము చేయుదునా, వలదా; ఫలము వచ్చునో, రాదో యనుకొనుట. హనుమంతుని విషయమున నిట్లే. మునుపు నేను జూచిన స్త్రీవలెనే యున్నది. అయినను ఆమెయౌనో కాదో. ఒక స్త్రీవంటిది మఱియొకతె లోకమున నుండరాదా? యని సందేహము. సందిగ్ధమౌ స్మృతి = మనుస్మృతి లోనగువాని యందలి వాక్యములకు అది సరియైన అర్థమా, యిదిసరి యైన యర్థమాయని సందేహించుట. ఇదియు హనుమంతుని సందేహమునే తెలుపు చున్నది. అనఁగా సీతాదేవి స్థితి యట్లున్నదని యెఱుఁగవలయు. క్షీణమైన సిరి = క్షయించిన సంపద, ఒకఁ డైశ్వర్యయుక్తుఁడై యున్నప్పటి వేషము దరిద్రుఁడై నప్పు డుండదు. అప్పుడు చూచినవా డిప్పుడు చూచినచో వేషము మాఱుటచే వాఁడు వీఁడగునా కాడా యని సందేహముతోఁచును. కలుష యుక్తమైనబుద్ధి = బుద్ధి నిష్కల్మషమై యుండిననే నిశ్చయజ్ఞానము తోఁచును. కల్మషముతోఁగూడి నప్పుడు యథార్థజ్ఞానము కలుగదు. సందేహమే తోఁచును. ఉపహతిఁ గూడిన కార్యసిద్ధి = విఘ్నముచేఁ జెడిన కార్యఫలము. ఒక కార్యము చక్కఁగాఁ జేసిన ఫలహాని లేదు. అది విఘ్నమై పోయిన నా కార్యము చేసినవాని కా ఫలము ప్రాప్తించదు. అట్టులే సీత సీతాత్వమున కేహానియు లేదు. ఆమె సీతయని తెలిసి కొనలేని లోపమామూఢునిదే. ఆత్మావలోకన మగుటకుముందు నాత్మజ్యోతివలె వెలుతురు హనుమంతునకు మందోదరివలెఁ గానవచ్చును. దానికి భ్రమపడరాదు. అదియే యాత్మయనుకొని సంతోషించువాఁడు భ్రష్టుఁడే కావున నాచార్యుఁడు శాస్త్రములుచెప్పిన గుఱుతులచే స్వబుద్ధి బలముచేఁ దర్కించి యూహించి నిశ్చ యించుకొనవలెను.

## తాత్పర్యము.

స్థిరపడనిశ్రద్ధ, సందేహము కలిగించుస్మృతి వాక్యము, క్షయించిన సంపద, కల్మషముతోఁ గూడిన బుద్ధి, విఘ్నమైన కార్యఫలమువలె నుండుదానిని.

సీ. కౌసలేయునిఁ జూడ♦గానక తపియించి, యసురచేఁతకుఁ జిక్కి♦యడలుదాని
వచ్చునా నా ప్రియ♦వల్లభుం డంచును, నలుదెస ల్వరికించి♦తలరుదానిఁ
బొదలుచు నొంటిమై♦బెదరి చూచెడిలేడి, కన్నెకన్నులఁబోలు♦కనులదానిఁ
గాలువలైపాఱు♦కన్నీటివఱదతోఁ, బుల్కు పుల్కను గను♦పోలుపుదాని
తే. వాడువాఱిన మోమున♦వగచుదాని, వేడినిట్టూర్పు పైపయి♦విడుచుదాని
ధూళి గ్రుంగిన మేనను♦దూలుదాని, విన్నఁదనమున మలమల♦వేఁగుదాని.

అర్థములు. కౌసలేయుఁడు=కౌసల్యాకుమారుఁడు, పోలుపు=అందము.

తాత్పర్యము.

శ్రీరామచంద్రునిజూడఁ జాలమిని తపించి రావణాసురునిచేతఁ జిక్కి వ్యసనపడు దానిని, నా భర్త వచ్చునాయని నాలుగు దిక్కులు చూచుదానిని, ఒంటరిగాఁ జిక్కి బెదరుచుఁ జూచుచున్న యాఁడు లేడి కన్నులవంటి కన్నులు గలదానిని, కాలువలుగాఁ గన్నీరు పాఱుచుండఁగా ఱెప్పల మీఁద మీఁద మూయుచుఁ దెఱచుచుఁ జూచుచుండు దానిని, వాడిపోయిన ముఖముతో దుఃఖించుదానిని, వేఁడి నిట్టూర్పులు మీఁద మీఁద విడుచు దానిని, దుమ్ములో మునిఁగిన దేహముగల దానిని, శోకముచే మలమల మాఁడుచుండు దానిని.

సీ. ఉత్తమాలంక్రియా♦యోగ్య యయ్యును మేన, మండనంబులు లేక♦యుండుదాని
గారుమబ్బుమఱుంగుఁ♦గనిన చుక్కలఱేని,వడువున మాసిన♦ప్రభలదాని
నభ్యాస మెడలుట♦నాత్మ విస్మృతి గన్న, చదివిన చదువు నాఁ♦బొదలుదాని
విగతసంస్కారమై♦వే అర్థ మొసఁగెడి.పదము నా వికట మై♦పరఁగుదాని
ఆ. నగునొ కాదొ సీత♦యనుచు శంకించుచుఁ, గలఁగి చూచి చూచి♦కష్టముననుఁ,
గారణంబు లెల్లఁ♦గలయనాలోచించి, నెలఁత సీత యనుచు♦నిశ్చయించె. ౪౪౫

అర్థములు. ఉత్తమాలంక్రియా యోగ్య = శ్రేష్ఠమైన యలంకారమునకు నర్హురాలు, మంటనంబులు = ఆభరణములు, విస్మృతి=మఱపు, విగత సంస్కారమై=వ్యాకరణ ప్రకారము శుద్ధముగాక గ్రామ్యమై, వికటమై=వికారమై.

తాత్పర్యము.

శ్రేష్ఠమైన యలంకారమునకు నర్హురాలయ్యును నాభరణములు లేక యుండు దానిని, వానమబ్బు చాటున నుండు చంద్రుని వలె ప్రభ మాసినదానిని (చంద్రుని ప్రభ మాయలేదు. చూచువారి కా ప్రభ యనుభవము లేదు. అట్టులే యిచ్చట) అలవాటు తప్పిపోవుటచే మఱపు దగిలిన చదువు వంటి దానిని (కష్టముపై మరల స్మృతికిఁ దేఁదగిన దానిని) వ్యాకరణ శుద్ధము గాకుండుటచే మఱియొక యర్థమిచ్చెడి మాటవలె విరుద్ధముగ నుండుదానిని, హనుమంతుఁడు చూచి

యీమె సీత యగునో, కాదో రావణాసురుఁడు బలాత్కారముగఁ దెచ్చి యిట్లుంచెనో యని బాధించుచున్నాఁడు. వారిలో నెవతెయో యేమోయని సందేహించి సందేహించి చూచి చూచి యీమె సీతయే యనుటకుఁ గారణముల నాలోచించి తుద కీమె సీతాదేవియేయని నిశ్చయించెను. ఆకారణము లీ క్రింద పద్యముల వివరింపఁబడును.

—♦ హనుమ తాను జూచినస్త్రీ సీతాదేవి యని నిశ్చయించుకొనుట. ♦—

కం. జానకి సొమ్ము లటంచును, మానవవిభుఁ డేవి పలికె♦మా కవి యెల్లన్
గానఁగ నయ్యెడిఁ గుజశా, ఖానికరములందు వ్రేలి♦కలికికి నటులన్. ౪౪౬

తాత్పర్యము.

తొలుత రావణాసురుఁ డెత్తికొని పోవుచుండఁ దాము చూచిన స్త్రీవలె నీమె యున్నది కావున సీతయై యుండునని తలఁచి, యొక తెను బోలి మఱియొక తె యుండవచ్చును, కావున నది నిశ్చయింపఁ జాలునంత ప్రమాణము కాఁజాలదని తర్కించి యితరప్రమాణములచే నిశ్చయించుచున్నాఁడు. దీనివలనఁ గేవల ప్రత్యక్ష ప్రమాణము ప్రమాణము గాదని యేర్పడు చున్నది. రామచంద్రమూర్తి యివి జానకి సొమ్ములని వేనిని మాకుఁజూపెనో యవియన్నియు నీమె సమీపమునఁ జెట్లకొమ్మలందు వ్రేలాడు చున్నవి.

సీతాదేవి యాభరణములు కపులముందఱఁ బాఱవైచినపు డొక ప్రక్కవి మాత్రమే తీసి మూఁటగట్టివైచెను. ఇచ్చట రెండవ ప్రక్కవి తీసి కొమ్మలకుఁ దగిలించినవి. ఎవ్వరైనఁ దన్ను వెదకుచు వచ్చిన యెడల వారు వీనినిబట్టి తన్ను గుర్తింతురుగాక యని యీమె యభిప్రాయము. ఈమె సీతయే యనుట కిది రెండవ కారణము. దీనినే వివరించు చున్నాఁడు. ప్రత్యక్షమును ననుమానప్రమాణముచే బలపఱుచు చున్నాఁడు?

ఉ. చక్కని చేఁతకమ్మలును♦జానగుమేల్ బొగడల్ సుకాంతిఁ బెం
పెక్కిన రత్నవిద్రుమమ♦హిష్ఠవిభాకర భూషణంబులున్
మక్కియు నల్లపాఱియును♦మానక పెక్కుదినాలు దాల్చుటన్
జక్కఁగ గుర్తు లేర్పఱిచె♦స్వామి వచించిన సొమ్ము లివ్వగున్. ౪౪౭

అర్థములు. చక్కని చేఁత=నాణెపుఁబని చేసిన, రత్నవిద్రుమ= రత్నములయుఁ బగడములయు, మహిష్ఠ = మిక్కిలి గొప్పదగు, విభాతి = కాంతికి, ఆకర =స్థానమైన, భూషణంబులన్=సొమ్ములు, మక్కియు=ముఱికి యయ్యుమ.

తాత్పర్యము.

చెట్లకొమ్మలందు సొమ్ములు వ్రేలాడుచున్నవి నిజమే, అవి యీమెవియే

యని యెట్లు నిశ్చయింప వచ్చును? అని సందేహించి దాని నివర్తిచేసికొను చున్నాఁడు. నాణెముగాఁ బనిచేసిన కమ్మలు, బాగడలు, రత్నములు పగడములు వీనిచేఁ బ్రకాశించు భూషణంబులు ఇవి మురికియయి నల్లవాఱి కూడ చాలదిన ములు ధరించుటచే నవి యీమె దేహముమీఁద గుర్తు లేర్పఱిచినవి.

అనఁగా నచ్చట శ్రీరామచంద్రమూర్తి సీత సొమ్ము లివి యని వేనిని జెప్పెనో యవి ధరించియుండిన దేహమునం దెట్టి గుర్తులు పడియుండునో యా గుర్తు లీమె దేహమునం దున్నవి. పనిలేనప్పుడు సొమ్ములు దీసిపెట్టుటకుఁ బెట్టెలు లేకుం డుటచే దేహమునందే విడువక ధరించి యుండుటచే దేహమునఁ గాయలు కాచె నని భావము. సీతాదేవి పాఱవైచినవి కాక యప్పుడు తొందరకుఁ దీయుటకు సాధ్యము గానివి దేహమందే యుంచుకొనెను. రామచంద్రమూర్తి తాను జూచిన నగలు గాక సీతాదేవి దేహముమీఁద నింకను నీ యీ సొమ్ము లుండెనని చెప్పెను. ఆ సొమ్ము లిందున్నవి. ఇది యాప్తవాక్యము.

క. అక్కడ నేఁ జూచిన నగ, లిక్కడఁ గనరావ; యున్న ♦ విట నచ్చోటన్
జిక్కని సొమ్ములె; దీనికి, నొక్కింతయు సందియంబు ♦ నొనరదు చూడన్. ౭౮

తాత్పర్యము.

అక్కడనే నేయే నగలు చూచితినో యా నగ లిచ్చట లేవు. ఇక్కడ నుండు నవి యచ్చట లేవు. ఇందు సందేహము లేదు. అనఁగా నక్కడ నెడమ చెవి, ఎడమ ముక్కు, ఎడమ చేయి, ఎడమ కాలికిఁ బెట్టుకొను సొమ్ము లుండిన నిక్కడ నవి లేవు, ఇక్కడ కుడి ప్రక్కవే యున్నవి.

మఱి యెవతె యైనఁ దన సొమ్ములు చెట్లకుఁ దగిలించె ననిన నిట్లుండు టకుఁ గారణము లేదు. కావున నందు నేను జూచిన సొమ్ము లీమె ధరించినవే. –

చ. పసిమికడానిడాలున శు♦భం బయి యప్పుడు పోవువేళ నా
కసమున నుండి రాలుచు న♦గంబునఁ గొంచొక చిక్కి ♦ తెస్సి తా
వెసఁ గపిపంక్తి చూడఁగను ♦ వ్రీలిన చీరయు మేలిసొమ్ములున్
వసుమతి నీమెయే విడిచె ♦ వంచనలే దొకయింత యేనియున్. ౭౯

ఇఁక మూఁడవ కారణ మూహించు చున్నాఁడు.

అర్థము. పసిమికడాని డాలు=పచ్చని బంగారు కాంతి, కొంచొక=కొంచెము.

తాత్పర్యము.

ఈమె యిప్పుడు పోవు సమయంబున నీమె వైచుటచే నాకసంబున నుండి పడుచు చెట్లకొమ్మలకుఁ దగులుకొని కొంచెము చినిగి క్రోఁతులు చూచుచుండఁగా పడిన పచ్చని బంగారు వన్నెగల యుత్తరీయము సొమ్ములు నీమెయే విడిచెను.

ఇందును మోసము లేదు. సుగ్రీవుఁడు సీతాభూషణములను శ్రీరామునకుఁ జూచినపుడవి చెడక యుండెను. ఆకాశమునుండి కొండమీఁద వైచి నపుడు సొమ్ములు విఱిగి తునకలై పోకుండునా యను సందేహమును వాల్మీకి యిచ్చటఁ బరిష్కరించుచున్నాఁడు. సీతాదేవి బండలమీఁద బాఱ వైవ లేదు. చెట్టుమీఁదఁ బడునట్లు మూటను వేసెను. అది చెట్టు కొమ్మలకుఁ దగిలి యచ్చటనుండి నేలఁబడెను, గావున సొమ్ములు తునుకలు గాలేదు.

క. చిరకాలంబీ వసనము, ధరియింపంబడుట మాపు♦తగిలియు రంగుల్
బరికింపఁగ నా చీరకు, సరియై యొప్పారె కాంతి ♦ సంపద వన్నెన్. ౪౫౦

తాత్పర్యము.

అది యెట్టులందువా? అక్కడ చీర కొంగే పచ్చని వన్నెగలదో యీ పచ్చని వన్నెగలది గానే యీయామె చీరయున్నది. అయినను యిది చిరకాలము ధరింపఁబడుటచే నుతుకుట లేకుండుటచే నీ చీర రంగు మాసినను కాంతియందు వన్నెయందు నా చీరకు సరిపోలి యున్నది.

ఉ. ఈ కనకాంగి రాము హృద♦యేశ్వరి దేవెరి దూరవిప్రవా
సాకుల యయ్యు రాముహృద♦యంబున నెప్పుడుఁ బాయకున్న, ద
స్తోకము రామచంద్రు నెడఁ ♦ దోఁచు సురూపము నంగసౌష్ఠవం
బీ కువలాక్షి యందుఁ బరి♦దృశ్యము లయ్యెను యుక్తమే కదా? ౪౫౧

ఈమె సీతయే యనుటకు మఱికొన్ని కారణములు చెప్పుచున్నాఁడు.

అర్థములు. దూర విప్ర వాసాకుల=దూర దేశమున మగని విడిచి కలఁత చెందినది, సురూపము=సౌందర్యము. అంగసౌష్ఠవము=అవయవ పరిపూర్తి, పరిదృశ్యము లయ్యెను=చక్కఁగాఁ గానవచ్చుచున్నవి, యుక్తము=న్యాయము, రాము హృదయంబునన్=రామునిన్ దన హృదయంబున – అనియు, తాను రాముని యొక్క హృదయమునం దుండి యనియు నర్థము గ్రహింపవలెను. ఇట్లు చెప్పుటచేఁ బరస్పరానురాగము చెప్పఁబడెను. ఈ యర్థము బాలకాండమున ౧౩౬౮ వ పద్యము నందు శ్రీ రఘురామ చంద్రుఁడును... మనం బా రమణీ లలామ పయి నారని కూరిమి నిల్పి యామెయున్ గూరిమిఁ బేరిమిం జెలఁగఁ గూర్చె మనంబు సదా హృదీశుపై'' అని చెప్పఁబడెను.

ఇట్లు చెప్పుటచే శ్రీరామచంద్రునకు హృదయేశ్వరి సీతాదేవి, శ్రీ సీతాదేవి హృదయేశ్వరుఁడు శ్రీరామచంద్రమూర్తియని యేర్పడెను. ఈకారణమున నిరువురు నేకాభిప్రాయము గలవారే యని యేర్పడు చున్నది. ఆమె యేది యనినది ఆయన కాదనఁడు. ఆయన యేదనినది యామె కాదనదు. సీతానుగ్రహము వచ్చిన రామానుగ్రహము వచ్చినట్లే. రెండవ వారి యందసూయ లేక యుండవలెను.

తాత్పర్యము.

ఈమె సీతయే యనుటకు నాలుగవ కారణ మే మనిన :- ఈమె రామునకు హృదయేశ్వరి. రాణి కావున దూర దేశమందు మగని విడిచి యుండినను రామచంద్ర మూర్తిని హృదయమునందు వదలక నిలిపియున్నది. రామునియొక్క హృదయము నందు నీమె యెడఁబాయ కున్నది. ఇఁక నైదవ కారణమేమన - సాముద్రిక శాస్త్ర ప్రకారము రామునం దేయవయవసౌష్ఠవము గలదో యట్టి సౌష్ఠవముగలవానికి నెట్టి యవయవ సౌష్ఠవము గలది భార్యగా నుండవలయునో, యట్టి యవయవ సౌష్ఠవ మీమె యందుఁ గానవచ్చుచున్నది, కావున శాస్త్రప్రకార మాయన కీమెయే భార్య యయి యుండవలె, నీమె కాయనయే భర్తయై యుండవలెను. ఇది న్యాయ్యమే కదా. ఇది శాస్త్రప్రమాణము.

ఈ పద్యమందు శ్రీరామచంద్రు నెడఁ దోఁచు నంగసౌష్ఠము లీ కువలాక్షి యందుఁ బరిదృశ్యము లయ్యె నని సీతారాముల కైక్యము చెప్పఁబడెను. మగని చిహ్నము లాఁడుదానియందు, నాఁడుదాని చిహ్నములు మగవాని యందున్న వని చెప్పరాదు. కావున నిక్కడ సామ్యమే గ్రహింపవలెను.

క. శ్రీరాఘవుఁ డీమెకుఁగాఁ, గారుణ్యం బానృశంస్య♦గరిమయుఁ గడు దు
ర్వారపుశోకము మదనుఁడు, గారింపఁగ వేఁగునట్టి♦కాంత యిదేయౌ. ౪౫౨

అర్థములు. కారుణ్యము=దయ, ఆనృశంస్యము=క్రూరత్వము లేకుండుట, వేఁగు=పరితపించు.

తాత్పర్యము.

మీఁద వివరించిన యైదుకారణములచే నీమె రాముని భార్య సీతాదేవియే యని నిశ్చయించు చున్నాఁడు. శ్రీరామచంద్రమూర్తి యేమె నిమిత్తము దయ, యక్రూరత్వము, వారింపరాని శోకము, కామము బాధింపఁగాఁ బరితాప పడు చున్నాఁడో యామె యీమెయే. రామచంద్రమూర్తి భార్యనిమిత్తమై శోకించుట కీ నాలుగు కారణములు. ఇవి క్రింది పద్యమున వివరింపఁబడు చున్నవి.

సీ. ఆపదవేళల♦నంగన నొక్కర్తుఁ బ్రోవలే దనెడి కా♦రుణ్యమునను
నన్ను నమ్మినదాని♦కిన్ని పాట్లబ్బిన, నైఁచితి నను నా♦నృశంస్యమునను
సర్వాంగలక్ష్మిని♦సకట కోల్పడితిఁగా, సుందరి వనియెడి♦శోకమునను
నొద్ద లేదామెఁగా♦యొప్పులకుప్ప నా, ప్రియ యన్న వెరవేఁకి♦వేఁకరమున
తే. సకట యీ నాలుగింటను♦నడలు చుండు
రామచంద్రుండు హృదయ మీ♦రామయంద
నిలిపె నీమెయుఁ బతియంద♦నిలిపె మనముఁ
గాన బ్రదికిరి వీరలు♦గడియ యైన. ౪౫౩

అర్థములు. అర్ధాంగలక్ష్మిని = తన దేహమునందు సగభాగమైన దానిని, కోల్పడితిఁగా = పోఁగొట్టు కొంటిని, రూ. కోలుపోవు - కొల్లపోవు - కోల్పోవు. వెరవేఁకి వేఁకరమునన్ = విరహజ్వరముచే.

అర్ధాంగలక్ష్మి - 'లోకే వేదేచ శాస్త్రేచ ధర్మశాస్త్రేషు చైవ హి, శరీరార్ధం స్మృతా జాయా, పుణ్యాపుణ్యఫలే సమే.

లోకవ్యవహార మందు వేద మందు స్మృతు లందు ధర్మశాస్త్ర మందు భర్త దేహములో సగము భార్య. అట్లులే పుణ్యపాపములందు నని యర్థము.

అర్ధోవా ఆత్మనో యత్పత్నీ॥
శాస్త్రప్రయోగా ద్వివిధాచ్చ వేదా
దాత్మాహ్యానన్యః పురుషస్య దారాః॥

ద్వేధాకృత్వాత్మనో దేహం, మర్ధేన పురుషోఽభవత్ । అర్ధేన నారీ తస్యాం, సవిరాజ మసృజత్ప్రభుః॥ మమ వైనైవ రేమే తస్మా దేకాకీ నరమతే! సద్వితీయ మైచ్ఛత్ ! సహైతావా నాస యథా స్త్రీపుమాంసౌ సంపరిష్వక్తౌ । స ఇమే మేవాత్మానం ద్వేధా పాతయత్తతం పతిశ్చపత్నీ చాభవతాం తస్మాదిద మర్ధబృగల మివ స్వ ఇతిహస్మాహ యాజ్ఞవల్క్య స్తస్మాదయ మాకాశః స్త్రియా పూర్వతపవతాగ్ం సమభవ. త్తతో మనుష్యా అజాయంత । బృహ. దా. ౪. బ్రా, ౩వ మంత్రము.

యో భర్తా సా స్మృతాంగనా । మను ౯. ౪౫.
యోభర్తా సైవ భార్యా స్మృతా - వాజసనేయ బ్రాహ్మణము.

కస్సవితా? కా సావిత్రీ? పురుషఏవ సవితా, స్త్రీసావిత్రి।సయత్ర పురుష స్తత్ స్త్రీ । యత్రవాస్త్రీ సపురుష । స్తేద్వే యోనీ తదేకం మిథునమ్॥ సావిత్ర్యుపనిషత్తు.

ఈ ప్రమాణములు పురుషునిలో సగముభార్యయని చెప్పుచున్నవి. కావున భార్యాభర్తృ సంబంధము జన్మాంతము లందును దప్పదు. ఈవిషయ మయోధ్యాకాండము నందుఁ గిష్కింధాకాండము నందుఁ జర్చింపఁ బడెను.

తాత్పర్యము.

శ్రీరామచంద్రమూర్తి సీతాదేవికై దుఃఖించుటకు హనుమంతుడు నాలుగు కారణములు చెప్పుచున్నాఁడు.

౧. పురుషుఁడగువాఁడు ఆఁడుకుయిలు ఆలకుయిలు విన్నంత మాత్రమునఁ దనప్రాణమిచ్చియైన వారిని రక్షింపవలయును. ధర్మశాస్త్రమిట్లుండఁగా నాపదవేళ నొక్క యాఁడుదానిని నేను క్షత్రియుఁడనై యుండియుఁ గాపాడలేక పోయితిని. గాదా యను సర్వ భూతదయ.

౨. ఆ స్త్రీ యైనను అన్య స్త్రీ గాదు. నేను దన్ను రక్షింపఁగల నని నమ్మి తన రక్షణభారము నామీఁద వైచి వేఱు రక్షణము గోరక సర్వ సౌఖ్యములు వదలి యన్ని కష్టములు పడుచు నా వెంట వచ్చినది. అట్టి దానికి నెట్టి కష్టము రానీయక కాపాడవలసి యుండఁగా నిన్ని కష్టము లామె పడుచుండినను ఆశ్రయ మగు నేను దేరగాని వలె సహించితిని. నే నెంత క్రూరుఁడను?

౩. నన్ను నమ్మి వచ్చినది పానిస కాదు. రక్త బంధువు కాదు. నా దేహములో సగమైనది. నా కుడిభాగము నేను రక్షించుకొను విధముగా నెడమ భాగము రక్షింపవలయును. అట్లు రక్షింపకుండిన నాకే హాని? అంతటి భారము నాయం దుండియు నటువంటి సుందరిని బోఁగొట్టుకొంటిని. నా దేహము నే కాపాడుకొన లేనివాఁడను. నే నేమి మగవాఁడను, నే నేమి క్షత్రియుఁడను?

౪. మాకుఁ బరస్పరానురాగ ముండినను, లేకుండినను అది భార్య-భర్తవ్య యని, నేను భర్త-పతి యని యుండు నటుకు దానిని భరింపవలసిన పాలింపవలసిన భారము నాయం దున్నది. అంతమాత్రమే కాదు. సీతాదేవి యొప్పులకుప్ప. సమస్త సద్గుణరాశి. అవగుణము లేనిది. ప్రియురాలు. నాయందు ప్రేమగలది. ఇట్టిది సమీపమం దుండినను 'ఒనరభార్యాసమేతుఁడై యున్న వాని కెంత లాపద లయ్యును నెఱుకపడవు' అన్నట్లు లామె సాన్నిధ్యమాత్రమే నా కష్టములు కష్టములుగాఁ దోఁపనీయదు. విశేషము లేకున్నను ఆమెతో సింపుగా మాట లాడుచుండినను జాలు. అదియు లేకుండఁ జేసికొంటిని గదా. లక్ష్మణునకు వలె వెంట లేకుండిన నే వ్యసనము లేదు. ఉండిపోయిన దుఃఖ మెక్కువ. ఈ వియోగము నే నెట్లు సహింతు ననియెడి మదన తాపమునను.

ఈ నాలుగింట రామచంద్రమూర్తి బాధపడుచున్నాఁడు. ఈ నాలుగవది లేకుండిన రామచంద్రమూర్తి నపుంసకుఁడో, షండుఁడో మనుష్య స్వభావ శూన్యుఁడోయని చెప్పవలసియుండును. ఈ కారణములచే రామచంద్రమూర్తి కేవల కాముకుఁడై దుఃఖింపలేదని యేర్పడుచున్నది. రామచంద్రమూర్తి యీమె యందుఁ దనమనస్సు నిలిపెను. ఈమె రామచంద్రమూర్తియందు మనస్సు నిలిపెను. కావున వీరి మనస్సులెచ్చట న్యాయముగా నుండవలయునో యచ్చటనే యున్నవి. దేహములు మాత్రము వేఱుగా నున్నవి కాని మనస్సు లేకముగా నున్నవి. కావున నేవీ రిరువురు బ్రతుకఁగలిగిరి. ఆయనమనస్సు ఈమెయందు లేకుండినను ఈమె మన స్సాయన యందు లేకుండినను ఇరువురు మరణించి యుందురు. జీవాత్మ పరమాత్మల కీ సంబంధము నెఱుంగునది.

క. ఎంతటిదుష్కరమును భూ, కాంతుఁడుఘటియించె నీమెఁ గనకయు బ్రదికెన్
జింతావ్యథఁ జిక్కండును, వింత గదే మిగుల రామవిభుచరితంబుల్. ౭౫౫

అర్థములు. దుష్కరము = చేయుటకు మిగులఁ గష్టమైనది.

## తాత్పర్యము.

ఈమెతోఁ సరససల్లాపములాడకుండినఁ బోనీ, సంభోగింపకుండినను మాననీ, కనులనైనఁ జూడక యీమెను విడిచి యిన్ని దినములుగ బ్రదికియున్నాఁడే. బ్రదికియుండుటే కాదు, చింతచే బాధపడకున్నాఁడే. రామచంద్రమూర్తి యెంతటి యసాధ్య కార్యమును జేసెను.

ఆయుస్సు తన స్వాధీనము గాదు. కావున బ్రదికియున్నాఁ డనుకొందునా. చింతచేతఁ గూడ శుష్కింపకున్నాఁడే. ఏడువలేదా యందునా. ఏడ్పున కేమి. ఏమాత్రము ప్రీతిగలవారు పోయినను దుఃఖమువచ్చును. అంతియకాని యట్టిదానిని బోఁగొట్టుకొనియీమెవలెనిద్రచాలించెనా? ఆహారము చాలించెనా? పడుక పెట్టెనా? ఈ వియోగమునకుఁ దగినంత కార్య మేమిచేసెను. రామచంద్రమూర్తి నడవడి మిగుల నాశ్చర్యకర మైనదే. ఏమి యీయన యింద్రియ జయము. ఋశ్యమూకమందు రామచంద్రమూర్తి యీమెకై యేడ్చుచుండుట చూచి యయ్యో యింతటి ధీరోదాత్తుఁడు మహానుభావుఁడు ఒకయాఁడుదానికిఁ గానిట్లేడ్చుచున్నాఁడే. ఎంత కామదాసుఁడు, ఎంత యింద్రియజితుఁడని తలఁచితిని గాని యీమెను జూచిన తరువాత రామచంద్రమూర్తి పాషాణ హృదయుఁడనియే చెప్పవలసి యున్నది.

రాముఁడు భూకాంతుఁడు గనుక బ్రదికెను. 'నిండు మనంబు నవ్యనవనీత సమానము, పల్కు దారుణాఖండల శస్త్రతుల్యము, జగన్నుత విప్రులయందు నిక్క మీ రెండును రాజులందు విపరీతము' రాజులకు వాక్కు తీపెగాని, మనస్సు వజ్రకఠినము. కావున బ్రదికెను. భూకాంతుఁడు అచేతనమైన భూమిని అశ్వగజరథాదుల నామోదింపఁజేయుఁవాఁడే కాని ప్రథమ ప్రణయపాత్రమైన భార్యను రంజింపఁజేయు నంతటి రసికుఁడు గాఁడు కావున బ్రదికెను.

బ్రదికెన్ = బ్రదికియున్నాఁడే. అది యాశ్చర్యము. సీతాదేవిని విడుచుట వలన నెంత దుఃఖము కలుగవలయునో యంత దుఃఖము రామున కున్న యెడల బ్రదికియుండునా? బ్రతుకక యేమిచేయుమనెదవు? ఆత్మహత్య చేసికొనుమనెదవా? అక్కఱలేదు. ఈమెనువిడుచుటవలన నెంతదుఃఖముకలుగవలయునో యంతదుఃఖము కలవాఁ డయ్యెనేని ప్రాణములు తమంతటఁ దామేయీశరీరమును విడిచి కాలుచున్న యింటిలో మనుష్యు లుండక పోవునట్లు పోయి యుండును. ఈయన ప్రయత్న మక్కఱయే లేదు. అట్లైన సీత ప్రాణ మేల పోలేదు. ఆమెకు దుఃఖము లేమికదా యందువేమో? సీత పరతంత్ర, భర్తయాజ్ఞలేక మరణించుటకు నధికారము లేదు. ఆమె దేహము, ప్రాణము రామునిసొత్తే. ఆమె యెట్లు పోఁగొట్టఁ గలదు. అవి పోయెద మన్నను నామె బిగఁబట్టవలెను. రాముఁడు స్వతంత్రుఁడు. దేహము వదలిపెట్టవలసి యుండెను. వదలిపెట్టక బిగఁబట్టి యున్నాఁడే. అదియే యసాధ్యకార్యము.

అన్యత్ర భీష్మా ద్గాంగేయా । దన్యత్ర చ హనూమతః
హరిణీఖురమాత్రేణ । చర్మణా మోహితం జగత్.

గంగానందనుఁడైన భీష్ముఁడుహనుమంతుఁడు వీరిరువురుతప్పదక్కినప్రపంచ మంతయునాఁడుజింక గిట్టంతచర్మమునకు మోసపోయియున్న దియనిజితేంద్రియుఁడని ప్రసిద్ధిగన్న హనుమంతుఁడుకూడరామచంద్రమూర్తిసీతాదేవినివిడిచియుండుట చెడు కార్యమని నిందించుచున్నాఁడు. ఎంతటి దుష్కరమును రామప్రభుఁడు సలిపెను. ఎంతటి దుష్టకార్యమును రామభూవిభుఁడు చేసెను. ఏమి చెడుకార్యము చేసె నందువా? ఎట్లీమెను విడిచి యల్పకాలమైన మాయామృగమువెంటఁ బోయెను. సీతాదేవి కోరినఁగదా పోయెను, అందువా? సీతాదేవి స్త్రీ. బుద్ధి చపలత స్త్రీస్వభావము. 'పెడతలనుండఁగా యువతి బృందముకెల్లను బుద్ధి' యన్నట్లువారు కోరికలు కోరుదురేకాని దానివలనవచ్చు మేలుకీళ్ల నాలోచింప శక్తిగలవారుగారు. నిజముగ నీమె మీఁదఁ బ్రేమయే యుండిన నీమెను విడిచి తుచ్ఛమృగమునకై పోవునా? ఆమెకోరిక నెఱవేర్పవలసి యుండినఁ దానే పోవలయునా? లక్ష్మణుని బంపరాదా? అది మూర్ఛపోయి పడునట్లు అచ్చటినుండియే కాకిమీఁద వైచినట్లు సమ్మోహనాస్త్రము వేయరాదా? అటుచేయక, యిటుచేయక యీమెను విడిచి పోయెనే. అదియే చెడ్డకార్యము. అట్లు చేసినకదా యిప్పు డీమె నింత కష్ట పెట్టు చున్నాఁడు. రాముఁడు గనుకఁజేసెను. రాముఁడనఁగా పైకిరమణీయమైన యాకా రము గలవాఁడే కాని లోపలఁ దెలివి తేటలు గలవాఁడుకాఁడు. కనుకనేకదా నీవు పురుషవేషము వేసికొన్న యాఁడుదానివని సీత చెప్పెను. అంతటి తెలివి లేని వాఁడైనచో భూకాంతుఁ డెట్లయ్యె నందువా. విభుఁడుగదా. వి+భు = భూ సత్తాయాం అన్నట్లు సామర్థ్యము లేనివాఁడు గదా విభుఁడు. అది యే మట్టు లనెదవు? ప్రేమము తెలివితేటలు సామర్థ్యము లేనివాఁడు తన తోడ నరణ్య మునకుఁ బిలుచుకొని వచ్చెనా యందువేమో? ప్రేమగలవాఁడయ్యేనేని నే నరణ్య మునకుఁ బోయెద ననఁగా నేను వచ్చెదనని సీతాదేవి చెప్పినట్లు చెప్పక నీవు నా వెంట రావల దనునా? ఇది ప్రేమగలవాని లక్షణమా? ఆమె యీయనయం దత్యంత ప్రేమగలది కావున నీయనను విడిచి యుండలేక వెంట వచ్చెదనని పోరాడి బలాత్కరించి సాధించెను. ఆమె పోరాటము పడలేక పిలుచుకొని వచ్చెనుగాని లేకున్నఁ బదునాలుగేం డ్లామెను విడిచియుండ బ్రయత్నించెను గదా. ఇదియా ప్రేమలక్షణము. పదునాలుగేం డ్లుండఁ గలవానికిఁ బదినెల లేమిలెక్క? కావున రాముఁడు చేసినది చెడుకార్యమే. అక్కడ రాముఁ డేడ్చుటఁజూచి యీయన నిజమైన నిండారుప్రేమ గలవాఁడని తలఁచితిని గాని యీమె యుండు స్థితిఁజూచిన నాకు నిప్పు డాయన దయలేనివాఁ డనియే తోఁచుచున్నది.

ఘటయింఛెక్ = ఎంత మతిమాలినవాఁ డైనను దన సంసారమును దాను

జెఱుచుకొనునా యందువేమో? చెఱచుకొనునా యని సందేహమేల? ఘటి యించెన్ = చేయనేచేసెనుగదా. ముంజేతి కంకణాని కద్దమేల? తన తెలివిలేమికిం దా ననుభవించునుగాక! నిష్కారణముగ నిటువంటి నిష్పాపను నింత కష్టములపాలు చేసెంగదా. దానికై నే నేడ్చెదను?

తనతండ్రి కాముకుండై భార్యకు వశపడితన్నిట్లు కష్టపెట్టుననిగదా రాముండు చెప్పెను. (అయోధ్య ప.) తానో భార్యయం దుంచవలసిన ప్రేమ యుంచకకదా నిష్కారణముగ నీమె నింత కష్టపఱచెను. తమ్ముండు, పెండ్లా మిరువురు తనకు సేవ చేయ నుండినను ఊరువిడిచి రావలయుననిన నంత కష్టపడినవాం డొంటరిగ మనుష్య ముఖదర్శన ప్రాప్తిలేక రాక్షసులచేతిలోంజిక్కి యెంత కష్టపడుచున్నదో యాలో చించెనా? కావున రామచంద్రమూర్తి చేసినది చెడుకార్యమే. ఏల యిట్లు చేసెను? ప్రణయవిద్య యందు నాయనకు ఓనమాలుకూడ రావు. గనుక ప్రణయ మనునది తెలియక చేసెనేకాని తెలిసి చేసినవాండు కాండు.

దుష్కరమును = భార్యను విడిచియుండుట దుష్కరమేని లోకములో భార్యలు లేనివా రెందఱు లేరు. వా రందఱును దుష్కరమును జేసినవారా? కారు. 'అనన్యాహి మయా సీతా భాస్కరేణ ప్రభా యథా' సూర్యునకు నెండవలె సీత నా కనన్య; నన్ను విడిచి యుండదు; ఆమెను విడచి నే నుండను అని చెప్పినవాండు కదా రాముండు. ఎండనువిడిచి సూర్యుం డుండుట సుకరమా? ఎండనువిడిచి సూర్యునివలె సీతను విడిచి రాముం డుండుట దుష్కరము కాదా. ఎండలేని సూర్యుండు తేజోహీ నుండు, పూజ్యుండు కాండు. ఎండవలని మేలునకై కదా లోకులు సూర్యుని బూజిం చుట. ఎండలేని సూర్యుని నెవరు పూజింతురు. అట్లులే సీతాదేవి తనతోడ లేదేని దాను దేజోహీనుండు, అపూజ్యుడు అని కూడ నాయనకుం దోంచినది కాదు కదా. అట్లయిన నెట్లు విడిచి యున్నాండనిన, భూకాంతుడు గనుక భూమి (రాజ్యము) ఆయనకుం గాంతము = ప్రియమైనట్లు సీత కాలేదు. కావున మృగముమీంది కాంక్షచే సీతను విడచి పోయినట్లు రాజ్యకాంక్షచే సీత నుపేక్షించెను.

క. ఎంతటిదుష్కరమును దుర్దాంతపరాక్రముండు నల్పు ♦ రాముండు సీతా
కాంత మదిరాయతాంబక, చెంతను లేకున్నం ద్రుటియు ♦ జీవముదాల్చెన్.

అర్థములు. దుర్దాంత పరాక్రముండు = అణంపరాని విక్రమము గలవాండు, మదిర + ఆయత + అంబక = సారాయమువలె మోహింపంచేయు దీర్ఘములైన నేత్రములు కలది. త్రుటియు = అల్పకాలమైనను.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి నిజముగ దుష్కర కార్యమే చేసెనని దృఢపఱుప, దానినే మఱియొక విధమునం జెప్పుచున్నాండు. 'ఆదరాద్వియుక్తి' యని కలదు గదా,

దుర్దాంత పరాక్రముండు = అణఁపరాని పరాక్రమముగలవాఁడు. ఇచ్చట శత్రువులకని చెప్పుట యప్రస్తుతము. ఇచ్చటశత్రువులింద్రియములే. ఇంద్రియములను నణఁపరాని మనోబలము కలవాఁడు కావుననే కామమునకు వశపడక బ్రదుకఁ గలిగెను.

మదిరాయతాంబక:— మదిరా = సారాయమువలె, మత్తును గలిగించు, ఆయత + అంబక = దీర్ఘములైన కన్నులు గలది. మదమనఁగాసంతోషము. సంతోషాతిశయముచే దేహము దెలియకుండఁ జేయునది మదిర. అట్టిగుణముగలదీర్ఘ నేత్రములుగలది. సారాయముత్రావినవానికి దేహము తెలియకపోవునట్లు లామెకన్నులు చూచిన నంతటి సంతోషము గలుగునని భావము. సారాయమువలెఁ ద్రాగ వలసిన పనిలేదు. దగ్గఱనుంచుకొని చూచుచుండినఁ జాలును. దానివలె నల్పకాల ముండు నది కాదు శాశ్వతముగ నుండునది. చెంతను లేకున్న = అనుభవింపక పోయినను ఊరక సమీప మందుండినను జాలును. త్రుటియర్ = మత్తు వస్తువులు సేవించు వారు దానిని వేళకుఁ దీసికొనక క్షణ మాలసించిన వెఱ్ఱిమెత్తినట్లయి మిగులబాధ పడుదురు. విశేషాభ్యాసముగలవారు చావనే చత్తురు. అట్లుండ నిన్ని సంవత్సరము లనుభవించుచుండి యిప్పుడు తటాలున నీమెను వదలి క్షణమైన నెట్లు బ్రదుకు చున్నాఁడు. ఇది దుష్కరమేకదా. సారాయము మనుష్యుఁడైన వాని కెట్టివానికైన దేహవిస్మృతి కలిగించి తబ్బిబ్బు పడఁజేయును. బండమీఁదఁబోసిన నేమగును. అట్టులే యీమె కన్నులాయనకు మత్తు కలిగింపలేదు. కావున ఆయన హృదయము గుండో, రాయియో యై యుండవలెను.

జీవముఁ దాల్చెను = జీవుని ధరించెర్. జీవితేశ్వరియగు నామె పోయిన పిమ్మట నాకేమిపనియని జీవుఁడు పోవఁదలఁచినను బోనీయక బిగఁబట్టెను. ఇది దుష్కరమేకదా. ఇంతటి యసాధ్యకార్యములు సాధించు రామచంద్రమూర్తి సామాన్యుఁడని యెట్లుచెప్పవచ్చును. ఇది చేయగలినవాఁ డెంత యసాధ్య మైన కార్యమైనను జేయఁ గలవాఁడే.

దుష్కరమును హేమాహేమీలు ఘటాఘటీలగు వానరులందరు మాచేతఁ గాదు మాచేతఁగాదని చెప్పినదానిని సముద్రముదాఁటి లంకప్రవేశించి రావణునకు దెలియకుండ లంకంతయు శోధించి సీతను జూచి నేనే యసాధ్య కార్యమును జేసితి నని గర్వించితిని కాని రామచంద్రమూర్తి చేసిన కార్యము నెదుట నేను జేసినది గొప్పగాదు.

క. అని జానకిఁ గని పావని, మనమున సంతోష మగ్న♦మానసుఁ డగుచున్
ఘనుఁ బ్రభుని రాము నెంతయుఁ,గొనియాడె న దెంతవాఁడొ♦కో యతఁడనుచున్.

౧౫ వ సర్గము.

తాత్పర్యము

అని తలఁచుచు జానకీదేవిని జూచి మాసినచీరతో స్నానములేని దేహముతో నిద్రాహారములు విడిచి భర్తనే ధ్యానముచేయు నిట్టి పరమపతివ్రతను జూచు నదృష్టము నాకుఁ గలిగెఁగదా. వానరు లందఱు బ్రదికిరిగదా. సుగ్రీవుఁడు కృతజ్ఞుఁడయ్యెఁ గదా. రామలక్ష్మణుల కార్యము నెఱవేఱెఁ గదా యని సంతోషములో మునిఁగిన మనస్సు గలవాఁడై ఘనుఁడును ప్రభువును నగు రామచంద్రమూర్తిని 'ఆహా యాయన యెంతగొప్పవాఁడో' గాకున్న నిట్టిస్త్రీకి భర్తయగునా? ఎంతటి జితేంద్రియుఁడు గాకున్న నీమెను విడిచి బ్రతుకునా? ఎంతటి ప్రభువు=సమర్థుఁడు గాకున్నఁ బోనున్న ప్రాణముల నిలుపఁ గలుగునా? ఇంత కార్యముచేయఁ గలుగునా; ప్రభుః=ప్రభవతి సమర్థో భవతీతి ప్రభుః-భూ సత్తాయాం-సమర్థుఁడగువాఁడు ప్రభువు. అని రామచంద్రమూర్తి సామర్థ్యమును బొగడెను.

—♦ ౧౯-వ సర్గము. హనుమంతుఁడు సీతాదేవి స్థితికి దుఃఖించుట. ♦—

ఉ. రాము గుణాభిరాము నల♦రామ నుతించి ప్రశంసితవ్యఁ జిం
తామథితాత్ముఁడై పవన♦నందనుఁ డశ్రులు గ్రమ్మ కన్నులన్
రాముని దేవిఁ గూర్చి యవు♦రా యనుచున్ దలపించి మూర్తమి
ట్లా మహిమాఢ్యుఁ డుండి తద♦నంతర మిట్లని యేడ్చె దుఃఖియై. ౪౫౭

అర్థములు. గుణాభిరామున్=గుణములచే నభిరాముఁ డగువానిని, అల=ప్రసిద్ధికెక్కిన, ప్రశంసితవ్యన్=గుణములచే బొగడఁ బడఁదగినదానిని; ఆయన రాముడు, ఈమె రామ; ఆయన గుణాభిరాముఁడు, ఈమె ప్రశంసితవ్య కావున నిరువురు సమానులని భావము. సీతారాములు గుణములందు సమానులు. వాత్సల్య సౌలభ్యముల యందు సీత రాముని కంటె శ్రేష్ఠురాలు కావున నిరువురు కలసిననే గుణసంపూర్తి. లేకున్నఁ గొఱఁతయే. పరతంత్రగావున రాముని కంటెఁ దక్కువ. చింతామథితాత్ముఁడు = చింతచేఁ జిలుకబడిన మనస్సు గలవాఁడు. అశ్రులు = కన్నీళ్లు, మహిమాఢ్యుఁడు = మహిమయను సంపత్తిగలవాఁడు. గొప్ప గుణములను నవి లోకమున నెవికలవో యవి యన్నియు హనుమంతునందుఁ గలవు. దుఃఖియై=దుఃఖము గలవాఁడై.

తాత్పర్యము.

గుణాభిరాముఁడగు రాముని గుణములచేఁ బ్రశంసింపఁదగిన ప్రసిద్ధికెక్కిన సీతను హనుమంతుఁడు పొగడి చింతచే వ్యాకులపడిన మనస్సుగలవాఁడై యాంజనేయుఁడు కన్నీళ్ళు కారఁగా రామచంద్రమూర్తి భార్యయగు సీతాదేవి నుద్దేశించి యారా యీయామె యెటువంటి యుత్తమురాలు. ఇటువంటి యామె కెటువంటి కష్టము వచ్చెను, అని యేడ్చి యీప్రకార మీగొప్ప గుణసంపత్తిగల హనుమంతుఁడు కొంచెము సేపుండి మరల దుఃఖము సైఁపలేక యిట్లేడ్చెను.

క. శీలవతి గురువినీతుం, డౌ లక్ష్మణునకును మాన్య ♦ యతని గురునకున్
మేలిప్రియ సీత వగచినఁ గాలము దురతిక్రమంబె ♦ కా యెవ్వరికిన్. ౮౫౮

అర్థములు. శీలవతి = పతివ్రత, గురువినీతుండు = మిక్కిలి జితేంద్రియుఁడు. (౨) మిక్కిలి వినయముగలవాఁడు. (౩) గురువులచే శిక్షింపఁబడినవాఁడు. లక్ష్మణునకును = లక్ష్మణు నంతవానికిని, మాన్య = పూజింప నర్హురాలు. దురతిక్రమంబెకా = అతిక్రమింపరానిదే కదా. ఎవ్వరికిన్ = ఎంతటివారికైనను.

తా త్ప ర్య ము .

ఈమె మహాపతివ్రత. ఆ కారణముచేతనే యీమె కెట్టి యాపదయు రాఁగూడదు. అంతియగాక, మిక్కిలి జితేంద్రియుఁడు 'తరుణీకుణప మన్నట్లు పరస్త్రీలను శవములవలెఁ జూచువాఁడు. అటువంటి లక్ష్మణునకు మాన్య— పెద్దలగు జ్ఞానులచేఁ జక్కఁగా శిక్షింపఁబడిన మనస్సుగలవాఁడు. కావున పరిపక్వమైన మనస్సుగలవాఁడు. అటువంటి లక్ష్మణునకును మాన్య, 'యస్య దేవే పరాభక్తి ర్యథాదేవే తథా గురౌ' అన్నట్లు భగవంతునం దెంత భక్తియో యంతభక్తి యన్న యందుఁ గలవాఁడు. అటువంటి వానికిని మాన్య. అంతియ కాదు. అటువంటి లక్ష్మణుని గురువునకు మిక్కిలి ప్రియురాలు. అంతటివాని గురు వీమె యం దెంత గొప్పతనము లేనిదే యీమె యందుఁ బ్రియము గలవాఁ డగునా? అటువంటి సీత. ప్రకృతి కతీత. అందఱవలెఁ బాంచభౌతికమైన గర్భమునుండి కర్మానుభవమునకై పుట్టినది కాదు. అట్టి యీమెకే వ్యసనము ప్రాప్తించిన నిఁక లోకము నందుఁ గాలము నతిక్రమించువాఁ డెవఁడు? అది యెవ్వని కెంతవానికి సాధ్యముగాదు.

కాలము దురతిక్రమం బను నీతి రామాయణమునఁ బలుతావుల బోధించుచున్నది. కావున నా నీతిని నెక్కువగ మనస్సునం దుంచికొని సర్వము కాలాధీనముగదా యని దుఃఖసంతోషములకుఁ బాలుపడరాదు. జగద్రక్షకులైన రామలక్ష్మణులు రక్షించు నప్రాకృతమైన సీతకే యీ లోకమునకు వచ్చిన కారణమున నిన్ని కష్టములు ప్రాప్తించెనే, ఇఁక మన మనఁగా నెంత యని సముద్రమున పైపై నలలు కదలిన లోఁతున నీళ్ళు కదల నట్లు మనస్సు పరితాపపడినను బుద్ధిని వ్యాకుల పడనీయరాదు. సహింపవలెను, యుద్ధ ౨౬౨౧ పద్యము జూచునది.

క. రాముని వ్యవసాయంబును, ధీమత్సౌమిత్రిమతముఁ ♦ దెలియుట సీతా
భామామణి కలఁకం గన, దేమియు వానలకు వేల్పు ♦ లేటి విధమునన్. ౮౫౯

అర్థములు. రాముని వ్యవసాయంబును = రామచంద్రమూర్తి నిశ్చయమును, రామచంద్రమూర్తి తన యాశ్రితులను వారి ప్రయత్నము నపేక్షింపకయే తానే సర్వప్రయత్నములుచేసి వారి నేవిధముగనైన రక్షించువాఁడు 'వ్రతమిది నాకున్ విడిచెదఁ బ్రాణము లైనను' అని యాశ్రితరక్షణమును దనప్రాణమిచ్చియైనఁ జేయువాఁడు

రామునినిశ్చయ మిట్టిదని తెలియును గావునను, ధీమత్ = బుద్ధిమంతుడైన, ఇచ్చట మత్ అనునది మతుప్ ప్రత్యయము, 'భూమ నిందా ప్రశంసాసు, నిత్యయోగేతి శాయినే సంబంధోస్తి వివక్షాయాం, భవంతి మతుబాదయః॥' సిద్ధాంతకౌముది. 'తదస్యాస్త్యస్మిన్నితి మతుప్' పాణిని. V 2-94 ధ్యాయం త్యనయేతి ధీ. దీనిచేఁ జక్కఁగా ధ్యానముచేయుదురు. కావున ధీ = బుద్ధి. కావున ధీమంతుఁడనఁగాఁ బ్రశంసింపఁదగిన చక్కని యాలోచనతో నిత్య సంయోగము గలవాఁడు. అనఁగా నాయనబుద్ధి ప్రమాదపడదని యర్థము. మాయామృగము విషయమున సీతారాములిరువురు ప్రమాద పడినను లక్ష్మణుఁడు ప్రమాదపడలేదు. అది మాయామృగమనియే చెప్పెను. మారీచుని కూఁత విషయములో సీత పొరపడినను లక్ష్మణుఁడు ప్రమాదపడలేదు. తనరక్షణమందుఁ దా నవివేకముగ సీతవర్తించెను గాని లక్ష్మణుఁడు తన్ను రక్షింపఁ బట్టుపట్టియే యుండెను అందు సౌమిత్రి, సుమిత్ర కొడుకు. తన్నుఁ దల్లివలెఁ జూచుకొమ్మనికదా యామె చెప్పెను. ఆమాట ప్రకారము తమ యందు మాతా పితృ గౌరవమేకాని ద్వేషబుద్ధి గలవాఁడు కాఁడు. లక్ష్మణుఁడట్టి వాఁడని సీతకుఁ దెలియును. వేల్పు ఏటి విధమునన్ = గంగానదివలె, గంగానది వానకాలమందు బురద నీళ్ళు వచ్చిపడినను నలుపై పోదుగదా.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి నిశ్చయము, బుద్ధిమంతుఁడగు లక్ష్మణు నభిప్రాయము దెలిసిన దగుటచే సీతాదేవి వానకాలమున మడ్డి నీళ్ళెన్ని పడినను స్వభావ శ్వేత గుణముల వదలని గంగవలె నీమెయు గుండె నిబ్బరము గలదై యున్నది. లేకుండిన నెప్పుడో గుండె పగిలి చచ్చియుండును.

క. రామున కీ యసితేక్షణ, రాముఁడు నీ సతికిఁ దగును ♦ ప్రాయమునందున్
శ్రీమానిత శీలంబుల, సాముద్రికలక్షణముల ♦ సద్వంశమునన్, ౪౬౦

అర్థములు. అసితేక్షణ = కాటుక కన్నులది, ప్రాయము = వయస్సు. శ్రీ మానిత శీలంబులన్ = సంపత్కరమై గౌరవింపఁబడఁ దగినస్వభావగుణములచేత.

తాత్పర్యము.

రామచంద్రమూర్తికీ కాటుక కంటి సీతయు, రాముఁడీ పతివ్రతకు వయస్సునందు శోభాకరములై గౌరవింపఁదగు స్వభావగుణము లందు సాముద్రిక లక్షణము లందు సద్వంశమునఁ బుట్టుట యందుఁ దగియున్నారు. అది యెట్టులన—

రాముఁడు నసితేక్షణుఁడే, సీతయు నసితేక్షణయే. ఒకరు సీత మాత్రమే యసితేక్షణ, రాముఁడు కాఁడు. ఆకారణమున సీతయందది యాధిక్యమని వ్రాసిరికాని యది సరికాదు. కిష్కింధాకాండము ౧౦౦౦ వ పద్యమందు "వికసితమేచక కంజ

తుల్య దర్శనీయుఁ డని రామచంద్రమూర్తి చెప్పఁబడెను. కావున నిరువురు నసితేక్షణులే. అయినను స్త్రీలయందు స్వభావసిద్ధమైన సౌందర్యమొకటి యతిశయించి యుండుటచేతను సీతకన్నులు తనకన్నులకంటె మోహజనకంబు లని రామచంద్రమూర్తి 'నేనొక క్షణంబసితేక్షణ లేక మేనిపొందిక బ్రదుకంగనేర'నని (సుందర. ౧౪౧౩ ప) చెప్పుటచే సీతాదేవికన్నులే సౌందర్యమునతిశయించె ననిభావము. అట్టి కన్నులకరుణార్ద్ర దృష్టి నాపై నెప్పుడు పడునో కదా. ప్రాయమునందుఁ = వయస్సునందు. వివాహకాలమునకు రామచంద్రమూర్తికిఁ బండ్రెండేండ్లు. సీతాదేవికి నారేండ్లు. రాముని యేండ్లలో సగము సీతాదేవికిఁ గలవు. కావునఁ దగినవయస్సే. ఈడులేని పెండ్లి రసాభాసము, శాస్త్రవిరోధము. 'వర్షైరేకగుణాం భార్యాముద్వహేత్త్రిగుణోవరః। ద్వ్యష్టవర్షాష్టవర్షాంవా వయోమాత్రావరాచ యా' విష్ణుస్మృతి. అనఁగా కన్యక యెనిమిది యేండ్ల దగునేని వరుఁడు పదునారేండ్ల వాఁడైగాని యిరువది నాలుగేండ్ల వాఁడై గాని యుండవలెను.

ఈ లెక్క వివాహ సమయమందే గాని యావలఁ గాదు. ఇప్పుడు శ్రీరామచంద్రమూర్తికి ముప్పదితొమ్మిది సంవత్సరములు. సీతాదేవికి ముప్పదిరెండు సంవత్సరములు. విష్ణు పురాణము కూడ వరునివయస్సులో మూఁడవవంతు వధువున కుండవలెనని చెప్పుచున్నది.

సీతారాములు వయస్సు నం దెట్లు తగి యున్నారో శీలమునం దట్లులే తగి యున్నారు. ఎట్టులనిన:— రామచంద్రమూర్తి 'వానియెడ నుండెనేని యేదేని దోషమద్ది గర్హ్యంబుగాదు సదాళుల, కనిచెప్పెను. సీతాదేవియో'

వధకుఁ బాత్రుల పట్లఁ గృపఁ జూపవలయు సజ్జనుఁ డపరాధము చేయనట్టి యతఁడుం గలఁడే' యని చెప్పెను.

సాముద్రిక ప్రకారము సార్వభౌముఁడు కాఁగలవాని చిహ్నములు రామచంద్రు నందుఁ గలవు. అట్టివానికి భార్యగా నుండఁదగిన దాని కెట్టి చిహ్నము లుండవలయునో యట్టివి సీతయందున్నవి. వంశమునందు నొకరు సూర్యవంశమునఁ బ్రసిద్ధికెక్కినవారి కుమారుఁడు. సీతాదేవి చంద్రవంశమున జగత్ప్రసిద్ధి గన్న జనకుని కూతురు.

ఈ సందర్భమున నీ స్తోత్రము పఠనీయము.

అయోధ్యాపురనేతారం, మిథిలాపురనాయకీం
రాఘవాణా మలంకారం, వైదేహీనా మలంక్రియామ్,
రఘూణాం కులదీపంచ, నిమీనాం కులదీపికామ్
సూర్యవంశ సముద్భూతం, సోమవంశ సముద్భవామ్

పుత్రం దశరథశ్యాఽపి, పుత్రీం జనకభూపతేః
వసిష్ఠాను మతాచారం, శతానంద మతానుగామ్
కౌసల్యా గర్భసంభూతం, వేదిగర్భోదితాం స్వయమ్.
పుండరీక విశాలాక్షం, స్ఫురదిందీవరేక్షణామ్,
మత్తమాతంగ గమనం, మత్తహంసవధూగతామ్.

*     *     *     *     *

సర్వలోక విధాతారం, సర్వలోక విధాయినీమ్
లోకాభిరామం శ్రీరామం అభిరామాంచ మైథిలీం
అన్యోన్య సదృశౌ వేతౌ త్రైలోక్య గృహదంపతీ.

(హనుమద్విరచిత సీతారామ స్తోత్రమునుండి సముద్ధృతము.)

'స్మరణమాత్ర సంతుష్టాయ' యన్నట్లు స్మరణముచే సంతోషించు వాఁడు రామచంద్రమూర్తి. ఒక్క నమస్కారముతో సంతోషించునది జానకి. 'ప్రణతి ప్రసన్న జానకి' యని యీ కాండమే చెప్పుచున్నది.

ఇట్టి యనురూప దాంపత్యము లోకమునందుఁ గలదా యని హనుమంతుఁ డాశ్చర్య పడుచున్నాఁడు.

ఇచ్చట నీ శ్లోకార్థము గ్రాహ్యము.

యువత్వాదౌ తుల్యేఽప్యపరవశతా శత్రుశమన
స్థిరత్వాదీన్ కృత్వా భగవతి గుణాన్ పుంస్యసులభాన్
త్వయి శ్రీ స్త్రైకాంతాన్ మ్రదిమ పతిపారార్థ్య కరుణా
క్షమాదీన్ వా భోక్తుం భవతి యువయో రాత్మని భిదా॥

తల్లీ! యౌవనములోనైన గుణములు మీ యిద్దఱ యందు సమానములే. అయినను స్వాతంత్ర్యము శత్రుసంహారము స్థిరత్వము (స్వకార్యము నుండి చలింప కుండుట) యీ మొదలగు పురుషులయం దుండఁదగు గుణములు నీభర్తయం దున్నవి. నీయందో మృదు హృదయము, భర్తృ విషయమున పారతంత్ర్యము, కరుణ, (ఇతరుల దుఃఖముల సహింప లేకుండుట) క్షమ (అపరాధముల సహించుట) గలవు. ఈ యీ మొదలగు గుణములు మీ స్వరూప విగ్రహములను ననుభవించుట యందు భేదము గలదు. ఈ కారణముచే భక్తుల కిరువురును సేవ్యులే కాని యొకరు మాత్రము గారు. ఈ సందర్భమున వీరి యిరువురి సామ్యము గుఱించిన ఈ ప్రమాణ వాక్యంబులు స్మరణీయంబులు. "నిత్యైవైషా జగన్మాతా, విష్ణోః శ్రీ రనపాయినీ। యథా సర్వగతో విష్ణు, స్తథైవేయంద్విజోత్తమ॥" జగన్మాత యగు శ్రీ దేవి విష్ణువునకు నిత్యానపాయిని. ఇరువురకు వేఱుపాటు లేదు. ఒకరున్న చోట రెండవ వారు తప్పక యుందురు.

త్వం మాతా సర్వలోకానాం, దేవదేవో హరిః పితా
త్వయా చ విష్ణునా చాంబ! జగద్వ్యాప్తం చరాచరమ్.

అమ్మా! సర్వలోకములకు నీవు తల్లివి; దేవదేవుఁడగు హరి తండ్రి; మీ యిరువురిచేఁ బ్రపంచ మంతయు వ్యాపింపఁబడినది.

లక్ష్మ్యా సమస్తం చిదచిత్స్వరూపం
వ్యాప్తం తదీశస్య తు సాఽపి సర్వమ్
తథాపి సాధారణ మీశితృత్వం
శ్రీ శ్రీశయో ర్ణ్వాచ సదైక శేషి।

చిద చిత్స్వరూపము సమస్తము లక్ష్మీదేవిచే వ్యాప్తము. దానిని నియమించునది యామెయే. అయినను యీశత్వము శ్రీ శ్రీశులయందు ఇరువురయందు సమానము. సర్వదా ఏక శేషులే.

ఒక మాటచే నిరువురఁ దెలుపునది యేక శేషము. జనని + జనకుఁడు = ఈ యిరువురను జెప్పవలసి వచ్చినపుడు జనకులు అనినఁజాలును. ఇట్టులే భ్రాతలు = అన్న, చెల్లెలు, అక్క తమ్ముఁడు. పుత్రులు = కొడుకు, కూతుఁరు.

ఇట్టులే భగవంతుని పేరు చెప్పినపుడు భగవతి లక్ష్మికూడ నున్నట్టులే భావింపవలయును.

ఈ విధముగ సర్వకారణత్వము సర్వవ్యాపకత్వము సర్వనియంతృత్వము లక్ష్మీనారాయణు లందు సీతారాములయందు నిరువురయందుఁ గలదు.

భగవంతుని విషయమై 'సర్వస్య వశీ-సర్వస్యేశానః॥' అనియు 'విశ్వస్యాత్మేశ్వరగ్ం' వాక్యములుండిన లక్ష్మి విషయమై 'అస్యేశానా జగతో విష్ణుపత్నీ, ఈశ్వరీగ్ం సర్వభూతానా' మిత్యాది వాక్యములు గలవు.

కావుననే న్యాసవిద్యయందు శరణాగతి యిరువురకుఁ జెప్పఁబడెనే కాని యొకరికి మాత్రమే చెప్పఁబడ లేదు. "లక్ష్మీంచ మాం సురేశేశ, ద్వయేన శరణంగతః మల్లోక మచిరా ల్లబ్ధ్వా మత్సాయుజ్యం స గచ్ఛతి। నిరుపాధిస్వతంత్రశ్చ స్వామినః కరుణానిధిః నిరుపాధిస్వతంత్రాచ స్వామినీ నః కృపానిధిః। త్వమేవ సర్వ శాస్త్రేషుశరణత్వేన నీయసే। ఆత్మాత్మీయంచ యత్కించ దుర్భరం దుస్త్యజం మమ।తత్సర్వం తవవిన్యస్తం శుభయోః పాదపద్మయోః।ఉపేయస్య తవప్రాప్త్యై త్వా ముపాయత్వయా వృణే। ఉపాయో భవ మే దేవ శరణం భవ మేఽచ్యుత। ఉపాయో భవ మే దేవి, శరణం భవ మేంఽబుజే।

*  *  *  *

సకృదేవం ప్రసన్నస్య, కృత్యం నైవావశిష్యతే ।
చంద్రాం ప్రభాసాం యశసా జ్వలంతీం
శ్రియం లోకే దేవజుష్టా ముదారాం
తాం పద్మనేమీం శరణ మహం ప్రపద్యే
అలక్ష్మీ ర్మే నశ్యతాం త్వాం వృణే.

ఈ విధముగ శ్రుతు లిరువురకు శరణాగతి విధించుచున్నవి. ఇరువుర యం దుపాయత్వము గలదు. ఉపేయత్వము గలదు. హనుమంతుఁడు చంపఁబూనిన రాక్షస స్త్రీలను తనకు శరణాగతలైన స్త్రీలను దానే స్వతంత్రించి రక్షించెగదా. ఇత్యాది కారణములచే సీతారాము లిరువురు సమానులుగ సేవ్యులనియే హను మంతుఁడు గ్రహించెను.

క. అని బంగరు బొమ్మనఁ ద్రిభు, వనములకు వేల్పుసాని ♦ వరలక్ష్మివలెన్
గన నగుసీతను గనుఁగొని, మనమున రాముని దలంచి♦మఱియుంబలికెన్. ౨౯౧

తా త్ప ర్య ము

అని బంగారు బొమ్మవలె, లేక మూఁడులోకములకు వేల్పుసాని= ఈశ్వరి యగు, వరలక్ష్మివలె = శ్రీ మహాలక్ష్మివలె నుండు సీతాదేవిని జూచి మనస్సున రాముని దలఁచి యిట్లనుకొనెను.

బంగారు బొమ్మ యనుటచే సుగుణముల రాశియనియు హేయగుణ రహిత యనియు లోకుల యందఱచేతఁ గోరఁబడునది యనియు భావము. 'హిరణ్మయీం లక్ష్మీ' మ్మని కదా, శ్రీ సూక్తము. త్రిభువనములకు వేల్పుసాని యనుటచే మూఁడు లోకములలోని వా రామె యాజ్ఞాబద్ధు లని భావము.

'యథా మయా జగద్వ్యాప్తం – స్వరూపేణ స్వభావతః తయా వ్యాప్తమిదం విశ్వం నియంత్రీ చ తథేశ్వరీ! సర్వేషా మేవ లోకానా మీశ్వరీ మమ వల్లభా॥' నేనెట్లు స్వరూపగుణములచే లోకమున వ్యాపించి యున్నానో లోకముల కెల్ల నీశ్వరి యగు నా వల్లభయు నట్లే వ్యాపించి యున్నది. ఆమె యీ లోకములకు నీశ్వరి యను శ్లోకార్థ మిట ననుసంధించునది.

యథా సర్వగతస్త్వంహి, తథైవేయం రఘూత్తమ. వ. పు. నీ వెట్లు సర్వత్ర వ్యాపించి యున్నావో రామచంద్రా! యీామెయు నట్లే వ్యాపించి యున్నది.

లోకేశ్వరి యనిన శచీ సరస్వతీ పార్వతీత్యాదు లందెవరో యనిసందే హము గలుగకుండుకై వరలక్ష్మి యనియె స్పష్టముగఁ జెప్పుచున్నాఁడు. సంస్కృతమున ఇవ శబ్దము ఏవార్థమున గ్రహించినట్లు ఇచ్చటవలె ననునది నిర్థా మందు గ్రహింపనగు.

పై పద్యమునందు సీతాదేవిని మనుష్యభావమునఁ జెప్పెను. ఆమెను మఱియుఁ బరీక్షించి యమానుష లక్షణము లుండుట గ్రహించి దేవతాస్త్రీలలో నీమె యెవతయై యుండు నని విచారించి లక్ష్మీదేవియే యని తీర్మానించుకొనుచున్నాఁడు. హనుమంతుఁడు రామచంద్రమూర్తిని తొలుత దర్శించినపుడు రామచంద్రమూర్తి నాలుగుచేతులతోఁ గనఁబడఁగా నీయన సామాన్యమనుష్యుఁడు గాఁడు, భగవదవతారమూర్తియని గ్రహించెను. ఇచ్చట లక్ష్మీత్వముసుస్పష్టముగా సీతయందుఁ గాన వచ్చెను.

వేల్పుసాని యనుచో "బ్రహ్మేశాది సురవ్రజ స్సదయితః త్వద్దాసదాసీగణా" యను శ్లోకార్థము గ్రహింపనగు.

స్వరూపం స్వాతంత్ర్యం భగవత ఇదం చంద్రవదనే
త్వదాశ్లేషోత్కర్షా ద్భవతి ఖలు నిష్కర్ష సమయే
త్వమాసీ ర్మాత శ్శ్రీకి మితు రిద మిత్థం స్త్వవిభవ
స్తదంతర్భావా త్త్వాం న పృథ గభిధ త్తే శ్రుతి రపి॥

తల్లీ! భగవంతుని స్వరూపము స్వాతంత్ర్యము ఎట్టిది యని విచారించి నిష్కర్ష చేయవలసి వచ్చినపుడు నీసంయోగాధిక్యమును బట్టి యాయన కవి గలుగుచున్న వని చెప్పవలసి యున్నది. అనఁగా సకలసమృద్ధిస్వరూప వగు నీవున్న చోటనే యాయన యుండును గనుక నే శ్రీనివాసుఁ డని పేరుగల వాఁడయ్యెను, అని నిన్నుఁ బట్టి యాయన గుణములు స్వరూప స్వభావములు తెలియవలసి యున్నవి. కనుక శ్రుతులు నీవు భగవంతునికంటె భిన్నమని చెప్పవు.

సీ. ఈ కాంతకై కదా ♦ యిషువున నొక్కంట, బలశాలి యవ్వాలి ♦ భంగపడియె
నీ వెలందికె కదా ♦ రావణతుల్యవీ, ర్యుండు గబంధుఁడు ♦ రూపు మాసె
నీ మానినికె కదా ♦ భీమవిక్రముఁ డైన, యనిరోధుఁడు విరాధుఁ ♦ డంత మొందె
నీ నెలంతకె కదా ♦ కానలోఁ బదునాల్గు, వేలరక్కసులకుఁ ♦ బేరు మాసె
తే. నీమెకై కాదె ఖరఖలు ♦ నామ మణఁగె, నీ సతికిఁ గాదె త్రిశిరుండు ♦ నీల్గి చనియె,
నీ సుదతికయి దూషణుం ♦ డే పడంగెఁ, బటుపరాక్రముఁ డగు రామ ♦ భద్రుచేత.

ఈప్రకార మీయామెయే రామచంద్రమూర్తి భార్య సీతాదేవి యని నిశ్చయించుకొని యామె మాహాత్మ్యము మనస్సునకుఁ దెచ్చుకొని మఱియునిట్లనుకొనుచున్నాఁడు.

అర్థములు, ఇషువు = బాణము, అనిరోధుఁడు = అడ్డము లేనివాఁడు,

రామచంద్రమూర్తి చేయు కార్యములకన్నిఁటికిని మూలకారణ మీయామెయే కదా యనుకొనుచున్నాఁడు.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి బలశాలియగు వాలిని నొక్క బాణముచే జంపుట యీామె కొఱకే కదా. ఈమె కొఱకే కదా రావణునితో సమానమైన బలవీర్యములుగల కబంధుఁడు రూపు మాసిపోయెను. యుద్ధమునం దెదురులేని భయంకరమైన పరాక్రమము గల విరాధుఁడు చచ్చుటకీమె కదా కారణము. ఈమె నిమిత్తముగాఁ గదా జనస్థానమందుఁ బదునాలుగువేల రాక్షసులు నాశమైరి. ఖరుఁడు – త్రిశిరుఁడు – దూషణుఁడు రామచంద్రమూర్తిచేఁ జచ్చుటకు నీమెకదా కారణము.

ఇన్నిఁటి యందుఁ గారణము సీతాదేవి. కర్త శ్రీరామచంద్రమూర్తి. ఇవన్నియు మనస్సునం దుంచుకొనియే రావణు విషయము నందును నిమిత్తము శ్రీరామచంద్రమూర్తి యనియు నిమిత్తమ కారణము సీతాదేవి యనియు౧౩౩౬ వ పద్యమున హనుమంతుడు వానరులకుఁ జెప్పెను. చేయించునది సీతాదేవి. చేయువాఁడు రామమూర్తి. నిగ్రహానుగ్రహముల రెంట నిదే నియమము.

ఉ. ఈమెకునై దురాలభక ♦పీశ్వరపాలితపూజ్యసంపదల్
శ్రీమహితార్కసంభవునిఁ ♦ జేరె నిమేషములోన, సాగరం
బీమెకుఁ గాదె నేను దరి♦యించితి, నీ పురిఁ గంటి, నీమెకై
రాముఁడు లోకమెల్ల మహిఁ ♦గ్రాఁచిన యుక్తమ నాకుఁ జూడఁగన్. ౪౬౩

అర్థములు. దురాలభ=లభింప సాధ్యముకానిది, అర్కసంభవునిన్=సుగ్రీవుని, గ్రాఁచినన్ = కాల్చినను.

తాత్పర్యము.

ఈమెకుఁగాను గదా దుర్లభమైన వానరరాజ్యసంపద నిమిషములో సుగ్రీవునికి లభించెను. ఈమె నిమిత్తమై కదా నేను సముద్రము దాఁటితిని. ఈ పట్టనము జూచితిని. ఈమెను దక్కించుకొనుటకై రామచంద్రమూర్తి గాని నేనుగాని చేసినయీా కార్యములు క్షుద్రములు. ఇవి యవి యననేల? ఈమె నిమిత్తమై రామచంద్రమూర్తి మూఁడులోకములు దహించినను దోషముగాదు. ఏల?

క, మేలో త్రిభువన రాజ్యము, మేలో జానకి యటన్న ♦ మేదినిసుతకున్
త్రైలోక్యరాజ్య మెల్లను, జాలదు పో యొక్కకళకు ♦ సరిపోలంగన్. ౪౬౪

తాత్పర్యము.

సీతాదేవి లేక మూఁడులోకముల ప్రభుత్వము వచ్చిన మేలా? మూఁడు లోకముల ప్రభుత్వము లేక యొక సీతాదేవిలభించుట మేలా? యనియాలోచించిన సీత కళలలో నొక్క కళకైనను నీ మూఁడులోకములు సరిపోఁ జాలవు. సీతాదేవి

యొక్కతె యుండెనా యిటువంటి ముల్లోకములు కోటానఁగోట్లు లభించును. ఆమె లేకున్న, యీ మూఁడులోకములుకూడ దక్కవు. కావున సీతను దక్కించుకొనుటకై యీ మూఁడులోకములను భస్మము చేసినను దోషము గాదు.

భగవంతుఁడనేక కోటి బ్రహ్మాండ నాయకుఁడు. లక్ష్మీదేవి యీయఖిలాండ కోటి బ్రహ్మాండములకు నాయకి. ఈ యనంత బ్రహ్మాండము లామెవలననే నామ రూపవంతములై స్థితి గలవై యున్నవి. అట్టి యామె కీ మూఁడులోకము లేమి లెక్క? ఇట్లు చెప్పుటచే లక్ష్మీదేవి (సీతాదేవి) సహధర్మచారిణియై భగవత్సంకల్పానుసారముగఁ దదాజ్ఞా వశవర్తినియై యాయనకుఁ బరతంత్రయై యుండు నని భావము.

ఆ. ఈమె ధర్మశీలుఁ ♦ డెంతో మహాత్ముండు, మిథిలనాథుఁ డగుచు ♦ మేల్మిగన్న
ప్రథితజనకుతనయ ♦ భర్తృదృఢవ్రత, యల్ల సీత సంద ♦ యంబు లేదు. ౪౬౫

అర్థములు, ప్రథిత = కీర్తికెక్కిన.

తాత్పర్యము.

ఈమె ధర్మగుణము గలవాఁడును నింతయని సెప్పరాని మహాత్మ్యము గలవాఁడును నగు మిథిలాధినాథుఁడగు జనకునికూఁతురు. పరమ పతివ్రతయగుసీతయే, సందేహము లేదు. ఆమెయందుఁగాకున్న నిట్టి లక్షణములు మఱి యొకతె యందుండవు.

సీ. తమ్మిపుప్పొడులయం ♦ దంబైన మడిదుమ్ము, రేఁచునాఁగటికొనఁ ♦ దోఁచె ధాత్రి
సత్యశీలుండైన ♦ జనకాపనీశుని, ముద్దులకూఁతురై ♦ తద్దఁ బెరిఁగె
అతివీరుఁ డార్యుండు ♦ నపరాజితుండైన, యాజికిఁ దొలికోడ ♦ లగుచు నెగడె
విదితాత్ముఁడును గృత ♦ విదుఁడు ధర్మజ్ఞుఁడౌ, రాముని మోహంపు ♦ రాణి యయ్యె
తే. గాంతుపైభక్తిఁ గష్టమర్మ ♦ చింత లేక, సౌఖ్యములఁ బాసిచొచ్చె ♦ నిర్జనవనంబు
నాకులలములుదినియింటి ♦ యందుఁబోలెఁ, బతిని సేవించుసతి దైత్య ♦ సతులఁజిక్కె.

అర్థములు. తమ్మి = తామర, ధాత్రి = భూమి, దాది, సత్యశీలుఁడు = సత్యము పలుకుటే స్వభావముగఁ గలవాఁడు, అపరాజితుఁడు = జయింపరానివాఁడు, ఆజికి = దశరథునకు, తొలికోడలు = పెద్దకోడలు; విదితాత్ముఁడు = ఆత్మజ్ఞానము గలవాడు, కృతవిదుఁడు = కృతజ్ఞుఁడు, మోహంపురాణి = ప్రియురాలు.

తాత్పర్యము.

తామరపుప్పొడులచే నందంబైనపొలము దుమ్మును రేఁగునట్లుచేయునాఁగటి కొనవలన భూమియందు, పుప్పొడిచే నందమైన తామరల దుద్దునందుఁ దోఁచు లక్ష్మీదేవివలె జనించి ధాత్రిని లోకమున కంతయు ధాత్రిజేసెను. ఆపిమ్మట సత్య

మైన శీలము, సత్యమే శీలముగాఁ గలిగిన జనకునకు ముద్దుకూతురై తనకు జనకుఁడగుటచే లోకమునకంతయు జనకుఁడను పేరువచ్చునట్లు చేయుచు బెరిగెను. (తనతోఁబుట్టినకారణమున చంద్రుఁడు లోకమున కంతయు మామయైనట్లు) ఆవల నతి పరాక్రమవంతుఁడును ఆర్యుఁడను సార్థక నామధేయము గలవాఁడును యుద్ధమునందుఁ బరాజయ మెట్టిదో యెఱుంగనివాఁడును, నగు దశరథునకు బెద్దకోడలయ్యెను. ఆత్మజ్ఞానముగలవాఁడును కృతజ్ఞుఁడును శరణాగతరక్షణ ధర్మ మెఱిఁగినవాఁడును, నగు రామచంద్రమూర్తికి ముద్దులరాణి యయ్యెను. ఇటువంటి మహానుభావురాలు భర్తపైగల భక్తిచేతఁ గష్టమను విచారమే లేక సౌఖ్యముల నెల్ల సమూలముగ వదలి పతిసేవ యథేచ్ఛముగఁ జేయవచ్చునని జనులులేని యడవికివచ్చి యాకలములుదిని స్వగృహమందువలె సంతుష్టచిత్తయై పతిని సేవించు మహాభాగ రాక్షసస్త్రీల నడుమఁ జిక్కుపడియున్నది. సీతాదేవికి నడవియందలి కష్టములు కష్టములుగాఁ దోఁపకుండుట కేమికారణము? భక్తిపూర్వకముగ మనస్సంతయు భర్తపైనుంచినది కావున. ఱాతినిద్రొక్కితినా కంపనుద్రొక్కితినాయని మనస్సు దానిపై నుండినఁగదా కష్టము తెలియును. మనస్సు మఱియొక విషయమున నానందించునపుడు తక్కినవెట్లు మనస్సునకు రాఁగలవు.

ఉ. సుందరిఁ గష్టదూర దర♦సుస్మితభాషిణి స్వర్ణవర్ణ రా
కేందునిభాస్య రాక్షసకు♦లేశ్వరపీడితం నీరువట్టుచే
వందురువాఁడు పెంజలువ♦పందిరి డాయఁగఁ గోరునట్టు లీ
కుందరదం గనంగ రఘు♦కుంజరుకోరుట యుక్తమే కదా. ౪౬౭

అర్థములు. కష్టదూర = కష్టములకు దూరముగ నుండఁదగినది, దరసుస్మితభాషిణి = కొంచెపుఁ జిఱునవ్వుతో మాటలాడునది, 'స్మిత మిహ వికాసి నయనం, కించిల్లక్ష్యద్విజం హసితం। మధురస్వనం విహసితం సాంగశిరఃకంపముద్ధసితమ్। అపహసితం సాస్రాక్షం విక్షిప్తాంగం భవత్యతిహసితం ద్వేద్వేహసితే చైషాముత్తమ మధ్యమాధ మాభిధే క్రమశః.

పెదవులు కదలింపక కన్నులచే నవ్వుట హసిత మనఁబడును. కొంచెముగా దంతము కనపడఁ బెదవులు తెఱచుట హసిత మనఁబడును. ఇవిరెండుత్తమ స్త్రీల లక్షణము. మధురముగ స్వరము వినవచ్చునట్లునవ్వుట విహసితము. దేహము శరీరము కదలునట్లునవ్వుట ఉద్ధసితము. దీని నేయపహసితమందురు. ఈ రెండునుమధ్యమ స్త్రీలలక్షణములు. కన్నీళ్ళు కాఱునట్లు నవ్వుట అపహసితము. విశేషముగ దేహమంతయు గదలునట్లు నవ్వుట అతిహసితము. పకపక వికవిక నవ్వులు దీనిలోఁ జేరినవే. ఇది యధమస్త్రీల లక్షణము. స్వర్ణవర్ణ = బంగారు చాయగలది. రాకేందునిభాస్య = పూర్ణచంద్రునివంటి ముఖముగలది, రాక్షసకులేశ్వరపీడిత = రావణునిచే

బాధింపఁబడునది, సీరువట్టుచే = దప్పిచే, వందురు వాఁడు = బాధపడువాఁడు, రఘుకుంజరు కోరుట = రాముఁడుకోరుట, షష్ఠీసమాసంబునఁ బ్రత్యయలోపము.

తా త్ప ర్య ము.

సీతాదేవి సౌందర్యముచేతనే యాదరింపఁదగినది. కష్టములెట్టివో యెఱుఁగక సుఖము లనుభవింపదగినది. ఉత్తమ స్త్రీ గావునఁ గొంచెపుఁజిఱునవ్వుతో మాట లాడునది, బంగారు చాయగల దేహము గలది, నిండు చందురుని వంటి ముఖము గలది. రావణుచే బాధింపఁబడునది. ఇట్టి దానినిదప్పి గొన్నవాఁడు పెద్ద చలువ పందిరి యొద్దకుఁ బోవఁ గోరునట్లు రామచంద్రమూర్తి చూడఁగోరుట యేమి యాశ్చర్యము? చూడఁగోరఁడేని దోషమాతనిదే కాని యామెది కాదు. చలువ పందిరి యొద్దకు దప్పి గొన్నవాఁడు పోకుండిన దోషమెవరిది? దుఃఖ మెవరికి?

క. రాజ్యపద భ్రష్టుఁడు దన, రాజ్యము లభియింప నలరు ♦ రహిని ద్రిలోకీ
పూజ్య యగు సీత మరలం, బ్రాజ్యంబుగఁ బొంది ముదము♦పడు రాముండున్.

తా త్ప ర్య ము.

రాజ్య సింహాసనమును బోఁగొట్టుకున్నవాఁడు తన రాజ్యమును మరల సంపాదించుకొని సంతోషించు నట్లు మూఁడు లోకములకు త్రివిధ జీవకోటులకు (బద్ధ - ముక్త - నిత్య) పూజ్యురాలగు సీతను రామచంద్రమూర్తి మరలఁ బొంది సుఖించును, సతోషించును.

దప్పిగొన్నవాఁడు - చలువపందిరి. రాజ్యము - భ్రష్టరాజు - ఈ రెండుప మానములు రామచంద్రమూర్తియే సీతను బొందుటకై కృషిచేసి యామె యున్న చోటికి వచ్చి యామెను గ్రహింపవలయు నని సూచించుచున్నది.. ఆ విషయ మున సీతాదేవి చేయవలసిన ప్రయత్న మేమియు లేదు.

ఉ. చుట్టములం దొఱంగినను ♦ జూఱలు వోయినఁ గామభోగముల్
నిట్టల మైన కష్టముల ♦ నెవ్వగఁ దాను మునింగి యుండినన్
నెట్టన ప్రాణనాథుఁ గన ♦ నిల్పి మనం బనయంబు నోర్పుతో
గిట్టక యున్న దీమె పిడి♦కింట నయో బిగఁబట్టి ప్రాణముల్. ౪౬౯

అర్థములు. తొఱంగినను = వదలినను, చూఱలు = కొల్లలు, నిట్టలము = అధికము, నెవ్వగన్ = నెఱ+వగన్ = నిండు దుఃఖమునందు, అనయంబు = సర్వదా, గిట్టక = మరణింపక.

తా త్ప ర్య ము.

దప్పిగొన్నవాఁడు చలువపందిరికై రాఁగా, నందు నీళ్ళు లేకుండెనేని యెట్లు పరితపించునో యట్లు రామచంద్రమూర్తి తన నిమిత్తమై యెంతో కృషిచేసి వచ్చి

నపుడు సీత తాను మరణించి యుండిన నెంత సంతాపపడునో యను భావముతో నాయన కట్టి సంతాపము కలిగింప నిష్టము లేక బంధువులందఱు విడిచినను, ఇష్టసౌఖ్యములు కొల్లపోయినను, ఎన్ని దీర్ఘకష్టములలో మునిఁగినను, సర్వకాల సర్వావస్థల మనస్సు తన భర్తయందే నిలిపి పోనున్న ప్రాణములను బోనీయక బిగఁబట్టియున్నది. ఆమె చేయఁదగినది యింతమాత్రమేగాక మఱియేమి చేయఁగలదు.

ఈ పద్యము మొదలు సీతాదేవి వృత్తాంతము ఏకమై, అనన్యమై, భగవత్ప్రాప్తి యెప్పుడో యెప్పుడో యనియే కోరుపరమభక్తుని ప్రపన్నుని చరిత్రము ననుకరించుచున్నది. లంక యందు స్త్రీలు,

౧. జన్మకర్మములచే రాక్షసు లయి రావణు వలచియుండువారు.

౨. జన్మకర్మములచే రాక్షసులు గాకపోయినను రావణుచే నపహరింపఁబడి లంకకు వచ్చిన పిమ్మట వానికి వశపడి యుండుటే సుఖమని యుండువారు.

౩. రావణుచే బలాత్కారముగ నపహరింపఁబడి లంకనుండి రావణుబారి నుండి తప్పించుకొని పోవు మార్గము తెలియక రక్షించువారు లేక క్షుద్ర సహవాసమని వాని సాంగత్యము రోసి వానికి విముఖులై లంక యందే పడి యుండువారు.

౪. బలాత్కారముగ లంకకుఁ దేఁబడినను రామచంద్రమూర్తిని నమ్మి యాయనయే రక్షకుఁడని విశ్వసించి యాయననే ధ్యానముచేయుచు లంకను, రావణుని సపరివారముగ దగ్ధముచేసి పోవలయు నని యుండు సీతాదేవి.

ఈ లోకమునం దీ నాలుగు తెగల మనుష్యులే కానవచ్చుచున్నారు.

౧. మొదటి తెగవారు పాపములోఁ బుట్టి పాపములోఁ బెరిఁగి యింద్రియ పరమార్థమని తలఁచి పరలోక విచారమే లేనివారు.

౨. ఉత్తమ వంశములలోఁ బుట్టినను స్వధర్మము నుండి చెడి కామదాసులై యింద్రియ సుఖములకుఁ బాలుపడినవారు.

౩. ఉత్తమ జన్మము లెత్తియు సంసారమునఁబడి కామమునఁ జెడ నొల్లక సంసారమునుండి తప్పించుకొను మార్గము తెలియక రక్షకులు లేక పరితపించుజీవులు.

౪. ఏదియో యల్ప పాపముచే సంసారమునఁ బడితి మని తలఁచి నిర్వేద పడుచు దీనినుండి తప్పించువాఁడు భగవంతుఁడు తప్ప వేఱొకరుఁడు లేఁడని విశ్వసించి తక్కిన యుపాయము లన్ని వదలి పరమభక్తినో, ప్రపత్తినో యాశ్రయించి యుండువారు.

సీతాదేవి తాను జెఱనుండి తప్పించుకొని పోవుటయే గాక తనవలె దుఃఖించుచున్న దేవగంధర్వనాగకాంతలను విడివడఁజేసినట్లు ఈ నాలుగవవారు తాము తరించి తమతోడి వారిని దరింపఁజేయుదురు. వీరికిఁ గావలసినదే రామాయణంబున సీతాచర్య నేర్పునది. దేహమునందుండు బద్ధజీవుఁడు కామ క్రోధాదులు, ఇంద్రియ

ములు తన్ను బాధించు చున్నను వానిని లక్ష్యపెట్టక దుఃఖమువలె సుఖంబులను గోరక భగవత్ప్రాప్తికై యెదురుచూచుచు భగవత్ప్రాప్తితప్ప వేఱుస్వర్గాదిఫలము గోరక భగవత్ప్రాప్తికి భగవంతునిఁ దప్ప, కర్మజ్ఞాన, యోగసాధన భక్తులను నుపాయముల వెదకక దేహాభిమానము స్వాతంత్ర్యము సంపూర్ణముగ వదలి స్వరక్షా భారముభగవంతుని మీఁదనే వైచి, అనన్యార్హ శేషత్వము, అనన్యశరణత్వము, అనన్యభోగ్యత్వమునను నాకారత్రయసంపూర్తిగలిగి సంసారమందుండియే తరింపఁగోరి ప్రపత్తిచేతనో, పరమ భక్తిచేతనో సాయుజ్యము పొందవచ్చునని సీతాదేవి చరిత్రమువలన మన మెఱుంగవలసి యున్నది. మీఁదఁ జెప్పిన విషయము లన్నియు సీతాదేవి చరిత్రయందు గమనింప నగు. సాయుజ్యలక్షణము యుద్ధకాండమునఁ జెప్పఁబడును. కావున భగవత్ప్రాప్తి కోరువాఁడు ఆయన యనుగ్రహప్రాప్తికై సీతాదేవివలె భగవన్నామోచ్చారణము చేయుచు స్వధర్మము వదలక మీఁదఁ జెప్పినట్లు వర్తించుట తప్ప మఱియేమియుఁ జేయవలసిన పనిలేదు. సీతాదేవి ప్రతిదినము సంధ్యవార్చుచుండెననుటచేపరమ భక్తుఁడైనను, ప్రపన్నుఁడైనను, జ్ఞానియైననుయావజ్జీవము నిత్యకర్మముల వదలరాదు. కామ్యకర్మములతోఁ బనిలేదు. ప్రపన్నుఁడు పరమభక్తుఁడు యజ్ఞాదులు చేయవలసిన పని లేదు. ప్రాణాయామ మభ్యసింప వలసిన పనిలేదు. ఆసనసిద్ధి పని లేదు. సన్న్యాస విషయము తలంపవలసిన పని లేదు. సర్వభూతదయ వదల రాదు. శత్రువులం దైనమైత్రియే చూపవలయును. ఇవన్నియు సీతాదేవి చర్యవలన మనము నేర్చుకొని బాగుపడవలసిన విషయములు. ఈప్రకారము వర్తించు వాని కీ జన్మాంతమునందే ముక్తి సిద్ధించును. సందేహము లేదు.

ఉ. చూడదు రాక్షసాంగనలఁ ♦ జూడ పుష్పఫలద్రుమంబులన్
జూడదు రమ్య హర్మ్యముల ♦ సుందరి డెందమునందు నెప్పుడున్
జూడఁగఁ గోరుచున్ భువన♦సుందరు రాముని నొక్కని న్మదిన్
వేడుక సేయ దయ్యో నవ♦నీసుత, యుక్తమె కా తలంపఁగన్. ౪౭౦

అర్థనులు, ద్రుమంబులన్ = చెట్లను.

తా త్ప ర్య ము.

సుందరియగు సీతాదేవి భువన సుందరుఁడైన శ్రీరామచంద్రు నొక్కని మాత్రమే చూడఁగోరుచు సర్వవేళల మనస్సంతయు నాయనయందే నిలిపి తన్ను బాధించు రాక్షసస్త్రీలను జూడదు. పూలచే పండులచే నిండి మనోహరమైన చెట్లను గాని యింపైన మేడలనుగాని చూడదు. ఇది తగినకార్యమే కదా. చూడదనుటకుఁ గన్నులుమూసికొనికూర్చుండినదనియర్థముగాదు. వానినిమనస్సులోకి రానీయ లేదని భావము. రాక్షసాంగనలఁ జూడ లేదనుటచే వారు పెట్టు బాధలను లక్ష్యము చేయ లేదని భావము. పండ్లు పూలచెట్లను జూడ లేదనుటచే ప్రియములమీఁద మనస్సు పోనీయలే దని భావము. ప్రియాప్రియములు రెండు వదలెనని భావము. సుందరి–

భువనసుందరుఁ గోరె ననుటచే నపహత పాప్మాది గుణములు శుద్ధాత్మయందుఁ బరమాత్మయందుఁ గలవనియు జీవునం దల్పముగను పరమాత్మయందుఁ బూర్ణముగను సంకోచ వికాసములు లేకయున్న 'వనియు శేష శేషిత్వ భావమును దెలుపుచున్నది. రాముని నొక్కని ననుటచే ఏకభక్తిని ఏకాగ్రభక్తిని అనన్యత్వమును జెప్పఁబడెను. యుక్తమెకా యనుటచేఁ బ్రసన్నునకుఁ బరమభక్తునకు నిట్టిచర్య తగును గదాయని భక్తాగ్రగణ్యుఁడగు హనుమద్దాసుఁ డామోదించుచున్నాఁడు. తాను బండితుఁ డైనవాఁడే కదా యెదుటివాని పాండిత్యము నెఱుగఁ గలఁడు. ఈ పద్యము భక్తుండు, ప్రపన్నుఁడు చాతకమువలె నుండవలయు నని బోధించుచున్నది. భూమి యందెన్ని చెఱువులు నదులున్నను జాతకము వానిలోని నీరు త్రావక మేఘములో నుండిపడు నీటిబొట్టుకై కాచి యుండును. అట్టులే భక్తుఁడు దేవతలెందఱున్నను దన యిష్టదైవమునే నమ్మి యేకభక్తి గలవాఁడై యుండును. అట్టులే పతివ్రతయుఁ దనభర్తకంటె ధనవంతులు, విద్యావంతులు, రూపవంతులు, బలవంతులు, లోకమున నుండినను వారినెల్లఁ దన భర్తకంటె నధములుగానే యెంచునుగాని వారిని బ్రేమించదు. వారివలననొకటి యాశింపదు. ఈ సందర్భముననీశ్లోకమున్మరింపనగు పూర్వార్ధము దండి చెప్పినది. ఉత్తరార్థము కాళిదాసు చెప్పినది.

'కేవా న సంతి భువి వారిరుహావతంసహంసావళీవలయునో జలసన్నివేశాః । కిం చాతక ఫల మపేక్ష్య సవజ్రపాతాౝ పాయోధరం (పౌరందరం) కలయతే నవవారిధారాః'.

క. వరభూషణములకంటెను, బరమం బగు భూషణంబు ♦ భర్తయె సతికిౝ
దరుణీమణి తద్భూషా, విరహితయై వనరుకతన ♦ వెలుఁగదు కంటే. ౪౭౧

తాత్పర్యము.

శ్రేష్టములయిన యాభరణములకంటె పతివ్రతకు శ్రేష్టమైన భూషణము భర్తతోడ నుండుటయే. ఆభర్త యను భూషణము సమీప మందు లేమిని నీమె యువతులలో నెంత గొప్పదైనను బ్రకాశింపక యున్నది.

భూషలుగావు మర్త్యులకు భూరిమయాంగద తారహారముల్ ......వాగ్భూషణమే సుభూషణము - భూషణముల్ నశియించు నన్నియు నన్నట్లు భూషణములకంటె గొప్పదియు యావజ్జీవముండునదియు నిహపర తారకమగునది యగు విద్యలోనయిన నన్నియు భగవద్భక్తి లేకున్నచో వ్యర్థములు. భక్తి లేని పండితుఁడు చాకిమూట మోయు గాడిదవంటివాఁడు. జీవునకు భర్త భగవంతుఁడే.

క. ఎంతటి దుష్కరమును భూ, కాంతుఁడు ఘటియించు నీమెఁ ♦ గనకయు బ్రదికెౝ
జింతావ్యథఁ జిక్కండు,న్వింతగ దే మిగుల రాము♦నిస్తులచరితల్. ౪౭౨

అర్థములు. నిస్తుల చరితల్ = అసమానమైన నడవడి. దీని తాత్పర్యమునకు ౪౫౪-౪౫౫ పద్యములు చూచునది. మరలనదియే చెప్పవలసిన కారణ మేమన: ఇందుఁ గ్రియభేదము. 'మమ ప్రాణాహి పాండవాః' 'సాధుల ప్రాణము నాయది సాధుల ప్రాణంబు నేను' అని చెప్పినవాఁడు తన ప్రాణము నొకచోటనుంచి తానొక చోట నెట్లుండఁ గలిగెను? లోకమున దేహము ప్రాణము నొకచోఁగూడియుండును గాని వేఱువేఱుగా నుండుటగలదా? ప్రాణమొకచోనుంచి తానొకచో జీవించుట దుష్కరముగదా. ఇట్టి యసాధ్యకార్యము రామచంద్రమూర్తి చేయుచున్నాఁడే; ఏమిపింత? ముందీవిషయము భార్యాభర్తృ న్యాయమునను సరించి చెప్పఁబడెను. ఇప్పుడు భక్త భగవన్న్యాయము ననుసరించి చెప్పఁబడెను.

క. అళినీలకుంతలాంతను, నళినీదలతుల్యనయన ♦ నవ్యసుఖార్హన్
గలకంఠి దుఃఖితం గనఁ, బలు కేటికినాకుఁ గూడ ♦ వ్యథపైకొనియెన్. ౪౬౩

అర్థములు. అళి = తుమ్మెదలవలె, నీల = నల్లనైన, కుంతలాంతను = వెండ్రుకల కొనలుగలదానిని, తలవెండ్రుకలు తెల్లనగుటకు కొనలయందుఁ బ్రారంభమగును. ఆ కారణముచేఁ దక్కిన భాగమందుండు నలుపుకంటెఁ గొనలయందు నలుపు తక్కువ. అట్టికొనలే నల్లనివని చెప్పినపుడు తక్కిన భాగముల నలుపు చెప్ప వలసిన పనిలేదు. నల్లని వెండ్రుకలు మోహకారులు.

గీ. ఇరుల గెలిచిన యంతఃపు♦రేందుముఖుల
కరుల మరుఁ డను వేఁటకాఁ ♦ డురులుచేసి
మరులు గొలుపంగ లేఁడయ్యె ♦ మనుజవిభుని
సరులులేని దృక్ఖంజన ♦ శాబకముల. శృం. నైష.

ఇట్లు చెప్పుటచే సీత తల విరియఁబోసికొని యున్నదని సూచన.

నళినీదళతుల్య = తామర రేకులవంటి, నయన = కన్నులుగలదానిని, ఇట్లు చెప్పుటచే కలువకంటి యగు సీత కన్నులయందుఁ బద్మముల సౌందర్యము గల దనియు నా కారణమున బద్మాక్షుఁడగు రాముని వశపఱుచుకొనఁగలిగెననియు భావము. నవ్యసుఖార్హన్ = క్రొత్తక్రొత్త సౌఖ్యములకు యోగ్యమైనది. కలకంఠి = మధురమైన కంఠస్వరము గలది. ఈమె దుఃఖించునపుడే యీమె కంఠస్వర మింత యవ్యక్తమధురముగా నున్నదే, సంతోషముతో మాట్లాడిన నెట్లుండునో కదా యని భావము, దుఃఖితన్ = దుఃఖించుదానిని వ్యథ = సంతాపము, పైకొనియెన్ = తనంతటఁదానే వచ్చి మీదఁబడెను; నాద్వంద్వ జయముకూడ వ్యర్థమై పోయెను.

తా త్ప ర్య ము.

తుమ్మెదలవలె నల్లని వెండ్రుకల కొనలుగలది, తామర రేకులవంటి కన్నులు

గలది, సాముద్రిక లక్షణములఁ బట్టి యెంతో సుఖింపఁదగినది, మధురమైన కంఠస్వరముగలది, ఇట్టిదికూడ వ్యసనములపాలగుటచేత, జితేంద్రియుఁడ నని ద్వంద్వాతీతుఁడనని గర్వముగల నాకుఁగూడ నా సమ్మతి లేకయే దుఃఖము తనంతఁదానే వచ్చుచున్నది. రామాంజనేయు లిరువురు విజితేంద్రియులే. నిర్ద్వంద్వులే. ఇరువురు సీతాదేవికై దుఃఖించిన వారే. ఏల ? పామరత్వముచేతనా ? కాదు. పరుల దుఃఖము తన దుఃఖముగా నెంచుట దయ. అట్టి దయ కారణము. బ్రహ్మచారిని, జ్ఞానిని, యోగిని, విరాగిని, క్రోఁతిని కావున మృగమను, సీతాదేవికి నాకు నింతకుఁ బూర్వ మెట్టి సంబంధము లేదు. అట్టి నాకే యీమె స్థితి దుఃఖము బలవంతముగాఁ గలిగింపఁగా భర్తయు ప్రియుఁడు రక్షాభారము వహించినవాఁడు, ఈమెచే సేవితుఁడు, ఆనంద మనుభవించువాఁడు నగు శ్రీరామచంద్రమూర్తి తనలో సగ మగు నీమెకై వ్యసన పడిన నేమివింత? అది స్వభావ విరుద్ధముగాదు. ఇట్టులే "జీవే దుఃఖాకులే విష్ణోః కృపా కాప్యుపజాయతే'' అన్నట్లు తన యంశమైన జీవునకుఁదాను భర్తగాను స్వామిగాను ఆధారముగను, శరణ్యుఁడుగ నుండియు నట్టి జీవుఁడు సంసారములోఁబడి దుఃఖించుచుండ జగత్పితయు, కరుణానిధియువాత్సల్యసాగరుఁడైన భగవంతునకుదయపుట్టకుండునా? వ్యసనపడకుండునా?

ఉ. రాముఁడు లక్ష్మణుంకుఁ దను ♦ రక్షణసేయ సుఖించు చుండు నీ
వామ క్షమర్ క్షమాతరుణిఁ ♦ బద్మవిలోచన రాక్షసాంగనల్
భీమవిలోకనల్ బెదరు ♦ పెట్టుచుఁ గావఁగ వృక్షమూలమం
దీమెయి నున్న దార! విధి ♦ కేది యసాధ్యము తప్పఁ జూచినన్. ౪౭౪

అర్థములు. క్షమన్ = ఓర్పునందు, క్షమాతరుణి = భూదేవి, భీమ విలోకనల్ = భయంకరములైన చూపులు గలవారు.

తాత్పర్యము.

రామచంద్రమూర్తియు లక్ష్మణుఁడు తన్ను రక్షించుచుండ సుఖపడవలసిన యీమె యోర్పునందు భూదేవి వంటిది, కమలముల వంటి కన్నులు గలది, చూచుటకే భయంకరములైన కన్నులు గల రాక్షస స్త్రీలు బెదరు పెట్టుచు రక్షింపఁగా చెట్టు మొదట నీవిధముగా నున్నది. భగవంతుఁడు దయతప్పి ప్రతికూలించినపుడు ఆయన కేది యసాధ్యము. అర్థాంతరన్యాసాలంకారము.

రాముఁడు, భగవంతుఁడు. లక్ష్మణుఁడు—ఇది యనంత గరుడ విష్వక్సేనాది.

నిత్య భాగవతుల కుపలక్షణము. ఇట్టి వారిచే రక్షింపఁబడు ప్రత్యగాత్మ; వామ = సంకోచ వికాసములకు లోనగు జ్ఞానము గలిగి భక్తిలేమిని ప్రతికూలముగ వర్తించి; క్షమా = ప్రకృతి తత్త్వమునందుఁబడి స్త్రీ వలె పరవశమై, పద్మవిలోచన = ప్రపంచ పదార్థములందు దృష్టికలదై; లంక యనెడి దేహములోఁ బడఁగా భయంకరములైన కామక్రోధలోభాదులు పీడించుచు ప్రకృతి విడిచి పోకుండునట్లు రక్షింపఁగా వృక్ష మూలమందు 'సమానవృక్షే' యను శ్రుతి, వృక్ష మనఁగా దేహమని బోధించుటచే వృక్షమూలమందనఁగా దేహమునకు మూలమైన హృదయస్థానమందు నీవిధముగ దుఃఖించుచున్నది. శుద్ధాత్మ యిట్లు బద్ధాత్మ యగుటకు భగవత్సంకల్పమే కదా కారణ మని భావము.

తే. మంచు సోఁకిన నెత్తమ్మి ♦ మాడ్కిఁ గాంతి, దఱిఁగి దుఃఖపరంపరఁ ♦ దప్త యగుచు
నంటుకానిని బాసిన ♦ పెంటిచక్ర,వాక మన సీత దీనత ♦ వనరు టయ్యె. ౪౭౫

అర్థములు. నెత్తమ్మి = అందమైన కమలము, తఱిఁగి = క్షీణించి, శరదృతువునఁ గళకళలాడుచున్న తామర పువ్వు మంచుకాలము రాఁగానే కాంతి క్షీణించిన దగును. అట్లీమె పండ్రెండుసంవత్సరము లయోధ్యలో సమస్త సౌఖ్యము లనుభవించుచుండి యిప్పు డాగంతుకముగ నిట్టి కష్టము లనుభవించుచున్నది. కాన కాంతిహీనయై యున్న దని భావము. మంచుసోఁకిన నెత్తమ్మి యనుటచే మంచు కాలము శిశిరఋతువు, నేఁడు రేపటితో వెళ్ళిపోవును. ఆవల వసంతము రాఁగానే యథాపూర్వము కాంతియుక్తమగును. అటులే యీమెకును దుఃఖము త్వరలోనే తొలఁగిపోవునని సూచన. దుఃఖపరంపరతప్త = ఒకటి వెంబడి యొకటి విరామము లేక దుఃఖముమీఁద దుఃఖమే వచ్చుటచే నెంతదుఃఖము సహింప సాధ్యమో యంతకుమించిన దుఃఖముచే బాధింపఁబడుచున్నదని భావము. కమలములు రాత్రి వచ్చిననే ముడుచుకొనిపోవును. దానికిఁదోడు మంచుకూడఁ గురిసిననే మగును ? అంటుకానిని = భర్తయగు చక్రవాకమును, పెంటిచక్రవాకము = ఆఁడు జక్కవ పక్షి. చక్రవాక దంపతులకు రాత్రివేళ వియోగము. కావున నెడబాసి రెండును విరహవేదనఁ దపించును.

"ఆయాతి యాతి పునరేవ జలం ప్రయాతి
పద్మాంకురాణి విచినోతి ధునోతి పక్షౌ
ఉన్మత్తవ ద్భ్రమతి కూజతి మందమందం
కాంతా వియోగ విధురో నిశి చక్రవాకః"

అన్నట్లు మగచక్రవాకమును బాసిన యాఁడుచక్రవాకము ఎట్లు తపించునో యట్లు తనభర్తను విడిచి యీమెయు దుఃఖించి యీమెయు దుఃఖించు చున్నదని భావము. చక్రవాకికి రాత్రివేళ భర్తృ వియోగము కలిగినను మరల నుదయము

కాఁగానే భర్తతోఁగలసికొందు నను నాశగలదు. అట్టులే యీయామెయు నాపదలు కాఁపురములు సేయవు, మంచికాలమువచ్చును, తనభర్త తన్నుఁ గలిసికొను నను నాశతో జీవించుచు ప్రకృతము దుఃఖపడుచున్నది. ఈ యుపమానములందు దుఃఖాశయము గ్రాహ్యమే కాని తక్కినవి గ్రాహ్యములు కావు.

తా త్ప ర్య ము .

మంచుసోఁకుటచేఁ గాంతి పోయిన కమలమువలె దుఃఖముమీఁద దుఃఖము వరుసగాఁ బ్రాప్తింపఁగా మిగులఁ బరితాప పడుచు తన భర్త యగు చక్రవాక మును బాసిన చక్రవాకి వలె సీతాదేవి దుఃఖించుచున్నది.

మానిని. పూవులబ్రేఁకన బ్రాలినకొమ్మలఁ ♦ బొల్చు నశోకమహాతరువుల్
తావులు నించుచు మాధవచారుసు♦ధాకరకాంతులు రేఁగుచు దుః
ఖావిలఁ జేయుచు నున్నవి యీ తర♦ళాక్షి నటంచు మనంబున నీ
దేవియ సీతయటంచును నిశ్చయ♦ధీయుతుఁ డుండె ద్రుమంబుపయిన్. ౪౭౬.

అర్థములు. బ్రేఁకన = భారముచే, తావులు = వాసనలు, మాధవచారుసుధాకర కాంతులు = వసంతకాలమున మనోహరమైన చంద్రకాంతులు, రేఁగుచున్ = విజృంభించుచు, దుఃఖావిలన్ = దుఃఖముచే వ్యాకులపడినదానిని, ద్రుమంబుపైన్ = చెట్టుమీఁద, మానిని = ఏడుభగణములు, గురువు. పదుమూఁడింట యతి.

తా త్ప ర్య ము .

పూవుల బరువుచే వంగినకొమ్మలు గల యశోకవృక్షములు సువాసనలు వ్యాపింపఁజేయుచు వసంతకాల చంద్రుని మనోహరకాంతులు విజృంభించుచు నీమె విరహాగ్నిని మఱింత ప్రజ్వరిల్లఁజేసి బాధపెట్టుచున్నవి, అని తనలో ననుకొనుచు నీమెయే సీతాదేవియని నిశ్చయబుద్ధిగలవాఁడై రాక్షసస్త్రీలు మేలుకొనియుండుటచే చెట్టు మీఁదనే యుండెను. పూచిన యశోకములు, వసంతకాలము, వెన్నెలకాంతు లివి యుద్దీనములు, కావున దుఃఖకరములు.

సీతాదేవిని నశోకవృక్షము క్రింద నుంచవలసిన కారణ మేమి ?

దీనికే సీతాశోకవృక్ష న్యాయ మని పేరు. ఏ చెట్టుక్రింద నుంచినను ఆ చెట్టు క్రింద నుంచవలసిన కారణ మేమని ప్రశ్న పుట్టును. ఈమె కూర్చుండిన చెట్టునకు సమీపమందే మేడ యున్నట్లు హనుమంతుని వాక్యముల వలనఁ దెలియనగు. రావణుఁడు దాని యందామె నుంచవలయుననియే తలఁచెను. గాని యామె నిరాకరించి సమీపమందున్న చెట్టుక్రిందఁ గూర్చుండెను.

—౧౭వ సర్గము. హనుమంతుఁడు సీతాదేవికిఁ గాపున్న రాక్షసస్త్రీలఁ జూచుట—

క. అంతట నీలాంబువులం, గాంతం బగు హంసయట్లు ♦ గగనాపరభా
గాంతరమున వెలికలువల, కాంతి నిశాకాంతుఁ డమరెఁ♦గడు నిర్మలుఁడై. ౪౭౭

అర్థములు. నీలాంబువులన్ = నల్లని నీటియందు, కాంతంబగు = మనోహరమయిన, గగనాపరభాగాంతరమునన్ = ఆకాశముయొక్క వెనుకటిభాగమున, పడమటిభాగమున. వెలి= తెల్లని, నిశాకాంతుఁడు=చంద్రుఁడు, కడు నిర్మలుఁడై= మిగుల స్వచ్ఛకాంతి గలవాఁడై.

ఈనాఁడు శుద్ధ త్రయోదశి కావునఁ దొమ్మిదిన్నర గంటలకే చంద్రుఁడు నడినెత్తిమీఁదికి వచ్చె నని ముందు చెప్పఁబడెను. ఈనాఁడు చంద్రాస్తమానము. ఇఱువదియాఱుగడియలకు అనఁగా నాలుగున్నరగంటలకు. ఇప్పుడాకాశమునలుపని చంద్రుఁడు తెల్లకలువవలె నున్నాఁడనుటచే మూఁడుగంటల ప్రొద్దై యుండవలెను.

క. వాసిగ సీతను వెనుకఁగ, బాసటయై వెలసె నేమొ ♦ పావని కనఁగా
భాసురనిర్మల తేజో, రాసులఁ దాపంబుఁ బాపె ♦ జాతనికిన్. ౪౭౮

అర్థములు. బాసటయై = తోడై, భాసుర నిర్మల తేజోరాసులన్ = ప్రకాశించు నిర్మలమైన కాంతి పుంజముచే, రాజు=చంద్రుఁడు, అతనికిన్=హనుమంతునికి.

హనుమంతుఁడు సీతను వెదక నారంభించినపుడు లంకా ప్రవేశకాలము మొదలుకొని యామె కనఁబడు వఱకు హనుమంతునకు సహాయుఁడై చంద్రుఁడు ప్రకాశించెను. పూనిన కార్యము నెఱవేఱినది కావున నిఁకఁ దానుండ రాదని చంద్రుఁడు వెడలి పోవుచున్నాఁడని భావము.

తాత్పర్యము.

హనుమంతుఁడు సీతాదేవిని చక్కఁగా వెతుకుటకుఁ దోడై యుండెనేమో యన్నట్లు నిర్మలకాంతులచేఁ బ్రకాశించి చంద్రుఁ డాయనకు మనస్తాపం బణఁచెను.

క. ౘవేఁగున మునిఁగెడియుడుపము, నాఁ గడుదుఃఖమున పేర్మి ♦ నవయుచు నుండం
గాఁ గనుఁగొనె రాముని యెల, నాఁగను నాఁగటిచాలు♦నవలామిన్నన్. ౪౭౯

అర్థములు. ౘవేఁగునన్ = బరువుచే, ఉడుపము = తెప్ప, నాన్ = అనునట్లు, వలె; నాఁగంటిచాలునవలామిన్నన్ = సీతాదేవి యనెడి స్త్రీరత్నమును.

తాత్పర్యము.

బరువుచే మునిఁగిపోవుచున్న పడవవలె మిక్కిలి దుఃఖాతిశయముచే సీతాదేవి దుఃఖపడుచుండఁగా హనుమంతుఁడు చూచెను.

సీ. ధరణీసుతను జూచి♦తన్నికటంబున, ఘోరదర్శనల సు♦రారిసతుల
నేకాక్షిని నకర్ణ♦నేకకర్ణను శంకు, కర్ణను దనుదీర్ఘ♦కంధరలను
నెగయు ముక్కునదాని ♦దిగ్రవేలు చెవిదాని, ధ్వస్త కేశిని బోడి♦తలలవారి
నతికాయ మగు నుత్త♦మాంగంబుఁ గలదాని. గడ్డంబు నంటు ప♦ల్కప్పుదాని
తే. లంబకర్ణలలాటను♦లంబకుచను, గేశకంబళధారిణిఁ♦గీశవరుఁడు
లంబజానుక లంబాస్య♦లంబజఠర, లంబరదనాంశుకలయుఁ గ♦దంబములను.

అర్థములు. నికటంబునన్ = సమీపమందు; ఘోరదర్శనలన్ = భయము గలిగించు నాకారముగలవారిని, ఏకాక్షి = ఒంటికన్నుగలది, అకర్ణ = చెవులు లేనిది, ఏకకర్ణ=ఒక చెవిగలదానిని, శంకుకర్ణ = మేకువంటి చెవిగలదానిని, తను దీర్ఘకంధరలను=సన్నమై పొడుగైన మెదడుగలదానిని, ధ్వస్తకేశిని = స్వల్పకేశములు గలదానిని, అతికాయము= దేహమునకు మించినది, పెద్దది, ఉత్తమాంగంబు=తల, పల్కప్పు = పెదవి, లంబకర్ణ లలాటను = వ్రేలు చెవులు నొసలు గల దానిని, లంబకుచను = వ్రేలుచన్నులదానిని, కేశకంబళ ధారిణి = కంబళి వంటి వెండ్రుకలు గల దానిని, కీశవరుఁడు = వానర శ్రేష్ఠుఁడు, కిసకిస— కిచకిచ మనునవి గావునఁ గీశము లనఁబడెనేమో – లంబజానుకన్ = వంగిన మోఁకాళ్ళుగలదానిని, లంబాస్య = వ్రేలాడు ముఖముగలదానిని, లంబజఠర = వ్రేలాడు పొట్టగలదానిని, లంబరదనాంశుకల=వ్రేలాడు పెదవులుగలదానిని, వీరి, కదంబములను=సమూహములను, చూచెను.

## తాత్పర్యము.

ఈ ప్రకారము సీతాదేవిని జూచి యామె సమీపంబునఁ జూచిన దిగులు కలిగించు రాక్షసస్త్రీలను ఒంటికంటిదానిని, ఒకచెవిదానిని, చెవులులేనిదానిని, మేకుచెవులదానిని, సన్నని నిడుపాటి మెడగల దానిని పైకి నెగదీసికొనిపోయిన ముక్కుబొక్కలదానిని, భుజముల మీఁదికి వ్రేలాడు చెవులదానిని, పొట్టి వెండ్రుకల దానిని, బోడితలలవారి, పెద్దతలకాయదానిని, గడ్డము తాఁకు పెదవిగలదానిని, వ్రేలాడు చెవులుగలదానిని, వ్రేలాడు నొసలుగలదానిని, వ్రేలాడు చన్నులదానిని, కంబళివంటి వెండ్రుకలు గలదానిని, వంగిన మోఁకాళ్ళుగలదానిని, వ్రేలాడు ముఖము గలదానిని, వ్రేలాడు పొట్టగలదానిని, వ్రేలాడు పెదవి కలదానిని వీరిని గుంపును జూచెను.

సీ. గిటకలఁ బొడవులనట మఱుగుజ్జుల. వికటల వామనానికరములను
మిట్టపండ్లులదానిఁబొట్టయుబ్బినదాని, ముక్కుడిఁ బింగాక్షిబొక్కనోటి
వికృతను గాళినిబింగళఁ గ్రోధన, గాలాయసమహోరు శూలకూట
ముద్గరహస్తలమొగిఁ గలహప్రియ, నజమృగమహిషశివాస్యతలల
తే. వ్యాఘ్రముఖనుష్ట్ర గజఘోటకాంఘ్రి మఱి ని
ఖాతమూర్ధను నేకాంఘ్రికర్ణకరల
నశ్వకర్ణిక ఖరకర్ణిహస్తకర్ణి
మఱియు గోకర్ణి హరికర్ణిమండలములు. ౪౮౧

అర్థములు. వికటలన్ = పెద్ద పిక్కలు గలవారిని, వామనానికరములను = పొట్టివారి సమూహములను, ముక్కుడిన్ = ముక్కు లేనిదానిని, అభావంబున ఇడి ప్రత్యయము. వికృతను = వికారముఖముగల దానిని, పింగళ = గోరోచనము వన్నె గలదానిని, క్రోధన = మిగుల కోపము గలదానిని, కాలాయసమహోరు శూల = ఉక్కుతోఁ జేయఁబడిన పెద్దశూలములను, కూట = కత్తి, అజ = మేఁక, శివా = నక్క, వ్యాఘ్రముఖ = పులిముఖమువంటి ముఖముగలది, ఉష్ట్ర = ఒంటెయు, ఘోట = గుఱ్ఱముయొక్కయు, గజ = ఏనుఁగుయొక్కయు, అంఘ్రి = కాళ్ళుగలది, నిఖాతమూర్ధను = గుంతపడిన తలగలదానిని, ఏకాంఘ్రి = ఒంటికాలుది, ఏకకర్ణ = ఒంటిచెవిది. ఏకకర = ఒంటిచేయిది, అశ్వకర్ణిక = గుఱ్ఱపుఁజెవులు గలది, ఖరకర్ణి = గాడిదచెవులు గలది, హస్తికర్ణి = ఏనుఁగుచెవులు గలది, గోకర్ణి = ఆవు చెవులు గలది, హరి కర్ణి = క్రోఁతి చెవులు గలవారి, మండలములన్ = సమూహములను

తాత్పర్యము. స్పష్టము.

సీ. అతినాసను ననాసచ్యుతనాస నుద్గతనాస, దిర్యఙ్నాసనాగనాసఁ
బాదచూడిక హస్తిపాదగోపాద మహాపాద దీర్ఘజిహ్వానఖలను
బుద్దతలలవారిఁబెద్దమెడలవారిఁ, బెద్దపొట్టలవారిఁబెద్దకనుల
వారిఁ బెంజన్నులవారిఁ గరేణుకాముఖ నజాముఖ హస్తిముఖిని నాడు
తే. పందిమోమునదానినివాజి వక్త్ర, నుష్ట్రవక్త్రను ఖరవక్త్రనుగ్రదర్శ
నలను ముద్గరశూలహస్తలను గ్రోధనలఁ గరాళలఁ గన్గొనెఁగలహరతల.

అర్థములు. అతినాసను = మితి మించిన ముక్కుగల దానిని, అనాసను = పుట్టుపునుండి ముక్కు లేని దానిని, చ్యుతనాస = ఉండి పోయిన ముక్కు గలదానిని, ఉద్గతనాస = నొసటి దగ్గఱ ముక్కు బొక్కలు గలదానిని, తిర్యక్ + నాస = అడ్డ ముక్కు గలదానిని, నాగనాస = తొండమువంటి ముక్కుగలదానిని, పాద చూడికన్ = పాదములందు జుట్టు గలదానిని, హస్తిపాద = ఏనుఁగు కాలు గల దానిని, గోపాద = ఆవుకాలు గల దానిని, మహాపాద = పొడుగాటి కాళ్ళుగలదానిని, దీర్ఘ

జిహ్వానఖలను = పొడుగు నాలుక గోళ్ళు గల వారిని, కరేణుకాముఖి = ఆఁడేనుఁగు ముఖము గలదానిని, అజాముఖి = మేకముఖము గలదానిని, హస్తిముఖి= మగయేనుఁగు ముఖము గల దానిని, వాజివక్త్రి = గుఱ్ఱపు ముఖము గలదానిని, ఖరవక్త్రి = గాడిద ముఖము గలదానిని, కరాళల = మిట్టకోఱలవారిని, కలహరతల = కలహ మాడుచున్న వారిని.

తాత్పర్యము. సులభము.

ఉ. కొల్లగఁ గల్లు ద్రావి, వెఱ♦కూఁతలు రోఁతలు గొల్ప, నంజుడుల్
నల్లయు నాని, వెక్కసపు ♦ లాగున మైఁ గలయంగఁ బూసి యు
త్ఫుల్ల సరోజనేత్ర యగు ♦ భూసుత యుండు కుజంబుచుట్టు అం
పిల్లఁగఁ గాంచె రక్కసుల ♦ మేఁ బులకింప సమీరసూతియుర్. ౪౮౩

అర్థములు. నంజుఁడు = మాంసము, నల్ల = నెత్తురు, ఆని = త్రావి, అంపిల్లఁగర్ = విజృంభింపఁగా, రక్కసులర్ = రాక్షసస్త్రీలను, మేర్ = దేహము, పులకింప = గగ్గురుపాటుచెందఁగా.

తాత్పర్యము.

కడుపారఁ గల్లుద్రావి, విన నసహ్య మగునట్లు వెఱ్ఱికూఁతలు గూయుచు మాంసము దిని, నెత్తురుద్రావి, చూచినవారికి వెక్కసము తోఁచునట్లు దేహము నంతయు నెత్తురు పూసికొని వికసించిన కమలములవంటి కన్నులుగల సీతయుండు చెట్టుచుట్టు అఱచుచుఁ, గేకలువేయుచు నుండు రాక్షస స్త్రీలను హనుమంతుఁడు తన దేహము పులకరింపఁ జూచెను. వారిని జూచునపుడు ఆయనకుఁగూడ భయము దోఁచె నని భావము.

——♦ హనుమంతుడు సీతాదేవిని జూచి సంతోషించుట. ♦——

సీ. ఆచెట్టు క్రీనీడ ♦ నమలినచారిత్ర, వనటచేఁ దపియించి ♦ వగచుదానిఁ
బెనఁగొన్న మాపుడు♦నును వెంద్రుకలదాని, నెఱి మీఱునడవడి♦ నెగడుదానిఁ
గాంతిఁ బాసినదాని ♦ గాంతుఁ గానఁగ లేని, దాని మేల్సొమ్ములు ♦ లేనిదాని
భర్త్రనురాగంబె♦ వరభూష యవుదానిఁ, బుణ్యహీనతఁ జేసి ♦ పుడమిఁబడిన
తే. రిక్కయనుబోనిదాని రే♦ద్రిమ్మరీఁడు, పట్టి బంధింపఁ జుట్టాల ♦ పట్టు లేక
సింగమూఁగినగుంపునఁ ♦ జేలి యొంటి, యైనయాఁడేనుఁగునుబోలె ♦ నడలుదాని.

అర్థములు. క్రీనీడ=క్రిందు+నీడ=క్రీనీడ, క్రిందు శబ్దమునకుఁ బరుషేతరంబులు పరంబులగు నపుడు లుప్త శేషంబునకు దీర్ఘంబు మాత్ర మగు. సమాసంబునఁ ద్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబగు. సు. వ్యా.

సంధి. ౫౧-౫౪- మాపుఁడు = మాసిన, భర్తృనురాగంబె = భర్తృ + అనురాగంబు + ఏ=భర్తయందలి ప్రేమయే, రిక్క = నక్షత్రము, ఋక్షశబ్దభవము, రేద్రిమ్మరీఁడు = నిశాచరరాజు, రాక్షసరాజు-రావణుఁడు.

తా త్ప ర్య ము.

ఆ చెట్టు క్రింద నీడలోఁ బవిత్రమైన స్వభావము గలదియు, దుఃఖముచేఁ దపించునదియు, మాసి పెనవేసికొనిన వెండ్రుకలు గలదియు, చక్కని నడవడి గలదియు, కాంతి తొలఁగినదియు, మగని జూడలేనిదియు, మంచి సొమ్ములు ధరింపనిదియు, పతిభక్తియే సొమ్ముగాఁ గలదియు, పుణ్యము క్షయింపఁగా నేలమీఁదఁ బడిన నక్షత్రమువలె నుండునదియు, రాక్షసుఁడు పట్టుకొనివచ్చి బంధింపఁగాఁ జుట్టముల తోడుపాటులేక సింగ మడ్డగింపఁగా తోడి యేనుఁగు లన్నియుఁ బెదరిపోవ నొంటరిగాఁ జిక్కిన యాఁడేనుగువలెఁ దపించునదియు నగు దానిని.

తే. వాడుకొనమిని దంత్రులు ♦ వదులుపాటి, ధూళిమాసినవీణెనాఁ ♦ దోఁచుదానిఁ
ప్రీతిభరమున మగని స్మ♦రించుదాని, రక్కసులపల్కుఁ బెడచెవిఁ ♦ జెక్కుదాని.

తా త్ప ర్య ము.

వాడుకొనకుండుటచేఁ దంతెలు వదులై దుమ్ముక్రమ్మిన కారణమున మాసిన వీణవలె నుండుదానిని, ప్రీతి యతిశయముచే మగని స్మరించుదానిని, రాక్షసస్త్రీలు చెప్పుమాటలు లక్ష్యము చేయనిదానిని.

సీ. శారదవేళను ♦ నీరదావృతమైన, పూపచందురురేకఁ ♦ బోలుదానిఁ
క్రూరగ్రహావృత ♦ రోహిణి చాడ్పున, నసురాంగనావృత ♦ యైనదానిఁ
బూవులు లేనట్టి♦తీవ,బోతినదాని, ధూళి బ్రుంగియు రుచిఁ ♦ దోచుదానిఁ
నసలు పైక్రమ్మిన ♦ యబ్జినివలెఁ గాంతి, నెగడియు నెగడక ♦ నెగడుదానిఁ
తే. దీరమాసిన చినిఁగిన ♦ చీరదాని, జింకపిల్లలకన్నుల ♦ చెలువు నవ్వు
కన్నుఁగవదానిఁ జూపఱ ♦ కడుపుఁ జేతఁ, గలఁచినట్లొనరించెడి ♦కలికిఁ గనియె.

అర్థములు. శారదవేళను = శరత్కాలమందు, నీరద + ఆవృతము = మేఘముచేఁ గప్పబడినది, పూపచందురురేక = గీఁతవలెనున్న లేఁతచందురువలెనున్నదానిని, ఇది క్రమాభివృద్ధిని సూచించుచున్నది. క్రూరగ్రహావృతరోహిణి= క్రూరగ్రహముచే నావరింపఁబడిన రోహిణీనక్షత్రము, అసురాంగనావృత = రాక్షసస్త్రీలచేఁ జుట్టఁబడిన, బ్రుంగియు = మునిఁగియు, రుచి = కాంతిచే, అసలు = బురద, నేరెటేటి యసల్ దెచ్చి - మనుచరిత్ర, అబ్జినీ= తామర తీఁగ, తీర = పూర్ణముగ, చూపఱ = చూచువారియొక్క, కలికిని = స్త్రీని.

తాత్పర్యము.

శరత్కాలమందు మేఘముచే నడ్డగింపఁబడిన పాడ్యమి చంద్రునివలె నుండు దానిని, క్రూరమృగములైన బుధాంగారకులచే బాధింపఁబడు రోహిణి యనునట్లు రాక్షసస్త్రీలచేఁ జుట్టఁబడిన దానిని, పూవులులేని తీఁగను బోలినదానిని, దుమ్ములో మునిఁగియుఁ గాంతి కనఁబడు దానిని, బురదలైనఁ గప్పిన తామర తీఁగవలె కాంతి కానవచ్చి కానరాక యుండు దానిని, పూర్ణముగ మాసి చినిఁగిన చీర గలదానిని, జింకపిల్ల కన్నులవంటి కన్నులు గలదానిని, చూచువారి కడుపులోఁ జేయి పెట్టి కలఁచునట్లు చేయు స్త్రీని హనుమ చూచెను.

ఆ. భర్తృతేజమునను ♦ బరమధీరత గల్గు, దీనమైనమోము ♦ దానిఁ దనదు
శీలమహిమఁ గాపు ♦ చేసికొంచడలెడు, దాని సీతఁ గనియె ♦ వానరుండు. ౮౬౭

తాత్పర్యము.

దుఃఖముతోఁ గూడి కాంతి మాసిన ముఖము గల దయ్యును భర్త పరాక్రమముఁ దలంచి యాయన తన్నుఁ దప్పక రక్షించునను ధైర్యముతో నుండు దానిని, మగఁడు వచ్చి రక్షించువఱ కామె నెవ్వరు రక్షించుచున్నా రనినఁ దన పాతివ్రత్యము చేతనే తన్నుఁ దాను గాపాడుకొనుచున్న దానిని, సీతాదేవిని వానరుఁడు చూచెను.

దీనివలన భక్తులు ప్రపన్నులు వెలుపలి కష్టము లెన్ని వచ్చి పీడించినను మహావిశ్వాసము వదలరా దనియు భగవంతుఁడు రక్షించువఱకుఁ దమ భక్తిప్రపత్తులే వారినిఁ గాపాడఁ గలవనియు భావము.

క. 'నా తేజము సాధులలో, నాతతమై యుండు వారి నలఁచు జనులకున్
హేతిక్రియ భీతి నిచ్చును, జేతోమోదంబు చెఱచు సిద్ధము సుమ్మీ.'
భాగ. ౯. ౧౨౫.

సీ. బెగడొంది కంపిల్లు ♦ మృగకన్యకయుఁబోలె, దిక్కులు చూచుచు ♦ స్రుక్కుదాని
వేడినిట్టూర్పుల ♦ వృక్షపల్లవములఁ, గ్రాఁచెడి నేమొనాఁ గ్రాలుదాని
నాంతరదుఃఖాబ్ధి ♦ యందందఁ బొంగిన, యలలయట్టూర్పులు ♦ వెలలుదాని
నవసిన యంగముల్ ♦ నానెంబుతో వినా, కృతభూషమై శోభ ♦ నెసఁగుదాని,
ఆ. మదిరనయన సీత ♦ మారుతి గనుఁగొని, సమ్మదాశ్రు లురల ♦ జాలుగాఁగ
రామచంద్రునకును ♦ సౌమిత్రికిని గేలు, మోడ్చి శాఖయందఁ ♦ ముడిఁగియుండె.

అర్థములు. కంపిల్లు = వణఁకు, మృగకన్యక = ఆఁడుజింక, పల్లవములన్ = చిగుళ్ళను, క్రాఁచెడి = కాల్చెడి, ఆంతర దుఃఖాబ్ధి = లోపలనుండు దుఃఖ మను

సముద్రము, వినాకృత భూషయై = ఆభరణములు లేనిదై, భూషయై = భూషయయ్యు, మదిర నయన = మద్యమువలె మత్తు గలిగించు కన్నులు గల దానిని, జాలు = ప్రవాహము, అంగముల్ నాణెంబుతో = అంగముల నాణెముతో. షష్ఠీ సమాసమందలి నిలలమీఁది యచ్చులకు హల్లుపరంబగుచోఁ గొన్నియెడల లోపంబుగానంబడియెడి. ప్రౌ. వ్యా, సంధి ౧౭౮ వ సూత్రము. వినాకృత భూషయై; భూషయయినను "న్యూనవచో వాక్యంబునఁ దద్వచనంబు లధ్యాహారంబులగు. ప్రౌ. వ్యా. వాక్య. ౧౩ సూత్రము.

## తాత్పర్యము.

భయపడి వడఁకుచున్న యాఁడులేడివలెఁదన్నురక్షింప రాముఁడు వచ్చునాయని దిక్కులు చూచుచున్న దానిని తనవేఁడి శ్వాసములచేఁ జెట్లయందలి చిగుళ్ళను గాల్చుచున్నదా యేమి యన్నట్లున్న దానిని, హృదయమున నుండు దుఃఖ మను సముద్రము పొంగి పొరలి రాఁగా నలలవలె నిట్టూర్పులు విడుచు దానిని, శుష్కించి యాభరణములు ధరింపకుండినను సహజకాంతి పాయనిదానిని, చూచిన వారిని మైమఱవఁజేయు సౌందర్యముగల దానిని హనుమంతుఁడు చూచి యిప్పటికిఁ గృతార్థుఁడనైతి నని సంతోషముచేఁ గన్నులనీరు ప్రవహింపఁగా నిదియంతయు రామలక్ష్మణుల యనుగ్రహముచేఁగదా లభించెనని వారికి నమస్కరించి చెట్టుకొమ్మయందే మాటలాడుటకు సమయమువేచి ముడుచుకొని యుండెను.

దీనివలన యోగికి నాత్మావలోకన ప్రాప్తి భగవత్కటాక్షముచేఁ గలుగు ననిభావము. 'య మేవైష వృణుతే తేన లభ్యః ధాతుః ప్రసాదా' త్తనిశ్రుతులు చెప్పెడిని గదా.

## —♦ ౧౮—వ సర్గము. రావణుఁ డశోకవనంబునకు వచ్చుట.♦—

క. చంచత్పల్లవకుసుమోదంచితవనిఁ గలయఁజూచి ♦ యవనిజఁ జక్కం
గాంచఁగ మారుతి దలఁపఁగ, నించుకదక్కువగ రేయి♦యెల్లంగడచెన్. ౪౮౯

అర్థములు, చంచత్ =కదలుచున్న, చెంచు అను శబ్దము దీనివలనఁ బుట్టినదే. చెంచులనఁగా దిరుగుచుండువా రని యర్థము. వారి స్త్రీలు చెంచితలు, పల్లవ = చిగుళ్ళచేతను, కుసుమ = పూలచేతను, ఉదంచిత= మిగులఁ బ్రకాశించెడి, వనిన్ = వనమును, ఇంచుక తక్కువగ రేయి యెల్లం గడచెన్ = అనుటచే చంద్రాస్తమానమైన దని సూచన. నాలుగున్నర గంట ప్రొద్దయ్యె నని భావము.

## తాత్పర్యము.

ప్రాతఃకాల వాయువుచేఁ గదలుచున్న చిగుళ్ళచేతను, బూలచేతను బ్రకాశించు వనము నంతయుఁ బాఱఁజూచి సీతాదేవిని నింకను బాగుగఁ జూడవలయునని

యాంజనేయుఁడు తలఁచు చుండఁగా గొంచెము తక్కువగా రాత్రి యంతయుఁ గడచెను.

ఉ. అంతట నాలకించెను ష♦డంగకవేదవిదుల్ మఖక్రియా
స్వాంతులు వేగుజాము సమ♦యంబున మేల్కని బ్రహ్మరాక్షసుల్
మంతు వొకింత లేక శుచి♦మద్విధి నించెడి బ్రహ్మఘోషముల్
వింతగ వాద్యనాదములు ♦ వీనులవిందుగ మ్రోయు చుండఁగన్. ౪౯౦

అర్థములు. షడంగక వేద విదుల్ = శిక్షా వ్యాకరణాదులగు నాఱంగము లతోఁ గూడిన వేదము నెఱిఁగినవారు, మఖక్రియా స్వాంతులు = యజ్ఞ కార్యము లందు మనస్సు గలవారు, బ్రహ్మరాక్షసులు = రాక్షసు లందు బ్రాహ్మణులు, వీరు బ్రాహ్మణులు – రావణాదులు క్షత్రియులు, కావున వర్ణాశ్రమ విభాగము రాక్షసు లందుఁ గలదని యేర్పడు చున్నది. బ్రాహ్మణ బీజోద్భవులగు పౌలస్త్యులు, కొందఱు తలఁచున ట్లనార్యులు గారు. క్రూరకర్మ లగుటచే రాక్షసులైరి. మంతువు = స్వర దోషము, కర్మాంగదోషములేక, శుచిమత్ + విధి = పరిశుద్ధమైన విధముగ, బ్రహ్మ ఘోషముల్ = వేదధ్వనులు, 'పరమాత్మా తపో వేదో బ్రహ్మ, బ్రహ్మజ్ఞే ద్విజే.' నానా. ౪.

తాత్పర్యము.

హనుమంతు డిట్లాలోచించుసమయంబున బ్రహ్మరాక్షసులుఆఱంగములతోడ వేదములు తెలిసినవారలు యజ్ఞకార్యముల మనస్సుగలవారలు, వేకువ జామున బ్రహ్మముహూర్తమున మేల్కని యేతప్పు లేకుండు నట్లు శుచిర్భూతులై నించెడి వేదఘోషములను వీనులకింపుగవాయింపఁబడు వాద్యముల ధ్వనులునువినవచ్చెను.

క. ఆ మంగళరవములఁ బూ,ర్వామరపతి మేలుకాంచి ♦ యంబరసుమనో
దామంబు లెడల సీతా, వామాక్షిం దలఁచె రాగ♦పరవశుఁ డగుచున్. ౪౯౧

అర్థములు. పూర్వామరపతి = రావణుఁడు, దేవతలకంటెఁ బూర్వులు కావున రాక్షసులు పూర్వ దేవత లనఁబడుదురు. అంబర = వస్త్రములు, సుమనో దామంబులు = పూలదండలు, ఎడలన్ = జాఱిపోవు చుండఁగా, రాగ పరవశుఁ డగుచున్ = కామముచే స్వాధీనత తప్పినవాఁడై.

తాత్పర్యము.

ఆ మంగళ ధ్వనులు విని రావణుఁడు మేల్కని, పట్టు వస్త్రములు ధరించిన పూలదండలు జాఱు చుండఁగా లేచి కామవశుఁడై సీతఁ దలంచెను.

క. మదనమదోత్కటుఁ డయి దశ♦,వదనుఁడు గాఢముగ మనము♦వనజాక్షిపయిన్
బదిలముగ నిల్పి కామము, హృది నణఁపఁగ నేరఁ డయ్యె♦నించుక యైనన్. ౪౯౨

అర్థములు. మదన మదోత్కటుఁడు=కామ మదముచే నతిశయించిన వాఁడు.

తా త్ప ర్య ము.

అతిశయించిన కామమదముచే రావణుఁడు తనమనస్సును దృఢముగ సీత యందుఁ బదిలముగ నిల్పి హృదయమునందుఁ గామమును గొంచెమైన నణఁప లేఁడయ్యెను.

ఇది మొదలు రావణుని మాటలు చేష్టలు కాముకునివో భక్తునివో పాఠకులు గమనింతురు గాక.

సీ. తనకును గల యను♦త్తమలక్ష్మి శోభిల్ల, సర్వాభరణములు ♦ సరగఁ దాల్చి
కుసుమితఫలితస♦త్కుజసంతతులచేతఁ, గందోయి కెంతయు ♦ విందు లిడుచు
విచ్చిన తమ్ములఁ ♦ బెచ్చు మీఱినకొలంకులు శకుంతంబుల♦కలకలములు
సొబగార నద్భుత♦సుందరం బయి పెక్కు,లీహామృగంబుల♦వ్యూహములను
తే. దృఙ్మనోహర మగుచును ♦ దేజరిల్లి, రత్నకాంచనతోరణ♦రాజ వెలసి
బహుమృగాకీర్ణమయి గళ♦త్ఫలచయ మయి, నవ్యమైన యశోకవనంబుఁజొచ్చె.

అర్థములు. అనుత్తమలక్ష్మి = అత్యంత ముత్తమసంపద, దేనికంటె నుత్తమమైనది లేదో యది యనుత్తమము, కుసుమిత = పూచిన, ఫలిత = పండిన, సత్కుజసంతతులచేతన్ = మంచి వృక్షసమూహములచే, కందోయికి = రెండు కన్నులకు, కన్ను+దోయి = కందోయి, ఈహామృగంబుల = కృత్రిమముగాఁ జేయఁబడిన జింకల, దుప్పులవ్యూహములను = సమూహములును, ఇచ్చటఁ గొందఱు తోడేళ్ల సమూహములని వ్రాసిరి. స్త్రీలు సంచరించు ప్రమదావనంబులందుఁ తోడేళ్ళగుంపులుండునా? దృఙ్మనోహరము = కంటికింపు, గళత్ఫలచయము = రాలుచున్న పండ్లగుంపులు.

తా త్ప ర్య ము.

తనకుఁగల మహాసంపద ప్రకాశించు నట్లు సమస్తభూషణములు ధరించినవాఁడై పూచిన, పండిన చెట్లు కన్నులకు సంతోషము గలిగింపఁగా వికసించిన కమలముల నతిశయించిన సరస్సులు, పక్షుల కలకలములు నింపు గూర్పఁగా నద్భుతము సుందరమునై కృత్రిమపు జింకల, దుప్పుల సమూహములుగలిగి కంటికింపై, ప్రకాశించి రత్నములయు, బంగారు తోరణములు అనేక విధములైన మృగములు రాలుచున్న పండ్లు గలిగిన యశోక వనమునఁ బ్రవేశించెను.

తే. వేయిగన్నుల వేల్పును ♦ వెంబడించు, నమరగంధర్వసతు లట్టు ♦ లసురసతులు
వందమంది సురేంద్రుని♦వైరి వెంట, నరిగిరి ప్రదీపచామర♦హస్తలగుచు. ౯౫౮

అర్థములు. వేయిగన్నుల వేల్పు = ఇంద్రుఁడు, ప్రదీప చామరహస్తలు= పెద్ద దీపములు, చామరలు చేతియందుఁ గలవారై, దీపములు పట్టుకొని వచ్చిరనుటచే చంద్రాస్తమానమైనది, చీఁకటి వ్యాపించిన దనుట స్పష్టపడియె.

తాత్పర్యము.

ఇంద్రుని వెంటఁబోవు దేవగంధర్వ స్త్రీలవలె వందమంది రాక్షస స్త్రీలు చేతఁ గాఁగడాలు, చామరలు ధరించి రావణుని వెంబడి పోయిరి.

సీ. రంగారుబంగారు♦భృంగారువుల నీళ్ళు, కొందఱు గైకొని♦ ముంద అరుగ
మండలాగ్రంబులు ♦ మణిమయాసనములు, గొని కొందఱంగనల్ ♦ వెనుక రాఁగ
జాణ యొక్కతె మణి♦స్థాలిఁ బానంబునఁ, బూరించి కుడికేలఁ ♦ బూని నడువ
రాజహంసను బూర్ణ ♦రాజబింబముఁబోలు, గొడుగు నొక్కతె వెను♦కడనుబట్టఁ
తే. బైడిదండంబు నొక్కతె ♦ పట్టుచుండఁ
గూర్కు కన్నులఁ దనప్రియ♦కులసతులును
మబ్బుతోఁ జను మెఱుఁగుల♦మాడ్కి నడవఁ
బంక్తికంధరుఁ డుద్యాన♦వనముఁ జొచ్చె. ౪౫

అర్థములు. రంగారు = అందమైన, భృంగారువుల్ = గిండ్లయందు, మండలాగ్రంబులు = కత్తులు, ఆసనములు = పీఁటలు, మణి స్థాలి=రత్నపాత్రమునందు పూర్ణరాజ బింబము = నిండు చంద్ర మండలను.

తాత్పర్యము.

అందమైన బంగారు గిండులతో నీళ్లు తీసికొని కొందఱు ముందు పోఁగా, కత్తులు, మణి మయములైన పీఁటలు తీసికొని కొందఱు స్త్రీలు వెనుక రాఁగ, నొక నేర్పరి కత్తె రత్న పాత్రమును పానంబుతో నిండించి, దానిని గుడిచేతఁ బట్టుకొని నడువ, రాజహంసను నిండు చంద్రబింబమును సరిపోలు శ్వేతచ్ఛత్రమును నొకతె పట్టుకొని రాగా, బంగారు దండ మొకతె పట్టుచుండ, నిద్ర మబ్బు కన్నులతోఁ దన భార్యలు మబ్బువెంటఁ బోవు మెఱుపులవలె నడచి రాఁగ రావణుఁ డుద్యాన వనముఁ బ్రవేశించెను.

శ్వేతచ్ఛత్ర లక్షణము —

విచితంతు హంస పక్షైః కృకవాకు మయూర సారసా నాంచ, దౌకూలేన నవేనతు సమగ్రత శ్ఛాదితం శుక్లమ్ । ముక్తాఫలైరుపచితం । ప్రలంబ మాలా విలం స్ఫటికమూలమ్ । షడ్ఢస్త శుద్ధ హైమం నవ పర్వ నగైక దండంచ । దండార్థ నిస్సృతం తత్ సమవృత్తం రత్నభూషిత ముదగ్రమ్। నృపతేస్తదాతపత్రం కళ్యాణకరం విజయదంచ. (బృహత్సంహిత)

సీ. వ్రీలినకొప్పులు♦రాలినపూఁతలు, దూలినసరములుఁ♦గ్రాలువారు
నిద్దురమంపులు♦నెఱిమత్తుకంపులుఁ, జెమ్మటమోములుఁ♦జెలఁగువారు
శ్రమవారిఁ దడిసిన♦సుమహారములవారు, మాలికాకులచికు♦రాళివారు
జేవురుఁగన్నులుఁ♦జెలువంపుఁజన్నెలు, మేలగువన్నెలు♦మెఱయువారు
తే. రాఁగ రాగంబునను వెంట♦రామవిభుని
కాంత మది నుంచి తమిఁ బెంచి♦కళవళించి
మౌఢ్యము వహించి మర్యాద♦మట్టగించి
క్రించు టసురుండు వనముఁ జొ♦త్తెంచుటయును. ౪౯౬

అర్థములు. మంపులు = మత్తు, శ్రమవారిఁ = చెమటనీళ్ళచే, మాలికాకుల = పూలదండలు తాఱుమాఱుగా నున్న, చికురాళివారు = తలవెండ్రుకలు గలవారు, జేవురు = ఎఱ్ఱనైన, క్రించు టసురుండు = దుష్టరాక్షసుఁడు.

తాత్పర్యము.

వీడిన కొప్పులు, రాలిపోయిన గంధపుఁ బూఁతలు, వ్యత్యస్తముగాఁ దొలఁగిన సరములు, నిద్దుర మబ్బులు, మద్యము వాసనలు చెమటగాఱు ముఖములు, చెమట నీళ్ళచేఁ దడిసిన పూలదండలు, పూలదండలు కలసి చిక్కుపడిన వెండ్రుకలు, ఎఱ్ఱని కన్నులు, అందమైన సొగసులు, మేలైన కాంతులు గల స్త్రీలనురాగముచేఁ దనవెంట రాఁగా దుష్టుఁడగు రావణుఁడు సీతాదేవిని దలఁచుకొని కామాతిశయముచేఁ దత్తఱలాడి సీత తనకు వశపడునని మూఢుఁడై తలంచి పరస్త్రీల విషయమున నుండవలసిన మర్యాద వదలి వనము ప్రవేశింపఁగా.

క. అంజనతనయుఁడు రావణ,కుంజరగమనావళీ ని♦కూజత్కాంచీ
శింజితములు శ్రవణపుటీ, రంజక హంసకనికాయ♦రవములు వినియెన్. ౪౯౭

అర్థములు. రావణకుంజరగమనావళీ = రావణాసురుని స్త్రీసమూహముల యొక్క, నికూజత్కాంచీ = ధ్వనించుచున్న మొలనూళ్లు, శింజితములు = ధ్వనులు, శ్రవణపుటీ రంజక = చెవులకు నింపైన, హంసక నికాయరవములు = అందెల సమూహముల ధ్వనులు.

తాత్పర్యము.

హనుమంతుఁడు సీతాదేవి సమీపమునకుఁ బోవలె నని యాలోచించు సమయమందు రావణాసురుని స్త్రీల యొడ్డాణముల యందలి గజ్జెలధ్వనులు, విన నింపైన యందెల నాదము వినవచ్చెను.

ఉ. ద్వారము డాసి యున్న సురవైరికులేశ్వరు, గంధతైలసి
క్తోరుసుదీపికల్ గొని త♦లోదరు లేగ వెలుంగు కావుని

స్తారుని, వక్రలోహితవి♦శాలవిలోచనుఁ, జాపహీనుఁ డౌ
మారుని మాఱుమూర్తి యన ♦ మంజులరూపు వహించు వీరునిన్. ౪౯౮

అర్థములు. గంధితైలసిక్త = వాసనచమురుతోఁ దడిసిన, ఉరుసుదీపికల్ = పెద్ద దీపములు, దివ్వెటీలు; కామవిస్తారుని=విశేషించిన కామము గలవానిని, వక్ర = వంకరయు, లోహిత = ఎఱ్ఱనయు, విశాల = విరివియు నగు, విలోచనుర్ = కన్నులు గలవానిని, చాపహీనుఁడు = విల్లులేనివాఁడగు, మారుని = మన్మథుని, మాఱట మూర్తి = ప్రతిరూపము, మంజులరూపు = మనోహరమైన యాకారము.

తాత్పర్యము.

సువాసన తైలముతోఁ దడిసిన దివ్వెటీలు దీసికొని స్త్రీలు రాఁగాఁ గామాతిశయము గలవాఁడును వంకరయు, నెఱ్ఱనయు, విశాలములగు కన్నులు గలవాఁడును విల్లుపట్టని రెండవ మన్మథుఁడును, సుందరుఁడు, వీరుఁడును తోఁటవాకిట వచ్చియుండు రావణాసురుని.

తే. అంగదంబులఁ దగిలిన♦యమృతఫేన, సన్నిభోత్తమవిమలవ♦స్త్రమును లీలఁ
గేలసవరించువాని దోర్లీల నిట్టిఁ, డంచు నెన్నంగరాని యా♦యసురఁ గనియె.

అర్థములు. అమృతము = ధారోష్ణం త్వమృతం పయః = అప్పుడు పిండి వేఁడి చల్లారని పాలు.

తాత్పర్యము.

భుజకీర్తులకుఁ దగులుకొన్న ధారోష్ణముల నురుగువలెఁ దెల్లనైన వస్త్రమును సవరించుకొనువానిని భుజబలమునం దింతవాఁడని చెప్పరానివానిని రాక్షసునిఁజూడఁ దలయెత్తెను.

ఇట్టిఁడు = ఇట్టివాఁడు, అట్టి యిట్టి యెట్టి శబ్దంబుల మీఁది తచ్ఛబ్ద వకారంబునకు లోపంబు విభాషనగు. ప్రౌ. వ్యా. స. ౯ సూ.

క. కాంచెను గాంచన కాంచీ, చంచన్మణికింకిణీల♦సన్మధ్యల రూ
పాంచితయువతుల మారుతి, పొంచి నగంబందు నుండి♦ పూవుంబోండ్లన్. ౫౦౦

అర్థములు. కాంచన కాంచీ = బంగారు మొలనూళ్ళయందు, చంచత్ = కదలుచున్న, మణి కింకిణీ = రత్నములు చెక్కిన చిఱుగజ్జెలచే, లసత్ = ప్రకాశించు, మధ్యలన్ = నడుములు గలవారిని, సౌందర్యముచేఁ బ్రకాశించు ప్రాయపు స్త్రీలను.

తాత్పర్యము.

బంగారుటొడ్డాణముల యందలి రత్నములగజ్జెలు గల నడుముగల సుందరులగు ప్రాయపుస్త్రీలను చెట్టునందుఁ బొంచియుండి హనుమంతుఁడుచూచెను. ముందు

వెలుతురు గనంబడెను. ఏమి యీ వెలుతురని తలయెత్తినిక్కి చూడఁగా రావణుఁడు, ఆవల వాని వెనుక వచ్చు స్త్రీలు గానవచ్చిరి.

ఉ. తారలు గూడియున్న యల♦తారకరాజును బోలి సుందరీ
వారము చుట్టు గొల్వఁగను ♦ వచ్చెడివాని లసత్పరిష్క్రియా
హారవిలాసునిం బటుమ♦హాబలభాసునిఁ గామదాసునిన్
హారిశరీరు విశ్రవసు♦నాత్మకుమారునిఁ గాంచి యాత్మలోన్. ౫౦౧

అర్థములు. తారకరాజు = చంద్రుఁడు, నక్షత్ర పర్యాయమున తారక శబ్దము పుంలింగ మందును గలదు. లసత్ = ప్రకాశించు, హార = సరములయొక్కయు, పరిష్క్రియా = ఆభరణములయొక్కయు, విలాసునిన్ = సౌందర్యము గలవానిని.

తా త్ప ర్య ము.

నక్షత్రములతోఁ గూడిన చంద్రునివలె స్త్రీలు తన్నుఁ జుట్టుకొనఁగా వచ్చుచున్నవానిని, ప్రకాశించు హారములు, ఆభరణములు వీనిచే సుందరుఁడైనవానిని, మహాబలవంతుని, కామమునకు దాసుఁడైనవానిని, మనోహరమైన శరీరము గలవానిని, విశ్రవసు కుమారునిఁ జూచి హనుమంతుఁడు తనలో నిట్లనుకొనెను.

మ. అగుఁ బో యీతఁడ రావణుం డనుచు ర♦క్షోధీశుఁ గానంగ వీ
లగు తానంబును జేరి భూరిబలుఁడై ♦ యా వీరు తేజంబునన్
విగళత్తేజుఁడు నొచుఁ గొమ్మలను డా♦వెన్ వాడునున్ సుస్తనిన్
జిగురుంబోఁడి సుగాత్రి డాయ నరుదెం♦చెం జూడఁ గాంక్షించుచున్. ౫౦౨

అర్థములు. తానము = ప్రదేశము, విగళత్తేజుఁడు = జాఱిపోయిన తేజము గలవాఁడు, డావెన్ = డాఁగుకొనెను. క్వచిద్గకారోవః అనుసూత్ర ప్రకారము గకారమునకు వకారము వచ్చెను. అగుఁబో = నిశ్చయముగా నగును.

తా త్ప ర్య ము.

నిశ్చయముగా వీఁడు రావణుఁడే యని తలఁచి వానిని జక్కఁగా జూచుటకు ననువైన స్థలముఁ జేరి అనఁగా వానికి నెదురు ముఖముగా నుండునట్లు విస్తారబలము గలవాఁ డయ్యును వాని తేజస్సు ముందర తేజోహీనుఁడై కొమ్మలసందున డాఁగుకొనెను. వాడును సీతను జూడ సమీపించి వచ్చెను.

—♦ ౧౯-వ సర్గము. రావణుఁడు సీతాదేవిని జేరఁబోవుట. ♦—

చ. తడయక సీత గాంచి దవు♦దవ్వుల భూషణభూషితాంగుఁడై
పడఁతులతోడ వచ్చు సుర♦భంజను యౌవనరూపవైభవున్
వడఁకుచు నోరుగాలికి వ♦ణంకు ననంటినిబోలి యూరులన్
గడుపును బాహులం జనులు ♦ గ్రక్కన మాటుచు నేడ్చుచుండఁగన్. ౫౦౩

## తాత్పర్యము.

ఆభరణములచే నలంకరించుకొని యాఁడువారితో వచ్చుచున్న రావణుని యౌవన సౌందర్య సంపత్తి గలవానిని దూరమునందే చూచి సీతాదేవి యోరు గాలికి నరఁటి చెట్టువలె గడగడ వణఁకుచు నాలస్యము లేక తొడలచేఁ గడుపును చేతులచే స్తనములను గప్పుచు నేడ్చుచుండెను.

సొమ్ములు మూటఁగట్టి యుత్తరీయమును బాఱవైచిన కారణముచేఁ బైటయు లేక యుండుటచేఁ గడుపు గానరాకుండఁ దొడలను ఱొమ్ములు గానరాకుండ మోఁకాళ్లను నడ్డముంచి ఆ కాళ్లను రెండుచేతులు కట్టుకొని బిగించె నని భావము.

సీ. దశకంధరుం డంత ♦ దర్శించె రాకాసి, మూఁక గావఁగ నార్తి ♦ మునుఁగుదాని
జలనిధి నవిసిన ♦ కలముఁబోలినదాని, నుత్తనేలను గూరు ♦ చున్న దానిఁ
గొట్టివైచినపూవుఁ ♦ గొమ్మ దీటవుదాని, నతులితసంశిత ♦ వ్రతముదానిఁ
బంకపు నగను బల్ ♦ వన్నె లీనెఁడు దాని, నొంటి నేడ్చుచు జింత నొందుదాని
ఆ. బురద క్రమ్మియున్న ♦ సరసిజం బనఁగను, మెఱసి మెఱయ కుండు ♦ మేనిదాని
మండనార్హ యయ్యు ♦ మండనంబులు ద్రోచి, యడలుదాని నవయు ♦ నొడలిదాని.

అర్థములు. అవిసిన = పగిలిన, కలము = ఓడ, అతులిత = అసమానమైన, సంశిత = మిగులఁ దీక్ష్ణమైన, వ్రతాః = వ్రతము గలదానిని, నిద్రాహారములు రెండును విడిచి కటికి నేలపైఁ గూర్చుండిన తీవ్ర వ్రతము గలదానిని, పంకపు నగను = దుమ్మనెడి యాభరణముచే, మండనార్హ = అలంకారమునకు యోగ్యురాలు, మండనంబులు = ఆభరణంబులు.

ఈ పద్యము మొదలు సంరెండు పద్యములు కుళకము.

ఈ పద్యము నారంభమున దశకంధరుఁడనియుఁ గడపటి పద్యంబున దశాస్యుఁడనియుఁ బ్రయోగించుట, కర్తృపదము మఱవకుండుటకై దూరాన్వయము నివారించుటకైయని తెలియునది. ఈ నడుమ నుండిన వన్నియు సీతాదేవి విశేషణములు.

## తాత్పర్యము.

రాక్షస స్త్రీల గుంపు తన్ను రక్షింపఁగా దుఃఖించుచుండు దానిని, సముద్ర మధ్యమున పగిలిన యోడవలె దరిగానక యుండు దానిని, కటికి నేలపైఁ గూర్చుండిన దానిని, తెగఁగొట్టివైచిన పూవు దీగవలె నుండు దానిని నిద్రాహారములు మాని మిగులఁ దీవ్రమైన వ్రతము పట్టిన దానిని, దుమ్ము క్రమ్మిన దేహము గల దానిని, తన వారెవ్వరు లేక యొంటిగ దుఃఖించుచుండు దానిని, బురద సోకిన కమలము వలె కాంతి గలిగి లేకున్న దానిని, ఆభరణములు ధరింప యోగ్యురాలయ్యు ధరింపని దానిని, శుష్కించిన దేహము గల దానిని.

చ. కనుఁగొన లేక మేర దన♦కాతియకుం బరివేష్టమానభో
గిని యన నుండుదాని, గుణ♦కీర్తితధార్మికవృత్తశీల మా
ఘనకుల మందుఁ బుట్టియును♦గాపురుషాధము దుష్కులోద్భవున్
బెనిమిటిఁ జేసికొన్న యలి♦వేణినిఁ బోని పతివ్రతామణిన్. ౫౦౫

అర్థములు. కాతియ = బాధ, మేర = అంతము, పరివేష్టమాన భోగిని = పొరలాడుచున్న ఆఁడుపాము; గుణకీర్తిత = గుణములచేఁ బొగడఁబడిన, ధార్మిక వృత్తశీలము = ధర్మాత్ముల నడవడి, యాచారము, కాపురుషాధమున్ = నీచుఁడగు దుష్టపురుషుని, దుష్కులోద్భవున్ = నీచపుఁ గులమందుఁ బుట్టినవానిని.

ఆఁడుపా మనుటచేఁ దాఁకిన మరణము సిద్ధమని భావము.

తా త్ప ర్య ము.

తన దుఃఖ మెపుడు ముగియునో తెలిసికొనలేక నేలపైఁ బొరలుచున్న యాఁడు పామువలె నుండుదానిని, గుణములచేత, ధర్మముచేత, నడవడిచేత, సదాచారముచేతఁ బ్రసిద్ధి కెక్కిన వంశమునఁ బుట్టియు, నీచకులమందు బుట్టిన నీచ పురుషుని దనభర్తగాఁ జేసికొన్న దానివలె నుండుదానిని, పతివ్రతారత్నమును.

క. అంకరహితవిదితాత్మునిఁ, బంకజదళనేత్రు రామ♦భద్రుని డాయన్
సంకల్పహయంబులచేఁ, బొంకంబుగ హృద్రథమునఁ♦బోయెడిదానిన్. ౫౦౬

అర్థములు. అంకరహిత = (౧) సమీపమందు లేనివానిని, (౨) కళంకము లేనివానిని, హేయగుణ మొక్కటియైన లేనివానిని, విదిత+ఆత్ముని = తెలియఁబడిన స్వభావము గలవానిని, సంకల్పహయంబులచేన్ = తలంపు లనెడి గుఱ్ఱములచే, హృద్రథమునన్ = హృదయ మను రథమునందు; విరహిణియుఁ, బరమభక్తుఁడు, ప్రపన్నుఁడు సమానులు. వీరల దేహ మెందున్న నుహృదయము, సంకల్పము విరహిణికి భర్తయందును, భక్తులకుఁ బ్రపన్నులకు భగవంతుని మీఁదను నుండును. ఆ విషయమే యిందుఁ దెలుపఁబడెను. అంకరహిత = పతివ్రతకు భర్తయందు నెట్టికళంకముగానరాదు. ఆయననిగ్రహములను గూడ ననుగ్రహములనియే తలంచుచుండును. విదితాత్ముని = తెలియఁబడిన మనస్సు; స్వభావము గలవాఁడు, ఆయన మనస్సు స్వభావ మెట్టిదైనది యనఁగాఁ దనయందు విశేషానురాగము గలవాఁడని, ఆశ్రిత రక్షణ మాయన స్వభావ మని సీతకుఁ దెలియునని భావము. కావుననే కదా కౌసల్య యందుండు ప్రేమకంటెఁ దనయం దెక్కువప్రేమ రామచంద్రమూర్తికిఁ గలదని హనుమంతునితోఁ జెప్పెను. (చూ. ౬౬౭ వ ప.) పంకజదళనేత్రున్ = పంకము = పాపము, పాపములోఁ బుట్టిన దానిని ఛేదించు చూపుగలవాఁడు. ఆయన దృష్టి సోఁకినంత మాత్రముననే యెల్లపాపములు హరించును. అంతటి మహానుభావుఁడు కావుననే కదా యాశ్రితు లందలి దోషము సహింపవలెనని చెప్పెను. ఆయన దృష్టి తగులఁగానే దోషనివృత్తి కాఁగా నిఁక దండింపఁ గారణ మేమున్నది? కావున

నాయం దేదయిన దోష ముండినను క్షమించి తన్ను రామచంద్రమూర్తి రక్షించునని భావము. రామభద్రునిఁ = 'భద్రశబ్దేన దేవశ్య నిత్యనిర్దోషతోచ్యతే' (అహి. ౫-౪౯) నిత్యనిర్దోషత్వము గల రాముని నని భావము. సంకల్పము = ప్రాణము, 'ప్రాణో మాయా క్రియాశక్తిర్భావ ఉన్మేష ఉద్యమః। సుదర్శనంచ సంకల్పః శబ్దాః పర్యాయ వాచకాః॥ (అహి. ౧౨ అధ్యా.।) హాయ = త్వరగాఁ బోవునది, త్వరగాఁ బోవునట్టి ప్రాణవాయువులచే, పొంకంబుగన్ = దృఢముగ, చలింపకుండ నని యర్థము. రథ శబ్దమునకు = దేహము - మనోరథము, రథము, వాహనము నని యర్థము. హృద్రథమనఁగా హృదయ మను రథము. (౨) హృదయ మను శరీరము - పోయెడి దానిన్ = పోవుచున్న దానిని, ఇక్కడ లేదని భావము.

తా త్ప ర్య ము.

ఎట్టి కళంకము లేనివాఁడును, తల్లియందుండు ప్రేమకంటె నెక్కువ ప్రేమ తనయందుఁ గలవాఁడును, తనయందు దోష ముండినను దానిని హరింపఁ జేసి స్వీకరించువాఁడును, నిత్య నిర్దోషియు నగు రామచంద్రమూర్తి యొద్దకు సంకల్పములను గుఱ్ఱములను గట్టిన హృదయ మను రథమునందుఁ గూర్చుండి పోవుచున్న దానిని.,

హృదయమునే శరీరముగాఁ గల ప్రాణము లతివేగమునఁ బోవుచున్న వని యైనఁ జెప్పవచ్చును. అనఁగా సీతాదేవి శరీరమందున్నదే కాని ఆమె హృదయము, ప్రాణము, భావము, సర్వము రామునొద్దకుఁ బోయిన వని భావము. భక్తులు, పతివ్రతలు నిట్టివారై యుందురు.

క. అపవాదముచేఁ దెరకు, నిపతిత మగుకీర్తిఁ బోని ♦ నెలఁతుకమిన్నన్
వ్యపకలితాభ్యాసం బగు, కృపణుని విద్యయునుబోలెఁ ♦ గీడ్పడుదానిన్. ౫౦౭

అర్థములు. నిపతితము = పడిపోయినది, వ్యపకలితాభ్యాసము = అలవాటు తప్పినది, చింతనలేనిది, కృపణుని = లోభివానియొక్క.

తా త్ప ర్య ము.

నిష్కారణ నిందచేఁ జెడిన కీర్తివలె నున్న దానిని, ధనము మీఁదనే దృష్టి గలిగి లోభియై గురువున కేమైన నీయవలసి వచ్చునే యని సరిగా నభ్యసింపని వాని విద్యవలె నుండుదానిని.

చ. సమసిన కీర్తి, నాదరము ♦ చాలని శ్రద్ధఁ, బరిక్షతంబు నై
యమలిన పూజ, భగ్న యగు ♦ నాశను, జిందఱవోవు లాభమున్
గమరిన పద్మమున్, మిగులఁ ♦ గాలెడి దిక్కును, భగ్న పూజనున్
దమమును గూడు వెల్తురు, ని♦దాఘమునందలి యేటిఁ బోలుచున్. ౫౦౮

తా త్ప ర్య ము.

నశించిన కీర్తిని, ఆదరింపఁబడని శ్రద్ధను (శ్రద్ధగలవాని నాదరింపకున్న నా శ్రద్ధ క్షీణించి పోవును.) పూజాద్రవ్యములు లేని పూజను, చెడిపోయిన యాశను,

చెదరిపోయిన లాభమును, వాడిపోయిన పద్మమును, కాలుచున్న దిక్కులను, విఘ్నమైన పూజను, జీఁకటితోఁ గూడిన వెలుతురును, ఎండకాలమందలి యేటిని బోలుచున్న దానిని. నిదాఘము = ఎండకాలము.

క. హతశూరము సైన్యమువలెఁ, బ్రతిహతశాసనము రీతి ♦ రాహువు మ్రింగన్
వెతగొను జాబిలిఁ గల నిశ,గతి శాంతానలము భంగిఁ♦ గ్రాలెడిదానిన్. ౫౯

అర్థములు. హతశూరము = చంపఁబడిన శత్రువులుగలది, ప్రతిహత = నెఱవేఱని, శాసనము భంగిన్ = ఆజ్ఞవలె, జాబిలి = చంద్రుఁడు, శాంతానలము = చల్లారిన నిప్పు.

తా త్ప ర్య ము.

శూరులు చచ్చిన సైన్యమువలె, వ్యర్థమైన యాజ్ఞవలె, రాహువు మ్రింగిన చంద్రునిగల రాత్రివలె, చల్లారిన యగ్నివలె నున్నదానిని.

తే. మైల దాఁకిన వేదినాఁ ♦ బూలఁ గమల,దళములను బీఁకివైచి ప♦క్షులను బఱచి
గజము గలఁపఁగ బురదచే♦గాడు పడిన,సారసాకరమో యనిఁ♦ జాలుదాని. ౬౦

తా త్ప ర్య ము.

అపవిత్రవస్తువు దాకిన యజ్ఞవేదికవలెఁ, దామరపూలను ఆకులను పీఁకివేసి, పక్షులను బాఱఁదోలి యేనుఁగు కలియపెట్టఁగా బురదగా నైన తామరకొలని వలె నుండుదానిని.

చ. మగనిఁ దలంచి యేడ్చుటను ♦ మానక, కట్ట దెగంగ వాఁకనాఁ
దగి, యుపచారహీన యయి, ♦ తానవసంగతిఁ గృష్ణపక్షమం
దగు నిశఁబోలు సుందరి, న♦ నర్ఘమణీస్థగితాలయోచితన్
మిగుల సుఖార్హనున్, మృదుల♦నిర్మల దేహను, సుందరీమణిన్. ౬౧

అర్థములు. తానవసంగతిన్ = కృశించి యుండుటచేత, అనర్ఘ = వెలలేని, మణీ = రత్నములచే, స్థగిత = చెక్కఁబడిన, ఆలయ = ఇంటియందుండ, ఉచితన్ = తగినదానిని.

తా త్ప ర్య ము.

మగనిఁదలంచి విడువక యేడ్చుచు కట్టఁదెగిన వంకవలెనై, యుపచారములు లేక కృశించి కృష్ణపక్షరాత్రివలె నుండుదానిని, వెలలేని మణులు చెక్కిన యింట నుండఁదగిన దానిని, మిక్కిలి సుఖమునకు యోగ్యమగు దానిని, సుకుమారమైన నిర్మలమైన దేహము గలదానిని, అందగత్తెలందు శ్రేష్ఠురాలిని.

తే. అపుడ యెండకు వైచిన♦యట్టి తమ్మి,తూఁడనంగను వాడిన♦తోయజాక్షి
యూథపునిఁబాసి కంబాన♦నుక్కు చెడఁగఁ, గట్టఁబడి వగనూర్చెడి♦కరిణికరణి.

తా త్ప ర్య ము.

కొంచెము కాలమునకు ముందే యెండలోవేసిన తామర తూఁడువలె వాడిన

దానిని, యూథనాయకుని వదలి కంబమునకుఁ గట్టఁబడఁగా నూర్పుచున్న యాఁడేనుఁగువలె నుండు దానిని.

క. తూలుచును నొంటిజడతోఁ, జాలిగ నగ లేమి లేమి ♦ శారదవేళన్
నీలం బగు వనలక్ష్మీ,లీలలు గల భూమినా ల♦లిం గనుదానిన్. ౫౧౩

అర్థములు. తూలుచును = సోలిపోవుచు, ఇది పూర్వపద్యముతో నన్వయము. ఒంటిజడతో - తల పరయఁబోసికొని, నేలపైఁ బొరలాడుటచే వెండ్రుక లన్నియు నొకటిగా జడకట్టుకొని పోయె నని భావము, నగలు = సొమ్ములు.

తా త్ప ర్య ము.

ఒంటి జడ గలిగి, చూచుటకు వ్యసనము గలిగించుచు, సొమ్ము లేమి లేకుండుటచే శరత్కాల మందలి నల్లని వనభూమివలె నుండు దానిని.

తే. భయమునను శోకమున నుప♦వాసములను
ధ్యానమునఁ గొఱకుడుపునఁ ♦ దపముఁ జేయు
చుండు నదివోలె శుష్కించి ♦ యుండుదాని
దీన యగుదాని వెలవెల ♦ యైనదాని. ౫౧౪

తా త్ప ర్య ము.

భయము చేతను, వ్యసనము చేతను, ఆహారము లేమి చేతను, చింతచేతను, శుష్కించి కొంచె మాహారము దీసికొని తపస్సు చేయుదానివలె నుండుదానిని, శోకించుదానిని, తన్నుఁ జూచి భయముచే తెల్లబోయిన దానిని.

ఉ. దేవతలార! నా పతికిఁ ♦ దేజ మెలర్పఁగఁ జేసి యాదశ
గ్రీవుఁ బరాభవింపుఁ డని ♦ కేల్మొగిడించి సభక్తికంబుగా
భావములోన వేఁడు చెలిఁ ♦ బ్రక్కలు చూచుచు నేడ్చుదాని, న
ప్పావని మైథిలిం గదిసెఁ ♦ బాపి దశాస్యుఁడు పంచతార్థమై. ౫౧౫

అర్థములు. పావనిన్ = పవిత్రురాలిని, పంచతార్థము = మరణము సమీపించిన కారణముచే.

తా త్ప ర్య ము.

దేవతలారా! నా పతికిఁ బరాక్రమ మతిశయింపఁజేసి రావణునకు నపజయము కలుగు నట్లు చేయుఁ డని రెండు చేతులు జోడించి భక్తితో నమస్కరించుచు మనస్సులోఁ బ్రార్థించు దానిని నీ ప్రక్క నా ప్రక్క చూచుచు నేడ్చు దానిని, పవిత్రురాలిని, బాపాత్ముఁ డగు రావణుఁడు మరణదశ ప్రాప్తించుటచే సీతను సమీపించెను.

——♦ ౨౦-వ సర్గము, రావణుఁడు తనకోరికను సీతాదేవికిఁ జెప్పుట. ♦——

క. చేరంగఁ బోయి రాక్షస,వీరుఁడు మధురోక్తిఁ బల్కెఁ ♦ బృథ్వీసుతతో
వారక తన మదిఁ గలుగు వి,చారము తెల్లంబుగాఁగ ♦ సాధ్వీమణికిన్. ౫౧౬

తాత్పర్యము.

ఇట్లు సమీపించి రావణుఁడు తియ్యని మాటలతో దన మనస్సులో నున్న యాలోచనలు స్పష్టముగాఁ దెలియునట్లు పతివ్రతాశిరోమణియైన సీతాదేవితో నిట్లనియె.

ఉ. ఏటికి నన్నుఁ జూచి జల♦జేక్షణ! దాఁపఁ గుచోదరంబు, లి
ట్లేటికొకో వణంకఁ, బరు♦లెవ్వరొకో కరభోరు! యిందు, నా
మాటను బాటిగాఁ గొనుము♦మత్ప్రియురాల! బహూకరింపు నన్,
మేటిసురూపతా ఖనివి♦నీవ గదే జగదేకమోహినీ. ౫౧౭

అర్థములు. కుచ+ఉదరంబును= స్తనములను కడుపును, కరభోరు = కరభమువంటి తొడలు గలదానా! కరభము = మణికట్టు మొదలు చిటికెనవ్రేలి మొదలు దాఁక చేతి వెలుపలిచోటు. (౨) ఏనుఁగుతొండము. సురూపతా = సౌందర్యమునకు, ఖనివి=గనియైన దానవు.

తాత్పర్యము.

నా ప్రియురాల! జగములను మోహింపఁ జేయుదానా! నన్నుఁ జూచి యేల నీవు కడుపును, చనులను దాచిపెట్టెదవు. ఏల యిట్లు వణఁకుచున్నదానవు. ఇక్కడఁ బరులెవరున్నారు. నా మాట వినుము. నన్ను గౌరవింపుము. నీవేకదా సౌందర్యమునకు గనియైన దానవు.

ఆ. కలికి మనుజులైనఁ♦గామరూపధరులు, రాత్రిచరులునైన♦రాజవదన!
యిందు లేరు నీకు♦నేటికి భయపడ? నాకు వెఱవ వలదు♦నళిననేత్ర! ౫౧౮

తాత్పర్యము.

కాంతా! ఇచట నీ జాతిలోఁ జేరిన మనుష్యులు లేరు. నా జాతికిఁ జేరి కామరూపధరులైన రాక్షసులు లేరు. నీ వేల యెవరు చూచి యేమనుకొందురో యని భయపడెదవు. నాకు నీవు భయపడవలసిన పనిలేదు. నేను రాక్షసుఁడనైనను నీ మీఁది కామమున వచ్చితినిగాని, నిన్నుఁ జంప రాలేదు.

క. పరదారగమనకేళియుఁ, బరదారాపహరణంబు♦పద్మదళాక్షీ
పరగుఁ గులధర్మమయి ని,ర్జరవైరుల కెల్ల భీరు♦సందియ మున్నే. ౫౧౯

తాత్పర్యము.

ఓరి! నేను నీభార్యనుగాను, పరభార్యలను నీవు కోరవచ్చునా యందువేమో, పరుల భార్యలను బొందుట, పరుల ధనమపహరించుట యను నాటలు రాక్షసుల కందఱకు నాకొక్కనికే కాదు కులధర్మము. ఓసి పిఱికి! దీనిలో సందేహము లేదు, ఇది కులధర్మ మగుటచే దోషము గాదు. కావున నీకుఁ బాపభయ మక్కఱ లేదు.

క. రామా! యిది యిట్లయ్యు న, కామను నినుఁ దాఁక నొల్లఁ♦గామము బలిమిన్
గామింపు యథాకామము, గా మైథిలి! నాదుపట్లఁ♦గరుణామతివై. ౫౨౦

తాత్పర్యము.

సుందరీ! పరదారలను బొందుట నా స్వధర్మమైనను స్వధర్మము నిర్వహించుట నాకు విధియైనను, నాయందు నీకుఁ గామము కలుగ లేదు. కావున నా కెంత కామమున్నను నిన్నుఁ దాకుఁట కిష్టపడను. నీవే నీ కోరిక ప్రకారము యథేచ్ఛముగా నన్ను నా యందు దయయుంచి కామింపుము.

ఉ. దేవి! భయంబు నొందఁగ మ♦దిం దగ దిందుఁ, బ్రసాదదృష్టి సం
భావన సేయు నన్ను వెత♦పాల్పడఁబోకుమ, యేకవేణి దు
ష్టావని శయ్యయున్ పరసు♦ఖార్త తలంబునఁ బస్తు లుంటయున్
వావిరిచింతయున్ మయిల♦వస్త్రము నీ కుచితంబులే యిటన్. ౫౨౧

అర్థములు. ప్రసాదదృష్టి = అనుగ్రహముతోఁ గూడిన చూపు, సంభావన = గౌరవము, దుష్టావని = పాడునేల.

తాత్పర్యము.

దేవీ! నీ విచ్చట భయపడరాదు. నన్ననుగ్రహదృష్టి గౌరవింపుము. వ్యసనపడ వలదు. ఒంటి జడ, గొడ్డునేల పడుక, సుఖింపవలసిన చోట నుపవాసములు, వదలని విచారము, మాసినగుడ్డ యివి నీ కిచ్చటఁ దగునా?

ఉ. అందము లైన మాల్యనిచ♦యంబులు దివ్యము లైన భూషలున్
జందన లేపనంబులును ♦ జక్కని పెక్కు తెఱంగు చేలముల్
సుందర మందిరంబులును ♦సొంపగు పానశయాసనంబులున్
సుందరి నృత్తగీతములు ♦ నూల్కొనుమీ ననుఁ బొంది మైథిలీ! ౫౨౨

తాత్పర్యము.

సొగసైన పూలదండల గుంపులు, దివ్యాభరణములు, దివ్య చందనపుఁ బూఁతలు, అనేకవిధములైన చీరలు, అందములైన యిండ్లు, సొంపయిన పానములు, పానుపులు, పీటలు, ఆటలు, పాటలు నన్నుఁగూడిన దానవై వీని నెల్ల నంగీకరింపుము.

క. స్త్రీరత్నమ! యిటు లుండకు, భూరివిభూషల ధరింపు ♦ పువుఁబోఁడీ! నన్
జేరియునున్ రుచిరాలంకారములకుఁ బాసి యుండఁ♦గాఁ దగు నొక్కో. ౫౨౩

అర్థములు. రుచిరాలంకారములకున్ = అందములైన సొగసులకు, ద్వితీయార్థమున షష్ఠి. షష్ఠీస్థానకంబగు కువర్ణకం బొక్కొక్కచో ద్వితీయాది విభక్తులకు మాఱుగాఁ దత్తదర్థంబులఁ జూపట్టెడి. (ప్రౌ. వ్యా, కా. ౧౩.)

తాత్పర్యము.

స్త్రీలయందు శ్రేష్ఠురాలా! నీ వీ ప్రకారముగా నుండఁ దగదు. వెలగల యాభరణములను ధరింపుము. నా యొద్ద నుండియును నీవు మనోహరములైన యలంకారముల విడచియుండ వచ్చునా?

క. చను చున్నది యెఱుఁగ వా కో, ననఁబోణీ! హారియౌవనము నీకు వృథా
చనినదియు మరలు నట వే? వనజాక్షీ! వచ్చునా ప్రవాహము మఱలన్? ౫౨౮

అర్థములు. హారియౌవనము=మనోహరమైన వయస్సు, "రతివ్యాయామ సహానోమత్తేభ స్యేవమత్తతా। విద్యతే యువభావో య స్తద్యౌవన ముదాహృతమ్."

తాత్పర్యము.

పుష్పకోమలా! నీకుఁ బ్రాయము వృథా పోవుచున్నది. ఇది నీకుఁ దెలియ లేదు కాఁబోలు. పోయిన ప్రాయము మఱలరాదు. ప్రవాహము మఱలి యెన్నడైన వెనుకకు వచ్చునా?

ఉ. నిన్ను సృజించి వెండి తరుణీ యలవిశ్వవిధాత రూపసం
పన్నల సృష్టి సేయుటయె మానె నటంచుఁ దలంతు లోకమం
దన్నులమిన్న! నీకు సరియంగన లేమి నొకర్తుఁ, బూరుషుం
డన్నలువైన నిన్బడసి యబ్జముఖీ! విడనాడి పోవునే. ౫౨౯

అర్థములు. విశ్వవిధాత=ప్రపంచము సృష్టిచేసిన బ్రహ్మ, రూపసంపన్నలన్=సౌందర్యలక్ష్మి గలవారల, అన్నులమిన్న=స్త్రీలయందు శ్రేష్ఠురాలా, నలువైన = నలువ + ఐనన్ = బ్రహ్మయైనను. నలు + వ = నలు+వాయి = నాలుగు వదనములు గలవాఁడు.

తాత్పర్యము.

నిన్నుఁ బుట్టించిన తరువాత బ్రహ్మదేవుఁడు సౌందర్యవతులగుస్త్రీలనుసృష్టి సేయుటయే మానె నని తలఁచెదను. ఏలన యో స్త్రీరత్నమా! నీకు సరియైన స్త్రీ లోకమున లేదు. నీకంటె నందకత్తెను సృష్టింప యత్నించినను నది వ్యర్థప్రయత్నమగును. ఆ పనికిఁ బూన నేల, యవమాన పడనేల యని యా పనియే మానుకొనెను. నీవు లభించినపుడు మగవాఁడా బ్రహ్మయైనను నిన్ను వదలిపోవునా?

ఈ రావణ వాక్యములకు మహేశ్వరతీర్థీయ మందు భక్తిపర్యాయముగాఁ గ్లిష్టకల్పనము చేసి వ్రాయఁబడియున్నది. అది వాస్తమునకు విరుద్ధ మని యిదివఱకే వ్రాయఁబడెను. ఈ విషయమున తిలకవ్యాఖ్యయం దీ వాక్యములు గానవచ్చెడిని. 'ఈదృశేషు తీర్థ స్యాన్యథాయోజనం భ్రాంత్యైవ, రక్షస స్తమోగుణావిష్టస్య భగవ న్మాయామోహిత స్యాకృత్యేష్వేవ ప్రవృత్తేః। తథా క్రియామాణం భగవద్ధ్యాన మపి పాపభోగోత్తరం జన్మాంతరే ఉత్తమఫలాయేతి బోద్ధవ్యం.........ఏవంచ భగవతో నిందావరుద్ధభావేన ధ్యాన మపి నరకభోగోత్తరం జన్మాంతరే ఉత్తమ ఫలాయ। అత ఏవాస్య మరణోత్తరం చతుర్థ్యా చతుర్యుగ్యాం చేదిరాజకులే జన్మ, చతుర్వింశతి చతుర్యుగ్యాం రామావతార ఇతిహరివంశోక్తేః। తావత్పర్యంతం చైతత్పాప ఫలభోగ ఇత్యర్థఆయాత ఇతిబోధ్యమ్.

ఇట్టిచోటుల తీర్థులవారి యన్యథార్థకల్పనమునకు భ్రాంతియే కారణము. తమోగుణావిష్టుఁడై భగవన్మాయామోహితుఁడైన వానికి యకృత్యములు చేయుట యందే ప్రవృత్తి. ఆ విధముగఁ జేయు భగవద్ధ్యానము కూడ పాపభోగానంతరము జన్మాంతరమున ఉత్తమ ఫలము నిచ్చునని యెఱుఁగనగు. ఈ విధముగ నిందించుచు భగవంతుని ధ్యానించుటచే నరకానుభవానంతరము జన్మాంతరమున ఉత్తమఫలము నిచ్చును. ఆ కారణముచేతనే నాలుగు మహాయుగముల యనంతరము చేదివంశ మునఁ బుట్టెను. ఇరువది నాలుగవ మహాయుగమందు రామావతారమని హరివంశ మందుఁ గలదు. ఇరువది యెనిమిదవ మహాయుగమునఁ గృష్ణావతారము కావున నంత పర్యంత మీ పాపఫల మనుభవించుచుండెనని తెలియవలయు నని యర్థము. ఈ విషయమున నింత కెక్కువ చెప్పవలసినది లేదు.

తే. ఎచ్చ ఱెచ్చట నా దృష్టి♦యిందువదన!, పడి యెనీపయి నందంద♦ప్రొంతిఁజలన
మించుకయు లేక నిలిచెనే♦యించుఁబోఁడి, గురునితంబినినిన్నొన్నఁ♦దరమె నాకు.

అర్థములు. ప్రొంతిఁ = ప్రీతిచే, గురునితంబిని = పెద్ద పిఱుఁదులు గల దానా? తరమే = సాధ్యమా?

తాత్పర్యము.

నీ దేహము మీఁద నా చూపు లెందెందుఁ బడెనో, యందందే యట్లే యవి ప్రేమచే భ్రాంతి గొని నిలిచి పోవుచున్నవి. కొంచెమైన నా స్థానమును విడిచి పోవు. ఇట్టి నిన్నుఁ బొగడ నాకు సాధ్య మగునా? కాదు.

దూరా దాకర్షణే శక్తో యస్స ఆకర్షక స్స్మృతః
సర్వేషాం స్పర్శ లోలత్వం కురుతే యస్స చుంబకః
కృతార్థయతి యో దృష్ట్వా సంతు సంద్రావక స్స్మృతః
భ్రామకో మధురాభాషీ సంస్తవే ద్వేషభాజనమ్। భోజకారిక.

అయస్కాంతము ఇనుమును లాగుకొనునట్లు ఆకర్షించునది ఆకర్షక మనఁ బడును. తాఁకవలయు నని కోరిక పుట్టించునది చుంబక మనఁబడును. చూపుల చేతనే కృతార్థులఁ జేయునది సంద్రావక మనఁ బడును.

సీ. విషవుమీ మోహంబు♦ వెలఁదిభార్యవుగమ్ము, నాకచ్చటచ్చట♦నాఁచికొనుచు
దెచ్చిన నా యెల్ల♦ తెఱవలలో నగ్ర, మహిషివి గమ్ము స♦మ్మదము మీఱ
నెల్లరఁ బీడించి ♦ యేను దెచ్చినమణుల్. నేను రాజ్యంబును ♦ నీ ధనంబ
నిర్జించి ధరణియు ♦ నిఖిల పత్తనములు, నీదుసంతుష్టికై ♦ నెఱి నొసంగు
తే. వాఁడజనకున, కెవ్వఁడే♦వాలుమగఁడు, నన్ను రణమున నోర్వఁగా♦నున్న జగము
నందుఁ? బోఁడులవేళల♦సుందరాంగి, నాదు బలవీర్యములను గ♦నంగఁ గలవు.

అర్థములు. నాఁచుకొనుచు = బలాత్కారముగ గ్రహించుచు, అగ్రమహి షివి = పెద్దపట్టపు రాణివి.

తాత్పర్యము.

సీతా! నీ వీ యజ్ఞానమును వదలుము. నాకు భార్యవు కమ్ము. నే నాయా దేశంబులందు బలాత్కారముగ గ్రహించి తెచ్చిన స్త్రీల యందఱిలో సంతోషముతో నీవు పట్టపు రాణివి గమ్ము. నే నందఱను బాధించి తెచ్చిన మణులు, నేను, నా రాజ్యము నీ సొత్తే. ఇదిగాక యింకయుఁ గావలయు ననిన భూమిని, సకల నగరములను జయించి నీవు తృప్తిపడుటకై నీతండ్రి జనకునకు సమస్తము నిచ్చువాఁడను. యుద్ధమునందు నా ధాటి సహింపఁగల శూరుఁ డెవ్వఁ డున్నాఁడే; యుద్ధములందు నా బలము, శౌర్యము నీవే చూడఁగలవు.

చ. ఒరగిన టెక్కెముల్, రవుతు♦లూడిన వాజులుఁ, గూలు తేరులున్
విఱిగిన విండులుం, జెదరి♦ప్రేలెడి వెంద్రుకలుం, దడంబడం
బఱచెడి పాదముల్, పిలుకు♦మాఱెడి సేనలుఁ, గల్గి శత్రువుల్
పిఱికితనానఁ బాఱుదురు♦భీతి ననిన్ దనుజామరుల్ సతీ! ౫౨౮

అర్థములు. పిలుకుమాఱెడి = చచ్చుచున్న, అనిన్ = యుద్ధమందు.

తాత్పర్యము.

సీతా! నేను యుద్ధము చేయునపుడు యుద్ధభూమి యెట్లుండునని తలఁచితివో కదా! కట్టుత్రాళ్ళు తెగి దండములు విఱిగి నేలరాలిన ధ్వజములు, రౌతులు చచ్చిన గుఱ్ఱములు, కుప్పకూలిన తేరులు, విఱిగినవిండ్లు, విరియఁబోసికొని పరువెత్తు వారి వెండ్రుకలు, తడఁబడ పరువెత్తుకాళ్ళు, చచ్చుచున్న సేనాభటులు గలవారై దానవులందు, దేవతలందు శత్రువు లగువారు భయపడి పరువెత్తుదురు.

ఉ. కన్నులకాంక్ష దీరఁ గనఁ♦గా మది గోల్చెడు నీదు రూపమున్
జెన్నగు భూషణంబులను ♦ జెల్వ! ధరింపుము మేన, నాశ దీ
ర న్నిఖిలేష్టభోగములఁ ♦ బ్రాజ్యముగా భుజియింపు, క్రీడలన్
బన్నుగఁ దేలుమీ, రుచిర♦పానకముల్ ముదమారఁ గ్రోలుమీ. ౫౨౯

తాత్పర్యము.

నీ సౌందర్యమును గన్నుల కోరిక దీరఁ జూడఁ గోరిక కలదు. కావునఁ జెలువా! దేహమున నాభరణంబుల ధరింపుము. నీ యాశదీర సమస్తభోగములఁ బూర్ణముగ ననుభవింపుము. కేళుల వర్తింపుము. సంతోషముతో మనోహరము లైన పానకములు త్రావుము.

మ. ధనమో భూమియొ రాజ్యమో యెదియునేఁ ♦ దన్వీ! యథేష్టంబుగా
వనితా! దానము సేయుమీ, ననుఁ గృపా♦భావంబునం జూడుమీ
కొనుమీ యెయ్యది గోర నిచ్చెదను నీ♦కు, న్నాపయిం గూర్మిఁ జూ
పిన నీవారల కెల్ల సౌఖ్యములు ప్రా♦పించున్ నిజంబాడెదన్. ౫౩౦

తాత్పర్యము.

నీ యిష్టప్రకారము ధనముగాని, భూమిగాని, రాజ్యముగాని, మఱి యేదైనఁ గాని నీయిష్టము వచ్చినవారికి దానము చేయుము. నన్నుదయతోఁ జూడుము. నీవేదికోరినను నిచ్చెదను. నా యందు నీ కనుగ్రహము గలిగెనా నీ బంధువుల కెల్ల సౌఖ్యములు లభింపఁజేసెదను. సత్యము చెప్పుచున్నాను.

తే. కలికినాదుసమృద్ధియుఁ♦గలిమి కీర్తిఁ, గనుముప్రీతి, వనాటుండు ♦గతరముండు
చెలియ! చీరాంబరుండు ని♦క్షిప్తవిజయుఁ, డతివ! స్థండిలశాయి నీ♦పతి దలంప.

అర్థములు. వనాటుండు = అడవులందు సంచారము చేయువాఁడు, గతరముండు = పోయినసంపద గలవాఁడు, చీరాంబరుండు= నారగుడ్డలు కట్టువాఁడు. నిక్షిప్త = వదలఁబడిన, విజయుఁడు = గెలుపు గలవాఁడు, స్థండిలశాయి = నేలపైఁ బండుకొనువాఁడు.

తాత్పర్యము.

ఇంతసేపు తన్నుఁ బొగడుకొని యిఁక రాముని దూషించు చున్నాఁడు. కలికీ! నా సమృద్ధి, సంపద, కీర్తి వీనిని బ్రీతితోఁ జూడుము. ఇఁక నీ మగఁడో యిల్లు, వాకిలి, గుడిసైయైన లేక యడవులందుఁ దిరుగువాఁడు. సంపద లేనివాఁడు. కట్టుకొన మంచి వస్త్రములు లేక, నారచీరలు గట్టువాఁడు. గెలుపు లేనివాఁడు. పండుకొనుటకు నొక చాపయైనలేక నేలఁ బడియుండువాఁడు. అట్టి దరిద్రరాముఁ డెక్కడ? నే నెక్కడ?

రావణుఁడు రామచంద్రుని దూషింపవలయునని దూషించినను 'సత్యవాణీ సరస్వతీ' యన్నట్లు వాని నోట సత్యవాక్కులే వచ్చెను. 'మానిషాద' వలెననియె యుంగునది. లేక ఘుణాక్షరన్యాయమనియైనఁ జెప్పవచ్చును. వనాటుండు = వన మనఁగా నీళ్లు, వానియందుఁ జరించువాఁడు, నారాయణుండు, గతరముఁడు = పొందఁబడిన లక్ష్మి గలవాఁడు. చీరాంబరుండు = అంబరము = ఆకాశము, అదియే వస్త్రముగాఁ గలవాఁడు, నిరావరణుఁ డని యర్థము = నిక్షిప్తవిజయుఁడు = చెడిపోని గెలుపేగలవాఁడు, స్థండిలశాయి = స్థండిల మనఁగా యజ్ఞభూమి, దానియందుండు వాఁడు.

ఉ. రాముఁడు నింత దాఁక నటఁ ♦ బ్రాణముతోడుత నున్న వాఁడొ లేఁ
డో మది సంశయింతు, నిను ♦ నుత్పలలోచన! చూడ నేనియుఁ
రాముఁడు చాలఁ, డగ్రమున ♦ రాజిలఁ గొంగలు వార్షి కాంబుద
స్తోమము గ్రమ్మినన్ వశమె ♦ చూడఁగ వెన్నెల నెట్టివారికిన్? ౫౩౨

తాత్పర్యము.

సీతా! రాముఁడు రాముఁ డని యంగలార్చెదవే, రాముఁ డింకను బ్రదికియున్నాఁడు, చావలేదనుట యేమి నిశ్చయము. ఒకవేళ బ్రతికియున్నాఁడనుకో, నిన్నుఁ జూచుటకైనను రాముఁడు రాఁజాలఁడు. ఎట్లన ముందు కొంగ లన్నియు

వ్యాపించి వానిపైన వానమబ్బు కూడఁ గ్రమ్మినప్పుడు వెన్నెలను జూచుట కెవరి కైన సాధ్యపడునా? అట్టులే సముద్రము దాఁటి నన్ను గెలిచికదా నీ యొద్దకు రావలె, అదెట్లు రాఁగలడు?

తే. వృత్రశాత్రవకరగత♦ హేమకశిపు,కీర్తిచందంబునను రామ ♦ మూర్తి మఱల
నాదుహస్తంబునం దుండి♦నళిననేత్ర! నిన్ను గ్రహియింప నెట్టులు♦నేర్చుఁ జెపుమ.

అర్థములు. వృత్రశాత్రవ కరగత = ఇంద్రునకు వశపడిన, హేమకశిపు కీర్తి = హిరణ్యకశిపునికీర్తి, ఇక్కడఁ గీర్తి కారణమైనభార్యయని గ్రహింపవలయును. భార్యాహరణము కీర్తిహరణమేకదా, హిరణ్యకశిపుని భార్యను ఇంద్రుఁడుహరింపఁ గలిగెను గాని రాముఁడు నాచేజిక్కిన నిన్ను మఱల హరింపఁజాలఁడు. మఱల రాముఁడు నిన్ను హరించెనేని నా కీర్తి హరించినట్లే. అది యెన్నఁటికిని గాఁజాలదు. ఇంద్రుఁడు హిరణ్యకశిపుని భార్యను హరించి నారదాశ్రమమున నుంచె ననియు మఱల హిరణ్యకశిపుఁడు నారదు మూలమున నామెను గ్రహించె ననియు భాగవతమునఁ గలదు. ఇది వైధర్మ్య దృష్టాంతము. రావణాసురుఁడు సీతను హరించినట్టులు హిరణ్యకశిపుఁ డింట లేని సమయంబున నింద్రుఁ డాయన భార్యను కయాధువును హరించెను. ఆవల వాఁడు నయముననో, భయముననో మరలఁ దెచ్చుకొనెను. నీవు నా భార్యవు. నిన్ను రాముఁడు నయమునఁగాని, భయమునఁగాని హరింపఁజాలఁడు. ఇట్లు చెప్పినను చెప్పవచ్చును. తన్ను గొప్పగాఁ జెప్పుకొనుటకై యింద్రునితోఁ తన్నుఁ బోల్చుకొనెను.

క. అందంబగు చిఱునగవున, సుందర రదనమునఁ గనుల♦సొబగున వినతా
నందనుఁడు లేలిహానము, చందమున హరించె దీవు ♦ సకి నా మనమున్. ౫౩౪

అర్థములు. లేలిహానము = పాము.

తాత్పర్యము.

అందమైన చిఱునవ్వుచేత, సుందరములైన దంతములచేత, కన్నుల సొగసు చేత, గరుత్మంతుఁడు పామును హరించినట్లు నీవు నా మనస్సును హరించుచున్నావు. ఈ యుపమానము సీతాదేవి రావణుపాలికి మృత్యుదేవత యని సూచించుచున్నది. మృత్యుదేవత యేదియో రోగమో, నొప్పియో నెపముపెట్టి యెట్లు చంపునో యట్టులే సీతయు రామునిచేత రావణుని జంపించు నని భావము.

ఉ. మాసినచీరఁ గట్టి, నెఱి♦మాలి యలంకృతి లేక మిక్కిలిన్
గాసిలు చున్న యిట్టి నినుఁ ♦ గాంచుట నా ప్రియురాండ్రతోడ వి
శ్వాసముగా రతిం జలుపఁ♦జాలన, కంటె సమస్తసద్గుణా
వాసలు మత్సతుల్ ముగుద! ♦ వారల కీశ్వరి వై చెలంగుమీ. ౫౩౫

తాత్పర్యము.

మాసిన చీరగట్టుకొని, సొగసు వదలి, యాభరణములు ధరింపక మిక్కిలికష్ట

పడుచున్న నిన్నుఁజూచి నిశ్చింతముగా నా భార్యలతో నేను క్రీడింపలేకున్నాను. అయ్యో! సీత యింత కష్టపడుచుండఁగా నాకేమిసుఖమని మనస్సంతయు నీమీఁదనే యుండుటచే వారిమీఁద మనస్సు పోవుటలేదు. అట్లైనచో నిప్పుడు నేడు నిన్నంగీకరించిన వారి కందఱకు నామీఁద కోపము రాదా? సవతి మచ్చరము సాధింపరా యందువేమో? నా భార్య లట్టివారు గారు. సుగుణసంపత్తి గలవారు. అదికాక వారి కందఱకు నీవే ప్రభ్వికమ్ము. నీయధికారానుసారము నిన్ననుసరించి వారు వర్తింతురు.

క. సిరి నచ్చరలు భజించెడి, కరణిఁ ద్రిలోకీప్రవరలు ♦ కాంతా! యస్మ
త్తరుణులు నిన్ను భజింతురు, కరమును భయభక్తియుక్తిఁ ♦ గరుణంగనుమీ. ౫3౬

అర్థములు. త్రిలోకీప్రవరలు = మూఁడులోకములందు శ్రేష్ఠురాండ్రు, అచ్చరలు = అప్సరసలు, అస్మత్తరుణులు = నా స్త్రీలు.

తాత్పర్యము.

శ్రీ మహాలక్ష్మిని మూఁడు లోకములందు శ్రేష్ఠురాండ్రగు నప్సరస లేవిధముగ భయభక్తులతో సేవింతురో యాప్రకారమే నా యాఁడువారందఱు నిన్ను భయభక్తులతో సేవింతురు.

క. చేకొను మలకాపురిఁ గల, ప్రాకటరత్నములు ధనము ♦ బద్మదళాక్షీ
లోకంబునఁ గల్గు నమూల్యాకల్పంబులను నన్ను ♦ నాదర మారన్. ౫3౭

అర్థములు. అమూల్య+ఆకల్పంబులు = వెలలేని యాభరణములు.

తాత్పర్యము.

కుబేరుని పుర మగు నలకాపురియందుఁ గల నిధులలో నుండు రత్నములన్నియు నీవే తీసికొనుము. అవిగాక లోకమునఁగల వెలలేని యాభరణములను గ్రహింపుము. నన్ను ననుగ్రహింపుము.

క. తపముననో బలముననో, విపులపరాక్రమములందొ ♦ విత్తమునందో
విపుల సుకీర్తినో కాంతినో, చపలాక్షీ! రామవిభుఁడు ♦ సరియగు నాతోన్. ౫3౮

తాత్పర్యము.

తపమునందో. బలమునందో, విస్తార పరాక్రమమందో, ధనమునందో, లోకమున మంచికీర్తియందో రాముఁడు నాతో సమానుఁ డగునా!

మ. లలనా! కోరినరీతిఁ గ్రీడలను దే♦లన్ రాదె, త్రావం గదే,
కలభోగంబులఁ బొందుమీ, యొసఁగెదం ♦ గళ్యాణి! విత్తంబులో
యిలయో యెయ్యది గోర నాపయిఁ గృపా♦దృష్టుల్ ప్రసారించినన్
జెలి! నీచుట్టము లెల్లరున్ సుఖులుగాఁ ♦ జింతింపు కాంతామణీ. ౫3౯

తాత్పర్యము.

సీతా! నీ యిష్టమువచ్చినట్లు మనసారఁ గ్రీడింపరాదా! త్రావరాదా! భోగము

లన్ని యనుభవింపరాదా! నీకుఁ గావలసిన ధనమో, భూమియో నీ వేది కోరిన నిచ్చెదనే. నాపై నీవు దయార్ద్ర దృష్టులు వ్యాపింపఁజేసితి వేని నీవే కాదు, నీకుఁ గావలసినవారు బంధువు లందఱు సుఖపడుదు రని నమ్ముము.

మణిమంజరి. మసలకు కనకసు♦మండన! కుంజ
ద్భసలవిసరములు♦భాసిలు వేలా
కుసుమితతరుగణ♦కుంజములందుఁ
బసమెయి మెలఁగుము♦భామిని నాతోఁ. ౫౮౦

అర్థములు. కనకసుమండన = బంగారుమయములైన మంచి యాభరణములు గలదాన, కుంజత్ = ధ్వనించు, భసల విసరములు = తుమ్మెదల గుంపులు, భాసిలు = ప్రకాశించు, వేలా = సముద్రతీరమందలి, కుసుమిత = పూచిన, తరుగణ = చెట్ల సమూహముల, కుంజములందు = పొదలయందు.

తాత్పర్యము.

భామిని! నీవు ఆలస్యము చేయకుము. బంగారు సొమ్ములు గలదానా! ఝుంకారములు చేయు తుమ్మెదల గుంపులుగల సముద్రతీరమందలి పూలచెట్లపొదలందు నాతో సంతోషముగా విహరింపుము. మణిమంజరి వృత్తమునకు, ననసనగ గణములు, తొమ్మిదింట యతి.

—♦ ౨౧-వ సర్గము. సీతాదేవి రావణునకు బుద్ధి చెప్పుట. ♦—

చ. అనుడు దశాస్యవాక్యముల♦నాధరణీభవ యాలకించి దు
ర్మన మయి వేపమాన యయి ♦ మానక సాధ్వి పతిం దలంచుచుఁ
గనుఁగవ నశ్రువు ల్దొరఁగఁ♦గా విలపించుచు దీననాదయై
యనియెను గడ్డిపోఁచ తన ♦ కడ్డము నిల్పి శుచిస్మితాస్య తాఁ. ౫౮౧

అర్థములు. దుర్మన = వ్యసనముతోఁ గూడిన మనస్సు గలది, ఆలకించి = విని, వేపమాన = వణఁకుచున్నది. సాధ్వి = పతివ్రత, అశ్రువుల్ = కన్నీళ్ళు, దొరఁగఁ = కాఱఁగా, దీననాదయై = దుఃఖముతోఁ గూడిన ధ్వనిగలది, ఏడుపు గొంతులతో, శుచిస్మితాస్య = పరిశుద్ధమైన చిఱునవ్వుతోఁ గూడిన ముఖముగలది. దుర్మన = పతి నెడఁబాసి యుండవలసి వచ్చెగదా, దుష్టుఁడగు వీనిచేఁ బతివ్రతలు వినరాని మాటలు వినవలసి వచ్చెగదా యని వ్యసనము.

వేపమాన = అబల—అసహాయ యగుటచే వీఁడు తొందరపడి తాఁకునేమో యను భయముచే వణఁకెను.

సాధ్వి = సాధుత్వము గలది. కావున వాని నిర్ధహింపఁ గలిగియు సహించెను.

పతిం దలంచుచుఁ = పతివ్రతలకు భర్తయే దైవము కావునఁ దక్కినవారాపత్కాలంబుల దైవమును స్మరించునట్లామె పతిం దలంచెను. పాలించువాఁడు గదా పతి.

అశ్రువుల్ దొరఁగఁగా = తన్ను వాఁడేమియుఁ జేయ జాలఁడను ధైర్యము గలది కావునఁ దనకై యేడిచినదికాదు తనవలన భర్తకు దుఃఖము వచ్చెఁగదా యనియుఁ, దనవలన వీఁడు సమూలము నాశమై పోవనున్నాఁడే, చెప్పినను వినఁడే యని రావణు నిమిత్తమైయు కన్నీరు గార్చెను.

గడ్డిపోఁచ తన కడ్డము నిల్పి.

౧. వీఁడు దుష్టభావము గలవాఁడైనను ప్రభువు, క్షత్రియుఁడు. ఇట్టి వీఁడు తన యొద్దకు వచ్చినపుడు 'ఆసనం చాన్న ముదకం దేయమ్' అతిథివంటివాఁడే. అతిథికి ఆసనమో, అన్నమో, నీళ్లో యథాశక్తి యియ్యవలయు నని శాస్త్రవాక్యము గలదు. కావునఁ దనకు లభించిన యా తృణము వైచెను.

౨. రావణుఁడు వచ్చి సమీపమందుఁ గూర్చుండుటచే దుష్టులలో సపంక్తి గూర్చుండరాదు గావున పంక్తిభేదము గలిగింప 'స్తంభేన సలిలేనవా పంక్తిభేదోఽభిజాయతే' స్తంభముగాని, నీళ్ళుగాని యేదైన నడ్డముండిన పంక్తిభేద మగును గావున నిరువురకు నడుమఁ దృణము వైచెను.

3. స్త్రీ పరపురుషునిఁ బ్రత్యక్షముగఁ జూడరాదు. మాటలాడరాదు. 'న పరముఖ నిరీక్షణం నాపి సంభాషణ'మ్మన్న నీతి ననుసరించి ప్రత్యక్ష సంభాషణము నివారింపఁ దృణ మడ్డము వైచెను.

౪. 'తృణ మివ లఘు మేనే' నిన్ను నేను తృణముగా నెంచుచున్నాను. అన్నట్లు నీవీ తృణముతో సమానము. ఈ తృణము నన్నేమి చేయఁగలదో నీవు చేయగలిగిన దంతయే యని సూచింపఁ దృణము వైచెను.

౫. నీకు జ్ఞానములేదు 'జ్ఞానేన హీనః పశుభి స్సమానః' యన్నట్లు నీవు పశువుతో సమానము. నీకు భోగ్యవస్తు వీ గడ్డయే. నేను గాదని తెలుప గడ్డిపోఁచ యడ్డము వైచెను.

౬. అలకాపురిఁగల, మఱియు లోకమున గల రత్నాభరణము లిచ్చెద నంటివే, అవి, నీ యైశ్వర్యమంతయు నీతృణముతో సమాన మని తెలుప గడ్డిపోఁచ యడ్డము వేసెను.

౭. ఎంతటి శత్రువైనను గడ్డిపోఁచ నోటఁ గరచుకొన్నవాని వీరులుచంపరు. కావున నీవు బ్రదుకఁ గోరెదవేని దీనిని నోటఁ గఱచుకొని రామునియొద్దకుఁ బొమ్ము. నిన్ను రక్షించును. లేకుండిన నిన్నుఁ జంపుట నిజము.

౮. నన్ను నీవు బాధించితివా హిరణ్యకశిపునిచే బాధపడు ప్రహ్లాదుని రక్షింప స్తంభమునుండి నృసింహమూర్తి యుద్భవించినట్టు లీతృణము నందు రామమూర్తి యుదయించి నిన్నిచ్చటనే చంపును.

౯. తృణము విఱిచి వేసిన యెడల సత్యము తప్పనని ప్రమాణము చేసినట్లగును.

కావున నన్ను నీవు బాధించుటచే రామలక్ష్మణులు నీలంకను భస్మీభూతము చేయుదు రని ప్రమాణముచేసి చెప్పెద నని భావము.

౧౦. నా యవయవములందు నీదృష్టి నిలిచి మఱలదని యంటివి. నీదృష్టులు మఱలక యంతటితో హతము లగునట్లు వామనుఁడు శుక్రాచార్యుని కన్నులు దర్భతోఁ బొడిచినట్లు దీనితోఁ బొడిచెదను.

౧౧. రామచంద్రమూర్తి నన్ను స్పృశించిన కాకాసురు నెట్లు దర్భచే గన్నులు పొడిచి పంపెనో యట్టులే నీకన్నులు పొడిచెదను.

౧౨. నీవు రాముని గెలిచెద నంటివి. రామచంద్రమూర్తి విడిచిన యా దర్భను బ్రహ్మరుద్రేంద్రాదులును మఱలింపఁ లేకపోయిరి. అట్టి వానిని నీ వేమి గెలువఁగలవు?

౧౩. ఈ తృణమును ద్రుంచునట్లు నీ తలను ద్రుంచెదను జుమీ యని సూచింప తృణము త్రుంచివైచెను.

పతివ్రతల కోపదృష్టి కోపింపఁ జేసినవారిని దహించును. దమయంతియొక వానిని దహించెను. గాంధారి చూపు ధర్మరాజు పదనఖంబులపైఁ బడ నవి కమలెను. (భార. స్త్రీ. ౧-౧౭౬)

అట్టులే వీఁడును దన దృష్టిపడెనా భస్మమగును. అట్లు వానిని మాత్రము భస్మముచేయుట యామెకు సమ్మతముగాదు. వీఁడు పరస్త్రీహరణము తన కులధర్మమని చెప్పెను. అట్టికులమునే నిర్మూలింపవలెను. గాని యొకని నిర్దహించిన లాభమేమి? అని తలఁచి వాఁడు దగ్ధుఁడు కాకుండుటకై తృణము వైచెను.

౧౪. నీవు నాకుఁ గోపము వచ్చునట్లు చేసితివేని నా కోపాగ్నికి నీ వీ తృణప్రాయముసుమా. కావున నాకుఁ గోపమువచ్చునట్లు చేయకుము.

శుచిస్మితాస్య - ఇది నవ్వవలసిన సమయము కాదే ఏల నవ్వెను?

౧. తక్కిన స్త్రీలు నవ్వుచున్నప్పు డుండు ముఖకాంతి యామె దుఃఖించుచున్న నుండును. అది స్వభావసిద్ధము. ఇప్పుడే యిట్లుండునది, సంతోషమున నుండు నపు డెట్లుండునో.

౨ పాము తన్ను మ్రింగుచుండఁ దాను గండుచీమను మ్రింగబోవు కప్పవలెఁ దన్ను మృత్యుదేవత వాతవేసికొనుచుండుట యెఱుఁగలేక నన్నాశించుచున్నాఁడే, వీఁడెంత మూఢుఁడని నవ్వెను. 'పట్టరాని దుఃఖమువచ్చిన ఫక్కుమని నవ్వు'మనిసామెత.

౩. క. గజ మంటినట్ల యడుచున్
భుజగము మూర్కొనినయట్ల ♦ పొరిగొను ధరణీ
భుజుఁడు నగినట్ల చంపున్
గుజనుఁడు మన్నించునట్ల ♦ గొను బ్రాణంబుల్ ॥పంచ॥

అని యుండుటచే రాజపుత్రి రాజనీతి యెఱిఁగినది కావున నట్లు నవ్వెను.

వ. రాముఁడు బలపరాక్రమంబుల నాయీడుగాఁ డనియెదవే, ఆయన యాశ్రమమున లేనపుడు గదా నన్నుఁ దెచ్చితివి. అట్టి పిఱికి పందవు చాటున నాఁడు వారి ముందర దంభములు పలికెదవే యని నవ్వెను.

౫. ఈ నవ్వు సామాన్యమైన నవ్వుగాదు. శుచిస్మిత = అగ్నిహోత్రము వంటి నవ్వు, అదియే వానిని నాశము చేయఁగలదు; శుచి = అగ్ని.

క. నాపయిఁ జిత్తముఁ జేర్పకు, నీపడఁతులయందు మనము ♦ నిలుపుము నను నీ
వీ పగిది వేఁడ ఫలమా, పాపాత్ములు ముక్తిఁ గోరు♦పగిదిని ఖలుఁడా! ౫౮౨

తా త్ప ర్య ము.

అందని పండునకై యఱ్ఱులు సాఁచినట్లు నాపై నీవు మన స్సుంప వలదు. పాపాత్మునకు ముక్తి లభింపనట్లు నేను నీకులభించు దానఁగాను. నీ వెంత వేఁడినను ప్రయోజనము లేదు. అట్లైన నన్నేమి చేయ మనెదవా? నామీఁద నుంచిన మనస్సును మరల వెనుకకుఁదీసికొని నీ భార్యల యందుంపుము. నామీఁద మనస్సుంచిన నీ కెట్టి కీడుకలుగునో నీ భార్యలమీఁద నీవు మన స్సుంపవేని యంత కీడు గలదు. ''పరిభూతవిషణ్ణా చేద్భార్యా భర్తా వినశ్యతి'' నిష్కారణముగ భార్యనవమానించుటచే నామె దుఃఖించెనేని భర్త నశించును, అని కలదు గదా. కావున నీవు వారిని నుపేక్షింపకుము, నన్నపేక్షింపకుము.

ఉ. పుట్టితిఁ బుణ్యవంశమునఁ ♦ బూజ్యతరాన్వయ మేను మెట్టితిం
బట్టితి నేకపత్నినియ♦మంబును నిట్లు రహించి పాపముం
గట్టుకొనంగ నేర్తునె య♦కార్య మొకండు ఘటించి? యేల యీ
వట్టివి విప్రలాపములు ♦ వాఁగెదు మూర్ఖుఁడ వౌచు రాక్షసా? ౫౮3

అర్థములు. మెట్టితిన్ = ప్రవేశించితి, ఏకపత్ని నియమంబు = పాతివ్రత్య వ్రతము. విప్రలాపములు = విరోధపు మాటలు, వాఁగెదు = వదరెదవు.

తా త్ప ర్య ము .

ఓరి రాక్షసుఁడా! నేను పుణ్యాత్ముని వంశమునఁ బుట్టితిని. అంతకంటెఁ బూజ్యులైన వారియింటఁ బ్రవేశించితిని. పతివ్రతానియమమును గ్రహించితిని, ఇట్టి నేను చేయరాని చెడుకార్యము చేయఁగలనా? చేసితి నేని నేను చెడుటయే కాక యీ రెండు వంశముల వారిని నరకముల పాలు సేయనా? ఇదంతయు నాలోచింపక యేల శాస్త్రవిరుద్ధము, లోకవిరుద్ధము, ఆత్మవిరుద్ధము నగు మాట లూరక వదరెదవు.

చ. అని పెడవాటుగా మఱలి ♦ యా జనకాత్మజ వెండి పల్కె నో
దనుజుఁడ! నేను సాధ్విఁ, బర♦దారను, నీ సతిఁ గాను, నీ మదిం
గను మిఁక సాధుధర్మము ప్ర♦కారము, సాధులమార్గ మూనుమీ,
పనిగొని తేర తేర కిటు ♦ పాపము నీ వొడిగట్ట నేటికిన్? ౫౮౪

అర్థములు. పెడవాటుగా = వెనుక ప్రక్కఁగా, రావణునకు వీఁపు కనఁబడునట్లు.

తా త్ప ర్య ము.

అని చెప్పి యీ పాపాత్మున కెదురు ముఖమై యుండుటయు దోషమేయని తలఁచి వానిని లక్ష్యము సేయక వెనుక వైపుగాఁ దిరిగి వానికి బుద్ధివచ్చి బాగుపడునుగాక యని మఱియు నిట్లనియె. ఓరి రాక్షసుఁడా! నేను బతివ్రతను, ఇతరుని భార్యను, నీ భార్యనుగాను. కావునఁ బరస్త్రీలయందుఁ బరపురుషు లెట్లుండవలెనో యా సాధుమార్గము తెలిసికో, తెలిసికొనుటయేకాదు. ఆ ప్రకారము సాధుమార్గమున నడువుము. బుద్ధిపూర్వకముగ నేల యిట్లు నిష్కారణముగఁ బాపము సంపాదించు కొనెదవు.

క. నీ కెట్లులో నీ భార్యలు, లోకంబునవారి భార్య♦లును రక్ష్య లటుల్
రాకాసి తేఁడ! నిన్నే, చేకొని యుపమగను బ్రీతి, ♦ జెలఁగు స్వసతులన్. ౫౮౫

తా త్ప ర్య ము.

ఓరీ! స్త్రీలకుఁ బాతివ్రత్యము నియతము, ఆ వ్రతమును బురుషులు కాపాడవలయును. నీ భార్యల పాతివ్రత్యమును నీ వెట్లు రక్షింతువో యితరుల భార్యల పాతివ్రత్యమును నట్లే నీవు రక్షింపవలయును. పాతివ్రత్య నియమము మంచిదా, చెడ్డదా యని యాలోచింపుము. అది మంచిది కావున నది యెందున్నను రక్షింపఁబడవలసినదే. పాతివ్రత్యమే యక్కఱ లేదందువా, నీ భార్యలు అంకాడిన నేమి దోషము? ఇతరుల భార్యలను నీ వాశించితి వేని నీ భార్యల వ్యభిచారమునకు నీ వనుజ్ఞ యిచ్చినవాఁడవేకదా. కావున నిన్నే యుపమానముగఁ దీసికొని నే నితరుల భార్యల నాశించినచో నా భార్య లితరుల నాశించిన దోష మేమి యనుకొని నన్ను నాశింపకుము.

ఉ. సంచలితేంద్రియుం డగుచుఁ ♦ జంచలుఁడై తనభార్యయంద ప్రే
మించి రమించి తుష్టిఁ గొన ♦ మేకొన నోపనిజాల్ము ప్రజ్ఞయున్
సంచితలక్ష్మి యాయథము ♦ సంతతియున్ మఱి వాని యాయువున్
ద్రుంచుట సత్య మన్యనవ♦తోయజపత్రవిశాలలోచనల్. ౫౮౬

అర్థములు. సంచలితేంద్రియుండు = బాహ్యేంద్రియ నిగ్రహము లేని వాఁడై, చంచలుఁడు = మనోనిగ్రహము లేనివాఁడై, మేకొనన్ = అంగీకరింప, జాల్మని = మూఢుని, ప్రజ్ఞయున్ = బుద్ధియు, సంచితలక్ష్మి = వాఁడెన్ని జన్మముల నుండియో సంపాదించిన పుణ్యము, ఐశ్వర్యము; అన్య.........లోచనల్ = పరస్త్రీలు.

తా త్ప ర్య ము.

బాహ్యేంద్రియనిగ్రహము లేక, మనోనిగ్రహము లేక తనభార్యతో మాత్రము క్రీడించి తృప్తిపడ లేని మూఢుని బుద్ధి, పూర్వపుణ్యము, ఐశ్వర్యము, వాని సంతానము, వాని యాయుస్సు వీని నన్నిటిని పరస్త్రీలు సత్యముగ నాశము చేయుదురు.

కావున జారత్వ మెంత కీడో తెలిసికొని బుద్ధిగలవాఁడవై ప్రవర్తింపుము.

శా. లేరా పెద్దలు నీకు బుద్ధిఁ దెలుపన్ ? ♦ లేకుందురా యీ పురిన్
వారిన్ డాయవొ ధర్మమార్గములు నే ♦ ర్వన్ ? నీ దురాచారముల్
దూరీభూతసుపుణ్యవత్క్రియలు సా ♦ ధువ్రాతదూరస్థుఁగా
నోరీ! తెల్పెడిఁ గాక యున్న విపరీ ♦ తోక్తుల్ ననుం బల్కెదే? ౫౮౭

అర్థములు. దూరీభూత=దూరముగాఁ జేయఁబడిన, సుపుణ్యవత్ క్రియలు=మంచి పుణ్యము నిచ్చు కార్యములు, సాధువ్రాత దూరస్థుఁగాన్=సజ్జనులకు దూరమందుండు వానిఁగా, విపరీతోక్తుల్=విరుద్ధపు మాటలు.

తా త్ప ర్యము.

నీవు చేయరాని పని చేయఁ బూనినపుడు నీ మేలు కోరి నీ కిది తగదు, హానికరము అని చెప్పెడు వా రింత పెద్దపట్టణమం దొకరైన లేరా? విభీషణాదుల వంటి వారు లేకుందురా? ఉన్నారు. ఉండిన నేమి లాభము? ఏది ధర్మ మేది యధర్మమని తెలిసికొనుటకు నీవు వారియొద్దకు పోవుచున్నావా? వారిని నీవు చెప్ప నిచ్చుచున్నావా? లేదు. "తద్విద్ధి ప్రణిపాతేన, పరిప్రశ్నేన సేవయా, ఉపదేక్ష్యంతి తే జ్ఞానం, జ్ఞానిన స్తత్త్వదర్శిన" యన్నట్లు నీవు పోయి నమస్కరించి ప్రశ్నించినఁగదా ధర్మతత్త్వ మెఱిఁగిన పెద్దలు నీకు జ్ఞాన ముపదేశింతురు. నీవట్లడిగిన వాఁడవు కావు ఏలన నీ దుష్ట ప్రవర్తనము, పుణ్యములు గాని కార్యములు చేయుట చూడఁగా సాధువులకు నీకుఁ జాల దూర మని తెలియుచున్నది. అటుగాకున్న నీ విట్లు విపరీతపు మాటలు మాటలాడనే యాడవు.

క. కాలంబు దీఱె రాక్షస, జాలంబుల కీవు వినవొ ♦ సాధుల బోధల్?
బాలిశ! మిథ్యాస్నేహవి, లోలున్ నిను నమ్మి వారు ♦ లోఁగరె చెట్టన్? ౫౮౮

తా త్ప ర్య ము.

నీవై యడుగ కున్నను, నీమేలు కోరువారు నీకు హిత ముపదేశించియుందురు. కాని వారి మాటలు నీవు విన్న వాఁడవు కావు. ఏల రాక్షసు లందఱు నీవలనఁ జావవలసిన కాలము వచ్చినది. కావున నింతవఱకు నీవు గొప్పవాఁడ వని నీ యాశ్రయమున మేలుపొందెద మని తలఁచి రాక్షసు లందఱు నీయందు స్నేహభావము గలవారై యున్నారు. వారు నీమేలుకోరునట్లు వారిమేలు నీవు కోరువాఁడవు కావు. నీస్నేహ మసత్యము. నీవు చెడుటయే కాక వారందఱు చెడునట్టి పనిని జేయుచున్నావు.

మిథ్యాస్నేహమనఁగా స్నేహ మభావ మని యర్థము కాదు. వారియందు నీకుఁ గల స్నేహభావ మే ఫల మియ్యవలయునో యా ఫల మిచ్చుట లేదు. స్నేహము వలని ఫల ముపకారము. అది నీ వలనఁ గలుగుటకు మాఱు అపకారము గలుగ నున్నది. కావున నీ స్నేహము మిథ్యాస్నేహము.

చ. అనయరతాత్ముఁ డౌచు నకృ♦తాత్మకుఁ డైన నృపాలపాశుప
ట్టనములు రాష్ట్రిముల్ సిరి య♦డంగును, దద్గతి రత్నపూర్ణయై
గొన బగు లంక యిం కిటను ♦ గూలెడు నిక్క-ము శీఘ్రకాలమం
దున యసురేంద్ర! నీ యొకని ♦ దోషమునం బలుమాట లేటికిన్. ౫౪౯

అర్థములు. అనయరతాత్ముఁడు = చెడునడవడియందు నాసక్తిగల మనస్సు గలవాఁడు, అకృతాత్మకుఁడు = పెద్దలచే శిక్షింపఁ బడని స్వభావము, మనస్సు గలవాఁడు, నృపాలపాశు = నీచరాజుయొక్క-, తద్గతిన్ = ఆ విధముగా,

తాత్పర్యము.

ఓరీ! పుణ్యాత్ములచేఁ జక్క-దిద్దఁ బడని మనస్సు, స్వభావము గలవాఁ డగుటచే చెడు నడవడియందుఁ బ్రీతిగల నీచరాజు కారణముగ వాని పట్టణములు, రాజ్యములు, సంపద నాశము లగును. ఆ విధముగనే నీ వొక్కఁడు చేయు పాపము వలన రత్నములతో నిండి యందమైన లంక యంతయు శీఘ్రికాలమందే నిజముగ నాశము కాఁగలదు. ఎట్లనెదవా? ఓడ నడపువాఁడు మత్తుఁడై యోడను సుడిగుండములోనికి దించిన వాఁడు చెడుటయే కాక వానినినమ్మి యోడలోఁ గూర్చుండిన వారందఱు చెడుదురు గదా.

ఉ. దూరపుఁజూపు లేక యెటు ♦ దోచిన నెయ్యది యైనఁ జేయుచున్
గ్రూరపుఁ బాపకార్యముల♦కున్ మన సిచ్చి చరించు నా యప
స్మారి స్వకీయకృత్యములఁ ♦ జావఁగ లోకము లెల్ల సంతసం
బారఁగఁ బందుగల్ సలుపు ♦ హాయిగఁ గన్ను మొగడ్చు రాత్రులన్. ౫౫౦

అర్థములు. అపస్మారి = ఉన్మత్తుఁడు, స్వకీయకృత్యములన్ = తానుజేసిన కార్యములచే, దూరపుఁజూపు = దూరాలోచనము.

తాత్పర్యము.

దూరాలోచనము లేక యేవేళ కేది తోఁచునో దానిని ధర్మాధర్మవిచారము లేక యే పాపకార్యమునందైన మనస్సు పోనిచ్చు నున్మత్తుఁడు వాడు చేసిన పాప కార్యములచే వాఁడు చావఁగా లోకు లందఱు సంతోషముతోఁ బండుగులు చేసికొని నిర్భయముగ, సుఖముగ రాత్రులందుఁ గన్నార నిద్రిపోదురు.

ఉ. నిక్క-పు వంచకుండ వగు♦ని న్నొక నెచ్చెలి వంచు నమ్మివే
దిక్క-ఱి పోవువారు నినుఁ ♦ దిట్టుదు రీ చెడుకూళ చిక్కె- నీ
చిక్కు-ల దైవ తంత్రమునఁ ♦ జేడ్పడుఁ గాక యటంచు సంతసం
బెక్క-ఁగ, నేలరా చెడెద ♦ వీ గతి నిందును నందు నిందలన్? ౫౫౧

తాత్పర్యము.

స్నేహితునివలె నటించుచుఁ దుదకుఁ గీడు గలిగించు నిజమైన మోసగాఁడ వగు నిన్ను నీ చిత్తవృత్తి తెలియనివారు, నిన్నుఁ దమకు మంచిస్నేహితుఁడ వని నమ్మి

దిక్కుమాలిపోవువారు, నీవు కష్టదశలోఁ జిక్కుకొనినపుడు ఈ దుష్టుఁడు దైవవశమునఁ జిక్కులపాలైనాఁడు, దీనితో వీఁడు నాశమైపోవునుగాకయని సంతోషముతో నిన్నుఁ దిట్టుదురు. ఓరి! యేలరా నిందలపాలయి రెండులోకము లందును జెడెదవు.

ఎవని కీర్తి యెంతవఱకు లోకంబున నుండునో యంతవఱకు వాఁడు స్వర్గమున నుండును. ఎవని యపకీర్తి యెంతవఱకుండునో యంతవఱకు వాఁడు నరకమున నుండును.

క. రవి కెట్టు లెండ శ్రీరా,ఘువునకు నే నట్లటన్న ♦ గనకంబుల నై
భవముల నాశలు గొలిపెద, వవివేకీ! మోసపుచ్చ ♦ నలవియె నీకుఁ. ౫౫౨

తా త్ప ర్య ము .

రావణా! నీ వెంతమూఢుఁడవురా, రామచంద్రమూర్తినుండినన్ను వేఱుదీయ నాలోచించెదవే, నీ చేనైన నగునా? సూర్యునకు నెండ యెట్టిదో, యెట్టు లనన్యమో నేను శ్రీరామచంద్రునకనన్యను. సూర్యునినుండి యెండను నీవు వేఱుపఱుపఁ గలిగెదవేని రామచంద్రమూర్తినుండి నన్ను వేఱుపఱుపఁగలవు. బంగారు, సంపద, భోగములను జూపి నన్ను మోసగింపఁ జూచెదవే, నీ వెంత యవివేకివిరా! మా యిరువురకు ననన్యత్వమే కాదు, ఎండ సూర్యుని కాంతియై సూర్యునిపై నాధారపడి యున్నను ఆ ప్రకాశమువలననే సూర్యుని యునికి తెలియవచ్చుట, సూర్యునకుఁ బూజ్యత గలుగుట. అట్టులే నేను రామచంద్రమూర్తి దాననై ఆయన మీఁద నాధారపడి పరతంత్రనై యున్నను ఆయన లోకమున కెక్కువ యుపయోగపడునట్లు చేయుదానను నేనే. ఆయన మహిమాతిశయము లోకమెఱుంగుట నావలననే. నేను లేనేని యాయన యునికియే లేనివాఁడని చెప్పవలసి యుండును.

ఈ విషయము నీకుమారీచుఁడు 'జనకాత్మజసంబంధమున రాముండప్రమేయపురుతేజుం డయ్యె' నని చెప్పెనుగదా! అవివేకి వగుట నీ వా యర్థము గ్రహింపఁజాలవైతివి. యాచకులు లేరేని దాతలు లేరు. రోగులు లేరేని వైద్యులు లేరు. ప్రజలు లేరేని ప్రభువు లేఁడు. అట్టులే ప్రపంచము లేదేని భగవంతుఁడు లేడు; ప్రకృతి మూలముననగాక భగవంతుని దెలిసికొను మార్గమే లేదు. భగవంతుని శక్తియే లక్ష్మి. ఆమెయే మాయ. ఆమెయే ప్రకృతి. ఆమె చిద్విలాసమే ప్రపంచము. కావునఁ బ్రపంచము వేఱు, భగవంతుఁడు వేఱు కాదు. లక్ష్మి యనుగ్రహముచేఁ బ్రపంచమును దాఁటగలము. భగవదనుగ్రహమునకుఁ బాత్రులును గాఁగలము. కాని బలాత్కారముచేతను మన ధనవిద్యాబలములచేతను ఆమెను వశపఱచుకొనలేము. ఆమెను వశపఱచుకొనుటకుఁ ద్రిజట చెప్పినట్లు నమస్కారమే సాధనము.

లక్ష్మీదేవి నారాయణునకు నిత్యానపాయిని యనుటకు,

''ఏవం యదా జగత్స్వామీ, దేవదేవో జనార్దనః
అవతారం కరో త్యేష, తదా శ్రీ స్తత్సహాయినీ

రాఘవత్వే భవేత్సీతా, రుక్మిణీ కృష్ణజన్మని
అన్యేషు చావతారేషు, విష్ణో రేషానపాయినీ
దేవత్వే దేవదేహేయం, మనుష్యత్వే చ మానుషీ
విష్ణో ర్దేహానురూపాం వై, కరోత్యేషాత్మనస్తనుం.

ఎప్పుడు జగత్స్వామి జనార్దనుఁ డవతార మెత్తునో యప్పు డెల్ల శ్రీదేవి యాయనకు సహాయురాలై యుండును. రామావతారమున సీతాదేవిగను, కృష్ణావతారమున రుక్మిణిగను, ఇతరావతారములందు నిట్లే విష్ణువును విడిచి యుండదు. ఆయన దేవతలం దవతరించెనా తాను దేవత్వమును, మనుష్యులం దవతరించిన మనుష్యస్త్రీగను నగును. విష్ణుదేహమున కనురూపమైన దేహమును దానుధరించును.

అనన్యయనఁగా రాయిసీళ్ళవలె, చేకఁటివెలుతురువలె నన్యముగాక సూర్యుడు —ఎండ; చంద్రుఁడు—వెన్నెల, రత్నము, కాంతివలె, సముద్రము—అల, శక్తి—శక్తుఁడు – ఇవిచూచుటకు వేఱుగాఁ దోఁచినను వేఱు గానివి. గుణము—గుణి, విశేషణము—విశేష్యము వీనివలెనవినాభావసంబంధము-గలది యనన్యము. ఇట్లులే జీవాత్మపరమాత్మల కనన్యత్వ మెఱుఁగునది. జీవాత్మవిశేషణము(ఎండ)పరమాత్మ విశేష్యము (సూర్యుఁడు) "మమైవాంశే జీవలోకే జీవభూత స్సనాతనః" అన్నట్లు పరమాత్మయంశమే జీవాత్మ. కావున విశేషణవిశేష్య సంబంధము; పరమాత్మకంటె నేనన్యముగాను, అని జీవాత్మయనుకొనుటయే యనన్యత్వ బోధమని శంకరమతము గాని జీవాత్మయేపరమాత్మయనితలఁచుటకాదు. అపృథక్సిద్ధము. "ప్రకాశాదివత్తునైవం పరః" –బ్ర. సూ. 3. 2. 46. ఈ యర్థమునేబోధించుచున్నది. అనఁగా కాంత్యాదికమువలెనే జీవుఁడుబ్రహ్మాంశము. ప్రకాశాదులగ్న్యాదుల యంశమగునట్లు జీవుఁడును పరమాత్మ యంశము. ఈ యర్థమునే రామచంద్రమూర్తియుముందు చెప్పఁగలఁడు. కావున ముముక్షు వగు బద్ధజీవుఁడు సీతాదేవి, రామచంద్రమూర్తి పట్ల నెట్టి యభిప్రాయముగలదై, యెట్లుప్రవర్తించి, లంకనుండిముక్తురాలయ్యెనో యట్లే పరమాత్మ విషయమున వర్తించి ముక్తుఁడు కావలయును. సీతాదేవి నేనే రాముఁడని చెప్ప లేదనుటను గనునింపవలెను. అట్టులే రాముఁడు తానేసీతయని చెప్ప లేదు.

తే. ఆ జగన్నాథు సత్కృతం ♦ బైన భుజము, దిండుగా సుఖమందెడి ♦ దేవి నయ్యు
నసురుఁడా! పేరు లేని పెద్దమ్మనొకనిఁ, గరముచే నంటుదు నె నాడు ♦ కాంతుఁ బాసి.

అర్థములు. ఆ = ఆవిధముగఁ బ్రసిద్ధికెక్కిన, జగత్ + నాథు = బ్రహ్మ మొదలు స్తంబపర్యంతము చేతనాచేతనముల కన్నిటికిని, నాథుఁడు = రక్షకుఁడుః అధిపతియగు వానియొక్క. సత్కృతంబు = పూఁజింపఁబడినది, దేవిని = ప్రియురాల నగు రాణినై యాయనతోడ సమానమైన లోకపూజ్యత గల రాణినినయ్యు, పేరు లేని పెద్దమ్మ=ఇది లోకోక్తి, కీర్తిప్రతిష్ఠలు లేనివానిని, ఒకనిఁ=కశ్చిత్తు గానిని, ఆయనకు దాసుఁడుగా నుండనైన యోగ్యత లేనివానిని.

తా త్ప ర్య ము.

సర్వలోక ప్రసిద్ధుఁడై, చరాచరకోటికి బ్రహ్మమొదలు స్తంబపర్యంతమున కంతకు నాథుఁడైన నా కాంతునియొక్క పూజ్యమైన భుజమును తలదిండుగాఁ జేసి కొని పండుకొనునతని దేవినైన నేను పేరు ప్రతిష్ఠలేని యనామకుని నొకనిఁ జేతితో నైనఁ దాఁకుదునా?

ఉ. సాంగము వేదముం జదివి ♦ సత్యము, శీలము గల్గి సాధుస
త్సంగతిఁ దేటి జ్ఞాని యగు ♦ బ్రాహ్మవిబుధేశున కాత్మవిద్య నా
నంగుగ రామభద్రునకె ♦ జ్యాపతికే తగు భార్య నేను నీ
యంగముఁ గాల నేనియును ♦ నంటుదునా యిది యేమి భ్రాంతిరా! ౫౭౪

అర్థములు. సాంగము = అంగములతోఁ గూడినది, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, ఈ యాఱును వేదాంగములు, సాధు సత్సంగతి = సాధువులగు సత్పురుషుల సాంగత్యము, జ్ఞాని = జీవాత్మ పరమాత్మల సంబంధము తెలిసినవాఁడు, బ్రాహ్మవిబుధేశునకు = బ్రాహ్మణ శ్రేష్ఠునకు, ఆత్మవిద్య = యోగవిద్య, అంగుగ = అన్నివిధముల చక్కఁగ, జ్యాపతికే = భూపతికే, తగు = యోగ్యురాలనైన, 'హ్రీశ్చ తే లక్ష్మీశ్చపత్న్యౌ' యని శ్రుతిచెప్పినట్లు భూదేవియు, లక్ష్మీదేవియు భగవంతుని భార్యలు, అంగము = దేహము, అంగముగాల యనుట యందు తిట్టుకూడ స్ఫురించెడిని.

సాంగము వేదముం జదివి = ఆఅంగములతోడ వేదముఁ జదువఁగానే లాభము లేదు, గాడిద గంధపొడిమూట మోసినట్లే. సత్యము, శీలము గలవాఁడై యుండ వలెను. నీవు వేదములు చదివితివి, ఏమి లాభము? సత్యశీలములు లేవు. ఇచ్చట నీ శ్లోకము స్మరింప నగు. హనుమంతుఁడు మఱల రామచంద్రమూర్తి యొద్దకుఁ బోయినపుడు ఆయన రాక్షసులబలాబలములు, ఆచారవ్యవహారములు ప్రశ్నింపఁగా,

'అగ్నిహోత్రాశ్చ వేదాశ్చ రాక్షసానాం గృహే గృహే, యనెను. ఇది వినఁగానే అగ్నిహోత్రములు, వేదములు గలవారిని జయింప సాధ్యముగాదే, అట్టి వారిని నే నెట్లు చంపఁగలను? అని యాయన ముఖము తెల్లబోయెను. అది తెలిసి కొని హనుమంతుఁడు 'దయా సత్యంచ శౌచంచ రాక్షసానాం నవిద్యతే,' దయ, సత్యము, శౌచము అనునవి యెట్టివో వా రెఱుఁగరు అనెను. అప్పుడు రామునకు ధైర్యము వచ్చెను.

అంతమాత్రమే కాదు. సాధుసాంగత్య ముండవలెను. అది లేదేని తక్కిన వన్నియు ఫలవంతములు గావు.

''సంత స్సంగస్య భేషజమ్'' ''నాసద్భిః కించి దాచరేత్'' "సంసర్గజాదోష గుణా భవంతి'' "త్రిజగతి సజ్జన సంగతి రేకా భవతి భవార్ణవతరణే నౌకా" "సత్సం గత్వే నిస్సంగత్వమ్'' "సత్సంగాద్భవ నిస్పృహో' "త్యజ దుర్జన సంసర్గం భజ సాధు

సమాగమమ్''"కురు పుణ్య మహోరాత్రం స్మర నిత్యత్వ మనిత్యతామ్''"మందో ప్యమందతా మేతి సంసర్గేణ విపశ్చితః''"దర్శనా దేవ సాధవః'' ఈ ప్రకారము సాధు సాంగత్య ముండవలెను. దుర్జన సాంగత్యము మానవలెను. నీకు సాధు సాంగత్యములేదు. దుష్టసాంగత్యము మెండుగాఁ గలదు. నీవు జ్ఞానివి కావు. క్ష్మావిభుడవు కావు. నీ కాత్మవిద్యయు లేదు.

తాత్పర్యము.

షడంగములతోఁ వేదముఁ జదివి, సత్యము, సదాచారము గలిగి, సాధువుల సాంగత్యముజేసి, జీవాత్మ పరమాత్మ సంబంధము తెలిసిన బ్రాహ్మణోత్తమునకు నాత్మసాధనభూత మైన యోగవిద్యవలె నీ యన్ని గుణములు గల రామభద్రునకు, భూపతికిఁ దగినభార్యను నేను. కావున వీనిలో నొక గుణమైన లేని నిన్నుఁ జేతితోఁ దాఁకు టటుండనీ, కాలితోనైనఁ దాఁకుదునా? ఇది యేమిభ్రాంతిరా, నన్నాశించెదవు? నీ యోగ్యత యెంతమాత్రమో తెలిసికొను తెలివికూడ నీకు లేదాయెఁగదా.

రామచంద్రమూర్తి క్ష్మావిబుధేశుఁ డెట్లయ్యె నని సందేహింపఁ బనిలేదు. క్ష్మా+విబుధ+ఈశుఁడు=భూదేవికి, దేవతలకు నీశుఁ డని ఛేదము.

రావణుఁడు శుద్ధబ్రాహ్మణుఁడు కాఁడు. శుద్ధక్షత్రియుఁడు కాఁడు. అనులోమ సంకరజాతి. అది ముందు విచారింపఁబడును.

క. కాననతలమునఁ జిక్కిన, ధేనుకతోఁ గరిని గూర్చు ♦ తెరువున దుఃఖా
ధీనసయి వగచు నాతోఁ, నానాథునిఁ దెచ్చి కూర్పు♦నయమతి వగుచున్. ౫౫౫

అర్థము, ధేనుక = ఆఁడేనుఁగు.

తాత్పర్యము.

ఎంతో యాశపడి మోసి తెచ్చితినే. నీ విట్లనెదవే. ఇప్పుడు నన్నేమి చేయమనెద వనెదవా? నీకుఁ గర్తవ్యము చెప్పెద వినుము. అడవిలో నొంటిగాఁ జిక్కి దుఃఖించు నాఁడేనుఁగు నొద్దకు మగయేనుఁగును దెచ్చి విడిచినట్లు నాభర్తను బాసి వగచుచున్న నాయొద్దకు నిప్పుడైన నీతిపరుఁడవై నాభర్తను దెచ్చి విడువుము. తన్నుఁ దీసికొనిపోయి రామునియొద్ద విడువు మని చెప్పలేదు. అట్లు చెప్పిన నా నెపమున మఱలఁ దాఁకును. కావున రామునినే యిటకుఁ దెమ్మనెను. అయినను నీవు నయమత వనిపించుకొందువు. ఇప్పుడు వచ్చిన దుర్నీతిపరుఁ డను పేరు పోవును.

ఉ, ఇంకను గొన్నినాళ్ళు పుర ♦ మేలఁ దలంచెద వేని, దండభృ
త్కింకర ఘోరపాశములఁ ♦ గీడ్వడ నొల్లవ యేని, రావణా!
కొంకకు రాముతోఁ జెలిమిఁ ♦ గోరుమ, యప్పురుషోత్తముండు ధ
ర్మాంకుఁడు నిన్ను నేలు శర♦ణాగతవత్సలుఁ డౌట నర్మిలిన్. ౫౫౬

అర్థములు. దండభృత్ = దండధరుఁ డైన యమునియొక్క, కింకర = భటులయొక్క, ఘోరపాశములన్ = భయంకరములైన పాశములచే, కీడ్వడన్ =

బాధనొంద, ధర్మాంకుఁడు = శరణాగత రక్షణమే లక్షణముగాఁ గలవాఁడు, శరణాగతవత్సలుఁడు = శరణని వచ్చినవారియందుఁ బ్రేమగలవాఁడు, అర్హసి = కూర్మిచే, ఇంకను = ఇదివఱకు నీవు సుఖముగా రాజ్యము చేసినట్లు ఇఁకమీఁదఁ గూడ, కొన్నినాళ్ళు = అల్పకాలమైనను, నన్ను రామున కర్పింపక పోయితివా నేఁడు మొదలు నీకు క్షయకాలమే. ఒక్కొక్కనాఁ డాలస్యము చేయుకొలఁది నీకు మృత్యువు సమీపించుచున్న దని తెలిసికొనుము, పుర మేలఁగ = కష్టపడి సంపాదించినది, సమస్త భాగ్యభోగ్యపదార్థములతో నిండినది, నాది యని నీ వభిమానము వహించినది యగు పట్టనము. పుర మనఁగా దేహము. కావున నీ దేహమును నింకను గొన్నినాళ్ళు రక్షింపఁ దలఁచెద వేని.

ఏలఁ దలంచెద వేని = నాశము చేయుటకు నిష్టము లేదేని—బాగుగఁ బాలింపఁ గోరిక కలదేని, ఈ విధముగ నీవు జీవించి యీ లోకమున సుఖపడఁ గోరినను, లేక, దండ...నొల్లవ యేని = చచ్చి, యమకింకరుల చేతిలో నరకబాధ పడ నిష్టము లేకున్నను, రావణా! వదరుపోతా! నేను చెప్పఁబోవునట్లు నీవు చేయక పోయితివా, రామచంద్రమూర్తి నిన్నుఁ జంపుట నిజము. అప్పుడు నీకీ రాజ్యసుఖము లోనగు నీలోక సుఖములు లేవు. పరలోకము నీ పాపానుభవమునకై నరకబాధయుఁ దప్పదు. రెండు లోకములఁ జెడుదువు. పరలోకమున నీవు సుఖపడఁ గోరినను రామునకు నీ వనుకూలుఁడవై యుండవలసిన వాఁడవే. ఆయన యందుఁ బ్రతికూలభావము గలవారికి బరలోకసుఖము లేదు. అనుకూల భావము గలవారికి నరకదుఃఖము లేదు. అట్లైన నేమి చేయు మనెదవా? కొంకకు = జంకుపడకుము. నీ పురమందు నీ కెవరు మేలు చెప్పువారు లేరు. వారు చెప్పినను నీవు వినవు. కనుక నీయందు జాలి గలిగి నీవు చెడిపోవుట సమ్మతింపక నేనే చెప్పుచున్నాను. "స్త్రీ బుద్ధిః ప్రళయంకరీ" యని యాఁడుది చెప్పినట్టు వినిన నేమి యపాయము వచ్చునో యని సందేహింపకుము.

రాముతో జెలిమి కోరుము = రామచంద్రమూర్తితో స్నేహము చేయఁ దలఁపుము, రాముతో = నీవంటి క్రూరగుణము వికారాకారము గలవానితోఁ గాదు. ఆకారమున గుణమున నభిరాముఁ డగు వానితో— రాముతో = మఱియెవ్వరితోనో కాదు. నా భర్త యగు రాముతో— నే నెట్లు నీ మేలుగోరి చెప్పుచున్నానో యట్లే నీ మేలుకోరి రక్షింపఁగల వానితో, వచ్చినవాఁడు రావణుఁడైనను రక్షించెదనని ముందు చెప్పఁగలఁడుగదా, అట్టి వానితోఁ జెలిమిఁ గోరుము. స్నేహము కోరుము, అనుకూలుఁడవు కమ్ము. ప్రతికూలబుద్ధివి కాకుము, కోరుము = అనుకూలుఁడనై వర్తించెద నని నీ మనసులో ననుకొనుము, చాలును. అంత కెక్కువ నీవు చేయవలసినది యేమియు లేదు. అట్టి యభిప్రాయము నీకుఁ బుట్టినను నిన్నాయన రక్షించును. ఓసీ నీవు నన్నుఁ జంపఁజూచుచున్నావు. ఆయనవిషయములో నిటువంటిఘోరాపరాధము జేసిన నేను ఆయన యెదుటఁ బడిన వెంటనే చంపునుగాని, విడుచునా? ఇదియా నీవు

బోధించుహితము—అందువేమో. ఓరీ! నీవంటివాఁడు కాఁడు. నీవు వధకర్హుఁడవైనను, ఘోరయుద్ధమందు నింకొక బాణమువేసిన చచ్చుస్థితిలో నీవున్నను చేతనాయుధము లేక యుంటివేని నిన్నాయన చంపఁడు. శత్రువు లందును ఆయన వాత్సల్యము గలవాఁడు. ఇది నీ వనుభవముచేఁ దెలిసి కొనఁగలవు. ఆయన పురుషోత్తముఁడు గనుక నాయనయం దిట్టి గొప్పగుణము గలదు. పురుషులకంటె నుత్తముఁడుగదా పురుషోత్తముఁడు. కావునఁ బురుషులయందుఁ గల ప్రాకృతాది గుణము లాయన యందు లేవు. కేవల శుద్ధసాత్త్వికగుణములు గలవాఁడు. కావున ననుకూల భావము గల నిన్ను నీ దోషము లెంచక రక్షించును. సజ్జనులు దోషము లెంచరు అని బహిరంగముగాఁ జెప్పఁగలఁడు. అట్లులే ప్రవర్తించును. 'అజ్ఞుండు చేసిన యప రాధములను జేపట్టఁ డీశ్వరుఁడు కృపాళుఁ డగుట' నని కలదుకదా. ఇంకను ఆయన విషయమై యీయన నడవడి యెఱిఁగినవా రేమి చెప్పిరో వినుము. అవిజ్ఞాతా=పరుల దోషము లెఱుఁగనివాఁడు. "అపరాధశతము సల్పిన విపరీతము నెంచఁడాత్మ విజ్ఞుం డగుటన్" "అపరాధానభిజ్ఞస్సన్ సర్వైన కురుతే దయామ్" అపరాధముల నెఱుఁగక పోవుట మాత్రమే కాదు, ఎల్లప్పుడు దయయే తలఁచువాఁడు. కావున కరుణా కాకుత్స్థుఁడని బిరుదు సంపాదించినవాఁడు. కావున నేనును బురుషుఁడనే, ఆయన పురుషుడే. నా యట్టి వాఁడే కదా యని నిన్నుఁబట్టి పోల్చికొనుము.

ధర్మాంకుఁడు—ధర్మగుణమే భూషణముగాఁ గలవాఁడు. "అంకో నాటక విచ్ఛేదే సంఖ్యాయాం యుధి భూషణే, సమీపే రూపకే స్థానే యతా వుత్సంగ చిహ్నయోః". నీకు బంగారు వెండి నగలు ఆభరణములు, ఆయనకు ధర్మగుణమే ఆభరణము. ధర్మాంకుఁడు=ఎదుటఁబడినంత మాత్రముననే నిన్నుఁ జంపునని భయ పడకుము. నిన్నుఁ జంపఁదలఁచెనా నిన్ను ధర్మయుద్ధమందే చంపును. అధర్మమార్గమున జయము రాఁగోరఁడు. కావున నీవై చావఁ గోరి పైబడి శస్త్రధారివై పోయినఁ దప్ప నిన్నుఁ జంపఁడు. ఏలన నాయన ధర్మాంకుడు = ధర్మబుద్ధిగలవాఁడు—బుద్ధి మాఱదా—ఎల్లకాల మొకతీరున నుండునా యందువేమో — ధర్మాంకుఁడు= ధర్మమునకు స్థానమైనవాఁడు. ధర్మమాయనను విడిచిపోదు. ఆయన ధర్మాంకుఁడు= ధర్మమే చిహ్నముగాఁగలవాఁడు. నీ వాయనను జూచినంతనే యీయన ధర్మాత్ముఁ డని గుర్తింపఁగలవు. నీముఖము చూడఁగనే నీవు క్రూరుఁడవనియెట్లు తెలియుచున్నదో యట్లాయనను జూచినవారు ధర్మాత్ముఁ డని తెలిసికొనఁగలరు. కావున నిన్ను నేలును=నిన్ను వశ్యము రక్షించును. నీవు నీ పుర మేలునట్లు నిన్నాయన యేలును. ఊరక యేలుట గాదు. అర్మిలిన్ ఏలును=ప్రేమతో రక్షించును. నీ దేహమును నీ వెట్లు రక్షించుకొను చున్నావో యట్లు నిన్ను రక్షించును. "రక్షతే భగవాన్విష్ణుః భక్తానాత్మ శరీరవత్" అని కలదుకదా సూక్తి. ఏమి నమ్మకమందువా, ఆయనశరణా గతవత్సలుఁడు=శరణు అని వచ్చినవారిని తనబిడ్డలవలెఁ జూచువాఁడు. తన బిడ్డను

దా నెవఁడైనఁ జంపునా? నీవు చెప్పినది బాగున్నది. ఆయనయందు విరోధభావము మాని నా యింటనే యుండెదను. నీవీ వనములో నుండుము. ఆయన నడవిలో నుండ నిమ్మనెద వేమో?

ఉ. మానుము రాక్షసేంద్ర! కొఱమాలినబుద్ధి దయాస్వరూపుఁ డా
మానధనుండు, న న్వెస సమర్పణ చేసి భజింపు మీవునున్
దాన శుభంబు నీ కగుచు నా నుడి నీవు కృతాంతుప్రేరణన్
వీనులఁ బెట్టవేని పృథివీవరుచే మృతిఁ గందు వాజిలోన్. ౫౨౭

అర్థములు. కొఱమాలిన బుద్ధి=నిష్ప్రయోజన మైన, యిటువంటి విపరీతబుద్ధి, మానుము=వదలుము — చెలిమిగోరుట కేమి లక్షణము? అపరాధముచేయుటయా? ఉపకారము చేయకుండినను అపకారముచేయుట మానవలెఁగదా. చేసినయపకారము సవరించుకొనకుండిన నది యేమి స్నేహము? అది స్నేహలక్షణమా? కావున నీవు చేసిన యపరాధమును సవరించుకొనుము. ఆయన మానధనుఁడు కావున నవమానము సహింపఁడు. అందు నాయన విషయమునఁ జేసిన యపరాధములను క్షమించునుగాని, యాయన యాశ్రితుల విషయమునఁ జేసిన యపరాధములను సహింపఁడు. కావున నావిషయమున నీవు చేసిన యపరాధమును ఆయన సహింపఁడు. నీవు దానిని సవరించు కొంటివా, వీఁడిట్టి దుష్టకార్యము చేసెనే యని మనస్సున నుంచుకొని దండింపక దయాస్వరూపుఁ డగుట క్షమించును. అంతటి దయావంతుఁ డైనచో నిప్పుడు మాత్రము నన్నేల క్షమింప రాదు. ఏమో జ్ఞానహీనుఁడు చేసినాఁడులే యని యూరకుండరాదా యందువేమో, అటయిన నందఱు నపరాధములు, పాపములుచేయువారే యగుదురు. పుణ్యాపాప వివక్షయే లేకపోవును. లోకమధర్మమున నుండును. అప్పుడు ధర్మరక్ష యెట్లు చేయఁగలఁడు? అధర్మరక్షకుఁ డగును. అటయిన నిపుడు నన్నేమి చేయుమ నెదవా? ఆయనను వెంటనే యిచ్చుటకిఁ దోడుకొనివచ్చి నన్ను సమర్పించి సేవింపుము. ఈవునున్ భజింపుము=నీవు కూడ భజింపుము, ఆయన రాఁగానే నీవిషయమై వీనిని రక్షింప వలసినది యని నేనును జెప్పెదను. నీవు కూడ నమస్కరింపుము. చాలును. అంత కెక్కువ నీ వేమియుఁ జేయవలదు. దానన్=ఆ నమస్కార రూపక సేవవలననే నీకు మేలు గలుగును.

కృతాంతుప్రేరణన్ = యముఁడు ప్రేరించుటచే, నా నుడి నీవు వీనులన్ బెట్టవేని = విని యాప్రకారము వర్తింపక పోయితివా, పృథివీవరుచేన్ = రామభూపాలునిచే, ఆజిలోన్=యుద్ధమందు, మృతిగందువు = చత్తువు.

తా త్ప ర్య ము.

రాక్షసరాజా! నిష్ప్రయోజనమైన యీ బుద్ధి వదలుము. రామచంద్రమూర్తి దయాస్వరూప మగువాఁడు. మానమే ధనముగాఁ గలవాఁడు. కావున న న్నాలస్యము చేయక యాయనకు సమర్పించి, నీవు కూడ సేవింపుము. దానివలన

నీకు మేలు గలదు. యముఁడు నిన్నుఁ బ్రేరించుటచే నా మాట వినక పోయితివా, యుద్ధమందు నీవు ఆయనచేఁ జచ్చుట సత్యము.

ఉ. తప్పినఁ దప్పవచ్చు బల ♦ దానవవైరిశతారపాతముల్
దప్పినఁ దప్పవచ్చు నల ♦ ధర్మని చూడ్కులు కొంతకాలమేఁ
జెప్పెద సావధానమతిఁ ♦ జేర్పుము వీనుల, రాముఁ డల్గినన్
జెప్పెడి దేమి మూర్తమునఁ ♦ జీలిచి వైచును నిన్ను బోఁటులన్. ౫౫౮

అర్థములు. బలదానవవైరి = బలుఁ డను రాక్షసునకు విరోధి యగు ఇంద్రునియొక్క, శతార = నూ అంచులుగల వజ్రాయుధముయొక్క, పాతముల్ = పడుటలు, ధర్మని = యమునియొక్క, కొంతకాలమేఁ = కొంతకాల మైనను, శాశ్వతముగాఁ దప్పదు. ఎట్టి యోగి యైనను బ్రలయమందైనఁ జావవలసిన వాఁడే, సావధానమతిఁ = హెచ్చరిక గల మనస్సుతో.

తాత్పర్యము.

బ్రహ్మచేత, రుద్రునిచేత, వరములు గొన్న నీ వంటి వారి విషయమున నింద్రుని వజ్రాయుధము వ్యర్థమై పోయినఁ బోవవచ్చును. యమధర్మరాజు కంటఁ బడక కొంతకాలము తప్పించుకొనినఁ దప్పించుకొన వచ్చునుగాని, నేను జెప్పెడి మాట యేకాగ్రచిత్తమున వినుము. ఏమో చెప్పుచున్నదని యుదాసీనుఁడవు గాకుము. రామచంద్రమూర్తికిఁ గోపమే వచ్చెనా, నే నేమని చెప్పుదును. నిన్ను బ్రహ్మరుద్రాదుల వరములు కాపాడలేవు. ఆయన బాణము లల్పకాలములో నిన్ను, నీవంటివారిని ముక్కలు ముక్కలుగాఁ జీల్చి వేయును. ఆయనకుఁ గోప మువచ్చి విల్లెక్కు పెట్టువఱకే నీ జీవితము,

క. కడువడి సురపతి విడిచిన. పిడుగులవడువునను గడిఁది ♦ బెడిదపుటులివుల్
విడివడ రఘుపతిశరములు, వెడలఁగ వినఁ గలవురా! వి ♦ వేకముఁ గనరా. ౫౫౯

అర్థములు. కడువడిఁ = మిగుల వేగముగ, కడిఁది = మిక్కిలి, బెడిదపు = భయంకరములైన, ఉలివుల్ = ధ్వనులు, విడివడఁ = బయలు వెడలఁగా.

తాత్పర్యము.

నామాట నీవు వినకపోయితివా మిగుల శీఘ్రముగ నింద్రుఁడువిడిచిన పిడుగుల వలె మిగులభయంకరములైనధ్వనులతో రామచంద్రమూర్తిబాణములువింటినుండి వెలువడవినఁగలవు. అవి వినకముందే తెలివి తెచ్చుకొనుము. ఒకసారివిని యవి యంత భయంకరముగాఁ దోఁచిన శరణు చొచ్చెదనులే యనకుము. ఆశబ్దము నీచెవిని బడక ముందే బాణము నీఱొమ్మున నాటియుండును, నీవు నేలఁబడి యుందువు. రామచంద్ర మూర్తి బాణములు వచ్చువిధము నీవు చూచిన వాఁడవు గావు. కావున నిన్ను నీవు గొప్పగాఁ జెప్పుకొనుచున్నావు. మారీచాదు లెఱుఁగుదురు. నీ శూర్పణఖ యెఱుఁగును. వారు నీకుఁ జెప్పియే యుందురు. నీ శరప్రయోగవిధము, రామచంద్ర

మూర్తి శరప్రయోగ విధము రెండును నేను జూచితిని. నీవి మేఘములనుండి వెలువడు నీళ్ళ బిందువులవంటివి. రామునివి పిడుగులవంటివి. మీ యిరువుర కిదియే తారతమ్యము. అనుభవమువలన నీవే తెలిసికొనగలవు.

ఉ. క్రూరవిషానలార్చులను ♦ గుప్పునఁ గ్రక్కుచుఁ గోఱ లార్చుచున్
ఘోరముగాఁగ సర్పములు ♦ దూఱెడు నట్టు లవక్రపర్వముల్
శ్రీరఘురామలక్ష్మణ సు♦చిహ్నితముల్ శితభీకరేషువుల్
ఘోరముగాఁ బయింగవియ ♦ గోడుకొనుం జుమి లంక యంతయున్. ౫౬౦

అర్థములు. క్రూరవిషానలార్చులను = తీక్ష్ణమైన విష మనెడి యగ్ని జ్వాలలను, ఆర్చుచున్ = ఆడించుచు, దూఱెడునట్టులు = ప్రవేశించు విధముగ, అవక్ర పర్వముల్ = వంకర లేని కణుపులు గలవి. సుచిహ్నితముల్ = పేర్లు చెక్కబడినవి, శిత = పదునైన, భీకర = భయము కలిగించు, ఇషువుల్ = బాణములు, గోడుకొనుం జుమి = కీడుల పాలగును జుమీ.

తాత్పర్యము.

ఓసీ! రాముని బాణములు పిడుగులవంటివి. పిడుగు లొకటియో, రెండో పడును. రాముఁ డూరిలోనికి రాఁజాలఁడు. ఊరివెలుపల నెందో యుండి యొకటి రెండు బాణములు విడిచినంత మాత్రమున వచ్చిన భయ మేమి యుండువా? నేను వేగము నందు, శక్తియందుఁ బిడుగు లని చెప్పితిని గాని, సంఖ్యయందుఁ గాదు. క్రూరములైన సర్పములు విషాగ్నులఁ గ్రక్కుచుఁ గోఱ లాడించుచు గుంపులు గుంపులుగఁ దూఱునట్టులు రామచంద్రమూర్తి యొక్క వంకర లేని కణుపులుగలిగి రామ లక్ష్మణుల పేర్లు చెక్కఁబడిన, భయంకరములైన బాణములు లంకలోఁ బ్రవేశించి రాక్షసులపైఁ బడఁగా నవి తగిలి చచ్చువా రెందఱో, భయపడి పరు వెత్తువా రెందఱో లంక యెంత యల్లకల్లోల మగునో యాలోచింపుము.

తే. రామలక్ష్మణముక్తనా♦రాచతతులు, కంకపత్రంబు లీపురిఁ ♦ గలయఁ బర్వి
పీనుఁగుల పెంట లొనరించు ♦ దానవాళి, నింట నింటను నేడ్పులు ♦ మింటినంట.

అర్థములు. ముక్త = విడువబడిన, నారాచతతులు = బాణసమూహములు, కంకపత్రంబులు = గ్రద్దయీఁకెలు గలవి.

రామలక్ష్మణులచేత విడువఁబడిన గ్రద్దయీఁకలు గల బాణము లీపట్టన మందంతయుఁ గలయ వ్యాపించి పీనుఁగుల పెంటలు గలిగింపఁగా, రాక్షసుల యింట నింటను నాఁడువా రేడ్చు ధ్వను లాకాశ మంటఁగలవు.

తే. పాఁపమూఁక సుపర్ణుండు ♦ పట్టి చిమ్ము, గతి మహాబలుఁ డగు రామ ♦ ఖగవిభుండు
రాక్షసేంద్రమహాసర్ప ♦ రాజి నెల్ల, నాశుగత్రోటిఁ జించి చెండాడుఁ జుమ్మ.

అర్థములు. పాఁపమూఁక = పాములగుంపు, ఖగవిభుఁడు=గరుత్మంతుఁడు, ఆశుగతోటి = బాణము లను ముక్కుచే,

తాత్పర్యము.

కోట్లకొలఁది మే ముండఁగా నొక్క రాముఁడేమి చేయఁగలఁ డందువా? పాములసమూహముల నొక్క గరుత్మంతుఁడు పట్టుకొని విదలించివైచు విధమున రాముఁ డనెడి గరుత్మంతుఁడు బాణములను ముక్కుతో రాక్షసులను సర్పముల గుంపును చించి చెండాడును జమ్మీ. ఎన్ని పాములయినను నొక్క గరుత్మంతుని గెలువఁ గలవా?

చ. అసురకుఁ గైవసం బయిన ♦ యైంద్రపదంబుఁ ద్రివిక్రమాకృతిన్
వసముగఁ గైకొనండె హరి ♦ వాసవశాత్రవ! యట్ల రాముఁడున్
వెస నిట నుండి తోడ్కొనుచు ♦ వెళ్ళును నన్, నిజ మంతవట్టు, నీ
వసదుగఁ జూడఁ బోకు రఘు♦వర్యుని, భూమి మనంగఁ గోరినన్. ౨౬౩

అర్థములు, అసురకున్ = బలికి, కైవసము=స్వాధీనము, ఐంద్రపదంబు= ఇంద్రపదవి, వసముగన్ = సాధ్వీనపడునట్లు, వశము—తద్భ—వసము. నన్ = నన్ను, అసదుగ — అల్పముగ, మనంగన్ = బ్రదుకుటకు.

తాత్పర్యము.

ఓరి యింద్రవిరోధీ! యింద్రవిరోధి యగు బలిచక్రవర్తి పూర్వ మింద్రుని స్థాన మాక్రమించి తానే యింద్రుఁడై యుండఁగా విష్ణువు దానిని మఱలఁ దన వశము చేసికొనలేదా? అట్టులే రాముఁడు నీ స్వాధీనమందుండు నన్నుఁ దోడ్కొని పోవును. రామచంద్రమూర్తి యొంటరిగాఁ డేమి చేయఁగల డని యాయనను నల్పముగఁ జూడవలదు. వామనుఁ డొంటరివాఁడు కాఁడా? బలపరాక్రమములు లెక్క గాని, యొంటరి సంటరి తనము లెక్కగాదు.

క. ప్రస్థానార్భటి చెలఁగ జ,నస్థానము వెడలి వచ్చి ♦ నానారులు నా
కస్థానముఁ జేరఁగను హ,తస్థానము గాఁగ నదియు ♦ ధైర్యము లేమిన్. ౨౬౪

అర్థములు. ప్రస్థానార్భటి = ప్రయాణధ్వని, నాకస్థానము = స్వర్గము, హతస్థానము = పాడుపడినది.

తాత్పర్యము.

యుద్ధమునందు నాతో రాముఁడు సాటియా యనెద వేమో. యుద్ధసన్నాహమున భేరీ భాంకారాదులతో జనస్థాన రాక్షసు లందఱు వచ్చి చచ్చి జనస్థానము పాడు పడఁగా యుద్ధమున నెదిరింప ధైర్యము చాలక.

క. దొంగిలి తెచ్చితి వుటజము,నం గూళా యొంటి నుండు ♦ నన్ నృపతిలకుల్
చెంగట లేమిని జోరుని, భంగియ గాకిదియు శూరు♦పద్ధతి యటరా? ౨౬౫

అర్థము. ఉటజము=పర్ణశాల, ఆకుటిల్లు; కూళా=వంచకుఁడా!

తా త్ప ర్య ము.

ఆకుటింటిలో నొంటిగా నుండుదానిని వంచకుఁడా! రాజపుత్రు లిరువురు దగ్గఱలేని సమయమునఁ దెచ్చితివి. ఇది దొంగవాని విధమా? శూరుని విధమా? ఇట్లు దొంగవలె వర్తించియు శూరుఁడ నని చెప్పుటకు సిగ్గు లేదా.

క. పులులపసి సోఁక శునకము, నిలువంగా లేనియట్లు ♦ నిలువం గలవే
కలన రఘూత్తంసుల ముం,గల విక్రమహీన నీవు ♦ కల్మషచిత్తా! ౫౬౬

అర్థములు. పసి = వాసన, కలనన్ = యుద్ధమందు, కల్మషచిత్తా = పాపాత్ముఁడా.

తా త్ప ర్య ము.

పులుల వాసన తగిలినంత మాత్రమున నా ప్రాంతమందు నిలువక కుక్కలు పరుగెత్తునట్లు నీవు యుద్ధభూమియందు రామలక్ష్మణుల యెదుట నిలువఁ గలవా?

చ. అలవి యెఱుంగ నేరక మ♦హాత్ములతోఁ బగ గొంటి, వీవు దు
ర్బలుఁడవు వారలం జెనయ ♦ వచ్చునె నీ కని? దోర్యుగోగ్రు నా
బలదనుజారి నొంటిచెయి♦వాఁ డగు వృత్రుఁడు పోరఁ దాఁకిన
ట్టుల విను నీవు ద్రుంగెదు ప♦టుప్రదరాహతి వారిఁ దాకినన్. ౫౬౭

అర్థములు. అలవి = శక్తి, తారతమ్యము, చెనయన్ = ఎదిరింపఁగా, అనిన్ = యుద్ధమందు, దోర్యుగ+ఉగ్రున్ = రెండుచేతులు గల భయంకరుఁడు, బలదనుజారి = ఇంద్రుఁడు, పటుప్రదరాహతిన్ = దృఢము లైన బాణముల దెబ్బలచే.

తా త్ప ర్య ము.

నీశక్తి యేమాత్రమో, రామలక్ష్మణుల శక్తి యే మాత్ర మో యాలోచింపక వారితో విరోధించితివి. నీవు బలహీనుఁడవు. యుద్ధమందు వారి నెదిరింప లేవు. రెండుచేతులు గల యింద్రుని నొంటిచేతి వృత్రుఁ డెదిరించి చచ్చినట్టులు నీవు వారి నెదిరించితివా వారి బాణముల తాఁకునఁ జావఁగలవు. అంతియ గాని, నీవు గెలువ లేవు.

చ. అనుజ సమేతుఁడై యిటకు ♦ నాత్మవిభుం డరుదెంచి వేగ పే
ర్చిన కినుకన్ వధించు నిను ♦ గ్రీష్మవిభాకరుఁ డల్పతోయమున్
దనకిరణాళిఁ బీల్చు గతి ♦ దాఁగిన యక్షపపర్వతంబునన్
వననిధినాథుపీటను ధ్రు♦వంబుగ వృక్షముఁ బిడ్గురీతిగన్. ౫౬౮

అర్థములు. పేర్చిన = అతిశయించిన, గ్రీష్మవిభాకరుఁడు = ఎండకాలము నాఁటి సూర్యుఁడు, అల్పతోయమున్ = కొంచెపునీటిని, యక్షప పర్వతంబునన్ = నీ యన్న యగు కుబేరుఁడు, నీకు వరములిచ్చిన శివుఁడు నుండు కైలాసమున, వననిధి నాథుపీటను = వరుణు నగరమున, సముద్రములో.

తా త్ప ర్య ము.

నా భర్త తమ్మునితో నిచ్చటికి శీఘ్రముగ వచ్చి మిగులఁ గోపముతో నెండ

కాలము సూర్యుఁడు చిన్నగుంతలోని నీళ్ళు తన కిరణములచేఁ బీల్చు విధమున నీవు కైలాసపర్వతము లోనగు నూర్ధ్వలోకంబుల నెత్తున డాఁగినను సముద్రములో వరుణుని పట్టనము లోనగు నధోలోకంబులందు డాఁగినను బిడుగు వృక్షమును బడఁ గొట్టునట్లు పడఁ గొట్టును.

—♦ ౨౨–వ సర్గము రావణుఁడు సీతాదేవిని బెదరించుట. ♦—

క. అని పరుసంబుగఁ బల్కిన, వనజాయతనేత్ర సీత♦వచనంబులు దా
విని పంక్తికంఠుఁ డనియెన్, వినరాని కఠోరవాక్య♦విస్తర మొలయన్. ౫౬౯

అర్థములు. వాక్యవిస్తరము = మాటల యతిశయము.

తాత్పర్యము.

ఈ రీతి సీతాదేవి కఠినముగఁ బలుకగా, నామె మాటలు విని వినరాని పరుషములైన మాటలచే నిట్లనెను.

కం. ఎంతెంతగ బతిమాలునో, యంతంత వశుండు పురుషుఁ♦ డగు సతులకుఁ దా
నెంతెంత ప్రియము లాడునో, యంతం తవమాన మొందు♦ నతఁ డతివలచేన్,

అర్థములు. అంతంతవమానము=అంత యనునది సర్వనామ మైనపుడు కళ. కావున నంతంతవమాన మని సంధికూర్చుటయ్యెను. విశేష్యమైనపుడు ద్రుతప్రకృతికము. ఇచ్చట నంత యను దానికిఁ గొలఁది యని యర్థము. “నీ యోగవిభవమింత యంత యని పొగడ నే నెంతదాన”కళా ౨.ఇట్టులే “ఇంతింతై వటుఁ డింతయై”.భాగ.

తాత్పర్యము.

పురుషుఁడు స్త్రీల నెంతెంత బతిమాలునో యంతంత వారికి వశుఁ డగును. ఎంతెంత ప్రియము లాడునో యంతంత వారిచే నవమానింపఁబడును. వీఁడు మనకు లోపడినాఁడు గదా యని యెంత యవమానమైనఁ జేయుదురు. అట్లులే నేను మంచి మాటలాడు కొలఁది నీవు నోరికి వచ్చిన ట్లెల్ల మాటలాడు చున్నదానవు.

క. కాపథములఁ జను హయముల, నేపున రథచోదకుండు♦ నిలిపెడి రీతిన్
నీ పలుకుల రేఁగిన నా,కోపము నార్చెడిని గామ♦గుణ మో చెలువా! ౫౭౧

అర్థములు. కాపథములన్ = తప్పు త్రోవలను, రథచోదకుండు=సారథి.

తాత్పర్యము.

తప్పు త్రోవలఁ బోవు గుఱ్ఱములను సారథి బిగియఁ బట్టి నట్లు నీ పలుకులు వినుట వలనఁ గలిగిన కోపమును నీయందు నాకుఁ గల కామ మనునది బిగఁబట్టు చున్నది.

చ. వెలదిరో! యాత్మకామమును♦ విఘ్న మొనర్చెడునట్టివారి దం
డ్యుల నొనరింప నెట్లు తగి♦యుండియుఁ గామభరంబునన్ దయన్
జెలిమిని జూపుచుంద్రు గద♦ చెల్వరో! యట్టులె కల్లతాపసిన్
వలచెడి నీవు వధ్య వయి♦నన్ బరిభావ్యవు నైన నోర్చితిన్.

అర్థములు. దండ్యులన్ = శిక్షకుఁ బాత్రులను, వధ్యవు = చంపఁబడఁదగిన దానవు, పరిభావ్యవు = అవమానింపఁ దగినదానవు.

తా త్ప ర్య ము.

ఓసీ! తన కోరికకు నెవ్వరు విఘ్నము కలిగింతురో వారు చంపఁబడఁదగినవారు. అట్లుండియుఁ గామాతిశయము చేతను, దయచేతను, స్నేహభావము చేతను దొంగ తపస్విని వలచు నీవు చంపఁబడుటకు నవమానింపఁ బడుటకుఁ దగిన దాన వైనను సహించితిని.

క. నీ వాడిన పరుషోక్తుల, కే వధ కీ వర్హ రాల ♦ విప్పుడ యని కో
పావేశ భరంబున నా, దేవారివిభుండు పలుకు ♦ దివిజస్తుతకున్. ౨౩

అర్థములు. దివిజస్తుతకున్ = దేవతలచే స్తోత్రము చేయఁబడిన దానికి, దీనినే సీమె యిచ్చిన ప్రత్యుత్తరముల కీమెను రహస్యముగా వర్ణించు దేవతలు స్తోత్రము చేసి రని భావము.

తా త్ప ర్య ము.

ఇప్పుడు నీవు చెప్పిన పరుసపు మాటలకు నీ విప్పుడే చావఁదగిన దానవు? అని రావణుఁడు కోపముచే దేహము తెలియక దేవతలచే శ్లాఘింపఁబడు సీతాదేవి కిట్లనియె.

మ. వినవే జానకి! యింక రెండు నెలలే ♦ విశ్వాసపూర్వంబుగాఁ
గను నే వేచెద, నంతయే గడువు, నె♦క్కం జూడు మా లోపలన్
ఘనవేణీమణి! నాదు శయ్యసతివై ♦ కాదేని రెన్నెల్లపై
నిను వంటింటను గోవి వండుదురు విం♦టే ప్రాతరాశార్థమై. ౨౪

అర్థములు. రెన్నెలలు. రెండు+నెలలు = కొన్ని యెడల నవర్ణకంబు పరంబగు నపుడు పూర్వపదాంత్య డకారంబు నకారం బగు (ప్రౌ. వ్యా. సం. ౧౫ సూ.) ప్రాతః + ఆశార్థమై = ఉదయకాల భోజనము, ఇది దాక్షిణాత్యుల పుల్లనీళ్ళ కూటిని సూచించెడినేమో.

తా త్ప ర్య ము.

జానకీ! విను మిదివఱకు నేను నీకుఁ బండ్రెండు నెలలు గడువిచ్చి యుంటిని. అందిక రెండు నెలలే కొఱఁత. ఆ రెండు నెలలు ముగియువఱకు నీ యందు విశ్వాసముంచి కాచియుండెదను. ఈలోపల నీవు నాభార్యగా నా పానుపెక్కక పోయితివా, ఆగడువు తీఱిన మఱునాఁడే నిన్ను నా వంటవారు నా యుదయకాలభోజనము లోనికి నంజుఁడుగా వండుదురు. నాలవ పాదంబున ననునాసికాక్షరయతి.

క. అని యిట్లు రాక్షసేంద్రుఁడు, జనకతనూజాత మిగుల♦సాధ్వసపఱుపన్
గని నిర్జరగంధర్వాం, గనలు తపించిరి వెతన్ వి♦కారేక్షణ లై. ౨౫

అర్థములు. సాధ్వసపఱుపఁగ = భయపెట్టఁగా, వికారేక్షణలై = దుఃఖభయములచే మాఱ్పుచెందిన కన్నులు గలవారై.

తాత్పర్యము.

ఈ విధముగ రావణుఁడు సీతాదేవిని భయపెట్టఁగాఁ జూచి యచ్చటనున్న దేవ గంధర్వస్త్రీలు భయదుఃఖములచే వికారమైన నేత్రములు గలవారై తపించిరి.

క. వెఱ పెట్టి కఱకు లాడెను, కఱటిం గని సీత వగవఁ ♦ గనుసన్నల వా
తెఱలఁ మోములఁ గొందఱు, తెఱగంటి నెలంత లామె ♦ ధృతిఁ దేర్పంగన్.

అర్థములు. వెఱపెట్టి = భయపెట్టి, కఱకులు = పరుషపు మాటలు, కఱటిన్ = మూర్ఖుని, కనుసన్నల = కంటి సంజ్ఞలచేతను, వాతెఱలన్ = పెదవుల చేతను, తెఱగంటి నెలంతలు = దేవతాస్త్రీలు, తెఱ+గన్నులు = తెఱచుకొని యుండు కన్నులు గలవారు, దేవతలకు ఱెప్పపాటు లేదు. అనిమేషులు.

తాత్పర్యము.

ఈ విధముగఁ బరుషపు మాట లాడుచు మూర్ఖుఁ డగు రావణుఁడు భయపెట్టుచుండఁగా దేవతాస్త్రీలు కనుగిఱుపులచేతను, పెదవి విఱుపులచేతను, మూతిత్రిప్పుల చేతను ఆమెకు ధైర్యము వచ్చునట్లు వానికి లోఁబడ వలదని సైఁగలు చేసిరి.

దీనివలనఁ గొందఱు వానికి వెఱచి లోఁబడి యున్నను వానిమీఁదఁ బ్రేమ లేనివారై యుండి రని యేర్పడుచున్నది.

—♦ సీతాదేవి రావణునిఁ బరుషంబులు పలుకుట. ♦—

తే. వారి సన్నల ధృతిఁ గూరి ♦ వారిజాక్షి, నిబ్బరంబుగ వృత్తశౌం♦డీర్యగర్వ
వశమునను నాత్మహిత మెంచి ♦ భావవీథి, నిట్టు లను వానితో దిగు♦లింత లేక.

అర్థములు. ధృతి=ధైర్యము, కూరి = పొంది, నిబ్బరంబుగన్ = అధికముగ, నిర్భరశబ్ద భవము. వృత్తశౌండీర్యగర్వమునను—వృత్త=తన పాతివ్రత్యము యొక్క, శౌండీర్య=బలము వలనఁ గలిగిన, గర్వమునన్=పొగరుచేత, "ఐశ్వర్య రూప తారుణ్య కుల విద్యా బలైరపి, ఇష్టలాభాది నాన్యేషా మవజ్ఞా గర్వ ఈరితః' ఐశ్వర్యము రూపము వయస్సు కులము విద్య బలము ఇష్టలాభము— వీనిచే నితరుల లక్ష్యము చేయకుండుటకు గర్వమని పేరు. ఇచ్చట గర్వమునకుఁ గారణము పాతివ్రత్యము.

తాత్పర్యము.

వారు చేసిన సైఁగల వలన నధికమైన ధైర్యముగలదై సీతాదేవి పాతివ్రత్య బలమువలనఁ గలిగిన గర్వముచే, "వీనికి దేహబలముండిన నాకుఁ బాతివ్రత్య బలము గలదు. వీఁడు నన్నేమి చేయఁగలఁడు" అని తన మేలాలోచించి యిట్లనెను.

ఉ. నిక్కము రోరి దుష్టమతి! ♦ నీదుశుభం బిటఁ గోరువారు లే
రొక్కరుఁ, గల్గి రేని యిటు ♦ లొప్పని కార్యము నీవు చేయఁగా
నొక్కి వచింప కుందురె ఘ♦నుల్ సరికాదుర మాను మంచు, నీ
యొక్కనితోడఁ బోవ దిటు ♦ లొప్పరికించుట వారు రాక్షసా! ౫౭౮

అర్థములు. ఒప్పరికించుటన్ = ఉపేక్షించుటచేత, నిక్కముర + ఓరి= నీచమిత్రోద్దేశములందు ఉద్దేశ్యవాచకమునకు ఏకత్వంబున రకారం బంతాగమం బగు. దీనినే పూర్వులు మఱియొక విధముగఁ జెప్పిరి. "కవులు పొగడువేళఁ గాంతలు రతివేళ, సుతులు ముద్దువేళ శూరవరులు, రణము సేయువేళ రాకొట్టి పిలుచుట, పాడి యిదియు మిగుల భజనకెక్కు." ఒప్పనికార్యము = లోకము శాస్త్రము నంగీకరింపని చెడుకార్యము, నొక్కి=ఒత్తి, గట్టిగా.

తా త్ప ర్య ము.

ఓరీ! రావణా! నీ మేలు కోరువారీ యూర లేరు. ఇది నిజము. ఏల? నీవు దుష్టబుద్ధివి కావున నిజముగా నీ మేలు కోరువా రొకరైన నుండిన నీ విట్లు చేయ రాని పని చేయఁబూని నపుడు నీ కిది సరిగాదు, ఇట్లు చేయువల దని గట్టిగా నొత్తి చెప్పకుందురా? వారు చెప్పక నిన్ను సవరింపక యుపేక్షించుటచే నిదినీయొక్కనితోఁ బోదు. వారు చేసిన వాఁ డనుభవించు నని తలఁచిరేమో కాని యదిపొరపాటు.

ఉ. ఆలను నేను రామునకు ♦ నా హరికిన్ శచివోలె నన్ను నో
బాలిశ నీవు దక్కఁగఁ బ్ర♦పంచమునం దెవఁడైనఁ గోరునా
బాలిని జిత్తమం దయినఁ, ♦ బల్కితి వెన్నొ దురుక్తులా యఘం
బేలర నిన్నుఁ బాయుఁ? జని ♦ తేనియు నెక్కడ కైనఁ ద్రెక్కొనున్. ౫౭౯

అర్థములు. ద్రెక్కొనున్=మ్రింగును—చెఱుచును.

తా త్ప ర్య ము.

ఇంద్రునకు శచివలె నేను శ్రీరామచంద్రమూర్తి భార్యను. ఇట్టి నన్ను మూఢుఁడా! నీవు తప్ప మఱి యెవఁడైన నీవలెఁ బ్రపంచమున మనస్సునం దైన నన్నుఁ గోరునా? నీ వెన్నో చెడుమాట లాడితివి. ఆ పాపఫలము నిన్ను విడుచు నని తలఁచితివా? నీవెక్కడికిఁ బోయినను నిన్నుఁ జెఱుచును.

ఉ. మత్తమతంగజంబుఁ గొలఁ ♦ మూలిన నీచశశంబు దాఁకఁగా
నెత్తినయట్లు నాదు విభు ♦ నీ వెదిరింపఁగఁ గోరు టెల్ల, నీ
జిత్తుల రాము దవ్వుచనఁ ♦ జేసియు దొంగిలి తెచ్చి నన్ను నీ
చిత్తమునం దొకింతయును ♦ సిగ్గు వహింప వ దెట్టి మానివో. ౫౮౦

అర్థములు. మత్తమతంగజంబు = మదపుటేనుఁగు, శశంబు= చెవుల పిల్లి; ఎత్తినయట్లు=ప్రయత్నించినట్లు, జిత్తులన్ = వంచనచే, మానివో = పౌరుషము గలవాఁడవో-కావనుట.

తా త్ప ర్య ము.

మదపుటేనుఁగుతోఁ బనికిమాలిన యల్పమైన చెవులపిల్లి యుద్ధము చేయఁగాఁ బ్రయత్నించినట్లు నీవు నాభర్తతో నెదిరించి పోరాడఁదలఁచుచున్నావు. నీవు వంచనచే రామచంద్రమూర్తిని దూరముగాఁ బోవఁజేసి నన్ను దొంగిలించి తెచ్చియు నీ మనస్సునందైన నీవు సిగ్గుపడవు. ఏమి పౌరుషము గలవాఁడవురా.

క. లవమాత్ర మేనియును నా,ధవుకంటం బడిన నీవు♦తత్సమయమునన్
బవరంబున నానృపులా,ఘవసత్త్వము లపుడె నీకుఁ♦గనఁబడి యుండున్. ౫౮౧

అర్థములు. లవము = కొంచెము, బవరంబునన్ = యుద్ధమందు, లాఘవసత్త్వములు = చుఱుకుఁదనము - బలము.

తా త్ప ర్య ము.

నీవు నన్ను దొంగిలించి తెచ్చు సమయంబున నీవు కొంచెమైన నా మగనికిఁ గనఁబడి యుండినయెడల యుద్ధంబున బాణప్రయోగమునందలి యాయన చుఱుకుఁదనము బలము తెలిసి యుందువు.

క. ఏలొకో ననుఁ దమిఁ గను నా, భీలవిరూపములుఁ గృష్ణ ♦ పింగళములు నా
నీ లోచనములు రెండును, నేలం బడ వవిసి యిపుడ♦నిష్ఠురశీలా. ౫౮౨

అర్థములు. తమిన్ = కోరికతో, ఆభీల = భయంకరములైన, విరూపములు = వికారములైన యాకారము గలవి, కృష్ణపింగళములు = నలుపు పసుపు గలిసిన కాంతి గలవి, నిష్ఠురశీలా = నిర్దయమైన స్వభావము గలవాఁడా.

తా త్ప ర్య ము.

కామముతో నన్నుఁ జూచు నలుపు పసుపు కలిసిన వన్నెగల వికారములైన నీ రెండు గుడ్లేల రాలిపోలేదో?

క. దశరథుకోడల నగుచున్, విశదయశుం డైన రామ ♦ విభునకు సతినై
యశముం గనుఁ ననుఁ బల్కిన,దశవదనా నీదు నాల్క♦దగఁ జీలదుగా. ౫౮౩

అర్థములు. విశదయశుఁడు = నిర్మలకీర్తిగలవాఁడు.

తా త్ప ర్య ము.

దశరథు కోడలనై నిర్మలకీర్తి వహించిన రాముని ధర్మపత్నినైన నన్నుఁ బనికిమాలిన మాటలు పల్కిన నీ నాలుక యేల రెండుగాఁ జీలకున్నదో.

ఉ. నేన దశాస్య నిన్నిపుడ ♦ నీఱుగఁ జేసెదనె? నాదువల్లభుం
డానతి యీమి నట్టిపని♦కై, తపమెల్లను బొల్లుపోవఁగా
మానస మొప్ప కుండుటను ♦ మానితిఁ గాక, హరింపఁ జాలుదే
దానవ నన్ను? నిన్గెడపు♦తత్పరతన్ విధి యిట్లు చేసెడిన్. ౫౮౪

అర్థములు. నీఱుగన్ = భస్మముగ, ఆనతి = ఆజ్ఞ, పొల్లుపోవఁగా = వ్యర్థమై పోవుట, కెడపు = చంపు, విధి = దైవము.

తా త్ప ర్య ము.

కుక్కను గొట్టను బచ్చెనకోల కావలయునా? యన్నట్లు నిన్నుఁ జంపుటకు రామచంద్రమూర్తి రావలయునా? నేనే నిన్ను భస్మముచేయలేనా? నీకంతశక్తి యుండిన నేల చేయరాదందువా? నేను గేవల పరతంత్రురాలను. నారక్షణభారము నాభర్తపై వైచియున్న దానను. నన్ను రక్షించు భారము ఆయనయందున్నది. ఇపుడు నేనుస్వతంత్రించి నిన్నుఁ జంపితినానాపారతంత్ర్యవ్రతమునకు హాని వచ్చును. నాప్రాణము పోయినఁ బోనిమ్ము. కాని, నా స్వరూపస్వభావమైన పారతంత్ర్యమును విడువఁజాలను. దానిని విడిచిన నాకు స్వరూపహానియే కలుగును, ఆయన యాపద లందు నన్ను నీవు రక్షించుకొమ్మని దుష్టుని శపింపు మని యనుమతి యిచ్చినవాఁడు కాఁడు. నేనాయనసొమ్ము. ఆయన నా స్వామి. స్వామి గదా తన సొమ్మును దాను గాపాడుకొనవలెను. ఉండిన ననుభవించువాఁ డాయనయే. పోఁగొట్టుకొనిన నష్టపడువాఁ డాయనయే. ఆయన నిమిత్తమై నా యునికిగాని నా నిమిత్తమై కాదు. కావున నాయన యాజ్ఞలేని కార్యము నేనెట్లు చేయుదును. అట్లు భర్తయాజ్ఞ లేని కార్యము నేను చేసితినేని నా పాతివ్రత్యమునకే హానివచ్చును. కావున నీవిపుడే భస్మము చేయఁబడుటకు యోగ్యుఁడవైనను నట్లు చేయక యూరకున్న దానను. అటుగాకున్న 'హతోభవ' యనినఁ జచ్చిపడవా? కావున నీవు నన్నేమిరా చేయం గలవు? నిన్నుఁ జెఱుచుటకు దైవమే నిన్నిట్టు లాడించు చున్నాఁడు. నీయంతట నీవే చెడుటకు సిద్ధముగా నున్నప్పుడు నేనేల చెఱుపవలె? బెల్లముదిని చచ్చు వానికి విషము పెట్టవలయునా?

క. శూరుఁడవై వితతబలో, దారుఁడవై యెలబిలుని ♦ తమ్ముఁడవై పెం
పారియు వంచనమెయిఁ బర, దారస్తైయంబు నీకుఁ ♦ దగునే యనుడున్. ౫౯౫

తా త్ప ర్య ము.

రామచంద్రమూర్తియంతటి శూరుఁడవుగాకపోయినను లోకమునశూరుఁడ వని పేరు తెచ్చుకున్న వాఁడవు. విస్తారమైన గొప్ప బలము గలవాఁడవు. లోక నమస్కృతుఁడైన కుబేరునితమ్ముఁడవు. కులముచే బలముచే నింతటి గొప్పవాఁడ వయ్యు మోసముచేసి పరస్త్రీని దొంగిలించి తెచ్చుట నీకుసరియా? అని చెప్పఁగా.

చెఱలోనుండు దేవతాస్త్రీలో, విభీషణు భార్యయో, కూతురో, రావణా సురుఁడు శాపభయమున నిన్నుఁ దాఁకడు భయపడ వలదని రహస్యము దెలిపిరి. రావణుఁడు చంపఁబూనిన నీశాప మడ్డుపడదు. సీతాదేవికి వీఁడు నన్నుఁ జంపెనా చంపనీ, నా పాతివ్రత్యమునకు హాని లేదు గదా, యని యామె ధైర్యము.

## —♦ రావణుఁడు సీతాదేవిపై నాగ్రహపడుట. ♦—

క. జానకి వచనంబులను ద,శాననుఁ డాలించి క్రూర ♦ మగు నయనంబుల్
దా నట్టె విచ్చి త్రిప్పుచు, మానవతీమణిని గినుక ♦ మందుచుఁ జూచెన్. ౫౯౬

సీతాదేవి మాటలకుఁ గోపించిన రావణుని యాకారము వర్ణింపఁబడుచున్నది.

తాత్పర్యము.

సీతాదేవి నయభయములు గలుగఁ జెప్పిన మాటలను విని రావణుఁడు క్రూరములగు కన్నులు పెద్దవిచేసి గ్రుడ్లు త్రిప్పుచుఁ గోపముచే మండిపడుచుఁ జూచెను.

ఇవన్నియు భక్తునిచేష్టలని తీర్థుల యభిప్రాయము.

సీ. కాలజీమూత సం♦కాశు, డున్నత మహా, భుజశిరోధరుఁడును ♦ భూరిసింహ
గతిసత్త్వుఁడును దీప్త♦తతజిహ్వాకాగ్రలోచనుఁడుమాల్యానులే♦పనుఁడుమఱియు
జలితాగ్రమకుటుండు ♦ స్వర్ణాంగదధరుండు, రక్తమాల్యాంబర♦సక్తనుఁడు
నవ్యసుధోత్పాద♦నద్ధాహిమందర, మన నల్ల మొలత్రాట ♦ నమరువాఁడు
తే. పర్వతమునకు నుద్దియై ♦ పరఁగువాఁడు? పీనభుజయుగ్మమున శృంగ♦విహితమైన
మందరధరాధరమునకు♦మాద్రివాఁడు,రావణుండుత్రిలోకవి♦ద్రావణుండు. ౨౭

అర్థములు. కాలజీమూత సంకాశుఁడు=నల్లని మేఘముతో సమానుఁడు, జీవనము=నీళ్ళు, దీనియందు మూజ్ బంధింపఁబడును గావున జీమూతము = మేఘము, ఉన్నత = ఎత్తైన, మహా = గొప్పవగు, భుజ = భుజములు, శిరోధరుఁడు=మెడగలవాఁడు, భూరిసింహ=పెద్ద సింహముయొక్క, గతి_గమనము, సత్త్వుఁడు=బలముగలవాఁడు, దీప్తతత జిహ్వాకాగ్రలోచనుఁడు = మండుచున్న పెద్ద నాలుక కొనయు కన్నులు గలవాఁడు, మాల్యానులేపనుఁడు=మాల్యములు గందపుఁబూఁతయుఁ గలవాఁడు, చలితాగ్రమకుటుండు=కదలుచున్న కొనగల కిరీటము గలవాఁడు, కోపముచేఁ దల వణకించు చున్నాఁడని భావము. స్వర్ణాంగదధరుండు=బంగారు భుజకీర్తులు గలవాఁడు, రక్తమాల్యాంబర సక్తనుఁడు=ఎఱ్ఱని మాలికలతోను వస్త్రముతోను గూడిన దేహము గలవాఁడు, నవ్య=నూతనమైన, సుధా+ఉత్పాద = అమృతము కలిగించుటకై, నద్ధ=కవ్వపుఁ ద్రాడుగాఁ గట్టఁబడిన, అహి=వాసుకి యనెడి సర్పముగల, మందరము=మందర మను పర్వతము, పీనభుజ యుగ్మమునన్=బలసిని రెండు భుజములచే, శృంగవిహితమైన=శిఖరములతోఁ గూడిన, మందరధరాధరమునకున్ = మందరపర్వతమునకు, మాద్రివాఁడు=సమానమైనవాఁడు, త్రిలోకవిద్రావణుఁడు = మూఁడులోకములను బరువెత్తునట్లు చేయువాఁడు.

తాత్పర్యము.

నీలమేఘముతో సమానుఁడును, ఎత్తైన భుజములు మెడ గలవాఁడును, పెద్ద సింహమువంటి గమనము బలము గలవాఁడును, మండుచున్న నాలుకకొన కన్నులు గలవాఁడును, పూలదండలు గందపుఁబూఁతయు గలవాఁడును, కదలుచున్న కిరీటము కొన గలవాఁడును, బంగారు బాహుపురులు ధరించిన వాఁడును, మందర పర్వతము

నకుఁ జుట్టఁబడిన పామువలె నల్లని మొలత్రాఁడు ధరించిన వాఁడును, పర్వతముతో సమానమైన వాఁడును, బలిసిన రెండు భుజములచే శిఖరములతోఁ గూడిన మందరమువలె నుండువాఁడును, మూఁడు లోకముల జనులను భయపడి పరువెత్తునట్లు చేయువాఁడును నగు రావణుండు.

తే. రక్తపల్లవవరపుష్ప♦రాజిచేత, నతులితాశోకములచేత ♦ నద్రివోలె
నవదివాకరవర్ణకుం♦డలయుగంబు, కలిమిఁదనరారుమునిమనః♦కంటకుండు. ౪౯

అర్థములు. రక్త పల్లవ వరపుష్ప రాజిచేతన్ = ఎఱ్ఱని చిగుళ్లు, శ్రేష్ఠములైన పూలు, వాని సమూహముచే, నవదివాకర=ఉదయకాల సూర్యుని, వర్ణ= వన్నెగల, కుండలయుగంబు కలిమి = రెండు చెవుల పోగులుండుటచే, తనరారు= ఒప్పుచున్న.

తాత్పర్యము.

ఎఱ్ఱని చిగుళ్లు పూలచేతను అశోకవృక్షములచేఁ గొండవలె బాల సూర్యుని వన్నెగల పోగులచేత నొప్పుచు మునుల మనస్సు సంకట పెట్టువాఁడు.

క. చందనలిప్త శరీరుఁడు, సుందరత వసంతుఁ డగుచు ♦ సురుచిర భూషా
బృందయుతుం డయి మసనము, నందలి మండపమునా భ♦యంకరుఁ డగుచున్.

అర్థములు. చందనలిప్త శరీరుఁడు=గంధముచేఁ బూయఁబడిన శరీరము గలవాఁడు, మసనము = స్మశానము.

తాత్పర్యము.

చందనముచేఁ బూయఁబడిన శరీరము గలవాఁడై, సౌందర్యమున వసంతుని వలె నుండి యందమైన సొమ్ములు ధరించినవాఁ డయ్యును శ్మశానమందలి మండపమువలె భయము గలిగించువాఁడు.

క. రాఁజెడి కోపహుతాశను, చేఁ జక్షులు జాజువాఱి ♦ చెడుగోపమునన్
రాఁజుచు నాశీవిష మనఁ, దాఁ జటులత సీతతోడ ♦ దశముఖుఁ డనియెన్. ౫౦

అర్థములు. హుతాశనుఁడు=అగ్ని, జాజువాఱి=ఎఱ్ఱనయి, ఆశీవిషము= పాము.

తాత్పర్యము.

రోఁజుచున్న కోపాగ్నివలనఁ గన్నులెఱ్ఱనయి తీవ్రరోషముచే బుసగొట్టు పామువలెనై కోపముచే దేహము కంపింప సీతతో నిట్లనెను.

ఉ. ఓ గుణహీనురాల! నను ♦ నొల్లక నీతివిహీను నిర్ధనున్
బా గని యాశ్రయించె దకట ♦ పంకజమిత్రుఁడు సంధ్యఁ ద్రుంచు నా
లాగున నిన్ను నిప్పుడ చ♦లంబున రూపఱఁ జేయువాఁడ, నీ
యాగడ మెల్ల నా యెదుట♦నా! నను రావణు నీ వెఱుంగవా. ౫౧

అర్థము. గుణహీనురాల=మంచి గుణము లేనిదానా!, నిర్ధనున్=దరి

ద్రుని, చలంబునన్ = పట్టుదలతో, రూపఱన్ = రూపు లేకుండ, ఆగడము = అకార్యము, అవగడము రూపాంతరము.

తాత్పర్యము.

ఓసీ గుణహీనురాలా! నన్ను ధనవంతుని బలవంతుని శౌర్యవంతుని రూపవంతుని లోకముల నెల్ల హాహా యనిపించువానిని నంగీకరింపక, నీతి లేనివాని ధనము లేనివాని నాకంటె మేలని చేరెదవా? సూర్యుఁడు సంధ్యను హరించునట్లు పట్టు పట్టి నిన్ను నాశము చేయుదును జూడుము. నీ యాగడములు నా యెదుటనా చేసెదవు? నేను రావణుఁడ నని యెఱుఁగవా? సాయంసూర్యుఁడు సంధ్యను హరింపవలయు ననినఁ దాను ముందు హరణము కావలెను. అటులే నేను జచ్చినను జచ్చెదను, నిన్ను జంపెదనని భావము. నిన్నుఁ జంపఁబోయి నేనే చచ్చెదను.

సీ. అని పల్కి యచ్చటి ♦ యసురకాంతల నేక కర్ణ నేకాక్షి గో ♦ కర్ణి హస్త
కర్ణిని మఱి లంబ ♦ కర్ణి నకర్ణిక, హస్తిపాది నపాది ♦ నశ్వపాది
పాదచూళికను గో ♦ పాదిని బృథుపాది, నేకపాదిని విపు ♦ లైకనేత్రఁ
బెద్దతలలవారిఁ ♦ బెద్దమెడలవారిఁ, బెద్దపొట్టలవారిఁ ♦ బెద్దచనుఁ
తే. వారి నతిమాత్రనేత్రల ♦ బాధదీర్ఘ, జిహ్వికను నజిహ్వికను మఱి ♦ సింహముఖిని
సూకరీముఖిఁ గోముఖి ♦ జూచి యనియె, వినుఁడు నా యాజ్ఞ మీరలు ♦ వనితలార.

తాత్పర్యము.

సులభము.

ఉ. మీరలు గుంపు గూడుచు స ♦ మేలపుమాటల రామపత్ని నీ
వారిజలోచనన్ వినయ ♦ వాక్కులనో మఱి సామదాన భే
దేరలనో భయంబుననొ ♦ యే గతినేఁ బ్రతిలోమలోమగీ
ర్వారములన్ మదీయవశ ♦ వర్తిని వైళమ చేయుఁ డెల్లరున్. ౫౯౩

అర్థములు. సమేలపు మాటలన్ = ఒద్దికైన మాటలతో, అనుకూల వాక్యముల, సమ్మేళన శబ్దభవము సమేలము- భేదేరలనో, భేద+ఇరలు = భేద వాక్కులచేతనో, ప్రతిలోమలోమగీర్వారములన్ = ప్రతికూలములు అనుకూలములు నైన మాటలు- వైళమ = శీఘ్రముగ.

తాత్పర్యము.

మీ రందఱు గుంపుగఁ గూడి యనుకూలవాక్యములచేత నీ రాముని భార్యను కమలములవంటి కన్నులు గల దానిని, నయఁపు మాటలచేఁగాని, సామ దానభేదవాక్కులచేఁ గాని భయముచేఁ గాని యే విధమునైనను సరియ, యనుకూల ప్రతికూల వాక్యముల నాకు వశపడునట్లు వేగముగఁ జేయుఁడు.

క. అని యానతి యిడి రాక్షస, వనితలకున్ మఱల మఱల ♦ వైదేహిని దాఁ
గనుఁగొని గర్జనములఁ ద,ర్జన మొనరుప నడ్డ మగుచు ♦ రాక్షసపతికిన్. ౫౯౪

అర్థములు. ఆనతి = ఆజ్ఞ ప్రతిభవము = ఆజ్ఞ, గర్జనములన్ = పెద్దగ నఱచు టచే, తర్జన = మొనరుపన్ = భయపెట్టగా.

తా త్ప ర్య ము.

ఈ ప్రకారము రాక్షసస్త్రీలకు నాజ్ఞచేసి మఱల మఱల సీతను జూచి పెద్దగా నఱచుచు బెదరింపఁగా రావణునకు నడ్డమై.

—♦ ధ్యానమాలిని రావణున కడ్డము వచ్చుట ♦—

తే. ధ్యానమాలిని రాక్షస♦తరుణి యతనిఁ
గౌఁగిటను గ్రుచ్చి యను ఱేఁడ! క్ష్మాజ యేల ?
యీ సకియమానవి వివర్ణ ♦ యేమనన్ మ
హాకృపణ రమియింపు నా♦యందు నీవు. ౫౯౫

అర్థములు. క్ష్మాజ = సీత, భూమియందుఁ బుట్టిన చెట్టువలె మొద్దువంటిది. ఈ సకియ+మానవి = ఈ స్త్రీ మనుష్యజాతిది. గొప్ప రాక్షసకులమునఁ బుట్టిన నీకు ఈ తుచ్ఛజాతి మనుష్య స్త్రీ యేల? (౨) ఈసకి+అమానవి = ఈమె మనుష్య స్త్రీ యని తలంచుచున్నావు. కాదు సుమా,. వివర్ణ = కాంతిలేనిది, (౨)నీ యోగ్యతకు మించినది, విశేషవర్ణ. మహా+కృపణ = మిగుల నీచురాలు (౨)మహా+అకృపణ = మిగుల పతివ్రత. ఈమె కోపించిన నీవు నాశమగుదువు, అని భావము.

తా త్ప ర్య ము.

ధ్యానమాలిని యనెడి రాక్షసస్త్రీ రావణుని కనిష్ఠభార్య, యతని కడ్డము వచ్చి కౌఁగిలించుకొని రాజా! యీ సీత యేల నీకు? ఇది తుచ్ఛ మనుష్య స్త్రీ, కాంతి లేనిది, మహా నిర్భాగ్య, ఇట్టిది నీ కేల ? నాతో రమింపుము' అనెను.

ఇట్లడ్డమువచ్చిన స్త్రీని వెనుక హనుమంతుఁడు అంగదాదులతోఁ జెప్పునప్పుడు మందోదరి యని చెప్పెను. రూపసామ్యముచేతనే భ్రమించెనో, సుప్రసిద్ధురాలగు మండోదరి పేరు తెలిసియుండి దీనిపేరు తెలియమిచేతనో లేక యిరువురు నడ్డమురాఁగా నొకరి పేరిచ్చట నొకరి పేరచ్చట వాల్మీకి చెప్పెనో! ఇచ్చటఁ చెప్పినవాఁడు వాల్మీకి. అచ్చటఁ జెప్పినవాఁడు హనుమంతుఁడు. ఈ ధాన్యమాలిని కొడుకే అతికాయుఁడనువాఁడు. వాఁడుకూడ రామునకు సీత నిమ్మని రావణునకుఁ జెప్పినవాఁడే కావున తల్లి కొడుకు లిరువురు సుగుణసంపత్తి గలవారని యేర్పడుచున్నది. కావుననే రావణునకు నడ్డమువచ్చెను. మహాపతివ్రత సీత తటాలున శపించిన రావణుఁడు చచ్చునే, తనకు వైధవ్యము వచ్చునే యని యడ్డమువచ్చి యుండవచ్చును.

రంగనాథ రామాయణమునందు లక్ష్మణమూర్ఛనాఁడు హనుమంతుఁడు సంజీవనికిఁ బోవునపుడు మొసలిగానున్న దీనికి శాపమోక్షణము గావించెననియు దీని

కొడుకు అతికాయుఁ డనియు నున్నది. అచ్చటఁ జెప్పఁబడినది దేవతాస్త్రీ.

“నా పాట విని దశాననుఁ డేగుదెంచి

* * *

వనిత నన్ గారింప వలదు రమ్మనుచు
ననుఁ బ్రియోక్తులఁ దేల్చి నాతో రమింప
నతికాయుఁ డుదయించె నంత నా పుత్రు
నతివేగమున దానవాగ్రణి కిచ్చి.”

యని యున్నది. దీని వలన నీ కాలనేమి కథ మతిహీనునిచేఁ గల్పిత మని స్పష్ట పడుచున్నది. వాల్మీకి చెప్పిన ప్రకార మిచ్చట నీమె రావణున కడ్డము వచ్చుట నిజమా? ఈ కాలమందే యందెందో మడుఁగులో మొసలియై యుండుట నిజమా? ఇది రాక్షసస్త్రీ, అది దేవతాస్త్రీ. అతికాయుఁడు దీని కొడుకా? దానికొడుకా? అతికాయుఁడు రాక్షసుఁ డనియే యుద్ధకాండమందు ౭౧వ సర్గమందుఁ గలదు. ఈ కారణముచేఁ గాలనేమికథ కల్పిత కథయే. పూర్వపీఠిక చూచునది. ఇప్పు డడ్డము వచ్చినవారు మండోదరీ ధాన్యమాలినులు మాత్రమే కాదు. అక్కడనున్న మఱికొంద ఱాఁడువాండ్రు నడ్డము వచ్చినట్లు హనుమంతుఁ డంగదాదులతో “రమ్మంచు వారెల్లఁ గోపంబుఁ జల్లార్చి యా రాక్షసుం దోడుకొంచేగి” రను వాక్యములచేఁ దెలియ నగు. (చూ. దండకము. ౧౩౯౭.)

క. నిక్క మిది బ్రహ్మదేవుం, డిక్కమలాక్షికిని నొసటి యెడ వ్రాయఁడు నీ
దిక్కులను గెలిచి తెచ్చిన, యక్కజపుం ధనము లెల్ల ననుభోగింపన్. ౪౯౬

అర్థములు. ఇది = నే నిపుడు చెప్పఁబోవునది.

తాత్పర్యము.

నేను జెప్పునది నిజము. నీవు దిక్కుదిక్కుల గెల్చి తెచ్చిన యాశ్చర్యకరములైన ధనముల నెల్ల ననుభవించుటకు బ్రహ్మదేవుఁడు దీని ముఖమున వ్రాయ లేదు. ఇది యేమి చేయఁగలదు? నీ వేమి చేయఁగలవు?

క. కామంబు లేని కామినిఁ, గామించినఁ యంతఁ బురుషు కాయంబు చెడున్
గామించుచున్న కామినిఁ, గామించిన బరమసుఖము గలుగును నాథా! ౪౯౭

తాత్పర్యము.

కామము లేని స్త్రీని గామించి, భోగించె నేని యట్టి పురుషుని దేహారోగ్యము చెడును. తనయందుఁ గామము కలిగి భోగింపవలయు నని కోరిక గల సమయంబున భోగించు పురుషునికి మిగుల సుఖము గలదు. కావున నీ మగతనము కొలఁది నాతో రమింప రమ్మి.

ఇది వారివారి భార్యలతో సంగమించునపుడును సత్యము. ఇరువురకుఁ గామము కలిగిన సమయంబున భోగించిన నే యిరువురకు సుఖము ఆరోగ్యము కలవుగాని

కామోద్రేక మున్నను లేకున్నను నిత్యశ్రాద్ధముగాఁ జేయు వారికి సుఖారోగ్య ములు లేవు. సత్సంతానము లేదు.

క. అని చెప్పుచు నా రక్కసి, దనుజేశ్వరుని న్మరల్ప ♦ దశవదనుఁడు దాఁ
జని నవ్వికొనుచుఁ జొచ్చెను, దనమందిరముఁ సువర్ణ ♦ ధామోజ్జ్వలముఁ. ౫౯౯

తాత్పర్యము.

అని చెప్పుచు నా రాక్షసి రావణుని మరలించుకొని పోఁగా రావణుఁడు దాని మాటలకు నవ్వికొనుచు బంగారుమయమై ప్రకాశించు తన గృహము లోనికిఁ బోయెను.

తే. దేవగంధర్వపన్నగ ♦ దేవతారి, కన్యకలు చుట్టుఁ గొలువంగఁ ♦ గదలి పోయె
నట్లు సీతను దర్జించి ♦ యనుచితగతిఁ, బంక్తివదనుండు మదనసం ♦ భ్రాంతుఁడగుచు.

తాత్పర్యము.

దేవగంధర్వస్త్రీలు, నాగస్త్రీలు, రాక్షసస్త్రీలు తన్నుఁ జుట్టుకొని సేవింపఁగా నిట్లు సీతను ననుచితమగు రీతి బెదరించి మదనునిచే తొట్రుపాటు పడువాఁడై వెడలి పోయెను.

—♦ ౨౩-వ సర్గము. రాక్షసస్త్రీలు సీతాదేవికి బోధించుట ♦—

క. ఆనతి యిడి యరిగిన న, ద్దానవపతు లంతఁ గ్రోధ ♦ తామ్రాక్షుల నా
జానకిని డాసి పలికిరి, నానావిధపురుషభాష ♦ ణంబుల నిట్టుల్. ౬౦౦

తాత్పర్యము.

రావణుఁ డిట్టు లాజ్ఞ చేసి పోఁగా నా రాక్షసస్త్రీలు క్రోధముచే నెఱ్ఱనైన కన్నులతో నాసీతను సమీపించి యనేకవిధములైన కఠినపు మాటలిట్లనిరి.

క. బేలా! రావణుఁ బతిఁగా నేలా కైకొనవు? వాని ♦ నేమిగఁ గని తా
పౌలస్త్యుని దశకంఠునిఁ, ద్రైలోక్యవరిష్ఠు నిహత ♦ దర్పితవైరిన్? ౬౦౧

అర్థములు. పౌలస్త్యుని = బ్రహ్మపుత్రుఁ డగు పులస్త్య మహర్షి వంశమున బుట్టినవానిని, గోత్రార్థక తద్ధితము, దశకంఠుని = పదితలలు గలవానిని, త్రైలోక్యవరిష్ఠుఁ = మూఁడు లోకములందు శ్రేష్ఠుఁడగువానిని, నిహత దర్పిత వైరిఁ = గర్వించిన శత్రువులఁ జంపినవానిని.

తాత్పర్యము.

ఓసి! తెలివి లేనిదానా! ఏల నీవు రావణుని భర్తగా గ్రహింపకున్నదానవే. రావణుఁడనఁగా నే మనుకొంటివే. కులము తక్కువయా యనిన, బ్రహ్మకుమారుఁడగు పులస్త్యమహాముని వంశమునఁ బుట్టినవాఁడు. లోకములో నందఱు కొక్కొక తలయయిన, పదితలలు గలవాఁడు. ప్రతిష్ఠకుఁ దక్కువా యనిన, మూఁడు లోకములందు వీనిని మించివాఁడు లేఁడు. బలహీనుఁడా యనిన, గర్వించిన శత్రువుల

నందఱ జయించినవాఁడు. మగఁ డిట్టివాఁడు గాకున్న నిఁక నెట్టివాఁడుగా నుండ వలయునే.

సీ. అంతట నేకజ♦టాఖ్య యి ట్లను సీత!, రావణుం డనఁగ నీ♦భావమునను
గొలఁదిగాఁ జూచెదే? యలప్రజాపతు లార్వు, రందుఁ జతుర్థుఁ డ♦బ్జాసనునకు
మానసపుత్రుండు ♦ మహితయశస్వి పులస్త్యుండు వాని త♦లంపునందుఁ
గలిగె విశ్రవుఁ డను♦కంజజతుల్యుండు, వాని పుత్రుఁడు గదే ♦ వారిజాక్షి!
తే. రావణుం డభియాతివి♦రావణుండు
తాన బతిమాలుకొన నీకుఁ ♦ దగునె బిగువు ?
మక్కువ యొనర్చుకొలఁదిని ♦ నిక్కపడెదు
నమ్మవా నాదుమాట నో♦యెమ్మెలాఁడి! ౬౦౨

అర్థములు. కొలఁదిగా = అల్పునిఁగా, ఆర్వురు ప్రజాపతులు=మరీచి, అత్రి, అంగిరుఁడు, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు అనువారు ప్రజాపతులు. వీరిలో నాలవవాఁడు పులస్త్యుఁడు. మానసపుత్రుఁడు = సంకల్పభవుఁడు, కంజజతుల్యుండు=బ్రహ్మతో సమానుఁడు. అభియాతివిరావణుండు=శత్రువుల నేడ్పించువాఁడు. ఎమ్మెలాఁడి = విలాసము గలదానా?

తాత్పర్యము.

'అంతట నేకజట యను రాక్షసి యిట్లనెను. సీతా! రావణుని నీ మనస్సునం దల్పునిఁగా నెంచుచున్నావు. వాని పుట్టువు నీకుఁ దెలియదు. వినుము. ఆర్వురు ప్రజాపతులలో నాలవవాఁడగు పులస్త్యుఁడు; ఈయన బ్రహ్మకు మానసపుత్రుఁడు. ఆయన సంకల్పమునఁ గలిగినవాఁడు విశ్రవుఁడు. వాని కొడుకు రావణుఁడు. ఇఁక బలమునందా, శత్రువుల నేడిపించువాఁడు. ఇట్టి గొప్పవాఁడు తానై వచ్చి నిన్నుఁ బ్రార్థింపఁగా నీ కేల యీ బిగువు. వాఁడు మక్కువ చూపుకొలఁది నీవు నిక్కి నిక్కి పడెదవే, నా మాట నీవు నమ్మవా?

సీ. ఆవల హరిజట ♦ యను పెనురక్కసి, తన పిల్లి కన్నులు ♦ దద్ద విచ్చి
గిరగిర మని త్రిప్పి ♦ కినుక మై నిట్లను, ముప్పదికోటులు ♦ మూఁడుకోట్లు
నిర్జరులను గెల్చె ♦ నిర్జరనాథునిఁ, జెఱఁబెట్టె నట్టి పె♦న్జెట్టి నీకుఁ
దగినవరుం డగు ♦. మగువ! వరింపుము, పంక్తికంఠుని ననఁ♦ బ్రఘస యనియెఁ
తే. క్రోధమూర్ఛిత యగుచును ♦ ఘోరఫణితిఁ
దనదు ప్రియభార్య రూపసి ♦ ధన్యురాలి
విడిచి నినుఁ గోరు శూరుని ♦ వీరవరుని
బలియు సతి వౌట కింత ని♦ర్బంధ మేల? ౬౦౩

తాత్పర్యము.

ఆవల హరిజట యను రాక్షసి తన పిల్లికన్నులు బాగుగఁ దెఱచి గ్రుడ్లుగిరగిర

త్రిప్పుచు నిట్లనెను. ముప్పది మూఁడుకోటుల దేవతలను జయించెను, ఇంద్రుని చెర పట్టెను, అటువంటి జగజెట్టి నీకుఁ దగిన మగఁడే కావున వానిని వరింపుము. అనిన ప్రఘస యనునది క్రోధముచే దేహము తెలియక కఠిన వాక్యముల నిట్లనియె. తన ప్రియురాలి,సుందరిని,పుణ్యాత్మురాలినివిడిచినిన్నుఁగోరువానిని, శూరుని,పరాక్రమ వంతుని, బలవంతుని భార్య యగుటకు నీవై పైపడి పోవలసి యుండఁగా నిన్నింత నిర్బంధ పఱుపవలెనా ?

క. కాంతాసహస్రకలితని, తాంతవిభాబహుళమణి వి♦తానాంచిత మా
నంతఃపురమును బోనిడి, కాంతా ! నీ తోడఁ గూడఁ♦గలఁ డాతండున్. ౬౦౪

అర్థములు. కాంతా సహస్రకలిత = అనేక స్త్రీలతోఁగూడినది, నితాంత విభా = అధిక కాంతిగల, బహుళమణి వితానాంచితము=అనేకవిధము లగు రత్న సమూహములచేఁ బ్రకాశించునది.

తాత్పర్యము.

అందఱుఁడు వారక్కడ నున్నారే, వారు చూచుచుండ నెట్లు వానితో సంభోగించెద నందువా, అనేక స్త్రీలతోఁగూడినదియు, అనేక రత్నకాంతులుగల దియు నగు నంతఃపురమును విడిచి యొంటిగ రమ్మనిన నిచ్చటకే వచ్చును. పోయి పిలుచుకొని వత్తునా ?

సీ. వికట యిట్లనియెను ♦ నికటంబునను జేరి, యమరులతో యుద్ధ ♦ మాడువేళ
నెన్ని మాఱులొ గెల్చె ♦ హేలమై నాగగంధర్వయక్షోరగ♦దానవులను
నట్టి మహాత్ముండు ♦ పెట్టి నీపై మతి, యాసింప నిర్భాగ్య♦రాల యేల
యతని యిల్లాల వై♦హర్షింప నొల్లవు? నాఁగ దుర్ముఖి యెల♦నాఁగ కనియె

ఆ. నెవనిఁ దలఁచి సూర్యుఁ ♦ డెండలుగాయండు, వెఱచు గాలి వీవ♦వృక్షతతులు
పూలవాన రాల్చు ♦ బోలుపుగా మబ్బులు, పరమభీతిఁ గురియు♦వలయునపుడు.

అర్థములు. నికటము = సమీపము, హేలమై = విలాసముగా.

తాత్పర్యము.

వికట యనునది చనువుగ దగ్గఱఁజేరి కూర్చుండి యిట్లనెను. సీతమ్మా ! రావణుఁడు యుద్ధములు చేయుచుండిన సమయమందు నాఁటవలె నవలీలగా నాగులను,గంధర్వులను,యక్షులను,పన్నగులను,దానవులనునెన్ని మాఱులో గెల్చినాఁడే, అంతటి మహాత్ముఁడు మనస్సంతయు నీమీఁదఁ బెట్టినాఁడే పిల్లా! నీవెంత నిర్భాగ్యురాలవే,అట్టివాఁడెంతో యాశపడిరాఁగా వాని యిల్లాలవై సంతోషింపకున్నదానవు. అనఁగా దుర్ముఖి యిట్లనియె. ఓసీ! యతని పేరనిన సూర్యుఁడు లంకపై నెండగాయ భయపడును. గాలివిసర భయపడును. చెట్లు భయపడి వాఁడుతమక్రిందికివచ్చినపుడు పూలవాన కురియించును. వాఁడు కోరినపుడు మేఘములు వర్షించును.

ఆ. అట్టి రాజరాజు♦నమరారిఁ బతిఁగాఁగఁ, గొనుము నాదుమాట♦వినుము శుభముఁ
గనుము సౌఖ్యముగను♦ మనుము మా రావణు,జాయ వగుట కింత♦ సందియంబ?

తా త్ప ర్య ము.

అటువంటి మహిమ గలవాఁడు, రాజుల కెల్ల రాజగువాఁడు, దేవతలకు విరోధి యగువాఁడు, రావణుఁడు. వానిభర్తగాఁ జేసికొని, నామాట విని, సుఖముగాఁ బ్రదుకుము. మా రావణు భార్య వగుట కింత సందేహ మేటే.

—♦ ౨౪-వ సర్గము. రాక్షసస్త్రీలు సీతాదేవిని బెదరించుట, ♦—

సీ. మఱియు నందఱుఁ జేరి ♦ మైథిలిఁ గనుగొని, తర్జించి రిటు క్రూర♦గర్జనముల
నది యేల యొల్లవే ♦ యఖిలభూత మనోహ,రం బైన శుద్ధాంత♦రంగసీమఁ
బఱుపులమీఁదను ♦ బన్నుండ? నో చెలి! మానుషి వగుటను ♦ మనుజునకును
నిల్లాల వగుటయే ♦ హెచ్చుగఁ జూచెద, విఁక నేటి రాముఁడే? యేల యతని
తే. మీఁదమనసుంచి మిడికెదు?♦మెలఁత! యింకఁ, గల్లనీ వెటురామునిఁ♦గనుటగాన
రాక్షసేశ్వరుఁ డైనట్టి♦రావణుండు నీకఁ దగువాఁడు భర్తగా♦నెమ్మిఁగొనుము.

అర్థములు. తర్జించిరి = భయపెట్టిరి, శుద్ధాంతరంగసీమన్ = అంతఃపుర ప్రదేశమున.

తా త్ప ర్య ము.

ఇట్లు నయవాక్యములు వ్యర్థములగుటఁ జూచి భయవాక్యముల నా రాకాసులంద ఱొక్కటిగఁ జేరి యిట్లు క్రూరనాదములు చేయుచు బెదరించిరి. సీతా! ఎట్టివారి మనసైన హరింపఁజాలు నంతఃపురమందు పఱుపులమీఁదను బండుకొనుటకు నీ కేమి నొప్పియా? ఏల పండుకొన ననెదవు. నీవు మనుష్యస్త్రీ వగుటచేత మనుష్యున కిల్లాలగుటయే గొప్పగాఁ జూచుచున్నావు. ఇఁ కెక్కడి రాముఁడు? రాముఁడెక్కడ? నీ వెక్కడ? వానిమీఁద మనస్సుంచి యేలయేడిచెదవు? రాముని నీ విఁకఁ జూచుట యసత్యము. కాబట్టి రాక్షసరాజు రావణుఁడు నీకుఁదగిన భర్త. వానిని గ్రహింపుము.

ఉ. మానుషి వౌట రాముఁ గొఱ♦మాలిన మానుషు రాజ్యహీనునిన్
దీను దరిద్రు దుర్బలుని ♦ దేవి! మనోహరుఁగాఁ దలంచె, దీ
మానవభోక్త లోకచయ♦మానితసర్వపదార్థ భోక్త యా
దానవభర్త భర్తగ య♦థాసుఖముం జరియింప రాదటే? ౬౧౮

అర్థములు. లోకచయమానిత = జనసమూహముచే గౌరవింపఁబడిన, సర్వపదార్థ భోక్త = అన్నివస్తువుల ననుభవించువాఁడు.

తా త్ప ర్య ము.

నీవు మనుష్యస్త్రీ వగుట పనికిమాలిన మనుష్యుని రాజ్యము లేనివానిని ఏడ్చుచుండువానిని దరిద్రుని బలహీనుని భర్తగాఁ దలంచెదవు. ఈ రావణుఁడో

మనుష్యులఁ దినువాఁడు. జను లే యే పదార్థములు గొప్పవని గౌరవించెదరో వాని నెల్ల ననుభవించువాఁడు. రాక్షసరాజు. ఇటువంటివానిని మగనిఁగాఁ జేసికొని యథేచ్ఛముగా సుఖింపరాదా!

క. అనుచును దను నసురాంగన, లన విని కనుఁగవలఁ గాఱు♦నశ్రులు గొనగో
టను మీటుచు జలజేక్షణ, యను నా రాకాసిమూఁక♦నల్లనఁ గనుచున్. ౬౦౯

తా త్ప ర్య ము.

తన్నీ ప్రకారము పరుషముగ మాటలాడుచున్న రాక్షస స్త్రీలనుగాంచుచున్న కన్నీళ్ళను గొనగోట మీటుచు సీతాదేవి యా రాకాసి మూఁకకుమెల్లగానిట్లనెను.

—♦ సీతాదేవి రాక్షసస్త్రీలకుఁ దనమనోనిశ్చయముఁ దెలుపుట ♦—

ఉ. రాక్షసకాంతలార! విన♦రా? జను లెవ్వరు మెచ్చ రీనుడుల్
రూక్షతరాఘకారణము♦లుం జుఁడి మీకిఁ, మర్త్యకాంతయుర్
రాక్షసు నాలుఁ గాఁగలదె? ♦ క్రచ్చఱ మీకిది యిష్టమేని నన్
భక్షణసేయుఁ డీ చెనఁటి♦పల్కులు నా చెవిఁ గ్రుచ్చకుండుఁడీ. ౬౧౦

అర్థములు. రూక్షతర = మిక్కిలి తీక్ష్ణములైన, అఘకారణములు = పాపమును గలిగించునవి.

తా త్ప ర్య ము.

రాక్షసస్త్రీలారా! నామాట చెవిలోఁ బడనీయరా? మీరు చెప్పునట్టి మాటలు లోకము మెచ్చునవికావు. అంతేకాదు. మీకు మహాఘోరపాపమును గలగించునవి. ఎందైన మనుష్యస్త్రీ రాక్షసుని భార్యకాఁగలదా? మీకిటు సేయ నిష్టమేని నన్నుఁజంపి తినుఁడు. ఈ దుష్టవాక్యములు పలుకుట చాలింపుఁడు.

క. దీనుండో వర రాజ్యవి, హీనుండో యెవ్వఁడైన ♦ హృదయేశ్వరుఁడే
మానితుఁ డగు నా కెప్పుడు, భానుండు సువర్చలకగు♦పగిదిం జగతిన్. ౬౧౧

తా త్ప ర్య ము.

దరిద్రుఁడో రాజ్యహీనుఁడో మఱి యెట్టివాఁడైనను సువర్చలకు సూర్యుని వలె నా మగఁడే నాకు గొప్ప.

సూర్యుఁడు తనఁవేఁడిమిచే మిగులఁ దపింపఁజేయుచున్నను సువర్చ యతనిని విడిచిపోయినదా? విష్ణు పురాణము. ౧-౮

"కల్పాదా వాత్మనస్తుల్యం సుతం ప్రధ్యాయతస్తతః
ప్రాదురాసీ త్ప్రభో రంకే కుమారో నీలలోహితః
రురోద సుస్వరం సోఽథ ప్రాద్రవ ద్విజసత్తమ!
కిం రోదిషీతి తం బ్రహ్మా రుదంతం ప్రత్యువాచవై
నామ దేహీతి తం సోఽథ ప్రత్యువాచ ప్రజాపతిః

రుద్ర స్త్వం దేవనామాసి మారోదీర్ధైర్య మావహ
ఏవ ముక్తః పునస్సోఽథ సప్తకృత్వో రురోదహ
తతో న్యాని దదౌ తస్మై సప్తనామాని వైప్రభుః
స్థానానిచైవ మష్టానాం పత్నీః పుత్రాంశ్చవైప్రభుః
భవయం శర్వ మథేశానం తథా పశుపతిం ద్విజ!
భీమ ముగ్రం మహాదేవ మువాచ స పితామహః
చక్రే నామాన్యథైతాని స్థానాన్యేషాం చకార సః
సూర్యో జలం మహీవాయు ర్వహ్ని రాకాశ మేవచ
దీక్షితో బ్రహ్మణ స్సోమ ఇత్యేతా స్తనవః క్రమాత్
సువర్చలా తథైవోషా సుకేశీ చాపరా శివా
స్వాహా దిశా తథా దీక్షా రోహిణీచ యథాక్రమమ్.

కల్పాదియందు బ్రహ్మకుఁ గొడుకు పుట్టి యేడ్చెను. ఏల యేడ్చెదవనఁగా; నా పేరేమి చెప్పుమనెను. బ్రహ్మ నీవు రుద్రుఁడవనెను. మఱల నేడుగా నైయేడ్చెను. అప్పుడు భవ – శర్వ – ఈశాన – పశుపతి – భీమ – ఉగ్ర , మహాదేవ యని వారికిఁ బేర్లు పెట్టెను. ఆ యెనమండ్రను సూర్య – జల – మహీ – వాయు – వహ్ని – ఆకాశ – దీక్షిత బ్రాహ్మణ – సోమ – దేహములిచ్చి సువర్చల – ఉష – సుకేశి – శివ – స్వాహా – దిశ – దీక్ష – రోహిణి యను నెనమండ్ర భార్యలనిచ్చెను. ఇందుఁ జెప్పఁబడిన సువర్చల యీమెయే.

ఈ సందర్భమున నీ శాస్త్రవాక్యములు స్మరణీయములు.

వ్యాసః. కురూపోవా కువృత్తోవా దుస్స్వభావోఽథవా పతిః
రోగాన్వితః పిశాచోవా మద్యపః క్రోధనోపివా
వృద్ధోవాథ విదగ్ధోవా మూకోంధో బధిరోపివా
రౌద్రోవాఽథ దరిద్రోవా కదర్యః కుత్సితోపివా
కాతరః కితవో వాపి లలనా లంపటోపివా
సతతం దేవవత్పూజ్య స్సాధ్వ్యా వాక్కాయకర్మభిః
అహంకారం విహాయాథ కామక్రోధౌచ సర్వదా
మనసో రంజనం పత్యుః కార్య మన్యస్య వర్జనమ్.

కురూపుఁడైనను. దుర్వృత్తి మందున్న వాఁడైనను, చెడుస్వభావము గలవాఁడైనను, రోగియైనను, పిశాచముపట్టినవాఁడైనను, మద్యముత్రాగువాఁడైనను, క్రోధగుణము గలవాఁడయినను, ముసలివాడైనను, వంచకుఁడైనను, మూఁగవాఁడు గ్రుడ్డివాఁడు చెవిటివాఁడైనను, క్రూరుఁడైనను, దరిద్రుఁడైనను, లోభియైనను, కుచ్చితుఁడైనను. పిఱికివాఁడయినను, జూదరియైనను, అన్యస్త్రీకాముకుఁడైనను, పతినిపతివ్రత

యగు స్త్రీ సర్వదా దేవునివలెఁ బ్రదిక్షణములఁ బూజింపవలెను. అతని విషయమున అహంకారము దుష్కామము క్రోధము వదలవలయును. అతని మనస్సు సంతోషపెట్టవలెను. అతఁడు సంతోషింపని తక్కిన కార్యము లన్నియు వదల వలయును.

సీ. బలసూదనునకుఁ బౌలోమి యట్టులు, దమి వసిష్ఠున కరుంధతిని బోలి
నీహారకరునకు రోహిణిరీతిని, జ్యవనర్షికి సుకన్య చందమునను
సత్యవంతునకు సావిత్రిమాడ్కిని, క్షితిఁ గపిలునకు శ్రీమతివిధమునఁ
బ్రిథ నగస్త్యునకు లోపాముద్రచాడ్పున, సగరునకును గేశిని గతిగాఁగ

తే. నల్ల సౌదాసునకు మదయంతికరణి, నలునకును దమయంతియందంబు వెలయ
రఘుకులాధీశ్వరుండైన రామచంద్రవిభునకే నాతని భజించి వెలయుదాన.

తాత్పర్యము.

పాతివ్రత్య మనునది తన కల్పితము గాదనియు సాధ్వాచారపరాయణలైన యుత్తమ స్త్రీలందఱు దాని ననుష్ఠించి యున్నారనియుఁ బూర్వపతివ్రతల నుదాహరించుచున్నది.

బలనిషూదనునకు = ఇంద్రునకు, పౌలోమి = శచీదేవి, నీహారకరునకు = చంద్రునికి, చ్యవనర్షికి = చ్యవనుఁడను మహాఋషికి, సుకన్య, శర్యాతి యను రాజు కూఁతురు. చ్యవనుఁడు గ్రుడ్డివాఁడైనను ఆయన కిచ్చి తండ్రి వివాహము చేయఁగా నాయననే సేవించుచుండెను. చంద్రునకు రోహిణి యనుటచే చంద్రునకుఁ బెక్కురు భార్య లున్నను, చలిచేత వణకించుచున్నను రోహిణి యొకగడియయైన నాయనను విడిచియుండదు. సత్యవంతుఁడు సంవత్సరమునకుఁ జచ్చు నని తెలిసియు సావిత్రి యాయనను వరించి చచ్చిన వానిని బ్రదికించుకొనెను. కపిలునకు = కపిల మహర్షికి - ఈయన యోగమందు సర్వదా యుండినను శ్రీమతి యాయనను విడిచినది కాదు. అగస్త్యుఁడు మహర్షి, దరిద్రుఁడు, లోపాముద్ర రాజుకూఁతురు. అట్లుండియు నాయనను విడువక సేవించెను. సౌదాసునకు = ఈయనకుఁ గల్మాషపాదుఁ డనియుఁ బేరు గలదు. ఈయన వసిష్ఠశాపముచే రాక్షసుఁడై యుండినను ఈయన భార్య యాయనను సేవించుచునే యుండెను. నలునకు దమయంతి. ఈయన చక్రవర్తిగానుండి జూదమందోడి యడవులపాలైనను, దిగంబరుఁడైనను, దన చీరెలో సగము చించి యాయన కిచ్చి యాయన వెంట నడవులలోఁ దిరిగి యష్టకష్టములు పడి తుదకు మగని సంపాదించుకొనెను. ఇందు చంద్రమతి హరిశ్చంద్రుడు చెప్పఁబడలేదు. కారణమేమో. వీరందఱు సీతారాములకుఁ బూర్వులే. ఇచ్చట సూక్ష్మముగ నొక్కొక్క మాటలో చెప్పిన యీ యితిహాసములఁ బెంచి వివరముగ వ్యాసమహర్షి భారతమున రచించెను. ఆ కారణముననే యిరువదినాలుగువేల గ్రంథముగల భారతములక్ష గ్రంథమయ్యెను: ఈ రామాయణమందు నూఱుపాఖ్యానములు సూచింపఁబడినవి, వీనికి వ్యాఖ్యానముగ భారతమునందుఁ గలవు. కావున రామాయణమునకు భారతము

వ్యాఖ్యాన మని యీ వ్యాఖ్యానమున ముందు వ్రాయఁబడెను. ఈ రామాయణ మందుఁ గల విషయములే భారత భాగవతములందుఁ బెంచి వ్రాయఁ బడినవి. ఈ వ్యాఖ్యాతయొక్క యీ యభిప్రాయమును బృహద్ధర్మ పురాణమందలి యీ యనువాదములు బలపఱుచు చున్నవి.

రామాయణం మహాకావ్య మాదౌ వాల్మీకినా కృతమ్
తన్మూలం సర్వకావ్యానా మితిహాస పురాణయోః
సంహితానాంచ సర్వాసాం మూలం రామాయణం మతమ్
తదేవాదర్శ మారాధ్యం వేదవ్యాసో హరేఃకలా
చక్రే మహాభారతాఖ్య మితిహాసం పురాతనమ్
కార్యాకార్య నిర్ణయేత్ర స్మృతిర్వై ధర్మసంహితా
ఇతిహాసాదివాక్యంతు తన్ని దర్శన సాధకమ్.

విధి రువాచ:—

యత్ త్వం వేదార్థవక్తా స్యాః కావ్యరూపేణ సర్వశః
అహం సృష్టికరో బ్రహ్మా తత్ర లీలాకరో హరిః
తద్విర్ణ నస్య కర్తా త్వం సృష్టిరక్షాకరో భవ
లోకానాం ధర్మయేష్టైవ విష్ణోర్లీలా మలాపహా
త్వయా సా వర్ణితా లోకే పరోధర్మ స్థిరో భవేత్
త్వంచ త్రికాలవృత్తిజ్ఞః సత్యవాదీ ప్రతిష్ఠితః
నాహం త్వత్తః పృథక్ భూతః కవి రన్యః ప్రజాపతిః
కవి ర్బ్రహ్మా కవి ర్విష్ణుః కవి రేవ స్వయం శివః
కవిర్వై ధర్మవక్తాచ కవిః సర్వార్థసై కవిత్
త్వంతు రామచరిత్రాణి మునే భావీని వర్ణయ
తత్తు రామాయణం నామ మహాకావ్యం భవిష్యతి
వర్ణ యిష్యసి యద్యత్ త్వం తత్తు విష్ణుః కరిష్యతి
విష్ణోః కీర్త్యా భవత్ కావ్యం స్థాస్య త్యాచంద్రతారకమ్.

దేవ్యువాచ:—

రామాయణం మహాకావ్యం కృతం వాల్మీకినా స్వయమ్
తత్ర రామచరిత్రస్య వ్యపదేశేన సర్వశః
సర్వే ధర్మాః సముద్దిష్టా వర్ణాశ్రమ విభాగశః
నానా దేశ చరిత్రాణి శత్రుమిత్రకథా అపి
ఇతిహాసస్వరూపేణ సర్వేధర్మా నిరూపితాః.

వాల్మీకి రువాచ:—

వేదః పరిణతోభూత్వా మహాభారతతాం గతః

స్త్రీశూద్ర ద్విజబంధూనాం వేదార్థ జ్ఞాన హేతవే
భారతం కృతవాన్ పూర్వం దేవో నారాయణః స్వయమ్
భారతస్య విధానాయ త్వం నారాయణ నిర్మితః
రామాయణాచ్చ విస్తీర్ణం త్వం మహాభారతంకురు
రామాయణ పరిపాట్యా త్వం మహాభారతంకురు
పరమాత్మ స్వరూపస్య సీతారామస్య చేష్టితమ్
వర్ణితం చైకరూపస్య తచ్ఛరీర విశేషవత్
స ఏవ దేవో భగవాన్ కృష్ణః కమలలోచనః
జీవ ద్వితీయ శ్చిక్రీడ భూభారక్షయ హేతవే
జీవాత్మ పరమాత్మానే నరనారాయణౌ విభో
నారాయణో వాసుదేవో నరశ్చైవార్జునాహ్వయః
నరనారాయణమయం తన్మహాభారతం విదుః
ఏకం రామాయణమయం కృతం రామాయణం మయా
రామాయణే భారతేచ విశేషోఽయ ముదాహృతః.

బృహద్ధర్మపురాణమ్.

శ్రీకృష్ణోపి పునర్దేవీ వ్యాసరూపధరో భువి
మానవానాం హితార్థాయ కావ్యాద్రామాయణాత్పునః
భాగా ద్భారత వర్షాంతర్గతాచ్చ వివిధాని హి
పృథక్ పృథక్ సప్తదశ పురాణాని కరిష్యతి
సవ్యాసో భారతాద్యైశ్చ యదా శాంతిం నగచ్ఛతి
అష్టాదశ సహస్రంహి శ్రీమద్భాగవతాభిధమ్
కరిష్య త్యష్టాదశమం రమ్యం జనమనోహరమ్
యత్కించి ద్గిరిజే భూమ్యాం కీర్త్యతే వై కథానకమ్
రామాయణాంశజం విద్ధి శ్లోకమాత్ర మపీహ యత్.

ఆనందరామాయణమ్.

శ్రీమద్రామాయణమునకు భారత భాగవతము లెట్లు వ్యాఖ్యానములో రామాయణములోని 'పరం కవీనా మాధారమ్' భవిష్యత్కవుల కిది యాధారము అను వాక్యమునకు మీఁది యనువాదములు వ్యాఖ్యానములై యున్నవి. వాని సారాంశ మేమన :—

రామాయణము మహాకావ్యము. అది యాదియందు వాల్మీకిచే రచింపఁబడెను. అది సర్వకావ్యములకు నితిహాసపురాణములకు నాదిమూలము. సమస్తసంహితలకు మూలము రామాయణము. దాని నాధారము చేసికొని విష్ణుకలయగు వేదవ్యాసుఁడు మహాభారత మను పురాతనేతిహాసమును రచించెను.

బ్రహ్మవాక్యము. నీవు కావ్యరూపమున వేదార్థవక్త వెట్లయితివో నేనట్లే సృష్టికర్తను. అందు లీలాకరుఁడు విష్ణువు. ఆ విష్ణువుయొక్క లీలలు వర్ణించే సృష్టి రక్షింపుము. ధర్మరూపయగు విష్ణులీల పాపముల హరించును. నీవు దానిని వర్ణించితివేని లోకమున ధర్మము స్థిరపడును. నీవు త్రికాలవేదివి. సత్యవాదివి. నాకంటె నీవు భిన్నుఁడవు కావు. కవి యనఁగా వేఱొక ప్రజాపతియే. కవియె బ్రహ్మ. కవియె విష్ణువు-కవియె శివుఁడు. ధర్మవక్త కవియె. సర్వరసజ్ఞుఁడు కవియె. నీవు రామాయణమును భవిష్యముతోడ వర్ణింపుము. అది మహాకావ్యమగును. నీ వేమి వర్ణించెదవో దానిని విష్ణువు చేయును. విష్ణుకీర్తిగల నీ వాక్యము ఆచంద్రతారకముగ భూమియందు నిలుచును.

దేవీవాక్యము :—

రామాయణ మహాకావ్యము వాల్మీకిచే రచింపఁబడెను. రామచరిత్రమును నెపముగాఁ దీసికొని సమస్త వర్ణాశ్రమ ధర్మములు నానాదేశ చరిత్రములు శత్రు మిత్ర కథలు ఇతిహాస స్వరూపముగ సర్వధర్మములు నిరూపింపఁ బడెను.

వాల్మీకి వాక్యము :—

వేదము పరిణమించి భారతముగ నయ్యెను. స్త్రీలకు శూద్రులకు బ్రహ్మబంధువులకు వేదార్థజ్ఞానముగలుగుటకై (వీరికి వేదము చదువు నధికారము లేమిని) భగవంతుఁడు నారాయణుఁడే పూర్వము భారతమురచించెను. భారతవిధానార్థము నీవు నారాయణునిచే నిర్మింపఁబడితివి. రామాయణమునకంటె విస్తారముగ నీవు భారతమును జేయుము. రామాయణక్రమము ననుసరించి నీవు భారతము చేయుము. పరమాత్మ స్వరూపమైన సీతారామ చేష్టితము ఆయన శరీర విశేషము వలెనే యొక రూపముగ వర్ణింపఁ బడినది. ఆ భగవంతుఁడు కమలలోచనుఁడు, కృష్ణుఁడై భూభారము తీయింపఁజేయ రెండవవాఁడగు జీవునితోఁ గ్రీడించెను. (రెండవవాఁడు జీవుఁడు అర్జునుఁడని యెఱుంగవలెను.) నరనారాయణులు జీవాత్మ పరమాత్మలు. నారాయణుఁడు వాసుదేవుఁడు. నరుఁడు అర్జునుఁడు. ఆ మహాభారతము నరనారాయణమయము, రామాయణము నేకమయముగా నేను జేసితిని. (ఇందు జీవకృత్యముకంటెఁ బరమాత్మకృత్యము విశేష మని భావము.) రామాయణమునకు భారతమునకిది భేదము. రామాయణమందు జీవాత్మను (సీతను) నెపముగా నుంచుకొని సర్వము తానే పరమాత్మ (రామచంద్రమూర్తి) చేసెను. భారతమందు జీవాత్మయగు నర్జునుచే సర్వము చేయించెను ఇది రెంటికి భేదము. వ్యాసరూపము ధరించి శ్రీకృష్ణుఁడను పేరు (కృష్ణశబ్దమునకు వ్యాసులనియు నర్థముగలదు) మానవుల హితముకొఱకు మఱల రామాయణ కావ్యమునకంటె భారముగ భరతవర్షమునఁ బదునేడు పురాణములను భారతమును వేలువేలుగ వ్యాసులు రచించియు శాంతిలేనివాఁడై పదునెనిమిదివేలగ్రంథము గల శ్రీమద్భాగవత మను పేరుగల పదునెనిమిదవ పురాణమును జనమనోహరమై రమ్యమైన దానిని జేయఁగలఁడు.

పార్వతీ! లోకమునఁ గీర్తింపఁబడిన కథయే కొంచెమైనను రామాయణాంశజ మనియే యెఱుంగుము. ఆనంద. రా.

రామాయణమున జీవకృత్యము సీతాదేవి చరిత్రము వలనను పరమాత్మ కృత్యము రాముని చరిత్రము వలనను దెలియనగు. మనము జీవాత్మల (సీతాదేవి) ప్రవర్తనము దెలిసికొని యాప్రకారము నడచి ముక్తులగుట యావశ్యకము. ఆసీతాదేవి చరిత్రము విశేషించి సుందరకాండమునఁ గలదు. ఆ కారణముచేతనే యిది విశేషముగ నాదరణ పాత్రమై సుందరకాండ మను సార్థక నామధేయమువహించి యున్నది.

తాత్పర్యము.

ఇంద్రునకు శచీదేవి, వసిష్ఠున కరుంధతి, చంద్రునకు రోహిణి, చ్యవనునకు సుకన్య, సత్యవంతునకు సావిత్రి, కపిలునకు శ్రీమతి, అగస్త్యునకు లోపాముద్ర, సగరునకుఁ గేశిని, సౌదాసునకు మదయంతి, నలునకు దమయంతి యెట్టులో రామచంద్రమూర్తికి నేనట్టులే, నే నాయన ననుభవించి కృతార్థురాల నగుదును.

క. జానకి యిటు పల్కిన విని, దానవకులనాథచోది◆తలు రాకాసుల్
దీనాత్మను గర్కశవా, చానిష్ఠురబాణనిహతఁ◆ జలిపిరి మిగులన్. ౬౧౩

అర్థములు. చోదితలు = ఆజ్ఞాపింపఁబడినవారు, దీనాత్మను = దుఃఖించుచున్న మనస్సుగలదానిని, కర్కశవాచా = కఠిన వాక్కులనెడు, నిష్ఠురబాణనిహతన్ = కఠినబాణములచేఁ గొట్టఁబడిన దానినిగ, రావణచోదితలు అనునది హేతుగర్భితము.

ఈ స్త్రీలు సీతను బాధించుట కేమి హేతువనిన రావణు నాజ్ఞయేకాని వారికి ద్వేషబుద్ధి గలిగి కాదు. కావుననే సీతాదేవి హనుమంతునితో (యుద్ధ. ౨౬-౨౬) 'నిర్జర విరోధి పనుపున, దర్జించిరి వీర లతని దాసులు గానన్, నిర్జితుఁడౌట దశాస్యుఁడు, తర్జింతురె యింక నన్నుఁ దరుచరవర్యా' యని చెప్పెను.

తాత్పర్యము.

సీతాదేవి యీప్రకారము చెప్పఁగా రావణుచే నాజ్ఞాపింపఁబడిన రాక్షసస్త్రీ లామెను కఠినవాక్కు లను బాణములచే మిగుల నొప్పించిరి.

క. కదలక మెదలక తెలవక, పెదవులు నా శింశుపాఖ్య◆వృక్షస్థితుఁ డై
బెదరించు చుండ రాక్షస, సుదతులు జానకిని వాయు◆సూనుఁడు వినియెన్. ౬౧౪

తాత్పర్యము.

ఇటునటు కదలక కైకుఁయి యనక శింశుపావృక్షమునందుండి జానకిని రాక్షసస్త్రీలు బెదరించు మాటల నెల్ల హనుమంతుఁడు వినెను. రావణుఁడు రాకముందే యామె సీతాదేవి యని హనుమంతుఁడు నిశ్చయించుకొనెను. ఆ నిశ్చయము రావణ సీతావాక్యప్రతివాక్యముల వలన స్థిరపడెను. ఇట్లుండ రావణుఁడు సీతాదేవి నన్ని

దుర్భాషణము లాడుచుండ వానిమీఁద దూఁకి హనుమంతుఁడు నాలుగు గ్రుద్దులు చేతులార గ్రుద్దక యెట్లు విని సహించి యూరకుండెను? ఇది దాసుని లక్షణమా? హనుమంతుఁడు దూతగా వచ్చెను. సుగ్రీవుఁడు సీతాదేవిని జూచి రమ్మనెను. రామచంద్రమూర్తి ముద్రికనిచ్చి దీనిని సీతాదేవి కిచ్చి మాటలాడి రమ్మనెను. ఇది దూత ముఖ్యకృత్యము. దీనిని జేయక క్రోధమునకుఁ బాలుపడి యముఖ్య కార్యమును జేయవచ్చునా? అందు వాఁడు తప్పఁద్రాగి కామవశుఁడై యున్న స్త్రీల నడుమ నున్నవాఁడు. అది యుద్ధసమయముగాదు. వానితో యుద్ధము పెట్టుకొనఁగానే రాక్షసులతో యుద్ధముతోనే సరిపోవునుగాని వచ్చినకార్యమున కెడము లేక పోవును. అందఱకంటె ముందు సీతాదేవి బెదరును. గావునఁ గార్యక్రమ మదిగాదు. వచ్చిన పనియైన యెడల యుద్ధ మెప్పుడైనఁ జేయవచ్చును. ఇవన్ని యాలోచించి హనుమంతుఁ డోర్పుగలిగిన వాఁడయ్యెను.

—♦ రాక్షస స్త్రీలు సీతాదేవిని గఱకు లాడుట ♦—

క. అంతట నందఱు రాక్షస, కాంతలు చుట్టుకొని రాము♦కామిని భీత
స్వాంతమున వణఁకఁ గోపా, క్రాంతత నిట్లనిరి వాతె♦ఱల్ చలియింపన్. ౬౧౫

అర్థములు. భీతస్వాంతమునన్=భయపడిన మనస్సుతో, కోపాక్రాంతతన్=కోపముచే నాక్రమింపఁబడుటచేత, వాతెఱల్=పెదవులు, వా+తెఱ=వాతెఱ, పండ్లకు తెఱవంటిది.

తాత్పర్యము.

సీతాదేవి యిట్లు చెప్పిన తరువాత రాక్షసస్త్రీలందఱు భయముచే వణఁకు నామెను జుట్టుకొని పెదవులు కోపముచేఁ గదలుచుండ నిట్లనిరి.

క. గొడ్డండ్లఁ ద్రిప్పుచును వఱ, గొడ్డంబులు పలుకుచుం ద్ర♦కోపంబునఁ బై
పడ్డగతి నీ వకే మా, ఱొడ్డెదు నీ వేల యొల్ల♦వో రావణునిన్. ౬౧౬

అర్థములు. వఱగొడ్డంబులు=వంకరమాటలు, "బిడ్డలకు బుద్ధిసెప్పని, గ్రుడ్డికి బిండంబు వండికొని పొండిదె పైఁబడ్డాడని భీముం డొఱగొడ్డములను" భాగ. ౧ స్క-౧. పాఠము సరిగాదు. "భీముఁడు వఱగొడ్డము లాడంగ నెట్లు గుడిచెద వధిపా" యనునది సాధుపాఠము.

తాత్పర్యము.

గొడ్డండ్లు ద్రిప్పుచు వక్రభాషణము లాడుచు మిగులఁ గోపంబునఁ బైపడు నట్లు వచ్చి నీవకే మమ్ము రావణునిఁగూడ యెదిరించి మాటలాడెదవు. ఏల నీవు రావణు నొల్లవే. వాఁడు మగవాఁడు కాఁడాయేమి?

క. అను డా బిభీషికోక్తుల, విని జానకి శోక బాష్ప♦వృష్టి కురియఁగాఁ
జనె నల్లశింశుపాద్రుమ, మున చాటునకున్ భయంబు♦ముంచుకొనంగన్. ౬౧౭

అర్థములు. బిభీషికోక్తులు = బెదరింపుమాటలు.

తా త్ప ర్య ము .

ఈ ప్రకారము చెప్పుచున్నవారి బెదరింపుమాటలు విని శోకమునఁ గన్నీళ్లు వర్షింపఁగా భయపడి లేచి శింశుపావృక్షముచాటునకుఁ బోయెను.

ఆ. బొజ్జ వ్రేలుపొట్ట ♦ యెఱ్ఱనికన్నులు, బుఱ్ఱముక్కు గలిగి ♦ చిట్టు చిట్టు
లాడుకొనుచు వచ్చి ♦ యాడె జానకితోడ, వినత యనెడు నొక్క ♦ వికటరూప.

తా త్ప ర్య ము .

సులభము.

క. పతిపై నెయ్యము మేల్మేల్, సతి! కనబఱిచితివి నీవు ♦ చక్కఁగ నైనన్
మితి మీఱిన నెది యేనియు, నతివా! కీడునకు మూల ♦ మగు నన వినవే ?

అర్థములు. నెయ్యము = స్నేహము,

తా త్ప ర్య ము .

నీవు నీ మగనిపై స్నేహము చక్కఁగఁ గనఁబఱిచితివి. మేలు మేలు. మెచ్చుకొంటినిగాని 'అతి సర్వత్ర వర్జయేత్.' ఏదైనను మితిమించరాదు. మగని మీఁదనైనను ఎంతప్రేమ యుంచవలయునో యంతే యుంచవలయును. ఎక్కువగా నుంచరాదు. మితిమించిన దేదైనను గీడునకుఁ గారణమగును.

సీ. మనుజాంగనకుఁ దగు ♦ మగనాలితనమును, మెలఁత చెప్పితి లెస్స ♦ మెచ్చువచ్చె
నయిన నా చెప్పెడి ♦ యత్యంతపథ్య మా, మాటలఁ జెవి నిడు ♦ మందయాన
సురనాయకుం డైన ♦ హరిహయునట్టులు, వరవిక్రముఁడు రూప ♦ వంతుఁ డైన
నిఖల రాక్షసభర్త ♦ నీ ప్రియభర్తగాఁ, గొనుము నా మాటను ♦ వినియుఁజూడు

తే. మీఁగి గలవాఁడు కలవాఁడు ♦ భోగపరుఁడు
దక్షిణుండు జనప్రియ ♦ దర్శనుండు
రావణుఁడు నీకుఁదగినట్టి ♦ ప్రాణవిభుఁడు
కృపణుఁ డగు రామునకు నేల ♦ యేడ్చె దిట్లు ? ౬౨౦

అర్థములు. మగనాలితనమును = పాతివ్రత్యమును, అత్యంత పథ్యము = మిక్కిలి మేలిచ్చునది, దక్షిణుఁడు = చక్కని మనస్సుగలవాఁడు, నేర్పరి.

తా త్ప ర్య ము .

మనుష్యస్త్రీలకుఁ దగిన పాతివ్రత్యము గుఱించి చెప్పితివి. బాగుగ నేయున్నది. అయినను అంతకంటె మేలైనది యొకమాట చెప్పెదను వినుము. దేవతాప్రభువైన యింద్రునివలె మిగులఁ బరాక్రమము గలవాఁడు, సుందరుఁడు అయిన రావణునినీవు భర్తగాఁగొనుము. ఒకపూఁట నామాట విని చూడు. ఆవల నీకు నిష్టము లేకున్నను కష్టముతోఁ జిననువదలిపెట్టుము. రావణుఁడుమహోదాత, భోగమందాసక్తిగలవాఁడు, నేర్పరి. ఎందఱ భార్యలనైన సంతోషపెట్టఁ గలవాఁడు, చూచుటకుఁ బ్రియమైన

ఆకారముగలవాఁడు. ఇట్టి రావణుఁడుకదా నీకుఁ దగినమగఁడు. దరిద్రుని రాముని గట్టుకొని యేల యేడ్చెదవే.

ఉ. ఘుమ్మను నంగరాగములు ♦ కాంచనరత్నసమంచితంబు లౌ
సొమ్ములు లెస్స మైఁ దొడిగి ♦ సుందరి! యీత్రుటినుండి యెల్లలో
కమ్ముల నేలుమీ, విబుధ♦కాంతునకుఁ శచి, స్వాహ యగ్నికిన్
సమ్మతి నిష్టురాం డ్రయిన♦చాడ్పున నీ వగుమీ సురారికిన్.  ౫౨౧

అర్థములు. అంగరాగములు = వాసన పదార్థములు; పూసికొని, మైన్ - దేహమునందు.

తా త్ప ర్య ము.

ఘుమఘుమ వాసనగొట్టు గంధములలోనైనవి పూసికొని బంగారురత్నములచేఁ బ్రకాశించుసొమ్ములు పెట్టుకొనియీక్షణమునుండిలోకముల నెల్లఁ బాలింపుము. ఇంద్రునకు శచి, అగ్నికి స్వాహాదేవి యిష్టురాండ్రయినట్టు నీవు రావణాసురునకుఁ బ్రియురాలవు కమ్ము.

ఉ. ఏటికి రాముఁ గట్టుకొని ♦ యేడ్చెద వా కృపణుం గతాయుషున్
గూటికి లేనివాని మదిఁ ♦ గూర్చెదు, విమ్ము మదీయవాక్యముల్
పాటిగ నెంచి మా పనుచు♦భంగి నొనర్పక మాఱు పల్కని
న్నూటికి గండకండగను ♦ గోసి భుజింతుము వ్యంజనంబుగన్.  ౫౨౨

అర్థములు. గతాయుషున్ = క్షీణించిన యాయుస్సుగలవానిని.

తా త్ప ర్య ము.

సీతా, యేమిటికే రాముఁడు రాముఁడని యొకలోభిని, అల్పాయువుగలవానిని, దినఁగూడు కట్టబట్ట లేనివానిని కట్టుకొని యేడ్చెదవు. అటువంటివానిమీఁద నీ కేటికే ప్రేమ. నామాటలువిను. మేము చెప్పినట్లు చేయక ధిక్కరించితివా, నిన్ను ముక్కలు ముక్కలుగా నతికి వ్యంజనముగా భుజింతుము తెలిసినదా?

తే. అంతటను వ్రేలుచన్నుల♦యసుర పేర, వికట వికటాట్టహాసంబు♦ప్రకటితముగ
ముష్టి పైకెత్తి చూపుచు ♦ ముగ్ధసీత, ప్రక్కఁ గనుఁగొని యిట్లనుఁ♦బరుష భంగి.

అర్థములు. వికటాట్టహాసంబు = భయంకరమైన నవ్వు.

తా త్ప ర్య ము. స్పష్టము

ఉ. ఓసి దురాత్మురాల! కఠి♦నోక్తులు పెక్కులు పల్క రాక్షసా
గ్రేసరు నయ్యొ పాప మని ♦ కేవలముం మృదుకాయ వౌటచే
నోసము మూసి పెందయను ♦ క్రూరత నిన్ను వధింపఁ డాతఁడో
యోమ్నసుత! కాలయోగ్య మగు ♦ మా పలుకుల్ గణియింప వైతిగా.  ౫౨౪

తా త్ప ర్య ము.

ఓసి దుర్బుద్ధీ! మా రాక్షస రాజును నీ వెన్నిమాట లంటివే. అంతక్రూర

నముగా నీవు మాటలాడినను నీయందు దయగలవాఁడై నీవు సుకుమారివౌటచేఁ గోపింపక నిన్నుఁ జంపలేదు. దేశము కాలము నాలోచించి మేము చెప్పుచున్న మాటలు వినవుకదా.

ఉ. ఏరికిఁ దేటి చూడఁగ మృగేక్షణ! శక్యము గాని యీ యకూ
పారము తీరమం దసుర♦వల్లభు నంతిపురంబులోన దు
ర్వారత మేము గావ దృఢ♦పంజరమందలి చిల్కయట్లు లై
చేరితి వల్ల యింద్రుఁడును ♦ జేరఁగ నేర్చునె నిన్నుఁ గావఁగన్. ౬౨౫

తాత్పర్యము.

రాముఁడు వచ్చును. నిన్నుఁ దోడుకొని పోవు ననెదవే. అదెట్లులే వచ్చును. మొట్టమొదట నా యొద్దున నుండువారికి సముద్రతీరమునుండు నీ లంకయె కానరాదు. ఒకవేళ సముద్రము దాఁటి వచ్చెననుకో, రావణాసురుని యంతఃపురములో నుండు నిన్నుఁ దెలిసికొననేలేఁడు. ఒకవేళ నీవిచ్చట నున్నావని వినినను మేము ఇందఱము కావలియుండఁగా మమ్ముఁ గాదని యెట్లు తీసికొని పోఁగలఁడే. పంజరములోఁ జిలుకవలెఁ జిక్కితివే. ఆ యింద్రుఁడైన నిన్ను రక్షించుటకు దగ్గఱకైన రాఁగలఁడా?

చ. వలవనిమాట లాడ, హిత♦వాదిని నేను, మదీయవాక్యముల్
చెలువలొ వీనులం జొనుపు ♦ చెక్కులఁ గన్నులనీరు గాఱఁగా
వలవల యేల యేడ్చెద, వ♦వశ్యము శోక మనర్థకంబెకా
వెలఁది! దశాస్యుతోడఁ గడు♦వేడుకలర్ విహరింపు మర్మిలిన్. ౬౨౬

తాత్పర్యము.

సీతా! నే నెంతమాట పనికి కావలయునో యంతేమాట లాడుదును. వ్యర్థముగా మాటలాడలేను. నేను నీకు హితమే చెప్పుదును. అహితము చెప్పను. తెలిసినదా నే నందఱవంటి దానఁగాను. నా మాటలు నీ చెవిలోకిఁ బోనిమ్ము. చెక్కిళ్ళ వెంబడి కన్నీరు గాఱునట్టు లేల వలవల యేడ్చెదవు. శోకము వలనఁ గీడేకాని మేలులేదు. కాఁబట్టి ప్రేమగలదానవై రావణుతోఁ గ్రీడింపుము.

ఉ. ప్రాయము శాశ్వతం బటవె ♦ భామల, కియ్యది నీ వెఱుంగవా,
తోయజనేత్ర! జవ్వనము ♦ దూలక మున్న నితాంతకాంతసా
ఖ్యాయతి నొందఁ జూడుము వ♦నాంతరవీథులఁ గేళికాద్రులర్
జే యని భోగముల్ గుడువఁ ♦ జేఁ దలె యీ యమరారినేతతోన్. ౬౨౭

తాత్పర్యము.

ఏమే సీతా! నీకీ వయస్సు ఇట్టులే శాశ్వతముగా నుండుననితలఁచితివా? ఇంతమాత్రము నీకుఁ దెలియదా? వెన్నెలయున్నప్పుడేకదే మేమ్ అల్లోనేరేళ్లు, ఆవల

రమ్మనిన వచ్చునా? కాఁబట్టి యౌవనము పోకముందే మిక్కిలి మనోహరమైన విస్తారసౌఖ్యము నీ వనుభవింప యత్నింపుము. ఆటపాటలయందు జేయని రావణుని తోడఁ గ్రీడించుట నీ కేమి చేదా? చేదు మేసెదవు కాఁబోలు. మమ్ముఁ గోరు వాఁడు లేఁడుకాని మేమైననా జమ్మని విహరింపమా?

క. సుందరి! బృందారకపర, బృందారకు భర్తగాఁగ ♦ నేలిన నిన్నుం
గ్రందుగ సప్తసహస్రము, లిందీవరలోచనాళు♦లెలిమి భజించున్. ౬౨౮

అర్థములు. బృందారకపర = దేవవిరోధు లగు రాక్షసులందు, బృందారకుని = శ్రేష్ఠుని. పుమాన్ బృందారకో దేవే తేషు శ్రేష్ఠమనోజ్ఞయోః॥ నానా॥ర. సప్త సహస్రములు = ఏడువేలమంది.

తాత్పర్యము.

సుందరీ, రాక్షసశ్రేష్ఠుఁడైన రావణుని భర్తగాఁ గొనితివి అని యొక్క మాట యనుము. ఇప్పుడే నిన్ను నేడువేలమంది స్త్రీలు వచ్చి పరిచరింతురో లేదో నా మాట చూడుము.

క. సమ్మతి గొన కీ మా వాక్యమ్ముఁ దిరస్కృతి యొనర్పఁ♦గాఁ జూచిన నీ
ఱొమ్ముఁ బగిల్చియు వెస న, స్రమ్మను గ్రోలెదము వింత♦చవు లూరంగన్.

అర్థములు. అస్రము = నెత్తురు, తిరస్కృతి = ధిక్కారము.

తాత్పర్యము.

మేము చెప్పిన యీ మాటలకును సమ్మతింపక తిరుగుపాటు చేసెదవా, యిదిగోఁ జూడు, నీ ఱొమ్ములు చీల్చి క్రొత్తరుచి పుట్టుచుండ నీ నెత్తురు ద్రావెదము.

క. చండోదరి యను రక్కసి, చండతరక్రోధమునను♦సాధ్వసకర మా
దండి త్రిశూలముఁ ద్రిప్పుచు, గండున నిట్లనియె జనక♦కన్యామణికిన్. ౬౩౦

అర్థములు. చండతర క్రోధమునను = మిగుల భయంకరమైన కోపముతో, సాధ్వసకరము = భయంకరము.

తాత్పర్యము.

చండోదరి యను రాక్షసి మిగులఁ గోపించినదై భయంకరముగాఁ ద్రిశూలముఁ ద్రిప్పుచు గర్వమున సీతతో నిట్లనెను.

క. త్రాసోత్కంపిపయోధర, నీ సుందరి భీతవన్య♦మృగనేత్ర స్వరా
వాసారిహృతను జూడఁగ, వాసిగ నా నోర నీళ్లు♦వారక యూరెన్. ౬౩౧

అర్థములు. త్రాసోత్కంపి పయోధర = భయముచే మిగుల వణఁకుచున్న చన్నులుగలది. భీతవన్య మృగనేత్ర = భయపడిన యడవిజింక కన్నులు గలది. స్వర్ + ఆవాస + అరి + హృతను = దేవవిరోధి యగు రావణాసురుచే నపహరింపఁబడిన దానిని.

తా త్ప ర్య ము.

భయముచేత వణఁకుచున్న చన్నులు గల యీ సుందరిని బెదరిన యడవి జింక కన్నులవంటి కన్నులుగలదానిని జూడఁగా నెప్పుడెప్పుడు వాత వేసికొందునా యని నా నోర నీళ్ళూరక యూరుచున్నవి.

తే. ఎప్పుడో కదె సీత య♦కృత్తు ప్లీహ, మెదను గల్గిన యుత్పీడ ♦ మిష్టముగను
జప్పరించుచు బంధన♦ మొప్పమీఱ, మెదడునరములు తనివార♦ మెసవు టొదవు.

అర్థములు. యకృత్తు=కడుపులో నీఁటి త్రిక్రింద కుడివైపున నుండెడి మాంసవిశేషము, కారిజముఁ (Liver) ప్లీహము=హృదయముఁన (కడుపులో) నెడమ ప్రక్క నుండెడి మాంసవిశేషము. (Spleen) గుల్మము. ఎదను=హృదయ కోశమును, (Heart) ఉత్పీడము=ప్లీహమునకుఁ బైనున్న మాంసఖండము. బంధనముఁ=ఈ మాంసపుఁ గట్లను.

తా త్ప ర్య ము.

అక్కా, వికటా! నే నెప్పుడే యీ సీత యకృత్తును ప్లీహమును హృదయమునఁగల యుత్పీడమును జప్పరించుచు మెదడు నరములు తృప్తిదీర తిందునే.

ఉ. అంతట నిట్లు పల్కెఁ బ్రఘు♦సాఖ్య యిదేటికె యింతరచ్చ? యీ
కాంత గళంబును న్నులిమి ♦ గ్రక్కున నల్లమనుష్యకాంత దా
నంతము నొందె నంచును ద♦శాననుతోఁ జని చెప్ప జేఁడు ని
శ్చింతతఁ దిండు పొం డనును ♦ సిద్ధము దీనికి నాల మేటికిఁ. ౬౩౩

అర్థములు. గళంబు=మెడ; నులిమి=నలిపి: ఆలము=ఉపేక్ష; తాఁ=తానే.

తా త్ప ర్య ము.

అప్పుడు ప్రఘున యను రాక్షసి యిట్లనెను. ఏమిటికే యీరచ్చ? నే నొక యుపాయముచెప్పెద. వినుఁడు. ఈ సీత గొంతు నులుముదము. చచ్చును. అంతట మనము రావణునొద్దకుఁబోయి మనుష్యస్త్రీ తానే చచ్చెనదని చెప్పుదము. తిను పొండనును. దీనికేల యుపేక్ష?

చ. గల గల వాదు లాడుటయె ♦ కార్యముచొప్పుఁ దలంప రెవ్వరుఁ
బలుకులతోడ నేమిపని ♦ భామిని నంజుడు నెల్లవారముఁ
వలనుగఁ బంచుకోఁ దగును ♦ వారుణి, నంజుకొనంగ నూరుఁగా
యలు గొని రండు మీదగు ♦ రయంబును జూతము గాక యిప్పుడుఁ. ౬౩౪

తా త్ప ర్య ము.

అంతట నజాముఖి యిట్లనెను. కుండలో గచ్చకాయలు పోసి యాడించినట్లు గలగలమని యందఱు వాదులాడువారేకాని యేపని యెట్లు చేయవలయునా యను జ్ఞానమొక్కరికిని లేదు. ఉత్తమాటలతో నేమిపని యగును. ఈసీత మాంసమునుమన మందఱము పంచుకొని సారాయములో నద్దుకొని లొట్టలువేయుచుఁ దిందముగాని

యేదీ, దీనిలోనికి నూరుఁగాయలు దీసికొని రాపొండు, చూతము. ఎవరు వేగిరము పోయి వచ్చెదరో చూడవలె!

క. అనుచు నజాముఖి పలికిన, విని శూర్పణఖాసమాఖ్య ♦ వినిచె యథార్థం
బనియె నజాముఖి, కల్లును, గొనిరండీ యదియ యన్ని ♦ కొదవలు దీర్చున్. ౬౩౫

తా త్ప ర్య ము.

అప్పుడు శూర్పణఖ యనునది యిట్లనెను. అజాముఖి సత్యము చెప్పెను. కల్లును దీసికొని వచ్చితిరా మనకొదవ లన్ని తీరిపోవును.

క. మానుష మాంసంబును స,మ్మానముగ నంజికొనుచు ♦ మఱి సురలోనన్
జానుగ నికుంభిలను గే,ళీనిరతిం దేల వచ్చు ♦ లీలం బాళిన్. ౬౩౬

అర్థములు. నికుంభిల=ఇది లంకకుఁ బడమటివైపున నుండిన గ్రామశక్తి, భద్రకాళి. ఈ నికుంభిల యిప్పటికి నున్నది.

తా త్ప ర్య ము.

మనుష్యస్త్రీ మాంసమును కల్లులో నద్దుకొని నికుంభిల దేవాలయమందు మన యిష్టము వచ్చినట్టు గంతులు పెట్టవచ్చును.

క. ఈ రీతి నసురకాంతలు, దారుణముగ బెడిదములను ♦ దర్జించిన నా
శ్రీరాముదేవి విని వెఱ, హా రామా! యనుచు నేడ్చె ♦ నంగిలియెండన్! ౬౩౭

తా త్ప ర్య ము.

ఈ విధముగా రాక్షసస్త్రీలు బెదరింపు మాటలాడఁగా శ్రీ సీతాదేవి రామాయని యంగిలియెండ నేడ్చెను. లంకలో సీతాదేవి రాక్షసస్త్రీలచేఁబడు బాధల వంటివే, దేహమునందలి బద్ధజీవుఁడు సంసారమునఁబడి యింద్రియాదులచేఁ బడు బాధలు. అయినను రావణుఁడుగాని రాక్షసస్త్రీలుగాని సీతాదేవిని బెదరించిరేగాని చంపఁజాలినవారుగారు. కావున జీవాత్మ నేవియుఁ జంపఁజాలవు. బాధింపనుమాత్రము బాధించును. సీతాదేవివలె బద్ధజీవులును ప్రారబ్ధవిశేష మని దృఢచిత్తముతో భగవంతుఁడు రక్షకుఁడని మహా విశ్వాసము కలిగియుండవలెను. సీతాదేవి యింద్రియములకు వశపడలేదని మహావిశ్వాసము కల దని మీఁద దృఢపడెను. తరువాత జీవుఁడు చేయవలసిన భగవద్ధ్యాన మిఁక సీతావిలాపరూపమునఁ జెప్పఁబడును.

—♦ ౨౫-వ సర్గము. రాక్షసస్త్రీలమాటలకు భయపడి సీతాదేవి యేడ్చుట. ♦—

ఉ. అండజయాన యిట్లు బహు ♦ శార్తి శ్రమంపడు చాసురాంగనా
దండముతోడ నిట్లు లనుఁ ♦ దథ్యము మీ పలు కాదరింప, నన్
దిండు యథేష్టవృత్తి, నగు ♦ నే యసురాధము లేడ? మర్త్యవే
తండసుయాన లేడఁ? గల ♦ దా విపరీతపుపొత్తు ధాత్రిలోన్? ౬౩౮

అర్థములు. అండజయాన=హంసల నడకవంటి నడకగలది, "అండజయాన నీ వొసఁగు నట్టి సపర్యలు వచ్చె" నని మనుచరిత్ర.

తా త్ప ర్య ము .

సీతాదేవి యీ విధమున మిగుల దుఃఖపడుచు నా రాక్షస స్త్రీలతోడ నిట్టు లనియె. ఓ రాక్షసాంగనలారా! సత్యముగా మీ మాట నేను వినను. మీరు చెప్పి నట్లు నేను జేయను. అయిన నన్నుం దినెదమందురా? మీ యిష్టప్రకారము తినుఁడు. నేను వలదనను. మీ రాలోచనలేక చెప్పుచున్నారు. నీచరాక్షసు లేడ? మనుష్య స్త్రీ లేడ? ఇటువంటి విపరీతపుఁ బొత్తు భూమిలోఁ గలదా?

రాక్షసస్థానమునఁ బ్రకృతిని, మర్త్యస్త్రీస్థానమున జీవాత్మను గ్రహింపవలెను. మనుష్యులకు మనుష్యభక్షకు లగు రాక్షసులకు విజాతీయభేద మున్నట్లు కేవల మచేతన మైన దేహమునకుఁ గేవలచేతన మగు నాత్మకు దారతమ్యము గల దని గ్రహింపవలెను. విషమాలంకారము. అనురూపము కాని వాని చేరిక చెప్పిన విష మాలంకారము.

క. అని రాకాసులలో మహి, తనయామణి చిక్కి వణఁకు ♦ దనలోఁ గ్రుంగుచుఁ
వని మందనుండి చెదరినఁ, బెనుఁ దోడేలు పట్టుకొన్న ♦ విడి హరిణి యనన్. ౬౩

తా త్ప ర్య ము .

మందనుండి చెదరి యొంటరిగాఁ దోడేలునకుఁ జిక్కిన యొంటి జింకవలె సీతా దేవి తన వారి నందఱ విడచి రాక్షసస్త్రీలలోఁ జిక్కుకొని వణఁకుచుండెను.

ఇచ్చటఁ దనవారు శుద్ధాత్ములు. అశుద్ధాత్మ ప్రకృతికి వశపడుటే జింక తోడేలికిఁ జిక్కుట.

తే. ఇంబు జాఱఁగఁ బుష్పక♦దంబభార, లంబమానసుశాఖకాలంబ యగుచుఁ
గంబుకంధర తనదు మ♦నంబునందుఁ నంబుజాక్షుని బతిని దుః♦ఖంబు గదుర. ౬౪

అర్థములు. ఇంబు = మనోజ్ఞత, ఇంపు; పుష్పకదంబ = పూలసమూహము యొక్క, భార = బరువుచే, లంబమాన = వంగి వ్రేలుచున్న, సుశాఖకాలంబ = కొమ్మను పట్టుకొన్నది, కంబుకంధర = శంఖమువంటి మెడ గలది.

తా త్ప ర్య ము .

తన మనోజ్ఞత్వము పోవునట్లు పూలగుంపుల బరువుచే వంగిన కొమ్మను బట్టు కొని సీతాదేవి తన మనస్సులోఁ దన భర్తను దలఁచి శోకంబుతో.

క. కనుదోయి నీటివాఁకను, జనుదోయిని దడుపుకొనుచు ♦ స్మరియించుచు లో
దనుజాంగనలకు వెఱచుచు. ఘనవాతోచ్చలితకదళి♦కరణిన్ వణఁకెన్. ౬౫

అర్థములు. ఘనవాత = గొప్పగాలికి, ఉచ్చలిత = మిక్కిలి కదలుచున్న, కదళికరణిన్ = అరఁటిచెట్టువలె.

తా త్ప ర్య ము .

కన్నీళ్ళచే స్తనములను దడుపుచు భర్తను లోపల స్మరించుచు రాక్షసస్త్రీ లే వేళ కేమి చేయుదురో యని భయపడుచుఁ బెనుగాలికి నరఁటిచెట్టువలె వణఁకెను.

చ. గడగడ లాడు నా కలువ♦కంటి విశాలము దీర్ఘమైన పెన్
జడ యిటు నట్టుఁ బొర్లుచు మ♦నంబునకుం దలఁపించె సర్పముల్;
బడఁతుక రామ! లక్ష్మణ! కృ♦పారత! యత్తరో కోసలాత్మజా!
చెడితిని హా సుమిత్ర! కృప ♦ సేయరుగా యొకరైన నా దెసన్. ౬౪౨

తాత్పర్యము.

గడగడ వణకుచున్న యాకలువలవంటి కన్నులుగల సీతాదేవియొక్క విశాలము, నిడివిగల పెద్దజడ సీతాదేవి నిలువఁబడి యుండుటచే నీ భుజము మీఁదికి నా భుజము మీఁదికిఁ బొర్లుచుఁ బెద్ద సర్పమును స్మరణమునకుఁ దెచ్చుచుండెను. ఆమెయును! రామ! లక్ష్మణ! దయగల యత్తా, కౌసల్యాదేవీ! హా సుమిత్రా! చెడితిని. ఒకరైన నాయందు దయ దలఁపరు గదా!

దీనివలన సోపాధి బాంధవు లెవ్వరు నెంత యాప్తులైనను నాత్మ నుద్ధారము చేయ లేరని సూచన. స్మృతిమ దలంకారము.

ఉ. తాలిమి వీడ, రాక్షసుల ♦ తర్జనముల్ గడుగోడు గూర్ప, నా
యేలినవానిఁ బాసి త్రుటి♦యేనియు జీవముతోడ నుండుటన్
గాలముకాని కాలమునఁ ♦ గల్గదు మృత్యువు పూరుషాళికిన్
గోలల కన్న సూరిపలు♦కుల్ కడునిక్కము హో తలంపఁగన్. ౬౪౩

అర్థములు. తాలిమి = ఓర్పు, ఏలినవానిన్ = ప్రాణేశ్వరుని, భర్తను, త్రుటి = అల్పకాలమున, కాలముకాని కాలమునన్ = అకాలమున, గోలలకు = స్త్రీలకు, సూరి = పండితులయొక్క.

తాత్పర్యము.

ఓర్పు సమసెను. రాక్షసుల బెదరింపులు బాధింప సాగెను. నా భర్తను బాసి యుండుట గలిగెను. ఈ మూఁడు కారణములచేఁ బ్రాణ మెపుడో పోవలసినదే, పోకయున్నది. దీనివలన స్త్రీకిఁగాని, పురుషునకుఁగాని యకాలమున మృత్యువు రాదని చెప్పునట్టి పండితుల మాట సత్యమే కదా. అటు గాకున్న నా దేహమున జీవములు నిల్వఁగారణ మేమి గలదు?

క. కొఱనోము నోఁచి పున్నెము, గఱగొఱ యగు నేను సుడియు ♦ గాలికి జలధిన్
జిఱజిఱను దిరిగి మునిఁగెడి,విఱిగిన కల మనఁగఁ జెడుదు♦విభురహితవలెన్. ౬౪౪

అర్థములు. కొఱనోము = పూర్ణముకాని వ్రతము, ఉద్యాపనము వఱకుఁ జేయక విడిచినది, గఱగొఱ = తక్కువ, విఱిగిన = పగిలిన, విభురహితవలెన్ = భర్త లేని దానివలె.

తాత్పర్యము.

ఏదియో గొప్ప నోము సలుపఁబూని సాంతముగ నెఱవేర్పనైతిని. ఆకారణముచే నా నోముఫలము నాకు లేదాయెను. ఆకారణముచే నాకు భర్తయుండియు

లేనిదాననై నడిసముద్రమున సుడిగాలికి గిఱగిఱ దిరిగి విఱిగిన యోడవలె నాపత్సముద్రమున మునుఁగుచున్నాను. నా నోము సాంతమైయుండిన యెడల నా పుణ్యఫలమే నా భర్తచే నన్ను రక్షింపఁజేసి యుండును.

దీని వలన స్త్రీల పాతివ్రత్యము, నోముల ఫలము, వారి భర్తల మూలమున వారిని రక్షించుచున్న దనియు; అట్టిఫలము లేనియెడల భర్తలుండినను రక్షింపఁజాల రనియు నేర్పడుచున్నది. దీనిని బట్టియే యాఁడుదాని దదృష్టమని నానుడి యేర్ప డెను. ఆఁడుది నిర్భాగ్యురా లగునేని మగవాఁ డెంత పుణ్యుఁడు, సమర్థుఁ డైనను దానికి సుఖము లేదు.

లోకమునఁ గొందఱు దరిద్రులుగను, కొందఱు భాగ్యవంతులుగను, కొందఱు దుఃఖులుగను, గొందఱు సుఖులుగ నున్నారు. ఈ భేదమునకు వారు వారు చేసిన పుణ్యవిశేషమే కారణము. వారివారి పుణ్యమునకుఁ దగినట్టు భగవంతుఁ డేదేని నెపము వెట్టి యిచ్చుచుండును. పుణ్యము లేనివారికి ఫలము లేదు. వారు వారు బాగుండుటకుఁ, జెడుటకు వారివారి కర్మమే కారణము.

ఉ. ఆ రఘురాముఁ బ్రాణవిభు ♦ నాదట నేఁ గనుగొంట లేకయుఁ
  గ్రూరపలాశినీవశముఁ ♦ గూరి మహావ్యథ నుక్కఁ గంటి, దు
  ర్వారరయోద్ధతం బయిన ♦ వాహినిచేతను నుర్లు వాహినీ
  తీరమునట్టులే మనుచుఁ ♦ దేఁకువ నుండుదు జీవయుక్తనై. ౬౮౫

అర్థములు. ఆదటన్=ప్రేమముతో, క్రూరపలాశినీ వశము=దయలేని రాక్షసస్త్రీల యధీనము, దుర్వార రయోద్ధతంబు=వారింపరాని వేగముచే నతిశయించినది, వాహిని=ఏఱు, తేఁకువన్=ధైర్యముతో.

తాత్పర్యము.

నా ప్రియవల్లభుఁడైన శ్రీ రామచంద్రమూర్తి దర్శనము లేకుండుట యటుండ దయలేని రాక్షసస్త్రీలకు వశపడి మిగుల బాధపడవలసివచ్చెను. మహా వేగమున బ్రవహించు నదీవేగమునకుఁ దెగి పడెడి యొడ్డులవలె నేను మరణింపక యేమి ధైర్యముతోఁ బ్రాణము ధరించి యుందును.

భగవత్ప్రాప్తి లేకుండిన మానునుగాక, బాధయైన లేకుండినఁ జాలుననిన నట్లుగాక బాధయు సహింపరాకయున్నది. దీనివలన భగవత్సాక్షాత్కార మగు వఱకు సంసార బాధ తొలఁగదని యేర్పడుచున్నది. ప్రకృతి బంధము మనప్రయత్న ముచేఁ దొలఁగునదికాదు. భగవదనుగ్రహమువలననే తొలఁగవలెను.

క. మాన్యునిఁ గృతజ్ఞు నుతసౌ,జన్యునిఁ గమలాక్షు సింహ♦సమగతిఁ గృతిమూ
  ర్ధన్యుని నా ప్రాణవిభున్, ధన్యులువోఁ గన్నులార ♦ దర్శించు జనుల్. ౬౮౬

అర్థములు. మాన్యుని=పూజింపఁ దగినవానిని, కృతజ్ఞున్=చేసినమేలు మఱవనివానిని, నుతసౌజన్యుని=స్తోత్రముచేయఁబడిన సాధుత్వముగలవానిని. ఈ

మూం డాత్మగుణములు. కమలాక్షుర్ =కమలములవంటి కన్నులుగలవానిని, సింహ సమగతిర్ =సింహము నడకతో సమానమైన నడకగలవానిని, కృతిమూర్ధన్యునిర్ = పుణ్యకార్యములు చేసినవారిలో శ్రేష్ఠుం డగువానిని, ధన్యులు=కృతకృత్యులు, హో =నిజము, నాప్రాణవిభుని పుణ్యాత్ములందఱు దర్శించుచున్నారుగాని నాకే దర్శించు నదృష్టము లేకున్నది.

ప్రాణములకు విభుఁడు భగవంతుఁడే. అట్టివానిని పుణ్యవంతులు సాక్షాత్కరింపఁ జేసికొను చున్నారు. అట్టివాఁడు నాయందుండినను నేను జూడలేకున్నాను. దీనికి నా పాపమేకదా కారణము.

ఇచ్చట నీ శ్రుతివాక్యములు స్మరింపనగు.

''త మక్రతుం పశ్యతి వీతశోకో
ధాతుః ప్రసాదా న్మహిమాన మాత్మనః॥''
తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరా
స్తేషాం సుఖం శాశ్వతమ్ నేతరేషామ్
సమానే వృక్షే పురుషో నిమగ్నో
అనీశయా శోచతి ముహ్యమానః
జుష్టం యదా పశ్య త్యన్య మీశ
మస్య మహిమాన మితి వీతశోకః. ॥ముండ॥

ఒక దేహమందు జీవాత్మ పరమాత్మ లిరువురు గలరు. అందు జీవాత్మ సంసారమున మునిఁగి యీశునిఁ గానలేక మోహమున దుఃఖించుచున్నది. అది యెప్పుడు రెండవవాఁడైన యీశ్వరునిదర్శించునో యప్పుడు శోకరహితమైనదగును.

ఇందాత్మగుణములు దేహగుణములు కలిపి చెప్పుటచే సగుణబ్రహ్మమే సేవ్య మని యట్టివాని సాక్షాత్కారము గలవారే పుణ్యాత్ము లని మోక్షార్హు లని యేర్పడుచున్నది. ''వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షాద్రామాయణాత్మనా''యన్నట్లు సాక్షాద్వేదమైన శ్రీ రామాయణము ఎవ్వఁడు గుణవంతుఁడని ప్రారంభించి శ్రీరామ చంద్రమూర్తియందు ననురాగము గలవారందఱు ముక్తులైరని యుపక్రమోప సంహారము లేకవిధము గల దయ్యెను. అట్లులే పంచమవేదము "నారాయణం నమస్కృత్య నారాయణ కథా మిమా' మ్మని ప్రారంభించి యందు ముఖ్యములైన విష్ణుసహస్రనామములు, భగవద్గీత, సగుణబ్రహ్మము నుపాసనమే మోక్షసాధనమని నిర్వహించెను. శ్రీ భాగవతము ''విశ్వజన్మస్థితి విలయంబు లెవ్వనివలన'' నని సగుణ బ్రహ్మముతోనే ప్రారంభించి "హరిందలంపు మీఁక జన్మముగలుగ''దని ముగించెను. బ్రహ్మసూత్రములు 'బ్రహ్మజిజ్ఞాస'యని ప్రారంభించి 'జన్మాద్యస్యయతః'అని సగుణ బ్రహ్మోపాసనతోనేప్రారంభించి, యట్టివారికి శ్రుతిప్రమాణమున పునర్జన్మము లేదని

'నపునరావృత్తిశబ్దాత్', అని సూత్రించెను. మందబుద్ధియెయి నిద్దురపోయెడి వాని కాళ్ళకు మ్రొక్కుటకంటె వాఁడే మేలుకొని యుండునపుడు మ్రొక్కుట ఫల దాయకము. ఇది సర్వమత సమ్మత మార్గము.

క. వసనాభిఁ దినినవానికి, నసువులు మెయి నిలువనట్టు ♦ లమరసనాభుం
వసుధాపతి నెడఁబాసిన, వశమే నా మేనఁ బ్రాణ♦వాయువు లుండన్. ౬౪౭

అర్థములు, వసనాభి = విషము, అసువులు = ప్రాణములు, అమరసనాభుం = దేవతలతో సమానుఁడు, వసమే = వశమే. అమరశబ్దమువాస్తవముస భగవంతునందే ముఖ్యవృత్తి నన్వయము. దేవతలందు గౌణాన్వయము. దేవతలకు బ్రహ్మకుఁగూడ మరణముగలదు. భగవంతుఁడు మాత్రమే మరణములేని వాఁడు కావున నమరుఁడు. దీపాదుత్పన్నదీపవత్, దీపమునుండి వచ్చిన దీపమువంటిదిగదా పూర్ణావతారములు. కావున రాముఁ డమరసనాభుఁడు. వసుధాపతి = భూదేవియు భగవంతుని భార్యయే కదా! 'హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ' అని శ్రుతి.

తాత్పర్యము.

విషము దినిన వాని దేహమునుండి ప్రాణవాయువులు తమంతటఁ దామే లేచిపోవును. ఆ విధముగ నమరసన్నిభుఁడు భూపతియు నగు నా భర్తను బాసిన నా దేహమునఁ బ్రాణవాయువు లుండునా?

క. కటకట యింతగ వెతచే, నటమటపడఁ బూర్వజన్మ ♦ మందును నేనే
పటుపాపముఁ జేసితినో, కుటిలాత్మిక నగుచు నదియ ♦ కూర్చెడిఁ గీడుల్. ౬౪౮

తాత్పర్యము.

ఇంత మహాదుఃఖము ననుభవించుటకు నెంత ఘోరపాపమును బూర్వజన్మ మందుఁ జేసితినో ఆ పాపము నన్నిప్పు డిట్లు బాధించుచున్నది. "అత్యుత్కటైః పుణ్యపాపై రిహైవ ఫల మశ్నుతే." అత్యధికమైన పుణ్యముగాని పాపముగాని చేసి యుండిన నీ జన్మమందే ఫలానుభవముగలదు. తక్కినవి మఱుజన్మంబుల ఫలించును.

పూర్వజన్మమునఁ జేసిన పాపము నేఁడిటు లనుభవించు చున్నానని సీతా దేవి చెప్పనే, ఆమె కర్మవశమునఁ బుట్టినదా? కాదు. ఈ మాట రాక్షసస్త్రీల నుద్దేశించి చెప్పఁబడెను. సత్యముగానుండవలె, వారి కర్థముగాక యుండవలెఁ గావునఁ బూర్వజన్మ మనఁగా బాల్యమని యర్థము. నిన్నరణ్యమునకుఁ బిలుచుకొని పోనని రామచంద్రమూర్తి చెప్పినపుడునీవాఁడు దానవుగానిమగవాడవాయని దూషించెను. ఆ పాప మిప్పు డిట్లు బాధించు చున్నదని భావము. బ్రహ్మ, క్షత్రియ, వైశ్యుల కుపనయనములో రెండవ జన్మము వచ్చును. వైద్యులకు ద్విజన్ములనిపేరు. సన్న్యా సాశ్రమస్వీకారము జన్మాంతరము. ఈ కారణములచే బాల్యము జన్మాంతరమే. జన్మాంతర మనఁగా నీ దేహము పోయి వేఱు దేహము వచ్చుటే కదా. ఏడు సంవ

త్సరములకుఁ బరిపూర్ణ నూతన దేహము వచ్చుచుండును. కావున సీతాదేవి యనాలోచిత వాక్యము చెప్పలేదు.

క. ఇక్కరణిని బెనుమోఱకు, రక్కస లోకటను మూఁగి ♦ రక్షింపంగా
నెక్కడి రాముఁడు నాకిట, దిక్కేదీ చూడ మృత్యు♦దేవత దక్కన్. ౭౪౯

తాత్పర్యము.

ఈ విధముగ మూర్ఖపు రాక్షసస్త్రీలు గుంపుగఁజేరి యందఱు నాపైఁ గావలి యుండ నెక్కడి రాముఁడు? ఎక్కడి నేను? ఆయనవచ్చి రక్షించునని యేమి నమ్మకము? కావున మృత్యుదేవతయే నాకు దిక్కు.

భక్తుఁడు తన యోర్పు ఓపిక సర్వస్వము ధారవోసియును భగవంతుఁడు సాక్షాత్కరింపఁడేని "కలఁడు కలండనెడివాఁడు కలఁడో లేఁడో" యను సందేహ మొకానొకవేళ గలుగును. ఈ సందేహ మనునది వ్యతిరేకముగఁ బరిణమింప రాదు. నేనింతశ్రమించి నష్టకష్టముల నోర్చినను భగవంతుఁడు సాక్షాత్కరింపలేదు. కావున నాస్తికునివలె భగవంతుఁడు లేఁడనుకొనరాదు. నాయం దేదో లోప మున్నది. దానివలనఁ గానరాలేదని తలఁపవలయును.

క. ఛీ మనుజ జన్మ మేటికి, ఛీ మఱి పరవశ్య మైన♦చెనఁటిబ్రతుకు నే
లా? మదిఁ దలంచినప్పుడ, యే మరణముఁ బొందరామి ♦ యేర్పడెఁ గంటే.

అర్థములు, పరవశ్యము = పరులకు స్వాధీనపడియుండునది. మనుజజన్మమేటి కనుటచే దేవతగానుండు నేను అకర్మవశతఁ గార్యార్థమై మనుష్యస్త్రీగాఁ బుట్టుటయుఁ దప్పనియే తోఁచుచున్నదని భావము. 'మానవానామిదం పథ్య' మ్మన్నట్లు దీని నూహించునది. మనుష్యజన్మ మేల నింద్యమనిన నది పరవశమైన బ్రదుకు గావున సంసార బద్ధుఁడైన జీవుఁడు స్వతంత్రించి చచ్చినను అసురలోకములుదప్పవు. స్త్రీ పర్యాయంబున నేను బతివ్రతను, భర్తకుఁ బరాధీనురాలను. ఈ దేహము, జీవము భర్తదిగాని నాదికాదు. దీనిని బోఁగొట్టుటకుఁ జెఱచుటకు నాకేమి యధికారముగలదు? కావునఁ బతియాజ్ఞలేక చచ్చుటకు నధికారములేని యీ యస్వతంత్రపు బ్రదుకు పాడుబ్రదుకు గదా యని భావము. సర్వం పరవశం దుఃఖం, సర్వ మాత్మవశం సుఖమ్మని స్మృతి కలదు గదా.

తాత్పర్యము.

మనుష్యజన్మ మేమి పాడుజన్మము. ఛీ ఛీ. అందుఁ బరవశమైన బ్రదుకేమి బ్రదుకు. తలఁచినపుడు చచ్చునట్టి యధికారము కూడ లేదాయెఁగదా.

దీని వలన మనుష్యులు సుఖమో దుఃఖమో ప్రారబ్ధ మనుభవింప వలయునే కాని బలాత్కారమరణముచే దానిని దప్పించుకొన యత్నింపరాదని యేర్పడు చున్నది. దేహి కట్టి యధికాము లేదు. అనుభవశేష మెప్పటికైన ననుభవింపవలసి

నదే. రాజదండితుఁడైన కారాగృహవాసి చెఱసాలనుండి తప్పించుకొనిననంతతో క్షమింపఁబడునా ?

—♦ ౨౬-వ సర్గము. సీతాదేవి శ్రీరామునిఁ దలంచుకొని దుఃఖించుట. ♦—

ఉ. వెండియు నిట్టు లేడ్చుఁ బృథి♦వీసుత యానతవక్త్రపద్మయై
దండిగ బాష్పవారి ముఖ♦తామరసంబున నావరింప గో
త్రం డొరలాడు గోడిగవి♦ధంబున నొప్పుచుఁ బిచ్చి యెత్తిన
ట్లుండి ప్రమత్తరీతిఁ దన♦యుల్లము భ్రాంతి మునింగినట్లుగన్. ౬౫౧

అర్థములు. ఆనత = వంపఁబడిన. వక్త్రపద్మయై = ముఖకమలము గలదై డొరలు = దొరలు, రెండు రూపంబులును గలవు. ఇట్టియే దొంగ డొంగలోనైనవి. గోడిగ = ఆఁడుగుఱ్ఱము. దొరలాడు గోడిగ యనుటచే నింతవఱకుఁ గొమ్మపట్టుకొని నిలఁబడిన సీతాదేవి యిప్పుఁడు నేలఁబడి పొరలాఁడుచున్నదని భావము. దేహికి దుఃఖమా దుస్సహమాయెను. అది తప్పించుకొనుటకు బలవంతముగ మరణించుటకు నధికారము లేదాయెను. ఇఁక నీ దుఃఖము వాయుటెట్లు ? ఎన్నాళ్ళని యీ దుఃఖమనుభవింపవలె ననిన దానికుపాయ మిఁక సీతాదేవి చేసినట్లు రామచంద్ర మూర్తిని దలఁచుకొని తలఁచుకొని సర్వదా ధ్యానించుట గుణవర్ణనము చేయుట నిర్వేదపడుటయే కాని వేఱుపాయము లేదు. దీనికే యభ్యాసయోగ మని పేరు.

''తచ్చింతనం తత్కథన మన్యోన్యం తత్ప్రబోధనమ్
ఏకాంతే తత్పరత్వంచ తదభ్యాసం విదు ర్బుధాః'' అధ్యాత్మరామాయణము.
''అథచిత్తం సమాధాతుం నశక్నోషి మయి స్థిరమ్
అభ్యాస యోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ.''

యని భ॥ గీ॥ ౧౨-౯ భగవంతు డుపదేశించెను.

ఇరువదినాలుగు గంటలు యావజ్జీవము సమాధియం దుండ లేనివారి కిదియే యవ్యవధానమైన యుపాయము. ఈ తీవ్రనిర్వేదఫల మాచార్యప్రాప్తి. అది ముందు చెప్పఁబడును.

అంతవరకుఁ ద్యాగము, మహావిశ్వాసము, చింతనము కార్యములు. ఉత్తరీయము తోడ సర్వాభరణములు తీసివేయుటచేఁ ద్యాగము చెప్పఁబడెను. మహావిశ్వాసము చింతనము ముందు తెలియగలవు.

తాత్పర్యము.

సీతాదేవి తలవంచుకొని కన్నుల నీళ్ళు దండిగఁ గాఱుచుండఁగా నేలఁబడి పొరలాడు నాఁడుగుఱ్ఱము వలెఁ బిచ్చి యెత్తినట్లు పిశాచము సోకుటచే దేహము తెలియనిదానివలె మనస్సు దిగ్భ్రమగొన్న దానివలెనై మఱియునిట్టు లేడ్చుచున్నది.

ఇందుఁ దమ మన స్సంతయు భగవంతునిపై నుంచిన భక్తప్రపన్నుల దశ వర్ణింపఁ బడెను. 'బాలోన్మత్త పిశాచ దశాలంబన' మన్నట్టు లతీత

భక్తియుక్తుఁడు 'బాల్యేన తిష్ఠాసేత్' న్నట్లు బాలునివలె దేహాభిమానము విడిచి నేలఁబడి పొరలాడును. పిచ్చిపట్టినట్లు, దయ్యము పట్టినట్లు, మీఁది గుడ్డయు నుండు నది పోవునది తెలియక వర్తించును. సీతాదేవి స్థితి యిట్లుండెను.

సీ. రాముఁ డేమఱి యుండ♦కామరూపాశరుం, డేప్చు చుండఁగ నన్ను♦నీడ్చి తెచ్చె
నీ రక్కసులచేతి♦కిటు చిక్కి వీరలు, తర్జింప నెబ్బంగిఁ♦దనువుఁ దాల్తుఁ
బ్రాణంబు లేటికి♦నర్థంబు లేటికి, భూషణంబు లవేల♦పొక్కు వేళ
రామచంద్రునిఁ బాసి♦రాక్షసీమధ్యంబు,నఁ బంపుచుండఁగ♦నాదుగుండె

తే. యినుపచిట్టెమొ గాక నా♦హృదయమునకు
ముదిమియును జావు లే వొకో♦నదమదంబ
నయ్యు దుఃఖంబుచే నది♦యవిసి పడదు
కటకటా నాదు దౌర్భాగ్య♦గరిమ నేమొ. ౬౫౭

అర్థములు. రాముఁ డేమఱి యుండఁగ=రామచంద్రమూర్తి నా రక్షణమం దజాగ్రత వహించిన వాఁడగుటచేత, కామరూపాశరుండు=కోరిన రూపము ధరింప గల రాక్షసుఁడు. సన్యాసివలె నైన రావణుఁడు. నదమదంబను=నలగినదానను. రామచంద్రమూర్తి ప్రమాదముచే నాకీ గతిగలిగెను. తానేకదా పొమ్మనె నందు వేమో పూర్ణముగా వదలి పొమ్మనెనా? కనుచూపు దూరము దాఁటఁగానే సీతను విడిచి నేను దూర మెట్లు పోదునని తలఁచి మృగమును జంపి యుండరాదా? మరలి వచ్చి యుండరాదా? అనఁగా భగవత్కటాక్షము దూరమయ్యె నేని యాపదలు తప్పక వచ్చును. సూర్యకిరణములు దొలఁగెనేని చీఁకటి వచ్చును. కోరిన రూపము ధరింపఁ గలది ఇత్యవిక్రియ యగు ప్రకృతియే.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి నా విషయమునఁ బ్రమాదపడుటచేతఁ గోరిన రూపము ధరింపఁ గల రావణాసురుఁడు నే నేడ్చుచున్నను బలాత్కారముగ నీడ్చి తెచ్చెను. ఇప్పు డీ రాక్షసులచేతఁ జిక్కి మరల రామ ప్రాప్తి నాకు లభింపఁజేయకుండుటకై నేను భయపెట్టఁ బడుచుండఁగా నే నేవిధముగా దేహము ధరింతును? నేను బ్రాణములు ధరించుట రామసేవానిమిత్తమే. నా ధనము రామకైంకర్యార్థమే. నా సొగసులు రామ సంతోషార్థమే యైయుండ నాయన లేక నే నేడ్చునపుడు నాకివన్ని యేల? ఎవరి కివి యుపయోగపెట్టుదును? రాక్షసస్త్రీల నడుమ నేను దుఃఖించుచుండ నా గుండె పగిలిపోకయున్నది. అది యినుపచిట్టెమేమో, లేక నా హృదయమునకు ముసలితనముగాని చావుగాని లేదేమో. అట్లుండిన యెడల నే నింత తీవ్రశోకాగ్ని చే నలఁగియున్నను అది పగిలి పెటిలి పడక యుండునా? గుండె యట్లు పోకుండుటకు స్వభావగుణము కారణముగాదు. గుండెలు పగిలి చచ్చిన వారెందఱు లేరు. నా నిర్భాగ్యదశ దాని నట్లు పోకుండ జేయుచున్నది.

తే. పాపజీవిత నయి రామభద్రుఁబాసి, యొడలఁ బ్రాణంబులను నిల్పియున్న దాన
  నీ యనార్యను నసతిని శీలహీన, నేమి బ్రదుకిది తలఁప నా దేమి వ్రతము. ౬।౩

తా త్ప ర్య ము .

రామచంద్రమూర్తి నా విషయమునఁ బ్రమాదపడెను. నన్ను విడిచిపోయెనని నే నేల యనవలె? ఆయన యట్లు పోవుట కేమి కారణము? నేను పాప జీవిత నగుటయే కారణము. నేను పుణ్యాత్మురాలనై యుండిన నే నేల పొమ్మందును. ఆయన యేల పోవును? ఆ పాపబలముచేతనే ప్రాణములను విడువలేక దేహమందు నిలిపియున్న దానను. ఎప్పుడు నేను దేహమం దభిమానముచేఁ బ్రాణములను నిలిపితినో యప్పుడే నే ననార్యను. ఆర్యనుగాను. పతివ్రతనుగాను. సదాచారవతిని గాను. అయియుండిన నాకీ కష్టము వచ్చియుండదు. ఇట్టి శీలాదులులేని దిక్కుమాలిన బ్రదుకేమిబ్రదుకు. నా పతివ్రత మేమివ్రతము? అది పర్యాప్తమైనది కాదు.

మ. తిననీ వీరలు నా శరీరమును బ్రీతిం, దీర ఖండింపనీ
  మనఁజాలం జతువర్ణవీవలయిత భూమ్నిభర్త నా భర్తఁ బా
  సి నితాంతంబు దురంత మైన వ్యథ గాసిం నొందుచే నిట్టి రీ
  తిని సౌఖ్యంబులు గోరుదాన నె? కడుం దీపో కదే ప్రాణముల్. ౬।౮

అర్థములు. తిననీ=తిననిమ్ము, "ఇచ్చుటకు సర్వత్ర ఈయనగు." తిననీయుము. తిననిమ్ము, తిననీయని రూపంబులు తిననివ్వని యనునది గ్రామ్యము. ఇచ్చుటకు 'ఇవ్వ' శాస్త్రసమ్మతముగాదు. మనఁజాలన్=బ్రదుకలేను, చతురర్ణవీ = నాలుగు సముద్రములచే, వలయిత = చుట్టఁబడిన, భూమ్ని=భూమికి, భర్త=పతి, నితాంతము = మిక్కిలి, దురంతము = అంతములేని.

తా త్ప ర్య ము.

రామచంద్రమూర్తి సేవ మఱల లభించునను నాశతో దేహమునందు అభిమానము వహించి ప్రాణములను దేహమున నిలిపితిని. అది యేమో యాశలేదాయె. ప్రాణమూ బలవంతముగ విడువరాదాయె, దుఃఖములా సహింపరానివాయె. నేనేమి చేయుదును? ఈ రావణుఁ డొక్క సముద్రముచేఁ జుట్టఁబడిన యొక ద్వీపమునకధిపతి. నాభర్త నాల్గు సముద్రములచేఁ జుట్టబడిన భూమీతలమున కంతయు నధిపతి. అట్టివానిని విడిచి మిక్కిలి యంతములేని దుఃఖముపాలై నేను బ్రదుకలేను. కావున నీ రాకాసులు నా దేహమునుబీఁకి తిందురా తిననిమ్ము. ముక్కలు ముక్కలుగా నఱుకుదురా, నఱుకనిమ్ము. ఈ బాధకంటె నది గొప్ప బాధగాదు. ఇంత దీర్ఘకాల బాధయుఁగాదు. ఇట్టిస్థితిలో నాకు మంచాలు పఱుపులు దిండ్లు సొగసులు కావలయునా? ఈ పాడు ప్రాణ మింత తీపా?

దీనివలన భక్తునిమనస్సు భగవంతునిపై నుండవలెఁగాని సౌఖ్యములపై నుండనీయ రాదని యేర్పడుచున్నది.

ఆ. ఎడమ కాలిగోర ♦ నేనియు రావణుఁ, దాఁకుదానఁ గాను ♦ దథ్య మింత
యతనివలతుననుట♦యదియేటిమాటయి,స్సీయెఱుంగఁడతఁడు♦చెనఁటియగుట.

తా త్ప ర్య ము.

రావణాసురుని నే నెడమకాలి గోటనైనఁ దాఁకు దానఁగాను. ఇది సత్యము. ఇఁక వానిని బ్రేమింతు ననుట యేమి మాట? ఛీ యింతమాత్రము వాఁడు తెలిసికొనలేక యున్నాఁడు. దీనికి వాఁడు సిగ్గువిడిచిన దుష్టుఁడగుటయే కారణము.

ఉ. తిట్టి తిరస్కరించిన మ♦దిం దెలియండు, తలంపలేఁడు దాఁ
బుట్టిన వంశముం బరువుఁ♦బోణిమియుం, దనుఁ దా నెఱుంగఁడా
కట్టిఁడి, నన్ను వేఁడెడిని ♦ గ్రౌర్యరతుం డయి, యేమి చేయుఁ దగ్
గట్టి యముండు పాశముల♦గట్టఁగ నీడ్వఁగఁ జావనున్నడన్. ౬౫౬

తా త్ప ర్య ము.

నన్నుఁ దాఁకుటకే యిష్టములేనిది నన్ను మోహించునా? యను జ్ఞానము లేదు. అంతటి యూహాబలము లేకుండినఁ బోనీ, నోరారఁదిట్టి ఛీ పొమ్మని ధిక్కరించి నను తెలిసికొనలేకున్నాఁడు. అంతియగాక తా నెటువంటి వంశమునఁ బుట్టెను? దాని గౌరవమేమి? తానెటువంటి వాఁడు? తన గౌరవమేమి? ఇట్లు పిత్రార్జితము స్వార్జితమైన గౌరవమునైన నాలోచించి, ఛీ మన గౌరవమేమి? ఈయాఁడు దాని చేత ఛీఛీవాట్లేమి? యని యైనఁ దలఁపలేక క్రూరుఁడై బెదరించి నన్ను వశపఱుచు కొనఁ జూచుచున్నాఁడు. ఇది వాని దోషమా? కాదు. యముఁడు పాశములు వేసి యీడువగాఁ జచ్చుటకు సిద్ధముగా నుండువాని కిటువంటి బుద్ధి గాక మంచిబుద్ధి చక్కని యాలోచన యెట్లు కలుగును. కాలబలముచే వాఁ డట్లు చేయుచున్నాఁడు.

——♦సీతాదేవి రాక్షసస్త్రీలకుఁ బరుషంబుగఁ బ్రత్యుత్తర మిచ్చుట.♦——

క. కోయుఁడు కడికండలుగా, వ్రేయుఁడు కత్తులను రోష♦వివశత నన్నున్
ద్రోయుఁడు మండెడుమంటల, మీయుక్తుల విన ని కేల♦మిడిసిపడంగన్. ౬౫౭

అర్థములు. కడికండలు=తునుకలు తునుకలు, కడికిఁ జాలినంత తునుకలు-నోటఁ బెట్టుకొనుటకుఁ జాలినంత చిన్న ముక్కలు, మిడిసి పడంగన్=మిట్టిపడఁగా.

తా త్ప ర్య ము .

మీనోళ్ళు పట్టునంత చిన్న తునుకలుగాఁ గోసెదరా కోయుఁడు. కోపించి కత్తులతో నఱకెదరా నఱకుఁడు. మంటలలో వేసి కాల్చెదరా కాల్చుఁడు. మీ యిష్టమేమైనఁ జేయుఁడు. నేను మీ మాటలు విననను. ఏల మీరీ గర్వమున మిట్టి పడెదరు? నా దేహము మీకు వశము. మీయిష్టమువచ్చినట్లుచేయుఁడు. మనస్సునా స్వాధీనము. దానిని మీరేమియుఁ జేయఁజాలరు. అని రాక్షసస్త్రీలకుఁ దెగ జెప్పి మఱల రామధ్యానము చేయుచున్నది.

సీ. తనవారిపట్లను ♦ బెనుదోస ముండిన, గుణము మాత్రముఁ గను ♦ గుణధనుండు
ఇంచుక యుపకార ♦ మెవఁడు చేసిన దాని, విస్మృతి నొందని♦విజ్ఞతముఁడు
తన్ను నమ్మినవాని♦ఖిన్నతకై తాను, విరవిర లాడెడి ♦ కరుణగలఁడు
అన్యుల యభివృద్ధి ♦ నాత్మఁగోరుచు నుండు, నిర్మలచిత్తుండు ♦ నిపుణతముఁడు
తే. పదియునాలుగు వేల దు♦ర్మదుల నొంటెఁ, జంపె రాక్షసులను జన♦స్థానమునను
నట్టినా ప్రాణభర్త దా♦నిట్టుకరుణ, మాలుటయునాదుదౌర్భాగ్య♦మహిమ నేమొ.

## తాత్పర్యము.

రామచంద్రమూర్తి నన్నుపేక్షింప నేమి కారణము? ఆయన దయాగుణ విహీనుఁడా? యనినఁ గాఁడు. నీ వాఁడను అనిన వారియం దెన్ని గొప్పదోషము లుండినను వానిని లెక్కింపక వారి యందుండు మంచిగుణము మాత్రము గ్రహించు కల్యాణ గుణములు గలవాఁడు. ఇట్టివాఁడు నా దోషము లెన్ను నా? (చూ. యుద్ధ. ౩౬.౫) ఎంత కొంచె ముపకార మెవరొకటియైనఁ జేసినను దానిని మఱవని కృతజ్ఞుఁడు. ఇట్టివాఁ డింతకాలము నిర్వంచనముగాఁ దనసేవ చేసిన నన్ను మఱచునా? (చూ. అయోధ్య. ౧౧ ప.)

తనయందు విశ్వాసముగలవారి కేదైన దుఃఖము ప్రాప్తించెనా ఆ దుఃఖము తనకు వచ్చినట్లు ఖేదపడువాఁడు. ఇట్టివాఁడు తన్నునమ్మి తనతోడఁ దన నిమిత్తమై యడవుల పాలైనదాని విషయమున బరితాప పడకుండునా? (అయోధ్య. ౬౬) పరుల యభివృద్ధికోరి యింకను నెవరెవరిని బాగుపఱుతునా యని సర్వజన శాశ్వత సౌఖ్యము గోరు వారి కది (ముక్తి) లభింపఁ జేయువాఁడు. ఇట్టివాఁడు నా మేలు గోరఁడా? (అయోధ్య. ౬౬) తన్ను రక్షించు సామర్థ్యము లేక యూరకున్నాఁడా యనినఁ బదునాలుగు వేల దుష్టరాక్షసులను జనస్థానమం దొంటిగఁ జంపెనే. అట్టివాఁడు తమ్ముఁడు కూడఁ దోడై యుండఁగా నీ రాక్షసుని జంపుట గొప్ప కార్యమా? కాఁబట్టి యిన్ని కారణము లాలోచింపఁగా నామీఁద నాయనకు దయ రాకుండుటకు నా దురదృష్టమహిమయే కారణము. ఇట్టి భావము వాస్తవభక్తుని లక్షణము. భక్తుఁడు భగవత్కటాక్షము తనయందు రాదేని భగవంతుని తప్పు పట్టఁడు. ఆయన కటాక్షము వచ్చునంత యోగ్యత తనయం దింకను గలుగ లేదు. కావున ఆయన కటాక్షము వచ్చుటకు నాయందుఁగల లోపములను బూర్తిచేసి కొనవద నని తన్నుఁ దాను దప్పు పట్టుకొనునే కాని తాను జేయ వలసిన దంతయుఁ జేసి పూర్ణభక్తి సంపాదించికొని నట్లు భగవంతుఁడు కఠినుఁడై యనుగ్రహింపనట్లు భావింపఁడు. ఎవఁడు తాను బూర్ణభక్తుఁడని తలఁచునో వాఁడు భక్తుఁడుగాఁడు. వాస్తవ భక్తునకింకను భగవత్సేవ చేయకపోయితినే యని యుండునే కాని వాఁడు సేవయందుఁ దృప్తి వహింపఁడు. ఇది భక్తస్వభావము.

సీ. నన్నిట్టు లరికట్టు♦నిస్సీచబలుఁ ద్రుంపఁ, జాలియు నన్నేల ♦ నేల రాఁడో?
దండకను విరాధు ♦ దండించినట్టి వీ,రాగ్రణి నన్నేల ♦ యరయ రాఁడొ?
ఖరదూషణాదుల ♦ ఖండించి వైచిన, శూరుండు నన్నేల ♦ చూడ రాఁడొ?
రక్కసు చేతిలోఁ ♦ జిక్కిన ప్రియురాలిఁ, బ్రోయాలి నన్నేల ♦ ప్రోవ రాఁడొ?
తే. యదధిమధ్యంబునను లంక ♦యుండుఁగాక,యన్యులకు నెల్లదుస్సాధ♦మగునుగాక
మహిమ జగముల నెందును ♦మాఱు లేని, రామబాణంబులకు నడ్డ♦మేమిగలదు?

తా త్ప ర్య ము.

రామచంద్రమూర్తి శక్తిచాలక తన్ను రక్షింప రాలేదనుట సరిగాదని కొన్ని దృష్టాంతములచే నిరూపించుచున్నది.

నన్నీప్రకారము నిర్బంధించి బాధపెట్టు నల్పబలుఁడగు రావణుఁ జంప నేల రాకున్నాఁడు? నా నిమిత్తమైకదా దండకాటవియందు విరాధుని వధించెను. నా నిమిత్తమైకదా ఖరదూషణాదులను సంహరించెను. అటువంటివాఁడు తనకుఁ బ్రియురాలను, ఇల్లాలను (ప్రోలు+ఆలు = ప్రోయాలు) నన్నేల రక్షింప రాకున్నాడు. అప్పుడు వారందఱు ముఖాముఖి యెదుటఁబడిరి. గావునఁ జంపగలిగెను. వీఁడు సముద్రమధ్యమునఁ గానరాకున్నాఁడు. కావునఁ జంపలేఁడందునా? లంక సముద్ర మధ్యమున నుండిన నుండుఁగాక. ఇతరుల కిచ్చటకి వచ్చుట యసాధ్యమైన నగును గాక. మూఁడులోకములందును నడ్డములేని రామబాణములకు నీ సముద్రమా యడ్డము.

విషజలాప్యయాత్ వ్యాళరాక్షసాత్ వర్షమారుతా ద్వైద్యుతానలాత్
వృషమయాత్మజాత్ విశ్వతోభయాత్ వృషభ తే వయం రక్షితా ముహుః॥

అను గోపికల వాక్యము స్మరించునది. కృష్ణసాన్నిధ్యమునకై రుక్మిణీ గోపికల పరితాప మెట్టిదో సీతా పరితాప మట్టిదిగా నెంచనగు.

ఉ. సందియ మయ్యె నా విభుఁడు ♦ చాలఁడు నే నిట నుంకు టెఱుంగ, నీ
చంద మెఱింగి యున్నయెడ ♦ సైచునె మానధనుండు, రామ! నీ
సుందరి రావణాసురుఁడ ♦ సుమ్ము హరించె నటంచుఁ జెప్పఁడే
మందల వీడ కున్న నీస♦మానబలుం డల గృధ్రనాథుఁడేఁ. ౬౬౦

అర్థములు. మానధనుఁడు = మానమే ధనముగాఁ గలవాఁడు. మందల = బ్రదుకుపాటు, జీవితము.

తా త్ప ర్య ము.

నాయం దెంతయో ప్రేమగలవాఁడు, ఎన్ని యాపదలనుండియో నన్ను రక్షించినవాఁడు, నేఁడు నామీఁద దయతప్పినాఁడనికాని, శక్తిచాలక యూరకున్నాడని చెప్ప సాధ్యపడదు. అట్లైన నేల యూరకున్నాఁడు? నేనెచ్చట నుండునది యాయనకుఁ దెలియదని నా సందేహము. ఆ కారణముచే నూరకున్నాఁడుగాని, తెలిసియుం

డిన పౌరుషశాలి తనభార్యను బరుఁ డపహరించె నన్న యవమానము నెట్లు సహించును? సహింపఁడు. బొత్తిగాఁ దెలియక యూరకున్నాఁడా యనిన నట్లు చెప్పుటకు వలను పడదు. ఏలన జటాయుప్రాణము పోకయుండెనా యాయన నీభార్యను రావణాసురుఁడు హరించె నని చెప్పకుండునా? చెప్పియే యుండునుగాని రామచంద్రమూర్తి వచ్చువఱకు నతఁడు జీవించి యుండెనో లేదో.

ఉ. అంతము నొందఁ జేసె నసు♦రాగ్రణి వీరు జటాయుఁ బట్టి, వా
  డెంతటి తెంపు చేసెఁ గడు♦వృద్ధుఁడు నయ్యును, ద్వంద్వయుద్ధమం
  దింతల నంతలం జనక ♦ యే ద్దెఱ చూపె మదర్థ, మక్కటా
  యెంతకు లేఁడు నాదు దుర♦దృష్టము కాలముగాదు వానికిన్. ౬౬౧

అర్థములు, అంతము = మరణము, ఇంతల నంతలన్ = కొంచెపుఁ బ్రయత్నముతో; ఏ ద్దెఱ = పరాక్రమము, మదర్థము = నా నిమిత్తము, ఎంతకు లేఁడు = ఎంత కార్యమైనను జేయజాలనివాఁడా? కాలము = అనుకూల కాలము.

తాత్పర్యము.

మీఁది యాలోచన క్రమమందు జటాయువు స్మరణమునకు రాఁగా వానిని గుఱించి యనుకొనుచున్నది. రావణుఁడు వీరుఁడైన జటాయువును జంపెనుగాని, వాఁడు ముసలివాఁ డయ్యును ఎంతసాహసము చేసెను. నిరాయుధుఁడై ద్వంద్వయుద్ధమందుఁ దన పరాక్రమ మంతయుఁ జూపెనుగాని, కొంచెముతో వీనిని విడిచెనా? వాఁ డిఁక నెంతయైనఁ జేసి జయించియుండును. నా దురదృష్టముచేతఁ గాలము వానికనుకూలించి వచ్చినదికాదు.

సర్వం కాల మపేక్షతే విధివశాత్ నైవాస్మి కాలక్షమః॥

చండకౌశికమందు హరిశ్చంద్ర వాక్యము

ఉ. నా యిట నుండు జాడ రఘు♦నాయకుఁ డింత యెఱింగెనేని య
  త్యాయతకోపఘూర్ణహృ ♦యంబున లోక మరాక్షసంబుగాఁ
  జేయుఁడె? యానిమేషమున ♦ సింధువునం బెనుదుమ్ము రేఁపఁడే?
  మాయఁగఁ జేయుఁడే ఖలుని♦మానముఁ బ్రాణము నామముం బురిన్. ౬౬౨

అర్థములు. ఇంత = రావణాసురుఁడు నీ భార్యను హరించెను అను మూఁడు మాటలు మాత్రము, అత్యాయత = మిగుల విస్తారమైన, కోప = కోపముచే, ఘూర్ణ = తిరుగుడు పడుచున్న, హృదయంబునన్ = మనస్సుచే, అరాక్షసము = రాక్షసులు లేని దానిఁగా, సింధువునన్ = సముద్రమందు.

తాత్పర్యము.

నేనీలంకలో నున్న దాన నను మాట మాత్రము తెలిసినవాఁడయ్యెనా రామచంద్రమూర్తి మిగులఁ గోపించినవాఁడై లోకముల రాక్షసుఁ డనువాఁడు లేకుండ జేయకుండునా? ఈ నిమిషమున సముద్రమునీళ్ళన్నియు నిగిరించి దుమ్ములు రేఁగునట్లు

చేయఁడా? ఈ దుష్టుని మానము ప్రాణము పేరు లంకాపట్టన మనువానిని రూపుమాపఁడా? కావున నిప్పటి కాయనకుఁ దెలియదనియే తలఁచెదను.

క. అప్పుడు గద రాక్షససతు, లిప్పుడు నే నేడ్చురీతిఁ ♦ నిం టింట నెలుం
గొప్పఁగ విధవాకృతులన్, గొప్పగ నేడ్చెదరు గోలు♦గోలున సతమున్. ౬౬౩

అర్థములు. సతమున్ = ఎల్లప్పుడు, జీవించి యుండువఱకు, నే నిప్పుడల్పకాల మేడ్చిన వారు కలకాల మేడ్తురు.

తాత్పర్యము.

ఈ రావణుని నూరుపేరు లేకుండ నెప్పుడు రామచంద్రమూర్తి ధ్వంసము చేయునో యప్పుడు నేనిప్పు డేడ్చు విధముగా రాక్షసస్త్రీ లింటింటఁ బెద్ద గొంతుకలతో లబో దిబో యని విధవలై యావజ్జీవ మేడ్చుచుండెదరు.

చ. ఉడిగెడువాఁడు కాఁడు పురు♦షోత్తముఁ డేగతి నైన నాడు పో
బడిఁ గనిపెట్టి యిచ్చటికి ♦ వచ్చుట సత్యము, వచ్చినంత నా
కడిఁదిబలాఢ్యులం గని క♦కావికలై చనువారు గాక క్రము
క్కుడి సురవైరులా యుసురు ♦ గాచుకొనం గలవారు మూర్తమేన్. ౬౬౪

తాత్పర్యము.

రామచంద్రమూర్తి చూచుటకు ముందే జటాయువు మరణించె నను కొందము. ఆయన నా వార్త చెప్ప లేదనుకొందము. అంతతో నావార్తరామచంద్రమూర్తికిఁ దెలియకయే యుండునా? ప్రస్రవణగిరి యాశ్రమ సమీపమందే కదా యున్నది. ఏటి వెంట వెదకుచు వచ్చిన నచ్చటఁ జచ్చిన జటాయువు కనఁబడియుండడా? రావణుని సారథి, చామరములు ధరించిన వారు, తేరులోనైనవి నేను బాఱవేసిన భూషణములు కానరాకయుండునా? వీనినిఁబట్టి యెవ్వఁడో రాక్షసుఁడు నన్నుహరించెనని యూహింపలేఁడా? అంతమాత్రమనుమానము కలిగిన నెవఁ డీ రాక్షసుఁడని పోఁబడి తీయకుండునా! వానరుల ముందట సొమ్ములు వైచితినే, వారెవ్వరైనఁ జెప్పియుండరా! ఇంతకాలమునకు నా వార్త చెప్పువారే లేకయుందురా? కాఁబట్టి యెట్లులైన నే నిందున్నానని తెలిసి యిచ్చటికి వచ్చుటయే సత్యము. అది తప్పదు. ఆ బలశాలులు రామలక్ష్మణు లిచ్చటికి వచ్చిరా యీ రాక్షసులందఱు చెల్లాచెదరై పరువెత్తుదురే కాని తమ ప్రాణములను క్షణమైనఁ గాపాడుకొనఁగలరా?

ఆ. పాడెరాసు లుండ ♦ బాటల నిండఁగఁ, బొగిలి కాలు పీనుఁ♦గు పొగలు మింట
నెడము లేక యాడు ♦ గృధ్రాళిగూటనీ, వీడు వేగ వల్ల♦కాడు కాదె. ౬౬౫

అర్థములు. వీడు = పట్టణము, వల్లకాడు = శ్మశానము, పొగిలి = కుమిలి.

తాత్పర్యము.

స్పష్టము.

క. తూర్ణంబ నాదుకోరికి, పూర్ణం బగుఁ, జెడెడివారు ♦ పొలఁతులు! మీ మీ
దుర్ణయముల మీరే యిది నిర్ణయముగ వినుఁడు వెండి♦నిజముం గనుఁడీ. ౬౬౬

అర్థములు. తూర్ణంబ = శీఘ్రము.

తాత్పర్యము.

ఓ స్త్రీలారా! నాకోరిక త్వరలోనే నెఱవేఱును. మీ మీ చెడు కార్యముల మీరే చెడిపోవుదురు. ఇది నిశ్చయము. ఇప్పుడు వినుఁడు. తరువాత నిజమైనపుడు చూడుడు.

ఇది యంతయు దేహేంద్రియముల కన్వయింపవలెను.

చ. చలఁగెడి నిప్డు డీ పురిని ♦ జేటును దెల్పెడు పెక్కులక్షణం
బులు, నిజ మీ పురంబు చెడి♦పోవును నిష్ప్రభమై, దశాననుం
డిలుగ దురాసదం బయిన♦యీ నగరంబు ముహూర్తమాత్రలో
పల సొబగా ఱెడిం గొమరుఁ♦బ్రాయపురండను బోలి, చూడుఁడీ. ౬౬౭

అర్థములు. నిష్ప్రభమై = కాంతిహీనమై, ఇలుగన్ = ఈలుగన్ = చావఁగా, దురాసదంబు = ఇతరులకు లభింపనిది, కొమరుఁ బ్రాయపురండ = లేఁత వయసు విధవ.

తాత్పర్యము.

ఈ పురము పాడైపోవు లక్షణములు పెక్కులు కానవచ్చుచున్నవి. ఈ యూరు కాంతిహీనమై చెడిపోవుట నిజము. ఇతరులకుఁ బ్రవేశింప సాధ్యముగాని యీ పురము స్వల్పకాలమున బాలవిధవవలె నందము చెడిన దగును. చూచుచుండుఁడు. 'వ్యభిచారరతా నారీ బాలరండాతు జాయతే' పోయిన జన్మమున అంకాడిన స్త్రీ యీ జన్మమున బాలవిధవ యగును. అట్టులే యీ పురమింకను నెంతోకాలము బాగుండవలసిన దయ్యును నిందు వ్యభిచారము లెక్కువగుటచేఁ ద్వరలోనే పతిహీనయై పాడగును.

క. భాసురపుణ్యోత్సవములు, వాసిగ శుభలక్షణములు ♦ పాయుచు విధవా
వాసం బగుచును బూర్వాసు,వాసినివలె నుండు లంక ♦ పతి మరణింపన్. ౬౬౮

అర్థములు. విధవావాసము=ముండలకు నెలవు, పూర్వాసువాసిని=ముందు ముత్తైదువుగా నుండునది. అనఁగా నిప్పుడు విధవ.

తాత్పర్యము.

పతియగు రావణుఁడు చచ్చిన కారణముచే నీ లంక పుణ్యోత్సవములు శుభచిహ్నములు పోయినదై పుణ్యములగు పండుగలు పసుపు కుంకుమ కాటుక గంధము కమ్మలు పాపట మొదలయిన శుభలక్షణములు పోయిన విధవవలె విధవల కునికి పట్టైయుండును.

క. తడ వింక లేదు సోఁకుం,బడఁతులు బిడ్డా యటంచు♦మగఁడా యనుచున్
గొడుకా యని యింటింటను, మిడుక న్నే వినఁగఁ గలను♦మెలఁతుకలారా!

అర్థములు. తడవు=జాగు, సోఁకుంబడఁతులు=రాక్షసస్త్రీలు, మిడుకన్=దుఃఖింపఁగా.

తాత్పర్యము

స్పష్టము.

క. దిగ్ధాము లెఱుఁగ హాతపల,భుగ్ధీరము నిష్ప్రభంబు♦పుర మగును నసం
దిగ్ధము రఘువరశరశుచి,దగ్ధం బై ముగ్ధలార! తథ్యము సనుఁడీ. ౬౦

అర్థములు. దిగ్ధాములు = దిక్కుల గాఁపురముండువారు, హాత = చంపఁబడిన, పలభుక్+ధీరము=రాక్షస వీరులు గలది, నిష్ప్రభంబు=కాంతి చెడినది, అసందిగ్ధము=సందేహము లేదు. రఘువరశర=రామచంద్రమూర్తి బాణములనెడి, శుచి=అగ్నిహోత్రముచే, దగ్ధంబై=కాలినదై.

తాత్పర్యము.

దిక్కులందుండువారికిఁ గూడఁ దెలియునట్లు ప్రసిద్ధముగా మూఢలారా! రామబాణాగ్నిచేఁ గాలి యీ పురము కాంతిహీనమై మాంసభోజులగు రాక్షసులు చచ్చినదై పట్టణము నిస్సందేహముగఁ బాడగును. ఇది నిజమగును. చూచుచుండుఁడు.

ఇదంతయు సీతాదేవి భూమియందు నాకాశమునందుఁ గానవచ్చు శకునములఁ బట్టి చెప్పె నని తెలియ నగు. ఉత్పాత చిహ్నము లనిష్టసూచకములు.

క. ఆ నీచ పంక్తికంఠుఁడు దా నొసఁగిన గడువు ముగియ♦దాపయ్యె మదిన్
మీ నైరృతు లెఱుఁగను సువి,ధానం బుత్పాత మిపుడు♦దలకొనుఁ జుండీ. ౬౧

అర్థములు. నీచపంక్తికంఠుఁడు = నీచుఁడు పంక్తికంఠుఁడు, నీచశబ్దము వృద్ధాదులలోఁ జేరినది, కావున దుష్టులోపము. "స మ్లేచ్ఛుఁడు బాహుగర్వమున నీచసుయోధనుఁడు" భారత ఉద్యో. దాపు=సమీపము, నైరృతులు = రాక్షసులు, సువిధానంబు=చక్కఁ జేసికొను విధము.

తాత్పర్యము.

ఆ నీచుఁడగు రావణాసురుఁడు నాకు సంవత్సరము గడువిచ్చెను. అది తన చావు గడువు. అది సమీపించుచున్నది. ఆ గండ మెట్లు తప్పించుకొనవలెనో మీ రాక్షసు లెఱుఁగరు. కావున నుత్పాత మిపుడే పుట్టును. చూడుఁడు.

క. మాంసము నమలెడి దుష్టనృ, శంసులు ధర్మం బెఱుంగఁ♦జాలర యసురుల్
హింసింతురు నన్ రాక్షస, పాంసను వఱువాతికూటి♦వ్యంజనమునకై. ౬౨

అర్థములు. నృశంసులు = క్రూరులు, రాక్షసపాంసను = నీచరాక్షసుని యొక్క, వఱువాతి=ఉదయకాలమందలి,

తాత్పర్యము.

ఈ లంక పాడగుటకుఁ బ్రారంభింపఁగా మాంసము నమలెడి క్రూరులకు బుద్ధితక్కువ గావున ధర్మమార్గమున నపాయము తప్పించుకొను మార్గ మెఱుంగక నా వలన నీకీడు మూఁడెనని రావణాసురుని ప్రొద్దుటి కూటికి సాధకముగ నన్ను హింసింతురు.

ఆ మాత్రమునఁ గీడు తప్పదు. తన్ను మగఁడు కొట్టఁగాఁ దాను బిడ్డను గొట్టుదానివలె రామచంద్రమూర్తి తమ్ముఁ జంపఁగాఁ దాము నన్నుఁ జంపుదురు.

క. ఏమి యొనర్చితి రేనియు, నే మనగా నేర్తు నాహృదీశ్వరుఁ గరుణా
ధాముని రాముని వికసిత, తామరసదళాక్షు విడిచి తలరెడిదానన్. ౬౭౩

అర్థములు. వికసిత తామరస దళాక్షున్ = వికసించిన తామర రేకులవంటి కన్నులు గలవానిని, హృదీశ్వరున్ = ప్రాణనాథుని-భర్తను.

తాత్పర్యము.

నా ప్రాణేశ్వరుఁడు దయాస్థానము. తామర రేకులవంటి కన్నులుగల రామచంద్రమూర్తిని విడిచి యేడ్చు నేను మీ రేమి చేసిన నే నేమి చేయఁగలను?

క. పతిఁ బాసి యుండు నీగతి, వెత గుడుచుట కన్న నిదిగొ విషముం గొని మం
చితవుగ నిచ్చెడి కరుణా, వతి యుండినఁ జననె కనఁగ వైవస్వతునిన్. ౬౭౪

అర్థములు. కరుణావతి = దయగలది, వైవస్వతునిన్ = యముని, కనఁగఁ జననె = చూడఁబోనా = చావనా?

తాత్పర్యము.

స్పష్టము.

ఉ. ఇక్కడఁ బ్రాణయుక్త నయి యేడ్చుచు నుండుట లక్ష్మణాగ్రజుం
డక్కడఁ దా నెఱుంగఁడొకొ కటా! యొక యింత యెఱింగి యుండినన్
జక్కఁగ రోయ కేలుడుగు క్ష్మాతల మెల్లను? నన్నుఁ బాసి లోఁ
ద్రెక్కొను శోకవేగమునఁ దీఱ నొకో? యిఁక నేమి సేయుదున్. ౬౭౫

అర్థములు. ఇక్కడన్ = ఈ లంకాపురమందు, ప్రాణయుక్తనయి = ప్రాణముతో నున్నదాన నయి, లక్ష్మణాగ్రజుండు — లక్ష్మణున కన్నయగు రామచంద్రమూర్తి, రామచంద్రుడనియే చెప్పరాదా యనిన రాముని విడిచినప్పటి సీతాదేవి దుఃఖము రామున కెట్లు తెలియఁగలదు? కన్నులారఁ జూచిన లక్ష్మణునకుఁ దెలియును. తనకుఁ దెలియకున్న లక్ష్మణుఁడు చెప్పియైన నుండఁడా? ఆ విధముగఁ దెలిసికొని వచ్చును గదా యని భావము. ఒక యింత = కొంచెమైనను, రోయక = వెదుకక, ఉడుగును = చాలించుకొనును.

తాత్పర్యము.

ఈ లంకలో నే నింకను బ్రతికి యేడ్చుచున్నదాన నని రామచంద్రమూర్తి

యెఱుఁగడు గాఁబోలు. తన్నుఁబాసి నే నేడ్చువిధము లక్ష్మణుఁడు చెప్పుటచే నైన దెలిసియుండెనా? భూమండల మంతయు వెదకక యేల యూరకుండును. నాదుఃఖ విధము తెలిసి వెదకింపక యుండుటచే నడవిలో నా శోకముచే మరణించె నేమో! ఇఁక నే నేమిచేయుదును?

క. ధన్యులు రఘుకులనృపమూ,ర్ధన్యుని నా హృదయాధినాథు ♦ రాముని నతరా
జన్యుని రాజీవాక్షుని. మాన్యునిఁ గను దేవసిద్ధ ♦ మౌనిప్రవరుల్. ౾౭౾

౾౪౾ పద్యముఁ జూచునది. అందు రామదర్శన భాగ్యము గల యాలోక జనులు ధన్యులని చెప్పఁబడెను. ఇందు ఆయననే పరలోకంబునఁ జూచు దేవతలు సిద్ధులు మౌనులు ధన్యులని చెప్పఁబడెను. ఇందే రూప గుణ విశేషములు చెప్పఁబడెనో యందా గుణవిశేషములే చెప్పఁబడెను. ఇట్లే లోకమూర్తికిఁ బరలోక మూర్తి కభేదము చెప్పఁబడెను.

'భక్తా స్తే యాదృశేరూపే సంసారపదసంశ్రితాః తాదృశం తే సమీక్షంతే' పరమవ్యోమవాసినః॥ సంసారమం దున్నప్పుడు భక్తు లెట్టిరూపమునం దాసక్తులై చూడఁగోరుదురో పరమపదమం దట్టి రూపమునే వారు చూడఁగలరు. ఇందు సీతా రాముల సేవించుచు ముక్తు లగువారికిఁ బరమపదమందు భగవంతుఁడు సీతారామ మూర్తిగనే కానవచ్చును. కృష్ణుని సేవించువారికి కృష్ణుడుగానే కానవచ్చును. భయంకరమూర్తులయిన భూతాదుల పతుల సేవించు తామసులకు భూతపతులు గానే కానవచ్చును. కావుననే శ్రీభాగవతమున సాత్త్వికులు భయంకర భూత పతుల వదలి సౌమ్యుఁడైన విష్ణువునే సేవింతు రని ప్రథమస్కంధమునఁ జెప్పబడెను. శంకరాచార్యులవారి తల్లి చరిత్ర స్మరించునది.

ఈ లోకమున సాధువులలోఁ గలిసి వర్తించు సాధువునకు సుఖము, సంతోషము గలదు. దుష్టులతోడ వర్తించు సాధువునకు సుఖము లేదు. అట్టులే ఇచ్చటి సాత్త్వికునకుఁ బరలోకమున సాత్త్వికులతోఁ గలిసిన సుఖము, సంతోషము గలదు. ఇచ్చట మిశ్రసాత్త్వికుఁ డనఁగాఁ గొంత సత్త్వగుణము, కొంత తమోగుణము గల వాఁడు. పరలోకమున భూతప్రేతపిశాచములతోఁ గలిసి వర్తించుట సుఖసంతోష కరముగాదు. కావున సాత్త్వికులు సత్త్వగుణముగలభగవంతునే యారాధింపవలెను.

క. పరమాత్ముఁడు ధీమంతుఁడు, నిరతము ధర్మైకరతుఁడు ♦ నృపఋషి యగు నా
వరశీలున కా లయినం, బరఁగెడి నా వలన నేమి ♦ ఫల మాయనకున్. ౾౭౭

అర్థములు. పరమాత్ముఁడు. (౧) ఆత్మల కన్నిటికిఁ బరముఁడైన వాఁడు, (౨) శ్రేష్ఠమైన స్వభావము గలవాఁడు. ధీమంతుఁడు = బుద్ధిమంతుఁడు, ఆశ్రితుల నెట్లు రక్షింతునా యను నాలోచన గలవాఁడు, ధర్మైకరతుఁడు = ధర్మము నందే ప్రీతిగలవాఁడు, నిరతము = ఎల్లప్పుడు, నృపఋషి = రాజఋషివంటి

వాఁడు, 'విద్ధి మాం ఋషిభి స్తుల్య'మ్మని కైకకుఁ జెప్పెనుగదా. ఋషి యనఁగా ద్రష్ట, చూచువాఁడు అని యర్థము. నృపఋషి యనఁగా జీవకోటులను బాలించు విధమునందే దృష్టిగలవాఁడు, వరశీలునకు = ఉత్తమ సదాచారము గలవానికి, ఆలు=భార్య.

తాత్పర్యము.

రామా రామా రామా యని నే నంగలార్చుచున్నదాననుగదా! రామచంద్రమూర్తి తోడి సాంగత్యము వలన నాకు మేలా? ఆయనకు మేలా? రామచంద్రమూర్తి పరమాత్ముఁడు, జీవాత్ముల కన్నిటికంటెఁ బరముఁడైనవాఁడు. ఆయన స్వరూప స్వభావములు జీవాత్ముల స్వరూప స్వభావముల కంటె నుత్తమ మైనవి. ఆయన సర్వజ్ఞుఁడు. ఎవ రెవరి విషయమున నెట్లు తాను బ్రవర్తించిన వారు బాగుపడుదురో యా విధము చక్కఁగఁ దెలిసినవాఁడు. తెలియుట మాత్రమే కాక జీవకోటి యుద్ధారణమందే సర్వదా యాసక్తి గలవాఁడు. రాజమాత్రుఁడా యనిన, రాజులందు ఋషివంటివాఁడు. జీవకోటులఁ బాలించు నాలోచన గలవాఁడు. ఇట్టి సదాచారసంపత్తిగలవానికి నేనో యాయన ఆజ్ఞకులోఁబడి యాయన నియోగించి నట్లు పని చేయుదానను. నే నాయన విషయమై పొరపడి వక్రముగఁ బోవుటయుఁ గలదు. ఇట్టి నావలన నేమి మేలుగలదు. నా మేలునకై యాయనను నేను సేవింప వలయును. నేను సేవింపకుండినంత మాత్రమున నాయనకు రాఁగల లోపము లేదు.

దీనివలన జీవాత్మలు భగవంతుని సేవించుట తమ మేలు కొఱకే కాని యాయన నుద్ధరింపఁ గాదు. జీవాత్మలు సేవింపకుండినంత మాత్రమున నాయనకు రాఁగల లోటు లేదు. లోకమున సర్వవిధముల సమాన మైనవి రెండు పదార్థములు లేవు. ఎందుఁజూచినను గొంచెమైన హెచ్చుతగ్గులే కానవచ్చును. హెచ్చు దానిని తక్కువది తన మేలునకై యాశ్రయింపవలసి యున్నది. అట్టులే భగవదంశము లైన జీవాత్మలు పరమాత్మను సేవించుట తమ మేలునకే. వీరి సేవవలన నవాప్త సమస్తకాముఁడైన భగవంతునకు రాఁగల లాభమేమియు లేదు.

ఆ. కంటి కెదుర నున్నఁ ♦ గడుఁ బ్రేమ గలుగును
మఱుఁగువడిన మైత్రి ♦ మఱపు గలుగుఁ
తథ్య మద్ది యగుఁ గృ ♦ తఘ్నులయం, దెదఁ
బ్రేమ మఱవఁ డెపుడు ♦ రామవిభుఁడు. ౬౭౮

తాత్పర్యము.

రామచంద్రమూర్తి రాజుగదా! రాజులు తమ యెదురుగ నున్న వారి నెక్కువగఁ బ్రేమించుటయుఁ, జాటుగనున్న వారిని మఱచి పోవుటయుఁగలదు. ఆ కారణమున నెదురుగాఁజూచునప్పు డెంతో ప్రేమగలవాఁడై యుండుటవాస్తవమే, ఇప్పుడుకనుచా

టగుటచే మఱచియుండునేమో. ఆ కారణమున నా విషయమై వెదకుటగాని, యిచ్చటికి వచ్చుటగాని యాలోచింపలేదేమో యందునా? కృతఘ్నులందుఁ గనుచాటు వారిని మఱచు గుణముగలదు. రామచంద్రమూర్తి కృతఘ్నుండుగాఁడే. ఒక్కయుపకారము చేసినను గలకాలము దానిని స్మృతియందుంచుకొనువాఁడే. అట్టివాఁడు నన్ను మఱచునా! చాటుగ నున్నప్పు డొక విధముగ, నెదురుగ నున్నప్పు డొక విధముగ నే నుందునేమో కాని యాయన ప్రత్యక్షమందుఁ బరోక్షమందు నేకవిధముగ నుండును. సమక్షమున నే నుపేక్షింతునేమో యనుటకు భగవద్గీత యందలి.

ద్వి. నీ యిట్టి మహిమను నే నెఱుంగమిని, నో యచ్యుతా చెల్మినో పొరపడియొ
యో యాదవా యని, యో కృష్ణ యనుచు, నోయి సఖా యని యూహించి చెలిమి
గేలిసేయుచు నిన్నుఁ గ్రీడల భుక్తి, వేళల నాసన వేళల నొంటి,
పాటున నేఁ బెద్దవారి సన్నిధినో, మాటలాడిన యవమానంపు నుడుల,
నప్రమేయా! కృష్ణ! యాత్మ క్షమింపు.

అను నర్జున వాక్యంబులు స్మరించునది. అరణ్యమునకు నిన్నుఁ బిలుచుకొని పోనని రామమూర్తి చెప్పినపుడు సీతాదేవి నలుగురిలో నవమానకరముగ మాటలాడలేదా? ఏకవచనమునఁ బిలువలేదా? రామచంద్రమూర్తి యిట్టి మాటలాడెనా? రావణ వధానంతరము మాటలాడలేదా యనిన నది నైమిత్తికము. ఆమె మహిమ లోకమునకుఁ దెలుపుటకే కాని క్రోధముచేఁ గాదు. జీవాత్మలు భగవంతుని విషయమున నెన్ని యపచారము లైనఁ జేయుదురు గాని భగవంతుఁ డట్లు చేయఁడు. దూరముగా నున్న మాత్రమున బిడ్డలను దల్లిదండ్రులు మఱతురా? అట్లులే భగవంతుఁడును.

ఆ. అంతమంచిగుణము♦లమరవో నా యందుఁ, బుణ్యఫలము చూఱ♦పోయె నేమొ?
ప్రాణతుల్యుఁ డైన♦భర్తచేవిడువంగఁ, బడితిఁ బడఁతి! గోడు♦గుడుచు దాన. ౯౭౯

తాత్పర్యము.

అంత ప్రేమ నీ యందు నీ భర్త కింకను గలదేని యేల రాలేదందువా? ఓసీ రాక్షసీ! చెప్పెద విను. అది యాయన లోపముగాదు. నన్నాయన యనుగ్రహింపఁ దగినంత మంచి గుణములు నాయందు లేవో, ఒకవేళ నుండినను వాని పుణ్యఫలము ప్రారబ్ధవశమునఁ జెడిపోయెనో? ఆ కారణమున నా భర్తచే నేను విడువఁ బడితిని గాని యాయనకు నా యందు దయలేక కాదు. ఆయన నన్ను మఱచి పోవుట చేతను గాదు.

క. శూరుఁడు రణధీరుఁడు నరి, మారుఁడు సద్గుణధనుండు ♦ మహితాత్ముఁడు సూ
దారుఁడు రాముఁడు పాయుట, ధారిణి నే మనుటకంటెఁ ♦ దగు మరణింపన్.

అర్థములు. అరిమారుఁడు=శత్రువుల సంహరించువాఁడు, సూదారుఁడు=సు+ఉదారుఁడు=మిక్కిలి గంభీరుఁడు, మనుటకంటెఁ=బ్రతుకుటకంటె.

తాత్పర్యము.

ఓసీ సీతా! నీ దోషమో, యాయన దోషమో ఆయన రాలేదు. నిన్నుఁ దోసెక్కొని పోలేదు. ఇప్పుడు నీవు చేయబోవునది యేమనెదవా? అటువంటి శూరుఁడు యుద్ధమునందటువంటి ధైర్యము గలవాఁడు శత్రుసంహారకుఁడు కల్యాణగుణములే ధనముగాఁ గలవాఁడు గొప్ప స్వభావము మనస్సు గలవాఁడు, మిగుల గంభీరుఁడు త్యాగియగు రామచంద్రమూర్తిని బాసి బ్రతికి యుండుటకంటెఁ జచ్చుటయే తగినపని.

మ. వనిలో వేరులు వెల్లఁకుల్ మెసవుచున్ ♦ వర్జించి శస్త్రాస్త్రముల్
మనుజశ్రేష్ఠులు నన్నదమ్ములు వ్యథా♦మగ్నాత్ములై పోయిరో?
యనయుండీ యసురేశ్వరుండు కుటిల♦వ్యాపార పారీణుఁడే
మన శూరాగ్రణులన్ వధించె నొకొ మా♦యాసంప్రయోగంబునన్. ౬౮౧

అర్థములు. మెసవుచున్=తినుచు, వర్జించి=వదలి; వ్యథామగ్నాత్ములై= శోకమునందు మునిగినవారై, అనయుండు = నీతిమాలిన వాఁడు, కుటిల వ్యాపార పారీణుఁడు= మోసకృత్యములందు గడితేఱినవాఁడు, మాయాసంప్రయోగంబునన్= మోసగించుటచేత, ఈ పద్యము పై పద్యమునకు ముందుండుట బాగు.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి యేల రాలేదందువా? దానికి రెండు కారణములు గలవు. ఒకటి యడవిలో ఆకులలములు వేరువెల్లఁకులు దిని శస్త్రాస్త్రములు వదలి నాయెడఁబాటు వలనఁ గలిగిన దుఃఖము చేతను అవమానము చేతను శోకమున మునిఁగి యన్నదమ్ము లిరువురు మరణించియైన నుండవలెను. లేదా? న్యాయము దప్పి చరించు నీ రావణుఁడు వంచనయందు గడితేఱినవాఁడు కావున నేదే మోసముచే వారిని జంపియైన నుండవలెను. వారు మరణించి యుండుటచే రాలేదేమో కాని జీవించియే యుండిన రాక మానరు.

క. ఇంతటి దురవస్థలఁ బడి, యింతటి దుఃఖంబుఁ గుడుచు♦హీనాత్మకుఁ దా
నెంతో సుఖదము మరణం, బంతకునకుఁ గరుణ లేదు♦హా! నా మూఁదన్. ౬౮౨

తాత్పర్యము.

ఇంత దుర్దశలకుఁ బాలుపడి యింతకష్ట మనుభవించు నీచురాలికి దీనికంటెఁ జచ్చుటే సుఖకరము. కాని యమునకు నామీఁద దయరాలేదు. అయ్యో నేనేమి చేయుదును?

క. ఎంతటిధన్యులో మును లా,వంతయు నే వంత లేక ♦ త్యక్తకలుషులై
స్వాంతముఁ బ్రియాప్రియంబుల,పొంతలఁ బోనీరు విజిత♦బుద్ధీంద్రియులై. ౬౮౩

అర్థములు. ఆవంతయున్ = ఆవగింజంత యైనను, వంత = వ్యసనము,

త్యక్తకలుషులై=వదలిపెట్టఁబడిన పాపములుగలవారై, కలుషము = ద్వంద్వము, స్వాంతముల్=మనస్సును; ప్రియాప్రియంబులల్=ఇష్టములయొక్క యనిష్టముల యొక్క, పొంతలల్ = సమీపమందు, విజితబుద్ధీంద్రియులై=జయింపఁ బడిన మనస్సు ఇంద్రియములు గలవారై.

తా త్ప ర్య ము.

మనస్సును నింద్రియములను జయించిన వారై శీతోష్ణములు సుఖదుఃఖములు లాభాలాభములు లోనగు ద్వంద్వము లనఁబడు కలుషముల వదలినవారై మనస్సును బ్రియమునకుఁగాని యప్రియమునకుఁ గాని సమీపమునకైనఁ బోనీయక సుఖము వచ్చిన సంతోషింపక యప్రియము వచ్చిన దుఃఖింపక రెంటను నేకవిధముగ నుండి కొంచెమైన నే వ్యసనము లేకయుండు మునీశ్వరు లెంత పుణ్యాత్ములో.

క. ప్రియమున సంతోషం బప్రియమున నధికముగ భయము♦పృథివి జనించున్
భయమును ముదమును విడిచిన, యయగుణులకు మ్రొక్కెదాన♦నవహితమతినై.

అర్థములు. అయగుణులకున్=శుభము గలిగించు గుణములు గలవారికి, అవహితమతినై=హెచ్చరికతోఁ గూడిన మనస్సు గలదాననై.

తా త్ప ర్య ము.

దేహాభిమానము గలవారికిఁ బ్రియము కలిగెనా సంతోషము కలుగును. అప్రియము కలిగెనా భయము కలుగును. కావున మనస్సు ప్రియము మీఁదను అప్రియము మీఁదను పోకపోయెనా ముదము లేదు, భయము లేదు. కావున నట్టి శుభకరమైన గుణములు గలవారికి హెచ్చరిక గలదాననై మ్రొక్కెదను.

మును లని చెప్పుటచే నీ రెండు పద్యములు వానప్రస్థుల విషయ మని యేర్పడు చున్నది. అయినను నిది నాకు స్వధర్మము గావున నా విషయ మాలోచింపఁ [illegible] లేదనుకొను చున్నది.

క. కావున విదితాత్ముం డగు, కేవల మత్ప్రియుని రాముఁ♦గీర్తితగుణునిన్
బో విడిచి పాపిదైత్యున, కే వశపడి యుండఁ గలనె♦మృత్యువుఁ గందున్.౬౨.౫౨

అర్థములు. విదితాత్ముండు=తెలియఁబడిన ఆత్మ గలవాఁడు, కేవల మత్ప్రియుఁడు=నాకుఁ గేవలము ప్రియుఁడగువాఁడు, అంతకంటెఁ బ్రియమైనది నాకు లేదు. కీర్తితగుణునిన్ = కీర్తింపఁబడిన గుణములు గలవానిని, పాపిదైత్యునకు= పాపపు రాక్షసునకు.

తా త్ప ర్య ము.

ఆత్మజ్ఞానము గలవాఁడై నాకుఁ బ్రియుఁడైన వాఁడొక్కఁడే యయి కీర్తింపబడిన సద్గుణములు గల రామచంద్రమూర్తిని విడిచి యాత్మజ్ఞానము లేక నా ప్రీతికిఁ బాత్రుఁడుగాక నింద్యగుణములు గల పాపపు రావణాసురునకు స్వాధీనపడి యుండఁ గలనా? చావనైనఁ జచ్చెదను గాని.

—— ౨౭వ సర్గము. త్రిజట తన స్వప్నవృత్తాంతము రాక్షసస్త్రీలకుఁ జెప్పుట. ——

క. అనిన విని యామె మాటకును గింకిరిపాటు గదురఁ గొందఱు రక్షో
వనితలు దశకంఠునకుఁ; వినిపింపఁగఁ జనిరి సీత వృత్తాంతంబున్. ౬౮౬

అర్థములు. కింకిరిపాటు = కోపము.

తా త్ప ర్య ము.

సీతాదేవి చెప్పిన యీ మాటలువిని రాక్షసస్త్రీలు కోపించినవారై కొందఱు రావణాసురుని పాలికిఁబోయి రాజా నీవుచెప్పినట్లు మే మామెను నయమున భయమునఁ జెప్పి చూచితిమి. మా మాట విన లేదు. మరణింప యత్నించుచున్నది యని చెప్పిరి.

క. కొందఱు కరాళవదనులు, ముందర నిలుచుండి రామ ముదితం గని యో
మందమతి! నీదు మాంసం, బిందఱమును గుడుతు మనుడు నేకార్థముగన్.

తా త్ప ర్య ము.

మఱి కొందఱు మిట్టపండ్లు గల నోళ్ళవారు సీతాదేవి కెదురుగ నిలఁబడి యోసీ బుద్ధిలేని దానా! యిప్పుడే నిన్నుఁ జంపి నీ మాంసము నిందఱము పంచుకొనెద మనియొక్క మాటగాఁ జెప్పిరి.

క. వారలను గాంచి నిద్దురఁ, గూరిన యొకవృద్ధ మేలుకొని త్రిజట యనన్
బేరుది యిట్టులు పలికెన్, మీరలు చాలింపుఁ డిక మీ మీ మాటల్. ౬౮౮

తా త్ప ర్య ము.

అప్పు డచ్చట నిద్దుర పోవుచున్న యొక ముసలి రాక్షసి త్రిజట యనునది మేలుకని వారి మాటలు విని వారితో నిట్లనెను. మీ మీ మాటలు మీరు చాలింపుఁడు. అది తత్తఱపాటుచే లేచి కూర్చుండు నవకాశము లేక పరుండియే చెప్పుచున్నది.

క. మీరకట సీతను రాముని, దారను జనకేంద్రుసుతను దశరథు స్నుషనున్
జేరి భుజింతురు? పొండీ, దూరంబుగ నన్నుఁ దినుఁడు తొయ్యలులారా! ౬౮౯

తా త్ప ర్య ము.

ఆడంగులారా! సీతాదేవిని, రాముని భార్యను, జనకరాజుపుత్రిని దశరథు కోడలిని మీరా భుజించువారు. చాలుఁజాలు, దూరముగఁబొండు, ఆమెను బాధింపకుఁడు. మీరు తినవలె నని యున్న నామె బదులు నన్నుఁ దినుఁడు.

మ. కలఁ గంటిం జెలులార! యే మనుదు మైకంపంబు పో దిప్పుడున్
దలఁపన్ దాని, సమూలనాశనము సిద్ధం బాశరశ్రేణి, కీ
నళినాక్షీమణిభర్తకున్ జయము మానం బో దనన్, భీత ల
చ్చెలువల్ నీ కల యెట్టి దీ నిశ ననం జెప్పం దదీయార్థమున్. ౬౯౦

అర్థములు. మైకంపంబు = దేహమున వణఁకు, ఆశరశ్రేణికిన్ = రాక్షస

సమూహమునకు, సమూలనాశనము = వేరుతోడ పాడైపోవుట, భీతలు = భయపడినవారు, నిశి = రాత్రియందు, తదీయార్థముం = ఆ కలయందలి విషయమును. ఈ త్రిజట విభీషణుని కూఁతు రని కొంద ఱందురు.

తాత్పర్యము.

అమ్మలారా! నే నొక కల గంటిని. నే నేమని చెప్పుదును. దానిని దలఁచుకొనిన నా దేహ మిప్పటికిని వణఁకుచున్నది. దానివలన రాక్షస సమూహము మూల ముట్టుగ నాశనము కాఁగలదు. ఈ సీతాదేవి భర్తకు జయము తప్పదు. అని చెప్పఁగా వారు భయపడి నీవెట్టి కలగంటివి చెప్పుమన నా కలయందలి విషయమా త్రిజట యిట్లు చెప్పెను.

సీ. ఆకాశగమనంబు ♦ హంససహస్రంబు, గజదంతమయ మైన ♦ కలికి పల్ల
కీలోనఁ దెల్లని ♦ మాలికల్ చేలముల్, దాల్చి సుమిత్రాగ్ర ♦ తనయుతోడ
రామచంద్రుఁడు వచ్చె ♦ రమణీయశుక్లాంబ, రావృత యగుచు నీ ♦ దేవి పాల
వెల్లిలోపల నున్న ♦ వెల్లనిగట్టుపై, భానునితోఁ బ్రభ ♦ పరఁగునట్లు
ఆ. రామచంద్రుతోడ ♦ రంజిల్లఁ గంటిని ధరముఁబోలి నాల్గు ♦ దంతములను
మీఱు చున్నగజము ♦ మీఁద సలక్ష్మణుఁ, గౌసలేయు నరుగఁ ♦ గంటిఁ గలను.

అర్థములు. ఆకాశ గమనంబు = ఆకాశమునఁ బోవునది, గజదంతమయము = ఏనుఁగు దంతముతోఁ జేసినది, శుక్లాంబరావృత = తెల్లని వస్త్రము కట్టుకొన్నది, పాలవెల్లి = క్షీరసముద్రము, గట్టు = పర్వతము, ధరము = పర్వతము, కౌసలేయుఁ = రామచంద్రమూర్తిని.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి యాకాశమునం బోవునట్టిదియు, వేయి హంసలుగట్టినట్టిదియుఁ, దెల్లని యేనుఁగు దంతముతోఁ జేయఁబడినదియు నగు పల్లకీలో తెల్లని పూలసరములు వస్త్రములు ధరించిన లక్ష్మణునితోడ వచ్చెను. ఈసీతాదేవి యందమైన తెల్లని చీర గట్టుకొని పాలసముద్రమునందలి తెల్లని పర్వతముమీఁద సూర్యునితోడఁ బ్రభ యున్నట్టు లాయనలోడ నుండఁగంటిని. నాలుగు దంతములు గలదై కొండవలె నున్న యేనుఁగుమీఁద లక్ష్మణుతోడ రాముఁడు పోవగంటిని.

"ఆరోహణం గోవృషకుంజరాణాం, ప్రాసాద శైలాగ్ర వనస్పతీనాం,విష్ఠానులేపో రుదితం మృతంచ స్వప్నేష్వగమ్యాగమనంచ ధన్యం" (స్వప్నాధ్యాయము) కలలందు ఎద్దులను, ఏనుఁగులను, మేడలను, కొండశిఖరములను, కాచు పూచు చెట్లను ఎక్కుటయు, మలము పూసికొనుట, ఏడ్చుట, చచ్చుట, పొందరాని దానితోఁ బొందుట—ఇవి శుభములు.

క. వెల్లని వలిపపుఁ జేలలుఁ, దెల్లని మాల్యములు దాల్చి ♦ ధీరోత్తము లీ
పల్లవపద చెంగట రం,జిల్లఁగ రఘుకులులఁ గంటిఁ ♦ జిత్తం బగలన్. ౯౨

తా త్ప ర్య ము.

తెల్లని దువ్వలువలు తెల్లని పూలదండలు ధరించి ధీరులలో శ్రేష్ఠులైనరామలక్ష్మణులు చిగుళ్ళవంటి పాదములు గల యీమె ప్రక్కను సంతోషముతో నుండఁ గంటిని. అది చూడఁగానే నా గుండెలు పగిలెను.

తే. అంత నా పర్వతాగ్రంబు♦నందు మింటి, నంటి యుండిన గౌరుపై ♦ నబ్జమిత్ర
కులుని తొడమీఁద నెక్కి యీ♦కలువకంటి,తరణి చంద్రుల నంటుచి♦ధంబుఁగంటి.

అర్థములు. గౌరు = ఏనుఁగు; అబ్జమిత్రకులునితొడ = సూర్యవంశమునఁ బుట్టిన రామచంద్రమూర్తితొడ, తరణి చంద్రులఁ = సూర్యచంద్రులను.

తా త్ప ర్య ము.

ఆవల నాపర్వతము శిఖరమునందు నాకాశముఁదాఁకుచున్న యేనుఁగుమీఁద రాముని తొడమీఁద నీసీతాదేవియుండి సూర్యచంద్రులఁ దాఁకుచున్నట్లు చూచితిని.

ఆదిత్య మడలం వాతు చంద్రమండల మేవవా
స్వప్నే గృహ్ణాతి హస్తాభ్యాం రాజ్యం సంప్రాప్నుయా న్మహత్.

కలయందు సూర్యమండలముగాని, చంద్రమండలముగాని చేతులతోఁ బట్టుకొన్నట్లు కనఁబడెనా వానికి గొప్పరాజ్యము లభించును.

క. రాకొమరులు రాజాస్యయుఁ, బ్రాకటముగ నెక్కినట్టి ♦ భద్రేభము నే
నాకసమున లంకపయిన్, జోకగ నిలువంగఁ గంటి ♦ సుందరులారా! ౯౫౪

అర్థములు. రాకొమరులు = రాజకుమారులు, రాజాస్య = చంద్రునివంటి ముఖముగలది, భద్రేభము = భద్రజాతి యేనుఁగు.

తా త్ప ర్య ము.

రాజకుమారులు రామలక్ష్మణులు చంద్రునివంటి ముఖము గల సీతాదేవి స్పష్టముగ భద్రజాతి యేనుఁగుపై నెక్కి లంకమీఁద నాకాశమున నున్నట్లు గంటిని.

క. అంచిత వృషభాష్టకముం, బూంచిన రథ మెక్కి పురుష♦పుంగవుఁ డిటకీ
చంచలలోచనతో నరు, దెంచుట నేఁ గంటిఁ గొఱంత♦ దెలియఁగ వినుఁడీ. ౯౫౫

అర్థములు. వృషభాష్టకము = ఎనిమిది యెద్దులు, పూంచిన = పూనునట్లు చేసిన.

మంచి యెద్దు లెనిమిది కట్టిన తేరెక్కి రామచంద్రుఁడీ సీతాదేవితో వచ్చుచుండుట గంటిని. తక్కిన కల చెప్పెద వినుఁడు.

తా త్ప ర్య ము.

తే. అర్కసన్నిభపుష్పకా♦ఖ్యాతదేవ,యానమున వార లీ గజ♦యానతోడ
నుత్తరంబుగ నరుగుట ♦ యుత్సవముగఁ, గన్నులారంగఁ గంటి నేఁ♦గలనుజుండి.

అర్కసన్నిభ = సూర్యునితో సమానమైన, పుష్పక+ఆఖ్యాత = పుష్పకమను పేరు గల, దేవయానమున = విమానమందు, వారలు = రామలక్ష్మణులు.

తా త్ప ర్య ము.

సూర్యకాంతిగల పుష్పకవిమాన మెక్కి రామలక్ష్మణు లుత్తరముగ నీసీత తోడఁ బోవఁ జూచితిని.

క. ఆవిష్ణుపరాక్రముఁ డగు, ధీవిభవుఁడు రామవిభుఁడు ♦ తేజం బెసఁగం
గా వెలఁదియుఁ దమ్ముఁడుఁ దా, నీ విధమున నుండఁ గంటి ♦ నిది నిక్కంబా.

తా త్ప ర్య ము :

విష్ణుపరాక్రముఁడు, మహాబుద్ధిశాలి యగు రామచంద్రమూర్తి, సీతతోను, దమ్మునితోను నీ విధముగ నుండఁగా నేను జూచితిని. ఇది నిజమగును.

స్వప్నక్రమ మే మనఁగా:—రామలక్ష్మణులు పల్లకిలో నెక్కి సీతను గూర్చి లంకాసమీపమునకు వచ్చిరి. లంక దగ్గఱ పాలసముద్రమునందు నొక తెల్లనికొండ యాకలయందుఁ గనఁబడెను. అచ్చటికి రామచంద్రమూర్తి వచ్చి చేరెను. సీతయు నా కొండయం దుండినది. రామలక్ష్మణులు పల్లకి దిగి యేనుఁగుపై నెక్కి సీత యొద్దకు వచ్చిరి. సీతయు నేనుఁగుపై నెక్కి పెనిమిటి తొడపైఁ గూర్చుండి నిక్కి సూర్యచంద్రులను బట్టుచుండినది. ఆ విధముగ వారు లంకమీఁదికి నాకాశ మార్గమున వచ్చి యేనుఁగు దిగి యెనిమిది యెద్దులు కట్టిన తేరిపై గూర్చుండి లంకలోనికి వచ్చి పుష్పకము నెక్కి యుత్తర దిక్కుగాఁ బోయిరి.

క. పాపాత్ములు స్వర్గంబున,దాపున కరుగంగ లేని♦తద్గతి రాముఀ
రూపింప నైన నేరదు, సౌపర్వసురారిగణము ♦ సంగరవీథిఀ. ౬౫

అర్థములు. సౌపర్వ = దేవతాసమూహము, సురారిగణము = రాక్షస సమూహము, సంగరవీథిఀ = యుద్ధరంగమందు.

తా త్ప ర్య ము.

పాపాత్ములు స్వర్గము సమీపమునకైన నెట్లు పోలేరో యా విధముగ దేవ రాక్షస సమూహములు యుద్ధరంగమందు శ్రీరామచంద్రమూర్తిని సమీపింపలేవు.

సీ. దశకంధరునిఁ గంటిఁ ♦ దైలలిప్తాంగుఁడై, తైలంబుఁ గ్రోలు చు♦న్మత్తుఁడగుచు
గన్నేరుపేరులు ♦ గళమునఁ గ్రేలంగ, రక్తాంబరంబులు ♦ గ్రాలు చుండ
ముండుఁడై, కృష్ణాంబ♦రుండయి వెండియుఁ,బుష్పకంబున నుండి♦పుడమిఁగూలఁ
బడఁతి యీడ్వంగను ♦ బాధలు పడుచుండ', గంటి నేఁ గల సోఁకు♦కాంతలార!
తే. మఱియు ఖరయుక్తరథమున♦మలయువాని, రక్తమాల్యానులేపన♦యుక్తుఁడగుచు
భ్రాంతమతి నూనెఁ గ్రోలుచు♦గంతులిడుచు,నగుచు గాడిదపై దక్షి♦ణంబుగాఁగ.

అర్థములు, తైలలిప్తాంగుఁడై=నూనె పూసికొనిన దేహము గలవాఁడై, క్రోలుచుఀ = త్రాగుచు, ముండుఁడై = బోడితల గలవాఁడై, కృష్ణాంబరుండయి = నల్లని గుడ్డ కట్టుకొన్నవాఁడై.

తాత్పర్యము.

ఇఁక రావణు విషయమై యేమి కల గంటినో చెప్పెద వినుము. రావణుఁడు దేహమునకు నూనె రాచుకొని, దూనె ద్రావుచు దేహము తెలియనివాఁడై, గన్నేరు పూలదండలు మెడయందు వ్రేలాడ నెఱ్ఱవస్త్రములు గట్టుకొని బోడితలవాఁడై నల్ల వస్త్రములు గలవాఁడై, పుష్పకమున నుండి యొక యాఁడుది యీడువఁగా నేలఁబడి బాధపడుచుండఁ జూచితి. మఱియు గాడిదలు కట్టిన తేరిమీఁద నెఱ్ఱ పూలదండలు నెఱ్ఱ గంధము పూసికొని భ్రాంత చిత్తుఁడై నూనె ద్రావుచు గంతులువెట్టుచు గాడిద మీఁద దక్షిణముగా.

సీ. చను చుండ వెండియు♦మన దశవదనుండు, తలక్రిందు గాఁగ గా♦ర్దభమునుండి
భయమోహితుం డయి♦పడుచు దిగ్గన లేచి, వెల వెలనై మద♦విహ్వలుండు
సాధ్వసార్తుండు నై♦జల్పకుఁ డగుచును, దిగ్వాసుఁ డయి దిక్కు♦ తెలియ లేక
దుర్గంధఘోర మై♦దుస్సహతిమిర మై, నరకాభ మగు పెను♦బురదలోనఁ
తే. బడఁగఁ గనుగొంటిఁ గాళినాఁ♦బడఁతి యొక తె
రక్తవసనయు మఱియుఁ గ♦ర్దమవిలిప్త
దేహయును నయి మెడగ్రుచ్చి♦తిగుచు చుండె
దక్షిణపుదిక్కుగా మన♦రాక్షసేంద్రు. ౨౦౦

తాత్పర్యము.

పోవుచు గాడిదనుండి తలక్రిందుగాఁ బడుచు, భయపడి దిగ్గన లేచి తెల్లబోయి మత్తుచే వికలుఁడై; భయపీడితుఁడై, వదరుచు, దిగంబరుఁడయి, దిక్కు తెలియక గబ్బుగొట్టుచు భయంకరమై, సహింపరాని చీఁకటి గల నరకసమమైన పెను బురదలో బడుచుండఁ జూచితిని. కాళి యనెడి స్త్రీ యెఱ్ఱగుడ్డ కట్టుకొని బురద పూసికొని వాని మెడఁ గౌఁగిలించి దక్షిణదిక్కుగా మన రాక్షసరాజు నీడ్చుచుండెను.

సీ. అల కుంభకర్ణుపై♦గలఁ గంటి నే నిట్టి, రీతిన మఱి దశ♦గ్రీవుసుతులు
నూనెఁ గ్రుంకుట గంటి♦దానవనాథుండు. పందిని నింద్రజి♦బలు మొసలిని
గుంభకర్ణుం డొంటెఁ♦గొని వాహనములుగ, దక్షిణదిశ కయి♦తరలఁ గంటి
వీరలలోన వి♦భీషణుం డొక్కఁడే, వెల్లనిగొడుగును♦ వెల్లచేల
తే. ములును వెల్లనిగంధంపుఁ♦బూఁతలు నయి, శంఖదుందుభినిర్ఘోష♦సంయుతముగ
నృత్తగీతాదులొప్పభూ♦భృత్సమంబు, మేఘరావంబునగు నొక్క♦ మేలిగజము.

తాత్పర్యము.

ఇఁక నా కుంభకర్ణుపై నిట్టి కల నే గంటిని. రావణాసురుని కొడుకులు నూనె మునుగుటఁ జూచితిని. రావణాసురుఁడు పందిని ఇంద్రజిత్తు మొసలిని, గుంభకర్ణుఁ డొంటెను, వాహనములుగాఁ జేసికొని దక్షిణదిక్కు ప్రయాణము చేయఁ జూచితిని. ఇందఱిలో విభీషణుఁ డొక్కఁడే తెల్లనిగొడుగు తెల్లవస్త్రములు తెల్లగంధపుఁ

బూతఁగలవాఁడై శంఖములయు భేరులయు ధ్వనులు గలుగఁగ ఆటలు పాటలు నొప్పు కొండవంటిదియు మేఘధ్వని గలదియు నగు నొక్క పెద్ద యేనుఁగు నెక్కి.

తే. ఎక్కి నల్వురమంత్రు ♦ లెనక మెసఁగ, మింటి తెరువునఁ బోవుచు ♦ నుంటఁగంటిఁ;
ద్రావి చెంగావిగుడ్డలు ♦ రక్తమాల్య,ములును దాలిచి వాదిత్ర ♦ ములు చెలంగ.

తాత్పర్యము.

నల్వురు మంత్రులతో విజృంభించి యాకాశమునఁ బోవుచుండఁ జూచితిని. త్రాగి యెఱ్ఱ గుడ్డలు ఎఱ్ఱ మాల్యములు ధరించి మేళతాళములతో నొప్పఁగా జూచితిని. విఱిగిన గోపురములు తోరణములు గల్దై రావణరక్షితమైన లంక సముద్రములోఁ బడఁగాఁ జూచితిని.

తే. సోఁకుమూఁకలు వెలయ నేఁ ♦ జూడఁ గంటి, భగ్నగోపురతోరణప ♦ ంక్తిగలిగి
యసురనాయకరక్షితం ♦ బైన లంక, వనధిలోపలఁ గూలంగఁ ♦ గనితిఁ జుండు.

దీని తాత్పర్యము పై ౨౦౨ పద్యమున నిమిడియున్నది.

క. ప్రాఁత యఁట రామునకు నొక, క్రోఁతి వెస న్వచ్చి లంక ♦ గుఱుకొని బూదిఁ
జేఁతయుఁ; జేడెలు మ్రోఁతలు, కూఁతలునై చొచ్చి లంకఁ ♦ గ్రోలుచు నూనెఁ.

అర్థములు. ప్రాఁత = భృత్యుఁడు, గుఱుకొని = ప్రయత్నపూర్వకముగా, బూదిఁ జేఁతయు = భస్మము చేయుటయు చూచితిని.

తాత్పర్యము.

మఱియొక విశేషము చెప్పెద వినుఁడు. రామునకు భృత్యుఁడఁట, ఒక క్రోఁతివచ్చి ప్రయత్నముతో లంకను గాల్చి బూఁడిదచేయఁగాఁ గంటిని. ఆఁడువా రేడ్పులతో నూనె త్రావి లంకలో.

క. వేఁడి యగుబూడిఁ గూలుట, మూఁడఁగ విధి కుంభకర్ణ ♦ ముఖ్యులు దమ దా
వాఁడిమి చెడి పడఁబొఱగఁ, బేఁడమడుంగునను గంటి ♦ వెలఁదుకలారా. ౨౦౫

తాత్పర్యము.

వేఁడి బూడిదలోఁ బడుటయుఁ గుంభకర్ణుఁడు మొదలగు ముఖ్యరాక్షసులు చచ్చి పౌరుషము చెడి పేఁడ మడుఁగులోఁ బడుచుండఁగఁ జూచితిని.

ఈ కలగన్నది త్రిజట. ఇది విభీషణుని కూఁతురని చెప్పఁబడెను. విభీషణుఁడు మొదటినుండియు సీతా పక్షపాతి. ఆమెయం దభిమానము గలవాఁడు. ఆయన తన భార్యను కూఁతునుబంపి సీతాదేవికి ననుకూలముగ వర్తింపఁ జేయుచుండినవాఁడు. ఇట్లగుటచేత రాక్షసస్త్రీలు సీతాదేవిని బెట్టుబాధ సహింపఁజాలక వారిని భయపెట్టుటకై తనబిడ్డ కిట్టి యుపాయము చెప్పెనాయని సందేహింపనగు ఇది ముసలిది. కావున విభీషణునిపుత్రి కాదేమోయని సందేహము. అదెట్టు లుండినను తక్కిన దంతయుఁ గల్పితమనితలంచినను క్రోఁతి వచ్చుట లంక కాల్చుట యనునది యెవరికి నూహింప

రాని విషయము. అట్టి కల వచ్చుట వెంటనే యది ఫలించుట యనునది స్వప్న మంతయుఁ గల్పితము కాదని స్థిరపఱచుచున్నది.

స్వ ప్న వి చా ర ము.

శూన్యవాదులు నాస్తికులు మాయావాదులు స్వప్నము లసత్యము లందురు. ఈ వాదము శ్రుతిస్మృతీతిహాసపురాణాదుల యభిప్రాయమునకు ననుభవమునకు విరుద్ధమైనది. ఈ రామాయణమందే దశరథస్వప్నము, భరతస్వప్నము, త్రిజటా స్వప్నము మూఁడుగలవు. మూఁడును సత్యము లయ్యెను. పగటికలలు ధాతు వైష మ్యముచే వచ్చు కలలు నసత్యములగును గాని యారోగ్యవంతులై నిర్మలమనస్సు గలవారి స్వప్నములు సత్యములే యగును. అట్లు గాదేని స్వప్నవిషయమువాని ఫల ములుగుఱించి చెప్పు శాస్త్రవాక్యము లన్నియు నున్మత్తప్రలాపము లగును. అను భవ మందును నేటికిని ననేక స్వప్నములు సత్యము లగుచున్నవి. వాని నిరాకరించు టెట్లు? కావున వాని నసత్యము లనరాదు.

అట్లైన "కలలంబోలెడి పుత్ర మిత్ర వనితాగారాది సంయోగముల్" అని గ్రంథములు చెప్పుచున్న వే? యనిన నవి యసత్యము లని చెప్పలేదు. అల్పకాల ముండి యావల వ్యర్థములై పోవునని చెప్పుచున్నవి. కలలో లభించిన డబ్బు కలలో సత్యమే కాని మేలుకొన్నప్పు డవి యెట్లు పనికిరావో యట్టులే ఈ సంసారవర్గము జీవించియుండు వఱకేకాని పుణ్యపాపములవలెఁ బరలోకమునఁగాని భక్తిజ్ఞానముల వలె మోక్షదశయందుఁగాని పనికిరావు. కావున వ్యర్థములు. ఈ దేశపు నాణెము లీ దేశమునఁ జెల్లినను బరదేశమునఁ జెల్లవు. కావున వానికి విలువలేదు. వ్యర్థములు కావున బెండ్లాముబిడ్డలను కలలకుఁ బోల్తురు. దేహము నీరుబుగ్గవంటి దన్నప్పు డల్ప కాలముండునది యని యర్థమేకాని యసత్య మని యర్థముకాదు. ఎవరి యభిప్రాయ మెట్లుండినను రామాయణము స్వప్నములు సత్యములనియే సాధించుచున్నది.

బృహదారణ్యకోపనిషత్తు 4-3-9

"తస్యవా ఏతస్యపురుషస్య ద్వే ఏవ స్థానే భవత; ఇదంచ పరలోకస్థానంచ; సంధ్యం తృతీయం స్వప్నస్థానం, తస్మిన్సంధ్యే స్థానే తిష్ఠన్నేత ఉభేస్థానే పశ్యతీదంచ పరలోకస్థానంచ. అథ యథాక్రమోయం పరలోకస్థానే భవతి తమాక్రమ మాక్రమ్యోభయాన్, పాప్మన ఆనందాశ్చ పశ్యంతి; సయత్ర ప్రస్వపితి అస్య లోకస్య సర్వావతో మాత్రా మపాదాయ స్వయం విహృత్య స్వయం నిర్మాయ, స్వేన భాసా స్వేన జ్యోతిషా ప్రస్వపి త్యత్రాయం పురుషః స్వయంజ్యోతి ర్భవతి"

అర్థములు. ఆపురుషునకు (జీవాత్మకు) రెండుస్థానములే కలవు. ఈలోకము, పరలోకస్థానము. మూఁడవది స్వప్నమను తృతీయస్థానము. అది ఇహలోకమునకుఁ బరలోకమునకు సంధిస్థానము. ఆసంధిస్థానమందుండు ఈలోకమును బరలోకమును రెండునుజూచుచున్నాఁడు. (రెండుగ్రామముల సంధి పొలిమేర మీఁద నిలువఁబడిన

వాఁడు రెండుగ్రామముల పొలమును జూచునుగదా) ఇట్లు సంధియందున్నవాఁడై యీలోకమున జాగ్రద్దశయందలి విషయములను బరలోకమున స్వప్నదశయందలి విషయములనుజూచినవాఁడై పరలోకమార్గమును (తాను జేసిన పుణ్యపాప ఫలానుభవముకొలఁది) బట్టిపోయి స్వప్నప్రపంచమందునిలిచి యీలోకమున జాగ్రద్దశ యందలిపాపములను, స్వప్నమునఁ బరలోకమందలిసుఖములను జూచుచున్నాఁడు. భగవంతుడే వీనిని నిద్రపుచ్చునపుడు వానికి మేలుకొనినపు డున్న జ్ఞానమును ఇంద్రియములను దానే గ్రహించి బాహ్యేంద్రియముల నెల్ల నివర్తింపఁజేసి స్వప్నపదార్థములను వానివాని యదృష్టము కొలఁది సృష్టించి యాస్వప్నపదార్థములను దన జ్యోతిచేఁ బ్రకాశింపఁజేసి స్వప్నము నందలి యాలోచనము తానే ప్రకాశింపఁ జేయుచున్నాఁడు, అట్టి నిద్రయందుఁ బురుషుఁడు జ్యోతియగుచున్నాడు.

౪-౩-౧౦. నతత్రానందా ముదః ప్రముదో భవం త్యథానందాన్ముదః ప్రముదః సృజతే; నతత్రరథా నరథయోగా నపంథానో భవం త్యథరథారథయోగా న్పథః సృజతే. నతత్ర వేశాంతాః పుష్కరిణ్యః స్రవంత్యో భవం త్యథ వేశాంతాః పుష్కరిణీః స్రవంతీః సృజతే సహికర్తా

అచ్చట ఆనందము ముదము ప్రముదము లేవు. ఆనందము ముదము ప్రముదము సృజింపఁ బడుచున్నవి. అచ్చట (ఆ స్వప్నమందు) రథములు లేవు. గుఱ్ఱములు లేవు. రథము పోవు మార్గము లేదు. రథములు వానిగుఱ్ఱములు మార్గము సృజింపబడుచున్నవి. అచ్చట గుంటలు లేవు, పుష్కరిణులు లేవు, నదులు లేవు, గుంటలు పుష్కరిణులు నదులు సృజింపఁబడుచున్నవి. వానికిఁ గర్త భగవంతుఁడె.

జీవుఁడు చేసిన పుణ్యపాపముల ఫలము ననుభవింపఁజేయుటకై భగవంతుఁడు దానికి దానికిఁ దగిన పదార్థముల నప్పటి కప్పుడు సృజించుచున్నాఁడు. కావున స్వప్నమునఁ జూచునవి యసత్యములుగావు.

రెండు గ్రామములు సత్యములైనచో నడిమి పొలిమేర యసత్య మెట్లగును? కొందఱు జీవాత్మయే వీని నెల్ల సృజించుకొనుచున్నాఁడందురు. కలలందుఁ బ్రియములవలె నప్రియములు కానవచ్చునుగదా. ఎవఁడైనను దన కప్రియము లగువానిని సృజించుకొనునా? కావున స్వప్నసృష్టికర్త భగవంతుఁడే. సృష్టికార్య మాయనదే కాని జీవునిది కాదు. ముక్తునకే యా యధికారము లేనపుడు బద్ధజీవున కెందుండి వచ్చును? స్వప్నములకు ఫలము గలదని ఛాందోగ్యోపనిషత్తునం దీశ్లోకముగలదు.

"యదా కర్మసు కామ్యేషు, స్త్రియం స్వప్నేషు పశ్యతి
సమృద్ధిం తత్ర జానీయా, త్తస్మిన్ స్వప్ననిదర్శనే." ఛా. ౨. ౯

ఎప్పుడు కామ్యకర్మములందు స్వప్నమున స్త్రీని జూచునో యప్పుడు వానికభివృద్ధిగలదని తెలియవలెను.

స్వప్నము లసత్యము లైనచో వానికి ఫలముగలదా? ఫలముగలదని శ్రుతి

చెప్పునా? ఇట్టులే. "స్వప్నే పురుషం కృష్ణం కృష్ణదంతంచ పశ్యతి, స ఏనం హంతి." ఐ. ఆర. 3-౨-౪-౧౭, కలలో నల్లనివానిని నల్లదంతములు గలవానిని చూచెనేని వాఁడు వానిని జంపును. చూ. బ్ర. సూ. 3-౨, ౪-౫: తై ౭. ౭-౧. బ్ర-సూ 3-౨-౬; 3-౨-౪.

ఇఁక స్మృతు లేమి చెప్పుచున్నవో చూతము.
స్వప్నాధ్యాయమున బృహస్పతి—
స్వప్నాధ్యాయం ప్రవక్ష్యామి నానాస్వప్నసముచ్చయే
స్వప్నస్తు ప్రథమే యామే సంవత్సర విపాకినం.
ద్వితీయే చాష్టభి ర్మాసై స్త్రిభిర్మాసై స్త్రియామికమ్
చాతుర్థే యామికే స్వప్నే మాసే నైకేన ఫలంభవేత్
అరుణోదయ వేలాయాం దశాహేన ఫలం భవేత్
ఏవం చానుదితే కాలే త్రిరాత్రంతు భవిష్యతి
గవాం దోహనవేలాయాం సద్యః స్వప్నఫలం భవేత్
అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి స్వప్నపుణ్య ఫలం ధ్రువమ్
వాతకం పిత్తకంచైవ చింతితం చానువర్జయేత్
అతిదీర్ఘం దివా దృష్ట్వా స్వప్నం తం పరివర్జయేత్
యస్తు పశ్యతి స్వప్నాంతే రాజానం కుంజరం హయమ్
సువర్ణం వృషభం గావః కుటుంబం తస్య వర్ధతే.
ఆరోహణం గోవృషకుంజరాణాం ప్రాసాద శైలాగ్రవనస్పతీనామ్
విష్ఠానులేపో రుదితం మృతంచ స్వప్నే ష్వగమ్యాగమనంచ ధన్యమ్
క్షీరిణం ఫలినం వృక్ష మేకాకీ యోఽధిరోహతి
తత్ర తస్య విబుద్ధస్య మృత్యు రిత్యేవ నిర్దిశేత్
యస్తు శ్వేతేన సర్పేణ......దంశితో భుజః
స హస్తలాభ స్తస్య స్యాదపూర్ణే దశమే దినే
ఉరగో వృశ్చికోవాపి జలూకా దృశ్యతే యది,
అవ్యయం చార్థసిద్ధించ పుత్రం తస్య వినిర్దిశేత్
ప్రాసాద శైల మారుహ్య సముద్రం తరతే నరః
అపి దాసకులేజాతః సోఽపి రాజా భవిష్యతి.
యస్తు మధ్యే తటాకస్య భుంక్తే వై ఘృతపాయసమ్
అఖండే పుష్కరే పత్రే తం విద్యా త్పృథివీపతిమ్
బలాకాం కుక్కుటీం క్రౌంచీం లబ్ధ్వా యః ప్రతిబుధ్యతే
సత్కులాల్లభతే కన్యాం భార్యాంచ ప్రియవాదినీమ్॥
స్వప్నాధ్యాయమువచించెదను. మొదటిజామున వచ్చినకల సంవత్సరమునకు

ఫలించును. రెండవజామున వచ్చినది యెనిమిది నెలలకు ఫలించును. మూఁడవ జామున వచ్చినది మూఁడు నెలలో ఫలించును. నాలుగవజామున వచ్చినకల నెలకు ఫలించును. అరుణోదయ వేళ వచ్చిన కల పది దినములకు ఫలించును. సూర్యోదయమునకు ముందు వచ్చినది మూఁడు దినములలో ఫలించును. ఆవులు పితుకు వేళ వచ్చినకల వెంటనే ఫలించును. ఇఁక స్వప్నముల పుణ్యఫలము చెప్పెదను. వాతపిత్తాదుల వలనఁ గలుగునని తానాలోచన చేయుచుండు వాని విషయమై వచ్చినవి. అతిదీర్ఘమైనవి పగటికలలు త్యాజ్యములు. స్వప్నాంతమందు నెవఁడు రాజును, ఏనుఁగును, గుఱ్ఱమునుబంగారును, ఎద్దును, గోవును జూచునో వానికుటుంబమువృద్ధియగును, ''ఆరోహణం గోవృషకుంజరాణాం'' ఈ శ్లోకార్థముముందు వ్రాయఁబడినది. పాలుగాఱు చెట్లను, పండ్లచెట్లను నొంటరిగా నెవఁడెక్కునో వెంటనే వాఁడు మేలుకొనెనేని వానికి మరణదశ ప్రాప్తించును. పాముగాని తేలుగాని జలగగాని కఱచెనేని విశేషధనలాభము పుత్రప్రాప్తి గలదు. మేడయెక్కి సముద్రము దాటినట్లు కల గనెనేని దాసికులములోఁ బుట్టినవాఁడైనను రాజగును. తటాకమధ్యమున నిండు తామరాకు నందు నేతిపాయస మెవఁడు తినునో వాఁడు రాజగును. ఎవనికి నాఁడుకొంగ పెట్టకోడి క్రౌంచిలభించినట్లై మేలుకొనునో వానికి సత్కులమునఁ బుట్టి ప్రియవాదిని యైన భార్య లభించును. స్వప్నములు మిథ్యలైనచో నిట్టిఫలము లెట్లు కలుగును.

శా. పొండీ చాటుగ లేచి రామవిభుఁ డీ♦పూఁబోఁడిఁ గైకొంచు ను
గ్రుండై రాక్షస కోటులం దునుముచోఁ ♦ గోపించి మీ రిట్టు లు
ద్దండత్వంబున నాత్మదారను బ్రియం ♦ దర్జించి బాధించుటన్
ఖండీభూతలఁ జేయకుండఁడు మిముం ♦ గంజాక్షి సంప్రీతికై. ౨౦౬

అర్థములు. ఉద్దండత్వమునన్ = విశేషముగ, ఆత్మదారను=తనభార్యను, ఖండీభూతలన్ = తునకలుగాఁ జేయఁబడిన వారిని.

తా త్ప ర్య ము.

రాక్షసాంగనలారా! లేచి చాటుగఁబొండు. రాముఁడీ సీతాదేవిని గ్రహించుటకై రాక్షసులనెల్ల భయంకరుఁడై వధించునపుడీమెను తనభార్యను విశేషించి భయపఱచి బాధించుటచే నీమె సంతోషమునకుఁగాను మిమ్మెల్లఁ దునుకలుగా నఱుకక మానఁడు.

క. మచ్చిక గల దని తన్నున్, నచ్చిన దని భార్య యని వ♦నంబుల కెలమిన్
వచ్చిన దని రఘునాయకుఁ, డిచ్చానకు నై వధించు ♦ నెల్లయసురులన్. ౨౦౭

తా త్ప ర్య ము.

తనయందుఁ బ్రేమగలదని తన్ను నమ్మినదని తన భార్యయని తనతోడనడవులకు సంతోషముతో వచ్చినదని రామచంద్రమూర్తి యీమె నిమిత్తమై రాక్షసుల

నెల్ల జంపును. ౪౫౩ పద్యమును జూచునది. రామచంద్రమూర్తి దుఃఖించుట కే కారణములు చెప్పెనో యా కారణములే త్రిజటయు రాక్షసవధకుఁ గారణములుగాఁ జెప్పెను.

దీనివలనఁ దన యాశ్రితుల నవమానించినవారిని భగవంతుఁడు సహింపఁడు, తీవ్రముగ దండించు నని సూచన. దోషము కొలఁది వంశనాశము చేయును. ద్రౌపది నవమానించిన కౌరవులు వంశనాశమై పోయిరి. సీతాదేవిని బాధించిన రావణుఁడు వంశనాశ మయ్యెను. దీనివలనఁ బతివ్రత నవమానించువారు బాధించు వారు తప్పక వంశనాశ మగుదురు.

ఉ. చాలును జాలు రక్కసలు! ♦ సాధ్వసభాషలపుస్తకంబు లా
మూలను గట్టి వైవుఁ డిఁక ♦ మోసము వచ్చును, మంచిమాటలన్
లాలన సేయుఁ డీమె, మనలన్ క్షమియింపఁగ వేఁడుకొంటయే
పోలును, సీత యాత్మవిభుఁ ♦ బొందుట నిక్కము నిక్కలం గనన్. ౭౦౮

అర్థములు. రక్కసలు = రాకాసులారా! సాధ్వసభాషల పుస్తకంబులు = మీరు పాఠముగ నేర్చిన బెదరింపు మాటల పుస్తకములు, నిక్కల = నిజమైనకల.

తాత్పర్యము.

రాకాసులారా! మీమాటలు చాలింపుఁడు. మీరు పాఠముగ నేర్చుకొన్న బెదరింపుమాటల పుస్తకము లావలఁ బాఱవేయుఁడు. ఇక నా పాఠములు వల్లించిన మన ప్రాణమున కపాయము వచ్చును. కావున మంచిమాటలచే నమ్మా తల్లీ యని బుజ్జగింపుఁడు. ఇదివఱకుఁ జేసినదానికిఁ బ్రాయశ్చిత్తముగ క్షమింప వేడుకొంటయే తగిన కార్యము. నాది నిజమైనకల. దీనినిబట్టి చూడ సీత తనభర్తతోఁ గూడు కొనును.

క. వ్యసనంబుల మునిగిన యా, బిసజేక్షణవిషయ మిట్టి♦విధమున కలయుం
బొసఁగిన యేనియుఁ దత్సతి, వెస దుఃఖము బాసి సుఖిత ♦ వెలయును జండీ.

అర్థములు. బిసజ+ఈక్షణ = కమలము వంటి కన్నులు గలది. బిసజేక్షణ విషయము = బిసజేక్షణ విషయమందు అని సప్తమ్యర్థమునఁ బ్రథమగఁ గాని బిసజేక్షణ విషయముగాఁ గలదని బహువ్రీహిగ నైన గ్రాహ్యము.

తాత్పర్యము.

వ్యసనంబులందు మునిఁగియున్న యే స్త్రీ విషయమున నిట్టికల కలుగునో యా స్త్రీ దుఃఖములను బాసి సుఖించును.

క. అదరించియు బెదరించియు, ముదలించియు గాసి పెట్ట♦మో మన మేలా
సదయ యగు ననఁగ వలవదు,కదిసెంబో బెడద మనకుఁ ♦ గాకుత్స్థునిచేన్. ౭౧౦

అర్థములు. ముదలించి = ఆజ్ఞపెట్టి, సదయ = దయతోఁ గూడినది, బెడఁద = అపాయము.

తాత్పర్యము.

సీతాదేవిని మన మదరింపలేదా బెదరింపలేదా నిర్బంధింపలేదా మన విషయమున నీమె యెట్లు దయగలదగును? అనవలదు. మనకు రామునిచే నపాయము సమీపించినది. రావణుఁడు చావఁగానే మనము చేయుచున్న పనికి మనల నయ్యో పాప మని రక్షించువా రెవరు?

క. ప్రణతిప్రసన్న జానకి, యణుమాత్రంబైన సందియము లేదు సుఁడీ
క్షణదాచరసతులారా, యణుమధ్యను వేడుడీ మహాపదఁ బాపున్. ౨౦౧

అర్థములు. ప్రణతిప్రసన్న = ఈమె నమస్కారముచేతనే సంతోషించునది. క్షణదాచరసతులారా = రాక్షసాంగనలారా! అణుమధ్యను = సూక్ష్మమైన నడుముగలదానిని.

తాత్పర్యము.

ఈమెను నానావిధముల బాధించితిమే, మనయందు దయ దలఁచునాయని సందేహింపఁ బనిలేదు. ఈమె నమస్కార ప్రియురాలు. మన మెన్ని తప్పులు చేసినను నిష్కల్మషమైన బుద్ధితో క్షమింపు మని వేఁడుచు నమస్కరించితిమేని శాంతి వహించి మనల నవశ్యము రక్షించును. మనకు రాఁగల మహాపాయమును నీమె తప్పఁ బాపువా రెవ్వరును లేరు.

"ప్రాయశ్చిత్త ప్రసంగేతు, సర్వపాప సముద్భవే
మా మేకాం దేవదేవస్య, మహిషీం శరణం వ్రజేత్॥"

సర్వపాపములు చేసి ప్రాయశ్చిత్తము పెట్టుకొనవలసి వచ్చినపుడు దేవదేవ మహిషినైన నన్ను శరణము పొందవలెను. "సర్వకామప్రదాం రమ్యాం, సంసారార్ణవ తారిణీం, క్షిప్ర ప్రసాదినీం లక్ష్మీం శరణ్యా మనుచింతయేత్॥" సమస్త కాంక్షలనిచ్చునదియు, మనోజ్ఞమైనదియు, సంసారసముద్రమును దాటించునదియు, శీఘ్రముగ ననుగ్రహించునదియు నగు లక్ష్మీదేవిని శరణు చొర సర్వాయగ రక్షకురాలిని ధ్యానింపవలెను, అను వాక్యములు స్మరింప నగు.

క. లక్షించి చూడఁగా నవ,లక్షణ మొకటైన లేదు లలిమీఁజు విశా
లాక్షి మెయిఁ గాన వల్లభ,సాక్షాత్కారంబు గలుగు జలజాక్షి కెటుల్. ౨౦౨

అర్థములు. అవలక్షణము = చెడు చిహ్నము, సీతాదేవి బాగుపడఁగల దనుటకు రెండవకారణము చెప్పుచున్నది.

తాత్పర్యము.

కలయటుండ నిండు. ఈమె దేహచిహ్నములఁ బరీక్షించి చూచినను నీమెకు శాశ్వతముగఁ బతివియోగము గలదని తెలుపు చెడు చిహ్న మొకటియైన లేదు. కావున భర్త యీమెకు సాక్షాత్కరింపఁ గలఁడు.

క. కేవలము వన్నె మాఱుట, చే వనటం బడె వటంచు ♦ సెంకించితి నీ
దేవీ యదుఃఖార్హా య యగు, గావున దివ్యసుఖములను ♦ గలదు భుజింపన్. ౨౦౩

అర్థములు. సెంకించితిన్ = సందేహించితిని, అదుఃఖార్హా య = దుఃఖపడి యోగ్యురాలు కాదు.

తాత్పర్యము.

ఈమె దుఃఖముచేఁ గాంతి మాఱుటచే నీమె భర్తను బాసి దుఃఖ మనుభవించునదియే యని సందేహించితిని గాని యీమె దుఃఖింప నర్హురాలు గాదు. ఈమె దివ్యసుఖముల ననుభవింపఁ గలదు. సందర్భము లట్లుండుటచే నీమెను నిష్కారణముగ బాధించి వెనుక మన మేల బాధపడవలెను. ఈమెను బాధించుట వలన మనకు రాఁగల లాభ మేమి? ముఖకాంతి మాఱుట కష్ట దశను దెలుపును.

చ. అదె యదె కంటిరే జలరు♦హాయతపత్రమువోలి మిక్కిలిన్
దదలెడి వామలోచనము ♦ తన్మానుతకుం బ్రియసూచకంబునై
సుదతికిఁ గార్యసిద్ధియును ♦ సోకులఱేనికి నాశనంబు దు
ర్మదపరకాలుఁడైన రఘు♦రామునకు న్విజయంబుఁ దెల్పుచున్. ౨౦౪

అర్థములు. జలరుహాయత పత్రము = కమలముయొక్క దీర్ఘమైన ఱేఁకు, వామలోచనము = ఎడమ కన్ను, ప్రియసూచకంబునై = మేలు సూచించునదై, సోఁకుల ఱేనికి = రాక్షస రాజగు రావణునకు, దుర్మద పరకాలుఁడు = చెడు గర్వము గల శత్రువుల పాలిటికి యముఁడైనవాఁడు.

తాత్పర్యము.

నా మాట యసత్యమేమో ప్రత్యక్షముగఁ జూడుఁడు. అదిగో నదిగో నామె యెడమకన్ను నిడివి తామర ఱేకు వంటిది యెట్లదరుచున్నదో చూడుఁడు. అది యీమెకు మేలు సూచించుచున్నది. ఈమె కోరిన కార్యము భర్తసమాగమము సిద్ధించును. రావణాసురునకు వినాశము, మదించిన శత్రువులపాలికి యముఁడైన రామచంద్రమూర్తికి గెలుపు తెలుపుచున్నది. స్త్రీల కెడమ కన్నదరుట శుభ సూచకము. ఇది మూఁడవ కారణము.

కం. ఆకస్మికముగ జానకి, డాకేల్ పులకించి వడకె ♦ డాపలిదెస శుం
డాకారోరు వదరుచును, గాకుత్స్థపురస్థితిం బ్ర♦కాశముఁ జేసెన్. ౨౦౫

అర్థములు ఆకస్మికముగన్ = ఉన్నట్టులుండి, డాకేలు = ఎడమచేయి పులకించి = గగ్గురు పొడిచి, డాపలిదెస = ఎడమప్రక్కన, శుండాకార = ఏనుఁగు తొండమువలె నున్న, ఊరువు = తొడ, కాకుత్స్థ పురస్థితిన్ = రామచంద్ర మూర్తి సమీపమందే యుండుట.

తాత్పర్యము.

ఉన్నట్టులుండి సీతాదేవియెడమచేయి గగ్గురువొడిచి యదరెను. ఎడమతొడ

యదరెను. దీనివలన రామచంద్రమూర్తి సమీపమందే యున్నాఁడనుట సిద్ధము.

చం. నెలకొని శాఖలందుఁ గడు♦నెమ్మది నుత్తమసాంత్వవాది యై
వెలసెడి పక్షి పల్కుచును ♦ వెండియు వెండియు స్వాగతోక్తిఁ బే
రెలమిని వెండి వెండియును♦ప్రేరణ చేసెడునట్లు గ్రాలెడున్
వల దిక నిందు నిల్చి యతి♦వన్ వ్యథపెట్టఁగఁ బొందు దవ్వుగన్. ౭౧౬

అర్థములు. ముందు తనకుఁ గల వచ్చెనని చెప్పెను. దాని కనుగుణముగా సాముద్రిక చిహ్నములను శుభశకునములను జెప్పెను. ఇఁక నంతకంటె బహిరంగమైన శకునము చెప్పుచున్నది. శాఖలందు నెలకొని, కడునెమ్మిగన్ = మిక్కిలిసంతోషముతో, వెండియు వెండియున్ = మీఁద మీఁద, పలుమఱు; ఉత్తమ సాంత్వవాదియై = మిక్కిలి మధురముగఁ బలుకుచున్నదై, పక్షి = పైఁడికంటి పక్షి, స్వాగతోక్తిన్ = స్వ + ఆగత + ఉక్తిన్ = స్వ = బంధువులయొక్క, 'బంధుస్స్వస్వజనాసమా' యని యమరము. బంధువు రాకను గుఱించి మాటను పేరెలమిని = మిక్కిలి సంతోషముతో, వెండి వెండియును = మాటి మాటికిని, ప్రేరణ చేసెడునట్లు = సీతాదేవిని ప్రేరించుచున్నదో యను నట్లు, రాముని కథను జెప్పుచున్నట్లు, క్రాలెడిన్ = ఒప్పుచున్నది. కావున నో రాక్షసస్త్రీలారా! మీ రిచ్చట నుండి యీమెను బాధపెట్టవలదు. దూరముపొండు. ఇది నాలవకారణము.

(౨) శాఖలందున్ = చిగిరించి పూచియున్న కొమ్మలందు, ఇట్టివే శాఖలనఁబడును. నెలకొని = నెలవుకొని = దృఢముగాఁ గూర్చుండి, కడు నెమ్మిగన్ = ఫలాదులఁ దినుటచే మిగుల సంతోషముగ, ఉత్తమ సాంత్వవాదియై వెలసెడి పక్షి, పక్షి = గొప్ప ఱెక్కలు గలది. పక్ష+ఇ = పక్షి. ప్రశంసార్థమున మతుప్ప్రత్యయము. 'భూమనిందాప్రశంసాసు । నిత్యయోగేతిశాయినే । ససంసర్గేస్తి వివక్షాయాం । భవంతి మతుబాదయః'' అను ప్రమాణమును గ్రహించునది. అనఁగా ఱెక్కలు విచ్చి యాకసమున గుండ్రముగఁ దిరుగుచుండిన గరుత్మంతుఁడు - గరుడపక్షి యాకాశమునఁ జక్రాకారముగఁ బ్రదక్షిణముగఁ దిరుగుటయుఁ బచ్చికొమ్మపై దృఢముగఁ గూర్చుండుటయు ఫలాదుల భక్షించుచు సంతోషముగా నుండుటయు శుభసూచకములు. కావుననే యుత్తమసాంత్వవాదియై వెలసెడు నట్లున్నది. పైనున్న యట్లను పదము వలసిన చోటుల నెల్ల నన్వయించును. ఉత్తమ సాంత్వవాది = నీ భర్త శీఘ్రముగా వచ్చును, ఇది దుఃఖపడవలసిన కాలముగాదు, కావున దుఃఖపడవలదు, అని యూఱట మాట లాడుచున్నది. స్వాగతోక్తిని వెండివెండియుఁ బల్కుచును - నీభర్తదుఃఖము నీ దుఃఖ మంతమాత్రమే కాదు. ఇంతకంటె నెంతయో యధికము అని పలుమాఱు చెప్పుచున్నట్లు విరహిణులకుఁ జెప్పెడి స్వాగతోక్తి భర్త సంతాపాతిశయమును జెప్పుటయే యని యెఱుఁగనగు. కాఁబట్టియే కదా కాళిదాసుఁడు, "తపతి తనుగాత్రి మదనస్త్వా, మనిశం మాం పునర్దహత్యేవ, గ్లపయతి

యథా శశాంకం న తథా హి కుముద్వతీం దివసః'' అని శాకుంతలమునఁ జెప్పెను. సన్నని దేహము గలదానా! మన్మథుఁడు నిన్ను దపింపఁజేసె నేని నన్నుఁ గాల్చుచునే యున్నాఁడు. పగలు చంద్రు నేమి చేయుచున్నదో కలువతీఁగ నేమి చేయుచున్నదో చూడుము. (చూడు ౧౮౧౩-౧౮౧౪పు)

వెండివెండియును బ్రేరణ చేసెడునట్లు=ఇట్లీమె యొద్దకు రామచంద్రమూర్తి వచ్చుట నిశ్చయమైన పిదప నింకేల స్నానాలంకారాదులకై తామసించుచున్నది, ఏల త్వరపడరాదు అని సీతను బ్రేరించునట్లు క్రాలెడిని. ఆ పక్షిస్వరము విన్నప్పుడిట్లుగాఁ దోఁచుచున్నదని యుత్ప్రేక్షాలంకారము. పేరెలమిన్=భార్యాభర్తలు కూడుట తనకే గొప్పసంతోషముగా భావించి యీపక్షి యట్టితనభావమురోమాంచముచేఁ దెల్పుచున్నట్లున్న దని భావము.

(౩) ఉత్తమము మధ్యమము అధమము అని కావ్యములు మూఁడువిధములు. "తను వగుశబ్దార్థంబులు, ధ్వని జీవ మలంక్రియా వితానము సొమ్ముల్, దనరు గుణంబులు గుణములు ఘనవృత్తులు వృత్తులౌర కావ్యేందిరకున్" నరస. అని. కావ్యమునకు ధ్వనిప్రాణము. శబ్దార్థములు దేహము. కావున వాచ్యార్థమునకంటెను, ధ్వన్యర్థమెందు విశేషించి యున్నదో యది యుత్తమకావ్యము. వాచ్యార్థముకంటె ధ్వన్యర్థమెం దతిశయింపదో యది మధ్యమకావ్యము. దీనినే గుణీభూతవ్యంగ్య మందురు. అనఁగా వ్యంగ్యము గౌణము, అప్రధానము అని యర్థము. ధ్వనియే లేనిది యధమకావ్యము. కథల పుస్తకములవంటివి చిత్రకావ్యములు. ఇట్టి ధ్వన్యర్థ మొక్కచోఁ బదమునను, ఒక్కచో వాక్యమునను, మఱొక్కచోఁ బ్రబంధ సమష్టి పైనను నుండుట గలదు. ఈ కాండమున ధ్వన్యర్థము అనాదిగా భగవత్సంబంధము గల జీవుఁడు సంసారమునఁ జిక్కి బాధలు పడుచుండఁగా నాచార్యుఁ డది చూచి తాళలేక వాని యుజ్జీవనార్థమై ప్రవర్తించుచున్నాఁడు అని. ఈయర్థము ఈ కాండమున రెండవ పద్యమగు "తరువాత రావణాసుర వరసీత'' యను పద్యముననే సూచింపఁబడెను. ఈ కాండమున లంకాశబ్దముచేత శరీరమును ఏకాక్ష్యాదులచేత నింద్రియములును రావణకుంభకర్ణులచే నహంకారమమకారములును ఇంద్రజిత్తు లోనగువారిచే కామక్రోధాదులును సూచితము. లంకలో శ్రమపడుచున్న సీత యనుటచే సంసారమునఁ గష్టపడుచున్న జీవుఁడనియు నట్టి జీవునికి భగవత్ప్రేరణమున జ్ఞానముపదేశింప వచ్చిన యాచార్యుఁడు హనుమంతుఁడనియు సూచితము. ఆ యాచార్యుని లక్షణ మీ పద్యంబున సూచితము. శాఖలందున్ = వేదశాఖలందు - నెలకొని = (౧) దృఢముగానుండి; వేదశాఖలను మఱవక దృఢముగా జ్ఞప్తియం దుంచుకొని; అధ్యయనము చేసిన వేదమును మఱవరాదు. మఱచినచోఁ బాపము కలదు. "అధీతమపి యో వేదం విముంచతి నరాధమః, భ్రూణహాసతు విజ్ఞేయావియోని మధిగచ్ఛతి'' యని శిక్షా వాక్యము. (౨) నెలకొని = వేదార్థవిషయమైన శ్రవణ మనన

నిది ధ్యానము లనియెడి యనుష్ఠానములు కలిగి "ఆచార్యో వేదసంపన్నో విష్ణుభక్తో విమత్సరః మంత్రజ్ఞో మంత్రభక్తశ్చ, సదా మంత్రాశ్రయ శ్శుచిః, గురుభక్తిసమాయుక్తః పురాణజ్ఞో విశేషతః, ఏవంలక్షణసంపన్నో గురురిత్యభిధీయతే॥" అనియాచార్య లక్షణము. అనఁగా జ్ఞానముగలవాఁడును విష్ణుభక్తిగలవాఁడును మాత్సర్యము లేని వాఁడును, మంత్రార్థము తెలిసినవాఁడును, ఆమంత్రమందు భక్తిగలవాఁడును, సర్వదా మంత్రము నాశ్రయించి యుండువాఁడును అనఁగా మంత్రార్థ మనుసంధానము చేయును నా ప్రకారము వర్తించువాఁడును, లోపల వెలుపలఁ గామినీ కాంచనాదుల పట్ల శుచిగా నుండువాఁడును, గురుభక్తిగలవాఁడును, పురాణజ్ఞానము విశేషించిగల వాఁడును, శాస్త్రములఁ జదివి తా నా ప్రకారముగ నాచరించుచు శిష్యులచే నాచరింపఁజేయువాఁడు నగువాఁడు గురువనఁబడును. ఇట్టి యాచార్యలక్షణ మీపదముచే జెప్పినట్లయ్యెను. కడు నెమ్మిగన్ = సదా సంతోషముతో నుండునని భావము. ఇట్టి యాచార్యుఁడుగదా భక్తులకు సదా సేవ్యుఁడు. "ఆహ్లాదశీతనేత్రాంబుః పులకీకృతగాత్రవాన్ సదా పరగుణావిష్టో ద్రష్టవ్య స్సర్వదేహిభిః" ఆచార్యుఁడు సర్వదా సంతోషముచేఁ జల్లని యానందబాష్పములు గలవాఁడును, పులకరించిన దేహము గలవాఁడును, ఎల్లప్పుడును పరమాత్మ గుణములను ధ్యానించుచుండువాఁడును నగు వానిని గురువుగ నందఱుచూడవలెను. ఆచార్యుఁ డిట్టి సంతోషము గలవాఁడై యుండవలెను. వెండి వెండియును ఉత్తమ సాంత్వవాది - ఉత్తమ = "ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః" భ. గీ. ప్రకృతి జీవులకంటె - బద్ధాత్మముక్తాత్మలకంటె నుత్తమ పురుషుఁడు పరమాత్మ యని చెప్పఁబడును, అన్నట్లు పరమాత్మను గుఱించి సాంత్వవాది = మంచి మాటలను శిష్యులకుఁ జెప్పువాఁడు. "త్వంమేఽహంమే, కుతస్తత్తదపి కుత ఇదం వేదమూల ప్రమాణా దేతచ్చానాది సిద్ధా దనుభవ విభవాత్తర్హి సాక్రోశఏవ। క్వాక్రోశః? కస్య? గీతాదిషు మమ విదితః కోత్రసాక్షీ? సుధీస్స్యాదర్థం త్వత్పక్షపాతీ స ఇతి నృకలహే మృగ్యమధ్యస్థవత్త్వ" మ్మని పూర్వాచార్యులు చెప్పినట్లు జీవ పరమాత్మలకు స్వాతంత్ర్య వివాదము కలిగినప్పుడు "యమో వైవస్వతో రాజా యస్తవైష హృది స్థితః తేనచే దవివాదస్తే మా గంగాం మాకురూన్ గమః" మనుస్మృతి. అనఁగా సర్వము సంయమించువాఁడగుటచే యముఁడనియు దండించువాఁడగుటచే వైవస్వతుఁడనియు రంజించువాఁడగుటచే రాజనియుఁ జెప్పఁబడి నీహృదయమందుండు పరమాత్మతో నీకు వివాదము లేదేని అనఁగా నాత్మవంచనము లేక సత్యమందుఁ బ్రవర్తించెదవేని గంగకుఁ బోవలసిన పనిలేదు. కురుక్షేత్రమునకుఁ బోవలసిన పనిలేదు. అంతరాత్మ కనుకూలముగ త్రికరణశుద్ధిగఁ బనులు చేయువాఁడు దన పాపములను బోఁగొట్టుకొనుటకు గంగానదిస్నానములకై పోవలసిన పనిలేదు. వాని యందుఁ బాపలవము లేదు. కావున నంతరాత్మకు విరోధముగా వర్తించు వాఁడెక్కడ

నెన్ని స్నానములు వ్రతములు చేసినను నిష్ప్రయోజనము. వానిపాపము పోదు. కావున వాడు తీర్థయాత్రలు చేయవలసిన పనిలేదు, అనియర్థము. ఇట్టిభగవదనుకూల ప్రవర్తనము భగవంతుని స్వాతంత్ర్యమును నాచార్యుఁడు మంచిమాటలతో జీవునికి బోధించును అనిభావము. సేద్యగాఁడొకతూరిపొలమునున్ని పైరుపెట్టినపుడది మొదటి సారి ఫలింపక విత్తుప్పాడైనను, పైరెండి పోయినను నంతమాత్రమున సేద్యముచేయుట మానక మఱలమఱలఁ గృషిచేయుచుఁ దానుబూనినకార్యము సఫలమగునంతవఱకు నిలుపనట్లు ఆచార్యుఁడొక్కసారిచెప్పగా వారివచనములను శిష్యుఁడు వినకపోయి నను నంతతో వదలక యాశిష్యుఁడు తనమాట వినునంత వఱకు నప్పుడప్పుడు వానికి జ్ఞానముపదేశించుచుండును. అని వెండియు వెండియు ననుపదముచేతఁ జెప్పినట్లయ్యెను. ఎట్లనఁగా నర్జునునకు భగవంతుఁడు భగవద్గీత యుపదేశించెను. దాని నర్జునుఁడు మఱచి మఱల దానిని జెప్పుమని యడిగెను. అప్పుడు శ్రీకృష్ణభగవానుఁడు 'నూనమశ్రద్ధధానోసి; దుర్మేధాశ్చాసి పాండవ' అర్జునా! నీవు శ్రద్ధగలవాఁడవు కావు. చెడుమేధ గలవాఁడ వని చీవాట్లుపెట్టి యనుగీతల నుపదేశించెను. ఇది ఉత్తర గీత లనఁబడునది కాదు. మహాభారతమున నశ్వమేధ పర్వమున ననుగీత లున్నవి కాని యుత్తరగీత లనునది లేదు. దానికి దీనికి సంబంధము లేదు.

పరలోక గమనమునకు సాధనమైన జ్ఞానము కర్మము అను రెండు ఱెక్కలు గలవాఁడు ఆచార్యుఁడు. ఒంటి ఱెక్క నిష్ప్రయోజనమైనట్లు జ్ఞానము లేనికర్మము, కర్మములేని జ్ఞానము వ్యర్థము. రెండు చేరిననే ఫలముగలదు. 'ఉభాభ్యామేవ పక్షాభ్యాం యథా ఖే పక్షిణాంగతిః, తథైవ జ్ఞానకర్మాభ్యాం నియతా పరమాగతిః। అనువాక్యము ఇందుఁ బ్రమాణము. అనఁగా రెండు ఱెక్కలతో నాకాశమందుఁ బక్షి యెట్లు లెగిరిపోవునో యట్లు కర్మజ్ఞానములు రెండును బరమగతికి నియత ములు. 'జ్ఞానీతు పరమైకాంతి' యన్నట్లు జ్ఞాన మనఁగాఁ బరమైకాంతభక్తి. జ్ఞాన కర్మములలో జ్ఞానమంగి. కర్మమంగము. 'బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసానాశకేన,'యను శ్రుతి యీ యంగాంగిభావమునఁ బ్రమాణము. అనఁగా యజ్ఞముచేత దానముచేత తపస్సుచేత ఉపవాసములచేత బ్రాహ్మణులు చక్కఁగాఁ దెలిసినవా రగుచున్నారు. (జ్ఞాను లగుచున్నారు.) దీనిచే నాచార్య శబ్దమునకు వ్యుత్పత్తి చెప్పినట్లయ్యెను. 'ఆచినోతిహి శాస్త్రార్థా, నాచారే స్థాపయత్యపి,స్వయ మాచరతే యస్మా త్తస్మా దాచార్య ఉచ్యతే' యని యాచార్య శబ్ద నిర్వచనము. శాస్త్రార్థముల నెఱిఁగి తనకుఁ దెలిసిన దాని నితరులకుఁ జెప్పి చేయించుచుఁ దానా ప్రకారము నడచువాఁ డాచార్యుఁడు.

స్వాగతోక్తిః=స్వ+ఆగత+ఉక్తిః=తనకు నాచార్యపరంపరంగా వచ్చిన మంత్ర మను వాక్కును పలుకుచును, మంత్రానుసంధానమునకుఁ బూర్వముగా

'ఆచార్యాణా మసా వసా విత్యాభగవత్త'' యని శ్రుతి చెప్పినట్లు గురుపరంపరానుసంధానము తప్పక చేయవలె ననుట దీనిచేత సూచితము.

వెండివెండియును ప్రేరణ చేసినట్లు గ్రాలెర్ట్ = తానుపదేశించిన దానిని అనుష్ఠింపఁ బలుమాఱు శిష్యుని నాచార్యుఁడు ప్రేరించు నని భావము. అట్లతఁడు చేయనిచోఁ దాను జేసిన యుపదేశము వ్యర్థమగునుగదా. దీని ననుసరించియే 'స్ఖాలిత్యే శాసితార'మ్మని స్ఖలనము గలిగినపుడు శాసించు వాఁడని గురులక్షణము చెప్పఁబడెను. ఇది తన లాభమనియే గురు వెంచవలయును, అని పేరెలమి నను పదము సూచించును.

తాత్పర్యము.

కొమ్మలందుఁగూర్చుండి మిక్కిలి సంతోషముతో మేలగు నూరార్పుమాటలు పక్షి చెప్పుచు మీఁదమీఁద శుభము దెలిపెడి పలుకులను బలుకుచు నిండు సంతోషముతో ధైర్యముకలిగి యుండఁ బ్రేరించుచున్న ట్లొప్పుచున్నది. దీనివలనసీతాదేవికిఁ గేవల సమీపకాలమందే శుభము కలుగఁగలదు. కావున మీరిందుండి యీమెను బాధింపవలదు. లేచిదూరముగాఁబొండు. ఆమెనునిర్భయముగానుండనిండు. అనఁగా వారందఱు నట్లేచేసిరి. ఇచ్చటనారాక్షసస్త్రీలు సీతాదేవి శరణు చొచ్చిరి. ఆమె రక్షించెదనని యభయమిచ్చెను. ఈవిషయ మిచ్చటఁ జెప్పఁబడలేదు. సీతాదేవి గుణమాహాత్మ్యము వానరులకుఁ దెలియఁ జెప్పు టావశ్యకము, గావున హనుమంతుఁడు వానరులతో మాటలాడు సమయమున నిది యాయన చెప్పెను. రెండుస్థలములందొక విషయము చెప్పుట వ్యర్థమని వాల్మీకి ముఖ్యమైన చోటఁ జెప్పెను.

—♦ { ౨౮–వ సర్గము సీతాదేవి శ్రీరాముడు రామికి యనేకవిధములఁ బరితపించుట. } ♦—

మత్తకోకిలము. క్రూరుఁడైన దశాస్యునాజ్ఞను ♦ ఘోరరాక్షసకామినుల్
దారుణంబుగ నప్రియంబులు ♦ దన్ను పలుకుచు నుంటఁగా
ధారిణీసుత కానలో మృగ ♦ నాథుబారిని బడ్డ యా
వారణేంద్రుని కన్యరీతిని ♦ బాధకంపిత గాత్రయై. ౧౧౨

తాత్పర్యము.

దయలేని రావణాసురుని యాజ్ఞాప్రకారము రాక్షసస్త్రీలు తన్ను వినరాని మాట లనుచుండఁగా సీతాదేవి యడవిలోసింహము బారిని బడ్డ యేనుఁగు పిల్లవలె మిగుల వణఁకుచున్న దేహము గలదై.

మత్తకోకిలము. ర స జ జ భ ర— పదునొకండవ స్థానంబున యతి.

మత్తకోకిలము. రాక్షసాంగన లెల్లఁ జుట్టును ♦ గ్రాలి భీషణవేష లై
రూక్షభాషల బాధపెట్టఁగ ♦ రోషదూషితుఁడైన యా

రాక్షసాధిపు తర్జనంబుల ♦ రామకామిని కాన సం
రక్షకచ్యుత యైన బాలిక ♦ రాణఁ దా విలపించుచున్. ౭౧౮

తాత్పర్యము.

రాక్షస స్త్రీలందఱు చుట్టుకొని భయంకరాకారములతోఁ గఠిన వాక్యముల చేతను, కోపముచే మనస్సు చెడిన రావణాసురుని బెదరింపుమాటలకును రామచంద్ర మూర్తి దేవి సీత యడవిలోఁ గాపాడువారు లేని యాఁడుపిల్లవలె నేడ్చుచు.

పంచచామరము. అకాలమందు మృత్యు వబ్బ ♦ దంద్రు పెద్ద లెల్ల నా
ప్రకారమే యథార్థ మయ్యెఁ ♦ బ్రాణమేగ దయ్యయో
నికారరీతిఁ దెచ్చి క్రుచ్చి ♦ నిష్ఠురంబు లాడఁగన్
వికారరాక్షసీజనంబు ♦ నే నదెంత పాపనో. ౭౧౯

అర్థములు. నికారరీతిఁ = మోసపువిధముగ.

తాత్పర్యము.

విధినియమించినకాలము వచ్చువఱకుఁ బ్రాణముపోదని పెద్దలు చెప్పుదురు. ఆ మాటయే నా విషయమున నిజమయ్యెను. కాలమురాలేదు, గనుక నే ప్రాణము పోవలసినంతస్థితివచ్చినను నదిపోలేదు. రావణాసురుఁడు మోసపువిధముగా నన్నుఁ దెచ్చి వికారాకారములు గల రాకాసుల కఠినవాక్కుల నన్నుఁబొడిచి బాధించుటకు నే నెంత పాపము చేసితినో.

పంచచామరము. జర జర జగగణంబులు, తొమ్మిదిఁట యతి. దీనిలో మొదటిహల్లు తొలఁగించిన సుగంధి యగును.

మత్తకోకిలము. అక్కటా! కఱ వాయె సౌఖ్యము ♦ నైకదుస్సహదుఃఖముల్
పెక్కు లాయెను, వజ్రపాతవి♦భిన్న శృంగమునట్టు లై
యొక్క వే శకలంబు లై చన♦దుల్లమింతయుఁ జూడఁగా
నిక్కమీ హృదయంబు నాశిల ♦ నేర దెన్నఁడు దైవమా! ౭౨౦

అర్థములు. నైక = అనేకములయిన, దుస్సహ = సహింపరాని, వజ్రపాత = వజ్రము పడుటచే, విభిన్న = విఱిగిన, శృంగమునట్టులై = పర్వత శిఖరమువలె, వే = వేయి, శకలంబులు = తునుకలు, ఉల్లము = హృదయము.

తాత్పర్యము.

అయ్యో! సౌఖ్యమా కఱవాయెను. సహింపరాని దుఃఖములా యనేకము లయ్యెను. వజ్రము పడిన కొండ శిఖరముపగిలి తునుక లగునట్లు నాహృదయమా వేయి తునుకలైపోదు. ఇదంతయుఁ జూడఁగా నా హృదయమునకు నాశన మనునది లేదు.

ఉ. చూడఁగ నైనరాని సుర♦సూదను కోఁతకు నగ్గ మూచు న
ల్లాడుటకంటెఁ బాప మగు♦నా యురిపోఁతల నేను బ్రాణముల్
వీడుట? శూద్రజాతునకు ♦ విశ్రుతమంత్ర మొసంగి పాపి యా
బాడబునట్లు నాకుఁ దగ♦వా మనసీయ నిశాటనేతకున్? ౭౨౧

అర్థములు. చూడఁగనైనరాని = ముఖముఁ జూచినను బాపము వచ్చును. అంతటి మహాపాపి, చూచి సహింపరాని భయంకరుఁడు; అగ్గము=వశము; బాడబునట్లు = బ్రాహ్మణునివలె; నిశాటనేతకున్ = రాక్షస ప్రభువునకు.

తా త్ప ర్య ము.

చూచి సహింపరాని రావణాసురుఁడు పెట్టు హింసకు లోపడి బాధపడుచుండుట కంటె నురి పోసికొని యాత్మహత్య చేసికొనుట తప్పా? ఆత్మహత్యవలన నరకము వచ్చును గదా యనిన నరకబాధ దీనికంటెఁ దీవ్రమయినదా? రావణాసురుని యిష్టప్రకారము వర్తించిన యెడల నీ బాధ యీ బాధ తప్పునుగదా యనిన శూద్రునకు వేదమంత్ర ముపదేశించిన బ్రాహ్మణునివలె నేను రాక్షసునకు మనసీయ వచ్చునా.

రామచంద్రమూర్తికి నా మనసు త్రికరణశుద్ధిగా ధారపోసితిని. అట్టిదానిని మరలఁ దీసికొనిననే దత్తాపహారదోషము వచ్చును. దానికిఁ దోడు నీచున కర్పణ సేయుట మహాదోషము.

ఒక ఋషీశ్వరుఁడు శూద్రున కొకనికి వైదిక విధానముగఁ బైతృకర్మముఁ దెలిపి వానిచే నట్లు చేయించి రాజపురోహితుఁడుగాఁ బుట్టినట్లు భారతమున అనుశాసనపర్వంబునఁ గలదు. కావున నిది ముముక్షువునకు భగవన్మంత్రమును నిషేధింపదు. ఏలన:- భక్తిప్రపత్తి మార్గముల మోక్షమున కందఱునధికారులే. కావున దానికిఁ గావలసినది చెప్పుట తప్పుగాదు. వైదిక కర్మములందు శూద్రున కధికారములేదు. కావున వానివిధానము చెప్పరాదని భావము.

మానిని. దుర్భర తేజుఁడు రాముఁడు నన్నిటఁ ♦ దూర్ణమ చూడఁగ రానియెడన్
నిర్భరకోపముతోఁ గడు వేగిన ♦ నిష్ఠుర శాతకృపాణములన్
గర్భమున న్మరణించిన జంతువు ♦ కండల శస్త్రచికిత్సకుఁడున్
నిర్భిదమున్ ఘటియించుగతిన్ రజ♦నీచరుఁ డోడక కోయు ననున్. ౭౨౨

అర్థములు. దుర్భర తేజుఁడు = శత్రువులకు సహింపరాని తేజముగలవాఁడు, నిర్భరకోపము = విశేష కోపము. నిష్ఠుర = కఠినములైన, కృపాణములన్ = కత్తులచే, శస్త్రచికిత్సకుఁడు = కత్తులతోఁ గోసి చికిత్స చేయువాఁడు, నిర్భిదమున్ = భేదించిన దానినిగా,

మానిని. ఏడుభగణములు గురువు; పదుమూఁట యతి.

తా త్ప ర్య ము.

శత్రువులకు సహింపరాని పరాక్రమము గల రామచంద్రమూర్తి త్వరగా నన్నుఁజూడరాఁడాయెనా, గడువుముగియఁగానేరావణుఁడు కోపాతిశయముచేనన్ను శస్త్రచికిత్సకుఁడు గర్భములో మరణించినశిశువునుగోసినట్లు వాఁడికత్తులచేభయము లేక కోయుఁగలఁడు.

మత్తకోకిలము. ఎంతకాలముగానొ యేడ్చెడి ♦ హీనభాగ్యకు రెన్నెలల్
కొంత కొంత గతించె నే మను♦కొందు నయ్యయొ ధారిణీ
కాంతు నాజ్ఞను గాలుసేతులు ♦ కట్ట వేకువ వధ్యుఁడై
చింతలం బడు దొంగ భంగిని ♦ జింతఁ గుందెద దైవమా! ౭_౨౩

తా త్ప ర్య ము.

దీర్ఘకాలముగ నేడ్చుచుండు నిర్భాగ్యురాలనగు నాకు రెన్నెలలలోనుగొంత కొంత గడచిపోయినది. (పదియవనెలలో పదునైదు దినములు గడచెను.) అయ్యో! యేమనుకొందును? రాజాజ్ఞచేఁ గాలుసేతులు గట్టివైవఁగా నుదయము కాఁగానే చంపఁబడెడి దొంగవలె నేను దుఃఖపడు చున్నాను.

సీ. కన్నతల్లికి మిన్న ♦ కరుణ నన్ లాలించు, నా రామమాత నా ♦ యత్తగార!
యత్తగారికి మిన్న ♦ యాదరించుచు నున్న, మైత్రి ధీపాత్ర సు♦మిత్ర దేవి!
కన్నతల్లినిబోలె ♦ మన్నించు నా ముద్దు, మఱఁది యోలక్ష్మణా! ♦ మహితచరిత!
తనప్రాణములకన్న ♦ ఘనముగా ననుఁ జూచుఁ బ్రేమసముద్ర యో♦రామభద్ర!
తే. యయ్యయో రామ! లక్ష్మణా! ♦ హా సుమిత్ర!
హా రఘూత్తము జనని య♦త్తా! యిటేను
గడలి సుడిగాలి సుడివడు ♦ కలముకరణి
మందభాగ్యను నిసుమల ♦ గ్రందుదాన. ౭_౨౪

అర్థములు. కలము = ఓడ, మందభాగ్యను = భాగ్యహీనను, గీతమున రెండవ పాదమునఁ బ్లుతయతి.

తా త్ప ర్య ము.

స్పష్టము.

చ. కటకట! నా నిమిత్తము మృ♦గంబుస్వరూపముఁ దాల్చియున్న యా
కుటిలునిచేత మృత్యువును ♦ గూరిరి శూరులు పార్థివాత్మజుల్
దటుకునఁ బిట్టపిడ్గు వడిఁ ♦ దాఁకిన సింహవృషద్వయంబునా
నటమట మింత కైనఁ గల♦దా? మఱి యింతకు మూల మేఁ గదా! ౭_౨౫

అర్థములు. మృగంబుస్వరూపము = జింకయొక్క యాకారము, మూలము ఏనుగదా = నేనేకదా కారణము.

తాత్పర్యము.

అయ్యో! నాకొఱకై జింక వేషముధరించిన వంచకునిచేత శూరులగురాజకుమారులు వానలేని పట్టి పిడుగు పడుటచేఁ జచ్చిన సింహముల వృషభములజంటవలె మరణించిరి కాఁబోలు. అయ్యో! యింతకంటె దుఃఖము గలదా? ఇంత యనర్థమునకు నేనేకదా కారణము. వారిరువురు నన్ను విడిచిపోవుట నాకోరిక ప్రకారమే కదా!

క. రామానుజుఁ దత్పూర్వజు నే మూఢతఁ బాయఁ గాలమప్పుడే దురదృష్టన్
ఆ మృగరూపధరాకృతి,మై మోసము చేసె నన్ను మాట లిఁ కేలా? ౭౨౬

అర్థములు. రామానుజున్ = రాముని తమ్ముని, తత్పూర్వజున్ = ఆ లక్ష్మణు నన్నను, రాముని తమ్ముఁడు లక్ష్మణుని యన్న యీ ద్రావిడ ప్రాణాయామ మేల? రామలక్ష్మణులని చెప్పియుండరాదా యనిన ఇరువురు నించుమించు సమానులని తెలుపుటకని యెఱుగునది. "ద్వా సుపర్ణా సయుజా సఖాయా' యను శ్రుతినిట ననుసంధించునది. దీనివలన శుద్ధాత్మ పరమాత్మ లించుమించుగా సమానులని భావము. మూఢతన్ = జ్ఞానహీనతచే, కాలము = మృత్యువు, దురదృష్టన్ = దుష్టఫల మనుభవింప వలసిన దానను.

తాత్పర్యము.

రామచంద్రుని, లక్ష్మణుని నెప్పుడు తెలివిలేనిదాననై దురదృష్ట వశమున నెడఁబాసితినో యప్పుడే మృత్యుదేవత జింకరూపము ధరించిన వాని రూపముగ వచ్చి నన్ను మోసగించెను. ఇఁక నేమనుకొని యేమి ప్రయోజనము? జీవాత్మ పరమాత్మ లిరువురు నెడఁబాసిన దేహమువలె నైతివి,

ఉ. హా రఘురామ! సత్యరత హా! పరిపూర్ణసుధాకరాననా!
హా రమణీయ దీర్ఘకర! హా! జగదేకహితా! విశారదా!
హా రణరంగభీకర!సమస్తజగచ్ఛ్రయ భూతరక్షణా!
సారసనేత్ర! నన్నిట నిశాటులు చంపుట నీ వెఱుంగవో? ౭౨౭

అర్థములు. సత్యరత = సత్యమందుఁ బ్రీతిగలవాఁడా! పరిపూర్ణసుధాకర+ఆననా=నిండుచంద్రునివంటి ముఖముగలవాఁడా! రమణీయ దీర్ఘకర = అందమైననిడుపాటిచేతులుగలవాఁడా! జగదేకహితా=ప్రపంచమునకునొక్కఁడేహితము గోరువాఁడా! విశారదా = నేర్పరీ, రణరంగభీకర = యుద్ధరంగమందు భయంకరుఁడా! సమస్తజగచ్ఛ్రయ భూతరక్షణా =అన్నిలోకములనుండు ప్రాణికోటులను రక్షించువాఁడా! సారసనేత్ర = కమలములవంటి కన్నులు గలవాఁడా! నిశాటులు = రాక్షసులు, మీఁదిపద్యమునందుఁ బ్రసన్నుఁడు భగవత్సాహాయ్యమును, భాగవత సాహాయ్యమును భక్తిహీనతచే నవివేకమున దురదృష్ట వశమునఁ గోలుపోయి ప్రకృతిచే వచింపఁబడి మృత్యుస్వరూపమైన సంసారమునఁ బడితినని తలఁచి

యేడిచి మించినదాని కేడ్చిన లాభమే మనుకొని, దీనిని దరించు నుపాయము భగవచ్చింతనముదప్ప వే ఱుపాయము లేదని భగవద్గుణానుసంధానము చేయుచున్నాఁడు, అని ధ్వని. ఈ పద్యమున భగవత్స్వరూపస్వభావ వర్ణనము చేయఁబడెను.

తా త్ప ర్య ము.

హా రఘురామా! నీ వంశపూర్వుల యోగ్యత, కీర్తి, ప్రతిష్ఠ లాలోచింపుము. సత్యమందుఁ బ్రీతిగలవాఁడా! వివాహకాలమున నాకేమి ప్రమాణము చేసితివో యాలోచింపుము. నిండు చంద్రునివంటి ముఖము గలవాఁడా! లోకమునఁ జీఁకట్లు సమయఁజేసి, యమృతము గురియించి లోకుల సంతోషింపఁ జేయువాఁడుగదా నిండు చంద్రుఁడు. అటువంటినీవు నా విషయమున నెట్లు సార్థక నామధేయుఁడవు కావలెనో యాలోచింపుము. అందములైన నిడుపాటి బాహువులు గలవాఁడా! నీకందుకొనరాక దూరమైన దేదికలదు? ప్రపంచమునకంతయు హితమే కోరువాఁడవునీవొకఁడవే కదా! నిన్ను విడిచిన నన్ను రక్షించువారు లేరే. అదియు నాలోచింపుము. నీవు దేనికైన సమర్థుడవే. నన్నొకయాఁడుదాని నాపదనుండి తప్పించు సామర్థ్యము లేదా? యుద్ధరంగమందు భయంకరుఁడా! నీవుపూనిన నీ రాక్షసులా నీ కెదురునిలుచువారు? దాని నాలోచింపుము.అన్ని లోకముల నన్ని భూతముల రక్షించు దీక్షగలవాఁడవే! నన్నొకతెను రక్షింపకుండిన నీ వ్రతము భంగముగాదా? కమలలోచనా! నీవీ రాక్షసులవలెఁ గ్రూరపు దృష్టిగలవాఁడవు కావే. తేనెచేఁ గమలమువలె దయచే నార్ద్రమైన దృష్టులు గలవాఁడవే. ఏల నాపై నా దృష్టి పఱుపకున్నావు? నీవు సర్వజ్ఞుఁడవే. ఇచ్చట రాక్షసులు నన్ను బాధించుట తెలిసికొనలేక యున్నావా?

సీ. ఈ వొక్కఁడవు దక్క ♦ నితర దైవము లేద, టంచు నేఁ దలఁచిన ♦ యట్టితలఁపు
వినఁగోరి నీసూక్తి ♦ వికటరాక్షసపరు, షాలాపముల విను ♦ నట్టి యోర్పు
నీతోడ శయనించు ♦ ప్రీతిమై నీ నేలఁ, బడియున్న యట్టి యీ ♦ కడిఁది దిటము
రాముఁ డేటికి నన్ను ♦ రక్షింపకుండు నక్, ధర్మమార్గంబున ♦ స్థైర్యవిధము

తే. నాదుపరమపాతివ్రత్య ♦ నవ్యతపము, పాడుగాఁబోయె నాదుదౌ ♦ ర్భాగ్యమునను
ధరఁగృతఘ్నున కొనరించు ♦ పరమకృతిని, బోలి నా పాప మెంత ప్ర ♦ భూతమౌర.

అర్థములు. ఎంత పుణ్యవంతునకైనను, ఎంత తపస్వికైనను ప్రారబ్ధమడ్డపడినపుడు వానిపుణ్యము తపస్సు, శీలమేదియు రక్షింపఁజాలదని చెప్పఁబడుచున్నది.

వికటరాక్షస = భయంకరులైన రాక్షసుల. పరుషాలాపములు = కఠినవాక్యములు, కడిఁది దిటము = గాఢమైన పట్టుదల, ధైర్యము, స్థైర్యవిధము = నిలుకడగా నుండుట.

నీ వొకండవు..............తలఁపు = దైవమనిన నీ వొకఁడవే దైవముగాని వేఱు దైవము లేఁడని మరియెట్టివారిని నేను దైవమని తలఁచినదికూడ లేదుకదా. "ఏకభక్తిర్విశిష్యతే" "అనన్యాశ్చింతయంతో మాం" "అనన్యచేతా స్సతతం

'అనన్యభాక్' 'అనన్యమనసః' 'అనన్యయోగేన' ఇత్యాది భగవద్గీతావాక్యములను 'నాన్యం దేవం నమస్కుర్యాత్' 'నాన్యం దేవం నిరీక్షయేత్' మఱి యొకరిని దేవుఁడని నమస్కారము చేయరాదు. మఱి యొకరిని దేవుఁ డని చూడనురాదు. ఇత్యాదివాక్యము లనుసంధించునది. భర్తృఁడు, ప్రపన్నుఁడు, పతివ్రత సమానులు. నాథా! నేనిటువంటి యేకభక్తి నీయందుఁ గలదాన నగుటచేఁ గదా నీవు నారాయణుపూజసేయు నపుడును నేను నీసహాయురాలుగానుండి కావలసినవి యందిచ్చుచుంటినే కాని, నేను నారాయణునందుఁ గూడ దైవబుద్ధినుంచి యర్చించిన దానగాను గదా. ఇది యనేక దేవతాపూజను నిరసించుచున్నది.

వినఁగోరి...... యోర్పు=చూచినంత మాత్రముననే గుండెలు పగిలించు నీ రాక్షసుల కఠినవాక్యములు నేనోర్పుతో వినుటకు వానియందలి ప్రీతియా కారణము? కాదు. ఊపిరి పట్టుకొని యుండిన నీ మధురాలాపములు మఱల విను భాగ్యము గలుగకపోవునా? ఒక్కనాఁడు ఒక్కమాటు వినినను నేను ధన్యురాల నగుదునే యని తలంచి కదా యింత యోర్పు గలదాననై యున్నాను. ఆ యాశ లేకున్న నెప్పుడో మరణించియుండనా? నీతోడ శయనించు......ఇదియుమీఁది యట్టులే యాలోచింపవలెను.

రాముఁ డేటికి......విధము – దీనికే మహావిశ్వాసమని పేరు. భగవంతుఁడు నన్ను రక్షించునుగాని రక్షింపకపోఁ డను దృఢమైన నమ్మకము. 'తెడ్డుండఁగా జేయి యేలకాల్చుకొనవలయు' నన్నట్లు, రక్షించువాఁడు రాముఁడుండఁగా నేనేల దానికై శ్రమపడవలె? ఇతరుల నేల యాశ్రయింపవలె నన్న పట్టుదల 'నిన్ను దశాస్య నేనిపుడు నీఱుగఁ జేయనె' యని చెప్పుట కిదియె కారణము. పాతివ్రత్య పరమ తపము = పాతివ్రత్యము, పతిసేవయే వ్రతముగాఁ గలది పతివ్రత, ఆమెచర్య పాతివ్రత్యము. స్త్రీల కిదియే పరమతపము, దీనిని మించిన తపము స్త్రీలకు లేదు.

క. ఉపవాసంబులు వ్రతములు, తపములు వేయేల భర్త ♦ దైవత మని ని
ష్కపటతఁ గొలిచిన సాధ్వికి, నృపవర దుర్లభము లేదు ♦ నిఖిల జగములన్.

"నాస్తి యజ్ఞః క్రియా కశ్చిన్నశ్రాద్ధం నోపవాసకమ్ । ధర్మః స్వ భర్తృశుశ్రూషా తయా స్వర్గం జయంత్యుత॥ నాస్తి స్త్రీణాం పృథగ్ధర్మో నవ్రతం నాప్యుపోషణమ్। పతిశుశ్రూషణం తాసాం, తేన స్వర్గో విధీయతే" స్త్రీలకు యజ్ఞములు–ధర్మములు–కర్మములు– శ్రాద్ధములు–ఉపవాసములు–వ్రతములు లేవు. పతిశుశ్రూష చేతనే వారు స్వర్గము జయింతురు. ఇట్టి వ్రతము గలది పతివ్రత. నా దురదృష్టము వలన నివి యన్నియు వ్యర్థమై పోయెను.

తాత్పర్యము.

నీకంటె నాకు వేఱు దైవము లేదని, నీవే నా దైవ మని నిన్నే కొలుచుచుంటిని. నీ మాటలు వినగల నను నాశతో రాక్షసుల పరుషవాక్యముల విన సహించితిని.

సీతోడఁబండుకొనఁగోరి యిచట భూశయ్యఁ గావించితిని. రామచంద్రమూర్తి నన్నేల రక్షింపఁ డను ధైర్యము గలదాననై నా రక్షణమునందు నేనే ప్రయత్నముఁ జేయ మానితిని. పాతివ్రత్యమను తపముదప్ప వేఱుతపము స్మరించినదానఁ గాను. నేను నిర్భాగ్యురాలనైన కారణమునఁ గృతఘ్నునకుఁ జేసిన మేలువలెనన్నియువ్యర్థమై పోయెను. పాప మనఁగా నిచటఁ బాపఫలమైన ప్రారబ్ధానుభవము. ప్రభూతము=దొడ్డది. దీనివలన నన్నిటికంటెఁ బ్రారబ్ధము బలిష్ఠ మని గ్రహింపనగు.

ఇందుఁజెప్పఁబడినవన్నియుఁ బరమభక్తులయు, ప్రపన్నులయు కృత్యములు.

ఏకదేవతోపాస్తి కలవాఁడై యుండును.

భగవచ్చరిత్రములు తప్ప వేఱు లౌకిక వార్తలు వినరాదు.

దేహసుఖములఁ గోరరాదు.

రక్షకుఁడు భగవంతుఁ డని దృఢవిశ్వాసము గలిగి తన యోగక్షేమములకై తాను బాటుపడ రాదు. స్వాతంత్ర్యబుద్ధి మానవలయును.

చ. చెలువము వాసి మిక్కిలి కృశించితి, ని న్గనులారఁ గానఁగాఁ
గల నను నాశయుఀ సమసెఁ గావున మత్కృతపుణ్యకార్యముల్
బొలిసెను నిష్ఫలంబు లయి పూరుష పుంగవ! పోయెఁ బొమ్ము ని
ర్మల మగు నేకపత్నినియమంబు నిరర్థక మౌచు వల్లభా! ౭౨

అర్థములు. చెలువము = అందము. కృశించితి = క్షీణించితిని.

తాత్పర్యము.

నాథా! నీకు సంతోషకరమైన నా చక్కఁదనము తొలఁగిపోయెను. సన్న్యాసులకు వలె దేహమా బక్కచిక్కి తెల్లబాఱెను. కాఁబట్టి నాయందు నిప్పుడు నీకు మునుపటి ప్రేమ యుండునో యుండదో, నీకైంకర్యహీననైన నన్ను మునుపటివలె నీ వాదరింపకుండిననుబోనిమ్ము. నేను దూరముననుండి నీముఖమునైన దర్శింపగలనను నాశయు సమసెను. కావున నేను జేసినపుణ్యముల ఫలమంతయు వ్యర్థమై పోయెను. గార్హస్థ్యమున సన్న్యాసమున రెంటఁ జెడితిని. పుణ్యకర్మముల ఫలము పోయినఁ బోనిమ్ము. దానికి నేను వగవను నన్నురక్షించునని, వ్యర్థమైపోదని, నీప్రాప్తికప్రతిహతమైన యుపాయమని నమ్మియుండిన నిర్మలమైన పాతివ్రత్యము (భక్తి) కూడ వ్యర్థమై పోయెను. దానికి నేను దుఃఖించెదను.

దేహము భగవంతుఁడుండు నాలయమనుభావముతో నలంకరించుకొనవచ్చును. భగవదర్పణ బుద్ధి మంచి యాహారముఁ దినవచ్చును. స్వబుద్ధి స్వప్రయోజనము మాత్రము నిషిద్ధము. సన్న్యాసులవలె దేహము శుష్కింపఁజేసి తపముల నవయుటకంటె నీ గృహస్థమార్గ ముత్తమ మని యేర్పడుచున్నది. కాని దానికంటె నిది కష్టతర మార్గము. ఇట్టు లుండ లేనివాఁడు సన్న్యాసి యగును. ఫలమునందు

సన్న్యాసులకుఁ గలుగు బ్రహ్మలోకప్రాప్తికంటె వీరికి భగవత్సాయుజ్యప్రాప్తి తత్సమీపవర్తిత్వము లభించును.

చ. జనకునియాజ్ఞ చొప్పునఁ బ్ర♦శస్తగతిన్ వనవాసదీక్షఁ దీ
ర్చి నగర మేగి ధాత్రి కభి♦షేకముఁ గైకొనుచుం గృతార్థతన్
జనవున వారిజాతదళ ♦ చారువిశాలవిలోచనాళితో
నెనయిక భీతి లేక రమి♦యించెద వంచుఁ దలంతు సువ్రతా! ౨౩౦

అర్థములు. ప్రశస్తగతిన్=లోకముపొగడునట్లు, నిర్విఘ్నముగా, తీర్చి= ముగించి, కృతార్థతన్ = పురుషార్థము లన్నియు సిద్ధముగా నుండుటచే, వారిజాత దళ = కమలముల ఱేకులవలె, చారు = మనోహరములై, విశాల = వెడలుపైన, లోచనాళితోన్ = కన్నులు గల స్త్రీలతో, ఎనయికన్ = ఒద్దికతో, భీతిలేక = నే నేమనుకొందునో యను భయములేక, సువ్రతా=ఏకపత్నీవ్రతము గలవాఁడా! ఈపద్యమును గొందరు రామునకు బహు భార్య లున్నా రనుటకు నాధారముగ నుదహరించెదరు, గాని యది నిరాకరము. ఇది స్వభావముగ స్త్రీలకు వచ్చునాలోచనయే. తానుఁబోయినఁ దనభర్తమఱల వివాహమాడకుండునా? యనిస్త్రీతలచుట యందేమి వింత గలదు? ఇచ్చట భయ మనునది వనవాసభయముకాదు. వనవాస దీక్ష ముగించి యయోధ్యఁజేరినపిమ్మటమఱల వనవాసభయ మెందుండి వచ్చును.

తా త్ప ర్య ము.

రామచంద్రమూర్తి సత్యసంధుఁడు. తండ్రియాజ్ఞ ప్రకారము పదునాలుగు సంవత్సరములు వనవాస దీక్షగాఁ బూర్తిచేసి తన సత్యమును, దండ్రి సత్యమును గాపాడెనని లోకము మెచ్చునట్లు నిర్విఘ్నముగ వనవాసము సలిపి యయోధ్యకుఁ బోయి రాజ్యాభిషేకము గ్రహించి పురుషార్థము లన్నియుఁ బూర్ణముగా నుండఁగా ననేకసుందరులతో నొద్దికతోఁ గ్రీడింపఁగల వని తలచెదను. అట్లు చేయక నీవెట్లుండఁగలవు? ఇంత ప్రభుత్వము చేయుచు విధురునివలె, సన్న్యాసివలె నుండుటను నీవారు సహింతురా! వారు బలవంతపెట్టియైన నీకు వివాహము చేయ యత్నింతురు. ఎందఱు రాజులు మా పిల్లనిచ్చెద మనిన మాపిల్ల నిచ్చెద మని పైపడివత్తురు. కావున నీవు మఱల వివాహమాడి సంసార సుఖ మనుభవింతువని తలఁచెదను. కాని సువ్రతుఁడవే. ఏకపత్నీవ్రతము గలవాఁడవే. పట్టినవ్రతము విడువని దృఢనిష్ఠుఁడవే. నిరపరాధిని నీ యందనురాగముగలదానిని నన్నిచ్చటఁ జావ విడిచి వ్రతభంగమగుట కోర్చియైన నట్లుచేయుదువా? చేయవేని నేను నీ సుఖముకూడఁ జెఱచిన దాన నగుదునుగదా. తాను జెడి భర్తను జెఱుచు నావంటి నిర్భాగ్యురాలుకూడ లోకంబున నుండునా?

పంచచామరము. ఘనంబుగా మనంబు నిల్పి ♦ కంజనేత్ర! నీ పయిన్
వినాశ మందు చున్నదాన ♦ నేను రామ! యీగతిన్

వినీతిరీతి నేను జల్పు♦విశ్వసద్వ్రతంబులన్
జనెం బ్రయోజనంబు లేక ♦ స్వల్పభాగ్య నౌటచేన్. ౭౩౧

అర్థములు. వినీతిరీతిన్ = మిక్కిలి వినయముతో, విశ్వసద్వ్రతంబులన్ = అన్ని మంచివ్రతములు, స్వల్పభాగ్యను = కొంచెము పుణ్యముగలదానను,

తా త్ప ర్య ము.

నాథా! రామచంద్రా! ఎంతటి పాపాత్మురాలైనను నీమీఁద నేకొంచెము మనస్సైన నుంచినను శ్రేయస్సుఁ గందురు. అటులుండ నేను నీమీఁద దృఢముగఁ జిరకాలముగ మనసు నిల్పి యీ విధముగ నశించుచున్నదానను రామా! యిది నీదోషము గాదు. నా దోషమే. ఏలన నేను నియమము దప్పక సల్పిన యన్ని మంచి వ్రతములు నల్పభాగ్యనగుటచే వ్యర్థములైనవి. ఏకొంచె మదృష్టమున్నను నేనుమాత్రము తక్కిన వారివలె నిన్నాశ్రయించి బాగుపడ లేకపోయితినా? నా దుర్దశకు నా దురదృష్టమే కారణము. నీవు కావు.

శా. లేరే దాతలు నాకు నింత విషమేఁ ♦ లేఖారి వేశ్మంబునన్
గ్రూరం బైన కృపాణ మేనియును గో♦కొమ్మంచు నీయంగ? న
ట్లేరే నిచ్చినఁ బాయనే తనువు ని♦ప్డే కాలకూటానఁ గా
నీ రాజత్కరవాలఘాతమునఁ గా♦నీ దుఃఖనాశంబుగన్. ౭౩౨

అర్థములు లేఖారి= దేవతలకు విరోధియగు రావణాసురుని, వేశ్మంబునన్ = ఇంటియందు, కృపాణము=కత్తి, కోకొమ్ము=తీసికో తీసికో, కాలకూటానన్ = విషముచే, కరవాలఘాతమున = కత్తిదెబ్బచే, కానీ = కానిమ్ము, ప్రార్థనాదులం దన్నత్యయాంత క్రియలమీఁది యుమ్మునకు నీకారంబు విభాష నగు ప్రౌ. వ్యా. క్రి. ౧౦ సూ.

తా త్ప ర్య ము.

రామచంద్రా! నీ వయోధ్యకేగి దుఃఖమే యనుభవింతువో, సుఖమే యనుభవింతువో, దుఃఖమనుభవింపకుండ నేనేమి చేయఁగలను. సుఖ మనుభవింప నేనేమి చేయఁగలను? నే నేమియుఁ జేయఁజాలను. ఇట్టిదానను నేనుజీవించి యేమి ప్రయోజనము? ప్రాణము విడుతునా? దానికైన విషమో కత్తియో కావలయునుగదా! అవి నే నెక్కడనుండి తెత్తును? ఈ రావణాసురుని యింటిలో నిందఱున్నారే. ఒకరైన నాయందు దయగలవారు గానీ, ద్వేషముగలవారు కానీ, కమ్మని యింత విషమో. పదునైన కత్తియో యిచ్చు దాతలు లేరా? అట్లెవరే నిచ్చిన నిప్పుడే విషము చేతనో, కత్తి నఱకులచేతనో నా దుఃఖము నశింపఁ బ్రాణము విడుతును గదా.

చ. లలన యనేకరీతులఁ ద♦లంచి తలంచి మనోవిభున్ వ్యథా
కులమతి నిట్లు వా విడిచి ♦ గోలున నంగిలి యెండ నేడ్చుచున్ ।

దలఁకుచు బుష్పితోరువసు♦ధారుహమూలసదేశ మేగి యి
చ్చలి తనవేణిఁ గేలఁ గొని ♦ చచ్చెరఁ దా నురిపోసికొ న్మతిన్. ౨౩౩

అర్థములు. వావిడిచి=నోరు తెఱచి- గట్టిగా, పుష్పిత=పూఁచిన, ఉరు=గొప్పదగు, వసుధారుహ=చెట్టుయొక్క, మూల = మొదళ్ళయొక్క, సదేశ=సమీప ప్రదేశము; ఉరిపోసికొన్మతిన్=ఉరిపోసికొను నభిప్రాయముతో.

తాత్పర్యము.

ఈ ప్రకారము తన భర్తను నానావిధములఁ దలఁచి తలఁచి దుఃఖముచే కలవరపడి నోరు తెఱచి హాయని గట్టిగా నోరెండ నేడ్చుచు నిఁకఁ బ్రదికి ప్రయోజనము లేదని పూఁచిన చెట్టు మొదటికి మునుపటికంటె సమీపముగఁ బోయి సీతాదేవి జడ చేతికిఁ దీసికొని యురిపోసికొను నభిప్రాయముతో.

చ. అనువగుశాఖఁ గేలఁ గొని ♦ యాత్మకులంబును రామచంద్రునిన్
ఘనుని సుమిత్రపట్టిని మ♦నంబున నెంచుచు నుండ శోకనా
శనమును ధైర్యసాధనము ♦ శస్తకరంబును నౌ నిమిత్తముల్
గనఁబడెఁ దొంటియట్ల మృగ♦కాతరనేత్రకు ముత్ప్రదంబులై. ౨౩౪

అర్థములు. అనువు=అనుకూలము, ఆత్మకులంబును=తన వంశంబును, శస్తకరంబును = మేలుకలిగించునవి, నిమిత్తముల్ = శకునములు, మృగ కాతర నేత్రకున్=జింకకన్నులవలె బెదరుటచేఁ జలించు కన్నులు గలదానికి, ముత్+ప్రదంబులై = సంతోషకరములై.

తన వంశంబును దలఁచుటచే – అట్టి గొప్పవంశమునఁ బుట్టిన నేను నిట్టి నీచపుఁ జావు చావ వచ్చునా యని యాలోచించె నని భావము.

'అతిమానా దతిక్రోధా త్స్నేహాద్వా యదివా భయాత్ ।ఉద్బధ్నీయా త్స్త్రీ పుమాన్వా గతిరేషా విధీయతే । పూయశోణిత సంపూర్ణే త్వంధే తమసి మజ్జతి । షష్టిర్వర్షసహస్రాణి నరకం ప్రతిపద్యతే । ఆశౌచం నోదకం నాగ్నింనాశ్రుపాతంచ కారయేత్' ॥ అవమానము వలనఁగాని, యతికోపముచేఁ గాని, స్నేహముచేఁగాని, భయముచేగాని యురిపోసికొని బలవంతపు మరణము స్త్రీగాని, పురుషుఁడుగాని చచ్చినయెడల నఱువదివేల యేండ్లు దుర్గంధముతోఁ గూడిన యంధతమిస్ర నరకమందుఁబడి యుండవలెను. బలవంతపుఁజావు చచ్చినవారికి సూతకముండరాదు. నీళ్లు విడువరాదు. అగ్నిసంస్కారము చేయరాదు. కన్నీరు విడువరాదు.

ఇట్టి నీచపుఁ జావు జనకునివంటి మహాత్ముని వంశము దాననై యెట్లు చత్తునా యని యాలోచించెను.

రామలక్ష్మణులను దలఁచుట నే నిట్లు చేసినవారి కపకీర్తి వచ్చునే యని, వారేమైన ప్రయత్నము చేయుచున్నారేమో నే నిపుడు చచ్చిన వారసమర్థులై యాఁడుదానిని రక్షింపలేక చావ విడిచిరని లోకులందురేమో నిష్కారణముగ

నంతటి వారికి నపకీర్తివచ్చునే? వారిచ్చటికి వచ్చునప్పటికి నేను జచ్చియుండిన దాహపీడితుఁడు పాడుపడిన చలువ పందిరికి వచ్చినట్లగునే యని యాలోచన.

తాత్పర్యము.

ఉరి పోసికొనుటకు ననుకూలమైన కొమ్మను జేతఁ దీసికొని తన వంశంబును, రామలక్ష్మణులను మనస్సులో స్మరించుచు నురిపోఁతకు యత్నము చేయుచుండ శోకము నశింపఁజేయునవియు, ధైర్యము కలిగించు నవియు, శుభకరములైనవియునగు శకునములు సంతోషకరములై మునుపటివలెనే కాన వచ్చెను.

మునుపటి వలెనే యనుటచే నింతకుఁ బూర్వముకూడ నిట్టులే యత్నముచేసి శుభశకునము లగుటచేఁ జాలించుకొను చుండె నని భావము.

—♦ ౨౯—వ సర్గము. మరణోద్యుక్తయగు సీతాదేవికి శుభశకునంబు లగుట ♦—

సీ. అంతటి వ్యథితను ♦ హర్షవ్యపేతను, బరిదీనమానసఁ ♦ బరమనియమ
భద్రనిమిత్తముల్ ♦ ప్రాపించి రాజిల్లె, ధనిఁ జేరు సేవక♦తతులభంగి,
లక్ష్మీకము నరాళ♦పక్ష్మరాజీవృతంబును విశదవిశాల♦మును విసీల
మును నగు వామలో♦చనము మీనాహత, మైన పద్మం బన♦నదరఁజొచ్చె
ఆ. మృదుమనోజ్ఞపీనవృత్తంబు చందనా,గురుసమర్హ మగుచుఁ♦బరమలోక
నాథచిరగృహీత♦నవ్యవామభుజంబు, కొంతసేపు కదలె ♦ నంతకంత. ౨౩౫

అర్థములు. అంతటి = ఇంతయని పరిమాణము చెప్పుటకు వాల్మీకి వంటి సర్వజ్ఞునకు సాధ్యము కానంతటి. వ్యథితను = దుఃఖపడిన దానిని, హర్షవ్యపేతను = సంతోషములేని దానిని, ఈమెయు గొన్ని నాళ్ళు సుఖమనుభవించినదా, పుట్టినది మొదలిట్టులే యున్నదేమో యనునట్లుచూచువారికిఁ దోఁచుచున్నట్లున్న దానిని, వి- అపఅను రెండుపసర్గములఁబ్రయోగమువలననింతయర్థముచెప్పవలసివచ్చినది.పరిదీన మానస = దీనమానస యనినప్పుడు దీనమైన మనస్సుగలదని యర్థమగును. పరిదీన యనుటచే నెప్పుడును నిల్లెశోకముతోఁ గూడినదైయుండునా, కొన్ని నాళ్ళుసంతోషముగలదై యుండెనేమో యందమా. దానికిఁ దగిన యాధారములేని మనస్సుగల దానిని; పరమనియమ = ఆమెశోకము బాధ యెట్లున్నను ఆమెను జూచినయడల నీమెజన్మప్రభృతి గొప్పనియమములు గలదని, పరమ పతివ్రతయని స్ఫురింపఁజేయు దానిని, భద్రనిమిత్తముల్ = శుభసూచకములు, ధనిన్ = ధనవంతుని, సేవకులు తమ యుజ్జీవనార్థము ధనికుని యొద్దకుఁ దామేపోయి యతనినాశ్రయింతురు. అట్టులే శుభశకునములు తమంతట దామే తాము శుభశకునములనిపించుకొనుటకుఁ దమ యుజ్జీవనార్థము ఆమెయొద్దకు వచ్చెనని భావము. లక్ష్మీకము = సేవకులు లక్ష్మిని గోరి లక్ష్మిగల వాని నాశ్రయించి వారి సేవ చేసి వారి కుపకరించి ధన్యు లగు చున్నారు. ఈ శుభశకునము లట్లుగావు. సాక్షాల్లక్ష్మి యగు సీతాదేవినే యాశ్ర

యించి యామె కుపకరించి రాజు నాశ్రయించి రాజ భటు లను గౌరవము సంపాదించు కొనునట్లు తాము శుభశకునము లని పేరొందెను. అరాళ = వంకరయగు ముత్తెపుఁజిప్పలవంటి రెప్పలయొక్క, పక్ష్మరాజీ = వెండ్రుకల సమూహముచే, వృతము = ఆవరింపఁబడినది. విశద విశాలము=విశదము=నల్లగుడ్డుచుట్టు తెల్లఁగా నుండునది, విశాలము = వెడలుపైనది. వినీలమును=నల్లని గుడ్డుకలది, వామలోచనము = ఎడమకన్ను, మీనాహతము = చేపచేఁ గొట్టఁబడినది, పద్మంబన= కమల మనునట్లు. కనులకొన లెఱ్ఱగా నున్నవని భావము. 'ప్రాంతర క్తైచ నేత్రే,యని యుండుటచే నీ వర్ణన మీమె పద్మినియని తెలుపుచున్నది. పీనము=బలిసినది,వృత్తము = గుండ్రనిది, చందన + అగురు+సమర్థ్యము=చందనము పూతఁకు, అగురు పూఁతకు యోగ్యమైనది, పరమలోక నాథ = లోకపరమనాథ యని యన్వయము, లోకముల కన్నిటికి శ్రేష్ఠుఁడైన నాథుఁడు, లోకనాథు లనిపించుకొన్నవారికందఱకు నాథుఁడని భావము. 'ఏకో దేవో నారాయణః-ఏక మేవాద్వితీయమ్ న త్వత్స మోస్త్యభ్యధికః కుతోన్యః' భ. గీ ౧౧-౪౩ అను శ్రుతి స్మృతి వాక్యములు స్మరణీయములు. ఇది వాల్మీకి యభిప్రాయము. చిరగృహీత=బహుకాలమునకుఁ బూర్వము అనఁగా ననాదిగ సూక్ష్మావస్థయందును స్థూలావస్థయందును, నవ్య = అందమైన, వామభుజంబు = ఎడమచేయి, కొంతసేపు = కొంచెముసేపు, ఎక్కువకాల మదిరిన వాతరోగ మగును.

తా త్ప ర్య ము.

ఇంతంతని చెప్పరాని బాధపడుచు సంతోష మనునది లేక మిగులశోకపూరిత మయిన మనస్సుగలదయ్యు పరమవ్రతము విడువక యుండు సీతకు ధనవంతునిఁజేరు సేవకులవలె శుభశకునములు కానవచ్చెను అవి యేవి యనిన శోభతోఁ గూడి వంకర వెండ్రుకలచే నావరింపఁబడి తెల్లనై విశాలమై నల్లనైన గ్రుడ్డుగలదై యంచున నెఱ్ఱని కాంతి గల యెడమకన్ను చేపతాఁకుచేఁ గదలెడి పద్మమువలెఁ జలించెను. మృదువై మనోహరమై బలిసినవై గుండ్రమైన చందనాగురు గంధముల కర్హమై లోకాధినాథుఁడగు శ్రీరామచంద్రమూర్తిచేఁ జిరకాలముగ గ్రహింపఁబడినదగు మనోహరమైన యెడమచేయి యంతకంత కెక్కువగఁ గొంచెముసేపు కదలెను.

క. కరిరాజహస్తనిభములు, సరసంబులుఁ బీవరములు ♦ సంహతములు నా
కరభోరుతొడల నెడమది, పొరిఁ బొరి రఘురాముఁజూపు♦పోలుపున నదరెన్.

అర్థములు. కరిరాజ హస్త నిభములు=శ్రేష్ఠమైన యేనుఁగు తొండముతో సమానములైనవి, సరసంబులు = అందముతోఁ గూడినవి. పీవరములు = బలిసినవి, సంహతములు = ఒకదాని నొకటి తాఁకియుండునవి, కరభోరు తొడలన్ = సీతాదేవి తొడలందు.

స్త్రీలకు నెడమ కన్ను, ఎడమ భుజము, ఎడమ తొడ అదరెనేని ఫలము

వెంటనే కనఁబడును. అట్టులే పురుషులకుఁ గుడివైపు కన్ను, భుజము, తొడ యదరె నేని వెంటనే శుభఫలము గలుగును.

తాత్పర్యము.

ఏనుఁగు తొండముతో సమానములై, యందములై, బలిసినవై – కావుననే జోడించి నపుడు నడుమ నెడములేనివైన సీతాదేవి తొడలందు నెడమతొడ రామ చంద్రమూర్తిని నేను జూపెద నన్నట్టు లదరెను. సీతాదేవికి నెడమకన్ను, ఎడమ భుజము, ఎడమతొడ యదరెనని చెప్పినఁజాలునే. ఇంత వ్యర్థవర్ణన మేల? ఇది వ్యర్థ వర్ణనము గాదు. లోకములోని స్త్రీలకు నేదైన నంగవైకల్యము వారి దుఃఖములకుఁ గారణము. అట్టియంగవైకల్య మీయామె యందు లవమైన లేదు. అట్లుండియు దుఃఖింప నేల యనిన నిదియామె స్వయముగఁ గోరి తెచ్చుకొన్నది. కాలుచున్న యింటిలోఁ జిక్కుకొన్న బిడ్డలబయటఁ దెచ్చుటకు దానిలో దుముకు దయావతివలె రావణు చెఱలోనుండు స్త్రీలనురక్షింపఁదాను జెఱలోఁ బ్రవేశించెనుగాని, కర్మానుభవమునకై కాదు. ఈ విషయము దెలుపుటకై యీ యవయవ వర్ణనమని యెఱుంగునది. అటుగాకున్న బలిసిన భుజములు, బలిసినతొడలు ననునవి మునుపటి స్థితిగాని, కూడు నీళ్లు లేక శుష్కించిన యిప్పటి స్థితిగాదు. దాని నిప్పుడు చెప్ప నేల?

క. చారురద చారులోచన, సారసముఖి యైన సీత ♦ స్వర్ణాభవిభో
దారము ధూసరితం బగు, చీరయు నొక యింత సడలె ♦ సేమముఁ దెలుపన్. 232

అర్థములు. చారురద = అందమైన దంతములు గలది, చారులోచన = అందములైన కన్నులు గలది; సారసముఖి = కమలమువంటి ముఖము గలది, స్వర్ణాభ = బంగారుతో సమానమైన, విభా+ఉదారము = కాంతిచే గొప్పది, ధూసరితము=దుమ్ముచే నిండి బూడిదరంగు గలది. వ్యాకరణము:—సీత యనునది చీరతో సమసించును. సీత చీర యని షష్ఠీతత్పురుషము. ఈ రెండుమాటల నడుమ చీరకువిశేషణములైన స్వర్ణాభ విభోదారము, ధూసరితముఅను పదములువచ్చినవి. ఇట్లు సమాసము నడుమ వ్యస్తపదములు రావచ్చునా? "ఒక్కొక్కచో సమాసగత పూర్వ పదంబు వ్యవహితోత్తర పదం బొంటితోడను, వాని పెక్కింటి తోడనునన్వ యించెడి'' ప్రౌ. వ్యా. సమా. 3౮. సూ. ''ఒక్కొక కన్నును, జెవియును, జెక్కును, మూఁపు చెలువగు చేయున్. భార. సభా ౧ ఆ. ఇచ్చట నొక్కొక చేయున్ అను సమాసము నడుమ చెలువగు నను విశేషణము వచ్చినది. సడలెన్ = వదులయ్యెను. నిష్కారణముగఁ గట్టుకొన్న వస్త్రము జాఱుట శుభ సూచకము.

తాత్పర్యము.

అందములై దానిమ్మగింజలవంటి దంతములు, నందములైనకన్నులు, కమ లమువంటి ముఖముగల సీతాదేవి కట్టుకొనియున్న పచ్చని కాంతి గలిగి మాసిన చీర కొంచెము వదలి జాఱెను.

క. మున్నుగడు లెస్సయెఱఁగి, యున్న నిమిత్తములఁ జూచి ♦ యుగ్రాతపవా
తోన్నతిఁ జెడుబీజము వృష్టిన్నన మొలతెంచుమాడ్కి ♦ సీతయునలరెన్. ౨౩౬

అర్థములు. ఉగ్ర + ఆతప + వాత + ఉన్నతిన్ = భయంకరమైన యతిశయించిన యెండకు గాలికి, వృష్టిన్ = వానచే, నన = మొలక.

తా త్ప ర్య ము .

మునుపు చక్కఁగా దెలిసియున్న శకునములఁ జూచి తీవ్రమైన యెండకు, గాలికి నెండిపోయిన, నేలలోఁ బడియున్న విత్తనము వాన పడఁగానే మొలకయెత్తునట్లు సీతాదేవి సంతోషించెను.

క. బింబఫలాధరమును రోలంబాలకమును సుమంజు ♦ లభ్రువు నీరే
జాంబకమున్ సితదంతంబుం బొలిచెనుముఖము రాహు ♦ ముక్తేందుగతిన్. ౨౩౭

అర్థములు. బింబఫలాధరము = దొండపండువంటి పెదవిగలది, రోలంబాలకము = తుమ్మెదవంటి ముంగురులు గలది, ఇవి యన్నియు బహువ్రీహి సమాసములు. సుమంజుల భ్రువు = మిగులమనోహరమైన కనుబొమ్మలు గలది, నీరేజాంబకము = కమలమువంటి కన్నులు గలది, సితదంతంబున్ = తెల్లని పండ్లుగలది, రాహుముక్తేందుగతిన్ = రాహువుచే విడువఁబడిన చంద్రునివలె.

తా త్ప ర్య ము

దొండపండువంటి పెదవి, తుమ్మెదలవంటి ముంగురులు, అందమైనకనుబొమలు, కమలము వంటి కన్నులు, తెల్లని దంతములు గల సీతాదేవి ముఖము రాహువుచే విడువఁబడిన చంద్రునివలె ప్రకాశించెను.

సాముద్రిక శాస్త్రమందలి యీ శ్లోకము నిచట స్మరింపనగు.

కన్నులు — లలనాలోచనే శస్తే, రక్తాంతే కృష్ణతారకే, గోక్షీరవర్ణవిశదే సుస్నిగ్ధే కృష్ణపక్ష్మణీ, ఉన్నతాక్షీచ దీర్ఘాయుః.

కనుకొలుకులం దెఱుపు — కనుపాపలు నలుపు-దానిచుట్టు నావుపాలవలెఁ దెలుపుగలవై, నునుపై నల్లని ఱెప్పకొనలు గల కన్నులు, మిగుల శ్రేష్ఠములు. కన్నులు కొంచెము మిట్టగనుండిన (మిడిగ్రుడ్లు కావు) దీర్ఘాయువు గలదగును.

తొడలు:— "సుదృఢైః కరభాకారైరూరుభి ర్మసృణైర్ఘనైః । సువృత్తైరోమరహితై ర్భవేయు ర్భూమివల్లభాః॥

తొడలు దృఢములుగను, కరభములవలెను, నునుపుగను, లావుగను గుండ్రముగను వెండ్రుకలులేకయు నుండిన రాజులకు భార్యలగుదురు.

దంతములు:— గోక్షీర సన్నిభాస్నిగ్ధా ద్వాత్రింశద్దశనాః శుభాః । అధస్తాదుపరిష్ఠాచ్చ సమాః స్తోక సమున్నతాః॥

ఆవుపాలవలెఁ దెల్లనై గఱుకులు లేక నునుపై క్రింది మీఁద సమములై కొంచె మెత్తుగలిగి ముప్పదిరెండు పండ్లుండెనేని శుభము.

పెదవులు:—పాటలో. వర్తులః స్నిగ్ధో రేఖాభూషితమధ్యమః। సీమంతినీ నామ ధరో ధరాజానిప్రియా భవేత్॥ ఎఱ్ఱనై - గుండ్రమై - నునుపై నడుమ రేఖగలిగిన పెదవి గల స్త్రీ రాజపత్ని యగును.

ముఖము:—సమం సమాంసం సుస్నిగ్ధం స్వామోదం వర్తులం ముఖం। సునేత్రం సురదచ్ఛాయం ధన్యానా మిహ జాయతే॥ ముఖము సమమై మాంసము గలదై నునుపై మంచి పరిమళము గలదై గుండ్రమై మంచి కన్నులు పెదవుల కాంతి గలదైయుండెనేని యట్టి స్త్రీ ధన్యాత్మురాలు.

స్తనములు:— ఘనౌ వృత్తౌసమౌ పీనౌ దృఢౌ శస్తౌపయోధరౌ॥ స్తనములు గొప్పవిగను గుండ్రముగను, రెండును సమముగను, బలిసినవిగను (గుంతలు లేనివి) గట్టిగను నుండునవి ప్రశస్తములు.

దక్షిణోన్నత వక్షోజా పుత్రిణీ ష్వగ్రజా మతా
వామోన్నత కుచా సూతే కన్యాం సౌభాగ్య సుందరీమ్॥

కుడి స్తన మెత్తుగ నుండిన మంచి కొడుకులు గలదగును. ఎడమ స్తన మెత్తుగ నుండిన సౌభాగ్యవతియు, సుందరియు నగు కూఁతును గనును. "మూలే స్థూలౌ క్రమ కృశౌ వగ్రే తీక్ష్ణౌ ప్రశస్తకౌ" మొదట నడుగు భాగమున లావుగను గ్రమ క్రమముగాఁ బైకిఁబోవు కొలఁది సన్నముగను (మారేడుకాయవలె) కొనలు తీక్ష్ణముగ నుండిన స్తనములు ప్రశస్తములు.

"సదృశం చూచుకయుగం శస్తం శ్యామం సువర్తులమ్." రెండుచను ముక్కులు సమానముగను, నల్లగను గుండ్రముగ నుండిన ప్రశస్తములు.

వెండ్రుకలు : కేశా అళికులచ్ఛాయా సూక్ష్మాస్స్నిగ్ధా స్సుకోమలాః
కించి దాకుంచితాగ్రాశ్చ, కుటిలాశ్చాతి శోభనాః.

తుమ్మెదరెక్కల కాంతిగలిగి సన్నములై, నునుపులై, మృదువులై, కొంచెము వంగిన కొనలు గలవై వంకర లయి యున్న వెండ్రుకలు శుభప్రదములు.

కనుబొమలు:—భ్రువౌ సువర్తులౌ తన్వ్యౌ స్నిగ్ధే కృష్ణే త్వసంహతే
ప్రశస్తౌ మృదురోమాణౌ, సుభ్రువః కార్ముకాకృతీ.

గుండ్రములై, నునుపులై, నల్లనై,—ఒకదానితో నొకటి కలియనివై మెత్తని వెండ్రుకలు గలవై విండ్లవలె నుండు కనుబొమలు ప్రశస్తములు. ఇవన్నియు నుత్తమ స్త్రీలక్షణములు. సీతాదేవియందివి యన్నియుఁ గాన నగును.

క. అంతట శ్రీరఘురాముని, కాంత విగతశోక హర్ష♦కలితయునై యే
కాంతము శోభిల్లె నిశా, కాంతునితో వెలుగు రేయి♦గతి నవ్వేళన్. ౭౪౦

అర్థములు: విగతశోక=పోయిన శోకము గలది, హర్షకలితయు=సంతోషము కలది, ఏకాంతము = మిక్కిలి.

తా త్ప ర్య ము.

ఇట్లు శుభ శకునములు కనఁబడిన పిమ్మట సీతాదేవి శోకమువదలి సంతోషించినదై చంద్రునితోఁ గూడిన రాత్రివలెఁ బ్రకాశించెను. నిశాకాంతునితోడి నిశవలె శ్రీరఘురాముని కాంత యనుటచే భర్తతోఁ గూడినంత సంతోషము గల దయ్యె నని భావము.

——♦౩౦-వ సర్గము. సీతాదేవితో నెట్లు భాషింపఁదగునని హనుమ యోజించుట♦——

క. సీతావిలాప మసురీ, వ్రాతము బెడిదములు త్రిజట♦స్వప్న కథనమున్
వాతతనూజుఁడు విని భూ, జాతను సురవని నమర్త్య♦సఖఁగఁ దలంచున్. ౭౪౧

అర్థములు. విలాపము=ఏడుపు, అసురీ వ్రాతము=రాక్షస స్త్రీలయొక్క, బెడిదములు = పరుషంపు మాటలు, బెట్టిద శబ్దమునకువలె దీనికిని బహువచనమందే యీ యర్థము. కథనము=చెప్పుట, సురవనిన్=నందనమందలి, అమర్త్య సఖగ=అప్సరసవలె, విని, తలంచున్ – ఈ రెండు క్రియలకు సమానాశ్రయితయే వివక్షితముకాని యుత్తర కాలీనత వివక్షితము కాదు.

తా త్ప ర్య ము.

సీతాదేవి యేడుపుమాటలు, రాక్షసస్త్రీల బెదరింపు మాటలు, త్రిజట చెప్పిన కలవిషయమైన మాటలు హనుమంతుఁడు విని యీమె దేవలోకములోని నందన వనమున నుండు దేవతాస్త్రీగాని, మనుష్యస్త్రీ గాదని తలఁచెను. ఈమె సీతాదేవియే యనుటకు నింతఁ జెప్పఁబడినవి, స్వతంత్రములు, పరోక్షములు, పరస్పర సంబంధము లేని సాక్ష్యములు. ప్రత్యక్ష సాక్ష్యము దేహమునందుఁ గాన వచ్చిన సాముద్రిక చిహ్నములు. ఇన్ని విధములఁ బ్రత్యక్ష పరోక్ష నిదర్శనములచే నీమె సీతయే. రామచంద్రమూర్తి సందేశము విన నీమె యర్హయే యని యెట్లు హనుమంతుఁడు తీర్మానించు కొనెనో యట్లులే యాచార్యుఁడును శిష్యుఁడుగా గ్రహింప నుద్దేశించిన వానిని ప్రత్యక్ష పరోక్ష నిదర్శనములచే భగవత్తత్త్వ రహస్య ముపదేశింప నర్హుఁడా యని పరీక్షింప వలయును.

ఉ. వేయితలంపు లూరఁ బడి♦వేలవిధంబుల యోజనాపరుం
డై యతిసంఖ్యులైన ప్లవ♦గాగ్రణు లెల్లెడ నే సతీమణిన్
రోయుచు నున్నవారో సిత♦రోచిముఖిం గనుఁగొంటి నిందు నే
నా యలినీలవేణిఁ గుసు♦మాసవసన్నిభవాణి జానకిన్. ౭౪౨

అర్థములు. యోజనాపరుండై = ఆలోచనలతోఁ గూడినవాఁడై, అతిసంఖ్యులు=లెక్కకు మించినవారు, ప్లవగాగ్రణులు=వానరశ్రేష్ఠులు, సితరోచిముఖిన్=చంద్రముఖిని, అలినీలవేణిన్=తుమ్మెదలవలె నల్లనైన జడగల దానిని, స్త్రీని, కుసుమాసవ=తేనెతో, సన్నిభ=సమానమైన, వాణిన్=వాక్కుగల దానిని.

తాత్పర్యము.

అనేకములగు తలంపులు గలుగఁగా ననేకవిధంబుల యోజించి హనుమంతుఁడు తనలోఁ దా నిట్లనుకొనుచున్నాఁడు. లెక్కలేని వానరులే సతీరత్నమును వెదకుచున్నారో యా స్త్రీని నే నిందు జూచితిని.

క. చారుఁడనై యోగ్యుఁడనై, వైరిబలాబలము లెఱుఁగ, వలఁతిని నా నే
నారసి యసురవిశేషము, లీ రావణుబలముఁ బురము నెఱిఁగితి నెల్లన్. ౭౪౩

అర్థములు. చారుఁడనై = వేగులవాఁడనై, హనుమంతుఁడు దూతగాఁ బంపఁబడెనుగాని వేగులవాఁడుగాఁ బంపఁబడ లేదు. దొంగవేషములతో, దొంగ చేష్టలతోఁ, దొంగమాటలతోఁ గార్యము చేయువాఁడు. వేగులవాఁడు. దూత బహిరంగముగ వర్తించువాఁడు. వీఁడు తన పేరు దాఁపఁడు. ఇట్టివాఁడు తాను వేగులవాఁడ ననుటయే గాక యోగ్యమైన కార్యముచేసితి ననియుఁ జెప్పుచున్నాఁడు. ఇది యెట్లు సమంజసము?

సుగ్రీవుఁడు సీతాదేవి యెందున్నదో చూచి రండని చెప్పెను. రామచంద్రమూర్తి సీతాదేవితో మాట్లాడి రమ్మనిముద్రిక యిచ్చెను. వెదుకుటయనుకార్యము రహస్యముగను జేయవచ్చును. బహిరంగముగఁ జేయవచ్చును. ఇచ్చట బహిరంగముగఁ జేయబూనినఁ గార్యభంగమగును. అది యాచితీవిరుద్ధము. దొంగవలె వెదకుట పౌరుషవిరుద్ధముకాదా యనిన నది యెట్టివారియం దట్టులే వర్తించుట, యెవరికైన నీతిబాహ్యము కాదు. 'కుటిలబుద్ధుల గెలువంగఁ గుటిలమతియ,యర్హ మగుఁగాని నీతిగా దార్జవంబు' అని నీతి లక్షణము. మఱియు 'యో యథా వర్తతే యస్మిన్, తస్మిన్నేవం ప్రవర్తయన్ ।నాధర్మం సమవాప్నోతి, న చాశ్రేయశ్చ విందతి' (భార. ఉ. ౧౭౯-౩౦.)

ఎవని విషయమున నెవఁడెట్లు వర్తించుచున్నాఁడో వాని విషయమున వాఁడట్లు వర్తించిన యెడల ధర్మహాని లేదు, శ్రేయోహాని లేదు. ఇది భీష్మవాక్యము.

యస్మిన్ యథా వర్తతే యో మనుష్యః
తస్మిన్ తథా వర్తితవ్యం స ధర్మః
మాయాచారో మాయయా బాధితవ్యః
సాధ్వాచారః సాధునా ప్రత్యుపేయః॥ శాంతి.

ఏ మనుష్యుఁ డితరుని పట్ల నెట్లు వర్తించునో వాని విషయమున నితరు లట్లే వర్తింపవలయును. అదియే ధర్మము. మాయలమారిని మాయచేత బాధింపవలయును. సాధు వగు నాచారము గలవానిని సాధుమార్గముననే జయింపవలెను. (శాంతి ౧౦౯-౨౯)

'త్వం మాయాభి రనవద్య మాయినం.........వృత్రం అర్దయః'
ఓ పాపరహితుఁడైన యింద్రా! మాయలాఁడగు వృత్రుని నీవు మాయచేతనే

చంపితి వని ఋగ్వేదమునందు నింద్రుని మాయావిత్వము నిందింపఁబడక శ్లాఘింపఁబడెను. (ఋ. ౧౦. ౧౮3-౧-౮౦-౭)

ప్రజంతి తే మూఢధియః పరాభవం
భవంతి మాయావిషు యే న మాయినః

కిరాతార్జునీయం ౧-30.

మాయావుల విషయమై యెవరు మాయతో వర్తింపరో వారు నాశమగుదురు.

ఇట్టి మహావాక్యము లుండుటచే వంచన చేసి చోరుని వలె వర్తించిన రావణుని విషయమై హనుమంతుఁడు వంచనముగఁ బ్రవర్తించుట ధర్మవిరుద్ధము గాదు. ఇంతకుఁ దన కార్యము సాధింప, అనఁగా సీతను వెదకుటయందు చారుని వలెవరించెనే కాని, నిద్ర పోవువాని గొంతు పిసుక లేదు. హనుమంతుని వేగుతనమున రావణునకు వచ్చిన హానియేమియు లేదు. ఓయీ యట్లైన 'న పాపే ప్రతిపాపః స్యాత్' పాపి విషయమున మనము పాపము చేయ రాదు. అనియు "అక్రోధేన జయేత్క్రోధం, అసాధుం సాధునా జయేత్' జయేత్ కదర్యం దానేన జయే త్సత్యేన చానృతమ్'' అక్రోధముచేఁ గ్రోధమును, సాధుత్వముచే నసాధువును, దానముచే లోభిని, సత్యముచే నసత్యమును జయింప వలెనను (భా.ఉ. 3౮-౭3-3౮) వాక్యములు వ్యర్థములా యనిన వ్యర్థములు కావు. సాధు మార్గముచే గార్యము చక్కఁబడు నని తోఁచినపుడు వంచన చేయరాదు. సామదానములు వ్యర్థములు, కార్యహానికరములు అని తోఁచినపుడు "విషస్య విష మౌషధ' మ్మన్నట్లు (విషము విఱుగుటకు వేఱొక విష మిచ్చుట) వంచనకు వంచనయే యర్హ కార్యము. గోటఁ బోవుపనికి గొడ్డలి ప్రయోగింపరాదు. గాని, గొడ్డలి ప్రయోగించినఁ గాని కార్యము చక్కఁబడ దని తోఁచినపుడు గొడ్డలి నుపయోగించుట తప్పు గాదు. వలఁతిని=సమర్థుఁడను, అరసి=వెదకి.

తాత్పర్యము.

వేగులవాఁడనై యుపాయముచేఁ దగిన కార్యము చేసిన వాఁడనై యెట్లైన యుద్ధము తటస్థించునుగాని తప్పదు. గావున శత్రువుల బలాబలము లెఱుఁగ సమర్థుఁడ నగు నేను పురమంతయుఁ దిరిగి వెదకి రాక్షసులందుఁగల వారి వారి బల తారతమ్య విశేషము, రావణు బలము, పుర లక్షణము సర్వము తెలిసికొంటిని. ఇప్పటికి సుగ్రీవుఁడు చెప్పిన కార్యము సాధించి యిఁక రామచంద్రమూర్తి చెప్పిన కార్యము సాధింప నాలోచించుచున్నాఁడు.

సీ. అటుగాన నప్రమే♦యగుణాకరుండును, నఖిలభూతహితుండు ♦ నైన రామ
చంద్రు దేవిని భర్తృ♦సందర్శనాసక్త, నాశ్వసించుటె శుభం ♦ బైన విధము
దుఃఖనిర్మగ్న యై♦దుఃఖాంత మెఱుఁగక, సంతపించెడి పూర్ణ♦సౌఖ్యపాత్ర
నూఱడింపకయ యే♦నూరక పోయిన, సత్య మనర్థంబు ♦ సంభవిల్లు

తే. నీ యశస్విని తన్నుఁదా ♦ నిందుఁ గాచుకొనఁగ నేరక మరణించు ♦ గురుబలుండు
దశరథసుతుండు జానకీ ♦ దర్శనేచ్ఛుఁ, డతని నాశ్వాసపఱుచుటే ♦ న్యాయ్యమగును.

అర్థములు. అప్రమేయగుణాకరుఁడు = ఇంతమాత్రము ప్రమాణమని కొలఁతచెప్పరాని కల్యాణగుణములకు గనియైనవాఁడు, భర్తృసందేశనాసక్తా = భర్తను జూచుటయందుఁ గోరిక కలదానిని, ఆశ్వాసించుటె = ఊఱడించుటయే, పూర్ణసౌఖ్యపాత్ర = నిండిన సౌఖ్యముల పాత్రము - సౌఖ్యములను బూర్ణముగా ననుభవింప యోగ్యురాలు, అనర్థంబు = కీడు, యశస్విని = కీర్తిమంతురాలు, జానకీదర్శనేచ్ఛుఁడు = సీతాదేవిని జూడఁ గోరిక కలవాఁడు.

తాత్పర్యము.

రావణుని గుఱించి తెలియవలసిన విషయము లన్నియుఁ దెలిసికొంటిని. కావున ననంత కల్యాణగుణఖనియును సర్వభూతములకు మేలుగోరువాఁడును నగు రామచంద్రమూర్తి దేవిని పతినిజూడ నాసక్తి గలదానిని నామెభర్త యోగక్షేమములు దెలిపి ధైర్యము వచ్చునట్లు చేయుటయే మేలగు కార్యము. అట్లుచేయక వచ్చినవాఁడను వచ్చినట్లు పోయితినా యీమె దుఃఖము తుదనెఱుఁగక దుఃఖము నందు మునిఁగి సంతపించుచున్నది. ఈమె మిగుల సౌఖ్య మందవలసిన దేకాని యిట్టి స్థితియం దుండఁదగినది కాదు. కావున నీమెకు ధైర్యోక్తులు చెప్పి యీమె దుఃఖము నివారించుట ప్రథమ కార్యము. అంతమాత్రమే కాదు. నే నీమె నూఱడింపక పోయితినేని మఱియొక యనర్థముకూడఁ గలదు. ఈమె యెంతో కీర్తికి నర్హురాలు. ఇట్టి యీమె తన్నుఁదాను రక్షించుకొనలేక మరణించును. అక్కడనో మహాబలశాలియగు రామచంద్రమూర్తి సీతాదేవి నెప్పు డెప్పుడు చూతునా యని యాసక్తి గలవాఁడై యున్నాఁడు. ఆయనమాట లీమెకుఁ జెప్పి యూరార్చినట్లు లీమె వృత్తాంతమాయనకుఁ దెలిపి యాయనను నూరార్పవలెను. ఇదియే న్యాయయుక్తమైన మార్గము.

ఆ. ఏమి సేయవచ్చు ♦ నీ రక్కసులు విను, చుండఁ బల్క నెట్లు ♦ యుక్తమగును
మగుప నేను రాత్రి ♦ తెగుదలలోపల, నూఱడింపకున్న ♦ నుసుఱుఁ బోయు. ౭౮౫

తాత్పర్యము.

రామచంద్రమూర్తి వృత్తాంత మీమెకుఁ జెప్పుట యావశ్యకమే కాని చెప్పుటెట్లు? నా మాట లీ రాకాసులు వినరాదు. వినిరా యిప్పుడేపోయి రావణునకుఁ దెలుపుదురు. వాఁడు బయలుదేఱి వచ్చును. అనుకొన్న కార్య మనుకొన్నట్లు గాదు. చెడును. కావున వీరికిఁ దెలియకుండునట్లు సీతాదేవికి మాత్రము తెలియునట్లు మాటలాడుట బాగు. ఉదయము కాకముందే నే నీ కార్యము చేయకపోయితినా యీమె నూఱడింపక పోయితినా యీమె ప్రాణము విడుచుట నిజము.

మ. హనుమా! యేమని నాకుఁ జెప్పు మనె న♦య్యా! జానకీదేవి నీ
వనుమా తద్వచనంబులెల్ల నని ధ♦ర్మాత్ముండు శ్రీరాముఁ డో
య్యనఁ బల్కన్ సతి నిందుఁ జూచియును మా♦ట్లాడింప కే నేగి లో
నను మానింపక యేమి మాటిడుదు? న♦ర్వాం బౌనె నా కా విధుల్? ౨౮౬

తాత్పర్యము.

అంతియకాదు. రామచంద్రమూర్తి యొద్దకుఁబోఁగానే హనుమంతా! సీతనుజూచితివికదా. ఉంగరమిచ్చితివా? దానినిజూచి యామె యేమనెను. ఆమాటలన్నియుఁ జెప్పుమని ధర్మాత్ముఁడగు శ్రీరామచంద్రమూర్తి దీనుఁడై యడుగును గాని యడుగకఁపోఁడు. ఈమెను మాట్లాడింపకపోయితినేని నాయనతో జంకులేక యేమని చెప్పుదును? చూచిరమ్మనినఁ జూచివచ్చితిని. మాట్లాడలేదని జెప్పుదునా? ఉంగర మేమిచేసితి వనిన నేను ధరించితినందునా? అటువంటిపని నాకుఁదగినదా? నేనట్లు చెప్పఁదగునా?

క. సీతాసందేశము లే, కా తరణికులేంద్రుఁ జూడ ♦ నరిగిన నతఁడున్
జాతాధికకోపానల, హేతులను నను నీఱుఁ జేయ ♦ కేలా మానున్. ౨౮౭

అర్థములు. సీతాసందేశము = సీతాదేవి చెప్పిన వార్త, జాతాధిక కోపానల హేతులన్ = పుట్టిన యధికమైన కోపమనెడి యగ్నిజ్వాలలచే, నీఱు = భస్మము.

తాత్పర్యము.

సీతాదేవి రామచంద్రున కేమి చెప్పనో తెలిసికొనక యాయనను జూడఁ బోఁగానే యాయన తీవ్రమగు కోపమనెడి యగ్నిజ్వాలలచే నన్ను భస్మముచేయకుండునా? పోయిన వాఁడవు చూచినవాఁడవు మాట్లాడింపక యేమని వచ్చితివనఁడా?

సీ. సీత యున్నది లంకఁ ♦ జెచ్చెరఁ బదఁడని, రాముకార్యమున శా♦ఖామృగాళిఁ
దోడి తెచ్చితి నేని ♦ తుదకు వ్యర్థము గాదె, జానకి యింతలో ♦ సమసె నేని
యటుగాన నిం దుండి ♦ యంతరంబును రోసి, జానకి నూరార్చి ♦ చనుట లెస్స
యల్ప శరీరుండ ♦ నందు దానరుఁడను, మజునుజునివలె నేను ♦ మాటలాడఁ
తే. దగవె సంస్కృతమున నేను ♦ ధరణిసురుని
రీతి సంస్కృత మాడిన ♦ భీత యగుచు
దశముఖాసురుఁగా నన్నుఁ ♦ దలఁచు నేమొ?
యేమి సేయుదుఁ గ్రోఁతి నే♦నెట్లు పలుక? ౨౮౮

అర్థములు. అంతరంబు = సందు, తగిన సమయము, అల్పశరీరుండన్ = చిన్న దేహము గలవాఁడను, ధరణిసురునిరీతిన్ = బ్రాహ్మణునివలె, సంస్కృతము = దేవభాష.

తాత్పర్యము.

సీతాదేవిని జూచిరమ్మనినఁ జూచి వచ్చితి నని నేను జెప్పఁగానే యడవి

క్రోఁతి కింత కెక్కువ తెలివి యెక్కడనుండి వచ్చునని తలఁచి కోపింపఁ డనుకో, నామాట నమ్మి వానరు లందఱు నిటవచ్చిరనుకో, ఇంతలో సీతాదేవి చచ్చెననుకో వాఱందఱు వచ్చియు వ్యర్థముగదా. కావున నవకాశముచూచి సీతాదేవి నూరార్చి పోవుటే బాగు. ఊరార్చుటెట్లు? నేనా చిన్న దేహముగలవాఁడను. దేహమునిప్పుడు పెంచరాదు. పిల్లక్రోఁతి యగు నేను మనుష్యులు మాటలాడినట్లు సంస్కృతమున మాటలాడవచ్చునా? బ్రాహ్మణునివలె సంస్కృతమున మాటలాడిన నీమె భయపడి నన్ను రావణాసురునిఁగాఁ దలఁచునో యేమో. క్రోఁతి నే నెట్లు మాటలాడుదును?

క. ఊరార్పఁగఁ దగుఁ దరుణిని, నూరార్చుట యెట్లు మాన ♦ మూనిన? మఱి నే
నేరీతిఁ బలుక; గతి లే, దీ రమణిం బలుకరింతు ♦ నే మనుజోక్తిన్? ౨౮౯

మాటలాడక నోరుమూసికొని యుంటినేని యూరార్ప వలసిన యీమెను నే నెట్లూరార్తును? మాటలాడఁబూనిన నే నేరీతి మాటలాడవలె? వేఱుగతి లేదు. ఈమెను నీకుఁ దెలిసిన ప్రాకృతభాషయందుఁ బలుకరించెదను. అట్లు చేసితినేని యీభాష యీరాక్షసులకుఁ దెలియదు. కావున నేను జెప్పునది వారికర్థముగాదు.

క. రూపంబునఁ గ్రోఁతియు నా,లాపంబులు మనుజులవియు ♦ లలనామణి దా
రూపించి మున్నెరక్షః, స్త్రీ పరిసంత్రస్తభయము♦చెందదె మఱియున్. ౨౯౦

తాత్పర్యము.

నేను బ్రాకృతము మాట్లాడిన నందునొక గండము గలదు. నేనా యాకారమునఁ గ్రోఁతిని. నామాటలా మనుష్యులు మాటలాడునవి. కాఁగాఁజూచి క్రోఁతి యేమి మనుష్యునివలెమాటలాడుటయేమి యని సందేహించి యిది యేదో మాయ యని మునుపే రాక్షసస్త్రీలచే భయపెట్టఁబడి యుండునది మరింత భయపడును.

సీ. కంజాక్షి యంతటఁ♦గామరూపిని నిర్జ,రారినేతఁగ నెంచి♦యఱచు భీతి
నా నాదమునఁ జేసి ♦ యఖిలాసురాంగనల్, వివిధసాధనహస్త♦లవుచుఁ గదిసి
కోపించి నను(బట్టి ♦ రూపుమాపఁగ నొండెఁ, గట్టికొంపోనొండెఁ ♦ గడఁగువారు
కొమ్మల రెమ్మల ♦ గొప్ప మొదళ్ళతో, వృక్షముల్ గొని పరు♦విడుచు నేను

తే. వనమున విహరింపఁగ ♦ భయదమైన, మత్స్వరూపంబుఁగనుఁగొని ♦ మగువలెల్ల
వికృతముఖములతో వెఱ♦వేగమరిగి, రాక్షసేంద్రుని గేహసం♦రక్షకులను. ౨౯౧

అర్థములు. నిర్జరారినేతఁగన్ = రావణాసురునిగ, గేహసంరక్షకులన్ = ఇంటికావలివారిని.

తాత్పర్యము.

ఇట్లు భయపడి నన్నుఁ గామరూపి యగు రావణాసురుఁడీ వేషమునవచ్చెనని తలఁచి యఱచును. ఆ యఱపు విని రాక్షసస్త్రీలందఱు నానాయుధములు తీసికొని నావద్దకువచ్చి కోపించి నన్నుఁబట్టిచంపుటకో, కట్టిరావణునొద్దకుఁ దీసికొనిపోవుటకో,

ప్రయత్నింతురు. నేనో కొమ్మలతో, రెమ్మలతో, బోదెలతోఁ జెట్లను బీఁకికొని వారికిఁ జిక్కక పరుగు లెత్తుచు నే నీ వనమునఁ దిరుగఁగా వారు నా భయంకర వేషముఁ జూచి వికారముఖములతోఁ బోయి రావణు నగళ్ళ కావలివారిని.

క. రక్కసులం బిలుతురు వా,రుక్కున శూలములు శక్తు ♦ లుగ్రాసులు నీ
సెక్కఁగఁగొని మొత్తములై, యొక్కట ననుఁ దాఁక రోస ♦ మొదవెడునాకున్.

అర్థములు. ఈసు = ఈర్ష్య, కోపము, ఉక్కున = బలముచే, అసులు = కత్తులు.

తాత్పర్యము.

రాక్షసులను బిలుతురు. వారు బలమున శూలములు, శక్తులు, కత్తులు కోపముతోఁ దీసికొని గుంపులై యొక్కటిగ నాపైపడి రాఁగా నాకు రోషము వచ్చును.

ఉ. వారల నెల్ల జంపుపని ♦ వచ్చినచో జలరాశి దాఁటి యా
తీరముఁ జేర నెట్లు లగుఁ? ♦ దెంపునఁ బైపడి నన్నుఁ బట్టినన్
శ్రీరఘురామువార్త చెవి♦సేరదు సీతకు, నేను జిక్కుదున్
ధారణికన్యఁ బట్టి ఖల♦దైత్యసతుల్ వధియింతు, రంతటన్. ౭౫౩

తాత్పర్యము.

ఈ వచ్చిన రాక్షసుల నందఱను జంపుచుంటినేని సముద్రముదాఁటి యావలి యొడ్డెట్లు చేరఁగలను ? అటుగాక వారు సాహసించి పైపడి నన్నుఁ బట్టికొనిరా సీతాదేవికి శ్రీరామునివార్త చెప్పువా రుండరు. నేను జిక్కుదును. అప్పుడు రాక్షసులు దుష్టులై సీతను జంపుదురు.

ఉ. పాడగు రామభానుజులు ♦ పట్టిన కార్యము, సీత యంటినా
జాడయుఁ గానరా కసుర♦సంఘపరీవృత యాచు వార్ధియే
వీడని పేరగడ్త యయి ♦ విశ్రుతి గాంచిన లంకలోనఁ గా
పాడఁ బడున్ రహస్యముగ ♦ బ్రాణములైనను గోలుపోయెడిన్. ౭౫౪

తాత్పర్యము.

అంతతో రామసుగ్రీవులు పట్టిన కార్యము పాడైపోవును. సీతను వారు చంపకపోయిరా, జాడ గూడఁ దెలియ రాకుండునట్లు రాక్షసులచేఁజుట్టఁబడి సముద్రమే యగడ్తగాఁ గల లంకలో రహస్యముగ నే నేలమాలిగయందో దాఁపఁబడును. లేదా యామె యీ బాధలు పడలేక చావనైనఁ జచ్చును.

చ. కలనను నన్నుఁ జంపినను♦గాక రుషామతిఁ గట్టివైచినన్
గలుగఁ డొకండు రామవిభు♦కార్యముఁ దీర్పఁగఁ జాలుమేటి, యె
వ్వాలను దలంచి చూచినను ♦ వానరుఁ డన్యుఁడు నూఱు యోజనం
బులు గల వార్ధి దాఁటఁగను ♦ బూనెడు వాఁడట లేఁడ యారయన్. ౭౫౫

అర్థములు. కలనను = యుద్ధమందు, రుషామతిన్ = కోపముతోఁ గూడిన మనస్సుతో, ఎవ్వాలను = ఏ విధముగఁ.

తా త్ప ర్య ము.

యుద్ధమందీ రాక్షసులు నన్నుఁ జంపినను గోపించి కట్టివైచినను రామ కార్యము చక్కఁ బెట్టఁగల గొప్పవాఁ డొక్కఁడైన లేఁడు. ఏ విధముగ నాలోచించినను నూఱుయోజనముల సముద్రమును దాఁటఁగల వానరుఁడు లేఁడు.

ఉ. వేలకొలంది రాక్షసుల ♦ పీఁచ మడంపఁగ నేర్తునైన దో
ర్లీల వెలుంగఁ బిమ్మటఁ ద♦రింపఁగ లేను మహాబ్ధి గాసిమై,
నాలములో జయం బపజ♦యం బన రా దిదమిత్థ మంచు, శం
కాలుళితార్థముల్ సలుపఁ♦గా మది గొల్పదు కొంచె మేనియుఁన్. ౭౩౬

అర్థములు. పీఁచము = మదము, దోర్లీల = భుజబలము, గాసిమైన్ = బడలిక చేత, ఆలము = యుద్ధము, ఇదమ్+ఇత్థమ్ = ఇది యీ ప్రకారము జరుగును, శంకాలుళితార్థముల్ = సందేహముచేఁ గలఁత చెందిన కార్యములు, కొల్పదు = సమ్మతింపదు.

తా త్ప ర్య ము.

ఎన్ని వేల రాక్షసుల మదమైనను భుజబలముచే యుద్ధమందు నణఁపఁగలను గాని, బడలిక చేత మఱల సముద్రము దాటలేను. అదిగాక యుద్ధమందు జయమపజయ మిట్టులే యగు నని నిర్ధారించి చెప్పు టెట్లు? కావున సందేహమున కెడమిచ్చు కార్యములు చేయ మనస్సు సమ్మతింపదు.

క. సందేహ మైన కార్యము, నం దెవ్వఁడు బుద్ధిమంతుఁ ♦ డాలోచన లే
కెందును దెగు? నటు చేసిన, నిందింపఁగఁబడును దుర్వి♦నీతుఁ డటంచున్. ౭౩౭

అర్థములు. తెగును = సాహసించును, దుర్వినీతుఁడు = నీతి యెఱుఁగనివాఁడు.

తా త్ప ర్య ము.

మేలు గలుగుట సందేహమైన కార్యమును బుద్ధిమంతుఁ డగు వాఁడాలోచింపక చేయ సాహసింపఁడు. అటు సాహసము చేసెనా వీఁడు నీతిమాలిన వాఁడని లోకులు నిందింతురు.

తే. పలుకరింపక నే నేగ ♦ భయము పేర్మి, మేను దొఱఁగుట నిక్క మీ♦మీననేత్ర
పలుకరించితి నేనియుఁ♦బైయనర్థ, చయము లెల్లను బ్రాప్తించు♦సత్యముగను.

తా త్ప ర్య ము.

రాక్షసులకు భయపడి పలుకరింపక నేను బోయితినా రాక్షసభయముచే నీమె దేహము వదలుట సత్యము. పలుకరించితినా మీఁదఁజెప్పిన కీడు కలుగుట సత్యము.

క. ఐనట్టు తోఁచు పను లేన్, భానునిఁ గనుగొన్నతమము ♦ పగిదిం జెడెడున్
వానిని దేశము, కాలము, జ్ఞానము లేనట్టిదూత ♦ సలుపఁ గడఁగినన్. ౭౩౯

అర్థములు. తమము = చీఁకటి.

తాత్పర్యము.

ఐనది యని నిస్సందేహముగఁ దోఁచు పను లైనను దేశ. కాలజ్ఞానములేని దూత చేయఁబూనెనేని సూర్యునిఁ జూచిన చేఁకటివలెఁ జెడిపోవును.

క. దీని నిటు సల్ప సఫలం, బౌ నని ప్రాజ్ఞులు విధించి♦నట్టిది కార్యం
బైనను జెఱుచును బండిత,మాని యయిన దూత శక్తి♦మంతుఁడు గామిన్. ౬౬౦

అర్థములు. పండితమాని = పండితుఁడ నని తన్నుఁదాను దలఁచువాఁడు.

తాత్పర్యము.

ఈ ప్రకారము చేసిన నీ కార్యము ఫలించు నని బుద్ధిమంతు లేర్పాటు చేసిన పనినైనను పండితమాని యగు దూత సామర్థ్యము లేనివాఁడై దానిని జెఱుచును.

ఉ. ఏగతిఁ గార్యహాని జని♦యింపక యుండునో, బుద్ధిజాడ్య మిం
కేగతిఁ రాకయుండు నొకో ♦ యేగతి వారిధిలంఘనంబు దా
నోగయి పోక యుండెడినొ ♦ యుర్విజ యేగతి నాదుమాటలన్
బాగుగ నాలకించు, వెఱ ♦ పొల్పడ కేగతి నుండు నన్గనన్. ౬౬౧

అర్థములు. జాడ్యము=మాంద్యము, ఓగయి = చెడి, వెఱ = భయము, నన్ గనన్ = నన్నుఁ జూడఁగానే.

తాత్పర్యము.

ఎట్లు చేసినఁ గార్యము చెడక యుండును. బుద్ధిమాంద్యము నా కేగతి రాకయుండును. ఎట్లు వర్తించిన సముద్రము దాఁటుట వ్యర్థము గాక యుండును. ఎట్లు చెప్పిన సీతాదేవి నా మాటలను జక్కఁగా వినును. నన్నుఁ జూడఁగానే సీతాదేవి భయపడకుండు టెట్లు ?

సీ. అనుచు దీర్ఘంబుగ♦నాలోచన మొనర్చి, మతిమంతుఁ డగు హను♦మంతుఁడపుడు
కార్యనిశ్చయము సీ♦కరణిని గావించె, నా రూపమును జూప♦కా రఘూత్త
మునిని గీర్తించెద ♦ వనజాతలోచన, భయపడ కుండెడు ♦ పగిది గాఁగ
రఘుకులగ్రామణి ♦ రాముని విదితాత్ము, ధర్మసహితశుభ♦దంబు లైన
ఆ. మధురవాక్యములను ♦ మానుగ నమ్మిక, పుట్టునట్టి భంగిఁ ♦ బొగడువాఁడ
వెలది యెంతమట్టు ♦ విశ్వసించునో దాని, నెఱిఁగి యవలికార్య♦మే నొనర్తు.

అర్థములు. దీర్ఘంబుగ=దూరముగ, ధర్మసహిత=ధర్మముతోఁ గూడినవి, శుభదంబులు = మేలిచ్చునవి, వెలఁది = స్త్రీ, సీత, ఎంతమట్టు = ఎంత మాత్రము.

తాత్పర్యము.

ఈప్రకారము హనుమంతుఁడు దూరాలోచనము చేసి బుద్ధిమంతుఁ డగుటచే నిట్లు చేయవలె నని నిశ్చయించుకొనెను. ఎట్లనఁగా నన్నుఁ జూచినఁగదా యీమె

భయపడును. నా రూప మీమెకుఁ గానరాకుండునట్లు కొమ్మలచాటున దాఁచి యీమె భయపడకుండునట్లు రామచంద్రమూర్తిని ధర్మముతోడఁ గూడినవియు, శుభము నిచ్చునవియునగు తియ్యని మాటలచే నామెకు నమ్మకము పుట్టునట్లు పొగడెదను. ఆమాట లీమె యెంతవఱకు నమ్మునో చూచి తరువాతి కార్య మాలోచించెదను. ఇంతమాత్రమునఁ జెడునది యేదియు లేదు.

క. అని నిశ్చయించి సీతం, గను చామెయె వినెడునట్లు♦గా సరసకుజం
బున మాటుగొనియె పావని, యనియెక్ మధురంబులైన♦యవితథసూక్తుల్. ౨౮౩

అర్థములు. ఆమెయె = ఆమె మాత్రమె, రాక్షసులకు వినఁబడకుండునట్లు, సరస = సమీపంబుననున్న, కుజంబునన్ = వృక్షంబునందు, మాటుగొనియె = దాఁచుగొనియె, అవితథసూక్తుల్ = యథార్థములై, వ్యర్థముకాని మంచిమాటలు, మధురంబులు = వినుటకు స్వయముగఁ దియ్యనివి, లోకమునందుఁ దఱుచుగా నింద్రియముల మూలమున జ్ఞానము ప్రసరించి విషయమును గ్రహించిన పిమ్మటనే మనస్సున నాహ్లాదము కలుగుట వాడుక. ఈమాటలట్లుగాక తామే చెవినిస్పృశించుచున్నవో, యాచెవియందే యాహ్లాదమునుగలిగించుచున్నవి. ఈమాటలుజ్ఞానమూలమున నాహ్లాదకరములుగావు. స్వయముగనే యాహ్లాదకరములు. ఇచ్చట జ్ఞానమునకు నాహ్లాదకరత్వము శబ్దమూలమున నని యెఱుఁగునది. ఈ వాక్యముల కంతటి మాధుర్యము గల దని యతిశయోక్తి. అవి తథసూక్తులు = ఈ వాక్యములు సీత విన్నతోడనే సంతోషపడి తాను బూనియున్న ప్రాణత్యాగ ప్రయత్నము తప్పక మానునని భావము. ఏ యుద్దేశముతో నా మాటలు చెప్పఁబడెనో యా యుద్దేశము నెఱవేర్చు శక్తి యా మాటలయందుఁ గలదని భావము. సూక్తుల్ = ఈవాక్యములకు నాహ్లాదకరత్వము పూర్వాపరనిరూపణముచేఁగాదు. వానియందు సహజముగానే యున్నదని భావము. తాత్పర్యము.

ఈ ప్రకారము నిశ్చయించుకొనినవాఁడై హనుమంతుఁ డామెను జూచుచు నామె మాత్రము వినునట్లు దగ్గఱనున్న చెట్టుచాటున నుండియే తియ్యనివి, ప్రయోజనకారులైన మంచి మాట లిట్లనెను.

—♦ ౩౧ వ సర్గము. హనుమ సీతాదేవి వినునట్లు శ్రీరాముఁ బ్రశంసించుట ♦—

సీ. దశరథుం డనురా జు♦దారకీర్తియు రథ, వారణ సైంధవ♦భటయుతుండు
ధర్మశీలుఁడు గుణ♦ధన్యుఁడు మాన్యుఁడు, రాజర్షివర్యుఁడు ♦ ప్రకటయశుఁడు
చక్రవర్త్యన్వయ♦జాతుండు తపమున, ఋషిఁబోలు బలమున ♦ నింద్రనిభుఁడు
కరుణాపరుఁడు ని♦క్ష్వాకువంశాగ్రణి, సత్యవిక్రముఁ డహిం♦సారతుండు

తే. నృపతిలక్షణ యుక్తుఁడు ♦ ఋజుగుణుండు
చతురుదధివృతమేదిని ♦ చక్రవిశ్రు

తుండు సుఖదుండు సుఖి యయి ♦ దొరలు లేక
దొరల కెల్లను దొర యయి ♦ పరఁగు చుండు. ౭౬౮

అర్థములు. ఉదారకీర్తి=(౧) గొప్పకీర్తి గలవాఁడు, (౨) ఉదారుఁడు= దాత యను కీర్తి గలవాఁడు, యాచించి వ్యర్థముగాఁ బోయినవాఁడు లేఁడను కీర్తి. 'దానేన ప్రభవాకీర్తిః. ప్రతాపప్రభవం యశః' అన్నట్లు దానాదులచేత వచ్చు మంచిపేరు కీర్తి యనియు, ప్రతాపముచే శత్రువుల జయించి సంపాదించిన పొగడ్తకు యశ మనియుఁ బేరు.

దశరథుఁడను పేరు స్మరించువా రచ్చటలేరు. ఒకవేళ యేదో ప్రస్తావనగా ననుకొన్నను బొగడువారు లేరు. కావున దశరథుఁడను రాజు ఉదారకీర్తియనుమాటలు చెవిలోఁ బడఁగానే యామెకు సంతోషము జనించి, యామె మనస్సు నాకర్షించి, యావల నేమి చెప్పునో వినదమను బుద్ధి పుట్టించెను. ఈ విధముగ హనుమంతుఁడు సీతాదేవి మనస్సును దన వంకకు లాగుకొనెను. రథ = తేరులు, వారణ = ఏనుఁగులు, సైంధవ = గుఱ్ఱములు, భట = కాలిబంట్లు, వీరితో - యుఁతుడు = కూడిన వాఁడు, చతురంగబలము గలవాఁడని భావము. ఇట్లు సేనాసమృద్ధి చెప్పఁబడెను. ధర్మశీలుఁడు = ధర్మగుణముస్వభావముగాఁగలవాఁడు, గుణధన్యుండు = సద్గుణములను ధనముగలవాఁడు, ధనము చేయు కార్యములు ఆయన గుణములే చేయుచున్నవి. మాన్యుండు = లోకులచే గౌరవింపఁబడువాఁడు; రాజర్షి వర్యుండు = రాజఋషులలో శ్రేష్ఠుండు, ప్రకటయశుఁడు = ప్రసిద్ధమైన యశస్సుగలవాఁడు, చక్రవర్త్యన్వయ జాతుండు = సగరుఁడు మొదలగు చక్రవర్తులు మూల పురుషులుగాఁగలవంశమునఁ బుట్టినవాఁడు, సత్యవిక్రముఁడు = సత్యమే విక్రమముగాఁ గలవాఁడు, 'సత్యేన లోకాన్ జయతి' యన్నట్లు పరాక్రమముచే సాధింపఁదగిన దానిని, సత్యముచేతనే సాధించువాఁడు, సత్యవిక్రముఁడు = యుద్ధమునందు న్యాయమున నిలిచి, వంచనలేక శత్రువుల గెలుచువాఁడు, బలహీనుఁడు గదా వంచన చేయవలె. నిక్కపు బలశాలికి వంచన యేల? ఋజుగుణుండు = చక్కని నడవడి గలవాఁడు, చతురుదధి = నాలుగు సముద్రములచే, వృత = చుట్టఁబడిన, మేదినీచక్ర = భూచక్రము గలవాఁడని, విశ్రుతుండు = ప్రసిద్ధిగలవాఁడు, సుఖదుండు = ప్రజలకు సుఖమే కలిగించువాఁడు, సుఖి = తాను సుఖము ననుభవించువాఁడు, దొరలు లేక = సమానులు లేక, దొరలకు = ప్రభువులకు, దొర = ప్రభువు.

తాత్పర్యము.

దశరథుఁ డనురాజు మహాదాత యనుకీర్తిని సంపాదించినవాఁడు. చతురంగ సైన్యము గలవాఁడు. ధర్మస్వభావముగలవాఁడు. సుగుణసంపత్తి గలవాఁడు, లోకపూజ్యుఁడు. రాజర్షులందు శ్రేష్ఠుఁడు. ప్రసిద్ధమైన యశము గలవాఁడు. చక్రవర్తుల వంశమునఁ బుట్టినవాఁడు. తపమున ఋషునకు సముఁడు. బలమున నింద్రసమానుఁడు.

దయాశాలి. ఇక్ష్వాకువంశమునఁ బుట్టినవారిలో శ్రేష్ఠుఁడు. సత్య పరాక్రముఁడు. అహింసయందుఁ బ్రీతిగలవాఁడు. గొప్పరాజులకుండవలసిన చిహ్నములుగలవాఁడు. చక్కని నడవడి గలవాఁడు. నాలుగు సముద్రముల నడిమిభూమిని నేలువాఁడు. ఒకరిని సుఖపెట్టి తానుసుఖించువాఁడు. తనతో సములు లేక, ప్రభువులకెల్ల బ్రభువగువాఁడు.

తన మామగారి నిట్లు పొగడు మాటలు విని గుణవతి యగు స్త్రీ యెల్లని దుండునా? కావున నిం కేమి వినఁబడునో యని సీతాదేవి యూరక నిలఁబడెను.

ఉ. ఆ మహితాత్మునగ్రసుతుఁ ♦ డబ్జనిభాస్యుఁ డతిప్రియుండు, శ్రీ
రాముఁడు పేర, స్వీయజన ♦ రక్షణదక్షుఁడు, నాత్మధర్మర
క్షామతి, చాపభృద్వరుఁ డ ♦ ఖండుఁడు నన్నిట, దుష్టశాత్రవ
స్తోమభయంకరుండు, నిజ ♦ శుద్ధకులాగత ధర్మరక్షుఁడున్. ౭౬౫

అర్థములు. అబ్జనిభాస్యుఁడు = చంద్రునితో సమానమైన ముఖము గలవాఁడు, స్వీయజనరక్షణ దక్షుఁడు = తన్నాశ్రయించిన వారిని తన్నాశ్రయించిన వారి నాశ్రయించిన వారిని రక్షించుటయందు సమర్థుఁడు, ఆత్మధర్మ రక్షామతి = స్వధర్మమును రక్షించు మనస్సు గలవాఁడు, చాపభృద్వరుఁడు = చాపభృత్ + వరుఁడు = విల్లుపట్టెడి వారిలో మేటి, అఖండుఁడు నన్నిట = ఏవిషయమందును గొఱఁత యనునది లేనివాఁడు, దుష్టశాత్రవ = దుష్టు లగు శత్రువుల యొక్క, స్తోమ = సమూహమునకు, భయంకరుఁడు = భయము కలిగించువాఁడు, నిజ = తనయొక్క, శుద్ధ = నిర్మలమైన, కులాగత = వంశపరంపరగా వచ్చిన, ధర్మ = ధర్మమును, రక్షుఁడు = రక్షించువాఁడు.

తా త్ప ర్య ము.

గొప్పమనస్సుగల యాదశరథ మహారాజునకుఁ బెద్దకొడుకొకఁడు గలఁడు. ఆయన పేరు రాముఁడు. ఆయన చంద్రునివంటి ముఖముగలవాఁడు, ఆకారణముచేనందఱకుఁ బ్రియుఁడైనవాఁడు, తన్నాశ్రయించినవారిని – వారినాశ్రయించిన వారిని రక్షించుట యందు సమర్థుఁడు. స్వధర్మరక్షణమందు మనస్సుగలవాఁడు. విల్లు పట్టెడి వారిలో నెల్లమేటి, అన్నివిషయంబులఁ బూర్ణుఁడు, సర్వజ్ఞత్వ సర్వశక్తిమత్వ– సర్వసంహార కత్వ–సర్వరక్షకత్వాది గుణములందన్నిట నేలోపము లేనివాఁడు, చెడు పగవారికి భయము గలిగించువాఁడు, నిర్మలమైన తనవంశాచార ధర్మమును రక్షించువాఁడు.

ఓహో యెవరో నామగనిపేరు చెప్పు చున్నారే, ఆయన గుఱించి యేమి చెప్పునో – ఉన్నాఁడని విందునో – వచ్చుచున్నాడని విందునో యని తహతహ పాటుతో చెవి మనస్సు నిచ్చి సీతాదేవి వినుచున్నది.

సీ. ఆయనఘుండు స♦త్యాత్ముఁడు వృద్ధుఁ డా, తనితండ్రి పనిచిన♦పనువుఁ జేసి
తమ్ముఁడు దారయుఁ♦దనతోడ రావనీ, ధారణి కేగి యా♦వీరవరుఁడు

మృగయారతుండయి ♦ మెలఁగుచు శూరులుఁ, గామరూపులు నైన♦ఖలసురారి
వరులఁ బెక్కు-రఁ జంపె ♦ ఖరదూషణాదులు, సమయుట విని జన♦స్థానమునను
తే. మాయలేడి నెపంబున ♦ మాయ చేసి, యతని యిల్లాలి రావణుఁ ♦ డపహరించె
నామె వెదకుచు వచ్చి నె♦య్యం బొనర్చె, భూవిభుఁడు కీశుఁడైన సు♦గ్రీవుతోడ.

అర్థములు. పనుపుఁజేసి = ఆజ్ఞచే, మృగయారతుండయి = వేఁటయందాసక్తి గలవాఁడయి.

తాత్పర్యము.

పాపరహితుఁడైన యా శ్రీరామచంద్రమూర్తి సత్యస్వభావుఁడు, ముసలివాఁడు నగు తన తండ్రి యాజ్ఞాపించిన ప్రకారము తన తమ్ముఁడు భార్య తనతోడ రాఁగా, నడవుల కేగి యా వీరుఁడు వేఁటకై తిరుగుచు శూరులు, గామరూపులును నగు దుష్టరాక్షసుల ఖరదూషణాదుల ననేకులఁ జంపెను. జనస్థానమున నున్న వారు చచ్చుట విని రావణాసురుఁడు మాయలేడి నెపమున మోసగించి యా రామచంద్రమూర్తి భార్యను అపహరించెను. రామచంద్రమూర్తి యామెను వెదకుచు వచ్చి వానరుఁడైన సుగ్రీవునితో స్నేహము చేసెను.

ఉ. వాని నిమిత్తమై తునిమె ♦ వాలిని; వానర రాజ్యలక్ష్మినిన్
బూనిచె సూర్యసంభవునిఁ ♦ బూనిఁ యతండును సీత రోయఁగా
వానరవీరులం బనిచె ♦ వాఁడి చెలంగెడి కామరూపులన్
మానక సర్వదిఙ్నిచయ♦మార్గణతత్పరు లైరి వారలున్. ౭౬౭

అర్థములు. పూనిచెన్ = పూనునట్లు చేసెను, పూనునకు పూనిచె, పూంచె-ఇవి ప్రేరణార్థకరూపంబులు. వాఁడి = పరాక్రమము, సర్వదిక్+నిచయ = అన్ని దిక్కుల సమూహములందు, మార్గణతత్పరులైరి = వెదకుట యను పనియందు నాసక్తిగలవారైరి.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి తనస్నేహితుఁడైన సుగ్రీవుని నిమిత్తమై వాలినిజంపి సుగ్రీవున కారాజ్యమునిచ్చెను. ఆ సుగ్రీవుఁడు సీతాదేవిని వెదకుటకై పరాక్రమవంతులు, కామరూపులు నగు వానరులఁ బంపెను. వారన్ని దిక్కులయందామెను వెదకుచున్నారు.

మ. సరగన్ నేను జటాయుసోదరుఁడు సం♦పాతి వాక్యంబునన్
గురుశక్తిన్ శతయోజనాయతమహా♦కూపారమున్ దాటితిన్
ధరణీపుత్రి నిమిత్తమై; యిచట సీ♦తానాయకోక్తస్వరూ
పరుచిశ్రీలఁ జెలంగు సాధ్వి గుణరూ♦పం గంటిఁ బుణ్యంబునన్. ౭౬౮

అర్థములు. సరగన్ = త్వరగా, శతయోజనాయత = నూఱుయోజనములు నిడివిగల, మహాకూపారమున్ = గొప్ప సముద్రమును, సీతానాయకోక్త =

సీతాపతి యగు రామచంద్రమూర్తిఁచే జెప్పఁబడిన, స్వరూపరుచిశ్రీలన్ = ఆకారముచేతను, వర్ణముజేతను, కాంతి సంపత్తిచేతను, సాధ్వీన్ = పతివ్రతను.

తాత్పర్యము.

అట్టివారిలో నొకఁడనైన నేను జటాయువునకన్న యగు సంపాతిమాటలప్రకారము శీఘ్రముగ నా గొప్పశక్తిచే నూఱామడ నిడివి గల గొప్ప సముద్రమును సీతాదేవి నిమిత్తమై దాఁటివచ్చి రామచంద్రమూర్తిచెప్పిన యాకారము, వర్ణము, కాంతి, గుణము; సౌందర్యముగల పతివ్రతను నా పూర్వపుణ్యఫలమునఁ జూచితిని.

చ. అని హనుమంతుఁడాడ జన♦కాత్మజ తద్వచనంబు లన్నియున్
విని వెఱగంది మోమునను ♦ వ్రేలెడి ముంగురు లల్ల ద్రోచికొం
చును మొగ మెత్తి చెట్టు దెసఁ ♦ జూచుచు రాము వెఱన్ స్మరించుచున్
గనియెను గ్రిందు మీఁదును న♦గంబునఁ బ్రక్కల నందు నొక్కెడన్. ౨౧౯

అర్థములు. వెఱగు+అంది = ఆశ్చర్యపడి, వెఱన్ = భయముచే, ఆపదలందు, భయసమయముల రామనామస్మరణము "ఆపదామపహర్తార" మ్మనుమంత్ర శ్లోకమును బఠించిన నా యాపద, భయము దొలఁగును. ఇది యనేక భక్తులకు ననుభవ విధితము.

తాత్పర్యము.

ఈ ప్రకారము హనుమంతుఁడు చెప్పఁగా సీతాదేవి యా మాటలన్ని విని యాశ్చర్యపడి ముఖముపై వ్రేలాడుచున్న వెండ్రుకలు మెల్లఁగ బైకిఁ ద్రోచికొని యెవ రీ మాటలు చెప్పిన వారని ముఖమెత్తి చెట్టు ప్రక్క చూచుచు నిది యేమి రావణమాయయో, యని భయముచే రామనామము స్మరించుచుఁ జెట్టునందు, గ్రింద మీఁదఁ, బ్రక్కల, సందులఁ జక్కఁగాఁ జూడఁగా నందు నొక్కచోట.

—♦ ౩౨–వ సర్గము. సీతాదేవి హనుమంతునిఁ జూచి భయపడుట, ♦—

ఉ. తూరుపు కొండపై నరుణు ♦ తోయమువాఁడన నొప్పి కొమ్మలం
దారఁగ డాగియున్న కపి ♦ నర్జునచేలుని సాంత్వవాది శం
పారమణీయపింగళుని ♦ భాస్వదశోకసుమోత్కరాభునిన్
జేరువ కొమ్మ నుండెడి య♦చింత్యపరాక్రము స్వర్ణలోచనున్. ౨౨౦

అర్థములు. అరుణ తోయమువాఁడు = అనూరునితో సమానుఁడు, ఆరఁగన్ = బాగుగ, అర్జున చేలునిన్ = తెల్లవస్త్రము గలవానిని, సాంత్వవాదిన్ = మంచి మాటలు చెప్పువానిని; శంపా = మెఱుఁగువలె, రమణీయ = అందమైన, పింగళుని = పచ్చని కాంతి గలవానిని, భాస్వదశోకసుమోత్కరాభునిన్ = ప్రకాశించు నశోక పుష్పముల సమూహముతో సమానుని, చేరువ కొమ్మన్ = సమీపమున నుండు కొమ్మయందు; మెల్లగాఁ జెప్పు మాటలు సీతాదేవికి వినఁబడుటకై సమీపశాఖయందే

యున్నాఁడని భావము. అచింత్య పరాక్రమ = చింతింపరాని పరాక్రమముగలవానిని, సముద్రము దాఁటుట, లంకలో వెదకుట, తన్నుఁగనుఁగొనుట సామాన్యులచే నగుకార్యముకాదు. స్వర్ణలోచనుఁ = బంగారువంటి కన్నులు గల వానిని.

తా త్ప ర్య ము.

తూరుపు కొండమీఁద నుదయించి యుదయింపకయుండు సూర్యునివంటి వాఁడని౯ జెప్పఁదగి కొమ్మలందు బాగుగా దాగియున్న తెల్లని వస్త్రము ధరించి ప్రియవాక్కులు చెప్పుచున్నవానిని, మెఱుఁగు వంటి పింగళవర్ణము గల వానిని అశోకపుష్పముల రాశివలె నెఱ్ఱనగు ముఖము గలవానిని, సమీపమందే యుండెడి యద్భుత పరాక్రమము, పచ్చని కన్నులు గలవానిని, క్రోఁతిని.

తూరుపు కొండమీఁది యనూరుఁడు ఎఱ్ఱనివాఁడు, ఎత్తున నున్నవాఁడను టచే సూర్యబింబము కానవచ్చి కానరాని సమయమును సూచించుచున్నది. హనుమంతుడను ననూరుని దర్శనమగుటచే రామచంద్రమూర్తి యను సూర్యుని దర్శనము శీఘ్రకాలమందే తప్పక కలుగునని భావము.

చ. కని చలియించి యబ్రపడి ♦ తన్మోసుత హా! యిది భీషణంబు నా
వనచరరూప, మే దొసఁగు ♦ పాటెలునో కనుఁ గొంట దీని, నం
చును మదిలోఁ దలంచి భృశ♦శోకమునఁ రఘురామ! లక్ష్మణా!
యని భయమోహితాత్మ యయి ♦ యల్లన నల్లన నేడ్చె దీనయై. ౭౭౧

అర్థములు. చలియించి = భయముచే దేహమును గదలించి, భీషణము = భయంకరము, దొసఁగు = కీడు, భృశ = అధికమైన, అల్లన నల్లన నేడ్చెఁ = మెల్ల మెల్లగా నేడ్చెను. ఇప్పటి సీతాదేవి మనస్సు నమ్మీనమ్మని డోలాయమాన దశయందున్నది. దానివలన గట్టిగానేడ్చిన రాకాసు లందఱు వత్తురేమో. నిజ ముగ నితఁడు రామదూతయై యుండినఁ గార్యము తాను బాధచేసిన ట్లగును.

తా త్ప ర్య ము.

చూచి దేహము జలదరింపఁగా నాశ్చర్యపడి యిది భయంకరమైన క్రోఁతి రూపము. దీనిని జూచితిని. ఏమి కీడు మూఁడఁగలదో యయ్యో యని మిగుల శోకముచే రామలక్ష్మణుల స్మరించి భయముచే భయపడిన మనస్సు గలదై మెల్ల మెల్లన నేడ్చెను.

క. కనుచుఁ బృథుభుగ్నవక్త్రుని, వనచరపతిమంత్రివర్యు♦వాతాత్మజుని౯
ఘనమేధావివరిష్ఠుని, దిననాథతనూజుబంటుఁ ♦ దేజోనిలయున్. ౭౭౨

అర్థములు. పృథుభుగ్న వక్త్రుని౯ = గొప్పదియు వంకరయైనదియు నగు ముఖము గలవానిని, మేధావి వరిష్ఠుని౯ = బుద్ధిమంతులలో శ్రేష్ఠుని.

తా త్ప ర్య ము.

పెద్దదియు వంకరయైనదియు నగు ముఖము గలవానిని, సుగ్రీవుని మంత్రు

లందు శ్రేష్ఠుని, వాయుకుమారుని, గొప్పబుద్ధిమంతులలో శ్రేష్ఠుని, సుగ్రీవుని బంటుగా వచ్చిన వానిని, తేజమునకు స్థానమైన వానిని జూచుచు.

చ. నెలఁత భృశార్తిఁ గుందుచు వి♦నీతునిరీతిగ నున్న మారుతిం
దలఁచి మనంబులోన నగు♦నా యిది స్వప్న? మ టంచు వెండియున్
జెలువ సమీరపుత్రుఁ గని ♦ చిత్తము వ్యాకుల మంద భీతిచేఁ
గలఁగి విసంజ్ఞ యై శవము♦కైవడి నై తెలి వొంది యిట్లనున్. ౭౭౩

అర్థములు. నెలఁత = స్త్రీ; సీత – వినీతునిరీతిగన్ = వినయము గల వాఁడుగ, విసంజ్ఞయై = స్మృతి తప్పినదై.

తా త్ప ర్య ము.

సీతాదేవి మిగుల మనోవేదనచే దుఃఖించుచు వినయవంతుఁడుగ నున్న హనుమంతుని జూచి యిది కలయా యేమి యని వ్యాకులపడి స్మృతితప్పి పీనుఁగు వలె నిశ్చేష్టయై యుండి మఱలఁ దెలివి తెచ్చుకొని తనలోఁ దా నిట్లనుకొనుచున్నది.

మ. కలలోఁ గ్రోఁతిని జూడరా దనుచు వ♦క్కాణించు శాస్త్రంబు, నేఁ
గలఁ గంటిం గద వాసరంబు, నిఁక నే♦కష్టంబు ప్రాప్తించునో
కలుగుం గావుత రామలక్ష్మణులకుం ♦ గళ్యాణముల్, సంతతం
బలరుం గావుత నాదుతండ్రి జనకుం ♦ డారోగ్యసంపత్తిచేన్. ౭౭౪

అర్థములు. వక్కాణించున్ = చెప్పును.

తా త్ప ర్య ము.

కలలోఁ గ్రోఁతిని జూచినఁ గీడని శాస్త్రములు చెప్పుచున్నవి. నేను గలలోఁ గ్రోఁతినిజూచితిని. కావునఁ గీడు కలుగనున్నది. రామలక్ష్మణులకు మేలు కలుగుం గావుత. మా తండ్రి జనక మహారాజారోగ్యముచే సంతోషించును గాక.

చ. కల యని యందునా యెటులు ♦ కల్గెడు స్వప్నము నిద్ర లేకయే?
కలిగెడు నెట్లు నిద్ర యిటు ♦ కాఱియపాటున వేఁగు వేళలన్!
జెలఁగు నొకో సుఖంబు సమ♦శీతకరాభముఖారవిందునిన్
జెలువుని రాముఁ బాసి యిటు♦చేడ్పడు దుర్భగురాల నాకునున్? ౭౭౫

అర్థములు. కాఱియపాటునన్ = బాధచే, సమ = నిండు; శీతకరాభ = చంద్రునితో సమానమైన, ముఖారవిందునిన్ = ముఖకమలము గలవానిని, దుర్భగురాలన్ = దురదృష్టముగలదానను.

తా త్ప ర్య ము.

ఇదికలయా! కాదు. ఏల? నిద్రలేక కలయెట్లువచ్చును? ఇప్పుడు నేను నిద్రించుచున్నానేమో. నిద్రయెట్లు వచ్చును? దుఃఖముచే బాధపడుచున్న వేళ నిద్ర యెట్లు వచ్చును. సుఖముదోఁచినఁగదా నిద్రవచ్చును. నిండుచందురువంటి ముఖారవిందము

గల రామచంద్రుని విడిచి యేడ్చుచుండు యీ నిర్భాగ్యురాలికి నిద్ర యెట్లు వచ్చును? సుఖ మెట్లు దోఁచును.

చ. కల యిదిగాదు, నిక్కువము ♦ గాదు, నిజం బరయంగ నెప్పుడుఁ
దలఁపున రామ రామ యని ♦ ధ్యాన మొనర్చుచు, నోర నట్టులే
పలుకుచు నుంటఁ దద్విషయ♦వాక్యములే విను దాన, నమ్మహా
బలుని స్వరూపమే కనెద ♦ భావనతీవ్రబలంబు పెంపునన్. ౭౭౬

తాత్పర్యము.

నిద్రకుఁ గారణము లేదు, కావున నిది కలకాదు. రాముదూత క్రోఁతియింత సముద్రముఁ దాఁటి రావణాసురుని యంతఃపురమునకు వచ్చుట నమ్మరాని విషయము. కావున నిది నిజముగాదు. అట్లైన నిఁకేమి యనిన నేను సర్వవేళల రామ రామ యని స్మరించుచున్న దానను. ఆయననే ధ్యానించు చున్న దానను. కావున నాయన మాటలే వినవచ్చుచున్నవి. తీవ్ర భావన బలముచే నాయన స్వరూపమే కానవచ్చు చున్నది.

ఉ. ఆ రఘువీరుపై హృదయ ♦ మంతయు నిల్పి మనోభవవ్యథా
భారముచేఁ దపించుటను ♦ భావనశక్తి రఘూత్తమాకృతిన్
సారెకుఁ గాంతు నెల్లయెడఁ ♦ జారుతదీయకథల్ వినంబడున్
వారక నాదు మోహ మొక ♦ వానరరూపముఁ గాంచి పల్కెనో. ౭౭౭

తాత్పర్యము.

వాస్తవ మిదియే. రామచంద్రమూర్తి మీఁదనే నా మనస్సంతయు నిలిచి మనస్సులోఁ బుట్టిన దుఃఖాతిశయముచేఁ బరితాప పడుట వలవ హృదయమునందు వేఱొక విచారము లేకుండుటచే భావన బలంబున నేనెందు జూచినను రాముని స్వరూపమే కానవచ్చుచున్నది. ఆకథలే వినఁబడు చుండును. కావున నా మోహమే యొక క్రోఁతిరూపము గైకొని పల్కు చున్నది.

ఈ పద్యమందు భక్తివలనఁ గలుగు సమాధి చెప్పఁబడెను.

యత్రైవ యత్రైవ మనో మదీయం
తత్రైవ తత్రైవ తవ స్వరూపమ్
యత్రైవ యత్రైవ శిరో మదీయం
తత్రైవ తత్రైవ పదద్వయం తే.

నా మనస్సెందెందుఁ బోవుచున్నదో యదియంతయు నీ స్వరూపమే. నా శిర స్సెందెందు వ్రాలుతునో యం దెల్ల నీ పాదములే యున్నవి.

"స్వానుభూతి రసావేశా, దృశ్యశబ్దా ఉపేక్షితః,
నిర్వికల్ప సమాధిశ్చ,నివాత స్థిత దీపవత్".

తన యనుభవ రస మావేశించుటచేఁ గానవచ్చునవి, వినవచ్చునవి, ఉపేక్షిం

చుట నిర్వికల్ప సమాధి యగును. ఇది గాలి లేనిచోట నుండు దీపము వంటిది.

సీతాదేవి రామునందే మనస్సు నిలిపి రామునే ధ్యానించుటచే నితరాకారములు గానవచ్చుట లేదు. ఇతర ధ్వనులు చెవిని బడుట లేదు. ఏది చూచిన రామచంద్రమూర్తియే, యేది విన్నను రాము ముచ్చటలే. ఇది భక్తి పరాకాష్ఠ. దీనిని మించిన దశ లేదు; దీని నెప్పుడు రామచంద్రమూర్తి ప్రసాదించునో. ఈ దశ కంస మారీచులకు భయము చేతను సీతాప్రహ్లాదులకు భక్తి చేతను గలిగెను.

చ. అటు లయినన్ మనోరథము ♦ నాకృతి యిట్టిది గాదటంచుఁ బ్ర
స్ఫుటముగ బుద్ధిచేఁ దెలియఁ ♦ జూచెద, రూపము లేదు దానికిన్
బటుతరరూపి యియ్యదియుఁ ♦ బల్కెడి మాటలు నన్నుఁ జూచియే
యెటు లనవచ్చు మాయ యని ♦ యెంతయుఁ జూచిన నిక్కువంబ యౌ. ౭౭౮

తాత్పర్యము.

ఆ విధముగఁ జూచిన నదియు సరకాదని తోఁచుచున్నది. మనోరథరూపమిది కాదని బుద్ధి చెప్పుచున్నది. మనస్సునకు రూపము లేదుకదా. ఇది స్పష్టముగ రూపముగలదై కానవచ్చుచున్నది. ప్రత్యక్షముగఁ గానవచ్చునది, నన్నుఁజూడ మాటలాడుచున్నది, మాయయని యెట్లనవచ్చును. కావున నిది వాస్తవమే.

“యథార్థం సర్వ విజ్ఞాన మితి వేదవిదాం మత”మ్మన్నట్లు మనకుఁ గానవచ్చునది వినవచ్చునది సర్వ సత్యమే కాని యసత్యము కాదని సూచితము.

చ. అని మది నిశ్చయించి తన ♦ హస్తయుగంబును మోడ్చి మ్రొక్కెదా
నను బలవైరియుక్తు సుమ ♦ నస్తతి మంత్రి స్వయంభువున్ శుచిన్
వనచరుఁ డిప్డు నాయెదుటఁ ♦ బల్కినవాక్యము లెల్ల సత్యమై
యొనరుత వేఱుగా జరుగ ♦ కుండెడిఁ గాత మటంచు వేఁడఁగన్. ౭౭౯

తాత్పర్యము.

నాకుఁ గానవచ్చు క్రోఁతి వాస్తవముగఁ గ్రోఁతియే గాని యొకవస్తువు మఱియొకవస్తువుగాఁగానరాలేదని నిశ్చయించుకొని రెండుచేతులుజోడించియింద్రునితో గూడిన బృహస్పతిని బ్రహ్మను అగ్నిని నమస్కరించెదను. ఇప్పుడీ క్రోఁతినాయెదుట జెప్పిన మాటలన్నియు సత్యములే యగునుగాక! దానికి భిన్నముగా జరుగకుండును గాక యని ప్రార్థించెను. ఇప్పటికి సీతాదేవి మనస్సునకు నిది నిజముగాఁ గ్రోఁతియే యని విశ్వాసము కుదిరి ఆయన చెప్పిన విషయము సత్యమని యింకను నమ్మినది కాదు.

——♦ 33–వ సర్గము. హనుమంతుఁడు సీతాదేవితోఁ సంభాషించుట ♦——

క. హనుమయు వినీతవేషంబున వృక్షముఁ గొంత డిగ్గి ♦ మోడ్పుం గేల్
దనశిరమునఁ బూనుచు నతివినయంబున మధురఫణితి ♦ వెలఁదికి ననియెన్.

తాత్పర్యము.

ఇంత మాత్రము దనయందు విశ్వాసము గలదయ్యెను గదా యని హనుమంతుఁడు నిశ్చయించుకొని మునుపున్న కొమ్మకంటెఁ గ్రిందికొమ్మకు వినయవంతుని వేషమున నేదిగి రెండు చేతులుజోడించి శిరస్సున నుంచుకొని మిగుల వినయముతోఁ దియ్యని మాటలతో నిట్లనెను.

శా. అమ్మా! పద్మదళాక్షి యెవతెవీఁ వే ♦ లా మైల కౌశేయచే
లమ్మున్ దాలిచి కొమ్మయూఁతఁగొని ని♦ల్వం? బద్మపత్రంబులం
దిమ్మై కాఱు జలంబు నాఁగఁ గనులం ♦ దిట్లేల శోకాశ్రుపూ
రమ్ముల్ గ్రమ్మెడి? నానతీయఁ గదవే ♦ ప్రార్థింతు సాధ్వీమణీ! ౭౮౧

తాత్పర్యము.

అమ్మా! పతివ్రతా రత్నమా! నిన్ను నే నొకటి ప్రార్థించెదను. నాయం దనుగ్రహించి సెలవిమ్ము. నీవెవ్వతెవు. ఁల యిట్లుమాసిన పట్టువస్త్రము గట్టుకొని కొమ్మను బట్టుకొని నిలఁబడి యున్నదానవు. తామరతేకులనుండి పడునీళ్ళవలె నేల కన్నులనుండి నీరు కాఱుచున్నది.

ఉ. కిన్నరకాంతవో ? యసుర♦గేహినివో ? వసురుద్రరామవో ?
పన్నగనారివో ? విబుధ♦భామినివో ? మఱి యక్షయోషవో ?
యన్నెలఁ బాసి కూలిన గు♦ణాన్విత రోహిణివో ? తలంప నో
కన్నియ నీవు దేవతవ♦కాఁ దలపోసెద భద్రలక్షణా! ౭౮౨

తాత్పర్యము.

నీవు కిన్నరస్త్రీవా ? వసువుల రుద్రుల భార్యవా? పన్నగస్త్రీవా? దేవతాస్త్రీవా? యక్షకాంతవా? ఆ చంద్రుని విడిచి నేలఁబడిన రోహిణివా? నీయందుఁగల శుభచిహ్నములు చూచి నీవు మనుష్య స్త్రీవికావు, దేవతాస్త్రీ వని తలంచెదను.

తే. అలుక చేతనో మోహంపుఁ ♦ గలఁక చేత
నో వసిష్ఠుని నెడఁబాసి ♦ యుర్విఁదిరుగఁ
గడఁగిన యరుంధతివి గావు♦గా ? యెఱుంగఁ
బల్కవే ప్రేమఁ గళ్యాణి ♦ భద్రమగుత. ౭౮౩

తాత్పర్యము.

కల్యాణీ! నీకు మేలుగలుగునుగాక! చెప్పుము. కోపముచేతనో మోహము వలనఁ గలిగిన కలఁతచేతనో భూమిని దిరుగుటకై వసిష్ఠుని విడిచివచ్చిన యరుంధతివి కావు గదా చెప్పుము. అరుంధతి తన పేరున కర్థము తానే యిట్లు చెప్పెను. "ధరాం ధరిత్రీం వసుధాం భర్తృస్తిష్ఠా మ్యనంతరమ్, మనోఽనురంధతీ భర్తృ రితి మాం విద్ధ్య రుంధతీమ్॥ భార. అను. ౧౮౨ అధ్యా.

ధరాః - పర్వతములను. ధరిత్రీం = భూమిని, వసుధామ్ = ఆకాశమును

(వసన్ దేవాన్ ధత్తే ఇతి వ్యుత్పత్త్యా వసుధాం దివమ్ - నీలకంఠ) పర్వతములను భూమిని ఆకాశమును భర్తతోడ నధిష్ఠించియున్నాను. భర్తను అవ్యవధానముగ ననుసరించి యుండుదానను. భర్త కంటె నెక్కువగా సారవంతమైన ధరిత్రిని దలఁచుదానఁ గాను. కావున నా పే రరుంధతి యందురు.

ఉ. ఎందులనుండి వచ్చి ? తిటు ♦ లిచ్చట నేల మహార్తిఁ గుంద, నో
సుందరి ! తండ్రి యెవ్వఁ డోకో ! ♦ సోదరుఁ డెవ్వఁడు ? భర్త యెవ్వరో
నందనుఁ డెవ్వఁ డమ్మ ? సుర♦నారివి గా వని తోఁచె నేడ్చుటన్,
దందడియూర్పు లుంట, వసు♦ధాస్థలి నిల్చుట, రాజచిహ్నలన్. ౭౫౮

తాత్పర్యము.

అమ్మా! ఎచ్చట నుండి నీ విచ్చటకు వచ్చితివి. ఇచ్చట నీ విట్లు దుఃఖింపఁ గారణమేమి ? నీవిటు దుఃఖింపవలసిన దానవుగావే. నీ తండ్రి యెవ్వఁడు? నీతోడఁ బుట్టినవాఁ డెవ్వఁడు? నీ భర్త యెవ్వఁడు ? కొడు కెవ్వఁడు ? నీ రూపము గుణము బట్టి నీవు దేవతాస్త్రీ వని తలఁచితిని గాని నీ వేడ్చుచుండుట చేతను, విస్తారముగ నూర్పు లుండుట చేతను, భూమి మీఁద నిలఁబడి యుండుటను రాజస్త్రీల కుండవల సిన చిహ్నములు నీ యందుండుటను నీవు దేవతాస్త్రీవి గావని తోఁచుచున్నది. రాజస్త్రీ చిహ్నములు.

'చక్రస్వస్తిక వజ్రాంకం ధ్వజమీనాత పత్రవత్
యస్యాః పాదతలం బ్రహ్మన్ సా భవేత్ క్షితిపాంగనా,
భవే దఖండభోగా యోర్వ్యాం మధ్యాంగుళి సంగతం
ఉన్నతో మాంసలోంగుష్ఠో వర్తులో౽తుల భోగదః॥'

చక్రము, స్వస్తికము, వజ్రము, ధ్వజము, మత్స్యము, గొడుగు వీని యాకారమువంటి రేఖలు పాదములుండిన రాజపత్ని యగును. కాలివ్రేళ్ల నడిమి భాగము భూమిని దాఁకియుండిన నఖండభోగములు గలుగును. బొటనవ్రేలు ఎత్తుగను గుండ్రముగ నుండిన విశేష సౌఖ్యములు గలుగును.

'రాజీత్వసూచకం స్త్రీణాం – పాదపృష్ఠం సమున్నతమ్
అస్వేద మసిరాఢ్యంచ మసృణం మృదు మాంసలమ్॥'

మీఁగాలెత్తుగను, చెమట లేనిదిగను, నరములు తెలియనిదిగను, నునుపుగను, మెత్తగను, బలిసినదిగను నుండిన రాజభార్య యగును.

'రోమహీనే శుభే స్నిగ్ధే యజ్జంఘే క్రమవర్తులే
సా రాజపత్నీ భవతి హ్యసిరే సుమనోహరే
ఏకరోమా రాజపత్నీ ద్విరోమాతిసుఖాన్వితా
త్రిరోమా రోమకూపేషు – భవే ద్వైధవ్య దుఃఖభాక్॥'

పిక్కలు రోమములులేక నునుపై గుండ్రములై నరములు తెలియక రమ్యముగ నుండిన రాజపత్ని యగును. ఒక రోమకూపమందొక వెంట్రుక యుండిన రాజపత్ని యగును. రెండురోమము లుండిన మిగులసుఖ మనుభవించును. మూడు వెంట్రుకలుండిన విధవ యగును.

"సువృత్తైః కరభాకారైః రూరుభి ర్మసృణైర్ఘనైః
సువృత్తై రోమరహితై ర్భవేయు ర్భూమివల్లభాః''

తొడలు దృఢములుగను, ఏనుగు తొండములవలెను, నునుపుగను, లావుగను, గుండ్రముగను, వెండ్రుకలు లేనివిగను, నుండిన రాజభార్య లగుదురు.

''చతుర్భి రంగులై శ్శస్తా కటి ర్వింశతి సంయుతైః
సమున్నత నితంబాఢ్యా చతురశ్రా మృగీదృశామ్
నితంబబింబో నారీణా మున్నతో మాంసలః పృథుః
మహాభోగాయ స ప్రోక్త స్తదన్యోஉశర్మణే మతః॥

మొల యిరువదినాలు గంగుళముల వెడలుపుగలిగి యెత్తై చదరముగా నుండిన పిఱుదులు గలది రాజపత్ని యగును. పిఱుదు లున్నతములుగను బలిసినవిగను విశాలముగ నుండిన మహాభోగము గల దగును.

'సూతే సుతాన్ బహూన్ నారీ పృథుకుక్షిః సుఖాస్పదమ్
క్షితీశం జనయే త్పుత్రం మండూకాభేన కుక్షినా.

కడుపు పెద్దదిగ నుండిన పెక్కుకొడుకులఁ గనును. కప్పవంటి కడుపు గలది రాజు గాఁగలవానిని గనును.

'రక్తా వ్యక్తా గభీరాశ్చ, స్నిగ్ధాః పూర్ణాశ్చ వర్తులాః
కరరేఖా స్త్రియో యస్యా, శ్శుభా భాగ్యవతీచ సా
మత్స్యేన సుభగా నారీ స్వస్తికేన వసుప్రదా
పద్మేన భూపతేః పత్నీ జనయే ద్భూపతిం సుతమ్
చక్రవర్తి స్త్రియః పాణౌ నంద్యావర్తః ప్రదక్షిణః
శంఖాతపత్రకమలా నృపమాతృత్వ సూచకాః.'

అఱచేతియందు రేఖలు ఎఱ్ఱగను, స్పష్టముగను, లోతుగను, నునుపుగను సంపూర్ణముగను (నడుమ తెంపులు లేక) గుండ్రముగ నుండిన భాగ్యవతి యగును. మత్స్య రేఖ యుండిన మహైశ్వర్యము కల దగును. స్వస్తిక ముండిన మంచి వ్రతము గలదగును. పద్మ రేఖ యుండిన రాజుభార్యయై రాజుగాఁగలవానిని కొడుకును గనును. చేతియందు నంద్యావర్త రేఖ యుండిన ప్రదక్షిణముగను రేఖలుండిన చక్రవర్తి భార్య యగును. శంఖము గొడుగు కమలము వీనివలె రేఖ లుండిన రాజమాత యగును.

'పాటలో వర్తుల స్నిగ్ధో రేఖాభూషిత మధ్యమః,
సీమంతినీనా మధరో ధరాజాని ప్రియా భవేత్.

ఎఱుపు వర్ణము – గుండ్రము – నునుపు – నడుమ రేఖగల పెదవి గలది రాజ భార్యయగును.

'భ్రువోరంతర్లలాటేవా మశకో రాజ్యసూచకః,
నాసాగ్రే మశక శ్శోణో మహిష్యాశ్చైవ జాయతే.'

కనుబొమల నడుమఁగాని, లలాటమునందుఁ గాని దోమవంటి సన్న మచ్చ యుండిన రాజ్యప్రాప్తి కల దగును. ముక్కు కొన నెఱ్ఱని మచ్చ యుండిన రాజ భార్య యగును.

'అరవిచ్చు తమ్మికైవడి, పరఁగిన రుచి నొప్పి నింబ పల్లవరుచితో
సరియైన మోవి గలయది, యరయంగా రాజపత్నియై విలసిల్లున్'
'ఉదరంబు కరతలోదర, సదృశంబై జంఘ లతి విశాలంబైనన్
సుదతీ తిలకంబున క,భ్యుదయం బగు ధరణినేలు పుత్రులఁగాంచున్'

"విదితముగఁ బ్రసన్నతగల
వదనముగల వనిత రాజవల్లభ"

ఇత్యాది చిహ్నములచే సీతాదేవి రాజపత్ని యని హనుమంతుఁడు గ్రహించెను.

చ. లలనరో! చూడ నీదుశుభ♦లక్షణముల్ నృపకన్య వంచు భూ
వలయము నేలుమేటి నృప♦వర్యుని పట్టపుదేవి వంచు నేఁ
దలఁచెద, దండకాటవి య♦థామతి ద్రిమ్మర రావణుండు దా
బలిమిని దెచ్చినట్టి నృప♦భామిని సీతవొ? పల్కు మే లగున్. ౭౫౫

తాత్పర్యము.

తల్లీ! నీయందుండు శుభచిహ్నములు చూచి నీవు క్షత్రియస్త్రీవనియు భూచక్రమంతయుఁ బరిపాలించు రాజశ్రేష్ఠుని పట్టపు దేవి వని నేను దలఁచుచున్నాను. దండకారణ్యములో యథేచ్ఛముగాఁ ద్రిమ్మరుచుండ రావణాసురుఁడు బలాత్కారముగఁ దెచ్చిన సీతవా యేమి? నిజము చెప్పుము. నీకు మేలగును.

క. అతిమానుష మగురూపము, వ్రతయుతవేషంబు నీదు♦వైవర్ణ్యంబున్
మతిఁ దలపోయఁగ రాముని,సతి వంచును దోఁచె; లేదు ♦ సందియ మబలా!

అర్థములు. అతిమానుషము = మనుష్యుల నతిక్రమించినది, మనుష్యులందు గానరానిది, వైవర్ణ్యము = కాంతిహీనత.

తాత్పర్యము.

మనుష్యస్త్రీలకు దుర్లభ మగు నీయందము దీక్షతోఁ గూడిన వేషమునీకాంతి హీనత యివన్ని చూడ నీవు రామచంద్రమూర్తి భార్యవనితోఁచుచున్నది. ఇందు సందేహము లేదు. నా యభిప్రాయము నిజమా చెప్పుము.

త్రిజట చెప్పిన మాటలు వినిన తరువాత రాక్షసస్త్రీలు సీతాదేవి నుపేక్షించి యెవరంతట వారు దూరమునఁబోయి పండుకొనిరి. ఆ కారణముచే హనుమంతుఁడు సీతాదేవితో సంభాషింప సమయము దొరకెను. ఈ విషయము హనుమంతుఁ డంగదాదులతో ముందు చెప్పును. సీతావిలాపము ముముక్షువగు ప్రపన్నుని విలాపము నొకటియని ముందు చెప్పఁబడెను. పూర్వకాండమున సంసారముఁ దరించు మార్గము దెలియక నిర్వేదపడుచుఁ దన్నాశ్రయించిన జీవుల రక్షించుటకై భగవంతుడాచార్యులఁ బంపుట చెప్పబడెను. ఇట్టి భగవత్సాహాయ్యము ప్రత్యక్షముగనో పరోక్షముగనో దేహాభిమానము పూర్తిగ వదలి తన్నే తన నిమిత్తమై మానప్రాణములను బోఁగొట్టుకొనుటకుసిద్ధపడి కేవలపరతంత్రులగువారికి లభించును. స్వప్రయత్నమందు దేహమునయందే మాత్రమభిమాన ముండినను భగవత్సాహాయ్యము రాదు. గజేంద్రుఁడు యుద్ధము చాలించి నీవేతప్ప నితఃపరంబెఱుఁగ నని నిలిచిపోయిన తరువాతఁ గాని భగవత్సాహాయ్యము రాలేదు. కౌరవ సభయందు దుశ్శాసనుఁడు తన చీర లొలుచు నప్పుడు ద్రౌపది తన్నుఁదాను గాపాడుకొనఁ బ్రయత్నించు చుండువఱకు భర్తలు తన్ను రక్షింతురని నమ్మియున్నంతవఱకు భగవత్సాహాయ్యమురాలేదు. పురుషప్రయత్నము వ్యర్థమని తలఁచి భగవంతుఁడే కలఁడని నమ్మి రెండు చేతులెత్తి.

'హా కృష్ణ! ద్వారకావాస! క్వాసి యాదవ నందన!
ఇమా మవస్థాం సంప్రాప్తాం కి మ్మనాథా ముపేక్షసే
శంఖచక్రగదాపాణే! ద్వారకానిలయాచ్యుత!
గోవింద! పుండరీకాక్ష! రక్ష!మాం శరణాగతామ్. భార.సభా.౬౬-౪౧

ఓ కృష్ణా! ద్వారకవాసా! వసుదేవ కుమారా! అనాథనై యిటువంటి యవస్థయందుండు నన్ను నేల యుపేక్షించెదవు.

శంఖము చక్రము గద చేతియందుఁ గలవాఁడా! ద్వారకవాసా! భక్తులను విడనాడనివాఁడా! పుండరీకాక్ష! శరణు! శరణు! రక్షింపుము. అని వసిష్ఠునుపదేశము స్మరించి భగవంతుని శరణు వేఁడఁగా వలువ లక్షయము లయ్యెను.

అట్లులే సీతాదేవియు, "కోయుఁడు కడికండలుగా, వ్రేయుఁడు కత్తులనుమండు మంటలఁ ద్రోయుఁ" డనియు, వీరు నన్నుఁ దిననీ, కోయనీ యేమైనఁ జేయనీ యని దేహాభిమానము వదలి నిద్రాహారము లుజ్జగించి యేకాగ్రమనస్కయై దుష్టరాక్షసులచేఁ జంపఁబడుట కంటె బుద్ధిపూర్వకముగా దేహము ప్రాణము రామచంద్రమూర్తికే సమర్పింపఁ దలఁచి నిరాశయై మరణోద్యుక్త యయ్యెనో యప్పుడు హనుమదాచార్య లాభము ప్రాప్తించెను.

—♦ సీతాదేవి హనుమంతునితోఁ దన వృత్తాంతము చెప్పుట ♦—

క. అనుఁడుఁ రఘువల్లభకీ, ర్తన హృష్టమనోజ్ఞ యగుచుఁ ♦ దర్వాశ్రితునిఁ
హనుమంతుఁ గాంచి పలికెన్, జనకతనూజాత తనదు♦చారిత్రంబున్. ౭౭౭

అర్థములు. రఘువల్లభకీర్తనహృష్టమనోబ్జ = రామచంద్రుని బొగడుటచే సంతోషించిన మనఃకమలముగలది, తరు+ఆశ్రితునిన్ = చెట్టుమీఁదనుండువానిని.

తాత్పర్యము.

ఈప్రకారము హనుమంతుఁ డడుగఁగా రాముని బొగడుటచే సంతోషించిన మనస్సుగలదై సీతాదేవి చెట్టుమీఁదనున్న యాంజనేయునితోఁ దన వృత్తాంత మిట్లు చెప్పెను.

క. రాజితయశుఁ డగు దశరథ, రాజేంద్రుని స్నుషను జనక♦రాజతనూజన్
రాజనిభాస్యుఁడు రామున, కే జాయను సీత యందు♦రిల నాపేరున్. ౭౮౮

తాత్పర్యము.

కీర్తిచేఁ బ్రకాశించు రాజశ్రేష్ఠుఁడగు దశరథుని కోడలను, జనకరాజపుత్రికను, చంద్రునివంటి ముఖముగల రామచంద్రుని భార్యను. నా పేరు సీతయందురు.

ఉ. మానితసర్వకామముల ♦ మానుషభోగములన్ భుజించుచున్
మానుగ రెండునుం బది స♦మల్ వసియించితి రామునింటిలోఁ
బూని త్రయోదశాబ్దమున ♦ భూవరుఁడున్ గురుమంత్రిపౌరలో
కానుమతిన్ మదీశ్వరు ర♦సాధిపుఁ జేయఁగ నున్న యంతటన్. ౭౮౯

అర్థములు. మానిత సర్వకామములన్ = గౌరవింపబడు సమస్తము లైన కోరికలను, మానుషభోగములన్ = మనుష్యు లనుభవింప యోగ్యములైన భోగములను, దీనివలనఁ దానుమనుష్యస్త్రీ గాదని సూచితము. రెండునుంబదిసమల్ = పండ్రెండు సంవత్సరములు, త్రయోదశాబ్దమునన్ = పదమూఁడవ సంవత్సరమున, మదీశ్వరు = నా భర్తను, రసా+అధిపున్ = భూపతిన్ = రాజుగ.

తాత్పర్యము.

మనుష్యులనుభవింప యోగ్యములైన సమస్తములైన కోరికలను భోగములను ననుభవించుచుఁ బండ్రెండు సంవత్సరములు రామచంద్రమూర్తి యింటిలో నుండితిని. పదుమూఁడవ సంవత్సరమున దశరథరాజు నాభర్తను రాజుగాఁజేయఁ బ్రయత్నింపఁగా.

ఇచట పదియు రెండు సంవత్సరములు రాము నింట నుండితినని చెప్పెను. రావణాసురునితోఁ దాను రామునితో నరణ్యమునకు వచ్చునప్పటికిఁ బదునెనిమిది సంవత్సరములని చెప్పెను. (చూ. అర. ౭౬౭) కావున రామచంద్రమూర్తి యింటికి నాఱవ సంవత్సరముననే వచ్చెనని యేర్పడుచున్నది.

ఉ. ఆ మనుజాధినాథు ప్రియు♦రా లగు కైకయి ప్రాణభర్తతో
రాముని నీవు ధారిణికి ♦ రాజుగఁ జేసెద వేని చెప్పెదన్
నేమముఁ బట్టి త్రావ నిఁక ♦ నీరముఁ, గూడును ముట్ట నింతతో
నీమెయితోడి పొత్తు సరి, ♦ యిప్పుడ ప్రాణముఁ బాయుదుం జుమీ. ౭౯౦

తాత్పర్యము.

ఆ రాజేంద్రుని ప్రియభార్యయైక తన మగనితో నిట్లు చెప్పెను. నీవుభూమికి రామచంద్రమూర్తిని రాజుగాఁ జేసెద వేని నేను నేమముఁబట్టి నీళ్ళు త్రాగను. కూడుముట్టను. నా ప్రాణముల నిప్పుడే పోఁగొట్టుకొందును.

ఉ. ఆడినమాట నిల్పుకొను♦నట్టి తలం పెదఁ గల్గె నేనియున్
వీడుము రాముని న్గహన♦వీధుల వేగ మటన్న మున్ను దా
నాడినమాట నెంచి ప్రియు♦రాలి కఠోరతరాప్రియోక్తికై
యేడిచి మూర్ఛలన్ మునిఁగి ♦ వృద్ధధరాపతి ధర్మబద్ధుఁడై. ౭౯౧

తాత్పర్యము.

నీవు చెప్పిన మాటప్రకారము సత్యము తప్పక వర్తింపఁదలఁచెదవేని రామచంద్రమూర్తిని నడవులలో వదల వలసినదని కోరఁగాఁ దాను ముందు చెప్పిన మాట తలఁచి ప్రియురాలి కఠినమై యప్రియమైన మాట విని యేడిచి మూర్ఛలో మునిఁగ ముసలివాఁడగు రాజు ధర్మముచేఁ గట్టఁబడిన వాఁడై.

ఉ. ఆలికిఁ జెప్ప లేక తన ♦ యగ్రతనూజుని వేఁడె రాజ్యమున్
శ్రీలలితుండు రాముఁ డభి♦షేకముకంటెఁ బ్రియంబునైన భూ
పాలునిమాటఁ గైకొనియెఁ ♦ బ్రాణనిమిత్తమ యైన నా మగం
డాలరిపల్కుఁ బల్కఁడు, న♦యంబున నిచ్చు గ్రహింపఁ డేనియున్. ౭౯౨

తాత్పర్యము.

పెండ్లమున కేమియు సమాధానముఁ జెప్పఁజాలక తన పెద్దకొడుకును నీవు రాజ్యము వదలి పొమ్మని కోరెను. సహజశ్రీమనోహరుఁడగు నాభర్తకు నాగంతుకమైన యీ రాజ్యాభిషేకము కంటెఁ దండ్రిమాట నెఱవేర్చుట ప్రియము కావున నాయనమాట నెఱవేర్ప నంగీకరించెను. ప్రాణము రక్షించుకొనుటకైనను నామగఁడు అప్రియమైన మాట చెప్పెడు వాఁడు కాఁడు. మంచితనముగా నెవ్వరేమి యడిగిన నిచ్చునేకాని యొకరిచే నేమియు గ్రహింపఁడు.

చ. జనకునిమీఁది భక్తిమెయి ♦ సంపదలున్ ధరణీ ప్రభుత్వమున్
ఘనతరినవ్యచేలములు ♦ గ్రక్కున వీడి, కుశాజినంబులన్
గొని, నను దల్లికిన్ మిగులఁ ♦ గూరిమి నప్పన చేసె నాకు న
య్యనఘునిఁ బాసినంత నమ♦రాలయ మైన రుచింప దాత్మకున్. ౭౯3

తాత్పర్యము.

తండ్రిమీఁద దనకుఁ గల భక్తిచేత సమస్తైశ్వర్యము భూప్రభుత్వము గొప్ప వెలగల వస్త్రములు తత్క్షణమే వదలి వనవాసమునకుఁ దగిన దర్భలు జింకచర్మములను గైకొని యడవికిఁ బోవఁ బ్రయత్నించి నన్నుఁ దన తల్లి కప్పగింపఁ జూచెను. గాని యీ పుణ్యాత్ముని వదలితినా స్వర్గమైనను నాకు రుచింపదు.

ఉ. కావున రామునకంటె మును ♦ కానలకేను బ్రయాణ మైతి, స
ద్భావుఁడు లక్ష్మణుండు దొలు♦తన్ ధరియించెను నారచీరముల్
మూవుర మిట్లు మేము వ్ర♦తముం గొని యెన్నఁడుఁ జూడనట్టి భీ
త్యావహ మైన దండక ధ♦రాధిపు నాజ్ఞనుజొచ్చి యుండఁగన్. - ౨౮

తాత్పర్యము.

కావున రామచంద్రమూర్తి కంటె ముందు నేనే యడవులకుఁ బ్రయాణమైతిని. రామచంద్రమూర్తిని సేవింప వలయునను మంచి హృదయముగల లక్ష్మణుడన్న మీఁది భక్తిచే నారచీర లప్పుడే కట్టుకొనెను. మేము మువ్వుర మీ విధముగా వనవాసదీక్ష గైకొని ముందెన్నఁడు చూడని భయంకరమైన యడవియందు రాజాజ్ఞాప్రకారము ప్రవేశించి యుండఁగా.

అయోధ్యాకాండమందు ముందు రామచంద్రమూర్తి నారచీరలు కట్టుకొన్న తరువాత లక్ష్మణుఁడు కట్టుకొనెనని యున్నను ఇచ్చట లక్ష్మణుఁడు ముందు కట్టుకొనెననుట ప్రయాణమందలి యతని యాదరాతిశయముఁ దెలుపుట కని గ్రహింపవలెను.

ఉ. ముచ్చిలి తెచ్చె నన్ను రఘు♦ముఖ్యుని దేవిని గూళ రావణుం
డిచ్చట దిక్కు లేమి నిటు ♦ లేడ్చెద. మాసయుగంబు జీవితం
బిచ్చె దశాస్యుఁ, డంతపయి ♦ నీల్గెడుదానను, నింతలోన నా
సచ్చరితుండు వచ్చు నని ♦ చాలఁగ నాశను మేను నిల్పితిన్. ౨౯

అర్థములు. ముచ్చిలి = దొంగిలించి, కూళ = వంచకుండు, క్రూరశబ్దభవము = కూళ. మాసయుగంబు = రెండు నెలలు.

తాత్పర్యము.

రాముని భార్య నగు నన్ను వంచన చేసి రావణుఁడు దొంగిలించి తెచ్చెను. కావున నిచ్చట దిక్కులేక యేడ్చుచున్న దానను. నాకుఁ బండ్రెండు నెలలు వాఁడు గడువిచ్చెను. వానిలో రెండు మిగిలినవి. అది తీరఁగానే చత్తును. ఇంతలో రామచంద్రమూర్తి వచ్చునను నాశచేతఁ జావకున్నాను.

{ ౩౪-వ సర్గము. హనుమంతుఁడు సీతాదేవికి శ్రీరామ
లక్ష్మణుల కుశలవార్తఁ దెలుపుట. }

సీ. అనవుడు నామాట ♦ లాలించి పావని, సాంత్వనోక్తుల నను ♦ జనకసుతకు
దేవి! నీకొక్కసం♦దేశ మంపఁగ రామ,భద్రుండు దూతనై ♦ వచ్చినాఁడ
శ్రీరామచంద్రుండు ♦ సేమ మయ్యెడఁ దన, సేమంబు సీతతోఁ ♦ జెప్పు మనియె
బ్రహ్మాస్త్రవేదశా♦స్త్రవిదుండు శ్రీరాముఁ, డర్మిలి నీ సేమ ♦ మడిగె నమ్మ!
ఆ. శౌర్యదర్పధనుఁడు ♦ సౌమిత్రి నీ పతి, కనుచరుండుఁ బ్రియుఁడు ♦ సాశ్రునేత్రుఁ
డగుచు నీకు భక్తి ♦ సాష్టాంగ మెరఁగెను, గుశలు లమ్మ వారు ♦ కువలయాక్షి.

అర్థములు. సాంత్వనోక్తులన్ = ఊరార్పు మాటలచే. సందేశము = వార్త, అనుచరుండు = దాసుఁడు, వెంటనంటి తిరుగువాఁడు, సాశ్రునేత్రుఁడు = కన్నీటితోఁ గూడిన కన్నులు గలవాఁడు, బ్రహ్మాస్త్రము తెలిసినవాఁ డనుటచే సమస్తాస్త్రములు దెలిసినవాడని యర్థము. వేదములు తెలిసినవాఁ డనుటచే అర్థముతోడ వేదముల నధ్యయనము చేసెనని భావము. శాస్త్ర మనుటచే ధర్మశాస్త్రము కర్మానుష్ఠానముతోడఁ దెలిసినవాఁడనియర్థము. అర్చిలన్ = ప్రేమతో, శౌర్యదర్పధనుఁడు = శౌర్యము వలని గర్వమే ధనముగాఁ గలవాఁడు, ఎరఁగెను = నమస్కరించెను. కువలయాక్షి = కలువలవంటి కన్నులుగలదానా! హనుమంతుఁడు సీతాదేవిని కువలయాక్షియని, అసితేక్షణ యని పలుతావుల వర్ణించెను. ఈ నేత్రసౌందర్యమే యీమె రామచంద్రమూర్తికిఁ దగిన భార్య యని తెలుపుచున్నదని హనుమంతుని యభిప్రాయము. కు + వలయ మనఁగా భూచక్రము. అది యంతయు నీ కనుసన్నల మెలఁగవలసినదై యుండ నీ కీ దశ తగినది కాదని భావము. అనఁగా నీవు సాక్షాల్లక్ష్మివిగాని, మనుష్య స్త్రీవిగా వని భావము.

తా త్ప ర్య ము.

ఆ మాట లాంజనేయుఁడు విని యూఱడింపు మాటలతో సీతాదేవి కిట్లనియె. దేవీ! రామచంద్రమూర్తి నీకొక్క మాట చెప్పుమని నన్నుఁ బంపుటచేత నాయన దూతనై వచ్చినాఁడను. శ్రీరామచంద్రమూర్తి క్షేమముగా నున్నా నని సీతోఁ జెప్పు మనెను. బ్రహ్మాస్త్రాది సకలాస్త్రములు దెలిసిన వాఁడును, కావున యుద్ధమం దెదురు లేనివాఁడును వేదముల నర్థముతో నధ్యయనము చేయుటచే సర్వవిషయములు తెలిసిన జ్ఞానియు, ధర్మశాస్త్రములు తెలిసినవాఁడగుటచే నేకార్య మెట్లుచేయవలెనో తెలిసి చేయువాఁడును నగు శ్రీరామచంద్రమూర్తి మిగులఁ గూర్మితో నీ సేమ మడిగె నమ్మ. శౌర్యము వలనఁ గలిగిన గర్వమె ధనముగాఁ గలుగుటచే రామచంద్రమూర్తికి సహాయుఁడై రాక్షసుల నెల్ల సాధింప సామర్థ్యముగల లక్ష్మణుఁడు నీ భర్తకు సేవకుఁడు ప్రియుఁడునై తల్లీ! నీకు సాష్టాంగ నమస్కారము గావించెను. కువలయాక్షీ! వా రిరువురు కుశలులు తల్లీ!

క. అని హనుమంతుఁడు పల్కిన, విని జనకతనూజ హర్ష♦వివశాత్మిక యై
తను వెల్లఁ బులకరింపఁగ, నను భావనిఁ జూచి యంచి♦తాలాపములన్. ౭—౭

తా త్ప ర్య ము.

అని హనుమంతుఁడు చెప్పఁగా విని సీతాదేవి సంతోషముచే దేహము మఱచినదై దేహముగగ్గురింపఁగా మనోహరములైనవాక్యముల హనుమంతున కిట్లనెను.

క. తనువునఁ బ్రాణము లుండినఁ, గనుఁగొను నూఱేండ్లకైనఁ ♦ గడు హర్షంబున్
మనుజుం డను సామెత ము,న్ననుకొనఁగా వింటి నది య♦థార్థమ చూడన్.

తా త్ప ర్య ము.

ఆంజనేయా! దేహమునఁ బ్రాణములుండెనా నూఱేండ్లకైనను మనుష్యుడు

సంతోషమనుభవించునని యొకసామెత పూర్వము వినియుంటిని. అది సత్యమనియే తోఁచుచున్నది. నేను ప్రాణము బిగఁబట్టుకొని యుండుటచేఁగదా యీ సంతోష వార్త వినఁగలిగితిని. ప్రాణము విడిచియుండిన నీ భాగ్యము లేక పోవునుగదా.

క. అని శుభవార్తం దెలిపిన, హనుమమయెడ జనకతనయ ♦ యద్భుత మగు ప్రీ
తిని జూపఁగ నన్యోన్యం,బును నమ్మిక కుదురుకొనఁగ ♦ ముచ్చట జరగెన్. ౭౯

తాత్పర్యము.

ఈ ప్రకారము శుభవార్త దెలిపిన హనుమంతునియందు సీతాదేవికి మిక్కిలి ప్రీతి గలిగెను. ఒకరి నొకరు నమ్మి సంభాషింపఁ దొడఁగిరి.

క. భూపుత్రిక పలికిన యా,లాపంబులు విశ్వసించి ♦ లాలించుచు దుః
ఖోపశమనం బొనర్పఁగ, దాపునకున్ మెల్ల వాయు♦తనయుం డరిగెన్. ౧౦౦

అర్థములు. విశ్వసించి = నమ్మి, లాలించుచు = బుజ్జగించుచు, ఉపశమనంబు = శాంతి.

తాత్పర్యము.

సీతాదేవి చెప్పిన మాటలు విని మనయందు నీమెకు దృఢమైన నమ్మకము కుదిరెనని నమ్మి యామెను బుజ్జగించుచు దుఃఖశాంతి సేయుటకై మెల్లమెల్లన సమీపమునకుఁ బోయెను.

క. అంతకు నంతకు వానర, కాంతుఁడు దను డాయుకొలఁది ♦ క్ష్మాసుత శంకన్
జింతించె రావణుండే, చెంతకు నటు వచ్చె ననుచుఁ ♦ జేడ్పడి భీతిన్. ౧౦౧

తాత్పర్యము.

హనుమంతుఁడు దగ్గఱకు వచ్చుకొలఁది రావణాసురుఁడే యీ వేషము వేసికొని తన్ను మాట లాడించుటకై వచ్చెనని సీతాదేవి భయపడెను.

—♦ సీతాదేవి హనుమంతుని రావణుఁ డని శంకించుట. ♦—

ఉ. అక్కట! మోస మయ్యెను ద♦శాననుఁ డీగతి మాఱురూపమున్
నెక్కొని వచ్చె, నీవిధము ♦ నేఁ దలపోయక మాట లాడితిన్
మక్కువ విశ్వసించితిఁ, బ్ర♦మాదము కల్గె నయో! య టంచుఁ దా
గ్రక్కునఁ గొమ్మ వీడుచు ధ♦రాస్థలిఁ గూలఁబడెన్ వ్యథామతిన్. ౧౦౨

తాత్పర్యము.

అయ్యయ్యో! నే నెంత మోసపోతిని. రావణాసురుఁడే మాఱువేషము వేసికొని వచ్చెను. నే నింతమాత్ర మాలోచింపక వీనితోఁ జనవుగ మాటలాడితిని. నిక్కపు రామదూతయనుప్రేమచే నమ్మితిని. అయ్యో! చాలఁ బ్రమాద పడితిని. అని పట్టుకొన్న చెట్టుకొమ్మ వదలి దుఃఖించుచు నేలఁ గూలఁబడెను.

క. వడఁకెడి దేహముతో వ్యథ, పడు పడఁతిం గాంచి హనుమ ♦ ప్రాంజలియగుచున్
గడువెఱ నతనిం జూడక, యడజడి నిట్టూర్పుతోడ ♦ ననె నీ రీతిన్. ౧౦౩

అర్థములు. అడజడిన్ = దుఃఖముతో.

తా త్ప ర్య ము.

శరీరము వడఁకుచుండఁగా బాధపడుచున్న యామెను జూచి హనుమ రెండు చేతులు జోడించి నమస్కరించెను. సీతాదేవియు నాయనను జూడక దుఃఖముచే నిట్టూర్పులు విడుచుచు నిట్లనెను.

చ. తెలిసితి లేర నిన్ను, నిటు ♦ తెక్కలివేషము వేసి రావణా!
కలఁచెద వేలరా? శుభము ♦ గాదుర నీ కిది, దండకాటవిఁ
వలనుగ భిక్షురూపమున ♦ వచ్చిన మాయలమారి వీవె, దు
ర్బల నుపవాస దీనఁ దగ♦వా యిటు కాఱియ పెట్ట రాక్షసా? ౧౦౮

అర్థములు. తెక్కలివేషము = దొంగవేషము.

తా త్ప ర్య ము.

ఓరీ! నీ వెవఁడవో తెలిసికొంటిని, రావణా! యేలరా! యిటు దొంగవేషము వేసికొని నా మనస్సు వికలము చేసెదవు. దీనివలన నీకు మేలులేదు. దండకారణ్యమందు నే నుండఁగా సన్న్యాసివలె వచ్చిన మాయలమారివి నీవు కావా? రాక్షసా! బలముడిగినదానను, ఆహారము లేని దానను, ఏడ్చుచున్నదానను, నన్నీ ప్రకారము బాధపెట్ట నీకుఁ దగునా?

ఉ. రావణుఁ డీ వటంచు నన♦రా దనియుఁ మదిఁ దోఁచె, ని న్గనఁ
భావమునందుఁ బ్రీతి ప్రభ♦వం బగు చున్నది, రామదూత వేఁ
వావిరి మేలు నీ కగుత ♦ వర్ణన సేయుము మత్ప్రియంబు లౌ
నా విభు రామచంద్రునిగు♦ణంబు, లనంతముదంబు నా కగుఁ. ౧౦౯

తా త్ప ర్య ము.

ఒకవిధమునఁ జూచిన నీవు రావణుఁడు కావనియుఁ దోఁచుచున్నది. ఏలన రావణునిఁ జూచినంతనే నా మనస్సు చిఱచిఱ లాడుచుండును. అట్టిది నిన్నుఁ జూచినఁ బ్రేమ యుదయించుచున్నది-నా యంతఃకరణము నన్ను మోసపుచ్చదు. నీవు నిజముగ రామదూతవే యయితివేని రాముని గుణములు వర్ణింపుము. రామచంద్రమూర్తి గుణములు నాకుఁ బ్రియంబులు. దానివలన నాకు మితిలేని సంతోషము కలుగును. రావణుఁడేయైన పక్షమున రామచంద్రునిఁ గీర్తింపఁడు. దీనివలన భగవద్గుణానుభవమందు నభిలాష గలిగి భగవద్గుణానుసంధానము చేయుచు శిష్యునకు భగవద్గుణములు వర్ణించి చెప్పువాఁడు నిజమైన గురువు. అటుచేయక తక్కిన నవి చెప్పువాఁడు దొంగగురువు. అట్టివా రెట్టివారైనను నమ్మరాదు. దగ్గఱఁ జేర నీయరాదు.

క. భూరిప్రవాహవేగము, తీరంబు హరించురీతిఁ ♦ దిగిచెదు సౌమ్యా
కారా! మచ్చిత్తము నని, ధారిణిసుత మఱియు నిట్లు ♦ దలఁచెఁ మదిలోఁ.

తా త్ప ర్య ము.

గొప్ప ప్రవాహముయొక్క వేగము గట్టును ప్రవాహములోనికిఁదీసికొను నట్లు నీ సౌమ్యమైన యాకారము నా మనస్సును నీవంక కీడ్చుచున్నది, అని మఱియు నిట్లు తలఁచెను.

ఉ. ఎక్కడిరామదూత? యిట ♦ కేగతి వచ్చును? స్వప్న మద్దిరా
నిక్కపుసౌఖ్య మిచ్చెడిని ♦ నేఁటికి రామునిదూత నంచుఁ దా
నొక్కఁడు క్రోఁతి వచ్చె.నయ♦యో కలయుం గఱ వాయె, మచ్చరం
బెక్కెయొ నన్నుఁజేర దది, ♦ యేగతిఁ గాంచెద రాఘవేంద్రులన్. ౧౦౭

తా త్ప ర్య ము.

అయ్యో! యిదియేమి నా భ్రాంతి. ఎంత భ్రమ పడుచున్నాను. రాము డెక్కడ? ఆయన దూతయెక్కడ? ఇచ్చటికి సముద్రముదాఁటి లంకలోఁబ్రవేశించి యంతఃపురమునఁ బ్రవేశించి యీ వనములో నీమూలఁ బడియుండుచోటికి నెట్లు రాగలఁడు. ఇది సాధ్యమా? కాదు. కావున నిది స్వప్నమే. సప్నమేజాగ్రద్దశయందును నాకు నిజమైన సౌఖ్య మిచ్చుచున్నది. ఇన్ని దినాలకు నేను రామదూతనని యొక క్రోఁతి కలలోవచ్చెను. అయ్యో! నాకుఁ గలకూడఁగఱవాయెను.నిద్రపోయినఁగదా కలవచ్చును. నిద్రలేక కల యెట్లు వచ్చును? దానికిని నామీఁద మచ్చరమేమో! కల లోనే రామలక్ష్మణులఁ జూడలేనిదానను బ్రత్యక్షముగ నెట్లు చూడఁగలను?

చ. కల యిది గాదు, వానరునిఁ ♦ గాంచిన స్వప్నమునందు భద్రముల్
గలుగునె? కల్గుచున్న యవి♦గా యిపు డీతనిఁ జూడ, నామనః
కలిలమొ? వాతలక్షణమొ? ♦ కా దనఁ బిచ్చియొ? యెండమావొ? యిం
దుల నెది గాదు, చక్కఁగపి ♦ తోఁచెడి, నాస్మృతి లెస్స యుండెడిన్. ౧౦౮

తా త్ప ర్య ము.

కలకల యని కలవరించుచున్నాను. ఇది కలయగునా? కాదు.ఏలనందువా? స్వప్నములోఁ గ్రోఁతిని జూచిన మేలుకొన్నప్పుడు మేలు కలుఁగునా? కలుగదు. అయినను ఇప్పుడు నాకు నీయనను జూడ మనస్సునకు సంతోషము కలుగుచున్నది-కావున నిది మనోవ్యాకులత్వమో? వాయువుగుణమో? అది కాదనిన నాకుఁబిచ్చి పట్టినదో! పిచ్చివానికిఁ దాను బిచ్చివాఁడని తోఁచునా? వాతరోగమైన నాడులు సమముగా నడచునా? కావున నిదియెండమావేమో? ఎండమావు నీళ్ళవలెఁ గానవచ్చును గాని క్రోఁతివలెఁ గానవచ్చునా? కావున వీనిలో నేదియుఁగాదు. ఏలన:- క్రోఁతి చక్కఁగాఁ గానవచ్చుచున్నాఁడు. నాస్మృతి చక్కఁగా నున్నది.

చ. అనుచు బలాబలంబుల ని♦జాత్మవిచార మొనర్చి లేదు నా
మనమున మోస, మింక ననుఁ♦మానము మానెదఁ, గామరూపి యౌ

దనుజవరుండె వచ్చె, నిది ♦ తథ్య మటంచును నిశ్చయించి యా
యనుపమసాధుశీల పలు♦కాడక యుండె మరుత్తనూజుతోన్. ౨౯

అర్థములు. బలాబలంబులన్ = ఈ కానవచ్చునది నిజమైన క్రోఁతి, రామదూతయా? మాయవేషము వేసికొనిన రావణాసురుఁడా యను విషయమున నే ప్రక్క నెక్కువ బలమున్నది, ఏప్రక్క తక్కువ బలమున్నదియని. నిజాత్మన్ = మనస్సులో, విచారము = ఆలోచన.

తాత్పర్యము.

ఇతఁడు రామదూత యగు నిజమైన వానరుఁడా, మాయావేష ధారియైన రావణుఁడా యనుటయందుఁ గల బలాబలంబులు తనలో నాలోచించుకొని వీనిని రామదూత యని నేను నమ్మితినా యటుకాదేని నాకపాయము కలదు. నిజముగా రామదూత యామైనా నా నిమిత్తమై వచ్చినవాఁడు గనుకఁ దన యథార్థస్థితిఁ దెలుప యత్నించును. కావున నేను మాటలాడకుండుటచేఁ గలుగు నష్టలేదు. నా మనమునఁ గలంకము లేదు. ఈ సందేహముతోఁ బని లేదు. కామరూపి రావణుఁడే యిట్లు వచ్చెను, ఇది సత్యమని నిశ్చయించుకొని యసమాన పాతివ్రత్యసంపదగల సీతాదేవి హనుమంతునితో మాట్లాడక యూరకుండెను.

—♦ హనుమంతుఁడు సీతాదేవికి సందేహము దీఱునట్లు భాషించుట. ♦—

క. కాంతామణి యీవిధమునఁ, జింతాకుల యగుట కీశ♦శేఖరుఁడు నిజ
స్వాంతంబున నూహించి ని, తాంతమధురసూక్తి సతికిఁ♦దా నిట్లనియెన్. ౨౧౦

అర్థములు. నిజస్వాంతంబునన్ = తన మనస్సులో, కాంతామణి = స్త్రీల యందు శ్రేష్ఠురాలు, గనుక నే యెవనితో నమ్మి మాటలాడవచ్చును, ఎవనితో మాటలాడరాదని యాలోచింపఁ గలిగినది. సామాన్యస్త్రీల కిట్టి వివేక ముండదు కదా.

తాత్పర్యము.

స్త్రీరత్నమగు సీతాదేవి యీ విధముగఁ దనవిషయమునఁ జింతచేఁ గలఁత చెందినదని తెలిసికొని వానరరత్నమగు హనుమంతుఁడాసందేహముఁ బాపఁదలంచి తియ్యని మాటలతో నిట్లనియె.

ఉ. రాజులలోన మేటి, దిన♦రాజు ప్రతాపమునందు యామినీ
రాజు మనోజ్ఞతన్, భువన♦రాజులరా జలరాజరాజున
ట్లా జగదేకకీర్తి యప♦రాజిత శౌర్యుఁడు, మూర్తిమద్రతీ
రాజు సురూపసంపద, వి♦రాజిలు సత్యవచోరతుండునన్. ౨౧౧

అర్థములు. దినరాజు = సూర్యుఁడు, యామినీరాజు = చంద్రుఁడు, రాజరాజు = కుబేరుఁడు, భువనరాజులన్ = లోకసమూహములందు, మూర్తిమత్ = రూపముగలిగిన, రతీరాజు = మన్మథుఁడు, రతి, రతీ రెండురూపములు గలవు. కుబే

రుఁడు = భువనరాజుల రాజనుటకు 'రాజాధి రాజాయ ప్రసహ్య సాహినే, నమో వయం వైశ్రవణాయ కుర్మహే' యని శ్రుతి.

తాత్పర్యము.

ఎవ్వఁడు రాజులలో శ్రేష్ఠుఁడు, ఎవ్వఁడు ప్రతాపమున సూర్యుఁడు, ఆహ్లాదకరత్వము నందుఁ జంద్రుఁడు. ఎవ్వఁడు కుబేరునివలె లోక సమూహములందు ప్రభువు. అటువలెజగమునందుఁ గేవలకీర్తిగలవాఁడు. ఎవ్వఁడు విష్ణువువలెఁ బరాజయమెఱుఁగని శౌర్యముగలవాఁడు. ఎవఁడుసౌందర్యమునందు నాకారముగొన్న మన్మథుఁడు, ఎవఁడు సత్యభాషణమందుఁ బ్రీతి గలవాఁడునై ప్రకాశించును. రాముని దూతనైతి వేని రామచంద్రునిఁ గీర్తింపుమని సీతాదేవి చెప్పుటచే నా సందేహము పోవ నాయనను వర్ణించు చున్నాఁడు.

క. గురుఁడు మధురోక్తులను భీ,కరుఁడు విరోధులకు భువన♦గణ మెవ్వని శ్రీ

కరకరముల ఛాయను సు,స్థిరతఁ జీవించు నట్టి ♦ దేవుని రాముఁన్. ౮౧౨

అర్థములు. గురుఁడు = బృహస్పతి, శ్రీకర = సంపత్కరము లగు, కరముల = బాహువుల, ఛాయను = నీడను, ఎండ వడఁబడినవాఁడు చెట్లనీడను సుఖపడినట్లు సంసారతాపమున వేఁగువానికి నాయన హస్తముల నీడయే సంతోషము గలిగించును. అట్టి దేవుని = ఇచ్చట నట్టి యనుటచే ఎవ్వఁడు రాజులలో మేటియని యెవ్వడను పదము అన్ని విశేషణంబుల మొదట ననువర్తింపఁ జేయవలెను.

తాత్పర్యము.

తియ్యని మాటలం దెవ్వఁడు బృహస్పతియో, ఎవ్వఁడు శత్రువులకు భయంకరుఁడో లోకమంతయు నెవ్వని సంపత్కరములైన బాహువుల నీడను స్థిరముగ జీవించుచున్నదో యట్టిదేవుని రామచంద్రమూర్తిని.

క. మృగము నెపంబుగ దూరం,బుగఁ గొని చని యెవరు లేని♦పొలకువఁ గని నె

వ్వగఁబడ నిన్నుం దెచ్చిన, పగతుఁడు తత్ఫలముఁ గుడువఁ ♦ బరికింపు మికన్.

తాత్పర్యము.

లేడి నెపము పెట్టి దూరముగఁ గొనిపోయి నీయొద్ద నెవరులేని జాడ తెలిసికొని నీవు దుఃఖించుచుండఁగా దెచ్చిన నీ విరోధి వాఁడుచేసిన పాపమునకు ఫలము నిఁక ననుభవించును. చూచుచుండుము.

శా. జ్వాలభీలకరాళశాతఖగదు♦ర్వారప్రవాహంబునన్

బాలా! రావణు ముంచి త్రుంచు ననిఁ గో♦పస్ఫీతుఁడై పోరిలోఁ

గాలాగ్నిప్రతిమానుఁ జేమహితుఁ డా♦కాకుత్స్థవర్యుండు స

చ్ఛీలా! నీకడ కంచె దూతగ నన్ను ♦ సెంకింప నీ కేటికిన్. ౮౧౪

అర్థములు. జ్వాలాభీల = జ్వాలలచే భయంకరమైన, కరాళ = నిడివియైన, శాత = వాఁడియైన, ఖగ = బాణములనెడి, దుర్వార ప్రవాహంబునన్ = అడ్డగింప

రాని వెల్లువయందు, కోపస్ఫీతుఁడై=నిన్ను హరించెనను కోపముచే వృద్ధినొందినవాఁడై, కాలాగ్ని ప్రతిమానుఁడు=ప్రళయకాలమందలి అగ్నిహోత్రునకు సమానుఁడు, సచ్ఛీలా=మంచి పాతివ్రత్యము గలదానా! శంకించు-తద్భవము=సెంకించు; సంస్కృత శకారమునకు వికృతియందు 'స', వచ్చును. శల్యుఁడు = సెల్లుఁడు, శంఖము = సెంకు లోనైనవి.

### తాత్పర్యము.

పతివ్రతాశిరోరత్నమా! నా విషయమున వాస్తవరామదూత యగునో కాదో యని యేల సందేహించెదవు? తల్లీ! యే మహాపురుషుఁడు యుద్ధమునందుఁ బ్రళయకాలాగ్ని వంటివాఁడై మంటలచే భయంకరమై నిడుపాటివై పదునైన బాణముల ప్రవాహమునందు రావణుఁడు నిన్ను హరించెనను కోపముచే విజృంభించి వానిని ముంచి నఱకివైచునో యట్టి నీభర్తరామచంద్రమూర్తిపంపఁగా దూతనైవచ్చితిని. ఏల సందేహించెదవు? నేను రావణుఁడఁగాను. నేను మాయావేషము వేయలేదు.

సీ. నీ వియోగంబున ♦ నెవ్వగ రాముఁడు, నీసేమ మడిగె నో♦నీరజాస్య!
సౌమిత్రి సద్భక్తి ♦ సాష్టాంగ మెఱఁగి నీ, కుశలంబుఁ గోరెనో♦కోమలాంఘ్రి!
రామునిమిత్రుండు ♦ రాజు క్రోఁతుల కెల్ల, సుగ్రీవుఁ డడిగె నీ♦శుభముఁదల్లి!
సౌమిత్రి సుగ్రీవ♦సహితుఁడై రాముండు, సంస్మరించును నిన్ను ♦ సతము దేవి!
తే. రాక్షసులకును జిక్కియు♦రాజవదన! భాగ్యవశమున నిందాఁక♦బ్రతికి యున్న
దానవింకిటఁ బూర్ణంబ♦తరుణి కనెదు, రాములక్ష్మణువానర♦స్తోమవిభుని.

అర్థములు. నీరజాస్య = (౧) కమలమువంటి ముఖముకలదానా! (౨) చంద్రునివంటి ముఖముగలదానా! ఇట్లు పగటిపూఁటఁ గమలమువలెను, రాత్రులందు జంద్రునివలె ఆహ్లాదమును గలిగించు నీ ముఖ దర్శనము లభింపమని, కోమలాంఘ్రి = మృదువులగు పాదములను గలదానా! దేవి=శ్రీలక్ష్మి దేవి.

### తాత్పర్యము.

నిన్నెడఁబాయుటచేఁ గలిగిన యపార వ్యథచేత రామచంద్రమూర్తి హనుమంతా! రేయి పగలుకూడ నన్ను సంతోషింపఁజేయు సీతాదేవియొక్క కమల చంద్రులఁబోలు ముఖము చూచుటకుఁ బ్రాప్తిలేదు. నీవైన బోయి చూచి నా సేమ మామెకుఁజెప్పి యామె సేమము తెలిసికొని రమ్మని నాతోఁ జెప్పెను. ఆయన యాజ్ఞప్రకారము నేను బయలుదేఱి వచ్చునపుడు నీమృదుపదములనుదప్పనిన్నుఁ గన్నెత్తియైన జూడని లక్ష్మణుఁడు నిండారు భక్తితో నీపాదములకు సాష్టాంగముగ నమస్కరించి నీక్షేమము తెలియఁ గోరెను. తనకు బ్రాణదాత • భయత్రాత యగుటచే రామచంద్రమూర్తిని దండ్రివలెఁ జూచు సుగ్రీవుఁడు రామచంద్రమూర్తి మిత్రుఁడు వానరులకెల్ల రాజు నీవు తల్లి వను భావముతో నీక్షేమముఁ దెలియఁ గోరెను. రామచంద్రమూర్తి నాకై దుఃఖించుచున్నాఁడో, రాజ్యనష్టికై, బంధు

వియోగమునకై దుఃఖించుచున్నాఁడో నీవేమి యెఱుంగుదు వందువేమో నావాలికి నీవు శ్రీ మహాలక్ష్మివి. అట్టి నీతో నేను గల్లలాడుదునా? ఆయన రహస్యముగఁ దనలోఁదా నేడువలేదు. లక్ష్మణుఁడు సుగ్రీవుఁడు కూడనుండఁగ వారితోఁ జెప్పుకొని దుఃఖింపఁగా వారును నీకై దుఃఖించుచున్నారు. మాయందఱ భాగ్యము బాగుండుటచే నీవు మనుష్యులను భక్షించు రాక్షసుల చేతిలోఁ జిక్కియు వారిచే భక్షింపఁబడక నీవై చావక యింతదాఁక బ్రదికియున్నదానవు. నీవు మరణించి యుండిన మేమందఱము చచ్చినవారమే. ఇక జరుగఁబోవునది చెప్పెద వినుము.

నీవు రామచంద్రమూర్తిని, లక్ష్మణుని, సుగ్రీవుని త్వరగా నీ లంకయందుఁ జూడఁగలవు.

ఉ. మానిని! వానరుండ, హనుమంతుఁడఁ బేర, దినేశపుత్రుఁ డా
వానరరాజు మంతిరని ♦ వారిధి దాఁటితి, లంకఁ జొచ్చితిన్
మానవభోజి నెత్తిపయి ♦ నా పద ముంచి పరాక్రమంబునన్
గానఁగ వచ్చినాఁడ నినుఁ ♦ గంజదళాయతనేత్ర! నమ్ముమీ. ౮౧౬

తాత్పర్యము.

నేను మాఱువేషముతో వచ్చిన రావణుఁడనని కదా నీ సందేహము. అట్టి మాయలమారిని నేనుగాను. నీకెట్లు గానవచ్చుచున్నానో యట్టిదే నా నిజస్వరూపము. నేను గోఁతినే. నా పేరు హనుమంతుఁడు. సూర్యపుత్రుఁడు వానరరాజగు సుగ్రీవుని మంత్రిని. అధముఁడగాను. ఇట్టి నేను నీ నిమిత్తమై రాము నాజ్ఞాప్రకారము సముద్రము దాఁటితిని. లంకలోఁ బ్రవేశించితిని. రావణాసురుని తలమీఁద దొంగతనముగఁ గాదు, పరాక్రమముచేఁ గాలుంచితిని, ఇంతచేసి నిన్నుఁ జూడవచ్చినాఁడను. తల్లీ! నన్ను నమ్ముము.

క. ఎవ్వనిఁగా నను దలఁచితి, వవ్వాఁడను గాను సంది♦యంపడ నేలా?
నొవ్వక యభిభాషింపుము, మవ్వంబున ననిన సీత♦మారుతి కనియెన్. ౮౧౭

తాత్పర్యము.

నన్ను నీ వెవ్వఁడవని తలఁచితివో యా రావణుఁడను నేనుగాను. ఏలసందేహించెదవు? పరునితో నెట్లు భాషింపవచ్చునాయని నొచ్చుకొనక నీ దాసునితో నీ బిడ్డతో నీవు ప్రేమమున మాట్లాడునట్లు మాటలాడుము. అనిన సీతాదేవి యాంజనేయున కిట్లనియె.

పూర్వము హనుమంతుఁడు రామచంద్రమూర్తి భార్య సీతాదేవి యీమెయే యని యెట్లు పెక్కునిదర్శనములచే నిశ్చయించుకొనెనో యట్లు సీతాదేవి యిఁక హనుమంతుని బ్రత్యక్షముగఁ బరీక్షించుచున్నది. అట్టులే శిష్యుని గురువెట్లు పరీక్షించునో గురువును నట్లే శిష్యుఁడుగాఁ గోరువాఁడు పరీక్షింపవలెను. గాని తటాలున వీథిని బోవు వానిని వేషభాషణములఁ జూచి యాచార్యుఁడని నమ్మి

దగ్గఱఁ జేర్పరాదు. అందు ముఖ్యముగ స్త్రీలు వారితో మనసిచ్చి మాటలాడరాదు. సీతాదేవి హనుమంతు నేవిధముగఁ బరీక్షించుచున్నదో చూడుఁడు. రామచంద్రమూర్తి యొద్దకు మాఱువేషముతోఁ బోవసాహసించిన హనుమంతుఁడు సీతాదేవి యొద్ద కట్లు పోవుట నిప్పుతో నాడుకొనుట యని తలఁచెను. లేకుండిన మనుష్య వేషముతోనే పోయి సంగతులన్ని చెప్పి తరువాతఁ దనరూపము చూపి యుండ వచ్చును. అట్లిచ్చటఁ జేసెనేని వీఁడు మాయలమారి, నన్ను మోసగించెనని తలఁచి యుండును. కార్యము భంగమై యుండును.

—♦ ౩౫–వ సర్గము. సీతాదేవి హనుమంతుని శ్రీరామలక్ష్మణుల చిహ్నంబు లడుగుట ♦—

సీ. శ్రీరామచంద్రుతో ♦ స్నేహ మెట్లు లభించె, నీకు? లక్ష్మణు నెట్టు ♦ లెఱిఁగితీవు?
నరవానరుల కెట్లు ♦ పరఁగె సమాగమం? బెట్టిగుర్తులవార ♦ లిద్ద అన్న
దమ్ములు? వానిని ♦ దథ్యంబుగాఁ దెల్పి, నాదుఃఖ మడఁపు వా ♦ నరవరుండ!
యెట్టిది సంస్థాన? ♦ మెట్టిది రూపంబు, రామున కా సుమి ♦ త్రాజునకును
ఆ. నూరుబాహులెట్టి ♦ వా రీతి వినిపింపు, మంచు నిట్లు దన్ను ♦ నడుగుటయును
మారుతాత్మజుండు ♦ మైథిలతో రాఘువుల శుభాంకరములను ♦ బలుకఁ దొడఁగె.

అర్థములు. సమాగమము = కూడిక, సంస్థానము = ఆకారసన్నివేశము.

రావణాసురుఁడు మాఱువేషముతో వచ్చి యుండిన యెడల రావణునెత్తిపై నా పదముంచితిని, రావణుని రామచంద్రమూర్తి చంపును, అని యిట్టి మాటలు చెప్పియుండఁడు. కావున వీఁడు రావణుఁడు కాఁడు, మాటలాడ వచ్చునని నిశ్చయించుకొనెను గాని వీఁడు రామ దూత యనుట యేమి నిజము? అని యీసందేహము దీరఁ బ్రశ్నించుచున్నది. తాత్పర్యము.

శ్రీరామచంద్రమూర్తికి నీకు స్నేహ మెట్లు లభించెను? ఏవిధముగా నీవు లక్ష్మణు నెఱిఁగితివి?నరులను జూచిన క్రోఁతులు దూర దూరమునందే యుండును. వానరులను జూచిన మనుష్యులు బెదరించుచుందురు. ఇట్టిచోట మీరిరువురు నొక చోట నెట్లు చేరితిరి? ఆ యన్నదమ్ము లిరువురు నెట్టి గుర్తులవారు? నీవు నిజమైన వానరుఁడవైతివేని యున్న వాస్తవముఁ దెల్పి నాకు సంతోషముఁ గలిగింపుము. రామునకు నాయన తమ్ముఁడు లక్ష్మణునకుఁ దొడ లెట్టివి? బాహువు లెట్టివి? తెలుపుము అని తన్నడుగఁగా హనుమంతుఁడు రామచంద్రమూర్తి శుభకరములైన చిహ్నము లిట్లు చెప్పఁ దొడఁగెను.

సీతాదేవి ప్రశ్న విషమ ప్రశ్న. అందు రెండు భాగములు గలవు. బాహువులు బహిరంగము లెవ్వరైనఁ జూచియుండవచ్చును. తొడ లెట్టివని యడిగెను. అనఁగా మర్మాంగము లెట్టివని ప్రశ్న. ఇవి వస్త్రము మఱుఁగున నుండునవి. వీనిని

వీఁ డెట్లు తెలిసికొనెను. తెలిసికొనెఁ బో, స్త్రీయైన తనతో వాని నెట్లు చెప్పును. ఔచిత్యము నెఱుఁగునా యెఱుఁగఁడా? రాముని దూతయేయైన పక్షమందు నౌచిత్య మెఱుఁగక మాటలాడఁడు. అని సీతాదేవి తలఁచి యీ ప్రశ్న వేసెను.

దీనివలన నాచార్యుఁడు భగవత్తత్త్వము నామూలాగ్రము సరహస్యముగఁ దెలిసినవాఁడై యుండవలెను. దాని నెవరికెట్లు చెప్పవలయునో యదియుఁ దెలిసిన వాఁడై యుండవలయు నని భావము.

ఉ. భాగ్యముఁ గాదె దేవి! నను ♦ భావమునం దిటు విశ్వసించి నీ
వాగ్యమ ముజ్జగించి నిజ ♦ వల్లభు గుర్తులు లక్ష్మణాంకముల్
యోగ్యవిధంబుగాఁ బలుకు ♦ మున్నవిధంబుగ నంటి ప్రీతి సౌ
భాగ్యవతీ! వచింతు విను ♦ భ్రాతల మేని శుభాంకపద్ధతుల్. ౨౧౯

అర్థములు. భాగ్యముగాదె = నా యదృష్టముగదా. వాగ్యమము = నియమము, ఉజ్జగించి = వదలి.

తాత్పర్యము.

దేవీ! నాయదృష్టము కొలఁది నన్ను నీవిట్లు మనస్సున రావణుఁడు గాఁడని నమ్మి మౌనము చాలించి నీ భర్త గుర్తులు లక్ష్మణు చిహ్నములు యోగ్యమగురీతి వాస్తవముగఁ జెప్పుమంటివి. సౌభాగ్యవతీ! యీ యన్నదమ్ముల దేహము లందలి చిహ్నములు చెప్పెద వినుము.

సీ. రాముండు కమలప♦త్రవిశాలలోచనుం, డఖిలసత్త్వమనో♦హరగుణుండు
రూపదాక్షిణ్యని♦రూఢుఁడై జనియించెఁ, దేజంబునందు నా♦దిత్యుఁబోలు
నోరుపుగుణమున♦నుర్వికిఁ దుల్యుండు, బుద్ధి బృహస్పతి♦పురుడు చూపు
సద్యశంబున హరి♦సకలజీవావళీ, రక్షకుఁ డాత్మీయ♦రక్షకుండు
ఆ. స్వకులవృత్తి ధర్మ♦సంరక్షకుఁడు నాల్గు,జాతు లరయుచుండు♦రీతి చెడక
మనుజహితము లైన♦మర్యాదలం దుండి పరుల నట్ల చేయఁ♦బనుచుచుండు.

అర్థములు. కమల పత్ర విశాల లోచనుండు = తామర రేకులవలె వెడలుపగు కన్నులు గలవాఁడు, విరోధ భావముతోఁ జెప్పినను అనుకూల భావముతోఁ జెప్పినను రామచంద్రమూర్తిని జూచిన వారాయన కన్నులుతమకన్నుల యెదుటఁ గట్టినట్లుండుటచే వానినే ముందువర్ణింతురు. అవియెట్టివారి మనస్సునైన నాకర్షించి వారి మనస్సున దృఢముగ నాటుకొను నంతటి సౌందర్యము గలవి. కావున నేశూర్పణఖయు 'నిడుద బాహులవాఁడు వెడఁద కన్నులవాఁ' డని ప్రారంభించెను. రామచంద్రుని బాహువులఁజూపినపుడీ బాహువులచేఁ దన్ను నీయన కౌఁగిలించుకొనునా యని యాశపడెను. ఆభ్రమవదలినది కాదు. కావున ముందు చేతులుచెప్పి తన్ను మోహింపఁజేసిన కన్నులు రెండవదిగాఁ జెప్పెను. ఈకన్ను లెట్టివనిన మహాప్రవాహమందుఁ దామర పూలవంటివి. సుడిగుండముల వంటివి. ప్రవాహమెంత సుందర

ముగఁ బ్రాఁకు చుండినను వాని నడుమ కమలము లుండెనేని మనుష్యుల దృష్టి వాని మీఁదికే పోవును. వానికై వానిని సమీపించితి మేని యవితమలోకి సీడ్చుకొనును. అట్లు సౌందర్యరస ప్రవాహమున నీకన్నులు దూరమునుండి చూచువారిని సమీప మునకు నాకర్షించును. సమీపమునకు రాఁగానే వారిమనస్సులను దమయందే లగ్నము చేసికొనును. సహజసుందరుఁడు రాముఁడు, ఆయన యందీ కన్ను లభిరామ ములై యున్నవి.

అఖిలసత్త్వ=సమస్త జంతువులయొక్క, సుమనో=మంచి మనస్సులను, హర=హరించు, గుణుండు=కళ్యాణ గుణములు గలవాఁడు, ఈయన సౌందర్య మెవరి నాకర్షించును? కన్నులు గలవారి నందఱను గన్ను లాకర్షించునట్టి లీయ నయు సమస్త జంతువులను నాకర్షించును. ప్రత్యక్షముగా నుండినచోఁ దామరలు కన్నులకుఁ గానవచ్చును. దూరముననుండు వారికెట్లు గానవచ్చును. రామచంద్ర మూర్తి సుమనోహర గుణములు గలవాఁడు. కమలము లెందో యున్న తుమ్మెదల నెట్లాకర్షించును? దాని స్వభావగుణమైన సువాసనచేఁ గదా. అట్టులే రామచంద్ర మూర్తి తన గుణములచే దూరమున నుండువారికిని దనయందుఁ బ్రేమ పుట్టించి తనయొద్దకు నాకర్షించును. ఏల? ఆయన సుమనస్సులవలె (పూలవలె)సుమనస్సుల (దేవతల-పండితుల) సుమనస్సులను (మంచి మనస్సులను) హరించు గుణములు గల వాఁడు. సర్వసత్త్వములను హరించువాఁడంటివే. రావణాది రాక్షసుల మనస్సుల నేల హరింపలేదు? కమలము తుమ్మెదలు లోనగువాని నాకర్షించునే కాని కప్పలను తేళ్ళను బాములను నాకర్షించునా? అట్టులే రాక్షసులు సుమనస్సులు గారు. కావున వారి మనస్సులు హరింపలేదు. వారి యందు సుమనస్సులు (మంచిమనస్సు గలవారు) గా నుండు విభీషణాదుల మనస్సు నాకర్షింపలేదా? చెట్లయందు గుట్టల యందుఁ దిరుగు నడవిమృగమైన నామనస్సునే యాకర్షించినపుడు మనుష్యుల నేల యాకర్షింపకుండును?

రూపదాక్షిణ్య నిరూఢుఁడై జనియించె=ఓయి, కమలము పుట్టినపుడే తేనె, వాసన పుట్టలేదు. కొన్నిదశలు మాఱినపిమ్మట వచ్చినవి. రామచంద్రుని గుణము లట్టివా యందువేని తల్లీ! యట్టి యాగంతుకములు గావు. రూపముచే-దాక్షిణ్య ముచే, నిరూఢుఁడై = పరిపూర్ణముగ నిండినవాఁడై, జనియించెను = పుట్టెను. అనుటచే నాయన కల్యాణగుణము లాయన తోడనే పుట్టినవి. కాని నడుమ వచ్చి నవికావు. ఇది 'పూర్ణమదః పూర్ణమిద'మ్మను శ్రుత్యర్థమును బోధించుచున్నది. పరత్వదశయందు నే షాడ్గుణ్య పరిపూర్తి గలదో అవతార దశయందును నాయాఱు గుణములు గలవని భావము, ఇచ్చట భ.గీ. ౯-౧౧ ''అవజానంతి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్, పరంభావ మజానంతో మమ భూతమహేశ్వరమ్'' సర్వభూతములకు మహేశ్వరుఁడనైన నేను నా పరత్వ భావమును వదలక జనించితి.

నని తెలిసికొన లేక మూఢులగువారు మనుష్య దేహము వంటి దేహమును (మనుష్య స్త్రీ దేహమును) ఆశ్రయించిన నన్నుఁ దెలిసికొన లేరు. అను శ్లోకము ననుసంధించునది. ఆ గుణము లేవి యందువా? రూపము=సౌందర్యము. ఇది దేహ గుణముల కన్నిటికి నుపలక్షణము. దాక్షిణ్యము. ఇది యాత్మ గుణముల కన్నిటికి నుపలక్షణము. ఈప్రకారము సమష్టిమీఁద సౌందర్యము, గుణముల గుఱించి చెప్పియిఁక వానిని వేఱు వేఱుగ వివరించి చెప్పుచున్నాఁడు. ఆదిత్యుఁ=సూర్యుని, ఉర్వికి=భూమిని, పురుడు=సమానము, సత్+యశంబునను=మంచికీర్తియందు, హరి=ఇంద్రుఁడు, ఆత్మీయ=తన వారిని, మనుజహితములైన మర్యాదలు=ఈమర్యాదలు (కట్టు పాట్లు) మనుష్యులకు హితములైనవే కాని వానివలనఁ దనకేమి మేలు లేదని భావము. మనుష్యులను హితమర్యాదలందుఁ బ్రవర్తింపఁ జేయుటకై లోక సంగ్రహార్థము తాను జేయుచున్నాఁడు. కాని యవిచేసిన నాయనకు రాఁగల లాభము లేదు. చేయకుండినఁ బ్రత్యవాయము లేదు. ''న మే పార్థాస్తి కర్తవ్యం, త్రిషు లోకేషు కించన, నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవహి కర్మణి'' భ.గీ.౩.౨౨.

తాత్పర్యము

రామచంద్రమూర్తి తామర ఱేకులవలె విశాలములైన కన్నులు గలవాఁడు. సమస్తజంతువుల మనస్సును హరించు గుణములు గలవాఁడు. సౌందర్యదాక్షిణ్యములతోఁ బూర్ణుఁడై జనించెను. తేజస్సునందు సూర్యునకు ఓరుపునందు భూమికి బుద్ధియందు బృహస్పతికి సమానుఁడు. మంచికీర్తియందు నింద్రునివంటివాఁడు. సకల జీవకోటుల రక్షించువాఁడు. అందు విశేషముగాఁ దన యాశ్రితులను రక్షించివాఁడు, తన కులవృత్తిధర్మముల రక్షించువాఁడు, తన యనఁగా తనది మాత్రమే కాక లోకమున వారివారి కులవృత్తులను కులధర్మములను రక్షించువాఁడు, వారి వారి పద్ధతుల చెడకుండునట్లు నాలుగు వర్ణములవారిని రక్షించును. మనుష్యుల కేవి హితములో యా మర్యాదలను ముందుఁ దా ననుష్ఠించి మార్గముఁజూపి తరువాత లోకులను మీరిట్టులే చేయుఁడని చెప్పుచుండును. రామచంద్రునం దుపదేశ పాండిత్యమే కాక యనుష్ఠానసామర్థ్యము చెప్పఁబడెను.

ఉ. కాంతి రహించుఁ, బూజితుఁడు ♦ కంజదళాక్షిరో! బ్రహ్మచర్య మ
త్యంతముఁ బూను, సాధులకుఁ ♦ దప్పనిప్రాపు, సమస్తసద్వ్యధుల్
సాంతముగా నెఱుంగు, సము ♦ పాసితవిప్రుఁడు, రాజవిద్యలం
దెంతయు మేటి, శీలధనుఁ ♦ డెల్లరపట్ల వినీతుఁ డంగనా! ౮౨౧

అర్థములు. కాంతిరహించుఁ = కాంతిచేఁ బ్రకాశించును. నావిషయమై శోకించుచున్నాఁడంటివే. అట్టివానియందుఁ గాంతి యుండునా? యందువేమో. గ్రహణము సూర్యకాంతిని రూపుమాప లేనట్టు లాపదలెన్ని వచ్చినను మహాత్ముల సహజకాంతి పోదు. పూజితుఁడు = సాధువులచే నర్చింపఁబడువాఁడు. బ్రహ్మ

చర్యమత్యంతముఁ బూనుర్ = బ్రహ్మచర్యము రెండువిధములు. గృహస్థుఁడు ఋతుకాలమందు మాత్రము తన భార్యతో సంగమించి తక్కిన దినములందు స్త్రీసాంగత్యము మానువాఁడు.

"ఋతు స్స్వాభావిక స్త్రీణాం, రాత్రయ షోడశః స్మృతాః
చతుర్భి రితరైస్సార్థ మహోభి స్సద్విగర్హితైః
తాసా మాద్యా శ్చతస్రస్తు నింద్యైకాదశీచ యా
త్రయోదశీచ శేషాస్తు ప్రశస్తా దశరాత్రయః.

స్త్రీకి రజోదర్శనమైనది మొదలు పదునాఱుదినములు ఋతుకాల మనఁబడును. వానిలో మొదటి నాలుగురాత్రులు నిషిద్ధములు. పదునొకండవ రాత్రి పదుమూఁడవ రాత్రియుఁ బనికిరావు. తక్కిన పదిదినములందు ఏకాదశీ అమావాస్య పున్నమ పితృదినములు వదలవలయును. తక్కినదినములు ప్రశస్తములు. ఋతుకాలమందు భార్యాభర్త లారోగ్యవంతులై యుండి దానిని వ్యర్థము చేసిరేని భ్రూణహత్యాదోషము వచ్చును. ఇది ముగ్గురుకొడుకులు గలుగువరకే కాని యావల నీ నియమములేదు. ఆవల భార్యను జెల్లెలివలెఁ జూడవలయును. పరస్త్రీలను దల్లులవలెఁ జూడవలెను.

'యుగ్మాసు పుత్రా జాయంతే, స్త్రియో యుగ్మాసు రాత్రిషు
పుమాన్ పుంసోధికే శుక్లే స్త్రీ భవత్యధికే స్త్రియాః
సమే పుమాన్ పుంస్త్రియావా క్షీణేల్పేచ విపర్యయః
యది సంయోగకాలేతు పురుషో రాగమోహితః
ద్విధా సముత్సృజే చ్ఛుక్లం యమకం తత్ర జాయతే॥

సరిదినములయందుఁ గూడిన పుత్రులును, బేసిదినములయందుఁ బుత్రికలును గలుగుదురు. పురుషుని వీర్యము అధికమైన పుత్రుఁడును స్త్రీయార్తవ మధికమైన స్త్రీయును రెండును సమత్వమును జెందిన నపుంసకుఁడు గాని స్త్రీ పురుషులు గాని గలుగుదురు. సంభోగకాలమునఁ బురుషుఁడు రాగమోహితుఁడై శుక్రమును రెండు విధములుగ విడిచినఁ గవలు పుట్టుదురు.

శ్లో॥ రాత్రౌ చతుర్థ్యాం పుత్రస్స్యా దల్పాయు ర్ధనవర్జితః
పంచమ్యాం పుత్రిణీ నారీ షష్ఠ్యాం పుత్రస్తు మధ్యమః
సప్తమ్యా మప్రజా యోషి దష్టమ్యా మీశ్వర స్సుతః
నవమ్యాం సుభగా సాధ్వీ దశమ్యాం చ వరః పుమాన్
ఏకాదశ్యా మధర్మ్యా స్త్రీ ద్వాదశ్యాం పురుషోత్తమః
త్రయోదశ్యాం సుతా లోకవర్ణ సంకర కారిణీ
ధర్మవిచ్చ కృతజ్ఞస్స్యా దాత్మవేదీ దృఢవ్రతః
ప్రజాయతే చతుర్దశ్యాం గుణాఢ్యై ర్జగతీపతిః

రాజపత్నీ మహీభోగా రాజవంశగ తాథవా
జాయతే పంచదశ్యాంతు బహుపుత్రా పతివ్రతా
విద్యాలక్షణ సంపన్న స్సత్యవాదీ జితేంద్రియః
ఆశ్రియ స్సర్వ భూతానాం జాయతే షోడశే పుమాన్॥

తాత్పర్యము.

నాలవ దినము రాత్రి పురుషునిఁ జేరిన యెడల అల్పాయువు ధన హీనుఁడు నగు పుత్రుఁడును, ౫వ దినము రాత్రి పుత్రవతియగు కూఁతురును, ఆఱవ దినము రాత్రియందు మధ్యముఁడగు పుత్రుఁడును, ఏడవ దినము రాత్రి సంతానహీనురాలగు పుత్రికయు, ఎనిమిదవ దినమున ప్రభువగు పుత్రుఁడును, తొమ్మిదవదినమున పతివ్రతయగు పుత్రికయు, పదియవ దినమున శ్రేష్ఠుఁడగు పుత్రుఁడును, పదునొకండవ దినమున అధర్మురాలగు పుత్రికయు, పంద్రెండవ దినమున పురుషోత్తముఁడగు పుత్రుఁడును పదుమూఁడవ దినమున వర్ణసంకరురాలగు పుత్రికయు, పదునాలవ దినమున ధర్మవేత్తయు, కృతజ్ఞుఁడును, ఆత్మవేదియు, దృఢవ్రతుఁడును, సుగుణములు గలవాఁడును భూభర్తయు నగు కొమరుఁడును గలుగుదురు. పదునేనవ దినమున రాజపత్నియు పతివ్రతయు రాజవంశమును పొందునదియు శ్రేష్ఠురాలును పుత్రులు గలదియు నగు పుత్రికయు, పదియాఱవదినంబున విద్యాలక్షణ సంపన్నుండును సత్యవాదియు జితేంద్రియుఁడును సర్వభూతాశ్రయుఁడునగు పుత్రుఁడు గలుగును.

ఇట్లు ఋతుకాలమందు మాత్రము స్వభార్యతో సంగమించుట యొకవిధమైన బ్రహ్మచర్యము. రెండవది స్త్రీసంభోగమునే మానుట.

'ప్రేమాభిలాషో రాగశ్చ, స్నేహః ప్రేమరతి స్తథా
శృంగారశ్చేతి సంభోగ స్సప్తావస్థః ప్రకీర్తితః.

ప్రేమ – అభిలాష – రాగము – స్నేహము – ప్రేమము – రతి – శృంగారము అని సంభోగ యేడు విధములు.

'ప్రేమా దిదృక్షా రమ్యేషు, తచ్చింతా త్వభిలాషకః
రాగ స్తత్సంగబుద్ధిస్స్యాత్. స్నేహ స్తత్ప్రవణా క్రియా
తద్వియోగాసహం ప్రేమ, రతి స్తత్సహవర్తనం
శృంగారస్తత్సమం క్రీడా, సంభోగ స్సప్తధా మతః.

అందగత్తెలఁ జూడవలయునను కోరిక ప్రేమ యనఁబడును. ఆ విషయమైన చింత యభిలాష. అట్టివారితో సంగమింపవలయునను బుద్ధి రాగము. దానియందే మనస్సుంచుట స్నేహము. అట్టివారిని విడిచి యుండలేకుండుట ప్రేమ. వారితోఁడ గలసి మెలసి తిరుగుట రతి. వారితోఁడ క్రీడించుట శృంగారము. ఈయేడును సంభోగ మనఁబడును. స్త్రీలతో నొంటిపాటున మాటలాడుటగాని, వారిచేఁ దల దువ్వించుకొనుటగాని, తలంటించుకొనుటగాని, వారిని స్పృశించుటగాని, వారుతలదువ్వుకొను

నపుడు పరుండినపుడు స్నానముచేయునపుడు చూచుటగాని యిట్టివి నిషిద్ధములు. వయస్సు స్త్రీలను పీనుఁగులవలె నైనఁ జూడవలె, లేదా వారి యొద్ద ౫-౬ ఏండ్ల బాలునివలెనుండవలె. ఇట్టిది రెండవ బ్రహ్మచర్యవిధము. ఇట్టి బ్రహ్మచర్యవ్రతము రామచంద్రమూర్తి యందు విశేషించి గలదు. సమస్త సద్విధుల్ = అన్ని వైదిక కర్మవిధానములు, సముపాసిత విప్రుఁడు = బ్రాహ్మణుల సేవించినవాఁడు, రాజవిద్య లందుర్ = ఆన్వీక్షికి - త్రయీ - వార్త - దండనీతి యను నాలుగు రాజవిద్యలు.

'అన్వీక్షకీ త్రయీ వార్తా దండనీతిశ్చ శాశ్వతీ
ఏతావిద్యా శ్చతస్రస్తు లోకసంస్థితిహేతవః॥ అని ప్రమాణము.

ఆన్వీక్షకి = తర్కవిద్య, త్రయి = మూఁడు వేదములు, వార్త = వాణిజ్యాదికము, దండము = దోషుల దండించుట. లోకస్థితి యీ నాలుగింటిపై నాధారపడి యున్నది. శీలధనుఁడు = సదాచార పరాయణుఁడు.

తాత్పర్యము.

కాంతిగలవాఁడు, సాధుపూజితుఁడు, తీవ్రమైన బ్రహ్మచర్యనిష్ఠగలవాఁడు, సాధువులకు నాయన తప్ప వేఱు ప్రాపు లేదు. సమస్త వైదిక కర్మవిధానము తుదముట్టఁ బూర్ణముగ నెఱుఁగును. బ్రాహ్మణోపాస్తి గలవాఁడు, రాజవిద్యలందు మిగుల సమర్థుఁడు. సదాచారసంపత్తి గలవాఁడు. అందఱ విషయమున నీతితోఁ గూడిన ప్రవర్తనము గలవాఁడు.

తే. వేదవేదాంగముల యజు ♦ ర్వేదమునను, విల్లువిద్యనునిపుణుండు ♦ విపులము లగు
నంసములఁ వాఁడు దీర్ఘబా ♦ హావిరాజి, యబ్జకంఠుఁడు ముఖము రా ♦ కాబ్జసఖము.

తాత్పర్యము.

ఋగ్వేదము సామవేదము అధర్వణము లను వేదములను, వేదాంగము లగు శిక్ష వ్యాకరణము ఛందస్సు నిరుక్తము జ్యోతిషము కల్పము ననువానిని, యజుర్వేదమును, ధనుర్వేదమునందును, నిపుణుఁడు. ఇంతవఱకు నాత్మగుణములు. ఇఁక దేహములు చెప్పెద వినుము. వెడల్పుగల మూఁపులు గలవాఁడు, నిడుపులగు బాహువులచే ప్రకాశించువాఁడు, శంఖమువంటి కంఠముగలవాఁడు. ముఖము పూర్ణచంద్రునితో సమానము. ఇందు యజుర్వేదమును ప్రత్యేకించి చెప్పుటచే రామచంద్రమూర్తి యజుశ్శాఖి యని తెలియ నగు.

ఆ. తామ్రలోచనుండు ♦ తతగూఢజత్రుండు, దుందుభిస్వనుండు ♦ తోయజాక్షి
బల్లిదుండు స్నిగ్ధ ♦ వర్ణుండు చామన, చాయవాఁడు సింహ ♦ సంహననుఁడు. ౧౭

అర్థములు. తామ్రలోచనుండు = ఎఱ్ఱ కమలమువంటి కన్నులుగలవాఁడు, తతగూఢజత్రుండు = మూఁపులు బలిసియుండుటచే వెలుపలికిఁ దెలియరాని మూఁపుల సంధి యెముక గలవాఁడు, దుందుభిస్వనుండు = భేరివంటి కంఠధ్వని గలవాఁడు, బల్లిదుండు = మిగుల బలిష్ఠుఁడు, బల్లిదాదులు సంస్కృత తుల్యములు గావున బల్లిదము

బల్లిదుఁడు బల్లిద యని రూపంబులు. ఇవి విశేష్యనిఘ్నములు, స్నిగ్ధవర్ణుండు= మిన మిన మను దేహకాంతి గలవాఁడు,—చామనచాయవాఁడు చామనము+చాయ= వృత్తియందు ప్రత్యయలోపము. బొగ్గువలె నలుపుగాక తెలుపుగాక మేఘవర్ణము వంటి చాయ గలవాఁడు. సింహసంహననుఁడు=సౌందర్యముతోఁగూడిసౌష్ఠవమైన ప్రత్యవయవము గలవాఁడు. 'వరాంగరూపోపేతో యస్సింహసంహననో హి సః॥ అమరకోశము. ఏయే యవయవ మెంత పరిమాణముండవలయునో యంతే పరిమాణముగల యవయవములు గలవాఁడు.

తా త్ప ర్య ము .

ఎఱ్ఱని కన్నులు, దాఁగిన మూఁపుసంధి యెముకలు, భేరివంటి గంభీరధ్వని గలవాఁడు, బలిష్ఠుఁడు, మినమిన మెఱయు దేహకాంతి గలవాఁడు, మేఘవర్ణమువంటి దేహవర్ణము గలవాఁడు, అవయవ సౌష్ఠవము గలవాఁడు.

సీ. సమవిభక్తాంగుండు ♦ సముఁడు త్రితామ్రుండు. త్రిప్రలంబుండును♦ త్రిస్థిరుండు
ముచ్చోట్ల నున్నతి ♦ ముచ్చోట్ల స్నిగ్ధత, ముచ్చోట్ల గాంభీర్య♦మునుగలండు
త్రివళివంతుండును♦ త్రినముండుత్ర్యవనత, త్రిశిరస్కుఁడమ్మ! నీ♦హృదయవిభుఁడు
నాలుగు వ్యంగ్యముల్ ♦ నాలుగు కలలును, నాలుగు రేఖ లం♦దంబు మీఱు

ఆ. జెలి! చతుస్సముండు♦ బలి చతుష్కిష్కుఁడో, యమ్మ మహితనాసి♦ కౌష్ఠహనువు
లమరువాఁడు జంట♦లగు పదునాలుగు, సమముగాఁ గలండు ♦ జనకతనయ.

అర్థములు. సముఁడు =ఎచ్చుతక్కువలు లేని శరీరము కొలఁత గలవాఁడు, సమవిభక్త+అంగుఁడు = ఒక్కొక్కయంగమును దగినంత కొలఁతతోఁ గలవాఁడు. త్రితామ్రుండు=కన్నుల కొలుకులందును, గోళ్ళయందును, అరచేయియరకాలియందును నెఱ్ఱని రంగుకలవాఁడు. 'నేత్రాంత నఖ పాణ్యంఘ్రితలై స్తామ్రై స్త్రిభిస్సుఖీ' యను వచనము ప్రమాణము. శ్లిష్టాంగుళీ రుచిర తామ్రనఖౌ సుపార్ష్ణి పాదా కరావపి సురక్తనఖాంత్మరేఖా'యనియు నిందుఁ బ్రమాణవచనము. త్రిప్రలంబుండు = రామునికిఁ గనుబొమలు బాహువులు వృషణములును దీర్ఘములైనని. 'దీర్ఘభ్రూ బాహుముష్కస్సు చిరజీవీ ధనీ నర' యని ప్రమాణ వచనము. త్రిస్థిరుండు = మూఁడుచోటులందు స్థిరమైనవాఁడు, స్థిరమైనరొమ్ము, స్థిరమైన మనికట్టు, స్థిరమైన పిడికిలి కలవాఁడు. 'ఉరశ్చ మణిబంధశ్చ ముష్టిశ్చ నృపతేస్థిరా' యనిసాముద్రిక వచనము. ముచ్చోట్లఁ = ఱొమ్ము, కడుపు, నాభి యంతర్భాగము అను నీ మూఁడు చోట్లయందు, ఉన్నతి = మిట్టగానుండుట కలవాఁడని యన్వయము. 'నాభ్యంతః కుక్షి వక్షోభి రున్నతః క్షితిపో భవే' త్తని ప్రమాణవచనము. "ఉన్నతకుక్షిః క్షితిపః పరిమండలోన్నత నాభీ యః క్షితిపః। హృదయం న లేపనం పృథు సమోన్నతం మాంసలంచ నృపతీనా" మ్మనియు వరాహమిహిరవచనము. ముచ్చోటఁ = పాదరేఖలు, తలవెండ్రుకలు, లింగమణి యను నీమూఁడు చోట్ల

యందు, స్నిగ్ధత = నునుపు, కలఁడు = కలవాఁడు, "స్నిగ్ధా భవంతి వై యేషాం పాదరేఖా శ్శిరోరుహాః తథా లింగమణి స్తేషాం మహాభాగ్యం వినిర్దిశేత్" అని సాముద్రిక ప్రమాణవచనము. ముచ్చోట్లన్ = స్వరము సత్త్వము నాభి యను మూఁడు చోట్లయందు, గాంభీర్యము గలండు = గంభీర స్వరము, లోఁతైన నాభి, గొప్ప సత్త్వము కలవాఁడు. "స్వరే సత్త్వే నాభౌచ గంభీర స్త్రిషు శస్యతే" యని బ్రహ్మపురాణము.

త్రివళినంతుఁడు=బొజ్జపైని మూఁడు మడఁతలుగలవాఁడు. (౨) మెడపైన మూఁడు మడఁతలు గలవాఁడు. "స్థిరా త్రిరేఖ్యా సుభగోపపన్నా స్నిగ్ధా సుమాంసోపచితా సువృత్తా. నచాతిదీర్ఘా చతురంగుళాచ గ్రీవా సుదీర్ఘా భవతీహ ధన్యా" యని ప్రమాణవచనము. త్రిసముండు=వెంట్రుకల కొనలు, మోకాళ్లు, వృషణములు అని మూఁడును ఎచ్చు తక్కువలులేక సమానమయినవిగాఁ గలవాఁడు. "కేశాగ్రం వృషణం జానుసమాయస్య స భూమిపః" అని వచనము. త్ర్యవనతుఁడు= రొమ్మునందు స్తనభాగము, దానికొనభాగము, కాలు సేతులయందు రేఖలు అనునీ మూఁడును లోఁతుగా నున్నవి రామునకని యర్థము. "పీనోపచితైర్నిమ్నైః క్షితిపతయ శ్చూచుకై స్తనై స్సుఖినః స్నిగ్ధా నిమ్నా రేఖా ధనినాం తద్వ్యత్యయేన నిస్వానా" మ్మని వరాహమిహిరవాక్యము. త్రిశిరస్కుఁడు=మూఁడు సుడులు గల తలలుగలవాఁడు. "ఆవర్తత్రయరుచిరం యస్య శిర స్స క్షితిభృతాం నేతా" యని ప్రమాణము. మూఁడు తీరులుగల శిరస్సు గలవాఁడు. సమమై గుండ్రమై యుండుట, ఛత్రాకారమై యుండుట, విశాలమైయుండుట యనునవి మూఁడుతీరులు "సమవృత్త శిరాశ్చైవ ఛత్రాకారశిరా స్తథా। ఏకచ్ఛత్రాం మహీం భుంక్తే దీర్ఘమాయుశ్చ విందతి" యని నారద వాక్యము. నాలుగు వ్యంగ్యముల్=పొట్టివియైన నాలు గవయవములు. మెడ ప్రజననము వీఁపు మోఁకాళ్లు. ఇవి పొట్టివైన నాల్గవయవములు, నాలుగవయవములు కొన్నిలోపములు గలవి. పాదములందు నరకము కనఁబడదు. ఒక రోమకూపమందు రెండు రోమములు మొలవవు. మగగుఱి పొడుగుగాక యుండును. వస్తి మాంసశూన్యము. ఇవియే లోపములు. "పాదైః ప్రస్వేదరహితైస్సిరాహీనశ్చ పార్థివః। ఏకరోమా భవేద్రాజా ద్విరోమా పండితో భవేత్। త్రిరోమా చతురోమాచ భవేద్భాగ్యవివర్జితః। సమపాదోపవిష్టస్య గుల్ఫం స్పృశతి మేహనం। యస్యేశ్వరం తం జానీయా త్సుఖినం చైవ మానవం। నిర్మాంస స్సంహతో వస్తిర్యేషాం తే సుఖభాగినః" అని నారద వచనము. నాలుగు కలలును = నాలుగు వేదములును. శరీరలక్షణము చెప్పునప్పుడు వేదములను జెప్పుట తత్సూచకములైన రేఖలను దెల్పుటకై యని తెలియునది. "మూలేంగుష్ఠస్య వేదానాం చతస్ర స్తిస్ర ఏవహి। ఏకా ద్వేవా యథాయోగం రేఖాజ్ఞేయా ద్విజన్మనా" మ్మని నందివచనము. నాలుగు రేఖలు – నొసలియందును, అఱచేతులయందును,

నఱకాళ్ళ యెందును నున్న నాలుగు రేఖలు. "లలాటే యస్య దృశ్యన్తే చతుస్త్రిద్వ్యేకరేఖికాః। శతద్వయం శతం షష్టి స్తస్యాయ ర్వింశతి స్తథా" యని కాత్యాయన వచనము. "యస్యపాదతలే వజ్రధ్వజ శంకాంకుశోపమాః। రేఖాస్సమ్యక్ప్రకాశంతే|మనుజేంద్రం తమాదిశే" త్తని నారదవచనము "పాణౌచతస్రో రేఖాశ్చయస్య తిష్ఠం త్యభంగురా" యని బ్రహ్మవచనమునిట స్మరించునది. చతుస్సముఁడు=భుజములు మోఁకాళ్లు, తొడలు, చెక్కిళ్లు అనునవి ఎచ్చు తక్కువలు లేనివాఁడు. (సమానముగాఁ గలవాఁడు.) చెక్కిళ్లకు మాఱుగాఁ బిక్కలనికొందఱందురు. "బాహు జానూరు గండాశ్చ చత్వార్యది సమానిచ" యనిబ్రహ్మాండ పురాణము. "గండాశ్చ" యన్నచో "జంఘాశ్చ" యనియు పాఠాంతరము. చతుః+కిష్కుఁడు=నాలుగుకిష్కులకొలఁతగలవాఁడు, కిష్కు=ఇరువదినాలుగంగుళములు. తొంబదియాఱంగుళముల యెత్తుగలవాఁడనిభావము. మహిత.........హనువులు. మహిత = కొనియాడఁబడిన, నాసిక = ముక్కు, ఓష్ఠ = పెదవి, హనువులు= దవడలు, పెదవులు దొండపండువలె నెఱ్ఱనై బలిసియున్నవి. ముక్కు ఎత్తై పొడుగుగా నున్నది. దవడ లంటుకొనిపోక బలిసియున్నవని భావము. జంట యిత్యాది= జంటగానున్న పదునాలుగవయవములు హెచ్చుతక్కువలులేక యున్నవి. "భ్రువౌ నాసాపుటే నేత్రే కర్ణౌ ఓష్ఠౌచ చూచుకే కూర్పరౌ మణిబంధౌచ జానునీ వృషణౌ కటీ। కరౌ పాదౌ స్ఫిజౌ యస్య సమాజ్ఞేయ స్స భూపతిః" అనిబ్రహ్మాండ పురాణము. "కర్ణాక్షి భ్రూగండ నాసా దంతోష్ఠ స్కంద జత్రుణీ। పాదౌ కరౌ స్తనావూరూస్ఫిచౌ ద్వంద్వాశ్చతుర్దశ సమాశ్చయస్య విద్యంతే క్రమేణోపచితాస్తథా" యని బ్రహ్మాండ పురాణ వాక్యము.

## తాత్పర్యము.

ఏయవయవ మెంతయుండిన నందమో యంతమాత్రమే వేర్వేఱుగాఁ దెలియునట్లు గలవాఁడు. ఎచ్చు తక్కువలు లేని శరీరము కొలఁత గలవాఁడు. ఎఱ్ఱని కనుఁగొనలు, గోళ్లు అరచేతులు అరకాళ్లు గలవాఁడు. కనుబొమ్మలు, వృషణములు, బాహువులు పొడుగుగాఁ గలవాఁడు. ఱొమ్ము మణికట్టు పిడికిలిస్థిరముగాఁగలవాఁడు. పొత్తికడుపు, బొడ్డు, ఱొమ్ము ఎత్తుగాఁ గలవాఁడు. పాదరేఖలు తలవెంట్రుకలు లింగము నునుపైయుండువాఁడు. గంభీరమైన కంఠధ్వని, నడక లోఁతైనబొడ్డుగలవాఁడు. కంఠమున మూఁడురేఖలు గలవాఁడు. తలవెంట్రుకలకొనలు, వృషణములు మోఁకాళ్లు సమముగాఁగలవాఁడు. చనుమొనలు స్తనములు రేఖలు పల్లముగాఁ గలవాఁడు. మూఁడు సుళ్లు గల తలగలవాఁడు. కంఠము, లింగము, పిఱుఁదులు, పిక్కలుఇవిహ్రస్వములుగాఁగలవాఁడు. సమమైగుండ్రమై విశాలముగానుండుశిరస్సు గలవాఁడు. బొటనవ్రేలిక్రింద వేదములసూచించు నాలుగు గీఁతలుగలవాఁడు. నొసట నాలుగు రేఖలును, అఱకాలియందును, అఱచేతియందు, ధ్వజమువజ్రముఅంకుశము

శంఖమువంటినాలుగు రేఖలుకలవాఁడు. బాహువులు మోఁకాళ్ళు, పిక్కలు, తొడలు, సమముగాఁ గలవాఁడు. బలశాలి. నాలుగు హస్తములనఁగాఁ దొంబది యాఱంగుళముల యెత్తుగలవాఁడు. మంకెనపువ్వు దొండపండు వంటి పెదవియు, బలిసియున్న చెక్కిళ్ళు, నిడుపైనిక్కపొడిచిన ముక్కుగలవాఁడు. కనుబొమలు, ముక్కుపుటములు, కన్నులు, వీనులు, పెదవులు, చనుముక్కులు, మోఁచేతులు, మణికట్లు మోఁకాళ్ళు, వృషణములు, కటిప్రదేశములు, చేతులు, కాళ్ళు, పిఱుఁదులుసమానములుగ నుండువాఁడు. ఇట్టిమగవారు లోకమందున్నారా యందువేమో. వీనికిఁ దగిన చిహ్నములు గల స్త్రీవి నీవొకతెవే యెట్లున్నావో, లోకమున నీకుఁదగినట్టి యిట్టి చిహ్నములు గలవాఁ డాయన యొక్కడే యున్నాఁడు.

ఉ. నాలుగుప్రక్కదంష్ట్రలును ♦ నాల్గిటియానముఁ గల్గు, నాలుగుల్
నాలుగు వంశముల్ గలఁడు ♦ నాలుగు నొక్కటి స్నిగ్ధ, మాఱునుల్
నాలుగు పద్మముల్, మఱియు ♦ నాలుగు నాఱును గొప్ప నొప్పెడుల్
నాలుగు రెండు మిట్టలును ♦ నాలుగు నైదును సన్నవైతగుల్. ౧౭-౨౫

అర్థములు. నాలుగుప్రక్క దంష్ట్రలు = పైపండ్లవరుస యందు రెండు ప్రక్కలును, దిగువ పండ్లవరుసయందు రెండు ప్రక్కలును జేరి నాలుగు ప్రక్కలు. అం దొక్కొక్క ప్రక్కయందును నాలుగేసి కోరలవంటి పండ్లు కల్గు నని యన్వయము. (౨) ఈ రెండువరుసలలోను నడుమనుండు నాలుగు పండ్లకు రెండుప్రక్కల యందును నొక్కొక్క పల్లుకలదు. దానికి దంష్ట్రయని పేరు. అవి నాలుగుప్రక్కలందును నాలుగున్న వని యర్థము. 'స్నిగ్ధాఘనాశ్చ దశనా సుతీక్ష్ణదంష్ట్రాస్సమాశ్చ శుభా' యని వరాహమిహిరవచనము.

''బంధుజీవ కుసుమోపమోఽధరో। మాంసలో రుచిరబింబ రూపధృత్। పూర్ణమాంసళహనుస్తు భూమిపస్తుంగతుండ రుచిరాకృతిస్తథా'' యని సంహితా వచనము. నాల్గిట యానముఁగల్గున్=సింహశార్దూలగజ వృషభములవంటినడకగల వాఁడు. ''గజసింహ గతీ వీరౌ శార్దూలవృషభోపమౌ'' యని బాలకాండవాక్యము. నాలుగుల్ నాలుగు=ఎనిమిది, వంశముల్ = నిడుపైన యవయవములు కలవాఁడు. వెన్నెముక, శరీరము, వ్రేళ్ళు, చేతులు, ముక్కు, కన్నులు, చెవులు, మగగుఱి యివి యెనిమిది యవయవములు. మగగుఱి వంకర కాకుండుట పొడుగనఁబడును. 'పృష్ఠ వంశశ్శరీరంచ హస్తపాదాంగులీ కరౌ, నాసికా చక్షుషీ కర్ణౌ ప్రజనో యస్య చాయతా'' యని సాముద్రిక వచనము. (౨) రెండుచేతులు, రెండుచేతుల వ్రేళ్లు, రెండు తొడలు రెండు పిక్కలు చేరి యెనిమిది యవయవము లని కొందఱు. 'బాహూచ నలకౌ చోరూ జంఘే చే త్యష్టవంశకా' యని వచనము. నాలుగు నొక్కటి=అయిదు అవయవములు. అవి వాక్కు, వక్త్రి, నఖములు, రోమములు, త్వక్కు అని కొందఱు. వెంట్రుకలు- కన్నులు- దంతములు- అడుగులు-

త్వక్కు అని మఱి కొందఱు. స్నిగ్ధములు = నునుపైనవి. 'చక్షు స్స్నేహేన సౌభాగ్యం, దంతస్నేహేన భోజనం, త్వచస్స్నేహేన శయనం పాదస్నేహేన వాహన'మ్మని వరరుచి వాక్యము. 'స్నిగ్ధనీల మృదుకుంచితా స్తథా మూర్ధజా స్సుఖకరా స్సమం శిర' యని మిహిర వాక్యము. ఆఱునుర్కా నాలుగు = పదియవయవములు, పద్మముల్ = పద్మాకారములు. ముఖము, నేత్రము, నోరు, నాలుక, పెదవి, దవడలు, స్తనములు, గోళ్ళు, చేతులు, కాళ్ళు యివి పది యవయవములు. "ముఖ నేత్రాస్య జిహ్వోష్ఠ తాలు స్తన నఖా కరౌ। పాదౌచ దశపద్మాని పద్మాకారాణి యస్య చ" యని వచనము. నాలుగు నాఱును = ఱొమ్ము, తల, నొసలు, మెడ, భుజములు, మూఁపులు, నాభి, పార్శ్వములు, వెన్ను, స్వరము–అను పది యవయవములు గొప్పవి, 'ఉర శ్శిరో లలాటం చ గ్రీవా బాహ్వంస నాభయః। పార్శ్వ పృష్ఠస్వరాశ్చేతి విశాలాస్తే శుభప్రదా" యని సాముద్రిక వచనము. విశాలములు. స్వరము అనేకులకు వినఁబడుటయేగొప్ప (౨)ఱొమ్ము, నొసలు, చెవులు, మెడ, తల, మనస్సు, కడుపు, కాలు సేతులు, వెన్ను–అని పది యవయవములని మఱి కొందఱు. "శిరో లలాటశ్రవణే గ్రీవా వక్షశ్చహృత్తథా।ఉదరం పాణి పాదౌచ పృష్ఠం దశ బృహంతిచ" యని బ్రహ్మపురాణ వాక్యము. నాలుగు రెండు = కక్షము, కుక్షి, వక్షము, ముక్కు, మూఁపు, నొసలు – అను నాఱవయవములు, మిట్టలు. కక్షః కుక్షిశ్చవక్షశ్చ ఘ్రాణస్కంధో లలాటికా" సర్వభూతేషునిర్దిష్టా ఉన్నతాంగా శ్శుభప్రదా" యని వరరుచి వాక్యము. నాలుగైదును = కేశములు, మీసములు, రోమములు, వ్రేళ్ళకణుపులు, త్వక్కు, మగగుఱి, బుద్ధి, చూపు–అను తొమ్మిది యవయవములు, సన్నలై తగుక. "సూక్ష్మాణ్యంగుళిపర్వాణి కేశలోమ నఖత్వచః। శేఫశ్చ యేషాం సూక్ష్మాణి తే నరా దీర్ఘజీవిన" యని వరరుచి వాక్యము. 'అస్ఫుటితాగ్రంసూక్ష్మంశ్మశ్రుశుభం మృదుచ సంతతం స్నిగ్ధ'మ్మనియు "సూక్ష్మదృక్సూక్ష్మబుద్ధిశ్చ యోనరస్స సుఖీ భవే" త్తనియు వచనాంతరములు.

తాత్పర్యము.

నాలుగు దంష్ట్రలు గలవాఁడు సింహము, ఏనుఁగు, శార్దూలము, వృషభము వీనివలె నడచువాఁడు, వీఁపు, దేహము, చేతుల కాళ్ళవ్రేళ్ళు, చేతులు, ముక్కు, కన్నులు, చెవులు, లింగము ఇవి నిడుదలుగా గలవాఁడు. బాహువులు, వ్రేళ్ళు, తొడలు, పిక్కలు యీ యెనిమిది నిడుపు లగువాఁడు, కన్నులు, దంతములు, చర్మము, పాదములు, వెండ్రుకలు మెఱయుచుండువాఁడు. ముఖము, కన్నులు, నోరు, నాలుక, పెదవులు, దవడలు. చన్నులు, గోళ్ళు, చేతులు, కాళ్ళు–ఇవి పద్మములవలె గుండ్రముగాఁ గలవాఁడు. శిరము, నొసలు, చెవులు. కంఠము, ఱొమ్ము, హృదయము, కడుపు, చేతులు, కాళ్లు, పిఱుఁదులు పెద్దవిగాఁగలవాఁడు. చంకలు, కడుపు, ఱొమ్ము, ముక్కు, మూఁపు, నొసలు మిట్టలుగాఁ గలవాఁడు.

వ్రేళ్ళ గణుపులు, తలవెంద్రుకలు, దేహమున వెంద్రుకలు, చర్మము, లింగము, మీసమున వెంద్రుకలు, సూక్ష్మబుద్ధి, సూక్ష్మదృష్టి–ఇవి సూక్ష్మములుగఁ గలవాఁడు.

తే. మూఁట వ్యాప్తుఁ డనుష్ఠించు ♦ మూఁటి సతము
రెంట దెల్లన సత్యంబు ♦ నంటి యుండు
ధర్మనిరతుండు సంగ్రహ ♦ దాన విధుల
నెంతయును నిస్తులుండు శ్రీ ♦ మంతుఁ డమ్మ! ౮౨౬

అర్థములు. మూఁటవ్యాప్తుఁడు = మూఁడింటిచే వ్యాపించినవాఁడు, "త్రిభిర్వ్యాప్తిశ్చ యస్యస్యాత్। తేజసాయశసాశ్రియా" యన్నట్లు తేజస్సుచేతను, కీర్తిచేతను, శ్రీచేతను వ్యాపించినవాఁడు. మూఁటన్ = పూర్వాహ్ణ మధ్యాహ్న పరాహ్ణము లను మూఁడు కాలములందు ననుష్ఠింప వలసిన ధర్మార్థకామము లను త్రివర్ణము గల వాఁడు. "ధర్మార్థకామాః కాలేషుత్రిషు యస్య స్వనుష్ఠితాః" యని బ్రాహ్మవచనము. రెంటఁ దెల్లన = తెల్లనిదంతములు, తెల్లనికన్నులు గలవాఁడు. మాతాపితృవంశములు రెండును శుద్ధముగాఁ గలవాఁడు.

తా త్ప ర్య ము .

తేజస్సు, యశస్సు, శ్రీ–యీమూఁటిచే వ్యాపించియుండువాఁడు. పూర్వాహ్ణ మధ్యాహ్న పరాహ్ణములందుధర్మార్థకామములనాలోచించిచేయువాఁడు. కన్నులు, దంతములు తెల్లనైనవాఁడు. పరిశుద్ధములైన మాతాపితృ వంశములు గలవాఁడు. సత్యమువదలనివాఁడు. స్వధర్మమునందు విశేషించి ప్రీతిగలవాఁడు. ధనార్జనమందు, దానముచేయుటయందు మిక్కిలియసమానుఁడు. శ్రీతోనిత్యయోగముగలవాఁడు.

ఇంత గూఢముగాఁ జెప్ప నేల? స్పష్టముగనే చెప్పియుండ వచ్చును గదా. స్పష్టముగాఁ జెప్పియుండిన సీతాదేవి హనుమంతుని బవిసార్చి యుండును. మీఁద వ్రాయఁబడిన యర్థమందు శిశ్నము; వృషణములు చెప్పబడినవి. హనుమంతుఁడు నీ మగని శిశ్న మిట్లున్నది. నీ మగని వృషణము లిట్లున్నవని చెప్పిన సీతాదేవి వీఁ డడవి మనుష్యుఁడే, ఔచిత్య మెఱుఁగక మాటలాడుచున్నాఁడు, ఇటువంటి మొద్దుగాఁడు శ్రీరామచంద్రమూర్తిదూతగా నుండఁజాలడు, అని తీర్మానించుకొని యుండును. ఆ కారణముచేతనే యీ రామాయణమునందు నౌచితీపోషణకై గూఢముగానే చెప్పఁబడెను. ఈ విషయము వీఁ డెట్లు చెప్పునో తెలిసి కొంద మనియేకదా సీతాదేవి యిటువంటి ప్రశ్న వేసెను. వస్త్రము మఱుఁగున నుండు వానిని హనుమంతుఁ డెప్పుడు చూచెను? ఎట్లు తెలిసికొనఁ గలిగెను.

"పలు సందియములం దొలఁచును, వెలయించు నతీంద్రియార్థ విజ్ఞానము లోకుల కక్షి శాస్త్ర మయ్యది యలవడ దెవ్వనికి వాఁడె యంధుఁడు జగతిన్–" చిన్నయసూరినీతిచంద్రిక, బుద్ధిమంతులకు శాస్త్రమేకన్ను. కావునఁ దక్కినవన్ని శాస్త్రప్రకారము సరిగా నున్నప్పుడవియు సరిగా నుండకతప్పదు. కావునశాస్త్రము

నాధారము చేసికొని చెప్పెను. దానిని గుఱించి హనుమంతుఁడు చెప్పకుండినను నేను జూడలేదు, నాకుఁ దెలియ దని చెప్పియుండినను హనుమంతుఁడు మందబుద్ధి యని సీతాదేవి తలఁచియుండును.

క. రాముని ద్వైమాతురుఁ డగు, సౌమిత్రి యజయ్యుఁ డాజి ♦ సద్గుణరూప
 ప్రేమముల నట్టివాఁ డు,ర్వీమండలి దేవి! నిన్ను ♦ వెదకుచు వారల్. ౨౮

అర్థములు. ద్వైమాతురుఁడు = లక్ష్మణుఁడు రామునకు సవతితల్లి కొడుకైనను నిచ్చట నిద్దఱు తల్లుల బిడ్డఁడని చెప్పఁబడెను. ద్వయో ర్మాత్రో రపత్యం పుమాన్ ద్వైమాతురయని వ్యుత్పత్తి. "మాతురుత్సంఖ్యాసంభద్రపూర్వాయా" యనిపాణిని. అనఁగానిద్దఱుతల్లులబిడ్డఁడు. కన్నతల్లి సుమిత్రవలెనే కౌసల్యాదేవిచే రామునితోడఁ బెంపఁబడుటచే నిద్దఱు తల్లుల కొడుకని చెప్పఁబడెను. రామలక్ష్మణు లిరువురు నొక్కతల్లి బిడ్డలవలెఁ గలసి మెలసి యున్నారుగాని, సవతితల్లి బిడ్డలని వారినిజూచిన వారు వారి నడవడిఁబట్టి చెప్పఁజాల రని భావము. అజయ్యుఁడు = జయింపరానివాఁడు, ఆజిన్ = యుద్ధమందు, అట్టివాఁడు = రామచంద్రమూర్తి వంటి వాఁడే, వారల్ = రామలక్ష్మణులు.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి సవతితల్లి కొడుకైనను నేకోదరునివలె నుండువాఁడు లక్ష్మణుఁడు. యుద్ధమందజయ్యుఁడు, సద్గుణమందు, రూపమందు, ప్రేమమందు, రాముని వంటివాఁడు, వా రిరువురు నిన్ను భూమి యంతయు వెదకుచు.

ఇంతవఱకు "ఎట్టిది సంస్థాన మెట్టిది రూపంబు రాముని కా సుమిత్రాత్మజునకు" అని సీతాదేవి యడిగిన ప్రశ్నకు సమాధానము చెప్పి శ్రీరామచంద్రునితో స్నేహ మెట్లు లభించె నీకు, లక్ష్మణు నెట్టు లెఱిఁగి తీవు, నరవానరుల కెట్లు పరఁగె సమాగమం బన్న ప్రశ్నలకుఁ బ్రత్యుత్తర మిచ్చుచున్నాఁడు.

—♦సీతాదేవికి హనుమంతుఁడు శ్రీరామసుగ్రీవుల సమాగమ విధంబుఁ జెప్పుట♦—

సీ. చనుదెంచిరమ్మ! మా ♦ చరియించుచోటికి, నన్న రాజ్యమునుండి ♦ తన్నుఁ దఱుమ
 ఋశ్యమూకాద్రి మే ♦ మెల్లరు సేవింప, నన్న భయంబున ♦ నదరిపడుచు
 నున్న సుగ్రీవుఁ డీ ♦ యన్నదమ్ములఁ జీర, వసనుల ధృతచాప ♦ పాణితలుల
 వీక్షించి భయమున ♦ నగిరి శృంగముఁ జేరి, ననుఁ బంపె వారిచం ♦ దం బెఱుంగ
ఆ. మోప్పఁ గేలఁ బురుష ♦ ముఖ్యుల డాసితి, వారు నాదు పల్కు ♦ గారవింప
 మోచి తెచ్చి కీశ ♦ ముఖ్యుని ప్రోలను, లలితరీతి వారి ♦ నిలుపుటయును. ౨౯

అర్థములు. మా చరియించు చోటికి = మేముచరించు చోటికి, సమాసంబునఁ బ్రథమకు షష్ఠి – చీరవసనులన్ = నారచీరలు గట్టిన వారిని, ధృతచాప పాణితలుల = హస్తములందు విండ్లు ధరించిన వారిని.

తాత్పర్యము.

మే మున్న చోటికి వారు వచ్చిరి. అన్న రాజ్యము నుండి తఱుమఁగా ఋశ్యమూకాద్రియందు మే మెల్లవారు సేవింప నన్నకు భయపడుచు నున్న సుగ్రీవుఁడు నారచీరలు, చేతుల విండ్లు ధరించిన వీరిని జూచిభయపడి యెగిరిపడి శిఖరము చేరి వారి వృత్తాంతము దెలిసికొనిరమ్మని నన్నుఁబంపెను. వారినిజూడఁగానే వారెవరో మహాత్ములని తోఁచుటచే నేను వినయమునఁ జేతులు జోడించుకొని వారియొద్దకుఁ బోయితిని. వారు నామాటయం దాదర ముంచి గౌరవింపఁగా నేనే వారిని మోచి తెచ్చి సుగ్రీవుని యెదుట నిలిపితిని.

ఇచ్చట నేను నేను అని యుత్తమపురుషము చెప్పుట యహంకారముచేఁ గాదు. రామ సుగ్రీవసఖ్యమునందుఁ దనకుఁగల సంబంధమును, నీవు లక్ష్మణు నెట్లెఱిఁగితి వనుటకుఁ బ్రత్యుత్తరము తెలుపుటకే.

క. వారు పరస్పరసల్లాపోరురతిఁ బ్రవిశ్వసించి ♦ యొండొరులను వా
రూరార్చిరి తమిఁ దనతన, చారిత్రముఁ జెప్పి విశద ♦ సరణిగ నంతన్. ౨౯

తాత్పర్యము.

వారిరువు రొకరితో నొకరు మంచిగ మాటలాడుచు నొకరి నొకరు నమ్మిరి. వారి వారి దుఃఖము వారు వారు చెప్పుకొనఁగా వారే యొకరి నొకరు సమాధాన పఱిచిరి.

క. అన్నయగు వాలిచేఁ దన, యన్ననిమిత్తంబు వెడల ♦ నడువంబడుటన్
బన్నపడి వగచు సుగ్రీ,వు న్నీ ప్రాణేశ్వరుండు ♦ పొలఁతీ! తేర్చెన్. ౩౦

అర్థములు. అన్న = స్త్రీ, ఇచ్చట భార్య యని యర్థము.

తాత్పర్యము.

తనభార్య నపహరింపవలెనని తనయన్న తన్ను వెడలఁగొట్టఁగా నవమానపడి దుఃఖించు సుగ్రీవుని నీ మగఁడు తల్లీ! సమాధాన పఱిచెను. వాలిసుగ్రీవుల వాస్తవ కలహ కారణ మిదియే.

తే. నీ వియోగవంశమున ♦ నెవ్వగ గొను, రాముచరితంబు వానర ♦ స్వామి కంత
వినిచె సౌమిత్రి యది విని ♦ విగతతేజుఁ, డయ్యె నుపరాగకలిత ప ♦ ద్మాప్తునట్లు.

తాత్పర్యము.

నిన్ను నెడఁబాయుటచే దుఃఖించు రామచంద్రమూర్తి చరితంబుసుగ్రీవునకు లక్ష్మణుఁడు వినిపించెను. అది విని సుగ్రీవుఁడు రాహుపట్టిన సూర్యునివలెఁ దేజో విహీనుఁ డయ్యెను. విగత తేజుఁడు = సీతా విరహముచే రాముఁడు గతతేజుఁడు = పోయిన తేజము గలవాఁడు, సుగ్రీవుఁడు; విగత తేజుఁడు = విశేషముగ (పూర్ణముగ) పోయిన తేజస్సుగలవాఁడు. ఇటువంటి దంపతుల దర్శనము వారు కూడియుండఁగా

లభింపదయ్యెఁగదా యని గతతేజుఁడై యుండి రామచంద్రమూర్తి దుఃఖము జూచి విగతతేజుఁ డయ్యెను.

ఉ. పూర్వము మింట రావణుఁడు ♦ పొల్తుక నిన్గొనిపోవువేళ నీ
వుర్విని వైచినట్టి నగ ♦ లొక్కెడ నేఁ బదిలంబు సేసితిన్
సర్వము నప్డు తేర దివ♦సప్రభుసూతియుఁ జూపెఁ గాని హృ
త్పర్వము గూర్ప నీ యునికి♦పట్టును మాత్ర మెఱుంగ మంగనా! ౫౩౨

అర్థములు. హృత్పర్వము = హృదయమునకు సంతోషము.

తా త్ప ర్య ము.

పూర్వము రావణాసురుఁడు నిన్ను నాకాశమార్గమునఁ దీసికొని పోవునపుడు నీవు భూమిమీఁద వేసిన యాభరణములను నేనొకచోట భద్రపఱచి యుంటిని. వాని నన్నిటినిఁ దీసికొని రాఁగ సుగ్రీవుఁడు వానిని రామచంద్రమూర్తికిఁ జూపెఁగాని, యాయన మనస్సు సంతోషించునట్లు చెప్పుటకు నీ వెందున్న దానవో మాకుఁ దెలియదు.

కిష్కింధాకాండము ౧౫౩ వ పద్యంబున సుగ్రీవుఁడు తెచ్చి చూపినట్లున్నది. ఇచ్చట హనుమంతుఁడు తెచ్చిన ట్లున్నది. హనుమంతుఁడు తెచ్చి సుగ్రీవుచేతి కీయఁగా సుగ్రీవుఁడు కనఁబఱచె నని తెలియ నగు.

ఉ. వానిని జేర్చి యంకమున ♦ వారిజలోచన! నీదుభర్త శో
కానలదహ్యమానుఁ డయి ♦ యాభరణాళిని గాంచి కాంచి య
మ్మా నినుఁ గూర్చి యా వఱచి♦పట్లఱచెన్ వివిధప్రలాపుఁడై,
నేను విచేతనున్ నృపతి ♦ నెమ్మదిఁ దేర్చితి సాంత్వవాక్యలన్. ౫౩౩

అర్థములు. అంకమునన్ = ఒడియందు, శోకానల దహ్యమానుఁ డయి = శోకాగ్నిచే దహింపఁబడిన వాఁడై, ఆవు+అఱచినట్లు, విచేతనున్ = స్మృతితప్పిన వానిని, సాంత్వవాక్యలన్ = ఊరార్చు మాటలచే.

తా త్ప ర్య ము.

ఆ యాభరణములను నొడిలో నుంచుకొని నీ మగఁడు శోకాగ్నిచేఁ గాలిన వాఁడయి వానిని జూచి చూచి, తల్లీ! యావఱచినట్లు నానా విధముల నేడ్చెను. స్మృతి తప్పిన రామచంద్రుని నేనే మూర్ఛ తేఱునట్లు చేసి యూరార్చితిని.

♦ శ్రీరాముని విరహతాపము హనుమంతుఁడు సీతాదేవికి జెప్పుట. ♦

ఆ. నగలు చూచి చూచి ♦ నగచరపతి కిచ్చె, మఱల వాని నీదు♦మగఁడు దేవి!
నిన్నుఁబాసి విభుఁడు ♦ నిత్య మగ్నినిగాలు, నగ్నిపర్వతంబు♦నటు తపించు.౫౩౪

మొదట రామచంద్రమూర్తి యవయవ సౌందర్యము నచ్చ చెప్పి యిప్పుడు సొమ్ముల విషయముఁ జెప్పి యా నమ్మకమును బలపఱచెను. నగలు చూచినపిమ్మట

తన విషయమై యుపేక్ష వహించెనా, ప్రేమగలవాఁడై వర్తించెనా యను విషయము సీతాదేవి ముఖ్యముగాఁ దెలియవలసినది. కావున నా విషయము చెప్పుచున్నాఁడు.

తాత్పర్యము.

ఆభరణములను జూచిచూచి మఱల రామచంద్రమూర్తి సుగ్రీవున కిచ్చెను. నిన్నెడబాసి నీమగఁడు సర్వదా లోలోపల నేకములు నగ్నినిగల యగ్గికొండవలెఁ దపించుచున్నాఁడు.

'అత్రమాల్యవతీశృంగే। దృశ్యతే హవ్యవాట్సదా, నామ్నా సంవర్తకోనామ కాలాగ్నిర్భరతర్షభ॥ భారత మాల్యవంతమను పర్వత శృంగమున సంవర్తకుఁడను నగ్ని సర్వదా కానవచ్చును, అని ప్రమాణము.

క. మగ్నుండై శోకంబున, భగ్నంబుగ నిద్ర చింత ♦ వనరుచు రామున్
డగ్నులచేఁ దపియించెడి, యగ్నిగృహం బనఁగ నున్న ♦ యాతండబలా! ౮౩౫

లోపల నున్నది నీ కెట్లు తెలిసెను. ఉన్నదో, లేదో లోపల నుండిన వెలుపలికిఁ దెలియదా యందు వేమో శోకంబున మునిఁగినవాఁడై నిద్ర భగ్నమైపోఁగా చింతచే దుఃఖించుచు రామచంద్రమూర్తి యగ్నులచే దపించు నగ్నిహోత్ర గృహమువలె నున్నాఁడమ్మా!

తాత్పర్యము.

నిత్యాగ్నిహోత్రులగు ద్విజుల యిండ్లలో నగ్నిని సంరక్షింప నొకగది దానికని ప్రత్యేకముగా నుండును. అందగ్ని యాఱక మండుచునే యుండును. ఆ కారణమున నాగది సెగలు గ్రక్కుచుండును. ఆ విధముగ నీ మగఁడు విరహాగ్నిచే సంతప్తుఁడగుటచే దేహము పెనము గ్రాఁగినట్లు గ్రాగుచున్నది.

ఉ. కానఁడు సౌఖ్య మేమి నినుఁ ♦ గానని వేదనచేతఁ, దాపముల్
మానఁడు, త్వద్వియోగదహ♦నంబు దహింపఁగ భూమికంపవే
గాన వణంకుకొండ యనఁ♦గాఁ జలియించెడి, సంతసింపఁడో
మానిని! నిన్నుఁ బాసి సుమ♦మంజులకుంజము లెన్ని చూచినన్. ౮౩౬

అర్థములు. భూమికంపవేగానన్=భూమివణఁకు వేగముచే, సుమమంజుల కుంజములు=పూవులచే రమ్యములైన పొదలు.

తాత్పర్యము.

నిన్నుఁ జూడలేదను తాపముచేత సౌఖ్యము కొంచెమైనఁ గానఁడు. తాపము వదలఁడు. నీ వియోగవహ్ని దహింపఁగ భూకంపముయొక్క వేగముచే వణఁకు కొండవలె వణఁకుచున్నాఁడు. తల్లీ! నిన్ను నెడఁబాసిన కారణముచే రమ్యములైన పూఁబొద లెన్ని చూచినను సంతోషింపఁడు.

తే. హృద్యకాంతారముల నెందు ♦ నేగుచున్నఁ
గ్రమలహరీతరంగిణుల్ ♦ గాంచుచున్న

నిన్నుఁ గానని కతమున ♦ నీరజాక్షి
మానవేంద్రున కరుస మన్ ♦ మాట లేదు. ౪౭

అర్థములు. హృద్య = మనోహరములైన, కాంతారములన్ = అడవు లందు, కమ్ర = మనోహరములైన, లహరీ తరంగిణుల్ = ప్రవాహములు గల యేళ్ళను. కతమునన్ = కారణముచే.

తాత్పర్యము.

ఎల్లవారికి మనోహరములైన యడవులందుఁ బోవుచున్నను, మనోహరములుగాఁ బాఱుచున్న యేళ్లు చూచినను నినుఁ జూడని కారణముచే రామచంద్రమూర్తికి సంతోష మను మాటయే లేదు.

ఉ. అంబుజనేత్ర! నీపతి ర♦ణావని రావణుఁ బుత్రమిత్రయు
క్తంబుగఁ జంపి శీఘ్రముగఁ♦గ్రమ్మఱఁ గైకొను నిన్ను, బాస లా
యంబుజమిత్రవంశ్యుఁడును♦నబ్జహితోద్భవుఁ డాచరించి రో
యంబ! వధింప వాలి నిను♦నారసి నల్గడ వార్తఁ దేరఁగన్. ౪౮

సీతాదేవితృప్తికై రామవిరహంబువర్ణించి, ప్రకృతమనుసరించుచున్నాఁడు.

అర్థములు. బాసలు=ప్రమాణములు. అంబుజమిత్రవంశ్యుఁడు=సూర్యవంశమునఁ బుట్టిన రామచంద్రమూర్తి, అబ్జహితోద్భవుఁడు=సూర్యపుత్రుఁ డగు సుగ్రీవుఁడు. క్రమాలంకారము.

తాత్పర్యము.

కమలాక్షి! నీభర్త రావణాసురుని కొడుకులతోడను, మిత్రులతోడను యుద్ధమందుఁ జంపి నిన్ను మఱల శీఘ్రముగ గ్రహించెను. నీకెట్లు తెలియు ననెదవా? వాలిని జంపునట్లు రామచంద్రమూర్తి ప్రమాణముచేసెను. నిన్ను వెదకించి వార్త తెప్పించెద నని సుగ్రీవుఁడు ప్రమాణము చేసెను.

ఉ. బంధురతేజు లుగ్రరణ♦పండితు లా హరినాథుతోడఁ గి
ష్కింధను డాసి వాలి హతుఁ♦జేసి యినాత్మజు రాజుఁ జేయుటన్
సంధిగ నైక్య మిట్లొదవె♦జక్కఁగ వారికి, వారి దూతులన్
సింధువు నుత్తరించి యిటు♦చేరితి రోయుచు నిన్ను మైథిలీ. ౪౯

అర్థములు. బంధురతేజులు=అధిక తేజస్సుగలవారు. ఉగ్రరణపండితులు=భయంకరయుద్ధమునందుఁబండితులు; ఇనాత్మజున్=సుగ్రీవుని, ఐక్యము=సమభావము స్నేహము. సింధువున్=సముద్రమును, ఉత్తరించి=దాఁటి, రోయుచున్=వెదకుచు, దూతుఁడు=యోధాదులు బహుళంబుగ స్త్రీసమములు. సు. వ్యా. తత్స. ౨౧. దూతశబ్దము యోధాదులందుఁ జేరినది. ఐక్యము ఈశబ్దార్థము గుఱించి కిష్కింధ ౧౬-౫ ప. వ్యాఖ్య చూచునది. ఉప్పుగడ్డ నీళ్ళలోఁ బడెనేని ఘనత్వము పోయి ద్రవత్వమును బొందునేకాని వాని పరమాణువులు జలపరమాణువులు కాఁజాలవు

సముద్రములో గంగ కలసినను విభజింపరానట్లు కలియునే కాని యొక పరమాణువు మరియొక పరమాణువు కాఁజాలదు. నామ రూపములు మారినను స్వస్వరూప స్వభావములు మారక భేదింపరాని సమత్వదశకు నైక్యమని పేరు. తుమ్మెదలు నానా పుష్పముల తేనెలొకచోఁ జేర్చును. మఱల దానిని విడఁదీయ సాధ్యపడునా? అట్టి కూడికకైక్య మని పేరు. మేఘ గంభీరభాషణంబు లన్నప్పుడు మేఘధ్వని మనుష్యునకు రాదు. మేఘధ్వనిని బోలిన ధ్వని యని యర్థము.

తా త్ప ర్య ము.

అధిక తేజము గలవారును భయంకర యుద్ధములందుఁ బండితులును, నగు రామలక్ష్మణులు సుగ్రీవునితోడఁ గిష్కింధకుఁ బోయి వాలిని జంపి సుగ్రీవుని రాజు చేయుటచే రామసుగ్రీవులకు స్నేహ మిట్లు కుదిరెను. నేను వారి దూతను. నిన్ను వెదకుచు సముద్రము దాఁటి యిచటికి వచ్చితిని.

క. హనుమంతుఁడఁ బేరను నా, యినజుఁడు రాజ్యస్థుఁడై హ♦రీశ్వరకోటిన్
నిను నెమకఁగఁ బదిదిక్కుల, కును బంచిన వారు చనిరి ♦ కోమలి నీకై. ౮౪౦

తా త్ప ర్య ము.

నాపేరు హనుమంతుఁడు. సుగ్రీవుఁడు రాజ్యము నంగీకరించిన వాఁడై తాను జేసినప్రమాణము ప్రకారము వానరకోట్లను నిన్ను వెదకుటకై పది దిక్కులకును బంపెను? వారును నీకై వెడలి పోయినారు.

ఉ. వాలి తనూభవుండు కపి♦వల్లభుఁ డుత్తమశూరుఁ డంగదుం
డోలిఁ ద్రిభాగసైన్యయుతుఁ ♦ డూనె స్వయంబుగ నేతదర్థమై
శైలవరంబు వింధ్యమునఁ ♦ జాలదినంబులు రోసి మేము దు
ర్గాళిని ద్రోవతప్పి వ్యస♦నార్తిఁ బడం జనెఁ గాలమంతయున్. ౮౪౧

అర్థములు. త్రిభాగసైన్యయుతుఁడు = సైన్యములో మూఁడవ భాగముతోఁ గూడిన వాఁడై; సమాసంబున సంఖ్యార్థకము సంఖ్యేయార్థక మగును. తృతీయ భాగ మనుటకు త్రిభాగము. స్వయంబుగన్ = తానే, ఏతదర్థమై = నిన్ను వెదకు కార్యమునకుఁగా.

తా త్ప ర్య ము.

వాలి కుమారుఁడు యువరాజు శూరులం దుత్తముఁడు నగు నంగదుఁడు సేనలో మూఁడవభాగముఁ దీసికొని యువరాజై యింట నుండవలసిన వాఁడయ్యు నిన్ను వెదకవలయు నని తానే పనిపూనెను. మేము వింధ్యపర్వతమునందుఁ జాల దినంబులు వెదకి త్రోవ తప్పి దుఃఖించుచుండ, జాల దినములు గడచెను. ఆ కారణమున నిచ్చటికి నేను వచ్చుట కాలస్యమయ్యెను. "వింధ్యాత్తు దక్షిణో దేశో దక్షిణాపథసంజ్ఞకః॥ యాదవ॥

క. గుట్టయు గుట్టయు విడువక. చెట్టును జెట్టును మఱుంగు♦చేనుం జేనున్
బట్టుగ వెదకిన జనకుని,పట్టీ! నీ యునికి తెలియఁ♦బడ దయ్యెఁ జుమీ. ౬౮౩

తా త్ప ర్య ము .

చెట్టు, చెట్టు గుట్ట గుట్ట వదలిపెట్టక చాటుగా నున్న చేను చేను పనిపూని వెదకితిమి గాని, నీ యునికిపట్టు మాకుఁ దెలియ లేదు.

క. గడు వేమో కడచనియెను, బుడమితనూజాత యున్న♦పోఁబడిఁ గనముల్
గనుసరి కపిపతి యను వెఱ, విడువఁగ నెంచితిమి మేము ♦ వెలఁదీ యసువుల్.

తా త్ప ర్య ము .

సుగ్రీవుఁడిచ్చిన నెలగడువు మించిపోయెను. సీతాదేవియున్న జాడ తెలియరా దయ్యెను. కపిరాజు కఠినుఁడు. ఊరకపోయినఁ జంపునని భయపడి మేమే ప్రాణ ములు విడువ నెంచితిమి.

—♦హనుమంతుఁడు సీతాదేవితోఁ దనకామె యునికి దెలిసినవిధంబుఁ జెప్పుట♦—

ఉ. అంగదుఁ డంతశోకమున ♦ హా! యనుచున్ నినుఁ గోలుపోవుటల్
భంగము గృధ్రరాజునకుఁ ♦ బ్రాణవినాశము వాలి కబ్బుటల్
శృంగమునందు మా కిటులు ♦ చేకుఱుటల్ మృతి, చెప్పికొంచు నో
యంగన! యేడ్చె, నేడ్చిన జ♦టాయువుసోదరుఁ డంతయు న్వినెన్. ౬౮౪

తా త్ప ర్య ము.

అప్పు డంగదుఁడు శోకముచే నీ వపహరింపఁబడుటయు, జటాయువు మర ణించుటయు, వాలివధయు, దిక్కులేనివారివలెఁ గొండ శిఖరమున మేము చావ వలసివచ్చుటయుఁ జెప్పుకొనుచు హా యని యేడ్చెను. అమ్మా! యా ధ్వని విని జటాయువున కన్న మా ముచ్చట లన్నియు వినెను.

మ. విని సంపాతి యనంగ గృధ్రపతి వే♦వే వచ్చి మా యంతికం
బునఁ గోపారుణనేత్రుఁ డై పలికె మ♦మ్ముం జూచి యెవ్వాఁడు నా
యనుజుం జంపె వచింపుఁడీ ప్లవగులా♦రా! యన్నఁ దారేయుఁడున్
దనుజుం డాతని నీ నిమిత్తము జన♦స్థానంబునం ద్రుంచుటల్. ౬౮౫

అర్థములు. అంతికంబునకున్=సమీపమునకు, కోపారుణనేత్రుఁడై=కోప ముచే నెఱ్ఱనయిన కన్నులు గలవాఁడై, తారేయుఁడు=తార కొడు కగు నంగ దుఁడు.

తా త్ప ర్య ము .

ఆ గ్రద్దరాజు పేరు సంపాతి. అతఁడు త్వరత్వరగా మా సమీపమునకు వచ్చి కోపముచే నెఱ్ఱ నగు కన్నులు గలవాఁడై నా తమ్మునిఁ జంపినవాఁ డెవ్వఁడు వానరులారా! చెప్పుఁ డని యడుగఁగా నంగదుఁడు నీ నిమిత్తమై రావణుఁడు జటాయువును జంపె నని చెప్పెను.

ఉ. అంతయు నాడె; నాడ నరు ♦ ణాత్మజుఁ డార్తి వహించి నీదు వృ
త్తాంతముఁ బల్కె రావణుని ♦ ధామమునందు వసించి యుండుటల్
సంతస మార దాని విని ♦ చయ్యనఁ గీశులు లేచి తన్నగ
ప్రాంతముఁ బాసి చేరిరి మ ♦ హాంబుధి యుత్తరతీరధారిణిన్. ౮౪౬

అర్థములు. ఆడన్ = చెప్పఁగా, అరుణాత్మజుఁడు = అనూరుని కొడుకు, ధామమునందు = ఇంట.

తా త్ప ర్య ము.

సర్వముచెప్పఁగా విని యనూరుని కొడుకగు సంపాతి దుఃఖపడి నీవు రావణాసురుని యంతఃపురమునందున్న వార్త చెప్పెను. వానరు లందఱు నా వృత్తాంతము విని సంతోషించి లేచి యాకొండ శిఖరము విడిచి సముద్రము యొక్క యుత్తరపు టొడ్డు చేరితిమి.

ఉ. చిత్తము నిన్నుఁ జూడఁ ద్వర ♦ సేయుచు నుండియుఁ గంధిదర్శనం
బుత్తలపాటు గూర్చెఁ బ్లవ ♦ గోత్తమపాళికి, నంత నేను లో
హత్తిన ధైర్యసారమున ♦ నామడ లొక్కశతంబు దాఁటి దై
త్యోత్తమ్మువీడు సొచ్చి నిశ ♦ నొయ్యన రావణు నిన్నుఁ జూచితిన్. ౮౪౭

అర్థములు. కంధి = సముద్రము, ఉత్తలపాటు = కలఁత, నిశన్ = రాత్రియందు.

తా త్ప ర్య ము .

నిన్నుఁ జూడవలయునని మాకెంత తొందరపాటుండినను సముద్రదర్శనము వానరులకు మనోవ్యాకులత్వము గలిగించెను, అప్పుడు నేను ధైర్యము సాహసము గలవాఁడనై నూఱామడ సముద్రమును దాఁటి రావణు నగరము ప్రవేశించి రాత్రియందు రావణు, నిన్నుఁ జూచితిని.

చ. కలఁది వచించినాఁడ, మదిఁ ♦ గాతరభావము మాని ధీరతం
బలుకుము, నన్ను నమ్ముము, నృ ♦ పప్రవరోద్యమ మాని నీకుఁగాఁ
జెలి! యరుదెంచినాఁడఁ, గపి ♦ శేఖరుమంత్రిని, వాయుపుత్రుఁడన్
జలజహితాన్వవాయనృప ♦ సత్తము రాముసిదూత సాధ్వి రో! ౮౪౮

అర్థములు. కాతరభావము = భయము, నృపప్రవరోద్యము = రాజ శ్రేష్ఠుఁడగు రామచంద్రుని ప్రయత్నము, జలజహితాన్వవాయ = సూర్యవంశము వాఁడగు; వాయుపుత్రుఁడన్ = వాయుదేవునికుమారుఁడను, 'నమస్తేవాయో-త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి' యను శ్రుతివాక్యమిట ననుసంధించునది. జగత్తునకుఁ బ్రాణ మైన ప్రత్యక్ష బ్రహ్మముయొక్క కుమారుఁడను. దీనిచేఁ దన యుత్తమ కుల ప్రసూతి చెప్పినవాఁ డయ్యెను. దీనివలన నుత్తమ కులమునఁ బుట్టినవానిని గాని, గురువుగా గ్రహింపరాదని యేర్పడుచున్నది. ఆనుపూర్విగ వంశపరంపర చెప్పలేని

గురువును గురువుగా గ్రహింపరాదు. అట్లు చెప్పలేనివారు నీచకులులుగాను, నీచ మతమువారు గాను నుందురు.

తా త్ప ర్య ము.

సాధ్వీరత్నమా! వాస్తవము చెప్పినాఁడను. నీవు భయమువదలి ధైర్యముతో మాటలాడుము. నన్ను నమ్ముము. నా యందు మాయ లేదు. రామచంద్రమూర్తి కార్యము నిర్వహింప నీనిమిత్తమై వచ్చినాఁడను. వానరరాజు మంత్రిని. వాయు దేవుని కుమారుఁడను. సూర్యవంశపు రాజగు రామచంద్రమూర్తి దూతను.

క. మీ రాముఁన కఖిలాయుధ, వారభృదగ్రణికి సుఖము ♦ వర్ణితగుణ! గు
ర్వారాధన యుక్తుం డగు, వీరుఁడు సౌమిత్రి సుఖత ♦ వెలసెడి నమ్మా? ౮౪౯

అర్థములు. అఖిలాయుధవారభృదగ్రణికిన్ = ఆయుధములు ధరించు నందఱిలో మొదటివానికి; వర్ణితగుణ=కీర్తింపఁబడు గుణములు కలదానా! గుర్వారాధనయుక్తుఁడు = అన్నసేవతోఁ గూడినవాఁడు, సుఖతన్ = సౌఖ్యముచే.

తా త్ప ర్య ము.

అమ్మా! ఆయుధములు ధరించువారిలో శ్రేష్ఠుఁడగు నీ భర్తకు రామచంద్రమూర్తికి సుఖము. కీర్తింపఁబడు గుణములు గలదానా! లక్ష్మణుఁడు అన్నసేవ చేయుచు సుఖముగా నున్నాఁడు.

క. నీ విభు హిత మెంచుచు సుగ్రీవుని నుడి దక్షిణముగ ♦ క్షితిజా! నిన్నున్
నే వెదకుచు ననహాయుఁడ, నై వచ్చితి నిన్నుఁ గంటి ♦ నతిపుణ్యమునన్. ౮౫౦

అర్థములు. నుడిన్ = మాటప్రకారము.

తా త్ప ర్య ము.

నీ భర్త మేలుగోరి సుగ్రీవుని మాటప్రకారము దక్షిణపు దిశగా నిన్ను వెదకుచు వచ్చితిమి. అందు నా పూర్వ పుణ్యాతిశయమున నేను నిన్నుఁ జూడఁగలిగితిని.

చ. నినుఁ గనలేని దుఃఖమున ♦ నివ్వెఱఁగూరిన కీశపాళికిన్
వినిచి నినుం గనుంగొనుట ♦ వేతొలఁగించెద దుఃఖమెల్ల, నో
జనని! సముద్రలంఘనము ♦ సార్థక మయ్యెను బుణ్యసంపదన్
హనుమ యొకండె కాంచె జన♦కాత్మజ నన్యశ మేను గాంచితిన్. ౮౫౧

తా త్ప ర్య ము.

నిన్నుఁ జూడలేక పోయితిమి గదా యను దుఃఖమున మిగుల భయపడుచున్న వానరసమూహమునకు నేను నిన్నుఁ జూచిన వార్త తెలిపి వారి దుఃఖ మంతయుఁ బోఁగొట్టెదను. తల్లీ! నేను సముద్రము దాఁటుట సఫల మయ్యెను. నా పుణ్యాతిశయముచే హనుమంతుఁడొక్కఁడే సీతాదేవిని జూడఁగలిగె నను కీర్తిని సంపాదించితిని.

—◆ హనుమంతుఁడు సీతాదేవికిఁ దన జన్మవృత్తాంతముఁ జెప్పుట. ◆—

క. వీరుఁడు రాముఁడు సహసరి, వారుఁ సహమిత్రుని సబాంధవునిఁ ర
క్షోరాజుఁ జంపి పోరఁ, నారక గ్రహియించు నిన్ను నమ్ముము దేవీ! ౮౨

ఇంతవఱకుఁ దాను రామచంద్రమూర్తి పంపున దూతయై వచ్చిన వార్తఁ దెలిపి యిఁకఁ దన జన్మచరిత్ర చెప్పుచున్నాఁడు. ఏలన :—

"యస్య నజ్ఞాయతే శీలం, కులం తస్య చ సంశ్రయమ్
న సంగతిం కుర్యా, దిత్యువాచ బృహస్పతిః॥

ఎవనియాచారము, స్వభావము, కులము నెవరి యొద్ద నెచ్చోట నుండునది తెలియదో వానితోడఁ గూడియుండరాదు, అని బృహస్పతి చెప్పెను. కావున స్నేహముచేసినను గలసి మెలసి యుండవలసి వచ్చినను గులహీనునితో నాచారహీనునితో సదాశ్రయము లేనివానితో నట్లు చేయరాదు గనుకఁ దన విషయము చెప్పుచున్నాఁడు. తన కులము, గుణము. ఊరు, నిజమైన పేరు, దాఁచువానిని నమ్మి దగ్గఱఁ జేరరాదన, నిఁక వానిని గురువుగా గ్రహింపవచ్చునా. కావున శిష్యులును గురువు వంశాదులను. వారి పుట్టువు పూర్వోత్తరములను విచారింపవలెను.

తాత్పర్యము.

వీరుఁడగు రామచంద్రమూర్తి పరివారముతోను, మిత్రులతోను జుట్టములతోను గూడిన రావణుని యుద్ధమునందుఁ జంపి నిన్ను గ్రహింపఁగలఁడు. నా మాట, దేవీ! నమ్ముము.

సీ. మాల్యవంతం బను మహిత భూధరమున, జనని! నాతండ్రి కేసరి వసించుఁ
జనియె గోకర్ణాఖ్య శైలంబున కతండు, నట శంబసాదనుఁ డనెడి దైత్యు
దేవర్షిసంభుని దిష్టుఁడై వధియించె, నతని క్షేత్రంబున ననిలునకును
జనియించినాఁడను స్వకృతకర్మంబున. హనుమంతుఁ డను నామమమరె నాకు,
అ. నీవు నమ్మపొంచె నీ నాథుగుణముల, నెల్లఁ బలికినాఁడ నిచటనుండి
నిన్నుఁ దోడుకొనుచు నీవల్లభుండేగు, భయపడంగ వలదు భవ్యశీల! ౮౩

తాత్పర్యము.

మాల్యవంత మను గొప్ప పర్వతము గలదు. అందు నా తండ్రి కేసరియను వానరరాజుండును. ఆయన యొకసారి దేవఋషుల సంఘముచే నాజ్ఞాపింపఁబడినవాఁడై శంబసాదనుఁడను దైత్యుని జంప గోకర్ణమను పర్వతమునకుఁ బోయి వానిని జంపెను. ఈ విధముగ మా తండ్రి తరమునుండి రాక్షసులకు మాకు విరోధమే. ఆయన భార్యయందు వాయుదేవునకు నేను జన్మించితిని. నేను స్వయముగఁ జేసిన కార్యముచే నాకు హనుమంతుఁ డను పేరువచ్చెను. నీవు నమ్మకొఱకు నీ భర్త గుణములను నన్నిటిని జెప్పితిని. నిన్నిచ్చటనుండి నీ ప్రియుఁడు తోడుకొని పోవును. నామాట నమ్ముము.

ఇది యాచార్యకృత్యము. శిష్యునకు భగవద్విషయము నంతయు సమర్థముగఁ జెప్పి నీవు భయపడ వలదు. నిన్ను భగవంతుఁడు తన యొద్దకు స్వయముగా వచ్చి తీసికొని పోవును. భయపడ వలదు. కాలమునకు వేచి యుండుము. నీవు మాత్రము సదాచారము, భక్తి విశ్వాసములు మానవలదని చెప్పును. భవ్యశీల యను సంబోధన మీ యర్థ మించుచున్నది. గురుపరంపరయుఁ జెప్పినవాఁడయ్యెను.

చ. అనవుఁడు విశ్వసించె జన♦కాత్మజ యాతని దూతగా మనం
బునఁ, గడు సమ్మదాశ్రువులు ♦ ముమ్మర మై ప్రవహించె వాలుఁగ
న్గొనలను, రాహుముక్తశశి♦కోపున మోము వికాస మందె, వా
నిని దలపోసె నిక్కపు వ♦నేచరుఁ డంచు నపాస్తశంక యై. ౬౪

తా త్ప ర్య ము .

ఇన్ని విధములఁ జెప్పఁగా సీతాదేవి హనుమంతుని రామచంద్రమూర్తిదూత యని నమ్మెను. నిడుపాటి కన్నుల కొలకుల నుండి సంతోష బాష్పములు విశేషముగఁ బ్రవహించెను. ముఖము రాహువుపట్టి విడిచిన చంద్రునివలె వికాసము నొందెను. సందేహమువదలి వీఁడు నిజముగా రామదూత వానరుఁడని నమ్మెను.

ఈ విధముగ శిష్యులు గాఁగోరువారు గురువుల మని వచ్చువారిని బరీక్షింపక గ్రహింపరాదు.

క. దానిని గని హనుమంతుఁడు, మానవతీమణికి ననియె ♦ మఱలి చనియెదఁ
జానకి! యూఱడుమీ నీ, కే నేమి యొనర్తు నెద్ది ♦ యిష్టము చెపుమా. ౬౫

తా త్ప ర్య ము .

ఈ ప్రకారము సీతాదేవి తన్నుఁ దన మాటలను నమ్ముటయు, సంతోషించుటయుఁ జూచి యమ్మా! మఱలి నేను రామచంద్రు నొద్దకు నీ వార్తఁ దెలుపఁబోవలసి యున్నది. నీ కేమి సాహాయ్యము చేయుమనెదవు, చెప్పుము. ఊఱడిల్లుము తల్లీ! ఊరడిల్లుము. నీ యిష్టము చెప్పుము. చేయుదు ననుటచే శిష్యుని సందేహములన్నియు గురువు దీర్ప శక్తిగలవాఁడై యుండవలె నని యేర్పడుచున్నది.

క. పవనతనూజుఁడ నగుటను, జవబలగరిమములఁ దండ్రి ♦ సరిపోలుదు నో
యవనిజ! కపిమాత్రుఁడ నని, తవులుట సందియము నీకుఁ ♦ దగదు సుశీలా!

తా త్ప ర్య ము .

నేను వాయుపుత్రుఁడ నగుటచే వేగాతిశయము చేతను, బలాతిశయము చేతను తండ్రికి సమానుఁడను. వీఁడు సామాన్య వానరుఁడు, ఏమి చేయఁగలఁడని సందేహించుట సత్స్వభావము గల నీకుఁ దగదు.

పవన తనూజుఁడను=పునాతి-పవనః; పవిత్రము జేయువాఁడు. అట్టి వాని కొడుకను. ఆయన గుణములు నాయందుఁగలవు. కావున నొరులపవిత్రు లగు కార్యము గాని, మాటలు గాని నేను చెప్పనని భావము. నీవును సుశీలవు. కావున

నీ కింత దూరము చెప్పఁబూనితిని గాని నీ నడవడి సరిగాదేని నీతో నేను మాట లాడి యుండ నని సుశీలాశబ్దము స్ఫురింపఁ జేసెడిని.

—♦ ౩౬-వ సర్గము. హనుమంతుఁడు సీతాదేవికి శ్రీరామముద్రిక నిచ్చుట ♦—

ఉ. ఇంకను నమ్మవేని జన♦కేశ్వరనందిని! చూడు రామనా
మాంకితమైన యుంగరము♦నాదటఁ బంచె నతండు దీని నీ
కింకరుచేత నీదు మది♦కిన్ ఘటియింపఁగ నమ్మకంబు నీ
యంకిలి దీఱు నం చొసఁగ ♦ నాయమ గైకొని దానిఁ బ్రీతితోన్. ౮౫౭

అర్థములు. రామనామాంకితము = శ్రీరామ యను నక్షరములు చెక్కఁ బడినది. అంకిలి = కలఁత, వ్యాకులత్వము, ఆయమ = అంతవఱకు వీఁడు రావణుఁ డని సందేహించి హనుమంతుని ప్రక్క చూడకుండిన యా సీత ప్రీతితోఁగైకొని = ఇదియేమి మాయయో, యే కమసాలిచేతఁ జేయించుకొని వచ్చెనో యని భీతిచే నిరాకరింపక ప్రీతిచేఁ జేతఁ దీసికొనెను.

కై+కొను = చిరకాలమున విడిచిపోయిన బంధువు ఆప్తుఁడు తటాలున రాఁగానే సంతోషముచే నతని చేతులు పట్టుకొని యాదరించినట్లు చేకొని.

తాత్పర్యము.

జనకరాజు కూతురా! నామాటయందు, నాయందును నీకింకను సందేహము గలదేని శ్రీరామచంద్రమూర్తి పేరు చెక్కఁబడిన యీ యుంగరమును జూడుము. దీనిని నీ కింకరుఁ డగు నాచేత నీకిమ్మని నీవు దీనిని జూచిన నీకు నాయందు నమ్మకము గలుగునని ప్రేమతోనిచ్చి నీయొద్దకుఁ బంపెను. దీనిచే నీమనోవ్యాకులత్వముఁ దీరు నని యా యుంగరమును నామె కిచ్చెను. ఆమెయు దానిని సంతోషముతోఁ గైకొనెను.

దీనివలన సంశయచిత్తులకు, శ్రద్ధచాలని వారికి రామమంత్రముపదేశింపరా దని యేర్పడుచున్నది. సీతాదేవి సందేహము దీరెననియు, శ్రద్ధగలదయ్యె ననియు ౮౫౭వ పద్యంబునఁ జెప్పఁబడెను. ఆ యమ గైకొని దానిఁ బ్రీతితో ననుటచేఁ దారకమంత్రము దొరకెను, ధన్యుఁడనైతినని సంతోషమున గురూపదిష్టమంత్ర మును శిష్యుఁడు గ్రహింపవలె నని యేర్పడుచున్నది. నాకిది చెప్పు, మిది చెప్పు మని యడుగరాదు. గురు వనుగ్రహించినది గైకొనవలెను.

ఈ విధముగ సీతాంజనేయుల చర్యవలన శిష్యలక్షణము, గురు లక్షణము ముముక్షు హితచర్య, భగవన్మంత్రప్రాప్తి చెప్పఁబడెను.

చ. పతికరభూషణంబుఁ గని ♦ పద్మదళాక్షి ముదంబు నొందెఁ దాఁ
బతియె సమక్ష మచ్చుటికి ♦ వచ్చినయట్లుగఁ, దామ్రశుక్రభా

సితనయనాంచితం బయిన ♦ శ్రీముఖ మెంతో వికాస మొందె న
స్ఫుతగతి రాహుముక్తపరి♦పూర్ణసుధాకరబింబమో యనన్. ౮౫౮

అర్థములు. తామ్ర=కనుగొలుకులందు నెఱ్ఱని కాంతిచేతను, శుక్ర=కంటి గ్రుడ్డుచుట్టు తెల్లని కాంతిచేతను, భాసిత = ప్రకాశించు, నయన+అంచితంబు= కన్నులచేఁ బ్రకాశించు, శ్రీముఖము=శోభాయుక్తమైన ముఖము, రాహుముక్త = రాహువుచే విడువఁబడిన, పరిపూర్ణ=నిండు, సుధాకరబింబము=చంద్రబింబము. ఉత్ప్రేక్షాలంకారము. తాత్పర్యము.

తన మగఁడు హస్తమున ధరించు నాభరణంబులఁ జూచి తన మగఁడే యెదురుగ వచ్చిన విధముగఁ దలంచి మిక్కిలి సంతోషించెను. ఎఱుపు తెలుపు గల కన్నులచేఁ బ్రకాశించు నామె ముఖము రాహువు విడిచిన చంద్రబింబము వలె వికాసము నొందెను.

భర్తృవియోగదుఃఖమే రాహువు.

పతికరభూషణంబు=పాణిగ్రహణ సమయంబునఁ దొలుత నా చేతిని రామచంద్రమూర్తి పట్టుకొన్నప్పుడు నన్ను స్పృశించిన ప్రథమాభరణ మిదియే కదా. నేను బ్రణయకోపము వహించినపుడు నన్ను శాంతిపఱుప నాభర్త గడ్డము పట్టుకొని సమాధానపఱచువేళ నన్ను స్పృశించిన దీ యుంగరమే కదా! నన్నుఁ గౌఁగిలింపఁగోరి కౌఁగిలించు నప్పుడు తనమేని యాభరణములు హారములు లోనైన వన్ని తొలగించి నప్పుడును వదలక యుండిన దీ యుంగరమే కదా. ఇరువురకుఁ బ్రణయకోపము వచ్చి మాటలాడక బిగించుకొని యుండి నపుడు మఱల నన్ను మాటాడింపఁగోరి యీ యుంగరమును నేల విడువఁగా నది నెపముగా మీ యుంగరము నేలఁబడినది తీసికొనుఁడని దాని నందిచ్చు నెపమున మమ్ముఁ గలిపిన దీ యుంగరమే కదా. వివాహకాలమున నాతోడ మా తండ్రి యిచ్చిన కారణముచే నరణ్యమునకు వచ్చునపుడు సర్వాభరణములనువదలియు నన్నుఁబోలెఁ దనతోడ తెచ్చుకొన్న దీయుంగరమే కదా. పచ్చకప్పురపుఁ దిప్పల వెన్నెల కుప్ప లాడునపు డొక కుప్పలో దీనిని నా భర్త దాఁచి యుంచఁగాఁ గనిపెట్టి నేను దెచ్చి యిచ్చుచుండున దీ యుంగరమే కదా. అని యిట్లనేకములు తలంపులు పూర్వకృత్యములు మనస్సునకు రాఁగా నుంగరమును బట్టి చేయి, ఆ మూలమునఁ గ్రమక్రమముగ నాకారమంతయు స్పష్టముగ భావనాతిశయబలమున గోచరింపఁగా భర్తయే యెదుట వచ్చి నిలిచెనని కౌఁగిలింపఁబోయె నని, రామచంద్రమూర్తి సమక్ష మచ్చటికి వచ్చినట్లని కవి గూఢముగ సూచించెను. ఈ క్రమము భగవన్మూర్తి ధ్యాన సోపాన మార్గమును దెలుపుచున్నది. ఇది శిష్యుని యుత్తరకార్యము. భగవన్మూర్తి యెదురుగ వచ్చి నిలచినట్లు తోఁచువఱకు ని ట్లుపాసింపవలెను. అప్పుడు రామచంద్రమూర్తియే వచ్చి యుండిన సీతాదేవి కౌఁగిలింపక యుండునా ?

పద్మదళాక్షి=పద్మము ముకుళించి యుండిన రేకులు తెలియరావు. కావున విచ్చిన పద్మ మనియే చెప్పవలెను. దాని వలన సీతాదేవియు సూర్యుని జూచిన కమలమువలెఁ దన ముఖమును వికాసింపఁజేసెనని భావము. ఉంగరమును జూచి నంతమాత్రముననే ముదంబు చెందిన సీత యిఁక రామాగమనము రావణవధ పునస్సంగమము గలిగిన నెంత యామోద ప్రమోద సమ్మోదములు గాంచునో కదా యని సూచన.

తామ్ర శుక్ర నయనంబులు=రక్తవర్ణము: నీ విన్ని దినాలు నన్నుపేక్షించి తివిగదా యని కోపమును - స్వయంకృతాపరాధమునకు నాయన నననేల యని శుక్రవర్ణము శాంతిని గన్నులు సూచించెను.

క. హ్రీమతి బాలామణి పతి, సేమము సందేశవార్తఁ ♦ జెప్పఁగఁ గపియుక్
సామోదంబుగ విని యా,సామీరిని గౌరవించి ♦ స్తవ మొనరించెన్. ౫౫

అర్థములు. హ్రీమతి=లజ్జగలది. తనయందు భావోదయము, భావోల్బణము, భావశాంతి తాను జవాలున లేచి భర్తను గాగిలించుకొనఁ బోవుట యీ చేష్టలకు హనుమంతుఁ డే మనుకొనునో యని సిగ్గుపడెను.

మీఁదఁజెప్పిన విషయము కవిహృదయము. కాదేని యిచ్చట 'హ్రీమతి' వ్యర్థవిశేషణము, అప్రస్తుత మగును. సిగ్గు పడవలసిన వేఱు కారణము లేదు. ఈ యర్థమును బాలామణి యను శబ్దము బలపఱచుచున్నది. సీత యిప్పుడు ముప్పది రెండేండ్లది కావున బాలనాయిక కాదు. అట్లుండియు బాలామణి యనుటచే నా సమయంబున ముగ్ధనాయికయందలి గుణము లజ్జ యామెయందుఁ గానవచ్చె నని భావము.

'ఉదయ ద్యౌవనా ముగ్ధా లజ్జావిజిత మన్మథా' యని కదా ముగ్ధ లక్షణము. సామోదంబుగన్ = ఆమోదముతోఁ గూడినట్లుగ, తొలుతటి మోద మిప్పు డామోద మయ్యెను. సామీరి = సమీర కుమారుఁడు = ఆంజనేయుఁడు. సమీరుఁ డనఁగా 'సమ్యక్ ఈరతి - సమీర' యని వ్యుత్పత్తిప్రకారము చక్కఁగాఁ జెప్పువాఁ డని యర్థము.

''వ్యాహర త్యభిదత్తేభిదధా తీరయతీ త్యపి'' యని క్రియా నిఘంటువు. కారణ గుణము కార్యమం దుండును, గావున ప్రియ వక్తృత్వ మాంజనేయునందుఁ గలదని భావము. స్తవము=స్తోత్రము. స్తవ మొనరించె ననుట గురుస్తోత్రము గురు మాహాత్మ్య వర్ణనము దెలుపుచున్నది. భగవన్మూర్తి సాక్షాత్కరింపఁ జేసిన గురువు నెంత స్తోత్రము చేసినను గొఱతయే.

తాత్పర్యము.

లజ్జావతి యగు నా బాలిక పతిక్షేమము, పతివార్త కపీశ్వరుఁడు చెప్పఁగా

మిగుల సంతోషముతో విని, ప్రియవాక్యములు చెప్పు నాంజనేయుని సన్మానించి యిట్లు స్తోత్రము చేసెను.

"ఆత్మజ్ఞ మర్చయే ద్భూతి కామః" అను శ్రుతివాక్య మిట ననుసంధించునది.

——♦సీతాదేవి హనుమంతుని బ్రశంసించి శ్రీరామాదుల కుశలం బడుగుట.♦——

సీ. జలనిధి యోజన♦శతము గోష్పదముగా, లంఘించి యొక్కఁడ లంకఁ జొచ్చి
తీవె శూరుండవు ♦ నీవె సమర్థుండ, వీవె ప్రాజ్ఞుఁడవు ♦ కపీంద్రచంద్ర!
సామాన్యవానరుఁ♦గా మది నమ్మంగఁ, జాల రావణుఁ డన ♦ సంభ్రమంబు
సంత్రాసమును లేమి ♦ సమభిభాషింపగఁ బావని తగుదువు ♦ ప్రాణనాథుఁ

తే. డైన శ్రీరామునకుదూత ♦ వగుటఁ జేసి; పంపఁ డతఁ డపరీక్షితుఁ ♦ బవనతనయ!
యందులోపల నా కొఱ ♦ కంపునపుడు, పటుపరాక్రమనంతునిఁ ♦ బంపుఁ గాని.

అర్థములు. సంభ్రమంబు=తొట్రుపాటు, సంత్రాసము=భయము, సమభిభాషింపఁగన్ = ఆంజనేయుఁడు ౪౧౭ వ పద్యంబున నభిభాషింపు మని కోరెను. దాని కిది ప్రత్యుత్తరము. భాషించుట యనఁగా నీ వెవ్వరనిన నీ వెవ్వరనిన క్రొత్త వారి వలె నేవో ముచ్చటలాడుట. అభిభాషించుట, యనఁగాఁ బరిచితు లగు వారు చేయు కుశల ప్రశ్నాదికము. సమభిభాషించుట యనఁగా నితరు లెవ్వ రెఱుఁగని యంతఃపుర రహస్యములు కూడఁ జెప్పుట. దశరథుఁ డను రాజని హనుమంతుఁడు చెప్పుట ౭౪౧ మొదలు పద్యంబులఁ గలదియు ౭౪౪ పద్యము మొదలు గలదియు భాషణము. ౭౯౬ మొదలుకొని యభిభాషణము. ఇఁకఁ జేయఁబోవునది కాకాసుర వృత్తాంతము, తిలక వృత్తాంతము సమభిభాషణము. నీ వభిభాషింపు మని కోరితివి గాని సమభిభాషింప నీవు యోగ్యుఁడవు.

ఏల ననఁగా:—పావని వగుటచే, పావని=(౧) ఆంజనేయుఁడు (౨) పవిత్రుఁడు. ఉపసర్గముల గుఱించిన యీ సూత్రము లిచ్చట ననుసంధింపనగు. "ఉపసర్గేణ ధాత్వర్థో బలాదన్యః ప్రతీయతే। ప్రహారాహార సంహార విహార పరిహారవత్॥ ధాత్వర్థం బాధతే కశ్చిత్ కశ్చిత్త మనువర్తతే।తదేవ విశినష్టస్య ఉపసర్గ గతి స్త్రిధా" అను సూత్రముల ననుసరించి యీ యర్థము సాధితము.

తాత్పర్యము.

నూఱామడగల సముద్రమును గోవుపాదమంత గుంతవలెదాఁటి యొక్కఁడవే లంకలోఁ బ్రవేశించితివి. వానరేశ్వరా? నీవే శూరుఁడవు. నీవే కార్యసాధకుఁడవు. నీవు మహాబుద్ధిమంతుఁడవు. రావణుఁ డనిన నందఱుఁ దత్తఱలాడుచుండ నీవు వాఁ డనిన తొట్రుపాటు పడవు. భయముపడిన వాఁడవు కావు. కావున నిన్ను నన్ని క్రోఁతులవంటి క్రోఁతి వని నేను నమ్మలేను. నా ప్రాణనాథుఁడైన శ్రీరామచంద్రమూర్తికిఁ బావనీ! నీవు దూతవు గావున నీతో రహస్యవిష

యములైన జెప్పుటకుఁ దగుదువు. ఏలన శ్రీరామచంద్రమూర్తి సామాన్య కార్యములకే పరీక్షించి గాని దూతను బంపఁడు. అందు నా యొద్దకుఁ బంపునపుడు విశేష పరాక్రమము గలవానిని బంపును గాని దుర్బలునిఁ బంపఁడు. నా మగఁడు నచ్చిన బంటు గావున నీకు రహస్యవిషయములు గూడఁ జెప్పఁదగుదువు. శూరుఁడవు, సమర్థుఁడవు, ప్రాజ్ఞుఁడవు అను పదంబులు జ్ఞానశక్తి బలంబులఁ దెలుపుచున్నవి. అనాయాసముగ జలనిధిలంఘించి యనుట బలమును, ఒక్కఁడవే యనుటచే సామర్థ్యమును, లంకఁ బ్రవేశించి నన్నుఁ దెలిసికొనుటచే జ్ఞానమును దెలుపఁబడెను. కపి+ఇంద్ర+చంద్ర = కపి = సూర్యుఁడు-జలమును బానమును జేయువాఁడు; 'కపయోర్కేభవానరాః' నానా. ర. ఈ ముచ్చెరగుణములు నీయందున్నవి. తపింపజేయు సూర్యునివలె నీవు శూరుఁడవు. ఇంద్రునివలె సమర్థుఁడవు. మనోధిష్ఠానదేవత యగుచంద్రునివలెఁ బ్రాజ్ఞుఁడవు. సంత్రాసము = అంత సముద్రమునకు - ఇంతటి రావణునకు భయపడవైతివి. ఇఁక నిన్ను భయపెట్టునది యేది కలదు?

పటు పరాక్రమవంతునిఁ బంపుఁగాని, ఇచ్చట గాని యేవార్థక బోధకము, పటుపరాక్రమవంతునే పంపును. అట్టివాఁడు కాని వానిని బంపడని యర్థము. కాని, యనుక్త వాక్య పదగ్రాహకం బగు నవ్యయము. (ప్రౌ. వ్యా. వా. ౧౮ సూ).

హనుమంతునియందు జ్ఞానశక్తిబలములు మూఁడుగుణములుగలవనియిందుఁ జెప్పఁబడెను. వీర్యము తేజస్సు యుద్ధకాలమునఁ జెప్పఁబడును. కావుననే నీవు రామునంతటి వాఁడ వని జాంబవంతుఁడు చెప్పెను.

సీ. సత్యసంగరుఁడు కౌ♦సల్యాతనూజుండు, కుశలిగా నా భాగ్య♦వశతఁ దంద్రి!
యనుపమగుణి సుమి♦త్రానందవర్ధనుం,డా లక్ష్మణుఁడు సుఖి♦యా హితేంద్ర?
రాముండు కుశలియేఁ♦భూమివార్థులఁ గాల్ప, లేదుగా కల్పాగ్ని♦లీలఁ గినిసి?
కా కేమి శూరులు♦నాకుల గెల్వరే, కలనిలో నా పాప♦ఫలము గాక
తే. యున్నవాఁడు గదా రాముఁ ♦ డన్న! చెపుమ
మద్వియోగవ్యథాప్తిని ♦ మఱుఁగకుండ?
నాకుఁగాఁ బరితాప మం ♦ దండు గాదె?
యెంచునా మీఁదికార్యంబు ♦ లెన్నఁ డైన? ౮౬౧

అర్థములు. సత్యసంగరుఁడు=(౧) యథార్థమైన ప్రతిజ్ఞగలవాఁడు. (౨) 'పాతునె నిను నాత్మజ్ఞుఁడు, ఖ్యాతివలెఁ నీకు నేల కళవళ పడఁగఁ' అనిచెప్పెనే, అట్టివాఁడు నన్ను విడిచియున్నాఁడె. ఇదియా సత్యప్రతిజ్ఞత్వము. ఇది నర్మోక్తి యని గ్రహించునది. కౌసల్యాతనూజుండు కాని దశరథతనూజుఁడు కాఁడు. దశరథుకొడుకైన యెడల నాయనయం దుండు బలపరాక్రమ శౌర్య సత్యసంధత లేవీ లేవే. ఆఁడుదానియం దుండు గుణము లున్నవే. కౌసల్యాతనూజుండు=కౌసల్య కడుపునఁబుట్టి యామె నేమి సంతోషపెట్టెను, ఇఁక నన్ను సంతోషపెట్టుటకు?

ఆమె యక్కడ నేడ్చు చున్నది. నే నిక్కడ నేడ్చుచున్నదానను. కుశలిగా నా భాగ్యవశత = నా భాగ్యవశమున బాగున్నాఁడుకదా ? ఆయన యెందైన నుండనీ బాగున్నాఁడుకదా! నాకంతే చాలు. నే నెట్లు పోయిన నాయనకేమీ ? కౌసల్యా తనూజుండు కుశలియా = నేను నిర్భాగ్యురాలనే. ఆమె కడుపు చలువచేత్తనైన క్షేమముగా నున్నాఁడుకదా. అదియే నాపాలికి భాగ్యము. తండ్రీ! తండ్రితోఁ జెప్పు కొన్నట్టు సిగ్గు బిడియము విడిచి తండ్రివలె నన్నాదరించి నా కష్టములు తొలగించెద వని చెప్పుకొనుచున్నాను. గాని పరాయివాఁడవు దూత వని నేను జెప్పఁ బూన లేను. మగఁడు వదలిన ఆఁడుబిడ్డలు తమ దుఃఖమును దండ్రితోఁ జెప్పుకొనక మఱి యెవరితోఁ జెప్పుకొందురు ?

అనుపమగుణి = అసమానమైన గుణములుగలవాఁడు. రామునివలె నొకటి చెప్పి మఱియొకటి చేయువాఁడు గాఁడు. ఎంత చెప్పునో యంతే చేయువాఁడు. సుమిత్రానందవర్ధనుఁడు = రామచంద్రమూర్తి యడవికివచ్చి తల్లిని దుఃఖపెట్టెను. లక్ష్మణుఁ డన్న వెంట వచ్చి తల్లిని సంతోషపెట్టెను. అటువంటి లక్ష్మణుఁడు రామ దాస్యమే చిహ్నముగాఁ గలవాఁడు, రామునకుఁ గష్టము దోఁపనీయక సేవ సేయుటే సుఖముగా నెంచు చున్నాఁడు గదా. హితేంద్రా = నా హితము కోరు బంధువు లున్నారు. ఏమి లాభము ? అక్కఱ వేళకు నీ వాదుకొన్నట్లు వార లాదుకొనఁ గలిగిరా? కావున నా మేలు కోరు బంధువు లందఱిలో నీవే శ్రేష్ఠుఁడవు. అక్కఱకు రాని చుట్టము లుండియు నేమి ప్రయోజనము ?

రాముండు కుశలియేన్ = రామచంద్రమూర్తి కుశలిగా నున్న పక్షమున, భూమి వార్ధులన్ = భూమిని సముద్రమును, కల్పాగ్నిలీలన్ = ప్రళయకాలాగ్నివలె, కినిసి = కోపించి, అయ్యో! రాముఁడు ప్రాణములతో నుండినయెడల నా నిమిత్తమై కోపించి ప్రళయకాలాగ్నివలె భూమిని సముద్రమును గాల్పకున్నాఁడా ? నన్ను రక్షించుకొనుటకై యంతపని చేసి యుండునే, చేయలేదా ? అది యాయనకుఁ గష్ట కార్యము గాదే. ఆయన కన్నెఱ్ఱనైనఁ జాలును. అదియే ప్రళయకాలాగ్ని చేయు పని చేయును గదా. విల్లు చేతికిఁ దీసికొని యెక్కుపెట్టి బాణము సంధించి సముద్ర ముపై నొకటి, భూమిపై నొకటి ప్రయోగింపవలెనా? ఆంజనేయా! రాముఁడు కుశలి యని నీవు చెప్పుటచే నమ్ముచున్నాను గాని యంతకార్యము చేయలేదు గావున మఱియొకరు చెప్పిన నమ్మియుండను. నీవుచెప్పుటచే నమ్మెదనుగాని యంతకార్యము చేయకుండుటచే నామీఁదఁ బ్రేమ తప్పినదని తలఁచెదను. లేదా యంతటిశక్తి లేదని తలఁచెదను. వారి శక్తి యాఁడుదానిని జంపను, ఆఁడుదాని ముక్కులు చెవులు గోయనే కాని యిటువంటి వారిని దండించుటయందు లేదు.

కాకేమి శూరులు = శూరులు కాకేమి? శూరులే యగుదురు. నాకులన్ = నాకులనైనను = దేవతలనైనను, నాకము + ఇ = నాకి = స్వర్గమందుండువారు,

గెల్వరా = గెల్వలేరా. నా పాపఫలము వారికి నాయందు దయ తప్పఁజేసి వారి శౌర్య ముపయోగింపకుండఁ జేసినది. ఆకారణముచే; మద్వియోగ వ్యథార్తిని = నన్ను విడుచుట వలనఁ గలిగిన దుఃఖముచే, మఱుఁగకుండఁగ = సంతాపింపక, నీళ్ళు కళవెళ కళవెళ క్రిందికి మీఁదికి మసల గ్రాఁగుట మఱుఁగుట యందురు.

తాత్పర్యము.

తండ్రీ! సత్యప్రతిజ్ఞగల కౌసల్యాకుమారుఁడు నా భాగ్యవశమునఁ గుశలముగా నున్నాఁడుగదా. అసమానగుణవంతుఁ డగు సుమిత్రానందనుఁడు లక్ష్మణుఁడు హితేంద్రా! సుఖమా? రాముఁడు కుశలముతో నుండినఁ బ్రలయకాలాగ్నివలెఁ గోపించి నా నిమిత్తమై భూమిని, సముద్రమును గాల్పలేదు గదా. వారు శూరులు కారా, శూరులే. దేవతలనైనను యుద్ధమందు గెల్వఁగలవారే. నాపాపఫలమువలన వారాప్రయత్నము చేసినవారుగారు. అన్నా! యాంజనేయా! నన్నెడఁబాసిన తపముచే రామచంద్రమూర్తి సంతాపింపకున్నాఁడుగదా. నాకొఱకై యాయన దుఃఖింపఁడు గదా. నా విషయమునఁ గాకున్నఁ దన విషయమే యైనను నిఁక మీఁద నయోధ్యయందుఁ జేయవలసిన కార్యములు మఱల బెండ్లియాడుట మొదలైనవి యాలోచించు చున్నాఁడా? లేక నావిషయమై నాప్రియురాలి కింత కష్టము వచ్చెనే, యెట్లు తప్పింత మని చేయవలసిన కార్య మెన్నఁడైన నాలోచించు చున్నాఁడా?

సీ. ఏమఱఁడే కదా ♦ యెల్లకార్యంబులు, దీనుఁడై సంభ్రాంతి ♦ వాన రేంద్ర?
పురుషకారములెల్ల ♦ సరిగఁ జేయును గదా, యారాజనందనుం ♦ డాంజనేయ?
సలుపునా మిత్రుల ♦ శత్రులయెడ రెండు, మూఁడుపాయంబులు ♦ మోసపోక?
గడన సేయునుగదా ♦ కడుమిత్రవర్గంబుఁ! జెలికాండ్రు రతని బూ ♦ జింతు రయ్య?
తే. దేవతానుగ్రహమునుజిం ♦ తించునొక్కొ? పౌరుషంబును దైవంబుఁ ♦ బరగుచున్న?
కరము దవ్వైన నామీఁదఁ ♦ గరుణ గలఁడె? బ్రోచునా నన్ను నే బాధ ♦ బ్రోచితండ్రి?

అర్థములు, పురుషకారము = మనుష్యులు చేయవలసిన ప్రయత్నము. మిత్రులయెడ సామదానములను రెండుపాయంబులు. శత్రులయెడ దానభేద దండములను మూఁడుపాయంబులు, గడనసేయునుగదా = సంపాదించునుగదా.

తాత్పర్యము.

నన్నెడఁబాసిన కారణముచే శోకతప్తుఁడై తొట్రుపాటుచేఁ జేయవలసిన కార్యములన్నియు నేమఱక చేయుచున్నాఁడుగదా. (ఇవన్నియు నర్మగర్భితములని యెఱుఁగవలయును.) నామీఁద ప్రేమ మునుపటివలెనే యుండెనా? (ఈకార్యము లేవియుఁ జేయఁజాలఁడని యర్థము.) ఆంజనేయా! ఈ రాజకుమారుఁడు రాజధర్మమనుసరించి చేయవలసిన పురుష ప్రయత్నములులోపము లేక చేయుచున్నాఁడు కదా. మిత్రులందు సామదానములు, శత్రువులందు దానభేదదండము లుపయో

గించుచున్నాఁడుగదా. మిత్రులను సంపాదించుచున్నాఁడా? స్నేహితులతని గౌరవింతురా? దైవ సాహాయ్యము కలుగు నుపాయ మాలోచించుచున్నాఁడు గదా! పౌరుషమునునమ్మి దైవమునునమ్మి పురుష ప్రయత్నము విడువక రెంటిని నాశ్రయించి యున్నాఁడుగదా. ఇన్ని కార్యముల సందడిలో మిగుల దూరమం దుండు నన్నెప్పుడైనఁ దలఁచునంతటి దయగలదా? ఈ బాధనుండి తొలగించి నన్ను రక్షించు నని యాశగలదా?

క. ఆగర్భశ్రీమంతుఁడు, భోగి వ్యథానర్హుఁ డైన♦పుణ్యుఁడు రాముం
డీగతి నాకై దుఃఖా,భోగంబున మిగుల నవసి♦పో లేదు గదా? ౮౬౩

అర్థములు. ఆగర్భ శ్రీమంతుఁడు = తల్లికడుపులో నుండినది మొదలు సంపద ననుభవించినవాఁడు, శ్రీ యాయనకు నిత్యానపాయిని గదా. (౨) శ్రీ శబ్దమునకు విషమనియు నర్థము గలదు. తల్లి గర్భమునందుండి హృదయమున విషము గలవాఁడే. భోగి = (౧) భోగము లనుభవించువాఁడు, (౨) సర్పము, వ్యథానర్హుఁడు = దుఃఖపడఁదగిన వాఁడు కాడు. (౨) పరులబాధ యెట్టిదో తెలిసికొను యోగ్యత లేనివాఁడు, పుణ్యుఁడు = పుణ్యమూర్తి. (౨) వక్రోక్తి–పుణ్యము నెఱుఁగనివాఁడు. రాముఁడు–(౧) రామచంద్రమూర్తి. (౨) పైకి నభిరాముఁడుగాఁ గనఁబడువాఁడు. దుఃఖాభోగంబునన్ = దుఃఖాతిశయముచే, నవసి = శుష్కించి.

తాత్పర్యము.

ఆంజనేయా! తల్లిగర్భమున నుండునది మొదలు సంపద ననుభవించువాఁడు. పుట్టిన పిమ్మట భోగములే నిత్యముగా ననుభవించువాఁడు, దుఃఖ మెట్టిదో యెఱుఁగ నర్హుడు కానివాడు. ఇట్టి రాముఁడు అడవులలోఁ దిరుగుటచే నెంత శుష్కింపవలయునో యంతేగాని, నా నిమిత్తమై దుఃఖాతిశయముచే విశేషించి శుష్కింపక బాగున్నాఁడు కదా.

తల్లిగర్భము నం దుండినది మొదలు విషముగల పాము తన కాటువలనఁ బరులు పడు బాధ యెట్లు తెలిసికొనఁగలదు? యట్లే తన యుపేక్షచే నేను బాధపడుచుండ నాకై యా పుణ్యుఁడు (వ్యతిరేకలక్షణ) దుఃఖించుచు మిగుల శుష్కింపక పూర్వమువలె బాగున్నాఁడుకదా!

సీ. కౌసల్యయు సుమిత్ర ♦ కపివరా! భరతుండు, కుశలు లే? యవ్వార్త♦విశదపడునె?
భ్రాతృవత్సలుం డైన♦భరతుఁడు నాకయి, యక్షౌహిణీసేన ♦ నంపునయ్య?
దంతనఖాయుధ♦తరుచరకోటితో, సుగ్రీవుఁ డీ లంకఁ ♦ జొచ్చునయ్య?
సత్త్వసంపన్నుండు♦సౌమిత్రి యసురులఁ, నానాస్త్రవృష్టిని ♦ నఱకునయ్య?
తే. చూతునా నేను భీకర♦శాతబాణ, దారితాంగు సబాంధవు♦దశశిరస్కు?
నా నిమిత్తంబువగచుచు♦న్నాఁడె? యేక,మతియె నాపతి యణఁపనా♦యతులితార్తి?

అర్థములు. అవ్వార్త విశదపడునె = వారి కుశలవార్త యేమైన వినవచ్చు

చున్నదా. తా మయోధ్య విడిచినది మొదలు కౌసల్యాదుల కుశలవార్తవచ్చుటయే లేదేని యిప్పు డీమె యీ ప్రశ్న వేయఁ గారణము లేదు. దీనివలన భరతుఁడు గుహుని మూలమున మనుష్యులఁ బంపి తమ వార్త రామాదులకుఁ దెలుపుచు వారి వార్త తాను దెలిసికొనుచుండె నని యేర్పడుచున్నది. అటుగాకున్న నంతటి భ్రాతృవత్సలుఁ డన్న వదినె యడవిలో నేగతి పట్టిరో విచారింపక యింతకాల మూరకుండునా? సీతాపహరణము వఱకు నిట్లే జరుగుచుండెను గాని, యున్నట్టుండి యాశ్రమము వదలి వచ్చిన కారణముచేఁ దమ వార్త వారికి, వారి వార్త వీరికిఁ దెలియలేదు. ఈ యభిప్రాయమును భ్రాతృవత్సలుఁ డైన భరతుఁడు నాకయి యక్షోహిణీ సేన పంపునా? యను ప్రశ్న బలపఱుచు చున్నది. వాడుక ప్రకారము వచ్చువారు తాము పంచవటి విడిచిన తరువాతఁ బంచవటికి వచ్చి తన వృత్తాంతముఁ దెలిసికొని పోయి భరతునకుఁ జెప్పి యుందు రనియు నాయన తనకుఁ గల యక్షోహిణీసేన రామచంద్రమూర్తికి సహాయముగాఁ బంపియుండు ననియు సీత యూహించెను. ఈ యూహ యపోహము గాదు. ఉత్తర కాండంబున ౧౭౧-౧౭౭ పద్యములఁ జూడుఁడు. కం. జనకావనీశు నందిని, వనముల హ్యాతమైన వార్త భరతుఁడు విని మి, మ్మనఘాత్ములార పిలిపించిన వచ్చితి రెల్ల రీరు స్నేహము పేర్మిన్'' ఇత్యాది వాక్యములు భరతుఁడు సీతారాముల కుశల వార్త తెప్పించుకొనుచుండె నని స్థిరపఱుచుచున్నవి. పూర్వ మీ విషయము చెప్పఁబడకుండినను వాల్మీకి శైలి ననుసరించి యీ ప్రశ్నవలన నది ముందు జరగుచున్న ట్లూహింపవలెను.

దంత నఖాయుధ తరుచర కోటితోన్=దంతములు, గోళ్ళు నాయుధములు గాఁగల క్రోఁతుల సమూహముతో, సత్త్వ సంపన్నుఁడు=బలసంపత్తి గలవాఁడు, భీకర శాత బాణ=భయంకరములై వాఁడియైన బాణములచే, దారితాంగు=చీల్పఁబడిన దేహము గలవానిని, సబాంధవున్=బంధువులతోఁ గూడిన వానిని.

## తాత్పర్యము.

కౌసల్యయు, సుమిత్రయు, భరతుఁడు క్షేమముగా నున్నారా? ఆవార్తయేమైన దెలియ వచ్చుచున్నదా? అన్నయందు ప్రేమగల భరతుఁడు నా నిమిత్తముగఁ దనకు గల యక్షోహిణీసేనను బంపునా? దంతములు, నఖములు సాధనములుగాఁ గల వానరసమూహములతో సుగ్రీవుఁ డీ లంకయందుఁ బ్రవేశించునా? బలసంపత్తి గల లక్ష్మణుఁడు రాక్షసుల నెల్ల నానాస్త్రవర్షముచే నఱకివైచునా? దశకంఠుఁడు బంధువులతోఁడ భయంకరములైన వాఁడి బాణములచేఁ జీల్పఁబడిన దేహము గలవాఁడై నేలఁబడి యుండఁజూడఁగలనా! అయ్యో! రామచంద్రమూర్తి నాకింత కష్టము వచ్చెనుగదా యని వ్యసనపడుచున్నాఁడా? నా దుఃఖమును బాపుటయందుఁ జపలుఁడుగాక యేకనిశ్చయముతో నున్నాఁడా?

చ. పరమనవీనహేమసమ♦వర్ణము పద్మసమానగంధియై
సురుచిరమైన మన్నయన♦సోమముఖంబు మరుత్తనూజ! మ
ద్విరహముపేరిమిన్ వ్యసన♦దీనత నీరము లింకఁ దమ్మికిన్
దరమయి వాడిపోలేదు గ♦దా వచియింపఁగదయ్య తత్త్వమున్. ౨౮

అర్థములు. పరమ నవీన హేమ=శ్రేష్ఠమై పుటము వేసి తీసి మెఱుఁగు పెట్టఁబడిన శుద్ధమైన బంగారుతో, సమ=సమానమైన. వర్ణము=కాంతి గలది, ఇచ్చట మెఱుఁగు మాత్రమే వివక్షితముగాని పసిమి వివక్షితముగాదు, పద్మసమానగంధి=తామర పూవుల వాసనవంటి వాసన గలది, సురుచిరమైన=అందమైన, మన్నయన సోమముఖంబు=నా కన్నులకుఁ జంద్రునివంటిదగు ముఖము. తరమయి=సమానమయి, తత్త్వమున్=వాస్తవమును.

తాత్పర్యము.

అప్పుడు పుటము వేసి తీసి మెఱుఁగుపెట్టబడిన శుద్ధమైన బంగారు మెఱుఁగు వంటి మెఱుఁగు కలదియు, పద్మముల వాసన వంటి వాసన గలదియు, నందమైనదియు, నా కన్నులకుఁ జంద్రునివంటిదియునగు రామచంద్రమూర్తిముఖము, వాయునందనా! నన్నుఁ బాసిన తాపముచేఁ గలిగిన దైన్యము వలన నీళ్లింకిన తామరవలె వాడి పోలేదు గదా. అయ్యా! నిజము చెప్పుము.

ఉ. క్రౌర్యముతోడఁ గైకయి య♦రణ్యములం బడు మన్న ధర్మ్య స
త్కార్య మటంచు నెంచిన వి♦కార విదూరుఁడుఁ, నేను బాదసం
చర్యఁ జరింపఁ గానఁ గనఁ♦జాలినధీరుఁడు, నేఁడు దీనుఁడై
ధైర్యము నుజ్జగింపఁడు గ♦దా కపినాథ! నిజంబుఁ జెప్పుమా. ౨౯

అర్థములు. క్రౌర్యము=దయలేని తనము; ధర్మ్యసత్కార్యము=ధర్మయుక్తమైన మంచిపని; వికార విదూరుఁడు=మనసున మాఱుపాటు లేనివాఁడు, పాదసంచర్యన్=కాలినడకతో, ధీరుఁడు=ధైర్యశాలి; ఉజ్జగింపఁడు=మానఁడు; రాముని విషయమైన సీతాదేవి మాట లన్నియు సర్వోక్తులే.

తాత్పర్యము.

దయలేనిదై, రామా! నీ వడవులఁ బడఁ బొమ్మని చెప్పఁగా సవతితల్లిమాట ప్రకారము వర్తించుట ధర్మయుక్త కార్య మని పట్టాభిషేకము చేసికొమ్మన్నప్పుడెట్లుండెనో యట్టులే కోపచిహ్నములు గాని, భయముగాని, వ్యసన చిహ్నలుగాని కనఁబఱుపని వాఁడు. నేను బదునెనిమిదేండ్ల పిల్లను, గాఁడవులలో, ముండ్లలో ఱాలలోఁ దనకన్నుల యెదుట గాలినడఁ దిరుగుచున్నను అప్పుడునుమనస్సులోజాలి యనునది లేక యూరక ధీరతఁ జూచుచుండిన ధైర్యశాలి, యిప్పుడు సీతపోయినఁ బోనిమ్మని ధైర్యము విడువక యున్నాఁడు గదా. ఆంజనేయా! నిజము చెప్పుము.

ఉ. ఓ మనుదాన దూతుఁడ! మదీశ్వరు, నాపయి కూర్మికంటె శ్రీ
రామున కాత్మమాతపయి రా జగు తండ్రిపయిన్ హితాళిపైఁ
బ్రేమము హెచ్చు గాదు సరిప్రీతియుఁ గా, దటు గావునం గదా
యా మహితాత్మువార్త వినునంతకు నిల్పితి మేనఁ బ్రాణముల్. ౫౬౭

తాత్పర్యము.

అయ్యా! రామదూతా! మా రాముఁడు కఠినచిత్తుఁడు, నిన్ను విడిచి సహించినాఁ డని నిష్ఠురము లాడెదవే, నీవుమాత్రము తక్కువైన దానవా ఆఁడు దాన వయ్యుఁ,జిన్న దానవయ్యు,నింతయాపదలో మునిఁగియుఁ బ్రాణములునిలిపితివే నీ ధైర్యము ముందట మా రాముని ధైర్యమే మాత్రము లే యందువా. నేను బ్రాణములు నిలిపిన కారణము చెప్పెద వినుము. నే నేమని చెప్పుదును. నా హృదయేశ్వరుఁడైన శ్రీరామచంద్రమూర్తికి నా యం దున్న ప్రేమ కంటె నెక్కువ ప్రేమగాని, సమానమైన ప్రేమగాని తన తల్లి యందు లేదు. తండ్రి యం దుండినదికాదు. తన యాప్తులయందును లేదు. ఇది నే నెఱుఁగుదును. ఆ ధైర్యము చేతఁగదా యాయనవార్త వినవచ్చువఱకు బొందిలోఁ బ్రాణములు నిలిపి యున్నదానను. నేను బ్రాణము విడిచితినా నా యందంతటి ప్రేమగలవాఁడు కావున నెటులైన నిచ్చటికి రానేవచ్చును. వచ్చి నేను జచ్చితి నన్న వార్తవిని యాయన 'అయ్యో! నా ప్రేమ వ్యర్థము చేసెఁగదా. నేను వచ్చి తన్ను రక్షింపఁ గలనను ధైర్యము, విశ్వాసము నాయందు లేనిదయ్యెఁగదా. ఎంతదయాహీనురా లని తపించునే, నా యందంతటి ప్రేమగలవానికి నేను దుఃఖము కలిగింప వచ్చునా? ఎన్ని బాధలైన సహించునుగాక యని కదా ప్రాణములు నిలిపితిని. ప్రాణముతీఁపని రక్షించుచున్నానని తలఁచితివా! ఇంత వఱకుఁ బైపద్యములందు వానరేంద్రా! కపీంద్రా! యని సంబోధించుచుండిన సీత యిప్పుడు దూతా! యని సంబోధించెను. ఏల? దూతతోఁ జెప్పినమాట లతని స్వామితోఁ జెప్పినట్లే. అతని స్వామి కా మాట లతఁడు చెప్పవలయు ననియే యుద్దేశ్యము. శ్రీభాగవతమున దశమస్కంధమున గోపికల భ్రమరగీతలు పోల్చి చూచినది.

సీతాదేవి తనయందు రామచంద్రమూర్తికిఁ గల ప్రేమ, యాయన తలిదండ్రులయందుఁగాని యాప్తులగు బంధువులందుఁగాని లేదని చెప్పుటచే భర్తలగు వారు పతివ్రతలగు తమ భార్యలం దట్టిప్రేమ యుంచవలె నని సూచన :— ఏల? అర్థాంగ లక్ష్మియై సగము దేహము పంచుకొని సహధర్మచారిణియై సమాన సుఖదుఃఖయై యీ లోకమునందే కాక పరలోకమునందును, నీ జన్మమందే కాక కడచినట్టియు, రాఁగలట్టియు జన్మంబులందును వెంటనంటియుండు సాధ్వియగు భార్యకుఁ దక్కినవారెట్లు సాటి కాఁగలరు? వారితోడి కూటమికిఋణసంబంధము కారణము. ఒకయాత్మయే కదా రెం డయ్యెను.

చ. అని మధురార్థయుక్తము మహార్థము నౌ వచనంబు లాడి యా
వనజదళాయతాక్షి కపివర్యుని రామగుణానుకీర్తనం
బును విను నాశ మౌనమును బూనిన నాయమఁ జూచి వాయునం
దనుఁడు కరంబుభక్తిఁ గరతామరసంబులు మోడ్చి యిట్లనున్. ౪౬౪

అర్థములు. మధురార్థయుక్తము=తియ్యని యర్థముతోఁ గూడినది, ఆమె చెప్పుమాటలనునింకనుదినవలెనింకనుదినవలె ననియాశకలిగించునవి. రామచంద్రమూర్తి హనుమంతా! సీతాదేవి యేమిచెప్పెననిన నామెమాటలు వినకుండినఁ దానేమిచెప్పఁగలఁడు. కావునవినుచుండెను. వినుకోలఁదిఁ దియ్యగానుండుటను, రామచంద్రునకుఁ జెప్పుటకై వినుట యావశ్య మగుటను సేవకుఁడగు వాఁడునడుమనడుమ మాటలాడరాదు గనుకను, ఆమె చెప్పినమాటలు హనుమంతుఁడూరక వినుచుండెను.

మహార్థము=ఆమాటల యందుండు గొప్పయర్థము. బ్రహ్మచారులగుహనుమంతునకు వాల్మీకికిఁ దెలియునవికావు. కనుక వానిని వివరించి చెప్పఁజాలకసమష్టి మీఁద మహార్థములని వాల్మీకి చెప్పెను. కపివర్యుని=కపులందు శ్రేష్ఠుఁడగు వాని యొక్క—కపులకెల్ల రాజు సుగ్రీవుఁడు—ఆయనమంత్రి, బంటుహనుమంతుఁడు—ఎట్లుకపివర్యుఁడయ్యెను. లౌకికాధికారము బట్టికాదు. సీతాదేవితో నింతచనువుగ నేకాంతమున మాటలాడునధికారము భక్తిపారతంత్ర్యపూర్తిగల హనుమంతునకుఁగలిగెఁ గాని మఱి యేక్రోఁతికిఁగలిగెను? కావున వాస్తవ కపివర్యుఁడు హనుమంతుఁడే.

తా త్ప ర్య ము.

ఈ ప్రకారముగ గొప్పదియుఁ, దియ్యనైనదియు నగు నర్థముతోఁ గూడిన మాటలు చెప్పిసీతాదేవి రామభక్తుఁడును, రామపరతంత్రుఁడునునగుకపిశ్రేష్ఠుఁడు చేయు రామగుణ కీర్తనము వినఁగోరి మౌనమువహించెను. ఇట్లు మాటలుచెప్పుట నిలిపిన యామెయభిప్రాయ మెఱిఁగి మిగుల భక్తిచే హనుమంతుఁడు హస్తకమలములు ముకుళించి యిట్లనియె.

దీనివలన రామభక్తుఁడు సీతారాముల యిరువురయందు సమాన భక్తి, యసమానపారతంత్ర్యము గలవాఁడై యుండవలయు నని యేర్పడు చున్నది. కరంబులు మోడ్చియిట్లనున్ = అనుటచే నుత్తమ స్త్రీలతోఁ గాని యుత్తమ పురుషులతోఁగాని మాటలాడు నపుడు సేవకులు చేతులు కట్టుకొనికాని, యంజలి మోడ్చి కాని మాటలాడవలెఁ గాని, చేతులూఁగు లాడించుచుఁగాని, వ్రేల వైచి కొని కాని మాటలాడ రాదని సూచన.

—— హనుమంతుఁడు సీతాదేవికి ధైర్యోక్తులు చెప్పుట ——

చ. కమలదళాయతాక్షి! యెఱుఁ గందు సుమీ యిట నీదు నునికి నీ
రమణుఁడు, కావునం గద పు రందరుఁ డా శచిఁబోలె నిన్ను శీ

గ్రుముగను దోఁడుకొంచు రగ ♦ రాఁ, డికనే వచియించి నంత వే
గమ చను దెంచు ఋక్షకపి♦కాండసమాకుల సైన్యయుక్తుఁడై. ౧౬౯

అర్థములు. నీ రమణుఁడు = నిన్ను రమింపఁ జేయువాఁడు కదా రాముఁడు–ఏమి కారణము? నీవు కమల దళాయతాక్షి వగుటయే కారణము. కమల దళాయ తాక్షి = తామర రేకులవలె దీర్ఘములైన కన్నులు గలదానా! నీనేత్ర సౌంద ర్యము నెపుడు నీ వద్దను నుండైనఁ జూచుకొన్న దానవో, కావో – చూచినను తేనెకుఁ దనతీపు తెలియనట్లు నీ సౌందర్య మాహాత్మ్యము నీ వెఱుగ లేకయేఁ యున్నావో కాని, నీ దృష్టి తనపైఁబడునాయని రాముఁడే కోరుచున్నాఁడు. నాదృష్టి గుఱించి యేమి చెప్పినాఁ డందువా, నీవు దగ్గఱ నున్నప్పుడు కమలదళాయతాక్షి వఁట. దూరముగా నుండినను కమలదళాయతాక్షివఁట. దగ్గఱనున్నప్పుడునీదృష్టులు తామర రేకులవలె శీతలమై తాపమార్చునఁట. దూరమున నున్నప్పుడుచూరకత్తి వలె మనస్సును జీల్చునఁట. 'కమలం ఛురికాదీనా' మ్మని కమల శబ్దమునకు చూర కత్తి మొదలగు వానికిఁ బేరు. దళశబ్దమునకుఁజీల్చుట ఖండించుట యని యర్థము. అట్టివాఁడు నీవిచ్చట నున్నదానవని తెలిసిన రాకయుండునా? నీవిచ్చటనుండుట యాయన యెఱుఁగఁడు. ఆ కారణముచేత ననుహ్లాదుఁ డపహరించిన శచిని నింద్రుఁడు మఱల గ్రహించుటయం దాలస్యమైనట్లు నీ విషయమందును ఆలస్య మైనది. ఇప్పుడు పోయి నేను జెప్పితినా వానరభల్లూక సేనా సమూహముతో బయలుదేఱి వెంటనే వచ్చును.

ఉ. క్రమ్మెడు క్రూరశాతవిశి♦ఖమ్ములచే వరుణాలయంబు స్త
బ్ధమ్మొనరించి లంక హత♦పాపనిశాటగఁ జేయు నమ్మ! మ
ధ్యమ్మునఁ గాలుఁడైన విబు♦ధాసురకోటులు నైన నాఁగినన్
దిమ్మ వదల్చు నమ్మము మ♦దిన్ నిరవద్యసుశీలభూషణా! ౧౭౦

అర్థములు. క్రూరశాత విశిఖమ్ములన్ = కఠినములై వాఁడిగల బాణము లచే, వరుణాలయంబు = సముద్రము, స్తబ్ధ మ్మొనరించి = కట్టివైచి, హతపాప నిశాటగన్ = చంపఁబడిన పాపపు రాక్షసులు గలది, పాపాత్ములను జంపునే కాని, విభీషణాదులఁ జంపఁడని భావము, కాలుఁడు = యముఁడు, విబుధ+అసురకోటులు = దేవతలయు, దైత్యులయు గుంపులు, ఆఁగినన్ = అడ్డగించినను, దిమ్మ = మత్తు, గర్వము, నిరవద్య = దోషరహితమైన సుశీల = పాతివ్రత్యమే, భూషణా = ఆభరణములు గలదానా.

తాత్పర్యము.

నీవు క్రోఁతివి గనుక సముద్రమును దాఁటితివి. రాముఁ డెట్లు దాఁటునందువా? కఠినములై పదునైన బాణములు ప్రయోగించి సముద్రమును గట్టివైచి లంక యందలి పాపపురాక్షసుల నందఱఁ జంపును. ఈ నడుమ యముఁడైనను, దేవత

లయినను దైత్యులయినను, నడ్డము వచ్చిరా వారికిఁ బట్టిన తలదిమ్ము వదల్చును. తల్లీ ! నిర్దుష్ట పాతివ్రత్యమే యలంకారముగాఁ గలదానా! నా మాట నమ్ముము.

ఇట్లు చెప్పుటచే నింతపని చేయించునని యర్థము. నా పాతివ్రత్యము వ్యర్థముగా బోయె ననిన సీతవాక్యమున కిది ప్రత్యుత్తరము.

క. సింగముచేఁ జిక్కిన మా,తంగమువలెఁ ద్వద్వియోగ♦తాపార్దితుఁడై
యంగన! సుఖము నెఱుంగఁడు, పొంగఱి కృశియించిఁ బూఁట♦పూటకు దేవీ!

అర్థములు. మాతంగమువలెన్ = ఏనుఁగువలె, త్వత్+వియోగతాప+అర్దితుఁడై = నిన్ను నెడఁబాయుట వలనఁ గలిగిన తాపముచేఁ బీడింపఁ బడిన వాఁడై, పొంగు+అఱి = సంతోషము చెడి; ఈపద్యములో మన్మథావస్థలలోఁ గృశత్వ మను నవస్థ చెప్పఁ బడెను.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి చిక్కిపోలేదుగదా యంటివి.ఆయనస్థితి చెప్పెదవినుము. సింహము బారిఁబడిన యేనుఁగువలె నిన్ను నెడఁబాయుటవలనఁ గలిగిన తాపముచే బాధపడుచు సంతోషము చెడి పూఁట పూఁటకుఁ జిక్కిపోవుచున్నాఁడు.

చ. మలయసుమేరువింధ్యధర♦మందరదర్దురభూధరాళిపై
ఫలముల వేరువెల్లకుల♦పై జననీ! శపథంబుఁ జేసెదన్
గలవు కనంగ భవ్యతర♦కంజవిలోచన ముజ్జ్వలోరుకుం
డల మరుణాధరంబు నగు ♦నాథమనోజ్ఞ ముఖేందుబింబమున్. ౨౨

అర్థములు. భవ్యతరకంజ విలోచనము=శుభకరమైన కమలములవంటి కన్నులు గలదియు, ఉజ్జ్వలోరుకుండలము=ప్రకాశించు గొప్ప కుండలములు గల దియు (ఉంగరమువలె దీనిని విసర్జింప లేదు. ఉత్తచెవులతో నుండరాదు గావున) అరుణాధరంబు=ఎర్రని పెదవిగలదియు, అగు, నాథ=రామచంద్రమూర్తియొక్క, మనోజ్ఞ=అందమైన, ముఖేందుబింబమున్=చంద్రునివంటి ముఖమును.

తాత్పర్యము.

తల్లీ ! నేను రిత్తయోదార్పుమాటలు చెప్పరాలేదు. మలయము, మేరువు, వింధ్యపర్వతము, మందరము, దర్దురము, లోనగు కొండల మీఁదను మాకాహార మైన పండ్లు, వేర్లు, గడ్డల మీఁదను ప్రమాణము చేసి చెప్పుచున్నాను. నీవు మే లయిన కమలములవంటి కన్నులు, గొప్ప కుండలములు, ఎఱ్ఱని పెదవిగల నీ మగని రామచంద్రుని యందమైన ముఖమును జంద్రునివలెఁ జూడఁగలవు.

క. రామునిఁ బ్రస్రవణతటీ,ధామునిఁ జూడంగఁ గలవు ♦ త్వరగా నల సు
త్రామునివిబుధాలయగత,భా మానితనాకపృష్ఠ♦భాసితుఁ బోలెన్. ౨౩

అర్థములు. ప్రస్రవణతటీధామునిన్ = ప్రస్రవణ పర్వతమం దిప్పు డుండు వానిని, సుత్రామునిన్ = ఇంద్రుని, విబుధాలయ గత = స్వర్గమందుండిన, భామా

నిత = కాంతిచేఁ బూజింపఁబడు, నాకపృష్ఠ భాసితుఁ బోలెన్ = నాకపృష్ఠమనుపర్వత ప్రదేశమునఁ బ్రకాశించు వానివలె.

తాత్పర్యము.

నేను జెప్పినది యసత్యమని నమ్మవేని రమ్ము. నీవేస్వర్గమందలినాకపృష్ఠము నందుండు నింద్రునివలెఁ బ్రస్రవణ పర్వతశిఖరంబున నున్న రామచంద్రమూర్తిని జూడఁగలవు.

క. మాంసము ముట్టఁడు రాముఁడు, హంసీవరయాన! మధువు♦నాసింపఁడు సా
యంసమయముల్ మాత్ర మ,హింసారతి వన్యఫలము♦లించుక కొనెడిన్.

అర్థములు. మధువు = తేనె, వన్యఫలములు = అడవియందుఁ బుట్టిన పండ్లను, ఇంచుక = కొంచెము.

శ్లో॥ దృఙ్మనస్సంగ సంకల్ప జాగరాః కృశతాఽరతిః
హ్రీత్యాగోన్మాద మూర్ఛాంతా ఇత్యనంగదశా దశ.

యని మన్మథావస్థలు పది. అందు అరతి యను నవస్థ యిందుఁ జెప్పఁబడెను. అరతి యనఁగా దేనియందుఁ బ్రీతి లేక పోవుట.

తాత్పర్యము.

మాంసమును దాఁకఁడు, తేనె నాశింపనే యాశింపఁడు. సాయంకాలమందు వానప్రస్థమార్గమున హింసలేక యడవి ఫలములను దేహధారణార్థమైకొంచెముగఁ దీసికొనును. దినమునకొక పూఁటనేకాని రెండవసారి భుజించుటలేదు. నాకు రెండు పూఁటల నాహారము లేదుగదా యందువేమో. నీవు చేయవలసినకష్టము లేదుగదా! ఆయనకు యుద్ధకార్యముగలదే; నిరశనవ్రతముఁబూనిన యుద్ధమెట్లు చేయఁగలఁడు. అటయును గాక, నీవు ప్రోషితపతికవు, ఉత్తమరాజకన్యవు. కావున పరదత్తము, అందు శత్రుదత్తము గ్రహింపరాదు. అందురావణుఁడుపతితుఁడు. కులటాషండవైరి పతితు లిచ్చునది పక్వమైనను, అపక్వమైనను ప్రాణాపద దశయందును గ్రహింప రాదు. అందు వ్రతస్థవు కావున నీకుపవాసము దగినదే. ఆయన నిష్కారణోపవా సము శాస్త్ర నిషిద్ధము కావున నెట్లు శుష్కోపవాసము చేయవచ్చును. నిర్నిమిత్త మైన శుష్కోపవాసము ఆత్మహత్యయగును. అది దోషావహము. శోకము, కోపము నుపవాస కారణములు గావు.

క. దోమలు నీఁగలుఁబురుగులుఁ, బాములుఁదనువెరియ మీఁదఁ♦బ్రాకుచునున్నన్
రాముఁ డెఱుంగఁ డొకింతయు, భామిని! నీయంద యుంటఁ♦బ్రాణములెల్లన్.

అర్థములు. ఎరియన్ = మండునట్లు, భామిని = కోపశీలా!

తాత్పర్యము.

ఆయన నిమిత్తమై నా దేహమునఁ బ్రాణములు నిలిపిన దాన నంటివి. ఆయన తన ప్రాణము లన్నియు నీయందు నిలిపియుండు వాఁడగుటచే ఈఁగలు,

దోమలు, పురుగులు, పాములు దేహము మంట యెత్తునట్లు మీఁదఁ బ్రాఁకులాడు చున్నను ఆయనకుఁ గొంచెమైన దెలిసినది కాదు. పరకాయప్రవేశముచేసిన యోగి వలెనున్నాఁడు. నీయందుఁగోపస్వభావ మున్నది. ఆయనయం దది లేదు. నీవాయన నుద్దేశించి నిష్ఠురము లాడితివే. ఆయన యొకమాటయిన నిన్నుగుఱించి నిష్ఠురము లాడినవాఁడు కాఁడుగదా. ఆయన కాలము సీతాసీతా యనుటలోసరిపోవు చున్నది. వే ఱాలోచన తోఁచినఁగదా నిష్ఠురము లాడుట.

ఈపద్యమున మనస్సంగమ మనెడి యవస్థ చెప్పఁబడెను. ప్రియపదార్థము నందుఁ దప్ప మఱి దేనియందును మనస్సుంచకుండుట మనస్సంగమ మగును.

సీ. నీ చక్కఁదనమును♦నీదు సౌశీల్యంబు, చెలువరో! ధ్యానంబుఁ♦జేయుఁ జేయుఁ
జేయుచో నీరూపు♦చేలువు కన్నులఁ గట్ట, సుందరీ! నిన్నెఱుఁ♦జూచుఁ జూచుఁ
జూచి నన్ బాసితే♦సుదతిరో! యంచును, గన్నులబడి నీరుఁ♦గార్చుఁ గార్చుఁ
గార్చి నే నేరీతిఁ♦గనుఁగొందునో కదే, మెలఁతనంచును గడు♦మిడుకు మిడుకు
తే. నన్యమేదిస్మరించఁ,డ♦నంగ బాణ, తాపమునఁజేసికనుమూయఁ♦దలఁపఁడెపుడుఁ
దలఁచెఁబోయంతలోన సీ♦తా!యటంచు,నులికిపడిలేచుమదిలోనఁ♦గళవళించు.

అర్థములు. అనంగ బాణతాపమున = మన్మథుని బాణముల వలనఁగలిగిన తాపముచే, ఇందుఁగనుమూయఁదలఁపఁ డనునది జాగరణమును దెలుపును. నీకు నిద్ర రా లేదని నిద్రావిషయ జ్ఞానమైనఁ గలదు. ఆయన కా యాలోచనయే లేదు. నిద్ర యనునది యొకటి యుండుటయు నెఱుఁగఁడు.

తాత్పర్యము.

స్పష్టము.

క. పండో పువ్వో మఱి యిం, కొండు మనోహరపదార్థ ♦ మో కాంచినచో
నండజగమనా యంచును, నుండును నినుఁగూర్చి యుల్ల♦ముదిలకొనంగన్. ౮౭౭

అర్థములు. అండజ గమనా = హంసనడక వంటి నడక గలదానా. ఉదిలకొనున్ = పరితాప పడును.

తాత్పర్యము.

స్పష్టము.

క. సీతా సీతా యనుచును, జేతము తపియింపఁ బలుకు ♦ క్షితిజా, నినుఁ దా
నే తెఱఁగునఁ బడయఁగ నగు,నా తెఱఁగు నొనర్చెడిన్ మ♦హాత్ముం డనఁగన్.

అర్థములు. చేతము = మనస్సు; ఇందుఁ దాపము చెప్పఁబడెను.

తాత్పర్యము.

స్పష్టము.

ఉ. రాముని కీర్తనంబునను ♦ రాగిలి రామసమానశోక సీ
తామదిరాక్షి. దుఃఖమును ♦ దవ్వొనరించి, శరన్ముఖంబునన్

ధూమజఖండయుక్త మగు♦తోయజశాత్రవమండలంబు నౌ
యామిని బోలి భూమిసుత ♦ యంజననందనుతోడ ని ట్లనున్. ౧౭౯

అర్థములు. రాగిలి = సంతోషించి, రామసమానశోక = రాముని శోక మెంత తీవ్రమో యంత తీవ్రత గలశోకము గలది. రాముని శోకముసీతకు రాదు. సీత శోకము రామునకు రాదు. తీవ్రత యందు సమత్వము. దవ్వు = దూరము. శరత్ + ముఖంబునన్ = శరత్కాలారంభమందు, ధూమజ = మేఘముయొక్క, ఖండ = తునుకతో, యుక్తము = కూడినది. తోయజశాత్రవ మండలంబు = చంద్ర మండలము; ఔ = కల, యామిని = రాత్రి.

తా త్ప ర్య ము .

హనుమంతుఁడు రామచంద్రమూర్తిని బొగడుటచే సంతోషించినదై రాముని దుఃఖమంత దుఃఖము గల సీత, నా దుఃఖమంత దుఃఖము రామచంద్ర మూర్తియుఁ బడుచున్నాఁడుకదా! తనదుఃఖముఁ బాపుకొన యత్నించునుకదా, యదియే నాకుఁ జాలునని తనదుఃఖమును వదలి శరత్కాలారంభమందు మేఘము తునుకలతోఁ గూడిన చంద్రమండలముగల రాత్రివలెనై యాయనతో నిట్లనియె.

ఇందలి యుపమానమువలన సీతాదేవి దుఃఖమంతయుఁ బోలేదనియు నింకను గొంత శేషము గలదనియు నేర్పడుచున్నది. కారణము క్రింది పద్యమునఁ గలదు.

—♦ { ౩౭–వ సర్గము, సీతాదేవి హనుమంతునకు రావణుఁడు పెట్టిన గడువు నెఱిఁగించుట. } ♦—

క. రాముఁ డనన్య మనస్కుఁడు, రాముఁడు భూరివ్యథాప♦రాయణుఁ డనుచున్
నీ మాటలు సుధ విషమున, సామీరీ! కలిపి యిడిన♦చందం బయ్యెన్. ౧౮౦

అర్థములు. అనన్య మనస్కుఁడు = ఇతరమునందు మనస్సు లేనివాఁడు, భూరివ్యథాపరాయణుఁడు = గొప్ప బాధపూర్ణముగ ననుభవించుచున్నాఁడు. సుధ = అమృతము.

తా త్ప ర్య ము .

ఆంజనేయా! రామచంద్రమూర్తి నన్నుఁ దప్ప మఱిదేనిని దలఁచుటలే దంటివి. ఇది యమృతముద్రావినంత సంతోషముగలిగించెను. రామచంద్రమూర్తి మిగుల దుఃఖించుచున్నాఁడంటివి. ఇది విషము ద్రాగినట్లు తాపము గలిగించు చున్నది. నీవు విషము కలిసిన యమృతము నిచ్చినట్లయ్యెను.

క. భూరితరైశ్వర్యముననో, దారుణదుఃఖమున నేని ♦ దైవము త్రాటన్
బూరుషునిఁ గట్టి యీడ్చును, ధారిణిపై జీవికిని స్వ♦తంత్రత గలదే? ౧౮౧

అర్థములు. భూరితర + ఐశ్వర్యముననో = గొప్ప సంపదయందుఁగాని, దారుణ దుఃఖమున నేని = భయంకర దారిద్ర్య దుఃఖమందైనను.

తాత్పర్యము.

గొప్ప సంపదయందుఁగాని, భయంకర దారిద్ర దుఃఖమందైనను పురుషుని దైవము (పూర్వజన్మ కర్మఫలము) త్రాటితోఁ గదలకుండఁ గట్టి యీడ్చును. భూమిమీఁదఁ బుట్టిన వారికి స్వాతంత్ర మనునది యున్నదా? లేదు.

ఆ. విధిని దాఁటు జీవి ♦ విశ్వంబునను లేదు, వానరేంద్ర? యింత♦వట్టు నిజము
రామచంద్రవిభుని♦సౌమిత్రినిన్ నన్ను, నెట్లుపఱచెఁ గంటి♦వే కదయ్య. ౧౧౨

అర్థములు. విధిని = దైవమును, పఱచెన్ = బాధపెట్టెనో.

తాత్పర్యము.

దైవనియమము నతిక్రమించు స్వతంత్రించి తన యిష్టప్రకారము వర్తించు ప్రాణి యీ లోకమందు లేదు. వానరశ్రేష్ఠా! యింతమాత్రము నిజము. అసత్యము గాదు. రామచంద్రమూర్తిగాని, లక్ష్మణుఁడుగాని, నేనుగాని దుఃఖింపవలసిన కారణమా లేదు. అయినను దుఃఖించు చున్నాము. దుఃఖించుటకు మాయందే దోషము గలదు? రామునికై నేను, రామచంద్రమూర్తి మా యపరాధములకై దుఃఖింపవలసినదే యనుకో. మా యిరువుర నడుమ లక్ష్మణుఁడేల మా యిరువురకై దుఃఖింపవలె? ఇదంతయు దైవచేష్టగదా.

ఉ. ఎప్పుడు చేరువాఁడొకో ది♦నేశకులాభరణంబు రాముఁడీ
గొప్ప వ్యథాసముద్రమున♦కూలముఁ? బెద్ద తుపాను తాఁకునన్
ద్రిప్పుల నొందు నావగతిఁ, ♦ దేజు దొఱంగి నలంగినాఁడె? న
న్నెప్పుడు దోడుకొంచరుగు? ♦ నెప్పుడు రావణుఁ ద్రుంచు మారుతీ! ౧౧౩

అర్థములు. దినేశకులాభరణంబు = సూర్యవంశమునకు నలంకారమైనవాఁడు. సముద్రమునకూలము = సముద్రముయొక్క తీరము, షష్ఠీసమాసమునన కారాగమము.

తాత్పర్యము.

మారుతీ! రామచంద్రమూర్తి యీ వ్యథాసముద్రమున మునుఁగకుండఁ దీర మెప్పుడయ్యా చేరును? పెద్ద గాలివానవలన గిరగిర తిరుగు నావవలెఁ గాంతిని బాసి నలఁగినాఁడా? నన్నెప్పుడు తోడుకొనిపోవునో, ఎప్పుడు రావణు సంహరించునో?

'పరిత్రాణాయ సాధూనాం, వినాశాయ చ దుష్కృతా'మ్మన్నట్లు సీతాదేవిని గ్రహించుట యను సాధు పరిత్రాణము ముఖ్యకార్యము దానికి విఘ్నము కలిగించు దుష్కృతుల వినాశము రెండవ కార్యము, అని యేర్పడుచున్నది.

ఉ. ఎప్పుడు వచ్చునోక్కొ మను♦జేంద్రుఁడు? రాక్షసకోటిఁ బట్టి తా
నెప్పుడు ద్రచ్చునోక్కొ? దను♦జేంద్రునిఁ గిట్టి శరాలి పాలుగా
నెప్పుడు ద్రుంచునోక్కొ? యను♦రేంద్రుని వీటిని మూలముట్టుగా
నెప్పుడు దంచునోక్కొ? నను ♦ నెప్పుడు చూచెడినోక్కొ? పావనీ! ౧౧౪

తా త్ప ర్య ము.

పావనీ! రామచంద్రమూర్తి యెప్పుడయ్యా వచ్చును. ఎప్పుడయ్యా రాక్షస సమూహములను బట్టి చీల్చును. రావణుని బాణములపాలుచేసి యెప్పుడు ఖండించును? ఈలంకాపురమును బునాదితోడఁ బాడగునట్లెప్పుడుదంచునో, నన్నెప్పుడయ్యా చూడవచ్చును.

ఉ. తీవర పెట్ట వయ్య జగ♦తీవిభు నింతటిలోన రాఁగ నో
పావని! నాకిలన్ బ్రదుకు♦పాటును నీ సమ తీఱునంతకే
చూ విధియించె నట్లు దను♦జుం, డింక మాసయుగంబ చిక్కెఁ ద
త్తావధియందుఁ, జెల్లెడిఁ జు♦మా దశమం బగు మాస మియ్యెడన్. ౮౮౫

అర్థములు. సమ = సంవత్సరము; ఇది సంస్కృతమున స్త్రీలింగము. ప్రాయికముగ బహువచనమందే ప్రయోగము. అయినను పాణిని ఏకవచనమందు 'సమాం సమాం' అని పఠించెను. (పా. వ్యా. ౨. ౧౨) మఱియు సమాం విజాయత యని యేకవచనమందును బ్రయోగముకలదు. కావునఁ దత్సమమున సమ యను రూపము సాధువు. దత్తావధి=ఇయ్యఁబడిన గడువు.

తా త్ప ర్య ము.

ఆంజనేయా! రావణుఁడు నాకొక్క సంవత్సరము గడు విచ్చెను. ఆ సంవత్సరము ముగియువఱకే నేను జీవించియుందును. ఆసంవత్సరమునందుఁ బదియవనెల జరగుచున్నది. కావున రెండునెలలు మాత్రమే మిగిలినవి. అవికాఁగానే నాచావు సిద్ధము. కావున నీలోపలనే వచ్చునట్లు రామచంద్రమూర్తిని తొందర పెట్టుము. ఆవల వచ్చినను ఫలము లేదు.

ఇది ఫాల్గున మాసము. ఇది పదియవనెల యగునేని జ్యేష్ఠమాసమున సీతాపహరణ మని యేర్పడుచున్నది.

ఉ. పెక్కువిధాలఁ దమ్ముఁడు వి♦భీషణుఁ డెంతయు నొక్కి చెప్పె నీ
వక్కమలేక్షణన్ మఱల♦నంపు మటంచును, నాలకింపఁ డా
ముక్కడి రావణుండు, విధి♦మూఁడినవానికి. సాధుపద్ధతుల్
మక్కువ గూర్చునే దురభి♦మానము కన్నులఁ గప్పి చుండఁగన్? ౮౮౬

తా త్ప ర్య ము.

ఈలోపల మంచి బుద్ధి పుట్టి రావణుఁడు మఱల నన్ను రామచంద్రున కర్పింపరాదా యందువేమో, వానికట్టి యభిప్రాయము లేదు. రావణుని తమ్ముఁడువిభీషణుఁడనువాఁడు నీవు సీతను మరల నిమ్మని యనేక విధముల బోధించెను గాని మూర్ఖుఁ డగు రావణుఁడు విన్నవాఁడుకాఁడు. వానికి మరణకాలము సమీపించి దురభిమానము కన్నులు గానరాకుండఁ జేయుచుండఁగా వాఁ డేల వినును?

చ. పెనిమిటియానతిం గొని వి♦భీషణుపత్ని నిజాత్మజాతఁ దా
నవల యనంగఁ బేర నల♦రారెడి కన్యక యీ చరిత్రముల్
వినుపఁగ బంచె నాకడకు♦వే పతి నన్ను గ్రహించు శుద్ధమై
తనరె మదంతరాత్మయును♦దాన వసించు గుణంబు లెన్నియేఁ. ౮౮౭

తా త్ప ర్య ము .

నీకెట్లీ విషయము దెలిసెనందువా? ఆ విభీషణుని భార్యయే సరమ యను నామె పతి యనుమతిఁదీసికొని తనకూఁతురగు నవల యను కన్యకచే నీవిషయము నాకుఁ జెప్పి పంపెను. ఆంజనేయా! నా పతి నన్ను గ్రహించుట సత్యము. ఏమి ధైర్యముతో నీ మాట చెప్పెద నందువా, నా యంతరాత్మ శుద్ధమై యున్నది. అంతరాత్మ శుద్ధమై యుండెనేని యనేక శుభగుణములుగలవు. ఏ కార్యమునందు నంతఃకరణము శుద్ధమై, ప్రసన్నమై యుండునో యా కార్యము నెఱవేఱిన దనియే నమ్మవచ్చును.

విభీషణుఁడు సకుటుంబముగ సీతాపక్షపాతి యనిదీనివలనస్పష్టపడుచున్నది. విభీషణునందు సీతాదేవి కనుగ్రహబుద్ధి కలదని యెఱుఁగుట చేతనే శ్రీరామచంద్ర మూర్తియు విభీషణు ననుగ్రహించెను. సుగ్రీవునివిషయమునకిట్టు లేక దావర్తించెను.

క. పౌరుషము సముత్సాహము, సారతరబలంబు నానృ♦శంస్యము మహిమో
దారిత కృతజ్ఞతాదులు, శ్రీరామునియంద కలవు♦స్థిరముగ హనుమా! ౮౮౮

లోకోత్తరకార్యమునందు స్థిరప్రయత్నము త్సాహము దానికిఁదగినట్టి కార్యము చేయుటపౌరుషము, సత్త్వము. అది నెఱవేఱుటకుబలము. ఆనృశంస్యము=చేయుట యందుఁ గ్రూరత్వము లేకుండుట, కృతజ్ఞత=తనకుఁ జేసిన మేలు మఱవకుండుట, విక్రమము=శౌర్యము, ప్రభావము=శక్తి.

తా త్ప ర్య ము .

హనుమంతా! లోకోత్తరకార్యము చేయుట, దానికిఁ బ్రేరకమైన యుత్సాహము, కార్యమును సాధింపఁదగిన మహాబలము, కార్యము చేయుటయందుఁగామ క్రోధములకు వశుఁడై, క్రూరుఁడై వర్తింపకుండుట, తన దివ్యమహిమ ప్రకాశింపఁ జేయుట, కార్యము చేయుట యందు సహాయులపట్లఁ గృతజ్ఞత, యీ మొదలయిన గుణములు స్థిరముగ నొక్క శ్రీ రామచంద్రమూర్తి యందే కలవు. కొందఱ యందివియల్పకాలమే యుండును. మఱికొందఱ యందిందుఁ గొన్నియేయుండును. రామునం దట్లుగాదు. కల్యాణగుణము లన్నియు సంపూర్ణముగ శాశ్వతముగ నున్నవి. అట్టివాఁడు నావిషయమై తనపౌరుషము చూపకుండునా?

సీ. ఆ జనస్థానంబు♦నందు సోదరుఁడేని, బాసటగా లేక♦పదియునాల్గు
వేలరక్కసుల దో♦ర్బలల నొక్కఁడె చంపె, నట్టివానికి నెవ్వఁ♦డడల కుండు?

నింద్రుని శచిపోలె ♦ నెఱుఁగుమఁ దన్మహీ,మంబుఁ గష్టంబు లా♦మానధనునిఁ
గలఁపగ జాలవు ♦ కాండభానువులను, రక్షోజలంబుల ♦ రామభానుఁ
తే. డడరి శోషింపఁజేయు నం ♦ చశ్రుపూర్ణ, లోచనాంబుజ యైన యా♦లోలనేత్రఁ
జూచి యిట్లను నంజనా♦సూనుఁ డప్డు, డేల శోకించెదమ్మ! యీ♦లీల నీవు. ౧౧౯౯

అర్థములు. అడలకుండును = భయపడకుండును; కాండభానువులను = బాణములను కిరణములచే, రక్షోజలంబులన్ = రాక్షసులను నీటిని, రామభానుఁడు = రామచంద్రమూర్తి యను సూర్యుఁడు; అశ్రుపూర్ణలోచనాంబుజము = కన్నీళ్ళచే నిండిన నేత్రకమలములు గలది.

తాత్పర్యము.

ఆంజనేయా! ఆయన రాలేదు. రావణుఁ జంప లేదు. నన్నుఁ దీసికొని పోలేదని నిష్ఠుర మాడెదవే. ఆయన యొంటరిగాఁ డేమి చేయఁగలఁడమ్మా! యందువేమో. ఆ జనస్థానమందుఁ దమ్ముఁడుకూడఁ దోడు లేక పదునాల్గువేల రాక్షసులను భుజబలముచే నవలీలగాఁ జంపలేదా. అట్టివాఁడిచ్చటికి వచ్చినంత మాత్రముననే యీ రాక్షసులు చూచి భయపడకుందురా. ఆయన శక్తి తెలియక నేను దూషింపలేదు. ఇంద్రుని శక్తి శచికిఁ దెలిసినట్లు రామచంద్రుని శక్తి నాకుఁ దెలియును. మానధనుఁడగు నతనిని నీ కష్టము లెవ్వియుఁ గలఁత చెందింపఁ లేవు. ఎన్ని కష్టములైన నోర్చి మానము కాపాడుకోఁగలఁడు. సూర్యునకుఁ దన కిరణములచే జలము నెండించుట మహాశ్రమకర మైన కార్యమా? అట్టులే రామునకు రాక్షసుల వధించుట కష్టకార్యమా! అని కన్నుల నిండ నీరు నించిన యా సీతాదేవిని జూచి హనుమంతుఁడు తల్లీ! యేల శోకించెదవు?

—♦హనుమంతుఁడు సీతాదేవిని దనవీఁపున నెత్తుకొని పోయెద వని చెప్పుట.♦—

ఉ. నానుఁడు లాలకించి రఘు♦నాథుఁడు వానరభల్లుకావళీ
సేనలతోడ నియ్యెడకు ♦ శీఘ్రమ వచ్చెడు, నంత కోర్వ నె
ట్లా వనితేని దుఃఖము ర♦యంబుగఁ బాతు ననింద్యశీల! చం
ద్రానన! నాదు వీఁపుపయి ♦ నాదట నెక్కుము కొంచుఁ బోయెదన్. ౧౨౦౦

అర్థములు. నా నుడులు = నా మాటలు; పాతున్ = పాచుదును, పాయునట్లు చేయుదును.

తాత్పర్యము.

నా మాటలు విని రామచంద్రమూర్తి శ్రోఁతులు, ఎలుగులు గల సేనలతో నిచ్చటికిఁ ద్వరగా వచ్చును. అంతకాలము వఱకు నే నీ దుఃఖమెట్లు సహింతునందువా? నీ దుఃఖమును నేను బోవునట్లు చేసెదను. నా వీఁపుపై నెక్కుము, రామచంద్రమూర్తి యున్న చోఁటికిఁ దీసికొని పోయెదను. నేను నీ కింకరుఁడను. కావున దీనివలన నీ శీలమునకు హాని లేదు.

క. నీ వోకత వేల? లంకను, రావణునిన్ మోచికొనుచు ♦ రయమునఁ బోవం
గా వలఁతిని, జేర్చెద నిపుడే విభుకడ హవ్య మగ్ని ♦ యింద్రునకువలెన్. ౨౧

అర్థములు. వలఁతిని = సమర్థుఁడను, హవ్య మగ్ని యింద్రునివలెన్ = అగ్నిహోత్రుఁడు హోమము చేయఁబడిన హవ్యమును నింద్రునకుఁ జేర్చినట్లు; ఈ యుపమానముకూడ స్పర్శదోష శంకను బరిహరించుచు, నాంజనేయుని శుచిత్వము తెలుపుచున్నది.

తాత్పర్యము.

నీవు నన్ను మోయఁగలవా యందువేమో, నిన్నుమాత్రమేకాదు. లంకను, రావణుని కూడ మోచికొని శీఘ్రముగఁ బోవసమర్థుఁడను. హవ్యవాహనుఁడగు నగ్ని హుతమును నింద్రునకుఁ జేర్చినట్లు నిన్ను శ్రీరామునొద్ద నిప్పుడే చేర్చెదను.

శా. అమ్మా! మున్ దనుజావళిం దునుమ దై♦త్యారాతి సన్నాహి యా
నమ్మాడ్కిం దన తమ్ముతోడ భవదీ♦యప్రాణనాథుండు య
త్నమ్మున్ జేయుచు నుండఁజూడఁ గల వు♦ద్యత్ప్రీతిఁ గన్నారఁగా
లెమ్మా యెక్కఁగదమ్మ! వీఁపుపయి నో♦లేమా! ననున్ నమ్ముమీ. ౨౨

అర్థములు. సన్నాహి = ప్రయత్నము గలవాఁడు; ఉద్యత్ప్రీతిన్ = పుట్టుచున్న ప్రేమతో.

తాత్పర్యము.

తల్లీ! పూర్వము రాక్షసులను జంపుటకు విష్ణువు ప్రయత్నము చేసినట్లు తమ్మునితోడ నీమగఁడు రావణాదులఁ జంప యత్నముఁ జేయుచుండ నీవు సంతోషముతో గన్నులారఁజూడఁగలవు. అమ్మా! లెమ్ము. నావీఁపుపై నెక్కుము. నా మాట నమ్ముము.

క. నినుఁ జూడఁ గోరు వానిని, ననుపమబలశాలిఁ బర్వ♦తాశ్రమగతునిన్
గనుఁగొనెదు నాకపృష్ఠం,బున నుండెడి వజ్రధరునిఁ♦బోలినవానిన్. ౨౩

తాత్పర్యము.

నాకపృష్ఠంబున నింద్రునిఁబోలి పర్వతాశ్రమ మందుండి నిన్నుఁ జూడఁ గోరుచున్న బలవంతు రామచంద్రమూర్తినిఁ జూడఁగలవు.

ఉ. ఆలము సేయకమ్మ నిను ♦ నాదటఁ గూర్చెదఁ బ్రాణనాథుతో
బాలిక! రోహిణీకుముద ♦ బాంధవు లట్టులు కూడి యుండ మీ
రాలు మగండు, శీతకిర ♦ ణార్కులతోడఁ బ్రసంగమాడుచున్
లీలగ దాఁటవమ్మ యవ ♦ లీల నభంబును సాగరంబునున్. ౨౪

అర్థములు. ఆలము=ఉపేక్ష, ఆదటన్=ప్రేమముతో, కుముదబాంధవుఁడు=చంద్రుఁడు, శీతకిరణార్కులతోడన్=సూర్యచంద్రులతోడ, ఆకాశమున నెంతయెత్తు ప్రదేశమునకుఁ బోయిన సూర్యచంద్రులిరువు రేకకాలమునఁ గాన వత్తురో యంత యెత్తున; నభంబును=ఆకాశమును; సాగరంబునున్=సముద్రమును.

తాత్పర్యము.

నామాట లేమోలే యని యుపేక్షింపకుము. రోహిణీచంద్రులు కూడియుండునట్లు నీవు నీ మగఁడు కూడియుండునట్లు చేసెదను. ఆకాశమున సూర్యచంద్రులతో ముచ్చట లాడుచు సముద్రమును, సముద్రమును దాఁటిన తరువాత నాకాశమును నవలీల దాఁటుదుము. రామచంద్రమూర్తి యొద్దకుఁ బోవు వఱకు నిన్ను దింపను.

క. నినుఁ నేఁ గొనిపోవఁగ న, న్ననుగమనము సేయ నోపఁ ♦ డమ్మా! లంకన్
దనుజుం డొక్కం డైనను, ననుమానము మాని యెక్కు ♦ మా నావీఁపున్. ౨౫

అర్థములు. అనుగమనము = వెంటవచ్చుట.

తాత్పర్యము.

ఈ రాక్షసులు మన వెంటఁబడఁగ, పోనిత్తురా యందు వేమో, నిన్ను నేను దీసికొని పోవునపుడు నావెంట నీ రాక్షసులలో నొకఁడైన రాఁ జాలఁడు, నమ్ముము.

క. ఏకరణిని వచ్చితి విట, కా కరణిని గొంచుఁబోదు ♦ నాకాశమునన్
నీ కేల సందియం బన, నా కపిఁ గని హర్ష విస్మ ♦ యాంగి వచించెన్. ౨౬

తాత్పర్యము.

నీవే విధముగ నాకాశమార్గమున నిటకు వచ్చితివో యావిధముగనే యాకాశమార్గమున నిన్నుఁ దోడుకొని పోయెదను, నీకేల సందేహము అనిన నా వానరుఁ జూచి సీత యతని భక్తికి సంతోషము, అతని మాటల కాశ్చర్యము గలదై యిటులు చెప్పెను.

——♦ హనుమంతుఁడు సీతాదేవికిఁ దన దేహముఁ బెంచి చూపుట. ♦——

క. హనుమా! మిక్కిలి దూరము, ననుఁగొని నీ వేగతిం జ ♦ నం జాలెదవో
విన వింతలు నీ పలుకులు, వనచర! నీ క్రోఁతిబుద్ధి ♦ వచ్చెం దెలియన్. ౨౭

తాత్పర్యము.

ఆంజనేయా! నేను సొమ్ములమూట కట్టి యెక్కడ వైచితినో నాకుఁ దెలియును. అక్కడకు నిక్కడకు మిగుల దూరముగలదు. ఇంతదూరము నన్ను మోచికొని నీ వే ప్రకారము పోఁగలవు. నీ మాటలు వినుటకు వింతలుగా నున్నవి. ఇంతవఱకు నీవు నిజమైన క్రోఁతి వగుదువో కావో యని సందేహించుచుంటిని. ఇప్పుడు నీబుద్ధిని బట్టి చూడ నీవు నిజమైన క్రోఁతివే యని నిశ్చయించుకొంటిని.

ఉ. ఇంతవు నీ వదేమి గతి ♦ నేగెదవో నను మోసికొంచు భూ
కాంతునిపాలి కం చనిన ♦ క్ష్మాసుతపల్కుల నాలకించి లోఁ
జింత వహించె నా కిపుడు ♦ చేకుఱెఁ గ్రొత్తపరాభవం బటం
చెంతయు వానరుండు మఱి ♦ యిట్లని తాఁ దలపోసె నాత్మలోన్. ౨౮

అర్థములు. ఇంతవు = ఇది చేతితోఁ జూపించి జేనెఁ డని చెప్పెను. అనఁగా అల్పశరీరుఁడవు. క్రొత్తపరాభవంబు = ఎన్నఁడు లేని యవమానము.

### తాత్పర్యము.

హనుమంతా! యీడిచి కొలిఁచిన జేనెడు లేవే, నీవెట్లు నన్ను మోసికొని రామచంద్రు నొద్దకు నంతదూరము పోఁగల ననెదవు. అనఁగా సీతాదేవి పలుకులు విని హనుమంతుఁడిట్లు విచారపడెను. ఎన్నఁడు నెవరిచేతఁ గలుగని యవమానము, నేఁడు ఆఁడుదానిచే బడవలసి వచ్చెను గదా యని మఱియు నిట్లు లాలోచించెను.

చ. ఎఱుఁగదుగాక యించుకయు ♦ నెంతటివాఁడనో కానఁ బల్కె న
న్నుఱక మదీయరూప మిపు ♦ డొప్పుగఁజూపిన నమ్ముఁగాక యీ
తెఱవ యటంచు నెంచి తన ♦ దివ్యమహాకృతిఁ జూప నేలపై
కుఱికి ద్రుమంబునుండి రభ ♦ సోద్ధతిఁ బెంపఁ దొడంగె గాయముఁ. ౮౯౯

అర్థములు. ఉఱక = లక్ష్యము లేక, ఉఱికి = దుమికి; రభసోద్ధతిఁ = వేగముతోడి గర్వముచే; నేలపై కుఱికి యనుటచే నింతవఱకు రాక్షసస్త్రీలకుఁగాన రాకుండునట్లు చెట్టుకొమ్మమీఁదే యుండె నని యేర్పడుచున్నది. అవమానము సహింపలేక రోషముగలవాఁడై చెట్టుమీఁదనే యుండి దేహము పెంపసాధ్యపడదు కావున నేల దుమికెను.

### తాత్పర్యము.

ఈమె నన్ను నవమానింపవలయుననుతలంపుతో నవమానింప లేదు. నేనెంతటి వాఁడనో, నా మహత్త్వ మెట్టిదో తెలియక లక్ష్యము లేక మాడలాడినది. నామాట నిజ మని, నేనంత కార్యము చేయఁగలనని, నిజముగ నమ్మినదికాదు, ఈమెనమ్మ నట్లుచేయుట నా స్వరూపము చూపించెద నని తలఁచి తన దివ్యమైన గొప్ప యాకారమును జూప నేలమీఁదికి దుమికి శీఘ్రముగా బెంపఁ బ్రారంభించెను.

సీ. దీప్తానలప్రభఁ ♦ దేజరిల్లుచు, మేరు, మందరసంకాశ ♦ మహితరూప
మునఁ దామ్రవక్త్రుఁడై ♦ ఘనవజ్రసన్నిభ, దంష్ట్రానఖంబులు ♦ దద్ద వెలుఁగు
జానకి ముంగల ♦ గా నిలుచుండి యి, ట్లనియె నాసతితోడ ♦ నాంజనేయు
డో దేవి! సగిరివ ♦ నోద్దేశముగ సాట్ట, వప్రతోరణముగ ♦ వైరినాథు
ఆ. తోడ లంకఁగొనుచుఁ ♦ దోరంపుజవమునఁ, బోవు శక్తి గలదు ♦ భూమితనయ!
పిన్నవాఁడ నను న ♦ భిప్రాయమును బాసి, రమ్ము జాలమేల ♦ రాముకడకు. ౯౦౦

అర్థములు. దీప్తానల ప్రభఁ = మండుచున్న యగ్నిహోత్రుని కాంతితో; సంకాశ = సమానమైన; మహిత = గొప్పదైన; తామ్రవక్త్రుఁడై = రాగివలె నెఱ్ఱని ముఖము గలవాఁడై; ఘన = గొప్పవగు; వజ్రసన్నిభ = వజ్రముతో సమానమైన; దంష్ట్రానఖంబులు = కోఱలు గోళ్లు, సగిరివనోద్దేశముగఁ = పర్వతములు, వనప్రదేశములతోడ; సాట్టవప్రతోరణముగ = బురుజులతో, ప్రాకారములతో, తోరణములతో.

తా త్ప ర్య ము.

మండుచున్న యగ్నిహోత్రకాంతి గలిగి, వెలుఁగుచు మేరుమందర పర్వతములతో సమానమైన గొప్ప యాకారము గలవాఁడై, యెఱ్ఱని ముఖము, వజ్రాయుధముల వంటి గోళ్ళు, కోఱలు గలవాఁడై, సీతాదేవి ముందు నిలుచుండి యిట్లనియె. దేవీ! ఈ లంకను గొండలతో, వనములతో, బురుజులతో, ప్రాకారములతో తోరణములతో, రావణాసురునితో పెల్లగించి యతివేగమునఁ దీసికొనిపోవు శక్తి గలదు. నేను జిన్నవాఁడ నను నభిప్రాయము వదలుము. ఆలస్య మేల ? రాము నొద్దకుఁ బోదము రమ్ము.

—♦ హనుమంతునితోడ సీతాదేవి తాను రామికిఁ గారణములు చెప్పుట. ♦—

చ. అనవుడు వాయుసూనుని మ♦హాద్భుతభీప్రదభూరి రూపమున్
గనుఁగొని నీరజాక్షి యను ♦ గాడుపునందనుతో నెఱింగితిన్
ఘన మగు తావకీనబల♦గర్వసమున్నతి వాయువేగమున్
వనదహనోరుతేజమును ♦ వానరమాత్రుఁడవే కపీశ్వరా ! ౯౦౧

అర్థములు. మహాద్భుత = మిగుల నాశ్చర్యకర మైన, భీప్రద = భయము కలిగించు; భూరి = గొప్పదగు; రూపమున్ = ఆకారమును, వనదహన = కాఱుచిచ్చు తేజస్సువంటి; ఉరు = గొప్పదగు; తేజము.

తా త్ప ర్య ము.

హనుమంతుఁ డీ ప్రకారము చెప్పఁగా మిగుల నాశ్చర్యము, భయము కలిగించు నతని గొప్ప యాకారముచూచి యాయనతో నిట్లనియె. కపీశ్వరా ! నీ బలగర్వము, వాయువేగము, కాఱుచిచ్చువంటి నీ తేజము, నెట్టిదైనది తెలిసికొంటిని. నీవు సామాన్యపు క్రోతివి గావు.

ఉ. ఇంతటివాఁడు గాక యది ♦ యెట్లు పయోధిఁ దరించి లంక నే
కాంతము చొచ్చి న న్నరయఁ♦గా క్షముఁ డౌ ? నొక ప్రాకృతుండు దా
నింత ఘటింప నేర్చునె ? య♦హీనజవంబున నన్ను రామ భూ
కాంతుని యంతికంబునను ♦ గ్రచ్చుఱఁ జేర్తువు విశ్వసించితిన్. ౯౦౨

అర్థములు. ఏకాంతము = రహస్యముగా; క్షముఁడు = సమర్థుఁడు; ప్రాకృతుండు = సామాన్య పురుషుఁడు; అంతికంబునకు = సమీపమునకు; విశ్వసించితిన్ = నమ్మితిని.

తా త్ప ర్య ము.

ఇంత గొప్పవాఁడవు కావేని, నీ వెట్లు సముద్రము దాఁటి రహస్యంబుగ నొంటిగ లంకలోఁ బ్రవేశించి నన్ను వెదకి కనుఁగొన సమర్థుఁడ వగుదువు, ఇంత కార్యము సామాన్య పురుషులకుఁ జేయ సాధ్య మగు పనియా ? మిగుల వేగముగ నీవు నన్ను రామచంద్రమూర్తి సమీపమునకుఁ దీసికొని పోఁగల వని నమ్మితిని.

సీ. అయినను మామకీ♦నాత్మేశుకార్యంబు, వేగంబు సిద్ధించు♦విధ మ దెట్లొ
యని తలపోయుట ♦ యావశ్యకము నాకుఁ, గాదె ? నీ వెంట రా♦రా దటంట
ననిలవేగము తుల్య ♦ మగు నీదు జవమున, కోర్వక దిగ్భ్రమ♦యొదవు నాకుఁ
బైపైన బొరలు కూ♦పారంబుఁ గన భీతిఁ, దల చుట్టి పడిపోనె ♦ దానిలోనఁ
తే. బడిన యంతనె తిమినక్ర♦పటలి నన్ను
బట్టి చవు లూరఁగా మ్రింగి ♦ యట్టె వోవె ?
నన్ను రక్షింపఁ దలపోయు ♦ చున్న నిన్నుఁ
గూర్చియును సంశయించెదఁ ♦ గ్రోఁతిరాయ. ౯౦౩

అర్థములు. మామకీ నాత్మేశు కార్యంబు=నా యాత్మకు నధీశ్వరుఁడైన రామచంద్రమూర్తి కార్యము త్వరగా సఫల మగు విధ మేదో యని నే నాలోచించుట తగును గదా. కావున నీ వెంబడి నేను రాను. నేను నీవెంట వచ్చితినా.

(౧) రావణుఁడు దొంగతనముగా సీతను హరించుకొని పోయినట్లు రామచంద్రుఁడు రావణాసురుని జయింపలేక దొంగతనముగా సీతను దెప్పించుకొన్నాఁడు, హనుమంతుఁడు లేకుండిన రామచంద్రుఁడు సీతను రక్షించుకొని యుండలేఁ డను నపకీర్తి నా మగనికి వచ్చును. నే నట్టి కార్యము చేయవచ్చునా ?

(౨) నే నచ్చటికి వచ్చితినేని నా ప్రాణము రక్షించుకొన్నట్టు లగును గాని యింత దుష్టకార్యము స్త్రీల విషయమునఁ జేయు వీని కేమి శిక్ష గలిగినట్లు? ఇట్టి వాఁడు శిక్షింపఁబడఁడేని యింకను లోకమున నెన్ని యనర్థకార్యములు చేయునో.

(౩) రామచంద్రమూర్తి తప్ప రావణునిఁ జంపఁగలవాఁ డెవ్వఁడు. ఎందఱ స్త్రీలనో నావలెనే బలాత్కారముగఁ దెచ్చి చెఱలో వేసియుండుట నీవు చూచితివి కదా. వారి మగవా రెవ్వరైన వానిని దండింపఁగలిగిరా ? కావున రామచంద్రమూర్తిచేతనే వీని పుట మార్పింపఁజేసిన నీ స్త్రీలందఱు సుఖముగఁ బోదురు. క్రొత్తవారు రాకుందురు.

(౪) రామచంద్రమూర్తి రావణుఁ జంపఁ బ్రతిజ్ఞఁ జేసెఁగదా. నే నచ్చటికి వచ్చితినేనియిది నెఱవేఱు టెట్లు? ఆయనసత్యప్రతిజ్ఞత్వమునకుహానిరాదా?నాయందు భక్తిగలవాఁడ వగుటచే నాసుఖము మాత్రము చూచితివిగాని, యివన్నియు నాలోచింప వైచితివిగదా. ఇకను జెప్పెద వినుము.

కూపారంబు = సముద్రము; చవులు = రుచులు.

తాత్పర్యము.

నీయందు నాకెంత విశ్వాసమున్నను శీఘ్రముగ నామగని కార్యము సిద్ధించు నుపాయము నేనాలోచించుట యావశ్యకముగదా. కావున నీవెంట నేనురాఁరాదు. వాయువేగముతో సమానమైన నీవేగము సహింపలేక నేనుదిగ్భ్రమనొందుదును. మీఁదమీఁద బొరలుచున్న యలలు గల సముద్రమును జూడఁగానే దానిలో

దలతిరిగి పడిపోదును. పడఁగానే తిములు మొసళ్లు వచ్చి నన్ను రుచులార మ్రింగి స్వేచ్ఛగాఁ బోవును. ఇది నాగతి. ఇఁక నీగతి విషయ మందును నాకు సందేహము గలదు. ఏ మంటివా?

సీ. ననుఁ గొనియేగు ని♦న్నని పంక్తికంధర, చోదిత రాక్షస♦శూరవరులు
నిను వెంబడింపరే? ♦ నీకును వారికిఁ, జండసంగ్రామంబు ♦ జరుగ కున్నె?
శూలముద్గరకరా♦భీలుర వారల, గెలుతువో! కలనిలో ♦ గెలువ లేవొ?
సాయుధుల్ వారు ని♦రాయుధుండవు నీవ, దెట్లు పోరెదవు న♦న్నెట్లు గాతు?
తే. నీవు కలహింపఁ గ్రూరదు♦ర్భావు లైన
దైత్యులను గని నా మది ♦ తల్లడిల్లి
వనధిలోపలఁ బడుదునో? ♦ పడిన నన్నుఁ
గొనుచుఁ బోయి యొసంగరే ♦ దనుజపతికి? ౯౦౪

అర్థములు. చోదిత = ఆజ్ఞాపింపఁబడిన; క్రూరదుర్భావులు=చెడ్డమనస్సు గలవారు.

తాత్పర్యము.

నన్నుఁ దీసికొని పోవు నిన్నుజూచి రావణుచే నాజ్ఞాపింపఁబడిన రాక్షసులు నీ కంటఁబడరా? వారికి నీకు భయంకర యుద్ధము జరుగకుండునా? వారు శూలములు, ముద్గరములు కలవారగుటచే దూరమునుండి నిన్నుఁ గొట్టుదురు. వారలను నీవు గెలుతువో గెలువలేవో. గెలు పోడు లెట్లున్నను ఆయుధములుకలిగి దూరము నుండి గొట్టువారితో నాయుధములు లేని నీవెట్లు యుద్ధము చేయఁగలవు? నన్నెట్లు రక్షింపఁగలవు? నీవు వారియొద్దకుఁ బోయికదా కొట్టవలెను. వారు నాలుగుప్రక్కల నిన్నుఁ జుట్టుకొని యాయుధములతోఁ గొట్టునపుడు నీవు ముఖ మొకవైపు తిరిగి పోరునపుడు వెనుకటె నన్నుఁ గొట్టరా? ఆ దెబ్బలు నాకుఁ దగులవా? దెబ్బలు తగులు టెట్లుడిననను గ్రూరులు చెడ్డ మనస్సుగల రాక్షసులను జూడఁగానే నా మనస్సు తల్లడిల్లదా? నేను సముద్రములోఁ బడిపోదు నేమో? నేను బడిపోఁగానే వారు నన్నుఁ బట్టుకొని పోయి రావణున కీయరా?

ఉ. పోరుపయిన్ మది న్నిలిపి ♦ పోరుచు నుండెడివేళ నీవు నే
వారిధి జాతి ద్రెళ్ళినను ♦ వారు బలాత్కృతిఁ గొంచుఁ బోయినన్
శూరత నిన్ను గెల్చినను ♦ జొప్పు చెడుం గద? నన్ను రాక్షసుల్
క్రూరత ముక్కముక్కలుగఁ ♦ గోయరె వారలచేతఁ జిక్కినన్? ౯౦౫

తాత్పర్యము.

నీమనస్సంతయు యుద్ధముపైనుంచి యుద్ధముచేయునపుడు నేను జాతిసముద్రములోఁ బడినను వారు బలాత్కారముగ మఱలఁ దీసికొని పోయినను,నిన్ను వారు గెలిచినను క్రమమార్గము తప్పనుగదా. వారిచేఁ జిక్కిన ముక్కలుముక్కలుగాఁ గోయరా?

చ. అరయుఁగ నేరి సొమ్ము విజ♦యాపజయంబులు యుద్ధమందు? సా
గరమున నేను ద్రెళ్ళమియ ♦ కల్గినను౯ విజయంబు నీకు నే
దొరకిన యేనియు౯ దనుజ♦ధూర్తుల యార్భటి విన్నమాత్రనే
హరివర! ప్రాణముల్ విడనె ♦ యంత భవత్కృతి వ్యర్థమే కదా? ౯౦౬

అర్థములు. త్రెళ్ళమియ = పడిపోకుండుటే.

తా త్ప ర్య ము.

యుద్ధమందు వీఁడే జయించును, వాఁడే యోడిపోవు నని యెవ్వఁడు చెప్పఁగలఁడు? బలహీనుఁడు గెలుచుటయుఁ గలదు. బలవంతుఁ డోడిపోవుటయుఁ గలదు. ఒకఁడు పదిమందిని జంపును. పదిమంది యొకనిఁ జంపుదురు. కావున యుద్ధములం దన్నిట నేనే గెలుతు నని యెవ్వఁడు నమ్మరాదు. ఒకవేళ నీవే గెలిచెదవనుకో, సముద్రములో నేను బడిపోలే దనుకో, అట్లుండినను రాక్షసుల సింహనాదములు విన్నంత మాత్రముననే వానరేంద్రా! నా ప్రాణములు లేచిపోవా? అప్పుడు నీవు పూనిన పని యంతయు వ్యర్థమేకదా.

క. చాలుదువు నీవు రాక్షస, పాళి౯ గెలువంగ నట్టి♦భంగియ యగు నే
నీ లోకంబునఁ దఱుఁగదె, వాలాయము రామకీర్తి ♦వనచరనాథా! ౯౦౭

అర్థములు. వాలాయము = నిరంతరము, అనివార్యము.

తా త్ప ర్య ము.

ఇట్లు చెప్పుటచే నీవు యుద్ధములో రాక్షసుల గెలువ లేవని నా యభిప్రాయము గాదు. నీవు తప్పక గెలుతువు. అట్లు నీవు గెలిచెద వేని లోకమునందు ననివార్యముగ రామచంద్రుకీర్తి తగ్గిపోదా? అట్లు చేయుట నీకుఁ దగునా?

క. అట్టులు గా కుండినచోఁ, బట్టుగ రాక్షసులు నన్నుఁ ♦ బార్థివులు కపుల్
నెట్టన యెఱుంగ కుండఁగ, గుట్టగు స్థలి దాఁప ఫలము ♦ గూడునె మీకున్? ౯౦౮

తా త్ప ర్య ము.

అట్లు గాకుండినను, రాక్షసులు నన్నుఁ బట్టుకొని పోయి రామలక్ష్మణులు గాని, వానరులు గాని తెలిసికొన సాధ్యపడని చోట దాఁచిరేని మీ శ్రమమునకు ఫలము గలదా?

ఉ. రాముని ప్రాణ మా యనఘు♦భ్రాతల ప్రాణము కీశవర్య! మీ
స్వామికులంబు ప్రాణమును ♦ వర్తిలు నెంతయు సేమ మార నా
క్షేమముఁ బట్టి, య ట్లగుటఁ ♦ జెచ్చెరఁ బోయి సుఖాన నున్నదా
భూమిజ యంచుఁ దెల్పి నృప♦పుంగవుఁ డెమ్ము శుభమ్ము గ్గ్లైడిన్. ౯౦౯

తా త్ప ర్య ము.

నీకు మఱొకవిషయము చెప్పెదను. వానరేంద్రా! రామచంద్రమూర్తి ప్రాణము, లక్ష్మణుని ప్రాణము, మీ వానరరాజు వంశము ప్రాణము యివన్నియు క్షేమముగా

నుండుట నా క్షేమముపై నాధారపడి యున్నవి. నాకు క్షేమము లేదయ్యెనా మీ కెవ్వరికి క్షేమము లేదు. కావున వెంటనే నీవు పోయి సీత సుఖముగా నున్నదని వారికిఁ జెప్పి రామచంద్రు నిచ్చటికిఁ దోడుకొని రమ్ము. నీకు శుభమగు గాక.

క. భూసుత లే దని నృపవరు, లాసను నాయెడను మాని ♦ రా యంతటితో
వాసిచెడి వానరావళితో, సమయుదు రిది నిజము వారు ♦ దుఃఖబలమునన్. ౯౧౦

తాత్పర్యము

'సీత లేదు' అని నా యాసను వారు వదలుకొనిరా వానరసేనలతోడ దుఃఖబలముచే వారు నశించుటే నిజము. వారు నశించిన మీరందఱు నశించినవారే.

చ. వరపతిభక్తిఁ జేసి మగ ♦ వానిని రాముని దప్ప నింక నె
వ్వరిని స్పృశింప నొల్ల, దశ ♦ వక్త్రుఁడు దాఁకఁడె నిన్ను నంటివా ?
పరవశురాల, దుర్బలను ♦ ప్రాపును లేద, యనాథ, నొంటి, నె
వ్వరసున నేమి చేయఁగలఁ ? ♦ బావని నీవ తలంచి చూడుమా. ౯౧౧

తాత్పర్యము.

నేను నీతోడ రాకుండుటకు ముఖ్య కారణము మఱి యొకటి గలదు. చెప్పెద విను. నామగని యందు నాకుఁగల భక్తిచేత మగవానిని రాముని దప్ప మఱియెవరిని దాఁక సమ్మతింపను. రావణాసురుఁడు నిన్నుఁ దాఁక లేదా, అప్పుడు నీవేమి చేయఁ గలిగితివి యందువా, అప్పుడు నేను మూర్ఛపోయి పరాధీననై యుంటిని, అందు బలములేని దానను, వేఱు సహాయము లేని దానను, దిక్కులేని దానను, ఒంటరి దానను, వాఁడో బలవంతుఁడు, సహాయసంపత్తిగలవాఁడు, అట్టి సందర్భమునందు వానిని నే నేమి చేయఁగలనో నీవే చెప్పుము. ఇప్పు డట్టి సందర్భములు లేవు. నేనై బుద్ధిపూర్వకముగాఁ దాఁకవలసియున్నది. అట్లు చేయుటకు నా మన స్సంగీకరింపదు. ఇది వాస్తవకారణము. ముందుగానే దీనిని జెప్పిన నీ వేమనుకొందువో యని కడపటఁ జెప్పుచున్నాను.

మగవానిని రామునిఁ దప్పననుటచే రామచంద్రమూర్తి యొకఁడే పురుషుఁడు, తక్కినవా రందఱు స్త్రీలని యభిప్రాయము. 'సఏవ వాసు దేవోఽయం సాక్షాత్పురుష ఉచ్యతే। స్త్రీప్రాయ మేతత్సర్వమ్ జగ ద్బ్రహ్మపురస్సరమ్' భగవంతుఁడు వాసుదేవుఁడే పురుషుఁడు. తక్కిన బ్రహ్మాదులతోడి ప్రపంచ మంతయు స్త్రీప్రాయ మను వాక్య మనుసంధించునది. స్త్రీ స్త్రీతోఁ గలిసిన నానందము కలదా. కావున జీవాత్మ భగవంతునితో సాయుజ్యము నొందిన నానందము గలదుగాని, బ్రహ్మాదులతో సాయుజ్యము కలిగిన మఱల జన్మింప వలసిన దే. మఱల దుఃఖింపవలసిన దే.

క. రాముఁడు దశకంధరు సం ♦ గ్రామంబున నింద చంపి ♦ కలబంధులతో
సేమముగ నన్నుఁ గైకొన, సామీరీ! యతని కదియె ♦ సముచితకృతి యౌ.

తాత్పర్యము.

రామచంద్రమూర్తి వచ్చు వఱకు సహింపలే నంటివి. నేను రా నంటివి. ఇఁక జరగవలసిన దేమి యనెదవా? రామచంద్రమూర్తి రావణుని యుద్ధమందు నీ లంకలోనే చంపి యాంజనేయా! నన్నుఁ దీసికొనిపోవుట యాతని యోగ్యతకుఁ దగిన కార్యము. ఆయన రాఁడు, నన్ను రక్షింపఁ డను సందేహ ముండిన యెడలఁ గదా నేను నీవెంట రావలెను. నా కట్టి సందేహము లేదు.

ఈ రెండు పద్యములందు సీతాదేవి తెలిపిన యభిప్రాయము ముఖ్యప్రాణము వంటిది. ఇందు ఆత్మనిక్షేపము, పారతంత్ర్యము స్పష్టముగాఁ జెప్పఁబడెను. ప్రపన్నులు తప్పఁ దక్కిన ముముక్షువు లందఱు భగవత్ప్రాప్తికి సాధనభక్తినో, (ఉపాయభక్తి) కర్మయోగమో, జ్ఞానయోగమో, అష్టాంగయోగమో యేదియో యొకటి సాధనముగ గ్రహింతురు. ప్రపన్నుఁ డీ సాధనముల దేనిని నాశింపక భగవత్ప్రాప్తికి భగవంతుఁడే సాధనము, ఆయనయే రావలెఁ దన్నుఁ దీసికొనియే పోవలె నని యుండువాఁడు. వానికి భగవంతుని 'అహం స్మరామి మద్భక్తం, నయామి పరమాం గతిమ్,' 'అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి' 'అభయం సర్వభూతేభ్యో దదామి' యను వాక్యములే యూఁతకోలలు. ప్రపన్నుఁడు భగవంతునిఁదప్ప వేఱొక సాధనము గోరినను, భగవత్ప్రాప్తితప్ప వేఱొక ఫలము గోరినను, భగవంతునిదప్ప వేఱొక దేవత నాశ్రయించినను ప్రపత్తి చెడును, ఫలింపదు. హనుమంతుని వెంట సీతాదేవి పోయియుండినను, ఆమెను రామచంద్రమూర్తి నీవు భ్రష్టురాలవని స్వీకరించియుండడు. పారతంత్ర్యము వదలిన ప్రపన్నుని భగవంతుఁడు స్వీకరింపఁడు. కావునఁ బ్రపన్ను లన్నివిధముల ననన్యులై యుండవలెను.

ఉ. శిక్షితవైరి యైన రఘు♦శేఖరు భూరిపరాక్రమంబుఁ బ్ర
త్యక్షము గాఁగ నేఁ గనిన♦దానఁ, బొరిం బొరి విన్నదాన, నా
దక్షుని సంగరస్థలిని♦దాఁకఁగ లేవు ముఖాముఖిన్ సహ
స్రాక్షముఖామరోరగసు♦రారిచయంబులు నైన వాయుజా! ౯౧౩

తాత్పర్యము.

అమ్మా! కోటఁ బోవుపనికి గొడ్డలి తెమ్మనుచున్నావు. జయాపజయము లెవఁడెఱుఁగు నని నీవే యంటివి. ఆయన కింత శ్రమము నీవీయవచ్చునా? మగనికి శ్రమమిచ్చుటయ పతిభక్తిలక్షణ మందువా. ఆంజనేయా! చెప్పెద వినుము.

ఆయన యోగ్యతకుఁ దగినది ఆయనకుఁ గష్టసాధ్యమైనది, సందిగ్ధమైనది, నేను గోరలేదు. ఎట్టి విరోధులనైన దండింపఁగల శ్రీరామచంద్రమూర్తి పరాక్రమమును బరులు విశేషముగాఁ జెప్పఁగా విన్నదానను. కన్నులార నేను జూచినదానను. ఆయన శక్తి నాకుఁ దెలియును. అసమర్థుని యెదుట యుద్ధభూమియందు నింద్రుఁడు మొదలుగాఁ గల దేవతలు, పన్నగులు, దేవదానవరాక్షసులు, గుంపులు గుంపులై

వచ్చి యెదుర నిలిచి తాఁకలేరు. ఇచ్చటఁ బ్రత్యక్షముగా ననునది ప్రత్యక్షాను మాన ప్రమాణములుగను, పొరింబొరి విన్నదాన ననునది శాస్త్రప్రమాణముగను బ్రపన్నుఁడు గ్రహింపవలెను. భక్తునకుఁ, బ్రపన్నునకు భగవంతుడు తన పాలిటఁ గలఁ డనుటకు ననేక నిదర్శనము లనుభవమునఁ దెలియు చుండును. వానిని బట్టి తక్కినవి యూహించుకొనును. శాస్త్రప్రమాణములు, ప్రహ్లాద నారద ధ్రువాంబ రీషాదుల చరిత్రములు, రామాయణమందుఁ గాకాసుర వృత్తాంతము (౬౭ ప) హనుమంతుఁడు రావణునకుఁ జెప్పిన 'అధిప బ్రహ్మ స్వభువు చతురాస్యుఁడైనఁ ద్ర్యంబకుఁడు రుద్రుఁడును బురహరుఁడునైన, నింద్రుఁడు మహేంద్రుఁడును సురాధీశుఁడైనఁ గలన శ్రీరామవధ్యునిఁ గావ లేరు. (ప.౧౧౭౭) బాలకాండమున బ్రహ్మ రుద్రేంద్రాదుల శరణాగతి, యుద్ధకాండమున బ్రహ్మాదులస్తుతి, యవి యన్నియు భగవంతుఁడు శ్రీరామచంద్రమూర్తియే తక్కిన యందఱ దేవతలకంటె గొప్పవాఁ డని స్థాపించుచున్నవి. ఇట్టి యుత్తమోత్తమ దేవతను సాధించు ప్రపత్తియే యుత్తమోత్తమోపాయం బని దృఢచిత్తుఁడై యనన్యుఁడై యుండవలెను.

ఉ. ఎవ్వఁ డొకో సహించెడి న◆హీనబలుఁ బలవైరివిక్రముం
జివ్వను జిత్రకార్ముకు వి◆చిత్రచరిత్రు సలక్ష్మణుం గడుం
గ్రొవ్వఱఁ జూచియేనియు? న◆కుంఠితమత్తదిశాగజాభుఁ దా
నెవ్విధిఁ దాఁకియుం మను స◆మీరసమీరితవహ్నితుల్యునిన్.          ౬౪

అర్థములు. బలవైరి విక్రముం = ఇంద్రుని పరాక్రమమువంటి పరాక్రమము గలవానిని, చివ్వను = యుద్ధమందు, గ్రొవ్వఱ = పొగరు క్షయించునట్లు, అకుంఠిత = మొక్కపోని, మత్తదిశాగజాభుం = మదించిన దిగ్గజములతో సమానుని, మనుం = బ్రదుకును, సమీర = వాయువుచే; సమీరిత = ప్రేరింపఁ బడిన, వహ్ని తుల్యునిం = అగ్ని సమానుని.

## తా త్ప ర్య ము.

జయాపజయవిచారము సామాన్యుల విషయమే కాని రామచంద్రమూర్తి విషయమున నపజయ శంక లేదనుటకు నింకను నాయన పరాక్రమముగుఱించి చెప్పుచున్నది. ఆంజనేయా! రామచంద్రమూర్తి యెదుటఁ బడుటయు యుద్ధము చేయుట యనుమాట లటుండ నిమ్ము. యుద్ధమం దాయనను జూచియైన సహింపఁ గలవాఁ డెవఁడయ్యా! ఎవడు మహాబలశాలియు, నింద్రపరాక్రముఁడును, చిత్రమైనధనువు ధరించిన వాఁడును, ఆశ్చర్యకరమైన నడవడి గలవాఁడును లక్ష్మణునితోఁ గూడిన వాఁడును నగు రామచంద్రమూర్తిని యుద్ధమునఁ జూచినంత మాత్రమున గర్వ భంగము కాని వాఁ డెవఁడయ్యా కలఁడు. ఇట్లుండఁగా వాయువుచేఁ బ్రేరింపఁ బడిన యగ్నివంటి వానిని, నష్టదిగ్గజములకు సరిపోలువానిని, నెదిరించియు బ్రదుకఁ గలవాఁ డెవఁడయ్యా!

క. కల్పావసానభాస్కర, కల్పు నమోఘానుపమిత ♦ కాండుని దృఢసం
కల్పుని లక్ష్మణసహితునిఁ, జల్పునొ సాహస మెవండు ♦ సమితిం దాఁకన్ ॥ ౯౧౫

అర్థములు. కల్పావసాన భాస్కరకల్పున్ = ప్రళయము కడపట ప్రకాశించు సూర్యునితో సమానుని; అమోఘ+అనుపమిత+కాండునిన్ = వ్యర్థము కాని, సమానము లేని బాణములు గలవానిని, దృఢసంకల్పుని = చలనము లేని సంకల్పము గలవానిని; సమితిన్ = యుద్ధమందు.

తాత్పర్యము.

ప్రళయకాలమునఁ గనఁబడు సూర్యుని వేఁడిమి గలవాఁడును, గుఱి తప్పని లక్ష్యమును, భేదింపని బాణము గలవాఁడును, వ్యర్థము కానిసంకల్పము కలవాఁడును నగు రామచంద్రమూర్తిని లక్ష్మణుని గూడియుండు వానిని యుద్ధమం దెదిరింప మనసునం దైన సాహసించునా?

మొదట నెదిరించి యెవరును నిలువఁజాలరనియు రెండవపద్యంబునఁ జూచి సహింపలేరనియు, నీపద్యంబున మనసుచే నైన సాహసింపరనియుఁ దెలిపెను. జగత్సంహారము చేయ సంకల్పించెనా, ప్రళయకాలమందలి సూర్యునివలెఁ బ్రపంచమును శోషింపఁ జేయును. ప్రళయకాలమందలి మేఘమువలె బాణవర్షము కురియించును. అట్టివానికి లక్ష్మణుఁడు తోడుపడినపుడు లోకమున నెవఁడు నిలువఁ గలఁడు? కావున జగత్సంహారముచేయ శక్తిగల రామచంద్రమూర్తికితుచ్ఛరావణాది రాక్షసుల సంహరించుట గొప్పకార్యమా? నీకిది గొడ్డలితోఁ జేయు గొప్ప కార్య మేమో కాని రామచంద్రమూర్తి కిది గోరఁ బోవుపని యనియే నానమ్మకము. దీనివలన భక్తులకుఁ, బ్రపన్నులకు భగవన్మహిమయందు నెట్టివిశ్వాసముండ వలయునో తెలియనగు. నేనొక్క యాఁడుదానను. నా నిమిత్తమై రామచంద్రమూర్తియింత గొప్ప యత్నముచేయునా యని సందేహింప నట్టు ప్రపన్నుఁడును తా నంతవఱకుఁ జేసియుండిన కర్మమును స్మరింపరాదు. భగవన్మహిమ మాత్రమే స్మరించుచు నింతటివాఁడు నన్ను రక్షించుట యేమి కష్టమని నమ్మి యాయననే స్మరించుచుండవలెను.

ఉ. కావున వే ఱుపాయములఁ ♦ గార్యము లే, దిటకున్ రయంబునన్
నా విభు లక్ష్మణాన్వితు వ ♦ నాటసమూహధవోపసేవితున్
నీ వెటులేని తెమ్ము, ధర ♦ ణీవిభుఁ గూర్చి నితాంతనిత్యదుః
ఖావిల నన్నుఁ దేర్పు, పవ ♦ నాత్మజ! పుణ్యము నీకు నయ్యెడన్. ౯౧౬

అర్థములు. వేఱుపాయములు = నేను జెప్పినది తప్ప నితరోపాయములు; వనాటసమూహధవ = అడవిద్రిమ్మరు లగు వానర భల్లూక సమూహములకుఁ బతియగు సుగ్రీవునిచే, ఉపసేవితున్ = సమీపమునుండి సేవింపఁ బడువానిని;

నితాంత = అధికమై, నిత్య = ఎడఁదెగని, దుఃఖావిలా = దుఃఖముచేఁ గలఁత చెందిన దానిని.

## తాత్పర్యము.

కావున హనుమంతా! నేను జెప్పెడు నుపాయము తప్పఁ దక్కిన వన్ని వదలి పెట్టుము. నీవు త్వరగా లక్ష్మణ సుగ్రీవులతోఁ గూడిన రామచంద్రమూర్తిని నేవిధమున్ననైన సరియ తోడుకొనిరమ్ము. ఆయన నుద్దేశించి యెడఁదెగని తీవ్రమైన దుఃఖము పడుచున్న నన్నుఁ గృతార్థను జేయుము. ఆంజనేయా! నీకుఁ బుణ్య ముండును.

తక్కిన యన్ని యుపాయములు వదలి నేను జెప్పిన యొక్క యుపాయము ననుసరింపు మనుటచే 'సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ' యన్నట్లు కర్మజ్ఞానభక్తి యోగాదుల నెల్ల నుపాయము లని గ్రహింప రాదని యెఱుఁగ నగు. ఇటకుం దెమ్ము-అనుటచే 'తం దుర్దర్శం గూఢ మనుప్రవిష్టం గుహాహితం గహ్వరేష్టం పురాణమ్। అధ్యాత్మ యోగాధిగమేన దేవం' కఠ.- 'అణోరణీయా న్మహతో మహీయా నాత్మా గుహాయామ్ నిహితోఽస్య జన్తోః తమక్రతుం పశ్యతి వీతశోకో। ధాతుః ప్రసాదా న్మహిమాన మీశం॥ అన్నట్లు లెక్కడనో, గుహలో దాఁగియుండు భగవంతుని వెదకుచు నేను బోలేను. ఆయనయే యిచ్చటికి వచ్చునట్లు చేయుము, అనియు శిష్యుఁడు గురువుమ బ్రార్థింపవలెను. ప్రస్రవణగిరి గుహలో నున్నాఁడు చూచిరమ్మనిక దా హనుమంతుఁడు పిలిచెను. దాని కిది ప్రత్యుత్తరము. "ఉపాసతా మాత్మవిదః పురాణాః। పరం పుమాంసం నిహితం గుహాయాం। వయం యశోదాశిశు బాలలీలా కథాసుధాసింధుషు లీలయామః" లీలా. ఆత్మజ్ఞానము గల ముసలివారు గుహలో నుండు పరమపురుషు నుపాసింపనీ, మాకు దానితోఁ బని లేదు. మేము యశోదాశిశు బాలక్రీడల కథ లను నమృత సాగరమున నాడుకొనుచుందుము, దానిలో మునుఁగుదుము, తేలుదుము. 'ధ్యానాభ్యాస వశీకృతేన మనసా య న్నిర్గుణం నిష్క్రియం।జ్యోతిః కంచన యోగినో యదిపరం పశ్యంతి పశ్యంతు తే। అస్మాకంతు త దేవ లోకనచమత్కారాయ భూయా చ్చిరమ్। కాళిందీ పులినేషు య త్కిమపి త న్నీలం మహో ధావతి॥ మధుసూదన సరస్వతి. ధ్యానాభ్యాస బలమున మనస్సును వశము చేసికొని యోగు లేదో జ్యోతినిఁజూచినఁ జూతురుగాక! మాకు దానితోఁ బని లేదు. యమునాతీరమందలి యిసుకదిబ్బలపైఁ బరువెత్తు నల్లని తేజస్సు మాకుఁ జాలును. ప్రపన్నుఁడు తానట్టి దృఢవిశ్వాసము ప్రపత్తి గలవాఁడై యుండవలెను, అని యేర్పడుచున్నది.

ఇం దాచార్య కృత్యము సూచితము. నిన్ను రామచంద్రమూర్తి యీ నిర్బంధము నుండి తొలఁగించి రక్షింప సంకల్పించియున్నాఁడు. నీవు భయపడవలదని హనుమంతుఁడు సీతాదేవికిఁ జెప్పి యచ్చట శ్రీరామునకు సీతాస్థితిఁ దెలిపి (౧౪౫౮ వ.ప.) సీతను శ్రీరామచంద్రమూర్తితోఁ జేర్చినట్లును గీతగోవిందమందు "న కురు నితంబిని

గమన విలంబన మనుసర తం హృదయేశ'' మ్మని రాధకుఁ జెప్పి-కృష్ణునికి ''సీదతి రాధా వాసగృహే'' యని చెప్పి సంధానము కుదిర్చినట్లును ఆచార్యుఁడు చేయవలయును. జీవాత్మ పరమాత్మలకు నడిమివాఁ డాచార్యుఁడు. కావున నాచార్యమూలమున భగవత్ప్రాప్తి సుకరము. ఇది భక్తప్రపన్నుల చర్య. లక్ష్మణశబ్దము నిత్యసూరులకును, సుగ్రీవశబ్దము ముక్తులకు నుపలక్షణము. సుగ్రీవుఁడు నడుమ వచ్చినవాఁడు. లక్ష్మణుఁడు నిత్యసేవ చేయువాఁడు.

—♦{ ౩౮ వ సర్గము. సీతాదేవి చెప్పిన కారణములను విని హనుమంతుఁడామెను ప్రశంసించుట. }♦—

క. అని జనకతనయ పలికిన, విని వాక్యవిశారదుండు ♦ ప్రీతుం డగుచుఁ
జననాథుతరుణిఁ గనుఁగొని, యనియెఁ జతురవచనరచన ♦ యమరఁగ నిట్లుల్.

అర్థములు. వాక్య విశారదుండు = మాటలు చెప్పుటయందు నేర్పరి. (౨) తర్క శాస్త్రపండితుఁడు, చతురవచన రచన=చాతుర్యము గల మాటల యల్లిక.

## తాత్పర్యము.

హనుమంతుఁడు తర్కపండితుఁడు గావున రామప్రాప్తియందుఁ దాను జెప్పిన యుపాయము మేలా? జనకరాజు కూఁతురు చెప్పిన యుపాయము మేలా యని తర్కయుక్తులచే నాలోచించి యామె చెప్పినదే బాగున్నదని సంతోషించిన వాఁడై సీతాదేవిని జూచి తన పరాభవమును (నీ క్రోఁతి బుద్ధియనిన మాటను) గప్పిపెట్టుచుఁ జమత్కారపు మాటల నిట్లనెను.

తే. చారుదర్శన నీ వన్న ♦ చంద మరయ, యుక్తరూపంబు నినువంటి ♦ యువతిమణికి
స్త్రీస్వభావంబునకును వి ♦ శిష్టసాధ్వి, శీలమునకును దగినట్లు ♦ చెప్పితమ్మ. ౧౮

అర్థములు. చారు దర్శన = అందమైన చూపుగలదానా, దర్శన శబ్దమునకు చూపు – కన్ను – బుద్ధి – తెలివి – శాస్త్రము – ధర్మము అను నర్థములు కలవు. ఇచ్చట నన్ని యర్థములు సమన్వయించును. కావున దీనికి (౧) చక్కని యాలోచన గలదానా, (౨) చక్కని బుద్ధిగలదానా, (౩) చక్కని యుక్తాయుక్త వివేకము గలదానా, (౪) చక్కని శాస్త్రజ్ఞానము గలదానా. (౫) చక్కని ధర్మమెఱిఁగిన దానా యని యర్థములు. కావున సీతాదేవి చెప్పిన రామప్రాప్తికుపాయము శాస్త్రసమ్మతమై, సద్బుద్ధి నిశ్చితమై, వివేక యుక్తమై సాధ్యమై ధర్మపద్ధతి ననుసరించి యున్నదని భావము. చందము=విధము–ఉపాయము, యుక్తరూపంబు = ఇచ్చటప్రశంసయందు రూపప్ ప్రత్యయ మని యెఱుఁగునది. ప్రశంసింపఁ దగినంత యుక్తమై యున్నది. విశిష్ట = విశేషముగ సదాచార సంపత్తిగల. సాధ్వి = పతివ్రతయొక్క, శీలమునకు = స్వభావమునకు.

తాత్పర్యము.

అందమైన చూపుగలదానా! నీవు చెప్పిన విధము నాలోచింపఁగా నీవంటి స్త్రీ చెప్పుటకు మిక్కిలి యుక్తమైనది. స్త్రీల స్వభావమునకు, సదాచార సంపత్తి గల పతివ్రత నడవడికిఁ దగినట్లు చెప్పితివి. అప్పుడు నేనేమో నీదుఃఖముచూడలేక చెప్పితినిగాని, నేను జెప్పినది మగవానిపై నాఁడుదియెక్కి కూర్చుండి వచ్చుట— ఘోరరణములోఁ బ్రవేశించుట, పతియాజ్ఞ లేక స్వతంత్రించి స్వచ్ఛందముగా వర్తించుట యివి పతివ్రతలకుఁ దగినవి కావని నాకును దోఁచుచున్నది.

తే. ఆఁడుదానవు గావున ♦ నదరె దిట్టు, లావుడలు నూఱు విరివి గ ♦ లట్టి కడలి
నాదు వీఁపెక్కి దాఁటంగ ♦ నళిననేత్ర! విశద మయ్యెను దీన నీ♦పిఱికితనము.

తాత్పర్యము.

నీవు క్షత్రియకన్యవు, రామచంద్రమూర్తి భార్యవు. ఘోరారణ్యములలో సంచారముచేసినదానవు. ఎంతో ధైర్యశాలిని వనుకొంటినిగాని నూఱామడ సముద్రమును నావీఁపెక్కి వచ్చుటకు భయపడితివో యప్పుడే నీవాఁడుదాని పిఱికితనము బైటపెట్టితివి. సక్రోఁతి బుద్ధియని సీతాదేవి చేసిన యవమానమునకు నీ యాఁడుతనమని బదులాక్షేపము, ఇంత మాత్రమున హనుమంతుఁడు క్రోఁతిగాక పోఁడు. సీతాదేవి యాఁడుది గాకపోదు. ఎంతటి వారికైనను అదెంత వాస్తవమైనను మాట పడవలయు ననినఁ గష్టము దోఁచును. సీతాదేవి తనది క్రోఁతి బుద్ధి యని రోషగించుకొనినవాడు తనది క్రోఁతిబుద్ధి యని తా ననుకొనుట సహజముగానే యుండెను. (చూ. ప. ౧౫౪ సుం.)

ఉ. రెండవకారణంబుగ ధ♦రిత్రిసుతా! యని తీవు ప్రాణకాం
తుం డగు రాముఁ దక్క మఱి♦నూల్కొనఁ దాఁకఁగ నొండ్లఁ జుమ్మి యె
వ్వం డగుఁగాక యంచు, నటు♦వంటి మహాత్ముని భార్యవైన యో
యండజనేత్ర! నీకుఁ దగు♦న ట్లన, నన్య లిటుల్ వచింతురే? ౯౦

అర్థములు. నూల్కొనన్ = అంగీకరింపను, అన్యల్ = ఇతరస్త్రీలు.

తాత్పర్యము.

నీవు నావెంట రామికి రెండవ కారణముగ వాఁడెవ్వఁడైన నగుఁగాక పర పురుషు నంట నంటివి. ఇట్లనుటకు రామచంద్రమూర్తి భార్యవైన నీకుఁ దగునుగాని యితరస్త్రీ లిట్టి యాపద్దశలో నిట్లుచెప్పుదురా? ఏదో విధముగఁ దప్పించుకొని పోయినఁ జాలునందురే కాని చచ్చినను సంతోషమే, పరపురుషునిఁ దాఁకను, బాధ పడుచుండు నందురా.

చ. వినియెడువాఁడుగాక రఘు♦వీరుఁడు దేవి! త్వదీయ చేష్టితం
బును మఱి నీవు నా యెదుటఁ♦బొందుగఁ బల్కినయట్టి మాటలున్

వనజదళాక్షి! నీవు పను♦పాటులు గన్గొని తాళలేక యా
యునయెడఁ గల్గుభక్తి మెయి♦నట్లు వచించితిఁ దల్లి సైఁపుమీ. ౯౨౦

తాత్పర్యము.

దేవీ! నీవిచ్చటఁ జేయుచుండు కార్యములు (నీయేడ్పులు-నీమాటలు-నీయురిపోఁత ప్రయత్నములు) నీవు నాయెదుట రావణునకు, నాకు, రాక్షస స్త్రీలకుఁ జెప్పిన మాటలు వీని నన్నిటిని రామచంద్రమూర్తికి వినిపించెదను. తల్లీ! నీవు పడుచున్న కష్టములను జూచి సహింపలేక రామచంద్రమూర్తియందు గల భక్తికారణముఁగ నట్లు చెప్పితిని. తప్పుగా నెన్నక క్షమింపుము.

చ. జలధిఁ దరించు టెంతయు న♦సాధ్యము గావున, లంకఁ జొచ్చుటల్
సులువుగఁ గాని కార్య మను♦చుం దలపోసి స్వశక్తి నెంచి నేఁ
బలుకుట దద్విధంబుగను ♦ భామిని నిన్పతితోడఁ గూర్చ మేల్
దలఁపునఁ గాని వేఱొక వి♦ధంబుగ నీ మది నెంచఁబోకుమీ. ౯౨౧

తాత్పర్యము.

సముద్రము దాఁటుట మొదట నసాధ్యము. రెండవది లంకఁజొచ్చుట యంతకంటె నసాధ్యము. ఈ కష్టము లన్ని యాలోచించి నాకు శక్తి గలదు కావునఁ జేయఁగలనను తలంపుతో నీ భర్తతోడ నిన్నుఁ జేర్పవలయు నను సదభిప్రాయముతో ఆ విధముగఁ జెప్పితిని గాని దురభిప్రాయముతోఁ గాదు.

తాను జెప్పినది సరి గాదని హనుమంతుని మనస్సునకే వచ్చినది.

క. నావెంట నిపుడు వచ్చుట, కీ వుత్సాహంబు సేయ♦వేనియు రామ
స్వామివిభున కభిజ్ఞానము, దేవీ యేదైన నిమ్ము ♦ తెలియఁగ దానన్. ౯౨౩
అర్థములు. అభిజ్ఞానము = గుర్తు.

తాత్పర్యము.

నావెంట నీవిపుడు వచ్చుట కంగీకరింపవేని నేనిచ్చటికి వచ్చుటకు నిన్నుఁ జూచుటకు రామచంద్రమూర్తి నమ్మఁదగిన గుర్తేదైన నిమ్ము; లేకున్న నా మాటలాయన నమ్మునా? ఉత్తమాటలు నీవు నమ్మవని కదా యాయన యుంగరము గుర్తుగ నిచ్చెను. అట్లులే యాయనను నమ్మింపఁజాలు గుర్తు నీవేదయిన నిమ్ము.

——♦ సీతాదేవి హనుమంతునకుఁ గాకాసురవృత్తాంతముఁ జెప్పుట. ♦——

క. అని పవనసుతుఁడు వల్కిన, విని జానకి కనుల నీరు ♦ వెలఁగ హనుమం
తునితో నిట్లను మెల్లగ, వినుమీ మే ల్గుర్తు నిట్లు ♦ విభునకు ననుమీ. ౯౨౪

తాత్పర్యము.

ఇట్లాంజనేయుఁడు చెప్పఁగా సీతాదేవి కన్నుల నీరు గాఱుచుండ మెల్లఁగ నిట్లనియె. హనుమా! రామచంద్రమూర్తికి మంచి గుర్తు చెప్పెద వినుము.

భర్తతోడఁ దానున్నప్పటి విషయములు జ్ఞప్తికి వచ్చుటయె దుఃఖకారణము.

సీ. మును చిత్రకూటంబు♦నను నీశ్వరాశను, మందాకినీతీర♦మందు మనము
తాపసాశ్రమములఁ♦దవిలి వసించుచో, విమలసుగంధి పు♦ష్పముల నొప్పు
వనములఁ దిరుగుచు♦బడలి నీ తొడవున, నుండితి నట వాయ♦సుం డొకండు
తన ముక్కునను మాంస♦మునయాసనన్నఁ జ, రక్కునఁ బొడిచెఁ జు♦ఱుక్కనంగ
ఆ. మంటిపెళ్ళ నెత్తి ♦ తుంటరి కాకిని, గొట్ట నదియుఁ జుట్టుఁ ♦ బెట్టు చుండె
గాని పోవదయ్యె ♦ దానిని గని కోప,మునను దఱిమికొట్ట ♦ మనసు పెట్టి. ౨౫.

అర్థములు. ఈశ్వరాశను = ఈశానదిక్కున, తొడవునన్ = తొడయందు; వాయసుండు = కాకము, మహద్వివక్షయందుఁ గొన్ని యమహాచ్ఛబ్దంబులగు డుజ్ఞగు. సు. వ్యా. సూ. ౨౯.

ఇది మొదలు ౯౨౮వ పద్యము దాఁక సీత రామచంద్రునితోఁ బ్రత్యక్షముగఁ జెప్పినట్లు రామచంద్రునే సంబోధించుచున్నది. ౯౨౯వ పద్యము మొదలు ౯౩౩వపద్యమువఱకు రాముఁడు పరోక్షమం దున్నట్లు తెంచుకొని హనుమంతుని సంబోధించి చెప్పుచున్నది. ఆపై మఱల మూఁడు పద్యములు రామునేసంబోధించి చెప్పెను. ఆపై హనుమంతుని సంబోధించి చెప్పెను. నొక్కి చెప్పవలసిన దానిని రాముని సంబోధించియు, నితరవార్త హనుమంతుని సంబోధించియు ననుచున్నదని కానినాతో మాటలాడుచున్నను మనస్సంతయు నీమీఁదనే యుండుటచే మైమఱచి నడుమనడుమ నిన్ను సంబోధించె నని హనుమంతుఁడు రామునితోఁ జెప్పుటకై యని కాని యెఱుంగునది.

సీతాదేవి కాకిని దోలలేక బాధపడుచుండ రామచంద్రమూర్తి యేల యూరక చూచుచుండెను? జీవుఁడు స్వరక్షణమున స్వతంత్రించి కార్యము చేయువఱకు భగవంతుఁ డుపేక్షించు ననియు జీవుఁ డీశ్వరునిపై భారము వేసినపుడు భగవంతుఁడు రక్షించు ననియు సూచితము.

తాత్పర్యము

స్పష్టము.

క. నాయొడ్డాణముఁ దీసితి, నాయెడ నొక్కింత జాఱె ♦ నంశుకము చెఱం
గా యది గని నీ నవ్వుట, నాయాసము పడితి లజ్జ♦యలముటకతనన్. ౯౨౬

అర్థములు. అంశుకము = చీర.

తాత్పర్యము.

ఆ కాకిని దఱుమఁ గొట్టుటకై నా యొడ్డాణము దీసితిని. అప్పుడు చీర జాఱి పోయెను. నీవు నవ్వితివి. నాకు సిగ్గు దోఁచుటచే నాయాసపడితిని.

క. ననుఁ గాకము చీరుటచేఁ, గినుకయు నీ వపహసింపఁ ♦ గెరలగ సిగ్గున్
కను దెంచి గాసిపడి నేఁ, గొనకొని నీ యంకసీమఁ ♦ గూర్చుంటి వ్యథన్. ౯౨౭

అర్థములు. చీరుటచే=ముక్కుతో గీచుటచే; కినుక=కోపము; అపహాసింపన్=నవ్వఁగా; అంకసీమన్=ఒడిలో.

తాత్పర్యము.

నన్నుఁ గాకి ముక్కుతో గీఁచుటచేఁ గోపము. నీవు నవ్వుటచే సిగ్గుగలదాననై ప్రయాసపడి వచ్చి నీ యొడిలోఁ గూర్చుంటిని.

చ. బుడబుడ బాష్పముల్ కనులఁ ♦ బొంపిరి వోవఁ జెఱంగుచేత నేఁ
దుడుచుకొనంగ నన్నుఁ గని ♦ తోయజలోచన! యూఱడింపవే?
వడఁబడి నీదు కుర్వపయి ♦ వ్రాలితి నిద్దుర గ్రమ్మ కన్నులన్
వడిగనె లేచితిం బిదపఁ ♦ నా పతి హాయిగఁ గూర్కె నా తొడన్. ౨౮

అర్థములు. పొంపిరి వోవన్ = వృద్ధికాఁగా.

తాత్పర్యము.

ఈ రెండు కారణములచేతఁ గన్నులందు నీళ్లు వృద్ధియయి బుడబుడ కాఱఁగా నేను కొంగుతోఁ దుడుచుకొనఁగా నీవు నన్ను సమాధాన పఱుప లేదా. అట్లు గాసిపడి నిద్దుర రాఁగా నీతొడమీఁదఁ బండుకొంటిని. వెంటనే లేచితిని. అప్పుడు నా మగడు నా తొడమీఁదఁ దలయుంచి పండుకొని నిద్రించెను.

పగటినిద్ర : అరణ్యకాండము ౧౦౮ వ పద్య వ్యాఖ్య చూచునది.

ఉ. అంతట మున్ను గాసి నిడి ♦ నట్టిది యా పలుగాకి కాకి నా
యంతికసీమ డాయుచు స్త♦నాంతరసీమను జీరి యంతతో
శాంతి వహింప కా పులుఁగు ♦ సత్వరతం బొడువంగ మాటికిన్
వంత జనింప రాము పయి ♦ వ్రాలెఁ దదుద్గత రక్తబిందువుల్. ౨౯

అర్థములు. పలుగాకి=చెడ్డది, అంతికసీమ=సమీప ప్రదేశము. వంత=బాధ; తదుద్గత=దానిలోనుండి బయలు వెడలిన; రక్తబిందువుల్ = నెత్తురుబొట్లు.

తాత్పర్యము.

ఇట్లు రామచంద్రమూర్తి నిద్దురింపఁగా ముందు బాధ పెట్టిన యా దుష్టకాకమే నా సమీపమునకు వచ్చి నా స్తనములమీఁద గీఱి యంతతోఁ బోక ముక్కుతో మీఁదమీఁద నాకు బాధ కలుగునట్లు పొడిచెను. ఆ గాయము నుండి వెలువడిన నెత్తురు బొట్లు రామచంద్రమూర్తిపైఁ బడెను.

ఉ. పాపపుఁ బుల్గు నా కిడెడు♦బాధల నైఁపక నాథు నిద్దురన్
లేపితి శ్రీకు శత్రుహరు ♦ లేచి యతండు స్తనాంతరంబునన్
జేపడియున్న కాటుఁ గని ♦ చిత్తమునం గన లూని యెవ్వఁడీ
పాపముఁ జేసెఁ జెప్పు మిఁకఁ ♦ బైదలి! యాతని రూపు మాపెదన్. ౩౦

అర్థములు. శ్రీకున్=శ్రీ కలవానిని. లోకమునఁ దఱచుగా జను లందఱు మేలుకనియున్న వేళఁ దళుకు బెళుకులు చేసికొనుటఁ, గనుగిఱపులచే సుందరులుగానే

కానవచ్చుచుందురు. నిద్రించునపుడావేషములు, నభినయనములుదొలఁగుటచే వారి స్వభావవికారరూపము కానవచ్చుచుండును. రామచంద్రమూర్తివిషయమట్టిదిగాదు. నడయాడు చున్నప్పుడెంత సుందరుఁడో నిద్రపోవునపుడంత సౌందర్యముకలవాఁడు గానే కానవచ్చుచుండును. కాని సౌందర్యమునకు నే దశయందును హానిలేదు.

నాథ శబ్దమునకు యాచింపఁబడువాఁడు దీవింపఁబడువాఁడని రెండు ధాత్వర్థములు గలవు.

నా నాథుఁడు = నాచే యాచింపఁబడువాఁడు. ఆయన నిద్దరపోవునపుడాయన సౌందర్యమును జూచి చూచి నీ సౌందర్యము, నాకుఁ గొంచెమిూయరాదా, నే నెంతో సుందరి ననిపించుకొంటినే యని యాచించుదానను. అట్టి సౌందర్యము ననుభవించుభాగ్యములేక, నిద్దురపోవు వానిని అందు తటాలున లేప రాదని తెలిసియు నా సౌందర్యానుభవానందమునకు నోఁచుకొనక నిద్దుర లేపితిని.

ఆ నిద్రాసౌందర్య మెట్టిదని చెప్పుదును. ఎవరైనఁ జూచిన దృష్టిదాఁకునో యని నేను దృష్టిదీసి మంగళాశాసనములు పలుకుదానను. అటువంటి సౌందర్యము గలవానిని లేపితిని.

శత్రుహరుఁ = ఆయన నిద్రపోవుచున్నప్పుడు చూచినను, శత్రువులు భయపడిపోదురు. కాకికి నిద్రపోవు రామచంద్రు ముఖము కనఁబడునట్లుచేసి యుండిననది భయపడి పరువెత్తియుండును. నేనట్టు చేయక తెలివిమాలి నిద్దుర లేపితిని.

(అరణ్య. ౧౧౮. బాల. ౬౨౨ వ్యాఖ్య చూచునది.) కనలు = కోపము. వైదెలి = ఓ సీతా!

తాత్పర్యము.

ఆపాపపుఁ బక్షి పెట్టెడిబాధ సహింపలేక సుఖముగ నిద్రించు నా నాథుని, శ్రీకాంతుని, శత్రుమర్దనుని లేపితిని. ఆయన లేచి నా స్తనములయందున్న గాయముఁ జూచి, కోపించి, యీ పాపముజేసిన వాఁడెవ్వఁడే చెప్పుము. వాని నిపుడే రూపము మాపెద నని చెప్పెను.

ఆ. రోషవేగముననుఁ బొంగెడి పంచవ, క్త్రంబు పాపముతోడఁ గర్వి యెవ్వఁ
డాడుకొనఁగఁ జొచ్చె నంబుజలోచన! యనుచు నచట నాకు నభిముఖముగ.

అర్థములు. పంచవక్త్రింబు = అయిదుతలలు గలది. (౨) విచ్చిన విశాలమైన పడగలు గలది. గర్వి = పొగరు పట్టినవాఁడు; అభిముఖముగఁ = ఎదురుగ.

తాత్పర్యము.

రోషముతో బుసకొట్టుచున్న యైదు తలల పాముతో నెవ్వఁ డాడుకొన సాహసించె నని చెప్పి నాకు నెదురుగ నున్న.

ఆ. రక్తసిక్తనఖర యుక్త మహా కరటంబుఁ, గనియెఁ గనినయంతఁ గాకిరూపుఁ
గొనినయట్టి శక్రు కొమరుండు గాడ్పునఁ, బర్వతంబు డిగ్గి పాఱఁ దొడఁగె.

అర్థములు. రక్తసిక్త నఖర యుక్తము = నెత్తుటితోఁ దడిసిన గోళ్ళుగలది; శక్రు కొమరుండు=ఇంద్రుని కొడుకు జయంతుఁడో, లేక వాలి క్రోతిఁగఁ బుట్టినట్లు కాకిగా నెవఁడైనఁ బుట్టెనో, అట్టివాఁడు. గాడ్పు=గాలి.

తాత్పర్యము.

నెత్తుటఁ దడిసిన గోళ్ళుగల కాకిని జూచెను. ఆయన జూచినంత మాత్రమున నే కాకిరూపముతోనున్న యింద్రుని కొడుకు గాలివలెఁ గొండ దిగి పరువెత్త నారంభించెను.

పిచ్చుకమీఁదఁ బ్రహ్మాస్త్ర మన్నట్లు కాకిమీఁద నంత పెద్ద యస్త్రము వేయవలయునా యను హనుమంతుని సందేహము దీఱ నది సామాన్యమైన కాకి కాదు, ఇంద్రుని కొడుకని సమాధానము చెప్పుచున్నది.

ఇంద్రుఁడు అహల్యను జెఱుపఁదలఁచి యొకనాఁటిరాత్రి కాకియై కూసెను. గౌతముఁడు కాకులు కూయువేళ యైనదని లేచి యేటికిఁ బోయి నది నిద్రించుచుండుట చూచి యిది యింద్రునికుచేష్టయని యెఱిఁగి నీకు కాకిరూపమే శాశ్వతమగును గాకయని శపించెను. అప్పుడు దేవతలు, ఋషులు గౌతముని బ్రార్థింపఁగా; నీశాపము నీకొడుకునకుఁ దగులు ననియు రామబాణపీడితుఁడై యాయనచేఁ రక్షింపఁబడి శాపముక్తుఁడగు ననియు గౌతముఁడు చెప్పెను. వాసిష్ఠ రామాయణము.

సీ. అదిచూచి శ్రీరాముఁ♦డాగ్రహవశుఁడయి, యా యరిష్టముపట్ల♦నదయుఁడగుచు
దర్భాసనంబున♦దర్భయొక్కటి దీసి, బ్రహ్మమంత్రంబునఁ♦బ్రజ్వరిల్లఁ
జేసి మహాకళిమీఁద♦వేసిన నదియును, నంబరపథమున♦నరుగుచున్న
బలిభుక్కు వెన్నంటి♦పఱవఁ దొడంగెను, గాకియు వెఱ మూఁడు♦లోకములను
తే. దిరిగ తిరిగియుఁ బలువుర♦శరణు వేఁడె,
గన్నతండ్రియు సురలును♦ఘనమహర్షి
చయములును దాముఁగావంగ♦జాల మనఁగ,
మరలి చనుదెంచి రామునే♦శరణుఁజొచ్చె. ౯౩౩

అర్థములు. అరిష్టము = కాకి, అదయుఁడు = దయలేనివాఁడు, మహాకళి = కాకి, బలిభుక్కు = కాకి, వెఱన్ = భయముచే, కన్నతండ్రి = ఇంద్రుఁడు, సురలు = దేవతలు, సురశబ్దము నిత్యబహువచనము, స్త్రీ సమాసము; సిద్ధసమాసంబునఁ బుంలింగము. భూసురుఁడు—భూసురులు; దీనికి నేకవచనంబున రూపము లేదు.

సు. వ్యా. తత్స. ౬౮. సూ.

బలిభుక్కు=కాకి; భగవంతుఁడే లోకులకు ముఖ్యబంధువు. తదితరులైన మాతాపిత్రాదులు ఆభాసబంధువులేకాని ముఖ్యబంధువులు కారు. కాన నట్టి ముఖ్య బంధువే లోకులను రక్షింపవలెనుగాని యీ యాభాసబంధువులు రక్షింప రని చెప్పుచున్నది, కాకియు నిత్యాది. కాకియున్ =(౧) భగవత్ప్రాప్తికిఁ బురుష

కారమైన జగన్మాతయైన సీతయెడ నపరాధపడిన యా కాకి. దాని యపరాధమిపుడే కలిగినది. కాన నార్ద్రముగనే యున్నది. కాని యింక నెండెడి స్థితికి రాలేదు. వెఱఁ = రాముఁ డేసిన బ్రహ్మాస్త్రమువలని భీతిచేత; కన్న తండ్రియుఁ = కష్టము వచ్చినపుడు కన్నతండ్రిగదా రక్షించు నని యతనిని శరణు వేఁడినది. కావంగఁజాల మను పైపద్యముతో నన్వయము. ఆ యింద్రుడు తాను త్రైలోక్యనాథుఁ డయినను వానిని రక్షింపఁ దనకు సాధ్యపడ దన్నాఁడు. 'ఇంద్రో మహేంద్రస్సురనాయకో వా' యని, యీ గ్రంథము నింద్రునికిని రక్షణ సామర్థ్యము లేదని చెప్పి యున్నది గదా. తండ్రి శబ్దముపైని సముచ్చయము తల్లిని సూచించును. తండ్రి మాత్రమే కాదు, తల్లియు వదలెను. సర్వరక్షకురా లైన సీతయెడ నపరాధము కావించిన వాని నామె మాత్రము రక్షింప సమకట్టునా ? 'సీతా నారీ జన స్యాస్య యోగ క్షేమం విధాస్యతి' యని గదా యీ గ్రంథమున నున్నది. క్రమ మిట్లగుఁగునది. ఆ కాకి తండ్రికన్నను దల్లికి బుత్రులందుఁ బ్రేమ యెక్కువయని యెంచి మొట్ట మొదట నామెను శరణుజొచ్చినది. ఆమె వదలిన పిమ్మటఁ దండ్రిని శరణుజొచ్చెను. ఆయనయు రక్షింపలేదనుటచేతఁ దల్లియుఁగావ లేదని యర్థసిద్ధము, సముచ్చయ సూచితము. లోకమున నొక్కనిని దల్లిదండ్రులు వదలి పెట్టినను బంధువులు వదలు వాడుక లేదు. ఈ వాయస విషయ మట్లు కాక తల్లిదండ్రులు వదలినది విని, బంధు వులును వదలి రను చున్నది. సురలును – కావంగఁ జాల మనఁగ ననుదానితో నన్వ యము. 'యస్య బిభ్యతి దేవాశ్చ జాతరోషస్య సంయుగే' యన్నట్లు రామునికన్ను లెఱ్ఱ బాఱినచో దేవత లెక్కడివా రక్కడనే జడిసిపోదురు గదా. పూర్వపు శరీర బంధువులు వదలుటయేకాక యిపుడు పరిగ్రహించిన కాక శరీరమునూలాన బంధువు లైన పక్షులును వదలినవని సముచ్చయము తెల్పును. పక్షులు వీనిని వదలుటకు రెండు కారణములు. రాముఁడు తమ రాజైన గరుత్మంతుని వాహనముగాఁ గొన్నవాఁడని యొక కారణము. 'పక్షిణోఽపి ప్రయాచంతే సర్వభూతానుకంపిన' మన్నట్లు రాముఁడు తమకునుశరణమగుట రెండవకారణము. తలిదండ్రులును, బంధువులును వదలినపిమ్మట నా కాకి దయాస్వరూపులయిన మహర్షులను శరణుజొత్తమనిపోయినది. వారునుజాల దూర మాలోచించి వదలి రనుచున్నది. ఘన మహర్షి చయమును దాము గావంగఁ జాల మనఁగ (౧) దయ చేయుటకును స్థలవ్యవస్థ కలదని యెంచి వారీ కాకిని వదలిరి (౨) వీనిని మనము చేర్చుకొన్నచో వీని సహవాసదోషము వలన మనకును చేటు కలుగును. మనము వీనిని వదలి పెట్టితిమేమని గతిలేక శ్రమపడుచున్న వీనిని రాముఁడు తప్పక రక్షించునని దూరాలోచన చేసి వీనిని వదలిరని యైనను భావము. (3) 'యో విష్ణుం సతతం ద్వేష్టి తం వింద్యా దంత్యరేతస' మన్నట్లు విష్ణువును ద్వేషించువాఁడు అంత్యజాతికిఁ బుట్టినవాఁడు. ఈ కాకి విష్ణుమూర్తి యవతారమైన రాముని ద్వేషించునది కాన, నిది చండాల జాతిలోఁ జేరినది. మాలవానిని మనము

దగ్గఱఁజేర్పనట్లు దీనినిగూడ దగ్గఱఁ జేర్పరాదని తలంచి వదలిరనియైనను భావము. సన్న్యాసులందుఁగోపముగలవాఁడు, పక్షులందుఁ గాకి చండాలు రనిసామెతగలదు. ఏనుఁగును బోఁగొట్టుకున్న వాఁడు, కుండల సందులందు వెదకి నాఁడన్నట్లు లీ కాకి తనకెవరును శరణు కాకపోఁగా వాకిలి తెఱచియున్న యింటింటఁ దూఱ నారంభించినదనుచున్నది. మూఁడులోకముల సంచరించుఁ బలువుర శరణువేఁడె. సంచరించుచుర్ = ఒక్కొక్క యింటికిని తొమ్మి దేసి మార్లు పోయి యింటివారికిఁ దెలియకమూలమూలలను దాఁగుకొనియుండె. ఎప్పుడైనవారికిదయకలుగునా తనపైనని యా కాకి కాచుకొని యుండెను. ఆ యింటివార లందఱును వీనిని బైటఁ ద్రోసి తలుపుగడియవేసికొనిరనిభావము.ఆపైనకాకిచేసిన దేమనఁగాచెప్పుచున్నది.మఱలఁ జనుదెంచిరామునే శరణుజొచ్చె. రామునే = (౧)రక్షకులని పేరు పెట్టుకొన్న మాతాపిత్రాదుల కంటెను, శిక్షకుఁడైన శ్రీరాముని ముఖమే కాకికిఁ జల్లగా నున్నట్లు తోఁచినది. కాఁబట్టి కాకి రామునే శరణుజొచ్చినది. 'యదివారావణస్స్వయ'మ్మని రావణుఁడు వచ్చినను రక్షింతునని కదా రాముని యధ్యవసాయము. (౨)సర్వలోక రక్షకుఁడైన రామునే (౩) 'దోషో యద్యపి తస్య స్యాత్' వాని దోషము నేను లెక్కింపను అనునట్టి రామునే, ఈ యభిప్రాయములన్నియు నేకారసూచితములు. శరణుఁజొచ్చెర్ = కాకి రాముని నివాసస్థానముగా నొందినదేకాని రక్షణోపాయముగా నొంద లేదు. 'నివాసవృక్ష స్సాధూనామ్' – సాధువులకు నివాసవృక్షము.

గోవింద.

## తాత్పర్యము.

పరువెత్తుచున్న యాపక్షిని జూచి కోపించి దయ వదలినవాఁడై దర్భాసనమందుండిన దర్భపోఁచ దీసి బ్రహ్మాస్త్రమంత్రమున మంత్రించి కాకిమీఁదవైచెను. ఆపోఁచ యాకాశమునఁ బోవుచున్న కాకిని వెంబడించెను. కాకి మూఁడులోకములు దిరిగితిరిగియ నేకులశరణు వేఁడెను. ఇంద్రుఁడు, బ్రహ్మాది దేవతలు, గొప్పమహర్షులు అందఱు మేమునిన్నుఁ గావఁజాలమని చెప్పఁగావేఱుగతి లేదని తెలిసి మఱలవచ్చి రామునే శరణు వేఁడెను.

ఈవిషయము పద్మపురాణమున నిట్లు వివరింపఁబడెను.
'యత్రయత్ర యయౌ కాకః, శరణార్థీ స వాయసః
తత్ర తత్ర తద స్త్రంతు, ప్రవివేశ భయావహమ్॥
బ్రహ్మాణ మింద్రం రుద్రంచ, యమం వరుణ మేవచ
శరణార్థీ జగామాసౌ, వాయసః శస్త్రపీడితః॥
తం దృష్ట్వా వాయసం సర్వే, ఋషయో దేవదానవాః
న శక్తాస్మ వయం త్రాతు మితి ప్రాహు ర్మనీషిణః॥
అథ ప్రోవాచ భగవాన్, బ్రహ్మా త్రిభువనేశ్వరః

భో భో బలిభుజాం శ్రేష్ఠ, త మేవ శరణం వ్రజ॥
సఏవ రక్షక శ్శ్రీశః, సర్వేషాం కరుణానిధిః
రక్షత్యేవ క్షమాసారో, వత్సలః శరణాగతాన్॥
శరణం వ్రజ సర్వేశం, నాన్య దస్తి తవ ద్విజ
ఇత్యుక్త స్సోఽథ బలిభు గ్బ్రహ్మణో రఘునందమ్
ఉపేత్య సహసా భూమౌ నిపపాత భయాతురః॥
ప్రాణ సంశయ మాపన్నం దృష్ట్వా సీతాఽథ వాయసమ్
త్రాహి త్రాహీతి భర్తార మువాచ దయయా విభుమ్॥
పురతః పతితం దేవీ ధరణ్యాం వాయసం తథా
తచ్ఛిరః పాదయో స్తస్య యోజయామాస జానకీ॥
త ముత్థాప్య కరేణాథ కృపాపీయూషసాగరః
రరక్ష రామో గుణవాన్ వాయసం దయ యైక్షత॥

తాత్పర్యము.

కాకి యెక్కడెక్కడికిఁ బోయెనో యస్త్ర మక్కడక్కడికిఁ బోయెను. శస్త్ర పీడితుఁడు కాకాసురుఁడు బ్రహ్మను - ఇంద్రుని - రుద్రుని - యముని - వరుణుని తక్కినవారిని రక్షింపుమనికోరెను. దానిని జూచి ఋషులు, దేవతులు, దానవులులో నగు వారందఱుమేమురక్షింపఁజాల మనిరి. అప్పుడు బ్రహ్మ ఓ కాకీ! నీవు పోయి శరణాగతవత్సలుఁడు, శ్రీపతియగు శ్రీరామచంద్రునే శరణు చొరుము. ఆయన యేసర్వరక్షకుఁడు, కరుణానిధి, క్షమాసారము, శరణాగతులరక్షించునని చెప్పఁగా నట్టులే వచ్చి శ్రీరాము సమీపమునఁబడెను. ప్రాణసంశయ దశ నున్న కాకిని జూచి దయావతి యగుసీత భర్తతో రక్షింపురక్షింపు మనెను. సీతాదేవి తన ముందటఁ బడినకాకిని జూచి దాని తల రాముపాదములపై బడునట్లు చేతితో నెత్తివేసెను. సీత యనుగ్రహించిన కారణముచే రామచంద్రుఁడును దానిని రక్షించెను.

సీ. శర ణంచు ధరణిపై♦సాఁగిలఁబడినట్టి, వాయసుఁ గని యది♦వధ్య మయ్యుఁ
జంపక కాచితి♦పెంపారు కరుణచే, జగముల దిక్కేది♦వగపు చెంది
శరణాగతం బైన♦పరభృత్తుఁ గనుగొని, వ్యర్థంబు పోదు బ్ర♦హ్మాస్త్ర మేమి
చెప్పెద వనినను♦జేకొన నిమ్ము నా, కుడికంటి ననియె నా♦చెడుగు కాకి
ఆ. బెడిదమైన శరము♦కుడికన్ను హరియించి, చనియెఁ జనియెఁ గాకి♦చావుదప్పి
కన్నులొట్టవోవఁ♦గాకుత్థ్సకులునకా, దశరథునకు భక్తి♦దండ మిడుచు. -౩౪

అర్థములు. దిక్కేది = దిక్కులేక; వధ్యము = చంపఁబడఁదగినది; దశరథునకు దండమిడుచు = శరణాగత రక్షణము మా వంశధర్మము కావున శ్రీరాముని నే శరణువేఁడి బ్రతుకు మని స్వర్గమున బోధించెను కావున నాయనకు దండము. పరభృత్తు = కాకి, కోవిల పిల్లలను సాకునది కావునఁ బరభృత్తు. కోకిలలు దమపిల్ల

లను దాము కాపాడలేక యాపిల్లలను దెచ్చి కాకిగూటిలో నుంచిపోవును. అవి తమపిల్లలే యని కాకులు సాకును. కాలము వచ్చి యవి గూసినపుడు తమపిల్లలు కావని తెలిసి వానిని తన్ని తఱుమును. ధరణిపై సాఁగిలఁబడిన – దుష్టపుత్రుఁడు, తండ్రి తన్ను శిక్షింప రాఁగా నా శిక్షను దప్పింపు మని తల్లి కాళ్ళపైఁ బడినట్లు నీ కాకి రామపాదముల యొద్ద నున్న భూమిమీఁదఁబడెను.

అట్టి వాయసుఁ = భగవద్విషయమున నపరాధము చేయుటే దీక్షగాఁ గల వానిని, పాఠక్రమమున నిట్లున్నను పాఠక్రమమునకంటె నర్థక్రమము బలీయ మను న్యాయ మనుసరించి యట్టి యను పదార్థమును తక్కిన విశేషణములకు ముందుగా యోజన చేసికొనునది. అట్టివాయసుఁ = తండ్రియగు రాముని విషయమునసే కాక పురుషకారభూత యగు తల్లి విషయమందును ద్రోహము చేసినవాఁడు.

తా త్ప ర్య ము .

శరణు శరణని భూమిమీఁద సాఁగిలఁబడిన కాకిని జూచి యిది వధింపఁదగిన దయ్యుఁ జంపక దయచేత వదలితిని. ఇంత ప్రపంచమందొక్కఁడైనఁ గాచువాఁడు లేక దుఃఖపడి శరణు జొచ్చిన కాకిని జూచి నా బ్రహ్మాస్త్రము వ్యర్థము పోదు. దాని కేమి యిచ్చెద వనిన నది తన కుడి కంటిని దీసికొన నిమ్మని చెప్పెను. ఆ భయంకర మైన బాణము దాని కుడికన్ను హరించి పోయెను. కాకియును, జావు తప్పి కన్ను లొట్టపోవ రామచంద్రమూర్తిని, దశరథమహారాజును దలఁచి నమస్కరించిపోయెను.

క. నా కొఱకై బ్రహ్మాస్త్రముఁ, గాకముపై విడిచి, నిన్నుఁ ♦ గా దని నునుఁ దా
నీ కరణిని గొని తెచ్చిన, యా కూళునియెడ నుపేక్ష ♦ యగునె నరేంద్రా! ౩౫

తా త్ప ర్య ము .

నరేంద్రా! నాకేదో కొంచె మల్పకాల బాధ గలిగించిన దని కాకముపై బ్రహ్మాస్త్రము ప్రయోగించిన నీవు, నిన్నుఁ దిరస్కరించి యింత కాలముగ నింత బాధపెట్టు నీ క్రూరుని నీవుపేక్షింపవచ్చునా? ఇట్లు చేసితివేని నీవు నరేంద్రుఁడ వెట్లయ్యెదవు? నీ నరేంద్రత్వమునకు హాని రాదా? కాన దానిని రక్షించుకొనుము.

చ. తెలియని దానఁ గాను జగ♦తీవర! నీదు పరాక్రమంబునుఁ
బలమును సాహసంబును, గృ♦పాగుణమే వరధర్మ మంచు మఱి
బలికితి వీవ నన్గుఱిచి ♦ బాధలఁ బొందెడి నాయెడఁ దయం
దలఁపుము, నాథుఁ డీవఁట య♦నాథగతిం బడియున్న దానఁగా. ౩౬

అర్థములు. నీదు పరాక్రమంబు బలము సాహసము = నీదు = పరుల దుఃఖ మును జూచి సహింపఁ జాలమని చెప్పిన నీ యొక్క; పరా...సము = చెప్పుటయే గాక పరాక్రమాదులచే నట్లే నెఱవేర్చయు నున్నావు. ఇది నే నెఱుఁగుదును. పరుల దుఃఖముఁ జూచి నే నొకానొక యేకాంతసమయంబున మీ యందుండు నన్ని సద్గుణములలో దేనిని మీరు గొప్పదిగా భావించి యనుష్ఠించెద రని నే నడుగఁగా

దయాగుణమే గొప్పగా నెంతు వని మీరే నాతోఁ జెప్పలేదా? ఈవ=నీవే, మఱి యెవ్వరో కాదు. దూతలు మొదలగు నితరుల ముఖమునఁ గాదు. నః గుఱిచి = నాతోనే. మఱి యెవ్వరితోనో చెప్పఁగా నేను విన్నది గాదు. మఱి యెవ్వరి విషయము గుఱించియో కాదు, నా విషయమందే. మన మిట్లడవులలో మృగముల, రాక్షసుల నడుమఁ దిరుగుచున్నామే. నా కేదైన నపాయము వచ్చి. నిన్ను విడిచి యుండుట గలిగెనేని నా గతి యేమి చేసెదరని నే నడుగఁగా నేను నిన్ను రక్షించెద నని నీవు చెప్పలేదా. కృపాగుణము=పరుల దుఃఖమును, దన దుఃఖముగా నెంచి నివారింపజేయు గుణము. ఇట్టి గుణము నీ యం దుండుటచేఁ గదా నీవు జగతీ వరుఁడ వైతివి. జగతీవరుఁడవు = భూదేవికి నిష్టుఁడ వగు వాఁడవు. భూమిచే వరింపఁబడిన వాఁడవు. "జగతీ రత్నగర్భాచ భూతధా త్ర్యబ్ధిమేఖలా" నిఘం. "జగతీ లోకో విష్టపం భువనం జగత్" లోకములో రాజు లందఱు భూమిని గోరుచుండఁగా, భూదేవి నిన్నుఁ గోర నేల? (అయోధ్య ౨౭ వ. పద్యము) నీ విష్టుఁడ వైన భర్త వనిగదా నిన్ను వరించెను. తన కిష్టుఁడుగాని వానిని, తన్ను భరింపలేని వానిని నే యాఁడుదైన భర్తగా వరించునా? మండుని నెవతె భర్తగా వరించును? అట్లు ప్రపంచమున కంతయు నీ విష్టవరుఁడవై రక్షింపఁగలిగి జగతీవరుఁ డని పేరొందిన వాఁడవు. న న్నొక యాఁడుదానిని రక్షింప లేవేని నీ కా బిరుదము సార్థకమా? "సీతాయాః పతయే నమః"యని నిన్ను సీతానాథుఁడు, సీతాపతి యను చున్నారుగదా. సీతను రక్షింపలేకుండిన నీ కీ పేరు తగునా? నీవు సీతాపతివి, సీతానాథుఁడ వగుటచే నీ కందఱు నమస్కరించు చున్నారుగాని, ఆ యోగ్యత నీవు దక్కించుకొనవేని నీ కెవ్వఁడు నమస్కరింప దలఁచును! సీతను రక్షింపలేని రాముఁడు మఱి యెవ్వనిని రక్షించును అని లోకము ని న్నుపేక్షింపదా. కావున నీ గౌరవము కాపాడుకొనుటకైన నన్ను రక్షింపుము.

ఈ విధముగా సీతాదేవి వాక్యము లన్నియు భావగర్భితములై యున్నవి. గ్రంథవిస్తరభీతి నేవియో కొన్ని వివరింపఁబడెను.

## తాత్పర్యము.

జగన్నాథా! నీ బల పరాక్రమ సాహసము లెట్టివో, యెంతటివో నే నెఱుఁగుదును. తెలిసియే నీవు తప్పక రక్షింతు వని నమ్మి యున్నదానను. అన్ని గుణములలో దయాగుణమే శ్రేష్ఠ మని నీవే నాతోఁ జెప్పియుంటివిగదా. ఆ దయను బాధలు పడు నాయెడఁ గనఁబఱుపుము. నిన్ను నాథుఁడుగాఁ గల నేను అనాథవలెఁ బడియున్న దాననే. ఇట్లు చేయుట నీకు ధర్మమా? ఈ యుపదేశ పాండిత్యము అనుష్ఠానమందు లేదా యని హనుమంతా! యడుగుము.

(అరణ్య ౧౩౮ వ. చూచునది.)

క. అంభోనిధిగంభీరుఁడు, శుంభద్విక్రముఁడు వైరి♦సూదనచణుఁ డా
జంభారినిభుఁడు సజలధి. కుంభినికిని భర్తచూ ర♦ఘుప్రవరుం డర్క. ౯౩౭

అర్థములు. అంభోనిధి = సముద్రమువలె; గంభీరుఁడు = లోఁతు తెలియ నీయనివాఁడు; వైరిసూదనచణుఁడు = శత్రువులఁ జంపుటయందు సమర్థుఁడు; జంభారి నిభుఁడు = ఇంద్రునితోఁ సమానుఁడు; సజలధి = సముద్రములతోఁ గూడిన కుంభినికి = భూమికి, సముద్రమడ్డము వచ్చినది, రాలేదందువా. భూమి అబ్ధి మేఖలకదా. స్త్రీతో భోగింపఁదలఁచిన మగనికి దాని యొడ్డాణమా యడ్డము వచ్చును? భూమి జలధివసనకదా. భూమికి సముద్రము చీరగదా. భార్యతో సంభోగింపఁ జీర యడ్డమని తలఁచు మగవాఁడు మగవాఁడా? (చూ.౯౬౮-వ ప. (జలధి వేష్టిత = సముద్రము వస్త్రముగాఁగలది)

తాత్పర్యము.

హనుమా! సముద్రమువలె గాంభీర్యము గలవాఁడును, ప్రకాశించు పరాక్రమము గలవాఁడును, శత్రుసంహారమందు సమర్థుఁడును, ఇంద్రునితోఁ సమానుఁడును నగు రామచంద్రభూపాలుఁడు చతుస్సముద్రములతోఁ గూడిన భూమండలమునకు భర్త సుమా.

క. ఈ విధమున నస్త్రకళా, కోవిదతతిమేటి స త్త్వ♦గుణధాముఁడు స
ద్భావుఁడు సచ్ఛీలుం డేలా విడువం డస్త్ర మొండు ♦ నసురావళిపై. ౯౩౮

అర్థములు. అస్త్రకళాకోవిదతతి = అస్త్రవిద్యయందలి పండిత సమూహములందు, సత్త్వగుణధాముఁడు = బలమునకు, సద్గుణమునకు స్థానమైనవాఁడు, సద్భావుఁడు = మంచిహృదయము గలవాఁడు.

తాత్పర్యము.

ఈ ప్రకారముగ నస్త్రవిద్యయందు పండితులగు వారిలో శ్రేష్ఠుఁడు, బలగుణ స్థానము = మంచి బలముగలవాఁడు, మంచి స్వభావముగలవాఁడగు రామచంద్ర మూర్తి నామీఁద నేమాత్రము కొంచెమైన దయ యుండినను లోక మరాక్షస మగు నట్లు నొక యస్త్ర మేల విడువకున్నాఁడు?

మ. వరదివ్యాస్త్రవిదుం డదేల యసుర♦వ్రాతంబుపై వైవఁడు
ద్ధరశాతాస్త్ర మొకండు? దేవదనుజ ♦ స్తోమాహిగంధర్వులేఁ
దిరు లై చూడఁగ లేరు సంగరధరి♦త్రిన్ రామునిన్, నం పయిన్
గరుణాలేశమె యున్న రాక్షసుల వీఁ♦కం గూల్పఁ డే హేతువో? ౯౩౯

అర్థములు. వరదివ్యాస్త్రవిదుండు = శ్రేష్ఠములైన దివ్యాస్త్రముల నెఱిఁ గినవాఁడు.

తాత్పర్యము.

ఉత్తమములైనదివ్యాస్త్రముల నెఱింగిన రామచంద్రమూర్తి రాక్షసులమీద

నొక పదునైన యస్త్రమేల విడువరాకున్నాఁడు. దేవతలు, దానవులు, పన్నగులుఁ గంధర్వులైనను యుద్ధభూమి యందు స్థిరముగ నిలఁబడి యాయన వంకఁ దేఱిచూడ జాలరు గదా. అట్టివాఁడు నామీఁదఁ గూరిమియున్నచో రాక్షసులఁ జంపకుండునా? దీనికి నేమి కారణ ముండఁగలదు. నామీఁద దయ లేమియే.

ఉ. అన్న యనుజ్ఞఁ బొంది యహితాంతకమూర్తి సుమిత్రపట్టియే
నన్నది యేల కావఁగ మనంబున నెంచఁడు? సర్వభుఙ్మరు
త్సన్నిభు లన్నదమ్ములు నజయ్యులు దక్షు లుపేక్షసేత కో
యన్న నిజంబు మత్కృతమహత్తరపాపమ హేతు వెన్నఁగన్. ౯౪౦

అర్థములు. అహితాంతకమూర్తి=శత్రువుల పాలిటికి యముఁ డగువాఁడు, సర్వభుక్+మరుత్+సన్నిభులు=అగ్ని వాయు దేవతలతో సమానులు, మత్కృత=నా చేతనే చేయఁబడిన, మహత్తర పాపమ = మిగుల గొప్పదగు పాపమే, అభ్యుపగత ప్రారబ్ధము. సంచితము, ఆగామి, ప్రారబ్ధములలో రామచంద్రమూర్తి నాశ్రయించి శరణాగతి చేసినచో వెంటనే సంచితాగామములు నశించును. యావజ్జీవమనుభవింపఁ దానై యంగీకరించిన ప్రారబ్ధము మాత్రము పోదు. అట్టులే యీప్రారబ్ధానుభవము నేనై యంగీకరించినదే. కావుననే వారుపేక్షించి యున్నారు. నా కార్తప్రపత్తి యుండిన రామ వియోగము లభించిన వెంటనే ప్రారబ్ధము నశించి యుండును. ఈ బాధ లేకుండును. దృప్త ప్రపత్తి యగుటచే ననుభవింప వలసి యున్నది. నేనై చేసికొనిన దానికి వారి నని యేమి లాభము? నేను బాపాత్మురాలినే, నా పాతివ్రత్యమునందు లోపము గలదు. ఏమన నేను నాదు జనకుండు నిన్ను స్త్రీ యని తలఁపఁడా యని దూషించితినే. ఆ పాప మేల వృథా పోవును. ఇది యుత్తరాఘము కదా. ప్రాయశ్చిత్తము పెట్టుకొనకున్న ననుభవింప వలసినదే కదా.

సర్వభుఙ్మరుత్సన్నిభులు = అగ్ని మందముగా మండకున్నను, గాలి వీచనేని యట్లుండ దానికి సాధ్య మగునా? అట్టులే లక్ష్మణుఁడు ప్రేరించిన రామచంద్రమూర్తి యెట్లుపేక్షించి క్రియాశూన్యుఁడై శత్రువుల నిశ్శేషంబుగ దహించి భస్మముసేయక యుండఁగలఁడు. కట్టె లన్ని భస్మ మగువఱకు నగ్ని చల్లారనట్లు రాక్షసుఁడను వాఁడు లోకమున లేకపోవువఱకు రామాగ్ని మండదా?

తాత్పర్యము.

రామచంద్రమూర్తి యుపేక్ష చేసినను నన్నుఁ దన తల్లివలెఁ జూచుకొను లక్ష్మణుఁడు నావలెనే పరతంత్రుఁడు. కావున స్వయముగఁ బూనకున్నను అన్న యనుజ్ఞపొంది యైన నన్ను రక్షింపనేల ప్రయత్నింపలేదు? ఆయన పగవారిపాలిటికి యముఁడే. దోషముగల భార్యలను భర్తలు విడువవచ్చును గాని యెట్టిదోషము గలదాని నైనఁ దల్లిని కొడుకు విడువవచ్చునా? అట్టి లక్ష్మణుఁడు నన్నేల చేయి విడిచెను? అన్నదమ్ము లిరువురు అగ్ని వాయువు వంటి వారు. గెలువరాని వారు. సమ

ర్థులు. నన్నుపేక్షించుటకు నేను జేసిన విశేషపాపము తప్ప మఱియే కారణము కనఁబడలేదు. వారియందు దోషము నెట్లు చెప్పుదును. వారు సమర్థులు కారా, నాయందుఁ బ్రేమలేనివారా. కావున దోసము నాదే.

క. అని దీనాలాపంబులఁ, గనుఁగవ బాష్పంబు లురలఁ ♦ గళవళపడుచున్
జనకజ పల్కిన విని యం,జనతనయుం డిట్టు లనియె ♦ సాంత్వవచనముల్. ౯౪౧

తాత్పర్యము.

ఈప్రకారము శోకముతోఁగూడిన మాటలను కన్నుల నీళ్లు గాఱుచుండఁ గలవరపడి సీతాదేవి పలుకఁగా నూరార్పుమాటల హనుమంతుఁ డిట్లనెను.

మ. వినుమీ సత్యముఁజేసి పల్కెదను దే♦వీ! రామభద్రుండు త్వ
జ్జనితార్తిన్ విముఖుండు సర్వమునకున్ ♦ సంతప్తుఁ డైకుందెడిన్
కని యాయన్న యవస్థ లక్ష్మణుఁడు శో♦కవ్యగ్రుఁ డయ్యెం జుమీ
కనితి న్నిన్నిపు డెట్లు కేల కిట, నిం♦కం జాలి నీ కేటికిన్. ౯౪౨

అర్థములు. త్వజ్జనితార్తిన్ = నీవలనఁ గలిగిన దుఃఖముచే, విముఖుండు = దేనికిని మాఱుమొగము కలవాఁడు, దేనియందుఁ బ్రీతిలేకున్నవాఁడు – సంతాపముచేఁ గ్రుళ్లుచున్నాఁడు. ఆ యన్న స్థితిఁజూచి లక్ష్మణుఁడు మనస్సు కలవళపాటు గలవాఁడగుచున్నాఁడు. నేనిచ్చట నిన్నెట్లో చూచితిని. ఇంకను నీ కేల వ్యసనము?

క. ఇడుమలఁ గుందెడికాలము, కడచెన్ దుఃఖాంత మిపుడ ♦ కనియెద వాత్రం
పడుచు విభు లెదురు చూచుచుఁ, బడఁతీ! యున్నారు లంక ♦ భస్మము సేయన్.

అర్థములు. ఇడుమలన్ = కష్టములను.

తాత్పర్యము.

అమ్మా! నీవు కష్టపడు కాలము పోయినది. నీ దుఃఖమిపుడే నశింపఁగలదు. దానిని నీవే చూడఁగలవు. లంక నెప్పు డెప్పుడు భస్మము చేయుదుమా యని రామలక్ష్మణు లిరువురు నెదురు చూచుచున్నారు.

క. ఆహవమున సహబాంధవు, ద్రోహిని రావణు వధించి ♦ ద్రుతగతిని జగ
న్మోహిని! నినుఁ గొని పురి కు♦త్సాహంబునఁ బోవు రామ♦చంద్రుఁడు ప్రీతిన్.

తాత్పర్యము.

మీకు ద్రోహముచేసిన రావణుని బంధువులతోడఁ జంపి శీఘ్రముగ నయోధ్యకు నన్నుఁ దీసికొని రామచంద్రుఁడు పోఁగలఁడు.

—♦సీతాదేవి హనుమంతునితో శ్రీరామలక్ష్మణులకు సందేశవార్తలు చెప్పి పంపుట♦—

ఉ. ఏమని చెప్పె సీతయన♦ నేమనుదున్ రఘురాముతో, సుమి
త్రామహిళాత్మజాతునకుఁ ♦ దన్విరో! యే మనువాఁడ? వానర
స్వామికి నేమి చెప్పుదును? ♦ సంగడికాం డ్రగు క్రోఁతిఱేండ్ల కే
నేమని నీదుమాటలు మ♦హీతనయా! వచియింతుఁ? జెప్పుమా. ౯౪౫

తాత్పర్యము.

అమ్మా! నేను బోయి సీతాదేవిని జూచితి ననఁగానే రామచంద్రమూర్తి సీత నాకేమని చెప్పు మనెను? లక్ష్మణుఁడు నాకేమైనఁ జెప్పెనా యనును. సుగ్రీవుఁడు, నా స్నేహితులు వానరులు మాకేమి చెప్పె మాకేమి చెప్పెనని యడుగుదురే. నీ మాటలుగా వారివారి కేమని చెప్పుదునో చెప్పుము.

క. ఈవిధిఁ దన్నడిగిన యా, పావనివాక్యముల దుఃఖపరితప్తగనై
భూవిభుని దేవి యిట్లను, వాపిరిఁ గన్నీళ్ళు దొరఁగ వాతాత్మజుతోన్. ౫౫

తాత్పర్యము.

ఈ ప్రకార మాంజనేయుఁడు తన్నడుగఁగా దుఃఖపీడితయై కన్నీరు గార్చుచు సీతాదేవి యాయనతో నిట్లనియె.

క. లోకచయభర్త శుభమతి, యా కోసలతనయ గాంచె నా మహనీయుర్
నాకు న్మాటుగ మ్రొక్కుము, మీ కుశలం బడిగె ననుమి మిత్రవతంసా! ౫౬

అర్థములు. లోకచయభర్త = లోకసమూహముల భరించువాఁడు, శుభమతి = లోకమునకు శుభము గలిగించు మనస్సు గలది, మిత్రవతంసా = మిత్రులందు శ్రేష్ఠుఁడా! అవతంసమె — వతంసము. 'వష్టిభాగురి రల్లోప మవాప్యో రుపసర్గయోః' యను సూత్రప్రకారము అకారము లోపించి వతంస మయ్యెను. అట్లే అవగాహము — వగాహము. అపిధానము — పిధానము అహంకారము — హంకారము. అవహేళ — వహేళ. అకూపారము — కూపారము. అహంవీర — హంవీర. అపోగండ — పోగండ, యయ్యెను. వతంసము = శిరస్సునందు ధరించెడి పువ్వు లేక ఆభరణము, అవతంసము = చెవులందుఁగాని, చెవులసందునందుఁగాని ధరించెడి పువ్వో, ఆభరణమో అని భేదము గ్రహించుట కలదుగాని, సాధారణముగ రెండును పర్యాయములుగనే ప్రయోగింపఁబడును. 'అవతంసంబవు పార్వతీపతి' కిత్యాదులు. అలంకారమందు శ్రేష్ఠ వాచకముగఁ బ్రయోగింపఁబడును.

లోకచయభర్త = లోకములోని స్త్రీలందఱు తల్లిదండ్రులను, దారపుత్రాదులను భరించు బిడ్డలఁ గందురు. కౌసల్య లోకముల నన్నిటిని భరించు పుత్రునిఁ గనెను. నే నాలోకములోఁ జేరినదాననే కదా. నన్నేల రక్షింపరాదు? శుభమతి = లోకక్షేమమును గోరు మనస్సు గలది. కౌసల్యాదేవి లోకముల నన్నిటి నిహపరములనుద్ధరించు కొడుకు కావలెనని నోఁచెను. కావున నట్టి కొడుకే పుట్టెనుగాని, యామె కట్టుకొన్న భార్యను సీతను దప్పఁ దక్కినవారిని రక్షించు కొడుకు కావలెనని నోఁచెనా? ఆ శుభమతి యిట్లు చేయునది కాదే. కావున నన్ను రక్షింపని దోషము రామచంద్రమూర్తిదే. శుభమతి యనునది రామున కన్వయించినను నన్వయింపవచ్చును. ఆ మహనీయుర్ = అటువంటి మహాత్ముని, ఆంజనేయా! అటువంటి నా ప్రియుని నని చెప్పు భాగ్యము నాకు లేదాయెఁ గదా! నాకుర్ మాటుగ మ్రొక్కుము = నాబదులుగ

నిది సీత నమస్కార మని మ్రొక్కుము. ఏమమ్మా! నీభర్తకు నీవు రక్షింపు మని నమస్కరించి ప్రార్థింప వలెనా యందువేమో.

(౧) లోకములో సామాన్య స్త్రీలు భర్తలకు నమస్కరింపరు. నేను సదాచార సంపత్తిగల జనకవంశమునఁ బుట్టిన దానను. పతిదేవతను కావున శాస్త్రవిధి ననుసరించి దేవునికి నమస్కరించినట్లు దైవ మను బుద్ధితో నమస్కరించెదను.

(౨) ఆంజనేయా! నాస్థితి యిట్టిదైనది. కొన్ని దినాలు ప్రియురాలనై యుంటిని. ఆవల భార్యనైతిని. ఆవల దాసినైతిని. ఇప్పుడేమైతినో నాకే తెలియదు. దాసీజనులు మాత్రము తమస్వామితో నమస్కరించి మాటలాడుచున్నారా? లేదు. దాసిని గూడఁ గానుగావున నేనట్లుచేసి చెప్పుకో వలసి వచ్చినది.

(౩) నేను మహాపరాధము చేసితిని. నన్ను రక్షింపు మని నేను గోరితిని. ప్రపన్నురాలగు నేనట్టి కోరికయుఁ గోరరాదు. ఆయన కృత్య మాయనకు నేర్పిన దాననైతిని. ఇదెంత దురహంకారము. దానివలన సర్వజ్ఞునందు విస్మృతిదోషము నారోపించిన దాన నైతిని. ఆయన రక్షణమందు విశ్వాసము లేనిదాన నైతిని. ఆయన సొత్తు కాపాడు కొననీ; పోఁగొట్టు కొననీ బలవంతపెట్టుటకు నే నెవతెను? ఆ దోషము పోవఁ బ్రాయశ్చిత్తముగా నమస్కరించు చున్నదానను.

(౪) వివాహకాలమందు నా పాదములంటి నన్ను స్వీకరించెను. ఇప్పుడు నేను నమస్కరించినఁ గాని నన్ను స్వీకరింపఁడు. కావున నమస్కరించెదను.

(౫) వివాహకాలమున నా పాదము లాయన యంటిన సహించితిని. నేనెన్ని నమస్కారములు చేసిన నా పాపము పోవును.

(౬) పరస్త్రీలు మహాత్ములఁ జూచినపుడు నమస్కరింప వలసినదే. ఆయన మహనీయుఁడై నాఁడు. నేను బరస్త్రీ నైతిని; కావున నమస్కరించెదను. అటుగాకున్న నన్ను రక్షింపుము. నన్ను రక్షింపు మని పరస్త్రీల వలెఁ జెప్పుకొన వలసిన కాలము వచ్చినది కదా! కావునఁ బరస్త్రీల వలె నేను నమస్కరించెదను.

మా కుశలం బడిగితి ననుము. మ్రొక్కుము - మోక్షమము లడిగిన దని చెప్పుము. అంతే కాని రక్షింపఁ గోరిన దని చెప్పవలదు. నీవు మిత్ర శ్రేష్ఠుఁడవు. కావున నీవు నాకుఁ జేయవలసిన యుపకార మింతయే. ఉపకారము చేయువాఁడు గదా మిత్రుఁడు.

ఉ. హారివిహార శాలలు స♦మంచిత నిస్తుల భోగ భాగ్యముల్
వారిజలోచనామణుల♦వర్గముఁ బాయుచుఁ, దల్లిదండ్రులన్
గౌరవ మారఁ బల్క, యధి♦కం బగు వారి ప్రసాద మంది, కాం
తారనివాసి యయ్యె గుణ♦ధన్యుఁడు లక్ష్మణుఁ డన్నఁ గావఁగన్. ౯౮౮

అర్థములు. హారి విహార శాలలు=మనోహరములై, సంచార యోగ్యములైన గృహములు - సమంచిత నిస్తుల భోగ భాగ్యముల్=మిక్కిలి యొప్పుచున్న,

యసమానములైన, భోగములు భాగ్యములు-వారిజలోచనామణుల వర్గము = సేవకు రాండ్రగు స్త్రీల సమూహము-కాంతార నివాసి = అడవియందు నివసించువాఁడు.

ఇది మొదలు నాలుగు పద్యములు లక్ష్మణ గుణ వర్ణనము.

తా త్ప ర్య ము.

ఆంజనేయా! రామచంద్రమూర్తి, నేను అడవులకు వచ్చుటకు లక్ష్మణుఁ డడవులకు వచ్చుటకుఁ జాల భేదము గలదు. రామచంద్రమూర్తి తండ్రి నిర్బంధము చేత నాయన యాజ్ఞ మీఱలేక వచ్చెనేకాని సంతోషముగ బుద్ధి పూర్వకముగ నొక ప్రయోజనము గోరి వచ్చిన వాఁడు కాఁడు. రామచంద్రమూర్తి వచ్చెను గావున భార్య నగుట నాకు రాక తప్పినది కాదు. రామచంద్రుని రాకను సమ్మతించిన వా రెవ్వరు లేరు. లక్ష్మణు విషయ మట్టిది కాదు. లక్ష్మణుఁ డరణ్యములకు రావలసిన కారణము లేదు. ఆయన యడవులకు వచ్చుట కందఱు సమ్మతించిన వారే. అందఱు సంతోషించినవారే, ఆయన భక్తికి మెచ్చి.

మనోహరములై సంచారయోగ్యములైన గృహములు, అసమాన భోగములు,సంపదలు, సేవచేయుటకుఁ గావలసినంతమంది యుత్తమస్త్రీలసమూహము,వీని నన్నిటిని దానే బుద్ధిపూర్వకముగ వదలి తల్లిదండ్రులను గారవించి సమాధాన పఱచి వారి యనుగ్రహమునకుఁ బాత్రుడై వారి యాశీర్వచనము వడసి తన కొక ప్రయోజనము లేకున్నను అన్న యొంటరిగాఁ బోవుచున్నాఁడే,పిలిచినఁ బలుకు మాఱుమనుష్యుఁడు లేఁడే యని యన్నసేవ యేకాంతమున యథేచ్ఛముగఁ జేయవచ్చును గదా యని యడవుల వసింపవచ్చెను. ఎంతటి సుగుణసంపత్తి గలవాఁడో తెలిసెనా?

చ. నిరుపమవిక్రమాఢ్యుఁడు వి♦నీతుఁడు సత్ప్రియదర్శనుండు ని
ర్భరసుఖ మెల్ల వీడి తన♦భ్రాతకుఁగా గహనంబులోన ని
ష్ఠురదశ సానుకూలమతిఁ ♦ జొచ్చి నిజాగ్రజుఁ గొల్చుచుండు, న
న్నరయును దల్లిఁగాఁగ, దన♦యన్నను దండ్రినిగాఁగ జూచెడిన్. ౯౪౯

అర్థములు. నిరుపమ విక్రమాఢ్యుఁడు = అసమాన పరాక్రమ సంపద గలవాఁడు, వినీతుఁడు = వినయము గలవాఁడు; పెద్దలచేఁ జక్కఁగా శిక్షింపఁబడినవాఁడు, సత్ + ప్రియ + దర్శనుండు = సజ్జనులకుఁ బ్రియమైన దర్శనముగలవాఁడు; నిర్భర సుఖము = అతిశయసౌఖ్యము; గహనంబులోనన్ = అడవిలో; సానుకూల మతిన్ = ఆనుకూల్యముతోఁ గూడిన మనస్సుతో, 'నాన్యం పశ్యామి రామస్య సాహాయ్యం కార్యసాధనే' సుం.౩౦.౩౨. సహాయ సాహాయ్యములు పర్యాయములైనట్లు లిచ్చట అనుకూలానుకూల్యములు పర్యాయములు. (౧) అనుకూలశబ్దము భావప్రధానము. (౨) అనుకూలశబ్దము అనుకూలాభిప్రాయ పరము. అనుకూలాభిప్రాయముతోఁగూడిన మనస్సుతో - నిజాగ్రజున్ = తన యన్నను; అరయున్ = విచారించును.

తాత్పర్యము.

అడవులకు వచ్చి యెటులున్నవాఁడో తెలియునా? అసమానపరాక్రమవంతుఁడయ్యు, గర్వము లేక వినయముగలవాఁడు, గురువులచేఁ జక్కఁగ శిక్షింపఁబడుటచే నాగుణము లభించెను. విద్యాఫలము వినయమే గదా. సత్పురుషులు చూచుటకుఁ బ్రియమైనవాఁడు. ఇట్టివాఁడు సుఖములనెల్లవదలి తన యన్న నిమిత్తమై యడవులలోఁగష్టదశయందు నన్నకు ననుకూలమైన మనస్సు గలవాఁడై తనయన్న సేవ చేయుచుండును. నన్నుఁదన తల్లివలెను, అన్నను తండ్రివలెను జూచి తల్లిదండ్రులకెట్లు సేవ చేయవలయునో యట్లుచేయును.

ఆ. మంచి మనసువాఁడు ♦ మంచిచూడ్కులవాఁడు
సింగ మెనయు మూఁపు ♦ చెలువువాఁడు
మామగారితోస ♦ మానుండు, దెలియండు
పాపి యసుర నన్నుఁ ♦ బట్టి తేర. ౯౫౦

తాత్పర్యము.

ఆయన యొకరికి మేలుచేయవలయునని తలంచునేకాని,యొకరికిని ద్రోహము చేయవలయునని తలఁచువాఁడు కాఁడు. ఆయన చూపులు చూడఁగానే యాయన సౌమ్యుఁడనితోఁపఁజేయునుగాని క్రూరుఁడనితోఁపఁజేయవు(చూ.కిష్కింధ.౯౦౫౪). సింహము మూఁపురముల వంటి మూఁపులు గలవాఁడు. అన్ని విషయము లందు మా మామ గారితోసమానుఁడు. రావణాసురుఁడు నన్నుఁ బట్టితెచ్చునదియాయన యెఱుఁగడు. తెలిసియుండెనా రావణుని నచ్చటనే హతునిఁజేసి యుండును.

సీ. వృద్ధోపసేవి సు♦శ్రీకుండు మితభాషి, మా మామగారి గా♦రాముసుతుఁడు
నాముద్దుమఱఁది యా♦సౌమిత్రి భరియించు, నెంత భరంబు మే♦మింతఁజెప్ప,
నెవ్వనిఁ గనుఁగొని♦యెలమిశ్రీరాముండు, తనతండ్రిమదిలోనఁ♦దలప కుండు
దాక్షిణ్యశీలుండు♦దయగలవాఁడు ని,ర్మలమతి కడుమెత్త♦మనసువాఁడు

తే. ననఘుఁడును రామచంద్రుని♦యనుఁగుభ్రాత, సేమ మడిగితినననీవు♦చెప్పవయ్య
యెట్లుచెప్పిన శ్రీరాముఁ♦డేఁగుదెంచు, నట్టులంతయుఁ జెప్పుమా♦యాంజనేయ!

అర్థములు, వృద్ధోపసేవి = పెద్దలనువారి సమీపమందుండి సేవ చేసినవాఁడు. ఉప=సమీపము; సుశ్రీకుఁడు = మంచి కాంతిగలవాఁడు; మితభాషి = అడిగినదానికి నెంత ప్రత్యుత్తర మీయవలయునో యంతియగాని, యెక్కువమాటలాడువాఁడు కాఁడు. ఎంత భరంబు=ఎంత భారమైనను, కష్టకార్యమునే కాదు. నాకు మామగారు పదునాలుగు సంవత్సరములకుఁగా నిచ్చిన చీరలు. గడ్డపాఱ, గంప, ఆయుధములు, కవచములు ఇంత బరువు మోచి తిరుగుచుండెను.

తాత్పర్యము.

పెద్దలయొద్దనుండి వారల సేవ చేసినవాఁడు, మంచి కాంతి గలవాఁడు, మితముగ మాటలాడువాఁడు, మామగారికిఁ బ్రియకుమారుఁడు, నాకు ముద్దు మఱఁది యగు లక్ష్మణుఁడు మేమెంత కష్టకార్యము చెప్పినను నాచేతఁగా దనక చేయువాఁడు. ఎంత బరువైన మోచి తెచ్చువాఁడు. ఆయన యుండుటచే శ్రీరాముఁడు తన తండ్రి లేఁడాయెనని తలఁపకున్నాఁడు. దాక్షిణ్య స్వభావముగలవాఁడు. దయ గలవాఁడు. నిర్మలమై, మృదువైన మనస్సు గలవాఁడు. ఎట్టి దోషము లేనివాఁడు. శ్రీరామచంద్రునకుఁ బ్రియసోదరుఁడు. అట్టి లక్ష్మణుని సేమ మడిగితి నని నేవే చెప్పుము. ఎట్లు చెప్పిన శ్రీరామచంద్రమూర్తి యిచ్చటికి వచ్చునో యట్లు సర్వము చెప్పుము.

క. నా వంత లంత మొందఁగఁ, బోవఁగ ననుఁ బ్రాణవిభుఁడు♦ పూనుట యెట్లో
యా విధిఁ గార్య మొనర్పఁగ, నీవె ప్రమాణంబు సుమి వ♦నేచరనాథా! ౯౫౨

తాత్పర్యము.

వానరేంద్రా! నాదుఃఖములు తుదముట్టవలె. ఇది నాకు గావలసిన కార్యము. దానికై నామగఁ డేమి ప్రయత్నము చేసిన నన్ను రక్షింపఁగలఁడో యది యంతయు నాయనచేఁ జేయింపవలసిన వాఁడవు నీవే. ఆ భారము నీయం దున్నది.

ఉ. సారెకుఁ జెప్పవయ్య కపి♦సత్తమ! నే నిఁక నొక్క మాస మే
తీరున నైనఁ బ్రాణములు♦ దేహమునన్ ధరియించుదాన. నా
పై రఘుచంద్రమా! నిజము♦ ప్రాణము నిల్వదు, మున్న ధోభువిన్
జేరిన కౌశికిన్ హరిని♦ జేర్చిన రీతి సముద్ధరింపుమీ. ౯౫౩

తాత్పర్యము.

ఆంజనేయా! యీ మాట మాత్రము గట్టిగఁ బలుమాఱు నా మగనికిఁ జెప్పుము. ఎంత కష్టమైన సహించి యింకొక నెల ప్రాణము బిగఁబట్టి యుండఁగలను. రామచంద్రా! యాపైన నేను నిలుపవలయు ననినను ప్రాణము నిలువదు. పూర్వ మింద్రుని రాజ్యలక్ష్మిని నింద్రుని జేర్చిన ట్లుద్ధరింపుము. తన సొత్తును దాను గాపాడుకొను మని చెప్పుము.

ఇంకను రావణుఁ డిచ్చిన గడువు రెండు నెలలకు మించి యుండఁగా నెలకే ప్రాణములు విడిచెద నన నేల?

ఇది పదునాలుగవ సంవత్సరము ఫాల్గున మాసము. సీతా రామ లక్ష్మణులయోధ్య విడిచినది చైత్ర శుద్ధ చతుర్థి. పదునాలుగు సంవత్సరములు పూర్తియగుటకు పంతొమ్మిది దినములే కొఱఁత యున్నది. పదునైదవ సంవత్సరము మొదటి దినము నీవు రావేని నే నగ్నిని బ్రవేశించెద నని భరతుఁడు శపథము చేసెను. రామచంద్రమూర్తి దాని నామోదించెను. కావున నేఁటి కిరువదవ నాఁడయోధ్యలో

రామచంద్రమూర్తి యుండక తప్పదు. భరతుఁడు చచ్చెనా కౌసల్యా సుమిత్రా కైకేయీ శత్రుఘ్నులు చచ్చినవారే. వంశ నాశన మగును. దానిని నా నిమిత్తమై రామచంద్రమూర్తి యెట్లు సహింపగలఁడు. కావున నయోధ్యకుఁ బోక తప్పదు. నేనా ఆయన వచ్చును, నన్ను రక్షించునని ప్రాణములు నిలిపియున్న దానను. ఆయన యిటు రాక యయోధ్యకుఁ బోయెనేని నా యాశ భంగమగును. దానితోఁ బ్రాణములు పోవును. కావున నెల దినములు బ్రదికి యుండెద ననెను. కౌశికిఁ హరిని జేర్చిన రీతిః = పూర్వము వృత్రాసురవధచే నింద్రునికి బ్రహ్మహత్య రాఁగా విష్ణ్వాదు లశ్వమేధము చేయించి యా హత్యాదోషముఁ బాపిరి. అయినను శ్రీ వచ్చినదిగాదు. వాని రాజ్యలక్ష్మి వానికి వచ్చునట్లు చేయ నాలోచించి యాకాశవాణి మాట ప్రకారము గవాక్షతీర్థమున నుండిన యామెను బిలిచినను రాక యామె పాతాళము నకుఁ బోయెను. అప్పు డచ్చటికి దేవతలు పోశక్తి చాలక విష్ణువును బ్రార్థింపఁగా నాయన పోయి యామెను దోడితెచ్చి యింద్రున కిచ్చెను—బ్రహ్మ పురాణము.

ఉచథ్యుని భార్య యమునలో స్నానము చేయుచుండఁగా వరుణుఁ డామెను నపహరించెను. ఆ ముని నారదమూలమున యాచించినను వరుణుఁ డామెను నిచ్చినవాఁడు కాఁడు. అప్పు డా ముని పాతాళ హ్రదమును నెండించి యామెను దెచ్చికొనెను. ఆమె పేరు కౌశికి యని కొంద అందురు. —భారతము.

—♦ సీతాదేవి హనుమంతుని చేతికిఁ దన చూడామణి నిచ్చుట. ♦—

క. అని తన కొంగున ముడిచిన, ఘనచూడామణిని దీసి ♦ కౌసల్యానం
దనునకు నిమ్మని జానకి, హనుమంతుని చేతి కిచ్చె ♦ నధిక ప్రేమన్. ౯౫౪

తా త్ప ర్య ము.

అని తన కొంగున ముడివేసి దాఁచియుంచిన చూడామణిని దీసి రామచంద్రుని కిమ్మని హనుమంతున కిచ్చెను.

క. ఇచ్చినమణి నంగుళి నిడె, నచ్చపుమతిఁ బెద్ద గాదు ♦ హస్త మపుడు దాఁ
గ్రచ్చఱ వలగొని మ్రొక్కుచు, నచ్చపలవిశాలనేత్ర ♦ యంచున నిలిచెన్. ౯౫౫

తా త్ప ర్య ము.

ఆమె యిచ్చిన జడబిళ్ళను హనుమంతుఁడు తన వ్రేలియందు ధరించెను. అప్పు డాయన హస్తము పెద్దది గాదు. సీతాదేవికిఁ జూపిన పెద్దయాకార మప్పుడే యా పని తీరఁగానే తగ్గించి పూర్వమువలెఁ జిన్నవాఁడై యుండుటచే నా బిళ్ళ యాయన వ్రేలికి సరిపోయెను. ఆయన బిళ్ళకు లోప్రక్క వెంట్రుకలు దూర్చుటకై యుండు తూములో వ్రేలిని దూర్చి యుంగరమువలె ధరించెను. ఇట్లు ధరించి యామెకుఁ బ్రదక్షిణించి నమస్కరించి యామె యొద్ద నిలువఁబడెను. రామచంద్రమూర్తికి హనుమంతుఁడు ప్రదక్షిణము చేసి నమస్కరించినట్లు చెప్పఁబడ లేదు. దీని

వలన హనుమంతునకు సీతారాము లిరువురు సమానులైనను భక్తిమెల్లు కొంచెము సీతవైపు వ్రాలెనేమో యని చెప్పవలసియున్నది.

క. సంతసమునఁ బొదలెడి కపి, కాంతుఁడు దేహంబు సీత♦కడ నుంచియుఁ దా
స్వాంతంబున రఘురామునిఁ, జింతించుచు నుండె నతనిఁ♦జేరఁగఁ జనఁగన్. ౧౫౬

తాత్పర్యము.

వచ్చిన కార్యము నిర్విఘ్నముగ నెఱవేఱెనని సంతోషించు హనుమంతుఁడు దేహమును సీతయొద్ద నుంచినను మనస్సు రామచంద్రమూర్తి యొద్దనుంచి యాయనను జూడఁ ద్వరపడుచుండెను.

చ. అతులితమై మహార్హమయి ♦ యా జనకాత్మజచే మహానుభా
వృత ధృతమైన యమ్మణిఁ బ్ర♦భావమునం గొని పావమాని మా
రుతమునఁ గంప మొందియును ♦ రూపయి క్రోల్కాను నద్రిపోలి హ
ర్షితమతియై చనం దలఁచె ♦ శ్రీరఘురామునిఁ జేర నంతటన్. ౧౫౭

అర్థములు. అతులితమై = అసమానమై, మహార్హమయి = మిక్కిలి యుత్తములు ధరింప యోగ్యమై; మహానుభావతన్ = మాహాత్మ్యముచే, ధృతమై = ధరింపబడినదై; ప్రభావమునన్ = తన మహిమచే; పావమాని = ఆంజనేయుఁడు; క్రోల్కాను = కుదుటఁబడిన-స్యమంతక మణివలె నీ మణి నందఱు ధరింప యోగ్యులు గారు.

తాత్పర్యము.

అసమానమై, యుత్తములు మాత్రము ధరింప యోగ్యమై, సీతాదేవిచే నామె మాహాత్మ్యముచే ధరింపఁబడినదైన చూడామణిని హనుమంతుఁడు తన బుద్ధిబలముచే గ్రహించినవాఁడై పెద్దగాలికిఁ జలించి మఱలఁ గుదుటఁబడిన కొండవలె మొదట సీతాదేవి కానరాకముందు మిగుల వ్యాకులపడియును నిప్పుడు స్వస్థచిత్తుఁడై సంతోషించి రామచంద్రమూర్తి యొద్దకుఁ బోవ నాలోచించెను.

{ ౩౯ వ-సర్గము. సీతాదేవి తన్ను గుఱించి శ్రీరామునికిఁ
దెలుప హనుమంతుని వేఁడుట. }

ఉ. జానకి రత్న మిచ్చి కపి♦సత్తముతో నను వానరోత్తమా!
దీనిని గుర్తెఱుంగు రఘు♦దీపకుఁ డెంతయు లెస్స, దీనీ నా
మానధనుండు కన్గొనిన♦మాత్రన నా జననిన్ ననున్ ధరా
జానిని నాజినిం దలఁచు ♦ సంశయ మింతయు లేదు సమ్మిమీ. ౧౫౮

అర్థములు. జననిన్ = నా తల్లిని; ధరాజానినిన్ = రాజును; ఆజినిన్ = దశరథుని.

తాత్పర్యము.

సీతాదేవి హనుమంతునకు చూడామణి నిచ్చి యిట్లనియె. వానరేంద్రా!

యీ గుర్తును రామచంద్రమూర్తి చక్కఁగా నెఱుఁగును. దీనిని జూచినంతనే నా తల్లిని, నన్ను; దశరథమహారాజును స్మరించును.

వివాహకాలంబున దీనినిజనక మహారాజు తనచేతి కీయఁగానాయన భార్య, దశరథుఁడు రాముఁడు చూచుచుండ నామె సీతాదేవి తలలో నలంకరించెను. కావున మేము తప్పక జ్ఞప్తికి వత్తుము. జనని యనఁగా కౌసల్య యని కొందఱం దురు. కన్యాదానవేళ కన్నతల్లిదండ్రులు దానముచేయఁ బెండ్లికూఁతుతోనుందురు గానివరునితల్లితోఁ బనిలేదు. కావున కౌసల్యవివాహవేది యొద్దలేదు. దశరథుఁడు మాత్రమే కుమారులతోడ నుండెను. అదియును గాక ౧౪౧౦ వ పద్యమున తొల్లితనూభవకు మామామగారు ప్రేమమునను ద్వాహవేళ శిరముఁదిదిగూర్పననెడి వాక్యమువలన కౌసల్యాప్రసక్తికిఁ గారణము లేదు. కన్య నలంకరించుపని కన్యతల్లి దండ్రులది గాని వరుని తల్లిదండ్రులది గాదు. కావున జనని యనగా కౌసల్యగాదు.

ఇప్పటి యాఁడువాఁరు ధరించు పచ్చబిళ్ళవంటిది యీజడబిళ్ళ. ఇప్పటివారు గాజుబిళ్ళకు చుట్టు జవ కట్టించి ధరింతురు. సీతాదేవి జడబిళ్ళ అంతయు రత్నమే. అనఁగా నంతపెద్ద కెంపుకావుననే యతులితము, మహార్హమని చెప్పఁబడను.

క. నీవు సముత్సాహముఁ గొను, నా విధిఁ బ్రేరించితిఁ న♦నాటచయేంద్రా!
నీవే యీ పని యిఁకమీఁ, దే విధి ఘటియింపవలయు♦నెంచుము దానిన్. ౯౫౯

తాత్పర్యము.

నీకుత్సాహము గలుగుటకై యెట్లు చెప్పవలయునో, యెంతచెప్పవలయునో య ట్లంతయుఁ జెప్పితిని. తరువాతికార్య మెట్లు చేయవలయునో యది నీవే యాలోచించుము.

క. నీవే గతి యీ కార్యం, వానరవర్య! ఫలము ♦ నొందఁగఁ జేయన్
నీ వే విధి నైనను నా, వారిదుఃఖంబుఁ బాప ♦ వలయుం జుమ్మీ. ౯౬౦

తాత్పర్యము.

స్పష్టము.

క. కావున నే మార్గంబున, భూవిభుఁడు మదీయదుఃఖ♦మును బోనడుచున్
నీ వా యుపాయ మంతయుఁ, బావని! యోజింప నీదె♦భారము సుమ్మీ. ౯౬౧

తాత్పర్యము.

స్పష్టము.

క. అన నట్ల చేయువాఁడను, వనితామణి! యని ప్రతిజ్ఞ ♦ వచియించి మరు
త్తనయుఁడు పయనం బైనను, గని జానకి యిట్లు లనియెఁ ♦ గనునీరొలుకన్.

తాత్పర్యము. స్పష్టము.

క. వినుమా కుశలం బడిగితి, ననుమా శ్రీరాముఁ దమ్ము ♦ నా ప్తజనయుతున్
దినకరసుతుఁ గపివృద్ధుల, హనుమా! ధర్మోక్తి సేమ ♦ మడిగితి ననుమా. ౯౬౩

తాత్పర్యము.

ఆంజనేయా! నీ మనస్సందో యుంచియున్నావు. నేను జెప్పునది వినుము. శ్రీరామచంద్రమూర్తిని, ఆయన తమ్మునిని, ఆయనకుఁ, దనకు ముఖ్యులైనవారితోఁ గూడిన సుగ్రీవుని, వానరులందుఁ బెద్దవారిని. ధర్మపద్ధతిని క్షేమము విచారించితి నని చెప్పుము.

తే. ఆ మహాబాహుఁ డైన శ్రీ ♦ రామచంద్రుఁ, డెట్లు తరియింపఁ జేయు న♦న్నీ దురంత
శోకవారాశినుండి యా♦చొప్పు నెఱిఁగి, యట్లు సమ్మతిపఱుపుమా ♦ యతులకీర్తి.

అర్థములు. దురంత శోక వారాశినుండి = అంతము లేని దుఃఖసముద్రము నుండి, అతులకీర్తి=అసమానమైన కీర్తి గలవాఁడా.

తాత్పర్యము.

మహాబలవంతుఁడైన శ్రీరామచంద్రమూర్తి యే విధముగఁ బారము లేని యీ దుఃఖ సముద్రమునుండి నన్ను దాటించునో, యా విధము తెలిసికొని యా విధముగనే యాయనను సమ్మతింపఁ జేసి కీర్తి వహింపుము.

క. నా చేతోవిభుఁ డేగతిఁ, బ్రోచుఁ నే మేను విడక ♦ పూర్వమె నన్నుఁ
ధీచతుర! యట్లు పలుకుము, వాచాపుణ్యంబుఁ జలుపు ♦ వానరవర్యా! ౮౯౫

అర్థములు. చేతోవిభుఁడు=మగఁడు, వాచాపుణ్యము = మాటచెప్పుట వలనఁ గలుగు పుణ్యము, కర్త కెంత పుణ్యమో ప్రేరించు వానికి, జేయించు వానికి నంత పుణ్యము గలదు కదా. "వష్టి వాగురి రల్లోప మవాప్యో రుపసర్గయోః। ఆపం చైవ హలంతానాం యథా వాచా నిశా దిశా॥ అని వాచాశబ్దము ఆకారాంత స్త్రీలింగము గలదు.

తాత్పర్యము.

నేను దేహము విడువక ముందే నన్ను నా మగఁ డెట్లు చెప్పిన రక్షించునో యట్లు బుద్ధి చమత్కారము గల నీవు చెప్పి ప్రేరకునకు వచ్చు పుణ్యంబు పొందుము.

క. సత్సాహసికాగ్రణి విచి, కిత్సాదూరోక్తి నీవు ♦ కెరలుచుఁ బలుకన్
బ్రోత్సాహము గొని నను నా, పత్సాగరముం దరింపఁ ♦ బతి యొనరించున్.

అర్థములు. సత్ + సాహసికాగ్రణి = మంచి సాహసము చేయువారిలో మొదటివాఁడవు. విచికిత్సాదూరోక్తిన్ = సందేహము లేని మాటలతో, కెరలుచు = ఉత్సాహముతో విజృంభించి.

తాత్పర్యము.

మంచి సాహసవంతులలో మొదటివాఁడా! నీవు సందేహమున కెడ మీయని మాటలతో నుత్సాహమున విజృంభించి పలికితివేని ప్రోత్సాహము గొని నాభర్త నను నాపత్సముద్రమునుండి తరింపఁజేయును. అటుగాక నీవు నీళ్ళు నములుచు లంక చాల దూర మున్నది. చుట్టు పెద్ద సముద్రము. దాని దాఁటుటే కష్టము. దాఁటి

నను రావణుఁడు బలవంతుఁడు. ఎట్లగునో, యేమో-యని యిట్లు లేనిపోనితుకతో జెప్పకుము. రామచంద్రా! లే లెమ్ము. సీతాదేవిని నా దుష్టుఁడు చాల బాధ పెట్టుచున్నాఁడు. మనము పోవువఱకు బ్రదుకునో, బ్రదుకదో, రావణుఁ డనఁగా నెంత? లే లెమ్ము. నిమిషములోఁ బోయి లంక ధ్వంసము చేసి రావణుని బట్టి ఖండించి సీతను దీసికొని వత్తము. ఆఁడుది దిక్కులేక యిందల్లాడు చుండఁగా నిందఱము మగవారము పరాక్రమ వంతుల మూరకుండ వచ్చునా. లే లెమ్మి పోద మని యిట్లు చెప్పుము.

క. నా సందేశయుతం బగు, నీసూక్తుల నాలకించి ♦ నెఱపౌరుషముఁ
గౌసల్యాతనయుఁడు క్రూ,రాసురపంక్తులకుఁ జూపు ♦ నాహవమందుఁ. ౯౭౮

అర్థములు. నా సందేశ యుతము = నేను జెప్పిన వార్తతోఁ గూడినది. ఆహవమందుఁ = యుద్ధమందు.

తా త్ప ర్య ము.

నేను జెప్పిన మాటలతోడ నీవు ననుసరించి యనుకూల వాక్యములు చెప్పితివా తన పౌరుషమును రాక్షసులపై రామచంద్రమూర్తి చూపును.

సీ. అనవుడుఁ బవమాన♦తనయుఁ డిట్లను దేవి! శ్రీరామభద్రుండు ♦ శీఘ్రముగను
వానర భల్లూక♦వారసంయుతుఁ డయి, చనుదెంచి యిచ్చటి♦శత్రుసమితి
హరియించి నీ దుఃఖ♦మపనయించును దేవ, మనుజనాగార్క యి♦మప్రభృతులు
బర్జన్యుఁ డైనను ♦ భగ్నులే నీ కయి, రాముండు దొడర నిం♦కేమి పలుక?
ఆ. జలధివేష్టితోర్వి ♦ శాసింపఁగలవాఁడు, రామచంద్రుఁ డతిపరాక్రమమున
నతని విజయమునకు ♦ నంబుజలోచన, నీవె కావె కతము ♦ నిశ్చయముగ. ౯౭౯

అర్థములు. అపనయించును=పోగొట్టును; తొడరఁ=ప్రయత్నించెనేని; జలధివేష్టితోర్విఁ=సముద్ర మను వస్త్రముచేఁ జుట్టఁబడిన భూమి; శిరోవేష్టము. ఇత్యాదులందు వేష్టము వస్త్రపర్యాయము. ద్రావిడులు సాధారణముగ వాడుక యందును కట్టువస్త్రము పర్యాయముగ వేష్ట శబ్ద ముపయోగింతురు.

తా త్ప ర్య ము.

సీతాదేవి యిట్లు చెప్పఁగా హనుమంతుఁడు "దేవీ! శ్రీరామచంద్రమూర్తి వానరులతోను, భల్లూకములతోను శీఘ్రముగా నిచ్చటికి వచ్చి శత్రుసమూహముల సంహరించి నీ దుఃఖమును బోగొట్టును. రామచంద్రమూర్తి యుద్ధప్రయత్నము నీకయి చేసెనేని దేవతలు, మనుష్యులు, పన్నగులు, ఇంద్ర సూర్య యములు లోనగు వారెవ్వ రడ్డమైనను చచ్చినవారే. ఇట్లు జయించి సముద్రముచేఁ జుట్టఁబడిన భూమండలమును బరిపాలింపఁగలఁడు. రామచంద్రమూర్తి పరాక్రమమును వర్ణించుచున్నానే కాని యాయన విజయమునకు మూలకారణము నీవే. చచ్చిన సత్యవంతుఁ డెట్లు బ్రదికెను. సావిత్రి సత్యవంతున కేవిధ మా విధముగ నీకు నే నః నీవే చెప్పి

తివే. అదియేల నీకు మఱపువచ్చెను. నీ పాతివ్రత్యము వ్యర్థమై యేల పోవును. ఆయనను గెలిపింప నది యొక్కటి చాలదా? ఇతరుల సాహాయ్యముకూడ నాయన కేల? (చూ. అయో. ౮౩౭ ప.) నీ పాతివ్రత్యబలము నందు నీ కేల విశ్వాసము దప్పెను. నీవె కావె కతము=ఆఁడుదాని దదృష్టము. ఆఁడుది పుణ్యవంతురాలై సుఖ మనుభవింపవలసియుండెనా భర్త చిరాయువై, యారోగ్యవంతుఁడై; భాగ్యవంతుఁడై యుండును. భార్య పాపాత్మురాలై దుఃఖ మనుభవింపవలసి యుండెనా భర్త చావనైనఁ జచ్చును. రోగియో దరిద్రుఁడో యగును. ఈ సందర్భమున సావిత్రి యమునితోఁ జెప్పిన వాక్యములు స్మరించునది. తల్లీ! నీ యందలి చిహ్నములు చూచిన నీవు దుఃఖంపవలసిన దానవు గావు. సుఖంపవలసిన దానవై యున్నావు. కావున నీ మగఁడు తప్పక విరోధుల జయించును. నీ పాతివ్రత్యమే నీ మగనికి జయ మిచ్చును. నీయందు వైధవ్య చిహ్నములు లేవు. కనుక యుద్ధమందు నీ మగనికి భయము లేదు. చూ. ౧౧౭౦-౧౩౩౬ పద్యములు.

—♦ సీతాదేవి తనసందేహమును హనుమంతునితోఁ జెప్పుట. ♦—

క. అనవుడు సముక్తికంబును, విన నింపును సత్య మైన♦వృషాటోక్తుల్
విని సంతసించి యంజన, తనయుఁ బహుమానసూక్తి♦ధరణిజ మెచ్చెన్. ౯౬౯

అర్థములు. సయుక్తికంబు=యుక్తి యుక్తముగ నుండునది; సేనలతోడ రాముఁడు వచ్చుననుట, సావిత్రి కథనము సయుక్తికము. నీ దుఃఖ మపనయించు ననుట యిపుడు రామ విజయమునకు నీవే కారణమనుట సత్యము. వృషాటోక్తుల్ = వానరుని మాటలు, బహుమానసూక్తి = గౌరవముతోఁ గూడిన మంచి మాటలు.

తా త్ప ర్య ము.

ఈ ప్రకారము హనుమంతుఁడు చెప్పఁగా నాయాన యుక్తియుక్తముగను, వినసింపుగను, యథార్థమునైన యాయన మాటలు విని సంతోషించు సగౌరవము లగు మాటల నాయనను సీతాదేవి మెచ్చుకొనెను.

క. ఆమాటలు విని శ్రీరఘు, రామునిపై గల్గుస్నేహ♦ రమ దీపింపం
గా మారుతి దెస మఱి మఱి, ప్రేమంబునఁ గనుచు నిట్లు ♦ ప్రేయసిపలికెన్. ౯౭౦

అర్థములు. స్నేహరమ = అనురాగ మను లక్ష్మి; ప్రేయసి = రాముని ప్రియురాలు.

తా త్ప ర్య ము.

స్పష్టము.

క. నా పలుకు నీకు సమ్మత, మైపోనరిన యేని శత్రు♦హరణసమర్థా!
యీపూఁట నిలిచి మఱుఁగున, రేపటఁ బోరాదె శ్రమము♦ద్రిలెడి నీకున్. ౯౭౧

అర్థములు. శత్రుహరణ సమర్థా = శత్రువులఁ జంపు సామర్థ్యము గల

నాఁడా! ఇట్లు చెప్పుటచే నిన్ను రాక్షసులు చూచినను నేమియుఁ జేయఁజాలరు. వారివలన భయము లేదు. అయినను ఆ పని రామచంద్రునకు విడువుమని భావము.

తాత్పర్యము.

నామాట నీ మనస్సునకు సరిపడినయెడల నిందే యీపూఁట నెందైనఁ జాటుగనుండి రేపు సముద్రము దాఁటి పోరాదా? నీకు గాసి తగ్గునుగదా. ఇప్పుడు వచ్చి మఱల నిప్పుడే పోవలె ననిన బడలిక తోఁచును గదా.

క. ఓపావని! నీసన్నిధి, ప్రాపున ధృతిఁగూరి యల్ప♦భాగ్యను క్షణమేౕ
నీ పుణ్యంబున శోకము, తాపంబుఁ దొఱంగి బ్రదుకు♦దానఁ గపీంద్రా! ౯౭౨

తాత్పర్యము.

ఆంజనేయా! నే నీ మాట చెప్పుట కేవలము నీనిమిత్తమే కాదు. నీవు సమీపమున నుంటివేని ధైర్యము గలదాననై యల్పకాలమైనను శోకతాపముల విడిచి యల్పభాగ్యము గల నేను బ్రతికి యుందును.

ఉ. పోయెద వేనిఁ బొమ్ము రఘు♦పుంగవుఁ జేరఁగ, నీవు గ్రమ్మఱౕ
వాయుజ! వచ్చునందనుకఁ ♦ బ్రాణము లుండునొ యుండవో చుమీ
యీ యెడలందు సందియము ♦ యొంతయు వేఁగెడు నాకు నీవునౕ
బాయుట గల్గ నేమి కని♦ప్రాణము నిల్చునొ నీవ చెప్పుమా. ౯౭౩

తాత్పర్యము.

ఆంజనేయా! యొకనాఁడు నీ విచ్చట నుండగానే నాకు రాఁగల లాభమేమి? ఆవల యథాప్రకార మేడువవలసిన దాననే కదా. ఎన్నాళ్ళని నీ విచ్చట నుండఁగలవు? నీ విచ్చట నాలసించిన కొలఁది నీరాకకై యెదురుచూచు రామచంద్రమూర్తి యెక్కువగఁ బరితపించునుగదా. నీ విచ్చట నుండిన జరుగవలసిన కార్యమెట్లు జరుగును. కావున రామచంద్రు నొద్దకు నీవు పోఁదలఁచినఁ బొమ్ము. అయినను నీవు మఱల నెన్నిదినాలకు వత్తువో యేమో. అంతవఱకు నాకీ దేహమునఁ బ్రాణము లుండునో యుండవో యది మాత్రము నేను జెప్పఁజాలను సందేహమే. అది యేమన్నా యిట్లు చెప్పెద వందువా. నిన్నుఁ జూచుటచేఁ బోనున్న ప్రాణములు మఱల వచ్చెను. నీవుకూడ వెడలిపోయిన దేహమునఁ బ్రాణములును నేమని నిలుచునో? నీవే చెప్పుము.

క. నీ యందును, నీకును దోఁడై యరుదెంచిన కపీంద్రు♦లందును నాకుౕ
బాయని సందేహం బో, వాయుజ! నా కనుల్మ్రోల ♦ వర్తిలఁ దోఁడఁగెౕ. ౯౭౪

తాత్పర్యము.

ఆంజనేయా! నీవు మరల సముద్రము దాఁటఁగలవు. పోఁగలవు. రామచంద్రునకు నా విషయమై చెప్పవలసిన వన్ని చెప్పఁగలవు. ఆ యన్నదమ్ములను వానరులను బిలుచుకొని సముద్రతీరమునకు రాఁగలవు. తరువాత ఆవలవిషయమునఁ

బెద్ద సందేహము నన్ను బాధించుచు నా కన్నులయెదుర మూర్తీభవించి నిలిచి యున్నది.

చ. హరివర ఋక్షసైన్యములు నా నృపవర్యతనూజులేని దు
స్తరజలరాశి దాటనెటు చాలుదురన్న? తలంచి చూడఁగా
గరుడుఁడు నీవు మారుతుఁడుఁ గాక మఱెవ్వరు భూతకోటిలోఁ
బరవసమొప్ప దాటఁగలవారలు గానఁగరారు మారుతీ! ౯౭౫

అర్థములు. పరవసము = ధైర్యము.

తాత్పర్యము.

వానరేంద్రా! యెలుఁగుల సేనగాని, రాజకుమారులుగాని దాఁటసాధ్యము గాని సముద్రము నెట్లు దాఁటుదురయ్యా! మారుతీ! ఈ భూతకోటిలో గరుత్మంతుఁడు, వాయుపుత్రుఁడవైన నీవు, వాయువుతప్ప మఱియెవ్వడును నీ సముద్రమును దాఁటఁగలవారు లేరని నా యభిప్రాయము.

క. కనుఁగొనఁది నసాధ్యంబా, పని యనుమానం దోఁచె; గార్యపద్ధతులను నీ
కననియది లేదు, దీనికి, హనుమా! నీ వనుమ విన సమాధానంబుల్. ౯౭౬

తాత్పర్యము.

నే నాలోచించుకొనఁది వారం దఱిచ్చుటకే వచ్చుట యసాధ్యకార్య మని తోఁచుచున్నది. అయినను కార్యము చేయుమార్గములందు నీ వాలోచింపనిది లేదు. దీనికి నీ వేమి సమాధానము చెప్పెదవో వినఁగోరెదను.

క. నీ వొకఁడవె యీ కార్యము, పావని సాధింప శక్తిపరుఁడవు ధరపై
నీ వొకఁడవె యీ కీరితి. చే విలసిల్లంగఁ గలవు శిక్షితవైరీ! ౯౭౭

తాత్పర్యము.

ఎట్లు సాధింపఁగలవో యేమో, నాఁకు దెలియదు గాని దీనిని సాధింపఁగల వాఁడవు నీ వొకఁడవే. ఈ కీర్తి పొందఁగలవాఁడవు నీ వొక్కఁడవే. మఱియొక రీ కార్యము చేయను లేరు, కీర్తిని సంపాదింపను లేరు. కాని నీ విట్లు చేయుట నాకుఁ గీర్తికరము గాదు

క. బలములతో నిచటికి రఘుకులతిలకుఁడు వచ్చి కలనఁ గూర్చి దశాస్యున్
గెలుపొంది నన్నుఁ దనపురి, కలవునఁ గొనిచనిన నాకు యశ మది గూర్చున్.

అర్థములు. కలనన్ = యుద్ధమున; అలవునన్ = బలముచే, నాకు = వీర్యశుల్కనగు నాకు వీరుఁడుగా నుండువాఁడుగదా నాకుమార్తెకు మగఁడు అని తండ్రి చాటించెను.

తాత్పర్యము.

అట్లైన నీ కేడి కీర్తికర మందువా? రామచంద్రమూర్తి సేనలతో నిచటికి వచ్చి యుద్ధమందుఁ దనబల పరాక్రమములు జూపి రావణుఁ జంపి నన్ను నయోధ్యకు

దీసికొనిపోయెనా, యది నాకుఁగీర్తికరము. అప్పుడు నేను వీరపత్ని యనుబిరుదమునకు దగిన దాన నగుదును. ఇది రామునకు సాధ్యముగానీ కాకపోనీ, ఆయనకుఁ గీర్తి కరముకానీ కాకపోనీ మఱియేయుపాయ మైనను నాకుఁగీర్తికరము గాదు. కావున నే నంగీకరింపను.

పరమభక్తులు, ప్రపన్నులు భగవంతుఁడుస్వయముగ వచ్చి తమ్ముఁ బిలిచి కొని పోవఁ గోరుదురు గాని దూతలచేఁ బిలిపించుకొనుట కూడ సహింపరు. "ఏత ద్దేహావసానే మాం తత్పాదం ప్రాపయ స్వయమ్" అనియే వారు కోరుదురు. అట్లుగాదేని మహారాజు నాశ్రయించుట, వాని భృత్యు నాశ్రయించుట రెండు సమానము లగును. అది రాజునకు, వాని యాశ్రితునకు యిరువురకు నవమాన కరమె.

క. ప్రాకటశితనారాచా, నీకంబున లంకఁ జలిపి ♦ నీఱుగఁ గడిమిన్
గైకొనిన న్నేగినచోఁ, గాకుత్స్థున కదియె తగిన ♦ కార్యము చుమ్మీ. ౯౭౯

అర్థములు. ప్రాకట శితనారాచానీకంబునన్ = ప్రసిద్ధములై, పదును గలిగిన బాణములగుంపులచే; నీఱుగన్ = భస్మముగ; కడిమిన్ = బలముచే; కాకుత్స్థునకున్ = దేవతలకుఁ దోడ్పై రాక్షసుల వధించి కీర్తి సంపాదించిన కకుత్స్థుని వంశమునఁ బుట్టినవానికి.

తాత్పర్యము.

నేను జెప్పిన యుపాయము కీర్తి కరము నాకు మాత్రమే కాదు. ప్రసిద్ధము లైన వాఁడి ములుకులచే లంకను భస్మముచేసి తనబలమున నన్నుఁ దీసికొని పోయె నేని దనకుఁ, దన వంశమునకుఁ గూడఁగీర్తికరము. కావున నానిమిత్తమై గాకున్నఁ దన నిమిత్తమై యైన నేను జెప్పినట్లు చేయవలెను.

దీనివలన భక్తి ప్రపత్తుల శ్రేష్ఠత్వము స్థాపింపఁ బడెను. ఉపాయముగొప్ప దైన నుపేయము గొప్పదే. ఉపేయము గొప్పదైనపుడు దాని సాధించునుపాయము గొప్పదిగానే యుండవలెను. ఉపేయము రామచంద్రమూర్తి, దానిసాధన ముపాయము, రామచంద్రమూర్తియే వచ్చుట.

తే. పరమశూరుండు రాముండు ♦ బవరమందు
నతని మగఁటిమి కనురూప ♦ మైనదాని
యోజన యొనర్చి చెప్పుమీ ♦ యోజమీఱ
వనచరకులావతంస! నీ వనుచు నడుగ. ౯౮౦

అర్థములు. బవరమందున్ = యుద్ధమందు. అనురూపము = తగినది.

తాత్పర్యము.

ఆంజనేయా! యిది యాఁడుదాన నైన నా యాలోచన విధము; నీవును రామచంద్రుఁడు యుద్ధమందు మిగుల శూరుఁడు; అటువంటి వానినిఁ దగిన చర్య యేదియో యాలోచించి చెప్పుము అని యడుగఁగా.

క. ఘనహితము హేతుయుతమును, ననఘార్థోపహిత మైన ♦ యవనిజసూక్తుల్
వినిఁ యంజనవరతనయుం, డనియెన్ వక్తవ్యశేష ♦ మాదట నిట్లుల్. ౯౦౧

అర్థములు. ఘనహితము = గొప్ప మేలు కూర్చునది, హేతుయుతము = యుక్తియుక్తము. అనఘ = దోషరహితమైన, అర్థ+ఉపహితము = అర్థముతోఁ గూడినది. వక్తవ్య శేషము = చెప్పవలసిన దానిలో నింతవఱకుఁ జెప్పఁగా మిగిలినది.

తాత్పర్యము.

మిగుల హితమైనవి, యుక్తియుక్తమైనవి, నిర్దోషమైనవి, ప్రయోజనముతోఁ గూడినవియగు సీతాదేవి చెప్పినమంచిమాటలనువిని, హనుమంతుఁడు చెప్పవలసిన దానిలో మిగిలిన దాని నిట్లు చెప్పెను.

—♦హనుమంతుఁడు సీతాదేవి సందేహము దీర్చుట♦—

ఉ. దేవి! కపీంద్రభల్లుకత♦తిప్రభువర్యుఁడు నిశ్చయించె సు
గ్రీవుఁడు నీ నిమిత్తము ప్ర♦కృష్టబలంబులతోడఁ దోడ్పడం
గా, వెస వత్తు రాతనికిఁ♦గైవస మై యసమాన విక్రముల్
దేవనిభుల్ మనోజవులు♦దిగ్గగ నాటులు శత్రుమర్దనుల్. ౯౦౨

అర్థములు. కపీంద్ర = వానర శ్రేష్ఠుల యొక్కయు, భల్లుకతతి = ఎలుగుల సమూహము యొక్కయు, ప్రభువర్యుఁడు = గొప్పప్రభువు, ప్రకృష్ట బలంబుల తోడన్ = గొప్ప సేనలతో, కైవసమై = స్వాధీనపడి. మనోజవులు = మనసువంటి వేగము గలవారు, దిక్+గగనాటులు = దిక్కులయందు, నాకాశమందు సంచరించువారు.

తాత్పర్యము.

దేవి! వానరభల్లూకరాజగు సుగ్రీవుఁడు నీ నిమిత్తమై గొప్ప సేనలతో రామచంద్రమూర్తికి సహాయపడ నిశ్చయించినాఁడు. ఆయనకు లోపడినవారై యసమానపరాక్రమము గలవారును, దేవతలతో సమానులును, మనోవేగముగల వారును, దిక్కులందు నాకాశమందు, సంచరించువారును, శత్రుసంహారకులు నగు వారు శీఘ్రముగ వత్తురు.

క. ఎంత గడుసుఁబని నైన రవంతయు వెతలేక సలుప ♦ నగు వారలు వి
క్రాంతులు సాబ్ధిధరావని, గంతున వలగొనెడివారు ♦ గగనాధ్వగులై. ౯౦౩

అర్థములు. గడుసుఁబని = కఠిన కార్యము. స+అబ్ధి = సముద్రముతోను, ధర = పర్వతములతోను గూడిన, అవనిన్ = భూమిని, గంతునన్ = దాటున, వలగొనెడివారు = ప్రదక్షిణించువారు; గగనాధ్వగులై = ఆకాశమార్గమున సంచరించువారై.

తాత్పర్యము.

వారెటువంటివారనితలఁచితివో యేమో, ఎంతకష్టమైన పనియైనను రవంత

మైన బడలిక లేక చేయఁగలవారు, పరాక్రమము గలవారు, సముద్రముతోను పర్వతములతోను గూడిన భూమండలమును ఆకాశమార్గమునఁ బ్రదక్షిణము చేసి రాఁగలవారు. అట్టివారి కీసముద్రము దాఁటుట యెంతకార్యము.

క. నాకంటె గొప్పవారును, నాకుఁ సరివారుఁ గలరు♦నగచరు లచటన్
నాకంటె హీనుఁ డొకఁడేన్, శ్లోకన్యా! లేఁడు తీక్ష్ణ♦కరసుతు నొద్దన్. ౯౮౮

తాత్పర్యము.

వానరులలో సముద్రము దాఁటగలవాఁడు నే నొకఁడ నని తలఁచితివి. అది పొరపాటు. సుగ్రీవు నొద్ద నాకంటె గొప్ప వారును, నాకు సమానులు నగువారు గలరే కాని నాకంటెఁ దక్కువ వాఁ డగు క్రోఁతి యొకఁడైన లేఁడు. వారీ ప్రక్క రాలేదు. కనుక నిన్నుఁ జూడలేదు. నేనీ ప్రక్క వచ్చితిని. నా పుణ్యము కొలఁది చూచితిని. ఈ మాత్రమున వానరుల యందఱిలో నేనే మొనగాఁ డని యెట్లు నిశ్చయించితివి.

క. నేనే నినుఁ గాంచితి నఁట, యా నిస్తులబలుల నేమి♦యనవలయు నొకో
మానవపతి భూరిగుణా,హీనులఁ బంపండు పంపు♦నితరుల మొదలన్. ౯౮౯

అర్థములు. భూరిగుణహీనులన్ = గొప్ప గుణములచే గొప్పయగు వారిని, ఇతరులన్ = గుణహీనులను.

తాత్పర్యము.

వానరవీరుల యందఱిలోఁ గనిష్ఠుఁడనగు బక్క క్రోఁతిని నేనే నిన్నుఁ జూడఁ గలిగితి నట. ఇఁక నసమాన బలు లగు వారి నే మనవలయును. రాజనీతి వినుము. నీకుఁ దెలియనిది గాదు. రాజు శత్రువుల యొద్దకుఁ బంపునపుడు గుణహీనులను దొలుతఁ బంపును గాని, గుణోత్తములను మొదటఁ బంపఁడు. ఏల? వాఁ డక్కడఁ జిక్కుపడె నేని తనకు బలము తగ్గును. కావున నందఱిలో హీనుఁడ నగుట చేతనే సుగ్రీవుఁడు నన్నుఁ బంపెను గాని యుత్తముఁ డగుటచేఁ గాదు.

ఇది యుక్తియుక్తమైనను సత్యము మాత్రము గాదు. అయినను నిట్టియసత్య మసత్యముగాదు. ఇందు సీతాదేవికి ధైర్యము చెప్పి జీవింపఁ జేయవలయు నను సదుద్దేశము గలదు గాని దురుద్దేశము లేదు. కావున నసత్యదోషము లేదు. పుణ్యపాపములు భావాధీనములు. అటుగాక సముద్రలంఘనము మాత్రమే సీత యుద్దేశ మగు నేని నిది సత్యమే. ఆమె సందేహము సముద్రము దాఁటి యెవ్వఁరు రాఁగల రనియే కదా. బలమున హనుమంతు డెక్కువైనను, వేగమున నంగద నీలాదులు సమానులే.

సీ. కావున నీవు శో♦కంబు మానుము దల్లి! దుఃఖకాలం బెల్లఁ♦దొలఁగిపోయె
నిదె పోయి నేఁ జెప్ప♦ముదితులై క్రోఁతులు, వచ్చెద రొకగంతు♦వైచి యిటకు
నా వీఁపుపై నెక్కి♦భూవిభుల్ శశిభాస్క,రులపోల్కి నీ మ్రోల♦నిలుచువార
లిట వచ్చి యీలంక♦నెల్ల సాయకములఁ, దుత్తుమురుగఁ జోవఁ♦ద్రుంచువారు

ఆ. రామచంద్రప్రభుఁడు ♦ రణరంగమం దిందు, సబలుఁ బంక్తికంఠు ♦ సంహరించి
నిన్నుఁ దోడుకొనుచు ♦ నెమ్మి నయోధ్యకుఁ, బోవువాఁడు, పువ్వుఁ ♦ బోణినిజము.

అర్థములు. ముదితులు = సంతోషించిన వారు, సాయకములన్ = బాణములచే.

తా త్ప ర్య ము .

ఈ కారణముచే నీవు రామలక్ష్మణు లెట్లు రాఁగల రను సందేహముగాని, రారను శోకముగాని వదలుము. నీదుఃఖకాలము పోయినది. నేను బోయి చెప్పఁగానే వానరు లొక గంతున్వైచి సంతోషముతో నిటకు వత్తురు. రామలక్ష్మణులు సూర్య చంద్రులవలె నా వీఁపుపై నెక్కి వచ్చి నీ యెదుట నిలువఁ బడుదురు. ఇచ్చటికి వచ్చి బాణములచే నీ లంక నంతయు పొడిపొడిగాఁ జేయుదురు. యుద్ధమందు రామచంద్రమూర్తి రావణుని సేనలతోడఁ జంపి నిన్ను యోధ్యకుఁదోడుకొనిపోవును.

క. కాలమున కెదురు చూడుము, బాలా! తూర్ణముగ రాము ♦ వహ్నివలెఁ గనం
జాలెద వాతఁడు నీవ్యథఁ, బాలార్చును నసురుగతిని ♦ బరికింపు మికన్. ౫౦౭

అర్థములు. తూర్ణముగన్ = త్వరగా; వహ్నివలెన్ = అగ్నివలె; పాలార్చును = నశింపఁజేయును.

తా త్ప ర్య ము.

అమ్మా! మే మెప్పుడు వత్తుమా యని మా రాక కెదురు చూచుచుండుము. ఈ లోపల నీ వేమియు సాహసము చేయఁబోకుము. రామచంద్రమూర్తిని మండుచున్న యగ్నిహోత్రమువలె నిందుఁ జూడఁగలవు, ఆయన నీ దుఃఖము మాపును. రాక్షసుఁ డిఁక నేగతి పట్టునో చూడుము.

చ. కొడుకులతోడ బంధుజన ♦ కోటులతోడ నమాత్యపంక్తితోఁ
గడచని రాక్షసేశ్వరుఁడు ♦ గ్రొమ్ముసలిఁ ద్రెళ్ళఁగ నీవ చూచి నీ
యుడుగని దుఃఖసాగరము ♦ నొడ్డును జేరి శశాంకు రోహిణీ
జలజదళాక్షి చందమున ♦ సమ్మద మారఁగఁ గూడెదఁ గనా! ౫౦౮

అర్థములు. అమాత్యపంక్తితోన్ = మంత్రుల సమూహముతో, కడచని = చచ్చి.

తా త్ప ర్య ము .

అమ్మా! కొడుకులతోఁ జుట్టములతో మంత్రులతోఁ జచ్చి రావణుఁడు నేల బడఁగా నీవే చూచి నీ దుఃఖ సముద్రముయొక్క యొడ్డును జేరఁగలవు. మఱియు రోహిణి చంద్రునిఁ గూడినట్లు నీ మగనిని నీవు సంతోషముతోఁ గూడుకొనఁగలవు.

సీ. అని యిటు లూరార్చి ♦ యవనిజఁ గనుఁగొని, పయనింప నాయత్త ♦ పడుచు వెండి
పల్కె నా పావని ♦ పల్లటిల్లకు మమ్మ, త్వరగా నె కాంచెదు ♦ దాశరథుల
శరచాపకరుల నీ ♦ పురమువాకిట నఖ, దంష్ట్రాయుధులు రణ ♦ దక్షులైన
శాఖామృగంబులు ♦ శైలాంబుదసముల్, సద్భక్తిఁ గొలువంగ ♦ జలదవేణి!

ఆ. నిన్నుఁ దలఁచి తలఁచి♦కన్ను మొగుడ్పక, యున్నవాఁడు రాముఁ♦డుమ్మలికను
దుఃఖపడకు మమ్మ!♦దురపిల్లకో యమ్మ. తాళవమ్మ! వెతలు♦దలఁగు నమ్మ.

అర్థములు. ఆయత్తపడుచున్ = సిద్ధపడుచు; పల్లటిల్లకుము = తెల్లఁబోకుము; శాఖామృగంబులు=వానరులు, శైలాంబుదసముల్ = పర్వతములతో మేఘములతో సమానమైనవారు, ఉమ్మలికను = శోకముచేత; దురపిల్లకుము = తపింపకుము; జలదవేణి=మేఘమువలె నల్లనైన జడ గలదానా.

తాత్పర్యము.

ఈ ప్రకారము సమాధాన పఱిచి ప్రయాణమునకు సిద్ధపడుచు సీతాదేవిని జూచి యామెకు మఱింత ధైర్యము వచ్చుటకై హనుమంతుఁ డిట్లనియె. అమ్మా! నీవు తెల్లబోకుము. విల్లు బాణములు ధరించిన రామలక్ష్మణులను నీ పురము వాకిటఁ ద్వారలోనే, గోళ్ళు కోఱలాయుధములుగఁ గలిగి యుద్ధమందు సమర్థులై పర్వతముల వలె నెత్తై మేఘముల వలె లావైన వానరులతోడఁ గూడి యుండఁగాఁ జూడఁ గలవు. రామచంద్రమూర్తి నిన్నుఁ దలఁచి తలఁచి వ్యసనముచే నిద్దుర లేక యున్నాఁడు. కావున నీవు సంతాపము పడకుము. రావణు భయము వదలుము.

క. రామునికంటె విశిష్టుఁడు, భూమిజ! యెవఁ డమ్మ లోక♦ముల నేం దేనిన్?
సౌమిత్రికి సముఁ డెవ్వఁడు? భామా! నీ కాశ్రయులును♦వహ్న్యనిలసముల్.

అర్థములు. విశిష్టుఁడు = గొప్పవాఁడు, వహ్ని+అనిలసముల్ = అగ్నివాయువులకు సమానులు.

తాత్పర్యము.

ఎందైనను, ఏ విషయ మందైనను రామచంద్రమూర్తి కంటె గొప్పవాఁ డెవఁడు? లక్ష్మణునకు సమానుఁ డెవ్వఁడు? వారిరువురు అగ్నివాయువుల వంటివారు. లోకమున దహన కర్మమందు నగ్నిని మించినది లేదు. ఇది రూపమే లేకుండఁ జేయును. బలమునందు వాయువుతో సమానమైనది. ఎట్టి దానినైన బోర్లఁదోచి తుత్తుమురు చేయఁ గలదు. రెండు నేకమైనపుడు శత్రునిశ్శేషము చేయఁగలవు. ఈయిరువురు నీకు సహాయులు. ఇఁక నీకు వచ్చిన భయ మేమి?

క. రాముని నేఁ జూచుటయే, భూమిసుతా! యడ్డు, నేను ♦ బోయి వచింపన్
భీమకపిస్తోమంబుల,తో మహీపుఁడు వచ్చి యిటకుఁ♦దున్నాఁడు నరిన్. ౯౯౦

తాత్పర్యము.

నేను బోయి రామచంద్రమూర్తిని జూచుటే యాలస్యము. నేను బోయి చెప్పఁగానే భయంకర వానర సమూహముతో నాయన బయలు దేఱివచ్చి శత్రు సంహారము చేయును.

క. ఈ రక్షోగణరక్షిత, ధారిణి వెత లందఁగలదు ♦ తల్లి! చిరముగా
స్వారాజును శచి గూడిన, తీరునఁ బతిఁ గూడెదీవు ♦ ధృతి గొను మాత్మన్.

అర్థములు. ఈ రక్షోగణరక్షిత ధారిణి= రాక్షస సమూహములచే గాపాడఁబడుచున్న యీ భూమి. ఈ యనునది సమీప పదార్థమును దెలుపును; చిరముగా= శాశ్వతముగా; స్వారాజును = స్వర్ + రాజును = ఇంద్రుని; ధృతి = ధైర్యము.

తాత్పర్యము

రాక్షసులు కాపాడుచున్న యీ లంక శాశ్వతముగా దుఃఖముల పాలుకాఁగలదు. ఇంద్రుని శచీదేవి కలిసికొన్నట్లు నీవును రామచంద్రమూర్తిని గలిసికోఁగలవు. ధైర్యము వహింపుము. భయపడవలదు.

—♦౪౦–వ సర్గము. సీతాదేవి శ్రీరాముని నుద్దేశించి హనుమంతునితోఁ బలుకుట♦—

సీ. అనవుడుఁ బవమాన♦తనయునిఁ గనుఁగొని, ధరణిజ యిట్లనుఁ ♦ గరముఁ బ్రీతి
నీ ప్రియసూక్తులు ♦ నిండుముదం బిచ్చె, వాడిన మడికిని ♦ వానయట్టు
శోకంబుచేఁ జాల ♦ శుష్కించి యుండు నా, యవయవంబులచేత♦నాసదీర
నెట్టు లాత్మేశు నే ♦ స్పృశియింపఁ గలనొ నీ,వట్లుసేయుము వఱు♦వట్లుదొలఁగఁ
గాకిని గ్గోపాన ♦ నేకాక్షముగఁ జేసి, నట్టివార్తయు నర♦ణ్యమున నాదు
ఆ. గండభాగమునను ♦ గరఁగిపోఁ దిలకంబు, స్వేదబిందువులను ♦ జిత్రరీతిఁ
మణిశిలనునొకంట♦మమతమీఱఁగనీవు,తిలకముంచుటయును♦దలఁపుమనుము.

అర్థములు. వఱువట్లు – వట్లు + వట్లు=వఱువట్లు, మిక్కిలి శుష్కించుట, ఏకాక్షముగఁ=ఒక కన్నుగలదానిగ, గండభాగమునను = చెక్కిలి యందు. (౨) గండశైలము ప్రక్కనున్నప్పుడు, స్వేదబిందువులను = చెమట బొట్లను.

తాత్పర్యము.

ఈ ప్రకారము హనుమంతుఁడు చెప్పఁగా నాయననుజూచి సీతాదేవిమిగులఁ బ్రీతితో నిట్లనియె. వాడిపోవుచున్న మడిలోని పైరునకు వాన మఱలఁ బ్రాణము గలిగించి పచ్చగాఁ జేసినట్లు చావనున్న నాకు నీప్రియవాక్కులుమఱలఁబ్రాణమును గలిగించెను. బ్రదికితిని. శోకముచే మిక్కిలి శుష్కించియుండు నీయవయవములచే నా దుఃఖమంతయు సమయునట్లు నామగని నేనెట్లు కౌగలింపగలనోనీవట్లుచేయుము. ఇదివఱకు నీకు నిచ్చిన గుర్తుగాక మఱియొక రహస్యమైన గుర్తు చెప్పెద వినుము. కోపముచేఁ గాకిని నొంటికంటిదానిగఁ జేసిన విషయముగాక యరణ్యములందు సంచరించునపుడు గండశైలమునందుఁ జెమటకు నా ముఖమున జుక్కబొట్టు కరఁగి పోఁగాఁ బోడుముఖముతో నుండు నాకుఁ దానే ప్రేమతో మణిశిలను జూఁది తిలకముంచెను. అదికూడ స్మరింపు మనుము.

దీనివలన ముత్తైదువులు కొంచెము సేపైనఁ బోడు ముఖముతో నుండరాదనియు, నట్టి పాడు ముఖమును బురుషులు చూడరాదనియు నేర్పడుచున్నది. తిలకములేని ముఖము శ్మశానమువంటిది. ఇందు సీసము పంచపాది.

క. వరుణేంద్రోపమవిక్రమ, పరుఁడవు నీయట్టిఁ డాత్మ♦పత్నిని దైత్యుల్
హరియించి బాధ పెట్టఁగఁ, బరునట్టుల యూరకుంట♦భావ్యం బగునే. ౯౯౪

అర్థములు. వరుణేంద్రోపమ విక్రమ పరుఁడవు=వరుణుని, యింద్రుని పరాక్రమముకంటె గొప్ప పరాక్రమము గలవాఁడవు. వారిరువురు కలిసినను నీ కీడు రారు. అట్టిఁడు=అట్టివాఁడు; ఆత్మపత్నిని = తనభార్యను: మఱి యెవతనో కాదు. తాను భరింపఁ బూఁటపడిన యిల్లాలిని; ఆమె లేకుండిన నగ్నిహోత్రముకూడ లేకుండఁ బోవుదానిని; దైత్యుల్ = రాక్షసులు; మఱి యెవ్వరో బంధువులు పిలుచుకొనిపోలేదు. హరియించి=దొంగతనముగా నెత్తికొని; నీసమ్మతి మీఁదఁ గాదు. బాధ పెట్టఁగన్=ఎత్తికొని పోవుట సుఖపెట్టుటకుఁ గాదు. బాధపెట్టుటకు; పరునట్టుల=అన్యునివలె; తేరకానివలె; శత్రువువలెనే; ఒక స్త్రీ బాధపడునపుడు పరాయిమగవాఁడైనను సాహాయ్యపడవలసినవాఁడే, శత్రువు మాత్రమే సహాయ పడఁడు.

పరాక్రమమందు ఇంద్రవరుణులిద్ద ఱొకటిగా వచ్చినను నీకు సమానులు గారు. అటువంటి పరాక్రమముగల నీవు నీభార్యను రాక్షసులు నీసమ్మతి లేకుండ దొంగతనముగా హరించి బాధపెట్టుచుండఁగా నీవుశత్రువువలె నూరకుండుటప్రశస్త కార్యమా?

ఉ. దాఁచితి నీరజంబుమణి♦దాశరథీ! యిది నీ మనోంబుజం
బాఁచికొనంగఁ జాలుట మ♦హాత్మ! భవద్విరహానలంబు న
న్నాఁచెడివేళ నిన్ననిన♦కై వడి దీనిని గాంచి పొంగుదున్
సైచుట దోఁప దింక వెత♦సంద్రమునం దుసు ఉగ్గఁబట్టుచున్. ౯౯౫

అర్థములు. నీరజంబుమణి = నే నిప్పుడు నీకుఁ బంపిన చూడారత్నము గనులలో ఱాలలోఁ బుట్టినదిగాదు. సముద్రమున జలములందుఁ గౌస్తుభమువలె బుట్టినది. మనోంబుజంబు=మనస్సనెడి కమలము, కమలము నీరజము — ఈ మణి నీరజము కావునఁబరస్పరము సోదరన్యాయము కలదు. కావున నీ హృదయకమలమును నిది యాకర్షింపఁగలదు. ఆఁచికొనంగన్ = ఆకర్షించుకొన; ఉసురు = ప్రాణము; ఉగ్గఁబట్టుచున్=బిగఁబట్టుచు; దాశరథీ = నీ తండ్రిని దశరథునైన స్మరింపుము. ఆయన బలపౌరుషములు స్మరించి యాయన కడుపునఁబుట్టిన నీ వెట్టులు ప్రవర్తింపవలయునో యోజింపుము. భార్యయొక్క తుచ్ఛమైనకోరిక నిమిత్తమైతన ప్రాణము విడిచిన యాయన చర్య స్మరింపుము. అట్టి కోరిక నేను గోరలేదు. నీ పౌరుషమునకుఁ గీర్తికి హాని రాకుండ నా ప్రాణమును గాపాడు మని కదా నేను గోరుచున్నాను. నా మామగా రుండిన నన్నిట్లుపేక్షించి యుండునా? మహాత్మ = నీవుస్వభావమున మహాత్ముఁడవే. ఏల నావిషయమున మాత్రము క్షుద్రాత్ముఁడవైతివి. భవద్విరహానలంబు = నిన్నెడఁబాయుట యనెడి యగ్ని.

### తా త్ప ర్య ము.

దశరథ రాజపుత్రా! నీ మనస్సు నిది యాకర్షింపఁజాలుశక్తిగలది కావున నీ నీటఁబుట్టిన మణిని నేను దాఁచియుంచితిని. ఇది నీ వియోగ మను నగ్ని నన్నుఁ కాలుచునపుడు నీటఁబుట్టినది కావున నీ చలువగుణము దీనియందుండుటచే నిప్పును నీళ్ళు చల్లార్చినట్లు నా విరహాగ్నిని నది చల్లార్చును దీనినిజూచి నిన్ను జూచినట్లే పొంగుదును. గావున దీనిని జూడఁగా నే విరహానలము శమించును. దీనిని గూడ నెడఁ బాసితిని. ఇఁక నీదుఃఖసముద్రమునందు నేను బ్రాణముబిగఁబట్టఁగలననితోఁపలేదు. అట్టైన నేల పంపితివందువా? ఇదివఱకు దీని దర్శనము నీరూపమునుస్మృతికిఁ దెచ్చు చుండెను. ఇప్పు డిదేపోయి నిన్నుఁ బిలుచుకొని వచ్చునని నమ్మిపంపితిని. ఇది సముద్రమునఁ బుట్టినది కావున సముద్రమువలన బాధలేకుండ నన్ను రక్షించు చుండెను. ఇఁక నన్ను రక్షించువారెవరు? ఈ రత్నమును జూచినపుడంతయు నీవు స్మరణమునకు వచ్చుటచే దీనిని దాఁచితినని చెప్పుటచేఁ జూచినపుడంతయు భగ వంతుని జ్ఞాపకముఁదెచ్చు పతకముగాని మఱి యేదైన చిహ్నముగాని దేహమున ధరింపవలయునని సూచన. అది పోవుట ప్రాణము పోవుటతో సమానము. కావుననే శ్రీకోదండరామ సేవక సమాజ సభ్యులు సీతారామ లక్ష్మణ పతకమును సర్వదా ధరించుచున్నారు. సీతాదేవి సర్వాభరణములు వదలి దీనిని మాత్రము ప్రాణపద ముగా దాఁచి యుంచెను. దానిని గూడ రామార్పణము గావించి సర్వస్వ నిక్షే పము గావించిన దయ్యెను.

ఆ. పడఁగ రాని యట్టి♦పాటులఁ బడుచును, వాకొనంగ రాని♦వార్త వినుచు
గుండె జల్లు మనఁగఁ ♦ గూళరక్కసులలో, నిన్నుఁదలఁచి సైఁచి♦యున్న దాన.

అర్థములు. వాకొనంగరాని = (౧) చెప్పరానంత నీచములైనవి. (౨) చెప్పరానన్ని సంఖ్య గలవి.

### తా త్ప ర్య ము.

ప్రాణి పడుటకు సాధ్యముగాని బాధ పడుచు నోటఁ జెప్పరాని మాటలు వినుచు గుండెలు జల్లు జల్లు మనుచుండ నీదయలేని రాకాసులలోఁ జిక్కుకొనియు నీవు కలవుకదా భయమేమి యని నిన్ను స్మరించి సహించి యున్న దానను.

దేహము ధరించిన ఫలము భగవంతుని స్మరణమే. దేహము లేదేని భగవ త్స్మరణములేదు. భగవంతుని స్మరించినఁగాని భగవత్ప్రాప్తిలేదు, కావున భగవ త్ప్రాప్తికై దేహధారణము చేయవలయును గాని మనమ్మై విడువరాదు. దాని నన్య ప్రాకృత విషయములందు వినియోగ పెట్టనురాదు. కావున నీ దేహము వదలి పోవు లోపలనే భగవత్ప్రాప్తి కలుగు నుపాయము చేసికొనవలయును.

చ. ఒక నెల యెట్టులైన మని♦యుండెద, నంతకు నీవు రానిచో
బ్రకటముగాఁగ బ్రాణములు ♦ పాయును, రావణుఁ జూచినంతటఁ

దకతక లాడు గుండియలు ♦ దైత్యుఁడు క్రూరుఁడు నాథ! నీమనం
బకట! కరంగ దేని యని♦యంతయు నా దురదృష్టమే చుమీ.

అర్థములు. మనియుండెదన్ = బ్రతికి యుండెదను; అంతకున్ = అంత కాలము వఱకు.

తాత్పర్యము.

ఎంతకష్టమైనఁబడుచు నొక నెల బ్రదికియుండెదను. (౯౫౩ ప.) ఈలోపల నీవు రానియెడల ప్రాణములు తమంతఁ దామే పోవును. నిలుప నాకు సాధ్యపడదు. ఆశ యను త్రాళ్ళచేఁ గట్టియుంచినాను. అది తెగిపోయెనా దానిని బిగఁబట్టు సాధనము లేదు. ప్రాణ మేల పోవు నందువా రావణుఁ జూచిన మాత్రముననే నా ప్రాణములు తల్లడిల్లును. వాఁడు మహా క్రూరుఁడు, ఇంత చెప్పినను ఇప్పటికిని నీ మనస్సు కరఁగ దాయెనా యది నా పాప ఫలమె గాని నీ దోషముగాదు.

—♦ హనుమంతుఁడు మరలిపోవుటకు సీతాదేవిని సెల వడుగుట. ♦—

చ. అని కరుణంబుగా రమణు ♦ నాడు మృగాయతనేత్రవాక్యముల్
విని పవమాననందనుఁడు ♦ విను మ్మ సతీ! శపథంబుఁ జేసెదన్
వనజదళాయతాంబకుఁ డ♦వశ్యము నీ వెతఁ బాపు, నెంతయున్
వనరెడి నిన్నుఁ బాసి, మగు♦వా, యది చూచి కృశించుఁ దమ్ముఁడున్. ౯౯౦

అర్థములు. కరుణంబుగాన్ = శోకముతో — శోకము గలుగునట్లు.

తాత్పర్యము.

అని దుఃఖకరముగా మగనిని బల్కుచున్న సీతాదేవి వాక్యములు విని హనుమంతుఁ డిట్లనియె. అమ్మా! నేను బ్రమాణము చేసి చెప్పుచున్నాను. నా మాట నమ్ముము. రామచంద్రమూర్తి యవశ్యము నీ కష్టములఁ దొలఁగించును. నిన్నుఁ బాసి యెంతయో దుఃఖించు చున్నాడు. ఆయన స్థితి చూచి లక్ష్మణుఁడును శుష్కించు చున్నాడు.

శా. ఎట్టెట్టో నినుఁ గంటి నిందు నిఁకఁ ద♦ల్లీ! దుఃఖకాలంబు గా
దెట్టుం దప్పదు నిన్నుఁ జూచుతమి ధా♦త్రీశాత్మజుల్ లంకకుం
బట్టన్ లగ్గలు రాక్షసాధముని దు♦న్మన్ నీవ కన్నార రా
పట్టీ! చూచెదు పోదు వాత్మవిభుతోఁ ♦ బద్మాక్షి మీ వీటికిన్, ౯౯౯

అర్థములు. రాపట్టీ = రాచకూతురా. పట్టి శబ్దము బిడ్డ శబ్దము వంటిది గాని ఆఁడుబిడ్డ — మగబిడ్డ యన్నట్లు ఆఁడుపట్టి మగపట్టి యని ప్రయోగములు లేవు. సందర్భానుసారముగా నర్థము చేసికొనవలెను.

తాత్పర్యము.

తల్లీ! యెంతో కష్టపడి నిన్ను నేనిందుఁ జూచితిని. ఇఁక నీవు యాచింపవలసి

నదిలేదు. నిన్నుఁ జూచు కోరికతో రాజకుమారులు లంకకువచ్చి కోటకు లగ్గలు పట్టి నీచరావణునిఁ జంపఁగా నీవే కన్నులారఁ జూచెదవు. ఇది తప్పదు. నీవు నీ మగనితో మీ యూరికిఁ బోఁగలవు.

ఉ. రాముఁ డెఱుంగు గుర్తొకటి ♦ రాజసుతా! యిది యంతె చాలు నా
భామిని మత్ప్రదత్తమణి ♦ పావని! చాలెడిగుర్తు, తన్మణిన్
భూమివిభుండు చూచిన స♦హోహముగా దెద నమ్ము నీ నుడుల్
నా మరుదాత్మజుండు పయ♦నం బయి నే నిఁకఁ బోయివత్తునే. ౧౦౦౦

తా త్ప ర్య ము.

రామచంద్రమూర్తి గుర్తింపఁగలఁ గుర్తొకటి యిమ్ము. అంతమాత్రము చాలును. తక్కిన కార్యములు నేను జేసెదను.అనినహనుమా! నేనిచ్చిన మణినిన్ను నమ్ము నట్లు చేయఁజాలినంత గుర్తు. దానిని జూడఁగానే నీవు నా యొద్దకు వచ్చితి వని నేను దీని నిచ్చితి నని నమ్మును. అసత్యముగాదు. అని చెప్పఁగా హనుమంతుఁడు తల్లీ నే నిఁక పోయి రావచ్చునా? అనుజ్ఞ యిచ్చెదవా?

చ. అని నమితోత్తమాంగుఁ డయి ♦ యంత ప్రణామము చేసి నిల్వ న
య్యనఘుని మేను పెంచుట మ♦హాంబుధి దాఁటఁగ నుత్సహించుటల్
గని కనుదోయి బాష్పములు ♦ గ్రమ్మ సగద్గదకంఠయై ధరా
తనయ ప్రభంజనాత్మభవు ♦ దైన్యమునం గని పల్కె నీ గతిన్. ౧౦౦౧

అర్థములు. నమితోత్తమాంగుఁడు = వంచిన శిరస్సు గలవాఁడు.

తా త్ప ర్య ము.

ఇట్లు చెప్పి తనకుఁ దలవంచి నమస్కరించి నిల్వఁగా నా పుణ్యాత్ముఁడు దేహము పెంచుట-సముద్రముదాఁట నుత్సహించుటచూచి కన్నుల నీళ్లుగ్రమ్మఁగా డగ్గుత్తికతో సీతాదేవి యాంజనేయునిఁజూచి వ్యసనముతో నిట్లనియె.

హనుమంతుఁడు సీతాదేవిని తొలుతఁ జూచినపుడు నమస్కరింపలేదు. ఇపుడు నమస్కరించెను. ఏల? పురుషులు స్త్రీలకు నమస్కరింప వచ్చునా? పురుషులు తాము చూచిన స్త్రీల కందఱకు నమస్కరింపరాదు గాని,

స్త్రియో నమస్యా వృద్ధాశ్చ, వయసా పతిదేవతాః
దేవతా ప్రతిమాం దృష్ట్వా యతించైవ త్రిదండినమ్॥
నమస్కారం న కుర్యాచ్చే దుపవాసేన శుధ్యతి.

వయస్సున వృద్ధస్త్రీలు, పతిని దేవతలవలెఁ గొలుచు పతివ్రతలు తీరున నమస్కారమునకు నర్హురాండ్రు. వీరిని, దేవతా ప్రతిమలను, త్రిదండ యతిని చూచి నపుడు నమస్కరింప కుండిన దోష మొకనాఁ డుపవాస ముండినఁ బోవును.

పాదములంటి మ్రొక్కుట యభివాదన మనఁబడును. చేతులు జోడించి మ్రొక్కుట నమస్కార మనఁబడును.

తొలుత సీతాదేవిని జూచినపుడీమె సీత యగునో కాదో తెలియదు. పతిదేవత యగునో, కాదో తెలియదు. వృద్ధయుఁగాదు. కావున నమస్కరింపలేదు.

దూత లక్షణములు.

నిసృష్టార్థో మితార్థశ్చ తథా సందేశ హారకః
కార్య ప్రేషతథా దూతో దూత్యశ్చాపి తథావిధాః.
ఉభయో ర్భావ మున్నీయ, స్వయం వదతి చోత్తరమ్.
సుశ్లిష్టం కురుతే కార్యం, నిసృష్టార్థస్తు సస్మృతః.
మితార్థభాషీ కార్యస్య, సిద్ధికారీ మితార్థకః
యావద్భాషిత సందేశ, హారః సందేశహారకః,

నిసృష్టార్థుఁడని, మితార్థుఁడని, సందేశహారుఁడని దూతలుమూఁడువిధములు. దూతికలునట్టులే. అందుల నుభయుల యభిప్రాయము దెలిసికొని ప్రత్యుత్తరములు తానేవారిభావ మనుసరించి సమయోచితముగ నిచ్చి కార్యముచక్కఁజేయువాఁడు నిసృష్టార్థుఁడు. మితార్థములుభాషించి కార్యము చక్కఁజేయువాఁడు మితార్థభాషి. కార్యమెట్టులైనఁగాని తనప్రభువు చెప్పినమాటలఁ జెప్పువాఁడుసందేశహారి. వీరిలో హనుమంతుఁడు నిసృష్టార్థుఁడు. రామ సుగ్రీవులు చెప్పకున్నను సీతాదేవి ప్రశ్నల కన్నిటికి హనుమంతుఁడు తానే సమయోచితముగఁ బ్రత్యుత్తరములు చెప్పెను. రావణునకు నిట్లే చెప్పఁగలఁడు. హనుమంతుఁడిట్టియుత్తమదూత కావుననే "ఆదిఁ బరోపకారపరులై చరియించిన యట్టి యాంజనేయాదులఁబోలనైతి" నని నలుఁడు దుఃఖించె నని శృంగారనైషధమునఁ జెప్పఁబడెను. కాలమునుబట్టిచూచిన నలుఁడు ముందటివాఁడు. హనుమంతుఁడు వెనుకటివాఁడు కావున ఆది ననుట సరికాదు. కావ్యములం దిట్టివి దోషముగ నెన్నఁబడవు. అందువిషయము మాత్రము ప్రధానముగ గ్రహింపఁబడును గాని పూర్వాపర విచారము కావ్యకర్తలకును లేదు.

—♦ సీతాదేవి హనుమంతుఁడు క్రమ్మఱిపోవుటకు ననుమతించుట ♦—

క. హనుమా? కుశలం బడిగితి, ననుమా! శ్రీరాము నతని♦యనుజు సుమిత్రా
తనయు సహామాత్యుని నిన తనుజాతుని నందు నున్న♦తక్కిన వారిన్. ౧౦౦౨

తాత్పర్యము.

ఆంజనేయా! రామచంద్రమూర్తిని, ఆయన తమ్ముని, లక్ష్మణుని, మంత్రులతోడ నుండు సుగ్రీవుని, ఇంకను నచ్చట నున్న తక్కినవారి నందఱను కుశల మడిగితి ననుము.

క. అన్నా! రాఘవుఁ డెట్టులు, నన్ను విపత్సాగరంబు♦నం జెడకుండన్
జెన్నారఁ బ్రోచు నా గతి, మన్ననమెయిఁ బలుక వన్న!♦మఱవకు మన్నా!

తాత్పర్యము.

అన్నా! ఆంజనేయా! నే నీ యాపత్సముద్రమున మునుఁగకుండ నెట్లు చెప్పిన రామచంద్రమూర్తి నన్ను రక్షించునో యట్లు చెప్పుము. అన్నా! మఱవకుము సుమా.

క. ఇన్నిచరాక్షసావళి, నన్ను భయము పఱుచు విధము ♦ నానావ్యసనా
పన్నత నేఁ గుందెడి గతి, విన్నప మొనరింపు నాదు♦విభునకుఁ దండ్రీ! ౧౦౦౪

అర్థములు. నానావ్యసనాపన్నతన్ = పలువిధములయిన దుఃఖముల యాపత్తుచే.

తాత్పర్యము.

తండ్రీ! యీ రాక్షస స్త్రీలు నన్ను భయపెట్టు విధము నానావిధములయిన దుఃఖములచే నేను బాధ పడుచుండు విధము నా మగనికి విన్నవింపుము.

ఇట్లు అంగీకరింపఁ బడినట్టి ప్రపన్నుండు సంసారములోనుండునట్టిస్థితిని పిరాట్టికి రావణుని గృహమునందుండు అశోకవనమున నుండి చూపించినది. అదెట్లనిన, పిరాట్టి రావణసంబంధ మెట్లో ఈతనికి దేహసంబంధమును అట్టిదే. పిరాట్టికి ఏకాక్షి, ఏకకర్ణి మొదలగు రాక్షసస్త్రీ లెట్లో, ఈతనికి అహంకార మమకారములును అట్లే. పిరాట్టికి తనను పెరుమాళ్ళవద్దనుండి కొనిపోదలఁచిన మారీచుఁడు ఎట్లో, ఈతనికి విషయప్రావణ్య మట్టిది. తర్జనభర్త్సనాదుల నొనర్చిన రాక్షస స్త్రీ సంబంధము పిరాట్టి కెట్టిదో, ఈతని కళత్రపుత్ర సంబంధ మట్టిదే. పిరాట్టికి ఆంజనేయులవారి సంబంధ మెట్టిదో, ఈతనికి ఆచార్యుని దర్శనమును అట్టిదే. పిరాట్టికి శ్రీయాంజనేయుల వారొనర్చిన రామగుణకీర్తన మెట్టిదో, ఈతనికి ఆచార్యుండు సాయించిన గురుపరంపరయును నట్టిదే. పిరాట్టికి ఆంజనేయుఁ డిచ్చిన యుంగర మెట్టిదో, ఈతనికి ఆచార్యుండు ఉపదేశించిన తిరుమంత్ర మట్టిది. పిరాట్టి రామచంద్రుని యుంగరమునుజూచి దానిమూలముగ సుందరమగు వ్రేలిని, దానిమూలముగ బాహువులను వాటిమూలముగ దివ్యమంగళ విగ్రహమును అనుసంధించుకొని, ప్రాణములను ధరించియున్నట్లు శ్రీ వైష్ణవుండును, ఆచార్యుండు కృపచేసిన తిరుమంత్రము యొక్క యర్థమును అనుసంధించుకొని ధరించియుండును. పిరాట్టి లక్ష్మణస్వామితో పరుషముగ మాట్లాడిన మాట ఈమెను పెరుమాళ్ళనువిడిచి,దూరముగానుండునట్లు చేసిన చందమున, ఈతం డొనర్చినట్టి 'భాగవతాపచారము' ఈతనిని 'క్షిపామి' 'నక్షమామి' అను భగవన్నిగ్రహమునకు విషయముగాఁజేసి పెరుమాళ్ళనుండి దూరముగానుండునట్లు చేసినది. పిరాట్టికి విరోధులగు రావణాదులను వధించి పెరుమాళ్లు ఆమెను గొనిపోవుట యెట్లో,అట్లే యీతనికి విరోధియగు ప్రకృతి సంబంధమును బోఁగొట్టి సర్వేశ్వరుండు ఈతనిని పరమపదమునకుఁ గొనిపోయి నిత్యముక్తులతోఁ బాటు నిత్యకైంకర్యమున నుపయోగపఱుచుకొనును. ఈ పదివార్తలను అను

స్థానపర్యంతము గలిగియున్నట్టి శ్రీ వైష్ణవుం డుండునట్టి తావే పరమపదము. (వార్త మాలా ౨౦౩ పుట)

—♦ ౭౧-వ సర్గము. హనుమంతుఁడు కార్యశేషం బాలోచించుట. ♦—

చ. శుభ మగు గాక త్రోవ నరి♦సూదన! యం చనఁ బొంగుచుఙ్ మరు
త్ప్రభవుఁ డుదగ్దిశాగమన♦తత్పరుఁడై యటువాసి పోయి నే
నిభనిభయానఁ గంటి, నిఁక ♦ నించుక కార్యమ తక్కెఙ్, నీ పురీ
విభు నెడ మూఁ డుపాయములు ♦ వీడి చతుర్థమె యుక్త మారయఙ్. ౧౦౦౫

అర్థములు. అరిసూదనా = శత్రుసంహారకుఁడా! ఈ దీవనవలన హనుమంతుఁడు రాక్షసుల జయింపఁగలిగెను. నీకు శుభ మగుఁగాక త్రోవఙ్ = అనుటచే సముద్రమందు వచ్చునపుడు కలిగిన విఘ్నములు మఱలఁ బోవునపుడు రాక తొలఁగినవి. పొంగుచుఙ్ - సీత దీవించినది, ఇఁక నాకేమి భయ మని సంతోషించినవాఁడై - మరుత్ + ప్రభవుఁడు = గాలి కుమారుఁడు, ఉదక్ + దిశా + గమన తత్పరుఁడై = ఉత్తరదిక్కుగాఁ బ్రయాణమై పోవ నాసక్తి గలవాఁడై, ఇభనిభ యానఙ్ = ఏనుఁగు నడకవంటి నడకగల సీతాదేవిని, ఇంచుక కార్యము = కొంచెపుఁ బనియె, తక్కెఙ్ = మిగిలియున్నది. సుగ్రీవుఁడు సీతను జూడుఁడు, లంకను వెదకుఁడు, అను రెండు పనులలో నొకటి సీతను వెదకుట. ఆ ముఖ్యమైన పని ముగిసినది. లంకఁ జూచుట నిలువ యున్నది. అదియును రాత్రిచూచినను రాక్షసుల బలాబలములు రావణు నభిప్రాయ మెట్లున్నది యెఱుఁగవలసి యున్నది. ఆంజనేయా! లంకను జూచితివా యనినఁ జూచితిని మిద్దెలు మేడలు బాగున్న వనియా చెప్పుదును? రావణు నభిప్రాయ మే మనిన నేను జూచినపుడు నిద్రపోవుచుండెను ఆవల నాతనితో మాట్లాడలేదని చెప్పుదునా? కావున రాక్షసుల బలాబలము రావణు నభిప్రాయము దెలిసికొనుట యను కొంచెము కార్యము నిలువ యున్న దనెను.

తాత్పర్యము.

శత్రుసంహారకా! నీకు మార్గమందు శుభ మగుఁగాక. విఘ్నములు కలుగకుండును గాక; పోయి రమ్మనిన సీమె దయకుఁ బాత్రుఁడ నైతిని, నాకేమి భయ మని హనుమంతుఁ డుత్తరముగాఁ బ్రయాణమై పోవఁదలఁచి కొంచెము దూరము చాటుగాఁ బోయి యిట్టు లాలోచించెను. సుగ్రీవుఁడు చెప్పిన పనులలో సీతాదేవిని గనుట యనునది ముగిసినది. రెండవది లంకాశోధనము. రాత్రివేళఁ జక్కఁగాఁ జూచిన వాఁడఁ గాను. రాక్షసు లేమాత్రము బలవంతులో రావణు నభిప్రాయ మేదో తెలియ లేదు. ఈ కొంచెపుఁబని నిలువ యున్నది. ఇది చేయుటకు సామదాన భేదములు రావణు విషయమున నిష్ప్రయోజనములు. నాలుగవది దండోపాయమె తగినది. ఎలయంటివేని.

ఉ. సామము మేలు గాదు దను♦జప్రకరంబుల పట్ల, దాన ము
ద్దామధనాఢ్యులందు ఫల♦దంబును గా, దిఁక భూరివిక్రమో
ద్దాము లభేదసాధ్యులు గ♦దా, యటుగానఁ బరాక్రమం బొకం
డేమెయిఁ జూడ యుక్త మని♦యెంచెద బ్రస్తుత కార్యభంగికిన్. ౧౦౦౬

అర్థములు. ఉద్దామ ధనాఢ్యులందు = అధిక ధనముగల వారియందు, ఫలదంబు = ఫలమిచ్చునది; భూరి విక్రమోద్దాములు = అతిశయించిన పరాక్రమముచే గొప్పవారు; అభేద సాధ్యులు = భేదముచే సాధింప రానివారు; ఏమెయిన్ = ఏ విధముగ, ఇప్పటి కార్యభంగికిన్ = ఇప్పటి కార్యవిధమునకు.

తా త్ప ర్య ము.

రాక్షసులు తమోగుణము విశేషముగఁ గలవారు. అట్టివారు మంచి మాటలకు, ధర్మవాక్య శ్రవణములకు సాధువుల వలె లోబడువారు గారు. దానము వశపఱచి కొందమనిన వారి యొద్దనే విశేషించి ధనమున్నది. ఇట్టి వారు ధనమునకు వశపడరు. అందఱు పరాక్రమవంతులు. వీరిలో భేదోపాయము సాధ్యము గాదు. ఇఁక నాలుగవది యగు దండోపాయమే యిప్పటి కార్యస్థితినిబట్టిచూడఁ దగియున్నది.

'అనిత్యో విజయో యస్మాద్దృశ్యతే యుధ్యమానయోః
పరాజయశ్చ సంగ్రామే తస్మాద్యుద్ధం వివర్జయేత్. మనువు.

గీ. కలహమున లక్ష్మిఁ గావించుఁ బ్రాణహానియును జేయు నింత నిక్కంబు
పలువు రొకని గోడి పాఱుట బల్లిదు, లనద చేత జెడుటయును ఘటించు.

క. జయమగు నోడుదు మను ని,శ్చయ మొక్కఁడు లేదు వినుము సమరమునఁ బరా
జయము మరణంబుకంటెను హృ,దయపుట భేదనము సేయుఁ దథ్యం బనఘా.

ఈ కారణముచే యుద్ధము మానుదుమా యనిన సీతాదేవి రామచంద్రునితోఁ జేర్చు టెట్లు? యుద్ధమునందుఁ బరాజయము వచ్చినఁ గార్యము చెడునేమో. ముందు రామచంద్రమూర్తి, వెనుక సీతాదేవి గాచు చుండఁగా నాకుఁ బరాజయమెట్లు రాఁగలదు? 'యత్ర రామో భయం నాత్ర నాస్తి తత్ర పరాభవ' యనుట యసత్యవాక్యమా? వారి సాహాయ్యము కలదని నేనధర్మ కార్యము చేయఁబూనితినా? ధర్మ మేల చెడును? కావున యుద్ధమునను సాహసించుటే తగీన కార్యము. దుష్టులకు భయపడి ధర్మము చెడుచుండఁ జూచుచుండ వచ్చునా? యుద్ధ మెప్పుడు నిషిద్ధము? అర్థకాంక్ష యన్యరాజ్యాపహరణమునకై, కేవలకీర్తికై బలములు రెండు సమానములై జయము సందిగ్ధమైనపుడు యుద్ధము నిషిద్ధము. తన ద్రవ్యముఁ దాను రాఁబట్టుకొనుటకై చేయు యుద్ధము నిషిద్ధము కాదు. అందు నాకు దైవ బలము గలదు. దేహబలము గలదు. ధర్మబలము గలదు.

ఇట్టి నేనే లేనిపోని కుశంకలచే యుద్ధమునకు జంకితినేని కార్యమగు టెట్లు?

కావున యుద్ధమునకు జంకరాదు. రామచంద్రమూర్తి యసహాయుఁ డను దురభిప్రాయము రావణునకుఁ గలదు. దానిని దొలఁగించినఁ గాని వాఁడు మెత్తఁబడఁడు. వారిలోవారికి భేదములు పుట్టవు. కావున యుద్ధ మవశ్యకర్తవ్య మగుచున్నది.

చ. అసురులచేవమట్టు తెలి♦యన్ గమనించెద నేని దండమే
యొసఁగు శుభోత్తరం బయి, మ♦ఱేది ప్రయోజనకారి గాదు, రా
క్షసవరవీరులం గెడపఁ♦గా ననిఁ గొందఱ నున్నవార లే
రస మఱి మెత్తపాటు గొన♦రాముని కార్య మకష్టసాధ్య మౌ. ౧౦౦౭

అర్థములు. చేవమట్టు=బలప్రమాణము. గమకించెద నేని, ప్రయత్నము చేసెదనేని, శుభోత్తరము=మిగుల మేలైనది; కెడపఁగాన్ = చంపఁగా; అనిన్= యుద్ధమందు; ఉన్నవారు=తక్కినవారు; అకష్టసాధ్యము=సులభ సాధ్యము.

తాత్పర్యము.

నేను మఱలి పోఁగానే రావణుని, రాక్షసులయు బలాబలములేమాత్రమని రామసుగ్రీవులు తప్పక యడుగుదురు. దానికి నేను సరియైన ప్రత్యుత్తర మీయవలసి యుండిన రాక్షసులేమాత్రము బలవంతులో తెలియవలయును. ఇది యుద్ధమందుఁ దెలియఁదగినదే కాని సామదానాదులఁ దెలిసికొన సాధ్యపడునది కాదు. అటుగాక యుద్ధమునకు నేను ప్రయత్నించుటవలన మఱియొక మేలు గలదు. ఇప్పుడు వీరు రామలక్ష్మణు లిరువు రసహాయులేమి చేయఁగలరని ధైర్యముతో నున్నారు. ఆదురభిప్రాయముఁదొలఁగించి రామచంద్రమూర్తికి సుగ్రీవసాహాయ్యముగలదని ప్రకటించి యుద్ధమునఁ గొందఱఁ జంపితినేని తక్కినవారు ద్వేషమువదలి మెత్తఁబడుదురు. వారిలో వారి కభిప్రాయభేదము పుట్టును. అప్పుడు రామచంద్రమూర్తి కార్యము కష్టము లేక నెఱవేఱును.

ఉ. సీతనుజూచి రమ్మనుచుఁ ♦ జెప్పెను గాక రఘూద్వహుండు దు
ర్నీతులతోడఁ బోరు మనె ♦ నే యని యాత్మఁ దలంతు నేనియున్
దూతయు నీతమైన పని ♦ తోఁ బలుకార్యములన్ ఘటించుచో
ఖ్యాతమనస్వి తత్ప్రథమ ♦ కార్యవిరోధము లేమిఁ గన్గొనున్. ౧౦౦౮

అర్థములు. దుర్నీతులతోడన్ =నీతిమాలిన వారితోడ, నీతము = నియమింపఁబడినది, ఖ్యాత = ప్రసిద్ధి కెక్కిన, మనస్వి = ధీరుఁడు, ఆలోచనాపరుఁడు, తత్ప్రథమకార్య విరోధము= మొదటికార్యమునకు విరోధించినది.

తాత్పర్యము.

రామచంద్రమూర్తిసీతాదేవిని జూచి మాట్లాడి రమ్మనెనుగాని, యీ నీతిమాలిన వారితో నీచకలహమునకు దిగు మనెనా యని యందునేని సీతాదేవి యేమి చెప్పెను. రామచంద్రమూర్తియే యిచ్చటికి రావలె, రావణాదులఁ జంపవలెఁ దన్నుఁ దీసికొనిపోవలె నని పట్టుదలగాఁ జెప్పెను. ఈమాట నేనుజెప్పినరాక్ష

సుల బలాబలవిచారము రాక తప్పదు. ఈ పని నాకుఁ బ్రభువు చెప్పలేదే యనరాదు. ఏవిధముగానైనఁ గార్యముసాధించుట యుత్తమ దూతకృత్యము. అటు చేయునపుడు ప్రభువు నియమించిన కార్యముతోడఁ గార్యసాధనమునకు నే వేవి చేయవలయునో యవి యన్నియు మొదటిదాని కంగములుగాఁ జేయుట దూతకృత్యమే. అయినను ధైర్యము, ఆలోచన గలవాఁడు నియమిత కార్యమునకు హానిరాకుండఁ జూడ వలయును. అది చెడకుండునట్లు కార్యము సాధింప నెన్నియైనఁ జేయవచ్చును. మూలచ్ఛేదమగు కార్యము చేయరాదు.

ఉ. ఎంతయుఁ జిన్నపాటి పని♦నేనియుఁ జక్కఁగఁ జేయఁ బూనుచో
సంతస మందఁ గూడ దొక♦సాధన మబ్బినయంత, నర్థ్వహాఁ
జింతలఁ బెక్కు మార్గములఁ♦జేయఁగ దానిని, గాన జానకీ
కాంతుని యిమ్మహాక్రియయుఁ♦గార్యము చేయఁగఁ బెక్కుభంగులన్. ౧౦౯

తా త్ప ర్య ము.

ఎంతగ యల్పకార్యమునైనఁ జక్కఁగఁ జేయవలయునని పూనినవాఁడది నెఱవేఱుట కెన్నెన్ని యుపాయము లున్నవో యన్నియు వెదకి చేయవలయును. అప్పుడే యీ కార్యము నిర్భయముగఁ జక్కఁగఁ నెఱవేఱఁగల దని నమ్మవచ్చును. కావున నీ రామ కార్యము కూఁడ బలువిధముల నెఱవేర్చుటే బాగు.

తే. దనుజులకు నాకుఁ గల తార♦తమ్య మెల్ల; నరసి నిక్క మెఱింగి కీ♦శాధినాథు
సరస కరిగితి నేని య♦శంబు వెలయ, భర్తృనాజ్ఞనుజేసిన♦బంట నగుదు. ౧౧౦

అర్థములు. సరసకున్ = సమీపమునకు, భర్తృనాజ్ఞను = భర్తయాజ్ఞను; షష్ఠీసమాసంబులం దుకారఋకారముల కచ్చు పరంబగు నపుడు నుగాగమం బగు. సు. వ్యా. సంధి. ౪౯ సూ.

తా త్ప ర్య ము.

బలమునందు రాక్షసులకు, నాకుఁగల భేదము తెలిసికొని రామచంద్రు సమీపమునకుఁబోయితినేని, యిప్పటికిస్వామియాజ్ఞ నెఱవేర్చిన బంటననిపించుకొందును.

క. సులభంబుగ నసురులతోఁ, గలహము సమకూరఁ బంక్తి♦కంఠుం డస్మ
ద్బలమును దనదు బలంబును, దెలిసికొనుం గాక యెంటఁ♦దెలియం గలఁడే?

తా త్ప ర్య ము.

రావణుఁడు తనయంతటి బలశాలి లేఁడని మదించి యున్నాఁడు. ఆ మద మణఁచిన గాని వాఁడు లొంగఁడు. కావున సులభంబుగ రాక్షసులను యుద్ధమున కీడ్చి కొందఱఁ జావఁదన్నుదునేని రావణుఁడు యుద్ధమునకు వచ్చును. అప్పుడు తన బలమెంతో నాబలమెంతో తెలిసికొనునుగాని, నే నూరక పోయిన వాని కేమి తెలియఁగలదు ?

ఉ. కావున నెట్టులైన దశ♦కంఠు సమంత్రి సమూహ సైన్యసం
భావితు నాజికీడ్చి పరి♦పంథి బలాబలరీతి వాని హృ
ద్భావము చందముం దెలిసి♦తద్దయుఁ జెక్కు చెమర్పకుండఁగాఁ
బోవుట కార్య మట్లయినఁ♦బో కృతకార్యుఁడ నౌదుఁ గావునన్. ౧౦౧౨

అర్థములు. ఆజికిన్ = యుద్ధమునకు, పరిపంథి = శత్రువుల, బలాబలరీతిన్ = బలము గలవారో, కారో యను దానిని, హృద్భావము చందము = ఆలోచన విధము; చెక్కు చెమర్పకుండఁగాన్ = అనాయాసముగ, చెంపమీఁదఁ జెమట పోయకుండఁగా, కృతకార్యుఁడను = కార్యము చేసినవాఁడను.

తాత్పర్యము.

కాఁబట్టి యేదో విధముగ రావణుని వాని మంత్రులతోను, సైన్యములతోను యుద్ధమున కీడ్చి దానియందు శత్రువుల బలాబలములు దెలిసికొని సీతావిషయమై వాని యాలోచన యేమో యనియు నెఱిఁగి యనాయాసముగా నే బాధ లేక మరలి పోయితి నేని రామకార్యము చేసినవాఁడ నగుదును.

చ. కనులకుఁ బండువై హృదయ♦కాంతము నై సురనాథునందనం
బన ఘనవృక్షసుందరల♦తాన్వితమై సొబగారుచున్న దీ
దనుజుని నిష్కుటంబు, వెస♦ధ్వంసముఁ జేసెద దీని, గారుచి
చ్చునఁ జెడినట్టి కాననము♦చొప్పయినం గని రావణుం డెదన్. ౧౦౧౩

అర్థములు. హృదయకాంతము = మనస్సున కాహ్లాదకరమై, ఘనవృక్ష = గొప్ప వృక్షములతోను, సుందరలతా = అందమైన తీఁగలతోను, అన్వితము = కూడినది, నిష్కుటంబు = ఉద్యాన వనము.

తాత్పర్యము.

కన్నులపండువై, మనస్సునకు నింపై యింద్రుని నందనవనమువలె గొప్ప వృక్షములతోను, నందమైన తీఁగలతోను గూడిన యీ యుద్యానవనము సొగసుగా నున్నది. దీని నిప్పుడే ధ్వంసము చేసెదను. ఇది కారుచిచ్చుచేఁ గాలినట్లు పాడై పోవఁగా రావణుఁడు తన హృదయమందు.

ఉ. మండి మహారథద్విపస♦మాజముఁ బంపును భండనార్థమై
దండిమగల్ త్రిశూలచయ♦దారుణపట్టి సచాపహస్తులై
గండున రాఁగ వారలను♦గ్రక్కునఁ జేయుచుఁ దుండెతుండెముల్
నిండు ముదంబునం జనెద♦నేఁ గపినాథపురంబుఁ జేరఁగన్. ౧౦౧౪

అర్థములు. మహారథద్విపసమాజము = గొప్ప తేర్లు, ఏనుఁగులు వీనిగుంపును; భండనార్థమై = యుద్ధము కొఱకు.

తాత్పర్యము.

కోపముచే మండిపడి పెద్దతేరులను, ఏనుఁగులను గల సేనలను యుద్ధకొఱకై

నా మీఁదికిఁ బంపును. ఆ శూరులు త్రిశూలములు, పట్టిసములు, విండ్లుపట్టుకొని వత్తురు. వారి నందఱను దునుకలు తునుకలుగా నఱకివైచి సంతోషముతోఁ గిష్కింధకుఁ బోయెదను.

—♦ హనుమంతుఁ డశోకవనంబుఁ బాడుచేయుట. ♦—

సీ. అని తలపోసి యం♦జనపట్టి చెలరేఁగి, యూరువేగంబున ♦ ధారిణీజ
తతులఁ బ్రభంజను♦గతి మూలముట్టుగఁ; బడవైవఁ గడఁగెను ♦ బెడిదముగను
మత్తశకుంతస♦మాఘుష్ట మగుచును, నానాద్రుమలతాళి ♦ నవ్య మయిన
ప్రమదావనం బెల్లఁ ♦ బాడు పాడొనరించి, యాటమలల నెల్ల ♦ నవనిఁ గలిపి
తే. కేళిసలిలాశయంబులఁ♦గూలఁ ద్రోయఁ, దెగిన తీఁగలు విఱిగిన♦యగచయంబుఁ
బాడుకొలఁకులు నగుచును♦బ్రమదవనము, కారుచిచ్చునఁ గాలిన♦కరణి నయ్యె.

అర్థములు. ధారిణీజతతులన్ = వృక్షసమూహములను, ప్రభంజనుగతిన్ = వాయువువలె, మూలముట్టుగన్ = వేళ్ళతోడ, బెడిదముగను = భయము కలుగు నట్లు, మత్తశకుంతసమాఘుష్టము = మదించిన పక్షుల ధ్వనులతోఁ గూడినది; ద్రుమ = చెట్లు, ఆటమలలు = క్రీడాపర్వతములు, కేళిసలిలాశయంబులన్ = క్రీడాసరస్సులను 'ద్రవకేళిపరీహాసాః క్రీడా లీలా చ నర్మ చ' అమరుఁడు. కేళీ కేళిరపి ప్రోక్తా. ద్వి. కో. రెండు రూపంబులుగలవు. అగచయంబు = చెట్ల సమూహము, ప్రమద వనము = స్త్రీలు విహరించు తోఁట, ప్రమదవనము ప్రమదావన మని రెండు రూపములు గలవు.

తాత్పర్యము.

ఈ ప్రకార మాలోచించిన వాఁడై హనుమంతుఁడు విజృంభించి తొడల వేగముచేత మహావాయువువలె చెట్లను వేళ్ళతోడ నేలఁబడవేయ నారంభించెను. మదించిన పక్షుల ధ్వనుల గలదై నానావిధములైన, చెట్లు తీఁగలు గలిగిన ప్రమదావనమును పాడుచేసి, క్రీడాపర్వతముల నెల్ల నేలపాలుచేసి, క్రీడా సరస్సుల విఱుగఁ ద్రోయఁగా తెగిన తీఁగలు, విఱిగిన చెట్లు, పాడైన సరస్సులు గలదై, యా వనము కారుచిచ్చున గాలి నట్లయ్యెను.

క. కూఁకటివేరులతోడం, బ్రాఁకుం బట్టెల్ల నేలఁ ♦ బడఁగ లతాళుల్
ప్రాఁకులకొనలఁ జలించెను, దేఁకువ వడఁకాడు చెలుల♦తీరున నంతన్. ౧౦౧౬

అర్థములు. ప్రాఁకుంబట్లు = తీఁగ లెగఁబ్రాఁకుటకు ననుకూలమైన చెట్లు - ప్రాఁకు + పట్లు = ప్రాఁకుంబట్లు - తేఁకువన్ = భయముతో, చెలుల తీరునన్ = స్త్రీలవిధమున.

తాత్పర్యము.

నేలఁ బాఁతుకొన్న తల్లివేళ్ళతోఁ దా మల్లుకొనుటకు నాధారముగ నుండిన

చెట్లన్నియు నేలఁపడఁగా వాని కొనలయందుఁ దీఁగలు దిక్కుచెడిన స్త్రీలు భయముతో వణఁకినట్లు వణఁకుచుండెను,

క. వ్యాళంబులు నలఁగెను జి,త్రాలయములుఁ బొదరుటిండ్లు ♦ లశ్మగృహంబుల్ గూలెను వ్రీలెను దూలెను, నేలను గడుఘోర మగుచు ♦ నేత్రంబులకున్. ౧౧౯

అర్థములు. వ్యాళంబులు=పాములు, అశ్మగృహంబుల్ = ఱాతియిండ్లు.

తా త్ప ర్య ము.

చెట్లుపడుటచే వానిసందునఁ బడి పాములు నలఁగిచచ్చెను. చిత్రగృహములు నేలఁగూలెను. పొదరుటిండ్లు వ్రీలిపడెను. ఱాతియిండ్లు నేలఁదూలిపడెను. ఇదం తయుఁ జూచుటకు ఘోరముగ నుండెను.

క. దనుజేశప్రమదావన, మును బ్రమదావనము మూలముట్టుగ నాశం బొనరిచి యలరుచుఁ గలనికి, హనుమంతుఁడు తోరణాగ్ర♦మందు వసించెన్.

అర్థములు. దనుజేశ = రావణుని, ప్రమదా + అవనమును = స్త్రీలకు సంతోషకరమైన భోగస్థానము, ప్రమదావనము=ఉద్యానవనము; మూలముట్టుగ= మొదలంట, అలరుచున్=సంతోషించుచు; కలనికిన్=యుద్ధమునకుఁగాను; తోర ణాగ్రమందు = ఆ వనము తలవాకిటి మీఁద.

తా త్ప ర్య ము.

రావణాసురుని భార్యలకు భోగస్థానమైన యుద్యానవనమును మొదలుముట్ట నాశము చేసి, సంతోషించి యుద్ధమున కెదురు చూచుచు నాఁతోట తలవాకిటి మీఁద గూర్చుండెను.

—♦౪౭వ సర్గము. రాక్షసస్త్రీలు హనుమంతువృత్తాంతము సీతాదేవి నడుగుట♦—

క. పక్షులబహుళారవమున, వృక్షంబులు గూలుధ్వనుల ♦ వెఱఁగొని లంకన్ రాక్షసులందఱు దిగ్భ్రమ,వీక్షించిరి యొకరిమొగము ♦ వేఱొకరంతన్. ౧౧౯

అర్థములు. బహుళ + ఆరవము = విస్తారధ్వని.

తా త్ప ర్య ము.

ఆకాశమునకు గుంపులు గుంపులుగ నెగిరి కూయు పక్షుల ధ్వనులచేతను, దభాలు దభాలని పడుచున్న చెట్ల చప్పుడులచేతను లంకలోనుండు రాక్షసు లందఱు భయపడి దిక్కుతోఁపక, యది యేమైనది తెలియక యొకరి ముఖము నొకరు చూచుచుండిరి.

ఉ. క్రూరనిమిత్తముల్ దెలుపు ♦ కూఁతలు పెట్టుచుఁ బాఱెఁ బక్షులున్ గ్రూరమృగంబు లాదిగ ది ♦ గుల్ పడి మేల్కని రాక్షసాంగనల్ ఘోరతరాకృతిన్ వెలయు ♦ క్రోఁతిని బొడగు చున్న నిష్కుటం బారసి చూచె వేగ జన ♦ కాత్మజఁ జేరఁగఁ బాఱుచుండఁగన్. ౧౦౨౦

అర్థములు. క్రూరనిమిత్తముల్ = చెఱపు దెలుపు శకునములు, ఘోర తరాకృతిని=మిగుల భయంకరమైన యాకారముతో, నిష్కుటము = ఉద్యాన వనము.

తా త్ప ర్య ము .

కీడును దెలుపుధ్వనులుచేయుచుఁ బక్షులు, క్రూరమృగములుపరువెత్తెను. కావలికత్తెలై నిద్రపోవుచున్న రాక్షసస్త్రీలు భయపడిలేచి భయంకరాకారముగల క్రోఁతినిజూచి, సీత యేమైపోయెనో యని యామె యొద్దకుఁ బరువెత్తిరి.

క. ఆరాకాసులు బెదరఁగఁ, గ్రూరము భయదంబునైన ♦ రూపముఁ గొనె న
మ్మారుతి యాతని భయదా, కారు మహాబలునిఁజూచి ♦ క్షోణిసుతతోఁ దర్క.

తా త్ప ర్య ము .

ఆ రాక్షసస్త్రీలు భయపడునట్లు ఘోరమై, భయంకరమైన రూపమును హనుమంతుఁడు ధరించెను. ఆ భయంకరాకారము గల యా మహాబలవంతు హనుమంతుని జూచి వారు సీతాదేవితో నిట్లనిరి.

ఉ. ఎవ్వఁడె వీఁడు సీత? యిట ♦ కేరి నిమిత్తము వచ్చినాఁడె; వీఁ
డెవ్వరివాఁడె? నీ వతఁడు ♦ నేమియొ ముచ్చట లాడుచుంటిరే?
నివ్వెఱ పొందఁ బోకు తరు ♦ ణీ! భయకారణ మేమి లేదు, నీ
కి వ్వనచారి యిందనుక ♦ నే మని చెప్పెను జెప్పవే యనఁ. ౧౦౨౨

తా త్ప ర్య ము .

సీతా! వీఁడెవ్వఁడే? ఎవరి కోసర మిచ్చటికి వచ్చినాఁడే? ఎవ్వరివాఁడెవీఁడు? నీవు, వీఁడు ముచ్చట లేవియొ యాడుచుంటిరే, అదియేమె? భయపడవలదు. నీకు రాఁగల భయమేమియు లేదు. ఇంతవఱకు నీ క్రోఁతి నీ కేమి చెప్పెనో చెప్పుము. అని యడుగఁగా.

ఉ. మీ మటుమాయపుం బనులు ♦ మీకె యెఱుంగఁగఁ జెల్లుఁగాక నా
కేమెయిఁ దోఁచు రాక్షసుల ♦ కృత్యము లెల్ల యథార్థరీతిగా,
బాముల కాళ్ళు పాములకుఁ ♦ బాటిలుఁ గాదె యెఱుంగ, నెవ్వఁడో
కోఁతి, మది నాకునుం గలఁగెఁ ♦ గ్రూరనిశాటుఁడు కామరూపియై. ౧౦౨౩

అర్థములు. మటుమాయము = మాయము + మాయము = మటుమాయము = మిక్కిలి మోసము. ఏమెయిన్ = ఏవిధముగ, క్రూరనిశాటుఁడు = భయంకరుఁ డగు రాక్షసుఁడు, కామరూపియై = కోరిన క్రోఁతిరూపము ధరించిన వాఁడై, అలంకారము— ఛేకోక్తి, ''ఛేకోక్తిర్యత్రలోకోక్తిస్స్యాదర్థాంతరగర్భితా! భుజంగ ఏవజానీతే భుజంగ చరణంసఖే'' చంద్రాలోకములోని వాడుకలో నున్న సామెతనే యర్థాంతరము గలదిగాఁ జెప్పిన ఛేకోక్తియగును. పాముల కాళ్ళు పాములకే తెలియు ననఁగా నిచట మోసగాండ్ర రహస్యకృత్యములు మోసగాండ్రకే

తెలియును. రాక్షస కృత్యములు రాక్షసులగు మీకే తెలియవలయు నని భావము.

తాత్పర్యము.

పాముల కాళ్ళజాడ పాములకుఁ గదా తెలియును. అట్లే రాక్షసుల మాయలు రాక్షసులైన మీకుఁ దెలియును గాని నాకెట్లు తెలియును. నాకుఁగూడ మనస్సు కలవర పడుచున్నది. ఏ రాక్షసుఁడే మాయరూపము ధరించెనో.

ఇచ్చట సీతాదేవి యసత్యము చెప్పె ననుట నిర్వివాద విషయము. సీతాదేవి వంటిది యెట్లసత్యమాడ సాహసించెను. అసత్యదోష మామెకుఁ గలదా, లేదా యని విచార్యము. ఎట్టిది సత్య మెట్టిది యసత్య మను విషయము పూర్ణముగఁ జర్చింప గ్రంథవిస్తర భీతి బాధించెడిని గావున సారాంశము దెలుపఁబడును. ప్రతి మనుష్యుఁడు నిత్యము ననుష్ఠింపవలసిన యమము లందు ముఖ్యమైనవి యైదు. అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము. తక్కిన నాలుగింటికి అహింస తల్లి, సత్యాదులు దానిబిడ్డలు. వేదసమ్మతములైన స్మృతీతిహాసపురాణ వాక్యము లెట్లు ప్రమాణములో, వేద విరుద్ధ స్మృతీతిహాస పురాణవాక్యము లెట్లప్రమాణములో యట్లు లే అహింస ననుసరించిన సత్యాదులు గ్రాహ్యములు. తద్విరుద్ధములు త్యాజ్యములు. మన సత్యమువలన నిరపరాధికి నిష్కారణముగ హింస కలుగు నట్లుండిన నట్టి సత్యము చెప్పరాదు. అసత్యమే చెప్పవలెను. దొంగతనము చేయక పోవుటచేఁ దనప్రాణము పోవునట్లుండు సమయంబున విశ్వామిత్రునివలె దొంగిలించి ప్రాణరక్షణము చేసికొనుటతప్పుగాదు. ఋతుకాలమందుఁ దనభార్యతో సంగమింప వలసిన పురుషుఁడు నిష్కారణముగ మాని భార్యకు మనః సంకటము కలిగించెనేని వాఁడు స్త్రీ హింస చేసినవాఁడే. కామక్రోధములకు దాసుఁడై యుధిష్ఠిరుని వలె నసత్యమాడుట దోషము. ధనార్జనమునకై దొంగిలించుట దోషము.

శూద్రవిట్క్షత్ర విప్రాణాం, యత్రర్తోక్తౌ భవే ద్వధః
తత్ర వక్తవ్య మనృతం, తద్ధి సత్యా ద్విశిష్యతే॥ మను. ౮-౧౦౪.

సత్యము చెప్పిన యెడల నిష్కారణముగ నిరపరాధులగు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రులకు వధము సంప్రాప్తమగు నేని యప్పు డసత్యమే చెప్పవలయును. అది సత్యమున కంటె శ్రేష్ఠ మైనది.

'న నర్మ యుక్తం వచనం హినస్తి, న స్త్రీషు రాజన్ నవివాహకాలే
ప్రాణాత్యయే సర్వ ధనాపహారే పంచానృతా న్యాహు రపాతకాని.'
భారతము.

వివాహకాలే రతి సంప్రయోగే, ప్రాణాత్యయే సర్వ ధనాపహారే
మిత్రస్య చార్థేఽప్యనృతం వదేయుః పంచానృతా న్యాహు రపాతకాని॥"

దురుద్దేశము లేని హాస్యమునందును, స్త్రీల విషయమునందును; వివాహ కాలమందును, ప్రాణాపాయము సంభవించునపుడును, తనసర్వధన మపహృత మగు

నపుడును స్త్రీయెడువిషయంబుల నసత్యమాడుట వలనఁ బాపములేదు. సత్యమాడి నచో హానికరమనితోఁచిన నసత్యమాడ వచ్చునేకాని యసత్యమే యాడవలయు నను నిర్బంధము లేదు.

హనుమంతుఁడు సీతాదేవికిఁ బ్రత్యుపకారమపేక్షింపని యుపకారి. గౌరవ మిత్రుఁడు నిరపరాధి-అట్టివానికి సత్యమాడుటచే నిష్కారణముగ హింస కలుగు నేని, సీతాదేవికిఁ బాపమువచ్చునేకాని సత్యమాడిన ఫలమురాదు. సత్యము చెప్పుటచేఁదనకును, బ్రాణాపాయముకలదనిభయపడెను. కావుననామెయసత్యము నకు నసత్యఫలము లేదు.

ఈ విధముగ రామచంద్రమూర్తియు (అయోధ్య ౧౧-౨౩) సుగ్రీవుఁడు హనుమంతుఁడు నసత్య మాడినవారే.

—♦ రాక్షసస్త్రీలశోకవనంబు పాడగుట రావణునకుఁ దెలుపుట. ♦—

సీ. ఏతెంచెనో? యన ♦ సీతోక్తులను విని, భయపడి కొందఱు ♦ పాఱి రందు
నిలిచిరి కొందఱు ♦ నెవ్వడి నసురాధి, పతికిని దెలుపంగ ♦ సతులు గొంద
ఱరిగి రావణుఁ గాంచి ♦ యవధారు దైత్యేశ! వికట వానరరూపి ♦ వీరుఁడొకఁడు
జనకజతోఁడుతఁ ♦ జనవున ముచ్చటలాడి యశోకవ ♦ నాంతరమున

ఆ. నిలిచియున్నవాఁడ ♦ నిర్జరనాథుని, దూతయో కుబేరు ♦ దూత యొక్కొ-
సీత నెమకుపొంటె ♦ శ్రీరాముఁ డంపిన, దూతుఁడేయొ తెలియ ♦ దుర్ఘటంబు.

అర్థములు. నెవ్వడి = నెఱ+వడి = మిగుల వేగముగ, అవధారు = అవ ధారు-దీనికి వినుము అర్థమనియు 'అవధారణమ్' ప్రకృతి యనియు సీతారామా చార్యులవారు 'అవధారయ' (చిత్తగింపుము) 'అవధారయతు' (చిత్తగించునుగాక) అను సంస్కృతక్రియాపదములకుఁ గ్రమముగా 'అవధారసు-అవధార అని ప్రాకృత రూపములు. రెండవది రూపమునను, దొలిది యర్థమునను "అవధారునకు" చేర్పుగా నున్నవి. రెండవదియే యిట్లు అర్థముతోఁ గూడి మాటి యుండును. (సర్వంకష వ్యాఖ్య - శృంగార నైష. ౮-౯౧)

తెనుఁగునందు వర్గయుక్కులులేవు. అయినను అవధారు - వసనాభి - జఱభి యను మూఁడు పదములందు వర్గయుక్కులు గాన నయ్యెడి.

తాత్పర్యము.

రాక్షసస్త్రీలుసీతాదేవి చెప్పిన యామాటలను విని కొందఱుభయపడి పఱు వెత్తిరి. కొందఱందేనిలిచిరి.కొందఱుమిగులవేగముగ రావణాసురునికిఁదెలుపఁబోయి రావణుఁ గాంచి రాజా! చిత్తగింపుము. భయంకరమైన వానరరూపము గల వీరు డొకఁడు సీతతో మచ్చికగా ముచ్చటలాడి యశోకవనము నందున్నవాఁడు, వాఁ డింద్రుని దూతయో, కుబేరునిదూతయో సీతను వెదకుటకొఱకువచ్చిన శ్రీరాముఁ దూతయో తెలిసికొన శక్యము గాకున్నది.

క. అమ్మా! యెవఁ డీకపి యని, యొమ్మను మే మెంత వేఁడు♦కొన్నఁ గ మాతో
నమ్మహిజ యెఱుఁగ నంచును, మమ్మం గికురించెమాయ♦మాటల చేతన్ ౧౦౨౫

అర్థములు. కికురించెన్ = మోసగించెను.

తా త్ప ర్య ము.

స్పష్టము.

ఉ. పోలఁక భీమరూపుఁ గొని♦పొంగుచు నీ ప్రమదావనంబు ని
ర్మూలముఁ జేసి క్రోఁతి మృగ♦మోహనపక్షివితానసల్లతా
జాల నగాళి రూపు చెడ♦సర్వముఁ బాడొనరించెఁ గాని తా
నేలొకొ తాఁకకుండెడు మ♦హీజ వసించు ప్రదేశ మొక్కఁడున్. ౧౦౨౬

అర్థములు. మృగ = మృగముల యొక్కయు, మోహనపక్షివితాన = అందమైన పక్షి సమూహములయు, సల్లతాజాల = మంచి తీఁగ గుంపులయు, నగ = చెట్లయొక్క, ఆళిన్ = పంక్తులను.

తా త్ప ర్య ము.

రౌద్రాకారము వహించి విజృంభించి నీ ప్రమదావనము నంతయు నిర్మూలము చేసి యాక్రోఁతి మృగములను, పక్షులను, దీఁగలను చెట్లను స్వరూపనాశము చేసెనుగాని, సీతాదేవియుండు ప్రదేశమును మాత్రము దాఁకినవాఁడు కాఁడు.

ఉ. ఆ సతిరక్షణార్థమొ ప్ర♦యాసముచేతనొ ధారిణీసుతా
వాసతలంబునై కుసుమ♦వారసమంచిత మైన శింశుపన్
గాసి యొనర్పఁబోఁడు, కనఁ♦గా శ్రమ మెక్కడి దయ్య వానికిన్?
భూసుతసౌఖ్యముం దలఁచి♦పోలుఁ జుమీ యది ద్రుంప కుండుటల్. ౧౦౨౭

అర్థములు. కుసుమ వార సమంచితము = పూలగుంపులచే నందమైన.

తా త్ప ర్య ము.

సీతాదేవికి రక్షణముగా నుండవలయుననియో లేక చెట్ల నన్ని ద్రుంచిన బడలిక చేతనో సీతాదేవి యుండు నశోకవృక్షమును విఱుఁగఁదన్నినవాఁడు కాఁడు. వాని కెక్కడిదయ్యా శ్రమము? సీతాసౌఖ్యము కొఱకే దానిని నిల్పియుండవలెను

క. నీవనముఁ జెఱిచినందున, కా వనితం బల్కరించి ♦ నందునకును ర
క్షోవర! వానరవరునకుఁ, గావింపుము కఠినశిక్ష ♦ కానర మడఁగన్. ౧౦౨౮

అర్థములు. చెఱిచినందునకు = చెఱిచిన దానికై – అందు. ఇది ప్రత్యయముగాదు. క్రియయుఁగాదు. అవ్యయ మని యొక నిఘంటుకారుఁడు వ్రాసియున్నాఁడు. అట్లన్నను–ఎల్ల శబ్దమునకు వలెదీనిపై అందుచేత అందులోపల అందునకు నను ప్రత్యయములతోఁడఁ గలిసి యావలికవుల ప్రయోగములందుఁ గానఁబడుచున్నది. ఉకారాంతము గావున షష్ఠీకువర్ణకమునకు ముందు నకారాగమము ప్రాప్తించెను. ఇట్టిది కవిత్రయప్రయోగములందు లేదు. ప్రదేశార్థకమైనపుడు

లకారాగమము కానయ్యెడి, 'అందులకు ధరణిఁగల నృపనందను' లని భారత ప్రయోగము కలదు.

తా త్ప ర్య ము.

నీ వనము పాడుచేసిన దానికిని, సీతను బలుకరించిన దానికిని క్రోఁతివానికి వాని ప్రాణ మడఁగునట్లు కఠిన దండము గావింపుము.

క. నీ వలచి యున్న చేడియ,తో వాసవమథన! పలికి ♦ తోడన మెయితోఁ
బోవచ్చునె యెవఁడే? ననఁ,గా విని మండిపడెఁ బంక్తి♦కంఠుఁడు కినుకన్. ౧౦౨౯

తా త్ప ర్య ము.

నీవు కోరియుండు నాఁడుదానితో మఱియొక పురుషుఁడు వచ్చి మాటలాడి యెవఁడైనఁగాని దేహముతో నుండవచ్చునా? యని చెప్పఁగా విని కోపముచే రావణుఁడు మండిపడెను.

—♦ రావణుఁడు హనుమంతునిమీఁదికి గింకరులఁ బంపుట. ♦—

క. కోపావర్తితనేత్రుం,డౌ పంక్తిగ్రీవుకనుల ♦ నశ్రులు రాలెన్
దీపంబునుండి మండుచుఁ, బై పయిఁ బడు తైలబిందు♦పటలం బనగన్, ౧౦౩౦

అర్థములు. కోపావర్తిత నేత్రుండు = కోపముచేఁ దిరుగుచున్న కన్నులు గలవాఁడు. పటలము = సమూహము.

తా త్ప ర్య ము.

కోపముచే గిరగిర దిరుగు గ్రుడ్లు కలవాఁడైన రావణుని కన్నులనుండి దీపము నుండి మండుచు మీాద మీాఁదఁ బడు చమురు బొట్లవలె నీళ్లు రాలెను.

మ. తనతోఁ దుల్యులఁ గింకరాఖ్యుల మహా♦దర్పాంధులన్ వాయునం
దనుఁ బట్టన్ దితిజాధినేత పనుపన్ ♦ వా రుగ్రులై కూటసా
ధనఖడ్గాదికహస్తులై వెస మహా♦దంష్ట్రాకరాళోదర
స్వనరూపద్రవిణంబు లొప్పఁ గపిపై ♦ సంగ్రామలోలాత్ములై. ౧౦౩౧

అర్థములు. దర్పాంధులన్ = బలగర్వముచేఁ గన్నులు దెలియని వారిని, కూటము=సమ్మెటవంటి యాయుధము. మహాదంష్ట్రా కరాళ= పెద్దకోఱలు, మిట్ట పండ్లు, ఉదర = కడుపు–స్వన = ధ్వని–రూప = ఆకారము – ద్రవిణంబు = బలము– సంగ్రామలోలాత్ములై = యుద్ధమునం దాసక్తి గలవారై, తాను స్త్రీలతో విహారించు నుద్యానము పాడైన దని విని చూడనైన రావణుఁడు వచ్చునని హనుమంతుఁడు తలఁచెనుగాని యొకఁడు సముద్రము దాఁటి లంకలోఁ బ్రవేశించి యంతఃపురముఁ జొచ్చి సీతతో మాటలాడి యుద్యాన వనము పాడుచెసెనని వినఁగానే యిది రామ పక్షమువారి గొప్ప యుద్ధ ప్రయత్నమునకు సూచనగాఁ దలఁచి రావణుఁడు తాను బోక సేనలను బంపెను.

తా త్ప ర్య ము .

తనతో సమానులైనవారిని కింకరులను పేరుగల వారిని మహాగర్వముచేఁ గన్నులు గానని వారిని, జూచి మీరు పోయి యాక్రోఁతిని బట్టుకొని రండని పంపఁగా వారు కూటములు ఖడ్గములు లోనగు నాయుధములు దీసికొని పెద్దకోఱలు మిట్టపండ్లు – కడుపులు – కంఠధ్వనులు – ఆకారములు బలము గలవారై యుద్ధ కాంక్షచే.

చ. ఎనుబది వేల దైత్యవరు ♦ లేకముఖంబుగఁ దోరణస్థితుఁ
హనుమను డాసి కాంచనక ♦ నత్పరిఘోగ్రకృపాణదీప్తనో
పనిచయశూలముద్గరసు ♦ పట్టిసతోమరశక్తితాడితాం
గునిఁగ నొనర్ప నాతఁడును ♦ గొండవలెఁ మెయి పెంచి క్రుద్ధుఁడై. ౧౦౩౨

అర్థములు. కాంచన కనల్ = బంగారుతోఁ బ్రకాశించు.

తా త్ప ర్య ము .

ఎనుబదివేలమంది రాక్షసు లొక్క-ముఖముగా వచ్చి తోఁటద్వారము మీఁద నున్న హనుమంతునిపైఁబడి బంగారుతోఁ బ్రకాశించు గండ్రగొడ్డండ్లతో, కత్తులతో మండుచున్న బాణసమూహములతో శూలములతో ఇనుప గుదియలతో అడకత్తులతో చిల్లకోలలతో శక్తులచేఁ గొట్టఁగా నాయనయుఁ గోపించి కొండవలె దేహము పెంచి.

—♦ హనుమంతుని జయఘోషము. ♦—

తే. వాల మల్లార్చి జాడించి ♦ వసుధ మోఁది, యార్భటించిన నా గర్జ ♦ కఖిలపురము
నిండి మార్మ్రోసెఁ బక్షులు ♦ నింగికెగరి, గుండెలగలంగ ధారిణిఁ ♦ గూలెనపుడు.

అర్థములు. అల్లార్చి = ఆడించి, మోఁది = కొట్టి, ఆర్భటించినఁ = సింహనాదము చేయఁగా, మార్మ్రోసెఁ = ప్రతిధ్వనులిచ్చెను. నింగికిఁ = ఆకాశమునకు అగలంగఁ = పగులగా.

తా త్ప ర్య ము .

తోఁక యాడించి జాడించి నేలపైఁ గొట్టి సింహనాదము చేయఁగా నా ధ్వనికి లంకయంతయుఁ బ్రతిధ్వని యిచ్చెను. పక్షులాకాశమున కెగసి గుండెలు పగిలి నేలవడెను.

చ. జయము జయంబు రామునకు ♦ సారపరాక్రమధన్యమూర్తికిఁ
జయము జయంబు విద్విషద ♦ సహ్యతరస్వి సుమిత్రపట్టికిఁ
జయము జయంబు దాశరథి ♦ సంపరిపాలితుఁడౌ వలీముఖో
చ్చయపతి సూర్యపుత్రునకు ♦ సాహసవిక్రమకీర్తిశాలికిఁ. ౧౦౩౪

అర్థములు. సారపరాక్రమ ధన్యమూర్తికి = దృఢమైనపరాక్రమము చేధన్యమైన యాకారముగలవానికి-విద్విషత్ = శత్రువులకు, అసహ్య = సహింపరాని, తరస్వి = బల

శాలి-మత్వర్థీయమైన వినిచ్ ప్రత్యయము. మాయా-మేధా-స్రజ్ శబ్దములకును సకారాంత శబ్దములకును జేర్చబడును. పాణిని ౫-౨-౧౨౧. స్రగ్వి - మేధావి- మాయావి తరస్వి-మనస్వి-యశస్వి లోనైనవి. ''అస్మాయామేధాస్రజోవినిః'' అని తోత్రము. దాశరథి = రామలక్ష్మణులచే; సంపరిపాలితుఁడు = చక్కఁగాఁ బరిపాలింపఁ బడువాఁడు, కేవల పాలితుఁడుగాక - పరిపాలితుఁడుగాక సంపరిపాలితుఁడనుటచే సేవకులవలెఁగాక - బంధువులవలెఁగాక యిహపరంబుల రెంటను రామచంద్రుఁడు చక్కఁగానే లోపము లేక రక్షించువాఁడని యర్థము. వలీముఖోచ్చయపతి=వానర సమూహమునకుఁ బ్రభువు. సాహస విక్రమ కీర్తిశాలికిన్ = సాహసముచేతను, పరాక్రమముచేతను, కీర్తిచేతను బ్రకాశించువానికి.

తాత్పర్యము.

దృఢ పరాక్రమముచే ధన్యమైన రూపముగల శ్రీరామచంద్రమూర్తికిని, శత్రువులకు సహింపరాని బలముగల లక్ష్మణునకును, రామలక్ష్మణులచేఁ జక్కఁగా రక్షింపఁబడు వానరనాథుఁడై తెంపు, పరాక్రమము, కీర్తిగల సుగ్రీవునకు జయము కలుగును గాక, జయము కలుగును గాక.

ఉ. దాసుఁడ సర్వసద్గుణవి♦తానమనోహర రామమూర్తికిన్
గోసల దేశవల్లభున♦కున్ హతశత్రుఁడ వాయుపుత్రుఁడన్
నా సరి గారు సంగరము♦నన్ దశకంఠులు వేవు రేనియున్
వాసి యడంతు జాల ద్రుమ♦పాళుల నే హనుమత్సమాఖ్యుఁడన్. ౧౦౩౫

అర్థములు. సర్వ సద్గుణవితాన =సమస్త కళ్యాణగుణ సమూహముచే- మనోహర=మనస్సు నాకర్షించు - దాసుఁడన్ = కింకరుఁడను, ఇట్లు చెప్పుటచే నేను జీతముఁ గోరి, బత్తెముగోరి దాసుఁడఁగా లేదనియు, శ్రీరామమూర్తియందుఁ గల కళ్యాణగుణములు నామనస్సు నాకర్షించుటచే దాస్యము నా స్వరూపము గాన నాయనను సేవించు చున్నానవియు భావము. వేవురు=వేయిమంది-లక్ష్మణు వాక్యములు స్మరించునది. (కిష్కింధ. ౧౩౫ వ. ప)

తాత్పర్యము.

సమస్తకల్యాణ గుణములచే మనోహరుఁడు, కోసలదేశ ప్రభు వగు రామచంద్రమూర్తికి నేను దాసుఁడను. శత్రుసంహారకుఁ డగు వాయుకుమారుఁడను. హనుమంతుఁడను పేరుగలవాఁడను. వేయిమంది రావణులైనను యుద్ధమందునాతో సరిగారు. జాలచేతను చెట్లచేతను, శత్రువుల సంహరింతును.

ఈ రెండు పద్యముల మూలశ్లోకములు క్షుద్రప్రయోగముల నెల్ల హరించునని యనుభవజ్ఞులు, పెద్దలు చెప్పిరి. ఎవరైన నేదైన క్షుద్రశక్తిప్రయోగముచేసినారని భయపడు వారీ రెండు శ్లోకములను గొన్ని నాళ్ళు విడువక దినమంతయు జపించిరేని యాప్రయోగము చెడును. దుష్టస్వప్నములు వచ్చినను భయపడరాదు.

క. ధ్వంసంబుఁ జేసి లంకను, హింసించి సమస్తరాక్ష♦సేంద్రుల సీతా
హంసీయానకు మ్రొక్కి ప్రశంసితగతిం జనెద మిడుక♦సకలసురాదుల్. ౧౦౩౬

తాత్పర్యము.

లంకను ధ్వంసము చేసి రాక్షసుల నందఱ హింసించి సీతాదేవికి మ్రొక్కి రాక్షసు లేడ్చుచుండఁగాఁ గీర్తికరమైన విధమునఁ బోయెదను.

క. అనిఘోషించిన దనుజులు, మనమున బెగడొంది సంజ♦మబ్బన విరివిం
గొను కపిపై నృపు నానతి, ఘనసాధనచయము వృష్టి♦గాఁ గురియంగన్. ౧౦౩౭

అర్థములు. బెగడొంది=భయపడి, విరివింగొను=వెడలుపైన, వృష్టి=వర్షము.

తాత్పర్యము.

ఈ ప్రకారము ధ్వనింపఁగా రాక్షసులు భయపడి సంధ్యావేళ పెద్దదిగా వ్యాపించు మబ్బువలె దేహము పెంచి యున్న వానరుని మీఁద రాజాజ్ఞప్రకారము వర్షముగా నాయుధములు బ్రయోగించిరి.

'బెగడొంది రాజునాజ్ఞ' ననుటచే భయపడి పరువెత్తఁ దలఁచియు నూరక పోయిన రావణుఁడు చంపునే యని యుద్ధముచేయ సాహసించిరని భావము.

తే. తోరణాశ్రితమైయున్న♦దొడ్డయినుపగుదియఁ గైకొని పెనుఁబన్న♦గుని గ్రహించి
తిరుగుగరుడునిపోలికఁ♦దిరిగి తిరిగి, యసురబలముల నెస నుఱు♦మాడెఁ గవిసి.

అర్థములు. తోరణాశ్రితమైయున్న=తోఁట వాకిట నున్న, ఆ తలుపులు వేయునపుడు బిగించుటకై యుంచిన గ్రద్దగడియమ్రాను.

తాత్పర్యము.

ఉద్యానద్వారమునం దున్న పెద్ద యినుపగుదియను దీసికొని పెద్దపామును బట్టుకొని తిరుగు గరుత్మంతునివలెఁ దిరిగి తిరిగి యారాక్షసుల నెల్ల నుగ్గుగాఁ గొట్టెను.

క. కింకరకాండంబుల ననిఁ, బొంకం బడఁగించి యుద్ధ♦మునఁ బుట్టుతమిన్
శంకింపక రక్షోతిభ, యంకరుఁడై తోరణంబు♦నందుం జేరెన్. ౧౦౩౯

తాత్పర్యము.

ఈప్రకారము కింకర సమూహముల నెల్లఁజంపి యుద్ధమునందలి కోరికతో జంకక రాక్షసులకు భయంకరుఁడై తోరణమునందు మఱలఁబోయి కూర్చుండెను.

దీనివలన నొక్క రామకింకరు నెదుట వేలకొలఁది రావణ కింకరులు శుష్కవేదాంతిరాక్షసుల నిలువఁ జాలరని యేర్పడెను.

చ. హనుమకు నోడి బెగ్గడిలి ♦ ప్రాణభయంబునఁ బాఱి రాక్షసేం
ద్రుని గృహమందుఁ దూఱి నుడి ♦ తొట్రిలఁ జచ్చిరి సర్వకింకరుల్
దనుజవరేణ్య! యన్న విని ♦ దారుణరోషణభీషణుండు లో
చనములఁ ద్రిప్పి గిర్గిర న ♦ జయ్యనిఁ బంచెఁ బ్రహస్తపుత్రకున్. ౧౦౪౦

అర్థములు. ఓడి = పరాజయము నొంది, బెగ్గడిలి = భయపడి, నుడి తొట్రిల్లన్ = మాట తడఁబడ. అజయ్యున్ = జయింపశక్యముగాని వానిని.

తాత్పర్యము.

హనుమంతునిచేఁ బరాజితులై భయపడి యింక నుండినఁ జచ్చెద మను భయమునఁ బరువెత్తి రావణు నింటిలోఁ దూఱి మాటఁ దడఁబడ రావణా, యందఱు కింకరులు చచ్చిరయ్యా యనిన విని తీవ్రకోపముచే భయంకరుఁడై గ్రుడ్లు గిరగిర ద్రిప్పుచు ప్రహస్తుని కొడుకును జయింపరాని బలముగల వానిని బంపెను.

—♦ ౪౩-వ సర్గము. హనుమంతుఁడు ప్రాసాదమును విఱుగఁ దన్నుట. ♦—

ఉ. ఆ దనుజాళిఁ జంపి పవ♦నాత్మజుఁ డంతయుఁ బాఱఁ జూచి యే
లా దుము దుమ్ము చేసియు వి♦లాసవనంబును, ద్రుంప నైతిఁ బ్రా
సాద మటంచు నెంచి పెలు♦చం గనకాచలశృంగతుంగ మై
మాదిరి మీఱు నత్తలము ♦ మానక నల్లలనాడ దూఁకుచున్. ౧౦౪౧

తాత్పర్యము.

కింకరుల నందఱఁ జంపి హనుమంతుఁడు నాలుగు ప్రక్కలఁ బాఱఁజూచి యుద్యానవనమును దుమ్ము దుమ్ముగా నేలఁగలిపి, యేల యీ మేడను పడఁగొట్టనైతి నని తలఁచి కోపించి మేరుపర్వతశిఖరముతో సమానమైన యా ప్రదేశమందము చెడునట్టు లది యుఱ్ఱూత లూఁగునట్లు దానిపైకి దుమికెను.

క. ఎక్కె శిఖరంబుమీఁదను, నిక్కనఁ గూర్చుండి పా♦వనియు భాసిల్లెన్
దిక్కుల వెలుంగు తేజము, పెక్కువనుదితార్కమాఱు♦బింబంబగుచున్. ౧౦౪౨

అర్థములు. ఉదితార్కమాఱుబింబము = పుట్టిన సూర్యునికి ప్రతిబింబము. ఇట్లు చెప్పుటచే నిప్పుడు సూర్యోదయ మయ్యెనని సూచన. ప్రాసాదము = లంకాధిదేవతగుడి. చూచుటకు మేడవలె నుండుటచేఁ బ్రాసాద మనఁబడెను.

తాత్పర్యము.

ఆ మేడ శిఖరము మీఁద నిక్కి దిక్కుల వెలుఁగఁజేయు కాంతితో నుదయించిన సూర్య బింబమున కుద్దియై కూర్చుండెను.

క. ధ్వంసంబు చేసి సమరరిరంసువు ప్రాసాద మెల్ల ♦ రాజిల్లె బలి
ష్ఠాంసములు వెలుఁగ సురలు ప్రశంసింపఁగఁ బారియాత్ర♦శైలాకృతియై.

అర్థములు. సమరరిరంసువు = యుద్ధక్రీడయం దాసక్తిగలవాఁడు, బలిష్ఠాంసములు = బలముగల మూఁపులు; పారియాత్రశైలాకృతియై = పారియాత్ర పర్వతము వలె.

తాత్పర్యము.

యుద్ధమునఁ గ్రీడించు కోరిక గల హనుమంతుఁడు మేడయంతయు విఱుగఁ దన్ని దేవతలు స్తోత్రము చేయుచుండఁ బారియాత్రపర్వతమువలె బలముగల మూఁపులతోఁ బ్రకాశించెను.

క. దుర్భరరవరయము శ్రవో, గర్భంబులు చీల్ప నసుర♦కాండములకుఁ బ్రా
విర్భూతామర్షంబున, నార్భటి యొనరించె రక్ష♦కావళి స్రుక్కన్. ౧౦४४

అర్థములు. దుర్భర రవరయము = అధిక మైన ధ్వనియొక్క వేగము; శ్రవో గర్భంబులు = చెవులగూబలు; కాండములకున్ = సమూహములకు, ప్రావిర్భూతామర్షంబునన్ = మిక్కిలి పుట్టిన రోషము, ఆర్భటిన్ = సింహనాదము, రక్షకావళి = కావలివాండ్ర సమూహము.

తా త్ప ర్య ము.

సహింపరాని ధ్వనివేగము రాక్షస సమూహముల చెవుల గూబలు పగులఁ దీయఁగా మిగులఁ గోపంబున రాక్షసులు మూర్ఛపోవునట్లు సింహనాదము చేసెను.

చ. జయము జయంబు రామునకు ♦ సర్వమహాస్త్రవిదగ్రవర్తికిన్
జయము జయంబు విద్విషద♦సహ్యతరస్వి సుమిత్రపట్టికిన్
జయము జయంబు దాశరథి♦సంపరిపాలితుఁ డౌ వలీముఖో
చ్చయపతి సూర్యపుత్రునకు ♦ సాహసవిక్రమకీర్తిశాలికిన్. ౧౦४౫

అర్థములు. సర్వమహాస్త్ర విదగ్రవర్తికిన్ = అన్ని మహాస్త్రములను దెలిసిన వారిలో శ్రేష్ఠునికి.

తా త్ప ర్య ము.

౧౦3४ ప. చూచునది.

ఉ. దాసుఁడ సర్వసద్గుణవి♦తానమనోహర రామమూర్తికిన్
గోసలదేశవల్లభున♦కున్ హతశత్రుఁడ వాయుపుత్రుఁడన్
నా సరి గారు సంగరము♦నన్ దశకంఠులు వేవు రేనియున్
వాసి యడంతు తాల ద్రుమ♦పాళుల నే హనుమత్సమాఖ్యుఁడన్.

తా త్ప ర్య ము.

౧౦3౫ ప. ప. చూచునది.

క. ధ్వంసంబుఁ జేసి లంకను, హింసించి సమస్తరాక్ష♦సేంద్రుల సీతా
హంసీయానకు మ్రొక్కి ప్రశంసితగతిఁ జనెద మిదుక ♦ సకలసురారుల్. ౧౦४౬

తా త్ప ర్య ము.

౧౦3౬ వ. ప. చూచునది.

—♦ హనుమంతుఁడు చైత్యపాలకులఁ జంపుట ♦—

మ. అని గర్జింపఁగఁ జైత్యపాలకశతం ♦ బా నాద మాలించి హ్యూ
జ్జనితామర్షము పేర్మిఁ జుట్టుకొని శ♦స్త్రప్రాసకుంతాదులన్
హనుమంతు న్వడి నొంప గంగ సుడిగుం♦డంబో యనం గ్రాలె నా
దనుజస్తోమము కేశవర్యుఁడును రౌ♦ద్రస్ఫూర్తి సాటోపుఁ డై. ౧౦४౭

అర్థములు. చైత్యపాలక శతంబు = దేవత గుడిని రక్షించు కావలి వారి గుంపు. హృత్ + జనిత + అమర్షము = హృదయమునందుఁ బుట్టినకోపము - ప్రాసము = ఈఁటె; కుంతము = ఈఁటె; ఈ రెంటికిని నాకారమునందుఁ గొంచెము భేదము. సాటోపుఁడై = ఆటోపముతోఁ గూడినవాఁడై.

తాత్పర్యము.

అని సింహనాదముచేయఁగా నా దేవాలయము కావలివారిగుంపు ఆధ్వని విని కోపాతిశయమునఁ జుట్టుముట్టుకొని యీఁటెలచేతను, ఇతర సాధనములచేతను హనుమంతుని నొప్పింప నపుడు ఆరాక్షసులగుంపు గంగయందలిసుడిగుండములవలె నుండెను. వానరేంద్రుఁడును ఆటోపముతోఁ గూడినవాఁడై, భయంకరుఁడై.

సీ. ప్రాసాదమునను స్తం♦భంబును బెకలించి, గిర గిర మన చూడ్కి♦కిని నగోచ
రముగ వేవిధముల♦రభసంబునను ద్రిప్పఁ, దజ్జాతశిఖిశిఖో♦త్కరము గవిసి
ప్రాసాద మెల్లను♦భస్మంబుఁ గావించె, వాయుసూనుండు దై♦తేయశతముఁ
గాలుని పురి కన్చి♦గగనంబునకు దాఁటి, యి ట్లను బిగ్గర♦నెల్ల వినఁగ
తే. వినుఁడు నావంటివారలు♦వేలకొలఁదు, లవని వర్తించు చున్నార♦లవనిజాత
నెమక సుగ్రీవవశవర్తు♦లమితబలులు, వానరేంద్రులు లంకాని♦వాసులార!

అర్థములు, రభసంబునను = వేగముగ, తజ్జాత = ఆ త్రిప్పుడు చేతఁ బుట్టిన, శిఖిశిఖోత్కరము = అగ్నిజ్వాలల సమూహము, ప్రాసాద మెల్లను = ఎల్లప్రాసాదమును, ఎల్ల శబ్దము ద్రుతాంతమైన యవ్యయము.

తాత్పర్యము.

ఇదివఱకుఁ బట్టియుండిన గుదియ చిన్నదని తోఁచుటచే దేవళమందలిధ్వజ స్తంభమునుబీఁకి కన్నులకుఁ గానరాకుండునట్లు వేయిమార్లు గిరగిర ద్రిప్పఁగా నా వేఁడిమి కుదయించిన యగ్నిజ్వాలలా దేవాలయమును భస్మము గావించెను. అంతట దాని కావలి రాక్షసులఁ జంపి యాకాశమున కెగిరి యందఱువినునట్లు గట్టిగా నిట్లనియె. ఓలంకా నివాసులారా! వినుఁడు. నావంటివారు వేలకొలఁదులు వానరులు సుగ్రీవునకు లోఁబడి మహా బలము గలవారు సీతాదేవిని వెదకు చున్నారు.

సీ. పదియేనుఁగులపాటి♦బలియురు కొందఱు, కొందఱు నూ ఱేనుఁ♦గుల బలంబు
దనరినవా రిభ♦దశశతబలయుతుల్, కొందఱు వాయువే♦గులును గలరు
అప్రమేయబలాఢ్యు♦లర్కజుకడ నిట్టి దంతనఖాశ్మసా♦ధనులఁ గపుల
నూఱులు వేలును♦నూఱువేల్ కోట్లును, బదికోట్లు నెన్నంగఁ♦బాటిగాని
తే. వారిఁ గొనివచ్చువానర♦వర్యుఁడౌన, మేయబలుఁడుసుగ్రీవుండు♦మిమ్ముఁజంపు
రామచంద్రునితోడ వై♦రమును గొంటి, రింక నెచ్చటి రావణుఁ♦డెచటిలంక?

అర్థములు. ఇభదశ శతబలయుతుల్ = వేయి యేనుఁగుల బలముగల

వారు, దంత - నఖ - అశ్మ సాధనుల్ = దంతములు గోళ్లు ఱాలు ఆయుధములుగఁ గలవారు.

తాత్పర్యము.

పది యేనుఁగుల బలము గలవారు కొందఱు, నూటేనుఁగుల బలముగలవారు కొందఱు, వెయ్యి యేనుఁగుల బలము గలవారు కొందఱు, వాయువేగముగలవారు కొందఱు, కొలది చెప్పరాని బలము గలవారు కొందఱునుసుగ్రీవు నొద్దనున్నారు. వీ రందఱు గోళ్లు దంతములు ఱాలు సాధనములుగఁ గలవారు. ఇట్టి కపులను నూర్లు-వేలును-లక్షలు-కోట్లు పదికోట్లు లెక్కింప సాధ్యముగాని వారినిఁ దీసికొని యమేయ బలుఁడు వానరరాజు సుగ్రీవుఁడు వచ్చును. మిమ్ముఁ జంపును. నిష్కారణముగ శ్రీరామచంద్రమూర్తితో విరోధించితిరి. ఇఁక రావణుఁ డెచ్చట. లంక యెచ్చట, మీ రెచ్చట? ఋణానుబంధము తీఱిన దని తలఁపుఁడు.

అంతఃపురమునకు వచ్చుచుండు వారికిఁ దప్పఁ దక్కిన వారికి సీత లంకలో నున్న దను వార్తయే తెలియదు. అంతయు రావణుఁడు రహస్యముగ నుంచెను.

—♦ ౪౪-వ సర్గము. హనుమంతుఁడు జంబుమాలిని వధించుట ♦—

ఉ. అంతట నేగుదెంచెను బ్ర♦హస్తసుతుం డగు జంబుమాలి దే
వాంతక చోదితుం డయి మ♦హారభసంబున రక్తమాల్యముల్
వింతగు రక్తవస్త్రములు ♦ లీలఁ గుండలముల్ ధరించి దు
ర్దాంతబలుండు వాసవశ♦రాసనతుల్యశరాసహస్తుఁడై. ౧౦౫౧

అర్థములు. దేవాంతక చోదితుండు=రావణుచే నాజ్ఞాపింపఁబడిన వాఁడు మహారభసంబునన్=మిగుల వేగముగ; వాసవ శరాసన తుల్య=ఇంద్రధనుస్సుతో సమానమైన, చాపహస్తుఁడై=వింటిని చేతియందుఁ గలవాఁడై.

తాత్పర్యము.

హనుమంతుఁ డీ కార్యము చేయుచుండఁగా రావణుచేఁ బ్రేరింపఁబడిన జంబుమాలి యనుప్రహస్తపుత్రుఁడు మిగులవేగముగ నెఱ్ఱనిపూలదండలు, నెఱ్ఱని వస్త్రములు, కుండలములు ధరించి యింద్రచాపమువంటి చాపము చేతఁబట్టుకొని మహాబలశాలి యగువాఁడు,

ఉ. సాయకమొండు గైకొని ది♦శావలయంబు వణంక జ్యాలతం
బాయక మీటుచున్ ఖరస♦మంచితమైన రథంబు నెక్కి తన్
డాయఁగ వచ్చువానిని ఘ♦నం బగు నాకృతివానిఁ గాంచి లో
వాయుజుఁ డుబ్బి యార్చె సుర♦వైరిసమూహము పిచ్చలింపఁగన్. ౧౦౫౨

అర్థములు. దిశావలయంబు=దిక్చక్రము, జ్యాలతన్=తీఁగవంటి నారిని, ఖరసమంచితము=కంచరగాడిదలఁ గట్టిన, పిచ్చలింపఁగన్=భయపడునట్లు.

తాత్పర్యము.

బాణ మొకటి చేతఁ దీసికొని దిక్చక్రము పగులునటుల ల్లెత్రాడు మీటుచుఁ గంచర గాడిదలు గట్టిన తేరెక్కి తన సమీపమునకు వచ్చు పెద్ద దేహము గలవానిని జూచి తగినవాఁడే వచ్చుచున్నాఁడని పొంగి రాక్షసులు భయ పడు నట్లు లార్చెను.

క. వానరవీరునిఁ గని యా, దానవవీరుండు బాణ♦దశకము వింటన్
బూనిచి బాహులఁ గ్రుచ్చుచుఁ నాననమునఁ దలను మార్గ♦ణావళి నాటెన్.

అర్థములు. మార్గణావళిన్ = బాణపంక్తులను.

తాత్పర్యము.

ఆ రాక్షసవీరుఁడు వానరవీరునిఁజూచి వింటఁ బది బాణములు సంధించి బాహువులఁ గ్రుచ్చుచు ముఖమునందుఁ,దలయందు బాణపంక్తులు నాటుకొన వేసెను.

బాహు యుద్ధముచేయువారిని బంపిన నాఁగ రని కింకిరవధచేఁ దెలిసికొని దూరమునుండి కొట్టువానిగా వింటి యుద్ధము చేయువానిని రావణుఁడు పంపెను.

క. శరనిహతముఖము రక్తని,కర బిందునిషిక్త మగుచు ♦ ఖరకరకిరణో
త్కరవికసితశరదాగమ, సరసీజాతంబు సొంపు ♦ సంపాదించెన్. ౧౦౫౪

అర్థములు. శరనిహత ముఖము = బాణములచేఁ గొట్టబడిన ముఖము - రక్తనికరబిందు = నెత్తుటి సమూహముయొక్క బొట్లచే, నిషిక్తము = తడిసినది, ఖరకర = సూర్యునియొక్క, కిరణోత్కర = కిరణసమూహములచే, వికసిత = వికసించిన, శరదాగమ = శరత్కాలమందలి, సరసీజాతంబు = కమలముయొక్క, సొంపు = అందము.

తాత్పర్యము.

బాణములచేఁ గొట్టఁబడిన హనుమంతుని ముఖము నెత్తుటి బొట్లచేఁ దడిసి సూర్యకిరణములచే వికసించిన శరత్కాలకమలమువలె నందమై యుండెను.

క. శోణిత మగు కపివదనము, శోణితబిందువులచేత ♦ శోభిలి మింటన్
శోణిత చందనబిందుల, రాణించెడి కోకనదము♦రాణఁ దలిర్చెన్. ౧౦౫౫

అర్థములు. శోణితము = ఎఱ్ఱనిది, శోణిత బిందువులచేత = రక్తబిందువులచే, శోణితచందన బిందులన్ = రక్తచందనపు బొట్లచే, కోకనదము = ఎఱ్ఱకమలము. అనుగుణాలంకారము. ఒక్క వస్తువునందున్న గుణమే మఱియొక వస్తుసన్నిధిచే నెక్కువైనట్లు చెప్పిన ననుగుణాలంకార మగును. యమునానది యందలినల్ల కలువ లన్నట్లు.

తాత్పర్యము.

ఎఱ్ఱని హనుమంతుని ముఖము ఎఱ్ఱని నెత్తుటి బొట్లచేత నాకాశమున నెఱ్ఱని చందనపు బొట్లుగల యెఱ్ఱతామరవలె నుండెను.

సీ. గోపాళితాఁకునఁ ♦ గోపించి మారుతి, డాపున నుండు బం♦డను నొకండు
గొని వైన వాఁడును ♦ దునుకలు గావించెఁ, బదిబాణముల దాని♦పాటుగాంచి
కపిసాల మొక్కండు ♦ గ్రక్కునఁ గైకొని, త్రిప్పంగ దానిని♦దితిజవరుఁడు
నాలుగుశరముల ♦ లీలమై ఖండించి, యేనిట భుజముల♦నేసి వక్ష
ఆ. మునను లొకటఁ బదిట♦ స్తనదేశమును గొట్ట, దీప్తబాణవిద్ధ♦దేహుఁ డగుచు
బరిఘ మదియ త్రిప్పి♦గిరగిర మసి వాని, ఱొమ్ము సూటి చూచి♦ఱువ్వ టయును.

అర్థములు. గోపాళి = బాణముల వరుస, సాలము = చెట్టు, ఏనిటన్ = ఐదుబాణములచే, బాణవిద్ధ = బాణములచే వేధింపఁబడు.

తాత్పర్యము.

బాణములు వరుసలుగఁ దాఁకుటచే హనుమంతుఁడు కోపించి సమీపమందున్న బండనెత్తి వానిమీఁద వైవఁగా వాఁడు దానిని బది బాణములచేఁ దునుకలు చేసెను. అది పడిపోవుట చూచి హనుమంతుఁడు చెట్టునొక్కటిపీఁకి గిరగిర త్రిప్పుచుండఁగా దానిని నాలుగు బాణముల నవలీలగా వాఁడు నఱకి; యైదు బాణముల భుజములను, నొక్క బాణముచే వక్షమును, పది బాణములచే స్తన ప్రదేశమును గొట్టఁగా మండుచున్న బాణములచే వేధింపఁబడిన దేహముగలవాఁడై మునుపటి యినుపకట్ల గుండు తీసికొని గిరగిర త్రిప్పి వాని ఱొమ్ము గురిచూచి విసరికొట్టెను.

క. తల యేదో చెయి యేదో, మొల యేదో చాప, మేదొ ♦ మోఁకాళ్ళేవో
తెలియక యుండఁగ దితిజుఁడు, నులినులియై నేలరాలె ♦ నుగ్గై సూచె.

తాత్పర్యము.

దాని దెబ్బచేత నిది తల, యిది మొల, యిది చేయి, యిది విల్లు, యిది మోఁకాళ్ళని గుర్తింపరాక యుండునట్లు వాఁడు పొడిపొడియై నుగ్గై నేలరాలెను.

క. స్యందనముతోడ ఘోటక, బృందముతోఁ బూనియున్న♦యిషుకాండముతో
నందములగు భూషలతో, గ్రుం దెను రక్కసుఁడు ముద్ద♦మాడ్కిగ నగుచున్.

అర్థములు. స్యందనముతోడన్ = తేరితో; ఘోటకబృందముతోన్ = గుఱ్ఱముల సమూహముతో; ఇక్కడఁ దేరికి గట్టిన కంచరగాడిద లని యర్థము. ఇషుకాండముతోన్ = బాణసమూహముతో; భూషలతోన్ = ఆభరణములతో.

తాత్పర్యము.

తేరితోడఁ, దేరికిఁ గట్టిన కంచరగాడిదలతోడ. వాఁడు సంధించిన బాణములతోడ, వాఁడు ధరించిన సొగసైన యాభరణములతోడ, రాక్షసుఁడు ముద్దగానై పడెను.

ఆ. జంబుమాలిపాటు♦చయ్యన హతశేష, కింకరాళి దెలుపఁ♦గింక రేఁగి
పంక్తికంఠుఁ డంతఁ♦బనిచె నమాత్యపు, త్రకుల శౌర్యగర్వ♦దర్పధనుల. ౧౦౫

అర్థములు. హతశేష కింకరాళి = చావఁగా మిగిలిన కింకరుల గుంపు,

కింకర్ = కోపముతో; అమాత్యపుత్రకుల్ = మంత్రికుమారులను, ఒక విలుకాఁడు హనుమంతుని సాధింపలేఁడని పెక్కురఁ బంపెను.

తా త్ప ర్య ము .

చంపఁబడఁగా మిగిలిన కింకరులు జంబుమాలి చచ్చె నని తెలుపఁగా రావణుఁడు కోపించి శౌర్యదర్పముల గొప్ప వారగు మంత్రిసుతులఁ బంపెను.

—♦ ౪౫-వ సర్గము. హనుమంతుఁడు మంత్రిపుత్రుల నేడ్వురఁ జంపుట. ♦—

సీ. సప్తార్చివర్చసుల్ ♦ సప్తసంఖ్యులు వారు, వెలువడి శరచాప♦వివిధసాధ
నంబులఁ గైకొని ♦ డంబుమీఱఁగఁ బరస్పరజయవాంఛు లై♦ భర్మజాల
కేతనమాలికా♦కీలితరథములు, నంబుదధ్వానంబు♦లట్లు మొరయఁ
జాప టంకృతుల ది♦శాభాగ మగలఁగఁ, గార్మేఘుంగుల యట్లు♦గ్రాలి చనఁగ
తే. వారితల్లులు కింకర♦వార్త వినుట, కొడుకు లే మగువార లో♦క్కో యటంచు
బాంధవాప్తసమేతు లై♦పల్లటిలిరి, సురవిరోధులు పవమాన♦సుతుని డాసి.

అర్థములు. సప్తార్చి వర్చసుల్ = అగ్నివంటి కాంతిగలవారు. సప్తార్చి వర్చసుల్ - శేషాద్విభాషా (పాణిని ౫-౪-౧౫౪) ప్రకారము కవర్ణాగమ మనిత్య మగుటచే నిచ్చట వర్చస్కులని చెప్పఁబడలేదు. పరస్పర జయ వాంఛులై = ఒకరినొకరు గెలువఁ గోరికఁగలవారై, ఒకరినిమించి యొకరు హనుమంతుఁ బట్టుకొను కోరిక గలవారై, భర్మజాల = బంగారు మయము లైన; కేతన మాలికా = ధ్వజముల వరుసలచే, కీలిత = కట్టఁబడిన. అగలఁగన్ = పగులఁగా; కార్మేఘుంగులు = తొలుకారు మెఱుఁగులు, పల్లటిలిరి = వ్యసనపడిరి.

తా త్ప ర్య ము .

అగ్నివలె మండువారేడ్వురు గృహంబులు వదలి విండ్లు, బాణములు తక్కిన సాధనములు తీసికొని యొకరిని మించి యొక్కరు జయము నొందవలయు నని కోరిక గలవారై బంగారు మయము లైన ధ్వజము లెత్తిన రథములు, మేఘము లుఱిమినట్లు ధ్వనింపఁగాఁ బోయిరి. వారి తల్లులు కింకరులవార్త విన్నవారగుటచే వీ రే మగుదురో యని చుట్ట పక్కములతో వ్యసన పడిరి. ఆ రాక్షసులు హనుమంతుని సమీపించి,

ఉ. స్యందనగర్జితస్వనము ♦ సాయక వృష్టియుఁ గ్రాల దేవతా
బృందవిరోధివారిధర ♦ మెంతయు మూఁగిన వాయుసూనుఁడున్
గొందలపాటు లేక యొక ♦ కొం డన నోర్చి చరించె మింట ని
ర్మందరయాన రాక్షసశ ♦ రంబులకున్ గుఱిగాక వేగి యై. ౧౦౬౧

అర్థములు. స్యందన గర్జితస్వనము = తేరులయొక్క ధ్వని యనెడి యుఱుముల ధ్వనియు, సాయకవృష్టియు = బాణముల వర్షమనెడి వర్షము, దేవతాబృంద

విరోధివారిధరము=రాక్షసులను మేఘము, రూపకాలంకారము. కొండలపాటు=కలఁతపడుట, కొండన=కొండయో యనునట్లు, ఉత్ప్రేక్షాలంకారము, నర్మందరయాన=మిగుల వేగముగా వచ్చెడి, వేగియై = వేగము గలవాఁడై.

తాత్పర్యము.

రథచక్రముల ధ్వని యుఱుములుగా, బాణప్రయోగము వర్షముగా రాక్షసులనెడి మేఘము గ్రమ్ముకొనఁగా హనుమంతుఁడు పర్వతమువలెఁ గలఁత పడక యతివేగముగ వచ్చు వారి బాణములకు గుఱిగాక వేగము గలవాఁడై యాకాశముననే తిరిగెను.

క. ఇంద్రశరాసనసంయుత,సాంద్రాంబుదపంక్తి కలఁచు♦శ్వసనుం డనఁగా
రుంద్రప్రతాపి కపియు న,తంద్రతఁ గోదండధరుల♦దైత్యులఁ గలఁచెన్. ౧౦౬౨

అర్థములు. ఇంద్రశరాసనసంయుత = ఇంద్రధనుస్సుతోఁ గూడిన, సాంద్ర+అంబుద పంక్తి = దట్టమైన మేఘపంక్తులను; కలఁచు = కలఁతపడునట్లు చేయు; శ్వసనుం డనఁగా = వాయువో యనునట్లు; రుంద్రప్రతాపి = ఘనమైనప్రతాపము గల; అతంద్రతన్ = హెచ్చరికతో.

తాత్పర్యము.

ఇంద్రధనుస్సుతోఁ గూడిన మేఘముల గుంపును వాయువు కలఁచునట్లు ఘనమైన ప్రతాపము గల హనుమంతుఁడు హెచ్చరిక గలవాఁడై రాక్షసులను సంక్షోభింపఁజేసెను.

క. కంఠారవ మారఁగఁ గపి,కంఠీరవ మపుడు గవిసి ♦ క్రవ్యాదవధో
త్కంఠుండై తలపదనఖ,కుంఠితములఁ జేసె నేలఁ ♦ గూల బలంబుల్. ౧౦౬౩

అర్థములు. కంఠ+ఆరవ = కంఠధ్వని; ఆరఁగన్ = అతిశయింపఁగా; కంఠీరవము = సింహము; క్రవ్యాదవధ = రాక్షసుల చంపుటయందు; ఉత్కంఠుఁడై = వేగిరపాటు గలవాఁడై; తల–పద–నఖ కుంఠితములన్ = అరచేత, కాల, గోళ్ళచే ధ్వంసమయిన వానిఁగా.

తాత్పర్యము.

పెద్ద సింహనాదము చేసి కపిసింహ మపుడు రాక్షసుల వధమందు వేగిరపాటు గలవాఁడై వీరితోడనా యింతసేపు యుద్ధమని తలఁచి యా సేనలను నరచేతులతోఁ గాళ్ళతోఁ గొట్టి, గోళ్ళతోఁ జీల్చివైచెను.

ఉ. కొందఱఁ గేల బాఁది, మఱి♦కొందఱ నేలను మోఁది, గ్రుద్దుచుం
గొందఱ, వెండి కొందఱను ♦గోళ్ళను జీల్చుచు, నట్టె తాఁకుచున్
గొందఱ గుండువోలె, నొక♦కొందఱ దిర్దిర ద్రిప్పి వైచుచున్
గొందల మందఁ గూల్చె రిపు♦కోటి ననాటవిభుం డుదగ్రుఁడై. ౧౦౬౪

అర్థములు. కేలన్ బాది = చేతితోఁ గొట్టి; మోఁది=కాళ్ళు పట్టుకొని తల నేలకు వ్రేసికొట్టి; వనాట విభుండు = వానరశ్రేష్ఠుఁడు.

తా త్ప ర్య ము.

స్పష్టము.

తే. చెవులు బీఁటలువాఱఁగ ♦ సింహనాద, మొనరఁ జేయఁగ మరికొంద ♦ ఱుర్విఁ గూలఁ
గాక తక్కురు వెఱచి చీ ♦ కాకుపడుచుఁ, బోయినదె పోకగాఁ బాఱి ♦ పోయిరంత.

అర్థములు. బీఁటలు=పగుళ్ళు; తక్కురు=మిగిలినవారు; చీకాకుపడుచున్ = శ్రమపడుచు.

తా త్ప ర్య ము

చెవులు పగుల్లు పాఱునట్లు సింహనాదము చేయఁగా, మఱి కొందఱు నేలఁ బడఁగా, దక్కినవారు కష్టపడుచుఁ బోయినదే పోకగా మరల తిరిగి చూడక పరు వెత్తిరి.

తే. తన్నుకొని చచ్చు గుఱ్ఱాలు ♦ ధరణిఁ గూలి
మూల్గు నేనుంగులును నేల ♦ వ్రొగ్గతిలిన
గొడుగులును డెక్కెముల్ నిండెఁ ♦ బుడమి నెత్రు
టేర్లు పాఱెను లంకలో ♦ సెగసె నులివు. ౧౦౬

అర్థములు. వ్రొగ్గతిలిన = వ్రేలఁబడిన; ఉలివు = ధ్వని.

తా త్ప ర్య ము.

స్పష్టము.

క. వానర వీరుం డీగతి, మానవభోజుల వధించి ♦ మసలక చని యు
ద్యానము తోరణమున న్నా, సీనుండై యుండె రణము ♦ సేసెడు కోర్కిన్. ౧౦౭

అర్థములు. మానవభోజులన్ = రాక్షసులను; మసలక = జాగు చేయక.

తా త్ప ర్య ము.

హనుమంతుఁ డీవిధముగ రాక్షసులఁ జంపి వెంటనే పోయి యుద్యానతోరణమున నింకను యుద్ధము చేయు కోరిక గలవాఁడై కూర్చుండెను.

—♦ ౪౬-వ సర్గము హనుమంతునిమీఁదికి రావణుఁడు
సేనానాయకుల నేవురఁ బంపుట ♦—

సీ. మంత్రితనూజుల ♦ మరణంబు రావణుఁ, డాలించి మఱుఁగిడి ♦ స్వాంతమును వి
రూపాక్ష దుర్ధర ♦ యూపాక్ష భాసక,ర్ణప్రఘసుల సైన్య ♦ నాయకులను
నేవురఁ గనుఁగొని ♦ యేగి మీరలు సర్వ,సైన్యంబుతో వన ♦ చరుని, బట్టి
తేవలయును జుండు ♦ తేఁకువ మెలఁకువ, తప్పక కడుఁ బ్రయ ♦ త్నంబు చేసి

తే. కాలదేశవిరోధంబు ♦ గలుగకుండఁ
గార్య మొనరింపుఁడీ క్రోఁతి ♦ గాఁడు వాఁడు
జిష్ణుఁడు తపోబలంబున ♦ సృష్టి చేసి
యంపెఁ బెనుభూత మొండస్మ ♦ దర్థముగను.

అర్థములు. మఱుఁగిడి=దాఁచిపెట్టి, స్వాంతమును=మనస్సును, తేఁకువ=ధైర్యము, మెలఁకువ = హెచ్చరిక, జిష్ణుఁడు = ఇంద్రుఁడు, అస్మదర్థముగను = నా నిమిత్తమై.

తాత్పర్యము.

మంత్రికుమారులు చచ్చినవార్తవిని విరూపాక్షుఁడు, దుర్ధరుఁడు, యూపాక్షుఁడు, భాసకర్ణుఁడు, ప్రఘసుఁడు నను సేనానాయకుల నయిదుగురఁ జూచి మీరు మీసమస్తసేనలతోఁ బోయి క్రోఁతినిబట్టి తేవలయునుజుమా. ధైర్యముహెచ్చరిక తప్పక, మిగులఁ బ్రయత్నముచేసి క్రోఁతిగదాయని యలక్ష్యము సేయక దేశకాల విరోధము లేకుండునట్లు పని సేయుఁడు. వాఁడు నిజమైన క్రోఁతిగాఁడు. ఇంద్రుఁడు తపస్సుచేసి నన్ను జయింపవలయు నని పెద్దభూతమును సృష్టిచేసి పంపెను. అని తన మనస్సునఁ గల దానిని దాఁచి మోసపుమాటలను జెప్పెను. అట్లు చెప్పినఁ గాని వారు దేవేంద్రుని శక్తియేకదా యనిధైర్యముతోఁ బనిచేయరు. వాస్తవము చెప్పిన నందఱు నిందింతురని భయము. మేము యుద్ధము చేయమని యందురేమో యని సందేహము.

చ. మిముఁ గొని కాదె గెల్చితిని ♦ మేటిబలాఢ్యుల నాగయక్షరా
డమరమహర్షి దానవుల ♦ నద్భుతరీతి రణాగ్రసీమలన్
సమయము వేచి వా రిపుడు ♦ సల్పఁగఁ జూచెద రప్రియంబుఁ జుం
డమరవిరోధులార! యెటులైనను క్రోఁతిని బట్టి తేరుఁడీ. ౧౦౯

తాత్పర్యము.

మిమ్ము సహాయులఁగాఁ గొనికదా మిక్కిలి బలవంతులైన నాగులనుయక్షుల ప్రభువగు కుబేరుని, దేవతలను, మహర్షులను, దానవులను యుద్ధభూమియందులోకు లాశ్చర్యపడునట్లు గెలిచితిని. ఇది మీరెఱింగిన విషయమే. ఆ కారణముచే వారికి మనకు విరోధముండుటయు మీకుఁ దెలిసినవిషయమే. ఎప్పుడు సమయముదొరకు నా పగతీర్చుకొందుమా యని వారు కాచికొని యుండుటయు మీకుఁ దెలిసిన విషయమే. ఇప్పుడు వారందఱుఁ జేరి నాకుఁ గీడుచేయ నాలోచించుచున్నారు. నావలె మీరును దేవవిరోధులే కావున వారు పంపిన యాక్రోఁతిని మీరెట్టులైనఁ బట్టుకొని రండు.

ఉ. గేలిగఁ జూడఁబోకుఁడు ప్ర♦కీర్తితవిక్రము నీకపీశ్వరున్
వాలిని వాలిసోదరు న♦వార్యపరాక్రము జాంబవంతుఁ గీ
శాలిచమూపు నీలు ద్వివి♦దాదులఁ జూచితిఁ గాని వారికీ
వాలినరూపు ధీగతి య♦వారిత తేజము లుల్లసిల్లెనే. ౧౧౦

అర్థములు. గేలిగన్ = క్రోఁతిగదా యని పరిహాసముగా, కీశాలిచమూపున్ = వానరసేనా నాయకుని, వాలిన = అతిశయించిన, ధీగతి = బుద్ధిమార్గము.

తాత్పర్యము.

ప్రతిదినము తోఁటలలో, దోఁపులలోఁ జూచు క్రోఁతిగదా యని పరిహాసముగా నీ క్రోఁతిని జూడవలదు. ఇది మిక్కిలి కీర్తి పొందిన పరాక్రమము గలది. నేను వాలిని, సుగ్రీవుని, వారింపరాని పరాక్రమము గల జాంబవంతుని, వానరసేనానాయకుని నీలుని. ద్వివిదుఁడు లోనగువారిని జూచితినిగాని యిటువంటి గొప్ప యాకారము, బుద్ధిబలము, వారింపరాని తేజము వారి కుండెనా ?

చ. ఘనతరభూత మెయ్యదియొ ♦ కైకొని వానరరూప మీ క్రియం
బనివడి రాఁగఁ బోలును, ప్ర♦మాదము మాని చరింపుఁ డాజిలో
మనుజసురాసురాదులును ♦ మార్కొనఁ జాలరు మిమ్ము నట్లటం
చును మది నేమఱం దగదు ♦ శూరులకుం గలహంబు పట్టులన్. ౧౦౭౧

తాత్పర్యము.

ఏదియో గొప్ప భూత మీ ప్రకారము వానర రూపముతోఁ బనిపూని వచ్చి యుండవలెను గాని, యిది నిజమైన క్రోఁతిగాదు. కాఁబట్టి యుద్ధమందు మిగుల హెచ్చరికతోఁ జరింపుఁడు. మిమ్ము మనుష్యులు, దేవతలు, రాక్షసులు, యుద్ధమం దెదిరింపఁ జాలరు. అట్లున్నను మే మింతవారముగదా మా కెవ్వ రెదు రని శూరు లగు వారు యుద్ధమందు హెచ్చరిక తప్పరాదు.

చ. కలన జయింతు నేన యనఁ♦గాఁ దగ దేరికి, గెల్పు చంచలం
బలఘుతరప్రయత్నమున ♦ నోఁ దన రక్ష యొనర్పు నంచుఁ దాన్
సెల విడ వార లేగిరి వి♦శిష్టరథేభతురంగపంక్తితోఁ
గలకలనాదముల్ చెలఁగఁ ♦ గాండశరాసనశస్త్రపాణులై. ౧౦౭౨

అర్థములు. కలనన్ = యుద్ధమందు, చంచలము = స్థిరముకానిది; అలఘుతర = మిక్కిలి గొప్ప దగు; విశిష్ట = మిగుల శ్రేష్ఠములైన, రథ - ఇభ - తురంగపంక్తిలోన్ = తేరులు, ఏనుఁగులు, గుఱ్ఱములు, వీనియొక్క వరుసలతో——పంక్తి - ఇది సంస్కృతమున 'పఙ్క్తి' యని వ్రాయఁబడును. నిఁక దత్సమమున నిదియె రూపమని యొక రనిరి. కాని యది మహాకవి సంప్రదాయానుసారము గాదు. ఇట్టి శబ్దము లెల్ల - అంకితము. మాతంగము - వాంఛ—ఈ ప్రకార మనుస్వారములు పూర్ణబిందువులుగా మార్చియే వ్రాయఁబడును. (చూ. సు. సంజ్ఞ. ౧౩ వ. సూ. సూచిక) 'నిండు మనంబు నవ్య నవనీత సమానము, పల్కు దారుణాఖండలశస్త్ర తుల్యము జగన్నుత విప్రుల యందు నిక్క మీ, రెండును రాజులందు విపరీతము గావున విప్రుఁడోపు,నోపం డతిశాంతుఁ డయ్యు నరపాలుఁడు శాపముఁ గ్రమ్మరింపఁగన్' ఇది పూర్ణబిందుప్రాసమున కుదాహరణము. నాలుగు పాదము లందును నిండు

సున్నలే యుండవలెను. ఓపంచు అనునది ఓపణ్ణు అని వ్రాయ వ్యాకరణము సమ్మతింపదు. ఓపఁడు అనుశబ్దమును అర్ధానుస్వారము, నిండుసున్న యగుటకుసూత్రము గలదుగాని యరసున్న వర్గపంచమాక్షరముగ మాఱు నని సూత్రము లేదు. సంప్రదాయము లేదు. అట్లులే 'సింగం బాఁకటితో గుహాంతరమునం జేడ్పాటుమై నుండి, మాతంగస్ఫూర్జితయూథదర్శనసముద్యత్క్రోధమై వచ్చు నోజంగాంతారని వాసభిన్నమతి నస్మత్సేనపై వీఁడె వచ్చెం గుంతీసుత మధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్॥' అనుచో సింగము తద్భవము గాన తద్భవములందు జణలు లేవు గావున సిజ్గమని వ్రాయ రాదు. అట్లులే తక్కిన పాదంబులం జూచునది.

తాత్పర్యము.

యుద్ధమం దెంత బలశాలియైనను నేనేజయించెద నని చెప్పఁదగదు. ఏలన గెల్పుస్థిరముగాదు. బలవంతుఁడేజయించునను నియతి లేదు. కావునఁ బ్రతిశూరుఁడు తన్ను రక్షించుకొనుటయందు మిగుల గొప్ప ప్రయత్నము సేయవలయును. అని వారి కాజ్ఞ యియ్యఁగా వారు శ్రేష్ఠములైన రథములు, ఏనుఁగులు, గుఱ్ఱములు కావలసినన్ని తీసికొని కలకలధ్వనులతో విండ్లు, బాణము, లాయుధములు ధరించినవారై.

——♦హనుమంతుఁడు సేనానాయకుల నేపురఁ జంపుట♦——

క. వీరునిఁ బ్రజ్వల దుదయ, త్సూరునివలె వెలుఁగు వాని♦శుభమతిని మహా
కారు మహావేగు మహా,ధీరు మహోత్సాహుఁ గనిరి♦దితిజవరేణ్యుల్. ౧౭౩

అర్థములు. ప్రజ్వలత్ + ఉదయత్ + సూరునివలె – సూరసూర్యార్య మాదిత్య ద్వాదశాత్మ దివాకరాః॥ అమరకోశము. ఇట్లు చెప్పుటచే సూర్యబింబ మింకను ఎఱ్ఱగానే యున్నదని సూచన.

తాత్పర్యము.

వీరుని, మండుచు నుదయించు సూర్యునివలెఁ బ్రకాశించు వానిని, మంచి మనస్సు గలవానిని, గొప్ప యాకారము గొప్ప వేగము గొప్ప ధైర్యము గొప్ప యుత్సాహము గలవానిని, హనుమంతుని రాక్షసశ్రేష్ఠులు చూచిరి.

సీ. కనుఁగొని దుర్ధరుం ♦ డనుపమశితపీత, ముఖశరపంచక♦మునను హనుమ
శిరము నొప్పించిన♦హరివరుం డుప్పర,వీధికి నెగిరి యు♦ర్వ్యయును దెసలు
నిండ గర్జింప న♦ఖండతేజుం డైన, దుర్ధరుం డొకసూఱు♦తూపు లూని
కపిమీఁద వర్షింపఁ♦గా నల్పమేఘంబుఁ, దూలించు వాయువు♦లీల వాని
ఆ. మాపి పవనజుండు♦మార్గణ హతి నొచ్చి, మేను వెంచి వేగ♦మింటి కెగసి
యచటనుండి పడియె♦నాతని తేరిపైఁ, గొండమీఁదఁ బిడుగు♦పిండనంగ.

అర్థములు. అనుపమ = అసమాన మైన; శిత = పదునైన; పీతముఖ = పచ్చని ముఖముగల, బంగారు గఱులు గల యని భావము. శరపంచకమున =

అయిదు బాణములచే, ఉప్పరవీధికిఁ = ఆకాశమునకు, తూపులు = బాణములు, మార్గణహతిఁ = బాణముల దెబ్బలచే.

తా త్ప ర్య ము.

ఇట్లు చూచి యందు దుర్ధరుం డనువాఁడు అసమానమై, పదునైన పచ్చని యైదుబాణములచే హనుమంతుని తలను నొప్పింపఁగా వానరశ్రేష్ఠుఁ డాకాశమున కెగిరి, భూమి, దిక్కులు నిండ సింహనాదము సేయఁగాఁ బూర్ణతేజస్సు గల దుర్ధరుఁడు నూఱుబాణములు వానరుని మీఁద గురియింపఁగాఁ జిన్నమేఘము నెగురఁ జిమ్ము వాయువు వలె వాని నెగురఁగొట్టి హనుమంతుఁడు బాణముల దెబ్బలకు నొప్పిచెందియు దేహమును బెంచి యాకాశమున కెగిరి యచ్చటనుండి కొండ మీఁదఁ బిడుగు గుంపు పడినట్లు దభాలున వాని తేరిపైఁబడెను.

ఆ. హయము లెనిమిదియును ♦ నక్షకూబరములు, సమసి విఱిగె వాఁడు ♦ స్యందనంబు
నుండి పడియె విడిచి ♦ యసువులు, వానిని గాంచి, తీవ్రరోషు లగుచు ♦ దివికి నెగిరి.

అర్థములు. అక్షకూబరములు = బండికన్ను; నొగలు-క్రమాలంకారము.

తా త్ప ర్య ము.

ఎనిమిది గుఱ్ఱములు చచ్చెను. బండికన్ను నొగలువిఱిగెను. వాఁడు ప్రాణములు వదలి తేరిమీఁదనుండి పడెను. వానిని జూచి మిగులఁ గోపించినవారై యాకాసమున కెగసి.

రాక్షసులు వేసిన బాణములు పోవు నెత్తుకంటె నింకను నెత్తున హనుమంతుఁ డుండుటచే వీరి బాణము లాయనకుఁ దగులకయె క్రిందఁ బడుచుండెను. కావున వారును నాకాశమున కెగిరిరి.

తే. అల విరూపాక్షయూపాక్షు ♦ లనెడివారు, కపియురస్థ్సలి మోఁదము ♦ ద్గరములెత్తి
హనుమ వారల వేగంబు ♦ నాఁగి మఱలఁ, బృథ్వికిని డిగ్గి చెట్టొండు ♦ పెల్లగించి.

తా త్ప ర్య ము.

మీఁదజెప్పిన విరూపాక్షుఁడు, యూపాక్షుఁ డనెడివారు వానరుని ఱొమ్ము పగులఁగొట్ట ముద్గరము లెత్తుకొనిరాఁగా వారివేగమును హనుమ యణఁచి తటాలున భూమిపైకి వచ్చి చెట్టు నొకదానిని బెల్లగించి.

ఉ. వారలఁ గొట్టి చంపఁ దమ ♦ వారల ముప్వురపాటుఁ గాంచి దు
ర్వారతరాగ్రహంబునను ♦ బట్టిసముం బ్రఘసుండు వైచినఁ
శూరుఁడు భాసకర్ణుఁడును ♦ శూలముఁ గైకొని గ్రుమ్మెఁ గ్రుమ్మినన్
మారుతి బాలభాస్కరుని ♦ మాడ్కిని మండుచు రక్తసిక్తుఁడై. ౧౦౭౭

తా త్ప ర్య ము.

ఇప్పుడు రాక్షసులు మీఁదనుండిరి, హనుమంతుఁడు క్రిందివైపున నుండెను.

వా రాకాశమునుండి క్రిందికి వచ్చులోపల హనుమంతుడు చెట్టు పీకికొనిపోయి వారిని గొట్టఁగా వారి ముద్గరములు పొట్టిపి, చెట్టు పొడుగాటిది యగుటచే వారిదెబ్బలు హనుమకుఁ దగులలేదు, హనుమంతుఁడు కొట్టినది వారికిఁ దగిలెను. దానితో వారు చచ్చిరి. ఇట్లు తమవారు ముగ్గురు చావఁగా మిగులఁగోపించి మిగిలిన యిరువురిలో ప్రఘసుం డనువాఁడు పట్టిసమును వైచెను. భాసకర్ణుఁడు శూలములతోఁ బొడిచెను. ఇట్లు పొడువఁగా నాంజనేయుఁడు నెత్తుటఁ దడిసి బాలసూర్యుని వలె మండుచు.

క. తరుమృగఫణిసంయుత మగు, ధరణీధరశృంగమునను ♦ దద్రాక్షసులన్
బురుగతి వైచిన నయ్యిరు, వురు వ్రాలిరి యపగతాసు♦వు లయి ధరిత్రిన్. ౧౦౨౭

అర్థములు. తరుమృగఫణిసంయుతము = చెట్లతోను, మృగములతోను, పాములతోను గూడినది. ధరణీధరశృంగము = పర్వత శిఖరము = వురుగతిన్ = గొప్ప వేగముతో - అపగత+అసువులు = పోయిన ప్రాణములు గలవారు. ప్రాణము పోయినవారు.

తా త్ప ర్య ము.

చెట్లతో మృగములతో పాములతో, గూడియుండిన పర్వత శిఖర మొట్లున్న దాని నట్లే తెచ్చి యా రాక్షసులపై మహావేగముతో వైవఁగా వారిరువురుచచ్చి నేలఁ బడిరి.

క. ఏవురు దళవాయులు నిటు, చావం బెఱవారి నెల్లఁ ♦ జక్కడఁచెను. దం
తావళహయభటతతి దం, తావళహయభటుల నసుర♦తతి నింద్రుఁడనన్. ౧౦౨౮

అర్థములు. దళవాయులు = సేనానాయకులు, దళవాహి—ప్రకృతి; చక్కడఁచెను = చంపెను, దంతావళహయభటతతిన్ = ఏనుఁగులయు, గుఱ్ఱములయు, భటులయు సమూహమును, దంతావళము— దంత + వలము = దంతావలము — ఇచట వలచ్ప్రత్యయమునకుఁ గల యని యర్థము. మత్వర్థీయము.

తా త్ప ర్య ము.

ఏవురు సేనానాయకు లిటు చావఁగాఁ దక్కిన సేనను ఏనుఁగులతో నేనుఁగులను, గుఱ్ఱములతో గుఱ్ఱములను, భటులతో భటులను గొట్టి యింద్రుఁడు రాక్షసులఁ జంపినట్లు చంపెను.

క. చనఁ దెరువులేక యుండఁగ, ఘనగజహయభటచయంబు ♦ క్ష్మా నెఱసిన నా
హనుమ లయకాలుఁడనఁగాఁ, జని తోరణసీమఁ జేరె♦ శ్రాంత్యర్థ మనన్. ౧౦౨౯

అర్థములు. తెరువు = త్రోవ, క్ష్మాన్ = భూమియందు; లయకాలుఁడు = ప్రలయకాలమందలి యముఁడు, శ్రాంత్యర్థము = బడలిక తీర్చుకొనుటకు.

తా త్ప ర్య ము.

పోవుటకు మార్గము లేకుండునట్లు పెద్దయేనుఁగులు, గుఱ్ఱములు, భటులసమూ

హము భూమిమీఁద నెఱపినట్లు వ్యాపింపఁగా ప్రలయకాలయమునివలె హనుమంతుఁడు బడలిక దీర్చుకొనుటకో యన్నట్టు తోరణసీమ చేరి కూర్చుండెను.

ఉత్ప్రేక్షాలంకారము. అనక్ ఇది యుత్ప్రేక్షావాచకము.

—♦ ౪౭–వ సర్గము. హనుమంతునిమీఁదికి రావణుఁ డక్షకుమారునిఁ బంపుట. ♦—

సీ. దళవాయు లేవురు ♦ దళములతోఁ బోర, హతు లౌట విని యమ♦రారి సేత
సమరోద్ధతోన్ముఖుఁ ♦ జండవిక్రమశాలిఁ, దన తనూభవు నక్షుఁ♦గనుఁగొనంగఁ
గనుసన్న యెఱిఁగి రా♦క్షసవీరుఁడును స్వర్ణ, చిత్రకార్ముకమును ♦ జేతఁ బూని
ద్విజవరుల్ వేల్వంగ ♦ వెస భగ్గు మని లేచు, నగ్నినా దిగ్గన ♦ నట్టె లేచి
తే. తపము బలమున నార్జింపఁ ♦ దప్తకనక, జాలశోభిత మై రత్న♦జాలలసిత
కేతనాంచిత మై జవో♦పేతసైంధ, వాష్టకసుయోజితం బయి ♦ యమరి మఱియు.

అర్థములు. దళములతో = సేనలతో; పోరన్ = రణమందు; సమర + ఉద్ధత + ఉన్ముఖున్ = యుద్ధమునందు గర్వించినవాఁడు; యుద్ధమునకు సిద్ధపడి యుండువాఁడు; కనుసన్న = కంటిసంజ్ఞ; స్వర్ణ చిత్రకార్ముకమున్ = బంగారుచే నలంకరింపఁబడిన వింటిని; ద్విజవరుల్ = బ్రాహ్మణశ్రేష్ఠులు; వేల్వంగన్ = హోమము సేయఁగా; తప్తకనకజాల = పుటము వేయఁబడిన బంగారు సమూహముతో; శోభితమై = ప్రకాశించునదియై; రత్నజాలలసిత = రత్న సమూహములచేఁ బ్రకాశించు, కేతనాంచితమై = ధ్వజములచే నొప్పునదై, జవోపేత = వేగముతోఁ గూడిన, సైంధవాష్టక = ఎనిమిది గుఱ్ఱములచే, సుయోజితంబయి = చక్కఁగాఁ గట్టఁబడినదై.

తాత్పర్యము.

అయిదుగురు సేనానాయకులు సేనలతోడ యుద్ధమందు జచ్చుట విని రావణుఁడుయుద్ధగర్వముగలవాఁడును, యుద్ధమునకుఁబోవసిద్ధపడియుండువాఁడును, భయంకరమైన పరాక్రమము గలవాఁడును తన కొడుకు నైన యక్షు డనువానిని జూడఁగా వాఁడు తండ్రి కంటిసంజ్ఞ యెఱిఁగి బంగారుచేఁ జిత్రింపఁబడిన విల్లు చేతఁబూని బ్రాహ్మణులు హోమము సేయఁగా భగ్గు మని మంట లెగయు నగ్నివలెఁ జివాలున లేచి తపముచే నార్జింపఁ బడినదియు, పుటము వేయఁబడిన బంగారుచేఁ బ్రకాశించునదియు, రత్నములచేఁ జెక్కఁబడిన కేతనములతోఁ బ్రకాశించునదియు, శీఘ్రముగఁ బోఁగల యెనిమిది గుఱ్ఱములను గట్టినదియు మఱియు,

తే. బాలభాస్కరుభంగినిఁ ♦ బ్రజ్వరిల్లి, యమరదానవదుర్జయ♦మై నభశ్చ
రంబు నై రత్నమయ మైన♦రథము నెక్కి, తూణమష్టకృపాణికల్ ♦ తోమరములు.

అర్థములు. అమరదానవ దుర్జయమై = దేవతలకు, దానవులకు జయింపరానిదై, నభశ్చరంబునై = ఆకాశమందుఁ దిరుగునదియై; తూణము = అంబుల పొది; అష్ట కృపాణికల్ = ఎనిమిది కత్తులు, తోమరములు = చిల్లకోలలు.

తాత్పర్యము.

బాలసూర్యునివలె వెలుఁగుచు, దేవదానవులకు జయింపరానిదై, యాకాశమునందు సంచరింపఁగలదై, రత్నములతో నిండిన రథమెక్కి యంబులపొదియు, నెనిమిది కత్తులు, చిల్లకోలలు.

పూర్వపు మంత్రులు రథముల విడిచి యాకాశమున యుద్ధము చేయుటచేఁ జంపఁబడి రని విని యాకాశమందును దేరి మీఁదనుండియే యుద్ధముచేయ సాధ్య పడునట్లు ఆకాశమున సంచరింపఁగల తేరిపైఁ గూర్చుండి దూరపు యుద్ధమునకు బాణములు, ద్వంద్వ యుద్ధమునకుఁ గత్తులు నని యుభయవిధసాధనములు గ్రహించిన వాఁ డయ్యె నని భావము.

క. వెలుఁగ న్వెలువడి భువి దివి, నులివునఁ బూరించి రథగ♦జోత్తమహయముల్
బలములు గొలువఁగఁ జనికనె, బలియునిఁ దోరణనివాసిఁ♦బ్లవగాధీశుఁ. ౧౦౪౩

అర్థములు. ఉలివున = కంఠధ్వనిచే; బలముల్ = సేనలు.

తాత్పర్యము.

వెలుఁగు చుండఁగా బయలుదేఱి భూమియు, నాకాశము ధ్వనిచే నిండించి రథములు, ఉత్తమ గజములు, ఉత్తమ హయములు, కాలిబంట్లు సేవింపఁగాఁ బోయి బలవంతుఁడై తోరణమందు నున్న వానరేంద్రునిఁ జూచెను.

చ. విలయ కృశానుతుల్యుఁ డగు♦వీరవరుఁ బహుమాన దృష్టిచేఁ
గలయఁగఁ జూచి వాని జవ♦గర్వము నాత్మఁ దలంచి స్వీయ మా
నలవు బలంబుఁ జూపఁగ హి♦మాత్యయభాస్కరుఁ బోలి తీవ్రుఁడై
తలఁకక మూఁడుబాణములఁ ♦ దాడితుఁ జేసి మరుత్తనూభవుఁ. ౧౦౪౪

అర్థములు. విలయ కృశాను తుల్యుఁడు = ప్రలయ కాలాగ్నితో సమానుఁడు; బహుమాన దృష్టిచేఁ = గౌరవముతోఁ గూడిన చూపుచే, దీనిచే హనుమంతుఁడు సామాన్యవానరుఁడు కాఁడు, శత్రువైనను నుత్తముఁడని గ్రహించె ననియుఁ బూర్వము వారు దానిని గ్రహింపజాలక పోయిరనియు, సూచన. దీని వలన నుత్తమ గుణములు గలవాఁడు, ఋజువాది, తనకు విరోధిపక్షమున వచ్చినను వాదమున నోడింపవలయునుగాని, యవమాన దృష్టిని జూడరాదని యేర్పడుచున్నది. కూట యోధులు గుణహీనులు. మాయావాదు లిట్టి గౌరవమునకుఁ బాత్రులు గారు. జవగర్వము = వేగముగ సంచరింపఁ గల నను పొగరు; అలవు = అస్త్రశస్త్ర విద్యయందుఁ దనకుఁ గలఁ పరిశ్రమము. బలము = దేహబలము. హిమాత్యయ భాస్కరుఁబోలి = మంచుకాలము పోయిన నాఁటి సూర్యుఁడు – ఎండకాలపు సూర్యుఁడు. మంచుకాలమునకు, నెండకాలమునకు నడుమ వసంత మున్నను హిమ విరోధి సూర్యుఁడు కావున, నతని కాలము గ్రీష్మము కావున గ్రీష్మమునాఁటి సూర్యుఁడని చెప్పవచ్చును. లేక చలికాలము పోఁగానే వచ్చు మాఘమాసమందలి

సూర్యుఁడని చెప్పినను జెప్పవచ్చును. మాఘ మాసమున మాడమెత్తు వేసంగి యను సామెతగలదు. అదియునుగాక 'అర్జునస్య ఇమే బాణా నేమే బాణా శ్శిఖండినః, సీదంతి మమగాత్రాణి మాఘే మాసే గవా ఇవ'' ఈ బాణము లర్జునునివి. శిఖండివి కావు. నా యవయవములను మాఘమాస కిరణములవలె బాధించు చున్నవి, యని యొక యర్థము గలదు. మాఘేమా=ఆఁడెంద్రకాయ, సేగవా = వాని పిల్లలు అని అర్థము.

తా త్ప ర్య ము.

ప్రలయకాలాగ్నివలె నున్న యుత్తమవీరుని నాంజనేయుని సగౌరవదృష్టిఁ జూచి వానికిఁ గల వేగగర్వము నాలోచించిఁ తన శస్త్రాస్త్రపాండిత్యము, దేహ బలము వానికిఁ జూప గ్రీష్మమందలి సూర్యునివలెఁ దీవ్రుఁడై యాంజనేయుని మూఁడు బాణములచేఁ గొట్టెను.

—♦ హనుమంతుఁ డక్షకుమారునిఁ జంపుట ♦—

క. వెండియుఁ బైపడి శితఖర, కాండంబుల నొంప నక్ష ♦ కపినాథులకున్
భండనము చెల్లె దివిజుల, గుండెలు దిగ్గనఁగఁ ♦ గ్రూరంబగుచున్. ౧౦౫
అర్థములు. శితఖరకాండంబులన్ = పదునై కఠినములైన బాణములను. భండనము = యుద్ధము.

తా త్ప ర్య ము.

అంతటోఁ బోక పైపడి పదునైన కఱకు బాణంబులచే నొప్పింపఁగా నక్షునకు హనుమంతునకు దేవతల గుండెలు దిగ్గనఁగా గ్రూరమైన యుద్ధముజరగెను.

చ. పుడమి వడంకెఁ, దేజ మఱి ♦ పోయె నహర్పతి, గాలి వీచుటల్
విడిచెఁ, జలించెఁ గొండలును ♦ విన్ను విరావ మెసంగె, క్షోభముం
బడియె సముద్రముల్ భయము♦పాటున; రాక్షసవానరేశ్వరుల్
విడివడి ఘోరభంగిఁ బురి ♦ విచ్చక మచ్చర మెచ్చి పోరుచోన్.
అర్థములు. అహర్పతి = సూర్యుఁడు; అఱి = క్షీణించి, విన్ను = ఆకాశము, పురివిచ్చక = సడలిపోక - దృఢముగ.

తా త్ప ర్య ము.

రాక్షసుఁడు కపీశ్వరుఁడు తెగఁబడి విచ్చలవిడిగ దృఢముగ వెనుదీయక మచ్చరమున యుద్ధముసేయు సమయమున భూమి వణఁకెను. సూర్యుని కాంతి మాసెను. గాలి వీచుట మానెను, కొండలు కదలెను, ఆకాశమున ధ్వనిపుట్టెను! సముద్రములు భయమునఁ గలఁతచెందెను.

ఉ. అట్టియెడం గుమారుఁడు ర♦యంబునఁ గాంచనపుంఖ బాణముల్
పట్టి విషోజ్జ్వలంబు లగు♦పాములపోలిక మూఁటి నాటినన్

దొట్టెడు నెత్తుటన్ ముఖము♦తోయజబాంధవుఁబోల సోఁకురా
పట్టి శరంబులు న్వాలిఁగె ♦ భానువు లట్టులు ప్రజ్వరిల్లుచున్. ౧౦౮౭

అర్థములు. కాంచనపుంఖ బాణముల్ = బంగారు పింజగల బాణములు, బాణము ప్రయోగించునపుడు పట్టుకొను చివర భాగము పుంఖము. ఒకకొన ములికి, ఒక కొన పింజ. విషోజ్జ్వలంబులు = విషముచే వెలుఁగుచున్నవి. తొట్టెడు = కాఱుచున్న, సోఁకురా+పట్టి = రాక్షస రాజకుమారుఁడు. భానువులు = కిరణములు,

తాత్పర్యము.

ఆ సమయమందు నా చిన్నవాఁడు వేగముగ బంగారుపింజగల బాణములను విషముగల సర్పములవంటి వానిని మూఁటిని నాటఁగా నెత్తురు కాఱుచుండఁగా హనుమంతుని ముఖము సూర్యబింబమువలె నుండెను. అక్షకుమారుని బాణములు కిరణములవలెఁ బ్రకాశించెను. కిరణములు సూర్యునినుండి వెలికిఁబోవును. కాని వెలినుండి సూర్యునొద్దకు రావు కావున గాయపడి నెత్తురుకాఱు హనుమంతుని ముఖము సూర్యుఁడై నపుడు అందునాటుకొన్న నెత్తుటఁ దడిసిన బాణములు కిరణము లని గ్రహింపనగును.

సీ. అదిచూచి మారుతి ♦ యాగ్రహోదగ్రుఁడై, తన చూపుగముల నె♦దనుజతనయు
బలముల వాహనం♦బుల దహియించెను, మందరాగ్రస్థాంశు♦మాలిమాడ్కి
నక్షుండు కుపితుఁడై♦యచలంబుమీఁద జీ,మూతముగతిముల్కి♦ముసురుగురిసెఁ
గపియును జంకక ♦ గర్జించి తృణవృత, వాపిని డాసెడి♦వారణంబు

ఆ. పగిదిఁ దన్నుఁ డాయు♦బాలునిఁ గికురించి, మింటి కెగసె దానఁ ♦ గంటగించి
యసుర పఱపె మార్గ♦ణాసార మతనిపై, హరియుఁ దగులువడక ♦ యంద తిరిగె.

అర్థములు. ఆగ్రహోదగ్రుఁడై = కోపముచే భయంకరుఁడై; మందరాగ్రస్థ+అంశుమాలి మాడ్కి = మందర పర్వత శిఖరమున నున్న సూర్యునివలె; భరతఖండమున సాలగ్రామ పర్వతమున కుత్తరమున మందర పర్వతము భూమికి నట్టనడుమఁ గలదఁట. దానిశిఖరముమీఁదికి సరిగా సూర్యుడువచ్చునప్పటికి నుత్తరాయణమున మధ్యాహ్నకాల మగును. అప్పుడుసూర్యుఁడుమిగులమండుచుండును. జీమూతము=మేఘము, ముల్కి ముసురు = బాణవర్షము; తృణవృత వాపిని=గడ్డిచేఁ గప్పఁబడిన బావిని; వారణంబు=ఏనుఁగు; ఏనుగులను బట్టుటకు గుంతతీసి దానిపైఁ దడికలు వేసి, దానిపై పైరు పండునట్లు చేయుదురు. ఆ గడ్డికై వచ్చి యేనుఁగులు గుంతలోఁ బడును. కికురించి = మోసగించి; కంటగించి = రోషించి; మార్గణాసారము = బాణవర్షము.

తాత్పర్యము.

అది చూచి యాంజనేయుఁడు మిగులఁ గోపించి చూపులచేతనే యక్షకుమారుని సేనలను, వాహనంబులను దహించెను. అక్షుఁడు మందర శిఖరమునందలి

సూర్యునివలెనై కోపించి కొండమీఁద మేఘము వర్షించునట్లు బాణవర్షము గురియించెను. దానికి హనుమంతుఁడు జంకక గర్జించి గడ్డికప్పిన బావికై వచ్చు నేనుఁగువలెఁ దన్నుఁబట్టుకొన వచ్చు నక్షుని మోసగించి యాకాశమున కెగసెను. తప్పించుకొని పోయె నని బాలుఁడు కోపించి యతనిపై బాణవర్షము గురియించెను. హనుమయు దానియందుఁ జిక్కుపడక సంచరించెను.

చ. తిరిగిన నీడ వోవక యె♦తీవ్రఖరాశుగ జాలవర్షముల్
గురియు కుమారుఁ గాంచి కపి♦కుంజరుఁ డెట్లు జయింతు వీని నం
చరయఁగ నింతలోన నమ♦రాంతకసూనుఁడు శాతమార్గణో
త్కరపరివిద్ధ బాహువుగఁ♦ద న్నొనరింపఁగ మెచ్చి చింతిలున్. ౧౦౮౯

అర్థములు. ఈడవోవక = వెనుదీయక, తీవ్రఖర = తీవ్రములు, కఠినములు నగు, ఆశుగజాల వర్షముల్ = బాణసమూహముల వానలు, శాత మార్గణ = పదునైన బాణములయొక్క, ఉత్కర = సమూహముచే, పరివిద్ధ = బాగుగ బాధింపఁబడిన; బాహువుగన్ = చేతులు గల వానిఁగ - చింతిలున్ = ఆలోచించెను.

తాత్పర్యము.

ఇట్లు తిరిగినను అక్షకుమారుఁడు వెను దీయకయే తీక్ష్ణమైన, కఠినములైన బాణముల వానను గురియుచుండఁగా వానిని జూచి వీని నెట్లు జయింతునా యని యాలోచించుచుండ నింతలో వాఁడు పదునైన బాణములచే బాహువుల భేదించెను. దాని కాంజనేయుఁడు మెచ్చుకొని యిట్టు లాలోచించెను.

ఉ. చూడఁగ బిన్నగాని పటు♦శూరుఁడు బాలదివాకరప్రభుం
డోడఁ డొకించుకేనియు స♦ముత్తమకర్ముఁడు, వీని కక్కటా!
కీడు ఘటింపఁగా మనసు♦గొల్పదు, వీని పరాక్రమంబుఁ గొం
డాడెద రెంతయున్ విబుధ♦యక్షమహాహిమహర్షు లద్దిరా! ౧౦౯౦

అర్థములు. ఓడఁడు = భయపడఁడు.

తాత్పర్యము.

వీఁడు వయస్సునఁ జిన్నవాఁడే కాని గొప్ప శూరుఁడు. లేతసూర్యుని కాంతి గలవాఁడు. కొంచెమైనను భయపడువాఁడు కాఁడు. గొప్ప పనిచేయువాఁడు. ఇటువంటి వీనికి నయ్యో యాపదఁ గూర్ప మన స్సంగీకరింపకున్నది. వీని పరాక్రమములు దేవతలు, యక్షులు, పన్నగులు, మహర్షులు స్తోత్రముచేయుచున్నారు. ఔరా!

ఉ. చక్కఁగఁ నన్నుఁ జూచెడిని♦సమ్ముఖమం దొగి నిల్చి తెంపు పెం
పెక్కెడు నంతకంతకును♦నెక్కుడు నేర్పును దీర్పు నోర్పునున్
మిక్కిలి యీసు మానఁడు, స♦మిన్నిపుణుండును, బాలుఁ డంచు నే
మక్కువ నూరకున్న నవ♦మానము తప్పక గూర్చు నాకనిన్. ౧౦౯౧

అర్థములు. సమిత్ + నిపుణుండును = యుద్ధమందు నేర్పు గలవాఁడు.

తాత్పర్యము.

వీఁడు దృష్టి చలించి యిటు నటు చూచునేమో యోసగింత మనిన దృష్టి చెదరనీక నన్నే చక్కఁగఁ జూచుచున్నాఁడు. నే నేదిక్కుపోయిన నాదిక్కున నా కెదురు ముఖ మగుచున్నాఁడు; అంతకంతకు నేర్పు-తీర్పు-ఓర్పు అతిశయించు చున్నది కాని తగ్గుట లేదు. రోషము తగ్గించిన వాఁడు కాఁడు. యుద్ధమందు మిగుల నేర్పుగలవాఁడు. వీఁడు చిన్నవాఁడని నేనుపేక్ష చేసితినా, యుద్ధమందు నా కవమానము తప్పక కలిగించును. హనుమంతుఁడు పిల్లరాక్షసున కోడిపోయె నను నపకీర్తి వచ్చును.

ఉ. భండనసీమ నీతని య♦భంగ పరాక్రమ వేగ తేజముల్
గుండెలు వ్రక్కలించు సుర♦కోటుల కేనియు, నేమి వీనితో
దండవిజృంభణంబు భుజ♦దర్పసమగ్రత! సైఁప వచ్చునే!
ఖండితుఁ జేయఁ బూన నగుఁ♦గా, జ్వలదగ్ని నుపేక్ష యర్హమా. ౧౯౨

అర్థములు. భండనసీమన్ = యుద్ధభూమియందు; వ్రక్కలించున్ = పగుల జేయును. జ్వల దగ్నిన్ = మండుచున్న యగ్నిని - భుజ దర్ప సమగ్రత = బాహు బలము వలన గలిగిన గర్వము యొక్క సంపూర్ణత్వము.

తాత్పర్యము.

యుద్ధభూమియందు భంగములేని వీని పరాక్రమము, వేగము, ప్రతాపము, దేవతాసమూహములకైనను గుండెలు పగులఁ జేయును, ఔరా యేమి వీని విలువిద్య యతిశయము-ఏమి వీని భుజాబలముయొక్క సంపూర్ణత్వము. దీనిని సహింపవచ్చునా? కూడదు. వీనిని జంపవలసినదే. మండుచున్న యగ్నిని నుపేక్షించిన వెనుకఁ జల్లార్ప సాధ్యపడునా? అది తెగఁగాల్పక విడుచునా?

చ. అని తన మేను పెంచి యసు♦రార్భకుఁ దుంపఁగ నెంచి స్వేచ్ఛమై
ఘనతర వేగవంతముల ♦ ఖప్రచరిష్ణువు లైనవాజులన్
దునిమెఁ దలప్రహారముల ♦ దోడనె తేరును గూల నేలపైఁ
దునియలు వాఱఁ దద్రథము ♦ దూఁకి కుమారుఁడు చాపహస్తుఁడై. ౧౯౩

అర్థములు. వేగవంతము లగు = మిగుల వేగముగలవి. ఖప్రచరిష్ణువులు = ఆకాశమందుఁ జక్కఁగాఁ దిరుగు స్వభావము గలవి, వాజులన్ = గుఱ్ఱములను, ప్రహారములన్ = అఱచేతి దెబ్బలచే.

తాత్పర్యము.

ఈ ప్రకార మాలోచించి దేహము పెంచి రాక్షసకుమారుఁ జంప నాలోచించి యిష్టానుసారము మిగుల వేగముగలవై యాకాశమునఁదిరుగు స్వభావము గల గుఱ్ఱములను అఱచేతిదెబ్బలచేఁ జంపెను. అట్లులే తేరును నేలఁగూలఁదన్నెను. ఇట్లు తేరు తునకలు కాఁగా నక్షకుమారుఁడు రథము నుండి దూఁకి విల్లుపట్టుకొని.

చ. అనుపమయోగశక్తిని మ॥హర్షులు దేహము వీడి స్వర్గముఁ
జనియెడిభంగిఁ దీవ్రరభ॥సంబున మింటికి దాఁటి ఖడ్గముం
గొని పవనాత్మజుం గదిసి॥క్రూరతఁబోరుచు నుండ నంజనా
తనయుఁడు డాసి పైపడి ప॥దంబులు రెండును బట్టి కోపియై. ౧౯౪

అర్థములు. అనుపమ యోగశక్తిని = అసమానయోగబలముచే, తీవ్ర రభసంబున = మిగుల వేగమున, డాసి = సమీపించి.

తాత్పర్యము.

మహర్షులు తమ యసమానయోగబలమున దేహము విడిచి స్వర్గమునకుఁ బోవునట్లు మిగుల వేగమున నాకసమున కెగిరి కత్తి చేతఁ బట్టుకొని హనుమంతుని సమీపించి ఘోరముగ యుద్ధము చేయుచుండఁగా నాంజనేయుఁడు సమీపించి పై పడి రెండుకాళ్ళు పట్టుకొని మిగులఁ గోపించినవాఁడై.

ఉ. అండజనేత జిహ్మగము॥నట్లు విదిర్చి విదిర్చి వేగతుల్
గండున నేలపై విసరి॥క్రచ్చఱ మోఁద శిరంబు వ్రక్కలై
కండలు నెత్తు రెమ్ములును॥క్ష్మాతల మంతయుఁ గప్పఁ దండ్రికిన్
గుండెలు ఝల్లనంగ సుర॥కోటులు సమ్మద మందఁ జచ్చినన్. ౧౯౫

అర్థములు. అండజనేత = గరుత్మంతుఁడు. జిహ్మగము = పాము - వంకరగాఁ బోవున దని వ్యుత్పత్త్యర్థము. వేగతుల్ = వేయివిధములుగ, గండునన్ = బలమున, క్రచ్చరన్ = శీఘ్రముగ - తండ్రికిన్ = తన తండ్రికి, రావణునకు.

తాత్పర్యము.

గరుత్మంతుఁడు పామునువలె వేయి విధముల నీ ప్రక్క, కా ప్రక్కకు విదిర్చి, విదిర్చి పామును దోఁక పట్టుకొని లేవనెత్తి యట్టులే యుంచిన పడగ పైకిలేచి చేతిని గఱచును. అట్లుగాక పట్టినపట్టు తోడనే గుడ్డను జాడించినట్లు జాడించి కదలించుచుఁ బట్టుకొనిన లేవలేదు. వేగముగ బలము కొలఁది నేలకు వేసి మోఁదఁగాఁ దల తునుకలై కండలు, నెత్తురు, ఎముకలు నేలయంతయు నావరింపఁగా రావణుని గుండెలు పగుల దేవతలు సంతోషింపఁ జావఁగా.

క. మునులును యతులుఁ బన్నగు,లును జక్రచరుల్ మహాత్ము॥లును వాసవుఁడున్
వినియములు నమరవరులును, గని రచ్చెరు వొలయఁ బం॥క్తికంఠసుతారిన్.

అర్థములు. చక్రచరుల్ = (౧) జ్యోతిర్మండలమున నుండువారు. (౨) ఆకాశమండలమున సంచరించువారు. (3) గుంపులు గుంపులుగాఁ దిరుగువారు. వినియములు = విశేషవ్రతములు గలవారు. పంక్తికంఠసుతారిన్ = అక్షకుమారుని జంపిన వానిని - హనుమంతుని.

తాత్పర్యము.

మునులు, యతులు, పన్నగులు, చక్రచరులు, మహాత్ములు, ఇంద్రుడు, మహావ్రతస్థులు, దేవతలు హనుమంతునిఁజూచి యాశ్చర్యపడిరి.

క. క్షతజోపమాక్షు వాసవ, సుతసన్నిభ తేజు నక్షు ♦ స్రుక్కించి మరు
త్సుతుఁ డేగి ప్రళయ కాలుని,గతిఁదోరణమందుఁ జేరె ♦ గాసి దొలంగన్. ౧౯౭౭

అర్థములు. క్షతజ + ఉపమ + అక్షున్ = నెత్తుటితో సమానమైన యెఱ్ఱని కన్నులు గలవానిని, వాసవ సుత సన్నిభ=జయంతునితో సమానమైన, తేజున్= పరాక్రమము గలవానిని.

తా త్ప ర్య ము

నెత్తురువలె నెఱ్ఱనగు కన్నులు గలవాఁడును, జయంతునితో సమానమైన పరాక్రమ వంతుడును నగు నక్షుని జంపి హనుమంతుఁడు ప్రలయకాల యముని వలె బడలిక తీర్చుకొనుటకై తోరణమందుఁ జేరెను. దీనివలన నక్షుని జంపుట యందు హనుమంతునకు బడలిక గలిగె నని సూచన.

{ ౪౮-వ సర్గము. రావణుఁ డింద్రజిత్తును హనుమంతుని మీఁదికిఁ బంపుట. }

క. వీరుఁడు తనయుం డక్షకుమారుడు వానరునిచేత ♦ మడియుట విని కో
పారుణితలోచనుండై, ధీరత రావణుఁడు పల్కె ♦ దేవేంద్రజితున్. ౧౯౭౮

అర్థములు. కోపారుణితలోచనుఁడై =కోపముచే నెఱ్ఱ వాఱిన కన్నులు గలవాఁడై - దేవేంద్ర జితున్ = ఇంద్రజిత్తును - ధీరతన్ = అక్షకుమారుఁడుకూడఁ జచ్చినాఁ డనఁగానే శత్రువు బలిష్ఠుఁ డని భయపడియు భయము బయటికిఁ దెలియ నీయక.

తా త్ప ర్య ము.

వీరుఁడైన తన కొడుకు నక్షకుమారుఁడు క్రోఁతిచేతఁ జచ్చె నని విని రావణుఁడు కోపముచే నెఱ్ఱనైన కన్నులు గలవాఁడై యింద్రజిత్తుతో నిట్లనియె.

తన ప్రియమైన యుద్యానవనము క్రోఁతియొకఁడు పాడు చేసె నని విన్నంత నే యింత సాహస మొక్కఁడు చేయఁజాలఁడు. నెపమునకై యొక్కని బంపిరిగాని వీనికి వెనుక ప్రాపై పెక్కురు సహాయు లుందు రని తలఁచి వీనిని దన సేవకులచేఁ బట్టి తెప్పించి యవమాన పఱుప నాలోచించి తొలుత కింకరులఁ బంపెను. వారు చావఁగానే యిందఱిఁ జంపినవాఁడు మిగుల బలిష్ఠుఁడు, ద్వంద్వయుద్ధమున నసాధ్యుఁ డని తలఁచి దూరమున నుండి కొట్టి చంపుటకై విలువిద్య నేర్చినవాఁడైనను నొంటరి వాఁడు వానరుని ముందఱ నాఁగఁ డని మంత్రిపుత్రుల నేడ్వురఁ బంపెను. ఇట్లు బాలురఁ బంపి వానరునిఁ జంపయత్నించెను గాని వాని యాలోచన విఫలమయ్యెను. పిల్లవాండ్రను బంపి లాభము లేదని తలఁచి, సేనానాయకులను బంపెను. వారును జావఁగాఁ దన నిమిత్తమై యితరులఁ జంపించుచున్నాఁ డని లోకులందు రని తలఁచి తన కుమారునే చిన్నవానిని బంపెను. వాఁడు చావఁగా నిఁక నీక్రోఁతి శస్త్రములకుఁ

జిక్కఁడు. బాహుబలమునకు లోఁబడఁడు. అస్త్రములచేఁగాని సాధ్యుఁడు గాఁడని యస్త్రవిద్యయందుఁ బ్రవీణుఁడును దనకు రెండవవాఁ డగు నింద్రజిత్తును బంపుచున్నాఁడు.

మత్తకోకిలము. ఈవె యస్త్రవిదగ్రగణ్యుఁడ ♦ వీవె సర్వసుపర్వదై
త్యావళీవ్యసనప్రదాతవు ♦ ఖ్యాత మెల్ల జగంబులన్
దావకీనభుజాబలంబు, వి♦ధాతఁ గొల్చి మహాస్త్రముల్
నీవు పొందితి, నీ చరిత్రలు ♦ నర్జరాళికి స్పష్టముల్. ౧౦౯

అర్థములు. అస్త్రవిద్+అగ్రగణ్యుఁడవు = అస్త్రములను దెలిసినవారిలో మొదట లెక్కింపఁదగిన వాఁడవు. సర్వసుపర్వ+దైత్యావళీ = ఎల్ల దేవతలకు, దైత్యుల గుంపులకు వ్యసనప్రదాతవు = శోకము గలిగించు వాఁడవు. ఖ్యాతము= ప్రసిద్ధికెక్కినది, తావకీన భుజాబలంబు=నీ బాహుబలము.

తాత్పర్యము.

అస్త్రవిద్యావంతులందు మొదటివాఁడవని లెక్కింపఁదగినవాఁడవు నీవే! నీవే సమస్త దేవదానవులకు శోకము కలిగించిన వాఁడవు. నీభుజబల మెల్లలోకంబులఁ బ్రసిద్ధికెక్కినది. బ్రహ్మదేవునిచే మహాస్త్రములు సంపాదించితివి. నీవు చేసిన కార్యములు దేవత లందఱెఱుఁగుదురు.

క. నీ యస్త్రబలము పెంపున, నీయెదుటను నిలువ వశమె♦నిర్జరులును దై
తేయులు వాసవుఁడైనను, మాయామ్నాయమున నీ స♦మానులుగల రే? ౧౧౦

అర్థములు. మాయా+ఆమ్నాయమునన్=మాయావిద్యయందు.

తాత్పర్యము.

దేవదానవులు నింద్రుఁడైనను నీ యస్త్రబలముయొక్క యాధిక్యముచే నీ యెదుటనైన నిలువగలరా? ఇఁక యుద్ధము చేయ లేరను మాటయేల? మాయలు చేయుటయందు నీకు సమానులు లేరు.

ఇట్లుచెప్పుటచే హనుమంతుని న్యాయమార్గమున నస్త్రములచేఁ జంపఁ జూడుము, అది సాధ్యము కాదని తోఁచెనేని మాయచేనైన వధింపుమని సూచన.

మత్తకోకిలము. యోజనం బొనరింపఁ దోఁపని♦యుక్తి యొక్కఁడు లేదు నీ
కాజికేళి నసాధ్య మౌ పని♦యైన నేదియు లేదుగా
యా జగత్త్రయి నీదు దర్ప మ♦హీననిస్తులితాస్త్రసం
యోజితాద్భుతశక్తి యెవ్వరో♦కో యెఱుంగరు పుత్రకా! ౧౧౧

తాత్పర్యము.

ఆలోచించితివేని నీకుఁ దోఁపని యుక్తి యొక్కటియైన లేదు. అన్నియుక్తు లాలోచింపను, వానిని గొనసాగింపను నీవే నేర్తువు. యుద్ధమందు నీక సాధ్యమైనది

లేదు. ఈ మూఁడులోకములందు నీబలము, నీ గొప్ప యస్త్రపాండిత్యము నాయనా! తెలియనివా రెవ్వరు?

తరలము. తపము పేర్మిఁ బరాక్రమంబున ♦ దారుణాస్త్రబలంబునన్
విపుల శక్తిని మాదృశుండవు ♦ నీవు గెల్పు రణంబులో
నెపుడు నిశ్చిత మా టెఱుంగుట ♦ నేను జింతఁ దొఱంగి ధీ
నిపుణ! యెప్పుడు హాయి నుండుదు ♦ నేఁటిమాట యిదేటికిన్. ౧౧౦౨

అర్థములు. మాదృశుండవు = నాతో సమానుఁడవు. ఎప్పుడు = ఇప్పుడే కాదు, సర్వకాలములందు, హాయిన్ = సుఖముగా.

తా త్ప ర్య ము .

గొప్పతనమునందు– పరాక్రమమందు– భయంకరమైన యస్త్రబలమునందు గొప్పశక్తి యందు నాతో సమానుఁడవు. నీవు యుద్ధమందు జయ మనునది నిశ్చయింపఁబడినదే. ఇది తెలిసిగదా నేను నిర్విచారముగా నన్నిటికి నింద్రజిత్తుగలఁడు, నాకెవరి వలన నేమి భయమని సర్వదా యున్నాను. ఇఁక నేఁటి మాట చెప్ప నేల?

తరలము. నభరస జజగణములు గణములు. పండ్రెండింట యతి. తరలమునందలి మొదటి రెండులఘువులు గురుగామార్చిన మత్తకోకిల యగును. మత్తకోకిల మందలి మొదటి గురువు రెండు లఘువులు చేసిన తరల మగును.

రావణాసురుఁ డింద్రజిత్తుతో మాటలాడు నపుడు వాల్మీకి అనుష్టుప్వృత్తము లీ ప్రకారము మార్చి మార్చి చెప్పి యున్నాఁడు. దానికిఁ గారణము శోక భయములు– అవమానము– వీనిచే రావణునకు స్వరభంగ మయ్యె నని కవి హృదయ మని, యట్టులే తెనుఁగు నందును కందము వృత్తము మార్పఁ బడెను.

క. ఓడక ని న్నెదిరిచి యుల్లాడని వాఁ డెవఁడు? భుజత♦పోఽతిబలంబుల్
గూడి నినుఁ గాచు నెప్పుడు, వీడక మఱి దేశకాల♦వేదివి తనయా. ౧౧౦౩

తా త్ప ర్య ము.

భయపడక నిన్నెదిరించి యుద్ధము నం దల్లాడని వాఁడెవఁడుగలఁడు? ఏలన భుజబలము, తపోబలము దానిని మించినబల మస్త్ర బలము, నిన్ను సర్వదా రక్షించుచున్నవి. అదియుఁగాక నీవు దేశము కాలము నెఱిఁగి యెప్పుడే ప్రదేశమున నెట్లు వర్తింపవలయునో యట్లు వర్తింప గలవు.

ఇవన్నియుఁ జెప్పుట హనుమంతునితో యుద్ధము చేయునప్పు డిన్నియు నుపయోగింప వలసి యుండు నని హెచ్చరించుటకే.

సీ. కింకరులను గాల♦కింకరులను గూర్చె, జంబుమాలిని బట్టి♦డంబు మాల్చె
మంత్రిపుత్రుల యమ♦మందిరంబున కన్పెఁ, బంచత సైన్యేశ♦పంచకమున
కలవరించెను హయ♦నాగరథాళితో, దళముల నెల్ల వి♦దళనపరిచె
నీ ముద్దుఁదమ్ముండు♦నీలై నక్షకుమారుఁ డింద్రజితా! నాకు♦నెల్లయందు

తే. కంటె నీయందు విశ్వాస♦ముంట నిన్నుఁ, బనుప వలసెను వానరు♦బలముఁజలము
చక్కఁ బరికించి నీ బలశౌర్యములను, దదనురూపంబు సేయుము ♦ తనయకుట్టి.

అర్థములు. కాలకింకరులను = యమకింకరులను, డంబు = తేజము, పంచత = మరణము, ఐదవదశ – బాల్యకౌమార యౌవన జరా మరణంబులను వానిలో నైదవది. దేహమునందలి పంచభూతములు కలయిక మాని వేఱైపోవును గావున పంచత. అలవరించెను=కలిగించెను. దళముల నెల్లన్ = సేనలనన్నిటిని,విదళన పఱిచెన్ = చీల్చివైచెను, ఎల్లయందు=ఎల్లవారి యందుకంటె, విశ్వాసము=నమ్మకము, ఇంద్రజితా = ఇంద్రజిత్తుఁడా అనుదాని సంబోధనరూపము. ఋత్విగాదులు గుణ......విభాషనగు. తత్సమ ౮౪ సూ. సు. వ్యా. ఈ సూత్రప్రకారము ఇంద్రజిత్తు, ఇంద్రజిత్తుఁడని రూపంబులు. జగదింద్రజిత్తుల తకారంబునకు లోపంబు విభాషనగు. సు. వ్యా. తత్స ౯౧ ప్రకారము ఇంద్రజి – ఇంద్రజిత్తని రూపములు.

ఎల్లయందు=ఎల్ల శబ్దము ద్రుతాంతంబయిన యవ్యయంబు ''సదృశం త్రిషు లింగేషు సర్వాసుచ విభక్తిషు వచనేషుచ సర్వేషు యన్న వేతి తదవ్యయ''మ్మని యవ్యయ లక్షణము. అనఁగా మూఁడు లింగములందు, అన్ని విభక్తులందు, ఎల్ల వచనంబులందు నేకవిధముగ నుండునది యవ్యయము. అట్టు లుండియు అప్పుడను నవ్యయమునకు అప్పటికి నని రూప మున్నట్లు ఎల్లయందు నని ప్రయోగములు గలవు. 'ఎల్లయందును దావసియించునెల్ల' భార. ఉద్యో. ౧ ఆ. ''ఎఱిఁగె సకల శాస్త్రంబుల నెల్లయందు.'' భార. ఆది ౨ ఆ. ఈ శబ్దము విశేష్యముగను బ్రయోగములు గలవు. ''ఎల్లం జూడఁగ,'' భార. కర్ణ ౧ ఆ. ౧౮౬ ప. ''ఎల్లఁజూడ''
3 ఆ. ౧౧ ప.

తాత్పర్యము.

నాయనా! కింకరులను, జంబుమాలిని, మంత్రిపుత్రులను, సేనానాయకుల నేవురను సేనలతోడ వానరుఁడు చంపెను. అందఱికంటె నీ యందు నాకు నమ్మకము మెండు. కావునఁ దక్కిన వారిని బంపిన గెలిచి వత్తురను నమ్మకము లేదు. నీవు గెలిచి వత్తువను నమ్మకము గలదు. కావున నిన్నుఁ బంపవలసి వచ్చెను. వానరుని బలము, చలము చక్కఁగాఁ బరీక్షించి దానికిఁ దగినట్టు నీ బలశౌర్యములను జూపుము.

మత్తకోకిలము. సేన యంతయు వానరేంద్రుని♦చే హతం బయి పోకమున్
వాని నస్త్రవిదగ్రగణ! జ♦వంబుమైఁ బరిమార్పుమీ.
వానిఁ దాఁకఁగఁ బోవు ముందుగ ♦ వానిశక్తి స్వశక్తియున్
మానసంబునఁ జక్కఁజూడు ప్ర♦మాదముం బడఁబోకుమీ. ౧౧౦౫

తాత్పర్యము.

వానిని జంపుటయందు నీ వెంత యాలస్యము చేసెదవో యంత మన సేన

నాశ మగును. కావున మనసేన వానిచే నాశము గాక ముందే యస్త్రములచేవాని వేగముగఁ జంపుము. ఉత్త బాణప్రయోగములఁ గాలము పుచ్చకుము. వానిపై బడి పోకముందే వాని శక్తి యేమాత్రమో, నీశక్తి యేమాత్రమో, చక్కఁగాఁ బరీక్షింపుము. హెచ్చరిక తప్పకుము.

మత్తకోకిలము. సేన కావఁగ లేదు నిన్నని ♦ సిద్ధ మియ్యది, సేన లె
　　　　న్నైనఁ దాఁకిన ద్రుంచు వాఁడు, మ♦హాబలోపమ వేగు వై
　　　　శ్వానరాభుని డాయఁ బోకుము ♦ వజ్రముఁ ధరియించి యొం
　　　　డేని ముష్టిరణంబు సేయఁగ♦నేని మర్దితశాత్రవా. ౧౧౦౬

అర్థములు. మహాబలోపమ వేగుఁ = వాయువుతో సమానమైన వేగము గలవానిని, వైశ్వానరాభునిఁ = అగ్నితో సమానుని, వజ్రముఁ = ఇది యింద్రుని వజ్రము కాదు. విష్ణుచక్ర మన్నట్లు లిది యొక యాయుధము. చూచుటకు వజ్రము వలె నుండును. ఇది శస్త్రమె కాని యస్త్రముకాదు. దీనిని సామాన్యరాక్షసులు కూడ ధరించి తిరుగుచుండి రని ౧౯౩ వ పద్యమునఁ గలదు.

తాత్పర్యము

ఇరువురు యోధులు విండ్లతో దూరమున నుండి యుద్ధముచేయునపుడు సేన లడ్డమువచ్చి రక్షింపఁగలవు. ఈ వానరుఁ డిట్టివాఁడు కాఁడు. తటాలున నీమీఁదనే దూఁకును. అప్పుడు సేన లేమి చేయఁగలవు? కావున నీవు సేనల నమ్మికొని పోవుట వ్యర్థము. సేన లెన్ని తాఁకినను వాఁడు చంపును. నీవు వజ్రము ధరించి యైనను వాని మీఁదికి బోకుము. వాఁడు వాయువువలె నలు ప్రక్కలఁ దిరుగు చుండును. ఏ మూల దూఱి నిన్నుఁ గొట్టునో? అది గాక వజ్రము కదలక యుండు దానిని గొట్టఁగలను. గాలి నెట్లు నఱకఁగలదు. కావున శస్త్రముల నమ్మవలదు. అట్లు పై పడిన ముష్టితోఁ గొట్టెద నందువేమో. వాఁడగ్నివంటి వాఁడు. వాఁడు పడినచోట నెల్ల భస్మము చేయును. అగ్నిహోత్రుని ముష్టిదెబ్బ లేమి చేయఁగలవు. కావున వానితో ముష్టి యుద్ధము సేయ యత్నింపకుము.

మత్తకోకిలము. ఇంతయుం దలపోయుమీ మఱి♦యేది యుక్తమొ చూడుమీ
　　　　యంత నింతను బోఁడు వాఁడు మ♦హాముల్ స్మరియింపుమీ,
　　　　స్వాంతముఁ నిజదృష్టియుఁ శర♦పాత మొక్కటిగాఁగ దు
　　　　ర్దాంతశక్తి రణంబు సేయుము ♦ తాల్మి. నీకు జయం బగుఁ. ౧౧౦౭

అర్థములు. అంతనింతఁ = అల్పప్రయత్నముతో, సులభముగా, స్వాంతము = మనస్సు, శరపాతము = బాణము పడుట, తాల్మిఁ = తొందరపడక, నిబ్బరముగ.

తాత్పర్యము.

ఇప్పుడు నేను జెప్పిన దంతయు నాలోచింపుము. దీనిలో నక్కడికిఁ బోయి నపు డేది యుక్తమో యది చేయుము. అల్పప్రయత్నముతో వాఁడు సాధ్యుఁడు

కాఁడు. కావున బ్రహ్మాస్త్రాది మహాస్త్రములను స్మరింపుము. మనస్సు - దృష్టి - బాణము మూఁడు నేకకాలమందు నేక ప్రదేశమందుఁ బడునట్లుయుద్ధముచేయుము. వానిని జెదర నీయకుము. తొందర పడకుము. నిబ్బరముగ మనస్సునఁ గలఁత లేక యుద్ధము చేయుము. జయము కలుగును.

క. బాలుని నినుఁ బంపఁగ రా, దాలమునకు నాకుఁ దెలియు నైనను ధరణీ
పాలురకు క్షత్రనీతియ, వాలాయము దాని దాఁట వచ్చునె చెపుమా. ౧౧౦

అర్థములు. ఆలమునకు = యుద్ధమునకు, క్షత్రనీతియ = రాజధర్మమె, వాలాయము = నిర్బంధము, అతిక్రమింపరానిది.

తాత్పర్యము.

పెద్దవా రుండఁగా యుద్ధమునకుఁ బిల్లవాండ్రను బంపుట సరిగా దని నాకుఁ దెలియును. అయినను మనము రాజులము. మనకు క్షత్రియ ధర్మము నిర్బంధము. తక్కిన వారివలె మనము ప్రవర్తింపరాదు. క్షత్రియ ధర్మప్రకారము రాజుముందుగ యుద్ధమునకుఁ బోరాదు.

ఇందు క్షత్రియులగు రాజులకిది ధర్మమని చెప్పుటచేఁ దాను క్షత్రియుఁడనని యంగీకరించినట్టు లాయెను. ఇదియె వాస్తవ విషయము. రావణాసురునికంటెవాని జాతి విషయము తమకుఁ దెలిసినట్లు కొందఱు వాఁడు బ్రాహ్మణుఁడనియు వానిఁ జంపుటచే రామచంద్రమూర్తికి బ్రహ్మహత్యవచ్చెననియుఁ జెప్పెదరు. బ్రహ్మహత్యా విచారము యుద్ధకాండమునఁ జేయఁబడును. ఇచ్చట రావణు మాటలు సత్యమా? తక్కినవారి మాటలు సత్యమా? విచారింప వలయును. ఎట్టివాఁడు బ్రాహ్మణుని డని శాస్త్రములు, వాని జాతి నిర్ణయించు చున్నవో చూతము.

శ్లో. సర్వవర్ణేషు తుల్యాసు, పత్నీ ష్వక్షతయోనిషు
ఆనులోమ్యేన సంభూతా, జాతా జ్ఞేయా స్త ఏవతే. మను. ౧౦-౫.

బ్రాహ్మణాదులగు నాలుగు జాతులవారు నాలుగు జాతులలోను శాస్త్రవిధి చొప్పునఁ బెండ్లియై వ్యభిచార దోషము లేని సవర్ణజాతి పత్నులయందు, అనఁగా బ్రాహ్మణునకు బ్రాహ్మణి యందును, క్షత్రియునకు క్షత్రియ యందు, నివ్విధమున నా యా జాతుల వారికి నా యా జాతుల స్త్రీల యందుఁ బుట్టినవాఁరు మాతాపితరుల జాతి గలిగి సజాతీయు లనఁబడుదురు. శ్లోకమున పత్నులయందు నని ప్రయోగింపఁ బడుటచే బ్రాహ్మణునకు తాను శాస్త్రప్రకారము వివాహము చేసుకొనని యన్యబ్రాహ్మణ స్త్రీయందు జనించినను వాఁడు బ్రాహ్మణుఁడు గాఁడు. ఈ విషయమున దేవలుఁ డిట్లు చెప్పెను. 'ద్వితీయేన తు యః పిత్రా సవర్ణాయాం ప్రజాయతే। అవవాత ఇతిఖ్యాతః, శూద్రధర్మా సజాతితః! వ్రతహీనా నసంస్కార్యాః స్వతంత్రా స్వపి యే సుతాః। ఉత్పాదితా సవర్ణేన, వ్రాత్యా ఇవ బహిష్కృతాః' సవర్ణ స్త్రీ యందు రెండవ తండ్రికిఁ బుట్టినవాఁడు అవవాటుఁ డనఁబడును. వాఁడు జాతిచే

శూద్రధర్మము గలవాఁడే. వానికి బ్రహ్మచర్యాది వ్రతములు, ఉపనయనాది సంస్కారములులేవు. వాఁడు వ్రాత్యునివలె బహిష్కరింపఁబడఁ దగినవాఁడు.

'యేతు జాతాస్సమానాసు సంస్కార్యాస్స్యురతోఽన్యథా' యని వ్యాసులు చెప్పెను. 'సవర్ణేభ్య సవర్ణాసు జాయంతేహి సజాతయః'అనియు 'విన్నాస్వేషవిధిః స్మృతః' వివాహమున భార్యాభర్తలుగ నైన వారియందే యీ విధి యని యాజ్ఞవల్క్యుఁడు చెప్పెను.

'స్త్రీష్వనంతర జాతాసు ద్విజైరుత్పాదితాన్ సుతాన్। సదృశానేవ తానాహు ర్మాతృదోష విగర్హితాన్.

దీనికి వ్యాఖ్యాన మందిట్లు వ్రాయఁబడినది.

అనులోమముగా నవ్యవహిత వర్ణ జాతీయభార్యలందు నెవరు పుట్టుదురో. అనఁగా బ్రాహ్మణునకు క్షత్రియ స్త్రీయందు, క్షత్రియునకు వైశ్య స్త్రీయందు, వైశ్యునకు శూద్రస్త్రీయందు, పుట్టిన కొడుకులు తల్లి యొక్క హీనజాతి వలన నిందింపఁబడిన వారై పితృసదృశు లగుదురే కాని తండ్రి జాతివారు కారు. పితృసదృశు లని చెప్పుటచే తల్లి జాతికంటె నెక్కువవారు, తండ్రికంటె నికృష్టు లగుదురని తెలియవలయును. వరుసగా వీరికి మూర్ధాభిషిక్తుఁడనియు, మాహిష్యుఁడనియు కరణజాతివాఁడనియుఁ బేర్లువచ్చునుగాని బ్రాహ్మణుఁడు, క్షత్రియుఁడు, వైశ్యుఁడు, ననుపేర్లు రావు. వీరికి వృత్తులు వేఱువేఱుగా విధింపఁ బడినవి. బ్రాహ్మణునకు వివాహిత లగు క్షత్రియ వైశ్య శూద్ర స్త్రీలయందుఁ బుట్టిన మువ్వురు – క్షత్రియునకు వైశ్యశూద్ర స్త్రీలయందుఁ బుట్టిన యిద్దఱు, వైశ్యునకు శూద్ర స్త్రీయందుఁ బుట్టిన యొకఁడు – ఈ యార్గురు అపశదు లనఁ బడుదురు. (అపశదు లనఁగా నికృష్టులు – అని మనువు)

విప్రస్య త్రిషు వర్ణేషు, నృపతే ర్వర్ణయో ర్ద్వయోః
వైశ్యస్య వర్ణే చైకస్మిన్, షడేతేఽపశదాః స్మృతాః.

మనువు. ౧౦–౧౦.

బ్రాహ్మణేన క్షత్రియాయా ముత్పాదితః క్షత్రియ ఏవ భవతి. క్షత్రియేణ వైశ్యాయాం వైశ్య ఏవ, వైశ్యేన శూద్రాయాం శూద్ర ఏవేతి శంఖస్మరణమ్. వైద్యనాథీయము.

బ్రాహ్మణునకు వివాహిత యగు క్షత్రియస్త్రీయందుఁ బుట్టినవాఁడు క్షత్రియుఁడే; క్షత్రియునకు వైశ్య స్త్రీయందుఁ బుట్టిన వాఁడు వైశ్యుడే; వైశ్యునకు శూద్రస్త్రీయందుఁ బుట్టినవాఁడు శూద్రుఁడే యని శంఖుఁడు.

కావున బ్రాహ్మణుఁడైన విశ్రవసునకు వివాహము చేసికొనని రాక్షస క్షత్రియ యందుఁ బుట్టిన రావణుఁడు బ్రాహ్మణ జాతివాఁ డెట్లగును ? ఇఁక గుణ కర్మములఁ బట్టి చూతము.

బ్రాహ్మణునకు బ్రాహ్మణ జాతి స్త్రీయందుఁ బుట్టినవాఁడైనను బ్రాహ్మణ గుణకర్మములు లేవేని వాఁడు బ్రాహ్మణుఁడుగాఁడు. వాఁడే వృత్తియం దున్నాఁడో యా జాతివానిఁగానే యెన్న వలయును. 'బ్రాహ్మణ క్షత్రియత్వంహి యాతి శస్త్ర సముద్యమాత్' అని భీష్ముఁడు పరశురామునితో ననెను. బ్రాహ్మణుఁడా! నీవు శస్త్రము ధరించుటచే క్షత్రియుఁడ వైతివి. కావున నిన్నుఁ గొట్టెద ననెను.

విశ్వామిత్రునితాత కుశుఁడు, సాక్షాద్బ్రహ్మపుత్రుఁడైనను నాయన వంశము వారందఱు క్షత్రకర్మ మవలంబించుటచే క్షత్రియులైరి. కాని బ్రాహ్మణు లనబడ లేదు. వ్యాసులకు శూద్రస్త్రీయందుఁ బుట్టిన విదురుఁడు శూద్రుఁ డయ్యెను గాని బ్రాహ్మ ణుఁడు కాలేదు. ఋషుల జన్మముగుఱించి యుత్తరకాండమునఁ జర్చింపఁబడును. ఈ కారణముల్లచే రావణుఁడు జాతి గుణకర్మములచే క్షత్రియుఁడే కాని బ్రాహ్మ ణుఁడు కాఁడు. అయోధ్య ౨౪౬౪ వ్యాఖ్య చూచునది.

కావున రావణుఁడు తాను క్షత్రియుఁడ నని క్షత్రియధర్మ మనుసరించి నిన్నుఁ బంపుచున్నా నని యింద్రజిత్తుతోఁ జెప్పినమాట శాస్త్రసమ్మత మైనది. రావణా సురుఁడు క్షత్రియుఁ డని చెప్పఁబడుట యిచ్చట మాత్రమే కాదు.

క. పరలోక సుఖముఁ గోరెడి, పురుషులు పెనువీఁకఁ బెనఁగి పోలియుదు రనిలో
ధర క్షత్రధర్మమున సం, గరమునఁ దెగువారి కేద్వఁ గా న్యాయంబే.

యుద్ధ. ౨౪౯౯.

క. క్షత్రియ సమ్మతము పురా, ధాత్రీశాధిష్ఠితమ్ము తగుగతి యిది యా
క్షత్రియున కాహవోజ్ఝిత, గాత్రునకై కార్పరాదు కన్నీ రెందుఁ.

యుద్ధ. ౨౭౦౨.

రావణునకు జరపిన యుత్తరక్రియలవిధానము పరిశీలించినను నవి బ్రాహ్మణు నకుఁ జేయు కార్యములు గావని స్పష్టపడును.

పుత్రా యేఽనంతర స్త్రీజాః, క్రమేణోక్తా ద్విజన్మనామ్
తా ననంతరనామ్నస్తు, మాతృదోషా త్ప్రచక్షతే॥

మను- ౧౦-౧౪.

ద్విజులకుఁ దమ వెంబడి జాతులందుఁ బుట్టిన బిడ్డలకు వారి తల్లియొక్క హీన జాతిని బట్టి హీనజాతులందుఁ బుట్టినవారుగా నెంచఁ బడుదురు. కనుక మాతృ జాతికిఁ దగిన సంస్కారమునకు నర్హులు. మీఁద వ్రాసిన దంతయు వివాహితలైన స్త్రీలకుఁ బుట్టిన వాని విషయము. రావణుఁడు వివాహిత స్త్రీకిఁ బుట్టినవాఁడు కాఁడు. విశ్రవసుఁడు కైకసిని వివాహ మాడలేదు. దాని తండ్రి కన్యాదానమును జేయ లేదు. సమీపమందుఁగూడ లేఁడు. కైకసి బిడ్డలు గోరి వచ్చెను. కావున విశ్రవసుఁడు బిడ్డల ననుగ్రహించెను. కావున నామె యుంపుడుకత్తె వంటిది– కావున ననులోమ జాతుల కంటె రావణుఁడు హీనుఁ డగు చున్నాఁడు. ఉత్త. కాం. ప. ౧౮౫-౧౮౬. భగవ

ద్వేషియైన సుమాలియొక్క పుత్రిక యగు కైకసి ప్రదోషకాలమందు విశ్రవస్సును బొందినది. కాఁబట్టి మాతృదోషము వల్ల రావణుఁడు కర్మచండాలబీజోత్పన్నుఁడనియును జెప్పవలసి వచ్చును. అంతకు బైన భగవద్భాగవత విషయము లైన యసహ్యాపచారములవల్ల నితఁడు కర్మచండాలుఁ డనుట సహజము.

క. కావున ని న్నంపెద నా,నావిధమహితాస్త్రముల మ♦నంబునఁ గపు సం
భావించుచుఁ బోరుము పు,త్రా! విజయముఁ గొమ్ము పోయి♦రమ్మా సుమతీ!

తాత్పర్యము.

క్షత్రియ ధర్మమును మన మతిక్రమింపరాదు. కావున నిన్నుఁబంపుచున్నాను. అనేకవిధములైన గొప్ప యస్త్రములను మనస్సున స్మరించుచు యుద్ధము చేయుము. కుమారా! పోయి జయించి రమ్ము.

—♦ ఇంద్రజిత్తు హనుమంతుని మీఁదికి యుద్ధమునకుఁ బోవుట. ♦—

చ. అని జనకుండు వల్క విన♦యంబున నాతనికిం బ్రదక్షిణం
బొనరిచి దక్షపుత్రనిభుఁ ♦ డుద్ధతి సన్నహనంబు సేసి బం
ధునిచయపూజితుం డగుచుఁ ♦ దూర్ణమ పర్వము వేళ వార్ధిరీ
తిని ఖగరాజవేగహరి♦దీప్తరథంబును నెక్కి వెల్వడెన్. ౧౧౧౦

అర్థములు. దక్షపుత్రనిభుఁడు= దేవతలతో సమానుఁడు, 'మనసా త్వేవ భూతాని పూర్వం దక్షో౽సృజత్తథా। దేవా నృషీన్ సగంధర్వా నురగాన్ పక్షిణ స్తథా'యని వి. పురా. వాక్యము ప్రమాణము. ఉద్ధతిన్=గర్వముచే, సన్నహనంబు= దృఢప్రయత్నము. బంధునిచయ పూజితుఁడు=చుట్టముల గుంపులచే గౌరవింపఁబడిన వాఁడై; తూర్ణమ=వేగముగ, పర్వము వేళ=పున్నమనాఁడు; వార్ధిరీతిని= సముద్రమువలె, ఖగరాజవేగ=గరుత్మంతుని వేగము గల, హరి=గుఱ్ఱములచే, దీప్త=ప్రకాశించు, రథంబును=తేరిని.

తాత్పర్యము.

ఈ ప్రకారము తండ్రి చెప్పఁగా వినయముతో నాయనకుఁ బ్రదక్షిణము చేసి దేవతలతో సమానుఁ డగు నింద్రజిత్తు గర్వించి యుద్ధమునకుఁ దగిన ప్రయత్నము చేసి బంధువు లందఱు గౌరవింపగా వేగముగఁ బున్నమనాఁటి సముద్రమువలెఁ బొంగి గరుడ వేగముతో సమానవేగము గల గుఱ్ఱములు కట్టిన తేరెక్కి యిల్లు వెడలెను.

ఉ. ఆ రథికోత్తముండు పవ♦నాత్మజు చక్కటి కేఁగ నాతఁడా
ఘోరశతాంగనిస్స్వనము ♦ క్రూరశరాసగుణారవంబులున్
భూరితరంబు గావుటయుఁ ♦ బొంగి గళార్భటి నించె వ్యోమసం
చారులు నాగయక్షఋషి♦సత్తము లుబ్బున మూఁగ వేడుకన్. ౧౧౧౧

అర్థములు. ఘోరశతాంగ నిస్వనము=భయంకరమైన తేరి ధ్వని, క్రూర శరాసగుణారవంబులున్=కఠినములైన యల్లెత్రాటి ధ్వనులును, గళార్భటి=కంఠ ధ్వని, వ్యోమ సంచారులు=ఆకాశమందుఁ దిరుగువారు, ఉబ్బునన్=సంతోషముతో.

తాత్పర్యము.

రథికులం దుత్తముఁడైన యా యింద్రజిత్తు హనుమంతుఁ డున్న చోటికిసరిగాఁ బోఁగా నతని రథచక్రధ్వని, అల్లెత్రాటి మ్రోఁత-మిక్కిలి యతిశయింపఁగాఁ దగిన వాఁడే వచ్చుచున్నాఁ డని హనుమంతుఁడు సంతోషించి సింహనాదము చేసెను. ఆకాశమున సంచరించువారు నాగులు, యక్షులు, ఋషిశ్రేష్ఠులు, సంతోషముతో గుంపుఁగూడిరి.

చ. దరకరభూరిచాపమును ♦ దారుణశాతశిలీముఖంబులున్
వరబలుఁ డుద్ధతింగొని జ♦వంబున సంగరకాంక్షఁ బోవ భీ
కరముగఁ గూసె సత్త్వములు ♦ కాంతి దొఱంగె దెసల్ విహంగమో
త్కరములు మింటఁ బెక్కులు వి♦ధంబుల నాద మొనర్చె భీతిచేన్. ౧౧౧౨

అర్థములు. దరకర = భయంకరమైన, భూరి = గొప్పదగు, చాపము= విల్లు, దారుణ శాతశిలీముఖంబులున్ = భీతిని గలిగించు పదునైన బాణములు, వరబలుఁడు=ప్రశస్తమైన బలము గలవాఁడు, బ్రహ్మవరబలము గలవాఁడు; సంగర కాంక్షన్=యుద్ధమునందలి కోరికతో - సత్త్వములు=జంతువులు, విహంగమ+ ఉత్కరములు=పక్షిసంఘములు.

తాత్పర్యము.

భయంకరమైన పెద్దవింటిని, పదునైన బాణములను దీసికొని యుద్ధమునందలి కోరికచే వేగముగఁ బోఁగా మృగములు గూసెను. దిక్కులు కాంతి మాసెను. పక్షులు భయపడి యాకాశమున కెగసి నానావిధములఁ గూసెను.

శా. జ్యాటంకారవిపాటితాశుఁ డగుచున్ ♦ శక్రారి నిర్వక్ర మా
నాటోపంబున బాణవర్షములతో ♦ నవ్వానరున్ డాయ వృ
క్షాటుం డుద్భటవైరిభీతికరగ♦ర్జాస్ఫోటితోర్వీధ్రుఁడై
యూటాడంగ ధరాతలంబు నిజవే♦గోద్ధూతజీమూతుఁడై. ౧౧౧౩

అర్థములు. జ్యాటంకార=అల్లెత్రాటి టంకారముచే, విపాటిత+ఆశుఁడు= చీల్పఁబడిన దిక్కులు గలవాఁడు, శక్రారి=ఇంద్రజిత్తు, నిర్వక్రము=వంకరలేనిది, ఆటోపంబున = వేగమున, వృక్షాటుండు = క్రోఁతి, ఉద్భట = మిక్కిలి, గర్జా= సింహనాదముచే, స్ఫోటిత = చీల్పఁబడిన, ఉర్వీధ్రుఁడై = కొండలు గలవాఁడై, ఊటాడంగన్=ఊఁగులాడఁగా - నిజ=తన, వేగ=వేగముచే - ఉద్ధూత=ఎగురఁ గొట్టఁబడిన, జీమూతుఁడై=మేఘములు గలవాఁడై.

తా త్ప ర్య ము.

అట్టి త్రాటి ట మ్మను ధ్వనిచే దిక్కులు పగులఁ జీల్చుచు, నింద్రజిత్తు నిండారు వేగమున బాణవర్షము గురియించుచు వానరుని జేరఁబోవ వానరుఁడు కంఠ నాదముచేఁ గొండలు బ్రద్దలు గాఁగా, భూమి కదలఁగ తన వేగమువలనఁ బుట్టిన గాలిచే మేఘములు చెదరి పోవఁ జేయుచున్న వాఁడై.

చ. విడివడి తాఁకె నిట్లు రణ♦వీరు లవారణ విక్రమంబునన్
గడుకొని దేవదానవుల♦కైవడిఁ బోరిరి బద్ధవైరు లై
యెడ గొన నీక వచ్చు శర♦వృష్టిరయంబును నాఁపి కాయముం
బొడ వొనరించి తంత్రిపథ♦ముం గొని గ్రుమ్మరుచున్న మారుతిన్. ౧౧౧౪

అర్థములు. విడివడి=యథేష్టముగ, అవారణ=అడ్డములేని, కడుకొని = ప్రయత్నించి, ఎడగొన నీక=సందు గలుగ నీయక, శరవృష్టిరయంబును=బాణ వర్షము యొక్క వేగమును, ఆఁపి=అడ్డగించి, తంత్రిపథమున్=ఆకాశమును.

తా త్ప ర్య ము.

విచ్చల విడి తాఁకెను. ఇట్లు యుద్ధమునందు వీరు లగు హనుమ దింద్రజిత్తులు దేవదానవులవలె విరోధబుద్ధిచే యుద్ధము చేసిరి. అప్పుడు సందులేక వచ్చుచున్న బాణవర్షముయొక్క వేగము నడ్డగించిన వాఁడై దేహము పెంచి వాయుమార్గ మునఁ జరించుచున్న యాఁజనేయుని.

ఉ. ఆయతతీక్ష్ణశల్యకన♦కాంచితపుంఖశరాలి వైచె న
త్యాయతవేగ మార నసు♦రాధిపనందనుఁ డంత దూర్యముల్
పాయక భేరికాపటహ♦వారరవంబులుఁ గార్ముకధ్వనుల్
మ్రోయఁ దొడంగె దాని విని ♦ రోషమునం బవమాన సూతియున్. ౧౧౧౫

అర్థములు. ఆయత = నిడుపైన - తీక్ష్ణ = పదునైన. శల్య = ములికి కల, కనకాంచిత పుంఖ శరాలిన్ = బంగారుచేఁ బ్రకాశించు పింజలు గల బాణ సమూహమును, అత్యాయత వేగము=మిక్కిలి యధికమైన వేగము, తూర్యముల్= వాద్యధ్వనులు, భేరికా=నగారాలయు, పటహ = తప్పెటలయు, రవంబులు= ధ్వనులు, కార్ముకధ్వనుల్=వింటి చప్పుడులు.

తా త్ప ర్య ము.

నిడుపై వాఁడియగు ములుకులు గల బంగారు పింజబాణములను మిగుల వేగముగ వేసెను. దానిని జూచి వాద్యధ్వనులు, భేరులు, తప్పెటలు రాక్షసులు మ్రోయించిరి. దానికి నాంజనేయుఁడు కోపించి.

మ. కృతహస్తుం డగు వాసవారి దనపైఁ ♦ గీలించు బాణావళిన్
వితథంగాఁ జేయుచు వాని యంతరమునన్ ♦ వేగంబు దీపింపఁగా

ధృతి పెంపారఁ జరించు, నెట్టయెదుటన్ ♦ దృగ్గోచరుండౌ, నభో
గతుఁడౌ, వెంటనె మీఁద దూఁకుఁ, గరయు♦గ్మం బడ్డగించు న్వెసన్. ౧౧౧౬

అర్థములు. కృతహస్తుఁడు = బాణములు గుఱి తప్పక వేయువాఁడు, 'కృతహస్త స్సుప్రయోగ విశిఖః – కృతపుంఖవత్'. అమర. వితగా = వ్యర్థముగా, అంతరమునన్ = నడుమ.

తా త్ప ర్య ము .

గుఱి సూటిగ వేయు నింద్రజిత్తు తన మీఁద వేయు బాణములను వ్యర్థపఱుచుచుఁ దనకుఁ దగులకుండఁ జేసికొనుచు నా బాణములకు నడుమ మిగుల వేగముగా దిరుగును. ఎట్ట యెదుటఁ గానవచ్చును. ఎదుట నున్నాఁడని బాణము వేయునంతలో నాకాశమున నుండును. అంతలో మీఁద దూఁకును. చేతు లడ్డము పెట్టును.

ఉ. ఇద్దరు యుద్ధకర్మచణు ♦ లిద్దఱు భూరిజవాధికోత్తముల్
పద్దుగఁ బోరి రిద్దఱు న♦పారపరాక్రమ ముల్లసిల్లఁగా
నద్దిర నాఁగ భూతనిచ♦యంబు, పరస్పర తారతమ్య మా
యిద్ద ఱెఱుంగ రైరి యసు♦రేశ్వరనందన వాయునందనుల్. ౧౧౧౭

అర్థములు. యుద్ధకర్మచణులు = యుద్ధము చేయుట యందు సమర్థులు, భూరి = గొప్ప, జవాధిక = మిక్కిలి వేగమునందు, ఉత్తముల్ = గొప్పవారు.

తా త్ప ర్య ము

ఇద్దఱు యుద్ధమందు సమర్థులు, ఇద్దఱు నతివేగము గలవారు. అంతము లేని పరాక్రమముతో భూతసమూహము లాశ్చర్యపడఁగా యుద్ధము చేసిరి. ఇంద్రజిత్తు హనుమంతులు పరస్పర తారతమ్యము నెఱుఁగ లేరైరి.

చ. హనుమ యెఱుంగఁ డయ్యె నసు♦రాధిపనందను నంతరంబు, నా
దనుజుఁ డెఱుంగఁ డయ్యె వసు♦ధారుహచారుని యంతరంబు, నా
యనఘులు పోరుచో దృఢస♦మాధిని నింద్రజి బాణముల్ వృథా
చనుటయ కాని కీశవరుఁ ♦ జక్కఁగ నాటవ యేమి సేయుదున్. ౧౧౧౮

అర్థములు. అంతరము = ఛిద్రము – లోపము, వసుధారుహచారుని = క్రోఁతియొక్క, దృఢసమాధిని = గట్టి నిశ్చల మనస్సుతో, ఇంద్రజి = ఇంద్రజిత్తు, అనఘులు = యుద్ధకర్మమందు దోషము లేనివారు.

తా త్ప ర్య ము .

ఇంద్రజిత్తునందలి లోపము హనుమ తెలిసికొన లేఁడయ్యె. హనుమలోపము నింద్రజిత్తు తెలిసికొన లేఁడయ్యె. ఇట్లు యుద్ధకర్మమందు లోపము లేక పోరునపుడు ఇంద్రజిత్తు తనలో నిట్లు లాలోచించెను. నా బాణము లన్నియు వ్యర్థములై పోవుచున్నవి. కాని వానిలో నొకటి యైన క్రోఁతిని దాఁకినది లేదే. ఏమి సేయుదును?

—♦ ఇంద్రజిత్తు హనుమంతుని బ్రహ్మాస్త్రమున బంధించుట. ♦—

చ. చిక్కఁడు లక్ష్యసిద్ధికిని ♦ జేవడి వీని వధింప శక్యమా
యెక్కరణిం గ్రహింప నగు ♦ నీతని నంచుఁ బితామహాస్త్రముం
గ్రక్కున నారికిం దొడిగి ♦ రావణి పావని వైచి కట్టె వీఁ
డుక్కరి యొంటఁ బోఁ డనుచు♦నుర్విపయిం బడె దానఁ గ్రోఁతియున్. ౧౧౯

అర్థములు. చేవడి= చేతి వేగముచే, పితామహాస్త్రమున్ = బ్రహ్మాస్త్రమును, నారికిన్ = అల్లెత్రాటికి; తొడిగి=సంధించి, ఉక్కరి = బలశాలి, ఒంటఁబోఁడు = మఱియొక విధముగఁ జిక్కఁడు.

తాత్పర్యము.

నా గుఱికి వీఁడు చిక్కుట లేదు. భుజబలముచే వీనిని జంప సాధ్యముగాదు. ఏ విధముగ వీనిని గట్టివేయ సాధ్యమగునని యాలోచించి బ్రహ్మాస్త్రమును వింట సంధించి యింద్రజిత్తు వీఁడు మఱియొక బాణమునకు సాధ్యుఁడు కాఁడని యాంజనేయునిమీఁద వేసి కట్టెను. దానితోఁ గ్రోఁతి నేలఁబడెను.

ఉ. వ్రాలి విచేష్టుఁడై పవన♦సూనుఁడు బ్రహ్మవరంబు నెంచి దో
ర్లీల నడంచి నిర్జరవ♦రిష్ఠుని యానతి దాఁట శక్యమా
పాలన సేయుటే పరమ♦భవ్యము చిక్కితిఁ బో భయంబు లే
దోలిఁ బితామహుండును బి♦డౌజుఁడు వాయువు నన్నుఁ గావఁగన్ ౧౨౦

అర్థములు. వ్రాలి= నేలఁబడి-విచేష్టుఁడై = కాలుసేతులు కదలింపనివాఁడై, దోర్లీలన్=భుజబలమును - నిర్జర వరిష్ఠుని = దేవతాజ్యేష్ఠుఁడగు బ్రహ్మయొక్క, ఆనతి = ఆజ్ఞ, పితామహుండును = బ్రహ్మయు - బిడౌజుఁడును = ఇంద్రుఁడును, నాలుగవపాదంబున వృద్ధివళి గావున బిడ+ఓజన్ లోని ఓకారముతో యతిచెల్లెను.

తాత్పర్యము.

కాలు సేతులు కదలింపలేక నేలఁబడి యాంజనేయుఁడు బ్రహ్మ దన కిచ్చిన వరము స్మరించి భుజపరాక్రమము చాలించి బ్రహ్మ యాజ్ఞ దాఁటవచ్చునా? దానిని రక్షించుటే మిగుల శ్రేయస్కరము. వీరికిఁ జిక్కితిని బో నాకు వరము లిచ్చిన బ్రహ్మ యింద్రుఁడు తండ్రి యగు వాయువు నన్ను రక్షింపఁగా నాకు రాఁగల భయమేమి?

క. ననుఁ బట్టుకొనుచుఁ బోదురొ, దనుజులు పోవుదురు గాక♦దశకంధరునిం
గనుఁగొని సంభాషింపఁగఁ,జను నదియును నొక్కమేలె♦చర్చింపంగన్. ౧౨౧

తాత్పర్యము.

వీరిచేతఁ జిక్కితిని బో వీరు నన్నేమి చేయుదురు. రావణాజ్ఞ లేక వీరేమియుఁ నన్ను జేయఁజాలరు. కావున వీరు నన్నుఁ బట్టుకొని రావణు నొద్దకుఁ దీసికొని

పోదురు. పోనీ రావణుతో సంభాషింపఁ గలుగుదును కావున నదియునొక మేలే. వాని యభిప్రాయము తెలిసికొని నట్లు లగును గదా.

ఆ. అని సమీక్ష్యకారి♦యా హనుమంతుఁడు, చేష్ట లుడిగి యుండి♦దుష్టు లతిమి
నారత్రాళ్ళఁ బెనిచి♦నారచీరలు గట్ట, గూఁత లిడియెఁ గ్రోఁతి♦గుణముఁ దెలుప.

అర్థములు. సమీక్ష్యకారి=ఆలోచించి కార్యము చేయువాఁడు. సమ్+ఈక్షాం+కరోతీతి సమీక్ష్యకారీ = ఈక్షించుట = చూచుట – దీనికి పర్యాయశబ్దములకు నాలోచించుట యని యర్థము గలదు. అతిమి=అతిక్రమించి.

తాత్పర్యము.

చక్కఁగా నాలోచించి కార్యముచేయు నాహనుమంతుఁడు కదలక మెదలక యూరకుండి యా దుష్టరాక్షసులు పైబడి నార త్రాళ్ళతో నార గుడ్డలు పెనవేసి తన్నుఁ గట్టుచుండఁగాఁ దన క్రోఁతి గుణము దెలుపుటకై కూఁతలు పెట్టుచుండెను.

——♦ రాక్షసులు హనుమంతునిఁ గట్టి రావణునొద్దకుఁ దీసికొని పోవుట. ♦——

చ. కనుఁగొని నిర్విచేష్టుఁ డగు♦కైసరి నాశరవార మెల్లఁ గిం
కను బలితంపుఁ బగ్గములఁ♦గ్రౌర్యమునన్ ద్రుమచీరపాళితోఁ
గొనకొని కట్టఁగా నసుర♦కుంజరుఁ డుత్కటకౌతుకంబునన్
గను నను నంచు నోర్చి కపి♦కట్టులు సైఁచి యణంగి యుండఁగన్. ౧౧౩

అర్థములు. నిర్విచేష్టుఁడు=ఏ చేష్టలు లేనివాఁడు, కైసరిన్ = హనుమంతుని, కేసరి పుత్త్రుఁడు కైసరి–అపత్యార్థక తద్ధితము. ఆశరవారము=రాక్షససమూహము. ద్రుమ చీరపాళితో=చెట్లపట్టలతోనైన వస్త్రముల సమూహముతో–కొనకొని=ప్రయత్నించి.

తాత్పర్యము.

ఇట్లు హనుమంతుఁడు చేష్ట లుడిగి పడి యుండుట చూచి చూచి రాక్షసులు కోపించి, బలముగల పగ్గములను నారవస్త్రములతోఁ బెనవేసి ప్రయత్న పూర్వకముగాఁ గట్టఁగా రావణాసురుఁడు మిగులఁ గౌతుకముతోఁ దన్నుఁ జూచును గాక యని హనుమంతుఁడు కట్లు సహించి యూరకుండెను.

చ. అసురలు త్రాళ్ళఁ బగ్గముల♦నా హనుమంతునిఁ గట్టినంతనే
వెస వెస వస్త్రబంధమును♦వీడి చనెన్, ద్రుహిణాస్త్రబంధముల్
పసచెడి పోవు నన్య మగు♦బంధచయంబులతోడఁ గూడినన్
లసదసమాస్త్ర మీగతి ఫ♦లం బటిపోవుట చూచి దీనుఁడై. ౧౧౪

అర్థములు. ద్రుహిణాస్త్రబంధముల్=బ్రహ్మాస్త్ర బంధములు, లసత్ = దివ్య తేజస్సుతోఁ బ్రకాశించు, అసమాస్త్రము = సమానము లేని యస్త్రము, ఫలంబటి=ఫలము చెడి.

తా త్ప ర్య ము.

రాక్షసులు త్రాళ్ళ చేతను, బగ్గముల చేతను హనుమంతుని గట్టఁగానే బ్రహ్మాస్త్ర బంధములు తొలఁగిపోయెను. బ్రహ్మాస్త్ర బంధములు మఱియొక బంధములతోఁ గూడెనేని వ్యర్థమై పోవును. అసమానశక్తిగల యస్త్ర మీ విధముగ నిష్ఫలమై పోవుట చూచి శోకించినవాఁడై.

బ్రహ్మాస్త్ర బంధబలమునందు విశ్వాసము లేనివారై రాక్షసులు త్రాళ్ళతోఁ గట్టఁగనే యా యవమానము సహింపలేక యస్త్రబంధము లూడిపోయెను. అట్లులే ప్రపత్తి చేసినవాఁడు దానియందు విశ్వాసము లేక దానికి సాహాయ్యమని వేఱొక సాధనమును గ్రహించెనేని ప్రపత్తి చెడును ప్రపత్తి యందుండు నపాయ మిదియే. ఇతరోపాయముల నది సహింపదు. ఉత్తములు నీచ సహవాసము సహింతురా.

శా. అయ్యో! యెంతటి కార్య మిట్లు విఫలం ♦ బాయెన్, సురారుల్ మహా
జయ్యం బౌ వరమంత్రశక్తి మది నెం♦చం జాలరై రక్కటా!
యి య్యస్త్రంబు పునఃప్రయుక్తమయి కా♦దేనిన్ మఱొం డస్త్రమేన్
గయ్యానన్ ఫలకారి కా దొదవె, శం♦కన్ సర్వదైత్యాళికిన్. ౧౦౨౫

తా త్ప ర్య ము.

అయ్యో! యెంత గొప్ప ప్రయత్న మిట్లు వ్యర్థమై పోయెను. ఈరాక్షసులు జయింపరాని గొప్ప మంత్రశక్తియందు నమ్మకము లేనివారైరి కదా. ఈయస్త్ర మును మఱలఁ బ్రయోగింపరాదు. ఇది వ్యర్థమైన చోట మఱి యే యస్త్రము పనిచే యదు. ఇఁక నేమి గతి? వీనిచే రాక్షసులందఱు నాశమై పోవు కాలము వచ్చినది.

చ. తనమెయి నస్త్రబంధములు ♦ దాఱు టెఱుంగఁడు గాక వానరుం
డని యిటు చింత సేయఁగ సు♦రాధిపజేత, పనాటనేత బం
ధనములఁ గట్టి కట్టెయలఁ ♦ దాచుచు ముష్టుల బిట్టు గ్రుద్దుచున్
గొని చని రావణాసురుని ♦ కొల్వున నిల్పిరి క్రూరరాక్షసుల్. ౧౦౨౬

అర్థములు. తనమెయిన్ = తన దేహమునందు, తాఱుట = వదలిపోవుట, సురాధిపజేత = ఇంద్రజిత్తు.

తా త్ప ర్య ము.

తన దేహమును గట్టిన యస్త్రబంధములు వదలిపోవుట వానరుఁ డెఱుఁగఁడు. కావుననే చిక్కుపడి యున్నాఁడు. తెలిసిన విజృంభించి యుండును. అని యింద్రజిత్తు ఆలోచించుచుండఁగా క్రోఁతిపతిని త్రాళ్ళతోఁ గట్టి కట్టెలతోఁ గొట్టుచు, పిడికిళ్లతో గ్రుద్దుచుఁ దీసికొనిపోయి కొలువుకూటమందున్న రావణాసురుని యెదుట రాక్షసులు నిలిపిరి.

ఉ. తెచ్చితి మయ్య! క్రోఁతి నని ♦ తెల్పిన నచ్చట నున్న వారు వీఁ
డెచ్చటనుండి వచ్చె? నితఁ ♦ డెవ్వఁడొ? యెవ్వఁడు పంపెఁ? దాను రా

నిచ్చట కేమి కార్య? మిటు ♦ లేటికిఁ జేసె నటంచు నొండొరుల్
ముచ్చట లాడుచుండ మద♦మోహమునన్ మఱికొంద ఱుద్ధతిన్. ౧౧౨౮

తాత్పర్యము.

తెచ్చితిమయ్య క్రోఁతిని, క్రోఁతి యని మొదటఁ జెప్పిన నింద్రజిత్తుని గూఁడ జంపెనని రావణుఁడు భయపడునని తెచ్చితిమని మొదటనే చెప్పిరి. రాజా! తెచ్చితిమి క్రోఁతినని తెలుపఁగా నాసభయందున్న వారు వీఁడెక్కడినుండివచ్చెను? వీఁడెవ్వఁడు? వీనిని బంపిన వాఁడెవ్వఁడు? ఏమిపని గలిగి వచ్చినాఁడు? ఏల యిట్లు చేసెను. అని యొకరితో నొకరు ముచ్చటలాడు చుండఁగా మదమోహముచే దేహము తెలియని కొందఱు గర్వించి,

ఉ. కట్టుఁడి కొట్టుఁడీ యతనిఁ ♦ గాల్పుఁడి మ్రింగుఁ డటంచుఁ గ్రుద్ధులై
నెట్టన పల్కుచుండ విని ♦ నీరజబాంధవవంశ్యదూత యు
ప్పట్టున రాక్షసాధిపుని ♦ పాదసమీపమునందు మంత్రులన్
దిట్టల వృద్ధసేవకుల ♦ దివ్యమణీమయగేహముం గనెన్. ౧౧౨౯

అర్థములు. నీరజబాంధవ వంశ్యదూత = రామదూత.

తాత్పర్యము.

కట్టుఁడు, కొట్టుఁడు, కాల్పుఁడు, మ్రింగుఁడని కోపించి రాక్షసులు పలుకుచుండఁగా విని రామదూత రాక్షసుల వెంటఁబోయి రావణుని పాదముల యొద్ద నున్న మంత్రులను దిట్టలను వృద్ధులను సేవకులను జూచెను. మఱియు దివ్యరత్నములతో నిండిన యా సభామంటపమును జూచెను.

క. ఇటురా యిటురా యనుచును. బటువికృతాకార దైత్య♦భటు లీడ్వఁగ ముం
దటఁ గనుఁగొనె దశముఖుఁ డు,ద్భటసాధ్వస హేతుతేజు ♦ వాయుతనూజున్.

అర్థములు. పటువికృతాకార దైత్య భటులు = మిగుల వికారములైన యాకారములు గల రాక్షస భటులు, ఉద్భట=మిగుల- సాధ్వస హేతు = భయకారణమైన- తేజున్ = పరాక్రమము గలవానిని.

తాత్పర్యము.

మిగులవికార మైన యాకారములు గల రాక్షసభటు లిటు రారా యని, యొకఁడీడువఁగా మఱియొకఁడిటురారా యని యిటు లీడ్వఁగా వచ్చి యెదుట నిలువఁబడిన మిగుల భయము గలిగించు తేజముగల హనుమంతుని రావణుఁడు చూచెను.

క. మర్కటసత్తముఁడును గనె, నర్కునివలె వెలుఁగువాని ♦ నతిబల తేజున్
గర్కశముఖు రాక్షసపతిఁ, దర్కింపఁగ రాని మహిమఁ♦దనరఁగ నతఁడున్.

తాత్పర్యము. ౧౧౩౦

సూర్యునివలె వెలుఁగు వానిని, మిగుల బలము, తేజము గలవానిని, గోప

ముచేఁ గఠినమైన ముఖము గలవానిని, నూహింపరాని మహిమగలరావణుని వానరుఁడును జూచెను. అప్పుడా రావణుఁడు.

చ. వికటతరాగ్రహారుణిత♦వింశతిలోచనముల్ వెలుంగఁగాఁ
బ్రకటమనీషులన్ సచివ♦రాజుల సత్కులశీలవృద్ధులన్
నికటతలానువర్తుల న♦నెం, గపి యెవ్వఁడెఱుంగుఁడీరు త
త్సకల మటన్న వారు కపి♦సత్తముఁ గార్యముఁ బ్రశ్నసేయఁగన్. ౧౧౩౧

అర్థములు. వికటతర = మిగుల భయంకరమైన, ఆగ్రహ = కోపముచేత- అరుణిత = ఎఱుపుగల-అరుణశబ్దము తారకాది గణములోఁ జేరినది. తారకాదిగణ మాకృతి గణము - తదస్య సంజాతం - తారకాదిభ్య ఇతచ్ (పాణిని౫-౨-౩౬) వింశతి లోచనముల్ = ఇరువది కన్నులు - ప్రకట మనీషులన్ = ప్రసిద్ధ బుద్ధిమంతులను -మనీషాశబ్దము శకంధ్వాదులలోఁ జేరినది. "శకంధు రథ కర్కంధూః కుద్దాలో లక్షసర్కటీ। లాంగలీషా హలీషాచ మనీషాచ పతంజలిః। కుల్కలోష్ణీష మంజీర మస్తిష్కకులటాయదః। తథా వృకంథు సీమన్తౌ శకంధ్వాది గణే స్మృతాః. శకంధ్వాదిషు టేః పర రూపం వాచ్య మ్మని వీనియందు పరరూపసంధి- మనస్ + ఈష - మనీష - మనీష గలవారు - మనీషులు - సచివరాజులన్ = మంత్రిశ్రేష్ఠులను - నికట తరానువర్తుల = మిగుల సమీపమందుండు వారిని.

తాత్పర్యము.

మిగులభయంకరములై యెఱ్ఱనైన యిరువది కన్నులు వెలుఁగఁగాఁ దనకు మిగుల సమీపమందుఁ గూర్చుండిన మిగుల బుద్ధిమంతులగు మంత్రిశ్రేష్ఠులతోను, కులమునందు, నాచారమందుఁ బెద్దవారితోను వీఁడెవ్వఁడో తెలిసికొనుఁడని చెప్పఁగా వారును హనుమంతునిఁ బ్రశ్నించిరి.

క. హరిలోకేశ్వరుఁడగు నా♦హరితనయుం డంప దూత♦నై యిచ్చటి కే
నరుదెంచితి నని వారికిఁ, బరమబలోదారుఁ డొసఁగెఁ♦బ్రత్యుత్తరమున్ ౧౧౩౨

అర్థములు. హరి లోకేశ్వరుఁడు = వానరకోటుల ప్రభువు - హరి తనయుండు = సూర్య పుత్రుఁడగు సుగ్రీవుఁడు-పరమ బలోదారుఁడు = గొప్ప బలము గల వారిలో గొప్పవాఁడు.

తాత్పర్యము.

వానర రాజగు సుగ్రీవుఁడు పంపఁగా వచ్చితినని వారికి మహాబలుఁడగు నాంజనేయుఁడు ప్రత్యుత్తర మిచ్చెను.

ఇది వ్యాస వాక్యమునకు ముందు సంగ్రహ వాక్యమనియైన గ్రహింపవచ్చును, లేక సభ్యుల కిచ్చిన ప్రత్యుత్తరమని యైనఁ దలఁప వచ్చును.

## —♦ ౪౯–వ సర్గము. హనుమంతుఁడు రావణుని సభలోఁ జూచుట ♦—

క. హనుమయు రావణుచర్యల, కును నబ్బురపాటు గదురఁ♦గోపారుణలో
చనుఁడై నిర్లక్ష్యగతిం, గనుఁగొనియెం బంక్తికంఠుఁ♦గలహోత్కంఠున్. ౧౧౩౩

అర్థములు. కోపారుణలోచనుఁడై = కోపముకే నెఱ్ఱనైన కన్నులు గలవాఁడై, నిర్లక్ష్యగతిన్ = సరకు సేయని విధముగ, కలహోత్కంఠున్ = యుద్ధమందు తహతహపాటు గలవానిని – రావణు నెట్టులైన యుద్ధమున కీడ్చి నాలుగు తన్నులు తన్న వలెనని హనుమంతునియాలోచన. తాను యుద్ధమునకుఁ బోక యె హనుమంతుని బట్టి తెప్పింప వలయు నని రావణు నాలోచన. వాని యాలోచనయే వాఁడు ఫలింప జేసుకొనియెఁ గదా యని హనుమంతుఁడు ఆశ్చర్యపడెను.

### తాత్పర్యము.

రావణుడు చేసిన కార్యములకు హనుమంతుఁడు ఆశ్చర్యపడి కోపముచే నెఱ్ఱనైన కన్నులు గలవాఁడై కలహమునందు మిగుల గోరిక గల రావణుని సరకు సేయక చూచెను.

సీ. అతులమహార్హ ము♦క్తావళీవృతమయి, మెఱుఁగారు మకుటంబు♦పదులు వాని
సంకల్పసంభూత♦జాంబూనదాభర, ణాంచిత మైన దే♦హంబువాని
క్షౌమవస్త్రుని రక్త♦చందనలిప్తుఁడై, వలపులు వెదఁగ్రమ్మ♦గొలుపువాని
దర్శనీయంబులై♦తగవివృతంబులై, దెఱపెట్టు కన్నుల♦మెఱపువాని
తే. మెఱుఁగుఁగోఱలు వ్రేలువా♦తెఱయుఁ గలుగు
వక్త్రదశకంబుతోడ స♦వ్యాళమంద
రాద్రిశిఖరంబునకు నెన♦యైనవాని
సమరవరులకు హృచ్ఛల్య♦మైనవాని. ౧౧౩౪

అర్థములు. అతుల = అసమానమై – మహార్హ = మిగుల వెలగలవైన– ముక్తావళీ = ముత్యముల వరుసలచే– వృతయయి = చుట్టఁబడినవై– మెఱుఁగారు = కాంతిచే నతిశయించు, మకుటంబు = కిరీటంబు– తలలు పది చెప్ప మకుటమొక్కటియే చెప్పుటచే నడిమి శిరస్సునకు మాత్రమే కిరీటము గలదని యేర్పడుచున్నది. సంకల్పసంభూత = తలఁపులచేతనే కలిగిన, జాంబూనదాభరణ = బంగరుసొమ్ములచే, అంచితము = ప్రకాశించునది. మనస్సుచే గల్పింపఁబడిన వనుటచే కోరినవెల్ల లోపము లేకుండ నిర్మింపఁబడినవని భావము. చేతితోఁ జేసిన వానియందేదైన లోపము లుండును. క్షౌమవస్త్రునిన్ = తెల్లని పట్టువస్త్రము కట్టుకొన్న వానిని, రక్తచందనలిప్తుఁడై = ఎఱ్ఱని గంధము పూసికొనినవాఁడై, వలపులు = వాసనలు, వెదఁగ్రమ్మన్ = నాలుగుప్రక్కల వ్యాపింపఁగా, దర్శనీయంబులై = చూడనందములై, వివృతంబులై = విచ్చఁబడినవై, వక్త్రదశకంబు తోడన్ = పదితలలతోడ, వా+తెఱ = పెదవి,

వా+ తెఱపి = వా+ తెరయన్నప్పుడు పండ్లకు తెరవలె నుండునది యని యర్థము. సవ్యాళ = పాములతోఁగూడిన, మందరాద్రి శిఖరమునకు = మందర పర్వతము యొక్క శిఖరమునకు. దీనివలన నడిమితల పెద్దదిగాను, దక్కినవి చిన్నవిగా నున్న వని భావము. ఎన=సమానము, హృత్ +శల్యము=గుండెగాలము.

## తా త్ప ర్య ము.

అసమానమై, గొప్పవారు ధరింపఁదగిన గొప్ప వెలగలవై ముత్యములచేఁ జుట్టబడి మెఱుఁగులు గ్రక్కుచుండు కిరీటము గలవానిని, మనస్సుచేఁ గల్పింపఁబడిన బంగారు సొమ్ములచేఁ బ్రకాశించు దేహము గలవానిని, తెల్లని పట్టువస్త్రము కట్టుకొన్న వానిని, ఎఱ్ఱని గంధము పూసికొని నలుప్రక్కల సువాసన వ్యాపింపఁ జేయు వానిని, చూడఁదగినవై తెఱవఁబడిన భయము కలిగించు కన్నుల వానిని, మెఱయు కోఱలు, వ్రేలాడు పెదవి, పదితలలు గలిగి పాపములతోఁడి మందరశిఖరమువలె నుండి దేవతలకు గుండెగాల మైన వానిని.

## —♦ రావణుని తలలు. ♦—

వింశద్భుజం దశగ్రీవం దర్శనీయ పరిచ్ఛదమ్. అర. ౩౨-౮
దశాస్యః కార్ముకీ బాణీ బభూవ. అరణ్య. ౫౧-౮
స్వం రూపం కాలరూపాభం - ప్రతిపద్య స్వకం రూపమ్
క్రుద్ధస్యాగ్నినిభా స్సర్వా రేజు ర్వింశతి దృష్టయః. అరణ్య. ౫౧-౧
వామబాహూ న్దశ తదా వ్యపాహర దరిందమః
సచ్ఛిన్నబాహో స్సద్యైవ బాహవ స్సహసాభవన్ అరణ్య. ౫౧-౩౯
ఏతౌ పాదౌ మయాస్నిగ్ధౌ శిరోభిః పరిపీడితౌ. అరణ్య. ౫౫-౩౫
శిరోభి ర్దశభి ర్వీరం భ్రాజరూపం మహౌజసమ్. సుంద. ౪౯-౬
బహుభి ర్బద్ధకేయూరై శ్చందనో త్తమరూషితైః. ౪౯-౮
దశాస్యో వింశతిభుజః ప్రగృహీత శరాసనః
అదృశ్యత దశగ్రీవో మైనాక ఇవ పర్వతః. యుద్ధ. ౧౦౩-౩౪

విక్షిప్య దీర్ఘౌ నిశ్చేష్టౌ భుజావంగద భూషితౌ, అని రావణు మరణానంతరము రెండు చేతు లొక తలలోనే కానవచ్చెను. నిద్రపోవు నపుడును రెండు చేతులు ఒక తలతోనే కానవచ్చెను.

ఇట్లు రామాయణమున రెండు విధములుగఁ జెప్పి యుండుటచేతను పది తల లుండుట విపరీతము గనుకను రావణుఁ డొంటి తలవాఁడే యనియుఁ బది తల లనునవి యత్యుక్తి యని కొందఱు, బచ్చెన తల లని కొందఱు నానావిధముల వ్రాసియున్నారు.

సీతాదేవి యొద్దకు నొంటితల సన్న్యాసిగాఁ బోయి యున్నట్టుండి పదితలల వాఁడగుటకు నీ బచ్చెన తలలును, జేతు లెండుఁ దాచి యుంచి తగిలించుకొనెనో! జటాయువు విఱుగఁదన్నినప్పుడివి యేల నేలఁబడియుండి రామలక్ష్మణులకుఁ గానరా లేదో! వానిని గూడ రావణుఁడు మూటకట్టుకొని పోయెను కాఁబోలు. ఇట్టి దురూహాలకు గ్రంథమునందుఁ బ్రమాణబుద్ధి లేకుండుటయే కారణము. రావణుఁడను పేరు రాకముందు వానిపేరేమో. నామకరణ మేమిగాఁ జేయఁబడెనో – వీ రాలోచించినవారు కారు. ఉత్తరరామాయణమున రావణుఁడు పుట్టినప్పుడే పదితలలతో బుట్టెనని చెప్పఁబడెను శివుఁడు రావణుఁ డను పేరు పెట్టువఱకుఁదన పేరు దశకంఠుఁ డనియె వాఁడు చెప్పుకొను చుండెను.

ఏవ ముక్తాతు సా కన్యా రామ, కాలేన కేనచిత్,
జనయామాస బీభత్సం రక్షోరూపం సుదారుణమ్।
దశగ్రీవం మహాదంష్ట్రం నీలాంజనచయోపమం
తామ్రోష్ఠం వింశతిభుజం మహాస్యం దీప్తమూర్ధజమ్॥
ఉత్తర. ౯ సర్గ. ౨౨. శ్లో. ప ౧౯౦ చూడు.

ఈ వాక్యములు రావణుఁడు పదితలలతోను, నిరువది చేతులతోను బుట్టెనని చెప్పుచున్నవి.

అథ నామాకరోత్తస్య పితామహసమః పితా
దశగ్రీవః ప్రసూతోయం దశగ్రీవో భవిష్యతి॥ ఉత్తర. ౧౯౨ వ. ప.

దీనిచే రావణునకు దశగ్రీవుఁ డనియే నామకరణమునాఁడు దండ్రిచేఁ జేరిడఁబడెను. ఆవల దశగ్రీవుఁడు బ్రహ్మనుగూర్చి తపస్సు చేయునపుడు తొమ్మిదితలలు గోసి వేల్చినట్లు ఉత్తర రామాయణమున ౨౦౨ వ పద్యమునఁ జెప్పఁబడెను. ఒంటి తలవాఁడైనచో నిది యెట్లు సాధ్యము. బచ్చెనతలలు కోసి హోమము చేయఁగా దానికి బ్రహ్మ మెచ్చుకొనెను గాఁబోలు.

నీ వెవఁడవు నీ పేరేమి యని మయుఁ డడిగినప్పుడు.
అహం పౌలస్త్యతనయో దశగ్రీవశ్చ నామతః
మునే ర్విశ్రవసో యస్తు తృతీయో బ్రహ్మణోఽభవత్.
ఉత్తర. ౧౨-౧౪ పద్య. ౨౫౪.

ఇందు రావణుఁడు తనపేరు దశగ్రీవుఁ డనియె చెప్పెను. దీనివలనఁ బది తలలు సహజము లనియుఁ గృత్రిమములు గావనియు నేర్పడెను.

పది తలల వాఁ డొంటితలవాఁడుగా నెట్లు కానవచ్చె నందురేమో, అది బ్రహ్మవరబలమున నే.

హుతాని యాని శీర్షాణి పూర్వం మగ్నౌ త్వయానఘ
పునస్తాని భవిష్యంతి తథైవ తవ రాక్షస,

ఛందత స్తవ రూపం చ మనసా యద్యదీప్సితమ్
భవిష్యంతి న సందేహో మద్వరా త్తవ రాక్షస॥ఉత్తర ౧౦—౨౫వ. ౨౦౭

రావణుఁడు కోరినప్పుడు కోరిన రూపమెత్తు వరము బ్రహ్మయిచ్చెను గావునఁ గోరినప్పుడొంటితలతోను, పది తలలతోను నుండఁగలఁడు.

ప్రకృతివిరుద్ధమని ప్రకృతి రహస్య మంతయుఁ దెలిసినసర్వజ్ఞుఁడు చెప్పఁదగిన మాట. మన తెలివి లేమిచేఁ గొన్ని దినములకు ముందుప్రకృతివిరుద్ధములని తలఁచినవి నేఁడు కన్నులారఁజూచుచున్నాము. మూఁడుతలలవారిరువురు, రామాయణమందే చెప్పఁబడిరి. రెండుతలల మనుష్యులమనముచూచియున్నాము. ఒక తెకు నలుగురు బిడ్డలు పుట్టుట, మగవాఁడాఁడుది యగుట, ఆఁడుదిమగవాఁడగుట నేఁడుప్రసిద్ధములైనవి. పుష్పకవిమానముగురించియు నేఁటి పెద్ద మనుష్యు లవివేకపు వ్రాఁతలు వ్రాసియున్నారు. అది యుద్ధకాండమునఁ జర్చింపఁ బడును.

ఉ. కాటుకప్రోవుఁబోలు మెయి♦గ్రాల నురంబునఁ దారహారముల్
నీటు చెలంగ నిండు నెల♦నెయ్యముఁ జూపు ముఖంబుతో బలా
కాటనయుక్తవారిదము♦నంగు వహించెడివానిఁ జిత్రిత
స్ఫాటిక రత్నపీఠమున♦సౌరు వహించెడివాని వీరునిన్. ౧౧౩౫

అర్థములు. ప్రోవు = రాశి, బలాకాటన యుక్త వారిదము = కొంగల సంచారముతోఁగూడిన మేఘము, అంగు = అందము.

తాత్పర్యము.

కాటుక కుప్పవంటి నల్లని యురంబున ముత్యాల దండలు సొగసుగాఁ గనఁబడఁ జంద్రునితో సమానమైన ముఖముతోఁ గొక్కెరలతోడి మేఘమువలె నుండువానిని, చిత్రపుఁబనిచేయఁబడిన స్ఫటికములు, రత్నములు చెక్కబడిన సింహాసనమందుఁ గూర్చుండి శోభించువానిని, వీరుని.

క. అంగదకేయూరాదిక, సంగతములు పీవరములు♦చందనయుతముల్
రంగుగ నైదుశిరములభు,జంగము లనఁ దేజరిలు భు♦జంబులతోడన్. ౧౧౩౬

అర్థములు. అంగదకేయూరాదికసంగతములు = రెట్టకడియములు, బాహుపురులు మొదలయిన వానితోఁ గూడినవి. పీవరములు = బలసినవి. చందనయుతముల్ = గంధము పూయఁబడినవి.

తాత్పర్యము.

రెట్టకడియములు, బాహుపురులు మొదలయిన వానితోఁ గూడి బలసి గంధపుబూఁత గలిగి యైదుతలల పామువలెఁ బ్రకాశించు భుజములతో.

సీ. కంకణఝణఝణ♦త్కారంబు తోరంబు,గను జామరములు జ♦వ్వనులు వైవ
మంత్రతత్త్వజ్ఞులౌ♦మంత్రివరుల్ దుర్ధ,రుఁడు ప్రహస్తుఁడునికుం♦భుఁడునుమఱిమ

హ్యపార్శ్వుఁడును భువ♦నాళి వార్ధిచతుష్టయంబు రీతిని జుట్టి♦యమరు చుండ
నితరమహామాత్రు ♦ లింద్రుని సురతతి, భంగిని భజియింపఁ♦బ్రబలువాని.
తే. మేరు శిఖరాగ్రగత మైన♦వారి యుక్త
వారిధర మన వెలుఁగొందు ♦ వాని రాక్ష
సేశ్వరుని రావణునిఁ జూచి ♦ హృదయసీమఁ
బరమవిస్మయపరుఁ డయి ♦ పవనజుండు. ౧౧౩౭

అర్థములు. తోరంబు=అధికము-స్థూల శబ్దభవము. జవ్వనులు=యావన వతులు; మంత్రతత్త్వజ్ఞులు = ఆలోచనల రహస్యము దెలిసిన వారు; వార్ధి చతుష్టయము=నాలుగు సముద్రములు; ఇతర మహామాత్రులు=ఇతర సచివులు; మేరుశిఖరాగ్రగతము = మేరుశిఖరము కొన నుండునది, వారియుక్త = నీళ్ళతోఁ గూడిన, వారిధరము = మేఘము.

తా త్ప ర్య ము.

వయస్సు పడుచులు చేతి కంకణములు ఝణంఝణ యని విశేషముగ మ్రోగుచుండఁ జామరములు వేయఁగా ఆలోచనలు చెప్పు మంత్రులు ప్రహస్తుఁడు, నికుంభుఁడు, దుర్ధరుఁడు, మహాపార్శ్వుఁడు ననువారు భూమిని నాలుగు సముద్రములు చుట్టుకొను నట్లు చుట్టియుండ ఇతర మంత్రులు దేవేంద్రుని దేవతల వలెఁ గొంచెము దూరమునుండి సేవింప, మేరుశిఖరము కొన నుండు నీళ్ళు గల మేఘమువలె నల్లగా నుండు వానిని, రావణుని జూచి హనుమంతుఁడు మిక్కిలి యాశ్చర్యపడెను.

శా. ఔరా రూప! మహో బలంబు! ధృతి యా♦హా! తేజమా యద్దిరా!
యౌరా రాజసమస్తచిహ్నకలనం ♦ బయ్యో యధర్మక్రియా
చారోదారుఁడు కాఁడ యేనియు బిడౌ♦జస్సంయుతం బో మరు
ద్వారాగారము నేల లేఁడె యితఁ డు♦ద్యచ్ఛక్తి సంపన్నతన్. ౧౧౩౮

అర్థములు. అధర్మక్రియాచారోదారుఁడు = అధర్మ కార్యములు చేయుట యందు గొప్పవాఁడు-బిడౌజః+సంయుతంబు=ఇంద్రునితోఁ గూడినది - మరుత్+వార+అగారము = స్వర్గము, ఉద్యత్+శక్తి+ సంపన్నతన్ = కలుగు చున్న శక్తి సంపత్తిచే.

తా త్ప ర్య ము.

ఏమి రూపము, ఏమి బలము, ఏమి ధైర్యము, ఏమి తేజము! ఔరా రాజుల కుండవలసిన యన్ని చిహ్నములు కలవే. ఇట్టివాఁడు ధర్మవిరుద్ధ కార్యములు చేయని వాఁడగు నేని యింద్రుని తోడి స్వర్గము నైనను దనశక్తి సంపత్తిచేఁ బాలింపలేఁడా.
క. కూ్రరుం డై భూతదయా,దూరుం డై లోకమెల్ల ♦ దూషించు పనుల్
వారక సలుపుట గాదే, సౌరాసురసమితి లోక♦చయములు వణఁకున్. ౧౧౩౯

అర్థములు. సౌర + అసుర + సమితి = దేవతల సమూహము, అసుర సమూహము.

తాత్పర్యము.

కఠిన మనస్సు గలవాఁడై, భూతదయలేని వాఁడై, జనులందఱు దూషించు చెడుకార్యములు చేయుటఁబట్టిగదా దేవతలు దానవులుకూడ వడఁకు చున్నారు.

క. లోకంబు నెల్లఁ గినుకను, నేకార్ణవముం బొనర్పనితఁ డెంచినచో
 పీకున నట్లొనర్పం, డే? కా దనువార లెవ్వరీ గురుతేజున్. ౧౧౪౦

అర్థములు. ఏకార్ణవము = ఒక్కసముద్రము, పీకున = బలమున.

తాత్పర్యము.

వీఁడు కోపించి, పరాక్రమించి లోకము లన్నియుఁ బ్రలయకాలమందువలె నొక్కసముద్రముగా జేయఁబూనెనేని యీ గొప్పతేజస్సు గలవానిని నడ్డగించువారు గలరా?

—౫౦-వ సర్గము. రావణుఁడు హనుమంతునిఁ జూచి యోజించుట—

మ. అను నాలోచన నుండ రావణుఁడు పింగాక్షుం బురోదేశవ
 ర్తిని గీశేశుని నట్టె చూచి మది సందేహించెఁ గైలాసమున్.
 ఘనశక్తిం బెకలింప శాప మిడు సాక్షాన్నందియా యేమి వ
 చ్చెను లంకకుఁ? గాక బాణుఁడో వచ్చెం గ్రోఁతిరూపంబునన్. ౧౧౪౧

అర్థములు. పింగాక్షున్ = పచ్చని కన్నులు గలవానిని, పురోదేశవర్తిని = తనకు ముందుప్రదేశమందుండు వానిని, కీశేశుని = వానరశ్రేష్ఠుని, బాణుఁడో = ఈబాణుఁడు కృష్ణునితోఁటి బాణుఁడుకాఁడు. వానిపేరుగల మఱియొకఁడు. బాణుఁడు శత్రుపక్షమువాఁడుగాఁ జెప్పఁబడుటచే వాఁడుకూడ రావణు శపించెనని తోఁచుచున్నది.

తాత్పర్యము.

ఈ ప్రకార మాంజనేయుఁ డాలోచించుచుండఁగా గోరోచనవన్నెగల కనులు గలవానిని, దనయెదుట నున్నవానిని, వానరుని నెగాదిగ చూచి వీఁడునేను గైలాసమును బెల్లగించినపుడు నన్ను శపించిన యీ నందియే యీ రూపముతో వచ్చెనో, లేక బాణుఁడే క్రోఁతి రూపము ధరించి వచ్చెనా యని సందేహించెను.

మ. అని శంకించి సరోషతామ్రనయనుండై మంత్రివర్యుం బ్రహ
 స్తుని వీక్షించి ప్రహస్త! నీ వడుగు మీ దుష్టాత్మకుం డెవ్వఁ? డే
 పనికై వచ్చెనొ మత్పురంబునకు? నెవ్వం డంపె? నుద్యానభం
 జన మేలా యొనరించె? నేమిటికి రక్షస్త్రీలఁ దర్జించుటల్? ౧౧౪౨

అర్థములు. సరోష తామ్రనయనుండై = కోపముచే నెఱ్ఱనైన కన్నులు గలవాఁడై, తర్జించుటల్ = భయపెట్టుటలు.

తాత్పర్యము.

అని సందేహించి కోపముచేఁ గన్నులెఱ్ఱనకాఁగా ముఖ్యమంత్రియగు ప్రహస్తుని జూచి ప్రహస్తా! యీ దుష్టాత్ముఁ డెవ్వఁడు? మా పట్టనమున కేమి పనికై వచ్చెను? వీనిని బంపినవాఁ డెవ్వఁడు? ఉద్యానవన మేల చెఱిచెను? ఏల రాక్షస స్త్రీల బెదరించెను?

ఆ. ఈ దురాత్ము నడుగు♦మేటికి యుద్ధంబు, సలిపె? ననఁగ నతఁడు♦పలికె నిట్టు
లోరి క్రోఁతివాఁడ!♦యీఁ అడిల్లుము భయ,పడఁగ వలదు నీకు♦భద్ర మగును.

తాత్పర్యము.

ఏల యుద్ధము చేసెను? నీ వడుగుము అనిన నతఁడు హనుమంతునిఁ జూచి యిట్టు లనెను. ఓరి క్రోఁతిజాతివాఁడా! యూరడిల్లుము. భయపడవలదు. నీకు మేలగును.

—♦ ప్రహస్తుఁడు హనుమంతునిఁ బ్రశ్నించుట ♦—

చ. అడలకు నీదుచందము య♦థార్థము చెప్పుము, నిక్క మాడఁ బో
విడుతుము, గాక దబ్బఱలు♦ప్రేలితి వేనియు నిన్ను మేనితో
విడువము, వాసవుం డసుర♦వీటికిఁ బంపెనె నిన్నుఁ? గానిచో
విడిముడితేని దూతవొ? ర♦విప్రభవాప్పతు లంప వచ్చితో? ౧౧౪౪

అర్థములు. విడిముడితేని = కుబేరుని, విడిముడి = ధనము, రవిప్రభవ + అప్పతులు = యముఁడు, వరుణుఁడు. అప్+పతి=జలాధిదేవత—"ప్రచేతా వరుణః పాశీ యాదసాంపతి రప్పతిః" అమరము.

తాత్పర్యము.

భయపడవలదు. నిజము చెప్పితివా నిన్ను వదలిపెట్టుదుము. అసత్యమాడితివా నిన్ను దేహముతో వదలము. చెప్పుము. నిన్ను నీ రాక్షస నగరమునకు నింద్రుఁడంపెనా? కుబేరుఁడు పంపెనా! యముఁడు పంపెనా? వరుణుఁడు పంపెనా?

చ. అసురుల గెల్వఁ గోరు హరి♦యంపఁగ వచ్చినదూత వేమొ, యీ
లసదసమాన తేజము బ♦లంబును వానరమాత్రునందు నీ
రస నెట నేనియుం గనఁగ♦రాదు, స్వరూపముచేత మాత్రమే
యెసఁగెదు వానరుండ వయి♦యేటికి వచ్చితి? విన్నవింపరా. ౧౧౪౫

అర్థములు. లసత్ + అసమాన + తేజము = ప్రకాశించు సమానములేని పరాక్రమము, రసన్=భూమియందు, 'భూ-ర్భూమి రచలానంతా రసా విశ్వంభరా స్థిరా' అమర. విన్నవింపరా. గీ॥ కవులు పొగడు వేళఁ గాంతలు రతివేళ సుతులు ముద్దువేళ శూరవరులు రణము సేయువేళ రాకొట్టి పిలుచుట పాడి యిదియ మిగుల భజన కెక్కు.

తాత్పర్యము.

రాక్షసుల గెల్వఁ గోరికగల విష్ణువు పంపఁగా వచ్చిన దూతవా యేమి? ఈ యసమాన పరాక్రమము సామాన్యమగు క్రోఁతియందు నీ భూమండలమునఁ గానరాదు. నీ వాకారముచేత వానరుఁడవే కాని, వాస్తవమునఁ గావు. ఇచ్చటికి నేల మాఱువేషముతో వచ్చితివి. విన్నవింపుము.

క. విడుతుము నిను నిజ మాడిన, మెడపైఁదల నిల్వఁబోదు॥మిథ్యలు వలుకన్
నొడువుము సర్వము సోఁకుల, యొడయనిపురి నీవుచొచ్చు॥నుద్దేశంబుల్. ౧౧౪౬

తాత్పర్యము.

నీవు నిజము చెప్పితివా వదలి పెట్టుదుము. అసత్యము చెప్పితివా నీ మెడ మీఁద తల నిలువదు. చచ్చుట నిజము. ఈ రాక్షస రాజనగరము నీవు ప్రవేశించిన కారణము సర్వము చెప్పుము.

——॥ హనుమంతుఁడు రావణునకుఁ దనవృత్తాంతముఁ జెప్పుట ॥——

క. అన విని హనుమంతుఁడు త,ద్దనుజగణేశ్వరునిఁ జూచి॥తడఁబడక యనెన్
వినుమీ నావృత్తాంతము, దనుజేశ్వర! పలుకువాఁడఁ॥దథ్యము గాఁగన్. ౧౧౪౭

తాత్పర్యము.

ప్రహస్తుని మాటలువిని హనుమంతుఁడు వానిని లక్ష్యము సేయక రావణుఁ జూచి జంకులేక మాట తడఁబడ యిట్లు చెప్పెను. రాక్షసేశ్వరా! నావృత్తాంతము సత్యముగఁ జెప్పెద వినుము.

సీ. వజ్రపాణియు యమ॥వరుణులు పంపఁగా, నేను వచ్చినవాఁడఁ॥గాను జుమ్ము
శ్రీదునకున్ నాకుఁ॥జెలిమి యెప్పుడు లేదు, నను విష్ణు పటకుఁ బొ॥మ్మనఁగ రాను
జాతి యియ్యదియ య॥చ్చపువానరుండను, రాక్షసరాజద॥ర్శనము సేఁత
దుర్లభం బది నాకు॥దొరకునిమిత్తమై, ప్రమదావనం బటు॥పాడు చేసి
ఆ. నాఁడ యుద్ధకాంక్ష॥నానాసురాదులు, రా మదీయ దేహ॥రక్షణార్థ
మేను బోరినాఁడ॥నింద్రాదులును నస్త్ర, పాశములను నన్నుఁ బట్టలేరు. ౧౧౪౮

తాత్పర్యము.

ఇంద్ర యమ వరుణులు పంపఁగా నేను రాలేదు. కుబేరునకుఁ నాకు స్నేహమే నాఁడును లేదు. నన్ను విష్ణువిచ్చటికిఁ బొమ్మనుటచేరాలేదు. నేనే యాకారమునఁ గానవచ్చుచున్నానో యాజాతికిఁ జేరినవాఁడనే. స్వచ్ఛముగ వానరుఁడను. రాక్షస రాజ దర్శనము నాకు దుర్లభము. అది దొరకు నిమిత్తమై ప్రమదావనము పాడు చేసితిని. యుద్ధముచేయు నిమిత్తమై రాక్షసులు రాఁగా నా దేహమును గాపాడుకొను నిమిత్తము యుద్ధము చేసితిని. ఇంద్రాదిదిక్పాలురు కూడ నన్నస్త్రములచేఁ గట్ట లేరు. నేనే కావలయునని చిక్కుపడితిని.

ఆ. బ్రహ్మవలన నిట్టు♦వర మేనునుం గంటి, రాజు గనఁగ నస్త్ర♦రాజమునకు
బట్టువడితిఁ ద్రాళ్ళఁ♦గట్టుట రాక్షసుల్ పాసె నెల్లయస్త్ర♦బంధనములు.

తా త్ప ర్య ము.

బ్రహ్మచేత వరములు పొందిన వాఁడవు నీవు మాత్రమె కాదు. నేను గూడనిట్టి వరములు పొందిన వాఁడనే. రాజును జూడఁగోరి బ్రహ్మాస్త్రమునకుఁ బట్టుపడితిని రాక్షసులు నన్నుఁ ద్రాళ్ళచేఁ గట్టుటచే నస్త్రబంధము లూడిపోయెను.

ఆ. రాక్షసేంద్ర! యొండు♦రాజకార్యముకల్మి, నేను వచ్చినాఁడ♦నిన్నుఁ జూడ
భూరి తేజుఁడైన♦శ్రీరామచంద్రుని, బంట నాదుమేలు♦పలుకు వినుము. ౧౧౫౦

తా త్ప ర్య ము.

అయినను నిన్నుఁ జూడవలయునని కోరి పట్టువడి వచ్చితిని. నే నొక రాజ కార్యము గలిగి నిన్నుఁజూడ వచ్చినవాఁడను. గొప్ప పరాక్రమము గల శ్రీరామ చంద్రమూర్తి బంటను. నీకు క్షేమకరమైనమాట చెప్పెద వినుము.

—♦ ౫౧-వ సర్గము. హనుమంతుఁడు రావణునకుఁ దాను లంకకు
వచ్చిన కారణముఁ దెల్పుట ♦—

సీ. సుగ్రీవునాజ్ఞ ద♦శగ్రీవ! వచ్చితి, నీ పట్టనమునకు♦నిన్నుఁ జూడ
నీ సోదరుండు వ♦నేచర నాథుండు, నీ కుశలంబును♦నెమ్మి నడిగెఁ
దమ్ముండు చెప్పిన♦ధర్మోక్తి యిహపర, సౌఖ్యనిదానంబుఁ♦జక్క వినుము
దశరథుం డనియెడి♦ధరణీశ్వరుఁడు చతు,రంగ బలంబులు♦నమరువాఁడు
ఆ. ధరణిజనములకును♦దండ్రికి మాఱట, తేజమున సురేంద్రు♦దీటువాఁడు
అతని పెద్దకొడుకు♦క్షితితలరంజన, శాలి విభుఁడు రామ♦చంద్రుఁ డతఁడు.

అర్థములు. నీ సోదరుండు = రావణుఁడు వాలి భ్రాతృ భావము గలవారమై యుందమని సంధి చేసికొనినవారు. కావున వాలి సోదరుఁడు రావణ సోదరుఁడే-సౌఖ్యనిదానంబు = సౌఖ్య కారణము-క్షితితలరంజన శాలి = భూమండలమును సంతోషింపఁ జేయువాఁడు. ఆయన పేరు రామచంద్రుఁడు.

తా త్ప ర్య ము.

సుగ్రీవుఁ డాజ్ఞాపింపఁగా నిన్నుఁజూచుటకై నీ పట్టనమునకు వచ్చితిని. నీ తమ్ముఁడు వానరరాజు సుగ్రీవుఁడు నీకుశలము సంతోషముతో నడిగెను. ఆయన నీకు నిహమందు బరమందు సౌఖ్యము గలిగించు ధర్మవాక్యము చెప్పి పంపెను. దానిని వినుము. చతురంగ బలంబులుగల దశరథుఁడను రాజు గలఁడు. ఆయన ప్రజలకుఁ దండ్రివంటి వాఁడు. తేజమున నింద్రుని సాటివాఁడు. అతని పెద్దకొడుకు (నీవలె భూమిజనులఁ బీడించువాఁడు కాఁడు) భూజనులను సంతోష పెట్టువాఁడు. కీర్తిచేసర్వత్ర వ్యాపించిన

వాఁడు. (నీవలె నపకీర్తిచేఁ గాదు) ఆయన పేరు రామచంద్రుఁడు. (ప్రజలసంతోష పెట్టువాఁడు) ఏడిపించువాఁడు కాఁడు.

ఈ మాటలు నీకుఁ జెప్పఁబోవునని సుగ్రీవుఁడు చెప్పలేదు. అయినను నుత్తమ దూత తన ప్రభువు నభిప్రాయము ననుసరించి దానికి విరోధము గాకుండునట్లు ఏ మాటలైనఁ జెప్పవచ్చును. ఏ కార్యమైనఁ జేయవచ్చును. అచ్చటచ్చట నేను అని చెప్పక సుగ్రీవుఁడు చెప్పె ననుటకుఁ గారణము. (౧) పేరునకుఁ గల ప్రతిష్ఠాతిశయము దెలుపుట. (౨) గర్వాతిశయముచే రాజులు తమ్ము గుఱించి చెప్పునపుడు అస్మ దర్థకముతోఁ జెప్పక యన్యుఁడుగాఁ జెప్పిన మర్యాద కలదు. ఆ ఛాయ ననుసరించి సుగ్రీవుఁడని చెప్పఁబడెను. దశరథుం డను పదము మొదలు 'సత్యము! రాక్షసేశ్వరా'! యను పదము వఱకు రామకార్యానుకూల మగు విషయము హనుమంతుఁడు స్వయముగాఁ జెప్పిన మాటలు.

చ. జనకునియాజ్ఞఁ జేసి సతి ♦ జానకి తమ్ముఁడు లక్ష్మణుండునున్
దనబడి నేగుదేరఁ జని ♦ దండకఁ జొచ్చెను ధర్మశీలి, యా
తనిసతి నష్ట యయ్యె వన♦ధారిణి ధారిణికన్య, దత్సతిన్
జనిగొని రోయుచుం దనకు ♦ బాసటగాఁ జనుదేరఁ దమ్ముఁడున్. ౧౧౫౨

అర్థములు. తనబడి = తన వెంబడి — ధర్మశీలి = ధర్మస్వభావుఁడు — నష్ట యయ్యెన్ = కానరాక పోయెను. బాసటగాన్ = సహాయుఁడుగా.

తా త్ప ర్య ము .

ఆ రామచంద్రమూర్తి తండ్రి యాజ్ఞప్రకారము భార్యయగుసీతయు తమ్ముఁడు లక్ష్మణుఁడు తోడరాఁగా ధర్మస్వభావుఁడు గాన దండక ప్రవేశించెను. (రాజ్యకాంక్షచేఁ దండ్రియాజ్ఞ మీఱి నీవలె నన్నను గొట్టినవాఁడు కాఁడు.) ఆయన భార్య యా యడవిలోఁ గానరాక పోయెను. ఆమెను వెదకుచుఁ దమ్ముఁడు తోడు రాఁగా.

ఉ. రాముఁడు ఋశ్యమూకకుధ♦రంబున సూర్యజుఁ జూడ నాతఁడున్
భూమిజ రోయఁగాఁ బ్రతిన ♦ పూనఁగ భానుకులుండు నల్లె శా
ఖామృగరాజ్య మిత్తు నని ♦ క్రచ్చఱ వాలి వధించి యాజిలోఁ
బ్రేమను గట్టెఁబట్టము హ♦రిప్రవరుండుగ సూర్యనందనున్. ౧౧౫౩

అర్థములు. కుధరంబునన్ = కొండయందు, ప్రతిన = ప్రతిజ్ఞ, శాఖామృగ రాజ్యము = వానర రాజ్యము, క్రచ్చఱన్ = శీఘ్రముగా, ఆజిలోన్ = యుద్ధమందు, హరిప్రవరుండుగన్ = వానర రాజుగ.

తా త్ప ర్య ము .

రామచంద్రమూర్తి ఋశ్యమూకపర్వతంబున సుగ్రీవునిఁజూడరాఁగా నతఁడు సీతను వెదకింపఁ బ్రతిజ్ఞచేసెను. రామచంద్రుఁడు సుగ్రీవునికి వాలినిజంపి వానర రాజ్య మిచ్చెదనని చెప్పి యుద్ధమునందు వాలినిజంపిసుగ్రీవుని వానర రాజుఁగ బట్టముకట్టెను.

ఉ. వాలిని మున్ను నీ వెఱుఁగ♦వా? యతఁ డొక్క శరంబు చేతనే
కూలెను రాముచేఁ, బిదపఁ♦గోమలి రోయఁగఁ గీశనాథులన్
బోలఁగ దిక్కు దిక్కులకు♦బుచ్చె దివాకరసూతి నూఱులన్
వేలును వేన వేలుగను♦నింగియు నేలయుఁ జూచి క్రమ్మఱన్. ౧౧౫౪

తాత్పర్యము.

వాలియెవఁడో యెట్టివాఁడో నీవు ముందే యెఱుంగుదువుకదా. అట్టివాఁడు రామునియొక్క బాణముచేతనే చచ్చెను. ఆపిమ్మట సీతను వెదకి వచ్చుటకు వానరేంద్రులను నూర్లువేలు వేనవేలుగ నన్నిదిక్కులకు సుగ్రీవుఁడు పంపెను.

ఈవృత్తాంతముఁ జెప్పుట రామచంద్రమూర్తి యసహాయుఁడు ఒంటరిగాఁడని నీవు తలఁచితివి. అది సరిగాదని తెలుపుటకై. వాలినిజంపిన వృత్తాంతముఁ జెప్పుట, నిన్ను జయించిన వాలిని నొకబాణముతోఁ జంపిన నిన్నుఁ జంపుట కదియు పనిలేదనియు రామునికి నిన్నుఁజంపుట సులభకార్యమనియుఁ దోఁపఁజేయుటకే.

క. గరుడానిలసమ వేగులు, హరివీరులు భూరివిక్ర♦మాఢ్యులు సీతా
హరిణాక్షీమణి నెల్లెడ, నరయుచు నున్నారు వారి♦యందే నొకఁడన్. ౧౧౫౫

అర్థములు. గరుడానిల సమవేగులు=గరుత్మంతునితోను వాయువుతోను సమానమైన వేగముగలవారు. హరివీరులు=శూరులగు వానరులు.

తాత్పర్యము.

గరుత్మంతునితో వాయువుతో సమానముగఁ బోఁగల వేగముగలవారు, వానరవీరులు భుజబల సంపత్తిగలవారు సీతాదేవిని నన్నిప్రదేశములందు వెదకుచు నున్నారు. వారిలో నేనొకఁడను.

సుగ్రీవు నొద్ద నా యట్టివాఁడు నే నొక్కఁడనే కాదు. అనేకులు గలరు. నన్నొకని జయించుటే నీకు దుష్కరమైనపుడు దండ యొక్క సారిగ నిచ్చటికి వచ్చిన నీవేమి చేయఁగలవో యాలోచింపు మనుట.

ఉ. మారుతు నౌరసుండ, హను♦మంతుఁడఁ బేరను, రాము దేవికై
యారయ నూఱుయోజనము♦లాయతమౌ లవణాబ్ధి దాఁటి నేఁ
జేరితి నీ పురంబు, నిట♦సీతను రోయఁగ నీ గృహంబునం
దే రమణీమణిం గనితి♦నింతయు సత్యము రాక్షసేశ్వరా. ౧౧౫౬

అర్థములు. ఔరసుండన్=కొడుకను.

తాత్పర్యము.

నేను వాయుపుత్రుఁడను. నా పేరు హనుమంతుఁడు. సీతాదేవి నిమిత్తమై నూఱామడ గల లవణసముద్రమును దాఁటి నీపురమునకు వచ్చితిని. ఇచ్చట సీతను వెదకఁగా నామెను నీయింటనే చూచితిని. రావణా! యిది యంతయు సత్యము.

అన్ని ప్రదేశములందు వెదకి నట్లే యిచట వెదక వచ్చితిని. నీవు లంకకుఁ

బోయినపుడు మా యన్న రావణు నడుగుము. ఆయన యన్ని లోకముల వృత్తాంతము తెలిసినవాఁడు. సీత వృత్తాంతము దెలుపు నని సుగ్రీవుఁడు చెప్పి యుండెను. ఆ మాట ప్రకారము నీకై వెదకు చుండఁగా నీతో మాట్లాడుటకు ముందు సీతయే కానవచ్చెను అని భావము. నీ దర్శనము నాకు దుర్లభమని తక్కిన కార్యము జేసితిని.

హనుమంతుఁడు దూత ధర్మము ననుసరించి రాక్షసరాజా యని సగౌరవముగ సంబోధించి సామోపాయమున యత్నించువాఁడు కావున సీతను రావణుఁడు తెచ్చుట తాను జూచి యుండియు నీవు సీతను దొంగిలించితి వని చెప్పలేదు. అది పరుషము కావున సామమార్గానుసారి కాదు. దొంగసొత్తు ఎవరి యింటనున్నదో వాఁడు దొంగయని కాని దొంగకు సహాయుఁడని కాని కదా యెంచవలయును. కావున నీ రెంటిలో నేదైనను నీకుఁ దగిన కార్యము కాదని వాని యోగ్యతను బొగడు చున్నాఁడు.

—♦ హనుమంతుఁడు రావణునకు బుద్ధి చెప్పుట. ♦—

చ. చదివితి వెల్ల ధర్మములు ♦ శాస్త్రవిధానము చొప్పునన్, జగ
ద్విదితముగాఁ దపోధికతఁ ♦ దీరితి, వట్టిఁడ వయ్యు నన్యలా
ముదితల నేప న్యాయమె ? స♦మూలవినాశనహేతు వాపదా
స్పద మగు ధర్మహీనకృతిఁ ♦ జల్పునొకో నినువంటి ప్రాజ్ఞుఁడున్. ౧౧౫౭

అర్థములు. ధర్మశాస్త్రములు– శాస్త్రవిధానము చొప్పునన్ = శాస్త్రము లెట్లు చదువ వలయునని శాస్త్రములందుఁ జెప్పఁబడినదో యట్టుల, అనఁగా గురుల యొద్ద 'తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా' యన్నట్లు–అధ్యయనము–బోధము–ఆచరణము = ప్రచారణము – అను నాలుగు రీతులుగా – జగత్ + విదితముగా = జగత్ప్రసిద్ధముగా, తపోధికతన్ = గొప్ప తపస్సుచే; అట్టిఁడవు = అట్టివాఁడవు – అన్యలు = ఇతరులను బెండ్లాడినవారు – ముదితలన్ = స్త్రీలను; ఏఁపన్ = బాధించుట– సమూల వినాశన హేతువు = మూల ముట్టుగ నాశము చేయునది. వంశ నాశము చేయునది – ఆపదాస్పద = విపత్తునకు నాధారము – ధర్మహీనకృతి = ధర్మము తప్పిన కార్యము – ప్రాజ్ఞుఁడున్ = బుద్ధిమంతుఁడు కూడ.

తా త్ప ర్య ము .

గురుసేవ చేసి యెట్లు చదువ వలయునో యట్లు ధర్మశాస్త్రములను నధ్యయనము చేసితివి. ప్రపంచము పొగడునట్టి తపస్సు చేసితివి. ఇంతటి గొప్పవాఁడ వయ్యు నితర పురుషుల స్త్రీలను బాధపెట్టుట ధర్మమా? అది వంశమును గూఁకటి వ్రేళ్ళతో నాశము చేయునంతటి విపత్తునకుఁ గారణము కదా. నీవంటి బుద్ధిమంతుఁ డిట్టి విపత్తు తెచ్చు కార్యము చేయవచ్చునా ?

ఓయి, రాజులు పరులను బాధింపరా దంటివి. అటయినరాజులకు సుఖభోగము లబ్బునా! రైతులు పన్నులైన నిత్తురా? ఆహారము గొనుటకూడ నితరభూములకు బాధాకరము గాదా! యందువేమో. దానివలనఁ దనకు నెక్కువ సుఖము తక్కువ కీడైనచో సహింపవచ్చునేమో కాని యెక్కువ కీడు, అల్పసుఖము, గలదానినిజేయ వచ్చునా? అందు నీవలె సుఖమే లేక కీడే విశేషించినపుడు దానిని బొత్తిగఁ జేయ రాదు కదా. సీతాహరణమువలన నీకు సుఖలేశము లేదు. కీడు విస్తరించి నిన్ను సమూలము నాశముచేయునది యై యున్నది. కావునఁ జేయఁదగినది కాదు. నా కెవ్వఁడు కీడు గలిగించువాఁ డందువేమో.

క. రామాగ్రహానువర్తులు, సౌమిత్రికరోజ్ఝితములు ♦ శరముల కెదుటన్
సేమముగ నిలుతురే నా,నామరరాక్షసులు నైన ♦ నసురప్రవరా! ॥౧౯॥

అర్థములు. రామ+ఆగ్రహ+అనువర్తులు = రామచంద్రమూర్తి కోపము ననుసరించి వెడలునవి, రామునకుఁ గోప మెంత యెక్కువో బాణవేగమంతయెక్కు వగు నని భావము. కోపము లేక వేసిన యొక బాణమే వాలి నంతటివానిని జంపినపుడు కోపముతో వైచిన బాణముల నెవ్వరు సహింపఁగలరు? అట్లు వెలువడినవి రామ చంద్రమూర్తి బాణములు మాత్రమే కావు. సౌమిత్రి కరోజ్ఝితములు = లక్ష్మణునిచే విడువఁబడినవి.

## తాత్పర్యము.

రామచంద్రమూర్తి కోపమున కనురూపముగ వెలువడు బాణములకు లక్ష్మ ణునిబాణములకు నెదుట నీవొక్కఁడవు కావు, లోకములనుండు దేవతలు రాక్షసులు నందఱు నేకమై వచ్చినను నెదిరించి నిలువఁగలరా?

క. రామునకు గీడు చేసియు, నీ మూఁడు జగంబులందు ♦ నెలమి సుఖంపం
గా మన నేనియు నెవనికి, సామర్థ్యము గలదొకో ♦ విచారింపు మెదన్. ॥౨౦॥

అర్థములు. మన నేనియున్ = జీవించుటకైనను.

## తాత్పర్యము.

రామచంద్రమూర్తికిఁ గీడు చేసికూడ నీమూఁడులోకములందు నెవ్వఁడైనఁ నెం దైనఁ బ్రాణముతో నుండుటకు నైన సాధ్య మగునేమో నీవే యాలోచింపుము. యుద్ధమునందు నిన్ను నీ సేనలతోడ జయించి నిన్నుఁ గారాగృహమందుంచినవాఁడు కార్తవీర్యార్జునుఁడు. వాఁడు చక్రవర్తియై భూమండల మందలి యందఱను జయిం చెను. అట్టివానిని సమస్తరాజులను నిరువదియొక్కమాఱు చంపినవాఁడు పరశు రాముఁడు. ఈయన యీలోకరాజులనేగాక దేవతల సేనలకు నాయకుఁడై రాక్ష సుల జయించిన కుమారస్వామిని జయించిన వాఁడు, అట్టి పరశురాముని నరగడి యలో బాణప్రయోగము లేకయే యోడించెను. ఇఁక నెవరు రామచంద్రమూర్తి యెదుట నిలువఁగలరు. దీనిని నీవు చక్కఁగా నాలోచింపుము.

ఉ. కావున ధర్మయుక్తము త్రి ♦ కాలహితంబును సార్థమైన సు
గ్రీవుని వాక్యముల్ వినుము ♦ శ్రీనరదేవున కిమ్ము జానకిన్
మా విభుదేవి నిందుఁ గని ♦ నాఁడ, నదే గడు, సింక నో దశ
గ్రీవ! రఘూద్వహుండె పయి ♦ కృత్యము లన్నిటిఁ దీర్పఁజాలెడిన్. ౧౧౬౦

అర్థములు. త్రికాలహితము = భూతభవిష్యద్వర్తమాన కాలములందు మేలైనది. ఒకఁడు ధర్మాత్ముఁడయ్యెనేని వానిమూలమున వాని పితరులు సుఖింతురు. వాని కిహపరముల సుఖము గలదు. వాని వంశమునఁ బుట్టబోవువారును మేలు కీర్తిగాంతురు. వచ్చినవారికిఁ బుట్టియుండు వారికిఁ బుట్టబోవువారికి మేలైనది. సార్థము = సౌఖ్యప్రయోజనముతోఁ గూడినది. ఇప్పుడు నీవు రాముఁడు వచ్చునేమో యని దిగులు కూడు తినుచున్నావు. అది తొలగును. శ్రీనరదేవునకు = సంపత్కరుఁడైన రాజునకు, (౨) శ్రీదేవుఁడు+నరదేవుఁడు = శ్రీనరదేవుఁడు = లక్ష్మీదేవికిని, జీవకోటికిని దేవుఁడు, మా విభుదేవిన్ = మాకుఁ ప్రభువైన రామచంద్రమూర్తి భార్యను (౨) మా = లక్ష్మీదేవి - విభు = నాథుఁడైన వాని - దేవిన్ = భార్యను - లక్ష్మిని లక్ష్మీపతి కిచ్చుట కార్యమే కదా. రామునకు - శ్రీనరదేవునకు-మావిభుదేవి యను పదములు భావగర్భితములు. పరత్వద్యోతకములు. గడుసు = కష్టకార్యము, రఘూద్వహుండు = రామచంద్రమూర్తి, దశగ్రీవ = రామున కొక తలయైన నాకుఁ బది తల లున్నవందువేమో. తలల లెక్క వచ్చెనేని శ్రీనరదేవుఁడు మా విభుఁడు రాముఁడు. 'సహస్రశీర్షా'యన్నట్లు ఆయన వెయ్యి తలలవాఁడని భావింపుము అని భావము. లేక అందఱకు నొక్క తలయుండిన నీకుఁ బదితల లున్నవే. అందఱకంటెఁ బదంతలు ఎక్కువగా నాలోచింపవలసిన వాఁడవై యుండియు నొంటితలవారి కుండు నాలోచనకూడ నీకు లేదాయెఁగదా యని సూచన.

తాత్పర్యము.

ఈ కారణముచే ధర్మముతోఁ గూడినది కావుననే త్రికాలములవారికి మేలు చేయునది, సుఖలాభముతోఁ గూడినది యగు సుగ్రీవునివాక్యము వినుము. అది యేదంటివా? జానకీదేవిని రామచంద్రమూర్తి కిమ్ము. ఆమె యెందుండునది తెలిసికొనుట కష్టమైనది. అది తెలిసినది. నేను జూచితిని. తక్కిన కార్యములు రామచంద్రమూర్తియే చక్కఁగా జేయఁగలఁడు. సీతను జూచినవాఁడవు తీసికొనిపోరాదా యందువేమో. తీసికొని పోఁగలను గాని, రామచంద్రమూర్తి చూచి రమ్మని చెప్పెనే కాని తీసికొని రమ్మని చెప్పలేదు. కావునఁ జూచితిని, వెళ్లిపోవుచున్నాను. ఆవల నాయన యిష్టము వచ్చినట్లు చేసికొననీ. ఆ విచారము నాది కాదు.

ఉ. కంటిని రావణా! జనక ♦ కన్యక నిచ్చుట, నామె నీవు వా
ల్గంటియఁ గాఁ దలంచితివి ♦ గాని యెఱుంగుము పంచవక్త్రియై

కంటు వహించి యున్న పెనుఁ♦గాలభుజంగిగ, దుర్విషాన్నముం
గొంట నతిఁ గ్రహించు టను♦కొమ్ము సురాసురకోటి కేనియున్. ౧౧౬౧

అర్థములు. వాల్గంటియ కాన్ = కేవల స్త్రీ యనియే – పంచవక్త్రియై = విశాలమైన పడగగలదై, కంటు = పగ, కాలభుజంగికన్ = నల్ల యాఁడు త్రాఁచు పామని. దుర్విషాన్నమున్ = చెడ్డవిషయముతోఁ గూడిన యన్నము, తీవ్రమైనవిషము దినినవాఁ డెట్లు చచ్చునో యట్లు చచ్చునని భావము. 'తీవ్రకోపా భుజంగమా' యన్నట్లు పామునకు గోపము మెండు. తన్ను బాధించినవానిఁ బగపట్టియెన్నాళ్ళకైనఁ గఱచి చంపక వదలదు. అట్లు సీతాదేవి నిన్నుఁ జంపక వదలదని భావము.

తాత్పర్యము.

రావణా! సీతాదేవి నిచ్చటఁ జూచితిని. ఆమెను నీవు స్త్రీ యని చూచుచున్నావు. కాని నిన్నుఁ జంపుటకై పగపట్టి వచ్చియుండు ఆఁడు త్రాఁచుపామని యెఱుఁగుము. ఆమెను సమీపించితివా నిన్నుఁ జంపును. నిన్నుఁ జంపుటకు రామచంద్రమూర్తి రావలసిన పని లేదు. ఆమెయే చాలును. దేవదానవులకైనను తీవ్రవిషముతో గలిసిన యన్నము దినుట యెట్టిదో యామెను గ్రహించుట యట్టి దనుకొమ్ము. కడుపులోఁ జేరిన విషమెట్టిదో నీ యింటిలో జేరిన సీతయట్టిది. నిన్నుఁ జంపక వదలదు. కావున వదలి పెట్టుము.

చ. అనఘుతపశ్శ్రమార్జితము♦నాయువుఁ దేజముఁ బెంచు ధర్మస
త్ఫల మిటు పాడుచేసికొన♦భావ్య మొకో? సురరాక్షసాళి నన్
గలన జయింప లే దనెడు♦గర్వము మాను, మవధ్యతావరం
బులు నినుఁ గావ విప్డు, చెడి♦పోవుదు చు మ్మది యెట్టు లంటివేన్. ౧౧౬౨

అర్థములు. అలఘు = గొప్ప దగు, తపశ్శ్రమ = తపస్సనెడి కష్టము చేసి, ఆర్జితము = సంపాదించినది, ధర్మ సత్ఫలము = ధర్మముయొక్క మంచిఫలము. కలనన్ = యుద్ధమందు – అవధ్యతావరంబులు = చంపఁ బడకుండునట్టి వరములు.

తాత్పర్యము.

రావణా! నీకుఁ బదితలలున్నవని లెక్కయె కాని మంచి చెడ్డ యాలోచించు తలయొకటియు లేదు. ఎంతగొప్ప తపస్సు కష్టపడి చేసితివో, యది మఱచితివా. ఆధర్మమువలనఁ గలుగు సత్ఫలములు ఆయుస్సువృద్ధి, తేజోవృద్ధిగదా. ఆ రెంటిని నాశము చేయు కార్యములు నీవుచేసిన, నీవుచేసిన తపస్సు వ్యర్థమె కదా. తపస్సు ఫలము దేవతులు రాక్షసులు నన్నుఁ జంపకుండుట యను వరము పొందితివి. నాకేమి భయ మని గర్వింపకుము. ఆ వరములు నిన్నిపుడు రక్షింపఁ జాలవు. కావునఁ జెడిపోదువు. అదెట్టు లందువా వినుము.

క. కాఁడసురుఁడు కాఁడమరుఁడు, కాఁడు దనుప్రోద్భవుండు♦గంధర్వుండున్
గాఁ డహి సుగ్రీవుఁడు కపి, జేఁ డెట్టులు బ్రదుకు దీత♦ఁ రాజేంద్రా! ౧౧౬౩

తా త్ప ర్య ము.

నీవు దేవతలచేత రాక్షసులచేతదానవులచేతగంధర్వులచేతనాగులచేతఁజావకుండఁగదా వరముపొందితివి. సుగ్రీవుఁడు అమరుఁడుగాఁడు– అసురుఁడు గాఁడు– గంధర్వుఁడు కాఁడు – దానవుఁడు కాఁడు – నాగులలోఁ జేరినవాఁడు కాఁడు. రాజేంద్రా! యిపుడు నీవరములు నిన్నెట్లు రక్షింపఁగలవు? ఆవరముల బలమున నీవెట్లు బ్రతుకఁగలవు. కావునఁ దపోబలము గల దను గర్వము వదలుము.

అ. పాపఫలము పుణ్య♦ఫల మేక కాలమం, దనుభవింప నెప్ప♦డనువు పడదు
ధర్మఫలము వెంట♦ధర్మఫలం బేగు, ధర్మమనను జెఱు న♦ధర్మఫలము.౧౧౬౪

తా త్ప ర్య ము.

చీఁకటి వెలుతురు లేక కాలమున రానట్లు, పాపఫలము పుణ్యఫల మేక కాలమునందు ననుభవమునకు రావు. ఒకటిపోయిన రెండవది వచ్చును. ఒక కాంతిలో మఱియొక కాంతి కలిసిపోవును గాని చీఁకటికలియనట్లు ఎన్నిధర్మముల ఫలము లైనను నేక కాలమున ననుభవమునకు వచ్చునుగాని పుణ్యఫల మనుభవించు కాలమందుఁ బాపఫలము రాదు. కావున నేను జేసినది పాప మైనయడల దాని ఫలము నాకేల యనుభవమునకు రాలే దనకుము. ధర్మఫల మధర్మమును జెఱుచును. కావున ధర్మఫలానుభవసమయంబున నధర్మఫలము ననుభవమునకు రానీయదు. 'ధర్మేణ పాప మపనుదతి' యను శ్రుతి గలదు గదా! అధర్మఫలమిపుడేల యనుభవమునకు రాలే దందువా. చీఁకటి వెలుతురును జెఱుపఁజాలదు. వెలుతురు జీఁకటిని జెఱుచును. చీఁకటి వెలుతురును జెఱుపలేదు. కావున నధర్మఫలము నీ కనుభవమునకు రాలేదు. ధర్మ మధర్మమును జెఱుచు నని శ్రుతి కలదుగాని యధర్మమువలన ధర్మము చెడు నని శ్రుతి లేదు.

ఓరీ నీవుచెప్పినది సరిగాదు. అష్టైశ్వర్యము లనుభవించు వానికి రోగము రాదా? రోగము పాపఫలముగాదా? ఆరోగము పుణ్యఫలమైన ధనముచే నౌషధరూపమున నాశమగుట లేదా. అట్టులే నేను జేసిన పాపము నా పుణ్యముచే నాశమగును గాని నన్ను బాధింపదు. నా తపఃఫలము వలన నాకు పాపఫలము రానే రాదు. వచ్చినను దానివలననే పరిహార మగునందువా? అది సరిగాదు.

ఐశ్వర్యము రోగము పరస్పరవిరుద్ధములు గావు. కావుననే యేక కాలమున రావచ్చును. నీవుచేసినతపస్సు వలన దీర్ఘాయువు కావలె. నీవుచేసినపరదారహరణమనుపాపము వలన వేగిరము చావవలె. ఒకటి యాయుర్వృద్ధికరము. మఱియొకటి యాయుర్నాశకరము. ఇట్టివి రెండెట్లు ఏకకాలమున సంభవించును? కావున నాత్మనాశక మగు పరదారహరణఫలమును, ఆత్మరక్షక మగు తపఃఫలము నశింపఁజేయు నని నమ్ముకుము.

రెండవది:—అధర్మఫలము నన్నంటనే యంటకుండ నా ధర్మఫలము చేయు

నంటివి. అదియును సరిగాదు. 'తదేవ ఫల మన్వేతి ధర్మో నాధర్మ నాశనః.' ధర్మము ధర్మఫలమునే యిచ్చునుగాని యధర్మమును జెఱుప దని యర్థము. అనఁగా ధర్మము తా నెంతఫల మీయవలయునో యంతే యిచ్చుట దాని కార్యముగాని, అధర్మమును జెఱుచుట దాని కార్యముగాదు. నేను దేవదానవులచేతఁ జావకుండుట నా తపము ఫలమునఁ గదా. అట్టులే యిది నరవానరులనుండి కాపాడదా యందు వేమో, కాపాడదు. నీవు తపస్సు చేసినవాఁడవు. వ్రతఫలము కోరక యుండినచో నది నిన్నందఱ నుండి కాపాడియుండును. అటుగాక నీవు వ్రతఫలముగ దేవదానవాదులచేఁ జావు లేకుండఁ గోరితివి. కావున నీ తప మంత మాత్రమే చేయఁగలదు గాని యంతకెక్కువ చేయజాలదు. అదియునుగాక నీవు నరవానరుల నిషేధించితివి. కావున నీ తపఃఫలము వారినుండి నిన్నుఁ గాపాడఁజాలదు. 'ధర్మో రక్షిత రక్షిత' యను వాక్యము వలన నా ధర్మము నన్నుఁ గాపాడదా యందు వేమొ. అది యాగంతుక విపత్తుల విషయము ననే కాని బుద్ధిపూర్వకమైన కర్మానుభవవిషయమునఁ గాదు.

'ధర్మశ్చాధర్మ నాశనః' యని కలదు గదా. నేను బూర్వము చేసిన ధర్మము నేఁటి యధర్మము నుండి కాపాడదా యందు వేమో. నీవు పూర్వము చేసిన పుణ్యము దానికిఁ బూర్వము చేసిన పాపములనుండి రక్షింపఁగలదుగాని దానికి వెనుక నిప్పుడు చేయు నధర్మముల నాశము చేయదు. నీవు నేఁడు భోజనము చేసితి వేని యంతకు ముందున్న యాఁకలిబాధను నది హరించును గాని, తేపటి యాఁకలి బాధను నది హరింపదుగదా. అధర్మమును ధర్మము నాశము చేయలేదేని ప్రాయశ్చిత్తము లేల పుట్టిన వందు వేమో. ఏ పాపమున కేది ప్రాయశ్చిత్తమో యా ప్రాయశ్చిత్త మా పాపమునే హరించును గాని యితర పాపముల హరింపఁ జేయఁజాలదు. జ్వరము నకై నీవు సేవించు నౌషధము వ్రణమును మానుపఁజాలదు. అదియునుగాక ప్రాయశ్చిత్త మనునది వెనుకఁ జేసినదానికిఁ బరితాపము. ఇఁక ముం దిట్టివి చేయనను నిశ్చయ ముండవలెను. నీవు చేసినదానికిఁ బ్రాయశ్చిత్తము చేసిన పాపమునకు వగచి యికఁ జేయనని నిశ్చయించుకొని నీవు బలవంతముగఁ దెచ్చిన సీతాదిస్త్రీలను వారివారి మగవారి కప్పగింపుము. ఆ దోషము నివర్తించును.

ఆ. మున్ను నీవు సలిపి ♦ యున్న తపోరూప, ధర్మమున ఫలంబు ♦ దానవేంద్ర
యనుభవించితింత ♦ దనుక నదంతయుఁ, బడయఁగల వధర్మ ♦ ఫలము వేగ. ౧౧౬౫

అర్థములు. ధర్మమున ఫలంబు — షష్ఠ్యర్థమున నకారాగమము-ధర్మము యొక్క ఫలము.

తాత్పర్యము.

నా తపఃఫలము నన్ను రక్షించు నని తలఁచెద వేమో? అది భ్రాంతి. తపఃఫలము పుణ్య మనుభవిందు కొలఁది క్షీణించును గాని శాశ్వతము గాదు. కావున నీ తపఃఫల మెంత యనుభవింపవలయునో యంతయు నేఁటిదాఁక ననుభవించితివి, ఆ

ఫలము సమసినది. ఇఁక నీవుచేసిన పాపఫలము నేఁటినుండి యనుభవింపఁగలవు. దాని పూర్ణఫలము వేగముగనే గాంచఁగలవు.

క. తలఁపు జనస్థానము వధ, దలఁపుము యవ్వాలివధము ♦ ధరణిపసుగ్రీ
వుల చెలిమియు స్మరియింపుము. దలపోయుమ యాత్మసుఖవి♦ధానం బధిపా!

తా త్ప ర్య ము.

నా పాపఫల మనుభవమునకు వచ్చుచున్నదని నీ కెట్లు తెలియఁగల దందు వేమో. జనస్థాన మందలి నీ తమ్ములు లోనగు నీ వారందఱు చచ్చుట దాని కంకురారోపణ మనుకొనుము. తరువాత నీకు మిత్రుఁడైన వాలి చచ్చుటయు నీ మిత్రునికి విరోధియైన సుగ్రీవుఁడు రామచంద్రమూర్తితో స్నేహము సేయుటయు, నివన్నియు నీ కష్టసూచకములు గావా. వీని నన్నిటిని నాలోచించి యేది నీకు సుఖకరమో దానిని జేయుము.

ఉ. నే నొకరుండనే కడిమి ♦ నిర్మథనం బొనరింప నేర్తు లం
కానగరంబు సర్వమును ♦ గాని వచింపఁడు రాముఁ డవ్విధిం;
దానె వధింతు నంచుఁ బ్రతి♦నన్ వచియించెఁ గపీంద్రుసన్నిధిన్
జానకిద్రోహి, న ట్లగుట ♦ సైరణ సేసితి రాక్షసేశ్వరా! ౧౧౬౭

అర్థములు. నిర్మథనము=నాశము, సైరణ సేసితిన్=సహించితిని.

తా త్ప ర్య ము.

నీ యధర్మఫలమును నేఁడే నీ వనుభవింపఁజేసి నా వాక్యముల యాథార్థ్యమును బ్రత్యక్షముగ నీకుఁ జూపఁగలను. నే నొకఁడనే యీ లంకానగరమంతయు నాశము చేయఁగలను. మీ యందఱలో నన్ను బాధింపఁగలవాఁడు లేఁడు. మీ శస్త్రాస్త్రములు న న్నేమియుఁ జేయఁజాలవు. ఇంద్రజిత్తు నొద్ద నున్న బ్రహ్మాస్త్రము పని ముగిసినది. అది మఱల నుపయోగింపదు. అంత కెక్కువ యస్త్రమతఁ డెఱుఁగఁడు. నాకుఁ గల వరముల బలముచే దక్కిన యస్త్రములు నన్నేమియుఁ జేయఁజాలవు. ఇప్పుడు నేను దిరుగఁబడి తన్నఁబూనిన నతఁడు కాని మఱి యెవ్వరు కాని యడ్డగింపలేరు. కాని యట్టిపని నాకు రామచంద్రమూర్తి చెప్ప లేదు. కావున సహించితిని. జానకీదేవికి ద్రోహముచేసిన వానిని దానే వధింతునని సుగ్రీవు సమక్షమునఁ బ్రతిజ్ఞ చేసెను. కావున నీ విషయమై నే నేమియుఁ జేయజాలక యున్నాను.

క. రామునకును సాక్షాత్సు,త్రాముఁడు నపకృతిని జేసి ♦ రాదు సుఖింపన్
సామాన్యుల నన నేలా? నీ మాటిఁక నేమి చెప్ప ♦ నిర్జరవైరీ. ౧౧౬౮

తా త్ప ర్య ము.

రామచంద్రమూర్తి కింద్రుఁడైనను అపకారము చేసి సుఖింపలేఁడు. తక్కిన వారిని నేమి చెప్పవలయును? పాపోపహతుఁడవైన నీవార్త చెప్పవలసిన పని యేమి?

ఉ. నీ వశమంద యుండి ధరణీసుత యంచును నీవు చూచు నా
భావిని లంక నంతయును శా డౌనరింపఁగఁ జేరియున్న యా
దేవిని గాళరాత్రిఁగ మదిం దలపోయుము, నీ మెడందు నీ
తావిధ కాలపాశ మది దార్కొనెఁ జూడుము యోగ్యపద్ధతిన్. ౧౧౬

అర్థములు. భావిని = ఉత్తమస్త్రీ, కాళరాత్రిఁగన్ = ప్రలయకాలమున సర్వము సంహారము చేయు భగవంతుని శక్తిగ-'సమీచ కాళరాత్రిశ్చ భైరవీ గణ నాయికా' యను నిఘంటు ప్రకారము గణనాయిక పేరని కొందఱు-బ్రహ్మ తన్ను నుధుకైటభులు బాధించి నపుడు ఈ శక్తిసాహాయ్య మపేక్షించి ప్రార్థించె నని మార్కండేయ పురాణమునఁ గలదు. ఆ పురాణమందే యీమె మోహరాత్రి, కాలరాత్రి, మహారాత్రి, నారాయణి లోనగు పేర్లు గల దనియు నీమె విష్ణుశక్తి యనియుఁ జెప్పఁబడును. త్రిగుణాత్మిక యగు ప్రకృతి భగవచ్ఛక్తియే. శక్తియే మాయ యని మహామాయ యని యిత్యాది నామంబులఁ జెప్పఁబడుచుండును. 'ఈశ్వరస్య మహామాయా తదాజ్ఞావశవర్తినీ - తత్సంకల్పానుసారిణీ, వివిధానంత మహాశక్తి సంసేవితా । అనంత మహామాయాజాల జననమందిరా । మహావిష్ణోః క్రీడా శరీరరూపిణీ । బ్రహ్మాదీనా మగోచరా । ఏతాం మహామాయాం తరంత్యేవ యేవిష్ణుమేవ భజంతి, నాన్యే తరంతి కదాచన ।వివిధోపాయైరపి॥ మహానారాయణోపనిషత్తు. భగవంతుని మహామాయ ఆయన యాజ్ఞకు లోపడి వర్తించునది. ఆయన సంకల్పము ననుసరించి యుండునది. మహావిష్ణువునకుఁ గ్రీడాశరీర మైనది. బ్రహ్మాదుల కగోచర మైనది ఎవరు విష్ణువును భజింతురో వారు మహామాయను దాఁటుదురు గాని, యితరోపాయముల నెన్ని టినైనను ఏ కాలమునకైనను దాఁట లేరు. ఈ విష్ణుశక్తియే జగద్రక్షా కార్యమునందు కేవల సత్వగుణము నంగీకరించి లక్ష్మి - శ్రీ - భూమి - నీళ - రుక్మిణీ-సీతాదిరూపంబులు నవతరించును. సంహారము చేయు కాలమందు తమోభూయిష్ఠయై మహాకాళి, కాళరాత్రి లోనగు నామధేయములు గలదై యుండును. ఏ కార్యమును జేయఁబూని నపుడు ఆ వేషభాష లుండుట యావశ్యకమె గదా. కావున సాత్త్వికులు శ్రీదేవిని, లక్ష్మీదేవిని, భూనీళాదులను, సీతారుక్మిణుల భజింతురు. తామసులు మహాకాళీ - కరాళీ - మహారాత్రి - దుర్గా - చండీత్యాది నామంబుల భయంకర మూర్తుల భజింతురు. ఈ తామసశక్తులలో మహాచంద్ర-యోగేశ్వరి-సిద్ధికరాళి, సిద్ధి వికరాళి - మహాంత - మారి - వజ్రకపాలిని - ముండమాలిని - అట్టహాసిని - చండకపాలిని - కాలచక్రేశ్వరి - గుహ్యకాళి - కాత్యాయని - కామాక్షి-చాముండ - సిద్ధిలక్ష్మి-కుబ్జిక-మాతంగి - చండేశ్వరి-కౌమారి-వీరు కుమారికలు - శుద్ధ - కాళిక - లలిత - మాలిని - వసుంధర - సరస్వతి - రమ - గౌరి - దుర్గ - వీరు దేవులు. రమ యనఁగ లక్ష్మి కావున నీమె యీ శివశక్తులలోఁ జేరినదని తలంపరాదు. ఆ పేరు గల శక్తి మహామాయ. కాళరాత్రి - సర్వమంగళ -

డమరుక – రాజరాజేశ్వరి – సంపత్ప్రద – భగవతి – కుమారి – వీరు దేవులు. వీరికి ఆఱుగురు శక్తులు పరిచారికలు గలరు. అనంగకుసుమ – అనంగమన్మథ – అనంగమదన – అనంగకుసుమాతుర – అనంగమదనాతుర – అనంగశిశిర—ఈ పేరులే యీ దేవతల స్వభావములు దెలుపుచున్నవి. ఈ శక్తిపూజలు కామ్యములు, నైమిత్తికములు. ఈ విషయము పూర్ణముగ మహాకాలసంహితయందుఁ జెప్పఁబడినది. సీత కాళరాత్రి యని తెలుసుకొనుమని హనుమంతుఁడు చెప్పినమాటనుబట్టి మీఁదఁ జెప్పిన తామసశక్తియే సీత యని కొందఱందురు. అది సరిగాదు. సీత గుణములందుఁ దమోగుణస్పర్శ లవమైన లేదు. ఉపమానములఁబట్టి చూచిన సీతనీపాలి కాలపాశమని కాలభుజంగి యనికూడ హనుమంతుఁడు చెప్పెను. దానినిబట్టియాఁమె త్రాఁచుపాముగాఁ బుట్టె ననవచ్చునా? కాళరాత్రి ప్రలయకాలమందుసంహార మెట్లు చేయునో యట్లు సీత నీ వంశము నాశము చేయు ననియే గ్రాహ్యముగాని, యుపమానములందు సర్వము యథార్థ మని గ్రహింపరాదు. పురుష సింహ మన్నప్పుడు సింహమున కుండు గోళ్లు, కోఱలు, కేసరములు పురుషున కున్న వనవచ్చునా? సాత్త్విక తామసశక్తులకుఁ గల భేద ముత్తర పీఠిక యందు వివరింపఁబడును.

ఇక్కడ సీతాదేవి సర్వసంహారక శివశక్తి యగునేని 'అక్కట కాళరాత్రిగతినా ధరణీశుని నీవ చంపితే' యని భరతుఁడు కైకవిషయమై చెప్పెఁగదా. (అయోధ్య. ౧౮-౨౧ ప) అక్కడనే కాళరాత్రి వచ్చెను. రెండు స్థలములం దుపమయని యెఱుంగ నగును. సీతావిధకాలపాశము = సీతా స్వరూపమైన యమపాశము. కాలపాశము సీతగాఁ బుట్టలేదు గదా.

## తాత్పర్యము.

నీ వశమందుండి జానకి యని నీవు తలంచు నుత్తమస్త్రీ లంకయంతయును బాడు చేయఁగ వచ్చి చేరిన కాళరాత్రివలెఁ దలంపుము. కాళరాత్రి యేవిధముగ లోకమును బ్రలయకాలమున నాశము చేయునో యట్లీమె యీ లంకయంతయు నాశము చేయును. ఈమె నీ మెడయందుఁ దగులుకొనిన యమపాశమని తలంపుము. కావున నీవు బ్రదికి లంకను గాపాడుకొనఁదలఁచితివేని యీామెను వదలిపెట్టుము. ఇది నీకు యోగ్యమగు మార్గము.

చ. ధరణిసుతాతపోనలసు♦దగ్ధము రాఘవకోపపీడితం
బరయుము సాట్టవప్రపుర ♦ మంతయు, మంత్రిహితానురక్త సో
దరసుత దారయుక్తముగఁ ♦ దద్దయు నాశన మేల యయ్యెదీ
పురమును వారిఁ గాచికొనఁ ♦ బోలదె చూడుము రాక్షసేశ్వరా. ౧౧౭౦

అర్థములు. ధరణిసుతా తపోనల సుదగ్ధము = జానకియొక్క తపస్సనెడి యగ్నిచే బాగుగఁ గాలినది. రాఘవ కోపపీడితంబు = రామచంద్రమూర్తికోపముచే

బాధింపఁబడినది. స + అట్ట + వప్ర + పురము = కోట బురుజులు ప్రాకారములతోఁ గూడిన పట్టనము, అనురక్త=నీయందుఁ బ్రీతిగలవారు.

తాత్పర్యము.

ఈ పట్టనమంతయు సీతాపాతివ్రత్యమను నగ్నిచేఁ గాలినదిగను రామచంద్రమూర్తి కోపముచే బాధింపఁబడినదిగాను దెలిసికొనుము. మంత్రులతో హితులతో నీయందనురాగముగల బంధువులతో, తమ్ములతో, దారపుత్రాదులతో నేల నాశమయ్యెదవు? (భార్యలకు వైధవ్యము వచ్చుటచే వారు నాశనమైనవారే.) ఈపట్టణమును దారపుత్రాదులను రక్షించుకొనరాదా?

క. వినుమీ నా వచనంబులు, దనుజేశ్వర! పలుకువాఁడఁ దథ్యము నేరా
మునిదాసుఁడ దూతుఁడ నం,దును వానరుఁడఁ శుభంబు దొరకొను నీకున్.

తాత్పర్యము.

రాక్షసేశ్వరా! నీవా రాక్షసుఁడవు. రామచంద్రమూర్తియా మనుష్యుఁడు. నేను మీ యిరువురజాతిలోఁ జేరినవాఁడనుగాను. మధ్యవర్తిని. నేను సొమ్ము పోఁగొట్టుకొన్నవాఁడనుగాను, రాఁబట్టుకొనువాఁడనుగాను ఇందు నాకు రాఁగల లాభనష్టులులేవు, అందు నేను రామదాసుఁడను. రామచంద్రమూర్తి సీతను జూచి రమ్మనిన దూతనై వచ్చినాఁడను. నే నసత్యమాడవలసిన పనిలేదు; సత్యము చెప్పుచున్నాను. నా మాట వినుము నీకు మేలు గలదు.

క. సచరాచరభూతజగ,న్నిచయంబుల సంహరింప నిరుపమశక్తిన్
రచియింప మఱల రాముఁడె, ఖచరేశ్వరదమన! నేర్చు ఘనయశ మొలయన్.

అర్థములు. సచరాచరభూత=చరములు, అచరములగు భూతములఁతో గూడిన జగత్ + నిచయంబులన్ = లోకసమూహములను, నిరుపమశక్తిన్ = అసమానశక్తిచే. రచియింపన్=సృజించుటకు, ఖచరేశ్వరదమన=ఇంద్రుని జయించినవాఁడా.

తాత్పర్యము.

నేను మధ్యవర్తి నగుటచే నాయనబలము నే నెఱుఁగుదును. నీ బలము నే నెఱుఁగుదును.

ఇరువుర బలాబలము తెలిసి చెప్పుచున్నాను. నీ వొక యింద్రుని గెలిచితి నని గర్వించెదవు. రామచంద్రమూర్తి జంగమస్థావరములతోఁ గూడిన సమస్త ప్రపంచములను దన శక్తిచే సంహరింపఁ గలఁడు, మఱల సృష్టింపఁ గలఁడు. కనుక నాయనకు నీకు నెక్కడి కెక్కడ? యుద్ధము సమానులందు శోభించును గాని దోమకు నేనుఁగునకు నెక్కడి తారతమ్యము?

హనుమంతుఁడు తొలుత నయవాక్యముల నారంభించి తన యొక్కొక మాట వలన రావణుని ముఖనయనంబులందుఁ గలుగు వికారమును గనిపెట్టి తరువాత

మాట క్రమముగా నిట్లు చెప్పుచు వాని యందుఁ బ్రసన్న భావము గానక భయ వాక్యముల నారంభించె నని తెలియ వలయును.

ఈ పద్యము 'యతో వా ఇమాని భూతాని జాయంతే-యేనజాతాని జీవంతి-యత్ ప్రయంత్యభిసంవిశంతి-తద్బ్రహ్మేతి-యను శ్రుతియర్థమును' బోధించుచున్నది. ఇట్లు రామచంద్రమూర్తి పరత్వము చెప్పఁబడెను. నేను సత్యము చెప్పుచున్నానను టచే నిది బెదరింపుమాటగాఁ దలంప రాదు. ఘనయశ మొలయఁగా అనుచో 'నత స్యేశే కశ్చన తస్య నామ మహద్యశ' యను శ్రుతి వాక్యము ప్రమాణము.

ఓయీ! సృష్టించు కార్యము బ్రహ్మది. సంహరించు కార్యము రుద్రునిదికదా! ఆ కార్యములు రామకార్యములుగాఁ జెప్పనేల యనరాదు. అనేకకోటి బ్రహ్మాండ ముల కంతయుఁ బ్రథమకారణము, ప్రథమాధికారి భగవంతుఁ డొక్కఁడే. 'ఏక మేవాద్వితీయం బ్రహ్మ' యన్నట్లు పరబ్రహ్మ మొక్కఁడే కాని యాయనకు సమానుఁడు మఱియొకఁడు లేఁడు. అధికుఁడు లేఁడు. గడ్డిపోఁచ కదలుటకుఁగూడ నాయనయే కారణము. కాని సృష్టికని యొక యధికారి,సంహారమునకని యొక యధి కారి స్వతంత్రించి లేఁడు.ఆభగవంతుఁడే బ్రహ్మయం దంతర్యామియైప్రవేశించిసృష్టి కార్యము చేయును.ఆయనయె రుద్రునియందుఁబ్రవేశించి సంహారకార్యము చేయును. భారతయుద్ధ మం దర్జునుఁడు నిమిత్తమైనట్లు బ్రహ్మరుద్రులు నిమిత్తమాత్రులు. వీరు భగవంతుఁడగు నారాయణుని విభూతులు. ఈప్రపంచమంతయుఁ దన యేకాం శమున నిలువఁబడియున్నదని కదా శ్రీకృష్ణభగవానుఁడు చెప్పెను. "విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్" భ.గీ. ౧౦-౪౨. "ఏ పరమేశుచేజగము లీ సచరాచరకోటిచే సముద్దీపిత మయ్యె నే విభుని - దివ్యకళాంశజు లబ్జగర్భగౌ రీపతి ముఖ్య దేవ మునిబృందము" భాగ. ఈ యర్థమునే సమస్తగ్రంథములు చెప్పుచున్నవి.

విష్ణోస్సకాశా దుద్భూతంజగద్తత్రైవచ స్థితమ్।స్థితిసంయమకర్తాసౌజగతోస్య జగచ్చసః॥ యస్మాదిదం జగ దజాయత యత్ర తిష్ఠ। త్యంతే సమస్త మిద మస్త ముపైతి యత్ర।తస్మైనమ స్సదసదాదివికల్పశూన్య। చైతన్యమాత్ర వపుషే పురు షోత్తమాయ॥సృష్టిస్థిత్యంతకరణాత్ బ్రహ్మవిష్ణుశివాత్మకాం।ససంజ్ఞాంయాతి భగవా నేకఏవజనార్దనః॥చతుర్విభాగసంసృష్టౌచతుర్ధా సంస్థితస్థితౌ॥ప్రలయంచకరోత్యంతే చతుర్భేదో జనార్దనః॥ ఏకేనాంశేన బ్రహ్మాసౌ భవత్యవ్యక్తమూర్తిమాన్॥ఏకాం శేన స్థితో విష్ణుః కరోతి పరపాలనమ్। అన్యేనాంశేన తమసో వృత్తి మంతకాలే తదా ప్రభుః। రుద్రరూపీ భగవా నేకాంశేన భవత్యజః। రుద్రకాలాంతకాద్యాశ్చ సమస్తా శ్చైవ జంతవః। చతుర్ధా ప్రళయా హ్యేతే జనార్దనవిభూతయః॥ యత్కించిత్సృజ్యతే యేనసత్త్వజాతేన వైద్విజ। తస్యసత్త్వస్యసంభూతౌ తత్సర్వంవై హరే స్తనుః॥ హంతి యావత్క్వచి త్కించిద్భూతం స్థావరజంగమమ్।జనార్దనస్యతద్రౌద్రం,మైత్రేయాం

తకరం వపుః। ఏవ మేకో జగత్స్రష్టా జగత్పాతా తథాజగత్ । జగద్భక్షయితా దేవో సమస్తస్య జనార్దనః॥ వి. పు ౧-౧౨. భగవంతుఁడగు విష్ణువు రజోగుణము విశేషముగఁ గల జీవులయందుఁ బ్రవేశించి వారిచే సృష్టి కార్యమును-తమోగుణము గలవారి యందుఁ బ్రవేశించి సంహారకార్యమును, సత్త్వగుణము గలవారియందుఁ బ్రవేశించి రక్షణమును జేయుచుండును. కావున సమస్తమునకు వాస్తవ ప్రయోజక కర్త భగవంతుఁ డనియు నైమిత్తిక ప్రయోజ్యకర్తలు జీవులనియు నెఱుఁగ నగు.

మ. నరదేవాసురయక్షకింపురుషగం♦ధర్వాహివిద్యాధరో
త్కరసిద్ధామరకిన్న రావళుల వి♦క్రాంతాద్యు విష్ణూపముఁ
నరదేవోత్తము రామునిఁ దురములో♦నఁ మార్కొనం జాల రె
వ్వరు నెక్కాలమునందు నెల్లయెడ స♦ర్వప్రాణిజాలంబులన్. ౧౧౭౩

అర్థములు. విక్రాంతాద్యుఁ = పరాక్రమము గల వారిలో మొదటివాఁడు, విష్ణూపముఁ = విష్ణువుతో సమానుని-అవతారమూర్తి యగుట సమత్వము చెప్పఁ బడెను. నరదేవోత్తము = (౧) రాజులందు శ్రేష్ఠుని-(౨) నరులందు దేవతలందు నుత్తముని - దురములోనఁ = యుద్ధము నందు.

తాత్పర్యము.

మనుష్యులు-దేవతలు-అసురులు-యక్షులు - కింపురుషులు - గంధర్వులు-పన్నగులు-విద్యాధరుల సమూహములు-సిద్ధులు- తక్కిన దేవజాతులవారు-కిన్నరులు వీరల సమూహములలోఁ బరాక్రమమున మొదటివాఁడగు విష్ణుసమానుని, రాజులలో శ్రేష్ఠుని, రామచంద్రమూర్తిని యుద్ధమునందు నెవ్వరైనను నేకాలమందైనను ఎల్ల ప్రదేశములందును సర్వప్రాణిసమూహములం దెవ్వరైనను నెదిరింప జాలరు. అంశము పూర్ణమును నెందైన నెదిరింపఁ గలదా? సముద్రములోని యల లన్నియును గలిసి సముద్రముతో విరోధించి బ్రదుకఁ గలవా?

౧౧౭౨ మొదలు ౧౧౭౫ వఱకుఁ గల పద్యములందు రామచంద్రమూర్తి 'రామపదేనాసౌ పరబ్రహ్మాభిధీయతే' యనునట్లు త్రికాల సత్యమగు పరబ్రహ్మమని హనుమంతుఁడు చెప్పుచున్నాఁడు. అటు గాదేని యా కాలమునం దుండు రామచంద్రమూర్తిని నంతకు ముందటివారు వెనుకటివారు, నెదిరింప లేరనుట యున్మత్త ప్రలాపము లగును.

క. రామునకు రాజసింహున, కా మహనీయాత్మునకును ♦ నవికలలోక
స్వామికి ద్రోహ మొనర్చితి, వే మెయి దుర్లభము బ్రదికి ♦ యెసఁగుట నీకున్.

అర్థములు. అవికల లోకస్వామికి = వికలముగాని సమస్తమైన లోకములను దన సొమ్ముగాఁ గల వానికి - ప్రభువునకు - ఏ మెయిఁ = ఏ విధముగనైనను.

తా త్ప ర్య ము.

రాజులందు శ్రేష్ఠుఁడు, పూజ్యస్వభావము గలవాఁడు, సమస్తలోక ప్రభువు నగు రామచంద్రమూర్తికి నీవు ద్రోహము చేసితివి. కావున నీ వే విధముగ నాలోచించినను బ్రదుకఁ జాలవు.

తే. మూఁడులోకంబులకుఁ బ్రభు♦ముఖ్యుఁ డైన
రామచంద్రుని రణమున ♦ రాక్షసేంద్ర!
నాగయక్ష నిశాట గం♦ధర్వ దేవ
దైత్యవిద్యాధరులు నైనఁ ♦ దాఁకలేరు. ౧౧౭౫

తా త్ప ర్య ము.

మూఁడు లోకంబులకుఁ బ్రభువు లగు వారిలో ముఖ్యుఁడగు రామచంద్రమూర్తిని నీ వొకఁడవు కాదు, నాగ యక్ష రాక్షస గంధర్వ దేవదానవ విద్యాధరులందఱు నొక్కటియై కూడ నెదిరింప లేరు.

తే. అధిప! బ్రహ్మ స్వభువు చతు♦రాస్యుఁ డైనఁ
ద్ర్యంబకుఁడు రుద్రుఁ,డును బుర♦హరుఁడు నైన
నింద్రుఁడు మహేంద్రుఁడును సురా♦ధీశుఁ డైనఁ
గలన శ్రీరామవధ్యునిఁ ♦ గావ లేరు. ౧౧౭౬

అర్థములు. సాధారణ దేవతలు రాము నెదిరింప లేకున్నను రక్షకులని ప్రసిద్ధులైన పర (గొప్ప) దేవత లెదిరింపరాదా యనుటకు సమాధానము చెప్పుచున్నాఁడు. అధిప – యిత్యాది–ఇందలి యొక్కొక్క విశేషణమును నా యా దేవత యొక్క శక్తి పరిపూర్ణతను దెల్పును. మొదటి రెండు మూఁడు పాదములను దలక్రిందుగా నన్వయించిన నే యుత్కర్షాపకర్షములు చక్కఁగ నేర్పడును గాన నట్లే యన్వయించుకొనవలెను.

''ఇది పరమైశ్వర్యే'' యను ధాతువుపైఁ బుట్టిన యింద్రశబ్దము త్రిలోకాధిపతి యని యర్థమును దెల్పును. ఇంద్రుఁడు త్రిలోకాధిపతి యయ్యును నింద్రునకు శత్రులను గెల్వ సామర్థ్యము లేదేమో యని యాశంకింపరాదనుచున్నది మహేంద్రుఁడను పదము. ఇంద్రుఁడు వృత్రాసురుని జంపుటచేత గొప్ప సామర్థ్యము కలవాఁ డని ప్రసిద్ధి కలదుగదా. అట్లయ్యును రాముని దాఁక లేఁడని భావము. ''మహాన్వై అయమభూద్యోవృత మవధీ దితి,తన్మహేంద్రస్య మహేంద్రత్వ''మ్మనుశ్రుతి మహేంద్ర శబ్దమందుఁ బ్రమాణము. ఎంత సామర్థ్యము కలిగియున్నను సహాయసంపత్తి లేనిచో నే కార్యమును గాదుగదా యనుటకు సమాధానము సురాధీశుఁ డైన నను పదము. ఇంద్రుఁడు తనవలె బలశాలు లైన ముప్పదిమూఁడు కోట్ల దేవతలతోఁ గూడియున్నను రామునిఁ దాఁక లేఁ డని భావము.

ఉగ్రుఁడైన యింద్రునకుఁ జేత గాకున్నను నుండ వచ్చును గాని సర్వ సంహారకుఁడైన రుద్రునికి రాముని దాఁకునట్టి శక్తి తప్పక యుండు ననుటకుఁ జెప్పు చున్నాఁడు. రుద్రుఁ డిత్యాది (౧) ప్రళయ కాలమందు జనులను సంహరించుచు నేడ్పించువాఁడు. (౨) రుతం వేదశబ్దం (బ్రహ్మణే కల్పాదౌ) రాతీతి రుద్రః అని యొక వ్యుత్పత్తి. సృష్ట్యాది యందు బ్రహ్మకు సమస్త వేదములను జెప్పువాఁడు. (3) రుతా – నాదేన (సకలమిదం జగత్) ద్రావయతి–రంజయతీతి రుద్రః = నాద రూపుఁడై సకల జగంబులను సంతోషపఱుచువాఁడు. (౪) రుతా–ప్రణవస్య వేదస్య నాదేన–దాపయతి–ఇష్టం ప్రాపయ తీతి రుద్రః. ప్రణవముగాని, వేదముగాని యుచ్చ రించువారికిఁ గోరికలీడేర్చువాఁడు. ప్రణవప్రతిపాద్యుఁ డనిగాని, వేదప్రతిపాద్యుఁడని గాని భావము. (౫) రుతం=సంసారదుఃఖం – దుఃఖహేతుం వా ద్రావయతీతి రుద్రః – సంసారదుఃఖమునో, దాని కారణమునో పోఁగొట్టువాఁడు. ఇంతశక్తి గలిగియున్నను రుద్రుఁడు రాముని దాఁక లేడని భావము. ఇతనికి సంహారకత్వశక్తియొక్క కాలవిశేషము సందే, అనఁగాఁ బ్రళయకాలమునందే గాని సదా లేదేమో. కాఁబట్టియే రాముని జయింప లేఁడేమో యని శంకింప రాదను చున్నాఁడు. త్ర్యంబకుఁడు – త్రి+అంబ కుఁడు=మూఁడు కన్నులు గలవాఁడు. నొసటనున్న మూఁడవకంటిలోని నిప్పు మంటలచేతఁ బ్రళయ భిన్న కాలమునను మన్మథునిఁ జంపి యుండలేదా. కాఁబట్టి యిట్లాశంకింపరాదు అని భావము. ఇదియుఁ గాక తాలీయము కాదనుచున్నాఁడు. పురహరుఁడు నైనను=మిక్కిలి బలవత్తరులైన త్రిపురాసులను సంహరించిన వానికి రుద్రునికి శక్తిలోపమే లేదని భావము. ఇంతటివాఁ డయ్యును రాముని మాత్రము దాఁక లేఁడు. రుద్రునికి శక్తిలేకపోయినను బోనిమ్ము. "బ్రహ్మణః పుత్రాయ జ్యేష్ఠాయ శ్రేష్ఠాయ" యని శ్రుతి చెప్పినట్లు అంతటి రుద్రునికి జనకుఁడైన బ్రహ్మ దేవునికైనను రాముని దాఁకు శక్తి యుండదా యనుటకు సమాధానము చెప్పుచున్నాఁడు. బ్రహ్మ ఇత్యాది–బృంహతీతి బ్రహ్మ యని వ్యుత్పత్తి; సాటి లేని గొప్పవాఁడు బ్రహ్మరుద్రునికిఁ దండ్రియైనను గర్మవశ్యుఁడే కదా. అయినచో నాతని కెట్లు లంత గొప్పశక్తి కలుగు ననుటకు సమాధానము. స్వభువు = కర్మపర తంత్రుఁ డయ్యును బ్రహ్మ పరులవలెఁ గాక తనకుఁ దానే జన్మించిన వాఁడు. కాన గొప్ప శక్తిమంతుఁడే యని భావము. ఎంత శక్తియున్నను సహాయసంపత్తి లేనిచో నెట్లు కార్యము నెఱవేర్చుననుటకు సమాధానము. చతురాస్యుఁ డైనను=నాలుగు మోములచేతను సమస్త వేదములను నొక్కటేతూరి యుచ్చారణ చేయుటచేతఁగలి గిన గొప్ప యతిశయము కలవాఁడయ్యును, ఇంతటి గొప్పవాఁడయినను బ్రహ్మ రాముని దాఁక నేలేఁ డని భావము. ఈ ముగ్గురు ప్రత్యేకించి రాముని దాఁక లేరని యింతవఱకును జెప్పెను. ముగ్గురు కలిసి వచ్చినను రాముని దాఁక లేరని క్రియాపదముపై నున్న బహువచనము సూచించును. (శ్రీ)రామవధ్యునికై

శ్రీరాముల వారిచే వధింపఁదగినవానిని, ''స్థానవినిగ్రహస్య చ'' యన్నట్లు వారి వారి కనుగుణముగానే గదా శ్రీరాములవారు శిక్ష విధింతురు. అట్లు వారు శిక్షించునపుడు వాని నెవరు రక్షింపనేర్తు రని భావము. కలనన్ గావలేరు–వీరు రామునితో యుద్ధముచేసి యావధ్యుని సంరక్షింప శక్తిగలవారు కారు. ఇట్లు కాక పోయినను వీరు రాముని శరణుజొచ్చి యా వధ్యుని విడిపింపుమని వేఁడి కాపాడుటకు మాత్రము శక్తికలవారే యని కలన నను పదము సారస్యము.

''హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే'' యనిబ్రహ్మదేవుఁడే పర దేవతయనియు, "నసన్న చాసచ్ఛివఏవ కేవల'' యనిరుద్రుఁడే పర దేవతయనియు,'ఇంద్రోమాయాభిః పురురూప ఈశతే'' యని యింద్రుఁడే పర దేవత యనియు వేదమున నచ్చటచ్చట నీ ముగ్గురుని బర దేవతలుగాఁ జెప్పియున్నాను నా ముగ్గురి కన్నను రాముఁడే పరాత్పరుఁ డని యీ పద్యమునఁ జెప్పఁబడెను. వేదాంతమునందు సత్, బ్రహ్మ, ఆత్మా యిత్యాదు లైన సామాన్యశబ్దంబులు పెక్కులున్నవి. హిరణ్యగర్భ శివేంద్రాదులైన విశేష శబ్దంబులును ననేకము లున్నవి. వాని కన్నిటికిని శ్రీరాములవారేయని పరాత్పర నిర్ధారకరమైన యీపద్యములోని శ్రీరామశబ్దముసూచించును. రక్షకులనిప్రసిద్ధి గాంచిన పర దేవతలు జెప్పెడి యీ సందర్భమున నింద్ర, రుద్ర, బ్రహ్మలను మాత్రము చెప్పి విష్ణుమూర్తిని జెప్పమిచేత శ్రీరాముల వారే విష్ణుమూర్తియని పారిశేష్యమున నేర్పడును.

ఈ ప్రకారము విలోమముగఁ జెప్పినను జెప్పవచ్చును. లేక అనులోమముగఁ జెప్పిన జెప్పవచ్చును.

బ్రహ్మసురజ్యేష్ఠుఁడు. అంతకంటెగొప్పవాఁడు దేవతలందు లేఁడు. నీయందనుగ్రహించి నీకు వరము లిచ్చినవాఁడు. అట్టి వాఁడైనను నిన్నుఁ గావలేఁడు. అట్టి బ్రహ్మయొక్క శిరస్సును దెగఁగొట్టినవాఁడు రుద్రుఁడు. నీ యం దనుగ్రహించి వరములు, బిరుదములు తన యాయుధము లిచ్చిన వాఁడు. అట్టి వాఁడును నిన్ను రక్షింపలేఁడు.

ఇఁక వీరేరక్షింపఁజాలనప్పుడు నీచేతఁ గట్టు పడిన యింద్రుని మాట చెప్పనేల? వారిరువురితోఁ గలిసిన బలవంతుఁడగును గదా యనిన వారు ముప్వురేకమైనను రామచంద్రమూర్తి చంపఁదలఁచిన వానిని గావలేరు. యుద్ధముచేసినిన్ను రక్షింపలేరుకాని కాకాసురునివలె శరణాగతి చేయుటచే రక్షింపఁ గలరు.

''సబ్రహ్మ సశివ స్సేంద్ర'' యనుచో విష్ణువును జెప్పక యాయన పర్వాతమును శ్రుతి సూచించు నట్టు లిచ్చట నా ముప్వురే చెప్పఁబడిరనియు వీరు ముప్వురకు బరువైన వాఁడు రామచంద్రమూర్తి యనియు సూచింపఁబడెను. ''సబ్రహ్మ సశివ స్సహరి స్సేంద్ర'' యను నది మాయావాది కల్పితమగు నపపాఠ మని యెఱుంగునది. ఛందోభంగము.

తాత్పర్యము.

ఓయీ రాక్షసరాజా! చిల్లర దేవతల మాట యటుండనిమ్ము. నీ యందుఁ బ్రేమగలిగి వరములిచ్చిన స్వాయంభువు, నాలుగు మొగములుగల బ్రహ్మయైనను, మూఁడుకనులుగలిగి త్రిపురముల నాశము చేసిన రుద్రుఁడైనను ముప్పదిమూఁడు కోట్ల దేవతల కధిపతి యయి యింద్రుఁడే కాక మహేంద్రుఁడు నైన వాఁడైనను గాక వీరు ముప్వురు కలసి యైనను యుద్ధమునందు నిన్నుఁ గావలేరు. కావున నీకు రక్షకము శరణాగతియే.

క. అను హితయుత మగుకఠిన వ,చనముల ధృతి చెడక హనుమ♦సభఁ దన్నాడన్
విని దశవదనుఁడు కోపం,బున గ్రుడ్డులు ద్రిప్పికొనుచు♦భ్రుకుటి వడంకన్.

తాత్పర్యము.

ఈప్రకారము హనుమంతుఁడు హితములైనను గఠినములైన మాటలను దన్నుసభలో నందఱు వినుచుండ ధైర్యముతోఁ జెప్పిన విని మహాకోపముతో గ్రుడ్లు గిరగిర ద్రిప్పుచుఁ గనుబొమలు ముడివడి వడఁకుచుండ-భ్రుకుటి-భ్రూకుటి.

—♦౫౨-వ సర్గము. విభీషణుఁడు రావణుతో దూతను జంపరాదని చెప్పుట♦—

సీ. హనుమంతుఁ జంపఁగ♦నాజ్ఞ సేయగ విని, దోషజ్ఞుఁడైన వి♦భీషణుండు
నిశ్చితార్థుండయి♦నీతి నాలోచించి, తద్ధితకాంక్షి న♦త్యంత హితము
వఱల నన్నను మృదు♦వాక్కుల నిట్లను, క్షమియింప వయ్య కో♦పంబు విడుము
దయఁజూడు నామాట♦తగవు విచారింపు, నయవిధిజ్ఞులు ధరా♦నాథు లెందు
తే. దూత వధియింప నొల్లరు ♦ దోష మగుటఁ,
గపిని జంపుట లోకవి ♦ గర్హితంబు
రాజధర్మ విరుద్ధంబు ♦ రాక్షసేంద్ర!
నిన్నుబోఁటికిఁ దగ దిది ♦ నిర్జరారి! ౧౧౭౮

అర్థములు. దోషజ్ఞుఁడు=పండితుఁడు, దోషములఁ దెలిసినవాఁడు. విద్వాన్విపశ్చిద్దోషజ్ఞస్సన్ సుధీః కోవిదో బుధః అమర-నిశ్చితార్థుఁడు = నిశ్చయింపఁబడిన ప్రయోజనము గలవాఁడు. తత్+హిత కాంక్షి = రావణుని మేలుగోరి-నయవిధిజ్ఞులు=నీతిశాస్త్రము మెఱఁగినవారు; లోకవిగర్హితంబు = జనులచే నిందింపఁబడినది.

తద్ధితము-విభీషణుఁడు చెప్పినది రావణునకు రెండువిధముల మేలు. (౧) రాజధర్మము నీతిశాస్త్రము నతిక్రమింపకుండుట. (౨) నీతో మాటలాడుటకై కట్టుపడి వచ్చినానుగాని యీకట్లు నన్నేమియుఁ జేయఁజాలవని లంకయంతయుఁ దానొకండే నాశము చేయఁగలనని హనుమంతుఁడు చెప్పెను. బ్రహ్మాస్త్రమునకుఁ గట్టుపడని వానిని జంపు వారెవరు? దేహము పెంచియో కుఱుచచేసియో కట్లు విడిపించుకొని

రావణుపై దూఁకిన నడ్డపడు వారెవరు? అది యెంతటి యవమానకరము. కావున విభీషణుఁ డీ రెంటిని దప్పించెను.

తాత్పర్యము.

హనుమంతుని జంపవలసిన దని యాజ్ఞ సేయఁగా విని పండితుఁ డగుటచే రావణు నాజ్ఞ రాజనీతివిరుద్ధ మని దాని యందలి దోష మెఱిఁగిన విభీషణుఁడు కార్యము నిశ్చయించి నీతి నాలోచించి రావణాసురుని మేలాలోచించి మిక్కిలి హితముగ నన్నతో మెత్తని మాటల వినయముతో నిట్లనెను. రాజా! క్షమింపుము. కోపము మానుము. వీనియందు దయచూడుము. న్యాయ మాలోచింపుము. నీతిశాస్త్ర మెఱిఁగిన రాజులు దూతను జంపుట దోషమని చంపరు. అందుఁ గ్రోఁతినిజంపుట లోకమువారు నిందించు కార్యము. రాజధర్మమునకు విరుద్ధమైన పని. సామాన్య రాజుల విషయమే యిట్టిదైయుండ నీవంటివాని విషయ మేమనవలెను. దేవతలను జయించిన నీవు క్రోఁతిని జంపించుటవలనఁ బేరా కీర్తియా?

తే. క్షత్రధర్మంబునందు వి♦శారదుఁడవు, మేలు మఱవనివాఁడవు ♦ మేటి వీవు
ధర్మవిదులందు లోకంబు♦తప్పు నొప్పు, దెలియుదువు పరమార్థ సు♦ధీవరేణ్య!

తాత్పర్యము.

క్షత్రియుల ధర్మమునందుఁ బండితుఁడవు, కృతజ్ఞుఁడవు, సామాన్య ధర్మములను దెలిసినవారిలో నీకు సమానులు లేరు. జనులుచేయు తప్పులను నొప్పులను దెలిసినవాఁడవు. పరమార్థము తెలిసిన పండితులందు నీవు శ్రేష్ఠుఁడవు.

క. చదువరి యగు నీబోఁటియు, మదిఁ గింకిరఁ బూని కాని♦మార్గము చనఁగాఁ
గొదుకనిచో నన్నాళ్ళలు, చదివిన చదువులకు ఫలము ♦ శ్రమ మొకఁడేకదా.

అర్థములు. చదువు+అరి = చదువరి = పండితుఁడు, విద్యావంతుఁడు, నీబోఁటియు=నీవంటివాఁడును, కింకిరి=కోపము, కానిమార్గము=సరిగాని మార్గము-చెడుమార్గము, కొదుకనిచో=సందేహింపని యెడల.

తాత్పర్యము.

నీవంటి పండితుఁడును గోపమునకుఁ బాలుపడి సరిగాని మార్గమునఁ బోవ సందేహింపనియెడల నెంతో కష్టించి పెక్కుకాలము చదివిన విద్యకు ఫలము కష్టపడుట యొకటేకదా. చదివిన చదువు లందలి విషయంబు లనుష్ఠాన మందుంచుకొననివాఁడు విద్య నేర్చుటకై పడిన పాటు వ్యర్థము. మూఢుఁడు పండితుఁడు నొక్కవిధముగ వర్తించి రేని వారి కిరువుర కేమి భేదము? శ్రమపడి చదువుట యొకటియే భేదము.

క. కావున నసురేశ్వర? పరి, భావితపరిపంథి! యుచిత♦భంగిని మది సం
భావించి దూతునిం దగ, వౌ విధి దండింపు మనిన ♦ నాతం డలుకన్. ౧౧౮౧

అర్థములు. పరిభావిత పరిపంథి=అవమానింపఁబడిన శత్రువులు గలవాఁడా!

తా త్ప ర్య ము.

కాఁబట్టి శత్రువుల దండించువాఁడా! ఔచిత్యము నాలోచించి దూత నే విధముగ దండింప న్యాయ్యమో యట్లు దఁడింపుము.

క. పాపాత్ముల విధియించుట, పాపం బగు నెట్లు శత్రు♦భంజన! కానన్
బాపచరిత్రుని వానరు, వ్యాపాదితుఁ జేయువాఁడ♦నని వచియింపన్. ౧౧౮౩

తా త్ప ర్య ము.

విభీషణా! పాపాత్ముల దండించుట పాపమా? కావునఁ బాపపు నడవడి గల క్రోఁతిని జంపించువాఁడను. అని చెప్పఁగా,

ఇచ్చటఁ బాపము – రాజద్రోహము – శత్రుపక్షమున వచ్చుట – రాక్షసులఁ జంపుట.

ఆ. అధికదోషయుత మ♦నార్యసమ్మతము న,ధర్మమూల మైన♦దశశిరస్కు–
పలుకు లాలకించి♦ప్రాజ్ఞుఁడైన విభీష,ణుండుపరమతత్త్వధీచణుండు పలుకు.

అర్థములు. అధిక దోష యుతము = మిక్కిలి పాపముతోఁ గూడినది. అనార్య సమ్మతము = పెద్దలు సమ్మతింపనిది. అధర్మమూలము = అధర్మము ఆధారముగాఁ గలది–పరమతత్త్వధీచణుఁడు=మిగుల సద్బుద్ధి నేర్పు సమర్థుఁడు.

తా త్ప ర్య ము.

మిగుల దోషముతోఁ గూడినది, పెద్దలు సమ్మతింపనిది, ధర్మ మాధారముగ లేనిది యగు రావణు మాట విని సద్బుద్ధి నేర్పఁగల సమర్థుఁడు, బుద్ధిమంతుఁడు నగు విభీషణుఁ డిట్లు చెప్పెను.

పంచచామరము. క్షమింపు రాక్షసేంద్ర! ధర్మ♦సంయుతంబు నా నుడిన్
శమంబుతోడ నాలకింపు♦చంపరాదు దూతఁ గా
ర్యమున్ ఘటించు వేళ నంచు♦నన్ని జాతులందునన్
సమస్తసీమలందు సూరి♦సంఘముల్ వచించెడిన్. ౧౧౮౪

తా త్ప ర్య ము.

రాక్షసరాజా! నీమాటకెదురు చెప్పుచున్నానని కోపింపకుము. నాదోషము సహింపకుము. నేను ధర్మయుక్తముగాఁ జెప్పుచున్నాను. కోపము వదలి వినుము. దూతను దూతకార్యము చేయువేళఁ జంపరాదు. ఈ మర్యాద అన్ని జాతులందు నన్ని దేశములందుఁ గల దని పండితులు చెప్పుదురు.

సుగంధి. శాత్రవుండు వీఁడు, లేదు ♦ సందియంబు, శిక్షకున్
బాత్రుఁడున్ మహాపకార ♦ వారమున్ ఘటించుటన్;
జైత్రవర్య! దూదపట్ల ♦ సజ్జనాళి పల్కెడిన్
గాత్రపీడనంబు నాది ♦ గాఁగఁ బెక్కుశిక్షలన్. ౧౧౮౫

అర్థములు. శాత్రవుండు = పగవాఁడు – మహా+అపకార వారముల్ = గొప్ప యపకారముల సమూహములను, జైత్రవర్య = జయశీలురలో శ్రేష్ఠుఁడా! గాత్రపీడనంబు = దేహమును బాధించుట.

తాత్పర్యము.

జయశీలురందు శ్రేష్ఠుఁడా! నిన్ను జయించువాఁ డెవ్వఁడు లేఁడు. కావున వీఁ డేమో యనివాఁడని కోపింప వలసిన పనిలేదు. వీఁడు పగవాఁడే. ఆ విషయమున సందేహము లేదు. వీఁడుగొప్ప యపకారము చేసినవాఁ డగుటచే దండింపవలసిన వాఁడే. అదియు నేనుగాదనను. వీనిని క్షమించి విడువుమని నేను చెప్పలేదు. నేను జెప్పునది దూతను దండింపవలసిన విధిప్రకారము దండింపు మనుచున్నాను. దూతను దండించుటయందు దేహబాధ కలిగించుట కొన్ని విధములు పెద్దలచేఁ జెప్పఁ బడినవి. ఆ ప్రకారము దండింపుము.

క. తల గొఱిగించుట యంగవి, కలుఁగాఁ గావించుటయును ♦ గశ నడుచుటయున్
తెలియఁగ గుర్తులు వేయుట, పలుకుదురివి దూతదండ ♦ పద్ధతు లనుచున్. ౧౧౮౬

అర్థములు. అంగవికలున్ = అవయవహీనుఁగా–ముక్కు–గోయుట, చెవులు గోయుట మొదలగునవి. కశ=కొఱడా – చబుకు – దూతదండపద్ధతులు = దూతను దండించు మార్గములు.

తాత్పర్యము.

తల గొఱిగించుట, యవయవ హీనుఁగాజేయుట, కొఱడాతో గొట్టించుట కఱ్ఱుగాల్చి వాఁతలు వేయుట– యీ మొదలయినవి దూతను దండించు విధము లని పెద్దలు చెప్పుదురు.

ఉ. అంతియకాని దూత వధ ♦ కర్హుఁ డటంచన నాలకింప, నీ
యంతటిధర్మవేత్త యుచి ♦ తానుచితార్థవినిశ్చితాత్ముఁడున్
శాంతిని మాని కార్యములు ♦ సల్పఁ గడంగిన నింక నే ధరా
కాంతులు సత్త్వవంతులు ప్ర ♦ గాఢతరాగ్రహ మాఁపువారలో? ౧౧౮౭

అర్థములు. ఉచిత+అనుచిత+అర్థ+వినిశ్చిత+ఆత్ముఁడున్ = ఇదితగును ఇది తగదు అనువిషయమును నిశ్చయింప యోగ్యుఁడు–ధరాకాంతులు = రాజులు; సత్త్వవంతులు = బలవంతులు.

తాత్పర్యము.

ఈ విధముగ దూతను దండింపుమని పెద్దలు చెప్పుచున్నారు గాని, దూతను జంపవచ్చునని యెవరును చెప్పఁగా నేనువినవేదు. నీ వంటిధర్మము తెలిసినవాఁడు ఉచితము అనుచితము అను విషయమున నిశ్చయమైన మనస్సు గలవాఁడు, కోపముతోఁ గార్యములు ధర్మవిరుద్ధముగఁ జేయఁబూననేని యిఁక బలవంతు లగు నే రాజులు మిగుల దురాగ్రహమును నణఁపఁగలరు. వారికి నీవే మార్గదర్శి వగుదువు గదా.

సుగంధి. ఆరయంగ ధర్మవాద♦మందుఁ గాని లౌకికా
చారమందుఁ గాని సర్వ♦శాస్త్రబోధనంబునన్
ధారణన్ భవత్సముండు ♦ దానవామరాళులన్
వీరవర్య! లేఁడు సుమ్ము ♦ నీవె మేటి వన్నిటన్. ౧౮

అర్థములు. ఆరయంగన్=విచారింపఁగా – బోధనంబునన్=జ్ఞానమందు – ధారణన్=జ్ఞప్తియం దుంచుకొనుట– భవత్సముండు=నీతో సమానుఁడు.

తాత్పర్యము.

చక్కఁగా విచారించి చూచిన ధర్మముగ వాదించు విషయమందుఁ గాని, లోకవ్యవహారము నడపుట యందుఁ గాని, సర్వశాస్త్రముల జ్ఞానమందుఁ గాని, చదివిన దానిని జ్ఞప్తియం దుంచుకొనుటయందుఁ గాని, దేవతలందుఁగాని దానవులందుఁ గాని నీతో సమానుఁడొక్కఁడును లేఁడు. ఏ విషయ మందైనను నీవే గొప్పవాఁడవు.

క. ఈకోఁతిఁ జంపితేనియు, నేకార్యము గలదు? వీని ♦ నెవ్వం డంపెన్
వీకున నవ్వానిని శి,క్షాకలితుం జేయు టొప్పు ♦ ఖ్యాతి యెసంగన్. ౧౯

అర్థములు. శిక్షాకలితున్=దండింపఁబడిన వానిని.

తాత్పర్యము.

వీనిని జంపితి వనుకో- దానివలన రాఁగల లాభమేమి? విరోధ మంతతోఁ దీఱునా? కావున వీనిని బంపిన వాఁడెవ్వఁడో వానిని దండించినఁగదా లాభము గలదు. పగ యడఁగును. కీర్తి హెచ్చును. వేరట్టులే యుంచి యేదో యొక కొమ్మను గొట్టిన లాభమేమి?

క. ఖలుఁడైన సుజనుఁడైనం గొలువునకై చిక్కి పరుల♦కుం దజ్జనముల్
పలికిన పలుకుల నొండెడఁ, బలికెడు నద్దూతఁ జంప ♦ భావ్యం బగునే? ౨౦

తాత్పర్యము.

మంచివాఁడో, చెడ్డవాఁడో కడుపుకూటి నిమిత్తము పరులకు లోపడి వారు చెప్పిన మాటలు మఱియొకచోటఁ జెప్పెడు దూతను జంప వచ్చునా?

సీ. ఇతని నీవు వధించి♦తేనియు జలనిధి, దాఁటి రాఁజాలిన♦దర్పఘనుఁడు
వేఱొక్కరుఁడు లేఁడు ♦ వీఁ డిట మడిసిన, రాజపుత్రులకు నీ♦యోజఁ దెలిపి
వారిని గొనివచ్చు♦వాఁడును గలుగండు, కాన యుద్ధముమాట ♦ కలుగఁ బోదు
యుద్ధప్రియుండవు ♦ యుద్ధసముత్కంఠ,రతులు నీ భటులు దు♦ర్జయులు సుమ్ము
తే. యింద్రుఁడాదిగ దేవత ♦ లెత్తిరేని,పోర నుత్సాహ మూనుచే ♦ పురుషగుణము
గాక నీయట్టివానికిఁ ♦ గడకుఁ ద్రోయ, కగునె దూతను జంపకు ♦ మసురనాథ!

అర్థములు. మడిసినన్ = చచ్చినయెడల, ఓజ = విధము – యుద్ధ సము

త్కంఠరతులు = యుద్ధమునందు విశేషము ప్రీతిగలవారు. దుర్జయులు = జయింపరానివారు.

## తాత్పర్యము.

ఇతని నీవు చంపితివా సముద్రము దాఁటి రాఁగల బలశాలి మఱి యొక్కఁ డుండఁడు. వీఁడిక్కడఁ జచ్చెనా యీవార్త రామలక్ష్మణులకుఁ దెలిపి వారినిఁ బిలుచుకొని వచ్చువాఁడును గలుగఁడు. కావున యుద్ధప్రశక్తి లేకయే పోవును. ఇక్కడ నింత ఘోరకార్యము వీనిచేఁ జేయించిన దానికై వారిని నీవు దండింపవలసి యున్నది. కావున యుద్ధము మానుపని చేయరాదు. నీవు యుద్ధమునందాసక్తి గలవాఁడవు. యుద్ధమనిన భయపడువాఁడవుగావు. నీభటులో యుద్ధమెప్పు డెప్పుడు వచ్చునా యని యెదురు చూచుటయందుఁ బ్రీతి గలవారు. యుద్ధమునందు జయింపరానివారు. ఇఁక యుద్ధమునకు నీవు జంక నేల? కావున నింద్రుడు మొదలైన వారందఱు దండెత్తి వచ్చినను యుద్ధము చేయుట యందుత్సాహమును వహించుటే మగతనము. దానిని నీవు తప్పింపఁ జూడరాదు. కావున దూతను జంపకుము.

క. హితులు మహామతులు సమా, హితులు కులోద్భవులు శస్త్రభృత్ప్రాగ్రసరుల్
జితకాశులు యోధులు సం, భృతులు భవత్సైన్యపతులు మేటిబలాఢ్యుల్.

హితులు = నీమేలు గోరినవారు - మహామతులు = గొప్ప యాలోచన చేయఁగలవారు, సమాహితులు = దానమానాదుల వశపఱుచుకొనఁబడినవారు - కులోద్భవులు = గొప్పవంశమునఁ బుట్టినవారు - శస్త్రభృత్ = ఆయుధముల ధరించిన వారియందు - ప్రాగ్రసరుల్ = శ్రేష్ఠులు - జితకాశులు = యుద్ధమునందు జయము నొందువారు - ఏకవచనము జితకాశి - సంభృతులు = నీచే యుద్ధమునకై జీతములు గొని భరింపఁబడువారు.

## తాత్పర్యము.

నీ సేనానాయకులు, నీమేలు గోరువారు, మంచి యాలోచనలు సేయువారు జీతములు బహుమానము లిచ్చి చేర్చుకొనఁబడినవారు, గొప్ప వంశములఁ బుట్టినవారు, ఆయుధములు ధరించువారిలో శ్రేష్ఠులు, యుద్ధములందు జయించు స్వభావము గలవారు; చక్కఁగ యుద్ధము చేయఁగలవారు, నీచేఁ బోషింపఁబడువారు, గొప్ప బలవంతులు.

క. వలసినచోఁ గొందఱు తమ, బలములతో దాడివెట్టి పార్థివపుత్రుల్
నిలిచిన చోటికిఁ జని తమ, బలములు ప్రకటించుటదియ పౌరుష మధిపా!

## తాత్పర్యము.

రాజకుమారుల మీఁదఁ బగ సాధింపవలెనని తలంపు గలదేని కొందఱు తమ సేనలతో దండెత్తి వారున్న చోటికిఁ బోయి తమశక్తి సామర్థ్యములు చూపించుట పౌరుషముగాని యొక శ్రోత్రిని దండించుట పౌరుషము గాదు. మేలుగాదు.

—♦౫౩-వ సర్గము. రావణుఁడు హనుమంతునితోఁకఁ గాల్ప నాజ్ఞఁజేయుట.♦—

చ. అన విని నీవు పల్కినది ♦ యంతయు సత్యము, దూతఁజంపుటల్
సనయము గాదు, వీడుటయు ♦ సమ్మతి గా, దొకశిక్ష వీనికిన్
జనుఁ బొనరింపఁ, గ్రోఁతులకు ♦ సమ్మతభూషణ మాటఁ దోఁక దా
నిని దెగఁగాల్చి పుచ్చుటయె ♦ నిర్మలతేజ యథార్థదండమా. ౧౯౪

అర్థములు. సనయము=నీతితోఁ గూడినది- సమ్మతభూషణము=ఇష్టమైన యలంకారము.

తాత్పర్యము.

విభీషణా! నీవుచెప్పిన దంతయు సత్యము. దూతను జంపుట రాజనీతికిఁ దగిన కార్యముగాదు. వీని నూరక విడిచి పెట్టుటయుఁ దగదు. వీని కేదియో యొక శిక్ష విధింపవలెను. క్రోఁతులకుఁ దోఁక యిష్టమైన యలంకారము. కావున దానిని గాల్చి పంపుట వీనికిఁ దగిన దండ మగును.

తే. అంగవైరూప్యకర్శితుఁ♦డైన వీనిఁ, జూచి యీతనిచుట్టముల్♦సుహృదు లెల్ల
నవ్వుదురుగాక వీనినీ♦నగరమునను, దోఁకఁగాల్చుచుఁ ద్రిప్పుఁడీ♦తూర్ణముగను.

అర్థములు. అంగవైరూప్యకర్శితుఁడు=అవయవములు చెడుటచే దుఃఖించువాఁడు-సుహృదులు=మిత్రులు-తూర్ణముగను=శీఘ్రముగ.

తాత్పర్యము.

అవయవములు విరూపము పొందుటచేఁ గృశించు వానిని చూచి వీని చుట్టములు స్నేహితులు నవ్వునట్లు వీని తోఁక గాల్చుచు నీ యూరంతయు వేగముగఁ ద్రిప్పుఁడు.

సీ. అనుచు దశగ్రీవుఁ ♦ డాజ్ఞ సేయఁగ విని, రాక్షసుల్ ప్రాఁతవ♦స్త్రములు దెచ్చి
చమురునఁ దడిపి వా ♦ లమునకుఁ జుట్టుచోఁ, నెందుకట్టెల రేఁగి♦మండువహ్ని
విధమునఁ దనమేను ♦ వృద్ధిచేయఁ గడంగె, వారును జెలరేఁగి♦వాలమునకు
నిప్పు దగిల్చిన ♦ నిష్ఠురామర్షప, రీతాత్ముఁ డై వాత♦సూతి చెలఁగి
తే. బాలభాస్కరుపగిదినై♦వాలమునను, జుట్టుకొని యుండునసురుల♦నట్టె కొట్టెఁ
దోఁక గాలుట గనుచు న♦స్తోకముదము,గనిరి బాలురు వృద్ధులు♦కాంత లెల్ల.

అర్థములు. నిష్ఠుర + అమర్ష + పరీతాత్ముఁడు = క్రూరమైన కోపముచే నావరింపఁబడిన మనస్సు గలవాఁడు- వాతసూతి = వాయుపుత్రుఁడు, అస్తోకముదము = గొప్ప సంతోషము.

తాత్పర్యము.

ఈప్రకారము రావణుఁ డాజ్ఞ చేయఁగా విని రాక్షసులు ప్రాఁత గుడ్డలు దెచ్చి చమురునందుఁ దడిపి తోఁకకుఁ జుట్టినపుడు ఆంజనేయుఁడు ఎండుకట్టెలచే

విజృంభించి మండు నగ్ని వృద్ధిచెందునట్లు తన దేహము వృద్ధిచేయఁ దొడఁగెను. వారును జెలరేఁగి తోఁకకు నిప్పంటించిరి. అది చూచి హనుమంతుఁడు బాల సూర్యునివలెనై మిగులఁ గోపించి యా తోఁకతోనే వారి నట్టె కొట్టెను. తోఁక గాలుచుండుట చూచి పిల్లలు, పెద్దలు, స్త్రీలు చాల సంతోషించిరి.

—♦ రాక్షసులు తోఁకఁ గాల్చుచుండ హనుమ యాలోచించుట ♦—

సీ. తనచుట్టు ముట్టి యా ♦ మనుజాశు లేపఁగఁ, దనలోన నిట్లని ♦ తలఁచెహనుమ
కర్తవ్య మెద్ది యి♦క్కాలంబునను నాకు, వీరు కట్టిరి గాక ♦ కోరినంత
నా కడ్డమే త్రెంచి ♦ వీకునఁ బాశముల్, బాల రాచనె వీరి ♦ నేలఁబెట్టి
భర్తృహితార్థమై ♦ పరఁగన యేనియు; రావణాసురు నాజ్ఞ ♦ రాక్షసులును
ఆ. నన్నుఁ గట్టి కీడు ♦ నా కొనరించిన,వారు గార; యిది శు♦భంబె చూడ;
రణమునందు నెల్ల ♦ రాకాసులను గూల్ప, నొకఁడ నేర్తునైన♦నోర్చువాఁడ.

అర్థములు. కర్తవ్యము = చేయఁదగినది.

తాత్పర్యము.

ఇట్లు రాక్షసు లందఱు చుట్టుకొని బాధింపఁగా హనుమంతుఁ డిట్టు లాలోచించెను. వీరు నన్నుఁ గట్టిరి గదా! ఇప్పుడు నేను జేయఁదగిన పని యేది? నేను విడిపించుకొనవలయు ననిన వీరు నా కడ్డమా? త్రాళ్లూడఁదీసికొని వీరి నందఱను నేలఁ బెట్టి కాల రాపనా? అయినను ఆక్రోశమునకు సమయముగాదు. భర్తకేది మేలో యది నే నాలోచింపవలయును. ఇంతకు వీరి నిప్పుడు నేనేల కొట్టవలె! రావణాసురు నాజ్ఞప్రకారము వీరు నన్నుఁ గట్టి నా కేమియుఁ గీడు చేసిన వారు గారు. మేలే చేయుచున్నారు. ఈ రాక్షసుల నందఱను గొట్టవచ్చును. గాని సహించుకొనెదను. ఏలననఁగా :—

తే. రాత్రివేళను దుర్గక♦ర్మంబు తెలియఁగ, సాధ్యపడ దయ్యె నెల్లను♦జక్కఁజూడ
నే నిశాక్షయమం దొప్ప ♦ నెల్లఁజూడ, నవనిభర్తకు నయ్యది♦హర్ష మొసఁగు

తాత్పర్యము.

కోటలు కట్టిన విధము రాత్రివేళ చక్కఁగాఁ జూడ సాధ్యపడినది గాదు. ఈ యుదయ కాలమున నంతయుఁ దిరిగి చూచితి వేని రాజున కది సంతోషకరముగ నుండును.

ఉ. కావున వీరు నన్నుఁ బెడ♦కట్లను గట్టినఁ గట్టనిమ్ము, మై
కావర మెత్తి కాల్చినను ♦ గాల్పఁగ నిమ్మటు లిట్టు లీడ్చిరా
హావడి నీడ్వ నిమ్ము, హృద♦యవ్యథ యేమియు లేదు, దైత్యచే
ష్టావిపరీత వర్తనల ♦ సర్వముఁ దీర్చెద వడ్డితో వెసన్. ౧౧౯౯

తా త్ప ర్య ము .

కాఁబట్టి నన్ను వీరు ఱెక్కలు విఱిచి కట్టిరా కట్టనిమ్ము. గర్వించి నా దేహమును గాల్చిరా కాలువనిమ్ము. ఆ ప్రక్క కీ ప్రక్క కీడ్చిరా యీడ్వనిమ్ము. మనస్సున నా కేమియు బాధ లేదు. వీరి విపరీత చేష్టల నన్నిటిని వడ్డితోఁ గూడ నప్పుతీర్చెదను.

ఉ. ఇప్పగిదిం దలంచునెడ ♦ నెంతయుఁ గేరుచు రాక్షసాగ్రణుల్
దప్పక శంఖభేరినిన♦దంబులతోఁ బురి వాడవాడలన్
ద్రిప్పిరి ఱొప్పి రెంతయును ♦ దిట్టిరి కొట్టిరి కొంద ఱార్చుచున్
జప్పటు లెప్పఁ గొందఱును ♦ సంభ్రమ మారఁగ వెంట నంటఁగన్. ౧౨౦౦

తా త్ప ర్య ము .

హనుమంతుఁ డిట్లు లాలోచించుచుండఁగా రాక్షసులు విజృంభించి శంఖములు భేరులు వాయించుచు వాడ వాడఁ ద్రిప్పిరి, ఱొప్పిరి, కట్టిరి, కొట్టిరి, తిట్టిరి. కొందఱఱచుచుఁ జప్పట్లు కొట్టుచుఁ గూడవచ్చిరి.

చ. హనుమ యథాసుఖంబుగను ♦ నాశరపంక్తులు వెన్నడింపఁగాఁ
గనుఁగొనెఁ దత్పురంబునను ♦ గ్రంతయుఁ గ్రంతయు సందు సందు నొ
య్యనఁ జని వాడ వాడయును ♦ నాయతవీధులు గూఢదేశముల్
ఘనగృహకాంతరంబులు న♦గారములున్ విలసద్విమానముల్. ౧౨౦౧

అర్థములు. ఆశరపంక్తులు=రాక్షసుల గుంపులు- వెన్నడింపఁగా=వెంటఁ రాఁగా- క్రంతయు=రచ్చ- సందు=సన్నత్రోవ, గూఢదేశముల్=రహస్య ప్రదేశములు, ఘనగృహకాంతరములు = పెద్దయిండ్లకుఁ గల రహస్యపుఁ ద్రోవలు- 'ప్రచ్ఛన్న ద్వారమంతర'మ్మని వైజయంతి. అగారములు = సాధారణ గృహములు - విమానములు=మేడలు.

తా త్ప ర్య ము .

రాక్షసులు వెంటరాఁగా హనుమంతుఁడు కష్టమనునది లేక, యా నగరంబున సందు సందు, గొంది గొంది, వాడ వాడ, వీధి వీధి, రహస్య ప్రదేశములు, పెద్ద యిండ్లకుఁగల దొంగత్రోవలు, సాధారణగృహములు, పెద్దమేడలు తిరిగితిరిగిచూచెను.

మ. ఇతఁడే చారుఁడు చూడుఁ డోయసుర లం ♦ చెల్గెత్తి రక్షోభటుల్
వితతారావము నింప గుంపు లగుచున్ ♦ వృద్ధుల్ శిశుల్ స్త్రీలు దీ
పితలాంగూలు సమీరనందనుని సం♦ప్రీతిం గనన్ వచ్చి, రా
వితముం గొందఱు రాక్షసాంగనలు పృ♦థ్వీపుత్రితో జానకీ! ౧౨౦౨

అర్థములు. చారుఁడు=వేగువాఁడు, ఎల్గెత్తి=గొంతెత్తి- బిగ్గఱగా, వితతారావము = విస్తారధ్వని, దీపితలాంగూలు = మండుచున్న తోఁకగలవాని, వితమున్=విధము.

తా త్ప ర్య ము .

ఓ రాక్షసులారా! వీఁడే మన యూరికి వచ్చిన వేగులవాఁడు. రండు!

చూడుఁడు. అని గొంతెత్తి గట్టిగా రాక్షసభటులు కేకలు వేయఁగా పిల్లలు పెద్దలు ముదుసళ్లు గుంపులు గుంపులుగా వచ్చి తోఁక గాలుచున్న హనుమంతునిసంతోషముతో వచ్చి చూచిరి. వారిలోఁ గొందరు రాక్షసస్త్రీలు పరువెత్తిపోయి సీతాదేవితో.

క. ఎఱ్ఱని ముఖంబుతో గుఱు, గుఱ్ఱని సీతోడఁ బల్కు♦క్రోఁతిని ననురుల్
బిఱ్ఱుగఁ గట్టియుఁ దోఁకను, జుఱ్ఱనఁ గాల్చుచును బురముఁ♦జుట్టెద రనిసన్.

తాత్పర్యము.

జానకీ! యెవఁడో యెఱ్ఱని ముఖముతో గుఱ్ఱు గుఱ్ఱని నీతో ముచ్చటలాడెనే యా క్రోఁతిని బట్టుకొని రాక్షసులు బిఱ్ఱుగఁగట్టి తోఁకను చుఱ్ఱని కాలుచుచు నూరిలోఁ ద్రిప్పుచున్నారే యని చెప్పిరి.

దీనివలన వీరు సీతాదేవి కావలికత్తెలనియు, సీతాంజనేయుల సంభాషణమును గొందఱు వినుచుండి రనియు వారి మాటలు వారి కర్థము కాలే దనియు నేర్పడెను.

—♦ సీతాదేవి యగ్నిహోత్రునిఁ బ్రార్థించుట. ♦—

తే. మంగళాత్మిక సతి యాత్మ♦మరణతుల్య
మైన వాక్కులు విని వికచాంబుజాక్షి
శోకసంతప్త యయి కపి♦శుభముఁ గోరి
హుతవహుని గూర్చి యిట్లని ♦ నుతి యొనర్చె. ౧౨౦౮

అర్థములు. మంగళ+ఆత్మిక = హనుమంతుని మేలుగోరు మనస్సుగలది. ఆత్మమరణతుల్యము = తన చావుతో సమానము–హనుమంతుఁడుచచ్చినా తాను జచ్చినట్టే యని తలఁచునది. వికచాంబుజాక్షి=వికసించిన కన్నులు గలది. శోకసంతప్త = వ్యసనముచే మిగులఁ దపించినది. హుతవహునిన్ = అగ్నిహోత్రుని, నుతి = స్తోత్రము.

తాత్పర్యము.

హనుమంతుని మేలుగోరుచున్న పతివ్రతయగు సీతాదేవి ముందు హనుమంతుని పరాక్రమము, రాక్షసవధ విని సంతోషముతో వికసించిన కన్నులు గలదై యుండినది. ఇప్పుడీ తన మరణముతో సమానమైన వార్త విని మిగుల వ్యసనపడి యాయన మేలు గోరి యగ్నిహోత్రు నిట్లు ప్రార్థించెను.

తే. భర్తశుశ్రూష యొనరించు♦పడఁతి నేనిఁ, దపములను నిష్ఠ సలిపిన♦తరుణి నేని
నేఁ బతివ్రత నగుటయు♦నిక్కమేని, హనుమయెడ శైత్యమూనుమీ♦యగ్ని దేవ!

తాత్పర్యము.

నేను బతిసేవ చేయు స్త్రీనై యుంటినా, నేను దపమును నిష్ఠతో సలిపి యుంటినా, నేను నిజముగాఁ బతివ్రతనైతినా, యగ్నిహోత్రుఁడా! హనుమంతునకు శీతలుండ వగుము.

క. ఇనకులతిలకుం డగు రా,మునకు న్నామీఁదఁ గరుణ ♦ మొనయున యేనిం
గన భాగ్యశేష నేనియు, హనుమయెడం శీతలుండ♦వగుముహుతాశా! ౧౨౦౬

తా త్ప ర్య ము.

సూర్యవంశము వారిలో శ్రేష్ఠుఁ డగు శ్రీరామచంద్రమూర్తికి నా మీఁద దయ గలదేని, నాకింకను గొంచెము భాగ్యమనుభవించు నదృష్టము గలదేని యగ్ని దేవా! హనుమకు శీతలుండ వగుము.

క. ఘనమతి రామునికూటమి, ననవరతముఁ గోరుదాన ♦ ననుచుం శుభశీ
ల న టంచు నతఁడు నమ్మిన, హనుమయెడం శీతలుండ♦వగుము హుతాశా!

తా త్ప ర్య ము.

గొప్ప మనస్సుగల రామచంద్రునితోడి సాంగత్యము నేనెల్ల వేళఁగోరుచుండుదాన నని, మంచి నడవడి గలదాన నని హనుమంతుఁడు నమ్మియుండెనా యాయనకు నగ్ని దేవా శీతలుండ వగుము.

తే. సత్యసంగరుఁ డైన భా♦స్కరసుతుండు
సరగ సుగ్రీవుఁ డిట వచ్చి ♦ సతము నన్ను
ముంచు శోకాబ్ధినుండి దాఁ♦టించు నేని
హనుమయెడ శైత్య మూనుమీ ♦ యగ్ని దేవ! ౧౨౦౮

తా త్ప ర్య ము.

వంచన లేక యుద్ధము చేయుసుగ్రీవుఁడు శీఘ్రముగ నిటకువచ్చి,విడువక నన్ను బాధించు నీ శోక సముద్రమునుండి దాఁటించుట సత్యమేని యగ్ని దేవా! హనుమంతుని యెడ శీతలుండ వగుము.

హనుమంతుని విషయమున నగ్నిహోత్రుఁడు చల్ల వాఁడయ్యెనా యివన్నియు సత్యము లని భావము.

రామచంద్రమూర్తి బ్రహ్మాస్త్రము సంధించి నిన్ను రూపు మాపెద నని బెదరించినను సముద్రుఁడు నా స్వభావగుణము నేను విడువనని చెప్పఁ గలిగెనుగాని సీతాదేవి మాట మాత్రమునఁ దన దాహకశక్తి వదలి యగ్ని చల్లపడెను. ఎంతటి మహాత్ములకైనను ఋషులకు సాధ్యము గానిది, పతివ్రత లగు స్త్రీలకు సుసాధము లని యెఱుంగ నగు.

కొంద ఱీ యశోకవనమున నుండునది యింద్రజాలపుసీత యని,యిది మాయారూప మని వ్రాసియున్నారు మాయారూపములకు రావణుని భస్మము చేయఁగల వను శక్తియు-నగ్నిహోత్రునిజల్లనగాఁజేయు పాతివ్రత్యమహిమయుఁ గలుగునేమో పాఠకు లాలోచింపవలెను. ఈ మాయాసీత పతి శుశ్రూష చేసినది కాదు. తపము లాచరించినది లేదు. ఇట్టి మాయాసీత మాటలకు నగ్నిహోత్రుఁ డెట్లు చల్లపడెను. ఈ మాయాసీత భాగ్యశేష గాదు.ఏలన నగ్నిహోత్రములోఁ బ్రవేశించినపుడురూపు

లేక పోయెను. ఆవల సుఖ మనుభవించినది లేదు. కావున నీ మాయాసీత వాక్యము లెట్లు సత్యము లయ్యెను.

సుగ్రీవుఁ డీమాయాసీతను దుఃఖమునుండి దాఁటించిన వాఁడు కాఁడయ్యె. కావున నీమె యథార్థసీతయే కాని మాయాసీత గాదు.

అష్టాక్షర మంత్రమందు (౧) ప్రణవము (౨) నమస్సు. (౩) చతుర్థీ విభక్తియుక్తమైన నారాయణపదము గలవు. అందుఁ బ్రణవము జీవాత్మ పరమాత్మకే యుపకరణము, ఆయన సేవకే జీవాత్మ వినియోగపడవలయు నని తెలుపును. (౨) నమస్సు, స్వాతంత్ర్య రాహిత్యమును కేవల పారతంత్ర్యమును దెలుపును. (౩) భగవత్ప్రియమైన భాగవత సేవ దెలుపును. భాగవతసేవ భగవత్ప్రీతికరము. ఈ విషయములు పూర్వకాండముల వివరింపఁబడెను. ఈమూఁటియందు మొదటిది లక్ష్మణుఁడు, రెండవది భరతుఁడు, మూడవది శత్రుఘ్నుఁడు ననుష్ఠానముచే దెలిపిరి ఈ మూఁటిని సీతాదేవి యొక్కతెయే యనుష్ఠించి చూపెను. ఎట్లన 'ఉర్వీజ నీవును గూడి యాడుచుఁ గొండల పేటులఁ విదుర గూరియ యున్నను మేలుకొన్నఁ గోదండ ధరుండనై మెలఁపు దాలిచి సర్వము నేన తీర్చెదఁ'(అయోధ్య.౮౮౭) అని చెప్పి యా ప్రకారము యావజ్జీవము లక్ష్మణుఁడు శుశ్రూష చేయుచుండెను. భరతుఁడు 'ఈ రాజ్యము నేను రాముని విట్టగుటఁ నీవ చెప్పుమీ ధర్మగతిఁ' (అయోధ్య ౧౧౫౧) అని చెప్పి కేవల పరతంత్రుడై రాముఁడులేని యయోధ్య యందుండ నొల్లక పల్లెటూర వానప్రస్థునివలె వసించెను.

శత్రుఘ్నుఁడు (అయోధ్య ౨) రామపరతంత్రుఁడై భాగవతుఁడైన భరతునకుఁ బ్రీతికరముగ వర్తించుచుండెను.

సీతాదేవి భర్తృశుశ్రూష నొనరించు పడఁతి నేని యని తెలిపి తన రామ కైంకర్యమును స్థిరపఱిచెను. రావణుని దగ్ధము చేయనని, హనుమంతుని వెంట రానని చెప్పి యట్లు చేయుటకు, దాను స్వతంత్రురాలఁగానని తెలిపి తన పారతంత్ర మును బ్రకటించెను. (౩) ఇప్పుడు రామదాసుఁ డగు హనుమద్భాగవతునకు సహాయము లేకుండఁజేసి భాగవతప్రీతి కనఁబఱిచెను.

ధర్మసందేహము:— "శీతో భవ" చల్లఁగాఁ గమ్ము అనిన మాత్రముననే యగ్నిహోత్రుఁడు చల్లనయ్యెను. అట్లులే 'హతో భవ' చావుము అని చెప్పి యుండిన రావణుఁడు చచ్చియుండును. ఈ నిదర్శనముఁబట్టి యంతటిశక్తి యామె యందుఁ గలదని యంగీకరింపవలసినదే. కాని రావణుతో నిన్ను దగ్ధునిఁ జేయఁ గలను గాని నా భర్త యాజ్ఞ లేదు. కావున నా తపస్సు వ్యర్థమై పోవుట యొల్లను. కావున నిన్ను శపింపనని చెప్పెనుగదా. హనుమంతుని రక్షించుటకు మాత్రము భర్తయాజ్ఞ గలదా? దీని వలనఁ దపోహాని లేదా.

పరిహారము: సీతాదేవి యీ కార్యమును దుష్కామక్రోధ లోభములకు

వశపడి చేయలేదు. ఇది పరహింసాత్మకమైనది కాదు. స్వధర్మ విరుద్ధమైనది కాదు. కావునఁ దపోహాని లేదు. దయ యాధారముగాఁ గల పరోపకారము అవశ్యకర్తవ్యమైన మిత్రభాగవత భర్తృహితలక్షణముఁ స్త్రీలకు రక్షాకార్యము స్వధర్మము. బిడ్డలను రక్షించుటయందు భర్తకుఁ గల స్వాతంత్ర్యము భార్యకుఁ గలదు. మగని నడిగి భార్య బిడ్డల కన్నము పెట్టవలసిన పని లేదు. దానికి భర్త యాజ్ఞ యనావశ్యకము. సీత సహధర్మచారిణి కదా. దీని వలనఁ బారతంత్ర్యహాని లేదు. ఆత్మరక్షార్థముప్రవర్తించినది కాదుగదా. పారతంత్ర్య మనునది స్వరక్షావిషయమే, నేనిట్లు చేసెదనుఁ దీని నీ వంగీకరింపు మని భర్తకుఁ జెప్పలేదు. భర్త చేయవలసిన కార్యము తాను చేయలేదు. భర్త చేయవలసిన పని యాయన యాజ్ఞ లేక స్వతంత్రించి తాను జేసిననే పారతంత్ర్యహాని కాని స్వధర్మనిర్వహణమందు భర్తయాజ్ఞతోఁ బనిలేదు.

వధ స్త్రీ కార్యము గాదు. పురుష కార్యము. అట్టిదానిని భర్త యనుజ్ఞలేక తన సుఖమునకై స్వతంత్రించి చేసినఁ బారతంత్ర్యహాని. క్రోధమునకు వశపడుటచే దపోహాని. నేను విడిచి పోవుచున్నాను. నన్ను నీవు కాపాడుకొమ్మని నలుఁడు చెప్పినట్లు రామచంద్రమూర్తి చెప్పలేదు. కావునసీతాదేవి చేసినది యకార్యముగాదు. ఇంతకు సీతాదేవి యగ్నిని బ్రార్థించెను గాని నా తపోబలముచే నీ విట్లు కమ్మని శాసింప లేదు.

——♦అగ్ని చల్లనైనందుకు హనుమంతుఁ డాశ్చర్య పడుట.♦——

సీ. అని వేఁడు సీతకు♦హనుమంతుసేమంబు, వచియించువిధమున♦వహ్ని సప్ర
దక్షిణశిఖుఁ డయి♦తనరెను; దేవిపై, వాలాగ్నియుతుఁ డయ్యు♦వాయువప్పుడ
ప్రాలేయమారుత♦ప్రాయుఁడై వీచెను, హనుమయుఁ దనలోన♦సంభ్రమపడుచు
ధగ ధగ మండియుఁ♦దాపంబుఁ గూర్పఁడు, శీతలుండై వహ్ని♦హేతువేమొ
ఆ. తెలిసెఁ దెలిసె రామ♦దేవునిమహిమను, మల నొకండు వార్ధి♦మధ్యమునను
గనుచు నక్రజంబు♦గొనితి నియ్యదియును, నతనిమహిమ సంది♦యంబు లేదు.

అర్థములు. సప్రదక్షిణ శిఖుఁడయి = ప్రదక్షిణముగాఁ దిరుగుచున్న శిఖలు గలవాఁడయి- ప్రాలేయ మారుత ప్రాయుఁడై = మంచుమీఁది నుండివచ్చు గాలివంటి వాఁడై.

తా త్ప ర్య ము.

ఈప్రకారము ప్రార్థించు సీతాదేవికి హనుమంతున కపాయము లేదని తెలుపు వానివలె నగ్నిశిఖలు ప్రదక్షిణముగఁ దిరుగు వాఁడయ్యెను. కాలుచున్న తోఁక మీఁదనుండి వచ్చుగాలియు వేఁడిగరాక మంచుగాలి వచ్చునట్లు చల్లగా నామెపై వీచెను, ఇట్లు లగ్నితన్నుఁగాల్పక చల్లగా నుండుటచూచి హనుమంతుఁ డాశ్చర్యపడి యిది యేమి యాశ్చర్యము, అగ్నిచల్లగానున్నాఁడు. దీనికేమి కారణముఅని యాలోచించి తెలిసెఁ దెలిసెను. పూర్వము సముద్రముదాఁటి వచ్చునపుడు పర్వ

తము, సముద్రము సాహాయ్యముచేయుట చూచితిని. అది రామదేవుని మహిమయే కదా. ఇదియును నాయన మహిమయే. ఆయన నాకిచ్చిన రామముద్రిక నాతోడ నుండి నన్ను నాపద లేకుండ గాపాడెను. ఇప్పుడు సీతాదేవిచూడామణి నా యొద్ద నున్నది. అది నన్నుఁ గాపాడఁగలదు.

క. జడధియు మైనాకుండును, గడుకొని శ్రీరాముపట్లఁ ♦ గాన్పించినకై
వడినేలయగ్నియును దో,డ్పడి శుభముం గూర్పకుండు♦వాఁడుదలంపన్. ౧౭౧౦

తా త్ప ర్య ము.

సముద్రుఁడుమైనాకుఁడు శ్రీరామునిపట్ల కానుపించినప్రీతిని,నగ్నిహోత్రుఁడు మాత్ర మేల కనఁబడఁజేయకుండును. ఇదియు రామచంద్రమూర్తి మహిమయే తన కార్యముచేయు నాకు శ్రీరామచంద్రమూర్తి యేల యుపాయము రానిచ్చును. మేలే కలిగించును.

దీనివలన నిర్వంచనముగ రామకైంకర్యము చేయువారికి శ్రీరామచంద్ర మూర్తి యుపాయములు రానీయఁడు. సాహాయ్యమే చేయునని భావము. ఒంటిమిట్ట శ్రీరామచంద్రు కైంకర్యము చేయు సమయంబున నిది యీగ్రంథకర్తకు ననుభవ విదితమే. 'యత్ర రామో భయం నాత్ర నాస్తితత్ర పరాభవ' యనుట మూఁటికి ముమ్మాటికి సత్యము.

క. సీతాసతిదయచేతను, సీతాహృదయేశు మహిమ♦స్వీయసఖు తనూ
జాతుఁడ నగుటను నాయెడఁ, బ్రీతిఁ గొని పావకుండు♦వేఁడిమి మానెన్. ౧౭౧౧

తా త్ప ర్య ము.

పతివ్రతయగు సీతాదేవి దయచేతను, ఆమెభర్తయగు శ్రీరామచంద్రదేవు మహిమచేతను, తన మిత్రుని కొడుక నగుటచేతను అగ్నిహోత్రుఁడు నాయందుఁ బ్రీతి గలవాఁడై వేఁడిమి చూపకున్నవాఁడు.

చ. అని తలపోసి కొంతవడి♦యార్భటుల న్దెస లెల్ల నించి చి
వ్వున గిరిశృంగతుల్యమయి♦పూర్వసుపర్వ నికాయహీన మై
తనరు పురంబు వాకిటికి♦దాఁటి గిరీంద్రనికాశ దేహుఁ డా
హనుమఁడు హ్రస్వుఁ డైనను ద♦మంతట బంధములెల్ల నూడినన్. ౧౭౧౨

అర్థములు. కొంతవడి= కొంతసేపు, ఆర్భటులన్ = సింహనాదములచే- గిరిశృంగ తుల్య మయి=పర్వతశిఖరముతో సమానమయి, పూర్వసుపర్వనికాయ హీనమై= రాక్షసుల గుంపులేనిదై, గిరీంద్ర నికాశ దేహుఁడు = పెద్దపర్వతముతో సమానమైన దేహము గలవాఁడు-హ్రస్వుఁడైనను=పొట్టివాఁడు కాఁగా.

తా త్ప ర్య ము.

ఈప్రకారము కొంత సే పాలోచించి సింహనాదము చేసి పర్వత శిఖరము వలె నెత్తై రాక్షసులులేని లంకానగరద్వారముగోపురము మీఁదికి చివాలునదాఁటి

పర్వతమువలె నున్న తన దేహమును జిన్నదిగాఁ జేయగాఁ గట్టిన కట్టులు వదులు పాటి వా నంతట నవియే జాఱిపడిపోఁగా.

క. శ్రీమంతుఁ డాత్మ వంతుం, డా మారుతసంభవుం డహార్యసమం బౌ
భీమాకృతి మఱలం గొని, యీమెయి నామెయిని బొఱివీక్షించిరుషన్. ౧౨౧౩

అర్థములు. శ్రీమంతుఁడు-ఆత్మవంతుఁడు = ఇవి రెండు మారుత సంభవుఁడను పదమునకు విశేషణములు. శ్రీమంతుఁడు=లక్ష్మీకటాక్షమునకుఁ బాత్రుఁడైనవాఁడు - ఆత్మయనఁగా విష్ణువు - ఆయన యనుగ్రహమునకుఁ బాత్రుఁడైన వాఁడు-ఆత్మవంతుఁడు = లక్ష్మీనారాయణుల యనుగ్రహమునకు, అనఁగా సీతారాముల యనుగ్రహమునకుఁ బాత్రుఁడైన వాఁడు, మారుతసంభవుఁడు = హనుమంతుఁడు - అహార్యసమంబు = పర్వతముతో సమానమైనది. భీమాకృతిన్ = భయంకరమైన యాకారమును-ఈమెయి నామెయి=ఈ ప్రక్క నాప్రక్క.

తాత్పర్యము.

సీతారాముల కటాక్షమునకుఁ బాత్రుఁడైన హనుమంతుఁ డీ ప్రక్క నాప్రక్క చూచి పూర్వపు భయంకరాకారమును మఱల గైకొని.

తే. తోరణాశ్రిత మైనట్టి దొడ్డ గుదియ, సరగఁ గైకొని కావలి సురవిరోధి
వారములఁగూల్చి ప్రజ్వలద్వాలుఁడగుచు, నంశుమాలినిబోలియి ట్లాత్మఁదలఁచు.

అర్థములు. తోరణాశ్రితము = ద్వారము నొద్ద నుండిని, సరగన్ = వేగముగ, ప్రజ్వలత్+వాలుఁడు = మండుచున్న తోఁక గలవాఁడు, అంశుమాలిని = సూర్యుని, దీనివలన సూర్యుఁడు కొంచెము పైకి వచ్చినాఁ డని సూచన.

తాత్పర్యము.

ద్వారమువద్ద నున్న గడియమ్రాకును దీసికొని శీఘ్రముగ నందు కావలి యున్న రాక్షసులఁ జంపి తోఁక మండు చుండఁగా సూర్యునివలె నై యి ట్లాలోచించెను.

—— ౫౪-వ సర్గము. హనుమంతుఁడు లంకఁ గాల్చుట. ——

క. కర్తవ్యం బెది యింకిట? మార్తురకుమ దుఃఖపీడ మఱి మఱి కలుగన్
వర్తింపవలయు సీతా, భర్తకుఁ గార్యంబు సుకర మగు నట్లైనన్. ౧౨౧౪

అర్థములు. కర్తవ్యంబు=చేయఁదగిన కార్యము, మార్తురకును = శత్రువులకు.

తాత్పర్యము.

ఇంక నేను జేయవలసిన పని యేమి? శత్రువులకు దుఃఖబాధ విశేషముగఁ గలిగింపవలయును. అట్లు చేసితినేని రామకార్యము సులభముగ నగును. లంకాపౌరులకు బాధ కలిగించితినేని యీ బాధ రావణునివలనఁ గలిగినదని పౌరులందఱు వానిపట్ల విరోధభావము వహింతురు. అప్పుడు వారిలో వారికి భేదము పుట్టును.

సీతను మఱల నిమ్మని చెప్పువా రుందురు. వినఁడేని రాము పక్షము వహించు వా రేడ్పుచుందురు. కావున నీ రాక్షసులకు బాధ కలిగింపవలెను.

కం. చెండితి నశోకవనముఁ, ఖండించితి రాత్రిచరుల♦కాండము సేనా
దండ మొకకొంత ద్రుంచితి, గండున దుర్గాళిఁ జెఱుచు♦కార్యము మిగిలెన్.

తాత్పర్యము.

అశోకవనమును బాడు చేసితిని. ఇది రావణునకు వాని స్త్రీలకు నప్రియ కార్యము. దీనివలన స్త్రీలు రావణునకు సీత నిమ్మని యీమె వలన నీ యనర్థము కలిగె నని చెప్పువారై యుందురు. కొందఱు రాక్షసులఁ జంపితిని. వారివారు రావణు దూషించు వా రగుదురు. సేనలోఁ గొంచెము భాగము నాశము చేసితిని. వీరికి స్థానమైన కోటలు, బురుజులు మిగిలి యున్నవి. వానిని జెఱుప వలయును,

ఉ. ఇంచుక యత్న మూని పుర♦మెల్లను నాశము జేయ మత్క్రియా
సంచయ మెంతయున్ ముగియు♦సార్థక మయ్యెడు మచ్ఛ్రమంబు; వా
లాంచలహవ్యవాహునకు♦నాహుతిచేయుట న్యాయ్య మీ గృహో
దంచితపత్తనం బనుచుఁ♦దద్భవనాళిపయిం జరించుచున్. ౧౨౧౭

అర్థములు. మత్క్రియాసంచయము = నేను జేయవలసిన పనులు- సార్థకము = ప్రయోజనముతోఁ గూడినది, మచ్ఛ్రమంబు = నేను పడిన కష్టము - వాలాంచల = తోఁక కొన నున్న, హవ్యవాహునకున్ = అగ్నికి- గృహోదంచిత పత్తనము = ఇండ్లచేఁ బ్రకాశించు నగరము- తత్ + భవనాళిపయిన్ = ఆ యిండ్ల మీఁద,

తాత్పర్యము.

ఇంకఁ గొంచెము ప్రయత్నముచేసి యీ నగరమును నాశనము జేసితినేని నేను జేయవలసిన కార్యము లన్నియు ముగియును. నేను బడిన శ్రమము ఫలించిన దగును. నాకు నుపకారముచేయు నగ్నిహోత్రునకుఁ బ్రత్యుపకారముగ నా తోఁక కొన నుండు నగ్నిహోత్రునకు నీ యిండ్లన్నియు నాహుతిగా నిచ్చుట న్యాయ్య మగును. అని యా యిండ్ల మీఁద దిరుగ నారంభించెను.

క. శంపాయుతతోయద మనఁ, గంపింపక హనుమ లంకఁ♦గల యిల్లిల్లున్
దెంపునఁ జొచ్చుచు దాహన, లంపటుఁడై తిరిగెఁ దోఁట♦లన్ సౌధములన్.

అర్థములు. శంపాయుత తోయదము = మెఱుపులతోడి మేఘము, కంపింపక = సందేహభయములచేఁ జలింపక, దాహన లంపటుఁడై = కాల్చుటయం దాసక్తి గలవాఁడై.

తాత్పర్యము.

మెఱుపులతోడి మేఘమువలె జలింపక హనుమంతుఁడు లంకలోఁగల యిల్లిల్లు తోఁట తోఁట మేడ మేడ, దూఱినవాఁడై సర్వము కాల్చుటయం దాసక్తిగల వాఁ డయ్యెను.

సీ. మంత్రిప్రహస్తుని ♦ మందిరంబున మహా, పార్శ్వుని గృహమున ♦ వజ్రనాభు
సదనంబునను శుక ♦ సారణాలయముల, నింద్రజిత్తు వసించు ♦ నింటియందు
జంబుమాలి సుమాలి ♦ సౌధసీమంబుల, రశ్మికేతుని వాటి ♦ రవివిరోధి
హ్రస్వకర్ణుల భవ ♦ నాంగణంబులయందు, దంష్ట్రిరోమశమ త్త ♦ తలములందు
తే. వలను మెఱసి యుద్ధోన్మత్తు ♦ నిలయమందు, నల ధ్వజగ్రీవదైత్య గే ♦ హంబునందు
ఘోరహస్తిముఖాఖ్యుల ♦ కూటములను, నోజ మెఱయ విద్యుజ్జిహ్వుఁ ♦ డున్న వీట.

అర్థములు. మందిరము- గృహము- సదనము- ఆలయము-భవనము-నిలయము-గేహము- కూటము-వీఁడు- వాసతలము- వీని కన్నిటికి నిల్లని యర్థము. ప్రహస్తుఁడు, ముఖ్యమంత్రిగావున 'ప్రథమాం పిబతే వహ్ని' యన్నట్లు మొదట వాని యింటికే చిచ్చుపెట్టెను.

తాత్పర్యము.

ప్రహస్తుడు, మహాపార్శ్వుఁడు, వజ్రనాభుడు, శుకసారణులు, ఇంద్రజిత్తు, జంబుమాలి, సుమాలి, రశ్మికేతుఁడు, సూర్యజిత్తు, హ్రస్వకర్ణుఁడు, దంష్ట్రిఁడు, రోమశుఁడు, మత్తుఁడు, యుద్ధోన్మత్తుఁడు, ధ్వజగ్రీవుఁడు, హస్తిముఖుడు, విద్యుజ్జిహ్వుడు, కరాళుడు, పిశాచుఁడు, శోణితాక్షుఁడు, కుంభకర్ణుఁడు, మకరాక్షుఁడు, కుంభుఁడు, బ్రహ్మశత్రువు, నికుంభుఁడు, యజ్ఞశత్రువు వీర లుండు నిండ్లకు నిప్పుపెట్టెను.

తే. సొరిదిగఁ గరాళుని పిశాచు ♦ శోణితాక్షు, కుంభకర్ణుని మకరాక్షు ♦ కుంభు బ్రహ్మ
శత్రుని నికుంభు మఱి యజ్ఞ ♦ శత్రు వాస, తలములం దెల్ల నగ్నిని ♦ గాలిపెగవిసి.

[యీ పద్యమునకు ౧౨౧౯ పద్యమునకుఁ గలిపి తాత్పర్యములు వ్రాయఁబడినవి.]

చ. విడిచి విభీషణాలయము ♦ వేమఱుఁ గ్రుమ్మరి యొక్కఁడేనియుఁ
విడివడకుండఁ దక్కఁగల ♦ వీఁడుల నన్నిటిఁ గాల్చి యంతటన్
గడచి మహార్హరత్నకన ♦ కప్రకటోజ్జ్వలభూషణావళిన్
గడుబెడఁగైన రావణు న ♦ గారమునన్ దహనంబుఁ గొల్పుచున్. ౧౨౨౧

అర్థములు. విడివడకుండన్ = వదలి పోకుండునట్లు, మహార్హ = మిగుల వెలగల- రత్నకనక=రత్నములచే, బంగారుచే- ప్రకటోజ్జ్వల భూషణావళిన్ = విస్తారముగఁ బ్రకాశించు నాభరణములచే- కడుబెడఁగు=మిగుల నందమైన.

తాత్పర్యము.

సీతాపక్షమువాఁడని విని యుండుటచేతను, తన పక్షమున ధర్మమార్గమున రావణుతో వాదించుటచే ధర్మాత్ముఁడని తెలిసి యుండిన కారణముచే విభీషణు నిల్లు మాత్రము కాల్పలేదు. తక్కిన యిండ్లన్నియుఁ దగులఁ బెట్టెను. ఆ పిమ్మట మిగుల వెలగల బంగారు మణుల సొమ్ములచే నలంకరింపఁబడిన రావణు నింటికిఁ జిచ్చుపెట్టెను.

క. కల్పాంతజలదగర్జా; కల్పం బగు నాద మడరఁ ♦ గపి రేఁగి నిజా
నల్పజన మారఁ జిచ్చును; గొల్పెను బెనుగాలి విసర ♦ ఘోరపు భంగిన్ ౧౨౨

అర్థములు. కల్పాంత = ప్రలయకాలము కడపటి, జలద = మేఘముల యొక్క, గర్జాకల్పము = ఉఱుములతో సరిపోలిన, కల్పప్రత్యయము కొంచెము తక్కువగా సమత్వమును దెలుపును. నిజ = తనయొక్క – అనల్ప = గొప్పదగు, జవము = వేగము, ఆరన్ = అతిశయింపఁగా.

తాత్పర్యము.

ప్రలయకాల మేఘ ధ్వనివంటి ధ్వని వ్యాపింపఁగా వానరుఁడు విజృంభించి సింహనాదము చేయుచు, గాలి బలముగ వీచు చుండఁగా మిగుల వేగమునఁ జిచ్చు తగిలించెను.

క. చిటులుచుఁ బఠీలు మనుచుం, బెటులుచుఁ బటపట మటంచు ♦ వివిధమణితతిన్
స్ఫటికంబుల గొన బాగెడి, కిటికీలును మేడ లిండ్లు ♦ క్షితిపైఁ గూలెన్. ౧౨౩

తాత్పర్యము.

స్పష్టము.

క. కాలి విమానంబులు ధరఁ, గూలుట చూపట్టె సుకృత ♦ కోటులు దీఱన్
గూలెడి సిద్ధభవనముల, పోలిక నెల్లెడల నసుర ♦ పురవరమందున్. ౧౨౪

అర్థములు, విమానంబులు = పెద్దమేడలు – చూపట్టెన్ = కనఁబడెను, సుకృతకోటులు = పుణ్యసమూహములు, తీఱన్ = క్షయింపఁగా.

తాత్పర్యము.

లంకయందుఁ గాలి నేలఁబడు పెద్దమేడలు, పుణ్యము లన్నియుక్షయింపఁగా నేలఁగూలు సిద్ధుల యిండ్లవలె నుండెను.

ఉ. మండెను నిండ్లకై కడుపు ♦ మండఁగఁ బర్విడి వచ్చి వేఁడిమిన్
దండను జేర లేక మసి ♦ నాశన మయ్యెడు విత్తముల్ గనన్
గుండెలు బ్రద్దలైనను ది ♦ గుల్ గొని యేడ్చెడివారు హా! యటం
చుండెడివారు మొత్తుకొను ♦ చుండెడివారు భ్రమించువారుగన్. ౧౨౫

అర్థములు. దండను = సమీపమందు, మసి = బూడిద, విత్తముల్ = ధనములు.

తాత్పర్యము.

స్పష్టము.

చ. తమతమ యిండ్లు కాచికొన ♦ దవ్వుల నుండియుఁ బాఱువారుఁ, బెం
డ్లములును బిడ్డలున్ మఱియు ♦ లబ్బెస లాడెడివారు, వారికై
తమకము మీఱ లోనఁ జని ♦ తాము నుగాలెడివారు, ధూమసం
తమసమునందుఁ జిక్కువగ ♦ దార్కొనువారును, నేడ్చు వారలున్. ౧౨౬

అర్థములు. కాచికొనన్ = రక్షించుకొనుటకు, దవ్వులనుండి = దూరము నం దుండి, ఇతరులయిండ్లు కాలుచుండఁగాఁ జూడఁ బోయినవారు తమ యిండ్లు కాలుచున్నవని వార్తరాఁగానే పరువెత్తిరని భావము, లబ్బైస లాడెడివారు =లబలబ మొత్తుకొనువారు, ధూమసంతమసము = పొగవలనఁ గలిగిన చీఁకటి.

తాత్పర్యము.

స్పష్టము.

క. కటకట! కపిరూపున ము,న్నటివైరముఁ దీర్చికొనఁ గ♦ణంగెను దహనుం
డిటు లనియెడివారల య, ప్పటి యులివు దిగంతరాళ♦భాగమునిండెన్. ౧౨౭

అర్థములు. కణంగెను = ప్రయత్నించెను, నులివు = ధ్వని, దిగంతరాళ భాగము = దిక్కులకు నడుమనుండు ప్రదేశము.

తాత్పర్యము.

అయ్యయ్యో! పూర్వము రావణుఁడు తన్ను పెట్టిన బాధ తీర్చుకొనుటకై యగ్నిహోత్రుఁడు నేఁడు కోఁతి వలె వచ్చి పగ దీర్చుకొను చున్నాఁడు. అని యనువారల ధ్వని యాకాశము నిండెను.

చ. పరువడిఁ జుట్టు ముట్టుకొనఁ♦ బావకకీలలు కొంద అంగనల్
విరిసిన కేశపాశములు♦ వ్రేలుచు నుండ మహాస్వనంబుతో
నురమునఁ జంటిపాపలను♦ నొత్తుచు మేడలనుండి కూలి రం
బరమున నుండి మబ్బులను♦ బాసి ధొరంగు మెఱుంగులో యనన్. ౧౨౮

అర్థములు. పావకకీలలు = అగ్నిజ్వాలలు, విరిసిన కేశపాశములు=ఊడిపోయిన కొప్పులు, అంబరమున నుండి = ఆకాశము నుండి, ధొరంగు= నేలఁబడు.

తాత్పర్యము.

కొందఱు స్త్రీలు తమ్మగ్నిజ్వాలలు చుట్టు ముట్టుకొనఁగా తలవెండ్రుకలు విరియఁబోసికొని పెద్దగా నేడ్చుచుఁ జంటి బిడ్డలను ఱొమ్ముల కొత్తుకొని మేడల నుండి క్రిందఁ బడుట చూడఁగా మేఘముల నుండి మెఱుపులు క్రిందఁ బడుచున్నవా యన్నట్లుండెను.

తే. వజ్రవిద్రుమవైడూర్య♦వర్గములును
వెండి పైఁడియు ముత్తెముల్♦ వింత లైన
ధాతుభవనాళి కరఁగి యెం♦తయును బాఱు
చుండఁగా నంజనానంద♦నుండు గనియె. ౧౨౯

తాత్పర్యము.

అగ్ని వేఁడిమికి వజ్రములు, పగడములు, వైడూర్యములు, వెండి, బంగారము, ముత్తెములు, లోహములతోఁ జేసిన యిండ్లు కరఁగి ప్రవహించుచుండఁగా హనుమంతుఁడు చూచెను.

క. తృప్తిఁ గనఁ డనుమ గాల్పం, దృప్తిం గొనఁ డగ్ని కాష్ఠ♦తృణసంఘములన్
తృప్తిఁ గన దిలయు శవసం,ప్రాప్తిన్ గాలియును వీవ♦బడలక యుండెన్.

అర్థములు. కాష్ఠ = కట్టెలయొక్కయు, తృణ = గడ్డియొక్కయు, సంఘములన్ = సమూహములను, శవసంప్రాప్తిన్ = పీనుఁగులను బొందుటచే.

తాత్పర్యము.

ఇండ్లను గాల్చుటయందు హనుమంతుఁ డిఁకజాలు నని దృప్తిపడ లేదు. అగ్ని కట్టెలను, గడ్డిని గాల్చుటయందుఁ దృప్తిపడలేదు. భూమి పీనుఁగు లెన్ని పడినను చాలు ననలేదు. గాలి యెంత విసిరినను శ్రమము పొంద లేదు.

తే. కింశుకంబుల డాలొక్క ♦ క్రేవ శాల్మ
లీప్రసూనచయంబుల ♦ లీల వేఱు
చోటఁ గుంకుమలోహిత ♦ శోభ యొండు
గడను జెలువార జ్వాలలు ♦ కాంతి మెఱసె. ౧౩౩

అర్థములు. కింశుకముల డాలు = మోదుగుపూల కాంతి, క్రేవ=ప్రక్క, శాల్మలీ ప్రసూనచయంబుల = బూరుగుపువ్వుల సమూహముల, లీలన్ = విధముగ, కుంకుమ లోహితశోభ=కుంకుమము, నెత్తురుయొక్క కాంతి.

తాత్పర్యము.

అగ్నిహోత్రుని జ్వాలలు మోదుగుపూలకాంతితో నొక్కచోటను, బూరుగుపూల విధముగ మఱియొక్కచోటను, కుంకుమము, నెత్తుటివలె వేఱొక్కచోటను నుండెను.

క. పురముల దహియించిన యా,పురహరు చందమున వాయు♦పుత్రుఁడు లంకా
పుర మెల్లఁ గాల్చె మంటలు, పొరిఁ బొరిఁ ద్రికూటశైల♦మున వ్యాపింపన్.

తాత్పర్యము.

త్రిపురములను గాల్చిన రుద్రునివలె హనుమంతుఁడు లంకాపురమంతయుఁ గాల్పఁగా నా మంటలు వృద్ధియై త్రికూట శైలమున వ్యాపించెను.

సీ. అభ్రంలిహాదభ్ర♦విభ్రమోదగ్రుఁ డై, రక్షశ్శరీరాజ్య♦రాశిఁ జేసి
నాలుకల్ గ్రోయుచు♦నలువంకఁ గ్రమ్ముచుఁ;బవనుండుదనకుఁదో♦డ్పడుచునుండ
రేఁగి బ్రహ్మాండంబు ♦ లోఁగొను పోలికఁ, గోటి దినేశుల♦సాటి మీఱఁ
బిడుగులు రాలెడి ♦ వడువున ధ్వనియించి, సర్వంబుఁ దానయై♦సర్వు నగ్ని
ఆ. మింటి నంట నెగయు ♦ మంటలు మోదుగు, పూలగుత్తు లనఁగఁ♦జాలి యుండె
నగ్గి యాఱ నెగయు ♦ నసితంపుఁ బొగలచే; మొగులు నల్లకల్వ♦జిగినిఁ దాల్చె.

అర్థములు. అభ్రం = ఆకాశమును, లిహ=నాకుచున్న - తాఁకుచున్న, అదభ్ర = అధికమైన, విభ్రమ = వ్యాపించుటచే, ఉదగ్రుఁడు = భయంకరముగ నతిశయించినవాఁడై, రక్షశ్శరీర = రాక్షస శరీరము లనెడి, ఆజ్యరాశిఁజేసి= నేతి

రాశిచేత, నాలుకల్ - మంటలు - జ్వాలలు; క్రోయుచున్ = హెచ్చుదక్కువలుగా వ్యాపింపఁజేయుచు, దినేశులసాటి = సూర్యులతో సమానము, వడువునన్ = విధముగ, అసితంపు = నల్లని, మొగులు = మబ్బు, జిగి = కాంతి.

తా త్ప ర్య ము.

అగ్నిహోత్రుఁ డాకాశము నంటు జ్వాలలచే వ్యాపించినవాఁడై రాక్షసుల శరీరము లనెడి నేయిచే జ్వాలలను గొన్ని పొట్టివిగాఁ గొన్ని పొడవుగా వ్యాపింప నాలుగు ప్రక్కల వ్యాపింపఁజేయఁగాఁ దనకు గాలి సహాయపడుచుండ విజృంభించి బ్రహ్మాండంబును మ్రింగు విధముగ కోటిసూర్యుల కాంతిఁగలిగి పిడుగుల రాలునట్లు చిటపట ధ్వనులు గలిగి యెక్కడఁ జూచినఁ దానేయై వ్యాపింపఁగా నాకాశమున కెగయు మంటలు మోదుగుపూల గుత్తులవలె నుండెను. నిప్పు చల్లారినచోట నెగయు పొగలచే నల్లపడి నల్లకలువల కాంతి గల దయ్యెను.

—♦ రాక్షసవిలాపము. ♦—

ఉ. ఈ కపి యామహేంద్రుఁడో సు♦రేశ్వరుఁ డో పవిహస్తుఁడో యముం
డో కుముదాప్తుఁడో దహనుఁ♦డో ధనదుండో జలాధినాయకుం
డో కమలాప్తుఁడో పవనుఁ♦డో యలరుద్రుఁడో కాక యీతనిన్
బ్రాకృతవానరుం డనఁగ ♦ వచ్చునె? కాదు లయాంతకుం డొకో. ౧౨౩౬

తా త్ప ర్య ము.

ఈ వానరుఁడు ముప్పది మూఁడుకోట్ల దేవతలకుఁ బ్రభువై వజ్రము ధరించిన యింద్రుఁడా-యముఁడా - చంద్రుఁడా - అగ్నిహోత్రుఁడా-కుబేరుఁడా-వరుణుఁడా - సూర్యుఁడా - వాయుదేవుఁడా కాక, యా రుద్రుఁడా వీరిలో నెవఁడో యొకఁడై యుండవలెను గాని, సామాన్యపు క్రోఁతి యనరాదు. అటుకాక ప్రలయ కాలాంతకుఁడో - వీ రెవరు గారు-ఏలన వీ రందఱు నిదివఱకు రావణుచేఁ బీడింపఁబడి యణఁగి పడి యుండువారే కావున.

ఆ. సర్వలోకకర్త ♦ సర్వపితామహుం, డై చతుర్ముఖుండు ♦ నైన బ్రహ్మ
ప్రబలకోప మిట్లు ♦ రాక్షసనాశార్థ,మరుగుదెంచెనో వ♦నాటుఁడగుచు. ౧౨౩౭

అర్థములు. సర్వలోకకర్త = అన్ని లోకముల సృజించువాఁడు, సర్వపితామహుఁడు = అన్నిటికిఁ దాతయైనవాఁడు, చతుర్ముఖుండు = నాలుగుముఖములుకలవాఁడు, రాక్షసనాశార్థము = రాక్షసుల నాశము చేయుకొఱకు, వనాటుఁడు = క్రోఁతి.

తా త్ప ర్య ము.

సర్వలోకముల సృజించువాఁడై ఆ కారణమున సర్వలోకముల తాతయై నాలుగుముఖముల బ్రహ్మదేవుఁడు తానిచ్చినవరములచే గర్వించి చేయరానిపనులఁ

జేయు రావణుఁ గోపింపఁగా నా కోపము రాక్షసుల నాశము చేయుకొఱకు క్రోధిమై వచ్చెనేమో ఇదియును గాదు. ఏలన:- బ్రహ్మ సృష్టించువాఁడే కాని చంపువాఁడు కాఁడు. కావున నీ వానరుఁడు బ్రహ్మ కాఁజాలఁడు. ముసిఁడిచెట్టు నైన దాఁబెట్టిన చెట్టును దా నెవ్వఁడు కొట్టడుఁగదా.

క. అనుచు విశిష్టులు రాక్షసు,లనలశిఖాదగ్ధభూరు♦హాలయవనప
క్షినికరముఖజీవ్యన్విత,మును దమనగరంబుఁ గాంచి ♦ పొక్కుచు మఱియున్.

అర్థములు. విశిష్టులు = జ్ఞానవంతులు, అనలశిఖా = అగ్నిజ్వాలలచే, దగ్ధ = కాల్పఁబడిన, భూరుహా = చెట్లతోను, ఆలయ = ఇండ్లతోను, వన = తోటలతోను, పక్షినికరముఖజీవి = పక్షుల గుంపులు మొదలగు ప్రాణులతోను, అన్విత = కూడిన, పొక్కుచున్ = త్వరపడుచు.

తాత్పర్యము.

అని చెప్పుచు జ్ఞానులగు రాక్షసు లగ్నిజ్వాలలచే దగ్ధమైన చెట్లు-గృహములు వనములు-పక్షులు లోనగు జీవజంతువులు గల తమ పట్టనమును జూచి దుఃఖపడుచు నీ వానరుఁడు మీఁదఁజెప్పిన వారిలో నెవ్వఁడు గాఁడు. వారి కింత శక్తి లేదు.

తే. అకట! యవ్యక్త మేక మ♦నంత మగు న,చింత్యవిష్ణుసు తేజంబు ♦ స్వీయమాయ
వానరాకృతిఁ గైకొని ♦ వచ్చె నేమొ, యఖిలరాక్షస కులవినా♦శార్థ మనఁగ.

అర్థములు. అవ్యక్తము = కన్ను మొదలగు బాహ్యేంద్రియములకు గోచరింపనిది, ఏకము = ముఖ్యము, అట్టిది రెండవది లేనిది. అనంతము = మూఁడు విధములైన పరిచ్ఛేదములు లేనిది- కాలపరిచ్ఛేదము, వస్తుపరిచ్ఛేదము, దేశపరిచ్ఛేదము- అని పరిచ్ఛేదములు మూఁడు విధములు. ఒక కాలమందుండి వేఱొక కాలమందు లేకుండుట కాలపరిచ్ఛేదము. అది లేనిదనఁగా నిత్యమైనది. ఒక ప్రదేశమున నుండి వేఱొక ప్రదేశమున లేకుండునది దేశపరిచ్ఛేదము. అది లేని దనఁగా సర్వదేశవ్యాపి యని యర్థము. ఒక వస్తువు దానై మఱియొక వస్తువు తాను గాకుండునది వస్తుపరిచ్ఛేదము. అది లేని దనఁగా సమస్త వస్తుస్వరూపమై యుండుట. ఇది వస్త్వైక్యముచేతను, అంతర్యామిచేతను, శరీరిశరీర భావముచేతను నిర్వహింప నగును. అచింత్యము = మనస్సుచే నాలోచించి తెలిసికొన సాధ్యముగానిది. విష్ణుసు తేజంబు = విష్ణువునం దున్న పూజ్య మగు పరమశక్తి; (౨) విష్ణుమూర్తియనెడి తేజస్సు-స్వీయమాయ = అచింత్యము అద్భుతమునైన తనశక్తి, అఖిల రాక్షసుల వినాశార్థము = సకల రాక్షస వంశమును నాశము చేయు కొఱకు.

తాత్పర్యము.

బ్రహ్మరుద్రాదులు, నింద్రాది దిక్పాలురు గాకున్న నెవ్వరింత కార్యము చేయగలవారు అని యాలోచించి యా జ్ఞానులు బాహ్యేంద్రియ గోచరము గానిది, యసమానమైనది, ఏ విషయమందును నంతము లేనిది, ఇట్టి దని యూహింపరానిది నగు

విష్ణు మహా తేజంబు అచింత్యమై యత్యద్భుత కర్మములు చేయగల శక్తి వానర స్వరూపమును గైకొని సర్వ రాక్షస వంశములను నాశము చేయుకొఱకు వచ్చినదని నిశ్చయించిరి. ఇందు ఏమొ యనునది సంస్కృతమున 'వా' వలె నిర్ధారణార్థమందుఁ బ్రయుక్తము. 'వా స్యాద్వికల్పోపమయోరేవార్థేచ సముచ్చయే' యని విశ్వము. దీనికి తరువాత మఱియొకటి దీని నిషేధించి చెప్పకుండుటచే నిదియే నిశ్చయ మని గ్రహింప నగు.

క. హనుమత్ప్రేరితహుతభు, గ్ఘనకీలాదగ్ధసాశ్వ♦గజరథజనప
క్షినిచయమృగవృక్షం బై. మనుజాశన నగర మపుడు ♦ మఱిమఱియేడ్చెన్.

అర్థములు. హనుమత్ + ప్రేరిత = హనుమంతునిచేఁ బ్రేరింపఁబడిన, హుతభుక్ = అగ్నిహోత్రుని, ఘనకీలా = గొప్ప మంటలచే, దగ్ధ = కాలిన- స+ అశ్వ+గజ+రథ+జన+పక్షి నిచయ+మృగ+వృక్షంబు=గుఱ్ఱములు- ఏనుఁగులు- తేర్లు- జనులు- పక్షుల గుంపులు- మృగములు- చెట్లతోఁ గూడినదై, మనుజాశన నగరము=రాక్షసుల పట్టణము, నగర మేడ్చె ననఁగా నగరములోని జను లేడ్చి రని లక్షణచే నర్థము గ్రహింపనగు.

తాత్పర్యము.

హనుమంతునిచేఁ బ్రేరింపఁబడిన యగ్నిజ్వాలలచేఁ గాలిన గుఱ్ఱములు- ఏనుఁగులు- రథములు- పక్షుల గుంపులు- మృగములు - వృక్షములు గల లంకా నగరము విశేషముగ నేడ్చెను. ఏ మని యేడ్చె ననిన.

క. అయ్యో తండ్రీ! కొడుకా!, యయ్యో ప్రాణేశ! మిత్ర♦మా పోయితివే
యిప్పుడ సుఖజీవన మ,య్యయ్యో పోయె నని యుంగ♦లార్చిరి యసురుల్.

తాత్పర్యము.

సుస్పష్టము.

చ. కెరలి ఛటచ్ఛటాకలిత♦కీలల మాలలఁ గాలి కూలుచున్
బరువిడు యోధవర్గములు ♦ ప్రాణము వాసిన వీరవర్యులై
పరగఁగ రోదనధ్వనులు ♦ పావని కోపబలాభిభూతమై
స్థిరఁ గనుపట్టెఁ దత్పురము ♦ తిట్టిన రూపఱుమాడ్కి దీనమై. ౧౨౪౦

అర్థములు. కెరలి = విజృంభించి, ఛటచ్ఛటా కలిత = ఛట ఛట మను ధ్వనులు గల, కీలల మాలలన్ = జ్వాలల సమూహముచే, పావని కోపబలాభిభూతమై = హనుమంతుని కోపబలముచే - అభిభూతమై = చెఱుపఁబడినదై, స్థిరన్ = భూమియందు, తిట్టినన్ = శపింపఁగా, రూపఱు మాడ్కిన్ = లేక పోయినవిధముగా.

తాత్పర్యము.

విజృంభించి ఛట ఛట ధ్వనులతోడి జ్వాలల వరుసలచేఁ గాలి, పడుచుఁ పరువెత్తి యోధుల గుంపులు చచ్చిన వీరశ్రేష్ఠులు గలదై, యేడుపు ధ్వనులు

వ్యాపింపఁగా హనుమంతుని కోపముచేఁ జెడి యా లంక శాపముచే రూపుమాసిన దానివలె దీనమై కనఁబడెను.

తే. సంభ్రమత్రస్త సవిషణ్ణ♦సౌరవైరి,పాళిచే నుజ్జ్వలజ్జ్వాల♦పావకార్చి
రంకములచేతఁ జూపట్టె♦ లంక కల్ప,విశ్వసృట్కోపనిహత మా♦విశ్వమనఁగ.

అర్థములు. సంభ్రమ త్రస్త = తత్తఱ పాటుచే భయపడిన, సవిషణ్ణ = దుఃఖముగల, సౌరవైరి పాళిచే = రాక్షసుల గుంపులతోఁగూడిన ఉజ్జ్వలత్ = మండుచున్న, జ్వాల = మంటలు గల, పావక = అగ్నియొక్క, అర్చిః+అంకముల చేత = శిఖల చిహ్నములచే, కల్ప = ప్రలయ కాలమందు, విశ్వసృట్ = బ్రహ్మ యొక్క, కోప = ఆగ్రహముచే, నిహతము = కొట్టఁబడిన, విశ్వము=ప్రపంచము.

తా త్ప ర్య ము.

సంభ్రమముచే భయపడి దుఃఖించు రాక్షస సమూహములచేతను మండు చున్న మంటల జ్వాలల గుర్తుల చేతను లంక ప్రలయమందు బ్రహ్మ కోపముచే నశింపు చేయఁబడిన ప్రపంచము వలె నుండెను.

ఆ. వనముఁ బాడుచేసి ♦ మనుజాదులను జంపి, సౌధభవనములను♦చదును చేసి
మండు తోఁకతోడ♦మార్తాండునట్లు త్రి,కూటశిఖరిఁ జేరి♦క్రోఁతి ఱేఁడు ౧౨౪౨

అర్థములు. మనుజాదులను = మనుష్యులను తిను రాక్షసులను, చదును = నేల చదరము.

తా త్ప ర్య ము.

వనము పాడుచేసి రాక్షసులఁ జంపి మేడలు మిద్దెలు నేల చదరముచేసి యింకను మండుచున్న తోఁకతో సూర్యునివలె వెలుఁగుచు వానరేంద్రుఁడు త్రికూట పర్వతము చేరె.

తే. జానకీశ్వరుఁ గనుఁగొన ♦ జనఁగ దలఁచె, నతని యద్భుతకర్మంబు♦నవధరించి
దేవగంధర్వమునినాగ♦దివ్యులెల్ల, నిస్తులంబైన ముదమున♦లివ్వటిలిరి.

తా త్ప ర్య ము.

రామచంద్రమూర్తిని జూడఁబోవఁదలఁచెను. ఆయన చేసినయాశ్చర్యకర మైన పనిఁజూచి దేవతలు గంధర్వులు నాగులు మునులు ఆకాశ సంచారులు మిగుల సంతోషించిరి.

క. గంధవహసుతునిచే దశ, కంధరపుర మెల్ల భస్మ♦కాండము గాఁగన్
గంధర్వులు సిద్ధులు, బంధురవిస్మయముతోడఁ ♦ బరికింపంగన్. ౧౨౪౪

తా త్ప ర్య ము.

వాయుపుత్రునిచే రావణుని పట్టణ మంతయుబూడిద రాశిగాఁగ గంధర్వులు సిద్ధులు మిగుల నాశ్చర్యముతోఁ జూడఁగా.

క. జ్వాలామాలావృతలాం,గూలు మరుత్తనయుఁ జూచి ♦ కూరిన భీతిన్
గాలానలుఁ డో యనుచును, జాలఁగఁ గంపించె భూత♦సంచయ మెల్లన్ ౧౨౪౫

అర్థములు. జ్వాలా మాలావృత లాంగూలుఁ = మంటల సమూహముచేఁ జుట్టఁబడిన తోఁకగలవానిని, కాలానలుఁడో = ప్రలయ కాలాగ్ని యో.

తా త్ప ర్య ము .

అగ్ని శిఖలచేఁ జుట్టుకొనిన తోఁకగల యాంజనేయుని చూచి భయపడి భూతముల సమూహములు ప్రలయకాల మందలి యగ్నిహోత్రుఁడిపుడే వచ్చెనేమో యని భయపడెను.

తామరసము. మునిసురపన్నగ♦ముఖ్యులుయక్షుల్, గనుఁగొని మారుతి♦కార్యము ఘనమగుప్రీతిని♦గాంచిరి మేల్ మేలనుచును మెచ్చిరి♦యంజనపుత్రుఁ. [నాత్మన్

తా త్ప ర్య ము .

మునులు దేవతలు పన్నగులు మొదలగువారును, యక్షులునుఆంజనేయుఁడు చేసిన కార్యమును జూచిమిగుల సంతోషించి మేలు మేలని హనుమంతునిఁ బొగడిరి.

తామరసము – దీనికే తోదక మనియుఁ బేరు. నజజయ గణములు – ఎనిమిదింట యతి.

—♦౫౫–వ సర్గము. హనుమంతుఁడు సీతాదేవి దగ్ధ యయ్యెనని పరితాపపడుట.♦—

క. అంతట హనుమంతుఁడు వాలాంతాగ్నిని వార్ధినీట ♦ నాఱిచి నగరం
బంతయును జూచి దుస్సహ, చింతారతి స్రుక్కె నేమి♦ చేసితి నయ్యో. ౧౫౭౭

అర్థములు. వాలాంతాగ్నిని = తోఁక కొన నున్న యగ్నిని – దీనివలన తోఁక కంతయు గుడ్డలు చుట్టలేదనియు కుచ్చుగా నొక కొనయందు మాత్రమే చుట్టఁబడెనని గ్రహింప నగు.

తా త్ప ర్య ము .

ఆవల హనుమంతుఁడు తోఁకకొన మండుచున్న యగ్నిని, తోఁకను సముద్ర జలములందు ముంచుటచేఁ జల్లార్చి పట్టణమంతయుఁ గాలియుండుటచూచి యయ్యో యేమిపని చేసితినని సహింపరాని విచారము గల వాఁడయ్యెను.

క. ఎంత యకార్యంబును నేఁ, జింతింపక లంకఁ గాల్చి ♦ చేసితి ననుచున్
స్వాంతమున దిగులుపడి యే, కాంతంబును దన్ను దానె ♦ గర్హించుకొనెన్.

తా త్ప ర్య ము .

లంకనంతయుఁ గాల్చి నే నెంతటి చేయరాని పని యాలోచన లేక చేసితినని మనస్సున దిగులుపడి తన్నుఁదానె మిగుల నిందించుకొనెను.

క. దీపించు నగ్ని జలముల, రూపు చెఱుచునట్లు పెరుఁగు♦రోషమును సుధీ
వ్యాపారముచే నణఁచెడు, నాపురుషుఁడె పో మహాత్ముఁ♦డవు ధన్యుండున్. ౧౫౭౯

తా త్ప ర్య ము .

మండుచున్న యగ్నిని నీళ్ళచేఁ జల్లార్చునట్లు వృద్ధియగుచున్న కోపమును మంచి బుద్ధి వ్యాపారముచే నణఁచెడివాఁడే గొప్ప మనస్సు గల ధన్యుఁడు.

క. కోపి తునుము గురువుల నేన్, కోపి కడుం గటుకులాడు♦గుణవంతుల నేన్
గోపి యొనర్పఁగఁ జాలని, పాపం బేదైనఁ గలదె♦భావింపంగన్. ౧౨౫౦

తాత్పర్యము.

కోపము గలవాఁడు గురువులనైనను జంపును. గుణవంతులనైనను దిట్టును. ఆలోచింపఁగా కోపి యగువాఁడు చేయఁజాలని పాపమే లేదు.

క. ఆరయ వాచ్యావాచ్యవి, చారంబే లేదు కోపి♦జనులకుఁ జేయం
గారాని కార్యమాడం, గారాని యవాచ్య మొండుఁ♦గలదే చూడన్. ౧౨౫౧

అర్థములు. వాచ్య- అవాచ్య- విచారంబు=ఇది చెప్పవచ్చును, ఇది చెప్పరాదను నాలోచన, అవాచ్యము= చెడుమాట-

తాత్పర్యము.

కోపము గలవానికి వీని నీమాట యనవచ్చును, వీని నీమాట యనరాదుఅను నాలోచనయే లేదు. ఎంత గొప్పవారినైన నెంతమాటయైన మాటలాడును. కోపికిఁ జేయరాని పని, చెప్పరానిమాట లేదు.

క. వాతాశనంబు జీర్ణం, బౌ తన కుబుసంబు విడుచు♦నట్టులు క్షమచే
జాతక్రోధముఁ బాఁచెడి, యాతఁడె పో పురుషుఁ డనఁగ♦నర్హుఁడు జగతిన్.

అర్థములు. వాతాశనంబు=గాలి యాహారముగాఁ గలది-పాము. జీర్ణంబు= చివికినది- కుబుసము=పొర, కుప్పసము; క్షమచేతన్ = ఓర్పుచే, జాతక్రోధము = పుట్టిన గోపము, ఆఁచెడి=నివారించెడి.

తాత్పర్యము.

పాము చివికిన తన దేహము పొరను వదలి పెట్టునట్లు పుట్టిన కోపమును నోర్పుచే నెవఁ డడ్డగించునో వాఁడే పురుషుఁ డనఁదగినవాఁడు.

క. ఎంతటి లజ్జాహీనుఁడ, నెంత సుదుర్బుద్ధిఁ బాప♦కృత్తముఁడ నిసీ
చింతింపక శ్రీరాఘవు, కాంతను దహియించి స్వామి♦ఘాతుకుఁ డైతిన్. ౧౨౫౩

అర్థములు. లజ్జాహీనుఁడన్ = సిగ్గులేనివాఁడను, సుదుర్బుద్ధి = మిగులఁ జెడు బుద్ధి గలవాఁడను, పాపకృత్+తముఁడన్ = పాపము చేయు వారిలో గొప్పవాఁడను. స్వామి ఘాతకుఁడు=స్వామిద్రోహము చేసినవాఁడను, ఉత్తమ పురుషమునకు మాఱు ప్రథమ పురుషము, పాండు భూవరునకుఁ గోడలైతివలె.

తాత్పర్యము.

నే నెంతటి సిగ్గులేనివాఁడను. ఎంతటి పాడుబుద్ధిగలవాఁడను. పాపాత్ములలోఁ బాపాత్ముఁడను ఛీ ఛీ ఆలోచన లేక శ్రీ సీతాదేవిని కాల్చి స్వామి ద్రోహము చేసినవాఁడ నైతిని.

ఉ. నిక్కము లంక యంతయును♦నీఱయి పోవుట, సీత యగ్నులం
జిక్కి నశించి యుండు, నెది♦సేయఁగఁ బూనితి దాని దెల్పి తే

కిక్కట నేనె కీడ్పుఱుచుటయ్యెను, జానకిఁ గావఁ జూడమిం
గ్రక్కసకింక చేతఁ బతికార్యము నంతయుఁ బాడుచేసితిన్. ౧౨౫౪

అర్థములు. నీఱు = భస్మము, క్రక్కసకింక = కఠినకోపము. కర్కశ భవము క్రక్కస.

తాత్పర్యము.

లంకయంతయుఁ గాలి బూడిద యగుట నిజము. ఆ మంటలలోఁ దగులుకొని సీత నశించియుండుటయు నిజము. దేనిని నేను జేయఁబూనితినో దానిని నేనే తెలివిలేక పాడుచేసితిని. జానకిని గావవలె నను నాలోచన లేనివాఁడనై క్రూరమైన కోపముచేఁ బతికార్యము నంతయు నేనే పాడుచేసితిని.

క. కొంచెపుఁబని యీపురిని న,హించుట యది యెల్ల దీరె నేలా? నేఁ గా
వించితిఁ బని నాశము నెదఁ, గాంచక, మతి యున్నె యాత్రగానికి నెందున్?

తాత్పర్యము.

ఈ పురిని దహించుట చిన్న పని. అది యంతయుఁ జేసితినిగాని యేమిప్రయోజనము? ఆలోచనలేక నేను బాగుఁ జేయఁదలఁచిన పనిని బాడుచేసితిని. తొందర పడి పనిచేయువానికి బుద్ధిగలదా? ఆత్రగానికి బుద్ధిమట్టు అనునది లోకోక్తి.

ఉ. ఎంతటిలోన నాశ్రమము లెల్ల వృథా చనె, రోషదూషిత
స్వాంతత స్వామికార్యమును వట్టునఁ గల్పితి మూలముట్టుగాఁ
గొంతయుఁ దక్క కంతయును గూలె సురారిపురంబు, మైథిలీ
కాంతయు నిందుఁ జిక్కి హతగా కెటు జీవము నిల్ప నోపెడిన్. ౧౨౫౬

అర్థములు. రోషదూషిత స్వాంతతన్ = కోపముచే దుష్టముగాఁ జేయఁబడిన మనస్సుచే- వట్టునన్ = వఱదలో.

తాత్పర్యము.

అయ్యో! యెంత యల్పకాలములో నేనుజేసిన కష్టమంతయు వ్యర్థమై పోయెను. రోషముచేఁ జెడిన మనస్సుతో స్వామి కార్యమును సమూలముగ వఱదపాలు చేసితిఁగదా. రావణుని నగరము కొంచెమైన మిగులక సర్వము నాశమయ్యెను. ఈ ప్రలయములో సీతాదేవి మాత్రము చావక ప్రాణ మెట్లు కాపాడుకొనఁ గలిగి యుండును. ఆమెయుఁ గాలి యుండును.

క. నా యజ్ఞానముచేతను, నా యూనినపనియె నాశనం బైన నిటన్
జేయుదుఁ బ్రాణత్యాగం, బీయెడ నయ్యదియ యుచిత మెటు యోజింపన్.

తాత్పర్యము.

నా తెలివితక్కువతనముచే నేను జక్కఁ జేయఁ బూనిన పనియే చెడిపోయిన యెడల నేను బ్రాణత్యాగము చేయుటయె యీ సమయమునఁ దగిన కార్యము.

క. చిచ్చుఱుకుదునో? కడలిని, మచ్చెములకు సత్త్వములకు మై యెఱగాఁగన్
జెచ్చెదునో? బడబాగ్నికి, నిచ్చెదునో దేహ? మిప్పు డెటు మరణింతున్?

అర్థములు. చిచ్చుఉరుకుదునో = చిచ్చునందుఁ బడుదునా – సప్తమ్యర్థవిభక్తి ... ముకుఁ బ్రథమ. మచ్చెములకుఁ = చేఁపలకు – మత్స్యశబ్దభవము మచ్చెము. సత్త్వములకు = క్రూర జంతువులకు – మై = దేహము. ఎఱ = ఆహారము, బడబాగ్నికి = సముద్రమున నాఁడు గుఱ్ఱము రూపమున నుండు నగ్నికి– శుచి– వర్ణవ్యత్యయమున తద్భవము చిచ్చు. ఇచ్చుదునో = చువర్ణంబుతోడి దుగ్ధకారంబునకు తకారంబు వైకల్పికంబు.

తాత్పర్యము.

అగ్నియందుఁ బడుదునా? సముద్రమందు దూఁకి మత్స్యములకు పెద్దజంతువులకు నా దేహము నాహారముగా నిత్తునా, బడబాగ్నిపాలు సేయుదునా? ఏవిధముగ దేహము విడుచుట తగును?

ఉ. వారలకార్యముం జెఱిచి♦ప్రాణము మేన ధరించుయే మటం
చా రఘురామలక్ష్మణుల♦నా కపినాథుని మోముఁ జూచెదన్?
భూరితరాగ్రహంబుమెయి♦భూప్రథితం బగు క్రోఁతిబుద్ధి నే
నీరహిఁ జూపితిం, ప్రకృతి♦వృత్తము నాఁపఁగ నేరనైతిఁగా. ౧౨౫౯

అర్థములు. వారల = రామలక్ష్మణసుగ్రీవుల, భూప్రథితంబు = భూలోకమున ప్రసిద్ధికెక్కిన, ఈరహిన్ = ఈవిధముగ, ప్రకృతివృత్తము = సహజముగా వచ్చిన నడవడి, ఆఁపగన్ = నిలుపుటకు, నేరనైతిన్ = సమర్థుఁడగా నైతిని.

తాత్పర్యము.

రామలక్ష్మణుల సుగ్రీవుని కార్యముపాడుచేసి ప్రాణములతో వారియెదుటికిఁ బోయి వారిముఖముల నేమని చూతును? ఏమి చెప్పుదును? మిక్కిలి గొప్పదగు కోపముచే నా స్వభావసిద్ధమైన క్రోఁతిబుద్ధిని నిలుపఁజాలనైతిని గదా.

నీది క్రోఁతి బుద్ధి యని సీతాదేవి యనిన హనుమంతునకు నది యవమానకరముగా నుండెను. కాని యిప్పుడు తన్నుఁదా ననుకొనుట తాను సుగ్రీవు ననుట బాగుగనే యున్నది.

ఆ. అనెడువారు లేమి♦నతిచంచలము రజో,భావమైనబుద్ధి♦పాడు గాను
శక్తిగలిగియుండి ♦ జానకిఁ గావంగఁ దలపనైతిఁ గనుక ♦ బలిమిఁజేసి, ౧౨౬౦

అర్థములు. అనెడువారు = ఏమి యిట్లు చేసితివని దండించువారు.

తాత్పర్యము.

దండించు పెద్దవారు లేని కారణమున మిగులఁ జలించునది రజోగుణముగలదియైన బుద్ధి పాడైపోవును. రక్షించుటకు శక్తుఁడనై కూడ కోపాతిశయమున జానకిని రక్షింపనైతిని గదా.

సీ. భూమిజ మరణింప♦రామలక్ష్మణులును, బ్రతుక రవ్వారలఁ♦పాటుఁ జూచి
సమయు సుగ్రీవుండు♦సహబంధుఁడై యది, విని భరతుండును♦విలయ మొందు

శత్రుఘ్నుతో నిట్లు ♦ మిత్రకులం బెల్లఁ, దీఱినఁ బ్రజలును ♦ దీర్ఘశోక
సంతప్తు లయ్యెద ♦ రింతకు ధర్మార్థహీనుఁడ భాగ్యర ♦ హితుఁడ రోష
తే. దోషకలితాంతరంగుండ ♦ దుర్మదుండ
నైన నే మూల మై లోక ♦ మంత నాశ
మొందఁ గన్గొందుఁ, గల దొకో ♦ సందియంబు
దీన? ననుచును జింతించె ♦ దీనుఁ డగుచు. ౧౨౯౧

అర్థములు. మిత్రకులము = సూర్యవంశము, తీఱినన్ = నశింపఁగా, దీర్ఘశోక సంతప్తులు = విస్తారమైన శోకముచేఁ దపించువారు, ధర్మార్థహీనుఁడన్ = ధర్మప్రయోజనము లేనివాఁడను – భాగ్యరహితుఁడను = సీతారాములు కూడి యుండఁగా జూచు పుణ్యము లేనివాఁడను–రోషదోషకలిత+అంతరంగుఁడ = రోష మనెడి పాపముతోఁగూడిన మనస్సుగలవాఁడను–దుర్మదుఁడన్ = చెడ్డగర్వము గల వాఁడను–మూలమై = కారణమై.

తాత్పర్యము.

జానకి మరణించెనా రామలక్ష్మణులు బ్రదుకరు. వారలు మడియుటఁజూచి బంధువులతోడ సుగ్రీవుఁడు చచ్చును. ఇదంతయు విని శత్రుఘ్నునితో భరతుఁడును జచ్చును. ఈ విధముగ సూర్యవంశము నశింపఁగా ప్రజలు దీర్ఘమైన శోకముచే మిగుల తపింతురు. ఇంతటి యనర్థమునకు ధర్మము ప్రయోజనముగా లేనివాఁడను, అదృష్ట హీనుఁడను కోప మను పాపములచేఁ జెడిన మనస్సు గలవాఁడను, బలము గలదు, నా కెవ్వరడ్డమని చెడ్డ పొగరుచే దేహము తెలియని వాఁడను, నేను కారణమై లోక మంతయు నాశమై పోవుట చూడ వలసియున్నది. ఇందు సందేహము లేదు. అని శోకము గలవాఁడై హనుమంతుఁ డాలోచించెను.

—♦ హనుమంతుడు సీతాదేవిని నగ్ని దహింపఁజాల డని నిశ్చయించుట. ♦—

క. ఈ విధమునఁ జింతించెడి, పావనికిం బూర్వదృష్ట ♦ భద్రశకునముల్
వావిరి మెయిఁ దోఁపఁగఁ జే, తోవీథిం జింత సేయఁ ♦ దొడఁగెన్ మఱలన్,

అర్థములు. పూర్వదృష్ట = పూర్వము కనఁబడిన– భద్రశకునముల్ = శుభ చిహ్నములు – మెయిన్ = దేహమునందు –తోఁపఁగన్ = కనఁబడఁగా.

దక్షిణాక్షిపరిస్పందో దక్షిణస్య భుజస్య చ
హృదయస్య ప్రసాదశ్చ సద్య స్సంసిద్ధి సూచకాః॥

మగవారికిఁ గుడి కన్ను, కుడిభుజము అదురుటయు హృదయముప్రసన్నమై యుండుటయు నప్పుడే కార్యసిద్ధి తెలుపు శుభసూచకములు.

తాత్పర్యము.

ఈ విధముగ నాలోచించు నాంజనేయునికి ముందు కనఁబడుచుండిన శుభ

శకునములు దేహమునందుఁ గానరాఁగా మఱల నిటు లాలోచించెను.

చ. అది యెటు సంభవించుఁ? గల♦దా దహియింపఁగ నగ్ని నగ్ని? భూ
విదితమహాత్మ శీలవతి♦స్వీయమహామహిమంబుచేత న
భ్యుదయము నొందకున్నె! వర♦పుణ్యచరిత్ర మహాత్ము దేవినిన్
సదమలశీలగుప్త మహి♦జన్ దహనుం డెటుదాఁకఁ జాలెడిన్? ౧౨౬౩

అర్థములు. అది = సీతాదేవి యగ్నిచే నశించుట – భూవిదిత మహాత్మ = ప్రపంచమునఁ బ్రసిద్ధికెక్కిన గొప్ప మహిమగలది. శీలవతి = సదాచారము గలది. స్వీయ మహిమంబుచేత = తన గొప్ప పాతివ్రత్య మహిమచే – అభ్యుదయము = శుభము – సదమలశీల గుప్త = మంచి నిర్దోషమైన సదాచారముచే రక్షింపఁబడు దానిని.

తాత్పర్యము.

సీతాదేవినఁట – అగ్నియఁట – దహించునఁట – అయ్యో! నా తెలివి తెల్లవాఱ నెటువంటి యాలోచన చేసితిని. సీతగూడ రాక్షస స్త్రీవంటి దని తలఁచితినిగదా. అయ్యో! నా పాపమా! అగ్నిని నగ్ని దహించుట యెందైనఁ గలదా! ప్రపంచము నందంతయుఁ బ్రసిద్ధికెక్కిన గొప్పమహిమ గలది, సదాచారసంపన్న, తన గొప్ప మహిమముచే బాగుపడి యుండదా! గొప్ప పుణ్యపు నడవడి గల రామచంద్రమూర్తి దేవిని, మిగుల నిర్మలమైన పాతివ్రత్యముచే రక్షింపఁబడు దానిని, జానకిని నగ్నిహోత్రుఁడు దాఁకఁగలఁడా? అంతటి శక్తి యతనికిఁ గలదా?

ఉ. రాము మహాత్మతన్ జనక♦రాజసుతాసుకృతంబుకల్మి న
న్నామెయిఁ గాల్ప నేరని హు♦తాశనుఁ డెట్టులు కైకపట్టిలో
నౌ ముగు రన్నదమ్ములకు♦నర్చితదేవతయై రఘూత్తమ
ప్రేమకు నాకరం బయిన♦ప్రేయసినిన్ దహియింపఁ జాలెడిన్? ౧౨౬౪

అర్థములు. సుకృతంబు = పాతివ్రత్యము – ఆమెయిన్ = ముందుచెప్పిన విధముగ – అర్చిత దేవత = పూజింపఁబడు దేవత – ఆకరము = స్థానము.

తాత్పర్యము.

శ్రీ రామచంద్రమూర్తి మహాత్మ్యముచేత – సీతాదేవి పాతివ్రత్య సంపద చేత నా దేహమును గాల్ప సమర్థుఁడు గాని యగ్నిహోత్రుఁడు లక్ష్మణ భరత శత్రుఘ్నులు మహాలక్ష్మివలె నెవ్వతెను బూజించుచున్నారో, ఎవతె శ్రీరామచంద్రమూర్తి ప్రేమకు స్థానమో అటువంటి శ్రీరామప్రియురాలిని యగ్నిహోత్రుఁడా గాల్పగలవాఁడు?

ఆ. అవ్యయుండుఁ బ్రభువు♦నఖిలంబు నెందేని, గాల్చివైచు వేల్పు♦గాడ్పుసఖుఁడు
పూనఁ డయ్యె నాదు♦పుచ్ఛంబు దహియింప, నమ్మహానుభావ♦నంటు నెట్లు?

అర్థములు. అవ్యయుండు = నాశములేనివాఁడు – పుచ్ఛంబు = తోఁక

తాత్పర్యము.

నాశము లేనివాఁడు, ప్రభువునైన యగ్నిహోత్రుఁడు రామచంద్రమూర్తి దాసుఁడనై యాయన కార్యము చేయుచున్నా నను తలంపుతో నాతోఁక కొన వెంద్రుకనైనఁ గాలుపఁ బూనని వాఁడు అటువంటి మహానుభావురాలిని నెట్లు తాఁకఁగలఁడు.

తే. ఔర! లంకకు వచ్చుచో♦నీరనిధిని, నడుమఁ గన్గొంటిఁ గాదె మైనాక మనెడి
శైలమొక్కటి నన్ను నా♦శ్వాసపఱుప,ననుచు వెండియుదానిని♦నాత్మఁ దలఁచి.

తాత్పర్యము.

ఏమి యాశ్చర్యము! నేను లంకకు వచ్చునపుడు సముద్రము నడుమ మైనాక పర్వతము నాకు నూఱట గలిగింప వచ్చెను గదా. ఇది యెవరి యనుగ్రహము? అనుచు నాలోచించి.

ఉ. సూనృతవాక్యసంపదను♦శుద్ధతపంబునఁ బ్రాణనాయక
ధ్యానరతైకచిత్తమున♦నాయమ కోరిన హవ్యవాహునే
పూని దహించుఁగాక. పువుఁ♦బోణిని నగ్ని దహింపఁ జాలునే?
లేనికుశంక లేల యని♦లేమ మహత్త్వము నెంచుచుండఁగన్. ౧౨౭

అర్థములు. సూనృత వాక్య సంపదను=సత్యము చెప్పుటయను సంపత్తి చేతను - శుద్ధ తపంబునన్=నిర్మలమైన పాతివ్రత్య మను తపస్సుచేతను - ప్రాణ నాయక ధ్యాన రతైక చిత్తమునన్ = తన భర్తనే ధ్యానించుట యందలి ప్రీతి యొక్కటియె గల మనస్సు చిత్తము చేతను - కోరినన్=ఇష్టముగల దయ్యేనేని - హవ్యవహునే= అగ్నిహోత్రునే- కుశంకలు = పనికిమాలిన దుష్ట సందేహములు లేమ=స్త్రీ.

తాత్పర్యము.

సమస్తలోకముల జయింపఁజాలు సత్యవాక్య సంపదచేతను, నిర్మలమైనపాతి వ్రత్య మను తపస్సుచేతను, భర్తను ధ్యానించుట యందే సంతోషించు మనస్సుగల దగుటచేతను నామె కోరిన నగ్నిహోత్రునే దహింపఁగలదు. అటువంటి స్త్రీని నగ్ని యా దహించువాఁడు.నాకేల యీ పనికిమాలిన కుచ్చితపు సందేహములు గలిగె నని సీతామహాత్మ్యమును నాలోచించు చుండఁగా.

క. ఔరా! వాయుతనూజ, ప్రేరితమగు నగ్ని లంక♦నెల్ల దహించెన్
దోరణవప్రాట్టప్రా, కారసమేతం బసాధ్య♦కార్యం బిదియున్. ౧౨౮

తాత్పర్యము.

ఆశ్చర్యమాశ్చర్యము!! హనుమంతునిచేఁ బ్రేరింపఁబడిన యగ్ని తోరణ ములతోను ప్రాకారములతోను బురుజులతోను లంకనంతయు దహించెను. ఇది యసాధ్య కార్యము.

క. స్థానములు విడిచి పరువిడ, దానవమాణవక వృద్ధ◆తరుణీజనతా
నానారోదనముల లం,కానగరము గుహల నేడ్చు◆కైవడిఁ దోచెన్. ౧౨౯

అర్థములు. మాణవక = బాలురు, జనతా = జనసమూహము.

తాత్పర్యము.

తమతమ యిండ్లు వదలి పరువెత్తి పోయి రాక్షస బాలురు, వృద్ధులు, వయస్సు స్త్రీ సమూహము, గుహలయందుఁ జేరి యేడువఁగా లంకానగరము గుహలందు నేడ్చు చున్నదా యేమి యన్నట్టు లున్నది.

క. ఏమీ చిత్రము భవన, గ్రామంబులతోడ లంక◆గాలియు సకలం
బా మహికన్యక మాత్రము, సేమంబున నున్న దగ్ని◆సేరదు సీతన్. ౧౨౦

అర్థములు. భవనగ్రామంబులు–ఇండ్ల సమూహము, "గ్రామః పల్ల్యాం స్వరే బృందే త్వయం శబ్దాదిపూర్వకః." నానా. ర. గ్రామ శబ్దముసమూహవాచక మైనపుడు దీనికి ముందు శబ్దము మొదలైన దేదైన యొక శబ్ద ముండును. శబ్ద గ్రామము– స్వరగ్రామము– గుణగ్రామము– భూతగ్రామము మొదలైనవి.

తాత్పర్యము.

ఏమి యీ యాశ్చర్యము! లంక ఇండ్లసమూహములతో నంతయుఁ గాలియు సీతాదేవి మాత్రము క్షేమముగా నున్నది. ఆమెను నగ్ని సమీపింపను గూడ లేదు.

క. అని ఋషులు చారణాదులు, వినువీదిని బల్కుచుండ◆వీనుల నమృతం
బును గురిసిన యట్లా నుడు,లను విని యా హనుమ పొంగి◆లాఁతుగఁ దనలోన్.

అర్థములు. వినువీదిని = ఆకాశమున, వినునట్టి వీథి. ఆకాశము శబ్దగుణకము,– నుడులను=మాటలను– లాఁతుగన్=అధికముగ.

తాత్పర్యము.

ఆకాశమున ఋషులు, చారణులు మొదలగువారు చెవులలో నమృతము పోసినట్లు చెప్పుచుండఁగా నా మాటలు విని హనుమంతుఁడు మిక్కిలి యుప్పొంగి తనలో.

చ. కలిగిన సన్నిమిత్తములఁ◆గన్నులఁ జూచిన భూరికారణం
బుల, ఋషి వాక్యజాలముల◆భూమిజ సేమ మెఱింగి, యాత్మలో
నలరుచుఁ గన్నులారఁగ మ◆హాసతిఁ జూచి, సుఖం బెఱింగి, యా
వలఁ, బయనింపఁగాఁ దలఁచె◆వాయుసుతుండు కృతార్థుఁ డంతటన్. ౧౨౨

అర్థములు. సన్నిమిత్తములన్ =శుభశకునములను, కుడికన్నదరుట లోనైనవి, అలరుచున్=సంతోషించుచు.

తాత్పర్యము.

శుభశకునములు కలుగుటచేతను, సీతాదేవి మహాత్మ్యము కన్నులారఁ

జూచి యుండుటచేతను, ఋషులమాటల చేతను, సీత క్షేమముగా నున్నదని తెలిసికొని సంతోషించుచు నయినను నా మహాపతివ్రతను కన్నార దర్శించి ప్రత్యక్షముగ క్షేమముగ నుండుట చూచి తెలిసికొని పిమ్మటఁ బ్రయాణము చేయవలయు నని వచ్చిన పని నిర్విఘ్నముగ సాంతముగ నెఱవేర్చిన హనుమంతుఁడు తలఁచెను. ఇట్లు తలఁచి.

—♦ ౫౬-వ సర్గము. హనుమంతుఁడు మఱల సీతాదేవిని సందర్శించుట. ♦—

ఉ. ఆ లలితాంగి యున్న యెడ♦నా పవనాత్మజుఁ డేగి శింశుపా
మూలగతావనీజఁ గని ♦ మ్రొక్కెడి తల్లి! మదీయభూరి పు
ణ్యాళివశంబునం గుశలి♦తాప్తి రహించెడి నిన్నుఁ గంటి, నా
యేలినవాని కార్యతతు ♦ లెల్లను దీరె యథోచితంబుగన్. ౧,౨౭౩

అర్థములు. శింశుపామూలగతావనీజన్=శింశుపావృక్షము మొదటనుండు సీతాదేవిని, మదీయ=నాయొక్క, భూరి=గొప్పదగు, పుణ్యాళి=పుణ్యపరంపరల, వశంబునన్=కారణముచేత, కుశలతాప్తిన్=క్షేమముగా నుండు, ఏలినవాని=ప్రభువుయొక్క, యథోచితంబుగన్=తగిన రీతిని.

తాత్పర్యము.

ఆ కోమలదేహ యున్న ప్రదేశమునకుఁ బోయి శింశుపావృక్షము క్రిందఁ గూర్చుండిన సీతను దర్శించి నమస్కరించి తల్లీ! నేను జేసిన గొప్పపుణ్యముల పరంపరల కారణముచే క్షేమముగా నుండు నిన్ను మఱల దర్శించు భాగ్యము కలిగెను. నా ప్రభుకార్య మేదేది యెట్లెట్లు చేయవలయునో యట్టట్టు లన్నియుఁ జేసితిని.

దీనివలన 'నీచాశ్రయం న కర్తవ్యమ్। కర్తవ్య మ్మహదాశ్రయమ్' నీచుల నాశ్రయింపరాదు. గొప్పవారినే యాశ్రయింపవలయు నన్నట్లు సీతాదేవి నాశ్రయించిన కారణమున శింశుపావృక్షము అశోకవృక్షము లేగాక వాని చుట్టునుండునవి కూడ విఱిగి పడక కాలిపోక నిలిచినవి. దీనివలన సీతారాముల నాశ్రయించిన వారే గాక వారి నాశ్రయించినవారు కూడఁ జెడరని యేర్పడుచున్నది. విభీషణుఁడే కాక విభీషణు వెంటవచ్చినవారుకూడ రక్షింపఁబడిరిగదా-'పశుర్మనుష్యః పక్షీవా యేచ వైష్ణవ సంశ్రయాః, తేనైవ తే ప్రయాస్యంతి తద్విష్ణోః పరమంపదమ్॥ విష్ణుభక్తుల నాశ్రయించిన పశువులు మనుష్యులు పక్షులుకూడ వాని వెంట విష్ణుని పరమ పదమునకుఁ బోదురు అను శ్లోక మనుసంధింపనగు.

క. అనుచుఁ బ్రయాణోన్ముఖుఁడై, హనుమన్తు మఱిమఱియుఁ గాంచి♦యవనిజ యని యెన్
బెనిమిటిపైఁ గలప్రీతిన్, మునుకొని సూచించువాక్య♦ముల నిట్లనుచున్. ౧,౨౭౪

అర్థములు. ప్రయాణోన్ముఖుఁడు=బయలు దేఱిపోవఁ బ్రయత్నించువాఁడు;

తా త్ప ర్య ము.

ఈ ప్రకారము చెప్పి బయలుదేఱి పోవఁ బ్రయత్నముచేయు హనుమంతునితో తన భర్తపైఁ దన కుండు ప్రేమ తెలుపు వాక్యములను నిట్లని చెప్పెను.

క. నీవొకఁడవె యీ కార్యము, పావని! సాధింప శక్తి♦పరుడవు సుమ్మీ
వావిరి బలోదయముచే, నీవే కనియెదవు కీర్తి ♦ నిర్దళితారీ! ౧౨౭౫

అర్థములు. నిర్దళితారీ = చీల్చఁబడిన శత్రువులు గలవాఁడా.

తా త్ప ర్య ము.

ఆంజనేయా! నీవొకఁడవే యీ కార్యమును నీ బలాధిక్యముచే శత్రువుల వధించి సాధింప శక్తిగలవాఁడవు సుమా. నాకంటె గొప్పవారు సుగ్రీవునొద్ద నున్నారని నీ భారము నీవు తప్పించుకొన యత్నింపకుము. ఎంద ఉన్నను ఈ కార్యసాధన భారము నీయందే యున్నది. మఱి యెవ్వరీ కార్యమును సాధింపలేరు.

క. ప్రాకట శితనారాచా,నీకంబునఁ జలిపి లంక ♦ నీఱుగఁ గడిమిన్
గైకొని నన్నేగినచోఁ, గాకుత్స్థున కదియె తగిన♦కార్యము సుమ్మీ. ౧౨౭౬

తా త్ప ర్య ము. ౯౭౯ వ పద్యము చూచునది.

తే. పరమశూరుండు రాముండు ♦ బవరమందు
నతని మగఁటిమి కనురూప ♦ మైన దాని
యోజన యొనర్చి చెప్పుమీ ♦ యోజ మీఱ
వనచరకులావతంస నీ♦వనుచుఁ బలుక. ౧౨౭౭

తా త్ప ర్య ము. ౯౮౦ వ పద్యము చూచునది.

క. వినయము హేతుయుతంబును, ననఘార్థోపహితమైన♦యా దేవినుడుల్
విని యంజనవరతనయుం, డనియెన్ సముచితపుభంగి ♦ నవనీసుతకున్. ౧౨౭౮

అర్థములు. అనఘార్థోపహితము = దోషరహిత మైన ప్రయోజనముతోఁ గూడినది.

తా త్ప ర్య ము.

అణకువతోను సకారణముగను దోషరహితమైన యర్థముతోఁ గూడినదిగను నుండు నామె మాటలను విని యాంజనేయుఁడు తగిన రీతి నిట్లనియెను.

చ. అడలకు మమ్మ వానర బ♦లాన్వితుఁడై వెస రామభద్రుఁడీ
కడలిఁ దరించి రాక్షసుల♦గర్వ మడంచి త్వదీయ శోకమున్
గెడపును, నమ్ము నా పలుకుఁ♦ గీడ్పడఁ బోకుము, రాముఁజూడ న
య్యెడ కిదె యేఁగువాఁడ, సెల♦వీయఁగదే జననీత్రి ప్రమొక్కెదన్. ౧౨౭౯

తా త్ప ర్య ము.

తల్లి! నీవు వ్యసనపడకుము. రామచంద్రమూర్తి వానరసేనలతోడ సముదము దాఁటివచ్చి రాక్షసుల పొగరణఁచి నీ శోకమును నిర్మూలము సేయును.

నా మాట నమ్ముము. నీవు సాహసము చేసి యపాయము కలుగు కార్యము చేసికొనకుము. అనఁగా మరణింపకుము. ఇదిగో నిప్పుడే రామచంద్రమూర్తినిఁ జూడఁ బోవుచున్నాఁడను. అమ్మా! నా కనుజ్ఞ నిమ్ము, నమస్కరించెదను.

—♦ సీతాదేవిచే సెలవుగొని మరలి హనుమంతుఁ డరిష్టాద్రి నెక్కుట ♦—

మ. అని సాష్టాంగనమస్కృతుల్ సలిపి కీ♦శాధీశుఁడుర్ స్వామి ద
 ర్శనకౌతూహలి యై లతాబహుళభూ♦జవ్రాత మై కేసరి
 స్వనగంభీరగుహాసమూహ మయి య♦క్షవ్యూహగంధర్వస
 న్మునిసర్పాదినిషేవితం బగుచు స్వా♦దుస్ఫీతమూలాఢ్య మై. ౧౨౮౦

అర్థములు. సాష్టాంగ నమస్కృతుల్ = సాష్టాంగనమస్కారము. తొలుత సీతాదేవినిజూచినపుడుప్రాకృతస్త్రీయనితలఁచి హనుమంతుఁడుసీతాదేవికి నమస్కరించినవాఁడు కాఁడు. సంభాషణానంతరము ౧౦౦౧ వ పద్యమున పతివ్రత యనియు, నూరకశిరస్సుతో నమస్కరించెను. ఇప్పుడు తల్లి యను భావముతో సాష్టాంగముగ నమస్కరించెను. యోగ్యత తెలియుకొలఁది భక్తియు హెచ్చెను. ఇప్పుడు కేవలము మాతృభావమె కాని వేఱుభావము లేదు. దీనివలన నుత్తమ పతివ్రతలకు పతిదేవతలకు మాతృభావముతో నెట్టివారైన, నెంతటివారైన సాష్టాంగ నమస్కారము చేయవలయు నని యేర్పడుచున్నది. స్వామి దర్శన కౌతూహలి = రామచంద్రమూర్తిని దర్శించుట యందుఁ గోరిక గలవాఁడై - లతా బహుళ భూజవ్రాతమై = అనేక వృక్షములు తీఁగలు గలదై - కేసరిస్వన = సింహముల ధ్వనులు గల - గంభీర గుహా సమూహ మయి = లోఁతైన గుహల సమూహములు గలది - స్వాదు స్ఫీత మూలాఢ్యమై = మిక్కిలి తియ్యనైన వేళ్ళు మొదలయినవి కలదై.

తాత్పర్యము.

ఇట్లు చెప్పి యభివాదనము చేసి యామెచే నాశీర్వదింపఁబడి వానరశ్రేష్ఠుఁడు రాముని దర్శింపఁ గోరిక కలవాఁడై విశేషముగఁ దీఁగలు చెట్లు గలిగి సింహముల ధ్వనులతోఁ గూడిన పొడుగాటి గుహలు గలదై యక్షసంఘములు, గంధర్వులు, మునులు, పాములు గలదై తియ్యని కందమూలములు గలదై.

సీ. తుంగపద్మకజుష్ట♦రంగనీలోద్యాన,మాలికాహృద్యమై ♦ క్రాలుదాని
 శృంగాంతరవిలంబి♦రంగత్పయోదోత్త,రీయమై కనువిందు ♦ సేయుదాని
 మార్తాండకరబోధ్య♦మానోన్మిషద్ధాతు, నేత్రసంజాత మై ♦ నెగడుదాని
 నిర్ఝరచయమంద్ర♦నిస్స్వనాధ్యయన ఘో,షాకలితం బయి ♦ యమరుదాని
తే. ప్రస్రవణరావవిస్పష్ట♦రమ్యగీత, మైనదానిని దేవదా♦ర్వవనిజముల
 నూర్ధ్వబాహువు నట్టుల ♦ యొప్పుదాని, నిలను బడు నీళ్ళనులివుల♦నేడ్చుదాని.

ఈ పద్యము దీని తరువాతి పద్యము హనుమంతుఁడు సముద్రమును దాఁటుటకై యెక్కిన యరిష్ట మను పర్వతముయొక్క వర్ణనము.

అర్థములు. తుంగ = ఎత్తైన - పద్మక = తామరరంగు గల ప్రాకులచేత - జుష్ట = కూడిన - రంగ = ప్రదేశములు గల, నీలోద్యాన = నల్లని వనముల - మాలికా = వరుసలచే - హృద్యమై = మనోహరమై, క్రాలుదానిఁ = ప్రకాశించుదానిని; ఇది పర్వతమునకుఁ గట్టు దోవతియై యున్నదని భావము. శృంగాంతర విలంబి = శిఖరముల నడుమ వ్రేలాడుచు - రంగత్ = ప్రకాశించు - పయోద = మేఘముల నెడి - ఉత్తరీయమై = ఉత్తరీయము కలదానిని - మార్తాండ కర = సూర్యకిరణములచే - బోధ్యమాన = మేలుకొలుపఁ బడుచున్న - ఉన్మిషత్ = తెప్పలు దెఱచి చూచుచున్న - ధాతు = ధాతువు లనెడి - నేత్రసంజాతమై = నేత్రసమూహము గలదై; నిర్ఝరచయ = సెలయేళ్ళ సమూహములయొక్క - మంద్ర = గంభీరమైన - నిస్స్వన = ధ్వని యనెడి-అధ్యయనఘోషాకలితంబు = వేదాభ్యాసముచేయు ధ్వని కలదై, ప్రస్రపణరావ = ఊటనీళ్ళు దూఁకు చప్పుడనెడి, విస్పష్ట = మిగుల స్పష్టముగాఁ దెలియవచ్చు, రమ్య = మనోహరమైన, గీతము = పాటలు గల దానిని, దేవదారు+అవనిజమూల = దేవదారు చెట్లచేత, ఊర్ధ్వ బాహువులు = చేతులెత్తినవి, ఇలను = నేలమీఁద, ఉలివుల = ధ్వనులచే.

తాత్పర్యము.

ఎత్తైన తామర వర్ణము గల ప్రదేశములు గల నల్లని యుద్యానము లనెడి దోవతియు, శిఖరముల నడుమ వ్రేలాడు మేఘము లనెడి యుత్తరీయము గలదై, సూర్యకిరణములచే మేలుకొలుపఁబడిన (విచ్చిన) ధాతువుల నెడి నేత్రములు కలదై, సెలయేళ్ళ మంద్రధ్వను లనెడి వేదాధ్యయన ధ్వనికలదై, ఊటనీళ్లు పడుటవలనఁ గలిగిన విస్పష్టమైన ధ్వని యనెడి సంగీతము కలదై, దేవదారు వృక్షము లనెడి చేతుల నెత్తినదై నేలఁబడుచున్న నీళ్ళచప్పుడు గల దానిని.

సీ. శ్యామమై పుష్పించి ♦ శరదభ్రతతులచే, వార్ధకమునఁబోలె ♦ వణఁకుచుండ
వెదురుబొంగుల గాలి ♦ వెడవెడఁ జొచ్చుచు, వెడలఁ గూజిత మన ♦ నెలయుచుండ
సర్పముల్ బుసగొట్టు ♦ సాకున హనుమపై, మల నిశ్శ్వసించిన ♦ మాడ్కి నుండ
నిండారఁగా మంచు ♦ నిండి గంభీరమై గుహలు ధ్యానించెడి ♦ వహి భజింప
తే. వారిధరపాదనిభ పాద ♦ వారములను, నడచి చనుచున్న యట్టి నా ♦ న్యాము వహింప
సాలతాలాశ్వకర్ణవం ♦ శప్రకీర్ణ, మగు నరిష్టనగంబు నా ♦ హనుమ యెక్కె. ౧౨౦౪

అర్థములు. శ్యామమై = నీలమై, శరదభ్ర తతులచే = శరత్కాలమందలి మేఘములచే, వార్ధకమునఁ బోలెను = ముసలితనము నందువలె, కూజితము = అవ్యక్తమధురధ్వని - కోకిల పంచమధ్వని - వారిధరపాద = కొండలు ప్రాకుఁటకను

కూలమైన, మేఘముల యవయవములతో-నిభ=సమానమైన- పాదవారములను=గుట్టల సమూహములచేత- ప్రకీర్ణ=విరివియైన- వహిం=విధము.

తా త్ప ర్య ము.

నలుపై- పుష్పించి శరత్కాల మేఘములచే ముసలి దానివలె వణఁకు దాని, వెదురుబొంగులలో నడుమ నడుమఁ బ్రవేశించి వెడలుటచే పంచమధ్వనివలె ధ్వనిగలదానిని, పాములు బుసకొట్టు నెపమున హనుమంతునిపై శ్వాసము విడుచుచున్నట్లుండు దానిని, పూర్ణముగా మంచు నిండి గంభీరమై గుహలు, ధ్యానించు విధముగ నుండుదానిని, మేఘములచేఁ బ్రాఁకఁబడు గుట్టలు గలదానిని, మద్ది-తాటి- ఇనుమద్ది- వెదురు వీనిచే వ్యాపించి యుండుదానిని, అరిష్టమను పేరు గల కొండను హనుమంతుఁ డెక్కెను.

సీ. చక్కఁగాఁ బూచిన ♦ పెక్కు తెఱంగుల, లతికలచే నలం♦కృతము నగుచు
వింతవింతగ బహు♦విధములౌ మృగముల, వారంబుచే నభి♦వ్యాప్తమగుచుఁ
బలుచాయ లగుధాతు♦వుల వన్నె లొప్పారు, శీతలవారి భూ♦షితము నగుచు
బండల గుండుల ♦ ప్రస్రవణంబుల, దుర్గమం బగుచును ♦ దోఁచుదాని
తే. యక్షగంధర్వ ఋషికిన్న♦రాహిసేవి,తంబు నగుదాని బెబ్బులుల్ ♦ దనరుదాని
సింగములుకందరములఁజె♦లంగుదాని,రాముఁగనుఁగొనుత్వర నెక్కె♦భీమబలుఁడు

అర్థములు. లతికలచేన్=తీఁగలచే- అలంకృతము=అలంకరింపఁ బడినది- అభివ్యాప్తము=మిక్కిలి వ్యాపింపఁబడినది- శీతలవారి=చల్లనినీటిచే-ప్రస్రవణంబులన్=ఊట కాల్వలచే- దుర్గమంబు=పోరానిది. కందరములన్=గుహలచే.

తా త్ప ర్య ము స్పష్టము.

క. నిజపాదఘట్టనంబుల, రజమై శిల లఱుగ నెక్కి ♦ రాజీవాళీ
భుజగభయదాబ్ధిఁ గని వా,తజుఁడనిలునిభంగి దాని ♦ దాఁటఁ గడంగెన్. ౧౨౨౪

అర్థములు. నిజపాదఘట్టనంబులన్=తన కాళ్ళ త్రొక్కుడులచే- రజమై=పొడియై - అఱుగన్ = క్షయింపఁగా - రాజీవాళీ= గుంపు వెంటవేసికొని తిరుగు కొలువాసము లను చేపల పంక్తులచే - రాజీవ మజ్జే రాజీవో మృగే మత్స్యే-నానా. ర॥ భుజగ=పాములచే, భయద=భయంకరమైన- అబ్ధిన్=సముద్రమును-వాతజుఁడు = వాయుపుత్రుఁడు - అనిలుని భంగిన్ = గాలివలె - కడంగెన్ = ప్రయత్నించెను.

తా త్ప ర్య ము.

తన కాలి త్రొక్కుడులచేత ఱాలు పొడి పొడి యగుచుండఁగా నెక్కి కొలస మీనులు పాములు గలిగి భయము కలిగించు సముద్రమును హనుమంతుఁడు దాఁటఁ బ్రయత్నించెను.

ఉ. ఉత్తరపార మేగుతమి♦నొత్తఁ బదంబుల శైలరాజమున్
దత్తఱ మందె సత్త్వములు♦ధారిణి డొల్లె వరప్రసూనసం
పత్తులతో ద్రుమోత్కరము♦పర్వత కందర సంస్థసింహముల్
బిత్తరపాటుతో దెసలు♦పెల్లగిలన్ ధ్వను లిచ్చె హెచ్చుగన్. ౧౨౫౫

అర్థములు. ఉత్తరపారము=ఉత్తరపు గట్టు, వనప్రసూన సంపత్తులతోన్= అధికములైన యడవిపూలతో, ద్రుమోత్కరము = చెట్ల సమూహము, పర్వత కందర=కొండగుహలయందు, సంస్థ=ఉన్న సింహములు, బిత్తరపాటు=భయము.

తాత్పర్యము.

సముద్రముయొక్క యుత్తరపుగట్టు చేరు కోరికతో నాపర్వతశ్రేష్ఠమును కాళ్ళచే సదుమఁగా నడవి మృగములు తత్తఱలాడెను. పూల సమూహములతో చెట్లు నేలఁబడెను. కొండ గుహలందున్న సింహములు బెదరి దిక్కులు పెల్ల గిల్లునట్లు విశేషించి ధ్వనించెను.

క. కుసుమితతరుచయములు సర, భసముగఁ జను నతని తొడల♦పటు వేగమునన్
బస చెడి వజ్రము తాఁకున, వసుమతిఁ గూలినవిధానఁ♦బడె భగ్నములై.

అర్థములు. కుసుమితతరు చయములు = పూచిన చెట్ల సమూహములు, సరభసముగన్ =శీఘ్రముగ, భగ్నములై =విఱిగినవై.

తాత్పర్యము.

వేగముగఁ బోవు నతని తొడలు తాఁకి పూచిన పూలచెట్లు బిగువు చెడి పిడుగుపడిన విధమున విఱిగి నేలఁ బడెను.

క. గాడుపుపట్టి జవోద్ధతి, బీడిత మై గిరిమృగేంద్ర♦బృందంబు గుహా
క్రోడంబులలోఁ దబ్బి, బ్బాడెను. గగనంబు పగులు♦నారవ మెసగన్. ౧౨౫౭

అర్థములు. జవోద్ధతిన్ = వేగాధిక్యముచే, పీడితమై = బాధింపఁబడినదై, గిరిమృగేంద్ర బృందంబు=కొండ సింహముల సమూహము, గుహాక్రోడంబులలో= గుహలందలి సందులలో, తబ్బిబ్బాడెను=తత్తఱపడెను.

తాత్పర్యము.

హనుమంతుని వేగాతిశయముచే బాధింపఁబడి కొండసింహములు గుహలలో దూఱి యందలి సందులలోఁ దబ్బిబ్బై దిక్కులు పగులునట్లు ధ్వనించెను.

క. తూలఁగఁ జీరలు పైఁటలు, వ్రేలఁగ మెయిభూషణములు ♦ వీడ్వడఁ గలఁగన్
శైలంబున విద్యాధర, బాలామణు లెగసి చనిరి ♦ పటుజవయుక్తిన్. ౧౨౫౮

తాత్పర్యము.

చీరలు జాఱిపోవుచుండఁగా పైఁటలు వ్రేలాడు చుండఁగా, ఆభరణము లొకదానిలో నొకటి పెనసికొని మార్పడు చుండఁగా కలఁతచెంది యా కొండ యందలి విద్యాధర స్త్రీలు మిగుల వేగముగ నెగసి పోయిరి.

సీ. అధికప్రమాణమ♦హావిషదీప్తజిహ్వాలు దూఱెఁ బాములు ♦ తలలు నులియఁ
గిన్నరోరగయక్ష♦కింపురుషాదులు, గగనస్థులైరి త♦న్నగము విడిచి
సనగకూటోదగ్ర♦శైలంబు దిగఁబడి, యారసాతల మేగె ♦ నద్భుతముగఁ
బదియోజనంబుల♦పఱపును ముప్పది, యోజనంబులయెత్తు ♦ నొప్పుచున్న
తే. యా ధరాధర మొకత్రుటి♦యంతలోన, నేలమట్టంబుగాఁ బోయె ♦ నీరనిధిఁ ద
రింప నుద్యుక్తుఁడగుచుహ♦రిప్రవీరుఁ, డిట్లు మింటికిఁగుప్పించి♦ యెగయుటయును.

అర్థములు. అధికప్రమాణ = మిక్కిలి గొప్పవగు = మహావిషదీప్తజిహ్వాలు = గొప్ప విషముచే జ్వలించు కోఱలు గలవి, నులియన్ = నలిగిపోఁగా; సనగకూటోదగ్రశైలంబు = చెట్లతో శిఖరములతోఁ గూడి పొడవైన పర్వతము, ఆరసాతలము = పాతాళము వఱకు, అవ్యయీభావ సమాసము. 'విభాషా అపపరిబహిరంచవః పంచమ్యాః' పాణి. II. I.–11–12 నేలమట్టంబుగాన్ = నేలతో సమముగా, ఉద్యుక్తుఁడు = ప్రయత్నించినవాఁడు.

తాత్పర్యము.

హనుమంతుఁడు సముద్రము దాఁటుటకై యాకాశమునకుఁ గుప్పించి యెగురఁగా మిగుల పెద్దవై చెడ్డ విషముచే జ్వలించు కోఱలుగల పాములు తలలు నలుగునట్లు రాల సందుల దూఱెను. కిన్నరులు పన్నగులు యక్షులు కింపురుషులు లోనగువారు ఆ పర్వతము విడిచి యాకాశమున కెగిరిరి. చెట్లతో శిఖరంబులతో ఎత్తైన పర్వతము పాతాళము వఱకు దిగఁబడెను. పదియోజనముల వెడల్పు, ముప్పది యోజనముల యెత్తుగల యా పర్వతము నిమిషములో నేలతో సమ మయ్యెను.

——♦ ౫౭-వ సర్గము. హనుమంతుఁడు మఱల సముద్రము లంఘించుట ♦——

సీ. అర్క–కారండవం ♦ బబ్జకువలయంబుఁ, దిష్యశ్రవణహంస♦దీపితంబు
జలధరశైవాల♦శాద్వలంబును బున,ర్వసుమహామీనవి♦రాజితంబు
నంగారకమహాగ్ర♦హంబు నైరావత,ద్వీపంబు స్వాతిహం♦సాపచితము
వాతసంఘాతసం♦జాతోర్మిచంద్రాంశు,శిశిరాంబుమంతంబు ♦ సిద్ధయక్ష
తే. భుజగగంధర్వఫుల్లనీ♦రజము నైన, యంతరిక్షార్ణవమున మ♦హాంబురాశి
నావ దరియించుచందాన ♦ నవ్యలీల,నంజనానందనుం డేగె ♦ నశ్రమముగ.

అర్థములు ఆకాశమున హనుమంతుఁడు పోవుటకు సముద్రమునందుఁ బోవు నావతోఁ బోల్చి చెప్పుచున్నాఁడు. అర్క–కారండవము = సూర్యుఁడనెడు నీటికోడి కలది– అబ్జకువలయంబు = చంద్రుఁడనెడి తెల్లకలువకలది– తిష్య = పుష్య నక్షత్రము– శ్రవణ = శ్రవణము అనెడి; హంస దీపితంబు = హంసలచేఁ బ్రకాశించునది– జలధర = మేఘమనెడి– శైవాల = నాఁచు తీఁగ గలదియు– శైవాలము = పచ్చిక ప్రదేశముకలదియు–పునర్వసు = పునర్వసునక్షత్రములనెడి, మహామీన పెద్దచేఁపలచే

విరాజితంబు = ప్రకాశించునది - అంగారక = అంగారకుఁడను మహాగ్రహంబులు పెద్ద మొసలి గలిదియు, గ్రహమే గ్రాహము-ఐరావత = ఐరావతము. అభ్రగజము కావున నది యాకాశముననే దిరుగుచుండును. కావుననైరావతమనెడు, ద్వీపంబు = దీవి గలది-స్వాతి హంసాపచితము = స్వాతియనెడి హంసచేఁ బూజితము - వాత సంఘాత = వాయుసమూహముచే - సంజాత = పుట్టిన అల లనెడి, చంద్రాంశు = చల్లని కిరణములచే - శిశిర = చల్లనైన - అంబుమంతంబు = నీళ్లు గల మేఘము- ఫుల్లనీరజము = వికసించిన కమలము - అంతరిక్షార్ణవమునన్ = ఆకాశ మనెడి సముద్రమందు - అశ్రమముగన్ = గాసిలేక.

తాత్పర్యము.

సూర్యుఁడనెడి నీరుకోడి, చంద్రుఁడనెడి తెల్లకలువ, పుష్యాశ్రవణ నక్షత్రములనెడి హంసలు మేఘములనెడి పాఁచి- పచ్చిక - పునర్వసు వనెడిమహామీనము, అంగారకుఁడను మొసలి, ఐరావతమనెడి దీవి, స్వాతియనెడి హంసము, గాలివలనఁ గలిగిన యలలనెడి మేఘము, సిద్ధులు యక్షులు సర్పములు గంధర్వులు ననెడివికసించిన కమలములు నయి యాకాశ మనెడి సముద్రమున, సముద్రమును నావదాఁటునట్లు హనుమంతుఁడు ఆకాశమునఁ బోవుచుండెను. సావయవ రూపకాలంకారము. రూపకోపమానములకు తిలతండుల న్యాయ సంసృష్టము.

తే. ఆకసంబును మ్రింగునో యబ్జవైరిఁ, బట్టి గీరునో సహతార♦భాస్కరంబు
గగనముహరించునోయనఁ♦గపివరుండు, చనియెమబ్బులఁజీల్చెడి♦చందముగను.

అర్థములు. అబ్జవైరిన్ = చంద్రుని, సహతార భాస్కరంబు = నక్షత్రసూర్యులతోఁ గూడిన, గగనమున్ = ఆకాశమును.

తాత్పర్యము.

స్పష్టము.

తే. తెలుపునెఱుపునుబసుపును♦నలుపునగుచుఁ, గృష్ణలోహితవర్ణంబు♦నెసఁగుచుండ
నతులతేజస్వియగు మరు♦దాత్మజాతు దేహసంపర్కమున మొగుల్♦తేజరిల్లె.

అర్థములు. కృష్ణలోహితవర్ణంబు = నలుపు ఎరుపు గలసిన వన్నె.

తాత్పర్యము.

మిగులఁ దేజోవంతుఁడైన హనుమంతుని దేహమును దాఁకుటచే, మేఘములుకొన్ని తెలుపుగను కొన్ని ఎరుపుగను పసుపుగను నలుపుగను ఎరుపునలుపు గలసినవిగను నానావిధముల నొప్పుచుండెను.

క. మఱిమఱి లోనం జొచ్చుచు, మఱిమఱి వెలుపలనుదోఁచి♦మబ్బులనడుమన్
మఱుఁగుచు మెఱయుచు నొప్పెడి, కఱకంఠుని శిరసుపూవు♦గతిఁ గపియొప్పెన్.

అర్థములు. మఱుఁగుచున్ = చాటగుచున్, మెఱయుచున్ = వెలుపలఁ బ్రకాశించుచు. కఱకంఠుని = శివునియొక్క, శిరసుపూవు = తలయందలి పుష్పము

అనఁగాఁ జంద్రుఁడు, కళంకుఁడు = కళ్ళఅనఁగా నలుపు, అది కంఠమునందుఁ గలవాఁడని మిశ్రబహువ్రీహి యని కొందఱ యభిప్రాయము. గరకంఠశబ్దభవ మని కొందఱ యభిప్రాయము.

తాత్పర్యము.

ఒక్కొక్కసారి మేఘముల నడుమఁ బ్రవేశించి కానరాక యొక్కొక్కసారి బయల మెఱసి కానవచ్చుచు మబ్బులనడిమి చంద్రునివలె హనుమంతుఁడొప్పెను.

తే. విశదవస్త్రంబు ధరియించి♦వివిధమేఘ, కాండవృతుఁడయి కనఁబడి♦కానఁబడక
యంబరంబునఁ జనియెడి ♦ యాంజనేయుఁ డంబుజారివిధంబున ♦ డంబు మీఱె.

అర్థములు. విశదవస్త్రంబు = తెల్లని వస్త్రంబు, దీనిచే నిందఱ రాక్షసులతోఁ బోరి వారిని చంపినను కట్టువస్త్రముపై నెత్తురుచుక్కలు పడలేదనిసూచన, మేఘకాండవృతుఁడయి = మేఘసమూహములతోఁ జుట్టఁబడి, అంబుజారి = చంద్రుఁడు.

తాత్పర్యము.

తెల్లని వస్త్రము ధరించి నానావిధములైన మేఘసమూహములతోఁ జుట్టఁబడి కానవచ్చి కొంతసేపు కానరాక కొంతసేపు ఆకాశమునఁ బోవుహనుమంతుఁడు చంద్రునివలె నుండెను.

తే. వారిధరనికురుంబంబు ♦ దారితముగ, మాటి మాటికిఁ జలుపుచు♦మారుతాత్మ
భవుఁడుబయలనుమెఱయుచు♦వైనతేయుమాడ్కిఁదనరారెనాకాశ♦మార్గమునను.

అర్థములు. వారి ధర నికురుంబంబు = మేఘసమూహము-దారితముగన్ = చీల్పఁబడినదిగా-వైనతేయు మాడ్కిన్ = గరుత్మంతునివలె - వినతా+ఏయ - వైనతేయ - అపత్యార్థక తద్ధితము.

తాత్పర్యము.

మేఘసమూహము నడుమఁదూఱి చీల్చుచు నాంజనేయుఁడు బయల మెరసి గరుత్మంతుని వలె నాకాశమున నొప్పుచుండెను.

సీ. జలదనిర్ఘోషుండు ♦ చటుల మహారావ, మున దెస లెల్లను ♦ బూర్ణములుగ
రాక్షసప్రవరుల ♦ రణమున వధియించి, తనపేరు నెల్లరు ♦ వినఁగఁ జేసి
పట్టనం బంతయు ♦ వ్యాకులపడఁ జల్పి, పంక్తికంఠుఁడు వ్యథ♦పడ నొనర్చి
ఘోరబలం బెల్లఁ ♦ గూఁపెట్టఁగాఁ గొట్టి, వైదేహికిని, గడు♦భక్తిమ్రొక్కి-
ఆ. మహితతేజుఁ డైన♦మారుతపుత్రుండు, మఱిలివచ్చి జలధి♦మధ్యమునను
జనుచునుండి శైల♦సత్తము మైనాకు, హస్తమున స్పృశించి ♦ యతని దాఁటె.

అర్థములు. జలదనిర్ఘోషుండు = ఉఱుమువంటి కంఠధ్వని గలవాఁడు - చటుల మహారావమున = భయంకరమైన గొప్ప ధ్వనితో-కూపెట్టగాన్ = కుయ్యో కుయ్యో యనునట్లు.

తాత్పర్యము. స్పష్టము

హనుమంతుఁడు లంకయందుఁ జేసినకృత్యమిందు సంగ్రహింపఁబడినది. ఇందు మైనాకు స్పృశించె ననుటచేతను శ్రీరామచంద్రమూర్తి సీతాదేవితో మరలి వచ్చునపుడు మైనాకుని జూడుమని చెప్పుటచేతను మైనాకుఁడు మఱల నీళ్ళలో మునుఁగలేదనియుఁ బైన కానవచ్చుచుండెననియు గ్రహింపనగు.

తే. జ్యాలతాముక్తనారాచ♦మనఁగ నరిగి, వారిదాభమహేంద్రంబు♦వలను చూచి
దశదిశలు నిండ సింహనా♦దంబు సేసె, మేఘనాదంబుఁబోలె న♦మేయశక్తి.

అర్థములు. జ్యాలతాముక్తనారాచమనఁగన్ = తీఁగెవంటి యల్లెత్రాటి నుండి విడువఁ బడిన బాణమో యనునట్లు - వారిదాభమహేంద్రంబు = మేఘముతో సమానమైన మహేంద్ర పర్వతము.

తాత్పర్యము.

పరిమితి చెప్పరాని శక్తిగల హనుమంతుఁడు వింటినారినుండి విడువఁబడిన బాణమువలెఁ బోయి మేఘమువలె నుండు మహేంద్రపర్వతముఁ జూచి పది దిక్కులు నిండునట్లురుమువలె సింహనాదము చేసెను.

క. హితదర్శనలాలసుఁడై, వితతంబుగ నార్చి తోఁక♦విద్రుపఁగఁ గపి య
ద్భుతఘోషమునదివాకర, యుతగగనము బ్రద్దలైన♦యొప్పుంగనియెన్. ౧౨౯౮

అర్థములు. హిత దర్శన లాలసుఁడై = మిత్రులను జూడవలయు నను కోరిక గలవాఁడై - వితతంబుగన్ = ధ్వని విస్తరించునట్లు - ఆర్చి = ఆడించి - విద్రుపఁగన్ = విదలింపఁగా- దివాకరయుత = సూర్యునితోఁ గూడిన- దీనివలన నిదంతయు పగటిచర్య యని సూచన.

తాత్పర్యము.

మిత్రులఁజూడఁ గోరిక కలవాఁడై తోఁక జాడించి విదళింపఁగా నా యద్భుత ధ్వనికి సూర్యునితోడి యాకాశము బ్రద్దలైనట్లయ్యెను.

—♦ హనుమంతుని సింహనాదము కపులు విని హర్షించుట ♦—

ఉ. ఆయులి వూరువేగమును♦నావలితీరమునందు దీనులై
వాయుతనూజుఁ జూచు తమి♦వర్తిలు శ్రోతులు విన్చు హృష్టులై
రాయెడ ఋక్షరా జలరి♦యందఱఁ జేరఁగఁ జీరి యిట్లనున్
జే యని వచ్చె వాయుజుఁడు♦సిద్ధము కార్యము పండు చూడుఁడీ. ౧౨౯౯

అర్థములు. హనుమంతుఁడు కానవచ్చుటకు ముందే యాయన సింహనాదము వానరులకు వినవచ్చెను. ఉలివు = కంఠనాదము, ఊరువేగమును = తొడల వేగమునఁ బుట్టిన ధ్వని, దీనులై = యేమో యేమో యను వ్యసనముచే ముఖములు వ్రేలవైచికొనినవారై. ఋక్షరాజు = జాంబవంతుఁడు, అలరి = సంతోషించి, చీరి = పిలిచి, జే = జయశబ్దభవము.

తాత్పర్యము.

హనుమంతుని సింహనాదము, తొడల సందున దూఱి వెడలుగాలి ధ్వనిని, ఆవలియొడ్డున వ్యసనపడుచు నెప్పుడెప్పుడు హనుమంతుని జూతుమా యను కోరిక గల శ్రోతలు విని సంతోషించినవారైరి. అప్పుడు జాంబవంతుఁడు వారి నందఱఁ బిలిచి యిట్లనెను. వానరులారా! హనుమంతుఁడు జే యని వచ్చుచున్నవాఁడు. పోయిన కార్యము ఫలించినది చుఁడీ.

ఉ. సందియ మేమి లేదు ధ్వని♦చందము తెల్పెడిఁ గార్యసాధనం
బెందు నసాధితార్థులకు ♦ నీ రవ మేటికిఁ గల్గు? నన్న న
య్యందఱు మిత్రదర్శనము♦నాశ సముత్సుకు లౌచు నంజనా
నందనురావముఁ విను చ♦నంత ముదంబున గంతు లాడుచుఁ. ౧౩౦౦

అర్థములు. అసాధితార్థులకు = కార్యము సాధింపనివారికి, రవము=ధ్వని.

దీనివలన శుభవార్త తాను బోకముందె తన మిత్రులకుఁ దెలిపి వారికుందు మాన్పి సంతోషపెట్టవలయు నని సూచన - మనము పోయి చెప్పవచ్చులే యని యుండ రాదు. అంతవఱకు నిష్కారణముగా వారు వ్యసనపడునట్లు చేయుటమిత్ర ధర్మము గాదు.

తాత్పర్యము.

సందేహము లేదు. హనుమంతుఁడు కార్యము సాధించెను. అదినీకెట్లు తెలిసె నందురా? ఆయన ధ్వనియె కార్యము సాధించెనని తెలుపుచున్నది. కార్యము సాధింపని వాఁడింత యుత్సాహముగ సింహనాదము చేయఁడు. అని చెప్పఁగా తక్కిన శ్రోతలుహనుమంతుఁడువచ్చుచున్నాఁడనిసంతోషించెను.జాంబవంతుడుకార్యము సఫలము చేసికొని వచ్చుచున్నాఁడని సకారణముగఁ జెప్పెను. ఇట్లు చెప్పఁగా వారందరు మిత్రుని దర్శించు నాశచేనాయన ధ్వని వినుచు గంతులు పెట్టుచుండిరి.

తే. ఒక్కశిఖరంబు నుండి యొం♦డొక్క శిఖర
మునకు నొక కొమ్మనుండి స♦ మున్నతంపుఁ
జెట్టుకొనకొమ్మ కెగురుచు ♦ నిట్టలంపుఁ
సమ్మదంబునఁ గ్రాలుచు ♦ సందడించి. ౧౩౦౧

అర్థములు. సమున్నతంపు = మిగుల నెత్తైన - నిట్టలంపు = అధికమైన, నిట్టలము రూ-ఇట్టలము.

తాత్పర్యము.

వచ్చుచున్న హనుమంతుని దూరము నందుండఁగనే చూచుకోరికతో నొక శిఖరమునుండి యంతకంటె నెత్తైన శిఖరమునకు, నందలి యొక చెట్టుకంటె నెత్తైన యింకొక చెట్టునకు, అందొక కొమ్మకంటె నెత్తైన యింకొక కొమ్మకు వానరులు మిగుల సంతోషముతో నెగురుచు కిలకిలార్భటుల సందటి చేయుచు.

క. పట్టుగ దూరపు జనులకుఁ; బుట్టముఁ జూపించురీతిఁ♦బుష్పితతరులన్
గొట్టకొనకొమ్మలన్ వెస, బిట్టుగ నాడించి యూఁచి♦పేర్చిరి క్రోఁతుల్ ౧౩౦౨

అర్థములు. పుష్పిత తరులన్ = పూచిన చెట్ల యందలి.

తా త్ప ర్య ము.

తా మున్న స్థానము తెలుపుటకై దూరమున నుండు వారికి గుడ్డలను చేతులతో నాడించి విసరి చూపునట్లు వానరులు పూచిన కొమ్మల నాడించిరి. ఊఁగులాడించిరి.

క. గిరిగుహల దాఁగి మొరయుచు, నురువడి వెలివచ్చుగాలి♦యొప్పున గర్జల్
పరఁగించుచుఁ జనుదెంచెను, సరభసముగ మారుతాత్మ♦సంభవుఁ డంతన్ ౧౩౦౩

అర్థములు. మొరయుచున్ = ధ్వనించుచు, ఉరువడి = మిగుల వేగముతో, వెలివచ్చు = బయటికి వచ్చు-సరభసమున్ = వేగముగ.

తా త్ప ర్య ము.

కొండగుహలయందు దాఁగియుండి మిగుల వేగముతో ధ్వనించుచు వెలుపలికి వచ్చుగాలి విధమున సింహనాదములు చేయుచు వేగముగ నాంజనేయుఁడువచ్చెను.

క. జలధరమార్గంబున న,బ్బలియుఁడు జలదోత్కరంబు♦పగిదిన్ రాఁగన్
వలిముఖు లందఱు ఘటితాం,జలులై నిలిచిరి నభంబు♦చాయం గనుచున్.

అర్థములు. జలధర మార్గంబునన్ = మేఘమార్గమున ఆకాశమందు - జలదోత్కరంబు = మేఘ సమూహమువలె, వలిముఖులు = వానరులు - ఘటితాంజలులై చేతులు జోడించినవారై - నభంబు = ఆకాశము.

తా త్ప ర్య ము.

ఆకాశమార్గమున మేఘమువలె బలవంతుఁ డగు హనుమంతుఁడు రాఁగా వానరు లందఱు చేతులు జోడించుకొని యాకాశము వంకఁ జూచుచు నిలిచిరి.

—♦ హనుమంతుఁడు మందరాద్రిపై దిగుట. ♦—

క. గిరినిభుఁ డగు కపిఋషభుఁడు, తరునికరాకులమహేంద్ర♦ధరకూటమునన్
ద్వరితుఁ డయి దూఁకె గిరిని,ర్ఝరమునఁ బడెనిహతపక్ష♦శైలంబనఁగన్. ౧౩౦౪

అర్థములు. గిరినిభుఁడు = పర్వతముతో సమానుఁడు - కపి ఋషభుఁడు = వానర శ్రేష్ఠుఁడు - తరునికర = చెట్ల గుంపులచే - ఆకుల = నిండి యుండు - గిరినిర్ఝరమునన్ = కొండవంక యందు - నిహత పక్షశైలంబు = ఱెక్కలు విఱిగిన పర్వతము.

తా త్ప ర్య ము.

కొండంత దేహముగల హనుమంతుఁడు వృక్షముల చేనిండియుండుమహేంద్ర పర్వత శిఖరము నందు వేగముతోఁ గూడిన వాఁడయి ఱాల మీఁద దూఁకిన

గాయపడు నని కొండవంకయందు నీళ్ళలో తెక్కలు పెఱిగిన పర్వతమువలె దబాలునఁ బడెను.

శ్రీరామ దర్శనమునకై పోవుట యందొక నిమిషమైన జాగు కారాదని యాయన త్వర సూచించుచున్నది, లేని యెడల దూరమునుండియే వేగము తగ్గించి వచ్చియుండ వచ్చును.

క. ప్రీతమనంబునఁ గపివర, జాతంబులు గంధవాహ♦సంభవుచుట్టుఁ
గౌతుకమున నిలుచుండిరి, యాతనిఁ గనుఁగొనుచు మెచ్చి♦యాడుచు మిగులన్.

తాత్పర్యము.

సంతోషించిన మనస్సులతో వానర శ్రేష్ఠుల సమూహంబులు వాయునందను చుట్టుకొని యాయన యేమి చెప్పునో వినవలయు నను కోరికతో నతనిఁ జూచుచు, మెచ్చుచు నుండిరి.

మానిని. అంతట వానరపుంగవు లెల్ల ని♦రామయతం గనుపట్టు హనూ
మంతునిఁ జూచి నితాంతముదంబున♦మూ నగు మూలఫలాదిక మే
కాంత ముపాయన మిచ్చి కుఱంగట♦నందఱుఁ జేరి భరింప శుభ
స్వాంతుఁడు ఋక్షధవాంగదవృద్ధుల♦కర్మిలిఁ జేసి నమస్కృతులన్. ౧౩౦౭

అర్థములు. నిరామయతన్ = ఒక గాయమైన లేక - నితాంత ముదంబునన్ = మిగుల సంతోషముతో - మూలఫలాదికము = వేళ్ళు పండ్లు మొదలైనవి - ఉపాయనము = కానుక - కుఱంగటన్ = సమీపమందు. ఋక్షధవ + అంగద వృద్ధులకు = జాంబవంతునకు నంగదునకు పెద్దవారికి - అర్మిలి = ప్రేమతో - భక్తితో.

తాత్పర్యము.

ఆ పిమ్మట వానరశ్రేష్ఠు లందఱు గాయమైనఁ బడక దేహబాధ లేక యుండు హనుమంతుని జూచి మిగుల సంతోషించి మూలఫలంబులు కానుకగ నిచ్చి దగ్గఱఁ జేరి యుండఁగా హనుమంతుఁ డందఱకు జ్ఞానవృద్ధుఁడు వయోవృద్ధుఁడు నగు జాంబవంతునకు ఆ పిమ్మట యువరాజగుటచే నంగదునకుఁ దరువాతఁ దనకంటె వయస్సునఁ బెద్దవారగు వారికి భక్తితో నమస్కరించెను. వృద్ధులనఁగా

'దశాబ్దాఖ్యం పౌరసఖ్యం-పంచాబ్దాఖ్యం కలాభృతామ్, త్ర్యబ్దపూర్వం శ్రోత్రియాణా మల్పేనాపి స్వయోనిషు. మను. ౨

ఒక గ్రామమందే యుండువారు తనకంటెఁ బదియేండ్లు పెద్దవారైనచో సఖులగుదురు. అంతకుఁ బైపడినవారు పెద్దవా రనిపించుకొందురు. గీతాది విద్యలు నేర్చినవాఁడు తనకంటె నైదేండ్లు పెద్దవాఁడైనచో సఖుఁడగును. అంతకుఁ బెద్దవాఁడు పెద్దవాఁడనబడును. వేదములు చదివినవాఁడు మూఁడేండ్లు పెద్దవాఁడయినచో సఖుఁడగును. అంతకుఁ బెద్దవాఁడు పెద్దవాఁడనఁబడును. తనవంశము వారిలో నన్నలు మొద

లగువారే మాత్రము వయస్సున బెద్దవారైనను సఖులగుదురు. ఆ కారణమున నధికు లందఱు నభివాదనార్హులు.

మానిని-ఏడు భగణములు గురువు. పదుమూఁడవ స్థానంబున యతి. మానిని యందలి మొదటిగురువు రెండులఘువులు చేసిన కవిరాజ విరాజిత మగును. కవిరాజ విరాజితమునకువలె మానినికిని తిక్కన యతులు రెండువిధములఁ గల్పించినాఁడు.

మానిని. కూలియుఁ గాంతి యి♦ గుర్వఁగఁ దేజము ♦ గుందక వహ్నులు ♦ గ్రూరశిఖా. స్త్రీ. ౨-౧౨౭.

ఇం దేడింట నేడింట నేడింట యతులు గూర్పఁబడినవి.

కావున నీ దెస నాతనికిన్ ప్రభు♦ఖత్వముగల్గదు భక్తిమెయిన్ స్త్రీ-౧-౯౦౫.

ఇందు పదుమూఁడవ స్థానంబున యతి గూర్పఁబడెను.

—♦ హనుమ కపులతోఁ దాను సీతాదేవిని జూచితి నని చెప్పుట. ♦—

సీ. చూచితి సీత నం♦చును సంగ్రహముగాఁగఁ, జెప్పి యంగదు కేలు♦ చేర్చి కేల
నా మహేంద్రాద్రిర♦మ్యారామతలమున, నాసీనుఁడై వాన♦రాళిఁ జూచి
రూక్షరాక్షసనతీ♦రక్షితసీతను, జూచితి సాధ్వి న♦శోకవనిని
విభుదర్శనాసక్తిఁ♦బెనఁగొన్న కురులతో, నుపవాసములఁ జిక్కి♦యున్నదనిన
తే. నమృతతుల్య మహార్థవా♦క్యములఁ గ్రోఁతు
లెగురువారును దూఁకువా♦రిందు నందుఁ
గూయువారుఁ గిలార్చుచు♦ మ్రోయువారు
వాలముల నెత్తి నేలపై♦ బాఁదువారు. ౧౩౦౮

అర్థములు. రూక్షరాక్షసనతీరక్షితన్=కఠినచిత్తలైనరాక్షసస్త్రీలచేఁగావలి కాఁచఁబడుచున్నదానిని, విభుదర్శనాసక్తిన్=మగనిఁ జూచు కోరికతో, అమృత తుల్య=అమృతముతో సమానమైన, మహార్థ=గొప్ప ప్రయోజనము గల, వాక్య ములన్=మాటలను, సీత యుపవాస మున్నదని చెప్పుటచే కిష్కింధాకాండమున నింద్రుఁ డమృత పాయసము దినదినము దెచ్చి యిచ్చుచుండె నను కథ కల్పిత మని యేర్పడు చున్నది, చూచితి సీతన్=ఇదిసుగ్రీవుని వాక్యానుసారము. కిష్కింధ. ౧౦౭౨ వ పద్యమున చూచునది.

తాత్పర్యము.

ఏమిచెప్పునో సీతకనఁబడె నని చెప్పునో, కానరాలేదని చెప్పునోయనితహ తహలాడు వానరుల మనస్సు కుదుటఁబడఁజూచితి సీతనని రెండుమాటలలోసారాం శముఁ దెలిపి యంగదు చేతిని తనచేతఁ బట్టుకొని పోయి యా మహేంద్రపర్వత మున రమ్యమైన వనప్రదేశమందు నందఱుఁ గూర్చుండుటకు ననువైన చోట గూర్చుండివానరులందఱుఁజూచిదయాహీనలైన రాక్షసస్త్రీలచేరక్షింపఁబడు సీతను

జూచితిని. ఆ పతివ్రత యశోకవనమందు తన భర్తను జూచుఁ గోరికతోఁ బేను గొనిపోయిన వెండ్రుకలతో, ఆహారము లేక శుష్కించి యున్నది అని చెప్పఁగానే యమృతముతో సమానమై, పోయిన తమ ప్రాణములను మఱల రప్పించినవై, మహా ప్రయోజనము గల వాక్యముల విని సంతోషాతిశయమున బూర్ణముగ విను నోపిక లేక కొంద ఱెగుర సాగిరి. కొందఱు దూఁకిరి. కొందఱు కిలకిలార్భటులు నించిరి. కొందఱు తోఁకలెత్తి నేలకు గాఁదిరి.

తే. ద్విరదతుల్యులు క్రోఁతులు ♦ తరుల నుండి
దుమికి హనుమంతుఁ బరిరంభ♦ణము నొనర్చి
రంత సర్వవనాటమ♦ధ్యంబునందు
వాలితనయుండు పల్కె స♦ద్వాయుతనయు. ౧౩౦౯

అర్థములు. ద్విరదతుల్యులు=ఏనుగులతో సమానులు, పరిరంభణము = కౌఁగిలింత, సర్వవనాట మధ్యంబునందు = క్రోఁతుల యందఱ నడుమ.

తాత్పర్యము.

అందఱు నేలఁ గూర్చుండి వినవలయుననిఁ గొందఱకు హనుమంతుఁడు దూరమగు గావునఁ గొంద ఱేనుగుల వంటివారు హనుమంతునకు సమీపమున నుండు చెట్లపైనుండి వినుచుండిన వారు హనుమంతుని మాటలు చెవినిఁ బడఁ గానే చెట్లనుండి దుమికి హనుమంతుఁ బ్రతికించితివి తండ్రీ! యని కౌఁగిలించిరి. అప్పు డా క్రోఁతులనడుమ నున్న యంగదుఁడు హనుమంతునితో నిట్లనియె.

క. విస్తారం బగు వారిధి, నిస్తరణ మొనర్చి మఱలి ♦ నెమ్మది రాఁగ
శ్శక్తిగతి నెవ్వఁ డోపును, నిస్తులజవసత్త్వములను ♦ నీ సముఁ డేడీ? ౧౩౧౦

అర్థములు. నిస్తరణ మొనర్చి = దాఁటిపోయి, నిస్తుల=అసమానమైన - జవసత్త్వములను = వేగమునందు. బలమునందు.

తాత్పర్యము.

ఇంత పెద్ద సముద్రమును దాఁటి పోయి సుఖముగా మఱలి యెవ్వఁడు రాఁ గలఁడు? వేగమునందు, బలమునందు నీతో సమానుఁడు లేడు.

క. ఔరా! నీ ప్రభుభక్తియు, నౌరా! నీ శక్తిధైర్య ♦ మరరే! హనుమా
భూరితరాదృష్టంబున, శ్రీరామునిరమణిఁ గంటి ♦ సీతాసాధ్విన్. ౧౩౧౧

తాత్పర్యము.

అవురా యేమి నీ ప్రభు భక్తి. నీశక్తి యేమి. ధైర్యమేమి ఔరా! ఆశ్చర్య కరము. మా యందఱ భాగ్యవశమున నీవు శ్రీరాముని భార్యను, పతివ్రతయగు సీతాదేవిని జూచితివి.

ఆ. జానకీవియోగ♦సంతాపమును బాప, వయ్యఁ డీవు దదృష్ట♦వశతఁ బాపి
నీదు పోక రాక ♦ నెఱి మాకుఁ దెలియంగఁ, బలుక వయ్య కర్ణ♦పర్వముగను. ౧౩౧౨

తా త్ప ర్య ము.

సీతనువిడిచి యుండుటవలనఁ గలిగిన శోకమును రామచంద్రమూర్తియదృష్ట వశమున వదలెను. నీ వెట్లు పోయితివో, యేమి చేసితివో, యెట్లు చూచితివో యది యంతయు మాకుఁ బూర్ణముగ చెవుల పండువుగ వినిపింపుము.

తే. అనిన వానరులెల్ల వా♦తాత్మజాతు, జాంబవంతుని నంగదు ♦ సరసఁ జుట్టి
యుండి రయ్యెడఁ బెద్దవౌ♦బండలందు, హనుమ చెప్పెడి వృత్తాంత♦మాలకింప.

అర్థములు. సరసన్ = సమీపమందు.

తా త్ప ర్య ము.

స్పష్టము.

క. ఎటు దాఁటెనొ వారిధి దా, నెటుజొచ్చెనొ లంక సీత ♦ నెటు చూచెనొ య
క్కుటిలుని దశకంఠునిఁ దా, నెటుగాంచెనొ యంచు వినఁగ ♦ నెసగిన వాంఛన్.

తా త్ప ర్య ము.

సముద్రము నెట్లు దాఁటెనో, లంక నెట్లు ప్రవేశించెనో, యే విధముగ సీతా దేవిని జూచెనో, కుచ్చితుఁ డగు రావణు నెటులు చూచెనో యది యంతయు వినఁ గోరిక గలవారై.

తే. అంజలి ఘటించి భజియింప ♦ నగచరాళి,వాలిసుతుఁడును శిఖరాగ్ర♦భాగమందు
దిశలు వెలిగించు చుండెను♦ దేవవితతి, గొలువ రాణించు వాసవు♦కొమరువోఁప.

అర్థములు. నగచరాళి = క్రోఁతుల గుంపు.

తా త్ప ర్య ము.

వానరు లందఱుఁ జేతులు కట్టుకొని సేవింపఁగా నంగదుఁడు పర్వతశిఖరము కొన యందు దేవతలు గొలువఁ బ్రకాశించు నింద్రునివలె దిక్కులుప్రకాశింపజేయుఁ చుండెను.

క. విలసితకీర్తియశస్సుల. నలరారెడు హనుమచేత ♦ నంగదములచే
జెలువారెడు నంగదుచే,జ్వలితం బయ్యెను మహీంధ్ర ♦ వరకూటంబున్.౧౩౧౬

అర్థములు. విలసితకీర్తి యశస్సులన్ = ప్రకాశించు కీర్తిచేతను యశస్సు చేతను, అలరారెడు=సంతోషించు. (౧) కీర్తియశస్సులు రెండును హనుమంతునకు విశేషణము లైనపుడు కీర్తి-బుద్ధి యతిశయమువలన వచ్చినది, యశస్సు పరాక్రమమువలన వచ్చిన ప్రఖ్యాతి. (౨) కీర్తి హనుమంతునకు యశస్సు అంగదునకు నన్వయింపవచ్చును. చూ. ప ౭౬౪.

తా త్ప ర్య ము.

ప్రకాశించు కీర్తిచేతను యశస్సుచేతను సంతోషించు హనుమంతునిచే, భుజకీర్తులు గల యంగదుచేఁ బర్వత శిఖరము ప్రకాశించెను.

## ౫౮-వ సర్గము. హనుమంతుఁడు తాను లంకకుఁ బోయి వచ్చిన విధం బంతయుఁ గపులకుఁ జెప్పుట.

దండకము. ఆద్యంతవృత్తాంత మాలింపఁగానింపు పెంపారనాజాంబవంతుఁడు వాతాత్మజుం జూచి యో యంజనానందనా! ముందుగాఁ బొందుగాఁ దెల్పు మేరీతి నానాతిని న్నీవు గన్గొంటి? వాల్గంటి దానొంటి నెట్లున్న? దా యున్నమిన్నన్ దశాస్యుండు క్రూరుండు దానే విధం జూచెడిన్? మీఁదికార్యంబు తేనంచునన్ సంచుగాఁ జెప్పనో చెప్పఁగారాని యవ్వాని భాషింపు మన్నన్, హనూమంతుఁడత్యంతసంతుష్టుఁడై హృష్టుఁడై జానకిన్ లోనధ్యానించి మూర్ధంబుచే మ్రొక్కియుక్కేవడిం బల్కె; వారాశి యా ప్రక్కతీరంబుఁ జేరంగ లో నెంచి నే నీ నగాగ్రంబునం దుండి కుప్పించి దాఁటంగ మీరెల్లఁ గన్నారఁగన్నార కాదే!యటే నేగ నంభోధిమధ్యంబునన్ హేమశృంగాంచితంబైన శైలంబు నాత్రోవ కడ్డంబు రా వచ్చె రా విఘ్న మం చెంచి రోషించి భేదించి పోవంగ లో నెంచి దానిన్ ఢికీలంచు నేఁ దాఁకితిన్, దోఁకతోఁ దాఁచితిన్, దాఁచినన్ దానిశృంగంబు వేభంగులన్ భంగమై రాలెఁ, దచ్ఛైలమో మామకీనాశయం బెంచి హర్షంబుగా నాయనా! నీకుఁ జిన్నప్ప నే, గాడ్పుమిత్రుండ, మైనాకుఁడన్, వార్ధిలో నుండుదున్, మున్ను పక్షంబు లుండన్ ధరాధ్రంబు లెల్లన్ యథేచ్ఛంబుగాఁ గ్రుమ్మరన్ లోకభీదానదక్షంబు లౌ వాని వీక్షించి పక్షంబులం ద్రుంచె వజ్రాహతిన్ శక్రుఁ, డగ్గోడు తప్పింప నీ తండ్రి నన్దెచ్చి యీ యంబుధిం ద్రోచెఁజూ, ధర్మభృద్వర్యుఁడున్ శక్రవీర్యుండు నౌ రామకార్యంబున న్నాదు సాహాయ్యముం గొమ్ము నా, నమ్మతిన్ నాదు కర్జంబు చందంబు బోధించి కార్యైకసక్తాత్మకన్ శైలరాజాజ్ఞ నేఁ బోయితిన్, గ్రావమున్ మానుషాకారమున్ మాని శైలాకృతిం బూని వారాశిమధ్యంబునన్, నిల్చె, నే నెచ్చు వేగంబునం బోవఁ బోవంగ నాగాంబ వేగంబ నా కడ్డమై నిల్చి యోగ్రోఁతితేఁడా! మదాహారముం గమ్మ, వేగమ్మ రారమ్ము, దేవాళి యేర్పాటు రా సుమ్ము నా, నమ్మహా దేపకిన్ మ్రొక్కి దిక్కేమియుం దోఁపకిట్లంటి నో దేవి! భూదేవి జామాత శ్రీరాముఁ డారణ్య దేశంబునన్ జానకీలక్ష్మణాన్వీతుఁడై క్రుమ్మరం బంక్తికంఠుండు శుంఠుండు తద్దేవినిన్ మ్రుచ్చిలించెన్, దదన్వేషణార్థంబు రామాజ్ఞచేఁ బోవుచున్నాఁడఁ, దద్దేవు దేశంబునం దుంట శ్రీరామకార్యంబునం దోడు కారాదె? కాదేని వైదేహినిన్ రామునిం జూచి వే వచ్చి నే నిచ్చి నీ మెచ్చుగాఁ జొచ్చువాఁడన్ భవద్వక్త్రమం దన్న నయ్యున్న హా! యేటిమాటల్ బళా దాఁటి పోనీయ, నా కీ వరం బిచ్చి రా దేవతావల్లభుల్, పొల్లుగా దన్న, మే న్పెంచితిన్ యోజనంబుల్ పదిన్నిడ్పు లం దర్థవిస్తారముం గల్గ నా దేవి నాయంత వాక్రంతఁ దావిచ్చె నే నంత హ్రస్వుండనై యొక్క యంగుష్ఠమాత్రంబు గాత్రంబుగాఁ జివ్వునన్ దానివక్త్రం

బునం జొచ్చి వెల్వడ్డ నన్ జూచి నైజాకృతిం దాల్చి యా యంబ, యోవాన రంబా! సుఖంబారం బో పొమ్ము, నీకార్యముల్ చక్కనౌఁ, గూర్పుమీ సీత శ్రీరాముతోఁ, మెచ్చితిన్ నీయెడన్, భద్రమౌ నన్న నన్నంతటన్ భూతముల్ ప్రీతముల్ మేలు మేలంచు శ్లాఘించెఁ, దర్వాత నిర్భీతిఁ బక్షీశురీతిన్ మొగుల్ త్రోవ నేఁబోవ, నా చాయ నెదో గ్రహింపంగ నేచాయఁ గన్గొన్న నాకేమి యుం దోఁప దాత్మీయ వేగంబు సంకుంఠితం బైన నే నాత్మలో నే మహా! నా మహావేగమా చిక్కె, నే ప్రక్క నే యొక్కరిం గానఁ గార్యంబు వార్యంబుగా నోపునో? యంచు దుఃఖాకులాత్ముండనై క్రిందు చూడంగ, మున్నీట ఘోరాకృతిం బండి రాక్షసి యొక్కర్తు నన్ జూచి గర్జించి తర్జించి పెన్నవ్వుతోఁ గ్రొవ్వుతోఁ గీడుగా నాడె, నో పెద్దదేహంబువాఁడా! బలే యెందురా యేగ వేవేగ? నే నెన్నియో నాళ్ళుగాఁ గూడు లేకుంట నాఁకంట నేఁ జిక్కి స్రుక్కంగ నిందుండ నాదండి భాగ్యాన నాకంటికిం దోఁచితి విట్ల, నాకడ్పులోఁ గుప్పగాఁ జొచ్చి యానంద మొందింపరా యన్నఁ గా నిమ్మటం చేను నామేను వేదాని వాకంటె బల్ పెద్దగాఁ బెంప, నాటక్కు నూహింపఁగా లేక నిగ్రంగ నోర్వచ్చె, నేనో నిమేషంబునన్ గుజ్జు వేషంబునన్ దాని పెన్బొట్టలో దిట్టనై యట్టె వే చొచ్చి ప్రేవుల్ వెసం గొంచుఁ జివ్వాలునం బైకి లంఘించితిన్, హస్తముల్ ప్రేల రాక్షసి వారాశిలోఁ గూలె, మింటన్ నభశ్చారులౌ చారణుల్ సింహికా రాక్షసిం ద్రుంచె సామీరి యంచాడఁగా వింటి, నే నత్యయం బెంచుచున్ వింటిమార్గంబునం బోయి శాఖప్రతానావృతంబౌచు లంకాపురం బుండు నా యొడ్డుఁ గన్గొంటి, నా పిమ్మటన్ సూర్యుఁ డస్తాద్రిఁ జేరంగ ఘోరాసురస్తోమ ముల్ గానకుండంగ లంకాపురిం జొచ్చితిం, జొచ్చుచుండంగ నొక్కర్తు కల్పాంత ధారాధరాకారఘోరాట్టహాసాననోపేతజాజ్వల్యమానాగ్ని కేశాళితో నన్నుఁ జంపన్ సమీపింప డాకేల నేఁ బెద్ద పెట్టొక్కటిం బెట్టితిన్, దానితో ఱోలుచుం గూలి, నన్ జూచి యో వీర! లంకాపురిన్ నేను, నన్గెల్చి తీవింక గెల్వంగ నేర్తీసురారాతిసంఘంబుఁ బొమ్మంచు నచ్చేడె నన్నాడె, నే నా ప్రదోషంబునన్ లంకలోఁ జొచ్చి రేయెల్ల సీతాసతిన్ రోసితిన్, దైత్యునంతః పురాంతస్థలిం గానరా దయ్యె, నే నయ్యెడన్ శోకసంతాప మేపారఁ బ్రాకార ముం దాఁటి, యుద్యానముం గాంచి, యందే యశోకావనీజాతమొం డెక్క బంగారనంటుల్ విరాజిల్లు తోఁటొక్కటిన్ శింశుపాభూరుహోపాంతదేశంబునన్ శ్యామనీరేజపత్త్రాంబకన్ నిత్యుపాసంబులం జిక్కి యేకాంశుకాన్వితయై, ధూళి సంలగ్నకేశాంతయై, శోకసంతాపదీనాంగియై, నాథు ధ్యానించుచున్ బెబ్బలుల్ చుట్టఁగా లేడిచందాన దుఃఖించుచున్ భూమిపై వ్రాలి పెన్మంచునం దమ్మివోలెన్ వివర్ణాకృతిం దాల్చి దైత్యేశభీతిన్ మృతిం జెందఁగా గోరు సీతా

సతిం గాంచు చా చెట్టుపై నుంటి, నే నింతలోఁ బంక్తికంఠాలయంబందుఘూళం
ఘుళీరావముల్ వింటి, నద్దాన నేనివ్వెఱం గొంటి, సంక్షిప్తగాత్రుండనై పక్షి
పోలెం గుజంబందు నే నుంటి, దైత్యేశుఁ డిల్లాండ్రతోఁ వచ్చె నచ్చోటికిన్, జానకీ
దేవి యారాక్షసాధీశునింజూచి మోఁకాళులన్ ఱొమ్మునం జేర్చి హస్తంబులంజుట్టి
విత్రస్తయై దిక్కు లేకందు నల్దిక్కు లీక్షించుచున్ వేపమానాంగియై యుండ
వాఁ డంగనం జేరి ధాత్రీస్థలిన్ వ్రాలి నన్నేల వే గోల! యో బేల! రెన్నెల్లలో
నన్నుఁ గైకోక గర్వించి తేనిన్ భవచ్ఛోణితం బేను ద్రావంగ నుంకింతుఁ జుమ్మన్న
నన్నీచు వాక్యంబు లాలించి రోషంబునన్ సీత భాషించె నో నీచుఁడా! దుర్మతీ!
నన్నవ్వితెం గాఁ గనుంగొంటిరా! నీవు; శ్రీరాము నిల్లాల. నిక్ష్వాకువంశేశ్వరుం
డైన యయ్యాజికిం గోడలన్, నన్ను రా నీవు నీచోక్తు లాడంగ! నీనాల్క తుత్తునక
లై కూలదా? క్రూరుడా? శూరుఁడా నీవు? చోరుండవై నాదు నాథుండు లే
నప్డు నన్దెచ్చి ముచ్చట్లు వాక్రువ్వఁగా వచ్చితా? రామచంద్రుండు సంగ్రామ
శూరుండు సత్యోక్త్యుదారుండు యజ్ఞప్రచారుండు నీ వా మహాభావు దాసుండు
గానైన నర్హుండవా? కావు కావన్న నన్నాతివాక్యంబు లాలించి కోపించి యంతఁ,
జితాస్థాగ్నిచందంబునన్ మండి పెన్గ్రుడ్డులం ద్రిప్పి నద్దేవినిం గ్రుద్ది చంపంగఁ గేలెత్త
నయ్యో యయో యయ్యయో యంచు దైత్యాంగనల్ గూయ స్త్రీమధ్యమం
దున్న మందోదరీనామ్ని దా నడ్డమై శూరుఁడా! యేమి యీ సేఁత? యీసీత నీ
కేల నే నుండఁగా? లేరె యీ యక్ష దేవాంగనల్? చాలరే వీరు? లీలావిలా
సంబులం దేలఁగా రా దె, రమ్మంచు వారెల్లఁ గోపంబు చల్లార్చి యారాక్షసుందోడు
కొంచేగి రల్లేగ సీతాసతిం గాచు ఘోరాస్య లా రాక్షసస్త్రీలు తద్దేవినిం జూచి
గర్జించి భర్జించి తర్జించి కర్జంబుగా నెన్నియో దారుణాలాపముల్ పల్కఁగా
వాని నాచానయున్ గడ్డిపోఁచంబలెం జూచె, నాయింతి స్థైర్యంబు నారక్కసుల్

గ్రక్కునం బోయి దేవారికిం జెప్పి యా యంగనన్ లొంగఁగాఁ జేయ దుస్సాధ
మం చెంచి యుందంద నిద్రించి రా మైథిలీదేవియున్ రామ! రామా! యటం
చేడ్చుచుండం ద్రిజటాఖ్య దా నిద్దురన్ లేచి రక్షస్సతీసంఘముం గాంచి మీ రే
టికే జానకిం జూచి భక్షింతుమా తిందుమా యంచుఁ దర్జింపఁగా? ద్రింగుఁడీ
నన్ను మీ రే, ధరాపుత్రి నాశంబు గా దెన్నఁ, డా యాజికిం గోడలై రాము
నిల్లాలు నా సాధ్వి మీ చేతికా చిక్కెడిన్? దారుణం బైన స్వప్నంబునం దీ దశ
గ్రీవు నాశంబు శ్రీరాము గెల్పుం గనుంగొంటి, మీ తర్జనల్ చాలు, మిమ్మెల్లనీ దేవి
శ్రీరాముతోఁ జెప్పి రక్షింపఁ జాలున్, నమస్కార మాత్రప్రపన్నన్ గృపావాల
వే వేఁడుకో రే, మదీయాశయం బిద్ది, నిక్కంబు దుఃఖంబులం బాపు నీ దేవి,
యో తల్లిరో! నీవ మా దిక్కు మా మ్రొక్కు గైకొంచు రక్షింపుమన్నన్ దయా
లోల సీతామహాదేవి తా నెవ్వరిం గాచు, నన్నంత నా యింతియుం గాంతు

జేతృత్వ మాలించి లోసిగ్గునం బల్కె, మీమాటసత్యంబ యే నట్ల రక్షింతునం
చీ గతిం బల్క, నాకల్కి యాపద్దశం జూడ లేనైతి, నాధైర్యమో నమ్మగాఁ
బోయె నేనంత నా కాంతతో భాషణోపాయముం జక్క భావించి యిక్ష్వాకు
వంశ స్తవం బారఁగాఁజేయ నామాట లాలించి యా దేవి కన్నీటితో వానరశ్రేష్ఠ
యెవ్వండ వయ్యా! నినుం బంపె నెవ్వాం డ దేలా య దేలాగునన్ వచ్చితీ విందు?
నే విందుగా విందు, శ్రీరాముతోఁ జెల్మి నీ కెట్లు చేకూరె? భాషింపవే యన్న
నా యన్నతో విన్నపం బిట్లు నేఁ జేసితిన్, దేవి! సనాథు మిత్రుండు మిత్రాత్మ
జుండుండు సుగ్రీవనాముండు, నే నా మహాశూరుబంటన్ హనూమంతుఁడ న్వైరి
వాఁడన్, నినుం గాన నా తేఁడు శ్రీరాముఁ డంపెంజుమీ, నీకభిజ్ఞాన మాత్మాం
గుళీయంబు దా నిచ్చెఁ గైకొమ్ము, నాకిమ్ము నీ వానతిన్, రామ సౌమిత్రులన్
డాయ నిన్గొంచు నేఁబోయెదన్ వచ్చె దే? యన్న నాగోలలన్ మిన్న యోయన్న
శ్రీరాముఁడే రావణుం జంపి నన్గొంచుఁబో వత్తు నన్నన్ సతీ! నాకుఁ జిత్తప్రమో
దావహంబైన గుర్తేమియేనిచ్చె దే? యన్నఁ గానిమ్మటం చింద మీదివ్య చూడా
మణిం గొమ్ము, నాప్రాణనాథుండు నిద్దాని వీక్షించినంతన్ నిజం బెచ్చుగా నన్ను
మన్నించు నం చిచ్చి తావెండియుం గొన్ని సందేశవాక్యంబులం జెప్పె, నే
నా సతీరత్నమున్ మ్రొక్కి నే నిందురాఁ జూచు చుండంగఁ దా వెండియున్
నన్ను వీక్షించి యో యంజనానందనా! యెట్లు ప్రాకుచ్చినన్ రామసౌమిత్రి
సుగ్రీవులి చ్చోటికిన్ వేగ రాఁ జూతురో యట్టు భాషింపు, మిం కేను మాస
ద్వయం బేచుమీ మేనఁ బ్రాణంబులం దాల్తు,నీలోన శ్రీరామచంద్రుండు నన్జూడ
రాఁడాయెనా నాయనా! నే నా యనాథాకృతిం జత్తు, మీయిష్ట మం చన్న
నా కన్న దీనోక్తు లాలింపఁగాఁగింక యంకూర మెత్తెఁ జుఁడీ, యంతఁగొండంత
దేహంబుతో యుద్ధకాంక్షన్ వనం బెల్లఁ జీకాకుగాఁ బీఁకి నిర్మూలముం జేయ
యారద్దునన్ నిద్దురన్ లేచి యద్దైత్య కాంతల్ మదిన్ భీతి గొల్పంగ నద్దిక్కులం
బాఱి యింద్రారినిం జేరి యో వైరివిద్రావణా రావణా! క్రోఁతి యొక్కండు
యుష్మన్మహాశూరతాజ్ఞానిదుష్టాత్ముఁడై తోఁటయెల్లన్ సపాటంబుగా నేలతో
పాటుగావించె, నాక్రించు రప్పించి ఖండింపుమీ, యన్న నా రాక్షసుం డుగ్రులం
గింకరాఖ్యాతశూలాయుధాశీతిసాహస్ర సంఖ్యాకులం బంచె, నే తాడిచేఁ
ద్రుంచితిన్ వారలం జావఁగాఁ, దక్కయున్నట్టిదైత్యుల్ వెసం బాఱి దేవారితోఁ
జెప్పి, రే నింతలో నూరకే యుండఁగా నంచుఁ దోఁపంగ నాచైత్య ప్రాసాదమున్
ధ్వస్తముం జేసియచ్చోటిరక్షస్తతిన్ స్తంభఘాతంబులం గూల్చితిన్ నూఱ్వురన్,
వచ్చెఁ దా నంతలోనం బ్రహస్తాత్మసంభూతుఁడౌ, జంబుమాల్యాఖ్యవిఖ్యాత
శూరుండు ఘోరాసురవ్యూహసంయుక్తుఁడై, వాని సేనాసమేతంబుగా లాఁచిచేఁ
జంపితిం, బిమ్మటం బంచె నాపై మహామాత్ర పుత్రాష్టకం బేను నద్దాన నే వారిఁ

గాలాలయావాసులం జేసితిం, బంచసంఖ్యాక సేనాను లుద్దండత న్వాండి పై రా
విదారించితిన్ సేనతో, వెన్క నప్పంక్తికంఠాత్మజుం డక్షుఁ డన్వాఁడు సైన్యం
బుతో వచ్చె, నే నాకుమారున్ మహావీరు మందోదరీసూనునిన్ మింటికి న్వాఁడు
లంఘించుచోఁ గాళ్ళు లీలన్ బిగం బట్టి గిఱ్ఱునన్ నూఱు మాఱుల్ వడిం
ద్రిప్పి పెన్మద్దగాఁ జేసి ధాత్రీస్థలి న్మోఁదితిన్, వానిపాటా దశాస్యుండునాలించి
వే ఱొండు పుత్రున్ మహాగాత్రునిన్ శక్రజిం బంపె; నవ్వాని నవ్వాహినిం
గూడఁ దేజం బఱంజేసి మోదించితిన్, వాఁడు నన్గెల్చునన్నమ్మకంబూనిరక్షో
విభుం డంపె, నన్నెట్టులుం గెల్వరా దంచు నూహించి వాఁ డంత బ్రహ్మాస్త్ర
పాశంబులన్ నన్ను బంధించె. రక్షోవరుల్ త్రాళ్ళతో నన్ను బంధించికొంపోయి
దైత్యేశుమ్రోలన్ నిలం బెట్ట వాఁ డుగ్రుఁడై యేలరా వచ్చితీలంక? కీ
వేలరా చంపితా సోఁకులం? జెప్పరా యన్న సీతార్థమై సర్వముం జేసితిన్,
నిన్నుఁ జూడంగ నీయింటికిన్ వచ్చితిన్ రాక్షసేంద్రా! హనూమంతుఁడన్వాఁడ,
నేఁ బావమానిన్ రఘూత్తంసుఁ డౌ రాముదూతుండ,సుగ్రీవుమంత్రిన్, ననుం
బంప రాముండు నీయొద్దకున్వచ్చితిన్ దూతనై, సూర్యపుత్రుండు నీ సేమముం
బ్రశ్న గావించె, ధర్మార్థకామానుషక్తంబు పథ్యంబు వాక్యంబునీకున్ వచించెం
జుమీ, ఋశ్యమూకంబునన్ రాముతో మైత్రిఁ గావించి యున్నాఁడు,తద్వీరు
వాక్యంబు లాలింపుమా, రామదేవుండు దేవారి నా నారినిన్ బ్రుచ్చిలించెన్
వనీభూమి, నీ విందు సాహాయ్యముం జేయుమా, యంచు నన్వేఁడ నే నట్లు తే
చేయుదుం గాని యవ్వాలినిం జంపఁగా బాసఁ గావింపుమీ యంటి,సూర్యాన్వ
యుం డట్లు గావించి యవ్వాలినిన్ బాణమొక్కంటనే చంపి కీశాధిపత్యంబు
నా కిచ్చె, నే హవ్యభుక్సాక్షికం బైన స్నేహంబు గావించితిన్, రామసాహాయ్య
మే నెట్టులుం జేయుదున్, జానకీదేవి శ్రీరామభూనేతకిమ్మా యనున్నంత వీరుల్
వనాటుల్ భవచ్ఛౌర్యనిర్మూలనం బెట్లుఁ గావింతు, రెవ్వారు మావారశౌర్యంబు
లోకంబునం గానరో? పోవరో మున్ను దేవాళికిం దోడుగా?నంచు నీతో వచిం
పన్ ననుం బంచె నన్నన్ రుషాశోణితం బైన నేత్రంబులం జూఁడునట్లుగ్రతం
జూచి నా విక్రమం బాదురాత్ముం డవిజ్ఞాతుఁడై యంతనన్ జంప నాజ్ఞప్తిగావిం
పఁగా వానితమ్ముండు ధీశాలి రక్షోవరున్నా నిమిత్తంబుగా వేఁడెనో సోఁకు ఱేఁడా!
కనన్ రాజశాస్త్రవ్యపేతంబు నీ యాజ్ఞ, శాస్త్రంబునం దూత వధ్యుండుగాఁ,
డిచ్చమైఁ దథ్యముం బథ్యముం బల్కు వాఁ డెట్టి నేరంబు గావించినన్ రూపు
మార్పన్ వికారంబుగాఁ జెల్లుఁగా, కెప్పుడుం జంపఁగా రాదనం, దోఁకఁ
గాల్పంగఁ బంచెన్ దశాస్యుండు, రక్షోవరుల్ వాల్కవారంబులన్ జీర్ణకార్పాస
వస్త్రంబులం దోఁకకుం జుట్టి నన్ గట్టెలం గొట్టుచున్, గింకచేఁ దిట్టుచున్,
బైపయిన్ ఱొప్పుచుం, వీథులం ద్రిప్పుచున్, బ్రోవ సంక్షిప్తగాత్రుండనై తట్టులం

డుల్చి నే వెండియుఁ ఘోరరూపంబుఁ గైకొంచుఁ బెట్లాడిచే వారలం జంప ద్వారంబునం జేరి లంకాపురిం గొంప లన్నింటికిం జిచ్చు సంధించి యామంటలో సీతయుం గ్రుంగెనో? పోయెఁగా పట్టనం బంతయుం బాడుగాఁ, దన్విమాత్రంబు దా నెట్లు జీవించెడిన్? రామకార్యంబు నిర్మూలముం జేసితిన్ బుద్ధిహీనుండ నై యంచు శోకించుచున్ సీత భద్రంబ యం చభ్రమార్గంబునం జారణుల్ పల్కఁ నాలించి భావించి సర్వంబునుం గాల్చు నాయాశ్రయాశుండు నాతోఁకఁ గాల్పండ, నా చిత్తమా సంప్రహృష్టంబు, సౌరభ్య సంభారుఁ డై గంధవాహుండు నున్ వీచె, సీతామహాదేవి నావీతిహోత్రుండు దాఁ గాల్పఁగా నోపు? నంచాత్మ మోదించి యా యించుఁబోణిన్ మఱిం గాంచి నే నామెకుం జెప్పి తత్రస్థ మా నా యరిష్టంబుపై నెక్కి మిమ్మెల్ల దర్శించు వేడ్కన్ గ్రక్కున్ వారిధిం దాఁటి చంద్రార్క-సంసేవితం బైన మార్గంబునన్ వచ్చితిన్, మిమ్ముఁ గన్గొంటి, శ్రీరామచంద్రప్రభావంబునన్ యుష్మదీయోరుతేజంబునన్ నేను సుగ్రీవు కార్యంబు నీమట్టు గావించితిన్ లంకలో, నింకఁ గాఁగల్గు కార్యం బవార్యంబుగా జేయ మీరెల్ల రున్నారుగా.

ఇంతవఱకు సుందర కాండమునఁ జెప్పఁబడిన విషయ మంతయు సంగ్రహముగా జెప్పఁబడెను. వక్త హనుమంతుఁడు.

అర్థములు. ఆద్యంత వృత్తాంతము, హనుమంతుఁడు జరపిన చర్య మొదటి నుండి తుదవఱకు; ఆలింపఁగా = వినఁగా: తేనంచునన్ = రామచంద్రమూర్తి యొద్ద; హనుమంతుఁడు జరపిన సర్వవృత్తాంతము వినఁగోరి జాంబవంతుఁడు హనుమంతుని నీవు సీతాదేవి నెట్లు చూచితివి. ఆమె యెట్లున్నది. ఆమె విషయమున రావణుఁ డెట్టి యభిప్రాయముగలవాఁడై యున్నాఁడు. జరిగిన దానిలో రామచంద్రమూర్తితో జెప్పఁగూడినది యేది? చెప్పరానిది యేది? ఇవన్నియుఁ జెప్పు మని ప్రశ్నింపఁగా హనుమంతుఁడు సీతాదేవినిస్మరించి యామెకు శిరస్సుతో నమస్కరించి యిట్లు చెప్పుచున్నాఁడు. హేమశృంగాంచితంబు = బంగారు శిఖరముచేఁ బ్రకాశించునది. అడ్డంబు రాన్ = అడ్డము రాఁగా. తాఁచితిన్ = కొట్టితిని-భంగమై = విఱిగినదై- మామకీనాశయము = నా యభిప్రాయము-చిన్నప్పను = పిన్నతండ్రిని - ధరాధ్రంబు లెల్లన్ = కొండలన్నియు - భీదాన దక్షంబులు = భయము నొసంగుటయందు సమర్థము లయినవి- పక్షంబులన్ = ఱెక్కలను - శక్రుఁడు = ఇంద్రుఁడు - గోడు = ఆపద-ధర్మభృత్ +వర్యుఁడు = (౧) కోదండము ధరించిన వారిలో శ్రేష్ఠుఁడు, (౨) ధర్మరక్షణము చేయువారిలో శ్రేష్ఠుడు; జామాత = అల్లుడు-కర్జంబు = కార్యము-కార్యైకసక్తాత్మకన్ = కార్యమునందు మాత్రమే యాసక్తిగలిగియున్న మనస్సుతో; గ్రావము = పర్వతము; నాగాంబ = సురస - మదాహారమున్ = నా యాహారము - అన్వితుఁడు = కూడినవాఁడు - తదన్వేషణార్థంబు = ఆమెను వెదకు కొఱకు - ఇచ్చన్ = ఇష్టప్రకారము-

అన్న = స్త్రీ - పొల్లు = వ్యర్థము - వాక్రంత = నోటిసందు - వెల్వడ్డ = బయలువెడలిన, నైజాకృతి = సహజస్వరూపము, మొగుల్ త్రోవన్ = ఆకాశమందు, చాయ = నీడ. చాయ = ప్రక్క. సంకుంఠితము = మొక్కపోయినది - తగ్గినది, వార్యంబు = అడ్డగింపబడినది, మున్నీటన్ = సముద్రమందు, ఆఁకంటన్ = ఆఁకలిచే, కుడుపు = ఆహారము, వాకంటెన్ = నోటికంటె, టక్కు = ఉపాయము, గుజ్జు = పొట్టి, నభశ్చారులౌ = ఆకాశమునఁ దిరుగువారగు, సామీరి = ఆంజనేయుఁడు, అత్యయంబు = అవశ్యము చేయవలసినదానిని, శాఖిప్రతానము = వృక్షసమూహముచే, ఆవృతము = ఆవరింపఁబడినది, కల్పాంత = ప్రలయకాలమందలి, ధారాధరాకార = మేఘమువంటి యాకారముగలది, ఘోర + అట్టహాస + ఆనన + ఉపేత = భయంకరమైన పెద్ద నవ్వుతోడి ముఖముతోఁ గూడినది, జాజ్వల్యమాన = మండుచున్న, అగ్నికోశాలితోన్ = మంటవంటి వెండ్రుకలతో, డాకేలన్ = ఎడమచేతితో, పెట్టు = దెబ్బ, ఓలుచున్ = విలపించుచు, ప్రదోషంబునన్ = సూర్యాస్తమానమైన తర్వాతి కాలమున, అంతఃపుర + అంతః + స్థలిన్ = అంతఃపురము లోపలిప్రదేశమున - అశోకావనీజాతము = అశోకవృక్షము, - శింశుపాభూరుహ = శింశుపావృక్షముయొక్క, ఉపాంతదేశంబున = సమీపప్రదేశమున, శ్యామన్ = నడిమి వయస్సుదానిని - నీరేజపత్రాంబకన్ = తామర రేకులవంటి కన్నులు గలదానిని - నిత్యుపాసంబులన్ = శుష్కోపవాసములచే - ఏకాంశుకాన్వితయై (౧) ఒంటివస్త్రముగలదై (౨) హరణకాలమందే చీర ధరించియుండునో యా చీరనే ధరించినదై - ధూళిసంలగ్న = దుమ్ముతోఁగూడిన - కేశాంతయై = వెండ్రుకల కొనలు గలదై - వివర్ణ = వన్నెమాసిన, ఆకృతిన్ = ఆకారమును - సంక్షిప్తగాత్రుండనై = కుఱుచ చేయఁబడిన దేహముగలవాఁడనై - కుజంబందు = చెట్టునందు - విత్రస్తయై = మిగుల భయపడినదై; వేపమానాంగియై = వణఁకుచున్న దేహముగలదై - భవత్ + శోణితంబు = నీ నెత్తురు - ఉంకింతును = ప్రయత్నింతును, ఆజికిన్ = దశరథునకు - సత్యోక్త్యుదారుఁడు = సత్యము చెప్పుటయందు గొప్పవాఁడు - చితాస్థాగ్ని = శ్మశానమున కాష్ఠమునందు నగ్ని - మండోదరీనామ్ని = మండోదరి యను పేరు గలది, ముందు ధాన్యమాలిని యను రాక్షసి యడ్డమువచ్చినట్లు చెప్పఁబడెను. ఇచ్చట మండోదరియని హనుమంతుఁడు చెప్పెను. దీనివలన నిరువురు నడ్డము రాఁగా నొకరిచ్చట నొకరచ్చటఁ జెప్పఁబడిరని కాని హనుమంతునకు మందోదరి పేరు మాత్రమే తెలిసి యుండుటచే నామె పేరు చెప్పెనని కాని ధాన్యమాలెనినే మందోదరి యని భ్రమించెనని కాని యెంచనగు. మందోదరి - మండోదరి యని రెండు రూపములు గలవు. మందోదరి యన్నప్పుడు పలుచని కడుపుగలది యనియు, 'మూఢాల్పాపటు నిర్భాగ్యా మందాః' అమరము. మండోదరి యన్న మీఁగడవలెఁ బలుచనైన కడుపు గలది యని కాని, అలంకార భూ

మైన కడుపు గలదని కాని గ్రహింపనగు. మండ=మండనము - అలంకారమునకుఁ బేరు 'మడి భూషాయాం' మ్మను ధాతువు వలనఁ గలిగినది. పచాద్యచ్—దంభ—డిండీర—శోలికా—దాడిమ శబ్దంబు లందు వలె దడల కభేదము గ్రహించి మండోదరి - మందోదరి యని గ్రహింపనగు. 'మందా స్థూలపిపీలికా' గండుచీమకు పేరు. దాని నడుమువలె సన్ననైన కడుపు గలది. మండోదరి-మందోదరియని రెండురూపంబులు. వారెల్ల..................నేగి రనుటచే ధాన్యమాలిని, మందోదరిగాక యితరస్త్రీలు నడ్డము వచ్చిరని గ్రహింపనగు. ఘోరాస్యలు = భయంకరమైన ముఖములు గలవారు, గర్జించి = సింహనాదము చేసి, భర్జించు = సంతాపపడఁజేసి, తర్జించి = బెదరించి, కర్జంబు = కార్యము, దారుణాలాపముల్=భయంకరమైన మాటలు, నిద్రించిరి = రాక్షసస్త్రీలు బెదరించిన తరువాత - నిద్రపోయిరి, ఆసమయముననే సీతాంజనేయుల సంభాషణము. త్రిజటాఖ్య=త్రిజట యను పేరు గల-జట-జాట రూపాంతరములు. త్రిజటా నామము దండకమునఁగుదురదు. నమస్కారమాత్రప్రసన్నఁ = నమస్కరించునంతమాత్రముచేత నేసంతోషించునది, కృపావాలఁ=దయకుఁబాదైనదానిని, మదీయాశయంబు= నా యభిప్రాయము - ఎవ్వారిఁ = ఎట్టి వారినైనను, ఎన్ని యపరాధములు చేసిన వారినైనను, కాంతు = భర్తయొక్క, జేతృత్వముఁ=జయమును - వమ్ము = వ్యర్థము - స్తవము = స్తోత్రము - విందుగాఁ = సంతోషముతో - మిత్రాత్మజుండు = సూర్యపుత్రుఁడు - అభిజ్ఞానము = గుర్తు - ఆత్మాంగుళీయంబు = తన యుంగరము- చిత్తప్రమోదావహంబు = మనస్సునకు సంతోషము గలిగించునది- కొన్ని సందేశ వాక్యంబులు = ఇవి రామచంద్రమూర్తితో మాత్రమే చెప్పఁదగినవి కావున నిచ్చట వానరులకుఁ జెప్ప లేదు. మాసద్వయంబె = రెండుపక్షములు మాత్రమే - పక్షౌవై మాసా యను వాక్యము ప్రకారము రెండుపక్షము లనియే గ్రహింపవలెను. చూ. ప. ౯౫౩-౧౪౦౭-౧౪౧౩. సీతాదేవి తానొక మాసమే బ్రదికి యుండెదనని హనుమంతునకుఁ జెప్పినట్లు ముందు చెప్పఁబడెను. ఇక్కడఁ దనతో రెండు మాసములు బ్రదికి యుండెదనని చెప్పినట్లు హనుమంతుఁడు చెప్పెను. ఒక మాసమును నది స్థిరపఱిచి దానికిఁగల కారణము ముందు వ్రాయఁబడెను. కొందఱు దీనిని స్థిరపఱుచుకొని యచ్చటి మాసమనుటకు రెండు నెలలని యర్థము చెప్పెదరు. "షష్టిభిర్దివసైర్మాసః కథితో బాదరాయణైః" అని యొక వాక్యముగలదు. అనాథాకృతిఁ=దిక్కు లేని దానివలె, కింక=కోపము - అంకూరము - రూ - అంకురము-మొలక-అంకూర మంకురంచ స్యా దంకురోంకూర ఇత్యపి. ద్వి॥కో॥ రద్దు=సద్దు=ధ్వని-యుష్మత్ - నీయొక్క - మహాశూరతా + అజ్ఞాని = నీ గొప్ప శౌర్యమెఱుగనివాఁడు- సపాటంబుగ = మట్టముగ - రూ. సపాట - నేలతోపాటు = నేలకు సమముగా-తోపాటు అనునది పైపాటులోపము- చేపడు శబ్దంబులవలె ఏకశబ్దమే.

కావున తోఁబాటు అనునది యపశబ్దము. అశీతిసాహస్ర సంఖ్యాకంబు = ఎనుబది వేలు లెక్క గలవారిని - లౌడి = గుదియ - పరిఘ - చైత్రప్రసాదమ్మున్ = 'త్య' లఘువేకాని యిచ్చట గురువుగా గ్రహింపరాదు. వైకల్పికము-పూర్వము చర్చితము. స్తంభ ఘాతంబులన్ = స్తంభము దెబ్బలచే, ఘోరాసుర వ్యూహసంయుక్తుఁడై = భయంకరులగు రాక్షసుల గుంపులతోఁ గూడిన వాఁడై - లౌణి = లౌడి - మహామాత్యపుత్రాష్టకంబు = మంత్రుల పుత్రుల నెనిమిది మందిని- కాలాలయావాసులన్ = యముని యింటఁ గాపుర ముండు వారు- చచ్చినవారు- హవ్యభుక్ + సాక్షికము = అగ్నిసాక్షిగాఁ గలది- వనాటుల్ = క్రోఁతులు- రుషాశోణితంబు = కోపముచే నెఱ్ఱనైనది- చూఁడునట్లు = కాల్చునట్లు - విభీషణ శబ్దము దండకమునఁ గుదురదు ÷ సోకు జేఁడా = రాక్షసరాజా - రాజశాస్త్రవ్యపేతంబు = రాజనీతికి విరుద్ధమైనది- వధ్యుండు = చంపఁ దగినవాఁడు - వాల్క వారంబులన్ = నార చీరల సమూహములను- జీర్ణ కార్పాస వస్త్రంబులన్ = దూదితో చేసిన ప్రాతవస్త్రములను, అభ్రమార్గంబునన్ = ఆకాశమున- ఆశ్రయాశుండు = అగ్ని -ఆశ్రయమును ఆహారముగాఁ గలవాఁడు- సంప్రహృష్టంబు = మిగుల సంతోషముతోఁ గూడినది- సౌరభ్య = మంచివాసన -గంధవహుండు = వాయువు - వీతిహోత్రుండు = అగ్ని- తత్రస్థమా = అందున్న- అరిష్టము = అరిష్టమను పర్వతము- సుగ్రీవు కార్యము = శ్రీరామచంద్రమూర్తికి సుగ్రీవుఁడు నీభార్యను వెదికి దాని వార్త చెప్పించెదనని చెప్పెను గావున యాయన కార్యము.

దండకము = ఈ దండకమున నన్నియు తగణంబులే కాని వేఱు గణము లేదు.—కడపట గురువు. విద్వాంసులెల్లన్ హకారంబె కానీ నకారంబే కానీ సకారంబె కానీ వచింపం దగు చున్నందుగా నిందుఁ గాదేని యాదిం దకారంబు కల్పించి యామీఁద నెల్లం దకారంబులే మెండుగా నిచ్చకున్ వచ్చు నందాఁక నిర్మించి గుర్వంతముం జేసినన్ దండకంబండ్రు-అప్ప.

తాత్పర్యము.

సుగమము.

ఓయీ యీ దండకమందు త్రిజటావాక్యముల నమ్మి రాక్షసస్త్రీలు సీతాదేవికి శరణాగతి చేసినట్లును, సీతాదేవి వారికి నభయ ప్రదానము గావించిన ట్లున్నదికదా.

(౧) "స్వరక్షణే ప్యశక్తస్య కో హేతుః పరరక్షణే" తన్నుఁ దాను గాపాడుకొనలేని వాఁడు పరుల నెట్లు కాపాడఁగలఁ డను న్యాయ మనుసరించి తన చెఱ తాను దప్పించుకొనలేక యాంజనేయా నన్నెట్టులయిన రామచంద్రునితోఁ జెప్పి రక్షింపుమని హనుమంతుని బ్రార్థించునది యితరుల నెట్లు రక్షింపఁగలదు. ఏటివెంటఁ గొట్టుకొని పోవునొకఁడు మఱియొకని రక్షింపఁగలఁడా ?

(౨) ఒకవేళ రక్షింపఁ గలిగనేని మగనితోఁ జెప్పి రక్షింపఁ గలదే కాని యీ యధికారము తనకుఁగలట్టు స్వతంత్రించి యెట్లు చెప్పఁగలిగెను. అనఁగా సీతాదేవియందు నుపాయత్వము గలదే కాని యుపేయత్వము లేదని సందేహము.

(౧) ప్రథమ సందేహము నిరాకరము - సీతాదేవి దన్నుఁ దాను గాపాడుకొనలేక హనుమంతుని బ్రార్థించె ననుట సరిగాదు.

'నేను దశాస్య నిన్నిపుడ నీఱుగఁ జేయనె నాదువల్లభుం డానతి యీమి నట్టి పనికై తపమెల్లను బొల్లుపోవఁగా మానస మొప్పకుండుటను మానితిఁగాక' యని స్పష్టముగా సీతాదేవి చెప్పెను.

క. 'జానకి కోపమె పూనిన, మానక యొనరించు దాని మఱి దహనుండుఁ
బూని కరంబున నంటినఁ, దానొనరుపఁ జాలఁ డింత తథ్యము సుండీ.' ౧౩౧౯

లంకయంతయు సీతాతపోదగ్ధమై యున్నదనియు, రామచంద్రమూర్తి నిమిత్తమాత్రమనియు హనుమంతుఁడు చెప్పెను.

శీతోభవ-హనుమ యెడ శైత్యమగుమీ యగ్నిదేవ యని యగ్ని చల్లగా నుండునట్లు చేసెను.

ఇంతటిశక్తిగలది తన్నుఁ దాను రక్షించుకొనశక్తి లేక హనుమంతుని బ్రార్థించె ననుట దుశ్శంకయే. తన్నుఁ దాను రక్షించుకొనినను హనుమంతుఁడు రక్షించినను రామచంద్రమూర్తి కపకీర్తి వచ్చునని యా ప్రయత్నము మానెను.

౨. ఇఁక రెండవ సందేహమును గుఱించి - లక్ష్మీనారాయణుల కవినాభావసంబంధము గలదనియు ౪౬౦౮ వ పద్య వ్యాఖ్యానమందు సర్వకారణత్వ - సర్వ వ్యాపకత్వ - సర్వనియంతృత్వాదు లిరువుర యందుఁ గలవనియు నిరువురు నుపేయభూతులే యనియుఁ జెప్పబడెను.

యత్పదాంభోజ ఘటితా ప్రణతీ ర్దుర్లభాన్యపి । పదాని పరమాం ముక్తిం సూతేతాం శ్రియ మాశ్రయే । సర్వకామప్రదాం రమ్యాం సంసారార్ణవ తారిణీమ్ । క్షిప్రప్రసాదినీం లక్ష్మీం, శరణ్యా మనుచింతయేత్ । అనేనైవం ప్రసన్నస్య శ్రియం దేవీం సనాతనీమ్।పాపానుషంగ స్సకల స్తత్‌క్షణాదేవ నశ్యతి. ఇత్యాది వాక్యములు లక్ష్మీదేవియుఁ దన యాశ్రితులను సంసారమునుండి తరింపఁ జేయఁగలదని తెలుపుచున్నవి.

లక్ష్మీనారాయణులను సీతారాములనుబరస్పరభిన్నులుగాఁ దలఁచుటచేనిట్టి దుశ్శంకలు కలుగుచున్నవి. "లక్ష్మ్యాసహ హృషీకేశో దేవ్యా కారుణ్యరూపయా రక్షకః సర్వసిద్ధాంతే వేదాంతేపిచగీయతే॥ యన్నట్లు లక్ష్మీదేవి భగవంతుని కరుణాశక్తియే. కృపయాపర్యపాలయత్ ॥ 'కరుణచేఁగాకమునురామచంద్రమూర్తిరక్షించె నన్నప్పుడు రామచంద్రుఁడు రక్షించెనా, కరుణ రక్షించెనా యని రెండు వేఱుగా విడఁదీసిప్రశ్నించుటెట్టిదో, లక్ష్మిరక్షించెనా నారాయణుఁడురక్షించెనా, సీతరక్షిం

చెనా రాముఁడు రక్షించెనా యను ప్రశ్నయు నట్టిదే. రాముఁడు లేని కరుణ రక్షింపజాలదు. కరుణ లేని రాముఁడు రక్షింపఁ జాలఁడు. కృపరక్షించెననిన రామచంద్రమూర్తి రక్షించె నన్నట్లే. రామచంద్రమూర్తి రక్షించె ననిన కరుణ రక్షించె నన్నట్లే. సీతా - లక్ష్మి-కరుణ-కృప-దయ-యివి పర్యాయపదములు. కావుననే భక్తులు లక్ష్మీవిశిష్ట నారాయణుని సీతావిశిష్టరాముని నుపాసింపవలయు నని శాస్త్రములు చెప్పుచున్నవి. ఒకరిపేరు చెప్పినను రెండవవారుకూడ నున్నట్లే భావింపవలయునుగాని రెండవవారి యందు నిరసన భావము కూడదు. సీతతోనాకుఁ బని లేదు రాముఁడే చాలుననరాదు. సీతయే చాలును, రామునితోఁ బని లేదనరాదు. ఎండను విడిచి సూర్యుని, వెన్నెలను విడిచి చంద్రుని-అలల విడిచి సముద్రునినను భవించు టెట్లు? అట్లులే గుణమును విడిచి గుణిని గాని, గుణిని విడిచి గుణముగాని నను భవించు టెట్లు? 'మా మేకంచ శ్రియాయుక్తం భక్తియుక్తో నరోత్తమః ద్వయేన మంత్రరత్నేన మత్ప్రియేణ భజేత్సదా। అచిరాన్మత్ప్రసాదేన మల్లోకంచ సగచ్ఛతి'। ఇత్యాది ప్రమాణము లనేకములు గలవు. 'యాసాభగవతశ్శక్తి రహంతా సర్వభావగా। అపృథక్కారిణీ సత్తా మహానందమయీ పరా। భావాభావానుగా శక్తిస్సర్వకార్యకరీవిభోః। స్వాతంత్ర్యరూపాసావిష్ణోః ప్రస్ఫురత్తాజగన్మయీ అహంతా బ్రహ్మణస్తస్య సాహమస్మి సనాతనీ। ఆత్మా స సర్వభూతానామహం భూతో హరిః స్మృతః। అహంతయా వినాహంహి నిరుపాఖ్యో నసిధ్యతి। అహమర్థ వినాహంతా నిరాధారా న సిధ్యతి॥ అహం భగవంతుఁడగునేని అహంతలక్ష్మీదేవి యగును. ఈ ప్రకారము గుణగుణులకు విశేషణవిశేష్యములకు వాగర్థములకు వలె లక్ష్మీనారాయణులకు సీతారాముల కభేదము. అవినాభావసంబంధము చెప్పినను ఎండయే సూర్యుఁడయ్యెను. సూర్యుఁడే యెండయయ్యెను. శక్తియేశక్తుఁడయ్యెను. శక్తుఁడే శక్తియయ్యెను. అర్థమే వాక్కు - వాక్కే యర్థము. అని యిట్లు స్వరూపైక్యము చెప్పరాదు. భార్యాభర్తృన్యాయముచే సీతాలక్ష్ములను స్త్రీస్వరూపములుగనే పూజింపవలెను. రామనారాయణులను పురుషరూపములుగనె పూజింపవలెను. సీతకు దోవతి కట్టరాదు. రామునకుఁ జీర కట్టరాదు. బిడ్డలకుఁ దల్లిదండ్రు లిరువురు సేవ్యులే. సీతకు రామచంద్రమూర్తి మాత్రమే సేవ్యుఁడు. ఎవరి సాంప్రదాయ మెట్లులుండినను సీతాదేవి యనుగ్రహించిన కాక - గృధ్ర - సుగ్రీవ - విభీషణులను రామచంద్రమూర్తి యనుగ్రహించుటచే సీతాదేవి యందుపాయత్వము గలదనియు, హనుమంతునిచేఁ జావకుండ రాక్షసస్త్రీలఁగాపాడుటచే నుపేయత్వము(స్వతంత్ర రక్షణశక్తి) గలదనియు, రామాయణము వలన నెఱుఁగవలసిన విషయము. రామచంద్రమూర్తి యందును నీ రెండు శక్తులు గలవు. ఇది సారాంశము.

{ ౫౮-వ సర్గము. హనుమంతుఁడు సీతాదేవిని దోడ్కొనివచ్చి శ్రీరాముని దర్శించుట యుక్తమని చెప్పుట. }

మ. అని సర్వంబు వచించి జానకి మహా♦త్యర్థప్రశీలంబుచే
నినసంభూతుని సంభ్రమంబు రఘువం♦శేశప్రయత్నంబు గాం
చెను సాఫల్యము, నాదు చిత్తమొ సదా♦చింతించెడిఁ జానకీ
వనజాతాయతలోచనాప్రవణమై♦భాషించిరిఁ సత్యముఁ. ౧౩౧౮

అర్థములు. మహా+అత్యర్థ+ప్ర + శీలంబుచే = మిక్కిలి గొప్పదై శ్రేష్ఠమైన పాతివ్రత్యముచే, ఉత్త శీలముకాదు. ప్రకృష్టశీలముకాదు – అత్యర్థప్రకృష్టశీలముగాదు. మహాత్యర్థ ప్రకృష్టశీలము – సంభ్రమము = త్వర, ఉత్సాహమని భావము. జానకీ వనజాయతలోచనా=కమలములవలె దీర్ఘములైన కన్నులు గల సీతాదేవియందు, ప్రవణమై=భక్తిగలదై, ఆసక్తిగలదై – మిట్టనీళ్ళు పల్లమునకుఁ బోవుచున్నట్లు పోవునదియై, వినయముతోఁ గూడినదై- ప్రవణశబ్దమున కిన్ని యర్థములు గలవు. అన్నియు నిచ్చట నన్వయించునవియై యున్నవి. సీతాదేవి విషయమున హనుమంతుని మనస్సు ఈ విధము గలదయ్యెను. అనఁగా సీతాదాసుఁడయ్యెనని భావము.

తాత్పర్యము.

శ్రీరామచంద్రమూర్తి యనుగ్రహము చేతను, మీ తేజోవిశేషము చేతను నావంతునకు మీరు పెట్టిన కార్యము సీతను జూచి వచ్చుట యను దానినిలంకలో నింతమాత్రము చేసివచ్చితిని. తక్కిన కార్యము మీవంతు సుగ్రీవుని సీతాన్వేషణమందుఁగల యుత్సాహము – రామచంద్రుని ప్రయత్నము, ఈ రెండును సీతాదేవి యొక్క మహాపాతివ్రత్య మహిమాతిశయముచే ఫలించినవి. వారిరువురి కార్యములు నెఱవేఱినవి. నామనస్సో వికసించిన కమలమును విడిచి తుమ్మెద యెట్లు రాదో యట్లు సీతాదేవిని విడిచి రాక యక్కడికే పోవుచున్నది. ఇట్లు నా జన్మము సఫలమైనది. ఉన్న దంతయు యథార్థముగాఁ జెప్పితిని.

చ. అలఁతిగ నెంచఁ బోకుఁడు సు♦రారివిభుఁ దశవక్త్రునిం దపో
బలమున లోకముల్ నిలుప ♦ బాఢతరాగ్రహ మెత్తి యన్నిటిఁ
బెలుచ దహింపఁ జాలెడిఁ బ్ర♦వృద్ధుఁడు సర్వవిధాల, జానకిఁ
బలిమిని దాకియుం జెడమి ♦ వానితపోగరిమంబునం జుఁడీ. ౧౩౧౯

అర్థములు. అలఁతిగఁ = అల్పునిగ, బాఢతరాగ్రహ మెత్తి = మిగులఁ గోపాతిశయము పూని, పెలుచఁ = త్వరగా, ప్రవృద్ధుఁడు=మిగుల గొప్పవాఁడు, తపోగరిమంబునఁ = తపస్సుయొక్క గొప్పతనముచే, 'గురు' శబ్దమునకు ఇమనిచ్ ప్రత్యయము చేర్పఁగా గరిమ యయ్యె.

తా త్ప ర్య ము.

నేను జెప్పిన దానిని బట్టి రావణుఁడల్పుఁడు, సులభ సాధ్యుఁడని తలఁపవలదు. వాని తపోబలముచేత లోకముల నిలుపను, కోపించి సంహరింపను గూడ సర్వ విధాల గొప్పవాఁడు. జానకిని దాఁకి వాఁడు దగ్ధుఁడు కాక యుండుట వాని తపో బలము చేతనే సుమా.

క. జానకి కోపమె పూనిన, మానక యొనరించుదాని ♦ మఱి దహనుండుఁ
బూని కరంబున నంటినఁ, దా నొనరుపఁ జాలఁ డింత ♦ తథ్యము సుండీ! ౧౩౨౦

తా త్ప ర్య ము.

ఓయీ యాంజనేయా! సీతాదేవి మహాపతివ్రత యంటివి. అట్టి పతివ్రతను బలవంతముగఁ దాఁకి రావణుఁడు తన తపోబలముచేఁ జెడక యున్నాఁ డంటివి. అట్లైన నామె తపోమహిమ కన్న, వాని తపోమహిమ గొప్ప దయ్యెఁ గదా. అట్టి వానిని రాముఁ డేమిచేయఁగలఁడు? సుగ్రీవుఁ డేమి చేయఁగలఁ డందు రేమో. అట్టి సందేహముతోఁ బనిలేదు. రావణుని దురభిప్రాయము వంటి దురభిప్రాయము గలవాఁడై మఱియొకఁడు బలాత్కారముగఁ దాఁకి యుండెనా యామె సంకల్పము లేకయే యగ్నిని దాఁకిన మిడుతయై యుండును. వాని తపస్సుచే నట్లు గాలేదు. ఏలందురా? దాని విషయమున నప్పు డామె కోపించినది కాదు. ఆమె కోపమే తెచ్చుకొనెనా యా కోపముచేయు పనిని నగ్నిహోత్రుఁడు మనము చేతితోఁ దాఁకినను జేయఁజాలఁడు. అగ్నిహోత్రుఁడు రావణాసురుని కొంపకాల్పఁ గలిగెను గాని సీతాదేవి యుండు చెట్టును గాల్పఁగలిగెనా? సీతాదేవి రావణుని దాన్నై ప్రత్యక్షముగఁ జెఱుపరాదని సంకల్పించి యున్నది. కావున వాఁడు జీవించి యున్నాఁడు.

చ. జరిగిన దేమొ చెప్పితిని ♦ జాంబవదాదుల సమ్మతిఁ గృపా
భరణము రామచంద్రుఁ గన ♦ భావ్యము జానకిఁ దెచ్చి, రావణుఁ
బరిజనయుక్తు నే నొకఁడ ♦ పట్టి వధింపఁగఁ జాలుదుఁ వనే
చరవరులార! మీరలును ♦ సాయము వచ్చినఁ జెప్ప నేటికిఁ? ౧౩౨౧

తా త్ప ర్య ము.

లంకలో జరిగిన వృత్తాంతము నంతయుఁ జెప్పితిని. ఇఁక జరుగవలసిన దేమో యాలోచింపుఁడు. నా యభిప్రాయమున జాంబవంతుఁడు మొదలగువా రంగీకరించిన యెడల సీతాదేవిని దెచ్చి రాజశ్రేష్ఠుఁడగు రామచంద్రమూర్తిని మనము చూడఁ బోవుట బాగు. ఆమె యిక్కడ దుఃఖించు చుండుట, ఆ వార్త చెప్పిన రామ చంద్రమూర్తి యక్కడ దుఃఖించుట, దానిని మనము బేదలవలెఁ జూచుచుండుట సరిగాఁ దోపలేదు. రావణుని వాని పరివారమును నే నొకఁడ నే చంపఁగలను. ఇఁక మీరుకూడఁ దోడైతిరా చెప్పవలసిన పనియేమిలేదు. మిగుల సులభముగ

గార్యమగును. మనము రావణుని జంపి సీతను దెచ్చితిమేని రామచంద్రునకపకీర్తిఁ రాదా యందురేమో-రాదు. సేవకులు కార్యము చేసిన ప్రభువు కీర్తి పొందును గాని, సేవకులు చేయవలసిన కార్యముకూడ ప్రభువు చేయవలయునా? సేవకులకు సాధ్యము కానిది ప్రభువు చేయవలెను. అన్నియుఁ బ్రభువే స్వయముగఁ జేసికొనునేని సేవకులతోఁ బనియేమి? ఈ కార్యము మనవలన నగునా యందురేమో.

క. శూరులుఁ గృతాస్త్రులును గడు,వీరులుఁగృతమతులుమఱియు♦విజయైషులు దు
ర్వారబలయుతులుఁ బ్లవగులు, మీరలు బాసటఁగ లంక ♦ మీటనె దివికిన్!

అర్థములు. కృతాస్త్రులు = అస్త్రములను దెలిసినవారు, కృతమతులు = చక్కని బుద్ధి యాలోచనము గలవారు-విజయైషులు = గెలుపుకోనఁ గోరిక గలవారు. దుర్వార బలయుతులు = వారింపరాని బలముతోఁ గూడినవారు, ప్లవగులు = ఈ సముద్రమును దాఁటగలవారు. (౨) ప్లవగులారా యని సంబోధనముగనైన గ్రహింప వచ్చును. బాసటగ = తోడుపడఁగ.

తా త్ప ర్య ము.

మీరందఱు శూరులు, అస్త్రజ్ఞానము గలవారు, మిగుల వీరులు, బుద్ధిమంతులు, జయముఁ గొనఁ గోరిక కలవారు, వారింపరాని బలముగలవారు, దాఁటశక్తి గలవారు. ఇట్టి మీరు తోడై వచ్చెద రేని లంక నాకాశమున కెగరఁ జిమ్మనా.

సీ. సహపుత్రు సానుజు ♦ సైన్యసమేతుని, రావణు నొకఁడ సం♦గ్రామమునను
బోరిపుచ్చ నేర్తును ♦ హరిహయజిత్తుని, బ్రాహ్మ మైంద్రంబును♦ రౌద్రవారు
ణాద్యస్త్రముల నెల్ల ♦ హననంబుఁ జేసెద, నందఱుఁగాని మ్మ♦టంటి రేని
నా కురిసెడి నిరం♦తర శైలవృష్టికి, నమరులు నిల్గుదు ♦ రసురు లెంత
ఆ. వనధి వేల దాఁటి♦వచ్చిన వచ్చును, మఱియు వణఁక వణఁక♦మందరంబు
గాని జాంబవంతుఁ ♦ గదలింపనేరదు, సంగరంబునందు♦శత్రుసమితి. ౧౨-౧౩

తా త్ప ర్య ము.

రావణుని కొడుకులతోఁ దమ్ములతో సేనలతో నే నొకండనే యుద్ధమందుఁ జంపఁగలను. ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రము-ఐంద్రాస్త్రము-రౌద్రాస్త్రము-వారుణాస్త్రము లోనగు వాని నెల్ల నాశము చేసెదను. ఇట్లు చేయుటకు మీ సమ్మతి గావలెను. మీ యంగీకారము లేమిని గదా యూరక వచ్చితిని. నేను రాలవాన గురియించితి నేని దేవతలు చత్తురు. రాక్షసు లేమి లెక్క? సముద్రము చెలియలి కట్టదాఁటి వచ్చిన రావచ్చును. మందరము వణఁకిన వణఁకును గాని జాంబవంతుని శత్రుసమూహము యుద్ధమునఁ గదలింప నేరదు.

సీ. అసురసంఘములఁ బే♦రైనవారిని జంపఁ,జాలు నొక్కరుఁడ యీ♦వాలిసుతుఁడు
పనసనీలుర జవ♦పటిమను నుగ్గగు, మందర మాశర♦బృంద మెంత

మైందద్వివిదులతో ♦ మార్కొనగలవారి, యక్షగంధర్వోరగాళి నైన
వ్రేల్వంచి యొక్కని ♦ వెదకి చెప్పుడు చూత. మే నెఱింగిన యంత♦లోన లేడు
ఆ. బ్రహ్మవరముఁ గన్న ♦ పరమబలాధికు, లమృత మానినార ♦ లాశ్వినేయ
గౌరవార్థముగను ♦ గమలసంభవుఁ డవ, ధ్యత్వ మిచ్చె వీర ♦ కనఘులార! ౧౩౨౪

తాత్పర్యము.

ఆ రాక్షసుల గుంపులోఁ బ్రసిద్ధమైన వారి నెల్ల నీ యంగదుఁ డొక్కఁడే చంపఁగలఁడు. పనసుని, నీలుని, వేగాతిశయమునకు మందరమైనను జూర్ణమగును. రాక్షసు లగుట చెప్పనేల? మైంద ద్వివిదులతో నెదిరించి పోరగల వారిని యక్షు లందు గంధర్వులందు పన్నగులందుఁ గలరేమో వెదకి చెప్పుఁడు. నాకుఁ దెలిసినంతలో లేఁడు. వీరు బ్రహ్మవరముచే బలవంతులు. అమృతమును ద్రావినారు. అశ్వినీ దేవతల గౌరవార్థము వీరికిఁ జావు లేకుండ బ్రహ్మ వర మిచ్చెను.

క. వరగర్వంబున వీరలు, సురవరసంఘముల గెల్చి ♦ సురఁ గ్రోలిరి యా
శరవిసరముఁ జీరికిఁ గొం,దు రె యంద ఱటుండ నిండు ♦ దోర్దర్పఘనుల్. ౧౩౨౫

తాత్పర్యము.

తక్కిన బలవంతులమాట యటుండనిండు. వీరు వరగర్వముచే దేవతా సమూహముల గెల్చి యమృతమును ద్రావిరి. ఇట్టి వీరు రాక్షసులను లక్ష్యపెట్టుదురా.

క. లంకాపుర మెల్ల, నిరా,తంకంబుగఁ గాల్చి బూడి♦దం జేసితి ని
శ్శంకంబుగ నామంబుల, బింకంబుగ నెల్ల యెడలఁ ♦ బేర్కొంటిఁ జుడీ. ౧౩౨౬

అర్థములు. నిరాతంకంబుగన్ = నిర్భయముగ.

తాత్పర్యము.

నిర్భయముగ లంకాపట్టన మంతయుఁ బూడిద యగువఱకుఁ గాల్చితిని. సందేహము లేకుండ పేర్లను అన్నితావులఁ జెప్పితిని. ఏమి చెప్పితి వందురా.

చ. జయము జయంబు రామునకు ♦ సారపరాక్రమధన్యమూర్తికిన్
జయము జయంబు విద్విషద♦సహ్యతరస్వి సుమిత్రపట్టికిన్
జయము జయంబు దాశరథి ♦ సంపరిపాలిత కీశభర్తకా
యయమతి సూర్యసూతికి మ♦హాద్భుత విక్రమ కీర్తిశాలికిన్. ౧౩౨౭

తాత్పర్యము; చూడుడు, ౧౦౩౪-౧౦౩౫.

క. కోసలరాజేంద్రునకున్, దాసుఁడ హనుమత్సమాఖ్యుఁ ♦ దనరినవాఁడన్
నే సుతుఁడ మారుతున కని, వాసిగ నెల్లరును వినఁగఁ ♦ బలికినవాఁడన్. ౧౩౨౮

తాత్పర్యము.

నేను శ్రీరామచంద్రమూర్తికి దాసుఁడను. నా పేరు హనుమంతుఁడు. నేను వాయుపుత్రుఁడను అని యందఱు వినునట్లు చెప్పి వచ్చినాఁడను గాని రహస్య వ్యాపార మేమియు లేదు.

—♦ హనుమంతుఁడు కపులకు సీతాదేవి స్థితిని దెలుపుట ♦—

క. అనుపమశీలవతీమణి, వనజాంబక ఖలు నశోక♦వని శింశప నీ
డను దుఃఖించుచు నున్నది, మన మెరియదె యామెపాటు♦ మదిస్మరియింపన్.

అర్థములు. అనుపమశీలవతీమణి = అసమానమైన పతివ్రతలలో శ్రేష్ఠురాలు–దీనిచే నామె గుణము చెప్పఁబడెను. వనజాంబక=కమలము వంటి కన్నులు గలది– దీనిచే నామె సౌందర్యము చెప్పఁబడెను. ఇట్లు గుణము, రూపము రెండు చెప్పఁబడెను. ఖలు=దుష్టుఁడగు రావణుని యొక్క– ఎరియదె=మండదా?

తాత్పర్యము.

గుణమునందు పరమపతివ్రతలలో నాయకమణి–సౌందర్యమునందా కమలములవంటి కన్నులు గలది. ఇట్లుత్తమ గుణము, ఉత్తమ రూపము గలది. శిష్టుఁడు గాఁడు. దుష్టుఁడగు వానియొక్క మేడలలోఁగాదు. అశోకవనములో. ఫలవృక్షము గాదు. ఇరుగుడు చెట్టునీడ దుఃఖించుచుండఁదగినదా? అది జ్ఞప్తికిఁ దెచ్చుకొనిననే నా మనస్సు మండిపోవుచున్నదే. ఇఁక మీరు చూచియుండిన నేమై యుందురో. ఎంతో రాతిగుండెవాఁడను గావున నిబ్బరించుకొనితిని. నే నింత దూరమొత్తి చెప్పుట కిది కారణము.

క. దానవతరుణీవృతయై, జానకి వారిదవిలీన♦శశిలేఖ యనన్
దీన యయి కాంతి దొఱఁగియు మానసమున సరకు గొనదు♦ మానవభోజిన్.

అర్థములు. దానవ తరుణీవృతయై=రాక్షసస్త్రీలచేఁ జుట్టఁబడినదై, వారిద విలీన=మేఘముచే మఱుఁగు పఱుపఁబడిన, శశిలేఖ=చంద్రరేఖ.

తాత్పర్యము.

రాక్షస స్త్రీలచేఁ జుట్టుకొనఁ బడుటచే మబ్బుచే మాటువడిన చంద్రరేఖ వలెఁ గాంతిహీన యయి శోకించుచుండియు సీతాదేవి యా రావణుని మనస్సునందు లక్ష్యము సేయదు.

తే. ఆత్మనాయకునందు నే♦కాగ్రవృత్తిఁ, జిత్తమును నిల్పి నిర్జర♦సత్తముపయి
నల పులోమజ యట్టుల♦యధికరక్త,యగుచు శ్రీరాము ధ్యానించు♦ననవరతము.

అర్థములు. నిర్జరసత్తముపయి = ఇంద్రునిమీఁద, అధికరక్త = మిక్కిలి యనురాగము గలది.

తాత్పర్యము.

ఇంద్రునియందు శచీదేవివలెఁ దన భర్తయందు నేకాగ్రమైన మనోవ్యాపారముచే మనస్సును నిలిపి యనురాగము గలదై సీతాదేవి సర్వదా శ్రీరామచంద్రమూర్తిని ధ్యానించుచున్నది.

ఉ. మాసిన యొంటిచేరను దు♦మారమునం దను వెల్ల బ్రుంగ సీ
తాసతి దుఃఖభారవశ♦తం దపియించుచుఁ బ్రాణనాథుపై

నాసను రక్కసుల్ బెదరు • లాడఁగ వ్రేలెడు నొంటివేణితో
గాసిని గుందెడిం, దలంపఁ • గాఁ గడుపెల్లను మండిపోయెడిన్. ౧౩౩౨

అర్థములు. క్రుంగన్ = మునుఁగఁగఁ, దుఃఖభారవశతన్ = అధిక దుఃఖమునకు లోఁబడి, రక్కసుల్ = రాక్షసస్త్రీలు.

తాత్పర్యము.

మాసిన యొంటి కట్టుచీరతో నుత్తరీయమైన లేక, దుమ్ములో మునిఁగి దుఃఖాతిశయముచేఁ దపించుచు సీతాదేవి భర్తను జూడఁగలనను నాశచే రాక్షసస్త్రీలు బెదరింపు మాటలను చెప్పినను వ్రేలాడు నొంటిజడతో మిగుల శ్రమపడి దుఃఖించుచున్నది. అది తలఁపునకు వచ్చిన కడుపు మండుచున్నది.

ఉ. చూడఁగ గుండె ఝల్లుమను • సోకునెలంతలు భీతిగొల్పఁ ద
న్నాడఁగ, వల్లభా! యనుచు • నాతనిసేమముఁ గోరి దీనయై
వాడి దురంతశోకమున • వ్రాల ధరాస్థలి దుష్టరాక్షసా
క్రీడమునందుఁ గంటిఁ గలి • కిం జలికారున తూఁడుఁ బోలఁగన్. ౧౩౩౩

అర్థములు. సోఁకు నెలంతలు = రాక్షసస్త్రీలు - ఆక్రీడము = ఉద్యానవనము - చలికారున = మంచుకాలమందు - తూఁడనన్ = తామర తూఁడువలె.

తాత్పర్యము.

చూచిన మాత్రము చేతనే గుండెలు ఝల్లనిపించు వికారరూపములు గల రాక్షసస్త్రీలు తన్ను భయపెట్టు మాటలాడఁగా నాథా యనుచు నాతని సేమము గోరి దుఃఖించుచు వెలవెలఁ బాఱిన ముఖముతో తేజస్సు మాసి నేలఁబడియుండఁగా రాక్షసుని యుద్యానవనమందు సీతాదేవిని మంచుకాలమునాఁటి తామరతూఁడువలె నుండు దానిని జూచితిని.

ఉ. వచ్చెడిజాడ లేదు నృప • వల్లభుఁ డీయెడ, కీ సురారినిన్
నచ్చఁగ రాదు, వానివల • నం జెడ నొల్లను, గాన నిప్పుడే
చచ్చుట మే లటంచును భృ • శంబుగ నిశ్చితచిత్తయైన యా
సచ్చరితాగ్రగణ్య కొక • చందమున న్మది నమ్మఁ బల్కితిన్. ౧౩౩౪

తాత్పర్యము.

రామచంద్రమూర్తియిచ్చటికి వచ్చుమార్గము కనఁబడ లేదు. రావణాసురుని నమ్మరాదు. ఎప్పుడు చంపునో యేమో. వానివలనఁ జచ్చుట నా కిష్టము గాదు. కావున నీ పాపాత్మునిచేతఁ జచ్చుట కంటె నా యంతట నేనే యిప్పుడే చచ్చుట మేలని దృఢ నిశ్చయము గల యాపతివ్రతా శిరోమణికి నే నేదో యొకవిధముగా నమ్మఁబలికితిని.

క. ముచ్చటలను సర్వార్థము, లచ్చపలాక్షికిని జెప్ప • నగచరపతితో
నచ్చపుఁ జెల్మి హృదీశున, కచ్చుపడుట కబ్జనేత్ర • హర్షంబందెన్. ౧౩౩౫

తా త్ప ర్య ము.

సీతాదేవి యనెను. సంభాషించునపుడు అన్ని విషయములామెకుఁ జెప్పఁగా వానరరాజుతో శ్రీరామచంద్రమూర్తికి మైత్రి కుదిరిన దానికి సీతాదేవి మిగుల సంతోషించెను.

ఉ. ఆమె మహానుభావతను ♦ నామె యతుల్య పతివ్రతంబునం
దామసుఁడైన యా యసుర ♦ నాయకుఁ డింతకుఁ జాక తక్కుటన్
భూమి మహాత్ముఁడే యనఁగఁ ♦ బోలును, వానిని రూపు మాపఁగా
రాముఁడు సంగరస్థలిని ♦ గ్రాలఁ గలండు నిమిత్తమాత్రమై. ౧౩౩౬

అర్థములు. మహానుభావతను = మాహాత్మ్యముచేత, అతుల్య పతివ్రతంబునన్=అసమానమైన పాతివ్రత్యముచేతను తామసుఁడు = విశేషముగఁ దమోగుణము గలవాఁడు, చాక=చావక, తక్కుటన్ = మిగిలి యుండుటచే, నిమిత్తమాత్రము-కుమ్మరవాఁడు కుండలఁ జేయుటయందు మన్ను ఉపాదానము, కుమ్మరి నిమిత్తము — అట్టులే రావణవధయందు రామచంద్రమూర్తి నిమిత్త మగుచున్నాఁడు. ఆయనచే నా పని చేయించు కారణము సీతాదేవి యగుచున్నది. ఆమె స్వయముగా రావణుని జంపెనేని వీరపత్ని యను పేరు రాదు అగస్త్యభ్రాత యన్నట్టులాయనకు సీతాపతియని పేరు వచ్చును. అది యాయనకు నవమానకరము. కావున భర్తచేతనే రావణుని జంపించి యాకీర్తి యాయనకు వచ్చునట్లు చేసి యిటువంటి వాని భార్య యనిపించుకొన వలె నని యా యమ వ్రతము. కావున నామెయే చంపలేదు, గాని శక్తి లేక కాదు. దీని వలన స్త్రీలు శక్తిమతులైనను బురుషులు చేయఁదగు కార్యములు తాము చేయఁగలిగి యున్నను మగలకుఁ దోడుపడి వారిచేఁ గార్యము చేయింప వలయును. గయ్యాళిగంగమ్మలై మగవారికపకీర్తివచ్చువిధముగ వారి సమ్మతిలేక వ్యవహరింప రాదని యేర్పడుచున్నది.

తా త్ప ర్య ము.

ఆమె మాహాత్మ్యము చేతను అసమాన పాతివ్రత్యముచేతను తామసుఁడైన రావణుఁడు చచ్చి దుర్మరణము పాలుగాకుండుటచే మహానుభావుఁడే యనఁదగు. వానిని చంపుటయందు యుద్ధమున రామచంద్రమూర్తి నిమిత్తమైయున్ని కార్యములాయనయే చేయఁగలఁడు. ఆ కారణమున నామె వానిని శపింపక యూరకున్నది.

తే. సహజముగ సీత తన్వంగి ♦ సాధులార!
యందుఁ దా భర్తృశోకతా ♦ పార్దిత యయి
పాడ్యమిని బఠియించెడి ♦ వాని చదువు
పగిదిఁ గృశియించి యున్నది ♦ ప్రభ దొలఁగి. ౧౩౩౭

అర్థములు. తన్వంగి=తను+అంగి = సన్నని దేహము గలది, భర్తృశోక తాప+అర్దితయయి=మగని విడిచిన శోకమువలనఁ గలిగిన తాపముచే బాధపడి.

తా త్ప ర్య ము.

సాధులారా! సీతాదేవి సహజముగ సన్నని దేహము గలది. అం దిప్పుడు మగని విడిచి యుండుట వలనఁ గలిగిన శోకబాధచేఁ బాడ్యమినాఁడు చదువువాని చదువువలె క్షీణించి యున్నది.

తే. సీత యీ రీతి లంకలోఁ॥జిక్కి-న వసి
గోడు గుడుచుచు నున్నది॥పాడి యరసి
దానికిని మాఱు సేయంగఁ॥దలఁప రయ్యె
యనినఁ దారాతనూభవుఁ॥డనియె నిట్లు. ౧౩౩౮

అర్థములు. పాడి=ధర్మము.

తా త్ప ర్య ము.

సీతాదేవి యీ విధముగ లంకలో బాధపడుచు శుష్కించి యున్నది. దీనికి ప్రతిక్రియ యేమి చేయుట న్యాయ్యమో యాలోచింప వలసినది. అనఁగా నంగదుఁ డిట్లనియె.

—॥ { ౬౦-వ సర్గము. అంగదుఁడు సీతాదేవిని దోడ్కొ-ని వచ్చుటకు సమ్మతించుట. } ॥—

ఉ. దంటలు మీరు శౌర్యమున॥దానవదేవభుజంగ పాళులన్
జంటలు లేరు మీకుఁ బ్లవ॥నంబున, నిట్టిరు రిత్తకేల వా
ల్గంటులమిన్న లేక చనఁ॥గార్యమె! రాముని జేరి జానకిన్
గంటిమి, తోడితేర; మనఁ॥గాఁ దగునా మిమునంతవారికిన్? ౧౩౩౯

అర్థములు. దంటలు=సమర్థులు- జంటలు=సమానులు; ప్లవనంబునన్ = దాఁటుటయందు- రిత్తకేల=ఉత్తచేతులతో- వాల్గంటులమిన్న = స్త్రీరత్నము - తోడితేరము=పిలుచుకొని వచ్చినవారము గాము.

తా త్ప ర్య ము.

శౌర్యమునందు మీరు సమర్థులు- దానవులందు దేవతలందుఁ బన్నగులందు దాఁటుటయందు మీకు సమానులు లేరు. ఇట్టివా రుత్తచేతులతో సీతఁ దేక పోవుట తగునా యాలోచింపుఁడు. పోయి సీతను జూచితిమి, పిలుచుకొని రా లేదని మీ యంతటి వా రనవచ్చునా?

ఉ. వీరుఁడు గాడ్పుపట్టి హత॥వీరముఁ జేసె సురారివారమున్
గారియ మన్య మేమి గలు॥గం గల? దుర్విజఁ దెత్త మన్న నా
వీరుని జాంబవంతుఁడు సు॥విశ్రుతశౌర్య! భవత్సమీహయున్
దీరగు, నైన రాఘవు మ॥తిం జనఁగాఁ దలపోయుమీ యనన్. ౧౩౪౦

అర్థములు. హతవీరము = చచ్చినవీరులు గలది- కారియము = పని - భవత్సమీహయున్ = నీ యాలోచన కూడ- తీరగున్ = చక్కఁగానే యున్నది.

తా త్ప ర్య ము .

వీరుఁడు హనుమంతుఁడు లంకలోని వీరులఁ జంపివచ్చెను. ఇఁక మన మచ్చటికిఁ బోయి చేయఁదగిన కార్యము సీతను దెచ్చుట తప్ప మఱి యేదియు లేదు. కావున మనము పోయి సీతను దెత్త మనఁగా జాంబవంతుఁడు ప్రసిద్ధకార్యము గల యంగదా! నీయాలోచన బాగుగనే యున్నది కాని రామచంద్రమూర్తి యభిప్రాయము తెలిసికొని యాయన యెట్లు చెప్పిన నట్లు చేయవచ్చును. ఆ విధముగ నాలోచింపుమని చెప్పఁగా.

—♦౬౧— సర్గము. కపులు కిష్కింధకుఁ బోవుమార్గమున మధువనంబుఁ జూచుట.♦—

క. సరి సరి యని రంగదకే,సరిసూనులు నున్నవారు♦శాఖామృగముల్
పరమమతి వాయుజపుర,స్సరము మహేంద్రాద్రిఁ బాసి♦చయ్యనఁ జనగన్.

అర్థములు. ఉన్నవారు = తక్కినవారు, వాయుజపురస్సరము = హనుమంతుఁడు ముందుగాఁ గలది.

తా త్ప ర్య ము .

అంగదుఁడు హనుమంతుఁడు తక్కిన వానరులు ఈ యాలోచన బాగున్నది, బాగున్నదని యంద అంగీకరించిరి. అంతట నందఱు హనుమంతుని ముందుంచుకొని మహేంద్ర పర్వతము విడిచి పోఁగా.

సీ. మేరుమందరసముల్♦భూరిగజాభులు, మార్తండపథ మెల్ల♦మాటుపఱచు
నట్టులు వ్యాపించి♦యాంజనేయునిఁ దమ, దృష్టులచే వహి♦యించునట్లు
కనురెప్ప వెట్టక♦కాంచుచు నాతనిఁ, గొనియాడుచును స్వామి♦పనిని దీర్చి
నార మన్మోదమున♦వారక ప్రియభాష,ణంబును జేయు చ♦నన్యచిత్త
ఆ. వృత్తి యుద్ధమునకు♦వేడుక సేయుచు, రామసాహ్యమునకు ♦ రాగపడుచు
మింటనేఁగి కనిరి♦కంటికిఁ బండువౌ,మధువనంబు మిగుల♦మంజులంబు. ౧౩౮౨

అర్థములు. భూరిగజాభులు = పెద్ద యేనుఁగులతో సమానులు - అనన్యచిత్తవృత్తి=ఇతరాలోచన లేక- మంజులంబు=అందమైనది.

తా త్ప ర్య ము .

మేరుపర్వతముతోను మందరపర్వతముతోను, సమానమైన యెత్తుగలవారును, పెద్దయేనుఁగులవలె బలసినవారునునగు వానరులుఆకాశమును మఱుఁగు పఱుచునట్టులు వ్యాపించి యాంజనేయుని తమ దృష్టులచే మోచికొని పోవుచున్నారా యను నట్లు ఱెప్పలార్పక తమ చూపులాయనమీఁదనే యుంచి యాయనను బొగడుచు స్వామికార్యమును నెఱవేర్చితిమను నధిక సంతోషమున ప్రియములైనమాటలాడుచు యుద్ధము చేయుటయందే తమ మనస్సులు నిలిపి దానికై యుత్సాహపడుచు రామచంద్రమూర్తికి నెప్పుడు సాహాయ్యము చేయుదుమా

చేయుదుమా యని దాని యందాసక్తి గలవారై యాకాశమునఁ బోవుచు మార్గమునఁ గంటికింపై యందమైన మధువనంబుఁ జూచిరి. మహేంద్రపర్వతమునకు లంకకుఁ గల దూరమునకంటె మహేంద్ర పర్వతమునకుఁ గిష్కింధకు నెక్కువ దూరము గలదు. అట్టు లుండియు నందఱు వానరు లాకాశమున నెగిరి వచ్చినవారే. సముద్రము దాటు విషయమున నందఱు వెనుకంజ వేసినారే. ఈ విషయము కిష్కింధాకాండమునఁ జర్చితము.

ఉ. నందనసన్నిభం బయి య♦నంత ముదావహమై ద్రుమావళీ
సుందరవల్లరీనికర♦శోభితమై సకలాప్రధృష్యమై
యందము మీఱఁగా దధిము♦ఖాఖ్యుఁడు సూర్యజు మేనమామ దా
నందు వసించి కాచు నెపు♦డర్కజముత్కర మద్ది గావునన్. ౧౩౪౩

అర్థములు. నందన సన్నిభము = ఇంద్రుని నందనోద్యానముతో సమానము- అనంత ముదావహము=అపరిమిత సంతోషమును గలిగించునది. ద్రుమావళీ= చెట్లవరుసల చేతను- సుందర వల్లరీనికర = అందమైన తీఁగల సమూహము చేతను-- శోభితమై=ప్రకాశించునదియై- సకలాప్రధృష్యమై = ఎట్టివారికిఁ జెఱుపనసాధ్యమై- అర్కజముత్కరము=సుగ్రీవునకు సంతోషకరము.

తాత్పర్యము.

ఇంద్రుని నందనవనముతో సమానమై-యపరిమిత సంతోషము గలిగించునదియై, చెట్లవరుసలచేతను, అందమైన తీఁగల గుంపులచేతమ బ్రకాశించునదియై యెట్టివారికినిఁ జెఱుపరాని దైన యా మధువనమును సుగ్రీవుని మేనమామ దధిముఖుఁ డనువాఁడు అందే కాఁపురముండి సుగ్రీవున కది సంతోషకరము గావునఁ గావలి కాచుచుండును.

క. దానిం గని క్రోఁతులు మధు, వానం దమకించి కొమరు♦నంగదు వేఁడన్
లోనం జన నిమ్మన యతఁ, డౌననఁ గపివృద్ధవిధిజు♦లామోదింపన్. ౧౩౪౪

అర్థములు. మధువు = తేనె- ఆనన్ = త్రాగుటకు- తమకించి = త్వరపడి - కొమరున్ = కుమారుని - కపివృద్ధవిధిజులు = వానరులందుఁ బెద్దవారు, జాంబవంతుఁడు; ఆమోదింపన్ =అంగీకరింపఁగా.

తాత్పర్యము.

ఆ వనమును జూచి క్రోఁతులు తేనెఁ ద్రావఁ దొందర గలవారై యువరాజగు నంగదుని మమ్ము లోపలికిఁ బోనిమ్మని ప్రార్థింపఁగా దానిని పెద్దవానరులు, జాంబవంతుఁడు నంగీకరింపఁగా నాయన సరి పొమ్మని చెప్పెను.

—♦ కపులు మధువనంబుఁ జొచ్చుట. ♦—

క. యువరాజనుమతి సేయఁగ, నవనీరుహచారు లెల్ల♦హర్షరసావే
శవివశులై నృత్యంబుల, వివిధంబులుగాఁగఁ జలిపి♦వెసఁ జొచ్చి వనిన్. ౧౩౪౫

అర్థములు. అవనీరుహచారులు = వానరులు - హర్షరసావేశవివశులై- సంతోషరసము ఆవేశించుటచే దేహములు తెలియనివారై.

తాత్పర్యము.

లోపలికిఁబొండని యవరా జంగీకరింపఁగా వానరు లందఱు సంతోషముచే దేహములు దెలియక నానావిధముల నృత్యములు చేసి లోపలఁ బ్రవేశించిరి.

మాలిని. ఆడెడువారును వేఁడెడువారును ♦ హాయిగఁ బాడెడివారును నై
ఏడెడివారును గూడెడివారును ♦ వేడుక లాఁగులు వేసెడు వా
రోడెడువారును గూలెడివారును ♦ నూఁగెడివారును మీసముల౯
దీడెడువారును దాఁటెడువారును ♦ దేఁకెడివారును నైరి కపుల్. ౧౩౪౬

తాత్పర్యము.

స్పష్టము.

సీ. కొనకొమ్మనొక్కటి♦క్రోఁతియొక్కండూఁచి, పెఱకొమ్మమీఁదఁగు♦ప్పించియొగసె
శాఖ యొక్కటినుండి♦సరగున నిల దూఁకి, గొబ్బున వేఱొక్క♦కొమ్మకెగిరెఁ
బైకొమ్మపైనుండి♦పడుచుఁ గ్రిందికొమ్మను,నొక కేలఁ గ్రహియించి♦యూఁగునొకఁడు
కొమ్మలలోఁ దాఁగి♦క్రోఁతియొక్కఁడు సేరఁ, దటుకునఁ బైపడి♦తఱుమునొకఁడు
ఆ. ఒక్కఁ డెక్కిరించు ♦ నొక్కరుఁ డిగిలించు
నొకఁడు కొక్కిరించు ♦ నొకఁడు కూయు
నొకఁడు కిచకిచ మను ♦ నొక్కఁడు గికురించు
నొకఁడు లాఁగు వేయ ♦ నొకఁడు లాగు, ౧౩౪౭

అర్థములు. కికురించు = మోసగించు - ఇగిలించు = పండ్లు వెళ్ళఁబెట్టు.

తాత్పర్యము.

స్పష్టము.

ఉ. పాడుచు నుండ నొక్కరుఁడు ♦ పైపడి నవ్వ నొకండు నవ్వుచో
నేడుచు చేగు వే ఱొరుఁడు ♦ నేడువ నొక్కఁడు వెక్కిరించుచు౯
జూడఁగఁబోవు నాతనిని ♦ సొంపు బలే యని కొక్కిరించుచు౯
గూడఁగఁ బోవు నాతనిని ♦ గ్రోతి మఱొక్కఁడు నవ్వుటాలకై. ౧౩౪౮

అర్థములు. నవ్వుటాలకై = నవ్వులాటకై.

తాత్పర్యము.

స్పష్టము-

క. ఈ విధి నిచ్చఁ జరించుచుఁ, ద్రావఁగఁ దేనియలు తృప్తి ♦ దనరనివాఁడు౯
వావిరి మత్తెక్కనివాఁ, డా వనచరసైన్యసమితి♦యం దరిది గనన్. ౧౩౪౯

అర్థములు. సమితి౯ = సమూహమందు.

తాత్పర్యము.

ఈ ప్రకారము యథేచ్ఛముగాఁ దిరుగుచుఁ దేనెలు ద్రాగి తృప్తిపడని వాఁడు, బాగుగ మత్తెక్కనివాఁడు ఆ వానర సేనలలో నొక్కఁడైన లేఁడు.

క. ఈ రీతి భాతి దీఱఁగ, నారామముఁ గలఁచి డులిచి ♦ యచ్చటిపండుల్
గోరంబుగఁ గూలిచి ద్రుమ,వారంబులఁ బెల్లు రేఁగి ♦ వానరు లున్నన్. ౧౩౫౦

అర్థములు. భాతి = కాంతి, డులిచి = పడగొట్టి, ద్రుమవారంబులన్ = చెట్లసమూహములను, గోరంబుగన్ = కనుటకు వెగటు పుట్టునట్లు-ఘోరశబ్దభవము.

తాత్పర్యము.

ఈ విధముగఁ గాంతి చెడునట్లు వనమును గలియఁబెట్టి, పండ్లు రాలఁగొట్టి చెట్ల సమూహములను చూచుటకు గోరముగ నుండునట్లు పడద్రోఁచి వానరులు చెలరేఁగి యుండఁగా.

—♦ దధిముఖుండు కపుల వారించుట. ♦—

క. ఇంతకు దధిముఖవానరుఁ, డెంతయుఁ గోపించి వనము ♦ నెటులేఁ గావన్
జింతించి వానరావళి, యంతికమున కేగి వారి ♦ నాఁపఁ గడంగెన్. ౧౩౫౧

అర్థములు. ఇంతకు = ఇంతపని చేసిన దానికి - ఎటులేన్ = ఏ విధముగనైనను-ఇట్లు చెప్పుటచే ముందు మంచిమాటల చేతను దరువాత బెదరింపు మాటల చేతను జెప్పిచూచెను గాని యది ప్రయోజనపడమిని దండోపాయము నాలోచించె నని భావము. అంతికమునకున్ = సమీపమునకు- ఆఁపన్=అడ్డగింప - కడంగెన్ = ప్రయత్నించెను.

తాత్పర్యము.

వానరు లింత పనిచేసిన దానికై దధిముఖుఁడు నయభయములఁ జెప్పి వ్యర్థము కాఁగాఁ గోపించి బలాత్కారముగ నైన వనమును రక్షింపఁ దలఁచి వారియొద్దకుఁ బోయి నివారింప యత్నించెను.

ఇంతవఱకు దూరముగా నుండి మాటలు చెప్పి పంపె నని భావము.

క. తిట్టెను గొందఱ వెలికి, నెట్టెను గొందఱకుఁ బలికె ♦ నీతులు కేలన్
గొట్టెను గొందఱఁ గొందఱ, మొట్టెను బిడికింటఁ గినిసి ♦ మునుకొని కపులన్.

అర్థములు. నెట్టెను=మెడపట్టి త్రోచెను.

తాత్పర్యము.

కొందఱఁ దిట్టెను. కొందఱ మెడపట్టుకొని తోఁటకు వెలుపలఁ ద్రోచెను. పెద్దవారికి నీతులు తెలిపెను. కొందఱను జేతితోఁ గొట్టెను. కొందఱఁ బిడికిలితో కోపించి మొట్టెను.

క. కొఱికిరి కొందఱు కోఱల, బఱికిరి గోళ్ళలను గాళ్ళ ♦ బడ నడిచి ధరన్
బఱబఱ యీడ్చిరి కరముల, నఱిముఱి మర్దించి విడిచి ♦ రా వనపాలున్. ౧౩౫౩

అర్థములు. అతిమురిన్ = త్వరతో.

తాత్పర్యము.

స్పష్టము.

క. కొందఱు ద్రోచిరి వానిని, గొందఱు దూషించి రధిక ♦ కోపంబున ని
ట్లందఱు బాధించుచు వా,నిం దరుచరు లా వనంబు ♦ నిర్మూలింపన్. ౧౩౫౪

స్పష్టము. తాత్పర్యము.

## ౬౨-వ సర్గము. అంగద హనుమంతుల ప్రాపులఁ గపులు మధు వనంబున నిచ్చకోలఁది సంచరించుట

క. అంతట హనుమంతుఁడు కపి,కాంతులతో మీరు తృప్తి ♦ గన నవ్యగ్ర
స్వాంతంబుల మధు వానుఁడు, చెంతలఁ జేరంగ నీను ♦ సిద్ధము పగతున్. ౧౩౫౫

అర్థములు. కపికాంతులతో = ముఖ్యవానరులతో - అవ్యగ్ర స్వాంతంబులన్ = చలింపని మనస్సులతో - పగతున్ = పగవానిని-తమ కార్యమునకు నడ్డము వచ్చుటచే పగవాఁడని చెప్పఁబడెను.

తాత్పర్యము.

దధిముఖుఁ డిట్లు వానరుల కడ్డము వచ్చుటయు వారికి వీరికిఁ గలహమందుఁ గాలము పోవుటయుఁజూచి హనుమంతుఁడు వానరముఖ్యులతో మీ రీ కలహమునకు కాలము గడుపవలసిన పని కాదు. ఈ పగవానిని మీ యొద్దకు రానీను. మీ రేకాగ్రచిత్తముల తేనె ద్రాగుఁడు.

సీ. హనుమంతుఁ డాడిన ♦ యా మాట లాలించి, యంగదుం డిట్లను ♦ హరివరేణ్యు
లార! యవశ్యకా ♦ ర్యం బకార్యంబైనఁ, గృతకృత్యుఁ డగు వాయు ♦ సుతుని పలుకు
ఇప్పుల్కుఁ గూర్చి నేఁ ♦ జెప్పంగవలయునే, తేనె గ్రోలుం డాస ♦ తీర ననిన
బళి బళీ యని మెచ్చి ♦ బలిముఖుల్ వెల్లువ,పోలెఁ జొచ్చిరి వన ♦ పాలకులను
తే. మొదలఁ దాఁచిరి త్రోచిరి ♦ మొగము పగుల
ద్రోణమాత్రము మధువు సం ♦ తోషముగను
నెల్లవారలుఁ ద్రావిరి ♦ కొల్లగాఁగఁ
గొన్నిటిని నేలఁ బగులంగఁ ♦ గొట్టి రపుడు. ౧౩౫౬

అర్థములు. అకార్యంబైనన్ = చేయరాని పనియైనను - అవశ్యకార్యము = తప్పక చేయవలసినపని ; తాఁచిరి = కొట్టిరి - ద్రోణమాత్రము = తూము కొలఁత-ద్రోణశబ్దము దేశవ్యవహారానుసారముగ తూమునకు-ఇద్దుమునకు-నలుతుమునకుఁ బేరు. 'అస్త్రియా మాఢక ద్రోణౌ' యని యమరము.

తాత్పర్యము.

హనుమంతుఁ డీ ప్రకారము చెప్పఁగా నాయనమాటలు విని యంగదుఁ

డిట్లనియె. వానరశ్రేష్ఠులారా! స్వామికార్యము నెఱవేర్చిన హనుమంతుఁడు చేయరానిపని చెప్పినను జేయఁదగినదే. ఇఁక నీ కార్యము గుఱించి యడుగనేల? మీయాశతీరఁ దేనఁ ద్రాగుఁడనిన బళిబళీ యని మెచ్చి యంతకు ముందు దధిముఖుని మాటలకు తోఁట వెలుపలఁబోయిన వారు లోకసారిగ వెల్లువవలెలోపలఁ బ్రవేశించి తోఁట కావలివారిని మొట్టమొదటఁగొట్టిరి. ఆవల నేలఁబడి ముఖముపగులఁ ద్రోచిరి. తూముమాత్రము తేనెకొల్లలుగ ద్రావిరి. కొన్ని తేనెతెట్టలను నేలవైచి పగులఁగొట్టిరి.

క. నైసర్గికబలమునఁ బృ, థ్వీసుతఁ గనుఁగొనుట వార్త♦వినుటను మఱి తా
రాసుతు ననుమతిఁ దేనియ, నాసలు దీరంగఁ ద్రావి♦రగచరు లెల్లన్. ౧౩౫౭

అర్థములు. నైసర్గిక బలమునన్ = సహజముగఁ గలిగిన బలముచేత-పృథ్వీసుతఁ గనుగొనుట - వార్త వినుట. దీని నొకటిగా నైన గ్రహింపవచ్చును, రెండుగానైన విభజింపవచ్చును. తమలోనొకఁడు సీతను జూచినను నందఱుచూచి నట్లే. దక్షిణమునకుఁ బోయిన కపులు సీతను జూచి రను పేరు వచ్చును గదా-వార్తవినుట=ఆ వృత్తాంతమువినుట - లేక సీతాదేవిని జూచిన వార్తవినుట యని యేకముగాను గ్రహింపవచ్చును. లేక హనుమంతుఁడు చూచుట-వానరులువినుట యని యైన గ్రహింపనగు. సంతోషమునగము బలము గావున సంతోషమువలనఁ గలిగిన బలము, నైసర్గికబలము, యువరాజాజ్ఞ గల దను ధైర్యమునఁ గలిగిన బలము, అన్నియుఁ జేరె నని భావము.

## తాత్పర్యము.

స్వభావసిద్ధమైన బలముచేతను, సీతాదేవిని జూచుట - వార్తవినుటవలనఁ గలిగిన యుత్సాహము చేతను, అంగదుఁ డనుమతించుటచేతను, గ్రోఁతులందఱు నాశ దీరఁ దేనెఁ ద్రావిరి.

సీ. కొందఱు మధువాని♦కొంత పాఱఁగ వైచి, మైనపుటుండల♦మూఱుకొనిరి
కొందఱు కైపెక్కి♦కొమ్మలఁ జేబూని, యాకు సెజ్జలఁ బడి♦రాద మఱచి
మత్తునఁ గడు వేఁదు♦ఱత్తినపోలికిఁ, ద్రోపు లాడిరి కొంద♦ఱేపు చెలఁగఁ
గొందఱు గర్జింత్రు♦కొందఱు నిద్రింత్రు, కొందఱు కిలకిల♦కూయు చుందు
ఆ. రేమొ యేమొ చేసి ♦ హిహిహి యందురు గొంద
ఱేమొ యేమొ చేసి ♦ యెగిరి కొంద
ఱేమొ యేమొ చేసి ♦ యెలమిఁ జెప్పిరి కొంద
ఱేమొ యేమొ చేయ ♦ నెంచి రపుడు. ౧౩౫౮

అర్థములు. మధువుఆని = తేనెఁద్రావి - మైనము + ఉండ = మైనవు టుండ-ఉండ = ఉంట-కైపు = మత్తు - సెజ్జ = శయ్యాశబ్దభవము. ఆదమఱచి= దేహము తెలియక - తమ్ముఁ దాము మఱచి-వేదుఱు=పిచ్చి - ఏమొ+ఏమొ=

ఆమ్రేడితము పరమగుటచే సంధి గలసి ఏమేమొ కావలసి యుండినను ఏమి-ఏమ్యాదులలోఁ జేరుటచే సంధి వైకల్పికము గావున నిచట సంధి గలుటలేదు. అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱుచుగ నగు- సు. వ్యా. సం. ౧౭. ఏమొయేమొయనునవియశ్లీలమగుటచేఁ జెప్పరానిక్రోఁతిచేష్టలనిగ్రహింపనగు. గర్జింత్రు= నిద్రింత్రు- రువర్ణకంబు పరంబగునపుడు సున్నమీఁది తదడల యుత్వంబునకు లోపంబు విభాష నగు. సు. వ్యా. క్రియ- ౭౨ సూ. గర్జింత్రు=గర్జింతురు — ఈ రూపములు ముందు నిండుసున్న యుండిననే యగును గాని యది లేనిచో గావు. ఇట్లు చెప్పుటచే మానుద్రు- చూచుద్రు. ఇత్యాది రూపము లసాధువులు.

తా త్ప ర్య ము.

స్పష్టము.

ఉ. వానరవర్గముల్ వడెడి♦పాట్లు గనుంగొని కిన్కమై మధూ
ద్యానము రక్షకుల్♦దధిముఖానుచరుల్ వెస రాఁగ వారలన్
జానుల ముష్టిఘాతములఁ♦జావఁగ మోదుచు దేవమార్గమున్
గానఁగఁ జేయ భీతిగొని♦క్రచ్చఱఁ బాఱిరి నేత యొద్దకున్. ౧౩౫౯

అర్థములు. మధు+ఉద్యానము = మధువనము- దధిముఖానుచరుల్ = దధిముఖుని వెంటనుండు సేవకులు- వెసన్ = త్వరగ- జానులన్ = మోఁకాళ్ళ. చేతను, ముష్టిఘాతములన్=పిడికిలి గ్రుద్దుల చేతను- దేవమార్గమున్ = అపాన వాయువు వెడలెడి మార్గము- ఉపనిషత్తులందు వాయులోకమును దేవలోక మని చెప్పుటచే నిచ్చట దేవశబ్దము వాయువాచి యని తెలియునది. నేత=తమప్రభువు.

**తా త్ప ర్య ము.**

క్రోఁతుల గుంపులుచేయు చేష్టలు చూచి కోపముచే మధువనమున కావలి యుండు దధిముఖుని సేవకులు త్వరగా రాఁగా వారిని వానరులు మోఁకాళ్ళ గ్రుమ్మిరి. పిడికిళ్ళ గ్రుద్దిరి. చచ్చునట్లు కొట్టిరి. ముడ్డిచూపించిరి. ఇట్లు చేయుటచే వారు భయపడి తమ ప్రభువగు దధిముఖు నొద్దకుఁ బరువెత్తిరి.

ఉ. ఇమ్మెయి నేగి యా దధిము♦ఖేశ్వరుఁ గన్గొని వాయుపుత్రు సా
యమ్మున వానరాళి వన♦మంతయుఁ బాడొనరించి మమ్ములన్
గ్రుమ్మిరి జానుదేశముల♦గ్రుద్దిరి ముష్టుల, వెండి దేవమా
ర్గమ్ములు చూపి రన్నఁ గిను♦కం గొని వారల నూఱడించుచున్. ౧౩౬౦

తా త్ప ర్య ము.

ఈప్రకారముపోయి యా దధిముఖునిఁ జూచి హనుమంతుని సాహాయ్యముచేఁ గ్రోఁతులు వనమంతయుఁ బాడుచేసి మమ్ము మోఁకాళ్ళగ్రుమ్మిరి. పిడికిళ్ళ గ్రుద్దిరి. పైపెచ్చు నాసనముల జూపిరి. అని చెప్పఁగా వాఁడు కోపించి వారల సమాధాన పఱిచి.

క్రుమ్మిరి- గ్రుద్దిరి- చూపిరి యనుటకు వానరాళి కర్త. మహాత్మమూహార్థక శబ్దంబమహాత్కార్య యుక్తం బయ్యెఁ దద్విశేషణ క్రియలు మహాత్కార్య యోగ్యంబులు విభాష పగు. (ప్రౌ. వ్యా, శబ్ద. ౧౭ వ. సూ) "పడ నడుతురు నిన్నుఁ గన్నఁ బ్రమథ గణంబుల్"-నిర్వ చ ఆ.

శా. రండీ వానరులన్ బలాంధులను గ్రౌర్యం బార మర్దించి తము
చ్చండత్వంబున నంచు నాతఁ డొక భూజశ్రేష్ఠముం గొంచు రాఁ
గొండల్ గుండులు బోలుఁ జెట్లుఁ గొని సక్రోధాంతరంగంబులన్
దండన్ డాసిరి తక్కక్రోఁతులు వెసన్ దండింపఁ గీశేశులన్. ౧౩౬౧

అర్థములు. బలాంధులను=బలముచేఁ గన్నులు గానని వారిని, ఉచ్చండత్వంబునన్ = మిగులఁగోపముచే- సక్రోధ + అంతరంగంబులన్ = కోపముతోఁ గూడిన మనస్సులతో, దండన్=ప్రక్కలందు- డాసిరి=సమీపించిరి.

తాత్పర్యము.

బలముచేఁ గన్నులు గానని క్రోఁతులను దయమాలి కోపముతోఁ జక్కఁగఁ గొట్టుదము రండు, పోద మని దధిముఖుఁడు చెట్టు నొకటి పీకికొనిరాఁగా, తక్కిన క్రోఁతులుఁ గోపముతోఁగూడిన మనస్సులు గలవారై కొండలు, గుండులు, బోలు, చెట్లు తీసికొని వానరుల దండింప వచ్చిరి.

—అంగదుండు దధిముఖునిఁ దన్నుట.—

సీ. వానరవరుఁ లిట్టు వచ్చి నేలను జెట్లఁ, గ్రుమ్మరు క్రోఁతుల గుంపుమీఁదఁ
గవిసిన నాతని కడకఁ గనుంగొని, పావని మొద లగు ప్రముఖు లెల్ల
నచటికిఁ బఱ తెంచి రంగదుఁ డంతటఁ, దరుహస్తుఁ డైన యా దధిముఖుండు
మనకుఁ బూజ్యుం డని మత్తత నెఱుఁగక, కోపించి కేలిచేఁ గూలఁ దాఁచి
ఆ. నలియ గ్రుద్ది విడువ వెలవెలఁ బోవుచు, రోజుకొనుచు నెత్తు రులు దొరంగ
నంగసంధి ప్రిదుల నరసావు చచ్చియు, లేచి యాఁపెఁ బెఱ వలీముఖముల.

అర్థములు. కడఁక = ప్రయత్నము - తరుహస్తుఁడు = చేతఁ జెట్టుగలవాఁడు- పూజ్యుం డని = తాత గావున గౌరవింపఁదగిన వాఁడని- మత్తతన్ = మదముచేత- అంగసంధి = అవయవముల సంధి బంధము - ప్రిదులన్ = శిథిలము కాఁగా- బిగువు చెడి వదులు పడఁగా- అరసావు చచ్చియు = మూర్ఛపోయి- పెఱ వలీముఖములన్ = ఇతర వానరులను.

తాత్పర్యము.

వనపాలకు లగు వానరు లిట్లు వచ్చి భూమిమీఁదఁ జెట్లమీఁదఁ దిరుగుచున్న క్రోఁతి గుంపులమీఁదఁ బడఁగా వాఁడు బలవంతముగఁ గొట్టి వానరులఁ దఱుమఁ జూచు చున్నాఁడని తలఁచి హనుమంతుఁడు మొదలగు వానర ప్రముఖు లచ్చటికి వచ్చిరి. అం దంగదుఁడు చేతఁ జెట్టు పట్టుకొనియున్న దధిముఖుఁడు తనకుఁ దాతయని,

గౌరవింపఁబడఁదగినవాఁడని, తేనె ద్రావినమత్తుచే నెఱుఁగక కోపించి చేతితోఁబడఁగొట్టి నలియ గ్రుద్ది వదలిపెట్టఁగా వాఁడుఁ వెలవెలఁబోయి రోఁజుచు నెత్తురు కాఱుచుండ నవయవసంధులు వదులుపాఱ మూర్ఛపోయి లేచి యితరవానరుల నడ్డగించెను. అరసావు - సగము చచ్చుట - మూర్ఛ

"ముగ్ధేర్ధసంపత్తిః పరిశేషాత్" బ్ర॥ సూ. ౩-౨-౧౦ అను బ్రహ్మసూత్రమున మూర్ఛను సగము చావుగా వ్యాసమహర్షి చెప్పెను. ఇది స్వప్న - జాగర - సుషుప్తి మరణావస్థలకంటె వేఱైనది. సర్వ ప్రాణములతోను, శరీరముతోను సంబంధమును గలిగియుండుట మూర్ఛయనఁబడును. శ్రీ భాష్యము. 'అతండు నీ మఱఁది కరసావొనర్చె' భార. ద్రోణ-౫ ఆ - అరసావు చచ్చి - ఇది 'పాకం పచతి' - వంట వండుచున్నాఁడు అను ప్రయోగమువంటిది. అర. రూ. అఱ.

తే. ఎట్టులో వారు విడువంగ ♦ నేగుదెంచి, యేకతంబునఁ దనవారి ♦ నెల్లఁగూర్చి
దధిముఖుం డిట్టులను వీరు ♦ మధువనంబు, నంద యుండఁగ మన మెల్ల ♦ నరిగి వేగ.

అర్థములు. ఏకతంబునన్ = ఒంటరిపాటున - ఏకాంత శబ్దభవము.

తాత్పర్యము.

స్పష్టము.

ఉ. రామునితోడ నున్న కపి ♦ రాజును గన్గొని యొక్కయంగదుం
డే మునుకొంచు దోషముల ♦ నెల్ల ఘటించె నటంచుఁ జెప్పఁ బై
తామహమున్ దురాసద ము ♦ దాత్తము నిష్టవనంబు గావునన్
దామస మేది కీశపతి ♦ దండనముల్ ఘటియించు వీరికిన్. ౧౩౬౪

అర్థములు. మునుకొంచు = ముందుపడి - ముందుగా వచ్చి - పైతామహమున్ = బ్రహ్మ ఋక్షరజస్సున కిచ్చినది. దురాసదము = సులభముగ దేవతలకును బొందరానిది - ఉదాత్తము = గొప్పది - ఇష్టవనంబు = ప్రియమైన వనము - తామస మేది = ఆలస్యము లేక.

తాత్పర్యము.

రామచంద్రమూర్తితో నుండు సమయమున సుగ్రీవునితో నంగదుఁడే ముఖ్యుఁడై ముందును నిలిచి దోషములన్నియు - వనములోఁ జొచ్చుట, తేనెలు ద్రాగుట, చెట్లు పాడుచేయుట. తమ్ము కొట్టుట, యివి యన్నియుఁ జేసెనని చెప్పితిమేని బ్రహ్మ ఋక్షరజస్సున కిచ్చినదియు, నెట్టివారైనను బ్రవేశింపరానిదియు, గొప్పదియు, ప్రియమైనదియుఁ గావున సుగ్రీవుఁ డాలస్యము లేక వీరి నందఱ దండించును.

క. భూవల్లభ శాసనపరి, భావులు దుర్మతులు వీరిఁ ♦ బరిమార్పింపం
గా వలయు నంత వీరల, కావరమును దొలఁగు మనకుఁ ♦ గసియుం దీఱున్.

అర్థములు. భూవల్లభ శాసన పరిభావులు = రాజాజ్ఞనుల్లంఘించినవారు -

దుర్మతులు = దుష్ట మనస్సుగలవారు, పరిమార్పింపంగాన్ = చంపింపగా, కావరము = పొగరు, కసియున్ = పగయును,

తా త్ప ర్య ము .

రాజాజ్ఞ మీఱిన చెడుమనస్సు గల వీరిని చంపింప వలయును. అట్లుచేసితిమేని వీరి పొగరణంగును. మన పగ దీఱును.

క. అని తనబడిఁ దక్కిన మధు,వనపాలకు లేగుదేర ♦ వాసరపతిపు
త్త్రునిఁ జూడ నాకసంబునఁ, జని దధిముఖుఁ డొక్క త్రుటిని♦సత్వరుఁడగుచున్.

అర్థములు. తనబడిన్ = తన వెంబడి – సత్వరుఁడు = త్వరగలవాఁడు

తా త్ప ర్య ము .

తన వెంటఁ దక్కిన వనపాలకులు రాఁగా సుగ్రీవునిఁజూడ దధిముఖుఁడు ఆకాశమున నిమిషములోఁ ద్వరగాఁబోయి.

ఆ. రామచంద్రవిభుని♦సౌమిత్రి సుగ్రీవుఁ, గాంచి యచట డిగ్గి ♦ కపికులాభ
రణముఁ జేర నేగి ♦ ప్రణతిఁ గావించె న,త్యంత మార్తి మొగము♦నందు వ్రేల.

తా త్ప ర్య ము .

రామలక్ష్మణ సుగ్రీవులఁ జూచి యచట దిగి సుగ్రీవు నొద్దకుఁబోయియేడుపుగొట్టు మొగముతో నమస్కరించెను. మేనమామ, యల్లునికి నమస్కరించుట ప్రభుత్వ గౌరవముం బట్టి యని తెలియవలయును.

—♦ ౬౩-వ సర్గము. దధిముఖాదివనపాలకులు సుగ్రీవునితోఁ
గపుల దుశ్చేష్టలు దెల్పుట ♦—

క. ఇమ్మెయి దీనతఁ దనపా,దమ్ములఁ బడ సూర్యసుతుఁడు ♦ దధిముఖుఁ గని లే
లెమ్మా భయపడకుము విష,యమ్మును వినిపింపు మంచు ♦ నాశ్వాసింపన్.

అర్థములు. దీనతన్ = భయమున – లెమ్మా లెమ్మా = లేలెమ్మా, ఆశ్వాసింపన్ = ఊఱడింపఁగా.

తా త్ప ర్య ము.

ఈ ప్రకారము భయముచే దన కాళ్ళమీఁదబడిన దధిముఖునిఁజూచి సుగ్రీవుఁడు లేలెమ్ము. భయపడకుము. ఏమి జరగెను. చెప్పుము. అని సమాధానపఱుపఁగా,

ఆ. అతఁడు లేచిపల్కె ♦ నధిప! నీ జనకుని,తరమునందు నన్న♦తరమునందు
నీతరంబునన్ వ♦నేచరు లావంక,మలయరాని రమ్య♦మధువనంబు. ౧౩౬౯

అర్థములు. నీ జనకుని తరమునందు, నన్నతరమునందు– నీ యన్న తరంబునం దని యర్థము. ‘కొన్ని యెడల సంబంధంబునం బూర్వవాక్యంబు నందలి పదంబధ్యాహార్యంబగు ప్రౌ – వ్యా–వాక్య ౧౨ సూ. ‘పంక్తి ముఖు నాతని తమ్మునిఁ గుంభకర్ణుని – దనయుని మేఘనాదుని, దానవేశ్వరునకుఁ దమ్మును’–నిర్వ – ౨ఆ.

తా త్ప ర్య ము.

యీ ప్రకారము సుగ్రీవుఁడు ధైర్యము చెప్పఁగా వాఁడు లేచి యిట్లు చెప్పెను. నీ తండ్రి తరమునందుఁగాని, నీ యన్న తరమునందుఁగాని, నీతరమందుఁగాని వానరులా ప్రక్కఁగూడఁ దిరుగరాని మధువనమును.

ఉ. ఆ వనచారు లెల్ల విల♦యం బొనరించిరి పాడు పాడుగాఁ
 ద్రావిరి తేనె, లెల్ల ఫల♦రాజి మెసంగిరి, తక్కు తేనెలన్
 భూవివరంబులం దొలుకఁ♦బోసి, రిదే మని పీర లడ్డమై
 పోవఁగఁ గొక్కిరించి కను♦బొమ్మలు చూపిరి గుజ్జుకొట్టుచున్. ౧౩౭౦

అర్థములు. భూ వివరంబులన్ = నేల బొక్కలందు, ఒలుకఁబోసిరి = పాఱఁబోసిరి.

తా త్ప ర్య ము.

నీవు దక్షిణమునకుఁ బంపిన క్రోఁతులు పాడుపాడు చేసిరి. తేనె ద్రావిరి. పండ్లన్నియుఁ దినిరి. త్రావఁగా మిగిలిన తేనెను నేల బొక్కలలోఁ బోసిరి. కొంత నేల దొరలించిరి. ఇదియేమి యీ యాగడ మని పీరడ్డము పోఁగా వెక్కిరించిరి. గుజ్జు కొట్టిరి. కన్ను బొమ్మలు చూపిరి— స్వభావోక్తి.

ఉ. ఏపున పీర లొక్కటిగ♦నేగి వని న్వెడలుం డటం చనన్
 గోపముతోడ ముష్టులను♦గ్రుద్దిరి, గ్రుమ్మిరి కాలుసేతులన్
 జూపిరి దేవమార్గముల♦శుంఠతనాన యథేచ్ఛ మిట్లు నీ
 భూపతితం జెలంగి పలు♦పోకలఁ బోయిరి తోఁట పాడుగన్. ౧౩౭౧

అర్థములు. ఏపున = బలముగ; నీ భూపతితన్ = నీవు రాజుగా నుండఁగా.

తా త్ప ర్య ము.

బలముగా వీరందఱు గుంపుగాఁ బోయి తోఁటలో నుండి వెడలిపొండనఁగా వారు కోపించి పిడికళ్ళ గ్రుద్దిరి. కాలుసేతులఁ గ్రుమ్మిరి. ముడ్డులఁ జూపిరి. శుంఠలై యిట్లు నీవు రాజై యుండఁగానే వీరు పలుపోకలఁ బోయిరి. తోఁట పాడుచేసిరి.

క. అని విన్నవించుచుండఁగ, విని లక్ష్మణుఁ డనియె నా ర♦విప్రభవా! యే
 మనియెడి నీ వనపాలుఁడు, వన రెడినిటు లేల యనిన♦వాక్యజ్ఞుఁ డనున్. ౧౩౭౨

తా త్ప ర్య ము.

అని విన్నపముచేయు సమయంబున వారి మాటలు లక్ష్మణుఁడు విని సుగ్రీవా యీ వనపాలుఁ డేమనుచున్నాఁడు. ఏల దుఃఖపడుచున్నాఁడు? అనిన మాటల యందలి నేర్పరియగు సుగ్రీవుఁ డిట్లు చెప్పెను.

—♦{ సుగ్రీవుఁడు లక్ష్మణుతో హనుమదాదులు మధువనంబున విహరించుటఁ దెల్పుట. }♦—

సీ. ఆర్య! సౌమిత్రి! యు♦ద్యానపాలుఁడు వీఁడు, దధిముఖుం డనియెడి♦తరుచరుండు
 దక్షిణదిశ రోయఁ♦దరలి పోయిన యంగ, దాదులు చనుదెంచి♦మోదమునను

మధువనంబునఁ జొచ్చి♦మధువంతయుం ద్రావి, యిచ్ఛావిహారంబు♦నెలమి జలుపు
చున్న వారఁట యందు♦నూహింప నివి యెల్ల, నకృతకృత్యుల చేఁత♦లనఁగ రాదు
తే. వనముఁ జొచ్చినయప్పుడె♦వారు కార్య, సాధకతఁ గ్రాలుచుండుట♦సత్యమయ్యె
చూడఁబడె దేవి, సత్యంబు♦సుమ్ము హనుమ, చేత నే యది యితరుల♦చేతఁ గాదు.

అర్థములు. అకృతకృత్యుల చేఁతలు=పనిసాధింపని వారి చేష్టలు–కార్యసాధకత=కార్యము సాధించుట చేత.

తాత్పర్యము.

స్పష్టము.

క. ఈ కార్యము సాధింపఁగఁ, జేకుఱుఁ బావని కె యొరుల♦చే నిదియానే
యాకపివరున కశక్తియు, ధీకలిమియు శ్రుతము తెంపు♦తేఁకువ గలుగున్. ౧౩౭౪

అర్థములు. ధీకలిమియు = బుద్ధి సంపద – శ్రుతము = శాస్త్రజ్ఞానము, తెంపు = సాహసము, తేఁకువ = ధైర్యము.

తాత్పర్యము.

స్పష్టము.

ఉ. మంతిరి జాంబవంతుఁ డఁట♦మానుగ వానరకోటికిన్ హనూ
మంతుఁడు రక్షకుం డఁట, స♦మానవిహీనబలాఢ్యుఁ డంగదుం
డింతకు నేలినాతఁ డఁట♦యిట్టిరు పూనిన కార్య మొక్క- యా
వంతయు మొక్క-పోనె? ఫల♦వంతమ యా టది యేమి చోద్యమో? ౧౩౭౫

అర్థములు. సమాన విహీన బలాఢ్యుఁడు=బలమునందు సమానులు లేని వాఁడు, ఏలినాతఁడు=ప్రభువు, మొక్క-పోనె=భంగమగునా.
ఈ దక్షిణదిశ పోయిన వానరులకు నాలోచన చెప్పువాఁడు జాంబవంతుఁడు.
అఁట=మహాత్వమును దెలుపును.

ఉ. రాజఁట ధర్మజుండు సుర♦రాజసుతుండఁట ధన్వి శాత్రవో
ద్వేజకమైన గాండివము♦విల్లఁట యుగ్రగదాధరుఁడైన భీముఁడ
య్యాజికిఁ దోఁడు వచ్చునఁట♦యాపదగల్గుట కేమి చోద్యమోఁ
................................................ భాగ.

తాత్పర్యము.

దక్షిణమున బోయిన వానరసేనకు నాలోచన చెప్పువాఁడా జాంబవంతుఁడు. రక్షకుఁడా హనుమంతుఁడుఁ ప్రభువా యసమాన బలుఁడగు నంగదుఁడు– ఇట్టి వారు పూనిన కార్యము భంగమగునా? ఫలవంత మగుట యేమి యాశ్చర్యము?

క. అంగదుఁ డాదిగఁ బ్రముఖులు, భంగించిరి మధువనంబు♦వారింపంగాఁ
జెంగటి కేగిన జానుల, నంగంబుల నలియ దంచి♦రఁట యీ కపులన్. ౧౩౭౬

అర్థములు. భంగించిరి=విఱిచిరి. అఁట – ఇచ్చట అఁట యనునది వృత్తాం

తమును దెలుపును. అనుట సంగ్రహరూపము. అట చెంగటికిన్ = సమీపము నకు, జానులన్ = మోకాళ్లతో.

తాత్పర్యము.

అంగదుడు మొదలయిన వానర ప్రముఖులు మధువనమును ఱిచి కుప్పపెట్టిరట. వలదని అడ్డముపోయిన వీరిని నలియ దంచిరట.

చ. వనజదళాయతాక్షి గని వచ్చినవారలు వారు కానిచో
వనమును బ్రహ్మదత్తమును వారలె కన్నుల నైన జూడఁగా
జనియెడివారు? నాఁగ శ్రుతి సౌఖ్యదవాక్యము లాలకించి యా
యినకులదీపకుల్ పరమ హృష్టతఁ దుష్టి వహించి రంతటన్. ౧౩౭౭

అర్థములు. వారలె = వారా! ఆశ్చర్యమును దెలుపును. శ్రుతి సౌఖ్యద వాక్యములు = చెవులకు సుఖము గలిగించు మాటలు, వినుట కింపయిన మాటలు.

తాత్పర్యము.

ఆ వానరులు సీతాదేవిని జూచి వచ్చిన వారు కానిచో బ్రహ్మ దత్తమైన వనమును వారికిఁ గన్నులనైనఁ జూచు ధైర్యము గలదా? అనఁగా విన నింపైన యా మాటలు విని రామలక్ష్మణులు మిక్కిలి సంతోషించి గగుర్పాటు చెందినవారైరి.

—సుగ్రీవుఁడు కపులకుఁ ద్వరగ రండని దధిముఖుచే వార్త బంపుట.—

చ. ఇనజుఁడు తోఁటవాని కని యెంగపివల్లభ! నీదు వాక్యముల్
వనచరులా వనంబునను వారక గ్రుమ్మరి రంచు వింటచే
ఘనముద మయ్యె, సాధితసు కార్యులు మన్నన కర్హులే కదా?
గనుక క్షమించితిం గపులఁ గానఁగ నేగుము పల్కు మివ్విధిన్. ౧౩౭౮

అర్థములు. సాధిత సుకార్యులు = మంచికార్యము నెఱవేర్చినవారు, ఇన జుడు = సుగ్రీవుఁడు.

తాత్పర్యము.

సుగ్రీవుఁ డట్లు రామలక్ష్మణులకుఁ జెప్పి తోఁటవానితో నిట్లనియె. వానర శ్రేష్ఠా! వానరులు మధువనమునందు స్వేచ్ఛావిహారము చేసిరని నీవు చెప్పుటచే మిగుల సంతోషించితిని. వారు మంచి కార్యమును సాధించిన వారు కావున మన్న నకు యోగ్యులు కదా! కావున క్షమించితిని. నీవు పోయి యా వానరులఁ జూచి యిట్లు చెప్పుము.

కిష్కింధాకాండము ౯౦౨౨ వ పద్యము చూడుఁడు. అందు సీతాదేవిని జూచితి నని చెప్పువాఁడు "మత్సమానుఁడై, వాసి చెలంగుచుండు—ఎక్కుడు దోపియుఁ జుట్ట మయ్యెడిన్'' అని చెప్పెనుగదా! కావున వారిని క్షమించెను.

క. హనుమంతుఁడు లోనుగఁ గల, వనచరవర్యులచరిత్ర వసుధాతనయం
గనుటను వారి ప్రయత్నము, వినఁగోరితి నృపులతోడ వే రండనుమా. ౧౩౭౯

తాత్పర్యము.

హనుమంతుఁడు మొదలగు వారు ప్రవర్తించిన విధము, సీతాదేవినిఁజూచుట యందు వారు చేసిన ప్రయత్నము, రామలక్ష్మణులతోడ నేను వినఁగోరితిని కావునఁ ద్వరగా రండని చెప్పుము.

క. అని చెప్పి సంప్రహృష్టుల, ఘనముత్సంఫుల్లనయన♦కంజుల నృపులన్
గని పులకితగాత్రుండై, యినజుఁడు కార్యంబుసిద్ధి♦కెంతయుఁ బొంగెన్. ౧౩౦౦

అర్థములు. సంప్రహృష్టులన్ = మిగుల సంతోషించిన వారిని, ఘనముత్ = గొప్ప సంతోషముచే, సంఫుల్ల = వికసించిన, నయనకంజులన్ = నేత్రకమలములు గలవారిని, పులకితగాత్రుండై = గగ్గురు పొడిచిన దేహము గలవాఁడై, ఇనజుఁడు = సుగ్రీవుఁడు, కార్యసిద్ధికి = కార్యము సఫల మగుటకు.

తాత్పర్యము.

ఈ ప్రకారము చెప్పి మిగుల సంతోషించినవారై అధిక సంతోషముచే వికసించిన కన్నులుగల రామలక్ష్మణులఁజూచి దేహము పులకరింప సుగ్రీవుఁడు కార్యము సఫల మయ్యెఁగదా యని యుప్పొంగెను.

—♦ ౬౪-వ సర్గము అంగదాదులు సుగ్రీవుకడకుఁ బోవుట. ♦—

క. తరణికులోద్ధారకులకుఁ, దరణితనూజునకు మ్రొక్కి ♦ దధిముఖుఁ డెగసెన్
బరిచరయుక్తుఁడు నింగికిఁ, దరణిపథంబున యథాగ♦తత్వర చనియెన్. ౧౩౦౧

అర్థములు. తరణికులోద్ధారకులకున్ = సూర్యవంశము నుద్ధరించు వారికి, తరణి తనూజునకున్ = సుగ్రీవునికి, పరిచరయుక్తుఁడు = సేవకులతోఁగూడినవాఁడు, నింగికిన్ = ఆకాశమునకు, తరణి పథంబునన్ = సూర్యుఁడుపోవు మార్గమున, ఆకాశమున – యథా+ఆగత+త్వరన్ = వచ్చినంత వేగముగ.

తాత్పర్యము.

రామలక్ష్మణులకు సుగ్రీవునకు నమస్కరించి దధిముఖుఁడు పరిచారకులతో గగనంబున కెగసి యెంత వేగముగ వచ్చెనో యంత వేగముగఁ బోయెను.

సీ. మధువనంబున డిగ్గి ♦ మధువారి మాత్రించి, కై పేది లేచిన♦కపులఁ గాంచి
యంగదుఁ జేరంగ ♦ నరిగి యంజలి మోడ్చి, రోషింపకయ్య మా♦దోషమునకు
నజ్ఞానవశమున ♦ నడ్డగించిరి వన, పాలురుమిమ్ము నృ♦పాలతనయ
యువరాజ! నీవ యీ♦యుద్యానమున కెల్లఁ బ్రభుఁడవు మూర్ఖత♦ బలిమిఁ జేసి
తే. చేసితిమి నేరమును మదిఁ♦జేర్ప కీవు; మమ్ముఁ క్షమియింపు మీరు వ♦నమ్ముఁ జేర
నేగుదెంచుట నీదు పి♦తృవ్యునకును నేను బోయి వచించితి♦మాననీయ! ౧౩౦౨

అర్థములు, మధువారిన్ = తేనెను–దాని కనుపానమైన నీటిని – ద్వంద్వ సమాసము కావున ఏకవద్భావము. మాత్రించి = మాత్రముగా విడిచి– తేనెతోడ నీళ్ళు త్రాగిన నది సుఖముగ, శీఘ్రముగ జీర్ణమగును. 'అనుపానం హిమంవారి యువ

గోధూమమయో ర్ఘ్రాతం। దధ్ని మద్యే బిసే క్షౌద్రే కోష్ణం పిష్టమయేషుచ' అని బాహాటము. మాత్రము విడిచినచోఁ ద్రావిన తేనె జీర్ణమైన దని గుర్తు-కై పేది= మత్తు విడిచి – రోషింపకయ్య = వ్యతిరేక మధ్యమ ము వర్ణంబున కెల్ల యెడల లోపంబు విభాష నగు-సు.వ్యా-సంధి-౭౧ సూ. పితృవ్యునకును=పినతండ్రికి-మాననీయ=పూజ్యుఁడా. తా త్ప ర్య ము .

మధువనము దిగి తేనెతోఁడఁ ద్రాగిన నీళ్ళను మాత్రము విడుచుటచే మత్తు తగ్గి, లేచిన క్రోతులఁజూచి యందు నంగదు సమీపించి యువరాజు గావునఁ జేతులు జోడించి యయ్యా మేము చేసిన యపరాధములకుఁ గోపింపకుము. ఈ వనపాలురు తెలివి లేనివారై మిమ్ము నడ్డగించిరి. రాజకుమారా! యువరాజా! యీ యుద్యానమునకు నీవే కదా ప్రభువు. నీ సొత్తు నీ వుపయోగింప నడ్డగింప వీరికేమి యధికారము గలదు? అజ్ఞానబలముచే నేరములు చేసితిమి. అవి నీవు మనస్సులో నుంచుకొనక క్షమింపుము. మీ రీ వనమునకు వచ్చిన వార్త నేను బోయి మీ పినతండ్రికి చెప్పితిని.

క. దోషంబుగ నేఁ జెప్పిన, భాషణముల నాలకించి ♦ పతి యది యేమోఁ
రోషింపఁడు మీపై సంతోషంబున వేగ ర మ్మ♦నుచుఁ జెప్పె మనెన్. ౧౩౬౩

తా త్ప ర్య ము.

నేను మీరు దోషము చేసినట్లు చెప్పిన మాటలు విని యదియేమి కారణమో నాకుఁ దెలియదు. రోషించుటకు బదులు సంతోషించి మిమ్ముఁ ద్వరగా రండని చెప్పె ననెను. పూజ్యార్థంబున మి మ్మని బహువచనము.

ఉ. ఆ కపిమాట లెల్ల విని ♦ యంగదుఁ డి ట్లను వానరాళితోఁ
నీ కథ లెల్ల రాఘవకు♦ లేంద్రుఁడునున్ విని యుండునే కదా
ప్రాకటలీలఁ దేనియలఁ ♦ ద్రావి శ్రమంబును దీర్చుకొంటి మిం
కే కరణీయ మిందుఁ గల ♦ దేగఁగ నొఁ బినతండ్రిఁ జూడఁగన్. ౧౩౬౪

అర్థములు. కరణీయము = చేయఁదగిన కార్యము.

తా. త్ప ర్య ము.

దధిముఖుఁడు చెప్పిన యామాట లన్ని విని వానరులతోఁ నంగదుఁ డిట్లనియె. ఈ దధిముఖుఁడు చెప్పినవి సుగ్రీవుఁడు చెప్పినవి రామచంద్రమూర్తికూడ విని యుండునుగదా. మనమో కావలసినంత తేనె ద్రావితిమి. బడలిక దీర్చుకొంటిమి. ఇక్కడ నిఁకఁ జేయవలసిన పని యేమి లేదు. పిన్న తండ్రిని జూడఁ బోదమా?

క. మీ రెల్ల రెట్లు చెప్పిన, నా రీతి నొనర్చువాఁడ ♦ నగచరులారా!
యీ రయఁ ద్వత్పరతంత్రుఁడఁ, గారియముల నందియంబు♦ గలదే దీనన్. ౧౩౬౫

అర్థములు. త్వత్+పరతంత్రుఁడన్ = మీ కధీనపడి యుండువాఁడను, కారియములన్ = పనులయందు.

తా త్ప ర్య ము .

మీ రంద ఱేది బాగని చెప్పెదరో యట్లే చేసెదను. పనులయందు నేను మీ స్వాధీనమం దుండు వాఁడను. ఇందు సందేహము లేదు.

క. యువరాజను మీ కెల్లర, కవుదునుగా కేమి దాన ♦ నాజ్ఞాపింపన్
దవుదునె? కృతకర్ముల మిము, నవునే పీడింప రి త్త ♦ యాజ్ఞలచేతన్? ౧౩౮౬

అర్థములు. కృతకర్ములన్ = కార్యము సాధించిన వారిని.

తా త్ప ర్య ము .

నేను మీకు యువరాజ నగుదునుగాక, దానివలన నేమి ప్రయోజనము. ఆ యధికారమునుబట్టి మీ కిష్టములేని కార్యము చేయవలయు నని యాజ్ఞాపింప వచ్చునా? కార్యము సాధించిన మిమ్ము వ్యర్థము లగు నాజ్ఞలచేఁ బీడింపరాదు.

చ. అన విని వార లెల్లరుఁ బ్ర♦హర్షమునం బ్రభు వెవ్వఁ డీ గతిన్
వినయము దోఁపఁ బల్కుఁ, బృథి♦వీపతి నంచును భాగ్యనష్టచే
తనుఁ డయి తానె సర్వ మని ♦ దర్పముఁ జూపును గాక యన్యుఁ డి
ట్లనునతఁ డున్నె? భావిశివ♦తార్హతఁ దెల్పెడి నీ వినీతియే. ౧౩౮౭

అర్థములు. ప్రహర్షమునన్ = అధిక సంతోషముచే, భాగ్యనష్ట చేతనుఁడు=సంపదచే మతి చెడినవాఁడు, దర్పము=గర్వము, భావి శివతార్హతకు= రాఁబోవు మేలునకు యోగ్యత, వినీతి=వినయము.

తా త్ప ర్య ము .

ఆ మాటలు విని వానరు లందఱు మిగుల సంతోషించి తానే రాజ నని యైశ్వర్యమదముచే మతిచెడినవాఁడై తానే సర్వము చేయువాఁడనని గర్వించును గాని ప్రభు వెవ్వఁడీ విధముగ వినయముతో మాటలాడును. ఇట్టి వాఁడు మఱి యొకఁడు గలఁడా? నీ వినయమె నీవు భవిష్యత్కాలమున గొప్పమేలు చెంద నధికారివని సూచించుచున్నది.

క. నీ నిర్దేశము లే కడు, గేనియు నటుపెట్టఁ జాల ♦ మెల్లరము నృపా
లా! నీ చెప్పినయట్టుల, వానరపతిఁ జూడఁబోవ ♦ వల నగు ననినన్. ౧౩౮౮

అర్థములు. నిర్దేశము=ఆజ్ఞ-"అపవాదస్తు నిర్దేశో నిదేశ శ్శాసనంచ స" యని నిఘంటువు.

తా త్ప ర్య ము .

నీ యాజ్ఞలేక మే మిటునున్న యడుగైన యటు పెట్టఁజాలము. ఏ కార్యమైనను నీవు చెప్పినట్లు చేయుదుము. నీవు చెప్పినట్లు సుగ్రీవునిఁ జూడఁ బోవుటయె తగిన కార్యము అని చెప్పఁగా.

ఉ. మంచిది లెండటన్న విని ♦ మానుగఁ గీశులు మింటిజాడ లం
ఘించి జవాన యంత్రమున ♦ క్షిప్తములై చను కొండ లట్టు ల

భ్యంచితలీల వచ్చిరి మ♦హాంబుదసంఘము లట్లు గర్జలన్
నించుచు; రామచంద్రుఁ డట♦నీరజలోచనవార్త రామికిన్. ౧౩౮౯

అర్థములు. క్షిప్తములై = చిమ్మఁబడినవై, మహాంబుదసంఘము లట్లు = పెద్ద మేఘములవలె.

తాత్పర్యము.

మీరు చెప్పినది బాగున్నది. అయినఁ బోదము లెండు అనఁగానే, వానరులాకాశమార్గమున వేగముగ యంత్రములచేఁ జిమ్మిన కొండ లెగిరి పోవునట్లు మేఘములవలె గర్జించుచు వచ్చిరి. ఇంతలో శ్రీరామచంద్రమూర్తి సీతాదేవి వార్త తెలియక పోవుటచే.

—♦ సుగ్రీవుఁడు శ్రీరామునకు ధైర్యోక్తులు చెప్పుట. ♦—

సీ. తపియింపఁ గనుఁగొని♦తపనతనూభవుం, డూరార్చి యిట్లను♦నీరజాక్ష
వీరలు చూచిరి♦వారిజాతాక్షిని, సందియం బేమియు♦నొంద వలదు
గడువు దాఁటియు నన్నుఁ♦గానఁగ వత్తురే, కార్యంబు సాధింప♦కయ నృపాల!
యంగదుం డంతటి♦యనదయే వరశౌర్య, తేజుఁడు రిత్తయే♦ తేరుటకును?
తే. గార్యమును జేయకయుఁ బ్లవ♦గప్రవరుఁడు, తండ్రిదాతలచే రక్షి♦తంబు నైన
నామధూద్యానరత్నంబు♦నేమిమొగముఁ, బెట్టుకొనిచొచ్చు నెదభీతిఁ♦గొట్టుకొనఁగ.

తాత్పర్యము.

సంతాప పడఁగా నాయననుజూచి సుగ్రీవుఁ డిట్లనియె. కమలాక్షా! ఊరడిల్లుము. ఈ వానరులు నిస్సందేహముగా సీతను జూచివచ్చిరి. అటు చూడకుండు లేని గడువు దాఁటి కార్యము సాధింపక నా యొద్దకు వచ్చుధైర్యము వీరికిఁగలదా? కార్యము సాధింపక వ్యర్థముగా వచ్చుటకు నంగదుండంత పనికిమాలినవాఁడా? కార్యము చేయఁడేని తాత తండ్రులు రక్షించి నా కెంతో ప్రియమైన శ్రేష్ఠమైన యుద్యానవనమును లోపల భయముచే గుండెలు కొట్టుకొనుచుండ నేమి ముఖము పెట్టుకొని ప్రవేశింపఁగలఁడు.

ఉద్యానరత్నము- 'రత్నం శ్రేష్ఠే మణావపి' అని శ్రేష్ఠమను నర్థమందు మణియను నర్థమందు రత్నశబ్దము ప్రయోగింపఁబడును. 'రత్నహారులు నృపతుల్'

తే. ఊఱడిల్లుము రఘువర!♦యూఱడిల్లు, సంశయము మానవయ్య కౌ♦సల్యతనయ!
చూడఁబడెదేవి, నిక్కంబు♦సుమ్ము హనుమ, చేతనే యదియితరుల♦ చేతఁగాదు.

తాత్పర్యము.

రఘువర - కౌసల్య తనయ - సీతాదేవి వార్త తెలియవచ్చెను. కావునఁ గార్యము నీవు సాధించినవాఁడ వగుటచే రఘువరుఁడవైతివి. లేనియెడ మీవంశమునకే యపకీర్తి వచ్చియుండునని భావము.

సీతాదేవి వార్త తెలియవచ్చుటచే కౌసల్య కొడుకును గలది యయ్యెను. అది రాకయుండిన నామె పుత్రహీనయె యై యుండును. సీతావియోగమువలన రామచంద్రమూర్తి మరణించినను మరణింపక యపకీర్తి పాలయినను అట్టి కొడుకుండియు లేనివాఁడేకదా.

తాత్పర్యము స్పష్టము.

క. ఈ కార్యము సాధింపఁగ, జేకుఱుఁ బావనికె యొరుల♦చే నిది యానే?
యా కపి యెడఁ దేజమువలె,నీ కపియెడ శక్తిబలము ♦ ప్రేక్షయు ధ్రువమా.

అర్థములు. ఆకపి యెడన్ = ఆకాశమందున్న ప్రసిద్ధుఁడైన సూర్యునియందు- 'కం జలం పిబతీతి కపిః' నీళ్ళను ద్రావువాఁడు కపి-సూర్యుఁడు. కపయార్కే భవానరాః' నానా. "కప్యాసం పుండరీక'' మను శ్రుతియందును గపి యనఁగా సూర్యుఁడనియె భాష్యకారులు వచించిరి.

తాత్పర్యము.

ఈ కార్యము సాధింపఁ గలవాఁడు హనుమంతుఁడే. ఇతరుల కిది సాధ్యము కాదు. ఆ సూర్యుని యందుఁ దేజము స్థిరమైనట్టు లీ కపియందు శక్తి, బలము, జ్ఞానము స్థిరమై యున్నవి.

ఉ. మంతిరి జాంబవంతుఁ డఁట ♦ మానుగ వానరకోటికిన్ హనూ
మంతుఁడు రక్షకుం డఁట, స♦మానవిహీన బలాఢ్యుఁ డంగదుం
డింతకు నేలినాతఁ డఁట ♦ యిట్టిరు పూనినకార్య మెన్నఁ డా
వంతయు మొక్కపోనె? యిపు ♦ డార్తిఁ దొఱంగు మతుల్యవిక్రమా. ౧౩౯౩

తాత్పర్యము చూడు ప. ౧౩౭౫

—♦ హనుమంతుఁడు శ్రీరామునకు సీతాదేవిస్థితిఁ దెలుపుట. ♦—

సీ. ఇటు ముచ్చటింపఁగ ♦ నింతలోఁ గార్యసిద్ధిని దెల్పురీతి గ♦ర్జనము లమరఁ
గిష్కింధ కేతెంచు♦కీశుల కిలకిలా, శబ్దంబు మింట నా♦సన్నమైన
నది విని సుగ్రీవుఁ డాయతాంచితవాలుఁ, డై యుండె వానరు ♦ లంగదాంజ
నేయపురస్సరు ♦ లై యరుదెంచి రా,ఘువకపినాథాంతి♦కమున డిగిరి
తే. యంత శిరమున మ్రొక్కి వా♦తాత్మజుండు
రామవిభునకు నియతయుఁ ♦ బ్రాణయుక్త
దేవి యన ఫలియించెఁ జో ♦ భూవరేంద్రు
కార్య మని సంతసంబందెఁ ♦ గపివిభుండు. ౧౩౯౪

అర్థములు. ముచ్చటింపఁగన్ = మాటలాడుచుండఁగా, ఆసన్నమైన = సమీపింపఁగా-ఆయతాంచితవాలుఁడై = నిడివిగాఁ జూపఁబడిన తోఁకగలవాఁడై-అంగద + ఆంజనేయ పురస్సరులై = అంగదుని నాంజనేయుని ముందుంచుకొన్నవారై-రాఘవకపి

నాథాంతికమునగా = రామసుగ్రీవుల సమీపమున - నియతయు = పాతివ్రత్య నియమముగలది - ప్రాణయుక్త = జీవించియున్నది - దేవి = సీతాదేవి - సీత ప్రాణముతో నుండియు శీలము చెడిన దయ్యేనేని చచ్చినదానితో సమానమె కావున శీలము గలదని మొదటఁ జెప్పెను. ప్రాణయుక్త=శీలము గలది నిజమే, చచ్చియుండిన శీలవతి యయ్యు నేమి లాభము. కావున జీవించి యున్నదని చెప్పెను. తరువాత దేవి యని చెప్పెను. దేవీశబ్దమును సీతాదేవియందుఁ గనుఁగల భక్తియు గౌరవము తెలుప నుపయోగించెను. దేవుని భార్య దేవి. దేవ ఏకో నారాయణ యన్నట్లు దేవశబ్దము ముఖ్యార్థమున నారాయణునందే యన్వయము. తక్కినవారియందు గౌణము. అట్టివాని భార్య లక్ష్మి. 'దారిద్ర్య ధ్వంసినీం దేవీం సర్వోపద్రవ వారిణీ' మ్మని దేవీశబ్దము లక్ష్మి పర్యాయముగ అష్టోత్తర శతనామంబులందుఁ బఠితము.

రామశబ్దము 'రము క్రీడాయా' మ్మను ధాతువువలనఁ గలిగినది. దేవశబ్దము 'దివు క్రీడాయా' మ్మను ధాతువువలన నుత్పన్నమైనది. కావున రామ దేవశబ్దములు సమానార్థకములు. దేవీ శబ్దము 'దివుక్రీడాయా' మ్మను ధాతువలనఁ గలిగినదే. దేవ విభుఁడవైన నీకు ఆమె యన్ని విధములఁ దగియున్నదని భావము. అనఁగా తన కామె సాక్షాల్లక్ష్మిగాఁ దోఁచెను గాని సామాన్య స్త్రీగాఁ దోఁపలేదని భావము. ముందు దేవియని చెప్పిన భ్రష్టురాలయ్యెనని చెప్పునో - మరణించెనని చెప్పునో యని రెండవమాట చెప్పునంతలో రామచంద్రమూర్తి యెంత సంతాప పడునో యని ప్రాణమునకంటె శీల మెక్కువ కావున ముందు శీలవతి యని చెప్పి యావల ప్రాణవతియని చెప్పి యావల దేవి యని చెప్పెను. ప్రాణయుక్త యనుటచే దేహము నందుఁ బ్రాణము మాత్ర మున్నది. జీవించినవారి కుండవలసిన లక్షణములు మఱియేవి లేవని భావము.

## తాత్పర్యము.

ఈ ప్రకారము రామ సుగ్రీవులు సంభాషించు సమయంబునఁ గార్యముసఫలమని తెలుపునట్లు సింహనాదములు చేయుచు వచ్చుచున్న వానరుల కిలకిలార్భటులు ఆకాశమున దగ్గఱగా వినరాఁగా సుగ్రీవుఁడు ప్రభువు కూర్చుండవలసిన విధముగా తోఁక పొడుగుగాఁ జాఁచి కూర్చుండెను. అంగదుని ఆంజనేయుని మఱియుంచుకొని వానరులు రామసుగ్రీవులకు సమీపమున దిగిరి. అప్పుడు శ్రీరామచంద్రమూర్తికి హనుమంతుఁడు - నియత - ప్రాణయుక్త - దేవి యని సర్వము మూఁడు మాటలలోఁ దెలిపెను. అది విని సుగ్రీవుఁడు రామచంద్రమూర్తికార్యము ఫలించెనని సంతోషించెను.

సీతాదేవిని వెదకించి వార్త తెప్పించెద నని చెప్పినమాట చెల్లించుకొంటినను సంతోషముకంటె రామకార్యము ఫలించెఁ గదా యని సంతోషించె ననుటచే మిత్రలక్షణము స్ఫుటీకరింపఁబడియె.

ఆ. ప్రీతియుక్తు లగుచు ♦ శ్రీరామలక్ష్మణుల్, కడు, బ్రియంబుఁ దెలుపు ♦ గంధవాహు
నాత్మజాతుఁ గనిరి ♦ సాదరాలోకన, పంక్తు లతనిమీఁదఁ ♦ బరఁగఁ జేసి. ౧౩౯౫

అర్థములు. సాదర+ఆలోకన+పంక్తులు=ప్రేమతోఁగూడినచూపులవరుసలు.

తాత్పర్యము.

శ్రీరామ లక్ష్మణులు ప్రీతిగలవారై మిగులఁ బ్రియములైన మాటల చెప్పు హనుమంతుని ప్రేమతోఁగూడిన చూపులచే చాలసేపు చూచుచుండిరి.

౬౫-వ సర్గము.

ఉ. రాముని లక్ష్మణుం బ్లవగ ♦ రాజును జేరి నమస్కరించి శా
ఖామృగపాళి భూమిసుత ♦ గాథ వచించెను లంక నామె సు
త్రామవిరోధిమందిరధ ♦ రం జెఱ నుండుట, రాక్షసాంగనా
భీమబిభీషికల్ గడవు ♦ పెట్టుట, తత్పతి భర్తృభక్తియున్. ౧౩౯౬

అర్థములు. సుత్రామ విరోధి = ఇంద్రునకుఁ బగవాఁడైన రావణుని యొక్క- మందిర ధరన్ = గృహప్రదేశమందు- భీమ బిభీషికల్ = భయంకరములైన బెదరింపు మాటలు.

తాత్పర్యము.

వానరు లందఱు రామలక్ష్మణ సుగ్రీవుల యొద్దకుఁ బోయి నమస్కరించి రావణాసురుని యింట సీతాదేవి యుండుటయు, రాక్షస స్త్రీలామెను బెదరించుచుండుటయు, రావణుఁడు గడువు పెట్టుటయు, ఆమె పతిభక్తి గుఱించియుఁ జెప్పిరి.

ఉ. జానకి సేమ మంచుఁ గపి ♦ సత్తము లాడఁగ రాఘవుం డనున్
వానరులార! సీత యెట ♦ వర్తిలు చున్నది? నా యెడాటమం
దే నియతిం జరించు! నిది ♦ యెల్లను జెప్పఁ డటన్న నంజనా
సూనుని నీవు పల్కు సతిఁ ♦ జూచినవాఁడ వటన్న వానరుల్. ౧౩౯౭

అర్థములు. నా యెడాటమందున్ = నా విషయమందు.

తాత్పర్యము.

సీతాదేవి క్షేమముగా నున్నదని వానరు లందఱుఁ జెప్పగా విని రామచంద్ర మూర్తి యిట్లనెను. వానరులారా! సీతాదేవి యెందున్నది? ఏమి చేయు చున్నది? నా విషయమందే నియమము గలదై యున్నది? ఇదంతయుఁ జెప్పుఁడని యడుగఁగా వానరులు హనుమంతా! చూచివచ్చిన వాఁడవు నీవే చెప్పు మనిరి.

క. హనుమంతుఁడును వసుధా,తనయామణి యుండు దెసకుఁ ♦ దన్వీమణికిన్
సనయంబుగ శిరమున వం,దన మొనరిచి యిట్టు లనియె ♦ దశరథసుతుతోన్.

తాత్పర్యము.

హనుమంతుఁడు సీతాదేవి యుండు దిక్కునకును, సీతాదేవికిని వినయముతో శిరస్సు వంచి నమస్కరించి శ్రీరామచంద్రమూర్తితో నిట్టు లనెను.

పైతృక కర్మములకుఁ దప్ప శుభకర్మములకు దేనికిఁ బనికిరాని దక్షిణదిశ సీతాదేవి యుండు కారణముచే హనుమంతునకు వందనీయ యయ్యెను. ఈ యభిప్రాయము సూచించుటచే దక్షిణదిశ యని చెప్పక సీతాదేవి యుండు దిశ యని కవి చెప్పెను. దీనివలన మహానుభావులు స్త్రీపురుషులే గాక వారుండు ప్రదేశములు పూజ్యములే యగుచున్నవి. ఆశ్రిత మహిమవలన, నాశ్రయము మహిమగల దగుచున్నది. దీనివలననే సీతాదేవి విషయమున హనుమంతున కెట్టి భయభక్తులు గలవో తెలియనగు.

—♦ హనుమంతుఁడు శ్రీరామునకు సీతాదేవి లంకయం దున్న దని తెల్పుట ♦—

సీ. శతయోజనాయత♦సాగరంబును దాఁటి భూమిజఁ గనుఁగోర్కెఁ♦బోయినాఁడ
నచట దుష్టాత్ముఁ డౌ♦నసురారి రావణుం, డేలెడి లంక య♦న్పోళ్ళు గలదు
ఆ రాక్షసేశ్వరు♦నంతఃపురంబున, స్వాభిలాషంబు నీ♦యంద యునిచి
జీవించి యుండెడి♦సీతను గంటి వి,రూపరక్షస్త్రీలు♦రూక్షముగను

తే. మీఁదఁ మీఁదను దర్జింప♦మిడుకుచున్న,దతివ దుఃఖ మెఱుంగని♦యట్టిసౌఖ్య
శీల యింతంత యనుచును♦జెప్ప రాని,శోకమునఁగుందు చున్న ద♦శోకవనిని.

అర్థములు. శతయోజనాయత సాగరము = నూఱు యోజనములు నిడివిగల సముద్రమును – ప్రోలు=పట్టనము – ఇది పురశబ్దభవము– స్వాభిలాషంబు = తనకోరిక యంతయు – విరూప రక్ష స్త్రీలు = వికార స్వరూపములుగల రాక్షసస్త్రీలు– రూక్షముగను=కఠినముగ– తర్జింపఁగ=భయపెట్టఁగా.

తాత్పర్యము.

నూఱు యోజనములు నిడివిగల సముద్రమును దాటి సీతనుజూచు కోరికచేఁ బోయితిని అచట చెడుమనస్సుగల దేవవిరోధిరావణుఁ డేలులంక యనుపట్టణమున్నది. ఆ రాక్షసరాజు నింటియందు యితర కోరిక యేదియును లేక తన కోరిక యంతయు నిన్నుఁ జూచుట యందే యునిచి యూపిరితో నుండెడి శీతను జూచితిని. మాటలఁబట్టి చేష్టలఁబట్టి ప్రాణమున్నదని తెలిసికోఁదగినదే కాని యూరక రూపము చూచిన ప్రాణమున్న దానివలెఁ గానరాదు. అట్టి యామెను వికార స్వరూపములు గల రాక్షస స్త్రీలు ఒకరివెంట నొకరు బెదరింపఁగా దుఃఖించు చున్నది. ఆమె దుఃఖమనునది యెఱుఁగక సుఖింప వలసిన దయ్యు యింతం తనరాని శోకముచే నశోకవనమునందు శోకించుచున్నది.

సీ. రావణు నంతఃపు♦రంబునఁ జెఱఁ జిక్కి, రాకాసిమూఁకలు♦రక్ష సలుప
నొకటిగఁ బెనఁగొన్న♦యొంటివేనలితోడఁ, గటిక నేలను బండి♦కష్టపడుచు
ననవరతంబుఁ ద్వ♦ద్ధ్యానరతాత్మయై, యడజడి హేమంత♦మందు నళిని
నాఁగ వివర్ణయై♦నవసి రావణుకోర్కె, వృథచేయ దేహంబు♦విడువఁ దలఁచి

ఆ. నిశ్చయించి యున్న ♦ నెలఁత నెట్టెటులో, యేను గాంచి యామె ♦ కెఱుకపడఁగ
నెలమిఁ బొగడినాఁడ ♦ నిక్ష్వాకువంశవి, ఖ్యాతి దేమి నమ్మఁ ♦ గలుగుటకును.

అర్థములు. వేనలి = జడ - వేణీ శబ్ద భవము - అనవరతంబు = ఎల్లప్పుడు - త్వత్ + ధ్యాన + రతాత్మయై = నిన్ను ధ్యానించుట యందే ప్రీతిగల మనస్సు గలదై - అడజడిఁ = దుఃఖముచే - నళిని = తామరతీఁగ - నవసి = చిక్కి.

తాత్పర్యము.

రావణుని యంతఃపురమందుఁ జెఱలోఁ జిక్కుకొని రాక్షసస్త్రీల గుంపులు తనపైఁ గావలి యుండఁగా వెంట్రుక లన్నియు నొక్కటిగఁ జేసుకొని పోయిన జడతో గోడ్డు నేలపైఁ గూర్చుండుటకును శక్తిలేక బండుకొని బాధపడుచు సర్వకాల సర్వావస్థల యందు నిన్ను ధ్యానించుటయందే ప్రీతి గల మనస్సు గలదై బాధపడుటచే మంచుకారునాఁటి తామర తీఁగవలె కాంతిచెడి (శుష్కించి, రావణు కోరిక యెటులైన వ్యర్థము చేయవలయునను కోరికతోనేకాని బ్రదుకు కోసి గాదు) దేహంబు వదల నాలోచించి నిశ్చయించి యున్న యామెను నట్టి సమయంబున నేను నతిప్రయాసము మీఁదఁ జూచి నారాక యామెకుఁ దెలియు నట్లు ఇక్ష్వాకు వంశరాజుయొక్క కీర్తిని నామెను నమ్మించుటకై పొగడితిని.

క. ముచ్చటలను సర్వార్థము, లచ్చపలాక్షికిని జెప్ప ♦ నగచరపతితో
నచ్చపుస్నేహము మీకిట, నచ్చుపడుట కబ్జనేత్ర ♦ హర్షం బందెఁ. ౧౮౦౧

తా. చూడు — ౧౩౩౫ ప.

—♦ హనుమంతుఁడు శ్రీరామునితో సీతాదేవి వాక్యంబులు దెల్పుట. ♦—

ఉ. నిన్ను మహానుభావ! కడు ♦ నిర్మలచిత్తమునన్ స్మరించుచున్
సన్నుతభక్తిశీలములు ♦ సాధ్వీగుణంబుఁ దపంబుఁ బాయకం
దున్నది, నేను జూచితి, ర♦ఘూత్తమ! నీకు నభిజ్ఞ చిత్రకూ
టోన్నతసీమఁ గాకికథ ♦ యొండు వచించియు నాకు నిట్లనెన్. ౧౮౦౨

అర్థములు. మహానుభావ = ఓ మహానుభావుఁడా యని సంబోధనముగ నైనఁ జెప్పవచ్చును. మహానుభావురా లగు సీతాదేవి యని యైనఁ జెప్పవచ్చును. రెండవదియె ప్రశస్తము, ప్రస్తుతము.

తాత్పర్యము.

మహామహిమగల యా సీతాదేవి నిన్ను మిగుల నిర్మలమైన మనస్సుతో స్మరించుచు సత్పురుషులచేత స్తోత్రము చేయఁబడిన భక్తి-స్వభావము-పాతివ్రత్యము-తపస్సు (ఉపవాసాది) వదలక యా యశోక వనమునం దున్నది. ఇది యితరులు నాకుఁ జెప్పఁగా నేను నీకుఁ జెప్పరాలేదు. నేను కన్నులారఁ జూచి చెప్పుచున్నాను. నీవు చూచి యుండిన నీతో నేమైనఁ జెప్పెనా యందువా నీకు గుర్తుగా చిత్రకూట పర్వతమున నెత్తగు ప్రదేశమందు జరిగిన కాకి కథ చెప్పి మఱియు నిట్లనియె.

క. హనుమా! యిచ్చటఁ జూచిన, దనుమా సర్వంబుఁ బురుష ♦ హర్యక్షునితో
నినకులదీపకుతో, నని, తను నాజ్ఞాపించెఁ గంజ♦నయన నృపాలా. ౪౦౩

అర్థములు. పురుష హర్యక్షునితో = పురుష సింహముతో.

తాత్పర్యము.

స్పష్టము.

క. మిక్కిలియత్నముతోనే, నక్కఱ రక్షించితిని మ♦హామణి యిది నీ
వ క్కాకుత్స్థున కిమ్మా, యక్కపినాథుండు వినఁగ♦ హనుమా యిట్టుల్. ౧౪౦౪

అర్థములు. మిక్కిలి యత్నముతో = మిగులఁ గష్టపడి – రాక్షసులపాలు గాకుండునట్లు.

తాత్పర్యము.

స్పష్టము.

ఆ. గండభాగమునను ♦ గరఁగిపోఁ దిలకంబు, స్వేదబిందువులను ♦ జిత్రరీతి
మణిసిలను నొకంట♦ మమతమీఱఁగ నీవు, తిలకముంచుటయును♦ దలఁపవలయు.

తాత్పర్యము.

చూ. ప. ౯౯౩.

ఉ. దాఁచితి నీజలోద్భవము ♦ దాశరథీ! యిది నీ మనోంబుజం
బాఁచి కొనంగఁ జాలుట మ♦హాత్మ! భవద్విరహానలంబు నన్
గ్రాఁచెడివేళ నిన్గనిన♦కైవడి దీనిని గాంచి పొంగుదున్
సైఁచుట దోఁప దింక రఘు♦చంద్రమ! యియ్యది నీకుఁ బంచితిన్. ౧౪౦౬

తాత్పర్యము. చూ. ప. ౯౯౫.

క. నెల యొక్కటి యెటు లేనియు, నిలుపుదుఁ బ్రాణంబు మేన ♦ నీరజనయనా!
నెల కావల బ్రదుకను నోఁ, కులచేతికిఁ జిక్కి నిజము♦ కువలయనాథా! ౧౪౦౭

అర్థములు. నోఁకులు = రాక్షసులు.

తాత్పర్యము.

స్పష్టము.

చ. అనుచుఁ గృశాంగి ధర్మరత ♦ యాశరసౌధనిరుద్ధ ధారిణీ
తనయ మృగాక్షి పల్కెను య♦థాస్థితి సర్వము నీకుఁ దెల్పితిన్
వనధిఁ దరింప బూనుము ది♦వాకరవంశమణీ! యెటేని యం
చును రతనంబుఁ జేతనిడె ♦ సొంపుగ వారలు విశ్వసింపఁగన్. ౧౪౦౮

అర్థములు. కృశాంగి = బక్కచిక్కిన దేహము గలది – ధర్మరత = అట్లుండియు పతివ్రతా ధర్మమందే ప్రీతిగలది, ఆశర = రాక్షసుని – సౌధ = అంతఃపురము, మేడయందు – నిరుద్ధ = నిర్బంధింపఁబడినది – యథాస్థితి = ఉన్నదున్నట్లు.

## తాత్పర్యము.

ఈ ప్రకారము తానెంతయో శుష్కించి వరుగైయున్నను పతివ్రతా ధర్మమునఁ బ్రీతి మాత్రము వదలక రావణు నింట నిర్బంధమునఁ జిక్కి సీతాదేవి చెప్పెను. ఉన్నది యున్నట్టు సర్వము నీకుఁ దెలిపితిని. సూర్యవంశ రత్నమా! నీవు సముద్రము నెటులైన దాఁటు నాలోచన సేయుము. అని చెప్పి వారందఱు నమ్మునట్లు రత్నమును రామచంద్రమూర్తి చేతిలో నుంచెను.

—♦ ౬౬-వ సర్గము. శ్రీరాముఁడు సీతాదేవిచూడామణినిఁజూచి దుఃఖించుట. ♦—

క. రాముఁడు తన్మణిఁ గైకొని, ప్రేమంబున నక్కుఁ జేర్చి ♦ ప్రియసోదరుతోఁ
భామినిఁ దలంచి దుఃఖో,ద్దామతఁ బలవించి సూర్య♦తనయున కనియెన్. ౧౮౦౯

అర్థములు. అక్కున్ = ఱొమ్ము - దుఃఖోద్దామతన్ = దుఃఖాతిశయముచే - పలవించి = ఏడ్చి.

## తాత్పర్యము.

ఆ మణిని రామచంద్రమూర్తి దీసికొని సీతాదేవియే వచ్చినట్లు తలంచి యామెను గౌఁగలించుకొనునట్లు ఱొమ్మున కొత్తుకొని సీతను దలంచి దుఃఖాతిశయముచే లక్ష్మణుతోను సుగ్రీవునితోను నిట్లనెను.

ప్రియసోదరుతోఁ దలంచి పలవించి యనుటచే దానిని జూడఁగానే లక్ష్మణుఁడును దుఃఖించె నని భావము.

సీ. సుగ్రీవ! యీ దివ్య♦చూడామణిని జూడఁ, జూడ నామనము లే♦దూడఁ గన్న
ధేనువు చేఁపెడు♦తెఱఁగునఁ గరగెడి-న్మాతనూభవకు మా♦మామగారు
వఱలుప్రేమమున సు♦ద్వాహవేళను శిర, మం దిది గూర్ప న♦త్యంతకాంతిఁ
దేజరిల్లుచు నుండె ♦ దివ్యంబు సజ్జన, పూజితం బంబుసం♦భూత మైన

ఆ. దీని నధ్వరమునఁ ♦ దృప్తుఁడై శక్రుండు, జనకునకు నొసంగె ♦ సారదమును
మణిని జూచినంత ♦ మా మామ జనకుని, నాత్మజనకుఁ గన్న ♦యట్టు లయ్యె.

అర్థములు. ఉద్వాహవేళను = పెండ్లిసమయమున - దివ్యంబు = దేవతాసంబంధమైనది - అంబుసంభూతంబు = జలములందుఁ బుట్టినది-అధ్వరమునన్ = యజ్ఞసమయమున - శక్రుండు = ఇంద్రుడు.

## తాత్పర్యము.

సుగ్రీవా! మనుష్య దుర్లభమై దేవతలు ధరించు నీ చూడామణిని జూడఁగా నా మనస్సు లేఁత దూఁడ చూచినంతన యావు చేఁపు విధముఁగా గరఁగున్నది. దీనిని మా మామగారు సీతాదేవికిఁ బెండ్లికాలమందు శిరంబున ధరింపఁ జేయఁగా నామె మిగులఁ గాంతిగలదై ప్రకాశించెను. ఇది దివ్యము. సత్పురుషపూజితము. జలములందుఁ బుట్టినది. దీనిని మామాగారు యజ్ఞముచేయు సమయంబున సంతోషించి

యింద్రుఁ డాయనకిచ్చెను. దీనిని జూడఁగానే మా మామ జనకరాజును, మాతండ్రిని జూచినట్లైనది. ౯౫౭వ పద్యముచూచునది. మా మామగారునుననుటచే నాయన ప్రక్కనుండిన యత్తగారును స్మృతికి వచ్చినదియే. నుకారమీయర్థమిచ్చుచున్నది.

క. ఆ తరుణీమణిశిరమున, భాతిం జెలువారు దీనిఁ ♦ బరికింపఁగ నా
 కో తరణిజ! భూసుతయే, ప్రీతిం జనుదెంచినట్టి♦రీతిగఁ దోఁచెన్. ౧౧

అర్థములు. భాతిన్ = కాంతిచే-పరికింపఁగన్=చూడఁగా ప్ర-పరీక్షించు.

తా త్ప ర్య ము.

ఆ సీతాదేవి శిరస్సునందుఁ బ్రకాశించు దీనిని జూడఁగానే సీతాదేవియె వచ్చినదని తోఁచెను.

ఉ. వారక దప్పిచే నలఁగు♦వానికి నీరము పోయురీతిగా
 సారెకు సీతవాక్యముల ♦ సౌమ్యగుణా! వచియింపవయ్య, యా
 వారిజనేత్ర లేకయును ♦ వారిజ మీ రతనంబుఁ గంటి, నా
 కారయ నింతకంటెను మ♦హాత్తరదుఃఖము లున్నె లక్ష్మణా! ౧౨

తా త్ప ర్య ము.

మిగుల దాహముచేఁ దపించు వానికిఁ ద్రావ నీళ్ళు పోసినట్టు లాంజనేయా! నాకు సీతాదేవి వాక్యముల వినిపింపుము. లక్ష్మణా! సీతాదేవి లేక యీ చూడామణిని జూచితిని. నాకింతకంటె గొప్ప దుఃఖము గలదా?

చ. ఒక నెలదాఁకఁ బ్రాణమున ♦ నుండఁగఁ జాలినయేని యింక జా
 నకి చిరజీవ, నే నొకక్ష♦ణం బసితేక్షణ లేక మేనిపొం
 దిక బ్రదుకంగ నేర, సుమ♦తీ! ననుఁ దోడ్కొని పోఁగదే ప్రియా
 నికటముఁ జేర, వార్తను వి♦నిన్ వశమా యిట నాకు నిల్వఁగన్? ౧౩

అర్థములు. అసితేక్షణ = నల్లని కలువలవంటి కన్నులు గలది - ప్రియానికటము = ప్రియురాలి సమీపము-వినిన్=వినియును, వినియున్ అను పదములో సముచ్చయము లోపింపఁగా మిగిలిన రూపము. నుకార మర్థవిశేషంబును దెలుపును.

తా త్ప ర్య ము.

నన్ను విడిచి సీతాదేవి యింక నొక నెల జీవించి యుండఁగలదేని యామెకు మరణమే లేదు. ఎన్ని దినాలైనను బ్రదికి యుండఁగలదు. నేనో యీ కాటుక కంటిని విడిచి యొకక్షణమైన బ్రతికి యుండలేను. కావున నేను బ్రతికి యుండవలెనని మీకుఁ గోరిక గలదేని నన్నామెసమీపమునకుఁ దీసికొని పొండు. ఏలన సీత యీ విధముగ నున్నదని విని కూడ నిచ్చటఁ బ్రాణముతో నుండ నాకు సాధ్యమా?

ఇంతటి దుఃఖమందును రామచంద్రమూర్తి దన్ను సీతాదేవి యొద్దకుఁ దీసికొని పొమ్మననేకాని యామె నిచ్చటికేల తేలేదని కాని, యిప్పుడైనఁ దీసికొని రండని కాని యనలేదు.

మ. అకటా! యెట్లు వసించునో కదె మదీ♦యాత్మేశ భీశీల యా
వికటాలాపభయంకరాస్యసురవి♦ద్వేష్యాళిమధ్యంబునన్;
బ్రకటాభ్రావృతశారదేందుసమ మై♦ పద్మాక్షి నెమ్మోము త
న్నికటానేకపలాశనావృతము నై ♦ నిస్తేజమై యుండదే? ౧౪౧౪

అర్థములు. మదీయాత్మేశ = తన యాత్మకు నేనీశ్వరుఁడ నని సీత చెప్పెను. గాని, నాయాత్మ కామెయే యీశ్వర, యీశ్వరియు. నా మనస్సు, నా ప్రాణములు నాజీవుఁ డామె వశమున నున్నవి. దీనివలనఁ బరస్పర సామ్యము చెప్పఁబడెను. భీశీల = భయపడు స్వభావముగలది, వికటాలాప = విరుద్ధముగ, భయంకరముగ మాటలాడు నట్టియు, భయంకరాస్య = దిగులుపుట్టించు ముఖములు గలట్టియు, సురవిద్వేష్యాళి = రాక్షసుల, మధ్యంబునన్ = నడుమ, ప్రకటాభ్రావృత = పెద్దమేఘముచేఁ గప్పఁబడిన శారదేందుసమమై = శరత్కాల చంద్రునితో సమానమై, తన్నికట = ఆమె సమీపమం దుండు, అనేక పలాశనావృతమునై = పెక్కు రాక్షసస్త్రీలచేఁ జుట్టఁబడినదై, నిస్తేజమై = కాంతిపోయినదై.

## తాత్పర్యము.

నా యాత్మకు నీశ్వరయై భయపడు స్వభావముగల యా దేవి దిగులు పుట్టించు మాటలు, దిగులు పుట్టించు నాకారములు గల రాక్షసుల నడుమ యెట్లు జీవించి యున్నదో కదా. ఇది యెంతటి యసాధ్యకార్యము. ప్రాణముతో నున్నది కాని, యుండినను మేఘములచే నావరింపఁబడిన శరత్కాల చంద్రునివలెఁ గాంతిహీనమై యుండదా?

క. హనుమా! భామిని పలుకుల, నసుమా మందునను బ్రదుకు ♦ నాతురురీతిన్
విని బ్రతుకువాఁడ నన్నే, మని మధురాలాప మధుర ♦ యనె మచ్చ్యుతమై.

అర్థములు. భామిని = 'కోపనా సైవ భామినీ' అమరము. కోపము గలది భామిని. ఇట్లు చెప్పుటచే నాంజనేయా నేను వచ్చి తన్ను రక్షింపలేదని నామీఁద కోపము గలదై యున్నదా యని భావము. ఆతురురీతిన్ = రోగివలె, మధురాలాప = తియ్యని మాటలు గలది – ఆమె విషయమై నీవు చెప్పిన మాటలు నీ నోర వచ్చిననే యింత తియ్యగా నున్నవే, ఇఁక నామె నోరనుండి వెలువడినవి యింకెంత తియ్యగా నుండునో. ఏలన నామె స్వభావమున మధుర కావున. మధువు కలది మధుర. మధు వనఁగా 'మన్యతే అభిలష్యత ఇతి మధు' – జనులచే నభిలషింపఁబడునది కావున మధు వనఁబడును. మధు వనఁగాఁ దేనె. ఆమెయే మధురయైనపు డామె మాటలు యేల మధురముగ నుండవు? ఏ మందున కైనను దేనె యనుపానము. ఆమెను గుఱించి నీవు చెప్పెడు నీ మాటలు నా కౌషధము వంటివి. ఆమె మాటలు తేనె యనుపానముతోఁ జేర్చినట్టివి – ఇట్లగుటచే నామె నోర నేమాటలు వచ్చెనో

వానినే చెప్పు మని భావము. మచ్చ్యుతయై = నాచే విడువఁబడినదై. మధుర = సుందరి, సుందరి మాటలు సుందరముగానే యుండును.

తాత్పర్యము.

హనుమా! సీతాదేవి నేను వచ్చి తన దుఃఖము బాప లేదని కోపించినదా చెప్పుము. రోగి యౌషధము దిని బ్రదుకునట్లు నీ మాటలు విని బ్రదుకువాఁడను. తేనెవంటి మాటలు, తేనెవంటి గుణము స్వభావము గల యామె నేను విడుచుటచే నన్నుద్దేశించి యేమి చెప్పెనో యా మాటలే చెప్పుము.

—♦ ౬౭-వ సర్గము. హనుమంతుఁడు శ్రీరామునకుఁ గాకాసుర వృత్తాంతం బభిజ్ఞానంబుఁ దెలుపుట. ♦—

క. అని రామచంద్రుఁ డడిగిన, హనుమంతుఁడు భూమికన్య ♦ యాడిన వెల్లన్
విని చెసతి చిత్రకూటం,బున వృత్తము గుఱుతుఁ జెప్పెఁ ♦ బురుషవరేణ్యా! ౹౧౹

అర్థములు. వినిచెన్ = వినునట్లుఁ జేసెను, వినిపించెను ప్రేరణార్థకమున వినిచెన్; చిత్రకూటంబున వృత్తము = చిత్రకూటము నందలి చర్య.

తాత్పర్యము.

అని రామచంద్రమూర్తి యడుగఁగా హనుమంతుఁడు సీతాదేవి చెప్పిన మాటలెల్ల వినిపించు పురుషశ్రేష్ఠుఁడా! చిత్రకూట పర్వతమున జరిగిన వృత్తాంతము గుఱుతుగాఁ జెప్పెను.

క. నీతోడుత నిద్రించుచు, సీతాసతి మున్నె లేవఁ ♦ జెచ్చెరఁ గాకం
బా తరుణీ స్తనమధ్యము, శాతనఖాగ్రమునఁ జీరె ♦ సహసోద్గత మై. ౹౨౹

అర్థములు. శాతనఖాగ్రమునన్ = పదునైన గోటికొనచే- చీరెన్ = గీచెను, సహసోద్గతమై = తటాలున నెగిరి వచ్చినదై - సుప్సుపేతి సమాసము.

తాత్పర్యము.

నీతోడ నిద్దుర పోవుచు సీతాదేవి ముందుగా లేవఁగా తటాలునఁ గాకి యొకటి యెగిరి వచ్చి యామె స్తనమధ్యమునందుఁ దన వాఁడి గోళ్ళకొనలచే గీచెను.

క. ఆర్యజనోత్తమ! నీవును, బర్యాయంబునను నీదు ♦ పడఁతుకతోడ సౌ
కర్యంబుగ నిద్దుర గొన, ధైర్యంబునఁ బక్షి మఱలఁ ♦ దద్దయు నేఁచెన్. ౹౩౹

అర్థములు. పర్యాయంబునను = క్రమముగా, ఆమె లేచిన తరువాత నీవు - ఏఁచెన్ = బాధించెను.

తాత్పర్యము.

నిద్దురపోవు చుండినది యామె లేచి కూర్చుండఁగా నీ వామె తొడపై దలపెట్టి నిద్రించితివి. ఇట్లు నీవు సుఖముగా నిద్రించు సమయమున నా కాకి మఱల వచ్చి యామెను బాధించెను.

క. మాటికి మాటికి ముక్కునఁ, గాటు పడం బొడువఁ బొడువ♦గాకము నీ సీ
మాటిఁ దదుద్గతరక్తము, సూటిగ నీమీఁదఁ బడియె♦శుద్ధచరిత్రా! ౧౮౯

అర్థములు. కాటు = గాయము - సీమాటి = ఉత్తమ స్త్రీ- తత్ + ఉద్గత రక్తము = ఆమెనుండి వెలువడిన నెత్తురు, సూటిగ = సరిగా.

తా త్ప ర్య ము .

ఆ యుత్తమస్త్రీని కాకి పలుమాఱు గాయము పడునట్లు ముక్కుతోఁ బొడువఁగా నామెనుండి వెలువడిన నెత్తురు సరిగా నీమీఁదఁ బడెను.

ఉ. పాపపుఁబుల్గు సీత కిడు♦బాధ సహింపఁగ లేక నిద్దురన్
లేచెను గాదె రామ! నిను♦లేచి నృపాల! స్తనాంతరంబునన్
జేపడియున్న గాటుఁ గని♦చిత్తమునం గనలూని యెవ్వఁడీ
పాపముఁ జేసెఁ జెప్పు మికఁ♦బైదలి వానిని రూపు మాపెదన్. ౧౯౦

తా త్ప ర్య ము . చూ. ప. ౯౩౦

ఆ. రోషవేగమునను♦రోఁజెడి పంచవ, క్త్రంబుపాముతోడఁ దవిలి యెవ్వ
డాడుకొనఁగఁ జొచ్చె♦నంబుజలోచన, యనితి వపుడు నీకు♦నభిముఖముగ.

తా త్ప ర్య ము . చూ. ప. ౯౩౧

ఆ. రక్తసిక్తనఖర♦యుక్త మా కరటంబుఁ, గనితి కనినయంతఁ♦గాకిరూపుఁ
గొనినయట్టి శక్రు♦కొమరుండు గాడ్పునఁ, బర్వతంబు డిగ్గి♦పాఱఁ దొడఁగె.

తా త్ప ర్య ము . చూ. ప. ౯౩౨

సీ. అది చూచి భృ♦శాగ్రహావశుఁడవై, యా యరిష్టము పట్ల♦నదయుఁ డగుచు
దర్భాసనంబున♦దర్భయొక్కటిఁ దీసి, బ్రహ్మమంత్రంబునఁ♦బ్రజ్వరిల్లఁ
జేసి వాకళిమీఁద♦వేసిన నదియును, నంబరపథమున♦నరుగుచున్న
బలిభుక్కు వెన్నంటి♦పఱవఁ దొడంగెను, గాకియు వెఱ మూఁడు♦లోకములను
తే. సంచరించుచుఁ బలువుర♦శరణు వేఁడెఁ, గన్నతండ్రియు సురలును♦ఘనమహర్షి
చయములును దాము గావంగఁ♦జాలమనగ, మఱలి చను దెంచి దేవనిన్♦శరణుఁ జొచ్చె.

తా త్ప ర్య ము . చూ. ప. ౯౩౩

సీ. శరణంచు ధరణిపై♦సాఁగిలఁ బడినట్టి, వాయసుఁ గని వాఁడు♦వధ్యుఁడయ్యుఁ
జంపక కాచితి♦పెంపారు కరుణచే, దిక్కెవ్వరును లేక♦దీనుఁ డగుచు
శరణాగతుం డైన♦జాల్మునాతనిఁ జూచి, వ్యర్థంబు పోదు బ్ర♦హ్మాస్త్ర మేమి
చెప్పెద వనినను♦జేకొన నిమ్ము నా, కుడికంటి నని యె నా♦ చెడుగు కాకి
ఆ. బెడిద మైన శరము♦కుడికన్ను హరియించి, చనియెఁ జనియెఁ గాకి♦చావు దప్పి
కన్ను లొట్టవోవఁ♦గాకుత్స్థకులునకా, దశరథునకు భక్తి♦దండమిడుచు. ౧౯౪

తా త్ప ర్య ము . చూ. ప. ౯౩౪

క. ఈ విధమున నస్త్రకళా,కోవిదతతిమేటి సత్యగుణధాముఁడు స
ద్భావుఁడు సచ్ఛీలుం డే,లా విడువం డస్త్ర మొండు♦నసురావళిపై? ౧౪౨౫

తాత్పర్యము. చూ. ప. ౯౩౮

మ. వరదివ్యాస్త్రవిదుండ దేల యసుర♦వ్రాతంబుపై నంపఁడు
ద్ధురఘోరాస్త్ర మొకండు! దేవదనుజ♦స్తోమాహిగంధర్వులేన్
దిరులై చూడఁగ లేరు సంగరధరి♦త్రిన్ రామునిన్; నాపయిం
గరుణాలేశమె యున్నఁ బంక్తివదనున్♦ఖండించుఁ గాకింక నేన్. ౧౪౨౬

తాత్పర్యము. చూ. ప. ౯౩౯

ఉ. అన్న యనుజ్ఞఁ బొంది యహి♦తాంతకతుల్యుఁడు లక్ష్మణుండు నే
నన్న దియేల కావఁగ మ♦నంబున నెంచఁడు? సర్వభుజ్మరు
త్సన్నిభు లన్నదమ్ములు న♦జయ్యులు దక్షు లుపేక్షసేత కో
యన్న! నిజంబు మత్కృతమ♦హత్తరపాపమె హేతు వెన్నఁగన్. ౧౪౨౭

తాత్పర్యము.

సీతాదేవి యేమాటలు చెప్పెనో యామాట లట్లె నీవు చెప్పుమని రామచంద్రమూర్తి యడుగుటచే నామె మాటలే హనుమంతుఁడు చెప్పెను.

—♦ సీతాదేవిని దా నూరార్చిన విధంబు హనుమంతుఁడు శ్రీరామునకుఁ దెలుపుట ♦—

క. అని దీనాలాపంబులఁ, గనుఁగవ బాష్పంబు లురలఁ♦గళవళ పడుచున్
జనకజ పల్కిన విని యో, జనవర! యిట్లంటి సతికి♦సాంత్వవచనముల్. ౧౪౨౮

అర్థములు. దీనాలాపంబులన్ = శోకముతోఁ గూడిన మాటలు. సాంత్వవచనముల్ = ఊరడింపు మాటలు. కనుఁగవన్ = రెండు కన్నులనుంచి.

తాత్పర్యము. స్పష్టము.

మ. వినుమీ సత్యము జేసి పల్కెదను దే♦వీ? రామభద్రుండు త్వ
జ్జనితార్తిన్ విముఖుండు సర్వమునకున్♦సంతప్తుఁడై యుండెడిన్
గని యాయన్న యవస్థ లక్ష్మణుఁడు శో♦కక్షుబ్ధుఁ డయ్యెం జుమీ
కనితిన్నిన్నిపు డెట్లొ కేలకిట, నిం♦కం జాలి నీ కేటికిన్. ౧౪౨౯

తాత్పర్యము. చూ. ప. ౯౪౨

క. ఇడుమలఁ గుందెడి కాలము, గడచెన్ దుఃఖాంత మిపుడ♦కనియెద వాత్రం
పడుచు విభు లెదురు చూచుచుఁ, బడఁతీ! యున్నారు లంక♦భస్మము సేయన్.

తాత్పర్యము. చూ. ప. ౯౪౩

క. ఆహవమున సహబాంధవు, ద్రోహిని రావణు వధించి♦ద్రుతగతిని జగ
న్మోహిని నినుఁగొని పురికి, త్సాహంబునఁ బోవు రామ♦చంద్రుఁడు ప్రీతిన్.

తాత్పర్యము. చూ. ప. ౯౪౪

ఉ. రాముఁ డెఱుంగు గుర్తొకటి ♦ రాజసుతా! యిడు మంతె చాలు నా
భామిని నాల్గు దిక్కులను ♦ బాఱఁగఁ జూచి నిజప్రవేణికా
సీమను గూర్పనైన మణిఁ ♦ జీఱచెఱంగున నుండి విప్పి స
ప్రేమను నాదుచేత నిడ ♦ దేవిరొ నే నిఁకఁ బోయి వత్తునే. ౧౨౩౨

అర్థములు. నిజప్రవేణికాసీమను = తన జడయందు-కూర్పనైన మణిన్ = కూర్ప ననువగు రత్నమును-సీతాదేవి కొన్ని సొమ్ములను జాఱవైచి, కొన్ని చెట్ల కొమ్మలకుఁ దగిలించెను గాని యీ జడబిళ్ళ సముద్రమునందుఁ బుట్టి యింద్రునిచే నీయఁబడిన దివ్యరత్న మగుటచే బయటఁ గానవచ్చిన రావణుఁడు హరించు నేమో యని దానిని మాత్రము తలనుండి తీసి రాక్షస స్త్రీలకుఁ గూడఁ దెలియకుండ చీర కొంగున ముడివైచి చీర బొడ్డులో దోపుకొని యుండెను. దీని వలన సీతాదేవి ద్రావిడుల వలె గూడకట్టు కాక యౌత్తరాహిక స్త్రీలవలెఁ గుచ్చిళ్ళు జాఱవిడిచి గోఁచి పెట్టి చీర కట్టి యుండెనని తోఁచు చున్నది. ఈ విధముగనే కదా చీరలు కట్టుకొను స్త్రీలు ధనమును సొమ్ములను నేఁటికిని దాఁచు చున్నారు.

## తాత్పర్యము.

అమ్మా! రాజపుత్రీ! రామచంద్రమూర్తి తెలిసికొనఁ గలిగిన గుర్తు నేదైన నొకటి యిమ్ము. అంతమాత్రము చేసినఁ జాలును. అని నేను జెప్పఁగా సమీపంబున రాక్షసస్త్రీలు లేకుండునట్టులే ప్రక్క-నా ప్రక్క-నాలుగువైపులఁజూచి వారుచూచిన రావణుతోఁ జెప్పుదు రేమో యను భయముచే వారికిఁ దెలియకుండఁదలలో ధరింప యోగ్యమైన యీ చూడామణిని చీరకొంగు ముడిలోనుండి తీసి నాయందలి ప్రేమచే నా చేత నుంచెను. అది తీసికొని యిఁకఁ బోయివత్తునా యంటిని.

చ. అని నమితోత్తమాంగమున ♦ నామె పదంబుల వ్రాలి లేవ న
య్యనఘయు నాదు వర్తనము ♦ నంబుధి దాఁటఁగ నుత్సహించుటల్
గని కనుదోయి బాష్పములు ♦ గ్రమ్మఁగ గద్గదకంఠ యై ధరా
తనయ మదాస్యముం గనుచు ♦ దైన్యము దోఁపఁగఁ బల్కె నీగతిన్. ౧౪౩౩

అర్థములు. నమిత+ఉత్తమాంగమునన్ = వంపఁబడిన శిరస్సుచే, అనఘ= పాపమెట్టిదో యెఱుఁగనిది, గద్గదకంఠయై=డగ్గుత్తిక పడుచున్న కంఠము గలదై, మదాస్యమున్ = నా ముఖమును.

## తాత్పర్యము.

ఇట్లు చెప్పి తల నామె పాదములపై వ్రాల్చి లేవఁగా నా పుణ్యాత్మురాలు నా ప్రయాణ సన్నాహము, సముద్రము దాఁట నుత్సహించుట చూచి రెండుకన్నుల నీళ్లుగాఱ, మాట తడబడ సీతాదేవి నా ముఖముఁజూచి శోకముతో నిట్లు పలికెను.

—♦ సీతాదేవి సందేశవాక్యములు హనుమంతుఁడు శ్రీరామునకుఁ దెలుపుట ♦—

క. హనుమా! కుశలం బడిగితి, ననుమా శ్రీరాము సతని♦యనుజు సుమిత్రా
తనయు సహామాత్యుని నిన, తనుజాతుని నందు నున్న♦తక్కినవారిన్. ౧౪౩౪
తాత్పర్యము. చూ. ప. ౧౦౦౨

క. అన్నా! రాఘవుఁ డెట్టులు. నన్ను విపత్సాగరంబు♦నం జెడ కుండన్
జెన్నారఁ బ్రోచు నా గతి, మన్నన మెయిఁ బలుక వన్న♦మఱవకు మన్నా!
తాత్పర్యము. చూ. ప. ౧౦౦౩

క. ఇన్నిచరాక్షసావళి, నన్ను భయము పఱుచు విధము♦నానావ్యసనా
పన్నత నేఁగుం డెడి గతి, విన్నప మొనరింపు ప్రోవ♦వెలయుత శుభముల్.
తాత్పర్యము. చూ. ప. ౧౦౦౪

క. ఈ విధి మీ యార్యామణి భూవల్లభ! భృశవిషాద♦పూర్వంబుగ సీ
తావరవర్ణిని పలికెను; నీ వా సతి కుశల యనుచు♦ నెఱనమ్ము మదిన్. ౧౪౩౭

అర్థములు. ఈ విధిన్ = ఈ ప్రకారముగ, ఆర్యామణి = ఆర్యస్త్రీలయందు శ్రేష్ఠురాలగు సీతాదేవి, భృశవిషాదపూర్వంబుగ = అయిశయించిన దుఃఖముతో - వరవర్ణిని=ఉత్తమస్త్రీ ''శీతే సుఖోష్ణసర్వాంగీ గ్రీష్మేతు సుఖశీతలా - భర్తృరక్తాచ యానారీసాతుస్యా ద్వరవర్ణినీ'' - రుద్రుఁడు. ఎవతె దేహము చలికాలము సుఖోష్ణముగను, ఎండకాలమందు సుఖశీతముగను నుండి భర్తయం దనురాగము గలదో యట్టి స్త్రీ వరవర్ణిని యనఁబడును. 'ఉత్తమా వరవర్ణినీ' యని యమరుఁడు.

తాత్పర్యము.

ఈ విధముగ మీ యార్యామణియు, వరవర్ణిని యగు సీతాదేవి మిగుల విషాదపడుచుఁ జెప్పెను. ఆమె జీవించియున్నదని నమ్ముము.

—♦ ౬౮-వ సర్గము. హనుమంతుఁడు సీతాదేవితోఁ దనకున్నైన సంభాషణముఁ దెలుపుట ♦—

క. నా పయి నీ స్నేహముచే, నీ పంపినవాఁడ ననెడి♦ నెఱనమ్మికచే
భూపాలోత్తమ! జానకి, యాపోవని రక్తి నిట్టు♦లనియెన్ నాతోన్. ౧౪౩౮

అర్థములు. ఆపోవని = తృప్తిలేని.

తాత్పర్యము.

నాయందు నీకుఁగల స్నేహభావము చేతను నీవు పంపినవాఁడ నెడి నమ్మకము చేతను తృప్తిలేని యనురాగముతో నాతో నిట్టు లనెను.

'ఓయి! సీత శీలవతి యంటివే పరపురుషుఁడవైన నీతో నింత చనవుగ నెట్లు మాట్లాడెనందువా? ఆమె నాతో మాట్లాడుటకుఁ గారణము నా యోగ్యత కాదు. నాయందు నీకు స్నేహభావము గలదనియు నీవు పంపిన దూతననియు నమ్మి నాతో నీ మాటలు చెప్పెను. నాయందునీకుఁ బ్రేమ లేదనియు ఏదో కార్యార్థముగ వచ్చిన

దూత యనియు తలఁచి యుండెనాఁ నాతో మాట్లాడి యుండదు. నాయందు నీకు ప్రేమయుండినను నీవు పంపిన దూత నని నమ్మకము లేకుండినను మాటలాడి యుండదు. ఈ రెంటికి నేను నిదర్శనములు చెప్పి చూపినపిమ్మటనే నాతో మన సిచ్చి మాటలాడెను. రావణాసురునితో మాటలాడినపుడు తృణ మడ్డము వేసికొని వెనుకప్రక్క తిరిగి మాటలాడెనుగాని హనుమంతునితో సమ్ముఖమ్ముగనే మాట లాడెను. దీనివలన భర్త కాంతరంగిక స్నేహితులై భర్తచేఁ బంపఁబడిన వారై రేని యట్టివారితోఁ బతివ్రతయు మాటలాడ వచ్చును.

క. రావణు వధించి రాఘవ,భూవరుఁ డెటుతోడుకొనుచుఁ ♦ బోవునొ నన్నీ
నీ వాగతి నిట నాగతి, వావిరి వినిపింప వలయు ♦ వాయుతనూజా! ౧౪౩౯

తాత్పర్యము. స్పష్టము.

క. నాపలుకు నీకు సమ్మత,మై పొనరినయేని శత్రు♦హరణసమర్థా!
యీపూఁట నిలిచి మఱుఁగున, రేపటఁ బోరాదె శ్రమము♦ప్రీలెడి నీకున్. ౧౪౪౦

తాత్పర్యము చూ. ప. ౯౭౧

క. ఓపావని! నీసన్నిధి,ప్రాపున ధృతిఁ గూరి యల్ప♦భాగ్యను క్షణమేన్
నీపుణ్యంబున శోకము, తాపంబుఁ దొఱంగి బ్రదుకు♦దానఁ గపీంద్రా! ౧౪౪౧

తాత్పర్యము చూ. ప. ౯౭౨

ఉ. పోయెద వేని పిమ్మ రఘు♦పుంగవుఁ జేరఁగ, నీవు గ్రమ్మఱన్
వాయుజ! వచ్చునందనుకఁ ♦ బ్రాణము లుండునొ యుండవో చుమీ
యీయెడలందు సందియము ♦ యెంతయు వేఁగెడు నాకు నిన్ను నన్
బాయుట గల్గ నేమి గని ♦ ప్రాణము నిల్చునొ నీవ చెప్పుమా. ౧౪౪౨

తాత్పర్యము చూ. ప. ౯౭౩

క. నీయందును నీకును దో,డై యరుదెంచిన కపీంద్రు♦లందును నాకున్
బాయనిసందేహం బో,వాయుజ! నాకనుల ముందర♦వర్తిలఁ దొడఁగెన్. ౧౪౪౩

తాత్పర్యము చూ. ప. ౯౭౪

చ. హరివర! ఋక్షసైన్యములు ♦ నానృపవర్యతనూజు లేని దు
స్తరజలరాశి దాఁట నెటు ♦ చాలుదు రన్న! తలంచి చూడఁగా
గరుడుఁడు నీవు మారుతుఁడు ♦ గాక మఱెవ్వరు భూతకోటిలో
వరజవ మొప్ప దాఁటఁ గలవారలు గానఁగరారు మారుతీ! ౧౪౪౪

తాత్పర్యము చూ. ప. ౯౭౫

క. కనుఁగొలఁది నసాధ్యం బౌ,పని యనుచుం దోఁచెఁ గార్య♦పద్ధతులను నీ
కననియది లేదు దీనికి, హనుమా! నీ వనుమ విన స♦మాధానంబున్. ౧౪౪౫

తాత్పర్యము చూ. ప. ౯౭౬

క. నీ వొకఁడవె యీ కార్యము, పావని! సాధింప శక్తి♦పరుఁడవు సుమ్మా
నీ వొకఁడవె యీకీరితి,చే విలసిల్లంగఁ గలవు ♦ శిక్షితవైరీ! ౧౪౪౬

తాత్పర్యము చూ. ప. ౯౭౭

క. బలములతో నిచటికి రఘు,కుల తిలకుఁడు వచ్చి కలనఁ గూల్చి దశాస్యున్
గెలుపొంది నన్ను దనపురి, కలవునఁ గొని చనినయేని ♦ యశ మది గూర్చున్.

తాత్పర్యము చూ. ప. ౯౭౮

క. వనమున నే నుండఁగఁ దల,మునుకలు నగు తనదు భీతి ♦ ముచ్చిలి తెచ్చెన్
దనుజుఁడు నను నావిధమునఁ, గొనిపోవుట యర్హ మా ర♦ఘుగ్రామణికిన్?

తా త్ప ర్య ము.

అడవిలో నే నుండఁగా తన ప్రాణభయమున మునిఁగి దొంగిలించి రాక్షసుఁడు నన్నుఁ దెచ్చెను. ఆ విధముగ దొంగతనముగ మరల నన్నుఁ దీసికొని పోవుట రఘువంశములోఁ బుట్టిన రాజులలో శ్రేష్ఠుఁడగు వానికిఁ దగిన కార్యమా? అది తన శూరధర్మమునకు నా వీరపత్నీత్వమునకు హానికరము కదా? కావున,

క. ప్రాకటశితనారాచా,నీకంబునఁ జలిపి లంక ♦ నేఱుగఁ గడిమిన్
గైకొని నన్నేగినచోఁ, గాకుత్స్థున కదియె తగిన♦కార్యము సుమ్మా. ౧౪౪౯

తాత్పర్యము చూ. ప. ౯౭౯

తే. పరమశూరుండు రాముండు ♦ భండనమున,నతనిమగటిమి కనురూప♦మైనదాని
యోజనయొనర్చి చెప్పుమా♦యోజమీఱ,వనచరకులావతంస!నీ♦వనుచుఁబలుక.

తాత్పర్యము. చూ. ౯౮౦.

ఉ. దేవి! కపీంద్రభల్లుకత♦తిప్రభువర్యుఁడు శౌర్యశాలి సు
గ్రీవుఁడు నీనిమిత్తము ప్ర♦కృష్టబలంబులతోడఁ దోడ్పడం
గా వెస వచ్చు నాతనికిఁ ♦ గైవసమై యసమానవిక్రముల్
దేవనిభుల్ మనోజవులు ♦ దిగ్గగనాటులు శత్రుమర్దనుల్. ౧౪౫౧

తాత్పర్యము చూ. ప. ౯౮౨

క. ఎంతగడుసుఁబని నైన ర,వంతయు వెత లేక సలుప ♦ నగువారలు వి
క్రాంతిని సాబ్ధిధరావని, గంతున వలగొనెడివారు♦గగనాధ్వగులై. ౧౪౫౨

తాత్పర్యము చూ. ప. ౯౮౩

క. నాకంటె గొప్పవారును, నాకున్ సరివారు గలరు ♦ నగచరులచటన్
నాకంటె హీనుఁ డగు కపి, యొక్కరన్యా! లేఁడు తీవ్ర♦కరసుతునొద్దన్. ౧౪౫౩

తాత్పర్యము చూ. ప. ౯౮౪

క. నేనే నినుఁ గాంచితి నఁట, యీసిస్తులబలుల నేమి♦యనవలయు నొకో
మానవపతి భూరిగుణా,హీనులఁ బంపండు పంపు♦నితరుల మొదలన్. ౧౪౫౪

తాత్పర్యము చూ. ప. ౯౮౫

సీ. కావున నీవు శో♦కంబు మానుము దల్లి, దుఃఖకాలం బెల్లఁ♦దొలఁగి పోయె
నిదె పోయె నేఁ జెప్ప♦ ముదితులై క్రోఁతులు, వచ్చెద రొకగంతు♦వైచియిటకు
నా వీఁపుపై నెక్కి ♦ భూవిభుల్ శశిభాస్క,రులపోల్కి నీమ్రోల♦నిలుచువారు
ఇటవచ్చి యీ లంక♦నెల్ల సాయకములఁ, దుత్తుమురుగఁ బోవఁ ♦ద్రుంచువారు
ఆ. రామచంద్రవిభుఁడు ♦ రణరంగమం దిందు, సబలుఁ బంక్తికంఠు ♦ సంహరించి
నిన్నుఁ దోడుకొనుచు♦నెమ్మి నయోధ్యకు, బోవువాఁడు పువ్వుఁ♦బోఁణిచూడు.

తాత్పర్యము. చూ. ప. ౯౮౬

క. కనెదవు నఖదంష్ట్రాయుధ, ఘనవిక్రమపరుల దేవి ♦ కపిసింహములన్
వినెదవు శైలాంబుదనిభ, వనచర గర్జలను లంక ♦ వసుధాధ్రములన్. ౧౮౫౬

అర్థములు. నఖదంష్ట్రాయుధ = గోళ్ళు కోఱలు నాయుధములు గాఁ గల, ఘనవిక్రమపరులన్ = గొప్ప పరాక్రమము గలవారిని — శైలాంబుద నిభ=పర్వతములతోను మేఘములతోను సమానులైన, వనచర=వానరులయొక్క—గర్జలను=సింహనాదములను — వసుధాధ్రములన్ = కొండలయందు.

తా త్ప ర్య ము .

దేవి! కోఱలు గోళ్ళు నాయుధములు గాఁ గల పరాక్రమవంతుల వానరులను నీవే చూడఁగలవు. మఱి మేఘములవలెఁ బర్వతములవలె నుండు వారి సింహనాదములను లంకయందలి పర్వతములందు వినఁగలవు.

తే. కాననావాస సమయంబుఁ♦గడపి నిహత,వైరి రాముండు నీతోడ ♦వనజనేత్ర!
యల యయోధ్యనునభిషేక♦మందఁ గనెద, వనుచునమ్మించిదుఃఖంబునాపినాఁడ.

అర్థములు. కానన+ఆవాస సమయంబు=అడవులలో వసియించు కాలము—సమయము = శపథమనియుఁ జెప్ప వచ్చును. నిహతవైరి=చంపఁబడిన శత్రువులు గలవాఁడు.

తా త్ప ర్య ము .

సంకేతప్రకారము వనవాసము గడపి విరోధులఁజంపినీతోడనయోధ్యయందు పట్టాభిషిక్తుఁడగును. అది నీవే చూడఁగలవు. అనిచెప్పి నమ్మించి దుఃఖపడకుండఁ జేసి వచ్చితిని.

తే. తత భవద్దుఃఖమునకును ♦ దరణిగోత్ర, వార్ధిచంద్రమ యట్లు తా♦బాధపడుచు
శుభమునిష్టంబునగునాదు♦సూక్తిధృతినొ,సంగ శ్రీరామ వహియించె♦ శాంతిసీత.

అర్థములు. తత=స్థారమైన, భవద్దుఃఖమునకు = నీకుఁగలిగిన కష్టమునకు, వేళకాహారము, నిద్ర, సంతోషము లేకుండుటకు. అట్లు నేను ముందుచెప్పినవిధముగా, ఇట్లు చెప్పుటచే తాను సమీపముననుండి శుశ్రూష చేసి సుఖము గలిగింపకపోయిన కారణముచే నీ కిన్ని కష్టములు వచ్చెనే యని నీ దుఃఖమునకై యాతడు దుఃఖపడు

చున్నది. అని భావము. తరణి గోత్రవార్ధి చంద్రమ=సూర్యవంశమను సముద్రమునకుఁ జంద్రునివంటి వాఁడా! సూక్తి = మంచిమాట-ధృతి = ధైర్యము.

తాత్పర్యము.

రామచంద్రదేవా! నీకు గలిగిన విస్తారదుఃఖమునకుఁ దాను బాధపడుచు శుభము ప్రియమునైన నామంచి మాటలు విని మరల నీకు సేవచేసి సంతోషపెట్టఁగల నను ధైర్యముతో సీతాదేవి శాంతిగలదయ్యెను.

హనుమంతుఁడు రామచంద్రమూర్తికిఁ దాను బడిన కష్టములం దొకటియైనఁ జెప్పినవాఁడు కాఁడు. అట్లు తన విషయమై చెప్పుట యాత్మశ్లాఘగానుండును. రెండవది రామచంద్రమూర్తి ముందు తెలిసికొన వలసినది సీతావృత్తాంతముగాని హనుమంతుని ప్రయాసములు గావు.

ద్విపద

ఓమ్మని తత్తనియును సత్తటంచు, నిమ్మాఁడువిధముల నెసఁగుచునుండు
బ్రహ్మనిర్దేశంబు;పరఁగెఁ దద్యుక్తి.బ్రాహ్మణుల్ శ్రుతులు నధ్వరములుపూర్వ
మట్టులు గాన నోమ్మని మున్ను పల్కి,పట్టుగ నాబ్రహ్మవాదుల విధులఁ
బలుకంగబడిన తపంబు దానంబు, కలితయజ్ఞము లెల్లకాలంబు జరగు;
తత్తని ఫలకాంక్షఁ దవులక ముక్తి, హత్తఁగోరినవారు యజ్ఞముల్ తపము
వివిధ దానక్రియావిసరంబు లెల్ల, నవనీశనందన! యాచరించెదరు. ద్వి. భ. గీ.

ఈ విధముగ శ్రుత్యర్థరహస్యమును నీ మూఁడు పదములు బోధించు చున్నవి.

ఇంతవఱకు నీ వ్యాఖ్యానము పఠించినవారికి పూర్వకాండములందు జెప్పఁబడిన ప్రణవార్థమునకు ననుష్ఠాన మీ కాండమందు స్పష్టముగ గోచరించును. అదిగాక దానికి వివరణమగు నష్టాక్షరి మంత్రార్థమునకు నిం దన్వయము గలదు. ఈ వ్యాఖ్యానము సూచించిన విధముగ మూలగ్రంథము సమన్వయించుకొనువారికి నీ విషయము సుబోధము. రెండవది యగు 'తత్'-అను దాని యర్థమున కన్వయము నీ కాండ బోధించు చున్నది. తరువాత రావణాసుర యని యీ కాండము తకారముతో ప్రారంభింపఁ బడి సీత యని తకారముతో సాంతము చేయఁబడెను. ఈ కడపటి పద్య మట్టిదే యై యున్నది. భగవద్గీతావాక్యముల తత్తనుదానికిఁ జెప్పఁబడిన యర్థమునకు నిందు నన్వయము గాననగు. కావున నిది మోక్షకాములకు నవశ్య పఠనీయ మగుచున్నది. మూఁడవది యగు సత్తనుదానిని మొదటి పద్యములో సీత యను పదము ఈ కడపటి పద్యమునందలి సీత యను పదము సూచించు చున్నది.

సత్పదార్థమును గీతావాక్యమే వివరించెను. దానికి నన్వయము సీతాచర్యయందుఁ గననగు. ఈ విధముగ ముముక్షువగువాని భావ మెట్లుండవలెను ? చర్య

యెట్లుండవలెను. వాఁడు తెలిసికొనవలసిన విషయమేది? యను విషయము నీ కాండము స్పష్టముగాఁ దెలుపుచున్నది. దానిని వ్యాఖ్యానమూలమునఁ దెలియ వచ్చును. మరలఁ గ్రోడీకరించుటకు గ్రంథవిస్తరభీతి బాధించుచున్నది.

ఈ విధముగ నీ కాండము ముముక్షువులకు బుభుక్షువులకు నిష్కాములకు సకాములకు స్త్రీలకుఁ బురుషులకు సేవ్యమై సార్థకనామము వహించుచున్నది. సీతారామానుగ్రహంబున నాంజనేయుఁడు సముద్రము దాఁటి రామకైంకర్యము గావించినట్లు శ్రీ సీతారామాంజనేయానుగ్రహంబున నీ వ్యాఖ్యాతయు నీ కాండ మును బూర్వపుణ్యవశమున దాఁటఁగలిగెను.

—♦ సుందరకాండాంత పద్యములు ♦—

క. యతిమానసబిసజాలయ! యతమాన జనార్థ నిర్వ♦హణ సుసమర్థా!
నత సర్వభూతచయ! యింగితవిజ్జనవర్య! విబుధ♦కీర్తితచర్యా! ౧౮౫౯

అర్థములు. యతిమానసబిసజ+ఆలయ = జితేంద్రియుల హృదయపద్మ మును స్థానముగాఁగలవాఁడు, జితేంద్రియులచేత ధ్యానింపఁబడువాఁడా! "యే నిర్జి తేంద్రియ గ్రామా యతినో యతయశ్చ తే" యని యమరుఁడు. యతమాన=ఒక్క కార్యార్థమై ప్రయత్నించు, జన=జనులయొక్క, అర్థ=కోరికను, ప్రయోజనమును, నిర్వహణ = నిర్వహించుటయందు, నెఱవేర్చుటయందు - సుసమర్థా = మిగుల సమర్థుడా, నత = నమస్కరించిన, సర్వభూతచయ = సమస్తప్రాణిసమూహములు గలవాఁడా, ఇంగితవిద్+జనవర్య = ఇంగితము నెఱుఁగు వారిలో శ్రేష్ఠుఁడా, ఇంగిత మనఁగా ముఖనయనాది బాహ్యవికారములచే భావము తెలుపుట. 'ఆకార స్త్వింగిత'మ్మని యమరుఁడు. ఆకారశబ్దమునకు రెండర్థములు గలవు. ఆకృతి యని - ఇంగిత మని. అభిప్రాయమును బ్రకటించు చేష్ట యింగితము ఇది బుద్ధిపూర్వకమై యుండవలెను, అబుద్ధిపూర్వకములైన ముఖరాగాదులు వైవర్ణ్యాది శరీరవికారము ఆకృతి - ఈ యుభయ విధచేష్టలు లేనివాఁడు కావున భగవంతుఁడు నిరాకారుఁడు, 'ఇంగితజ్ఞాశ్చ కోసలా' యని ప్రసిద్ధికదా. విబుధ= దేవతలచేతను, పండితులచేతను, కీర్తిత = పొగడఁబడిన- చర్యా = నడవడి కలవాఁడా.

ఇట్లు చెప్పుటచే నీ గ్రంథకర్తయొక్క యభిప్రాయమును దెలిసికొని దాని నెఱవేఱ్ఁ జేసెనని భావము.

—♦ పద్మనాభ వృత్తము ♦—

రామా! నతాంహోవిరామా! మునీంద్రాత్మ♦రామా! రయాసత్యధామా! నిశాట
స్తోమావళీభీషసంగ్రామసీమా? వి♦ధూమత్రిధామాభ తేజస్సుధామా!
రామాంబుముగ్ధామ! నీలోత్పలశ్యామ♦రా కేందుకామాభ సౌందర్యధామా!
సోమాదిముఖ్యామరారాధ్యనామా! వి♦శుద్ధాత్మ భక్తావనోద్దామకామా! ౧౮౬౦

నతాంహస్+విరామా=నమస్కరించువారి పాపములు నశింపఁజేయువాఁడా; 'అంహో దురితదుష్కృత'మ్మని యమరుఁడు విరామశబ్దము కరణార్థక ఘఞన్తము. కర్తయే కరణముగా వివక్షితము. 'ఉతతమాదేశ' మనెడి సద్విద్యాప్రకరణ శ్రుతిలోని యాదేశశబ్దము కరణార్థక ఘఞంతముగా శ్రుత ప్రకాశిక. మునీంద్రాత్మారామా=మునిశ్రేష్ఠుల యాత్మలయందుఁ గ్రీడించువాఁడా; దయాసత్యధామా=దయకు సత్యమునకు నునికి పట్టయిన వాఁడా; నిశాట స్తోమావళీ = రాక్షసుల గుంపుల వరుసలకు- భీమ=భయంకరమైన- సంగ్రామ సీమా=యుద్ధప్రదేశము గలవాఁడా; విధూమ=పొగలేని- చక్కఁగా మండెడి- త్రిధామాభ=అగ్నిహోత్రునితో సమానమైన- తేజస్=కాంతికి- సుధామా=మంచిగృహమైనవాఁడా; రామాంబుముక్=నల్లనిమేఘమువంటి- ధామా = కాంతిగలవాఁడా; ఆశ్రితార్థప్రదానార్థ మీ విశేషణము. 'బలే రామో నీల చారు సితే త్రిషు' అని యమరము. నీలోత్పలశ్యామ = నల్లకలువవలె చామనిచాయ కలవాఁడా; ఇది యాకారవర్ణ ప్రతిపాదకము. రాకేందు కామాభ=పూర్ణ చంద్రునితోను, మన్మథునితోను సమానమైన-సౌందర్య=చక్కఁదనమునకు-ధామా=స్థానమైనవాఁడా, సోమాదిముఖ్య=స+ఉమ=సోమ=శివుఁడు మొదలగు ప్రముఖు లయిన-అమర = దేవతలచే, ఆరాధ్య=కొనియాడఁదగిన. నామా = పేరుగలవాఁడా! విశుద్ధాత్మ=నిర్మల మనస్సుగల, భక్త=భక్తులను, అవన = రక్షించుటయందు, ఉద్దామకామా=అధికాపేక్షకలవాఁడా; రాగల యుద్ధకాండార్థ మిందు సూచితము. నతాంహోవిరామా = సముద్ర గర్వభంగము, దయాసత్యధామా = శరణాగత విభీషణరక్షణము, నిశాట......సీమా = రాక్షసులతోడి యుద్ధము, రావణాది శత్రుమారణము, మృతవానర జీవనము, సీతాహృదయానందకరత్వము, బ్రహ్మరుద్రేంద్రాది స్తోత్రము, విభీషణ పట్టాభిషేకము సూచితము.

పద్మనాభవృత్తము-ఏడు తగణములు. గగము-పదుమూఁడింట యతి. ఈ వృత్తము గ్రంథకర్తకుఁ బ్రాణతుల్యమిత్రుఁడగు శ్రోత్రపల్లె పద్మనాభశాస్త్రిలవారి పేర వారి జీవితకాలమందే వ్రాయఁబడినది. ఆయన మరణించి యిరువది సంవత్సరము లయినను ఎన్నఁడు కనఁబడినవాఁడు కాఁడు. దీని కర్థము వ్రాసిన రెండు దినముల కావల నాయన స్వప్నములోఁ గనబడుటచే నీ విషయము వ్రాయవలసి వచ్చెను. అటువంటి మిత్రుఁడు దుర్లభుఁడు. ఈ గ్రంథకర్తకుఁ గష్టకాలమం దనేకవిధముల నాదరించెను. భగవంతుఁ డాయనకు శాశ్వతశాంతి యొసంగుఁగాత.

—♦ అంబురుహావృత్తము ♦—

క్ష్మారమణీశరజాబ్జ భవానన ♦ సారసాహిత పద్యసం
వారసుశంసి నిజార్థి మహాద్భుత ♦ బాఢధైర్య పరాక్రమా!

భూరిపయోనిధితారణ కారణ♦భూతనిర్జరయానవ
చ్చారుతరాత్మ సమాఖ్యః నిజాశ్రిత ♦ సర్వసౌఖ్య విధాయకా! ౧౪౬౧

అర్థములు. క్ష్మారమణీ = భూమి – ఇది యొకటికి సంజ్ఞ, శరజ = కుమారస్వామియొక్కయు – 'శరజన్మా షడానన' యని యమరుఁడు. అబ్జభవ = బ్రహ్మయొక్క ఆనన = ముఖములు – కుమారస్వామికి నాఱుముఖములు, బ్రహ్మకు నాలుగుముఖములు; సారసాహిత = చంద్రుఁడు – ఇది యొకటికి సంజ్ఞ. ఇట్లు విలోమముగాఁ జూచిన 1461 యగును. వేయి నాలుగునూర్ల యఱువది యొకటి – ఈ సంఖ్యగల – పద్యసంవార = పద్యసమూహముచే; సుశంసి = బాగుగాఁ గొనియాడఁబడు, నిజార్థ = తన యాశ్రితులయొక్క, మహాద్భుత బాఢ ధైర్య పరాక్రమ = మిక్కిలి యాశ్చర్యకరమైన, మిగుల ధైర్యముతోఁగూడిన పరాక్రమము గలవాఁడా. ఇట్లు చెప్పుటచేఁ దన యాశ్రితుఁడైన హనుమంతుఁ డన్ని పద్యముల నిందు గొనియాడఁ బడెనని భావము. భూరిపయోనిధి = గొప్పసముద్రమును, తారణ = దాఁటుటయందు, కారతభూత = సాధనమైన భూరిపయోనిధి యనుటచేఁ దక్కిన సముద్రములు సంసారసాగరము నంత పెద్దవి కాదని భావము. నిర్జరయానవత్ = దేవయానమైన విమానములవలె, చారుతర = మిగుల రమ్యమైన, ఆత్మసమాఖ్య = తన పేరు గలవాఁడా, రామనామోచ్చారణముచే సాగరజలమునంటకయే సుఖముగ విమానముమీఁదఁ బోయినట్లు, (హనుమంతుఁడు సముద్రము దాఁటినట్లు) సంసారము సుఖముగ దాఁటవచ్చునని భావము. నిజాశ్రిత = తన్నాశ్రయించిన వారికి, సర్వసౌఖ్య విధాయకా = సమస్తసౌఖ్యములు గలిగించువాఁడా, ఇట్లనుటచే రామనామోచ్చారణముచే ముక్తులగు వారికి భగవంతునితో సమానమైన సమస్తభోగములు కలుగునని భావము. 'భోగమాత్ర సామ్యలింగాత్' అని బ్రహ్మసూత్రము చెప్పుచున్నది కదా. తారణ శబ్ద స్వారస్యముచేఁ దారక నామము వివక్షితము.

సీ. జానకీ రఘురామ♦చరణ సేవాసక్త, చిత్తుఁడై తత్కృపా♦సక్తి కతన
వామలూరూద్భవు♦పాదముల్ దలఁదాల్చి, ప్రత్యక్ష బ్రహ్మాత్మ♦భవునకెరఁగి
యభివాదనము సల్పి యాచార్యులకునెల్ల, వ్యాఖ్యాతలకును సా♦ష్టాంగమెరఁగి
పరమభక్తులనుబ్ర♦పన్నులు ముదమొంద స్వాంధ్రవాల్మీకిరా♦మాయణమున
గీ. ఘన మహార్థంబు సుందర కాండమునకు, వాసుదాసుండు రచియించి♦వ్యాఖ్య దీని
మందర మనంగ శ్రీరామ♦చంద్ర విభున, కర్పణము చేసె జన్మంబు♦సార్థకముగ.

ఈ కాండమువలన నేర్చుకొనవలసిన విషయములు.

౧. జీవాత్మ పరమాత్మల సంబంధ మెట్టిది ?

౨. జీవాత్మ తరుణోపాయ మెట్టిది ?

౩. జీవాత్మలకు సేవ్యుఁడు నిర్విశిష్టరాముఁడా? సీతా విశిష్ట శ్రీరాముఁ

౪. శిష్యాచార్య లక్షణములు.

౫. ఆత్మావలోకన పరుఁడైన యోగి లక్షణము.

౬. బద్ధ జీవ తారతమ్యము.

౭. యోగికి, భక్త ప్రపన్నునకు భేదము.

—♦ గ ద్య ము ♦—

ఇది శ్రీమద్రామచంద్రచరణారవింద మిళిందాయమాన
మానసత్వ మహావైభవాంధ్ర వాల్మీకి కవిసార్వభౌమాది బిరుదాంచిత
వావిలికొలను రామచంద్రరాయ తనూభవ సుజనవిధేయ
సుబ్బరాయ నామధేయప్రణీతంబైన మందరాఖ్య వ్యాఖ్యానసమేత
శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణ మను నిర్వచన
మహాకావ్యంబునందు సుందరకాండము.

శ్రీ రా మా ర్ప ణ మ స్తు.

శ్రీ శ్రీ శ్రీ

శ్లో. నమోస్తు రామాయ సలక్ష్మణాయ, నమోస్తు దేవ్యై జనకాత్మజాయై
నమోస్తు వాతాత్మభువే వరాయ, నమోస్తు వల్మీకభవాయ తస్మై.

